మండ లక్ష్మీ నృసింహకవి ప్రణీత

# సారస్వత
# త్రిలింగ శబ్దానుశాసనమ్

(భూషణ వ్యాఖ్యాన సహితమ్)


పరిష్కరణ - వ్యాఖ్యానకర్త :

డాక్టర్. అంబడిపూడి నాగభూషణం, M.A., Ph.D.,

జనరల్ ఎడిటర్ :

డాక్టర్. వి. వి. కృష్ణశాస్త్రి, M.A., Ph.D.,

డైరెక్టర్. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత

గ్రంథాలయం - పరిశోధనాలయం





ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ

ప్రాచ్య లిఖిత గ్రంథాలయం - పరిశోధనాలయం

హైదరాబాద్ - 500 001

A.P.G.O.M.L. & R.I. Series :- 36

# Saraswatha Trilinga Sabdanusasanam
## by Manda Laxmi Nrisimha Kavi

*Edited and Commentated by :*
**Dr. Ambadipoodi Nagabhooshanum,** M.A.,Ph.D.

*First Edition : March 90*

*No. of Copies : 500*

*Price : Rs* 123 00



*Printed at -*
*VIJAY MANOHER OFFSET PROCESS & PRINTERS*
*1-10-212/2/A, Ashok Nagar, Hyderabad.*

# విషయసూచిక

# తొలిపలుకు

డాక్టర్. వి. వి. కృష్ణ శాస్త్రి, M.A., Ph.D.,
సంచాలకులు
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ
ప్రాచ్యలిఖిత గ్రంథాలయం
పరిశోధనాలయం, హైద్రాబాద్.

"వ్యాకరణాత్పదసిద్ధిః పదసిద్ధేరర్థనిర్ణయో భవతి ।
అర్థాత్తత్త్వ జ్ఞానం తత్త్వజ్ఞానాత్పరం శ్రేయః" ।

అనే ఆర్యోక్తి ననుసరించి సమ్యక్పద పదార్థ జ్ఞాన సంపాదనకై సంస్కృత శబ్దాను శాసనాలను తప్పక చదవవలసిన అవసరం ఎంతైనా ఉంది. సంస్కృతంలో ఉన్నట్లుగానే తెలుగులో కూడా శబ్దాను శాసనాలు చాలా ఉన్నాయి.

శబ్దానుశాసనానికి "శబ్దానా మను శాసనమ్" అను వ్యుత్పత్తిని గ్రహిస్తే శబ్దాల వ్యుత్పత్తిని తెలియచేసేది శబ్దానుశాసన మని తెలుస్తున్నది. ఈ ఉద్దేశ్యంతోనే అమరసింహుడు తన నిఘంటువుకు "నామలింగాను శాసనం" అనే పేరు పెట్టినట్లు మనం గ్రహించ వచ్చును.

కాని వ్యాకరణ పదానికి "వ్యాక్రియంతే వ్యుత్పాద్యంతే సాధు శబ్దాః అస్మిన్ అనే నేతి వా వ్యాకరణం" అని వ్యుత్పత్తి. ఆ వ్యుత్పత్తిని గ్రహించి సంస్కృత నిఘంటువైన 'శబ్దకల్పద్రుమం' "వ్యాక్రియంతే అర్థా యేనేతి - వి + ఆ + కృ + ల్యుట్" అని ప్రకృతి ప్రత్యయ విభాగాన్ని వివరించింది. దీని ఆధారంగా శబ్దాను శాసన మంటే వ్యాకరణమే అని మనం గ్రహించ వచ్చును.

ఆంధ్రభాషకు లభించిన వ్యాకరణాలు పూర్వంలో సంస్కృతంలోనే సూత్రీకరింప బడ్డాయి. అర్వాచీన కాలంలో రచింపబడ్డ గ్రంథాలు తెలుగులోనే సూత్రీకరింప బడ్డాయి. ఆంధ్రవ్యాకరణ కర్తలు తమ సూత్ర రచనా సంవిధానంలో బహువిధాలుగా సంస్కృత (పాణి న్యాదులు) వ్యాకరణ కర్తల సూత్ర సంవిధాన సిద్ధాంతాల మర్యాదలనే అనుసరించి తమతమ గ్రంథ నిర్మాణ పథకాలను నిర్మించుకున్నారు. దీనికి నిదర్శనంగా మన తెలుగు వ్యాకరణాలలో ఇత్సంజ్ఞలు, ప్రత్యాహారములు, ఆదేశాగమాదులు మొదలుగా గల సంకేతాలు మనకు గోచరమౌతున్నాయి. సంస్కృతంలో వ్రాయబడ్డ తెలుగు వ్యాకరణాలు కొన్ని రేఖా మాత్రంగా ఈ క్రింద పేర్కొన బడుతున్నాయి.

1. కాణ్వవ్యాకరణము - కణ్వుడు
2. బార్హస్పత్య వ్యాకరణము - బృహస్పతి
3. ఆంధ్రశబ్ద చింతామణి - నన్నయ
4. త్రిలింగ శబ్దాను శాసనము - అథర్వణుడు
5. వైకృత చంద్రిక - మంచెళ్ల వాసుదేవుడు
6. కవి శిరోభూషణము - అహోబలపతి
7. ఆంధ్రశబ్దాను శాసనమ్ - నివర్తి శేష సుమతి
8. ఆంధ్ర కౌముది - మండ లక్ష్మీనృసింహ కవి
9. త్రిలింగ శబ్దాను శాసనము - మండ లక్ష్మీ నృసింహ కవి
10. సూత్రాంధ్ర వ్యాకరణము - చిన్నయ సూరి
11. హరికారికలు - శిష్ట్లు కృష్ణమూర్తి శాస్త్రి
12. హరి కారికాశేషము - భాగవత రామమూర్తి శాస్త్రి

ఆంధ్ర భాషకు ఆంధ్ర భాషలోనే వ్రాయబడిన వ్యాకరణ గ్రంథాల్లో చిన్నయ సూరి బాలవ్యాకరణం అగ్రతాంబూలాన్ని అందుకుంది. అందుచేతనే బాలవ్యాకరణానికి అనేక వ్యాఖ్యానాలు వ్రాయబడ్డాయి. వాటిలో దువ్వూరి - దూసి - వర్ధం - బులుసు మొదలగువారి వ్యాఖ్యానాలు ప్రసిద్ధి పొందాయి. బాల వ్యాకరణం సాధించని రూపాలను సాధించుటకై బహుజనపల్లి సీతారామాచార్యులు గారు "ప్రౌఢ వ్యాకరణాన్ని" రచించారు. "ప్రయోగ శరణం వ్యాకరణం" అనేది ఆర్యోక్తి. అందువల్లనే ఆంధ్రభాషా పరిణామగతి ననుసరించి అనేక ఆంధ్ర వ్యాకరణాలు అవతరించాయి.

క్రీ. శ. 18వ శతాబ్దానికి చెందిన వాడుగా భావింపబడుతున్న మండ లక్ష్మీనృసింహ కవి మన తెలుగు భాషకు సంస్కృతంలో వ్రాసిన ఈ "సారస్వత త్రిలింగ శబ్దాను శాసనం"లో త్రిలింగ శబ్ద స్వరూపాలను సంస్కృతంలో సూత్రీకరించాడు.

మండ లక్ష్మీ నృసింహకవి తన గ్రంథాన్ని అవతారికలో "సారస్వత త్రిలింగ శబ్దాను శాసనం" అని గ్రంథాంతంలో "త్రిలింగ శబ్దాను శాసనం" అని పేర్కొన్నట్లు వ్రాత ప్రతివల్ల తెలుస్తున్నది. గ్రంథ నామాన్ని వ్రాయటంలో వ్రాయసగాని దోషంగా దీన్ని మనం భావించ వచ్చు. సామాన్యంగా వ్రాయస గాండ్ర లోపాలవల్ల అనేక గ్రంథాల్లో పాఠభేదాలుండటం సహజమే. ఈ పాఠభేదాలకు మూలకారణం ఆయా గ్రంథాలను వ్రాసిన వ్రాయస గాండ్రే.

అయినప్పటికీ కవి అవతారికలో మొట్టమొదటి సారిగా పెట్టుకున్న పేరు అందరికీ సువిదితం కావాలనే ఉద్దేశ్యంతో ఈ గ్రంథానికి "సారస్వత త్రిలింగ శబ్దాను శాసనం" అనే పేరునే స్థిరీకరించటం జరిగింది.

మరొక్క విషయం అథర్వణుడు తాను వ్రాసిన వ్యాకరణ గ్రంథానికి "త్రిలింగ శబ్దాను శాసనం" అని పేరు పెట్టుకున్నాడు. అథర్వణుడు మండ లక్ష్మీ నృసింహ కవి కంటే పూర్వుడు. అదే పేరును ప్రస్తు గ్రంథానికి కూడా పెడితే పఠితృలోకంలో సందిగ్ధత ఏర్పడుతుందనే విషయాన్ని కూడా దృష్టి యందుంచుకొని ఈవ్యాకరణ గ్రంథానికి కవి పెట్టుకున్న రెండు పేర్లలో "సారస్వత త్రిలింగ శబ్దాను శాసనం" అనే పేరునే ఎంచుకోవటం జరిగింది. అయినప్పటికి గ్రంథంలోపలి పేజీలలో "త్రిలింగ శబ్దాను శాసనం" అనే పేరును కూడా పేర్కొనటం జరిగింది.

ఈ రెండు పేర్లే కాకుండా ఈ వ్యాకరణ గ్రంథానికి "ఆంధ్రకౌముది" అనే పేరు కూడా వాడుకలో ఉన్నట్లు తెలియవస్తున్నది. కానీ మండ లక్ష్మీ నృసింహకవి తన గ్రంథానికి "ఆంధ్ర కౌముది" అనే పేరును గ్రంథంలో ఎక్కడా పేర్కొలేదు. అయితే ఈ కవే వ్రాసిన మరొక వ్యాకరణ గ్రంథానికి "ఆంధ్ర కౌముది" అనే పేరు ఉంది. ఈ రెండు గ్రంథాలను ఒకే కవి రచించటం వల్ల దీనికి కూడా "ఆంధ్ర కౌముది" అనే పేరు వాడుకలో కొచ్చి యుండ వచ్చును.

మండ లక్ష్మీ నృసింహకవి మొదట లఘురూపంగా "ఆంధ్రకౌముది"ని రచించి, ఇంకా వివరంగా ఉంటే బాగుంటుందనే ఉద్దేశ్యంతో "సారస్వత త్రిలింగ శబ్దాను శాసనా"న్ని రచించినట్లు భావించ వచ్చును.

ఆంధ్ర శబ్ద చింతామణి, వికృతి వివేకాల వలె శ్లోక రూపంలో కాకుండా సిద్ధాంత కౌముది వలె సూత్రం - వివృతి- ఉదాహరణాలు మొదలైన రీతిలో రచించి, శ్రీ మండ లక్ష్మీ నృసింహ కవి భట్టోజీ దీక్షితులను అనుసరించాడు. కవి తన అవతారికా శ్లోకాల్లో -

> "కణ్వం శేషం కతి తనుభవం రావణం పుష్పదంతం ।
> విష్ణుం చంద్రం సురగురుమహం సోమ చంద్రం నమామి ॥" (అవతారిక - 2)

అని కణ్వుడు, శేషుడు, కాత్యాయనుడు, రావణుడు, పుష్పదంతుడు, విష్ణువు, చంద్రుడు, బృహస్పతి ,సోమచంద్రుడు - ఈ తొమ్మిది మందిని స్తుతించి, తరువాతి ఈ క్రింది శ్లోకంలో -

> "బార్హస్పత్యం రావణీయం కాణ్వమాథర్వణం వివన్ ।
> కరోమి సారస్వత త్రిలింగ శబ్దాను శాసనమ్ ॥ (అవతారిక - 3)

తాను బార్హస్పత్య, రావణీయ, కాణ్వ, ఆథర్వణ వ్యాకరణాలను పరిశీలించి, ఈ సారస్వత త్రిలింగ శబ్దాను శాసనాన్ని రచిస్తున్నట్లు స్పష్టీకరించాడు. అంతే కాకుండా ఆయా వ్యాకర్తల మతాలను తన వ్యాకరణ గ్రంథంలో అనువైన చోట్లలో ఉట్టంకించాడు. ఉదాహరణకు కొన్ని

| | | | | |
|---|---|---|---|---|
| సంశ్లేషే రావణస్య | - | సంధి | - | 42 సూ. |
| స పురుషే పుష్పదంతస్య | - | సంధి | - | 43 సూ. |
| బిందు సోమచంద్రస్య | - | సంధి | - | 44 సూ. |
| ఉక్కిణ్యస్య | - | శబ్ద, అజంత, | - | 25 సూ. |
| అచః ప్రతీపః కాత్యాయనస్య | - | తద్భవం | - | 49 సూ. |

అనేక చోట్ల బృహస్పతి సూత్రాం కనుకూలంగా, బింబప్రతిబింబంగా సూత్ర రచన జరిగినట్లు వ్యాఖ్యాన కర్త అక్కడక్కడా అధోజ్ఞాపికల్లో పేర్కొనటం వల్ల బృస్పతి మతాన్ని కూడా ఈ కవి గౌరవించి తన వ్యాకరణ గ్రంథాన్ని రచించినట్లు నిర్ధారింప వచ్చును.

"శేషా దేశస్యా హోచో ఽ భోః" వా. 1.4.54, పేజి. 457

పై సూత్రాన్ని వ్యాఖ్యాన కర్త బృహస్పతి సూత్రంగా సూచించటం జరిగింది. ఈ కవి తద్భవ పరిచ్ఛేదంలో 23వ సూత్రం "శేషాదేశస్యా హోచో ఽ భోః " అని రచించిన సూత్రం పై సూత్రానికి యథాతథంగా ఉండటం మనం గ్రహింప వచ్చును.

వీరినే కాక ఈ వ్యాకర్త భల్లటుని మతాన్ని కూడా గౌరవించినట్లు మనకు "ఉల్లోపో భల్లటస్య" - అనే కారకపరిచ్ఛేదం లోని 28వ సూత్రంవల్ల తెలియవస్తుంది.

కాని పై వ్యాకర్తలు రచించిన వ్యాకరణ గ్రంథాలు ప్రస్తుతం లభించటం లేదు.

కవి తెలుగు భాషకు సంబంధించిన వ్యాకరణాంశాలను ఈ క్రింది పరిచ్ఛేదాల్లో వివరించాడు. అవి ఇవి, పరిభాషా ప్రకరణమ్, సంజ్ఞా పరిచ్ఛేదః, సంధి పరిచ్ఛేదః, ఔపవిభక్తిక ప్రకరణమ్, శబ్ద పరిచ్ఛేదః, అజంత ప్రకరణమ్, హలంత ప్రకరణమ్, సర్వనామ ప్రకరణమ్, తద్ధిత పరిచ్ఛేదః, ఏకపద విధి ప్రకరణమ్, కారక పరిచ్ఛేదః, సమాస పరిచ్ఛేదః, తద్భవ పరిచ్ఛేదః, తజ్జాః, దేశ్యనామాని, నానార్థ శబ్దాః, దేశ్యక్రియాః, అవ్యయాః, క్రియా పరిచ్ఛేదః, కృత్ప్రకరణమ్, ధాతు ప్రక్రియా, సంఖ్యావాచక ప్రకరణమ్, అనుస్వార ప్రకరణమ్, రేఫ (సంయుక్త) ప్రకరణమ్.

ఈ తెలుగు వ్యాకరణం సంస్కృతంలో ఉండటం వల్ల, తెలుగు భాషా బోధకులకు, ముఖ్యంగా తెలుగు భాషను అభ్యసించే విద్యార్థులకు సులభంగా అర్థం కావాలనే ఉద్దేశ్యంతో, ఈ వ్యాకరణ గ్రంథాన్ని తెలుగు వ్యాఖ్యాన సహితంగా ప్రకటిస్తున్నాము. మా ఈ ఆశయాన్ని సాహితీలోకం సహృదయంతో ఆదరిస్తుందని భావిస్తున్నాము.

ఈ సంస్థ మాజీ సంచాలకులు డాక్టర్. వి. వి. యల్ నరసింహారావుగారు ఈ "సారస్వత త్రిలింగ శబ్దాను శాసనమ్" వ్రాత ప్రతి మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత గ్రంథాలయంలో అసూర్యం పశ్యగా పడివుండటాన్ని గ్రహించారు. దీన్ని యోగ్యులైన వారి చేత పరిష్కరింపజేసి సాహిత్య లోకాని కందిస్తే బాగుంటుందని నిశ్చయించు కొన్నారు. వారి దృష్టిలో డా॥ అంబడిపూడి నాగభూషణం గారు మెదిలారు. వీరు గుంటూరులోని కె. వి. కె. సంస్కృత కళాశాలలో ఉపన్యాసకులు. వ్యాకరణం అంటే ఎంతో అభిమానం. బాల, ప్రౌఢ వ్యాకరణాల వ్యాఖ్యానాల నన్నింటిని లోనారసి పరిశీలించి, పరిశోధించి "త్రిలింగ లక్షణ శేషము" అనే పేర నాగార్జున విశ్వవిద్యాలయానికి సిద్ధాంత వ్యాసాన్ని సమర్పించి పి.హెచ్.డి. పట్టాను పొందినారు.

అంతేకాదు వీరు ఇంకా వ్యాకరణ శాస్త్రంపై ప్రగాఢ పరిశోధనలు సలిపి "బాల వ్యాకరణ వికాస వివేచనము, ద్రుత స్వరూపాన్వేషణము, ద్రుత ప్రకృతి కావలోకనము, ద్రుత కార్యాను శీలనము" అనే గ్రంథాలను వెలయించినారు. అర్థ దీపిక (బాల వ్యాకరణ వ్యాఖ్య); బాల వ్యాకరణ సూక్తులు (బాల వ్యాకరణోద్యోత సంజీవని వ్యాఖ్యాను శీలనము) అనే గ్రంథాలు వెలుగు చూడవలసి ఉన్నాయి.

డా॥ నాగభూషణంగారు ఈ గ్రంథాన్ని పరిష్కరించటానికి సంతోషంతో ఒప్పుకొని పరిష్కరించి భూషణ వ్యాఖ్యను వెలయించి మా సంస్థకు అందచేశారు. డా॥ వి. వి. యల్. నరసింహారావుగారు చేపట్టిన ఈ కార్యక్రమాన్ని నేను పూర్తి చేస్తున్నందుకు నేను ఎంతో గర్విస్తున్నాను. ఈ గ్రంథ ప్రచురణకు మూలకారకులైన మాజీ సంచాలకులు డా. వి. వి. యల్ నరసింహారావుగారికి హార్దికాభినందనలు.

సకాలంలో ఈ బృహద్వ్యాకరణ గ్రంథాన్ని పరిష్కరించి, వ్యాఖ్యానించి మా సంస్థకు అందేసి నందుకు డా॥ అంబడిపూడి నాగభూషణంగారికి మా సంస్థ పక్షాన శుభాభినందనలు.

ప్రాచ్య లిఖిత గ్రంథాలయం - పరిశోధనాలయం, సాంకేతిక విద్య, పురాపత్ర, పురావస్తు శాఖల అమాత్యవర్యులు మాననీయ శ్రీ కటారి ఈశ్వర కుమార్‌గారు నిరంతరం మాకృషికి ప్రోత్సాహమొసగి సహకారాన్ని అందిస్తున్నందుకు వారికి మా హృదయ పూర్వక నమస్సుమాంజలులు.

విద్యాశాఖ కార్యదర్శి శ్రీ ఆర్. వి. వైద్యనాథ అయ్యర్, ఐ.ఏ.ఎస్.గారు మా సంస్థపైని ఎంతో ఆదరాభిమానాలు కలిగి, సహాయ సహకారాలను అందిస్తున్నందుకు వారికి మా శుభాభినందనలు.

ఈ మధ్యకాలంలో డా॥ రవ్వా శ్రీహరి గారు కూడా ఈ వ్యాకరణ గ్రంథాన్ని పరిష్కరించి ప్రథమ భాగాన్ని ప్రకటించినారు. సహృదయతతో డా॥ రవ్వా శ్రీహరిగారు మా గ్రంథానికి ఆంగ్లంలో పరిచయ వాక్యాలు వ్రాసి ఇచ్చినందుకు వారికి మా సంస్థ పక్షాన శుభాభినందనలు.

ఈ వ్యాకరణ గ్రంథ ముద్రణ సందర్భంగా బహు ప్రయాసం కోర్చి, ఎంతో ఓర్పుతో సహకరించిన పరిశోధనాధికారులు శ్రీ కె. విఠల్‌రెడ్డి, శ్రీమతి వి. సరళకుమారిగారలకు; తెలుగు పండితులు శ్రీ కె. ఎస్. సత్యనారాయణ, శ్రీ ఎన్. రాధాకృష్ణ శాస్త్రి, శ్రీమతి వై. వత్సలం గారలకు, సంస్కృత పండితులు శ్రీ డి. కె. శ్రీనివాసాచారి, శ్రీ కె. వి. రామశాస్త్రిగారలకు మా హార్దిక శుభాభినందనలు.

ఎంతో శ్రమకోర్చి ఓర్పుతో అందంగా పొందికగా ముద్రించి ఇచ్చిన విజయా మనోహర్ ప్రెస్ అధినేతలకు మా సంస్థ పక్షాన శుభాభినందనలు.

వి. వి. కృష్ణశాస్త్రి

# A Critical Note on
# Saraswata Trilinga Sabdanusasanam.

Dr. R. Srihari.

We have two Telugu Grammars in Sanskrit written by Manda Lakshmi Narshimha Kavi (M.L.N) in the style of Siddhanta koumudi of Bhattoji Dikshita out of these two, one is very brief named "Andhra Koumudi" (A.K.) and the other is a comprehensive one as "Saraswata Trilinga Sabdanusasanam" (S.T.S). Andhra Koumudi is printed by Arsha Printers Visakhapatnam. Now Saraswata Trilinga Sabdanusasanam is critically edited with Telugu commentary named "Bhooshana vyakhya" by Dr. Ambadipudi Nagabhushanam and published by the department of A.P. Govt Oriental Manuscripts Library and Research Institute Hyderabad.

The present note deals with some of the new facts told by M.L.N. in his Saraswata Trilinga Sabdanusasanam.

The only one paper manuscript of Saraswata Trilinga Sabdanusasanam is preserved at Govt. Oriental Manuscript Library, Madras.

This consists of the following chapters :
1. Parbhasha 2. Samjna 3. Sandha 4. Sabda 5. Tadhita 6. Karaka 7. Samasa 8. Tadbhava 9. Desyanama 10. Desyakriya 11. Avyaya 12 Tinprakriya 13. Kridanta.

In Telugu the phonemes 'c' (చ) and 'j' (జ) have two pronounciations i.e. Palatal and dental and this is conditioned by the preceding vowels. When preceded by palatal vowels ea and ja have palatal sound and by dental vowel it has dental sound. Grammarians describe this kind of sound feature with regard to only two phonemes i.e. ca (చ) and ja (జ). But in S.T.S. we find this kind of palatal and non-palatal sound features applied to the phoneme 'sa' also. This is explained in the Sutra 'Sasse' - Sakaropi tadvat syat talavyaci pare. Selavu, Selayeru, Seluva, Siggu, Seeku, Dose, Dosili are the examples for palatal sound while Sana, Subba, Sudi, Sogasu, Soyagamu, Saidu, Souru are the xamples for dental sound. This sbows Manda Lakshminarasimha Charaya has noticed the palatal and dental sound features in case of 'Sa' also.

In Telugu, though the Initial 'u' and 'o' are generally pronounced as 'vu' and 'vo' in the words like 'vuru', 'vokka' etc. these are regarded as vowel Intital forms only. Contrary to this M.L.N. takes these words as consonent Initials and in Sandhi he elides the initial consonant so as to give scope for Sandhi which occurs only to the vowels. Not only in Sandhi but even-as independant words also these are regarded by M.L.N. as consonent initials only. He also gives the following example.

"వువిద యొకర్తు మేనఁ దాఁడవుల్గిలించె"

**While defining** some of the technical terms such as desya and gramya etc. M.L.N. **differ from other** Telugu grammarians. For example M.L.N. defines 'desya' as a word that **derives from dravidapanchaka** i.e. Andhra. Dravida, Karnataka, Maharastra and Ghurajara **(Andhra, Dravida,** 'Karnataka, Maharashtra, Ghurjarkhya dravida Panchakajjatam yetpadam **taddesya samjnam** syat).

According to all Telugu grammars only the parushas (క, చ, ట, త, ప) preceded by nominative endings change to saralas (గ, స, డ, ద, వ) respectively. But M.L.N. says that the initial ja (జ) and ba (బ) of a desya word also may change to sa (స) and va (వ) respectively and gives the following examples.

శివుడు సింక (శివుడు + జింక) ధరించె
కృష్ణుడు వల్లిదుండు (కృష్ణుడు + బల్లిదుండు)

In Telugu we find different sets of words which take ఇ, టి, ంటి, తి known as aupavibhaktikas before the case suffixes. Though most of the Telugu grammarians have referred to Aupavibhaktikas but did not care to enumerate the words that take aupavibhaktikas. In S.T.S. we find the list of the words that take Aupavibhaktikas and also their classification.

It is interesting to note that S.T.S. mentions some peculiar case suffixes. That are not found in any one of the Telugu grammars. These are aru, ponte, and parudi.

M.L.N. says that aru and ponte are used as instrumental case suffixes in sahartha[1] and gives the following examples.

| | |
|---|---|
| రాముని యరు వచ్చె | (Came along with Rama) |
| రాముని పొంటె నేగె | (Went along with Rama) |

M.L.N. says that 'aruta' formed by adding 'uta' to aru is also used in Saharatha.[2]

తన యరుత వచ్చె

Though the suffix 'ponte' is found in proudha vyakarana (Pr.V.) but not as Trteeya suffix but as chaturthi suffix. This suffix in the form of 'ponte' is still in usage in Nalgonda Dialect in sahartha as described in S.T.S. M.L.N. also gives the following examples from Ramachandrodaya of Badabagni bhattaraka and Athervana bharata.

i) ఇనవంశరాజపుడు పొం
పున విశ్వామిత్రమౌని పొంట య
జ్జనకుని యింట హర శరా
సనము విఱిచి పెండ్లియాడె జగతీ కన్యన్.

ii) ధర్మరాజా మఖమరుతఁజనిరి రమ్యాంబునకున్.

According to S.T.S. 'parudi' is a suffix in ablativecase. M.L.N. gives an example for this form atharvanabharata.

నే విదిగా మత్క్రోధ్వృఁడైన జముని
పట్టి పారుడి శాపంబు వాసి తింక
దసార్గమున కేగె (ను) మీరు సుఖముజెంద
యుండు డనుచు విమానంబు నొత్తి చనియె.

---

1. Aru toda ponte sahanthe vasah'.
2. 'Utasearutodayoh' (Sabdapariccheda).

Unlike the many traditional grammarians M.L.N. does not hesitate to accept any nominal suffixes such as valla, gunda, vanka, unechi, kanna etc., not found in old Telugu. This shows the liberality of M.L.N. with regard to vyavaharika Telugu.

According to Andhra Sabda Chintamani (A.S.C.) and other grammars of nominative plural suffix 'lu' added to the nominal form ending with 'La' preceded by long vowel is compulsorily replaced by 'r' (ర) but M.L.N. prescribes this adesa optionally thus giving scope for both the forms i.e. baluru and balulu, bhupaluru and bhupalulu etc. While A.S.C. and B.V. prescribe 'ku' compulsorily in place of 'nu' of mranu, kolanu etc. In plural forms S.T.S. does it optionally. As such according to M.L.N. mranulu, kolanulu etc. are also permissible. Likewise in the plural forms of chenu, meanu etc., the elision of 'nu' is also optional.

Ex. meelu, meenulu; chelu - chenulu etc.

The formation of the following tadhitantas by adding different taddhita suffixes is not found in other grammars.

a) మూలు + అలు = మూలాలు
   ఇల్లు + అలు = ఇల్లాలు
b) అది + గో = అదిగో
   ఇది + గో = ఇదిగో
c) అ + పుడు = అపుడు
   ఈ + పుడు = ఇపుడు
d) ఇంత + సేపు = ఇంతసేపు
e) అంత + దరు = అందరు.

M.L.N. has also noticed some of the features in vyavaharika language and also accepted them in his S.T.S. For example M.L.N. say sthat in the words like Kayyamu, neyyamu, biyyamu, oyyana etc., ukara preceded by dwitva yakara can optionally be replaced by ekara. As such both the forms i.e. with a and e are possible.

కయ్యము - కయ్యెము
నెయ్యము - నెయ్యెము
బియ్యము - బియ్యెము

Normally the words that constitute shasti tatpurusha samasa are not separated by any intervening words. But M.L.N. says that these may also be separated and gives the following examples.

1. నరసింహరాయ చంద్రుని కరమురుడుగఁగీర్తి వెలిసె
2. రాముని మహిలోన మిగులంబ్రబలెఁగీర్తి
3. కీర్తి విలసిల్లె విక్రమ క్షితి వరుని

S.T.S. also discusses the formation of Tadbhava words in detail and prescribes rules for phonological changes that occur in the process which are not found in many traditional grammars.

Now The Saraswata Trilinga Sabadnusasanam has been critically edited with Telugu Comentary by Dr. A. Nagabhushanam and published by the Department of A.P. Govt. Oriental Manuscripts Library & Research Institute focuses light on some more gramatical aspects.

అవుతుంది. భాషా లక్షణమైనా అంతే. శ్లేషల్లోనో యతిప్రాసల్లోనో మరింకెందువల్లో ఎందుకైనా ఎక్కడైనా కవి స్వతంత్రిస్తే ఆ స్వాతంత్ర్యం భాషా సామాన్య లక్షణం అనడం సమంజసం కాదు. మరికొందరు అనుసరిస్తే ఆ లక్షణం భాషలో స్థిరపడితే అది స్వీకరించకపోవడమూ సమంజసం కాదు. అంతదాక అవి ప్రత్యేక స్థలాలుగానే గుర్తించాలి అయినా సూర్యుడున్నా ఏ మూలల్లో చీకట్లుండకపోవు. సూర్యతేజస్సు ననుమానిస్తామా తిరస్కరిస్తామా ?

దీపం చిన్నదనిపించినపుడు మరీ మసిబారి అంతా ఆరయితే మోసం రానుందా, అస్పష్టంగానుందా, దానికాంతిని మరికొంత విస్తరింపజేసుకోవాలి.

అందుచే పూర్వకవుల లక్ష్యాలనూ లాటి లక్షణ గ్రంథాలను చూడనున్న సూరి సూక్తి అవశ్యం ఆచరణీయం.

## తెలుగు వ్యాకరణం

తెలుగు వ్యాకరణాలను గురించి పరిశోధన విస్తృతంగానే జరిగింది. ఆయా గ్రంథాల పీఠికల్లోనూ, ఆంధ్ర వ్యాకరణ వికాసాది గ్రంథాల్లోనూ సమాచారం పూర్వోక్తమే పునరుక్తులెందుకు.

అయినా ప్రస్తుత వ్యాకరణంలో ప్రస్తావింపబడినంతవరకు పూర్వ వ్యాకర్తల పేర్లైనా స్మరింపడం మాత్రం అవసరం కదా.

నృసింహకవి తన యీ వ్యాకరణ గ్రంథారంభంలో—

'కణ్వం శేషం కలితనుపమం రావణం పుష్పదన్తమ్
విష్ణుం చన్ద్రం సురగురు మహం సోమచన్ద్రం నమామి'
(పీఠి. 1. శ్లో.)

అని కణ్వాదులను ప్రశంసించాడు. వీరందరూ ఆంధ్రలాక్షణికులా ? తెలుగు భాషనూహా ప్రాకృత భేదంగానే భావించి వుండటంవల్ల ఇందులో కొందరు ప్రాకృత వ్యాకర్తలూ వుండి వుండొచ్చు. ప్రస్తుత వ్యాకరణంలో ఉద్ధరించబడిన ఆంధ్ర భాషా లక్షణాలను బట్టి వీరిలో ఎక్కువమంది తెలుగు వ్యాకర్తలే అని గ్రహించవచ్చు.

ఉదాహరణకు :—

1. కణ్వుడు— ఉకారాన్తంబు 'ని' లోపము. రామునిరాము (శబ్ద. 58), క్రి. 101. చూ॥

2. రావణుడు— సంశ్లేషో రావణస్య (సంధి. 42) ద్రుతానికి సంశ్లేషం. రామున్జానకీపతి. శబ్ద. 31, ఏక. 5, 14, క్రియా. 83 మొ॥

3. పుష్పదంతుడు—నపరుషే పుష్పదన్తస్య.పరుష పరత్వంలో ద్రుతానికి లోపంరాదు. సంధి. 43, పరి-37, శబ్ద 47, 65, 71, 75 మొ॥

4. సోమచంద్రుడు— బిన్దు స్సోమచన్ద్రస్య (సంధి-44) వల్పరకతలో ద్రుతానికి పూర్ణబిందువు. పరి-33, శబ్ద-26, 77 మొ॥

5. సురగురువనగా బృహస్పతి— బృహస్పతి సూత్రాలు కొన్ని యథాతథంగా అథర్వణుడి త్రిలింగ శబ్దానుశాసనంలో వున్నాయి. అవి ప్రస్తుత గ్రంథం లోనూ కనబడుతున్నాయి. సూత్రంలో బృహస్పతి పేరున్నవి ఇందులో కనబళ్ళేదు. బృహస్పతి వారికి తరువాతివాడేమో.

ప్రయోగానర్హాశ్చ - (శబ్ద. 17) శబ్ద. 8, మొ॥

కరితనుభవుడంటే కాత్యాయనుడు. అచః ప్రతీపః కాత్యాయనస్య (తద్భ. 49) ఝయః-తద్భ. 61, తద్భ 9. మొ॥ లక్షణాలు ఇందులో వున్నాయి: అన్నీ తప్పువాల్ని నిరూపించే యివి కాత్యాయను డాంధ్రలాక్షణి కుండని నిరూపిస్తాయా? ప్రాకృతవ్యాకరణుడేమో ఇతడుల గూర్చిన ప్రస్తావన ఈ గ్రంథంలో కనబడదు.

హేమచంద్ర సూత్రాలు త్రి. శ. లోను ఇందులోను కనబడుతూ హేమచంద్రు డొకడాంధ్ర లాక్షణికుడని నిరూపిస్తున్నాయి. పై శ్లోకంలోని చంద్రుడు హేమ చంద్రుడేమో. ఆం. కౌ. లో నాగరాజాదులున్నారు.

పేర్లేకాని వీరు వ్రాసిన పుస్తకాలు మాత్రం లభ్యం కావడంలేదు. ప్రస్తుత వ్యాకరణంలో అథర్వణ వ్యాకరణమూ, నన్నయభట్టు వ్యాకరణమూ ప్రస్తావింప బడ్డాయి. అవి మాత్రమే ఇపుడు లభ్యమవుతున్నాయి. నన్నయభట్టు వ్యాకరణం ఆంధ్రశబ్ద చింతామణి ప్రసిద్ధమే.

## ప్రాచీనత

అథర్వణుడి వ్యాకరణం త్రిలింగ శబ్దానుశాసనం. పేరులోనే కాకుండా విష యంలోకూడా ప్రస్తుత వ్యాకరణమూ అథర్వణుడి వ్యాకరణమూ చాలా సన్నిహితంగా వున్నాయి. దొరుకుతున్న వ్యాకరణ విషయం దాదాపు అంతా కొంచెకచో అదే క్రమంలో కూడా ప్రస్తుత వ్యాకరణంలో వుంది. దీన్నిబట్టి కణ్వాదుల లక్షణాలు దాదాపు సమగ్రంగా ప్రస్తుత వ్యాకరణంలో కెక్కాయేమో అనిపిస్తుంది.

త్రిలింగ శబ్దానుశాసనంలో, కణ్వ, బృహస్పతి, రావణ, పుష్పదంత, హేమచంద్రుల లక్షణాలు యథాతథంగా ఉద్ధరింపబడ్డాయి. అథర్వణుడు క్రీ. శ. 1250 ప్రాంతంవాడు. కణ్వాదులందరూ అథర్వణుడికి పూర్వులే కాబట్టి వాళ్ళింకా ప్రాచీనులు. వీళ్ళలో కణ్వుడాద్యుడు. (వై. చం. తొలిపలుకు xviii పుట) చరిత్రకందని ఆంధ్ర మహావిష్ణువు కాలంలో ఇది రచింపబడిందంటే ఆంధ్రవ్యాకరణ చరిత్ర ప్రాచీనత గుర్తింపవచ్చు.

## త్రిలింగ శబ్దానుశాసనం

ప్రస్తుత వ్యాకరణంలో ప్రస్తావింపబడ్డ పూర్వ వ్యాకరణాలలో దొరుకుతున్నవి. త్రి. శ., ఆం. శ. చిం. లు రెండే. ఇందులో ఆం. శ. చిం. నన్నయకృతమైనా, దాన్ని ప్రస్తుత వ్యాకరణం ప్రముఖంగా పేర్కొనకపోవడం విశేషం.

ప్రస్తుత గ్రంథానికి ఆధారంగా పేర్కొనబడ్డ త్రిలింగ శబ్దానుశాసనం ఇంకా అముద్రితం. మద్రాసు గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్టు లైబ్రరీలో ఒక ప్రతివుంది. దీనికింకో ప్రతి కాకినాడ సాహిత్య పరిషత్తు కార్యాలయంలో వుంది. అందులో అనుబంధంగా బార్హస్పత్య సూత్రాలు అర్థవివరణంతో వుండటం విశేషం.

అథర్వణుడి ఈ గ్రంథంలో దాదాపు సగందాకా లక్షణాలు కణ్వాదులవే. మూడోకాండలో కణ్వబృహస్పతుల సూత్రాలు, నాలుగో కాండలో హేమచంద్రుడి సూత్రాలూ వున్నాయి. ఇంకా రావణపుష్పదంతుల లక్షణాలు ఇందులో ఉద్ధరింపబడ్డాయి. ఇలా ఉద్ధరించినవి పోగా మిగిలిన స్వీయలక్షణాన్ని అథర్వణుడు అనుష్టుప్పుల్లో చెప్పాడు. అయితే అవిగూడ పూర్తిగా స్వయంగా వ్రాసింది కాదేమో.

ప్రస్తుత వ్యాకరణంలో నృసింహకవి 'అపి చ అథర్వణ వ్యాకరణే' ఐదన్తామిదన్త పఠిత రావణీయ సూత్ర మథర్వణాచార్యేణోక్తత్వాత్ (శబ్ద. 69. సూత్ర వివృత) అన్నాడు. త్రి. శ. 3. కాండలో "క్వందో రేవవిధిర్నిత్య మై దన్తానా మిదన్తవక్" అని (22. శ్లో) ఇది అథర్వణుడు అనుష్టుప్పులో అంటే స్వీయలక్షణంగానే చెప్పాడు. అథర్వణుడు తనదిగా చెప్పిన ఈ సూత్రం రావణుడు చెప్పిందని ప్రస్తుత వ్యాకరణం పేర్కొంటున్నది. అక్కడ త్రి. శ. లో రావణుడి ప్రసక్తేలేదు. దీన్ని బట్టి అథర్వణుడు అనుష్టుప్పుల్లో చెప్పిన స్వీయలక్షణాలు గూడా కణ్వాదులైన పూర్వ వ్యాకర్తలనుండి సంగ్రహించినవి వున్నవన్నమాటే. అవి పోగా అథర్వణుడు స్వతంత్రంగా చెప్పిన లక్షణాలేవో గుర్తించడానికి కణ్వాది వ్యాకరణాలు లభ్యం కావడం లేదు.

మొత్తమ్మీద అథర్వణుడు పూర్వపదాలు యథాతథంగా ఉద్ధరించటం మాత్రమే కాక పూర్వుల లక్షణాలను స్వీకరించి వాటిని అనుసరించి త్రిలింగ శబ్దాను శాసనం నిర్మించాడని గుర్తించవచ్చు.

ఈ స్థితి ఆం. శ. చిం. లో కూడా వుండటమే విశేషం.

## (మరో) నన్నయభట్టు వ్యాకరణం

త్రిలింగ శబ్దానుశాసనాన్ని అథర్వణుడి వ్యాకరణంగా పూర్తిగా చెప్పినట్లు గానే ప్రస్తుత వ్యాకరణం నన్నయ వ్యాకరణాన్ని కూడా ఆంధ్రశబ్ద చింతామణి అనే పేరుతో వ్యవహరించలేదు. అయినా ఆ గ్రంథం ప్రస్తావన ఇందులోవుంది.

రో రాయః కణ్వాస్య (శబ్ద. 69) అనే సూత్రం వివృతిలో 'కిఞ్చ అన్నం భట్టారక వ్యాకరణే రై శబ్దస్య స్త్రీవాచి రైనావో ఇతి బాహుళ్యత్వ సూత్రస్య ప్రయోగాచ్చ'- అని పేర్కొనబడింది. ఆం. శ. చిం. లో అజంత పరిచ్ఛేదంలో ఇది 62 సూత్రం. కాని దీనికి కర్త 'అన్నంభట్టు' అని యిక్కడ చెప్పబడింది.

ఇలాగే 'సర్వనామ్నోఽస్యచ్చ గురోః' అనే శబ్ద. 80 సూత్రవివృతిలో "అపి చ అన్నం భట్టారక వ్యాకరణే 'లాన్తాత్తు డురౌ తయో' రితి రావణీయ సూత్రస్య సకలభాషా వాగనుశాసనేనోక్తత్వాచ్చ" అని చెప్పబడింది. ఆం. శ. చిం. అజంత పరిచ్ఛేదంలో 15 సూత్రంగా 'లాన్తాత్తు డురౌ తయోః క్రమేణ స్తః' అనే సూత్రంవుంది. ఇక్కడ కూడా కర్త 'అన్నంభట్టు' అనే చెప్పబడినా అతను 'సకల భాషావాగను శాసను'డనటం గమనార్హం.

స్థలాంతరంలో 'సకల భాషావాగనుశాసన నన్నయ భట్టారక ప్రణీతే రాఘవాభ్యుదయే మహాప్రబన్ధే' (శబ్ద-33) అన్నారు. పూర్వంలో లాగానే సకల భాషావాగను శాసన బిరుదాన్ని బట్టి యిక్కడి నన్నయభట్టే పూర్వంలో అన్నంభట్టు అయివుంటే వాడా అని సందేహం. ఈ బిరుదు ఇద్దరికీ వుండేదేమో, అనవచ్చు.

కాని మళ్ళీ యింకోచోట 'భారతే ఆదిపర్వణి అన్నంభట్టారకస్య మహా ప్రయోగః - రామమూందాత రఘుక్షితీశులు'- (కార-14) అన్నారు. ఈ ప్రయోగం నన్నయ భారతంలో ఆదిపర్వంలోదే. (2-178).

ఇది నన్నయభట్టారక కర్తృకమనటంలో వివాదం లేదు గదా. ఇక్కడ నన్నయభట్టు అన్నంభట్టుగా పేర్కొనబడ్డాడు. దీన్నిబట్టి పూర్వం అన్నంభట్టారక వ్యాకరణం అన్న స్థలంలోకూడా నన్నయభట్టే ఉద్దేశింపబడ్డాడనవచ్చు. అన్నంభట్టు ప్రమాదపతితం కావచ్చు.

ఇందులో అన్నిచోట్లా నన్నయభట్టే ప్రస్తావింపబడ్డా వాళ్ళొకళ్ళు కాదేమోనని సందేహం.

అన్నంభట్టుకొకచోట సకలభాషావాగనుశాసన బిరుదంజోడించగా మరోసారి యీ రెండు శబ్దాలను ఆ బిరుదు తగిలించలేదు. అందులో ముఖ్యంగా భారతకర్త నన్నయభట్టుకు ఈ బిరుదం కలపకపోవడాన్ని బట్టి, భారతకర్తకు సకలభాషా వాగనుశాసనుడనే బిరుదుండనడానికి ఆధారంలేకపోవడాన్ని బట్టీన్నీ ఆతడు వేరు. రాఘవాభ్యుదయకర్త, వ్యాకరణకర్త ఇద్దరూ ఒకరే అని రెండుచోట్లావున్న సకలభాషా వాగనుశాసన బిరుదం చేత గుర్తించవచ్చు. అయితే ఈ పక్షంలో ముందు పేర్కొన్న చోట వ్యాకర్త అయిన అన్నంభట్టారకుడికి బిరుదు కలపకపోవడం అనేది యిందుకు బాధకంకాదు. ఎందుకంటే రెండోచోట అదే వ్యాకర్తకి బిరుదు తగిలింపబడిందిగదా. ప్రమాదవశంలో మొదట పోయిందేమో. చెప్పకపోవడం మాతప్పుకాదు. దాన్ని అన్నం భట్టారకవ్యాకరణమనే రెండుచోట్ల ముందుగానే పేర్కొనడం గమనించవచ్చు.

అయితే ఇదే విధంగా ఆదిపర్వ ప్రయోగ సందర్భంలో కూడా బిరుదు పేర్కొకపోవడం విశేషంగాదనీ ఈ గ్రంథంలో ప్రస్తావింపబడిన అన్నిచోట్ల నన్నయభట్టు ఒక్కడేననీ ఆతడు సకల భాషావాగనుశాసనుడనీ చెప్పవచ్చును గదా అని సందేహం కలగొచ్చు.

ఆంధ్ర శబ్దచింతామణి టీకలలో పరిచ్ఛేదాంతగద్యలలో 'ఇతిశ్రీ సకల భాషా వాగనుశాసన నన్నయభట్టు విరచితాంధ్రశబ్దచింతామణౌ' అని వ్యాకర్త నన్నయభట్టుకు సకల భాషావాగనుశాసన బిరుదం వున్నది. భారత కర్త తన గ్రంథావతారికలోగాని ఆశ్వాసాంత గద్యాలలో గాని ఎక్కడా సకలభాషావాగనుశాసన బిరుదం పేర్కొలేదు. విపుల శబ్దశాసనుడ నన్నాడు. తరువాత వారు శబ్దశాసన వరేణ్యుడు (న్యా. పు అవ.8) శబ్దశాసనుడు (విష్ణుకాంచీ మహాత్మ్యాదాలభారతావతారికలు), వాగనుశాసనుడు (ప. సు. 1-10) (పం.ప్ర. 14-17) ఇత్యాదిగా పేర్కొన్నారు. ఎక్కడా సకల భాషావాగనుశాసను డనలేదు. ముఖ్యంగా నన్నయ తన ఆశ్వాసాంత గద్యాలలో 'సకల సుకవిజనవినుతుడు' గానే చెప్పుకొన్నాడు గాని 'సకల భాషావాగనుశాసను'డని ఎక్కడా చెప్పలేదు కాబట్టి భారత కర్త సకల భాషావాగను శాసనుడని చెప్పడానికి ఆధారం ఏమీ కనబడదు.

భారత కర్తగాడని విమర్శకులు నిర్ణయించినవారు రచించిన చౌడేశ్వరీ విలాస ప్రబంధంలో ప్రథమాశ్వాసాంత గద్యలో ఇది సకల భాషావాగనుశాసన శ్రీ నన్నయభట్టు విరచితంబైన వుంచిట. (కవిత. 26) ఇందులో ప్రస్తావింపబడ్డ రాఘవాభ్యుదయం దొరకడంలేదు. అయినా ప్రస్తుత వ్యాకర్త వచనాలనుబట్టి రాఘవాభ్యుదయ కర్త గూడా సకల భాషావాగనుశాసనుడైన నన్నయభట్టే.

మొత్తమ్మీద భారతకర్త సకలభాషావాగనుశాసన బిరుదం లేనివాడు కాని వ్యాకరణం, రాఘవాభ్యుదయం (చౌడేశ్వరీ విలాసం) వ్రాసిన నన్నయభట్టుకాబిరుదం వుంది.

భారతకర్త అయిన నన్నయభట్టే వ్యాకరణం వ్రాసివుంటే అథర్వణ ప్రభృతులు నన్నయని ప్రస్తావింపకుండా వుండటంకూడా సంభవమనిపించదు.

ఇంతేందుకు ప్రస్తుత వ్యాకరణంలో నన్నయభట్టు వ్యాకరణం ప్రసక్తి వుంది. ఆం. శ. చిం. లో కనబడే లక్షణాలతో సన్నిహితమైనవి ఇందులో వున్నాయి. అయినా ప్రస్తుత వ్యాకరణం కణ్వాదులనూ, అథర్వణుని గ్రంథంకూడా పలుమార్లు ప్రస్తావించింది. అవతారికలో ఎక్కడా నన్నయ పేరు ప్రస్తావించలేదు నన్నయకప్పటికి ప్రసిద్ధి లేదనలేం కదా. సుప్రసిద్ధుడైన నన్నయ వ్యాకరణం వుండగా దాన్ని అనుసరిస్తూ కూడా నన్నయను వ్యాకర్తగా ఈ వ్యాకరణం అవతారికలో అసలు ప్రస్తావించక పోవటమేమిటి ?

ప్రస్తుత వ్యాకరణకర్తకంటె కూడా మంచి లక్ష్మీనృసింహకవి వ్రాసిన 'ఆంధ్ర కౌముదిలో' చింతామణి స్ఫూర్తి అధికం. ఈ వ్యాకరణంలో చెప్పబడిందానికి భిన్నంగానూ విశేషంగానూ చింతామణి కనుగుణంగా 'ఆం. కౌ.' లో చాలా లక్షణాలు కన్పిస్తాయి.

ఉదాహరణకి రెండు మూడు చూద్దాం.

ప్రస్తుత వ్యాకరణంలో కళా ద్రుత ప్రకృతికాలతోపాటు 'సంకీర్ణాలు' (సం-25) పేర్కొనబడ్డాయి. చింతామణిలో వీటి ప్రస్తావన లేదు. ఆం. కౌ. కూడా సంకీర్ణాలను పేర్కొనలేదు.

ప్రథ్యావిధం త్రైవిధ్యమ్ అని ప్రస్తుత వ్యాకరణం తెలుగు అయిదు విధాలంటే చింతామణి 'ఇయం చతుర్విధా భవతి' అన్నది (సం. 42) అదేవిధంగా ఆం. కౌ. (అన్నను వివిధ) చతుర్విధైషా (సం. 61) అన్నది

1. ఉత్తమపురుషాన్తా స్త్రిజన్త్రభ్యాః (సా. ర. శ. క్రి-135)

రిజన్తద్యనామానా స్స్యో ర్మధ్యమ పురుషాశ్చ యే రహాన్తాశ్చ (చిం. క్రి. 37)

రిజన్తాద్యా రహాన్త మధ్యమాః (ఆం. కౌ. క్రి. 40)

2. వాజీవ్ (సా. త్రి. శ. క్రి. 67)

సంప్రార్థనార్థకాదీత్ (బా. క్రి. 43)

ప్రార్థనార్థకాదీత్ (ఆం. కౌ. క్రి. 45)

క్రియాపద ప్రక్రియా నిరూపణం చింతామణితో దాదాపు సమానంగా సా. త్రి. శ. కు భిన్నంగా ఆం. కౌ. లో నడచింది.

ఇలాగా నీ, నా, తా శబ్దాల ప్రక్రియ, మొ॥ గుణవదగుణవ ద్విభాగం ప్రస్తుత వ్యాకరణంలోలేదు. చింతామణికనుగుణంగా ఆం. కౌ. లో వుంది. అలాగే హలంత రూపసాధన విధానం చాల వరకు ఆం. కౌ. చింతామణికి సన్నిహితం.

వివరంగా తద్గ్రంథ పరామర్శనంలో చూద్దాం. ప్రస్తుతానికి ఆం. కౌ. చింతామణితో చాలా సన్నిహితమైన సంబంధం కల్గివుందనడానికి ఆధారాలు చాలు.

అయినా ఆం. కౌ. లో గూడా నృసింహకవి 'కాణ్వాద్యార్షసూత్రాణి సూత్రాణి బుద్ధ్వా కరోమ్యాంధ్రశబ్ద కౌముదీ మేవ'మన్నాడే కాని ఎక్కడా సకల భాషావాగను శాసన నన్నయభట్టునుగాని నన్నయభట్టారక వ్యాకరణాన్ని గాని ప్రస్తావించలేదు.

అందుకు కారణం ఏమై వుండాలి. అది కాణ్వాది వ్యాకరణాలవలె (అథర్వణ వ్యాకరణంవలె కూడా) ప్రాచీనం అయ్యుండక పోవటం కారణ కావచ్చు. తాను ఎలా కణ్వాదుల లక్షణాలను గ్రహించాడో చింతామణికర్తకూడా అలాగే చేసుండాలి. అథర్వణుడికంటె చింతామణీకర్త స్వతంత్రంగా చెప్పిన లక్షణం తక్కువైయుండాలి. తాను వ్రాసిన పద్ధతిలోనే రచింపబడింది కాని అపూర్వం కాదని, అయ్యుండొచ్చు. చింతామణిలోని లక్షణాలకు మరేదో పూర్వవ్యాకరణం మూలం అయినపుడు, చింతామణికి మూలమయిన గ్రంథాలే తన గ్రంథానికి మూలం అని చెప్పుకోవచ్చుగాని చింతామణిని చెప్పుకోవలసిన అవసరం ఏముంది? అనేదృష్టి కావాలి.

అయితే ఆం. కౌ. చిం. కే సన్నిహితంగా వుందికదా. అందులోనైనా చింతామణిని ప్రస్తావించినట్లయితే బాగుండేది అనడంలో సందేహం అక్కర్లేదు. కాని చింతామణిలో కనబడే ఆ భేదం చింతామణి కర్త స్వతంత్రంగా తానై ఏర్పరచింది కాదేమో.

ఏమైనా చింతామణి తన గ్రంథంలాంటిదే అందే పూర్వోక్త లక్షణాల కూర్పే గాని విశిష్టం కాదనే ప్రధానంగా తలచి వుండటం వల్లనే నన్నయభట్టు వ్యాకరణాన్ని తన గ్రంథానికి ఆధారంగా ఈ వ్యాకర్త పేర్కొనకపోయి వుండాలి. చింతామణి

అధర్వణ గ్రంథానికంటెగూడా తరువాతిదేమో సన్నిహిత కాలానికి చెందిందని కూడా అధర్వణుణ్ణి, అధర్వణ గ్రంథాన్ని ప్రశంసించిన యీ వ్యాకర్త చింతామణిని ప్రశంసించి ఉండకపోవచ్చు. చింతామణికప్పటికంత ప్రసిద్ధి గూడాలేదేమో. ఈ ఊహాకాధారాలు వెదకాలి. ఇక ప్రస్తుత వ్యాకరణంలో ఉద్ధరింపబడిన అంశాలు చూస్తే అసలు చింతామణి స్వరూపమే వింతగా ప్రత్యక్షం అవుతున్నది.

## చింతామణి 'నిజ' స్వరూపం

ప్రస్తుత వ్యాకరణంలో ఉద్ధరింపబడిన పై వాక్యాలు గమనిద్దాం. అందులో చింతామణిలోని 'స్త్రీవాచ్యైర్నావోః' అనేది బృహస్పతి సూత్రమని, లాన్నాత్తరరాతయోః అనేది రావణుడి లక్షణమని చెప్పబడింది. ఈ రెండింటి ప్రసక్తి వచ్చింది కాబట్టి ఏవి విషయం మరికొంత తెలిసింది.. ము చింతామణిలోని మిగిలిన లక్షణాలు ఎక్కడినుంచి వచ్చాయో ఇంతకు పూర్వం అధర్వణుడు తన త్రి. క. లో గూడా రావణాదుల లక్షణాలను (ఐదక్షమిదక్షర) స్వీయంగా చెప్పడం గమనించాం. అంటే యీ వ్యాకరణాలు తమకు పూర్వాలైన కావ్యాది వ్యాకరణాలలో చెప్పబడిన లక్షణాలను స్వీకరించియున్నమాట వానివల్లగూడా ఆ విషయాలలో ఈ వ్యాకరణాలలో పరస్పరం సంబంధం గోచరిస్తుంది.

ప్రస్తుత వ్యాకరణంలో కార. 42 సూత్ర వివృతిలో 'కర్తృత్వ ప్రథమానాస్త్యత్ద్వదితి వక్తవ్యః'- కర్తృత్వం ప్రథమా సవర్ణ కాస్స్యురితి వృత్తి కారాః' అని చెప్పబడింది. అంటే కాణ్వాది వ్యాకరణాలలో దేనికో వృత్తిగూడా ఎవరో వ్రాసారన్న మాట. ఇటువృత్తి వాక్యాలు ప్రస్తుత వ్యాకరణంలో అక్కడక్కడ వున్నాయి. ఇంతకీ పైని వృత్తి కార వచనముగా చెప్పబడ్డ 'కర్తృత్వ ప్రథమానాస్తత్ద్వదితి వక్తవ్యం' అనే వాక్యం యొక్క అభిప్రాయం సన్నయభట్టారక వ్యాకరణంలో 'కర్మాదేః కర్తృత్వం ప్రథమాచ సవర్ణకశ్చ తద్వత్స్యాత్' అని (హలన్త-33) సూత్రంగా వుంది. ఆ వృత్తికీ సూత్రం మిక్కిలి సన్నిహితం. వృత్తిలో 'నాస్త' అంటే చిం. కూడా సవర్ణకం ఒకటే చెప్పింది. కనుక అంతకుపూర్వం చెప్పిన (హలన్త-31) సవర్ణకాన్ని గూడా యిక్కడ చేర్చలేదు. వి. వి. 'కర్మాది కర్తృతా యాంచతౌ క్రియాణ విశేషణమ్' అని నివర్ణనాన్ని కూడా కలిపింది. ఏమైనా తద్వత్ శబ్దంతో సహా చింతామణి సూత్రంపై వృత్తి వచనాని కనుగుణంగా వుంది. చింతామణిలో శ్లోకబద్ధంగావడం వల్లా, చింతామణి సూత్రంకంటె భిన్నంగా వుండటం వల్లా, ముఖ్యంగా ఇతర స్థలాల్లోలాగా సన్నయభట్టారక వ్యాకరణంలోదని చెప్పక పోవడంవల్లా, ఈ వృత్తికారవచనం చింతామణిలోదికాదు. చింతామణినిచూసి ఎవరో వృత్తి వ్రాసారనడంకంటె, కాణ్వాది వ్యాకరణ సూత్రాలకెవరో వృత్తివ్రాస్తే

ఆ సూత్రాలతో పాటు వృత్తులనుగూడ చింతామణికర్త లక్షణ గ్రంథంలో కలిపేశా డనటం సహజంగా తోస్తున్నది'. ఇంతకీ ఈ వృత్తివాక్యం ఆ చింతామణిలో సూత్రం చేయబడ్డా ఆం. కౌ. మఱల 'వృత్తి'గానే (తస్య కర్తృత్వ ప్రథమానశ్చేతి వక్తవ్యమ్' ఆం. కౌ. హలన్త-75 సూత్ర వివృతి) చెప్పడం గమనిస్తే నన్నయ భట్టారక వ్యాకరణానికింత ప్రాముఖ్యం ఇవ్వకపోవడం గోచరిస్తుంది. మొట్టమొదట ఈ విషయం చింతామణికో చెప్పబడివుంటే నృసింహకవి యీ సూత్రాన్ని గ్రహించక వృత్తిగా చెబుతాడా అనే సందేహం.

ఇదే మఱి కొన్ని వృత్తి వచనాలు కూడా చింతామణిలో సూత్రాలుగా (శ్లోకాలు) కూర్చబడటం గుర్తించవచ్చు.

'బహువచస్స్వపక్వ విభక్తి వికారైస్సమస్యన్తే యథాతథమితివాచ్యమ్' (సా. త్రి. శ. సమాస. ఆ. సూత్రవివృతి) ఇదీవృత్తికారవచనమే అనవచ్చు. చింతామణిలో 'స్వపక్వవిభక్తి వికారైర్బహుశ్చయథాతథం సమస్యన్తే' (హల్. 49) అని సూత్రమ యింది వృత్తివచనంలోని మాటలు అటు ఇటుగా మొత్తం చింతామణి సూత్రంలోకెక్కడం స్పష్టం. ఆం కౌ. లో ఇది కూడా వృత్తి వాక్యంగానే (సమా. 7) చూపబడింది.

'సర్వవిభక్తిస్సంస్కృతతుల్యేతవాచ్యమ్' (ఆకార-1). అని ఆంధ్రకౌముదిలో ఇది వృత్తి లాగానే కనబడుతుంది. (సా. త్రి. శ. 'ఆద్యాతుల్యా' అని సూత్రం (కార-47) ఇది చింతామణిలో 'సర్వవిభక్తిస్సంస్కృతతుల్యా' అని (హలన్త-40) సూత్రం అయింది.

ఇలా ఇంకెన్ని వున్నాయో.

దీన్ని బట్టి చింతామణికర్త కాణ్వాది వ్యాకరణ లక్షణాలనే కాకుండా వాటికెవరో వ్రాసిన వృత్తిలో విశేషాలు కూడా దాదాపు యథాతథంగానే స్వీకరించి 'చింతామణి'గా కూర్చాడన్న మాట.

ఇది పూర్వ లక్షణాల కూర్పే గదా అనే ఉద్దేశ్యంతోనే దీనికి ప్రస్తుత వ్యాకర్త లంతగా ప్రాముఖ్యం ఇవ్వలేదనడంలో తప్పు లేదుగదా.

చింతామణిలో తత్కర్త పూర్వ లక్షణాన్ని గ్రహించడంలో శ్లోక బద్ధం చేయడం వరకు మాత్రమే అక్షరాల మార్పులు చేశాడో, కాక ప్రయోజన విశేషం సాధిస్తూ మార్పులేవైనా చేశాడో, అపూర్వంగా తెలుగు భాషా లక్షణాన్ని ఏమైనా చెప్పాడో లేదో గుర్తించడానికి చింతామణికి మూలమైన లక్షణ గ్రంథాలు దొరకడం లేదు.

ఇలా ఈవ్యాకరణాలు లక్షణనిర్వహణంలో పరస్పర సంబంధం అధికంగా కలిగి వున్నాయి.

**ఉదాహరణకొక్కటి :—**

| | |
|---|---|
| మహతస్సోర్ధజనితోభవేత్పుంసి | ఆం. శ. చిం. అ. 12 |
| మహతస్సోర్ధజనితః | సా. త్రి. శ. శబ్ద. 20 |
| మహతో(ని)తోసుజోస్సఃపుంసి | ఆం. కౌ. ల. 18 |
| సోర్మహతోడుజనితః | వై. చం. ల. 3 |

ఉపకృతి తిజ్మధ్యాది సంజ్ఞలు మొదలైన అంశాలు గ్రంథంలో ఫుట్‌నోట్సులో గుర్తిద్దాం.

## ప్రాకృత వ్యాకరణ ప్రభావం

ఈ గ్రూపు వ్యాకరణాల్లో ప్రత్యేకంగా కన్పించే లక్షణం ప్రాకృతవ్యాకరణ ప్రభావం. వై. చం. సంజ్ఞాప్రాకృతవచ్చ (సం. 3) అని సూత్రించి పెక్కు సంజ్ఞలు వాల్మీకీయంనుంచి యథాతథంగా పేర్కొంది. సుస్ మొదలైన ప్రత్యాహారాలు మరికొన్ని సంజ్ఞలు ప్రస్తుత వ్యాకరణంలోకూడా వున్నాయి.

తత్సవ ప్రకరణంలో ప్రాకృతవ్యాకరణంనుంచి కొన్నిలక్షణాలు యథాతథంగా ఇందులో స్వీకరించబడ్డాయి.

**ఉదాహరణకి కొన్ని :—**

1. క్షః కః — బృహస్పతి సూత్రంగా త్రి. శ అనుబంధంలోవుంది.
   ప్రా. వృ 3–2–32 — సా. త్రి. శ. తద్భ. 58

2. కగటడదపల్గకగపశోరుపర్యధే— బృహస్పతి సూత్రంగా త్రి. శ అనుబంధంలో
   ప్రా. వృ. 1–4–66 — సా. త్రి. శ. తద్భ–10

ఇక్కడ 'శషసాశ్శః' (ప్రా. వృ. 1. 1. 7) అనే ప్రాకృతీయ లక్షణాన్నా శ్రయించి 'శ' అనేసంజ్ఞను,(శషసలు అనేఅర్థంలో) యీ వ్యాకరణాల్లోనూ గ్రహించాలి.

3. ప్రాయోలుక్కగజ తదపయవామ్— బృహస్పతి సూత్రంగా
   (ప్రా. వృ. 1–3–8) — త్రి. శ. అనుబంధం

4. శేషోన్నః
ప్రా. వృ. 3–2–47

బృహస్పతి సూత్రంగా
త్రి. శ. అనుబంధం.
సా. త్రి. శ. తద్భ. 24

5. శేషాదేశస్యాహ్రోచోఖోః
(ప్రా. వృ. 1-4-86)

సా. త్రి. శ. తద్భ. 23

ఇక్కడ ప్రస్తుతవ్యాకరణంలోను 'ఖ' సంజ్ఞను ప్రాకృతంనుంచే గ్రహించి ఆదిః ఖః (ప్రా. వృ 1–1–9), అనే ప్రాకృత లక్షణాన్ననుసరించి మొదటివర్ణమని అర్థం తెలియాలి. వై. చం. ఈ సంజ్ఞను ప్రాకృతానుసారంగా చెప్పింది. (సం. 9)

6. పోవః (ప్రా. వృ. 1. 55)

సా. త్రి. శ. తద్భ. 41

కొన్ని ప్రాకృత వ్యాకరణాన్ని స్ఫురింపజేస్తూ దానికి సన్నిహితంగా కనబడతాయి.

1. హోహ్రస్వస్యః
వై. చం. సం.5, ప్రా. వృ. 1–5

హోహ్రస్వస్య
సా. త్రి. శ. పరి 16

2. దిర్ఘీర్ఘః
ప్రా. వృ. 1–6, వై. చం. సం. 6.

దిర్ఘీర్ఘస్య
సా. త్రి. శ. సం. 15

3. మనయామ్
ప్రా. వృ. 1–4-69

అధోమనయామ్
సా. త్రి శ. తద్భ. 14

4. లవరామదశ్చ
ప్రా. వృ. 1–4–68

ఉభయత్రరవలామ్
సా. త్రి. శ. తద్భ. 3

5. ఆదేర్జః
ప్రా. వృ 1–3–64

ఆదేర్యోజః
సా. త్రి. శ. తద్భ. 36
ఇది బృహస్పతి సూత్రంగా త్రి. శ. అనుబంధంలో వుంది.

6. ఋతోఒత్
ప్రా. వృ. 1–2–63

ఋతోఒద్వృద్ధాదౌ
సా. త్రి. శ. తద్భ. 36

7. యశ్రుతిరః
ప్రా. వృ. 1–3–10

యశ్రుతిరచ్
సా. త్రి. శ. తద్భ. 11

8. ఐచపజ్
ప్రా. వృ. 1–2–109

ఏజైచః
సా. త్రి. శ. తద్భ. 31

మొదటైన విషయం ఇది. కొన్ని సందర్భాలలో అదే అర్థం చెప్పడమో తెలుగు కవులకనువైన విధంగా అర్థంలో కొంచెం మార్పుతో చెప్పడమో వుండటం ఇందులో గమనించవచ్చు.

'దుర్లోపః' (సంఖ్య-55) అనే సూత్రంలో విధింపబడింది ద్విపర్ణమైతే అందులో రేఫం జరుగుతుంది. అందువల్ల 'ఇతోద్విత్వతే' (ప్రా. వ్యా. 1-4-65), (ఇతోద్విత్వమ్ ప్రై. చం. సం. 15) అనే ప్రాకృత వ్యాకరణ సంప్రదాయాన్ననుసరించి ణ కారం ద్విత్వంతో వచ్చి రెండు నాళ్లు, రెండాళ్లు (స్థిరపరకతలో అనుస్వార లోపం) రెణ్ణాళ్లు వేడి నీళ్లు, వేణ్ణీళ్లు ఇత్యాదిగా రూపొందుతాయి.

ఈ విధంగా ప్రస్తుత వ్యాకరణంలోనూ ప్రాకృత వ్యాకరణ ప్రభావం అధికం గానే కన్పిస్తుంది.

ఇంకా సూక్ష్మంగా పరిశీలిస్తే ఈ గ్రూపు వ్యాకరణాల్లో వుండే సామ్యాలను విపులంగా గుర్తించవచ్చు. ఆ సామ్య సంబంధాలను గుర్తిస్తూ ఈ వ్యాకరణాలను ఒక దానితో ఒకటి పోలుస్తూ పరిశోధిస్తే సూత్ర కర్తలు వుద్దేశించిన అర్థాలు తెలుసుకో గలుగుతాం.

మొత్తమ్మీద ఈ సామ్య సంబంధాలతో ప్రస్తుత వ్యాకరణంగూడా ఈ గ్రూపులో చేరిందని గుర్తించవచ్చు.

ఇక ప్రస్తుత వ్యాకరణం గురించి చూద్దాం.

## అసలీ పుస్తకం పేరేమిటి ?

ప్రస్తుత వ్యాకరణం పేరే వివాదాస్పదం కావడం మొదటి విశేషం.

ప్రస్తుత వ్యాకరణానికి ఒకే ఒక్క వ్రాతప్రతి ఆధారం. అది మద్రాస్ గవర్న మెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలో వుంది. కాగితాల మీద వ్రాయబడింది. D. 1223 నంబరులో వుంది. ఈ పుస్తకంలో ప్రతిపేజీ మీద పైన 'ఆంధ్ర కౌముదీ' అని వ్రాసివుంది. ఇది నకలు ప్రతి తీసుకున్నవారు వ్రాసుకున్నదనేది స్పష్టం. దీన్నిబట్టే కావచ్చు ఆ లైబ్రరీ వారు ప్రచురించిన డిస్క్రిప్టివ్ కేటలాగ్ 6వ సంపుటంలో ఈ పుస్తకం (D. 1223 గలది) ఆంధ్ర కౌముదిగానే పేర్కొనబడింది.

## ఆంధ్ర కౌముది అవుతుందా ?

దీన్నిబట్టి యీ పుస్తకం పేరు 'ఆంధ్ర కౌముది' అనాలి.

కానీ 'ఆంధ్ర కౌముది' అన్నది గ్రంథకర్తృ వచనం కాదు. గ్రంథకర్త తన గ్రంథాన్ని గురించి స్వయంగా "బార్హస్పత్యం రావణీయం కాణ్వమాథర్వణం విదన్ కరోమి సారస్వత త్రిలింగ శబ్దానుశాసనం" (అవ. 3 శ్లో) అని స్పష్టంగా చెప్పుకున్నాడు.

తర్వాతగూడా లక్షభాగం ప్రారంభించబోతూ "కాణ్వ బార్హస్పత్య రావణీయాది వ్యాకరణాని బుద్ధ్వా కరోమి సారస్వత త్రిలింగ శబ్దానుశాసన మేవమ్" అని మళ్ళీ తన గ్రంథం పేరు 'సారస్వత త్రిలిఙ్గశబ్దాను శాసనమ్' అనే పేర్కొన్నాడు.

ఇందులో పరిచ్ఛేదాలకు చివర గద్యలేదు. (ఆం, కౌ. లో కూడా కనబళ్ళేదు.) (O. R. I. తిరుపతి ప్రతుల్లో) గ్రంథాంతంలో 'ఇతి త్రిలిఙ్గ శబ్దాను శాసన వ్యాకరణమ్ సంపూర్ణ మగమత్' అనివుంది. ఇక్కడ గ్రంథంపేరు త్రిలిఙ్గ శబ్దాను శాసన మని వుండటంలో ముందరి 'సారస్వత' శబ్దం ప్రమాద వశాత్తు నష్టమై వుంటుందనడం తప్పుకాదు. గ్రంథంలో గ్రంథకర్త స్వయంగా ఒకటికి రెండుసార్లు చెప్పుకున్నదాన్ని బట్టి దీని పేరు సారస్వత త్రిలింగ శబ్దాను శాసనమే. ఆంధ్రకౌముది అనడానికి గ్రంథ కర్తృవచనాల్లో ఆధారం లేకపోగా విరోధమే వుంది. సారస్వత త్రిలింగ శబ్దానుశాసన మని చెప్పటం 'ఆంధ్ర కౌముది' అనడానికి విరోధమే కదా,

డిస్క్రిప్టివ్ కేటలాగు ననుసరించేట్లు కాబోలు ఆం. వ్యా. వి. కూడా దీన్ని ఆంధ్ర కౌముది అనే పేరుతోనే వ్యవహరించింది. ఇందలి అంశాలను, ఆంధ్ర కౌముదిలోవిగా వుద్ధరించింది.

ఈ నృసింహకవే వ్రాసిన 'ఆంధ్రకౌముది' అనే గ్రంథం వొకటి ప్రత్యేకంగా వుంది. ఇది వొకసారి అచ్చుకూడా అయింది. ప్రయత్నించానుగాని యిది నాకు లభ్యంగాలేదు. వ్రాతప్రతులనుబట్టి చూడగా 'ఆంధ్రకౌముది' అనే పేరు గ్రంథస్థమై వున్న ఆ పుస్తకానికీ, సారస్వత త్రిలింగ శబ్దానుశాసనం అనేపేరు గ్రంథస్థమైవున్న యీ పుస్తకానికి పోలికలతోపాటు భేదంకూడా అధికంగానే వుంది.

ఈ భేదాన్ని ఆం. వ్యా. వి. గుర్తించకపోలేదు. రెండో సంపుటంలో ప్రస్తుత గ్రంథం (సా. త్రి. శ) 'ఆంధ్రకౌముది' బృహద్వృత్తిగా ప్రత్యేకంగా పేర్కొనబడింది. పుట 101 లో ఇది ఆంధ్రకౌముదికంటె భిన్నంగావడం ప్రస్తావింపబడింది. మండలక్ష్మీనృసింహకవి కంటే వేరైన ఆధునికుడెవరో ప్రస్తుత గ్రంథాన్ని వ్రాసి వుండొచ్చు (పుట-101) ననడంలో సా. త్రి. శ. ఆంధ్రకౌముదికంటే భిన్న గ్రంథ మని గుర్తింపబడినట్లే చెప్పవచ్చు.

'దీనికి (సా. త్రి. శ.) ప్రత్యంతరాలు లేవు'. (ఆం. వ్యా. వి. 2 సంపుటం. 73) కాని ఆంధ్రకౌముదికి వ్రాతప్రతులు అనేకం వున్నాయి. మద్రాసులోనూ,

తిరుపతి (O.R.I.)లో రాశినాపలోనూ. ఇవి గుర్తించిన ఆం. వ్యా. వి. ప్రస్తుత సా. త్రి. శ. ను ఆంధ్రకౌముది (I. 197 పుట) బృహదాంధ్ర కౌముది (I. 190 పుట) ఒకే గ్రంథంగా వ్యవహరించి వుండవలసింది.

ఇవి రెండు ఒకే గ్రంథాలనుకోవడం వల్లనే ఆం. వ్యా. వి. ప్రస్తుత వ్యాకరణంలో వున్న సారస్వత త్రిలింగ శబ్దాను శాసన పదాన్ని బట్టి ఆంధ్ర కౌముదికే 'త్రిలింగ శబ్దానుశాసనం అనేది నామాంతరమివ్వడం (II-78) జరిగింది. [1](ఆం. వ్యా. వి. ఉద్ధరించిన శ్లోకార్థంలోని 'సారస్వత' శబ్దం ఎందుకుపేక్షితమయిందో ఆం. వ్యా. వి. లఘువృత్తిగా భావించిన అనేక ప్రతులు వేనిలోనూ ఆంధ్ర కౌముది అనే పేరే తప్ప సారస్వత త్రిలింగ శబ్దాను శాసనం అనే పేరే లేదు. ఈ పేరున్న ఈ ప్రస్తుత వ్యాకరణం ఆంధ్ర కౌముది ప్రతులకు భిన్నం. కాబట్టి దీన్ననుసరించి ఆంధ్ర కౌముదికి (సారస్వత) త్రిలింగ శబ్దానుశాసనం అనే నామాంతరం వుందనడానికి వీలు లేదు. అలాగే బృహదాంధ్ర కౌముది, లేదా ఆంధ్ర కౌముది బృహద్వృత్తి అని ఆం. వ్యా. వి. ఊహించిన ఈ గ్రంథంలో సారస్వత త్రిలింగ శబ్దానుశాసనమనే పేరేగాని ఆంధ్రకౌముది అనే పేరు గ్రంథ కర్త వచనాల్లో ఎక్కడా లేదు కాబట్టి సా. త్రి.శ. కు ఆంధ్ర కౌమది అనేది నామాంతరం అనడానికి వీలులేదు, సారస్వత త్రిలింగ శబ్దానుశాసనం అనే పేరు మాత్రమే వున్న పుస్తకం, ఆంధ్ర కౌముది అనే పేరు మాత్రమే వున్న పుస్తకం రెండు విభిన్నాలు కావడం చేత ఒక దాన్ని బట్టి రెండోది దీనికి నామాంతరం అనడం కుదరదు.

## ఇది ఆంధ్ర కౌముది కాదు

సా. త్రి. శ. ను ఆంధ్రకౌముది అనకూడదనడమే ఉచితం. ఈ రెండింటికీ పోలికలు లేకపోలేదు. కాని భేదాలు అధికంగానే వున్నాయి. ఉదాహరనకు కొన్నింటిని చూద్దాం.

ఈ గ్రంథంలో అవతారిక మొదట్లో బార్హస్పత్యం రావణీయంకాణ్వ మాథర్వణం విదన్ కరోమి సారస్వత త్రివిజ్ఞశబ్దాను శాసనమ్' (అవ-3) అని చివర్లో "కాణ్వ బార్హ స్పత్య రావణీయాది వ్యాకరణాని బుద్ధ్వా కరోమి సారస్వత త్రివిజ్ఞశబ్దానుశాసన మేవ" మ్మనీ దీని పేరు రెండు చోట్ల సారస్వత్రిలింగ శబ్దాను శాసనంగా వుంది. ఇంక ఇదే సందర్భంలో ఇదే విధంగా ఆం. కౌ. లో

అథర్వణాని కాణ్వాని బార్హస్పత్యాని సంవిదన్

---

1 ఇది మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం వారి కేటలాగు V, పుట-1545 అనుసరించి చెప్పింది కావచ్చు.

కౌముదీ మాంధ్ర శబ్దానాం సూత్రాణిప కరోమ్యహమ్ (ఉప-3) "కాణ్వా బార్హస్పత్యాని సూత్రాణి బుద్ధ్వాకరోమ్యాంధ్ర శబ్ద కౌముదీ మేవమ్" అనీ ఆంధ్ర కౌముది గానే పేర్కొనబడింది.

స్పష్టంగా గ్రంథ నామం భిన్నంగా గ్రంథ కర్త స్వయంగా చెప్తుంటే తప్పున్నంగా చెప్పటం ఎలా? ఎందుకు?

గ్రంథస్థ లక్షణంలో కూడా సా. త్రి. శ. కంటే ఆం. కౌ. లో భేదాలు గమనించ వచ్చు. ఆం. కౌ. లో చింతామణి స్ఫూర్తి అధికంగా వుండటం అక్కడ సా. త్రి. శ. కు భిన్నంగా వుండటం ఇంతకు ముందే గుర్తించాము. కొన్ని భేదాలు ఇక్కడ చూద్దాం.

పరి భాషా పరిచ్ఛేదంలో సా. త్రి శ. లజీ ఘా్రతి విధా (14) అని ప్లుతభేదం చెప్పి ద్వివిధో్ర్రావణస్య' (14) అని రావణుని మతాన్ని ఉద్ధరించింది ఆం. కౌ. ద్వివిదోఽజ్ అని రావణుడి పేరు చెప్పకుండానే ఆ మతాన్ని మాత్రమె పేర్కొంది.

సంధి పరిచ్ఛేదంలో ఉత్వ సంధిని గూర్చి సా. త్రి. శ. లో త్రి. శ. కనుగుణంగా చెప్పబడిన శేషాత్ స్వేఽచివి భాషా తద్ధితలిజప్యయేతోనిత్యమ్ క్వచిచ్చాన్యస్మిన్, అని (3,4,5,) చెప్పబడ్డ విధులు సాధించే అర్థం చాలవరకు ఇతస్తదాదేశ్చ, కిమాదేః ప్రాయః అనేవి సాధిస్తున్నాయి. ఆం. కౌ. మొదటి మూడు సూత్రాలు చెప్పలేదు. లిజన్తాలకు అనుత్తమేతో నిత్యమ్, వోత్తమస్య (సంధి-6,7)అనే లక్షణాలతో సాధించి పునరుక్తుల్ని పరిహరించింది. ప్రథమేతర విభక్త్యుకార సంధి సా. త్రి. శ. లో లేదు. వానావి విభక్త్యుతః (సంధి.4) అని ఆం. కౌ. చెప్పింది. (అనామిషు విభక్తిషూతోనా- ఆం. శ. చిం. సంధి.

ధాత్రాదేర్దగుః (శబ్ద 67) అని సా. త్రి. శ. చెపితే ఆం.కౌ. డాబవిధాత్రాదేః (శబ్ద. 66) అన్నది ఆం. శ. చిం. అనుక్త.

సా. త్రి. శ. లో హలంతాలు గుణపద గుణవర్గణాలుగా విభావింపబడలేదు. ఆం. కౌ. లో (చిం. కనుగుణంగా?) అటువంటి విభాగంవుంది.

క్రియద్వేధా అని (క్రి. 1) సా. త్రి. శ. చెప్పిన మహ దమ్యోదం ఆం. కౌ. లో లేదు (చిం. కనుగుణంగా) ఆం. కౌ. క్రియ తద్ధర్మాద ర్థకాలుగా విభాగించింది. (క్రి. 8) ఇది సా. త్రి. శ. లో లేదు. సా. త్రి. శ. లోని లేట్, లోట్ లకారాలు ఆం. కౌ. లో లేవు. చింతామణిలోనూలేవు. లడాద్యంత క్రియాపద ప్రక్రియ సా. త్రి. శ. కంటె చాలాభిన్నంగా చింతామణికి సన్నిహితంగా ఆం. కౌ. చెప్పింది.

సూత్రంలో ఆధారం స్పష్టంగా లేకుంటా వివృత్తిలో విశేషంగా కనిపించే అర్థం ఆం. కౌ. లో సూత్రబద్ధం అయివుండటం గమనించొచ్చు.

అనుకృతేశ్చ — (సంధి. 39) లహమాద్యనుకరణస్య వా ద్విత్వం స్యాత్తని దీనికి వివృత్తి అహమాదేర్వానుకరణే ద్విత్వమ్' (సంధి. 20) అని ఆం. కౌ. లక్షణం. ఇక్కడ 'హ' అనడం చింతామణికంటె విశేషం.

లినామిరశ్చ (కార. 20) ఔపవిభక్తికయోగ్య లివర్ణానామికారస్యలుగ్వాస్యాత్ అని వివృతి. ఔపవిభక్తి కలినామిల్లుగ్బహుళమ్' (అజన్త. 101) అని ఆం.కౌ ఇది చింతామణి కనుగుణం (ఔపవిభక్తికవర్ణయోగ్యానాం వివర్ణాంఇల్లుక్ ఇకారలోపో బహుళం స్యాత్ అని ఆం.కౌ. సూత్రవివృత్తిపై సా. త్రి. శ. వివృతి మార్గంలోవుంది.)

విభక్త్యాదేల్లోపః (సమా. 2) సమాసాంగేషు శబ్దేషు విభక్త్యాదీనాం లోపస్స్యాత్తని వివృతి. విభక్త్యాదేస్సమాసాహేషులోపః (సమా. 3) అని ఆం. కౌ. ఇది చింతామణిని స్ఫురింపజేస్తూ కొంత ప్రత్యేకతతోవుంది.

ఇలాంటివి ఇంకా వున్నాయి ప్రస్తుతానికివిచాలు.

సా. త్రి. శ. లో వున్న పరిచ్ఛేదవిభాగమే అంతా ఆం. కౌ. లో లేదు. సర్వనామప్రకరణం, ఆర్థితపరిచ్ఛేదం, తద్భవపరిచ్ఛేదం, వగైరాలు ఆం. కౌ. లో ప్రత్యేకంగా లేనేలేవు. ఏకపదవిధిప్రకరణం మొదలైన వాటిల్లో సా. త్రి. శ. లో త్రి. శ. అనుగుణ్యం ఆం. కౌ.లో లేదు. ఆం. కౌ.లో కన్పించే చింతామణి సాన్నిహిత్యం అంతగా సా. త్రి. శ. లో లేదు. సా. త్రి. శ. లో కన్పించేపునరుక్తులు ఆం. కౌ.లో కనబడవు.

సా. త్రి. శ. కంటే ఆం. కౌ. లక్షణ విధానంలో పరిణతి కన్పిస్తుంది. కాబట్టి సా. త్రి. శ. క తరువాతనే ఆం. కౌ. రచింపబడిందనవచ్చు. ఆం. వ్యా. వి దీనికివిరుద్ధంగా భావించడం విచార్యం. ఏమైనా ఈరెండు గ్రంథాల అంతరస్వరూపంలో చాలాతేడావుంది. కాబట్టి ఇవిరెండు ఒకటే అని కాని, ఒకే గ్రంథంయొక్క రెండు స్వరూపాలుగా (బాలసరస్వతీయ చింతామణి, అప్పకవీయ చింతామణిలాగా) గాని (ఆం. వ్యా. వి II - 101) చెప్పడాని కవకాశంలేదు పోలికలకంటె వైరుధ్యాన్ని నిరూపిస్తే భేదాలివిరెండు వేర్వేరు గ్రంథాలని స్పష్టం చేస్తున్నాయి.

## ఇది సారస్వత త్రిలింగ శబ్దానుశాసనం

కాగా సా. త్రి శ. ఆం. కౌ లు రెండూ భిన్నగ్రంథాలు. అటువంటపుడా గ్రంథాన్ని అందరో చెప్పినట్లుగా ఆంధ్రకౌముదిగా గ్రహించడం ఎంత ఉచితమో, ప్రస్తుతవ్యాకరణం ఈగ్రంథంలో చెప్పబడినట్లుగా 'సారస్వతత్రిలింగశబ్దానుశాసనం'గా గ్రహించటం అంత ఉచితం అవసరమున్నూ.

మొత్తమ్మీద ప్రస్తుత వ్యాకరణం పేరు. ఆంధ్ర కౌముది (బృహదాంధ్రకౌముది) కాదు. సారస్వత త్రిలింగశబ్దానుశాసనం.

## కర్త ఎవరు ?

ఇక ఈ పుస్తకం వ్రాసిందెవరో తెలుసుకోవాలి. ఇందులో వివాదమే అక్కర్లేదు. గ్రంథకర్తే స్వయంగా తనవివరాలన్నీ చెప్పుకొన్నాడవతారికలో. నాంచారమాంబా తనయస్సూనుర్వరదయజ్వనః లక్ష్మీనృసింహ సుకవిరాజోఽహం మంద వంశజః". (సా. త్రి. శ. అవ-10 శ్లో. , ఆం. కౌ. అవ. 4 శ్లో.) నాంచారమ్మ వరదయజ్వల కొడుకు లక్ష్మీనృసింహ కవి 'మందవంశజం' అనేచోట 'మండ' అని ఆం. కౌ. ప్రతుల్లో కనవస్తుంది. 'మండ' వంశంగా ఇది వాడుకలో వుంది. 'మండ లక్ష్మీనృసిహ కవి' తాను వ్రాసినట్టుగా స్వయంగా చెప్పుకుంటుంటే కర్త యెవరనే సందేహమే అనవసరం.

కాని ఆం. వ్యా. వి. దీనికి భిన్నంగా మండలక్ష్మీ నృసింహాచార్యులు గాకుండా నృసింహ కవి ఆంధ్రకౌముది ఆధారంగా అందులో సూత్రాలకు తమ సూత్రాలు జోడించి చింతామణి సూత్రాలను చేర్చి వాటి మీద బృహద్వృత్తి వ్రాశాడని (II-101) పేర్కొన్నది.

కాని యిది సమంజసంగా కనబడటంలేదు. ఆం. వ్యా. వి. పై వాక్యాలను బట్టి సా. త్రి. శ. ఆం. కౌ. లు భిన్న కర్తృకాలు. అటువంటప్పుడు సా. త్రి. శ. వ్రాసిన వాడు తన గ్రంథారంభంలో నృసింహ కవిగా ఎందుకు చెప్పుకొన్నాడు? 'లక్ష్మీ నృసింహ కవి రాజోఽహం మంద వంశజః' అనేది ఆం. కౌ. లో వున్నట్టుగా సా. త్రి. శ లోనూ వున్నదే. స్వీయ లక్షణాలు గూడా జోడించినవాడు తన గ్రంథాన్ని తాను వ్రాసినట్టు చెప్పకోక పోగా తాను నృసింహ కవి నని చెప్పడం ఎలా సంభవం?

అవతారిక కూడా నృసింహ కవి ఆంధ్ర కౌముది నుంచి ఎత్తి వ్రాసుకున్నాడా? అయితే తన పుస్తకానికి మరో పేరు పెట్టడందేనికి? ఆంధ్రకౌముదిని, తత్కర్తను తీసికొన్న వాడు గ్రంథం పేరు మాత్రం ఎందుకు మార్చాలి?

ఏమైనా సా. త్రి. శ. లో నృసింహకవి రాజోఽహమ్. అనే మాట సా. త్రి. శ. నృసింహ కవి కంటే వేరైన వాడెవరో వ్రాశాడనడాన్ని ఎంత మాత్రం అంగీకరింపనీయదు.

బృహద్వృత్తి గూడా ఇంకెవరో వ్రాశారంటున్నది. ఆం.వ్యా.వి. కాని ప్రస్తుత గ్రంథంలో మధ్యలో గూడా వివృతిలోనే మళ్లీ గ్రంథకర్త తన చరిత్ర చెప్పుకున్నాడు.

కుంభజునికి అనే తిక్కన ప్రయోగ సాధుత్వం గురించి చెప్తూ. 'అధర్వణ వచనేన సోమయాజి ప్రయోగస్య సాధురేవేతి జ్ఞాత్వామయా వేంగి నాటీయేన మండ కుల కలశ జలధి సుధాకరేణ శ్రీమదష్ట భాషా సరస్వతినా సహస్రావధానినా సరస కవిశేఖరేణ కవిరాజకంఠీరవేణ శ్రీ నకులి వాగీశ్వరీ వర ప్రసాదలబ్ధ సర్వంకష సరససాహిత్య సకలాంధ్రవిద్యా పాండిత్యధౌరేయేణ లక్ష్మీనృసింహ సుకవినా.... (శబ్ద. 36 సూత్ర వివృతి) అని చెప్తున్నాడు. గ్రంథమధ్యంలో ఈ ఉత్కర్ష సందర్భోచితంగా కనబడదు. కాని ఎవరో కల్పించారని ప్రక్షిప్తం చేశారనీ చెప్ప డానికి ఆధారం ఏముంది ? ఇందులో నృసింహకవి తన్నుగూర్చి చెప్పుకొన్న విశేషణా లన్నీ పూర్వం అవతారికలో చెప్పిన వాటితో సరిపోవడం గమనార్హం. సుకరో వేంగి నాటీయః.... సహస్రావధానీర్వ్యష్ట భాషాసరస్వతిః (అవ-5) నకులీ శారదాదేవీ కటాక్షామృతవర్ధితః (అవ-4) మొ॥

దీన్నిబట్టి సూత్రార్థ వివరణం (బృహద్వృత్తి) నృసింహకవే వ్రాశాడని అంగీకరింపక తప్పదు. గ్రంథస్థమైవున్న గ్రంథకర్త వచనాలను తిరస్కరించడానికి బాగా బలమైన ప్రమాణాలు దొరకాలి. అవి లేనపుడు నిరాధారంగా వీటిని త్రోసి పుచ్చడం సమంజసం కాదుగదా.

ఆం. వ్యా. వి., ఆం. కౌ., సా. త్రి. శ. లు భిన్న గ్రంథాలని మొదలు తలచినట్లు లేదు. అవి రెండూ ఒకే గ్రంథం యొక్క రెండు రూపాలు అని భావించడం వల్ల ఆం. వ్యా. వి. లో పూర్వోత్తర విరోధం వాటిల్లింది.

ఈ నృసింహకవి కాలాన్ని నిర్ణయించడానికి స్వీకరించిన రామానుజాచార్యులు ముత్తాత గావడం మొదలైన విషయాలు - '(సా. త్రి. శ. అవ. 7 నుండి 10 శ్లో.) సా. త్రి.శ. లో వున్న వేఆంధ్ర కౌముదిలో నృసింహకవి ముత్తాత ప్రసక్తి కానరాలేదు. (ఆం. వ్యా. వి.) ఆ సందర్భంలో ఆధారాన్ని ఉటంకించలేదు. మద్రాస్ ప్రా.పు.భా. కేటలాగు వివరాలు కూడా అయ్యుండొచ్చు. సా. త్రి. శ. ను బట్టి (తత్కర్త) నృసింహకవి కాలాన్ని నిర్ణయిస్తూ, సా. త్రి. శ. ను మాత్రం నృసింహకవి వ్రాయ లేదనడం విరుద్ధం కదా.

ఏదేమైనా ప్రస్తుత వ్యాకరణంలో తత్కర్త నృసింహకవి అని తాతల తండ్రుల చరిత్రతోసహా చెప్పివుండగా సూత్రార్థ వివరణంలోగూడా తత్కర్త నృసింహకవిగా చెప్పబడగా దాన్ని తిరస్కరించి వేరెవరో వ్రాశారనడం అంగీకారయోగ్యంగా కనబడదు.

# అనుమానం ఎందుకు ?

అసలు నృసింహకవి కాకుండా ఆధునికుడెవరో వ్రాసివుంటారనే అనుమానం ఎందుకు రావాలి ?

ఆం. వ్యా. వి. ఒకే ఒక్క ఆధారం చూపించి. 'అన్యదేశాగతం గ్రామ్యం' అనే సూత్ర వివృతిలో 'దేఖోజాపు ఇదరావు, దాల్, లాఠీ, పూఛా, ఆవో, షురు, పత్తరు, బొమ్మన్ ఫీ పీవో యూ కం సిడౌన్ ఇత్యాది' అని హిందీ ఇంగ్లీషు పదాలున్నాయి. హిందీ శ్రీనాథుడికి ముందునుంచే తెలుగువారిపై ప్రభావం చూపించే కాబట్టి హిందీ పదాలు చూపడంలో విరోధంలేదు. ఇక ఇంగ్లీషు పదాలు ఉదాహరించడాన్ని బట్టి యేతత్కర్త ఆధునికుడు కావాలని ఆం. వ్యా. వి. నిశ్చయం. (II పుట 102).

ఆం. వ్యా. వి. పేర్కొన్నదాన్నిబట్టే నృసింహకవి క్రీ. శ. 1660 ప్రాంతంలో ఈ గ్రంథం (సా. త్రి. శ.) వ్రాశాడు. (I-198) అప్పుడు వ్రాసిన పుస్తకంలో ఇంగ్లీషు మాటలుండటం కేవలం అసంభవం అనలేం.

మొట్టమొదటి ఇంగ్లీషువాడు (ఫాదర్ స్టీవెన్స్) 1580 ప్రాంతంలోనే భారత దేశానికి వచ్చాడు. 1600 ప్రాంతంనుంచి ఈస్టిండియా వర్తకం ఇక్కడ నడిచింది. 1611 లో బందరులోనూ, 1625 లో నెల్లూరులోనూ మొదటగా గిడ్డంగుల నిర్మాణంతో ఆంధ్రప్రాంతంలోనూ ఇంగ్లీషువారు చేరారు. 1640 ప్రాంతంనాటి వెంకటాధ్వరి తన విశ్వగుణాదర్శ చంపువులో ఇంగ్లీషువారి గుణగణాలను వర్ణించడంవల్ల అప్పటికే మద్రాసు ప్రాంతంలో స్థిరపడ్డ వారి మంచిచెడ్డలు తెలిసేంతగా ఇంగ్లీషు వారితో ఇక్కడి ప్రజలకు సాన్నిహిత్యం ఏర్పడింది. 1660 ప్రాంతంలోవున్న పాలవేకరి కదిరీపతి శుకసప్తతిలో ఇంగిలీసు ముఖాములు (1-175, 3-10) ప్రస్తావింపబడ్డాయి. (తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావం డా॥ కొత్తపల్లి వీరభద్రరావు పుటలు 46-75)

మరి ఆ ప్రాంతంలో వున్న నృసింహకవి తన గ్రంథంలో రెండుమూడు ఇంగ్లీషు ముక్కలు చేర్చడంలో అసంభవంగా తోచడంలేదు. క్రొత్తగా ప్రవేశించిన భాషపై మోజుతో వాటిని చెప్పివుండొచ్చు. హిందీ పదాలు చాలా వుదాహరించినవాడు ఇంగ్లీషు మాటలు అత్యల్పంగా చూపడం గమనార్హం. అసలింతకీ నృసింహకవి ప్రదర్శించిన ఇంగ్లీషు పదాలు ఏ కావ్యంనుంచో వుద్ధరించినవి కాకపోవడం ముఖ్యంగా గమనించవలసిన విషయం.

కాబట్టి ఆ ప్రకవి కాలంలో వున్నావన్నా ఈ గ్రంథంలో ఇంగ్లీషు మాటలుండటం (ఉన్న మాటల తీరుబట్టి గూడా) నృసింహకవి కర్తృత్వానికి బాధకంగా భావించవలసిన అవసరం కనబడదు.

# నృసింహ కవి ఎప్పటివాడు ?

ప్రస్తావన వచ్చింది కాబట్టి యిక్కడ నృసింహ కవి కాలం గురించి చూద్దాం.

నృసింహకవి సా. త్రి. శ. అవతారికలో తన్ను గురించి కొంచెం చెప్పుకున్నాడు.

ఇతని పేరు మంద లక్ష్మీనృసింహకవి. కౌశికస గోత్రుడు. వేంగినాటివాడు. ఇతని తల్లిదండ్రులు నాంచారమ్మ వరదయజ్వలు. వరదయజ్వ తండ్రి వెంకటాచార్యులు, వెంకటాచార్యుల తండ్రి వెంకటాద్రిసూరి. అతని తండ్రి రామానుజాచార్యుడు. (అవ. 5-10) రామానుజాచార్యుడు వెంకటపతి రాయలకు విద్యాగురువు. ప్రభువసుదాన్నిబట్టి వెంకటపతిరాయలు రాజై వుంటాడు. కాని వెంకటపతిరాయల పేర్లున్నవారు ముగ్గురున్నారు. మొదటి వెంకటపతి 1542-43, రెండో వెంకటపతి 1586-1614, మూడో వెంకటపతి 1630-1642 పాలించినవారు. వీళ్ళలో ఎవరికి గురువు? రామానుజాచార్యుడు వివదించి గెలిచాడన్న కాముదేవమిశ్రుణ్ణి గురించిగాని, స్నేహితుడన్న గోపీనాథమిశ్రుణ్ణి గురించిగాని తెలియరాలేదు. రామానుజాచార్యులు ఉత్తర మనోహరం అనే గ్రంథంకూడా వ్రాశాడు.

రామానుజాచార్యులు రెండో వెంకటపతి రాయలకు గురువై వుంటాడని కాబట్టి నృసింహకవి యీ గ్రంథం 1660-1670 ప్రాంతంలో రచించి వుంటాడని పరిశోధకులూహించారు. (ఆం. వా. వి. I. 198, ఆం. భా. వి. 165) మొ॥

నృసింహకవి యీ గ్రంథంలో చాలమంది కవులను, చాలా కావ్యాలను ప్రస్తావించాడు. కాని దాన్నిబట్టి నిశ్చయించడానికి బలమైన ఆధారంలేదు.

సర్గ. 16 సూత్రందగ్గర 'తముఁదామవత్తురట్టుల' అనే మువ్వగోపాలకృష్ణ క్షేత్రయ్య పద్యాన్నుదహరించాడు. క్షేత్రయ్య 1620 ప్రాంతంలో రఘునాథనాయకుణ్ణి దర్శించాడు విజయరాఘవుడిదగ్గర వున్నాడు. కాబట్టి యీ గ్రంథం ఆ తరువాతనే.

అలాగే పరి 24 సూత్రందగ్గర గౌతమీ పరిణయంనుంచి 'శ్రీలచెలువొందు చెన్నపురి విలసిల్లు' అనియీయబడింది. ఇందులో ఒకఅర్థంలో 'చెన్నపురి' అంటే మద్రాసు అని గ్రహించాలి. చెన్నపట్టణం అనేపేరు 1641లో ఏర్పడినట్లు తెలుస్తున్నది. (తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావం) కాబట్టి 'చెన్నపురి' అనేపేరున్న యీ గౌతమీపరిణయం ఆతరువాత రచింపబడింది కావాలి. ఇందులో ఇంగ్లీషుమాటలుండటం కూడా ఈ సమయానికి విరుద్ధంకాదు. కాగా ఆంతరంగికాలైన ఈ ఆధారాలనుబట్టి సా. త్రి. శ. రచనాకాలం 1650 కి తర్వాతనే అని నిశ్చయంగా చెప్పవచ్చు. ఆ తరువాతనే ఎప్పుడూ అనేది కచ్చితంగా చెప్పడానికి ఇంకా పరిశోధన జరగాలి.

సా. త్రి. శ. లో వుద్ధరింపబడిన ప్రయోగాలు సరిగా వుపకరించడంలేదు.

నన్నయ తిక్కనలు, అథర్వణుడు, భీమకవి, నాచనసోమయాజి, భాస్కరుడు, రామరాజభూషణుడు మొదలైన ప్రసిద్ధతెలాగూ క్షేత్రయ్యకు పూర్వులే.

అనిరుద్ధ విజయం, రామచంద్రాభ్యుదయాల కర్తగా, ప్రస్తావింపబడిన బడబాగ్ని భట్టు (శబ్ద. 8, 89, కార. 13) అప్పకవి ఉద్ధరించిన (2–374) బడబానల భట్టేనేమో.

అలాగే భల్లాణరాయచరిత్ర వ్రాసిన కవిమేధాతిథి భట్టుగా ఇందులో పేర్కొన బడ్డవాడు (కూచిమంచి అప్పకవి) 17 వ శతాబ్దివాడే. అప్పకవి ఉద్ధరించినమేధావిభట్టు (2–371) ఇతడేనేమో.

విక్రమాదిత్య చరిత్ర వ్రాసిన భల్లటుడు (కార. 13) 1360–1390 ప్రాంతంవాడు (లాక్షణిక భల్లటు డితడేనేమో. అథర్వణుడి గ్రంథంలో కనబడని భల్లటుడు, చింతామణి సా. త్రి. శ. లలో ప్రస్తావింపబడ్డాడు)

కళాధరకవి (జాంబవతీ కల్యాణం) (శబ్ద. 87) 1600 ప్రాంతంవాడు.

ఇందులోచెప్పబడ్డ రత్నాంగద చరిత్ర (శబ్ద. 86) రుక్మాంగద చరిత్ర అయి వుంటుంది. మల్లన 15 వ శతాబ్దివాడు.

జైమిని భారతం ఆదిపర్వం (పరి. 24), జైమిని రామాయణం (పరి. 26) శ్రీ కంఠరామాయణం, (శబ్ద. 72), గౌతమీ పరిణయం, పంచాస్త్ర విజయం (మల్లన) చిత్రశేష భాగవతం (పరి. 24) శశాంకకవి విజయ రామచరిత (శబ్ద. 87) ప్రోవణాంక కవి ప్రబంధసారకృష్ణాభ్యుదయం (హల్. 22) అనే వారిని గూర్చి ఇంకా తెలుసుకోవాలి.

ఏమైనా లభ్యమైన కవి కావ్యాల సమాచారంలో 1650 తర్వాతివాడని నిశ్చయంగా చెప్పేది కనబడదు. కాబట్టి పూర్వ విమర్శకులు పేర్కొన్నట్లుగా సా. త్రి. శ. 17వ శతాబ్ది ఉత్తరార్ధంలో రచింపబడింది, రామానుజాచార్యులు రెండో వెంకటపతిరాయల గురువూ అయ్యుండవచ్చును. కవి నివాసమూ పెనుగొండ చుట్టుపట్లనే యేమో.

చింతామణిని ప్రస్తావించిన సా. త్రి. శ. కర్త బాలసరస్వతిని పేర్కొలేదు. బహుశ ఆ గ్రంథాన్ని నృసింహ కవి చూడలేదేమో. అహోబిలుడు ప్రస్తావించిన అథర్వణకారికలకు గూడా వ్యాఖ్య వ్రాసిన నృసింహ పండితుడు అథర్వణకారికలు

(వికృతి వివేకం) తెలియని యీ నృసింహకవి కంటె భిన్నుడే (ఆం. వ్యా. వి. 421-425).

తరువాతి వాళ్లు కూడా యీ నృసింహ కవిని పేర్కొన్నట్లు కనబడలేదు. కాబట్టి ఫలానా సంవత్సరం లోపుగా వున్నాడనీ నిశ్చయంగా చెప్పడానికి వీలు కనబడలేదు.

అందుచేత బాధకాంశాలు దొరకనంతవరకూ - ప్రస్తుతానికి నృసింహకవి 17 వ శతాబ్దం వాడనీ, 1660, 70 ప్రాంతంలో ప్రస్తుత వ్యాకరణ గ్రంథం రచించాడనీ పూర్వ పరిశోధకుల అభిప్రాయాన్ని అనుసరించవచ్చు.

ఇక ప్రస్తుత విషయంలో—

## ఏది ముందు ?

'సంకీర్ణాలు' ఆంధ్ర కౌముదిలో లేవు. సా. త్రి. శ. నృసింహకవి కాక మరొకడు వ్రాశాడని స్వీయసూత్రాలూ, చింతామణి సూత్రాలు గూడా చేర్చి బృహద్వృత్తి వ్రాశాడని ఆం. వ్యా. వి. భావించింది. (II-101) చింతామణిస్ఫూర్తి సా. త్రి. శ. లో కంటె ఆం. కౌ. లోనే అధికంగా వుందనీ, చింతామణి మార్గంలో సా. త్రి. శ. కు భిన్నంగా కూడా ఆం. కౌ. లో లక్షణాలున్నాయని యింతకుముందు గుర్తించి వున్నాం. కాబట్టి ఆం. కౌ. కు చింతామణి సూత్రాలు కూర్చడం లేదు. ఇంకా తొలగించటమే వుందనాలి. ఆం. కౌ. మొత్తం గ్రంథం చింతామణి అడుగు జాడల్లో నడిచిందని ఆం. వ్యా. వి కూడా గుర్తించింది (II-పుట 79) ఆం. కౌ. కు భిన్నంగా సా. త్రి. శ. లో చింతామణి స్ఫూర్తి చాలా తక్కువ.

ఇంతకీ ఆం. కౌ. కు భిన్నంగా లక్షణం వుండటం వల్ల సా. త్రి. శ. ఆం. కౌ. కంటె భిన్న గ్రంథం అన్నంత వరకూ నిరూపింపబడుతుంది. కాని దాన్ని ఇంకొకడు వ్రాశాడనడానికి మాత్రం ఇది ఆధారం కాదు. పై ఆం. వ్యా. వి. మాటలను బట్టి చూస్తే ఆంధ్ర కౌముది (లఘువృత్తి) ముందుగా వ్రాయబడిందనీ, సా. త్రి. శ. (బృహద్వృత్తి) తరువాత పెంచి చెప్పబడిందనీ ఉద్దేశించినట్టు స్పష్టం. కాని యిలా చెప్పడం సమంజసంగా కనబడటం లేదు.

సా. త్రి. శ. కంటె ఆం. కౌ. లో లక్షణం పరిణతం అయి వుండటాన్నిబట్టి ఆంధ్ర కౌముదే తర్వాతి గ్రంథం అని గుర్తించవచ్చు. ఉదాహరణకు ఆం.వ్యా.వి.నే ఉద్ధరించిన సంకీర్ణాలను తీసుకుందాం. అథర్వణుడి వ్యాకరణాన్ననుసరించి సా. త్రి. శ. సంకీర్ణాలను పేర్కొంది. కాని దానివల్ల శాస్త్రానికి ఏ విధమైన

ప్రయోజనమూ లేదు. కాబట్టి అది పరిహరింపదగింది. అట్లా పరిహరించిన లక్షణం తరువాతిది కావడం సహజం గాని ముందుగా సముచితమైన ప్రణాళికలో వున్న లక్షణాన్ని తరువాత అనవసరంగా మార్చాడని చెప్పడం ఒప్పుతుందా? త్రి. శ. ననుసరించి సా. త్రి. శ. సంకీర్ణాలను పేర్కొంగా దానివల్ల ప్రయోజనం లేకపోవడాన్ని గుర్తించి తరువాత (చిం. కనుగుణంగా) ఆ సంకీర్ణ విభేదాన్ని తొలగించాడనడం ఉచితం కదా. సా. త్రి. శ. లో కనబడే అనవసరోక్తులు, పునరుక్తులు ఆం.కౌ. లో లేవు. ఇత్వ సంధిలో మనం దీన్ని గుర్తించాం. ఇంకా ఆ సా. త్రి. శ. వివృతిలో వున్న విశేషార్థం ఆం. కౌ. లో సూత్రబద్ధంగావడమూ గమనించాం. మొదట అవసరమైన అర్థాన్ని సూత్రించగా ఆ తరువాతి వాడు సూత్రాన్ని అనుగ్రంగా చెబుతూ మిగిలిన అంశాలు వివరించడం జరిగిందనడం సక్రమంగా కనబడదు.

కాబట్టి సా. త్రి. శ. కంటె ఆం. కౌ. తరువాత రచింపబడిందే. అందులో లోటుపాట్లను (కొన్నింటినయినా) సవరిస్తూ అనర్థాలను తొలగించిన ఆం. కౌ. ఈ గ్రంథానికి పూర్వం రచింపబడిందయ్యే అవకాశం లేదు. ఇదింకా సమగ్రంగా గ్రంథాంతరంలో గమనిద్దాం.

మొత్తమ్మీద, సా. త్రి. శ. ఆం. కౌ. లు రెండూ నృసింహకవి వ్రాసినవే. మొదట సా. త్రి. శ. తరువాతనే ఆంధ్రకౌముది.

## నృసింహకవి కర్తృత్వం ఎంత?

ఇక ప్రస్తుత గ్రంథంలోకి ప్రవేశిద్దాం.

సా. త్రి. శ. లో సూత్రమూ, సూత్రార్థ వివరణము - (ఉదాహరణాదులతో) వున్నాయి.

కాని మనం ఇంతకు ముందే అనుకున్నట్లుగా కార. 42 సూత్ర వివరణంలో "కర్తృత్వ ప్రథమా నాన్తా స్తద్వదితి వక్తవ్యమ్. సంస్కృత వత్కర్మాదేః ప్రథమా న వర్ణకా స్యురితి వృత్తికారాః" అని చెప్పబడింది. దీన్నిబట్టి ప్రస్తుత వ్యాకరణంలో సూత్ర వివరణలతోపాటు వృత్తులున్నాయని గుర్తించొచ్చు. కాబట్టి సూత్రమూ, ఎక్కడైనా వృత్తులూ, అన్నిచోట్లా వివరణలూ వున్నాయి. వీటిని సూత్రము, వృత్తి, వివృతి అని పేర్కొందాం. పై వివృతి వచనాలను బట్టి 'వృత్తికర్త' ఒకడు వేరే వున్నాడు. అతడు సూత్ర వివృతి కర్తలకంటే వేరైనవాడనటంలో సందేహం లేదు గదా. మరి సూత్రమూ, వివృతీ ఒకడే వ్రాస్తే నడుమ వృత్తులింకొకడు వ్రాయటం ఎలా సంభవం? కాబట్టి సూత్రకారుడొకడూ, వృత్తికారుడొకడూ, వివృతి రాయడొకడూ ముగ్గురు వేరే వుండాలి?

ఇందులో వృత్తులులాగా కనబడేవి నృసింహకవి వ్రాసిన ఆంధ్ర కౌముదిలోనూ వృత్తులుగానే వుండటం ఇంతకుముందు గుర్తించాం.

సా. త్రి. శ. లో వృత్తి కారవచనాలేవో ఇదమిత్థంగా నిర్ణయించడాని కాధారాలు లేవు. 'ఇతివాచ్యమ్. ఇతివక్తవ్యమ్' అని వున్నవి. వృత్తు లనుకొంటె అవి స్వల్పంగా కనబడతాయి, ధాతుప్రక్రియలో కొంచెం అధికంగా కనబడుతున్నాయి.. సమా. 6.సూ. వివృత్తి మొ॥ చోట్ల వృత్తుల్ని గమనించ వచ్చు. అయినా వృత్తిలో పై పదాలుండి తీరాలని నియమేముంది? కానివి వృత్తులలో వివృతికర్త వ్యాఖ్యావిశేషాలలో గుర్తించటం కష్టం. దీనికింకా విస్తృత పరిశోధనం జరగాలి.

ఏమైనా సూత్రవృత్తి వివృతి కర్తలు భిన్నులైతే లందులో నృసింహకవి వ్రాసిందేమిటి? అని సందేహం.

పైన 'కుంభజునికి' అనే రూపం గురించిన వివృతిలో నృసింహకవి స్వీయ విషయ వివరణాన్ని బట్టి వివృతిని నృసింహకవే వ్రాశాడని చెప్పవచ్చు. అయితే వివృతి మాత్రానికే సారస్వత త్రిలింగ శబ్దానుశాసనమని పేరు పెట్టాడా ?

ఇంక వృత్తి యెవరిది ? సూత్ర మెవరిది ?

కణ్వాదుల వ్యాకరణ ప్రశంసనిబట్టి వారి లక్షణాలను యథాతథంగా స్వీకరించి, నృసింహకవి వివరణం వ్రాశాడా ? ఆ కాణ్వాది వ్యాకరణాల్లో దేనికయినా అంతకుముందే వృత్తిగూడా వ్రాయబడివుంటే ఆ వృత్తుల నక్కడినుంచి గ్రహించాడా? ఆ గ్రంథాలు దొరికితేగాని వృత్తి విషయం స్పష్టంకాదు. ఏమైనా వృత్తికారుడు నృసింహకవి కాదన్నంత వఱకూ స్పష్టం.

## సూత్రకర్త ఎవరు ?

అయితే సూత్రాలు వ్రాసిం దెవరు ? తన గ్రంథ నిర్మాణాన్ని గురించి వ్రాస్తూ నృసింహకవి 'బార్హస్పత్యమ్ రావణీయమ్ కాణ్వ మాథర్వణం విదన్ కరోమి' - అనీ, 'బార్హస్పత్య రావణీయాని వ్యాకరణాని బుద్ధ్వా కరోమి'- అని కాణ్వాది వ్యాకరణాలు తెలిసి తాను సా. త్రి. శ. వ్రాస్తున్నా నన్నాడు.

వివృతి నృసింహకవే వ్రాశాడు గదా. దానినే కాణ్వాదుల ననుసరించి వ్రాశాననీ, వివృతికే సా. త్రి. శ. అనిపేరనీ నృసింహకవి అభిప్రాయంగా చెప్పవచ్చునా? అపుడు సూత్రకర్త తాను గాదని గ్రంథకర్తే అంగీకరించినట్లవుతుంది.

## వివృతి - పూర్వవ్యాకరణానుసరణం

సూత్రంలో ఆధారం కనబడకుండా వివృతిలో కన్పించే విశేషార్థం పూర్వ వ్యాకరణాలను అనుసరించి వుండటం గమనించవచ్చు.

1. శేషేయుక్కః (శబ్ద-16)

షష్ఠీ సమాస విగ్రహవాక్యే శేషషష్ఠ్యాః యుక్కు స్యాత్ అని వివృతి. షష్ఠీ సమాస విగ్రహం ప్రసక్తి కాధారం సూత్రంలో కనబడదు. వివృతిలోని యీ విశేషం త్రి. శ. లో (3. కాం) అథర్వణు ఉద్ధరించిన 'షష్ఠీ సమాస విగ్రహవాక్యే యుక్కు' అనే బృహస్పతి సూత్రంలో కనబడుతుంది.

2. త్రిషుతజ్జాదయః (కార. 30) ఈ సూత్రానికర్థం వివృతినిబట్టి తెలుసుకోవలసిందే. 'తద్భవదేశ్యాశ్చ శబ్దాస్త్రిషు లిఙ్గేషు నిత్యాజన్తా స్స్యుః'- ఈ అజంతత్వానికి సూత్రంలో ఆధారం స్పష్టంకాదు. అథర్వణుడు త్రి. శ. (4. కాం)లో తద్భవాది పదానాంచ—నిత్యాజన్తా త్రిషు ధ్రువమ్' అన్నాడు. నిత్య శబ్దంలో సహా పై వివృతి ఈ అథర్వణ లక్షణాన్ననుసరించి చదవడం స్పష్టం.

ఇలాగే

3. 'అస్మిన్ త్రిలిఙ్గశాస్త్రే కర్తృ కర్మాదికం సర్వం పాణినీయ సమంస్యాత్' (కర్తృ కర్మాదికం సమమ్-కార-1)

కర్తృ కర్మాదికం సర్వం పాణినీయ సమంస్యాత్ (త్రి. శ. 7. 1)

4. సర్వేషాం భాషాణా మర్థశాస్త్రంచ సమం స్యాత్ (అర్థ శాస్త్రంచ: కార-3)
కించార్థశాస్త్రంచ సర్వాసాంభాషాణాం సమమేవహి (త్రి. శ. 7-2)

5. క్వచిత్స్థలేషు గస్యవస్స్యాత్....
ఏతద్వివక్షాధీనమేవ'-(క్వచిద్వోగస్య-వక. 8)
వో గస్య వివక్షాధీనమేవహి (త్రి. శ. 6. 3)

ఏక పదవిధికారక ప్రకరణాల్లో అథర్వణుడి వ్యాకరణాన్ననుసరించి వివృతిలో విశేషాలు చెప్పడం చాలా అధికంగా కన్పిస్తుంది.

చింతామణి కూడా పూర్వ వ్యాకరణాలనుంచి లక్షణాలు గ్రహించింది. మనకు దొరుకుతున్నది చింతామణే కాబట్టి అదే మూలంగా భావిస్తూ సా. త్రి. శ. వివృతి చింతామణిని అనుసరించిన చోట్లు గమనిద్దాం.

1. లీనామితశ్చ-కార. 20 - చౌపవిభక్తియోగ్య లివర్ణా మికారస్య లుగ్వా స్యాత్, లివర్ణాన్త త్వాద్విస్తు సహిత మువర్ణకశ్చ॥

చౌప విభక్తికలీనామిల్లుగ్వ్యపక్షం తథైవ ముశ్చస్యాత్.
(ఆం. శ. చిం. అ. 76)

2. ఌస్సంయుక్త సమాప్తస్య. (కార. 21) సంయుక్త సమాప్త శబ్దస్య భూయోఽన్తే ఌప్రత్యయస్స్యాత్—

అపి సంయుక్త సమాప్తో భూయోఽన్తేఌః ప్రదృశ్యతే నామ్నామ్.
(ఆం. శ. చిం. అ. 77)

సూత్ర క్రమం గూడా అలాగే వుండటం విశేషమే.

ఇటువంటివి చాలా వున్నాయి. అవి గ్రంథంలో గమనిద్దాం. క్రియా 96. సూత్ర వివృత్తిలో 'ఇణష్టోర్లలి' అని యీ వ్యాకరణంలోని సూత్రానికి బదులుగా 'టోరిణోహ లిలోపస్స్యా' తనే అధర్వణుడి (2.13) సూత్రంతో ప్రక్రియ నడపడం గమనించవచ్చు.

## వృత్త్యనుసరణం

సా. త్రి. శ. లో 'వృత్తి' ప్రస్తావన గమనించాం. ఇంతకు ముందు పూర్వ వ్యాకరణాలతో పాటు 'వృత్తి'ని గూడా 'వివృతి' అనుసరించినట్లు తోస్తుంది.

లిడ్లేటో రేకవచనమ్ (క్రి. 58.) అనే సూత్రానికి 'తిర్యగ్దేష కర్తృషు భూత తద్ధర్మయో ర్బహుఽవచనస్య ఏక వచనస్స్యాత్' అన్నది వివృతి. వివృతిలో అవసరమైన అర్థం అంతా వుంది. కాని దానికి సూత్రంలో ఆధారమే కనబడదు. 'తిర్యగ్దేషు కర్తృషు బహువచనం నైకవచనంమేవ స్యాద్భూతే తద్ధర్మేచ' అని చిం. లో (క్రి. 22) ఈ అర్థం చెప్పే సూత్రం వుంది. కాని ఆం. కౌ. లో "కర్తృషు తిర్యగ్ద దేషు భూతతద్ధర్మార్థయో ర్బహో రేకత్వ మితి వాచ్యమ్" (క్రి. 24. సూ. వివృతి) అని యిది వృత్తిగా చూపబడింది. ఆం. కౌ. వృత్తిగానే చూపడాన్ని బట్టి చింతామణికి కూడా అదే మూలం అయ్యుండాలి. కొన్ని వృత్తి వచనాలు చింతామణిలో సూత్రీకరింపబడటం లోగడ గమనించాం. కాగా ఇక్కడ వృత్తిలోని విశేషమే వివృతిలో కనిపిస్తుంది. ఆం. కౌ. చూపిన వృత్తివాక్యంలోను ఈ సా. త్రి. శ. వివృతిలోనూ, 'ప్రథమ పురుష' యందనే అంశం లేకపోవడం గమనార్హం.

అధర్వణుడి త్రి. శ, ఆం. సా. ప. కాకినాడ ప్రతిలో అనుబంధంలోను (ఆం. కౌ. అనుబంధంలోను) కనిపించే బార్హస్పత్య సూత్రాల వివృతి కొన్ని చోట్ల ప్రస్తుత గ్రంథంలోని వివృతిని స్ఫురింపజేస్తుంది. తుచ్ఛార్థే పూర్వస్యే త్తస్మాత్ (త్రి. శ. అను.4) అనేదాని వివరణం పూర్వస్యేత్ (సా. త్రి. శ. తద్భ.12) అనే

సూత్ర వివృతి వలెవుంది. అలాగే ఇక్కడి తద్భవ ప్రక్రియలో శేషాదేశస్యాఽహో చోఽభోః మొ॥ కాని తద్భవ ప్రక్రియలో ఆయా ప్రాకృత లక్షణాలు త్రి. శ. అనుబంధంలో యథాతథంగా వుండగా సా. త్రి. శ. లో మారాయి. లవరామధశ్చ ఉభయ త్రరవలామ్, యక్షలిరః-యక్షలిరచ్ మొ॥ అలాగే క్రియాపదప్రక్రియలోనూ తేడా వుంది. కాబట్టి దానితో దీనికి సబంధం వుందనడం కుదరడంలేదు, బార్హ స్పత్య సూత్రాల కెవరైనా వివరణం వ్రాసుకొని త్రి. శ. గ్రంథం తర్వాత చేర్చు కొనుండవచ్చు.

మొత్తంమీద నృసింహ కవి వ్రాసిన 'వివృతి' ఈ గ్రంథావతారికలో పేర్కొ న్నట్లుగా కాణ్వాది వ్యాకరణాలు తెలిసి ఆ తెలివిడితో వ్రాసినదే (కొంత భేదంవుంది) అని గుర్తించవచ్చు.

## సూత్రభాగం?

సూత్రభాగం అంతా నృసింహకవి వ్రాయలేదనడానికి మరికొన్ని ఆధారాలు కనబడుతున్నాయి.

నృసింహకవే తాను వ్రాసిన ఆంధ్రకౌముదిలో "ఆధర్వణాని కాణ్వానిబార్హ స్పత్యాని సంవిదన్ కౌముదీ మాన్ధ్ర శబ్దానాం సూత్రాణిచ కరోమ్యహమ్''(అవ.3శ్లో) అనే టప్పుడు 'సూత్రాణిచ కరోమి' అని ప్రత్యేకంగా ఎందుకు చెప్పాడు అంటే అంతకు ముందు తాను వ్రాసిన సా. త్రి. శ. లో సూత్రాలన్నీ తాను వ్రాయలేదు అనే వుద్దేశంతోనా? కాని ఆం. కౌ. లో గూడా పూర్వుల సూత్రాలున్నాయి, తక్కువ. ఇది బలమైన ఆధారం కాకపోవచ్చు.

కాని సా. త్రి శ. గ్రంథంలోపలి విషయాలు కొన్ని సూత్రకర్తృత్వం విషయమై ఆలోచింపజేస్తాయి.

## సూత్రాలు-వైరుధ్యం

కొన్నిచోట్ల సూత్రాలు గూడా పరస్పరం విరోధంతో కనిపిస్తున్నాయి.

ఉదాహరణకు 'కూర్చిలనునయో ద్వితీయాయాః' అనే (శబ్ద.4) సూత్రం, ల, ను, ని, అనే వాటి వలెనే కూర్చిని గూడా ద్వితీయావిభక్తిగా పరిగణించింది. 'కర్మ ప్రవచనీయకే కూర్చిః' - (శబ్ద.24) (ద్వితీయా విభక్తేః కర్మప్రవచనీయార్థే కూర్చిస్యాత్, రాముని గూర్చి) అని దీన్ని ద్విదీయావిభక్తి స్థానంలో విధించింది కూడా. కాని మళ్ళీ 'ద్వితీయాకూర్చియోగే' (కూర్చియోగేద్వితీయాస్యాత్-రాముని గూర్చి) (కార.7) అని కూర్చితోయోగం వున్నపుడు ద్వితీయ వస్తుందని సూత్రింప

బడింది. కూర్చి అనేచో ద్వితీయా విభక్తి అయివుండగా దానితో యోగంలో ద్వితీయ రావడమేమిటి? అంటే యీ పక్షంలో కూర్చి ద్వితీయావిభక్తికాదు. 'రాముని గూర్చి' అన్నపుడు ని వర్ణాన్ని సాధించడం వుద్దేశంకావచ్చు. ఏమైనా యివి పరస్పరం విరుద్ధంగా వున్నాయి.

కూర్చి ద్వితీయావిభక్తిగా ఒక వ్యాకరణమూ, విభక్తిగాక ప్రత్యేకపదముగా ఇంకో వ్యాకరణమూ భావించి వేర్వేరు పద్ధతుల్లో ఈ రూపాన్ని సాధిస్తే ఆ రెండింటిని ఇక్కడ కూర్చడం జరిగిందేమో. కూర్చిః కర్మణి (శబ్ద.28) అని చెప్పిన ఆం. కౌ. కూర్చియోగంలో ద్వితీయ అని చెప్పినట్లు కనబడుటలేదు. లేక ప్రథమ ప్రయత్నంలో ఒకే వ్యాకర్త తానొక నిశ్చయానికి రాలేక రెండు విధాలుగా చెప్పినా చెప్పుండవచ్చు.

## పునరుక్తులు

ఒకే అంశాన్ని వివిధ పద్ధతుల్లో రెండు మూడు సార్లు చెప్పడం పా. త్రి. శ. లో అక్కడక్కడా కనిపిస్తుంది.

కజ్మిత్రాపభావే (క్రి.76) అనే సూత్రం 'అభావార్థే ధాతోః కజ్మికౌ ప్రత్యయౌ స్త చేయక చేయమి' అని వ్యతిరేకక్త్వార్థంలో కక్ ప్రత్యయాన్ని వ్యతిరేకభావార్థంలో మిక్ ప్రత్యయాన్ని చెబుతున్నది.

కాని మళ్ళీ కఙభావే - మిట్చ (క్రి.119,120) అని యివి కచ్, మిట్, అనే ప్రత్యయాలుగా విధింప బడ్డాయి. వ్యాకరణం అంతా ఒకడే వ్రాస్తే ఇలా పునరుక్తి సంభవమా? (బాల వ్యాకరణానికి సూత్రాంధ్ర వ్యాకరణంలాగా, ఆంధ్రకౌముదికి ముందిది ప్రథమ ప్రయత్నంగా పునరుక్తులొచ్చాయనుకుందామా?)

ఛ్చోస్తహల్ఝ్యాదౌ (క్రి.51) అనే సూత్రం 'చువర్ణంబుతోడ దుగ్దకారంబగుః లనే బాల.క్రి. సూత్రంలాగానే చూతుడు అనే విధమైన రూపాలతో పాటు వచింతురు లనే విధమైన రూపాలు గూడా సాధిస్తుంది. కాని దౌచేర్వాలుగ్లోటి, తౌదోబిన్దోః' లనేవి వచింతురు లనే విధమైన రూపాలకోసం చెప్ప బడ్డాయి. కాని క్రి. 51 సూత్రం వుండగా మళ్ళీ యీ రెండు సూత్రాలు అనవసరం. చిం. లో క్రి. 34, 38 సూత్రాలు ఈ అర్థాన్ని చెబుతున్నాయి, ఛ్చోస్తహల్ అనే లక్షణం అందులో లేదు. పా. త్రి. శ. లో ఇవి రెండు వేర్వేరు వ్యాకరణాల మూలంగా ప్రవేశించాయా?

ఇలాగే మఱికొన్ని పునరుక్తులు. ముకోలుక్చ శటః (క్రి.70) ముకోలుగ్వా (క్రి.140) ఇక్కడ రెండుచోట్లా వివృతి కూడా సన్నిహితంగా వుండడం గమనార్హం.

ఆ,ఈ,ఏ అనే సర్వనామాలు రెండు సార్లు రెండు విధాలుగా సాధింపబడ్డాయి. సమా-14-16, తద్ధి 20, 21.

'సేనేర్వా లుక్' (సంధి.47) అనే సూత్రం సమాసంలో నిలోపం చెప్తున్నది. నిర్వాడుజన్తస్య (కార.43) అనేది మళ్ళీ సమాసంలో 'ని' వికల్పంగ విధిస్తున్నది. వివృతీకర్త అక్కడా ఇక్కడా రామాయణం నుంచి 'దశరధేశ్వరు కోడల' అనే ప్రయోగం చూపించాడు.

నివర్ణంలోపిస్తుందనే పక్షంలో నివర్ణం విధించడం అనవసరం. విధించే పక్షంలో లోపిస్తుందనడం అనవసరం.

టీర్ఘర్త్రేఽట్పుటబ్లాప్పుదేర్వా ల్ (క్రి.37) అనే సూత్రం ఉందురు, ఉంట మొదలైన రూపాలు సంగ్రహిస్తున్నది. టాదేర్వా లుక్ (ధా.తు.2) ఉంటిని, వావౌచ ధా.4. ఉందురు అనే సూత్రాలు మళ్ళీ యిటువంటి రూపాలను గూర్చి చెబుతున్నాయి.

లుగ్వాకో రావణస్య (క్రి.83) య్వోర్లుక్కణ్వాస్య (ధాతు.6) మొ॥

ఇటువంటి పునరుక్తులు ఆం. కౌ, లో లేకపోవడం గమనిస్తే ఆం. కౌ. సా. త్రి. శ.కు తరువాత గ్రంథమని గుర్తించవచ్చు.

## వివృతి-విశేషార్థం

సూత్రంలో ఆధారంలేకుండా వివృతిలో విశేషార్థం కొన్ని చోట్లా గమనించవచ్చు.

'వాతః' (సంధి 6) అనే సూత్రానికి 'ఆతత్సతజ్జస్యాస్త్రీపశువాచకస్య కేవల వికృతి సంభవస్యాకారస్య (లపిపరే సంధిర్వా స్యాత్) అని వివృతి. ఆ సూత్రంలోని లతః అనే దళానికి ఇంతపె అర్థం వుందనడం సహజం గాదు. అతత్సాదులుగా వివృతిలో వున్న దళాలకు ప్రత్యుదాహరణలతో సార్థక్యం గూడా వివృతికర్త నిరూపించాడు. సూత్ర వివృతులు రెండూ ఒకడే వ్రాసివుంటే ప్రయోజనవంతమై అవసరమైన యీ అర్థాన్ని నిరాధారంగా వివృతిలో ఎందుకు చెపుతాడు? తానే వ్రాసిన సూత్రంలో ఆ ప్రయోజనం ఎందుకు సాధించడు. ఏ కొంచెమో విశేషమయితే సూత్రంలో చెప్పకుండా వివరణంలో చెప్పడం బాలవ్యాకరణాదుల్లో వుంది. కాని అవసరమైన ప్రధానార్థాన్ని గూడా ఉపేక్షించడం జరుగుతుందా?

సంధి. 47, క్రియా 93. కృత్. 9, కృత్-11. మొదలైన అనేక స్థలాల్లో వివృతికర్త యీ విధంగా వివృతిలో విశేషార్థం చెప్పి దళసార్థక్యాన్ని నిరూపించాడు. క్రియా 58, 69, 101 మొదలైన అనేక స్థలాల్లో అవసరమైన అర్థం సూత్రంలో దొరకదని వివృతే చెప్పింది.

## వైయర్థ్యం

ఒక్కొక్కసారి వివృతి చెప్పిన విశేషార్థం వల్ల సూత్రం వ్యర్థం కావడం గూడా కన్పిస్తుంది.

సేనేన్యాయుక్ (సంధి.47) సూత్రాన్ని వివరిస్తూ 'మహతః ప్రకృతి నివర్ణకస్య' అని విశేషార్థం చెప్పాడు వివృతికర్త. దీనివల్ల 'రంగ కోడలు' అని కాదన్నాడు. కాని 'తద్ధితవృతు మహతోన్నిత్యమ్' (కార.44) సూత్రం 'రంగని కోడలు' ఇత్యాదులలో నివర్ణం నిత్యంగా వస్తుందని చెపుతున్నది. ఈ అర్థం పూర్వంవివృతి వాక్యం చేతనే సిద్ధం. భామయొక్క కొడుకు ఇత్యాదుల్లో ని వర్ణకం ప్రాప్తించడమేలేదు. అయినా 'మహద మహతో ర్నాంత్యస్య' అనే సూత్రం భామకొడుల ఇత్యాదుల్లో ని వర్ణం అసలు రాదంటున్నది. ఇవన్నీ సిద్ధార్థసాధకాలు (పునరుక్తులన్నా అనవచ్చు.)

## వివృతి-విశేషరూపాలు

కొన్ని రూపాలు సాధువులుగా వివృతి గుర్తించినా అవి లక్షణ బద్ధాలు గాక పోవడం గమనార్హం.

"లోకే పట్టపేనుగు, గోరంచు ఇత్యాది ప్రయోగాః అలక్షణాద్గ్రామ్యా ఏవ- అపిచ శిష్టప్రయోగ బాహుళ్యేన నిర్భయా ప్రయోక్తవ్యా ఏవ' - (సంధి. 50. సూత్ర వివృతి) 'టుగచి' అనే సూత్రం టుగామమం నిత్యంగా చెబుతున్నది కాబట్టి టుగాగమం రాకపోవడం 'అలక్షణం' పట్టపేనుగు, గోరంచు అన్నపుడు టుగాగమం లేక పోవడం, అయినా అవిశిష్ట ప్రయుక్తాలై సాధువులు గావడం గుర్తించిన వివృతి కర్తే సూత్రకర్త అయితే వీటి అలక్షణాలుగా ఎందుకు చేశాడు? లక్షణబద్ధం చేయక పోవడం వల్ల సూత్ర వివృతులు భిన్నకర్తృకాలని గ్రహించడంలో తప్పులేదు గదా.

## వివృతి-ప్రమాదాలు

కొండొకచో వివృతిలో ప్రమాదాలు కనబడుతున్నాయి. 'రాజ్ఞోఙుర్నిత్యమ్' అనే (హల్-17) సూత్రం రాజన్ శబ్దానికి ఙు ప్రత్యయాన్ని విధిస్తుంది. దీన్ని 'సోర్థ

ప్రత్యయో నిత్యం స్యాద్విభక్తౌ సమాసేచ' అని ప్రథమైక వచనంలో సుస్థానంలో ఆదేశంగా వస్తుందని చెప్పి అలాగే 'రాజు' అనే దాని ప్రక్రియను వివరించింది. కాని 'డుజో లోపశ్చ' అనే సూత్రం (హల్-19) రాజన్ శబ్దస్య డుప్రత్యయస్య లోపస్స్యాత్' అని చెప్తున్నది. పూర్వం వివరించినదాన్ని బట్టి బు ప్రత్యయ సుస్థానంలో వస్తుంటే దాని మీద డుజ్జెక్కణ్ణించి వస్తుంది? మరి డుజ్లోప విధానం ఎందుకు? ఈ రెండు సూత్రాలూ ఒక్కడే వ్రాసి వుంటే బు ప్రత్యయ సుస్థానంలో వస్తుందనే వివరణం పొర పాటు, ఇతర విభక్తి స్థలాల్లోలాగా సువరకలలో వస్తుందనాలి ప్రథమైక వచనంలో కూడా. అప్పుడు వివృతిలో ప్రమాదంవల్ల సూత్రం వ్రాసినవాడు వివృత్తి వ్రాయలేదని స్పష్టం. తన సూత్రాన్ని తానే సరిగా అర్థం చేసుకోలేక పోయినాడనలేం గదా.

ఇంక హల్-17 సూత్రం వివృతి సూత్రకర్త ఉద్దేశించిందే. అయితే డుజ్లోపం విధానం వ్యర్థం. కాబట్టి డుజ్లోప విధానం వేరే వ్యాకరణంలో దయ్యుండాలి. అప్పుడు రాముడు మొదలైన చోట్ల వలెనే రాజు అన్న వుడు గూడా ఉత్వం 'మహతస్సుప్యుదతః, అనే సూత్రం ప్రకారం వచ్చి ఆ తర్వాత దానిమీద సువిభక్తికి 'మహతస్సోర్డుజనితః' అని డుజురాగా 'డుజోలుశ్చ' అని డుజ్లోపం చెప్పడం వుచితం అవుతుంది. ఒక వ్యాకర్త బు ప్రత్యయ విధానంతో (త్రి. శ.) 'రాజు' సాధిస్తే మరో వ్యాకర్త డుజ్లోపంతో (వృద్ధు,) ఆ రూపాన్ని సాధించాడనాలి. మిగిలిన విభక్తుల్లో బాధ అలా వుంచితే, ఈ పక్షంలో ఇందులో సూత్రాలన్నీ ఒక్కడే వ్రాశాడనడానికి వీలులేదు. సూత్రంలో ప్రమాదాలున్న స్థలాలూ ఇందులో లేకపోలేదు. కాని యిక్కడ సూత్ర కర్తే పొర పడ్డాడనీ ఆ పొరపాటే వివృతిలోనూ వచ్చిందనీ, కాబట్టి కర్తలు వేరు కాదని చెప్పే అవకాశం కనబడడం లేదు.

ఇటువంటి ప్రమాదాలు సంధి - 7, 29, 37, శబ్ద 31 సర్వ-15, కార-5, క్రియా - 120 మొదలైన స్థలాల్లో గమనించవచ్చు.

## విలక్షణ వివృతులు

కొన్ని చోట్ల సూత్రం వుద్దేశించిన దానికంటె భిన్నమైన అర్థం వివృతిలో గోచరిస్తుంది.

కృదంత పరిచ్ఛేదంలో అత్వాది దేశ్యానాం (తత్సమానా మివ) అనే సూత్రానికి "తత్సమ పదానా మివ దేశ్య శబ్దానాం చ అతు ఇత్యాద్యా ఆగమాస్స్యుః నలువ - పూవిలుతుఁడు" అని వివృతి. అ-తు మొదలైన యివి సమాసాంత కార్యాలు. తిజ్ ప్రకియ (పోనీ కృత్ప్రక్రియ) లో సమాసాంతాల విధానం అసందర్భం. అయితే యీ వ్యాకరణంలో ఒక పరిచ్ఛేదంలో మరో పరిచ్ఛేద విషయాలుండటం

సామాన్యమే. కాని యిక్కడ 'వివృతి' చెప్పిన అర్థం సూత్రకర్త ఉద్దేశించలేదనే చెప్పవలె.

వివృతిలో 'తత్సమ పదానా మివ' అని స్పష్టంగా చెప్పబడింది. సమాసాంతాలైన అ-తు మొదలైన తత్సమస్థలాల్లో ఎక్కడైనా వున్నాయా? 'తత్సమానా మివ దేశ్యానాం' అనడం లో తత్సమాలలోనే ఈకార్యం ప్రసిద్ధం అనే అభిప్రాయం గోచరిస్తుంది. కాని తత్సమాలలో ఈ కార్యం అసలు లేదనడం నిశ్చయమే. కాబట్టి తత్సమాల్లో ఈ కార్యం పూర్వోక్తం అనుకోవడానికి వీల్లేదు. కాబట్టి 'తత్సమానా మివ' అనేది లక్ష్యవిరుద్ధార్థక మవుతున్నది.

ఔపవిభక్తికపదంతద్విధిః (సమా-1) అనే సూత్రం దగ్గర-'ఏషాం సమాసానామన్త విధిః ప్రత్యయాది కార్య మౌపవిభక్తికవత్ స్యాత్'- పూవిలుతుఁడు ఇత్యత్ర(తు)వర్ణః చతస్రోవాచః ఇత్యత్ర నలువ ఇత్యాది' అనివివృతి - లక్షణానుగుణంగా వీటిని సమాసాంతాలుగా వివరించింది. అంతే కాదు ఇక్కడ ఉదాహరించిన నలువ, పూవిలుతుడు అనేవే సమా.1, సూత్రం దగ్గరకూడా చూపింది. ('నలువ' శబ్దం తద్భవంగా కూడా ఈ వ్యాకరణం పేర్కొంది. )

కాబట్టి ప్రస్తుత సూత్రార్థం వివృతిలో విలక్షణంగా వుందనక తప్పదు.

ఇంక ఈ సూత్రం 'అత్వాది తత్సమానామివ దేశ్యానామపి క్రియాపదానాఞ్చేత్ క్రియ. 50) అనే చింతామణి లక్షణాన్ని స్ఫురింపచేస్తుందనడంలో సందేహం లేదు. ఆ సూత్రం తత్సమ క్రియలలో వలె దేశ్య క్రియలకూ అత్వాది కార్యాలు వస్తాయని చెపుతున్నది. 'తత్సమానామివ' అనేది కూడా సముచితంగా అన్వయిస్తూ ఆ అర్థమే యా సూత్రానికి సమంజసం అని స్పష్టం చేస్తున్నది. 'తత్సమపదత్వాది దేశ్యానామ్ - దేశ్యక్రియాపదానాం తత్సమ క్రియా పదానామివ అత్వాది కార్యం స్యాత్' అని అం. కౌ. (క్రి. 51) లో ఈ సూత్రార్థం అదే విధంగా వుంది. రెండింటికి కర్త ఒక్కడే అయినా సా. త్రి. శ. లో సూత్రార్థం గుర్తించడంలో నృసింహకవి పొరపడ్డాడనే చెప్పాలి.

ఇంతకే అసలు సా. త్రి. శ. లో క్రియాపద నిరూపణ విధానం వేరు. పైన చెప్పబడ్డ అత్వాదుల్లో మొదటిదైన అత్వాన్ని 'వ్యతిరేకాదా ఖాదిని చాత్ స్యాత్ అని చింతామణీ, అద్యావివ్యతిరేకయోః అని ఆం. కౌ. (క్రి. 18) అత్వంగానే విధించాయి. కాని సా. త్రి శ. ఇక్కడ అత్త్వం చెప్పలేదు. ఇంక 'ల్యాద్వ్యతిరేకాదావుత్' (క్రి. 51) అని వ్యుత్పత్యయంగా చెప్పబడింది'- మరి అత్వాది దేశ్యానాం అనే విధానం ఎలా? ఇది యింకో వ్యాకరణంలోది అయ్యుండాలి. బహుశః చింతామణి సూత్రానికి కూడా అదే మూలం అయ్యుంటుంది. వేర్వేరు వ్యాకరణాలను

ఆశ్రయించడంవల్ల సా. త్రి. శ. లక్షణాల్లో పునరుక్తులతో పాటు ఇటువంటి విరోధాలు కూడా ఏర్పడి వుంటాయనవచ్చు. ఏమయినా ఇక్కడి వివృతి చెప్పిన అర్థం సూత్ర కర్త ఉద్దేశించిందనడాని కవకాశం లేదు. సూ. 1. సూత్రమూ, దాని వివృతిని బట్టి కూడా ఇక్కడి సూత్ర వివృతు లొక్కరే వ్రాశారని చెప్పడానికి వీల్లేకుండావుంది.

ఇటువంటిదే దీని తర్వాతి సూత్రం కూడా 'లోపాగమా బహవః' (కృత్. 45) అనే దీనికి 'తద్భవపదేషు వర్ణలోపాగమనాం బహవస్స్యుః' అని వివృతి. ఈ సందర్భంలో ఆం. కౌ. లో 'వర్ణలోపాగమాః పురుషార్థ వచనేషు (క్రి. 53) అని క్రియా పదాల్లోని లోపాగమాలే చెప్ప బడ్డాయి. 'వర్ణాగమో విశేషః పురుషే ష్వర్థేషు చాపి వచనేషు అని చింతామణి (క్రి. 51). ఇక్కడ సా. త్రి. శ. తద్భవాల ప్రసక్తి తీసుకు రావడం విశేషం. 'వర్ణ లోపాగమా నైకే సర్వస్మిన్ స్తద్భవే పదే' అనే వి.వి. కారికని అహోబలుడీ సందర్భంలో మరోసారి ఉద్ధరించాడు. దానికీ దీనికీ ఏమయినా సంబంధం వుందేమో తెలియదు.

అయితే వివృతి మాత్రమే నృసింహ కవి వ్రాశాడనీ, సూత్రాలన్నీ పూర్వ లాక్షణికులవే అని నిశ్చయించవచ్చునా ? కాణ్వాది వ్యాకరణాల నుండి సూత్ర భాగ మంతా యథాతథంగా తెచ్చేసి, కలిపి వ్యాఖ్యానించి తన వ్యాఖ్యానానికే సారస్వత త్రిలింగ శబ్దానుశాసనం అనే పేరుంచా డనడానికీ వీలులేదు.

## సూత్రభాగమూ నృసింహకవిదే

బార్హ స్పత్యమ్ రావణీయం కాణ్వమాథర్వణం విదన్ కరోమి - అనీ, బార్హ స్పత్యాది — బుద్ధ్వా కరోమి అనే నృసింహ కవి చెప్పిన మాటల్లో కాణ్వాది వ్యాకర ణాలు తెలిసి తాని గ్రంథం వ్రాస్తున్నాననే తప్ప వారి గ్రంథా లలాగే తీసికొని వాటికి వ్యాఖ్యానం మాత్రమే వ్రాస్తున్నానని చెప్పలేదు.

ఎలా గ్రహించాడో చెప్పడానికి మనకి కాణ్వాది వ్యాకరణాలు లభ్యం కావడం లేదు. కాని లభ్య మవుతున్న అథర్వణుడి త్రిలింగ శబ్దాను శాసనంలో కాణ్వాది లక్షణాలు కొన్ని లభ్య మవుతున్నాయి. వాటిని బట్టి చూద్దాం. కొన్ని లక్షణాలు సా త్రి. శ. లో యథాతథంగా వున్నాయి.

అందౌచ కణ్వ. (త్రి. శ. 3. రాం) సా. త్రి శ. శబ్ద. 40

ప్రయోగానర్హశ్చ (బృహస్పతి -) సా. త్రి. శ. శబ్ద. 17

జిదనుస్వారస్య, అనునాసికంచ [హేమచంద్ర] (త్రి. శ. 4)

సా. త్రి. శ. కృత్. 45,46 — మొ॥

ఇలా కొన్ని లక్షణాలు యథాతథంగా వున్నా చాలా సా. త్రి. శ. లో మార్పులకు రోనయినాయి.

రో రాయః (తి. శ. 3) కణ్వ - రో రాయః కణ్వస్య  సా. త్రి. శ. శబ్ద -69
అందోరలిశ్చ (త్రి. శ. 4. హేమ)  జేరలిచ. సా. త్రి. శ. సన్ధి. 66
సహార్థే తోడశ్చ (త్రి. శ. 3. బృహస్పతి) మహత స్సోర్థుజనితః (సా.త్రి.శ.శబ్ద. 20)

ఇక్కడ మార్పు నృసింహ కవి కృతమా? లేక ఇంకో గ్రంథం నుండి తీసికోవడం వల్ల జరిగిందా?

తన గ్రంథానికాథర్వణం కూడా ఆధారంగా నృసింహ కవి చెప్పాడు. అది దొరుకుతూనే వుంది. సా. త్రి. శ. లో అథర్వణ వ్యాకరణం దాదాపు సమగ్రంగా కనబడుతుంది. (దీన్ని బట్టి కావ్యాదులు గూడా ఇందులో సమగ్రంగా స్వీకరింపబడ్డాయేమో) ఏకపదవిధి ప్రకరణంలో సూత్రాల క్రమం కూడా త్రి. శ. కనుగుణంగానే వుండటం గమనించవచ్చు.

1. సాచ్చేతోదోరిష్టః క్వాచిత్కమితిరావణః
   (త్రి. శ. 6. కాం. 8. శ్లో.)
   సాచ్చేతోదో రావణస్య  సా. త్రి. శ. ఏక. 5

2. ఏనో వివృతతరస్య లఘుయత్వమ్  (త్రి. శ. 6 - 6 శ్లో)
   లయశ్చ  సా. త్రి. శ. ఏక. 18  మొ॥

అథర్వణ లక్షణం ఛందోబద్ధం. సా. త్రి. శ. అలా కాదు. కాబట్టి సా.త్రి.శ. కర్త త్రి. శ. లక్షణాన్ని యథాతథంగా కాక ప్రధానమయిన అర్థం వరకూ గ్రహించి కొంచెం సవరించి గ్రహించి వుండవచ్చు.

చింతామణిలో, రావణ బృహస్పతి ప్రభృతుల సూత్రాలున్నట్టు గుర్తించి అవి నన్నయభట్టు వ్యాకరణంగానే పేర్కొన్నది సా. త్రి. శ. ఇక్కడ గూడా అదే విధంగా కావ్యాదులందలి లక్షణాలు స్వీకృతాలయినా సూత్రగ్రంథం సారస్వత త్రిలింగ శబ్దాను శాసనంగా స్వీయంగా చెప్పడంలో తప్పులేదని నృసింహకవి అభిప్రాయం కావచ్చు.

ఏమైనా దొరుకుతున్న అథర్వణుడి త్రిలింగ శబ్దానుశాసనంతో పోల్చిచూడగా నృసింహకవి యీ వ్యాకరణంలోని సూత్రాలు కావ్యాది గ్రంథాల నుండి కేవలం యథాతథంగా స్వీకరింపబడ్డాయనీ, వివృతి మాత్రమే నృసింహకవి వ్రాశాడనీ అనడా

నికి అవకాశం లేదు. అవకాశం వున్నచోట్ల పూర్వుల సూత్రాలను త్రి. శ., చిం. (ప్రభృతులవలె) యథాతథంగా స్వీకరించడంతోపాటు కొన్నిచోట్ల స్వల్పమైన మార్పులు గూడ చేయబడ్డాయని, కాబట్టి వివృతితోపాటు సూత్రభాగం కూడా నృసింహకవిదిగానే చెప్పాలనీ గ్రహించవచ్చు. పూర్వులు చెప్పిన వ్యాకరణాలతోపాటు వృత్తులను గూడ నృసింహకవి తన వివృతిలో ప్రస్తావించాడు, అనుసరించాడు. వివృతి కేవలం నృసింహకవి కృతం. వృత్తి యితరులు చేసినవి. ఎవరో తెలియదు. సూత్రభాగం కొంత పూర్వులదీ, మరికొంత పూర్వులననుసరించినదీ, ఎక్కడ ఏ విధమైన మార్పులు చేశాడో నిర్ణయించడానికి తగిన ఆధారాలు లభ్యంకావడం లేదు. కానీ ఆధారంగా చెప్పిన ఆథర్వణం ఛందోబద్ధం కాగా అది మూలంగా వున్న సా. త్రి. శ. లక్షణం వచనంలో వుండటం, మొదలైన అంశాలనుబట్టి కొంచెపు మార్పులైనా జరిగాయని మాత్రం నిస్సంశయంగా చెప్పవచ్చు. స్వతంత్రంగా కూడా నృసింహకవి యిందులో సూత్రాలు రచించి వుండవచ్చును. దేశ్య శబ్దాలు, తజ్జలు, నానార్థక శబ్దాలు వగైరా (పట్టికలు) పూర్వ లాక్షణికోక్తాలు కాకపోవచ్చు.

కణ్వరావణాదుల లక్షణాలను స్వీకరించి స్వీయాలుగా చెప్పిన త్రి. శ. అథర్వణ వ్యాకరణం అయినట్లుగా, (కణ్వ) బృహస్పతి రావణాదుల లక్షణాలను (ఛందోబద్ధంచేసి) చెప్పిన చింతామణి నన్నయభట్టారక వ్యాకరణం అయినట్లుగా-కాణ్వాది లక్షణాలు కొన్ని యథాతథంగా గ్రహించినా, (వాల్మీకీయాదులయిన్ను) ఇంచుక సవరించి మార్చడం మొదలైన లక్షణాలతో వున్న సా.త్రి.శ. గ్రంథం సూత్ర (వృత్తి) వివృత్యాత్మకమైనది మొత్తం అంటే సూత్రభాగంతో సహా నృసింహకవి కృతమే అవుతుంది. కాగా మొత్తం గ్రంథం నృసింహకవి వ్యాకరణం. అది సారస్వత త్రిలింగ శబ్దానుశాసనం.

దీనిలోని లోటుపాట్లను చాలవరకు సవరించుకొని తరువాత నృసింహకవి ఆంధ్ర కౌముది రచించి వుంటాడు. ప్రస్తుత గ్రంథంలో నృసింహకవి చూపిన స్వాతంత్ర్యం చాలా తక్కువే అని చెప్పాలి. అందుకే పునరుక్తులూ, వైరుధ్యాలూ, వివృతిలో విశేషార్థ కల్పనలూ సా. త్రి. శ. లో కన్పిస్తున్నాయి. ఇవి ఆం. కౌ. లో లేకపోవడమే దాని పరిణతిని పర్వకాన్ని సూచిస్తున్నవి. అందువల్లనే అందులో నృసింహకవి 'సూత్రాణిచకరోమి' అని చెప్పివుంటాడు. అది అంతగా పట్టించుకోనక్కరలేదో ఏమయినా సారస్వత త్రిలింగ శబ్దానుశాసనం. అంతా నృసింహకవి కృత గ్రంథంగా గుర్తించాం.

## సారస్వత త్రిలింగ శబ్దానుశాసనం అంటే ఏమిటి ?

ఈ గ్రంథానికి కవి 'సారస్వత త్రిలింగ శబ్దానుశాసనం' అని పేరు పెట్టాడు. ఈ పేరుంచడంలో నృసింహకవి అభిప్రాయం ఏమిటి?

అనుభూతి స్వరూపాచార్య ప్రణీతమై సంస్కృతంలో 'సారస్వత వ్యాకరణం' వుంది. (సంస్కృత వాఙ్మయ చరిత్ర పుట. 161) సరస్వతీ వరప్రసాదంవల్ల రచించిన దానికి సరస్వతి పేరుమీదుగా అతను సారస్వత వ్యాకరణం అని పేరు పెట్టాడట- ప్రస్తుత పేరూ అటువంటిదేనా?

'శబ్దానుశాసనం' అంటే వ్యాకరణం. త్రిలింగ శబ్దానుశాసనమంటే తెలుగు వ్యాకరణం, సరస్వతీ వరప్రసాదం వల్ల ఏర్పడి ఇది సారస్వత త్రిలింగ శబ్దానుశాసన మయ్యిందా?

దీనికి కర్త అయిన నృసింహకవి సకల శారదాంబోపాసకుడు. 'సకల శారదా దేవీ కటాక్షామృత వర్ధితుడు' (అవ. 3. శ్లో.) ఇష్ట దేవత సరస్వతీ ప్రసాద సిద్ధం అనే వుద్దేశ్యంతో సారస్వత = సరస్వతీ ప్రసాదసిద్ధ, త్రిలింగ = తెలుగు, శబ్దానుశాసనమ్ - వ్యాకరణము. అన్నాడా !

పైగా ఈ నృసింహకవి 'అష్ట భాషా సరస్వతి'. అది బిరుదమేమో. ఏమైన అష్ట భాషా సరస్వతి అనే తన పేరు మీదుగా గూడ తాను వ్రాసిన యీ తెలుగు వ్యాకరణం తన పేరు మీదుగానే సారస్వత త్రిలింగ శబ్దానుశాసనంగా నృసింహకవి పేర్కొని వుండొచ్చు.

త్రిలింగ క్షేత్రాన్ని గురించి బ్రహ్మాండ పురాణంలో చెప్పిన విషయం, త్రి. శ. లోనూ, ఇందులోనూ చెప్పబడింది. త్రిలింగం దేశం.

సరస్వతికి సంబంధించినది సారస్వతం అంటే భాష. త్రిలింగ (దేశం యొక్క సారస్వతం, సారస్వత త్రిలింగం. [త్రిలిఙ్గస్య సారస్వతమ్ - సారస్వత త్రిలిఙ్గః) రాజదంతాదుల్లో చేర్చుకుని సారస్వ త్రిలింగ మనే రూపం సాధించుకోవచ్చు.) సారస్వ త్రిలింగం యొక్క శబ్దానుశాసనం సారస్వత త్రిలింగ శబ్దానుశాసనం - తెలుగు భాషా లక్షణం అని అర్థం.

తెలుగు వ్యాకరణం అనే యీ అర్థం కంటే పూర్వం అనుకున్నట్లుగా, (అష్ట భాషా) సరస్వతి (నృసింహకవి) నిర్మితమయిన త్రిలింగ శబ్దానుశాసనం అని కాని, ఉపాస్య దేవత అయిన సరస్వతీ ప్రసాదం వల్ల సిద్ధించిన త్రిలింగ శబ్దానుశాసనం అని కానీ అర్థం చేయడమే వుచితంగా తోస్తున్నది. ఏమైనా సారస్వత త్రిలింగ శబ్దానుశాసనం = (నృసింహ కవి) తెలుగు వ్యాకరణం.

మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారం ప్రచురించిన కేటలాగులో ఇది ఆంధ్ర కౌముది అంటూనే 'త్రిలింగ శబ్దానుశాసనం' అనేది దీనికి నామాంతరంగా చెప్ప

బడింది. సూత్రకర్త రెండు చోట్ల సారస్వత త్రిలింగ శబ్దానుశాసనం అని చెప్పు కొంటుండే 'సారస్వత' శబ్దం ఎందు కుపేక్షితమైందో అర్థం కావటం లేదు. సారస్వత శబ్దాన్ని గ్రంథనామం నుంచి తొలగించే అవకాశం కనబడటం లేదు. ఇది గ్రంథనామంలో భాగమే కాని వేరుగా వుండే అవకాశం ఏ విధంగానూ తోచకుండా వుంది. గ్రంథాంత గద్యంలో ఈ గ్రంథం పేరు 'త్రిలింగ శబ్దానుశాసనం'గా వుండ టాన్ని బట్టి అలా చెప్పబడిందేమో. కాని గ్రంథస్థమై వున్న వచనాలని బట్టి ఇది కేవలం 'త్రిలింగ శబ్దానుశాసనం' కాదు. సారస్వత త్రిలింగ శబ్దానుశాసనం.

## సా. త్రి. శ. రచనా లక్ష్యం

తన గ్రంథ రచనా లక్ష్యాన్ని గురించి నృసింహకవి అవతారికలో ఇలా చెప్పు కున్నాడు.

"తత్సతజ్జాచ్ఛదేశ్య గ్రామ్య భేదైరుత్కృష్టితాయాం త్రిలింగభాషాయాం సాహిత్య రచనేచ్ఛూనామ్ త్రిలింగ శాస్త్రాభియోగ దార్ఢ్యవిహీనానాం మతిమంద మతీనాం ప్రబన్ధ రచనా సమర్థానాం మహాకవీనాం చ త్రైలింగ్యానాం సుశబ్దానా మప శబ్దానాం వివేకస్య నిర్మలా దర్శభూతం కవి మహాప్రబన్ధ రచిత మర్మ పదోద్ఘాట నాతిమాత్రకరణమ్"-

తెలుగులో కావ్యం వ్రాయలేనివారికీ, వ్రాయాలనుకునేవారికీ, మహాకావ్యాలు రచించగలవారికీ కూడా ఉపయోగించేటట్లు సాధు అసాధు శబ్దాలు నిరూపించడం దీని లక్ష్యం.

నన్నయ మొదలుకొని క్షేత్రయ్య ప్రభృతుల వరకూ, ఆంధ్ర సాహిత్య చరి త్రలో పేరు గూడా వినని కవుల కావ్యాలతో సహా ప్రయోగాలనేకం సా. త్రి. శ. ఉద్ధరించింది. దీనివల్ల నృసింహకవి కావ్యాది లక్షణ పరిజ్ఞానంతోపాటు లక్ష్య పరి శ్రమ కూడా తెలుస్తున్నది.

## లక్ష్యం నెరవేరిందా ?

తాననుకున్న లక్ష్యాన్ని నృసింహ కవి యీ గ్రంథంలో చాల వరకు సాధిం చాడనే చెప్పొచ్చు.

తత్సమ, తద్భవ ప్రకరణాలు చాల విస్తృతాలయి సమగ్రంగా చెప్పడానికే ప్రయత్నించాయి. తజ్జ, దేశ్య, నానార్థకాది శబ్దాయుల పట్టిక ఆంధ్ర భాషా సమగ్ర స్వరూపాన్ని అందీయడానికి చాలవరకు అపూర్వంగా కృషి చేసింది. అచ్చిక పదాలు, సంఖ్యా వాచకాదుల ప్రక్రియ కూడ ఇందులో విపులంగానే కన్పిస్తుంది కాబట్టి లక్ష్యం చాలవరకే గ్రంథం సాధించినట్లే చెప్పాలి.

## సాధుత్వ కల్పనం

కుంభజునికి అనే ప్రయోగం సాధువు చేయాలనుకోవడం, పట్టపేనుగు, గోరంచు, అనే విలక్షణం చేత సిద్ధించక పోయినా కవి ప్రియుక్తాలు కావడం చేత ప్రయోగార్హాలే అని నిర్ణయించడమూ సాధు శబ్ద నిరూపణంలో భాగంగా గ్రంథ రచనా లక్ష్యానుగుణంగానే వున్నాయి.

## వ్యావహారికాలు

కాని యీ వ్యాకరణం సాధించిన శబ్దాలన్నీ సాధువులే అనీ, కవి ప్రయుక్త లనీ చెప్పడం కష్టం .

ఉదాహరణకు :-

'వస్వతాలవ్యస్యచ' (సంధి. 38) అనే సూత్రం ఇ ఈ ఎ ఏ ల తో కూడినపుడు వ కారానికి లోపం చెప్పుతున్నది. విత్తు - ఇత్తు, వెట్టి - ఎట్టి (ఇలాగే బావి - బాయి మొ॥ కూడా వుంటాయి) ఇత్తు - ఎట్టి లాంటి ఈ పదాలు గ్రామ్య వ్యవహారంలో వుంటాయా ! జన వ్యవహారంలో వున్నమాట వాస్తవమే. వీటికి కావ్య ప్రయోగార్హత కల్గిస్తూ లక్షణ బద్ధం చేయటం ఎంత వరకుచితం ?

ఇలాగే మరికొన్ని :

(వేడుక) వేట్క (గాడుపు) గాడ్పు - సంధి. 24

తత్సమాలుగా జల్మము -మల్మథుఁడు - తద్భ: 8

రిష రిసభము తద్భ - 26

సంఖ్యావాచకాలు కొన్ని ఒగటె ఒగతె తద్భ - 19

పద్రెండు సంఖ్య - 37

రెణ్ణెళ్లు, వేణ్ణీళ్ల సంఖ్య - 55

గెనిఁటి గెనింటి ఆను - 6

జెయము చతురు తద - 47

బ్రాహ్మఁడు తజ్జ - 260

చూచిని క్రియా - 64

చేయుదాము, చూదాము మొ॥ క్రియా - 73

చూచితే (పశ్యతిచేత్) క్రియా - 78

రావడము పోవడము క్రియా - 86

చూచుతా వినుతా — కృత్ - 7

కోదండ్లు మొ॥ — కార - 17

ఇవి లోక వ్యవహారంతో విన్పిస్తాయి. కాని కావ్య వ్యవహారంలో కన్పించవు.

'ధాతోరేత్ ప్రాచామ్' అనే (క్రియా. 124) సూత్రంచేత అయ్యేవాడు చూచే రాయఁడు ఇత్యాదులని వివృతి నిరూపించింది. ఇవి గ్రామ్యాలని సూరి ప్రభృతులు స్పష్టం చేశారు. అయితే యిక్కడ వివృతి "ఏతే ప్రాచాం ప్రయోగం లసాధుత్వా త్కణ్వ రావణ పుష్పదన్తాది త్రైలింగ్య మహర్షి భిర్నరాకృతా ఏవ" లని స్పష్టం చేశాడు. కణ్వాదుల కంటే ప్రాచీనాలన్నమాట అయ్యే వాడనే విధమైన రూపాలు. అయినా కణ్వాదులు తిరస్కరించినప్పటికీ సా. ప్రతి. శ. వాటిని ప్రతిపాదించడంలో వీటికి కావ్య ప్రయోగ ప్రామాణ్యం ఎంతో అర్థంకాదు. (హంసవింశత్యాద్యర్వాచీన గ్రంథాల్లో ఇవి అరుదుగా లేకపోలేదు). దీన్నిబట్టి కణ్వాదులకు భిన్నంగా సా. ప్రతి. శ. స్వతంత్ర లక్షణం చెప్పిందని తోస్తుంది. 'ఏతే ప్రాచాం ప్రయోగాః' అనడాన్ని బట్టి 'ధాతోరేత్ ప్రాచామ్' అనే యీ లక్షణం పూర్వలాక్షణికోక్తంకాక స్వతంత్రంగా వీటికి సాధుత్వాన్ని కల్పించడం కోసం నృసింహకవే చెప్పాడేమో ననిపిస్తుంది.

అయినా కావ్యప్రయుక్తాలు అనడానికాధారాలు మృగ్యాలైన యిటువంటి శబ్దాలకు సాధుత్వ కల్పనం అవసరమా ?

## వింత శబ్దాలు

ఇదిలా వుండగా ఈ వ్యాకరణం ప్రతిపాదించిన మరికొన్ని శబ్దాలు నేడు వ్యవహారంలో కూడా వినిపింపక వింతగా తోస్తున్నాయి.

విధాత్రాదుల్లో చూపిన జామాతృఁడు మొదలైన రూపాలు వ్యవహారంలో వున్నాయా ?

వాయిగ్గౌ నుద్వోః (సంఖ్య-9) సూత్రం ఏను ఐదు శతాబ్దాలతో నుదులకు సమరకత్వంలో వికల్పంగా లోపం చెప్తూ (ఏనూరు) ఏనుమరు, ఐనూరు, ఐదునూరు అనే రూపాలు సాధిస్తున్నది. ఇటువంటి రూపాలెక్కడా వినబడవు.

ఇలాగే - ఒరుఁడు (ఒక్కఁడు) సంఖ్య-25, ఎనమండ్రు (సంఖ్య. 37) ఒరుపది (ఒకపది-సంఖ్య. 39) పదునకొండు-సంఖ్య-47) ఇచ్చకించె (క్రియా. 30) పోచున్నాడు (క్రియా. 83) ఈవడు, ఈవక (క్రియా. 87).

ఇటువంటివి తద్భవాల్లో ఎక్కువగా కన్పిస్తున్నాయి. బయ్యేదుఁడు, దవ్వాసనఁము (తద్భ. 46) వకము (బకము) వాలుఁడు (బాలుఁడు) (తద్భ. 51) లచ్చెరబము (తద్భ. 55) సిక్కారు పూజారు మొ॥ (తద్భ 59, 60) లాహలహము (తద్భ. 87) పిరేమ (ప్రేమ) దిరేత (ద్రుత) (తద్భ. 68) మొ॥

అనుస్వార రేఫ ప్రకరణాల్లో భేదాలు చాలా గోచరిస్తున్నాయి.

## అసాధు శబ్ద నిరూపణం

ఇటువంటి వింతలెన్నో చూపిన సా. త్రి. శ. అసాధువులని ప్రత్యేకంగా ఒక శబ్దాన్ని గురించి నిర్ణయించడం చాలా అరుదు.

ఆత్మనే పదార్థంలో కొని ప్రత్యయంలో 'నేర్లగ్గురోః' (క్రియా. 19) అనే సూత్రం చేత నివర్ణ లోపంతో చేసుకొవచ్చి, తీసుకొపోయె అనే రూపాలు సాధించింది. ఇవి వినబడవు. కనబడవు. అక్కడే 'కిఞ్చ లోకే కేచిద శాస్త్ర వేదినః కవయః కొని ప్రత్యయస్థానే కవర్ణ ప్రయోగ స్సమీచీన ఇతి వ్యాహర న్తి తేషాం ప్రయోగ స్త్వ సాధురేవ' అని నిర్ణయించి చెప్పింది. బొలెక్కుక నీ బిడ్డడు అనే విధంగా 'కొని' కి బదులుగా కవర్ణం లోక వ్యవహారంలో ప్రసిద్ధం. కావ్య వ్యవహారంలో కూడా ప్రవేశించింది. అయినా యివి అసాధువులని సా. త్రి. శ. ఎందుకు నిర్ణయించిందో. చేసుకొవచ్చి అనే దానికి బదులుగా 'చేసుక వచ్చి' అని సాధించినా బాగుండేది. పూర్వ లాక్షణిక మతాలను గ్రహించే సమయంలో సా. త్రి. శ. స్వాతంత్ర్యం ఎక్కువగా చూపించక ప్రధానంగా దాన్ని అనుసరిస్తుండటం వల్లనే ఇక్కడ ఇలా చెప్ప బడిందేమో.

ఏమైనా మొత్తమ్మీద ఆంధ్ర భాషా లక్షణ నిరూపణంలో సా. త్రి. శ. విస్తృతమయిన ప్రయోజనవంతమయిన కృషించేసిందని అంగీకరించక తప్పదు.

ఆ కృషి ఫలాన్ని సంక్షిప్తంగా పరిచయం జేసుకుందాం.

## సా. త్రి. శ. లక్షణ స్వరూపం

ఇందులో పరిచ్ఛేద విభాగం వ్రాత ప్రతిలో అన్నిచోట్లా విస్పష్టంగా కన్పింపక పోయినా విషయ క్రమాన్ని బట్టి విభాగం ఇలా గుర్తించవచ్చు. ఈ ప్రకరణ విభాగమే దీని లక్ష్యవిస్తృతిని సూచిస్తుంది.

## పరిభాషా పరిచ్ఛేదం

ఇందులో ప్రధానంగా వర్ణాలకు సంబంధించిన అంశాలు వున్నాయి. సంస్కృతాంధ్రాది వర్ణాలు, దంత్య తాలవ్య స్వరభేదం, పదాదియకారవం, వుపూవొవోలు, వాటి లోపం, సంస్కృత పద ప్రయోగం మొదలైన విషయాలిందులో చెప్పబడ్డాయి. ప్లుతాన్ని పేర్కొటం (6) స్వరాలను దంత్యతాలవ్యాలుగా విభజించడం (11, 12) దంత్యతాల వ్యభేదం చజలతోపాటు సకారానిక్కూడా చెప్పడం (19) ఇందులో విశేషాంశాలు.

## సంజ్ఞా పరిచ్ఛేదం

ఇందులో వివిధ సంజ్ఞలు పేర్కొనబడ్డాయి. పరుష సరళాదులతోపాటు ప్రాకృతాను సారంగా హ (16) ది (15) మొదలైన సంజ్ఞలు చెప్పబడ్డాయి. తెలుగుభాషలోని తత్సమాది భేదాలలో తద్భవంతోపాటు అచ్చవేరుగా (29) చెప్పడం తద్భవాలలో ఏకదేశ తద్భవాలు (32) సచ్ఛాయాతద్భవాలు (37) అనే భేదకల్పనం విశేషం. ఏటిలో మూల సంస్కృత శబ్దంలో ఏకదేశం మాత్రమే వికృతికి లోనుగావటం సామాన్యం కాగా అవికృతమైన మిగిలిన భాగంలో అనాంధ్ర (సంస్కృత) లక్షణంవుంటే (జడ) ఏకదేశతద్భవమనీ, కాక అది ఆంధ్రలక్షణమూ లనదగివుంటే (ముద్దు) సచ్ఛాయా తద్భవమనీ వింగడించినట్లు తోస్తుంది. ఈ విభాగం వల్ల ప్రయోజనం మృగ్యం.

## సంధి పరిచ్ఛేదం

తరువాత యథాక్రమంగా సంధి విషయాలు చెప్పబడ్డాయి. ఉత్వేత్వ సంధులు ప్రత్యయాచ్చంధి అంబాద్యర్థక సంధి ద్రుతకార్యాలు మొదలైనవున్నాయి. 'గసడదవాదేశం' ఆపేరుతో లేదు. ఇందులో గడదావేశం సరళాదేశంగా చెప్పబడింది. (53) సవలు వేరుగా విధింపబడటం అలావుంటే బబలకు కూడ సవాదేశం చెప్పడం విశేషం (51, 52) అతడు + బల్లిదుడు అతడు వల్లిదుడు మొదలైన యిటువంటి రూపాలు కవిప్రయోగాను లక్షణంగావు. వ్యవహారంలోనూ ఇది వినబడదు. ద్రుతకార్యాలలో ద్రుత మీద్రద సరళాదేశం ఒకసారీ (45) ద్రుతానికైన బిందుపుమీద సరళాదేశం వేరొకసారి (46) చెప్పడం విశేషం.

## ఔపవిభక్తికాలు

చింతామణి మొదలైన యీ వర్గం వ్యాకరణాలలోగానే యిందులోనూ, ఔపవిభక్తికాలు సంధి పరిచ్ఛేదంలో చెప్పబడ్డాయి. చింతామణికంటె ఇందులో ఔపవిభక్తికాలు విపులంగా చెప్పబడ్డాయి. కానిపునరుక్తులు విశేషం 'ంటి'గా ప్రసిద్ధమైన ఔపవిభక్తికం ఇందులో 'టిజ్జు'గా విహితం (69) లటిచ్, లంటిచ్ (77) ఇటిక్, ఇంటిక్ (78) మొ॥ ఇందులో విశేషాలు.

అకట, కట మొదలైన అవ్యయశబ్దాల కొక ప్రక్రియ నిరూపించడంలో ఈ పరిచ్ఛేదంలో ఒక వైలక్షణ్యం (30 మొ॥) ఇది ఉచితంగా తోచదు.

ఇందులో చెప్పబడిన 19 మొదలైన స్వరలోప విధానాలు ఆచ్ఛిక శబ్దాలకు సంబంధించినవి.

## శబ్దపరిచ్ఛేదం

ఈ రకం వ్యాకరణాలలాగానే ఇందులో అజంత హలంత సంస్కృత శబ్ద సాధనం ప్రధానంగా కనబడుతుంది. ఆచ్ఛిక శబ్ద నిరూపణానికొక ప్రత్యేక ప్రకరణం కనబడదు. శబ్ద పరిచ్ఛేదంలోనూ కారకాది పరిచ్ఛేదాల్లోనూ ఆచ్ఛిక శబ్ద నిరూపణం కనబడుతుంది.

ఇందులో విభక్తి పరిగణమే విశేషం లబు లబుత తృతీయా విభక్తులుగాను, (6, 7) ఉంచి, ఉండి, కుండా, పొరుడి మొదలైనవి పంచమీ విభక్తులుగానూ 10, 13 విషయ నిమిత్తాలు సప్తమిగానూ (18) చెప్పడం విశేషంగానూ విలక్షణంగానూ కని పిస్తుంది. లబు పొరుడి మొదలైనవి నేడు వ్యవహారంలో కూడా లేవు.

ఉజంతాలు, ఋవర్ణకాంతాలు మొదలైన వాటి ప్రక్రియ వివరంగానే నిరూపింప బడ్డింది. నౌ శబ్దానికి నావ అనేదానితోపాటు (70) పుష్పదంతమతాను గుణంగా 'నావి' అనే రూపం చెప్పబడింది. (71) 'నావ' అనే రూపాన్ని మాత్రమే సాధించిన చిన్నయ సూరి 'నావి' యనియు నాదేశం బగునండ్రు అన్నాడు. సూరి వాక్యాలకు రావి పాటి గురుమూర్తిశాస్త్రి తెలుగు వ్యాకరణంతో పాటు ఇది కూడా మూలమేమో.

మహదుదంతాలకు సామాన్యంగా విష్ణుశంభు అనేవిధంగా ప్రథమైక వచనంలో వుదుజ్వర్ణక విరహిత రూపాలు సాధించటం ఒక విశేషం (61, 62) ఋకారాంతాలలో విధాత్రాదులలో జానూతృడు శమితృడు మొదలైన ఏన్నో శబ్దాలు డు మంతాలుగా చూపడానికి కావ్య ప్రయోగ ప్రామాణ్యం కనబడదు (68).

## హలంత ప్రకరణం

హలంత సంస్కృత శబ్దాలు జగదాదులు (ఇది చింతామణి తదనుగుణంగా ఆం. కౌ. పేర్కొన్న అగుణ వర్ధణం అనవచ్చు.) నృగాదులు (ఇది చిం, ఆం. కౌ. లు పేర్కొన్న గుణవర్ధణం అని స్థూలంగా చెప్పవచ్చు) అని విభాగింపబడ్డాయి. హలం తాల చివరి హల్లుకు పూర్వంలో వుండే వర్ణాలను బట్టి విధానాలు చేయకం ఇందులో విలక్షణంగా కన్పిస్తుంది. (4, 8 మొ॥) రాచకొలము ఇత్యాదిగా సమాసాల్లో కనబడే 'చ' కారాన్ని రాజు శబ్దంనుండి సాధించడం (18) సముచితంగా తోస్తున్నది.

## ఆచ్ఛిక ప్రకరణ

ఆచ్ఛిక ప్రకరణం ఇందులో ప్రత్యేకంగా లేదు. కాని అక్కడక్కడా చెప్పిన విధుల్ని ఒకచోటకు తెచ్చుకుని ఆచ్ఛిక శబ్ద నిరూపణం కూడా సా.త్రి.శ. లో విశేషం గానే గుర్తించవచ్చు. ఆచ్ఛిక విధులెక్కువగా కారక పరిచ్ఛేదంలో వుండటం మొదటి విశేషం.

మహదు దంతాలకు అల్లువు, అల్లు అనే విధమయిన రూపాలు (శబ్ద.89) సాధించడం విశేషం. ఇవి కవి ప్రయోగాల్లో లేదు నాటి జన వ్యవహారంలో వుండేమో ఇప్పుడుహ కందదు. రంగంట్లు తిప్పంట్లు (శబ్ద. 82) అనే విధమయిన రూపాలు బహుశ లోకవ్యవహారాన్నుంచి ప్రమాణీకరించి వుండవచ్చు.

ఇందులో చాలా వింతలు కనిపిస్తాయి. 'వా' మొదలైనవి ఏకాక్షరశబ్దాలనీ వాటిని 'యి' వర్ణకం వచ్చి వాయి రేయి మొదలైన రూపా లేర్పడతాయనీ యిందులో ప్రక్రియ (ఏ.క.16) (త్రి.శ. కనుగుణం) 'వాయి' మొత్తం ప్రాతిపదిక అని యితరుల సముచిత నిర్ణయం. చైౢ లాంటి రూపాలు మరీ వింతగా (ఏ.క.14) ఈ వ్యాకరణంలో సాధింపబడ్డాయి. శబ్దాలన్నీ అదంతాలనీ అత్వం గలవనీ అందులో ఇత్వం వస్తుందనీ కలక - కలికి అనే విధంగా రూపాలు సాధించడంలో వ్యాకర్తల దృష్టి (ఏ.క.12) స్పష్టం కాదు.

## సర్వనామ ప్రకరం

సర్వనామాలను గూర్చి చెప్పడానికి ఈ వ్యాకరణంలో ప్రత్యేకంగా ఒక ప్రకరణం ప్రారంభం కావడం ముదావహం. ఇందులో ప్రధానంగా ఆ,ఏ,ఏం శబ్దాల మహద మహద్రూపాలు, నీనా, తామను శబ్దాల ప్రక్రియ ప్రముఖంగా నిరూపింపబడింది. సర్వనామ శబ్దాల ప్రక్రియ తద్ధిత పరిచ్ఛేదంలో కూడా అధికంగా కనిపించడం విశేషం.

నానీతా శబ్దాలకు తృతీయాదుల్లోగూడా (పంచమివరకు) నానుచేతా నన్నువల్ల లనే విధమయిన (సర్వ-8,9) రూపాలు ఈ వ్యాకరణం సాధించింది. ఇవి కావ్యాల్లో కనబడవు. నేడు వ్యవహారంలో కూడా లేవు. గ్రంథకర్త నాటికేమైనా లోకవ్యవహారంలో వుండేవేమో.

ఆ ఈ ఏ అనే రూపాలు సమాస తద్ధిత పరిచ్ఛేదాల్లో రెండు మార్గాలలో రెండు సార్లు సాధింపబడ్డాయి. అటమటీండ్లు అనే విధమైన రూపాలుగూడా వ్యవహారంలో వున్నాయేమో (తద్ధి. 39) అల, అల్ల అనేవి తదర్థక ఆ శబ్దం నుండి సాధింపబడ్డాయి (కార. 49,50).

## సంఖ్యా వాచకాలు

తెలుగులో సంఖ్యావాచకాలుగూడా సర్వనామాలే అవుతాయి. ఈ వ్యాకరణంలో గూడా సంఖ్యా వాచకాలను సర్వనామాలుగా వివరించడం జరిగింది. (సంఖ్య.16) సంఖ్యావాచక శబ్దాల ప్రక్రియ విపులంగా చూపడం కోసమేమో ఈ వ్యాకరణంలో సంఖ్యా వాచక ప్రకరణం సర్వనామ ప్రకరణం కంటే వేరుగా నిరూపింపబడింది.

తెలుగు సంఖ్యావాచకాలను సంస్కృత సంఖ్యావాచకాల స్థానంలో ఆదేశించడం ఇందులోని ప్రత్యేకత (2, 4 మొ॥) రెండు మూడు అనే చోట్లగూడా డువర్ణం ప్రత్యయంగా విధింపబడింది (1) ఐగురు, (ఏనుగురు) ఒరుకు (ఒక్కడు) లనేవిధంగా కొంత వైలక్షణ్యం గోచరిస్తున్నా వీటి నిరూపణం చాలవరకు ఆమోదయోగ్యంగా నడిచింది.

## అవ్యయ ప్రకరణం

రావణుడు చెప్పిన అవ్యయపాఠం అని ప్రారంభించి సా. త్రి. శ. అవ్యయాలు చాలా వివరించింది. ఇందులో చాలవరకు అవ్యయాలే అయినా కొన్ని కావు. రావణుడు కూడా అయ్య అక్క ఇత్యాది శబ్దాలు అవ్యయాలుగా చెప్పడం వింత. తదనుగుణంగానే సా. త్రి. శ మరి కొన్ని అవ్యయేతరాలు కూడా అవ్యయాలుగా చెప్పింది. ఏమి మొదలైన ఆ శబ్దాలు అవ్యయాలు కావని ఆ ప్రకరణంలో గుర్తించగలం.

## తద్భవ పరిచ్ఛేదం

ఈ వ్యాకరణంలో తద్భవ శబ్దాల ఉత్పత్తి విస్తృతంగా నిరూపింపబడింది. తద్భవ రూపాల సాధనకు సమగ్రమైన లక్షణం ఏర్పరచవలసిన అవసరాన్ని సూచిస్తూ అందుకు మంచి ఆధారంగా ఈ పరిచ్ఛేదం ఉపయుక్తం అవుతుంది.

వాల్మీక్యాది ప్రాకృత వ్యాకరణాల నుండి కొన్ని లక్షణాలు ఇందులో యథాతథంగా గ్రహింపబడ్డాయి (తద్భ 10, 23,58 మొ॥). కొన్ని తెలుగుకు అవసరమైన విధంగా స్వల్పంగా మార్పులు చేసి తీసికున్నట్లు కనబడుతోంది. (3, 14 మొ॥) కాని వివృతి పెక్కుచోట్ల వ్రాయబడుతూ ఒకే లక్షణం పునరుక్తమైన తావులు కనబడుతున్నాయి.

ఏమైనా తద్భవాలకి సంబంధించి ప్రాథమికమైన విధానాలు ఇందులో ఉపయోగించేవిగా వున్నాయి. కొన్ని వ్యావహారిక పదాలూ మరికొన్ని మతశబ్దాలూ ఇందులో తద్భవాలుగా నిరూపించడం గమనించవచ్చు. పూజారు అచ్చెరజము మొ॥,

## శబ్దాల పట్టికలు

నిఘంటువులాగా ఈ గ్రంథంలో తజ్జ దేశ్య నానార్థకాది శబ్దాలపట్టికలు బహుధా ఉపయోగించేవిగా వున్నాయి. కొన్ని వైరుధ్యాలు గోచరించినా వీటివల్ల ప్రయోజనం గుర్తింపదగిందే.

## కారక పరిచ్ఛేదం

కారకాలకు సంబంధించి ఒక పరిచ్ఛేదం ప్రత్యేకంగా ఆరంభంగావడం ఇందులో విశేషం. చింతామణిలో శబ్ద ప్రకరణంలోనే స్వల్పంగా కారకాలుగా నిరూపింపబడ్డాయి.

తెలుగు విభక్తులు యథా సంస్కృతంగా వస్తాయని (కార.47) చెప్పినా, తెలుగులో ఒక విభక్తకి మరో విభక్తి వచ్చే స్థలాలను చాలా వివరంగా ఈ వ్యాకరణం నిరూపించింది (10,11, మొ॥).

కూర్చిని ద్వితీయా విభక్తిగా పరిగణించి, ద్వితీయకు విధించికూడా కూర్చి పరకతలో ద్వితీయ విధించడం (కార.7) వింతగావుంది. షష్ఠికి చతుర్థి రెండు పర్యాయాలు చెప్పబడింది (12,6). లింగవిశేషణ విభక్తి. (శబ్ద-92) విభక్తి (శబ్ద.87) వచన (కార.48) వ్యత్యాసాలు స్వల్పంగా ప్రతిపాదింప బడ్డాయి.

ఏమయినా కారక విషయా లిందులో ఎక్కువగా చెప్పబడ లేదనిపిస్తుంది. ఇందులో ఆచ్ఛిక శబ్ద నిరూపణ మెక్కువగా కన్పిస్తుంది.

## సమాస పరిచ్ఛేదం

అలాగే సమాస విషయాలుకూడా ప్రత్యేకంగా పేర్కొనడం ప్రారంభించినా చెప్పింది తక్కువే ననిపిస్తుంది.

చింతామణిలో లాగానే ద్విగు ప్రభృతి సమాసా లిందులో ప్రస్తావింపబడ్డాయి (3). షష్ఠి సమాసంయొక్క ప్రాచుర్యాన్ని గుర్తించడం (త్రి.శ. కనుగుణంగానే) విశేషం (10). సమాసక సంజ్ఞను ఉపయోగించుకొన్న జాడ కనబడలేదు గాని ఆ సంజ్ఞను పేర్కొన్నది. (4)

## తద్ధిత పరిచ్ఛేదం

సర్వనామాలను గురించి చెప్పినవెంటనే ప్రారంభించడం వల్లనేమో తద్ధిత పరిచ్ఛేదంలో సర్వనామాల ప్రక్రియ కనబడుతుంది.

తద్ధిత ప్రత్యయాలు వాండు గాండు అనే విధంగా చెప్పబడ్డాయి. గొల్లఁడు మొదలైన చోట్ల డుజ్జె తద్ధిత ప్రత్యయమనడం విశేషం. అమ్మక్షి ఇత్యాదిగా అణ్ణి అల్ల

ఆళు అనేవి తద్ధిత ప్రత్యయాలుగా చెప్పడం లోకవ్యవహారాన్ననుసరించి అయ్యుండొచ్చు. అంత, ఆలు, ఏసి, అనేవి గూడా ప్రత్యయాలుగా చెప్పడం (56, 59, 64) సమంజసమని పించదు. కాలవాచకాలమీద 'సేపు' తద్ధిత ప్రత్యయంగా చెప్పడం (65) ఉచితంగావుంది.

## క్రియాపరిచ్ఛేదం

క్రియా పదాలను గూర్చి చెప్పిన ప్రకరణం ఇందులో చాలా విస్తృతంగా వుంది. కృదంత ప్రకరణంలో కూడా క్రియాపదాల ప్రక్రియకు సంబంధించిన లక్షణాలు గోచరిస్తాయి.

తత్సమధాతువులు ఉపకృతి పరికృతి సంస్కృతి భేదంతో మూడు విధాలుగా చెప్పడం చింతామణిని స్ఫురింపజేస్తున్నా ఇందులోని ప్రక్రియ చింతామణి ప్రణాళికకు చాలా భిన్నమైన మార్గంలోవుంది.

తద్ధర్మార్థంలో లేట్ (15), ఆశీరాద్యర్థాల్లో లోట్ (17, 61) ఇందులో విశేషంగా చెప్పబడ్డాయి. నామవిభక్తులు సుప్పులకు విధించినట్లే క్రియావిభక్తులు గూడా తిఙ్ఙుల స్థానంలో విధింపబడ్డాయి. (40, 41 మొ॥)

నన్నయ నాటినుంచి విమర్శకులు పేర్కొన్నట్లుగా వచ్చుచున్నఁడవు, వచ్చుచున్నాఁడను అనే (విశేషణ) రూపాలు మధ్యమోత్తమపురుష క్రియాపదాలుగా ఇందులో సాధింపబడ్డాయి (41, 42) కాని ఆ పద్ధతిలో లమహదర్థంలో వచ్చుచున్నదవు వచ్చుచున్నదను (క్రియా 44) అని సాధించడం వింత. ఇటువంటి రూపాలు భాషలో వుంటాయనిపించదు. ఈ ప్రమాదం ఎక్కడిదో. ఇలాగే వచ్చుతా (కృత్-7) అని శత్రర్థంలో ఉతాప్రత్యయమూ వచ్చితే అనేవిధంగా చేదర్థంలో (78) తే ప్రత్యయమూ, మొదలైనవి కావ్యం ప్రయోగప్రామాణ్యం లేనివిగా తోస్తుంది. రావడము అని అడ ప్రత్యయం చెప్పడం ఉచితమే. కాని యిది కర్త్రర్థకం అనడం (కృత్. 33) సరిగాలేదు. భావార్థకంగా చెప్పవలసింది. చేతురు (94) అనే రీతిరూపాలు గూడా లక్షణ బద్ధంచేయడం సమంజసమే.

మొత్తంమీద కొద్దిగా పునరుక్తులు, ప్రక్రియలో గౌరవమూ, కన్పిస్తున్నా క్రియాపదనిరూపణం ఈ వ్యాకరణంలో కొంతవరకు సమగ్రంగానే చెప్పబడిందనవచ్చు.

# కృత్ప్రకరణమ్

కృదంతాల నిరూపణం అంత విస్తృతం కాదు. అయినా దీని ప్రత్యేకించి విభాగింపవలసినది గుర్తింపడం ముదావహం. ఇందు తిఙ్ప్రక్రియను సంబంధించిన విధానాలు చేరా యెలాగో (42, 43 మొ॥) ఈవి (17) కూక (12) నోము (23) రాక (20) మొదలైన కృదంతాల నిరూపణంతో ఈ ప్రకరణం ప్రత్యేకంగా విభజించడం ప్రయోజనవంతమే.

# ధాతు ప్రక్రియ

తరువాత ధాతు ప్రక్రియ అని కొన్ని ధాతువులు వాటి అర్థాలతో నిరూపించబడ్డాయి. ఇందులో మొదటి సూత్రమే వివాదాస్పదం. అందులో చెప్పినవి చాలా ధాతువులు అనరానివి. అగ్గువ ఇంగువ ఇత్యాది రూప సాధ్యం విలక్షణం.

ఇందులో ఉంటిని (2) మొదలైన క్రియాపద నిరూపక లక్షణాలు చోటు చేసుకున్నాయి.

# అనుస్వార ప్రకరణం

తెలుగులో ప్రధానంగా ఖండానుస్వారం ఎక్కడ వుంటుందో నిరూపించడానికి ఈ ప్రకరణం ఆరంభమైంది. లక్ష్యం మంచిదే అనడంలో సందేహంలేదు. కవులకవసరమైన లక్షణం చెప్పాలనే లక్ష్యం నెరవేరడానికీ ప్రకరణమూ అవసరమే కాని (ఆయా వర్ణాలు పరంగా వున్నపుడు) ఏయే వర్ణాలమీద బిందువుంటుందో చెప్పే యీ లక్షణాలలో అతివ్యాప్త్యవ్యాప్తులుండటం సహజం. 'పరుష సరళములకు ముందే బిందువు' అన్నంత వరకు నిర్దుష్టంగా సరిపోతుంది. కాకపోతే తజ్జాది శబ్దాల పట్టికలాగా, అనుస్వారంవున్న శబ్దాలను గూడా పట్టికగా ఇచ్చినట్లయితే లక్ష్యం చక్కగా నెరవేరేదేమో ననిపిస్తుంది.

# రేఫ ప్రకరణం

అనుస్వార ప్రకరణం వంటదే రేఫ ప్రకరణం. ఇందులో రేఫ సంయుక్త శబ్దాలను గూర్చి చెప్పడం జరిగింది. అతివ్యాప్త్యాదులు తప్పవు. అయినా రేఫ సంయుక్తాలను నిరూపింప బూనుకునేకంటే నిత్యవైధర్మ్యంవున్న సాధుశకట రేఫ శబ్దాలపట్టికనిస్తే ప్రయోజనవంతమేమో.

రేఫ ప్రకరణంతో ఈ వ్యాకారణం పరిసమాప్తమైంది.

లోసుగు లేవైనావున్నా కొన్ని పూర్వవ్యాకరణాల కంటె విస్తృత ప్రణాళికతో అంతటి ప్రయోజనాన్ని సాధిస్తూ ఈ వ్యాకరణం బహుముఖంగా ఆంధ్రభాషో పయోగి అయివుందనడంలో సందేహం అక్కర్లేదు.

## సా. త్రి. శ. లక్షణ సంగ్రహం

| పరిచ్ఛేదాలు - | సూత్రాలు | విషయానుగుణ పరిచ్ఛేద సూత్రక్రమం | |
|---|---|---|---|
| 1. పరిభాషా పరిచ్ఛేదం | - 37 | (1) సంజ్ఞా పరిచ్ఛేదం | - 71 |
| 2. సంజ్ఞా పరిచ్ఛేదం | - 38 | | |
| 3. సంధి పరిచ్ఛేదం | - 85 | (2) సంధి పరిచ్ఛేదం | - 52 |
| 4. శబ్దపరిచ్ఛేదం | | (3) శబ్ద పరిచ్ఛేదం | |
| (అజంత ప్రకరణం) | - 92 | i అజంతా ప్రకరణం | - 86 |
| 5. హలంత ప్రకరణం | - 27 | ii హలంత ప్రకరణం | - 25 |
| 6. సర్వనామ ,, | - 22 | iii ఆచ్ఛిక ,, | 58 |
| 7. తద్ధిత పరిచ్ఛేదం | 64 | iv సర్వనామ ,, | 70 |
| 8. ఏకపదవిధి ప్రకరణం | 24 | v సంఖ్యావాచక ,, | 57 |
| 9. కారక పరిచ్ఛేదం | 50 | vi ఔపవిభక్తిక ,, | 17 |
| 10. సమాస ,, | 18 | | |
| 11. తద్భవ పరిచ్ఛేదం | 139 | vii అవ్యయ ,, | 10 |
| 12. అవ్యయ ప్రకరణం | | viii అనుస్వార ప్రకరణమ్ | 28 |
| 13. క్రియా పరిచ్ఛేదం | 140 | ix రేఫసంయుక్త | 63 |
| 14. కృత్ప్రకరణం | 50 | (4) తద్భవ పరిచ్ఛేదం | 136 |
| 15. ధాతు ప్రక్రియ | 7 | (5) కారక పరిచ్ఛేదం | 22 |
| 16. సంఖ్యావాచక ప్రకరణం | 55 | (6) సమాస ,, | 21 |
| 17. అనుస్వార ,, | 28 | (7) తద్ధిత ,, | 23 |
| 18. రేఫ (సంయుక్త) ,, | 63 | (8) క్రియా ,, | 163 |
| | | కృత్ప్రకరణమ్ | |
| మొత్తం సూత్రాలు | 939 | మొత్తం సూత్రాలు | 934 |

ఇతర పునరుక్తులనుగూడా తొలగిస్తే సూత్రసంఖ్య మరికొంత తగ్గుతుంది.

# గ్రంథ పరిష్కారం గురించి

మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలోని D 1223 నంబరు గల వ్రాత ప్రతి ఒక్కటే దీని కాధారం. మరో ప్రతి వున్న జాడలేదు. ఆ ప్రతి తీసు కోవడంలో మిక్కిలిగా సహకరించిన శ్రీ తీర్థం శ్రీధర శర్మగారికి కృతజ్ఞుణ్ణి.

## విషయ విభాగం

వ్రాతప్రతిలో ఆయా అంశాలు పరిభాషా సంజ్ఞాదులుగా విభాగింపబడ్డాయి కాని తేడాలున్నాయి. 'అథ శబ్దాః' అని ప్రారంభించి హలంతాలు, కారకాలు, సమాసాలు చెప్పాక 'తపత్సము ప్రక్రియోక్తా' అని వుంది. అలాగే 'అథ తిఙ్ప్రక్రియా' అని ప్రారంభించి మధ్యలో 'అథ కృదన్తాః' అని కృత్ప్రకరణం ప్రారంభమైనట్లు చెపుతూ మరలా చివర 'తిఙ్ప్రక్రియోక్తా' అని వుంది. పరిష్కరణంలో లక్షణ విషయ క్రమాన్ని బట్టి వ్రాత ప్రతిని దాదాపుగా అనుసరించే పరిచ్ఛేద ప్రకరణాల విభాగం చేయబడింది.

## పరిచ్ఛేదాలు

ఇందులో పరిభాషాప్రకరణం అనీ, అథ శబ్దాః, అనీ, 'తిఙ్ప్రక్రియా' అనీ ఆయా విభాగాల పేర్లొక్కొక్క తీరుగా కనబడుతున్నాయి. 'అథ సన్ధిః' అని ప్రారంభమై చివర 'సన్ధి పరిచ్ఛేదస్సమాప్తః' అని వుంది. సౌలభ్యాని కనుగుణంగా పరిష్కర ణంలో ఆయా విభాగాలు పరిభాషాది పరిచ్ఛేదాలుగానూ, తదంతర్గత భాగాలు ప్రకర ణాలుగానూ పేర్కొనడం జరిగింది.

## విషయ క్రమం

ఈ గ్రంథంలో ఆయా పరిచ్ఛేదాలలో వేరే పరిచ్ఛేదాలకు సంబంధించిన విష యాలున్నాయి తద్ధిత పరిచ్ఛేదంలో సర్వనామ ప్రక్రియ, కారక పరిచ్ఛేదంలో ఆచ్ఛిక ప్రక్రియా వగైరా. వ్రాత ప్రతి ననుసరించే ఆ క్రమంలోనూ లక్షణం వ్యాఖ్యానింప బడింది. విషయాన్ని బట్టి ఏ లక్షణం ఏ క్రమంలో వుంటే బాగుండేదో అనుబంధం-1 విషయానుగుణ సూత్రాను క్రమణికగా ఇవ్వబడింది. వ్రాత ప్రతిని ఆశ్రయించి చేయవలసిన ఈ విభాగం సాధ్యమైనంతవరకు జాగ్రత్తగానే క్రమం గుర్తించడ మైంది. నిశిత పరిశీలనం జరిగితే ఏమైనా కొంచెం మార్పు గోచరిస్తే గోచరించ వచ్చు. అనుబంధం చూడదగు.

## సూత్ర వృత్తి వివృతులు

వివృతిలో వృత్తి కర్త ప్రస్తావింపబడ్డ కారణంగా, సూత్రార్థ వివరణానికి ఇందులో 'వివృతి' లనే పేరుంచబడింది. వృత్తులు గుర్తించడానికి తగిన ఆధారాలు లేవు. వృత్తులనిపించినవి వృత్తులుగా చూపబడ్డాయి. వివృతి మాత్రమే వ్రాత ప్రతిలో లభ్యమై సూత్రం కనబడనపుడు త్రి. శ; అం. కౌ.లు ఆధారంగా సూత్రం ఊహింప బడింది. ఆ విషయం అక్కడ ప్రస్తావింపబడిందికూడా.

## ఫుట్ నోట్సు

వ్యాఖ్య వ్రాయడం కంటె ఫుట్ నోట్సు ఈయడానికే కొంచెం శ్రమ అధికం అయింది. త్రి. శ., అం. కౌ., ఆం. శ. చిం., అ. కా., వై. చం. లలో ప్రస్తుత గ్రంథంలోని లక్షణాలకు ఆధారమైనవి ఫుట్‌నోట్సులో ఇవ్వబడ్డాయి. కొన్ని చోట్ల కొంచెం భేదం కనిపించినా సామ్యాధిక్యాన్ని బట్టి, తరువాతి పరిశోధనకు ఉపయోగించ గలదనే వుద్దేశ్యంతోనూ ఆయా ఆధారాలీయబడ్డాయి.

అం. కౌ. ముద్రిత ప్రతి నాకు దొరకలేదు. O. R. I. తిరుపతి నుండి నేను వ్రాసుకున్న వ్రాత ప్రతి (R. 124 B) ననుసరించి అం. కౌ. సూత్ర సంఖ్య ఇచ్చాను. దీన్ని గూడా పరిష్కరించి వ్యాఖ్య వ్రాసే ప్రయత్నంలో వున్నాను. అది అయ్యాక సూత్ర సంఖ్యలో ఏమైనా తేడా వస్తుందేమో. అయినా కొంచెం అటు యిటుగా నైనా గుర్తించడానికి వీలవుతుంది గదా అని అం. కౌ. సూత్ర సంఖ్య ఇవ్వడం జరిగింది.

త్రి. శ. కు మద్రాసు (ప్రా. లి. పు. భాం.) వ్రాత ప్రతి (D 1245) ఆధారం. దీనికి కాకినాడ అం. సా. ప. లో ప్రత్యంతరం దొరికింది. దాన్ని నాకు సంపాదించి యిచ్చిన శ్రీ చిట్టాప్రూరి శివరామకృష్ణకు కృతజ్ఞతలు. అం. సా. ప. ప్రతిలో చివర బృహస్పతి సూత్రాలు కొన్ని వివృతిలో ఉన్నాయి. ఇది అథర్వణం గ్రంథంలో భాగం కాదు. ఇందులో కొంత O. R. I. తిరుపతి అం. కౌ. (R.318) ప్రతిలో కూడా చివర వుంది. అవి అనుబంధంగా ఇదుకోసుంచి సూత్రాలు ఫుట్ నోట్సులో ఇవ్వబడ్డాయి. త్రి. శ. పరిష్కరించి వ్యాఖ్య వ్రాయడం దాదాపు పూర్తి అయ్యింది. ఇందులో త్రి. శ. సూత్ర సంఖ్య. మద్రాసు ప్రతి ఆధారంగా కాండల సంఖ్యతోనూ, నా పరిష్కరించిన దాన్ని అనుసరించి, సూత్ర సంఖ్య ఇవ్వడం అయింది.

ఈ వర్గం వ్యాకరణాల తులనాత్మక పరిశీలనకు ఈ ఫుట్‌నోట్సు ఉపయోగించాలని ఆశ.

# కృతజ్ఞతలు

మా తల్లిదండ్రులు ఆదిలక్ష్మి ప్రసాదులకు పాదాభివందనాలు.

అక్షర భిక్ష పెట్టి అన్ని విధాలా ప్రోత్సహిస్తున్న మా గురువర్యులు డాక్టర్ బేతవోలు రామబ్రహ్మం గారికి సదా కృతజ్ఞుణ్ణి.

ఈ గ్రంథ ముద్రణ బాధ్యతను స్వీకరించిన ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీ అండ్ రిసర్చ్ ఇనిస్టిట్యూట్ డైరెక్టర్ డాక్టర్ ఏ. వి. యల్. నరసింహారావు గారికి వ్యక్తిగతంగానూ, ఆంధ్రభాషాభిమానులందరి తరఫునా కృతజ్ఞతలు.

నా కర్తవ్య నిర్వహణంలో నా యితర బాధ్యతలు తగ్గించి శ్రమించిన మా విద్యార్థులు చిరంజీవులు పి. శ్రీనివాసరెడ్డి ప్రభృతు లందరకూ ఆశీస్సులు.

అసలు గ్రంథంలో ప్రవేశించే ముందు - మానితపు నడక పేరిమి - మనుసంచలకు నీరసనీరము పోనిడి క్షీరము గొనుట సహజము రాదే ! అనే చిన్నయసూరి వచనం స్మరిద్దాం.

ఇట్లు
సుధీజన విధేయుడు
**అంబడిపూడి నాగభూషణం**

# సారస్వత

# త్రిలిఙ్గ శబ్దానుశాసనమ్

## అవతారికా

### అవిఘ్నమస్తు

1. కల్యాణాయతనం శ్రీమాన్ రుక్మిణీ వల్లభో మమ
ఆదిరస్తు పురః కృష్ణః శ్రేయసే యశసే శ్రియై॥

కల్యాణాయతనం = శుభములకు నిలయ మగువాఁడును, శ్రీమాన్ = శ్రీమతుఁడును, రుక్మిణీ వల్లభః = రుక్మిణీనాథుఁడును, ఆదిః = ఆదిభూతుఁడు నగు, కృష్ణః = శ్రీకృష్ణుఁడు, మమ = నాకు, శ్రేయసే = శుభములకును, యశసే = యశస్సునకును, శ్రియై = సంపదలకును గారణమగుచు, పురః అస్తు = ప్రత్యక్ష మయియుండుఁ గావుత.

గ్రంథారంభమున నిష్టదేవతా స్మరణము. గ్రంథకర్త యగు నృసింహకవి కృష్ణభక్తుఁడు 'కృష్ణభక్తస్సు మన్త్రవిత్' అని తన్నుగూర్చి పైని జెప్పుకొనును. కావున నిష్టదైవ మగు కృష్ణుని నుతించుచు గ్రంథారంభము చేయుచున్నాఁడు.

'కల్యాణాయతన' మ్మని మొట్టమొదటఁ గల్యాణ శబ్దముతో శుభారంభముతో గ్రంథమును 'మంగళాది'గాఁ గూర్చెను.

2. లక్ష్మీశ్శశ్వద్భవతు నకులీ శారదాయై నమోఽస్తు
శ్రీమల్లక్ష్మీ నృహరి విభవే దేవవర్యాయ తస్మై
కణ్వం శేషం కతితనుభవం రావణం పుష్పదన్తమ్
విష్ణుం చన్ద్రం సురగురుమహం సోమచన్ద్రం నమామి॥

ఇం దిష్టదేవతాస్తుతితోఁ బూర్వాచార్య నమస్కారమును గలిపి యొకే శ్లోకమున నిబంధించుట విశేషము. దీనిచేఁ బూర్వాచార్యులపై నిష్టదేవతాతుల్య మగు గౌరవము వ్యక్తము కాఁగలదు.

లక్ష్మీః = సంపద, శశ్వత్ = నిరంతరముగా, భవతు = కలుగును గావుత.

నకులీ శారదాయై = వాగేశ్వరీ మంత్రాధిష్ఠాత్రి యగు సరస్వతీదేవికి, నమః అస్తు = నమస్కారము, దేవవర్యాయ = దేవతలలో శ్రేష్ఠుఁడగు, తస్మై = ఆ, శ్రీమల్లక్ష్మీనృహరివిభవే = శ్రీమంతుఁ డగు లక్ష్మీనృసింహ విభునకు, నమః అస్తు = నమస్కారము.

ఇష్టదేవతా ప్రార్థనమునకుఁ బిదపఁ బూర్వపండిత నమస్కృతి.

అహమ్ = నేను, కణ్వమ్ = కణ్వుని, శేషమ్ = శేషుని, కతితనుభవమ్ = కాత్యాయనుని, రావణమ్ = రావణుని, పుష్పదన్తమ్ = పుష్పదంతుని, విష్ణుమ్ = విష్ణుని, చన్ద్రిమ్ = చంద్రుని, సురగురుమ్ = బృహస్పతిని, సోమచన్ద్రిమ్ = సోమచంద్రుని నమామి = నమస్కరింతును.

కణ్వుఁడు మొదలగు పూర్వాంధ్ర లాక్షణికులకుఁ గవి నమస్కారము చేయుచున్నాఁడు.

3. బార్హస్పత్యమ్ రావణీయమ్ కాణ్వ మాథర్వణం విదన్
   కరోమి సారస్వత త్రిలిఙ్గ శబ్దానుశాసనమ్ ॥

బార్హస్పత్యమ్ = బృహస్పతి కృత మగు నాంధ్ర లక్షణ గ్రంథమును, రావణీయమ్ = రావణుఁడు రచించిన వ్యాకరణమును, కాణ్వమ్ = కణ్వుఁడు విరచించిన శబ్ద శాస్త్రమును, ఆథర్వణమ్ = అథర్వణుఁడు చేసిన త్రిలింగ శబ్దానుశాసనమును, విదన్ = తెలిసి, సారస్వత త్రిలిఙ్గ శబ్దానుశాసనమ్ = 'సారస్వత త్రిలింగ శబ్దానుశాసనము' అను నాంధ్ర లక్షణ గ్రంథమును, కరోమి = రచించుచున్నాను.

4. నకులీ శారదాదేవీ కటాక్షామృత వర్ధితః
   దిగన్తర పరివ్యాప్త కీర్తి జ్యోత్స్నా విరాజితః ॥

నకులీ శారదాదేవీ కటాక్షామృత వర్ధితః = వాగేశ్వరీ మంత్రాధిష్ఠాత్రి యగు వాగ్దేవి యొక్క కటాక్ష మనెడు నమృతముచే వర్ధిల్లినవాఁడును, దిగన్తర పరివ్యాప్త కీర్తి జ్యోత్స్నా విరాజితః = అన్ని దిక్కుల నడుమ నంతటను వ్యాపించిన కీర్తి యనెడు వెన్నెలచేఁ బ్రకాశించువాఁడును (తరువాతి పద్యములోని కన్వయము)

'నకులి' వాక్ స్తంభనకరియగు విద్యయని యెందుము.

5. సుకరో వేంగి నాటీయః కృష్ణభక్తస్సుమన్త్రవిత్
ధన్యస్సహస్రావధానీ హ్యష్టభాషా సరస్వతిః ॥

సుకరః = పుణ్యాత్ముఁడును, వేంగినాటీయః = వేంగినాటి శాఖకుఁ జెందినవాఁడును, కృష్ణభక్తః = శ్రీ కృష్ణభక్తుఁడును, సుమన్త్రవిత్ = మంత్రవేత్తయు, ధన్యః = ధన్యుఁడును, సహస్రావధానిః = సహస్రావధానియును, అష్టభాషా సరస్వతిః,హి = (సంస్కృతమును, షడ్విధప్రాకృతములు, నాంధ్రము నను) ఎనిమిది భాషలయందును సరస్వతియగు నట్టివాఁడును-

6. శ్రీ కామదేవ మిశ్ర ద్విరద దన్తావళద్విషః
శ్రీ గోపినాథ మిశ్రేంద్రప్రియమిత్రస్య ధీమతః ॥

ఇట నృసింహకవి తన ముత్తాతను గూర్చి విపులముగాఁ జెప్పుచున్నాఁడు.

శ్రీ కామదేవ... ద్విషః = శ్రీయుతుఁడగు కామదేవ మిశ్రుఁడను మత్తగజమునకు సింహమును, (కామదేవ మిశ్ర నేదేని వివాదమున జయించియుండును) శ్రీ గోపినాథ ...మిత్రస్య = శ్రీయుతుఁడగు గోపినాథ మిశ్రునకు నిష్ట సఖుఁడును, ధీమతః = బుద్ధిశాలియును

(తరువాతి పద్యములోని కన్వయము)

7. శ్రీమతో వేఙ్కటపతిరాయవిద్యాగురోః ప్రభోః
అవతారస్యవాల్మీకే రంశస్యచబృహస్పతేః ॥

ప్రభోః = ప్రభువగు, శ్రీమతః = శ్రీమంతుఁడైన, వేఙ్కటపతిరాయవిద్యాగురోః = వేంకటపతిరాయులకు విద్యాగురువును (చదువుచెప్పినవాఁడును) వాల్మీకేః = వాల్మీకి మహర్షియొక్క, అవతారస్య = అవతారమయినవాఁడును, బృహస్పతేఃచ = బృహస్పతి యొక్క,అంశస్య = అంశయయినవాఁడును,(రామానుజాచార్యుఁడు వాల్మీకి బృహస్పతుల లక్షణములు గలవాఁడని యర్థము. వీరు వ్యాకర్తలగుదురేమో- మీఁద పద్యములోని కన్వయము. )

8. వాక్పతే రుత్తరమణి సారగ్రన్థ కృతో నిధేః
సతాం రామానుజాచార్య దిగ్గజస్య మహాకవేః ॥

వాక్పతేః = సరస్వతీనాథుని వంటివాఁడును, ఉత్తరమణి సారగ్రన్థకృతః = 'ఉత్తరమణిసార'మను గ్రంథమును రచించినవాఁడును, సతాం నిధేః = సద్గుణము

లకు నిధియును, మహాకవేః = మహాకవియును అయిన, రామానుజాచార్య దిగ్గజస్య = రామానుజాచార్యుఁడను దిగ్గజమునకు (పై పద్యములోని కన్వయము - ఇంతఃపూర్వము చెప్పిన విశేషణములన్నియు నీ రామానుజాచార్యునకు సంబంధించినవి).

9. ప్రపౌత్రో వేఙ్కటాద్ర్యార్య సూరే ర్నప్తా విపశ్చితః
శ్రీ వేఙ్కటాచార్యమణేః పౌత్రః కాశ్యపగోత్రవాన్ ॥

ప్రపౌత్రః = (రామానుజాచార్యులకు) మునిమనుమఁడును, వేఙ్కటాద్ర్యార్యసూరేః = వేంకటాద్రి సూరికి, నప్తా = మనుమని కొడుకును, విపశ్చితః = పండితుఁడైన, శ్రీవేఙ్కటాచార్యమణేః = వేంకటాచార్యునకు, పౌత్రః = మనుమఁడును, కాశ్యపగోత్రవాన్ = కాశ్యప సగోత్రుఁడును (తరువాత పద్యములోని కన్వయము).

10. నాంచారమాంబా తనయ స్సూను ర్వరదయజ్వనః
లక్ష్మీనృసింహ సుకవిరాజోహం[1] మండవంశజః ॥

నాంచారమాంబా తనయః = నాంచారమ్మకుఁ గొడుకును, వరదయజ్వనః = వరదయజ్వకు, సూనుః = పుత్రుఁడును, మండవంశజః = మండ వంశమునందు జనించినవాఁడును అగు, అహం = నేను, లక్ష్మీనృసింహసుకవిరాజః = 'లక్ష్మీనృసింహ కవి' యనువాఁడను

ఇందు గ్రంథకర్త స్వవిషయములు వివరించెను. గ్రంథకర్త 'మండ' వంశము నందు జన్మించెను. పేరు లక్ష్మీనృసింహకవి. సహస్రావధాని యగుట, అష్ట భాషా సరస్వతి యగుట మొదలగు నీతని విశిష్ట లక్షణములు పూర్వోక్తములు.

నృసింహకవి తల్లి పేరు నాంచారమ్మ. తండ్రి వరదయజ్వ. వరదయజ్వ తండ్రి (నృసింహకవి తాత) వేంకటాచార్యుఁడు. వేంకటాచార్యుని తండ్రి (నృసింహకవి తాత యొక్క తండ్రి) వేంకటాద్రి సూరి. వేంకటాద్రి సూరి యొక్క తండ్రి పేరు రామానుజాచార్యుఁడు. ఈ రామానుజాచార్యుఁడు ఉత్తరమణిసార మను గ్రంథమును రచించెను. వేంకటపతిరాయలచే విద్యా నేర్పినవాఁడు. గోపీనాథ మిశ్రునకు మిత్రుఁడు. కామదేవ మిశ్రుని జయించినవాఁడు.

ఇట్లు రాజగురువాదిగాఁ బ్రసిద్ధిని గనుటచే నృసింహకవి రామానుజాచార్యుల నుండి తన వంశమును బ్రస్తావించె ననవచ్చును.

---

1. సుకవీరాజతే అని ఆం. కౌ. పాఠము. అవ. 3 శ్లో.

ఇష్టదేవతాస్తుతి, పూర్వపండిత నమస్కృతి, స్వీయకృతి, వంశచరిత్రల వర్ణనములకుఁ బిదప నింకఁ దన గ్రంథవిషయమునకుఁ బ్రవేశికగా నాంధ్రభాషాస్థితిని గూర్చి నృసింహకవి ప్రస్తావించుచున్నాఁడు.

వ॥ [1]పూర్వమేవాంధ్ర భాషోత్పత్తిర్భగవద్భిః కణ్వపుష్పదన్త సోమచన్ద్ర రావణ నిర్జరాచార్యాదిభిర్మహర్షిభి[2]ర్భగవతా వాల్మీకినా చ ప్రోక్తా ప్రాకృతాదిషు :-

మహాత్ము లగు, కణ్వుఁడు, పుష్పదంతుఁడు, సోమచంద్రుఁడు, రావణుఁడు, బృహస్పతి, వాల్మీకి మొదలగు మహర్షు లాంధ్రభాష యుద్భవించిన విధానమును గూర్చి ప్రాకృతాదుల సందర్భమున నింతకు మునుపే పేర్కొనియున్నారు.

ఈ గ్రంథము లేయవియు లభ్యములు గామిఁ దత్స్వరూపము నిరూపింప వీలు చిక్కదయ్యె.

వ॥ కిఞ్చ - రావణీయే.

ఇంక రావణుని గ్రంథమునందు (ఆంధ్రభాషోత్పత్తి ప్రకార మిట్లు చెప్పబడి యున్నది.)

11. ఆంధ్రనాథో మహావిష్ణుర్నిశుంభదనుజాపహః
పురా స్వాయంభువమనోః కాలే కలియుగే హరిః[3] ॥

పురా = పూర్వము, కలియుగే = కలియుగము (నారంభము) నందు, స్వాయంభువమనోః కాలే = స్వాయంభువమనువు కాలమున, నిశుంభదనుజాపహః = నిశుంభుఁ డను రాక్షసుని సంహరించిన వాఁడును, ఆంధ్రనాథః = ఆంధ్రులకు (ఆంధ్రదేశమునకు) నాయకుఁడును, హరిః = హరియు నయిన, మహావిష్ణుః = శ్రీమహావిష్ణువు (తరువాతి పద్యములోని కన్వయము)

1. ఆం. కౌ. (ప్రారంభం) ఈ కథాభాగము ఆం. కౌ. లోఁ గూడఁగలదు.
2. ఏతద్వాల్మీకి నా ప్రోక్తం ప్రాకృతాశాచ. వస్తుతః (అ. త్రి. శ. 3. 1).
3. త్రి. శ. 3. కాం. 2. శ్లో.

12. కాకులే రాజవర్యస్య సుచన్ద్రస్య తనూభవః
[1]అభవత్ సర్వ[2]దేవైశ్చ వేష్టితో లోకపూజితః[3] ॥

లోకపూజితః = లోకములచేఁ బూజింపఁబడువాఁడును, సర్వదేవైశ్చ = ఎల్ల సురలచేతను, వేష్టితః = సేవింపఁబడువాఁడునయి, కాకులే = శ్రీకాకుళమునందు, రాజవర్యస్య = రాజులలో శ్రేష్ఠుఁడైన, సుచన్ద్రస్య = సుచంద్రునకు, తనూభవః = కొడుకు, అభవత్ = అయ్యెను.

శ్రీ మహావిష్ణువు ఆంధ్రదేశమున శ్రీకాకుళమునను రాజగు సుచంద్రునకుఁ గొడుకుగాఁ బుట్టెను.

13. శ్రీశైల భీమ కాళేశ మహేంద్రగిరి సంయుతమ్
ప్రాకారం సుమహత్ కృత్వా త్రీణి ద్వారాణి చాకరోత్ ॥ [4]

శ్రీశైల.... సంయుతమ్ = శ్రీశైలమును, భీమేశ్వరగిరియు, కాళేశ్వరాచలమును, మహేంద్ర పర్వతమును గలిగియున్నట్లుగా, సుమహత్ = మిక్కిలి గొప్ప దగు, ప్రాకారం = ప్రాకారమును, కృత్వా = నిర్మించి, ద్వారాణి చ = ఆ ప్రాకారమునకు ద్వారములను గూడ, త్రీణి = మూడింటిని, అకరోత్ = ఏర్పఱచెను.

అతఁడు శ్రీశైలము, భీమేశ్వరము, కాళేశ్వరము, మహేంద్రగిరి యను నాలుగును గలియునట్లుగా నాంధ్రదేశమునకుఁ బెద్ద ప్రాకారమును గట్టించి దానికి మూఁడు ద్వారము లేర్పఱచెను.

14. త్రిలోచనః[5] స్వన్మహేశ త్రిశూలం చ కరే ధృతః
త్రిలిఙ్గరూపేణావసత్త్రి ద్వారేషు గణైర్వృతః ॥

---

1. ప్రభవత్ - అని అ. త్రి. శ. పాఠము.
2. దేవైశ్చ (ఆం. కౌ.) దేవేశులలో నని యిప్పక్షమున నర్థము.
3. త్రి. శ. 3.
4. త్రి. శ. 3, 4.
5. 'శర్వో' అను వ్రాఁతప్రతి యందలి పాఠమున గణభంగము సన్. త్రి. శ. 3, 5.

మహేశః = పరమేశ్వరుఁడు, త్రిలోచనః = మూఁడు నేత్రములు గలవాఁడును, కరే = చేత, త్రిశూలమ్ = త్రిశూలమును, ధృతః చ = ధరించినవాఁడును, సన్ = అయి, గణైః = ప్రథమ గణములచే, వృతః = పరివేష్ఠింపఁబడినవాఁడగుచు, త్రిలింగ రూపేణ = మూఁడులింగములుగా, త్రిద్వారేషు = ఆ మూఁడు ద్వారములయందు, అవసత్ = నివసించెను.

శ్రీశైలాది పర్వతములను గలుపుచు గట్టిన ప్రాకారమునకు నేర్పఱచిన మూఁడు ద్వారములందును లింగరూపమున శివుఁడు త్రినేత్రుఁడును, త్రిశూలహస్తుఁడును ప్రమథగణ పరివృతుఁడు నయి నివసించుచుండెను.

(ఇట్లాంధ్రదేశమునకు ద్వారములయిన మూఁడుచోట్ల త్రిలింగము లుండుటచే నీదేశము త్రిలింగదేశ మయిన దన్నమాట.)

15. ఆంధ్ర విష్ణు స్సురయుతో దనుజేన నిశుంభునా
యుద్ధ్వా త్రయోదశయుగాన్ హత్వాతం రాక్షసోత్తమమ్॥ [1]

సురయుతః = దేవతలతోఁ గూడియున్న, ఆంధ్రవిష్ణుః = ఆ ఆంధ్రవిష్ణువు (ఆంధ్ర రాష్ట్రై పుట్టిన శ్రీ మహావిష్ణువు) దనుజేన = రాక్షసుఁడగు, నిశుంభునా = నిశుంభునితో, త్రయోదశయుగాన్ = పదమూఁడు యుగముల కాలము, యుద్ధ్వా = యుద్ధము చేసి, తమ్ = ఆ, రాక్షసోత్తమమ్ = గొప్ప రాక్షసుని, హత్వా = సంహరించి (తరువాతి పద్యములోని కన్వయము).

దేవ సైన్యముతోఁ గూడిన యా యాంధ్ర విష్ణువు రాక్షసుఁ డగు నిశుంభునితో పదమూఁడు యుగములు యుద్ధము చేసి యా నిశుంభుని సంహరించెను.

16. అవసత్తత్ర ఋషిభిర్యుతో గోదావరీ తటే
తత్కాల ప్రభృతి క్షేత్రం త్రిలిఙ్గమితి విశ్రుతమ్॥ [2]

తత్ర = అచట నిశుంభుని సంహరించిన పిదప (నా త్రిలింగవృత దేశమునందు) ఋషిభిఃయుతః = ఋషులతోఁ గలిసి, గోదావరీ తటె = గోదావరి యొడ్డున, అవసత్ = (ఆంధ్రవిష్ణువు) నివసించెను.

---

1. త్రి. శ. 3, 6.
2. త్రి. శ. 3. 7.

తత్కాల ప్రభృతి = ఆ సమయము మొదలుకొని, క్షేత్రమ్ = ఆ పుణ్యప్రదేశము, త్రిలిఙ్గమ్ ఇతి = త్రిలింగము అనుపేర, విశ్రుతమ్ = ప్రసిద్ధ మయ్యెను.

ఆంధ్రవిష్ణువు నిశుంభుని జంపిన పిదప నా గోదావరీనది యొడ్డున (నిశుంభుని గోదావరీ తటమున సంహరించె నని యభిప్రాయము) ఋషులతోఁ గలిసి నివసించెను. అప్పటినుండియు నా ప్రాంతమునకు 'త్రిలింగము' అను పేరు ప్రసిద్ధ మయ్యెను.

17. తత్రత్యా స్తత్సమాలాపా స్తత్కాలీనా హరే ర్భటాః
కాలేన మహతా సర్వం తత్సమమ్ స్వల్పబుద్ధిభిః ॥ [1]

తత్కాలీనాః = ఆ కాలమునందలి, హరేఃభటాః = శ్రీ మహావిష్ణువు యొక్క బంట్లు, తత్రత్యాః = ఆ త్రిలింగదేశమునం దున్నవా రయి, **తత్సమాలాపాః** = అచ్చోటి యాంధ్రులతో సమ మయిన భాషను గలిగిరి, మహతాకాలేన = ప్రాచీన కాలము నుండియు, సర్వమ్ = అట్లు హరిభటులు త్రిలింగదేశ జనులతో సమముగా భాషించుటచే నేర్పడిన భాష మొత్తము, తత్సమమ్ = తత్సమ మను పేరు గల్గిన దైనది. (ఇతి సమ్మతిః- అను తరువాతి శ్లోకమున నన్వయము)

శ్రీ మహావిష్ణు వాంధ్రదేశమున నివసించిన కాలమునం దచ్చట నున్న హరిభటు లా ప్రాంతమునందలి యాంధ్రులతో సమముగా భాషించిరి. అట్లేర్పడిన భాష తత్సమ మైనది.

హరి భటులు దేవతలు. దేవతల భాష సంస్కృతము. ఆ సంస్కృతమును వా రాంధ్రులతో సమముగా ననఁగా నాంధ్రముతో సమముగా బలికిరి. ఇట్లు తెలుఁగుతో సమాన మ ఏచు నేర్పడిన సంస్కృతము తత్సమ మైనది.

ఇట్లు తత్సమ మనఁగా సంస్కృతసమము మాత్ర మని యర్థ మైనది.

'స్వల్పబుద్ధిభిః' లను నీ శ్లోకము తుది పదమునకుఁ దరువాతి శ్లోకముతో నన్వయము.

18. అస్ఫుటేనోచ్చారితాని తద్భవానీతి సమ్మతిః
వికర్ష వ్యత్యయాభ్యాం చ పాదార్థోక్తి విశేషతః [2] ॥

1. త్రి. శ. 3. 8.
2. త్రి. శ. 3. 9.

స్వల్పబుద్ధిభిః = అల్పబుద్ధు లగు హరిభటులు కొందఱిచే, అస్ఫుటేన = అస్పష్టముగా, ఉచ్చారితాని = పలుకఁబడిన వగు శబ్దములు, తద్భవాని ఇతి = తద్భవములు అనుట, సమ్మతిః = అంగీకరింపబడుచున్నది.

హరిభటులలో నల్పబుద్ధులగు కొంద అస్పష్టముగా నుచ్చరించుటచే నేర్పడిన శబ్దములకుఁ దద్భవములని ప్రసిద్ధి.

వికర్ష వ్యత్యయాభ్యాంచ = వికర్షముచేతను, వ్యత్యయముచేతను, పాద అర్థఉక్తి విశేషతః = శబ్దమున నాలుగవ భాగము, లేదా సగము మొదలగు రీతిగా నుండుట మొదలగు విశేషములను బట్టియు- తరువాతి పద్యములోని కన్వయము.

పాద, అర్థ, ఉక్తి విశేషములో శబ్దమునందుఁ గొన్ని యక్షరములు లోపించుట యుద్దేశము గావచ్చును. 'పాదోనస్యా విశేషతః' అని ప్రాంత ప్రతిలోని పాఠము. కాని యథర్వణుని గ్రంథమునను, నృసింహకవిదే యగు నాంధ్రకౌముది యందును 'పాదార్థోక్తి విశేషతః' అను పాఠమే కాననవును.

19. తద్భవాశ్చేతి కథ్యన్తే కాలేన మహతా వృతాః
బ్రహ్మణా నిర్మితా వాచః పూర్వమాంధ్రేశితుర్హరేః ॥ [1]

20. అచ్చా ఇతి చ కథ్యన్తే సుప్తిజ్[2] ధాతుసమన్వితాః ॥ [3]

(మహతా కాలేన = మిక్కిలి కాలముచే, ఆవృతాః = వ్యాపించి సట్టి శబ్దములును) తద్భవాః ఇతి = తద్భవములు అని, కథ్యన్తే = చెప్పఁబడుచున్నవి.

వికర్ష, వ్యత్యయము, వర్ణలోపము మొదలగు విశేషములతో (చాలకాలమున) నేర్పడిన శబ్దజాలమునుకుఁ దద్భవము లని పేరు.

ఇవియును నల్పబుద్ధు లగుహరిభటు లనఁగా దేవతల యుచ్చారణమున నేర్పడినవే అనఁగా సంస్కృతమునుండి యేర్పడినవే. తద్భవములు సంస్కృతోద్భవములే యని యభిప్రాయము.

---

1. ఆంధ్రేశితుర్వరైః-అని వ్రాతప్రతి
2. సువ్వృకృత్-అని ఆం. కౌ. పాఠము. సుప్కృత్-కావచ్చును
3. త్రి. శ. 3, 10, 11

విసర్గ యను హల్సంయోగమునకు నడుమ నచ్చుచేరి హల్లులు వేరుగా నిలుచుట నిద్ర-నిదుర మొ॥ వ్యత్యయ మనఁగా వర్ణములు ముందు వెనుక లగుట.

ఆంధ్రే ఈశితుః = ఆంధ్రరాజును, హరేః = విష్ణువుకొఱకై,
పూర్వమ్ = పూర్వకాలమున (హరిభటుల రాకకుఁ బూర్వము)

(అనఁగా మిక్కిలి ప్రాచీన మని యర్థము). బ్రహ్మణా = బ్రహ్మచే, నిర్మితాః = సృష్టింపఁబడిన, సుప్ తిఙ్ ధాతు సమన్వితాః వాచః = ప్రథమాది నామ విభక్తులతోను, క్రియావిభక్తులతోను ధాతువులతోను గూడినట్టి శబ్దజాలము, అచ్చాః ఇతి చ = 'అచ్చ' శబ్దము లని, కథ్యన్తే = చెప్పఁబడుచున్నవి.

ఆంధ్ర విష్ణువు కొఱకై ఎంతోకాలము ముందే బ్రహ్మదేవుఁడు నామవిభక్తులు క్రియావిభక్తులు ధాతువులు గలిగిన శబ్దములను సృష్టించెను. దీనినే పండితులు 'అచ్చ' యని యందురు.

ఇది పూర్వమె బ్రహ్మచే సృష్టింపఁబడిన దనుటలో నాంధ్రభాష ప్రాచీనతతో పాటు ప్రామాణ్యమును గూడఁ బేర్కొనుట యుద్దేశము. హరిభటు లాంధ్రదేశమునకు రాకపూర్వమె యీభాష యీదేశమున నున్నది. సంస్కృత సంబంధ మేర్పడక మునుపటి సహజ మగుభాష యచ్చ యనఁబడును.

ఇట్లు మొత్తముపైఁ దెలుఁగుభాష తత్సమము తద్భవము అచ్చ యని మూఁడు తెఱఁగులుగా వింగడింపఁబడియున్నది.

మొట్టమొదట నున్నది సంస్కృతముతో సంబంధము లేనిది. (నేఁడు దేశ్య ముగాఁ జెప్పబడునదియు ననవచ్చు.)

అచ్చ = అచ్చ తెనుఁగు.

సంస్కృతముతో సమాన మైనది తత్సమము. పెక్కు వర్ణ వికారములతో సంస్కృతమునుండి యేర్పడినది తద్భవము.

కేవలము సంస్కృతముతోడి సంబంధము మాత్రమే చెప్పఁబడుటలోఁ బ్రాకృత ప్రభావము కారణము గానోవును. ప్రాకృతమునకుఁ బూర్వము సంస్కృతమె కావున ప్రాకృత లాక్షణికులు సంస్కృతేతర భాషా ప్రసక్తి తేరు. కాని తెలుఁగునకు బూర్వము సంస్కృత మొక్కఁడే గాక ప్రాకృతమునుఁ గలదు. ఈ లాక్షణికులు ప్రాకృత వ్యాకరణమునను బండితులే. తెలుఁగుపై గల ప్రాకృత ప్రభావమును గుర్తింపకుందురా ? ప్రాకృత సమభవములును, సంస్కృత భవములుగాఁ దలఁచి రేమో, ఇదియు నొక మతమె.

ఈ శ్లోక మన్వయ మించుక మాఱినఁ దద్భవములకు నచ్చ సంజ్ఞ సిద్ధించు. సంస్కృత సమేతర మెల్ల నచ్చయగు. ఇతి-

అని - పైరీతిగా నాంధ్రభాషోత్పత్తి ప్రకారమున రావణుఁడు[1] పేర్కొనెను.

**యుదాహ కణ్వః**

కణ్వః యత్ ఆహ = ఇటఁ గణ్వుఁ డేమి పల్కె ననఁగా—

21. **అంధ్రసంస్కృతభాషాస్తు దేవతానాం ప్రమోదకాః**
**సుబన్తైశ్చ కృదన్తైశ్చ యుక్తా స్స్వర్గప్రదా నృణామ్[2] ॥**

**ఇతి—**

ఆంధ్ర సంస్కృత భాషాః తు = ఆంధ్ర, సంస్కృత వాక్కులు, దేవతా నాం = దేవతలకు, ప్రమోదకాః = సంతోషమును గూర్చునవి.

తుశబ్ద మేవార్థకముగా గ్రహించిన (దేవతానాం ప్రమోదకాః ఆంధ్ర సంస్కృత భాషాస్తు) దేవతలను సంతసింపఁజేయు నవాంధ్ర సంస్కృత భాషలు మాత్రమే యని యర్థ మగును. పూర్వము పేర్కొనఁబడిన యాంధ్రభాషోత్పత్తి ప్రకారము ననుస రించి హరిభటు లనఁగా దేవతలు. సంస్కృతమును దెలుఁగుగా వ్యవహరించుటచేఁబట్టి వారికిఁ దెలుఁగు భాష ప్రమోదము నిచ్చునది యని గ్రహింపనగును. 'ఆంధ్రసంస్కృత భాషాస్తు' అని యాంధ్రమును ముందుగనె పేర్కొనుటలో దేవతలకు సంస్కృతము కంటె నాంధ్రము ప్రథమప్రమోదస్థాన మనుటయు నుద్దేశము గావచ్చును.

ఇంక నివి దేవతలకుఁ బ్రమోదము నిచ్చుటకుఁ గారణమై యున్నట్లుగా నొక్క యంశము చెప్పఁబడుచున్నది.

సుబన్తైః చ = ప్రథమ మొదలగు నామ విభక్తులు గల శబ్దములతోను, కృదన్తైః చ = కృత్ప్రత్యయములు గల శబ్దములతోను, యుక్తాః = కూడినవగుచు (ఆంధ్ర సంస్కృత భాషలు), నృణామ్ = మానవులకు, స్వర్గప్రదాః = స్వర్గమును గల్గించును. (ఇతి - అని కణ్వుఁడు చెప్పెను).

---

1. ఆం. కౌ. కిఞ్చ రావణీయే—యని యారంభించి యీ వృత్తాంతమును జెప్పినది.
2. త్రి. శ. 4. 14. ఆం. కౌ.

ఈ లోకమున స్వర్గసుఖములను బిదప స్వర్గమనఁగా దేవత్వమును నీ భాషలు గల్గించును. అందుకే దేవతల కీభాష యిష్ట మేమో. మొత్తముపై సుబంత త్వము, కృదంతత్వము (మొ॥) నీ భాషల విశిష్ట లక్షణముగాఁ జెప్పట యిట సారాంశము గావలెను.

కణ్వుఁ డిట్లు తెలుఁగు భాషాప్రాశస్త్యమునుఁ బ్రస్తావింపఁగా -

వ॥ కిఞ్చ భగవతా భాష్యకారేణాక్షేపః 'కృతః త్రిలిఙ్గభాషాయాః కో ధాతుః, కః ప్రత్యయః, కిం ప్రాతిపదికమ్' ఇతి—

కిఞ్చ = అయిన, భగవతా = భగవానుఁడగు, భాష్యకారేణ = మహాభాష్యకర్త పతంజలి మహర్షిచే, ఆక్షేపః కృతః = ఒక యాక్షేపము చేయఁబడినది. ఏ మని ?

త్రిలిఙ్గభాషయాః = తెలుఁగుభాషకు, ధాతుః కః=ధాతు వేది? ప్రత్యయః కః = ప్రత్యయ మేది? ప్రాతి పదికం కిమ్ = ప్రాతిపదిక మేది? ఇతి = అని (పతంజలి తెలుఁగుభాష నాక్షేపించెను.)

తెలుఁగు భాషకుఁ బ్రకృతి ప్రత్యయవిభాగమె లేదని పతంజలిమహర్షి యాక్షే పించెను.

అట్టియెడల కణ్వుఁడు 'సుబన్తైశ్చ కృదన్తైశ్చ యుక్తాః' అని ప్రాతిపదికలు నామ విభక్తులు ధాతువులు గల వని చెప్పుట యెట్లు పొసఁగును? అనఁగా-

వ॥ కణ్వస్తు యదాహ—

కణ్వః తు యత్ ఆహ = (పై పతంజలి యాక్షేపమునుగూర్చి కణ్వమహర్షి యే మనియె ననఁగా)

వ॥ శ్రుత్యాది సమ్మతత్వాచ[2] త్రిలిఙ్గభాషాయాస్తు ప్రత్యయ ప్రాతిపదికాని సన్త్యేవ।

శ్రుత్యాది సమ్మతత్వాచ = శ్రుతి మొదలగు వాని యంగీకారము ననుసరించి తెలుఁగుభాషకుఁ బ్రత్యయము ప్రాతిపదికము నన్నవి కలవు.

---

1. త్రి. శ. 4-15.
2. త్రి. శ. 4. 16

వ॥ ఇత్యుక్త్వా పునశ్చ —

అని పేర్కొని మఱలఁ గణ్వుఁ డిట్లనెను

వ॥ 'యో దేవతాంశ జో విప్ర స్సంస్కృత కవిర్భవేత్।
ఋష్యంశజాతో యో విప్రస్త్రిలిఙ్గ కవిర్భవేత్' ఇతి

యఃవిప్రః = జ్ఞానియగువెవ్వఁడు, దేవతాంశజః = దేవతాంశచేఁ బుట్టునో, సః=వాఁడు, సంస్కృత కవిః భవేత్ = సంస్కృత భాషయందుఁ గవి యవును, యోవిప్రః = జ్ఞానియగు వాఁడెవ్వఁడు, ఋష్యంశజాతః = ఋషులయంశతో జన్మించునో, సః=వాఁడు, త్రిలిఙ్గకవిః భవేత్ = తెలుఁగుభాషయందుఁ గవి యగును. ఇతి= అని (కణ్వుఁడు పేర్కొనెను).

వ॥ కాత్యాయనః

కాత్యాయనుఁ డీయంశమున నిట్లు పేర్కొనెను.

22. ఆంధ్ర సంస్కృత భాషే ద్వే సర్వభాషాసు చోత్తమే।
తాభ్యాం కవిత్వం యః కుర్యాత్స కవిర్యాతి చామృతమ్॥

సర్వభాషాసుచ = భాషలన్నింటియందును, ఆంధ్ర సంస్కృత భాషే = ఆంధ్రభాషయును, సంస్కృత భాషయును, ద్వే = రెండే, ఉత్తమే=ఉత్తమములు, యః = ఎవఁడు, తాభ్యామ్ = ఆ ఆంధ్ర సంస్కృతములతో, కవిత్వమ్ = కవిత్వమును, కుర్యాత్ = నిర్మించునో, సః=ఆ, కవిః=కవి, అమృతం యాతి = అమరత్వమును బొందును (భావప్రధాన ప్రయోగము).

భాష లెన్నియున్న నన్నింట నాంధ్ర సంస్కృతములు రెండే యుత్తమములు. ఆ భాషలలో గవిత చెప్పగలిగిన కవి యమరుఁ డగును.

ఆంధ్ర సంస్కృతభాషే యనుచోట ద్వివచనము చేతనే సిద్ధించుచున్నను మఱల 'ద్వే' యని పేర్కొనుటచే నితర మగు భాష యెద్దియును నాంధ్రసంస్కృతములవలె నుత్తమము గాదని చెప్పుటను దృఢము చేయునట్లు చెప్పఁదగును.

వ॥ అథర్వణ శాఖోపనిషది "[1]త్రిలిఙ్గానాం సంస్కృతాంధ్ర ప్రాకృతాస్తు ప్రియంకరాః" ఇతి—

1. 'త్రిమూర్తీనా'మ్మని త్రి. శ. లో (5. 1.), ఆం. కౌ. పాఠము నాదియై బ్రహ్మ విష్ణు మహేశ్వరులకుఁ గ్రమముగా సంస్కృతాంధ్ర ప్రాకృతములు ప్రియంకరములుగాఁగా (ఆంధ్ర) విష్ణువున కాంధ్రబాష యిష్ట మని భావము గావచ్చు.

అధర్వణశాఖకుఁ జెందిన యుపనిషత్తున[1]—

త్రిలిఙ్గానామ్ = త్రిలింగదేశ జనులకు (తెలుఁగువారికి) సంస్కృతాంధ్ర ప్రాకృతాః తు = సంస్కృతము, ఆంధ్రము, ప్రాకృతము నను భాషలు, ప్రియం కరాః = ఇష్టములు, ఇతి = అని చెప్పబడినవి.

ఇందుఁ బ్రాకృతముగూడఁ దెలుఁగువారి కిష్టమగుట చెప్పఁబడినది. ఈ ఇష్టము తెలుఁగువారికి సంబంధించిన దగుట గమనింపఁ దగును.

వ॥ ధర్మరాజః—

ఈ విషయమున ధర్మరా జిట్లు పేర్కొనెను.

23. [2]బ్రాహ్మ్యం జన్మసు దేశేషు త్రిలిఙ్గం దైవతం హరిః
రాజా కురూద్భవో భాషా సంస్కృతాంధ్రమయీ భువి ॥

ఇతి—

భువి = ఈ భూమిపైని, జన్మసు = పుట్టుకల యందు, బ్రాహ్మ్యమ్ = బ్రాహ్మణత్వమును, దేశేషు = దేశములయందు, త్రిలిఙ్గమ్ = త్రిలింగమును, (ఉత్తమములు) దైవతమ్ = దైవము, హరిః = హరియే (దైవములలో హరియే శ్రేష్ఠుఁడు) రాజా = రాజు, కురూద్భవః = కురువంశమునందు బుట్టినవాఁడు, (రాజులలో ధర్మరాజు శ్రేష్ఠుఁడు) భాషా = భాష, సంస్కృతాంధ్రమయీ = సంస్కృతాంధ్రములు గూడినది, (భాషలలో సంస్కృతాంధ్రమయ మగు తెలుఁగుభాష శ్రేష్ఠము. ఇతి = అని, (ధర్మ రాజు పేర్కొనెను).

ఇందుఁ ద్రిలింగదేశము, తెలుఁగుభాష విశిష్టములని ధర్మరాజు వాక్యములలోఁ బ్రస్తుతాంశము.

వ॥ రావణః—

రావణుఁ డిట్లు పేర్కొనెను.

24. ఆంధ్రసంస్కృతభాషాభ్యాం కవిత్వమృషితాప్రదమ్[2].

ఆంధ్ర సంస్కృత భాషాభ్యామ్ = ఆంధ్రభాషతోను, సంస్కృత భాషతోను, కవిత్వమ్ = కవనము, ఋషితాప్రదమ్ = కవికి ఋషిత్వమును గల్గించు.

---

1. ఆ. త్రి. శ. 5. 2. ఆం. కౌ.

1. ఇది కవ్యోక్తముగా త్రి. శ. లో (4-16) ఆం. కౌ.

సంస్కృతమునను, దెలుఁగునను గవిత్వము చెప్పఁగల్గుటవలన నాకవి ఋషి యగు నని రావణుఁడు చెప్పెను.

వ॥ స్మృతిస్తు 'నాఽనృషి కురుతే కావ్య'మితి[1]

స్మృతిః తు = స్మృతి యన్నచో, అనృషిః = ఋషి గానివాఁడు, కావ్యమ్ = కావ్యమును, న కురుతే = చేయలేఁడు. ఇతి = అని పేర్కొనుచున్నది.

ఋషి గానివాఁడు కావ్యమును నిర్మింపలేఁడనఁగా ఋషియె కావ్య నిర్మాత యగును. సంస్కృతాంధ్రములఁ గవిత చెప్పఁ గలుగుట వలన ఋషిత్వముగలుగు నను రావణుని వచనములలోని యభిప్రాయ మిదియె యగుచున్నది.

వ॥ తథా చ శ్రుతిః 'ఋషిర్విప్రః కావ్యే' నేతి[2]

తథా చ = అదే విధముగా, శ్రుతిః = శ్రుతియును, విప్రః = విప్రుఁడు, కావ్యేన = కావ్య నిర్మాణముచే, ఋషిః = ఋషి యగును. ఇతి = అని, పేర్కొనుచున్నది.

వ॥ బృహస్పతిః—

ఆంధ్ర భాషావైశిష్ట్యమును జెప్పిన పిదప నాంధ్ర వ్యాకరణ వైశిష్ట్యమును గూర్చి బృహస్పతి పలుకు లిట్లు పేర్కొనుచున్నవి.

వ॥ 'త్రిలిఙ్గశాస్త్రవిహితస్య లక్షణస్యాపి అల్ప ప్రయోగేణహైన్యం న కారయే' దితి—

త్రిలిఙ్గశాస్త్ర విహితస్య = తెలుఁగు వ్యాకరణ శాస్త్రమునందు విధింపఁబడి నట్టి, లక్షణస్య అపి = లక్షణమునకును, అల్పప్రయోగేణ = అల్పుల ప్రయోగమును బట్టి, హైన్యమ్ = హీనత్వమును, న కారయేత్ = చేయరాదు. ఇతి = అని, బృహస్పతి చెప్పెను.

విరుద్ధముగా నున్న యల్ప కవి ప్రయోగము ననుసరించి త్రిలింగ శబ్దాను శాసనమునఁ జెప్పఁబడిన లక్షణమును హీనముగాఁ దలఁపరా దనీ బృహస్పతిమతము.

---

1. త్రి. శ. (4-16) ఆం. కౌ. లోను నున్నది.

2. త్రి. శ. 4. 16.

ఆంధ్రకౌముదియందును,[1] అధర్వణుని త్రిలింగ శబ్దానుశాసనమునను నీయవి కణ్వుని వచనములుగాఁ జెప్పఁబడఁగా నిట బృహస్పతి వచనములుగాఁ జెప్పఁబడుట విశేషము.

వ॥ నాగరాజః

వ్యాకరణవైశిష్ట్యమును గూర్చి 'నాగరాజు' ఇట్లు పేర్కొనెను.

వ॥ **ఆంధ్ర విష్ణోరనుజ్ఞా (కృ)తస్య మద్వ్యాకరణస్య ద్రోహీ గురుద్రోహీ[2] ఇతి.**

ఆంధ్రవిష్ణోః = ఆంధ్ర విష్ణువుయొక్క, అనుజ్ఞా (కృ)తస్య = అనుమతితోఁ జేయఁబడిన (సమ్మతించిన) మద్వ్యాకరణస్య = నా యీవ్యాకరణమునకు, ద్రోహీ = ద్రోహము తలపెట్టినవాఁడు, గురుద్రోహీ = గురు ద్రోహము చేసినట్టి పాతకుఁడగును, ఇతి = అని నాగరాజు చెప్పెను.

'కణ్వం సోమం బృగుమునిమహం పుష్పదన్తం కవీంద్రమ్ విష్ణుం సురముని గురుం నాగరాజం నమామి'యను ఆం. కౌ. శ్లోకమున నాగరాజు ప్రస్తావింపఁబడెను.

కాని పై వాక్యము కణ్వునివచనముగనె ఆంధ్రకౌముది అధర్వణుని త్రిలింగ శబ్దానుశాసనములో చెప్పఁబడియున్నది. ఇట నాగరాజ మతముగా నుంట విశేషము. కణ్వుఁడు శ్రీకాకుళాంధ్ర దేవుని యను మతితో తెలుఁగు వ్యాకరణము రచించియుండ నోపు.

వ॥ **విష్ణుర్యదాహ**

విష్ణుః = విష్ణువు (అను నాంధ్ర లాక్షణికుఁడు), యత్ = ఏమి, ఆహ = చెప్పె ననఁగా—

25. **"అత్ర త్రిలిఙ్గ భాషాయాం లిఙ్గమర్యాదయా స్థితాః[3]**
**శబ్దాః కేచిత్తు నేత్యాహు రల్పజ్ఞా మందబుద్ధయః ॥"**

---

1. త్రి. శ. ఆం. కౌ. లను బట్టి యిట వ్రాఁత ప్రతిలో లేకున్నను నల్పశబ్దము గ్రహింపఁబడినది. త్రి. శ. 3.

2. త్రి. శ. 3. ఆం. కౌ.
ఇదికణ్వోక్తిగానున్న త్రి. శ. అభిప్రాయ ముచితమనిపించు. ఆం. కౌ. నను సరించియు.

3. ఇది విష్ణూక్త మని చెప్పఁబడలేదు. త్రి.శ.లో యథాతథంగా నున్నది. (3-12) లోకాత్రశత్వాల్లింగస్య బోధ్యం స్యాదుజ్ఝాగ్నవర్ణకైః అన్నది అధికముగా నున్నది. ఆం. కౌ. యథాతథము.

ఇతి—

అత్ర = ఈ, త్రిలిఙ్గభాషాయామ్ = తెలుఁగు భాషలో, లిఙ్గమర్యాదయా = లింగమర్యాద, స్థితాః = కలిగినట్టి, శబ్దాః = శబ్దములు, న ఇతి = లేవు అని, కేచిత్ = కొందఱు, అల్పజ్ఞాః = కొంచెపుఁ దెలివి గల, మందబుద్ధయః = మంద బుద్ధులు, ఆహుః = చెప్పిరి, ఇతి = అని (విష్ణువు చెప్పెను).

తెనుఁగున లింగమర్యాద గల శబ్దములు లేవని కొందఱల్పజ్ఞులు పేర్కొనిరి.

కేచిదల్పజ్ఞాః ఇత్యాది శబ్దములచే నీ యభిప్రాయము సరి గా దని సూచింపఁ బడినది.

తెనుఁగు శబ్దములకు లింగమర్యాద గలదని విష్ణువు నభిప్రాయముగాఁ జెప్ప వలెను. (ఇది విచార్యము. తెనుఁగునఁ బారిభాషిక లింగము లేమి యథార్థము) లౌకిక లింగము ననుసరించి శబ్దశాస్త్రమున విధాన సమన్వయమున భేదము పొడఁగట్టును).

వ॥ ఇంద్రః—

శాస్త్రవైశిష్ట్యమును గూర్చియే యింద్రుఁ డను నాంధ్ర లాక్షణికుఁడిట్లు పేర్కొనెను.

వ॥ శాస్త్రస్య యద్విరుద్ధః స్యాత్తత్త్యాజ్యః నాత్ర సంశయ ఇతి[1]

యత్ = ఏది, శాస్త్రస్య = శబ్దశాస్త్రమునకు, విరుద్ధః = విరుద్ధమో, తత్ = ఆ శబ్దము, త్యాజ్యః = విడిచిపెట్టవలసినదే, అత్ర = ఈ యంశమున, సంశయః = సందేహము, న = లేదు.

లక్షణవిరుద్ధమైన శబ్దము గ్రాహ్యము గా దనియు నది తప్పక పరిహరింప వలయు ననియు భావము. లక్షణ విరుద్ధము గ్రామ్య మనియు నయ్యది కావ్య వ్యవహారమున కనర్హ మనియు లాక్షణికులు నిర్ణయించిరి.

ఇది మహేంద్ర వచనముగా నాంధ్రకౌముది.

వ॥ యదాహ శేషః—

శేషః = శేషుఁ డను లాక్షణికుఁడు, యత్ = ఏమి, ఆహ = చెప్పెననఁగా—

వ॥ అల్పజ్ఞానాం ప్రయోగేషు నా విశ్వాసోఽత్ర శాస్త్రతః[2] ఇతి—

1,2- ఇంద్ర, శేషమతములుగాఁ జెప్పఁబడిన యీ వాక్యము లథర్వణోక్తము లనిపించునట్లుగా త్రి. శ. లో నున్నవి (3-13).

అత్ర = ఈ యాంధ్రభాషయందు, శాస్త్రతః = శబ్దశాస్త్రము ననుసరించి, అల్ప జ్ఞానామ్ = కొంచెపుఁ దెలివిగలవారి, ప్రయోగేషు = ప్రయోగములయందు, విశ్వాసః = నమ్మిక ( తత్త్రదూప గ్రహణము), న — తగదు, ఇతి = అని చెప్పెను.

సమగ్రముగా శాస్త్రజ్ఞానము లేక చేసిన కవి ప్రయోగమునెడ విశ్వాసము తగదు. శాస్త్రజ్ఞుఁడు శాస్త్రానుగుణముగనె ప్రయోగించు ననియు, దద్విరుద్ధముగాఁ బ్రయోగించినవానికి శాస్త్రజ్ఞానము (బొత్తుగా లే దనకున్నను) సమగ్రముగా లేకుండుటచే నట్టి ప్రయోగము గ్రహింపఁదగ దనియు భావము. ఇట నల్పజ్ఞుఁ డగు కవి ప్రయోగముకంటె శాస్త్రమె బలీయ మని నిరూపింపఁబడినది.

ఇది బృహస్పతిమతముగా నాంధ్రకౌముది.

వ॥ సోమచన్ద్రః—

ఈ యంశమున సోమచంద్రుఁ డిట్లు పేర్కొనెను.

వ॥ 'ప్రయోగమేవ పశ్యన్తి మూఢా మేధావినస్తు న'[1] ఇతి—

మూఢాః = శాస్త్రజ్ఞాన విహీనులు, ప్రయోగమేవ = కవి ప్రయోగమును మాత్రమె, పశ్యన్తి = తెలియుదురు, మేధావినః తు = బుద్ధిమంతులు మాత్రము, న = అట్లు (ప్రయోగమాత్రమునకె ప్రామాణ్యమీయరు) గ్రహింపరు.

బుద్ధిమంతులు కవిప్రయోగమునకుఁ గాక శబ్దశాస్త్రము ననుసరించియె గ్రహింతు రని భావము.

వ॥ పుష్పదన్తస్తు యదాహ—

పుష్పదన్తః తు = ఈ యంశమునఁ బుష్పదంతుఁ డను లాక్షణికుఁడు, యత్ = ఏమి, ఆహ = చెప్పె ననఁగా—

వ॥ ప్రయోగో నామ లోకావిరోధి సలక్షణమ్
దోషరహితం వృద్ధానుమతమ్ నాన్యత్తదేవగ్రాహ్య మితి[2]—

ప్రయోగఃనామ = ప్రయోగమనఁగా, లోకావిరోధి = లోకమునకు విరుద్ధము గానిదియు, ననఁగా లోకమున బ్రసిద్ధ మైనదియు, సలక్షణమ్ = లక్షణవంత మయి

---

1. ఈ వాక్యము హేమచంద్రునిదిగా త్రి. శ. (3-14) ఆం. కౌ. యథాతథము.

2. 'వృద్ధానుజ్ఞాత' మ్మను మాత్రపు మార్పుతో — ఆ త్రి. శ. లోను, ఆం. కౌ. లోను, ఇది యథాతథము. (3—15)

నదియు, (శబ్ద శాస్త్రానుగుణమైనది) దోషరహితమ్ = దోషము లేనిదియు, వృద్ధానుమతమ్ = పూర్వ పండితులచే నంగీకరింపఁబడినదియు ననునది మాత్రమే, అన్యత్ = పయి లక్షణములకు భిన్నముగా నున్నది. న = ప్రయోగమె కాదు. ఏవి పూర్వోక్త లక్షణానుగుణమో తత్ ఏవ = ఆ శబ్దము మాత్రమె, గ్రాహ్యమ్ = గ్రహింపవలెను. ఇతి - అని (పుష్పదంతుఁడు చెప్పెను)

'లోకావిరోధి' యనుటలో లోక వ్యవహారమున నున్న పదమె గ్రహింపఁదగును. ఇట్లనుట వలన లక్షణవంత మైనను (దోషరహిత మైనను) వృద్ధానుమత మైనను పూర్వకవి ప్రయుక్త మయినను లోకవిరోధి గ్రాహ్యముగాదు. ఇట్లనుటలోఁ గొందఱు కవులు పేర్కొన్న 'ప్రాంతవర్జ మాటలను బరిహరించుట యుద్దేశ మగునని తోచు.

ఇట్టి వృద్ధానుమతి, గల్గి లోకావిరోధి యైనను లక్షణవిరుద్ధ మగు శబ్దము గ్రాహ్యము గాదు.

సలక్షణ మనుట యనఁగా దోషరహిత మగుటయె. మఱల దోషరహిత మనుటలో నాలంకారికులు పేర్కొన్న దోషములు లేనపుడే ప్రయోగార్హ మగునని యభిప్రాయము గానవచ్చును.

'వృద్ధానుమత' మనుటచే లక్షణవత్త్వాది లక్షణములు గల్గినను బూర్వకవి ప్రయుక్త మైయుండుట యవసర మని యభిప్రాయము.'

'ఇహ తు ప్రవ్యాహార్యం సంకేత సుప్రసిద్ధ మేవ పద' మ్మను చింతామణి లక్షణము నందలి యభిప్రాయ మిందు గోచరించుట గమనింపవచ్చును.

వ॥ చతుష్షష్టి కళాధురాధర్వణాచార్యస్తు యదాహ-

చతుష్షష్టి ...... చార్యస్తు = అరువది నాలుగు కళల నేర్పరి యగు నథర్వణాచార్యుఁడు, యత్ = ఏమి, ఆహ = చెప్పెనఁగా

వ॥ 'అశాస్త్రీయ ప్రయోగం గ్రామ్య'[1] మితి -

అశాస్త్రీయ ప్రయోగం = లక్షణమునకు భిన్నముగా నున్న ప్రయోగము, గ్రామ్యమ్ = గ్రామ్యము, ఇతి = అని (అథర్వణుఁడు చెప్పెను.)

1. అన్యమన్యతేతు "అశాస్త్రీయ ప్రయోగం గ్రామ్యమితి"
(ఆం. కౌ.) (అ. త్రి. శ. 3-3-16)

లక్షణ విరుద్ధమైన ప్రయోగము గ్రామ్యము. అది పరిహర్తవ్యము. అని యథర్వణుని నిశ్చయము.

కణ్వాదుల గ్రంథము లలక్ష్యములు. అథర్వణుని గ్రంథము త్రిలింగ శబ్దానుశాసనమున నీలక్షణము గలదు. కణ్వాదుల వచనములుగా నిం దుద్ధరింపఁ బడినవియుఁ గొన్ని యథర్వణుని త్రిలింగశబ్దానుశాసనమున నుంట గమనింపవచ్చును.

వ॥ ఇత్యేవం కణ్వరావణ పుష్పదన్తసోమచన్ద్ర
బృహస్పతి ప్రభృతిర్మహర్షిభి రుక్తత్వాత్[1]

ఇత్యేవమ్ = పయిని జెప్పినతీరుగా, కణ్వ.... మహర్షిభిః = కణ్వుఁడు, రావణుఁడు పుష్పదంతుఁడు, సోమచంద్రుఁడు, బృహస్పతి మొదలగు మహర్షులచే, ఉక్తత్వాత్ = ఆంధ్రభాషా వ్యాకరణముల వైశిష్ట్యము చెప్పఁబడియుండుటచేతను.

వ॥ ఏ షా త్రిలిఙ్గ భాషా సంస్కృత భాషా తుల్యేతి ప్రసిద్ధతయాచ[2]-

ఏషా = ఈ, త్రిలిఙ్గభాషా = తెలుఁగుభాష, సంస్కృతభాషాతుల్యా = సంస్కృతభాషతో సమాన మయినది, ఇతి = అని, ప్రసిద్ధతయాచ = ప్రసిద్ధమై యుండుటను బట్టియును-

వ॥ పూర్వమేవ ఏకశ్శబ్దస్సుష్ఠు ప్రయుక్తః స్వర్గేలోకే కామధుగ్భవతీతి
భగవతా భాష్యకారేణ పతంజలినా భాష్యే ప్రపఞ్చితత్వాచ్చ -

పూర్వమేవ = ప్రాచీనకాలముననె, భగవతా = భగవానుఁడును, భాష్యకారేణ = మహాభాష్యకర్తయు నగు, పతంజలినా = పతంజలి మహర్షిచే, భాష్యే = మహాభాష్యము నందు, సుష్ఠు ప్రయుక్తః = సమర్థముగాఁ బ్రయోగింపఁబడిన, ఏకః శబ్దః = ఒకశబ్దము, స్వర్గే లోకే = స్వర్గలోకమునందు, కామధుక్ = ఇష్టములను బ్రసాదించునది (కామధేనువు వంటిది) భవతి ఇతి = అగునని, ప్రపఞ్చితత్వాత్ చ = వివరింపఁబడియుండుటచేతను.

వ॥ తథా హి-

ఈపై కారణముల ననుసరించి

---

1. ఆం. కౌ.

2. ఆం. కౌ

వ॥ తత్సతజ్జాచ్చదేశ్యగ్రామ్యభేదై రుత్కర్షితాయాం త్రిలిఙ్గభాషాయాం సాహిత్య రచనేచ్ఛూనామ్ -

తత్స.... భేదైః = తత్స (మము) తజ్జ (తద్భవము) అచ్చ, దేశ్యము గ్రామ్యము ననునయిదు విధము లయిన భేదములతో, ఉత్కర్షితాయామ్ = ప్రశస్తిని బొందినట్టి, త్రివిఙ్గ భాషాయామ్ = తెలుఁగుభాషలో సాహిత్య రచనేచ్ఛూనామ్ = కావ్యములు చెప్పఁగోరు వారలకు-(దేశ్యగ్రామ్యములుపైని దేర్కొనఁబడును.)

వ॥ త్రిలిఙ్గశాస్త్రాభియోగదార్ఢ్య విహీనానామ్

తెలుఁగు వ్యాకరణముతో గాఢమైనసంబంధము లేనివారలకు-

వ॥ అతిమందమతీనామ్-

మిక్కిలి మందబుద్ధులకును-

వ॥ ప్రబంధ రచనా సమర్థానాం మహాకవీనాం చ-

కావ్యరచనము సామర్థ్యము గల్గినవారికిని, మహాకవులకును-

వ॥ త్రైలింగ్యానామ్ సుశబ్దానా మపశబ్దానాం వివేకస్య నిర్మలాదర్శ భూతమ్-

త్రైలింగ్యానామ్ = త్రిలింగ దేశమునకు సంబంధించిన (తెలుఁగు పదములకు సంబంధించిన)సుశబ్దానామ్ = సాధుశబ్దముల యొక్క, అపశబ్దానామ్ = అసాధువులగు శబ్దముల యొక్క, వివేకస్య = వివేకమునకు, నిర్మలాదర్శభూతమ్=స్వచ్ఛ మగు నద్దమువంటి దానిని.

వ॥ కవిమహాప్రబన్ధ రచిత మర్మపదోద్ఘాటనాతిమాత్ర కరణమ్

కవులయొక్క మహాకావ్యములయందుఁ గూర్పఁబడిన మర్మ పదములను (సమాసాదులు) విస్తరించి చెప్పుదానిని,

వ॥ ఇదానీమహమపి-

ఇదానీమ్ = ఇపుడు, అహమ్ అపి = నేనుగూడ (పూర్వమె కణ్వాదులు పెక్కురు త్రిలింగమునకు వ్యాకరణము చెప్పియుండిరి కావున వారితో పా టిపుడు దానును జెప్పుచుంటినని నృసింహకవి యభిప్రాయము.)

వ॥ కాణ్వ బర్హస్పత్య రావణీయాది వ్యాకరణాని బుద్ధ్వా -

కణ్వుని యొక్క వ్యాకరణమును, బృహస్పతి చెప్పిన లక్షణ గ్రంథమును రావణుఁడు మొదలగువారు రచించిన శబ్దశాస్త్రములను బుద్ధ్వా = గ్రహించి.

వ॥ కరోమి సారస్వత త్రిలిఙ్గ శబ్దానుశాసన మేవమ్ -

సారస్వత త్రిలింగ శబ్దానుశాసనమును ఇట్లు చేయుచున్నాఁడను.

ఇటఁ గూడ గ్రంథనామము సారస్వత త్రిలిఙ్గ శబ్దానుశాసన మని చెప్పఁబడుట గమనింపఁదగియున్నది. ఆంధ్రకౌముదిలో మిగిలినభాగ మంతయు నిట్లె యుండఁగా 'కరోమ్యాన్ధ్రశబ్ద కౌముదీ మేవ'మ్మని యాంధ్ర కౌముదిగాఁ జెప్పఁబడినది.

ఒకటికి రెండుసార్లిట్లు పేర్కొనఁబడుటచే నీగ్రంథము నామము 'సారస్వత త్రిలింగ శబ్దానుశాసన' మని నిశ్చయించి చెప్పఁదగును.

త్రిలింగము లగు శబ్దములగు శబ్దములు త్రిలింగ శబ్దములు, అనగాఁ దెలుగు పదములు. సారస్వతములయిన- అనఁగాఁ గావ్యములందుఁ బ్రయుక్తము లయిన తెలుఁగు పదములు సారస్వాత త్రిలింగ శబ్దములు. అట్టిదానికి సంబంధించిన యనుశాసనము (వ్యాకరణము) సారస్వత త్రిలింగ శబ్దానుశాసనము. అనఁగా లోకవ్యవహారమునందుఁ బ్రయుక్తము లగువానిం గాక యాంధ్రకావ్యములందుఁ బ్రయోగింపబడి యున్న శబ్దములకు నీగ్రంథము లక్షణము చెప్పుచున్నట్లు తెలియవలయును. "కవి ప్రబన్ధరచిత సత్కృపదోద్ఘాటనాలిమాత్ర కరణమ్"- అని యింతకు ముం దీగ్రంథమును గూర్చి చెప్పుట స్మరింపఁదగును. మొత్తముపై నిది కావ్యభాషానుశాసనము. (కాని గ్రంథమున లోకవ్యవహారమునకుఁ బ్రాధాన్యమిచ్చి కావ్యములం దెచ్చటను గన్పట్టని శబ్దములను సాధించుటయుఁ గానవచ్చును)

"కరోమి సారస్వత త్రిలిఙ్గ శబ్దానుశాసన మేవమ్" అని చివర 'ఏవమ్' అని చెప్పుటతోఁ బైని లక్షణగ్రంథ మారంభింపఁబడుచున్నట్లు స్పష్ట మగుచున్నది.

ఇఁక సారస్వత త్రిలిఙ్గశబ్దానుశాసనము:

# సారస్వత
# త్రిలిఙ్గ శబ్దానుశాసనమ్
## పరిభాషా పరిచ్ఛేదః

**1. సిద్ధిర్లోకాద్దృశ్యా**[1]

వ్యా. సిద్ధిః = తెలుఁగు భాషయొక్క సిద్ధి, లోకాత్ = లోకమునుండి, దృశ్యా = తెలియఁదగినది.

**వి. త్రిలిఙ్గభాషా సిద్ధిర్లోకాద్దృశ్యా స్యాత్.**

తెలుఁగు భాష లోకమునుండి యనఁగాఁ త్రిలింగ దేశమునకుఁ జెందిన జనుల యొక్క వ్యవహారమునుండి తెలియఁదగినది. సంస్కృత ప్రాకృతాదులగు నితర భాషలతో సంబంధము లేని యచ్చమైన తెలుఁగు భాష జన వ్యవహారమునుండి తెలియవలయు నని తాత్పర్యము.

అథర్వణుని త్రిలింగశబ్దానుశాసనము, మంచెళ్ల వాసుదేవకవి వైకృత చంద్రిక, మండలక్ష్మీ నృసింహకవి, సారస్వత త్రిలింగ శబ్దానుశాసనము, ఆంధ్ర కౌముది మొదలగు నాంధ్ర వ్యాకరణములు సంజ్ఞాదుల విషయమున నితరాంధ్రవ్యాకరణముల కంటెఁ బ్రాకృత వ్యాకరణ ప్రభావమున కధికముగ లోనైనవి.

ఈ సిద్ధిర్లోకాద్దృశ్యా యనునదియు వాల్మీకి ప్రాకృత లక్షణమునె యనుసరించి యున్నట్లు స్పష్టము.[2]

ఇది సారస్వత త్రిలింగశబ్దానుశాసనము గావున నిచట సిద్ధి యనఁగాఁ త్రిలింగ శబ్దముల సిద్ధియని యర్థ మగును. తెలుఁగు భాషయొక్క యేర్పాటు లోకమునుండి యనఁగా జనుల నుండి, జనుల వ్యవహారమునుండి తెలియఁదగును. అనఁగా త్రిలింగ దేశము నందలి జనుల వ్యవహారమునుండి తెలుఁగు భాషయొక్క వర్ణపదాది స్వరూపము గుర్తింపఁదగియున్నదని తాత్పర్యము.

---

1. ఆం. శ. చిం. సం. 6.; సిద్ధిర్వ్యవహారాచ్చ (వై. చం. సం. 1.)

2. వా. సూ. 1. 1. 1.

2. అనుక్త మన్యస్మాత్[1]

వ్యా. అనుక్తమ్ = ఈ సారస్వత త్రిలింగ శబ్దానుశాసనమందుఁ జెప్పఁబడని లక్షణము, అన్యతః = పాణినీయము మొదలగు నితర వ్యాకరణముల నుండి తెలియదగినది.

వి. అస్మాభిర్యదనుక్తం తత్సర్వమపి పాణినీయాది వ్యాకరణేభ్యో యథాతథం గ్రాహ్యం స్యాత్[2]

మా చేతఁ జెప్పఁబడని దంతయును బాణినీయము మొదలగు వ్యాకరణములం దెట్లో యట్లే గ్రహింపఁదగును.

ఈ తెలుఁగువ్యాకరణమునందుఁ జెప్పక విడిచిపెట్టిన లక్షణము సంస్కృతము మొదలగు నితరభాషా వ్యాకరణముల నుండి గ్రహింపఁదగును. సంస్కృతము, మఱియుఁ బ్రాకృతమునకుఁ జెందిన వ్యాకరణము లందును, బాణినీయమును, వాల్మీక్యాది ప్రాకృతవ్యాకరణములును బ్రధానముగా గ్రహింపఁదగి యున్నవి.

ఉపధ, టిత్వప్రయోజనము మొదలగు నంశము లీ వ్యాకరణమునందుఁ జెప్పబడలేదు. 'అలోఽన్త్యాత్పూర్వ ఉపధా, ఆద్యన్తౌ టకితౌ' మొదలుగాఁ బాణిని మహర్షి వ్యాకరణమునందుఁ జెప్పిన లక్షణములను యథాతథముగా ననుసరించి తెలిసికొనవలయును.

'సానేర్వాలుక్' మొదలగు చోట్ల 'స' యను సంజ్ఞ యిం దుపయుక్తము. 'సస్సమాసః[3] అను వాల్మీకీయ మగు ప్రాకృత వ్యాకరణ లక్షణము ననుసరించి 'స' యనుదానికి సమాస మను యర్థమును వై. చం. ప్రభృతులు దెలుఁగున స్పష్టముచేసినవి. కాని యిది పాణినికి బూర్వముననె యుండుట గానవచ్చును. రాజాఽసే (గణ సూత్రము. 106) స ఇతి సమాసస్య ప్రాచాం సంజ్ఞా (బాల మనోరమ. పత్యన్త పురోహితాదిభ్యోయక్ (5. 1. 127) సూత్రవ్యాఖ్య.) యని సమాసమునకు 'స' సంజ్ఞ వాల్మీకి కంటె మిగులఁ బ్రాచీనము. కాఁగా సంస్కృతము నుండి ప్రాకృతమునకును (నందుండి) తెలుఁగునకును నీ సంజ్ఞ విస్తరించినదని చెప్పవచ్చును. కాఁగా నిది కేవలము ప్రాకృత వ్యాకరణము నుండియె తెలుఁగు లాక్షణికులు గ్రహించి రనుట కవకాశము తక్కువ యగుచున్నది.

---

1. అనుక్తమన్యస్మాత్ (ఆం. కౌ. పరి. 2)
అన్యశాస్త్రోక్త్యాగ్రాహ్యం స్యాదనుదీరితమ్ (త్రి. శ. 1. 40)

2. అనుక్తం సంస్కృత వత్ (వై. చం. సం. 2)

3. వా. సూ. 1-1-8 (వై. చం. సం. 7)

3. సప్త ప్రాణాః [1]

వ్యా. ప్రాణాః = ప్రాణములు, సప్త = ఏడు.

వి. అస్మిన్ శాస్త్రే స్వరూపేణాదిదుదేదోదైదౌత ఇతి సప్త ప్రాణాః స్యుః

వ్యా. ఈ త్రిలింగశాస్త్రమునందు అత్, ఇత్, ఉత్, ఏత్, ఓత్, ఐత్, ఔత్- లను నవి యేడును ప్రాణము లగును.

ప్రాణము లనఁగా నచ్చులు. ఆదిః ప్రాణః అని యకారాదులకుఁ బ్రాణసంజ్ఞ విహితము. అవి యేడు. అ, ఇ, ఉ, ఎ, ఐ, ఒ, ఔ అనునవి. సంస్కృతమునందు ఎ, ఒ, యను హ్రస్వ వర్ణములు లేవు గావున నా భాషయం దున్న ఏ, ఓ, యను దీర్ఘములే వృత్తియందుఁ జెప్పఁబడినవి. అయినను నిచటఁ దెలుఁగున ఎ, ఒ, అను హ్రస్వములనే, (అ, ఇ, ఉ లను బట్టియు) గ్రహింపవలయును. 'ఏదన్తతా చ నామ్నామన్యతరస్యామియాన్తానామ్' మొదలుగాగాఁ జింతామణ్యాదులం దిట్టి స్థితి సుపరిచితమే.

ఆ, ఈ, మొదలగు దీర్ఘములు, అ, ఇ, మొద లగువాని యుచ్చారణకాలము నందలి భేదముచే నేర్పడునవి కాఁగా హ్రస్వదీర్ఘములకు స్వరూపమునందు భేదము లేదు. అ, ఇ, ఉ, ఇత్యాదులవలెఁ బరస్పరము భిన్నములు గావు. కావుననే అత్- మొదలగు తీరుగా వివృతియందు 'స్వరూపేణ సప్త' యని చెప్పఁబడినది.

4. వింశతిః ప్రాణినః [2]

వ్యా. ప్రాణినః = ప్రాణులు, వింశతిః = ఇరువది.

వి. క గ చ జ ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హ ళా ఇతి వింశతిః ప్రాణినః స్యుః.

వ్యా. క గ చ జ ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హ ళ యను నిరువదియును ప్రాణులగును. ప్రాణి యనఁగా హల్లు. కాదిః లేదా హాదిః[3] ప్రాణీ యని చెప్పఁబడిన లక్షణ మీ గ్రంథమున నష్ట మైయుండును. ఏమయినను కకారాదు లగు హల్లులకుఁ బ్రాణు లని సంజ్ఞ.క మొదలగు పైని జూఁపబడిన

---

1. ప్రాణాస్సప్త స్వరూపేణ విశ్రుతిః (త్రి. శ. 1. 6)
2. ప్రాణినః పరే (త్రి. శ. 1. 7)
3. హాదిః ప్రాణీ (ఆం. కౌ.) పరి. 19

వర్ణము లిరువదింటికిని (హల్లులు) ప్రాణి యని సంజ్ఞ తెలుఁగున విశేషముగాఁ గల్గును. సప్త ప్రాణాః అని అచ్చు లేడు, వింశతిః ప్రాణినః అని హల్లు లిరువది గలిసి అనుస్వారముతో తెలుఁగునకు వర్ణములు 28 అగుచున్నవి. సున్న, యచ్చులలోఁ గాని హల్లులలోఁ గాని పరిగణింపఁబడలేదు. (ఇట్లే విసర్గయును.) ఇది మాహేశ్వర సూత్రములందు లేకుండుట యొక్క హేతువు గావచ్చును. ప్రక్రియాదులగు ప్రయోజనముల నుద్దేశించి మాహేశ్వరసూత్రములం దనుస్వార విసర్గములకుఁ బ్రవేశము లేక పోవచ్చును. తెలుఁగున నట్లు పరిగణింపకుండుట విశేషము. 'బిన్దుర్ద్వివిధ' యని బిందువు ద్వివిధ మగుట యిందే చెప్పఁబడినది. అనుస్వార విసర్గలు, గురులఘునిర్ణయమునఁ బ్రత్యేకముగాఁ బరిగణింపఁబడ కుండుటకు వాని నిటఁ బేర్కొనకుండుట కే దేని సంబంధము గల దేమో పరిశీలింపవలయును.

## 5. అన్యే చ[1]

వ్యా. అన్యే-చ = తెలుఁగునందుఁ గలవానికంటె నితరము లగు వర్ణములును దెలుఁగునఁ జేరును.

వి. ఇతరే వర్ణా స్తత్సమాన్యదేశ్యాది శబ్దయోగవశాత్ స్యుః.

వ్యా. ఇతరము లగువర్ణములును దత్సమములు నన్యదేశ్యములు మొదలగు శబ్దముల కారణమునఁ దెలుఁగులోనికిఁ బ్రవేశించును.

'వర్ణకవికృతం తత్సమ్' (29) అనుసూత్రము ననుసరించి తెలుఁగు ప్రత్యయముతోడి మార్పులు పొందిన సంస్కృత శబ్దము తత్సమము. అదియె తత్సమము తత్సమ మనఁగా సంస్కృత సమము.

అన్యదేశ్య మనఁగా నన్యదేశాగత మనఁదగును. అయ్యది గ్రామ్య మని 'అన్యదేశాగతం గ్రామ్యం' మ్మను (33) లక్షణము చెప్పుచున్నది. 'ఇది అనర్థం చ' యని కావ్యములందుఁ బ్రయోగించుట కర్హముగాదు. అయిన నిట నిట్లు పేర్కొనుటచే నన్యదేశ్యములకుఁ గొన్నింటికిఁ గావ్య ప్రయోగార్హతగలదని తెలియవచ్చును. (కవిశి. 256)

---

1. అన్యేచ ఇతర వర్ణాశ్చతత్స మాది శబ్దయోగవశాత్ స్యుః (అం. కౌ. పరి. 17) తేఽన్యేచాను ప్రవిశన్తి శబ్దయోగవశాత్ (అం. శ. చిం. సం. 15)

అన్యము లనఁగాఁ జెప్పఁగా మిగిలినవి. 'సప్త ప్రాణాః వింశతిః ప్రాణిన' యని యింతకు మునుపు తెనుఁగునందలి వర్ణములు పేర్కొనఁబడినవి. దానికంటె వే అయినవి యన్యములు. ఋ, ౠ, మొదలగునని.

ఇట్లు తెలుఁగున లేని వర్ణములు గూడ సంస్కృత సమములు, నన్యదేశ్యములు నయిన శబ్దములమూలమునఁ దెలుఁగులోనికిఁ బ్రవేశించుచున్నవి.

ఋ (ౠ) ఌ (ౡ) విసర్గ, ఖ ఛ ఠ థ ఫ ఘ ఝ ఢ ధ భ ఙ ఞ శ ష యనునవి యిట నన్యములుగాఁ దేలుచున్నవి. ఇవి పదునేడు. ఇంకను అ ఆ ఐ ఔ ఓ ఔ లతోఁ గూడి తాలవ్యము లయిన చ జలును.

ఋతువు - ఋషి మొ॥

సూత్రమునందలి 'చ' శబ్దముచే సంస్కృత సమాన్యదేశ్యశబ్దములలోఁ దెలుఁగు నం దున్న వర్ణము లుండుటయు నవిరుద్ధ మగుచున్నది. అమలము, కమలము మొ॥

'తత్సమాన్యదేశ్యాది' యనుచో వివృతి యందలి యాదిశబ్దముచే గ్రామ్యములుఁ గ్రహింపవచ్చును.

అనుకరణ శబ్దములందు నిట్టి వర్ణము లుండుట గమనింపవచ్చును. ఖణేల్, గుభుల్ మొ॥

సప్త ప్రాణాః, వింశతిః ప్రాణినః లని యచ్చతెనుఁగున నచ్చులు 7, హల్లులు 20, అనుస్వార మొకటి కాఁగా మొత్తము వర్ణములు 28 'అన్యే చ' యను ప్రస్తుత లక్షణముచే సంస్కృత సమాదులనుండి తెలుఁగులోనికి వచ్చినవి పయిని గుర్తించిన 17- కలియఁగా మొత్త మాంధ్రభాషకు 28 + 17 - నలువది యైదు వర్ణము లగుచున్నవి.

### 6. అణోజౌ త్రివిధౌ[1]

వ్యా. అణోజౌ = అణ్, ఏచ్ అను ప్రత్యాహారములు, త్రివిధౌ = మూఁడు విధములు.

వి. అణోజౌ ప్రత్యాహారౌ హ్రస్వదీర్ఘప్లుతభేదైః త్రివిధౌ స్తః.

1. ఐచం వినా స్వరాః పంచ హ్రస్వదీర్ఘప్లుతైః త్రిధా (త్రి. శ. 1-9)

అణ్, మఱియు నేజ్ అను ప్రత్యాహారములు హ్రస్వము, దీర్ఘము, ప్లుతము నను భేదముచే మూఁడు విధము లగును.

అణ్, ఏజ్ ప్రత్యాహారము లనఁగా నా ప్రత్యాహారములచే బోధింపఁబడు వర్ణములు. అణ్ అనునది, అ ఇ ఉ (ణ్), అనువానిని, ఏజ్ అను ప్రత్యాహారము ఏ ఓ (జ్) అనువానిని బోధించును. కాఁగా అ, ఇ, ఉ, ఎ, ఒ అను వర్ణము లయిదు నొక్కొక్కటి హ్రస్వము, దీర్ఘము, ప్లుతము నను భేదములతో మూఁడు విధము లయియుండును.

'అనుక్తమన్యస్మాత్' తను లక్షణము ననుసరించి, 'ఊకాలోజ్ఝ్రస్వదీర్ఘప్లుతః అనుపాణినీయ లక్షణానుసారముగా, హ్రస్వ, దీర్ఘ, ప్లుతములను గుర్తింపవలయును ఒక మాత్ర సెకనులో నయిదవవంతు (వ్యా. సం. స. 23) కాలమున నుచ్చరింపఁ బడునది హ్రస్వము. రెండు మాత్రల కాలమున నుచ్చరింపఁబడునది దీర్ఘము. మూఁడు మాత్రల కాలమున నుచ్చరింపఁబడునది ప్లుతము.

అ ఇ ఉ ఎ ఒ లయిదు నీ మూఁడు భేదములచే వెఱసి పదునయిదు విధము లగుచున్నది. ఉదా:- అ, ఆ, 3. ఆ. దీర్ఘమునకుఁ బ్రత్యేకముగా లిపియందు భేదము గలదు. ప్లుతమున కట్లు లేదు. కావున దీర్ఘాక్షరము పయినే మూఁడు మాత్రల కాలము పలుకుబడిని (ప్లుతత్వమును) సూచించుచు మూఁడంకె యుంచఁబడుచున్నది. దీర్ఘమునకు వలెఁబ్లుతమునకుఁ బ్రత్యేక ము లిపి లేకుండుటయె లౌకిక వాఙ్మయము నందుఁ బ్లుతముయొక్క యప్రాధాన్యమును సూచించుచున్న దనవచ్చును. తెలుఁగు లాక్షణికులు పెక్కురు ప్లుతమును బేర్కొననేలేదు.

'సాధ్యాదేః' ఇత్యాదిగా దీర్ఘము ప్రస్తావింపఁబడినది. కాని ప్లుత మట్లు లే దీ వ్యాకరణమునను. హ్ర (సం. 15) ది (సం. 14) అని హ్రస్వదీర్ఘములకు సంజ్ఞ లేర్పఱుపఁబడినట్లుగాఁ బ్లుతమునకుఁ జెప్పఁబడలేదు.

7. ఐజి న హ్రస్వః[1]

వ్యా. ఐజి = ఐచ్ అను ప్రత్యాహారమునందు, హ్రస్వః = హ్రస్వము, న = లేదు.

వి. ఐకారౌకారౌ హ్రస్వౌ న స్తః

వ్యా. ఐకారమును, ఔకారమును హ్రస్వములు గావు.

---

1. ఐదౌతౌ హ్రస్వరహితౌ (త్రి. శ. 1. 10)

'ఐఔచ్' అను మాహేశ్వరసూత్రము ననుసరించి యైచ్ అను ప్రత్యాహారముచే ఐ, ఔ అను రెండు వర్ణయిలు బోధింపఁబడును. ఐ ఔ అను రెండు వర్ణములకును హ్రస్వము లేదు. ఇట్లనుటచే ఐ, ఔ లకు దీర్ఘము, ప్లుతము నను భేదము గల దని యర్థ మగును.

'అణేజౌ త్రివిధౌ' అను పూర్వసూత్రమున వ్రాఁతప్రతిలో 'అణేజౌ' యను పాఠము గానవచ్చును. దాని చొప్పున 'ఏచ్' అను ప్రత్యాహారముచే ఏ, ఓ లతోపాటు, ఐ, ఔ లును బోధింపఁబడును గావున, ఐ ఔ లు, హ్రస్వ దీర్ఘ ప్లుతములను మూఁడు భేదములును గల్గిన వగును. అట్టియెడల నీ సూత్రముచే హ్రస్వమును నిషేధించెను గావున మిగిలిన వగు దీర్ఘప్లుతములు పూర్వసూత్రముచే సిద్ధము లగును.

కాని యట్టియెడల నొక భేదము లేనపుడు ఐ ఔ లకును త్రైవిధ్యము ముఁదుగా విధించుట యనవసరము.

'అణేజౌ' యని చెప్పఁగా ఐ ఔ ల విషయము చెప్పఁబడలేదు గావున నిట 'ఐ ఔ లకు ద్వైవిధ్యము విధించినఁ జాలును. హ్రస్వ నిషేధమును దానిచే దీర్ఘప్లుతములను సిద్ధింపఁజేయుటయు సూటిగా నుండవు. కాక ద్వివిధములన్న హ్రస్వదీర్ఘములచేతనా లేక హ్రస్వప్లుతముల చేతనా యను సందేహము గలుగకుండుటకై హ్రస్వము లేదని చెప్పుటయుఁ దన్మూలమున దీర్ఘప్లుతములే యుండు ననియుఁ జెప్ప టొప్పుననఁదగు.

ఇంక నీ నృసింహకవియే వ్రాసిన 'యాంధ్రకౌముది'లో 'ద్వివిధోఽజ్' అని చెప్పఁబడుటనుబట్టి పూర్వసూత్రమునను నట్లే చెప్పఁబడిన దనిపించును. అందుకే యా సూత్ర మట్లు గ్రహింపఁబడినది.

మొత్తముమీఁద, ఐ,ఔ లొక్కొక్కటి దీర్ఘము, ప్లుతము నను భేదముచే రెండు విధములు. వీనికి హ్రస్వస్థితి లేదు.

## 8. బిన్దుర్ద్వివిధః [1]

వ్యా. బిన్దుః = బిందువు- ద్వివిధః = రెండువిధములు.

వి. సిద్ధసాధ్య సంజ్ఞాభ్యాం పూర్ణార్ధ భేదాభ్యాం బిన్దుర్ద్వివిధ స్స్యాత్.

---

1 అనుస్వారౌచసమ్మతౌ (త్రి. శ. 1. 11)

అనుస్వారశ్చ - అనుస్వారశ్చ సిద్ధసాధ్యభేదాభ్యాం ద్వివిధ స్స్యాత్ (ఆం. కౌ. పరి. 21)

*వ్యా. సిద్ధము సాధ్యము నను పేరులతోఁ బూర్ణము ఖండము నయిన బిందువులు ద్వి విధము లగును.*

యథా క్రమముగా సిద్ధము-పూర్ణము, సాధ్యము-ఖండము. పూర్ణబిందు వనఁగా నిండు సున్నకు సిద్ధబిందు వనియు, ఖండబిందు వనఁగా నఱసున్నకు సాధ్య బిందు వనియుఁ బేరులు. ఇట్లు సిద్ధము, సాధ్యము ననుభేదముతోఁ దెలుఁగున బిందువు రెండువిధము లయియున్నది.

సంస్కృతభాషలోఁ బూర్ణబిందు వొక్కటియె యున్నది. తెలుఁగున ఖండబిందు వధికము. పూర్ణబిందువు సంస్కృతమున నుండి సిద్ధ మయియుండుటచే దానికి సిద్ధమనియు, నర్ధబిందువు తెలుఁగుననే యేర్పడియుండుటచే సాధ్య మనియుఁ బిలువఁ బడియుండవచ్చును.

'బిన్దుర్ద్వివిధః' అని రెండు విధము లనియె చెప్పఁబడెను గాని సూత్రమున నా భేదము స్పష్టము చేయఁబడలేదు. కాని యాపిదప 'ప్రోక్తిస్సిద్ధసాధ్యౌ' చ యని 'సిద్ధసాధ్య' సంజ్ఞలు ప్రయుక్తము లయినవి. ఇట్లగుటనుబట్టి నిండు సున్నకు సిద్ధ మనియు, నఱసున్నకు సాధ్య మనియు సంజ్ఞ లీ వ్యాకరణమునకుఁ బూర్వమే సుప్రసిద్ధములయి యున్నట్లు గుర్తింపవచ్చును[1].

'సిద్ధస్సాధ్యశ్చానుస్వారః పూర్ణార్ధభేదతోద్వివిధ' యను చింతామణి లక్షణము నకుఁ బ్రస్తుతస్థలమునందలి 'సిద్ధసాధ్య సంజ్ఞాభ్యాంపూర్ణార్ధ భేదాభ్యాం బిన్దుర్ద్వి విధస్స్యా'త్తను వృత్తి మిగుల సన్నిహిత మయియున్నట్లు స్పష్టమే. పూర్ణార్ధ భేదతః ద్వివిధః అనుస్వారః, సిద్ధః, సాధ్యః చ - యనురీతిగా నన్వయించినచోఁ జింతామణి సూత్రమును ప్రస్తుత స్థలమువలెనె యభిప్రాయ మిచ్చు నన వీలు గలదు. కాని తద్వ్యాఖ్యాత లట భిన్నముగాఁ బేర్కొనిరి. వారిమతము ననుసరించి పూర్ణబిందువు నర్ధబిందువు నొక్కొక్కటి సిద్ధము సాధ్యము నని రెండు విధములై మొత్తముపై బిందువు నాలుగు విధము లగును. శబ్దమున సహజ సిద్ధమైన బిందువు (ఖండమును- అరఁటి, పూర్ణమును- బంతి) సిద్ధ మనియు శాస్త్రముచే సాధింపఁబడిన బిందువు (ఖండ మైనను - రాముఁడు, పూర్ణ మైనను రాముండు) సాధ్య మనియు నభిప్రాయము. ఇదియె పిదప ప్రసిద్ధము.

---

1. సిద్ధః పూర్ణః - పూర్ణానుస్వారస్సిద్ధ సంజ్ఞస్స్యాత్ (ఆం. కౌ. పరి. 2.2)
సాధ్యోఽర్ధః - అర్ధానుస్వారస్సాధ్య సంజ్ఞస్స్యాత్ (ఆం. కౌ. పరి. 23)

*దీనినిబట్టి యరసున్న గూడ సహజసిద్ధమైన సిద్ధమె యగును. నిండుసున్న* యైన శాస్త్రముచే సాధింపఁబడినచో సాధ్యమె యగును. పూర్ణమా? అర్ధమా? యని తప్ప, సహజమా, సాధింపఁబడినదా యను వివక్ష యీ వ్యాకరణమున లేదు.

ఇది యిట్లుండ నిచ్చటను ద్వివిధ మనఁగాఁ బ్రకరణమునుబట్టి హ్రస్వము దీర్ఘము నను భేదముచేతనె ద్వివిధమా? యనియు సందేహము గలుగును. అప్పకవి-

"బిందువునకు రెండు భేదంబు లగు హ్రస్వ
దీర్ఘ రూపములను దెలుఁగులందు
హ్రస్వ మనఁగ నొప్పు నర్ధబిందువు దీర్ఘ
మనఁగఁ బూర్ణబిందు వయ్యెఁ గృష్ణ! (అప్ప. 2. 84)

యనెను. హ్రస్వబిందు వరసున్న. దీర్ఘబిందువు నిండు సున్న. కాని పిదప 'హాత్సిద్ధసాధ్యౌచ' యనుట సిద్ధసాధ్య భేదమును సూత్రకర్త మతమున గుర్తింపవలసి యున్నది. ఈ పక్షమునను హ్రస్వ బిందువునకు నన నఁగా నరసున్నకు సాధ్యబిందు వనియు, దీర్ఘబిందువున కనఁగా నిండుసున్నకు సిద్ధబిందు వనియు సంజ్ఞలు పూర్వ ప్రసిద్ధములా యనిపించును.

## 9. హాత్సిద్ధసాధ్యౌ చ[1]

వ్యా. హాత్ = హ్రస్వముకంటెఁ బరముగా, సిద్ధసాధ్యౌ చ = సిద్ధబిందువును సాధ్య బిందువు నుండును.

వి. హ్రస్వాక్షరాత్పరతస్సిద్ధసాధ్యావుభౌ బిన్దూ స్తః.
ఘనుఁడు, ఘనుండు; ఇఁక, ఇంక.

వ్యా. హ్రస్వముకంటెఁ బరముగ సిద్ధబిందువు సాధ్యబిందువును రెండు నుండును. 'హో హ్రస్వస్య (సం. 15) అను సూత్రమునుబట్టి హ్రస్వమునకు 'హ' యని సంజ్ఞ. సిద్ధ మనఁగాఁ బూర్ణబిందువు, సాధ్య మనఁగా ఖండబిందువు.

సహజము గాని, వ్యాకరణముచే సాధింపఁబడినది గాని యైన ఖండ బిందువును, బూర్ణబిందువును రెండును హ్రస్వముపై నుండవచ్చును. అ, ఇ, ఉ, ఋ (ఌ), ఎ, ఒ- అనునవి హ్రస్వములు. వీనిపై ఖండ పూర్ణ బిందువులు రెండు నుండనగు.

1. హాత్సిద్ధశ్చ (ఆం. కౌ. పరి. 24)

ఘనుఁడు అనుచో హ్రస్వముపై శాస్త్రముచే సాధింపఁబడిన సాధ్య (ఖండ) బిందు వున్నది. ఇఁక- అనుచో హ్రస్వముపై సహజ మగు సాధ్య (ఖండ) బిందు వున్నది. బంతి యనుచో హ్రస్వముపై సహజ మగు సిద్ధ (పూర్ణ) బిందు వున్నది.

ప్రస్తుత లక్షణము బిందు వున్నస్థలమును వివరించునదే కాని బిందువును విధించునది గాదు.

## 10. సాధ్యోదేః[1]

వ్యా. దేః = దీర్ఘము కంటెఁ బరముగ, సాధ్యః = సాధ్యబిందువుండును.

వి. దీర్ఘాక్షరాత్పరతోబిన్దుస్సాధ్య ఏవ స్యాత్. కాఁక - వీఁక.

వ్యా. దీర్ఘముకంటెఁ బరముగా సాధ్యబిందువె యుండును.

దిర్దీర్ఘస్య (సం. 14) యను సూత్రము ననుసరించి దీర్ఘమునకు 'ది' యని సంజ్ఞ. సాధ్య మనఁగా ఖండబిందువు. దీర్ఘ మైనయచ్చునకుఁ బైని ఖండబిందు వుండును. ఆ, ఈ, ఊ, (ఋా ఌా) ఏ ఓ, ఐ ఔ లు దీర్ఘాచ్చులు. కాఁక - మీఁగడ మొ॥

'సాధ్యః' అనుటచే దీర్ఘమునకుఁ బైని సిద్ధ మనఁగాఁ బూర్ణబిందు వుండ దని యర్థ మగుచున్నది. ఇట్లు దీర్ఘముపైని బూర్ణబిదుంవు లేదనుట వలన వ్యాకరణముచే దీర్ఘముపైఁ పూర్ణబింధువు నీ సూత్రము వారించుచున్నది. ఇట్లే 'సాధ్యోదేః' యను సూత్రము 'దీర్ఘము మీఁద సాధ్యపూర్ణము లే' దను నర్థమును సాధింపఁగలుగుచున్నది కాని బాలవ్యాకరణము ననుసరించి దీర్ఘముపై సహజసిద్ధ మగు పూర్ణబిందువు యుండుటకు వీలు గలదు. ప్రస్తుత లక్షణము ననుసరించి యా యవకాశము లేదు. కాంచ్న వాంచు అనురీతి నరుదుగాఁ గలవు.

## 11. అదుదోదైదౌతో దన్త్యాః

వ్యా. అత్, ఉత్, ఓత్, ఐత్, ఔతః = అ, ఉ, ఒ, ఐ, ఔ, అనునవి, దన్త్యాః = దంత్యములు.

వి. అదుదోదైదౌతోదన్త్యాస్స్యుః.

1. దీర్ఘాత్సాధ్యః - దీర్ఘాక్షరతోఽర్ధఏవ. (ఆం. కౌ. పరి. 25)

వ్యా. అ, ఉ, ఒ, ఐ, ఔ లు దంత్యములు. అత్ మొదలగుచోట్ల నున్న త కారము లుచ్చారణ సౌకర్యమునకై చేర్పఁబడినవి. కాని తత్కాలమాత్ర గ్రహణ ప్రయోజనమునకై చేర్పఁబడినవి గావని గ్రహింపవలయును. చింతామణ్యా దులందు నిట్లే తకార ముచ్చారణార్థము చేర్చుట స్పష్టమే. సోర్థగితః, ఇతాం జసః కిస్స్యాత్ మొ॥ కాఁగా హ్రస్వదీర్ఘప్లుతములుగా మూడు విధము లయియున్న, అ, ఉ, ఒ, అనునవియును, దీర్ఘము, ప్లుతము ననుభేదముతో ద్వివిధము లయిన ఐ, ఔ అనునవియును దంత్యము లగు నని సూత్రార్థము.

దంత్యము లనఁగా దంతముల సహాయముచే నుచ్చరింపఁబడునవి. దంతభవము లగుటచే నీ వర్ణములు దంత్యము లని గ్రహింపవచ్చును.

## 12. ఇదేతౌ తాలవ్యౌ

వ్యా. ఇత్, ఏతౌ = ఇ కారమును, ఎ కారమును, తాలవ్యౌ = తాలవ్యములు.

వి. ఇకారైకారౌ తాలవ్యావచౌ స్తః.

ఇ, కారమును ఎ కారమును దాలవ్యము లయిన యచ్చులు. సంస్కృతమునందు హ్రస్వము లయిన ఎ, ఒ లు లేకుండుటచే నీ సూత్రమున 'ఏత్' అనియుఁ బూర్వ సూత్రమున 'ఓత్' లనియు దీర్ఘములె యుచ్చరింపవలసివచ్చినది. వీనిచేఁ దెలుఁగున ఎ, ఒ అను హ్రస్వములె గ్రహింపవలెను. ఇత్, ఏత్, అనుచోట్ల నున్న త కారములు పూర్వసూత్రము నందువలెనే యుచ్చారణార్థము చేర్పఁబడినవి. కావున హ్రస్వదీర్ఘ ప్లుతములను భేదముచే మూఁడు విధము లయిన ఇ, ఎ, లును దాలవ్యము లగును.

తాలుభవము లగుటచే నీయవి తాలవ్యములు. తాలు వనఁగా దౌడ కా దనియు, ముం దున్న దంతముల కించుకపై నుండు నోటిలోపలి భాగ మనియు వ్యాఖ్యలవారు స్పష్టము చేసిరి. (వ్యా. సం. స.)

## 13. ఋచ్చ

వి. ఋకారోఽపి తాలవ్యాచ్ స్యాత్.

వ్యా. ఋత్ చ = ఋకారము నయితము తాలవ్య మగును.

'ఇదే తౌ తాలవ్యౌ' యను పూర్వ సూత్రము ననుసరించి యిచ్చట 'చ' శబ్ద మువే ఋకారము తాలవ్యము న నను నర్థము సిద్ధమగుచున్నది. ఇచటను ఋత్ లనుచో

తకార ముచ్చారణార్థము చేర్పఁబడినది. కావున సంస్కృతమునుండి వచ్చి చేరు హ్రస్వమును (దీర్ఘమును) ప్లుతమును నయిన ఋ కారము తాలవ్య మగును.

ఋ కారము యొక్క స్థానము మూర్ధము. 'ఋ టు రషాణాం మూర్ధా' అని యిచట నిది తాలవ్యముగాఁ జెప్పఁ బడుట విశేషము.

ఋ కార మచ్చ తెలుఁగున లేదు. సంస్కృత సమముల మూలమున సంస్కృతమునుండి ప్రవేశించెను. కావునఁ బూర్వ సూత్రమునొద్ద ఋ కారమును విడిచి దానిని బ్రత్యేకముగా నిటఁ బేర్కొని యుండవచ్చును. ఌ కారము విషయము ప్రస్తావింపఁ బడలేదు. ఋ ఌ వర్ణముల సావర్ణ్యమును బట్టి (ఋ ఌ వర్ణ యో ర్మిథః సావర్ణ్యం వాచ్యమ్) ఋ కారమునకుఁ జెప్పిన తాలవ్యత ఌ కారమునకును గల్గునని యభిప్రాయము గానోపును. ఇది యస్పష్టము.

## 14. ద్వివిధోఽజ్రావణస్య[1]

వ్యా. రావణస్య = రావణుఁ డను లాక్షణికుని మతమున, అజ్ = అచ్ప్రత్యాహారము, ద్వివిధః = రెండు విధములు.

వి. అచ్ప్రత్యాహారో హ్రస్వదీర్ఘ భేదాభ్యాం ద్వివిధస్స్యా ద్రావణస్య మతే.

వ్యా. రావణుని మతమున హ్రస్వము దీర్ఘమునను భేదముతో నచ్ప్రత్యాహారము రెండు విధములు. అచ్ప్రత్యాహార మనఁగా నా ప్రత్యాహారముచే బోధింపఁబడు వర్ణములు. అ ఇ ఉ (ణ్) ఋ ఌ (క్) ఏ ఓ (ఙ్) అనునవి యేడు నచ్ప్రత్యాహారసిద్ధము లగు వర్ణములు.

రావణుని మతమున నీ యే డచ్చులును హ్రస్వము దీర్ఘము నని రెండు విధములుగనె యుండును తెలుఁగున. 'అణేజౌత్రివిధౌ' యని యీ వ్యాకరణమునందు హ్రస్వ దీర్ఘ ప్లుతము లని మూడు భేదములు పేర్కొనబడినవి. కావున రావణుని మతమున వీనికిఁ బ్లుత మను మూఁడవ భేదము లేదని తాత్పర్య మగుచున్నది.

'ఐ చ్ న హ్రస్వ' యని యిందు ఐ ఔ లకు హ్రస్వ మను భేదము లేదు. దీర్ఘమును, బ్లుతము నని రెండు విధములే. రావణుఁ డచ్ప్రత్యాహారము ద్వివిధ మని చెప్పుటచే 'ఐచ్' లనువాని ప్రసక్తి యిట లేదు. ఐ ఔ లకు హ్రస్వభేదము లేకుండుటచేఁ బ్రస్తుత వ్యాకర్త మతమునందే యవి రెండు విధములు. రావణుని మతమున నున్న

---

1. ద్వివిధోఽజ్ (ఆం. కౌ. పరి. 20)

అప్రత్యాహారమె రెండు విధములు. కాఁగా ఐ ఔ లు ద్వివిధములు గావు. అవి యొకే విధము. ఐ ఔలు దీర్ఘములు మాత్రమె యగును. అ ఇ మొదలగు వానికె యంగీకరింపని ప్లుత మను భేదము రావణుఁడు ఐ ఔ ల కంగీకరించె ననుటయు నుచితము గాదు.

కావున నిచ్చట ద్వివిధః అనుటలోఁ దెలుఁగు నందుఁ బ్లుతము లేదనుటయు రావణుని మతముగా నెన్నదగును. ఐ ఔ లకును ప్లుతము లేదు.

ఇట అజ్ఝ్ద్వివిధ మని కాక తెలుఁగునఁ బ్లుతము లే దని పేర్కొన్న నింకను సూచిగను సమగ్రముగను నుండెడి దని భావించుటలోఁ దప్పు లేదు.

## 15. రో నిత్యమ్[1]

వ్యా. రః = రేఫము, నిత్యమ్ = నిత్యముగాఁ, ద్వివిధః = రెండు విధములు.

వి. అస్మిన్ శాస్త్రే రేఫస్తు రేఫఱకార భేదాభ్యాం నిత్యం ద్వివిధస్స్యాత్.

వ్యా. త్రిలింగ వ్యాకరణమున రేఫము, ర - ఱ - యను భేదముతో రెండు విధము లయి యున్నది. ర వర్ణము సాధురేఫ మనియు, ఱ వర్ణము శకట రేఫ మనియుఁ బ్రసిద్ధము. 'ద్వివిధోఽప్రావణస్య' యను పూర్వ సూత్రమునుండి ప్రస్తుత సూత్రములోనికి 'ద్వివిధః' అనునది యనువర్తించును. నిత్యశబ్ద మనుటచే లాక్షణికు లందఱమతమును నని యభిప్రాయము గావచ్చును. లాక్షణికుల మతమునఁ దెనుఁగు భాషయందలి రేఫము, సాధు రేఫమనియు, శకట రేఫ మనియు రెండు విధములు. స్వరూపము చేతను నుచ్చారణముచేతను నీ భేదము గల్గెనని ఆం. కౌ. చెప్పినది.

## 16. గవోద్యన్త వ్యఞ్జనపరపూర్వ సబిన్దు విసర్జనీయ హల్పరాః[2]

వ్యా. ది+అన్త = దీర్ఘము తుదిని గలిగిన యక్షరమును, వ్యఞ్జనపరపూర్వ = హల్లు పరముగానున్న దానికిఁ బూర్వము నందలి యక్షరము ననఁగా సంయుక్తా

---

1. రో నిత్యమ్ - అస్మిన్ శాస్త్రే రేఫస్తు రూపోచ్చారణ భేదాభ్యాం నిత్యం ద్వివిధం స్యాత్ (ఆం. కౌ. పరి. 28).
   రస్త్వత్ర గృహ్యతే ద్వి విధః. ఆం. శ. చిం. సం. 19.

2. దీర్ఘో ద్వివ్యఞ్జనపరో గురుః (త్రి. శ. 1. 12).

క్షరమునకుఁ బూర్వము నందలి యక్షరమును, సబిన్దు విసర్జనీయ హల్పరాః = పూర్ణబిందువుతోఁ గూడినది, విసర్గతోఁ గూడినది, పరముగానున్న (పొల్లు) హల్లుతోఁ గూడినదియు నయిన యక్షరములు, గవః = గురువులు.

వి. దీర్ఘాన్తవర్ణ వ్యఞ్జనపరాక్షర పూర్వ లఘువర్ణః, బిన్దు 'విసర్జనీయ సఙితాక్షర హల్పర వర్ణా ఏతే గురవస్స్యుః. శ్రీ, లక్ష్మి, వనంబు, శిరఃకంపము, ధనముల్.

వ్యా. దీర్ఘ మయిన యచ్చు చివర గల్గినదియు (శ్రీ) సంయుక్తాక్షరమునకుఁ బూర్వము నందలిదియు (లక్ష్మి-ల) పూర్ణబిందువుతోఁ గూడినదియు (వనంబు - నం) విసర్గముతో గూడినదియు (శిరఃకంపము -రః) పొల్లు పరముగా నున్న పొల్లుతోఁ గూడిన వర్ణమును (ధనముల్ - ముల్) గురువు లవును.

గుగౌ గురోః (సం. 20) అను సూత్రము ననుసరించి గురువునకు 'గు' లేదా 'గ' యని సంజ్ఞ. 'గు' అను శబ్దమునకు సంస్కృతమునఁ బ్రథమావిభక్తి బహువచనాంత మగు రూపము గవః 'ఉర్దీర్ఘస్య (సం. 14) అను సూత్రముచే 'ద' యనఁగా దీర్ఘము. బిందువు తెలుఁగున ద్వివిధము. అయినను నిచ్చట నఱ సున్నను గాక నెఱ సున్ననే గ్రహింపవలెను. కాఁగా 'వనంబు' అనుచో 'నం' అనునది గురువు కాని 'ఎరఁచె' యనుచో రవర్ణము గురువు గాదు. నిండు సున్నకు దీర్ఘ బిందువనియు, నఱ సున్నకు హ్రస్వబిందువనియు వ్యవహారము గానవచ్చుచున్నది. అప్పకవి 'హ్రస్వ మనఁగ నొప్పు నర్ధబిందువు దీర్ఘమనఁగఁ బూర్ణ బిందువయ్యె (అప్ప. 2. 84) ననుటచే నఱసున్న హ్రస్వ బిందు వగును. దీర్ఘ బిందు సహితమె గురువు. హ్రస్వబిందు సహితము లఘు వని విశేషముగనె గుర్తింపవలసియుండును.

ప్లుతము నంగీకరించువారి పక్షమున నిచ్చటి దీర్ఘము ప్లుతమునకు నుపలక్షణ మని గ్రహింపవలెను. అపుడు దీర్ఘమును, దీర్ఘాంతమును, ప్లుతమును, ప్లుతాంతమును గురువులె. ఆ, ఆ 3, రా, రా 3 మొ॥

## 17. హపరో లః[1]

వ్యా. హపరః = హ్రస్వ విశిష్ట మయిన యక్షరము, లః = లఘువు.

వి. హ్రస్వపరో వర్ణః లఘుస్స్యాత్. క, హరి ఇత్యాది.

వ్యా. హ్రస్వమైన యక్షరము లఘు వగును.

---

1. హ్రస్వ పరోలఘుః (త్రి. శ. 1. 13)

'హో హ్రస్వస్య' (సం. 14) యను సూత్రము ననుసరించి 'హ' యనునది హ్రస్వమునకు సంజ్ఞ. 'లో లఘోః' (సం. 21) అను లక్షణమును బట్టి లఘువునకు 'ల' యని సంజ్ఞ.

హ్రస్వమైన యచ్చును, హ్రస్వ మగునచ్చు గలిగిన యక్షరమును లఘువగును. అ-ఇ, క-కి మొ॥ గురులఘు నిర్ణయమున ననుస్వార విసర్గలకు పొల్లు లగు హల్లులకు వలెనే ప్రత్యేక పరిగణనము లేదు. దీర్ఘ బిందువు (నిండు సున్న) తోఁ గూడఁ బూర్వవర్ణము గురువు. హ్రస్వబిందువు (అఱసున్న) తోఁ గూడఁ బూర్వమందలి హ్రస్వవర్ణము లఘువు.

## 18. దన్త్యాశ్చురతాలవ్యే[1]

వ్యా. చుః=చవర్గములు, అతాలవ్యే = తాలవ్యములకంటె వే ఱయిన యచ్చుతోఁ గూడియున్నపుడు, దన్త్యాః = దంత్య మగును.

వి. తద్భవదేశ్యాదీనాం దన్త్యాశ్చవర్గస్స్యాదతాలవ్యేఽచిపరే. చనువు, చాయ, చుక్క, చూపు, చొప్పు, చోద్దెము; చోటు, చైక, చౌకు, జన్నము, జాతర, జుట్టు, జూదము, జొన్న, జోక, జోడు.

వ్యా. తద్భవము, దేశ్యము మొద లయిన శబ్దములందు, తాలవ్యములుగాని యచ్చులతోఁ గూడినపుడు చవర్గము దంత్య మగును.

చుః అనఁగా చవర్గము (అణుదిత్సవర్ణస్య చాప్రత్యయః) అచ్చతెలుఁగున ఛ, ఝ, ఞ, యను వర్ణములు లేవు. కాఁగా చవర్గ మనఁగా చజలు రెండే యగుచున్నవి. 'సప్తప్రాణాః' (పరి. 3) అని చెప్పఁబడిన యచ్చు లేడును బిదప దంత్యములు, తాలవ్యములు నని రెండుగా విభాగింపఁబడినవి. 'ఇదేతౌతాలవ్యౌ' (పరి. 12) యను సూత్రము ననుసరించి ఇ ఈ ఎ ఏ లు, (బుచ్చు) తాలవ్యములు. తాలవ్యములుగానివి యనఁగా దంత్యములు. అవి అదుదోదైదౌతో దన్త్యాః (పరి. 11) అను సూత్రము ననుసరించి అ, ఆ, ఉ, ఊ, ఒ, ఓ, ఐ, ఔ, యను నచ్చులు దంత్యములు. దంత్యము లయిన యీ యచ్చులతోఁ గూడిన చజలు దంత్యము లగును. ఇది యచ్చతెనుఁగునందే యని గుర్తింపవలె.

---

1. దన్త్యౌత్విమౌయదా (త్రి. శ. 1.25).

అర్ధదన్త్యః (ఆం. కౌ. పరి. 34) (ఆం. శ. చిం, 23).

చుర్దన్త్యోఽతాలవ్యాచ్ వై. చం. అజన్త. 52 (దీనివృత్తి కొంతభిన్నమై బాల సం. 10. కు మూలమనఁ దగియున్నది.)

కాఁగా అచ్చులెనుఁగున 'అఆ ఉఊ ఒఓ ఐఔ లతోఁ గూడిన చజలు దంత్యము లగు' నని సూత్రము నర్థము. చనువు-జౌకు మొ॥

ఐ కారముతోఁ గూడిన దంత్యమగు నని చెప్పఁబడుటయే కాక యందుకు 'చైక' యనునది యుదాహరింపఁబడినది. చిన్నయసూరి 'ఐదంతము లయిన చజలు సమేతర శబ్దములందు లే' వని స్పష్టము చేసెను. ఇట నుదాహరింపఁబడిన 'చైక' యనునది యస్పష్టము. ఈ శబ్దము కోశములందును గానరాదు. సూరియభిప్రాయమునకు భిన్నముగాఁ బ్రామాణిక ప్రయోగము లభింపదు. 'చక్కెర బొమ్మకున్ మార్మొలయు చైవుల' (శుక-1.213) లనుచో చైవు అనునది కోశముల కెక్కినది. ఇంకన్ చై, (చెయి) (సూ.ని) చైది యను నొంటు రెండు గానవచ్చును. చైదము చైదీ యనఁగఁ జెల్లు (కవి సం. 2. 106) ఇట్టి వీని నెంతవఱకుఁ బ్రమాణములుగాఁ జెప్పఁగలము. వానిని గూడ గ్రహించినను 'చై' (జై) యను స్థితిని దంత్యముగాఁ జెప్పుటయుఁ గుదురదు. ఇవి తాలవ్యములుగా నుచ్చరించుటయె గమనింపఁగలము. దానికిఁ గారణము గూడ స్పష్టమే. చెయి, చెయిది, చెయువు, చెయిద మనురీతిగా వీని పూర్వరూపము నందట చకార మెత్వ విశిష్టమయి యున్నది. ఎత్త్వముతోఁ గూడినఁ దాలవ్యమె గదాయవును. 'ఎయి'కి 'ఐ' యయిన దని చెప్పినను నటఁ దాలవ్య మగుటయె సక్రమము. 'చయి' అని 'అయి' నుంచి అయికి 'ఐ' నిత్యముగా నైన దని వీనియందు దంత్యతను నిర్ణయించు (ము. కౌ. సంజ్ఞా. 10) ప్రసంగ మసహజ మనక తప్పదు.

మొత్తముమీఁద నైదంతము లయిన చజలు ప్రామాణికము లై గానరావు. కొండొకచోఁ గాన నైనను నచట నుచ్చారణమునఁ దాలవ్యములె యై యున్నవి గాని దంత్యములు గావని గుర్తింపనగును. నాఁటి వ్యవహారమున దంత్యము లగుట వివృతి య ట్లుదహరించిన దేమో. ఇంతకును 'చైక' యను శబ్దమె గానరా దాయెను. మఱి యొక యెది యేని శబ్దమో యస్పష్టము.

వి. [1]'అతాలవ్య ఇతి కిమ్' తాలవ్యాచ్పరత్వాత్తాలవ్యశ్చవర్గః. చివురు, చిఱుత, చీకు, చెలువము, చెక్కిలి, చేద, జిట్ట, జీబు, జెలగ, జెట్టి, జేజె ఇత్యాది.

వ్యా. 'దన్త్యశ్చరతాలవ్యే' యను నీ సూత్రమున 'అతాలవ్యే' యను దశ మెందుకు? తాలవ్యాచ్చులతోఁ గూడియున్నపుడు చజలు తాలవ్యము లగును.

---

1. తాలవ్యాచి చ జౌస్యాతాం తాలవ్యౌ చ స్వభావతః (త్రి. శ. 1-28). ఏతాలవ్యః (అం. కౌ. పరి. 34).

[1] ఇదేతౌ తాలవ్యౌ (పరి. 13) యను సూత్రమునుబట్టి ఇఈఎఏలు తాలవ్యములు. వీనితోఁ గూడినచో చజలు తాలవ్యము లగును. అనఁగా 'ఇచుయశానాం తాలు' అనుటవలన సహజముగా నీ చజలు తాలు స్థానీయములు. అయ్యును 'దన్త్యాశ్చరతాలవ్యే' యను నీ లక్షణముచేఁ దాలవ్యేతరము లయిన యచ్చులతోఁ గూడినపుడు తాలవ్యములు గాక దంత్యము లగును. 'అతాలవ్యే' యనుట వలనఁ దాలవ్యము లయిన యచ్చులతోఁ గూడినపుడు దంత్యములు గావు. కాఁగా నివి సహజముగాఁ దాలవ్యములె కావున దాలవ్యములె యగును.

మొత్తముమీఁద ఇఈఎఏలతోఁ గూడిన చజలు తాలవ్యము లగు నని తాత్పర్యమగుచున్నది. చిలుక - జేజ.

ఇట అద్దన్త్యః, ఏతాలవ్యః అను ఆం. కౌ. లక్షణమున నృసింహకవి 'అదన్త్యస్తాలవ్యశ్చుర్వక్రః' అను ఆం. శ. చిం. (సం. 23) లక్షణమునకు సన్నిహితము ప్రస్తుత గ్రంథమున విస్తరించి చెప్పఁబడినది.

**19.** సశ్చ[2]

వ్యా. సః చ = సకారము సయిత మట్లే చ వర్గమునకు వలెనే యగును.

వి. సకారోఽపి తద్వత్ స్యాత్ తాలవ్యాచిపరే.

సెలవు, సెలయేరు, సెలవ, సెద, సిగ్గు, సీకు, దోసె, దోసిలి. దన్త్యాచ్పరస్య-సాన, సుబ్బు, సూది, సొగసు, సోయగము, సైదు, సౌరు. ఇత్యాది.

వ్యా. సకారమును దాలవ్యాచ్చుపర మైనపుడు తాలవ్య మగును. సెలవు మొ॥
దంత్యాచ్చు పర మైనపుడు దంత్య మగును.

'దన్త్యాశ్చ రతాలవ్యే' యను పూర్వ సూత్రము ననుసరించి యిచ్చటి 'చ' శబ్దముచే సకారము గూడ చ వర్గమునకు వలెనె యగు నని యర్థ మగును. అనఁగాఁ దాలవ్యము కంటె వే అయిన యచ్చు ననఁగా దంత్యముతోఁ గూడినపుడు సకారము దంత్యమగును. 'అదుదోదైదౌతో దన్త్యాః' అను సూత్రము ననుసరించి, అఆ, ఉఊ, ఐఔ యను (దంత్యములగు) నచ్చులతోఁ గూడియున్నపుడు సకారము దంత్య మగును. సాన, సౌరు మొ॥

---

1. ఏతాలవ్యః - తాలవ్య చవర్గఏదన్తస్స్యాత్ (ఆం. కౌ. పరి. 34).
2. సశ్చ (ఆం. కౌ. పరి. 36).
   (చ ?) సస్య దన్తేఽచిదన్త్యత్వం, తాలవ్యత్వం చ తద్వతి (త్రి. శ. 6. 18).

చ వర్గమునకు వలెనె సకారము గూడఁ దాలవ్యము లైన యచ్చులతోఁ గూడి నపుడు దంత్యముగాక తాలవ్య మగును. ఇయ్యది విశేషము.

సహజముగాఁ దాలవ్యము లయిన చ జ లు దంత్య స్వరములతోఁ గూడినపుడు దంత్యము లగుట తెలుఁగున చ జ ల విషయమున విశేషము. ఇంక 'ౡ తు లసానాం దన్తాః' అనుటచే సంస్కృతానుగుణముగా సకారము దంత్యము. అయ్యును దెలుఁగునఁ దాలవ్యము లయిన యచ్చులతోఁ గూడినపుడు తాలవ్య మగుట సకారము నెడలఁ దెలుఁగులోని విశేషము.

'ఇచే తౌ తాలవ్యౌ' యను సూత్రము ననుసరించి ఇ ఈ ఎ ఏ - యనునవి తాలవ్య స్వరములు. ఇ ఈ ఎ ఏ లతోఁ గూడినచో సకారము తాలవ్య మగును. సిగ్గు, సెలవు.

'ఇచుయశానాంతాలు' అనుటను బట్టి సంస్కృతానుసారముగా 'శ' కారము తాలవ్యము. అది సంస్కృత సమముల మూలమునఁ దెలుఁగునఁ బ్రవేశించుచున్నది. ఇ ఈ ఎ ఏ లతోఁ గూడిన సకారము తాలవ్య మని యీ సూత్రము విధించుచున్నది. కావుననే యిచ్చట దంత్య మగు సకారమునకు బదులుగాఁ దాలవ్యమగు శకార మచ్చ తెనుఁగునఁ జోటు చేసికొన్నది. ఆందువలన సిగ్గు - శిగ్గు, సెలవు-శెలవు-శలవను రీతిగా వ్రాఁత యందు భేద మేర్పడినది. తాలవ్యముగా నుచ్చరించుట చేతను, దాలవ్య మగు నట్టి వర్ణ మిట్టి దొకటి యుండుట చేతను నీ తడఁబాటు గలిగిన దని యూహింప వచ్చును.

ఇట్లే సంస్కృత సమముల సైతము సీమంతిని-శీమంతిని, సేవ-శేవ యను వ్రాఁత కొండొకచోఁ గలదు.

దంత్యాచ్చుతోఁ గూడిన శకారము సకార మగుటయుఁ గొండొకచో గమనింప వచ్చును. రాశి యనుచోఁ దాలవ్య మగు శకారమె యున్నది. బహువచనమున దీని కుత్వమయి 'రాశులు' అని యగును. ఇపుడు దంత్యస్వరముతోఁ గూడియుండుట శకారమునకు మాఱుగా సకారము వ్రాయుట గలదు. రాసు లని కొందఱు దీనిని లక్షణబద్ధము చేయఁబూనుటయు గలదు.[1] (ఆంధ్ర భాషానుశాసనము సంజ్ఞ-43)

ఇది యెల్ల నుచ్చారమునందలి భ్రష్టతయె యని యంగీకరింపక తప్పదు. వీనిని బ్రమాణీకరించుటకుఁ దగిన ప్రయోగప్రామాణ్యమును గానరాదు. అందుకే ఇఈ

---

1. సావర్ణ్యాత్ శకారస్యాపి కేచిత్.రాశి-రాసులు. వై. చం. అజన్త. 52 సూ.చుర్ధన్యోః తాలవ్యాచ్, సూత్రవృత్తి.

ఎ ఏ లతోఁ గూడిన సకారము తాలవ్యమగుటను ప్రామాణికులగు లాక్షణికులు పెక్కురు ప్రస్తావించియే యుండలేదు. వారి మతము ననుసరించి ఇ ఈ ఎ ఏ లతోఁ గూడి యున్నను సకారము దంత్యమె కాని తాలవ్యము గాదు.

## 20. యః ప్రాణస్య[1]

వ్యా. ప్రాణస్య = అచ్చునకు, యః = యకార మగును.

వి. ప్రాణాత్పరస్య ప్రాణస్య యకార స్స్యాత్. భామ యాబిడ, హరి యీతఁడు, కన్నె యరిగె, నీకై యిచ్చితి, తనకో యని పల్కె, గ్లౌ యుదయించె ఇత్యాది.

వ్యా. అచ్చుకంటెఁ బర మయిన యచ్చునకు యకార మగును. హరి + ఈతఁడు= హరి యీతఁడు మొ॥

ఆదిః ప్రాణః (సం. 4) అను సూత్రము ననుసరించి అకారము మొదలగు వానికిఁ బ్రాణమని సంజ్ఞ. ప్రాణ మనఁగా నచ్చు. వివృతియందుఁ జెప్పఁబడిన విశేషము ననుసరించి యచ్చుకంటెఁ బరముగా నున్న యచ్చునకు యకారము వచ్చును.

సంధి యయినపు డచ్చున కచ్చు పరముగా నుండదు గావున నీ యకారము సంధి లేనపుడే వచ్చును. పరముగా నున్న యచ్చునకును నీ యకారము పూర్వమునం దాగమముగా వచ్చు నని గ్రహింపఁదగును. కావున బరప్రాణ మట్లు యుండును.

హరి + ఈతఁడు, హరి య్ ఈతడు = హరి యీతఁడు మొ॥ రాముడు + అతడు = రాముఁ డతఁడు మొద లగు రీతిగా సంధి యయినచోట్ల యకార మాగమము ప్రసక్తి లేదు. అచ్చుకంటెఁ బరమగుట, యకారము పూర్వాగమ మగుట యను నంశములు సూత్రమునఁ జెప్పఁబడిన బాగుండెడివి. ఇది యిచ్చట సరిగా సందర్భ పడియు నుండలేదు.

## 21. న యవలామ్[2]

వ్యా. యవలామ్ = యవల లకు, న = (విరోధము) లేదు.

---

1. యోచోఽచ్ (ఆం. కౌ. పరి. 30) లఘుర్యోచోఽచః (వై. చం. సంధి. 2). ప్రాణానాంయశ్చ. త్రి. శ. 2. 33.
2. నయవలాం లఘ్వలఘూనామ్ (ఆం. కౌ. పరి. 30). నాన్యేషాం వైధర్మ్యంలఘ్వ లఘూనామ్ (ఆం. శ. చిం. సం. 26).

వి. లఘ్వలఘూనాం యవలాం విరోధో న స్యాత్.

వ్యా. లఘువులు నలఘువులు నైన యవల లకు విరోధము లేదు.

'యరలవ' యను వర్ణములు లఘువు లనియు నలఘువు లనియు రెండు విధములు. ఇందు లఘువులైన, యవల లకును నలఘువు లయిన యవల లకును బరస్పరము విరోధము లే దని యర్థము. లేనిచి విరోధ మనియు, నది లఘ్వలఘువులకుఁ బరస్పరము లే దనియు రెం డంశములు వృత్తియం దుండి గమనింపఁదగిన విశేషములు. ఈ యంశములు సూత్రముననే స్పష్టముచేసిన బాగుండెడిది. విరోధము లేదనుటకంటె మైత్రి యుండు నని చెప్పుట యుచిత మేమో యనియుఁ దోచును.

ఏ మయినను వివృతి ననుసరించి లఘుయకారము నలఘుయకారమును మిత్రములు. అట్లే లఘ్వలఘువులు నైన వకారములును, లఘ్వలఘువు లైన శకారములును మిత్రములు.

ఇచట మైత్రి యనఁగా యతిప్రాసమైత్రి యని యితర గ్రంథములనుబట్టి తెలియవచ్చును. 'ఆ యజుని తండ్రి ఫణి రాజశాయి యనఁగ' ఇచట లఘుయకామురన కలఘుయకారముతోఁ బ్రాసయతిమైత్రి చెల్లినది.

యతిప్రాసమైత్రిని గూర్చి వ్యాకరణములు ప్రసగింపవలసిన యవసరము తెలియకున్నది (ఇట్లే గురులఘు నిర్ణయాదులును). అట్టి మైత్రి యని యిందు స్పష్టముగాఁ జెప్పఁబడుటయుఁ గానరాదు. మఱి యే దేని ప్రయోజనము శబ్దశాస్త్రమునకు సంబంధించినది గల దేమో పరిశీలింపవలయును.

ఇట వివృతియందును యతిప్రాస మైత్రి ప్రయోజనముగాఁ జెప్పఁబడలేదు.

22. రయోర్నిత్యమ్[1]

వ్యా. రయోః = రేఫలకు, నిత్యమ్ (విరోధము) నిత్యము.

వి. రేఫఱకారయోర్నిత్యం విరోధ స్స్యాత్. కఱచు, తఱుచు, విఱిచె, గఱిత

వ్యా. రేఫమునకు ఱకారమునకు విరోధము నిత్యముగా నుండును. "రో నిత్యమ్" (పది-15) అనుసూత్రము ననుసరించి రేఫము రెండువిధములు. సాధురేఫము,

1. రయోర్నిత్యమ్ (ఆం. కౌ. పది. 31).
రయోస్తు నిత్యం స్యాత్ (ఆం. శ. చిం. సం. 26).

శకటరేఫము. 'రయోః' అను నిచ్చటి ద్వివచనముచే సాధుశకటరేఫములు రెంటు గ్రహింపఁబడును. కాఁగా సాధురేఫమునకును శకటరేఫమునకును నిత్యముగా విరోధము గల దని సూత్రార్థము.

పూర్వ సూత్రమార్గము ను బట్టి యిచట విరోధ మనఁగా యతిప్రాసలయందు మైత్రి లేకుండుట యని చెప్పవలయును. అపుడు సాధుశకటరేఫములకుఁ బరస్పరము యతియందుఁగాని ప్రాసయందుఁ గాని మైత్రి లే దని తాత్పర్య మగును.

యతిప్రాసమైత్రి విషయము శబ్దశాస్త్రమునఁ బ్రస్తావింపవలసిన యవసరము గానరాదనుట యిచటఁ గూడ గమనింపఁదగినదే.

ఇంతకు నిచ్చటఁ గూడ వివృతియందును యతి ప్రాసమైత్రి ప్రయోజన మని చెప్పఁబడలేదు. ఉదాహరించిన తీరునుబట్టి చూడఁగా నీ విరోధమువలన సాధురేఫ ముండ వలసినచోట శకటరేఫము గాని శకటరేఫ ముండవలసినచోట సాధు రేఫము గాని యుండ దని చెప్పఁదలఁచినదా యనిపించును. అదియు నెంతయు ననవసర మనుట స్పష్టమే. ఈ పక్షమున యవలలకు విరోధము లే దనుట కుదురదు గదా ఏఱు లనుచో నేలు లనియు, కల యనుచోఁ గళ యనియు నెట్లు చెప్పుదురు?

న యవలామ్, రయోర్నిత్యమ్ లను నీ లక్షణములకు శబ్దశాస్త్రమునకు సంబంధించిన ప్రయోజన మేది యేని గలదో? స్పష్టము గాకున్నది.

వి. సూత్రే తత్సమ తద్భవాగ్రహణాత్తయోరేఫ ఏవస్యా దితి బోద్ధవ్యః. కరములు, వరదుఁడు, తురక, నిద్దుర, చిత్తరువు, దురను ఇత్యాది.

వ్యా. సూత్రమునందుఁ దత్సమములును దద్భవములును గ్రహింపఁబడక పోవుటచేఁ దత్సమ తద్భవములందు సాధురేఫము మాత్రమె యుండును శకట రేఫ ముండదు. కరములు మొ॥ దేశ్యాదులం దన్నచోఁ బై రీతిని శకటరేఫమె కాక సాధురేఫము నుండును.

ఈ వివృతి సమంజసముగా నున్నట్లు దోఁచదు తత్సమతద్భవములందు శకట రేఫము లే దని చిన్నయసూరియును జెప్పెను. (తద్భవములం దలఘు రేఫము గలదు. (ప్రౌఢ. సంజ్ఞా. 8) అది యట్లుండ నా యర్థమును సాధించిన తీరె యసమర్థముగ నున్నది.

తత్సమ తద్భవము లీ సూత్రమున గ్రహింపఁబడ వేల ? ఇది సాధు శకట రేఫములకు విరోధము నిత్యమని గదా చెప్పుచున్నది. తత్సమ తద్భవములను

గ్రహింపక పోవుట చేత నచట సాధు రేఫమె యుండు నను తరువాతి వివృతి వాక్యము ననుసరించియుఁ దత్సమ తద్భవా గ్రహణ మీ సూత్రము నుద్దేశించి యుండరాదు. ఇంక నసలు సాధు శకటములతో రేఫకు ద్వైవిధ్యమును జెప్పుచున్న సూత్రమునందు దీనిని గూర్చిన విచారణ మవసరముగాఁ గలదు. అది 'రో నిత్యః' (పరి. 15) మ్మనునది. మఱి యీ ప్రసంగ మచ్చటఁ జేయక యిచటఁ జేయ నేల ?

అది యట్లుండఁగా సూత్రమున గ్రహింపఁబడినదా? లేదా యను విచారణ మెట్లు? సూత్రమునం దన్ని చోట్ల నట్లు గ్రహింపఁబడుచున్నదా ? 'దన్త్యశ్చర తాలవ్యే' యని మాత్రమె సూత్ర ముండఁగా వివృతి 'తద్భవ దేశ్యాదీనా' మ్మని తద్భవము నెట్లు పేర్కొన్నది. ఇట నేల పేర్కొనలేదు. సూత్రమునఁ జెప్పఁబడని యంశము లనేకములు వివృతి నుండుట 'యః ప్రాణస్య' మున్నగు సూత్రములలో గమనింపఁ దగియే యున్నది. సూత్రమునందుఁ జెప్పియున్న పదమును గూర్చిన విచారణము యుక్తము. కాని యిందు సూత్రమున లేని పదమును గూర్చిన చర్చ యథార్థమును సాధింపఁజాలదు.

ఇంక నిదియు నట్లుండఁగా సూత్రమునఁ దత్సమ తద్భవములను గ్రహించి నచోఁ దత్సమ తద్భవములందు మాత్రమె ద్వైవిధ్య ముండి దేశ్యాదుల యం దుండదు. దేశ్యాదులయ దు నున్నదని చెప్పునపుడు మొత్త మాంధ్ర భాషలో నుండఁగాఁ దత్సమ తద్భవ దేశ్యాచ్ఛములయం దని చదువ నేల ?

తత్సమ తద్భవములం దిష్టము గానిచోఁ దత్సమ తద్భ వేతరములందు రేఫము ద్వివిధ మని చెప్పవలసియుండును

మొత్తము మీఁదఁ దత్సమ తద్భవములందు సాధురేఫమె యుండు నను నర్థము సూత్రము నందలి పదము ను బట్టి సాధింప వీలు లేదు. 'యః ప్రాణస్య' మొదలగు స్థలములందు వలె వ్యాఖ్యానమునందు విశేషముగాఁ జెప్పుకొనవలనదే. ఇంకను దంత్య తాలవ్య చ జ ల వలెఁ దత్సమేతర భాషయందు రేఫ ద్వివిధ మని చెప్పి తత్సమములో శకట రేఫము లే దని గ్రహింపవచ్చును. తత్సమములో శకట రేఫము లే దను నంశము నె ట్లేని స్మరింప నవకాశము గలదు. సంస్కృతమున లేని యచ్చ తెనుఁగు లగు దంత్య చ జ లును సంస్కృత సమముల నుండవు గదా. విశేషముగాఁ జెప్పికొనినఁ దప్పు. ద త్య చ జ ల వలెనె శకట రేఫము నయితము తత్సమము లందు లేకుం డుటను గుర్తింపవచ్చును.

కావి తద్భవములందు లేదని చెప్పుట మాత్రము విశేషము గాక తప్పదు. అచ్చర, మొదలగు రీతిగాఁ దద్భవములందును దంత్య, స్వరముతోఁ గూడిన చ జ యి దేశ్యాదులందు వలెనె దంత్యము లగు చున్నవి గదా.

**23.** న ప్రేరయోస్సావర్ణ్యమ్[1]

వ్యా. రయోః = రెండు రేఫలకును, ప్రే = ప్రాసయందు, సావర్ణ్యమ్ = సవర్ణత న = లేదు.

వి. ప్రాసస్థానే రేఫ ఱ కారయో స్సావర్ణ్యం న స్యాత్.

వ్యా. ప్రాసయందు రేఫమునకును ఱ కారమునకు సావర్ణ్యము లేదు.

ప్రోఽనన్తరమ్ (సం.19) ప్రః = ప్రాసస్య (సం-7) యను లక్షణమునుబట్టి 'ప్ర' యనునది ప్రాసకు సంజ్ఞ. 'రయోః' అనునప్పటి ద్వివచనముచే రెండు రేఫలు 'రో నిత్య' మ్మను లక్షణమును బట్టి యవి సాధు (ర) శకట (ఱ) రేఫములు. కావున ర-ఱ లకుఁ బరస్పరము ప్రాసయందు మైత్రి లేదని యర్థము. అనఁగా సాధురేఫమునకు సాధురేఫముతో మాత్రమే ప్రాస చెల్లునట్లే శకటరేఫమునకు శకటరేఫముతో మాత్రమే ప్రాస చెల్లు.

వి. ప్ర ఇతి శబ్ద ప్రయోగాద్యతిస్థానే తయో స్సావర్ణ్యం స్యాదితి జ్ఞాయమ్.

రేఫ ఱ కారయో రుదాహరణాని - అథర్వణభారతే.

కం॥ కురుపతి రవిసుతుని సువ
ర్ణరత్న భూషణ తతుల నుఱక బహుమతిఁజే
సి రభసము మీఱ సేవల
కు రాజు గావించె సమరకుశలుం డగుటన్.

వ్యా. 'నప్రే' యని సూత్రమున' ప్ర' శబ్దమును గ్రహించుటచేత యతియం దీ సావర్ణ్య నిషేధము లేదు. అనఁగా యతియందు సావర్ణ్యము గలదు. కావున సాధు శకటరేఫములకు యతియందు మైత్రి కలదు. ర-ఱ లకుఁ బరస్పరము యతి వేసికొనవచ్చును.

---

1. కశ్చిద్వదతి సాజాత్యం యతావేవానయోః (అ. కా. సం. 20).

ఆథర్వణుని భారతమందలి పై పద్యమున రెండవ పాదమున సువర్ణ శబ్దము నందలి సంయుక్త మయియున్న సాధురేఫమునకు 'నుఱక' యను చోటి శకటరేఫ ముతో యతి చెల్లినది.

యతియందును ర-ఱ మైత్రి లేదని యప్పకవ్యాదుల మతము. అప్పకవి, ఏకతర యతి ప్రాసవైరములం దీయంశమునె అంతకు మునుపే పేర్కొనెను.

కం॥ త్రిమయక రేఫములకు రే
ఫములను ఱాలకును ఱాలఁ బ్రాసములను వి
క్రమములను జెప్పఁదగు నీ
క్రమ మెఱుఁగక రెంటను గుకవి కూర్చుఁ గృతిన్. (అప్ప. 2. 295)

ఇట్లె కొంద ఱితరులును. శారదాదర్పణములోఁ బ్రాస మైత్రి లేదుగాని ర ఱ లకు యతి చెల్లు నని చెప్పఁబడిన ట్లప్పకవి పేర్కొనె. (అప్ప 2.300) ప్రస్తుతవ్యాకరణము నట్లే పేర్కొన్నది.

ఇంకఁ బై యథర్వణ భారత పద్యమునఁ బ్రాసము సాధురేఫమునకు సాధురేఫము తోనే చెల్లుట గుర్తింప నవును. ఇట్లే శకటరేఫకు శకటరేఫతోనే ప్రాస చెల్లును.

వి. ఱకారస్య -

కం. తఱుచైన కురుబలంబుల
మఱపించుచుఁ గడిమి మెఱయ మాఱిమసఁగి న
ట్లఱిముఱి బెడంగు గదఁ గొని
కఱువలి కొడుకండు నుఱుము గావించె వడిన్ !

వ్యా. ఇచట శకటరేఫమునకు శకటరేఫముతోనే ప్రాసము చెల్లినది.

కం. గురు భీష్మ కర్ణ గాంధా
రరాజ భూరిశ్రవులు దొరకు దోర్ధృతి గ్ర
చ్చఱ కవ్వడి మార్కొని ని
బ్బరముగ నటు గురిసి రంపవానలు గడిమిన్.

వ్యా. వివృతియం దుదాహరింపఁబడిన యీ పద్యమున మూఁడవ పాదము నందు 'గ్రచ్చఱ' యను శబ్దమునఁ బ్రాస స్థానమున శకట రేఫ మున్నది. మిగిలిన పాదములందు గురు , రాజ, నిబ్బర - యనుచో సాధు రేఫ మున్నది. కాఁగా

ని పద్యమున సాధు శకటరేఫములకుఁ బ్రాస యందును మైత్రి కుదురుపఁబడినవి. ఋకచ్ఛబ శబ్దమునం దుండవలసినదియు శకట రేఫమె.

ఇట వివృతి యందు మూఁడు పద్యము లుదాహరింపఁబడినవి. ఇందు మొదటిది సాధు రేఫ ప్రాసము. రెండవది శకట రేఫ ప్రాసము. మూఁడవ పద్యమేల? సాధు శకటములు రెండింటికిఁ బ్రాస[1]. కాక మొదటిది సాధు శకటములకు యతి చెల్లినందు కనియు, రెండవది శకట రేఫ ప్రాసము గాఁగా మూఁడవది సాధు రేఫ ప్రాసమున కీయఁబడిన దనవచ్చును. అట్టి యెడల రెండవ పద్యమునకు ముందు 'ఋకారస్య' యని చెప్పినట్లు మూఁడవ పద్యమునకు ముందు 'రేఫస్య' యని చెప్పియుండఁడా? ఋకచ్ఛబ యనుచో నపూర్వకముగా సాధురేఫమె యుంచుటయు సరి గాదు గదా.

'రయో ర్నిత్యమ్' అనునది విరోధము నిత్యముగాఁ నుండుటను చెప్పుచున్నది. దానికి బ్రయోజనము యతిప్రాస మైత్రి లేకుండుటయె యైన నిట మఱల 'న ప్రేరయో స్స్యా వర్ణ్య' మ్మని ప్రాసయందు సావర్ణ్యము లేదనుట యేల? పూర్వ సూత్రముచే సిద్ధించునే కదా. యతి యం దిష్ట మయిన దానిని విధించుకొనసగును గదా. 'రయో ర్నిత్యమ్' అను దానికి విరోధ మనఁగా యతి ప్రాస మైత్రి లేకుండుట గా దనఁగా 'న యవలా' మ్మను సూత్రము నొద్దను విరోధము లేకుండుట యనఁగా యతి ప్రాస మైత్రి చెల్లుట ప్రయోజనము గా దని చెప్పవలయును. వివృతియం దట్లు చెప్పకుండుటకుఁ గారణ మవియ యగు నేమో.

## 24. సాంస్కృతిక దన్త్యౌ చౌ ప్రయతిశ్లేష చిత్రేషు సమౌ.[2]

వ్యా. సాంస్కృతిక దన్త్యౌ = సాంస్కృతికమును దంత్యమును నయిన, చౌ = చవర్గలు, ప్రయతిశ్లేషచిత్రేషు = ప్రాసయందును, యతియందును, శ్లేషయందును, చిత్రకవితలోను, సమౌ = సమములు.

వి. ఆంధ్ర దన్త్య చవర్గ సాంస్కృతిక చవర్గౌ ప్రాసయతిశ్లేషచిత్రేషు తుల్యాకృతీ స్తః.

---

1. అపదద్చాత్ర సాజ్గత్యం ప్రాసేష్వపి చ కళ్పన (అ. కా. సం. 20).

2. ప్రాయ శ్లేషే చిత్రే సమాకృతీ- సంస్కృతాభ్యాం చజాభ్యాం యాతః కార్యాతిదేశాత్ సమానోచ్చారణౌ శ్లేషే దన్త్యౌ సాంస్కృతికౌ (త్రి.శ. 1. 29, 30, 31).

వ్యా. అచ్చతెనుఁగు నందలి దంత్యచవర్గమును, సంస్కృతమునకు సంబంధించిన (యనఁగా సంస్కృత సమములందలి తాలవ్య) చవర్గమును ప్రాస, యతి, శ్లేష, చిత్ర స్థలములందు సమానము లైయుండు నని యర్థము.

ప్రః ప్రాసస్య (సం. 7) యను లక్షణమునుబట్టి 'ప్ర' యనఁగాఁ బ్రాస. దంత్యము లైన చజలు సంస్కృత సమేతరము లయిన శబ్దములందే యుండును. కావున సాంస్కృతికచవర్గ మనఁగాఁ దాలవ్యచవర్గ మని యర్థము. దంత్యములు సంస్కృతమున రేవు. కాఁగా నవి యాచ్ఛికములే యగుటయు స్పష్టము. కాఁగా నచ్చ తెనుఁగునందలి దంత్యము లయిన చజలకు ననఁగా, అఆఉఊఒఓఐఔలతోఁ గూడిన చజలకు సంస్కృతసమము లందలి తాలవ్యము లయిన చజలతోఁ బ్రాసాదుల యందు మైత్రి కల దని సూత్రము యొక్క యర్థము.

వివృతిలోఁ దుల్యాకృతి యని చెప్పఁబడినది. ఆకృతిలోఁ దుల్యత యనునది సరిపడునదిగాఁ దోఁపదు. వివృతియందుఁ జూపఁబడిన యుదాహరణముల తీరును బట్టియుఁ బ్రాసాదుల యందు మైత్రి యని గ్రహింపదగును.[1]

ఏ. ప్రాసే జైమిని భారతే-

కం॥ ముచుకుందవరదుఁ డెంతే
ని చులకన యొనర్చి పో యనెను (దగ) విన వే
మి చెలియ వానికిఁ దగునె మ
ఱి చిన్నవాఁ డనుచు నోపి ప్రేలదె మనతోన్ ॥

వ్యా. తెనుఁగునందలి దంత్యము లయిన చజలకు సంస్కృత సమములందలి తాలవ్యము లయిన చజలతోఁ బ్రాస చెల్లును. అందు కుదాహరణము పై పద్యము.

ముచుకుంద శబ్దము సంస్కృతము అగుట నుత్వముతోఁ గూడినను దాలవ్యమె యయినది. రెండవ పాదమున 'చులకన' యనునది యచ్చతెనుఁగు కాఁగా నుత్వముతో గూడిన చకార మిటదంత్యమైనది. ఈ రెండింటికి నిందుఁ బ్రాసమైత్రి కుదుర్పఁబడినది. ఇంక చెలియ,చిన్న యనుచో మూఁడు నాలుగుపాదము లందలి చరకార మాచ్ఛిక మయ్యుఁ దాలవ్యమె యయినది. తాలవ్యము లగు ఇ, ఎ యను స్వరములతోఁ గూడియుండుటచే నివి తాలవ్యములు. వీనికి నా దంత్యచకారముతోఁ బ్రాస చెల్లినది. ప్రాస యందు స్వర మైత్రి పాటింపనక్కఱలేదు. కావున సాంస్కృతిక తాలవ్యచకారమునకును (ముచు

1. ఏతయోఽధస్సావర్యమ్ (అం.కౌ.పం. 36), ప్రాసేనిత్యమ్ (37) యతౌన (39).

కుంద) నాచ్ఛిక తాలవ్యచకారమునకును (చెలియ, చిన్న) (నాంధ్ర) దంత్య చకారము (చులకన) తోఁ బ్రాస చెల్లినది (ఏమైన సంస్కృత సమాచ్ఛికతాలవ్య చకారముం కాచ్ఛిక దంత్య చకారములతోఁ బ్రాస కిది లక్ష్యము).

వి. [1]యతౌ-పంచాస్త్రవిజయే-మల్లకవికృతే-

చం॥ "చురుకున నాట నేసె నవచూతసుమాశుగ పంక్తి నా యెదన్"

వ్యా. సాంస్కృతికమైన తాలవ్యచవర్గమునకు నాచ్ఛికములగు దంత్యచజలతోఁ బ్రాస చెల్లును అందుకు మల్లకవి రచించిన పంచాస్త్ర విజయమునుండి యొక యుదాహరణము. పద్యస్థలమునందు 'చురుకు' అనునది యాచ్ఛికము. దంత్యమగు ను కారముతోఁ గూడియున్నది గావున 'చ' కారము దంత్య మయినది. దీనికి 'చూత' శబ్దమునందలి చకారముతో యతి చెల్లింపఁబడినది. చూతశబ్దము సాంస్కృతికమగుటచే నందలి చకార మూ కారముతోఁ గూడినను దాలవ్యమె యగును. ఈ రెండింటికి నిట యతి.

యతియందు స్వరమైత్రియుఁ బాటింపవలసియున్నది. కావునఁ దెలుఁగునందలి దంత్యచజలపుఁ దెలుఁగునందలి తాలవ్యచజలలో యతిమైత్రి యుండదు. దంత్యచజలకే పరస్పర మన్నింటికి యతి మైత్రి యుండదు గదా చచాచైచౌ యనువానికి చుచూలలో యతి లేదు. సాంస్కృతిక మయిన తాలవ్యచజలలో స్వరమైత్రి ననుసరింపని యతి చెల్లు ననుట స్పష్టమే.

వి. శ్లేషే-గౌతమీపరిణయే-

శ్రీలచే మించు చెన్నపురి విలసిల్లు.

శ్లేషయందును సాంస్కృతిక (తాలవ్య) చజలును, నాచ్ఛికము లగు దంత్య చజలును సమానములై కూర్పఁబడును. ఇట నాచ్ఛికము లగు తాలవ్య చజలును దంత్యములతోఁ గూర్పఁబడవచ్చును.

ఉదా :- "శ్రీలచే మించు చెన్నపురి విలసిల్లు" మించుచున్+చెన్న = మించుచెన్న, అనుచో 'చెన్న' లోని చకారము దంత్యము. మించుచు ననుచో సంధిచేఁ బూర్వ ముత్వముతోఁ గూడియుండుటచే చకారము దంత్యము. కావున సంధియైన పిదపఁ

---

1. ఇచట వృత్తియందు శ్లేష స్థల ముదాహృతము. ప్రయతశ్లేష యను సూత్ర మందలి క్రమమును బట్టి యతి విషయము ముందు చూపఁబడినది.

దాలవ్యమగు నెత్వముతోఁ గూడియున్నను చకారము దంత్యమె యగును. (పచ్చ+ఆకు = పచ్చాకు, పచ్చి+ఆకు = పచ్చాకు) మఱియొక యర్థమున మించు (నట్టి) 'చెన్న పురి' యనుచో చకారము తాలవ్య మగుట స్పష్టము. ఇట్లిట శ్లేషయందు దంత్యమును దాలవ్యమును నయిన చకారములు గూర్పఁబడినవి.

'ఒకానొకచో జకారం బుభయంబు నగు' నను ప్రౌఢవ్యాకరణ సూత్రము ప్రస్తుత స్థలమున కనుగుణ మైనదె యని గుర్తింపవచ్చును. అయ్యును ప్రౌఢవ్యాకర్త జకారము నొక్కదానినె పేర్కొనెనే కాని చకారమును గూర్చి ప్రస్తావింపలేదు. ప్రస్తుత స్థల మట్టిలక్షణమునకుఁ దగినది. ఇట్టి వానిని గావ్యములందుఁ బ్రత్యేకముగా గమనింపకపోవుటే కాక ప్రస్తుత వ్యాకరణ గ్రంథమును జూచియుండకపోవుటచేఁ బ్రౌఢ వ్యాకర్త చకార ముభయ మగుటఁ బ్రస్తావింపఁ డయ్యె నని గుర్తింపవచ్చును. ఈ గ్రంథమును జూచియున్నచో నొకవేళ నీ ప్రయోగ మప్రామాణిక మని త్రోసిపుచ్చి నను నిట్టిస్థితి కవి ప్రయోగములో గుర్తింప యత్నించెడివాఁ డనఁదగు. తీయఁగ బంచదార వెనుదీయఁగ (విజయ) మొదలగున విట్టివి.

వి. చిత్రే - శేషభాగవతే—

కం॥ బృందావనమున వేఁగుటఁ
జెందక ప్రేఁతలఙ్ల గలయు చెన్ను గదా గో
విందుఁ డని యొక్కరవి యా
నందంబునఁ బలికె నొండునలినేక్షణతోన్॥

చిత్రకవిత్వ స్థలమునను దంత్యచజలు, సాంస్కృతికము లయిన తాలవ్య చజలును సమానములై రయుపఁదగును ఇట్టిస్థితి పరిశీలింపవలయును. వృత్తియం దుదాహరింపబడిన పద్యమున నన్నియు నాచ్ఛికతాలవ్య చజలే కన్పించుచున్నవి.

వి. సూత్రే ఆంధ్రతాలవ్యమాత్రే గ్రహణాదాంధ్ర తాలవ్యచవర్గః సాంస్కృతిక తాలవ్యాంధ్ర దన్త్యాభ్యాం ప్రాసశ్లేషచిత్రేషు తుల్యోచ్చారణ స్స్యా దితిజ్ఞాతవ్యః.

సూత్రమునం దాంధ్రతాలవ్యములను మాత్రమె గ్రహించుట చేత నాచ్ఛికమయిన తాలవ్యచవర్గము సాంస్కృతిక మగు తాలవ్య చవర్గముతోను, నాచ్ఛిక మగు దంత్య చవర్గముతోను దుల్య మైన యుచ్చారణము గలది యగు నని తెలియఁదగును.

సూత్రమునందలి యాధారము స్పష్టము గాదు కాని యాచ్ఛిక దంత్య చజలను సాంస్కృతికము లయిన తాలవ్య చజలతోఁ జెప్పిన సామ్యము వలన, నాచ్ఛికము

లయిన తాలవ్య చజలతో సామ్యము ప్రాసశ్లేష చిత్రస్థలములందు సిద్ధించు నని మాత్ర మెన్నఁదగును. యతియందు స్వరమైత్రియు నుండవయుటంబట్టి యాంధ్ర దంత్య చజల కాంధ తాలవ్య చజలతో స్వరమైత్రి లేమి యతిమైత్రియు నుండదు గావునఁ బాసశ్లేష చిత్రస్థలములే యిట వివృతియందును సముచితముగాఁ బ్రస్తావింపఁబడినవి. ఆం. కౌ. కూడ య తౌ న (పరి. 39) యని పేర్కొనుట గమనింపఁదగు.

సూత్రమునందలి సమశబ్దమునకు '[1] తుల్యమైన యుచ్చారణ' మని వివృతి యందలి వివరణము (ఇదే యంతకు ముందు 'తుల్యాకృతి' యని చెప్పఁబడినది.). లనఁగా ప్రాసాదులలో దంత్య తాలవ్య చజలు సమాన మయిన యుచ్చారణము గలిగి యుండు ననవలయును. దంత్యములు తాలవ్యము లగునా? తాలవ్యములు దంత్యము లగునా? భిన్నము లగు దంత్య తాలవ్యములకుఁ దుల్య మయిన యుచ్చారణ మెట్లు? యతి ప్రాసాదులలో నీయవి భిన్నస్థలముల నుండునవి శ్లేషయందు దొక్కచోటున యుండును. ఇట లేని దుల్యోచ్చారణ మెట్లు? ప్రౌఢవ్యాకర్త పేర్కొన్న ట్లుభయ మగునా? దంత్యతాలవ్యోభయ యోచ్చారణము సంభవము గాదు. కాఁగా దంత్య తాలవ్యములకుఁ దుల్యోచ్చారణ మనునది ప్రౌఢవ్యాకర్త చెప్పిన ప్రకారము యొక్క యుభయతా విధానమువలె నసంగత మని చెప్పక తప్పదు.

ఇంక నుదాహరణాదులనుబట్టి యతిప్రాసాదులలోఁ గలియుట యీ సమప్రవిధానమునకుఁ బ్రయోజన మని యెన్న వచ్చును.

'మిథ స్సవర్ణశ్చ' యని దంత తాలవ్యములకుఁ జెప్పఁబడిన సావర్ణ్యమున కిట్టి ప్రయోజనమె కొందఱు వ్యాఖ్యాత లూహించుట స్పష్టమె (కవి.శి. 238). అది సరిగా దనుటయు స్పష్టమె.

## 25. వస్యోష్ఠ్యస్య నామ్నో లుక్.[2]

వ్యా. నామ్నః = ఒక శబ్దముకంటెఁ బరముగా నున్న, స + ఓష్ఠ్యస్య = ఓష్ఠ్యము లగు స్వరముతోఁ గూడిన, వః = వకారమునకు, లుక్ = లోప మగును.

వి. ఓష్ఠ్యప్రాణసహితస్య నామావివకారస్య నామ్నః పరతో లుక్ స్యాత్. పృష్ఠఁ డుండె, రాముఁ డొప్పె.

---

1. 'సమానోచ్చారణా శ్లేషే దన్త్యోః సాంస్కృతికో' యను త్రి. శ. లక్షణానుగుణ ముగ నిది యిట్లు చెప్పఁబడియుండును.

2. ఓష్ఠ్యస్వరవకారస్య యకారస్య పదాత్పరే లోప స్స్యాత్- త్రి. శ. 1. 32.

వ్యా. వే ఱొక శబ్దమునకుఁ బరముగా నున్నదియును, ఓష్ఠ్యము లగు నచ్చులతోఁ గూడియున్నదియు నయిన శబ్దము మొదటి వకారమునకు లోప మగును. కృష్ణుఁడు + వుండె, కృష్ణుఁడు + ఉండె = కృష్ణుఁడుండె మొ॥.

'ఉపూపధ్మానీయానామోష్ఠౌ' యనుటచే ఉఊ అను నచ్చు లోష్ఠస్థానీయములు. ఓదౌతోః కంఠోష్ఠ్యమ్ అనుటచే ఒఓలకు నోష్ఠము గూడ స్థాన మగుచున్నది. కావున నిట ఉఊఒఓ అను నచ్చులు ఓష్ఠ్యములు. 'నామ్నః' అను పంచమ్యంతముచే వేఱొక శబ్దముకంటెఁ బర మయియుండునది కావలె ననఁగా వకారము శబ్దము మొదట నుండునది గావలయును. అనాదియం దున్నచో నయ్యది వేఱొక శబ్దమునకుఁ బర మగుట సంభవింపదు గదా. కావున వేఱొక శబ్దమునకుఁ బర మయియున్నదియు, శబ్దము మొదటిదియునయి ఉఊ ఒఓలతో గూడిన పొల్లు వకారమునకు లోపమగు. దీనినిబట్టి యీ వ్యాకరణము ననుసరించి తెలుఁగుపదములకు మొదట 'వువూవొవో' లుండు నని యంగీకరించి నట్లయినది.

కృష్ణుఁడు+వుండె ననుచోఁ బ్రస్తుత సూత్రముచేఁ బొల్లు వకారము లోపింపఁగా 'కృష్ణుఁడు+ఉండె' అని యగును. నిత్యముతోఽచి (సంధి-2) యను సూత్రముచే సంధియై కృష్ణుఁ డుండె నని యగును. రుక్మిణి+వొప్పె ననుచో నిట్లే వకారము లోపించి రుక్మిణి+ఒప్పె ననుచో నచ్చె యున్నది గావున 'యః ప్రాణస్య' (పరి-21) యని యకారమై రుక్మిణి యొప్పె నని యగును.

ఇట్లు లోపము విధించుటవలన కృష్ణుఁడు వుండె, రుక్మిణి వొప్పె ననురీతి వ్యస్త రూపములు వారింపఁబడినవి.

'వః' అనుటచేత వకారమునకు భిన్నమైన హల్లునకు లోపము లేదు. ఆతఁడు కొలిచెను మొ॥

'సౌష్ఠ్యస్య' యనుటచే ఉఊ ఒఓలకంటె వే అయిన యచ్చుతోఁ గూడియున్నచో వకారమునకును లోపము లేదు. అవి వంకర, వాఁడు విడిచెను. అదంకర యనురీతి నుండవు.

'నామ్నః' అనునది శబ్దసామాన్యమున కుపలక్షణము. కావున సుబంతములపైని, క్రియాపదములపైని గూడ నీ కార్యము సాధారణముగ నగును చదువఁడు+వొకఁడు= చదువఁ డొకఁడు మొ॥

ఇంకను 'నామ్నః' అనుటచే వే ఱొక శబ్దమునకుఁ బరముగా నున్నపుడే వువూవొవోలలో వలోపము కాఁగా, వేఱొక శబ్దమునకుఁ బరముగా నుండ నపుడు లోపము రాదు. వుండెను-ఆవు మొ॥

ఈ లోప మాచ్ఛికశబ్దములయందే యగు నని గుర్తింపవలయును. సంస్కృత సమములందును వుదకము, వూర్మిక, వోదన మను తీరుగాఁ బదాదిని వువూవోలు విన్పించినను నయ్యది సంస్కృతమునుండి వచ్చిన శబ్ద మగుటచేత సంస్కృత లక్షణానుసారముగా నయ్యది సాధువు. కాదు గావున వుదక మనురీతి యుచ్చారణము దుష్ట మగుటచే అవి యుదక మనురీతిని దీనికి లక్ష్యస్థానములు గావు. ఇట్టి చోట్ల మొదట వకారమున్న వోఢృవోఢవ్యాదు లగు నొండు రెండు శబ్దములలో వకారము లోపింపదు. అది వోఢవ్యము మొ॥

కాఁగా నీ సూత్రమువలన నచ్చతెనుఁగు పదముల మొదట వువూవొవో వర్ణము లుండుట యీ వ్యాకరణము సమ్మతించినట్లగుచున్నది. 'క్వచిదపినస్త ఉదోతౌ దన్త్యోష్ఠభవస్య వికృతి పదాదౌ' మొదలగు వానినిబట్టి యప్పకవి ప్రభృతులు దీనిని దిరస్కరించిరి. 'సిద్ధిర్లోకాద్వృశ్యా' యని యీ శబ్దములసిద్ధి త్రిలింగదేశజనులవ్యవహారము నుండి తెలియఁదగిన దగుటచేతను, నట్టి వ్యవహారమునందు వువూవొవోలు దెలుఁగు పదముల మొదలఁ గల్గుటచేతను నిది యిట్లంగీకరింపఁబడియుండును. అందుకయియే శబ్దాంతర యోగమున దానికి లోపము చెప్పుకొనవలసిన ప్రక్రియా గౌరవమునకీ వ్యాకరణములు పాల్పడ వలసివచ్చినది. ఈ వ్యాకరణములందలి లక్షణములు కావ్యభాషయందు గానరాక, వ్యవహారమునందు మాత్రమే కన్పించుశబ్దములను గూడఁ బ్రమాణీకరించుట గమనింప వచ్చును. 'సళ్ళ' మొదలగు లక్షణము లిట్టి వగుట స్పష్టమే. ఉదకము మొదలగు సంస్కృత సమములయెడ నన్నచో దేశ్యశబ్దములకువలె వ్యవహారము గాక సంస్కృత లక్షణము ప్రమాణము. కావునఁదదనుగుణముగా 'ఉదక' మనునదే సాధువనియు, వుదక మనుతీరుగా వువూవోలయుచ్చారణము దుష్ట మనియు గుర్తింపవలసియున్నది.

26. న పద్యాదేః క్వచిత్[1]

వ్యా. క్వచిత్=కొన్నియెడల, పద్యాదేః=పద్యమున మొదట నున్నట్టి వువూవొవోల యందలి వకారమునకు, న (లుక్) = లోపము లేదు.

వి. పద్యాదే రోష్ఠ్యప్రాణపరస్య వస్య క్వచిత్ స్థలే లోపో న స్యాత్. జైమినిరామాయణే- సీతా కల్యాణే -

---

1. పద్యాదిగతస్య వా స్యాత్ త్రి. శ. 1. 35.

చం॥ వువిద యొకర్తు మేనఁ దొడవుల్ దిగవిడ్చె ముదంబు మీఱఁగా
నవనిజ కప్పు డోర్తు వెలయ న్నొసటన్ దిలకంబు దిద్దె నొ
క్క వనిత దొడ్గె మేన్ రయికె కాటుక లదెం గనులం దొకర్తు సాం
ద్రపమృగనాభిపంక మొకకాంత యలందె విలాస మొప్పఁగన్.

వ్యా. పద్యము మొదట నున్న వువూవొవోల యందలి వకారమునకుఁ గొన్ని యెడల లోపము లేదు. అందు కుదాహరణము- జైమిని రామాయణమున సీతా కల్యాణఘట్టమునందలి- 'వువిద యొకర్తు మేనఁ దొడవుల్'. ఇచట 'వువిద' యనుచోఁ బద్యము మొదట 'వు' వర్ణమునందలి వకారము ప్రస్తుత లక్షణము ననుసరించి లోపింపక నిల్చియుండుటచేతఁ 'దొడవుల' అనుచోటి వకారముతో యతిమైత్రి నందినది. వకారము లోపించినచో ఉవిద- తొడవుల్ అనుచోట ఉ-వులకు యతి చెల్లదు.

'వస్యోష్ఠ్యస్య నామ్నో లుక్' అను పూర్వసూత్రము ననుసరించి యెది యేని శబ్దమునకుఁ బరమై యున్నపుడే వువూవొవోల యందలి వకారమునకు లోప మగును. అట్టియెడల శబ్దాంతరమునకుఁ బరము గానపుడు లోపము ప్రాప్తింపదు. పద్యము మొదట నున్న యిది వేఱొక శబ్దమునకుఁ బరముగా నుండుట యసంభవము గావునఁ బూర్వసూత్రము ననుసరించి వకారలోపము రానేరదు. అట్టియెడల 'నపద్యాదేః' క్వచిత్తని నిషేధింప నేల ? ఇట్లు నిషేధించుటవలన శబ్దాంతరమునకుఁ బరముఁ గాకున్నను వువూవొవోల వకారము లోపింప దను నర్థము జ్ఞాపకము చేసికొనవచ్చును. దాని వలన, ఉవిద - వువిద యనురీతిగా నుండు నవకాశము లభించును. కాని యీ యర్థము వలనఁ బ్రయోజన మేమియుఁ బ్రత్యేకముగాఁ గానరాదు.

ఇంతియు 'పద్యాదేః' అనుటచేఁ బద్య మధ్యమున నున్న లోపము వారింపఁబడు నవకాశమే లేదు. గో-'వుల గణించుం బధాతయును వోపఁ' డనుచో బద్య మధ్యమునం దుండుటచే వోపఁ డనుదానియందు ప్రస్తుత సూత్రముచే వకారము లోపింపకుండు నవకాశము లేదు. కావున 'వస్యోష్ఠ్యస్యనామ్నో లు' క్కను సూత్రముచే లోపము వచ్చి ధాతయును ఓపఁ డని యై వు- (గోవు) ఓ- లకు యతి చెల్లింపఁబడిన దనవలయును. ఇది గమనించిన- ఉవిద- తొడవుల్- లనునవియుఁ గుదురును. న పద్యాదేః క్వచిత్తనున దేల ?

ఇట్టి స్థితులనుబట్టి చూడఁగా నీ సూత్రము 'న పద్యాదేః క్వచి' త్తని గాక నపద్యాదౌ క్వచి త్తని యుండు నేమో ? పద్యము మొదలుగాఁ గలిగినదాని యందు లోపము లే దనఁదగు. వువిదయొకర్తు మున్నగునది 'వస్యోష్ఠ్యస్యనామ్నః' అను

పూర్వసూత్రమునికె లక్ష్యము కాఁగా గోవుల ధాతయు వోపఁడనురీతిని ప్రస్తుత సూత్రమునకు లక్ష్యము లగును. పూర్వసూత్రముచే శబ్దాంతర యోగమున వువూ వొవోల వకారము లోపింపవలసి యుండగాఁ బ్రస్తుత సూత్రముచే పద్యాదులయం దది నిషేధింపబడి 'ధాతయును వోపఁడు' మొదలగు వానికి సాధుత్వమును సంపాదింపఁ గల్గును. ఆదిశబ్దముచే వచనమునందు నెటనే నిట్టి లోపాభావమున్న సాధించుకొన వచ్చును.

'న పద్యాదిగతస్య' యను నధర్వణుని త్రిలింగ శబ్దానుశాసనమందును నిట్లె పద్యాదిగతమనఁగాఁ బద్యము మొదట నున్నది యని కాక పద్యము మొదలగువానియం దున్న దని చెప్పఁదగును. మొదలగువానియం దని చెప్పుచోఁ బద్య మని వేఱ చెప్ప నేల ? ఎల్లెడల ననవచ్చును గదా యని సందేహింపవచ్చును. కావ్యములయందు, బద్యములలోనె యిది తప్పక యంగీకరింపవలసిన స్థల మగుట దాని ప్రత్యేకత యట్లు గుర్తింపఁబడిన దనఁదగును.

అయ్యు నిది యింకను బరిశీలించి నిర్ణయింపఁదగును.

27. యశ్చ[1]

వ్యా. యః చ = యకారము సైత మట్లే లోపించును.

వి. అతత్సనామాదియకారస్య నామ్ని పరతో లుక్ స్యాత్. రాముఁడెవ్వఁడు, గురుఁ డిచ్చోట, వాక్కెడ. అతత్సపదం కిమ్? బ్రహ్మణుఁడు యజ్ఞము సేసె.

వ్యా. వేఱొక శబ్దము కంటెఁ బరముగానున్న సంస్కృత సమము కంటె వేఱయిన తెలుఁగుశబ్దము మొదటి యకారమునకు లోపము వచ్చును. రాముఁడు+యెవ్వఁడు, రాముఁడు+ఎవ్వఁడు=రాముఁడెవ్వఁడు. సంస్కృత సమము మొదటి యకారము లోపింపదు. బ్రాహ్మణుఁడు యజ్ఞము సేసెను. బాహ్మణుఁ డజ్ఞము సేసె నని కాదు.

'యశ్చ' యను సూత్రమునందలి చశబ్దముచేత 'వసౌత్వస్యనామ్నో లుక్' అను సూత్రము ననుసరించి వేఱొక శబ్దము కంటెఁ బరముగా నున్న యచ్చతెనుఁగు పదము మొదటి యకారమునకునుఁ లోపమగునని యర్థమగును. వేఱొక శబ్దమునకుఁ బర మగునదనుటచే యకారము పదాదియందున్నదే లోపించునని స్పష్టము అనాదియం దున్న యకారము వే ఱొకశబ్దమునకుఁ బరముగా నుండుట యసంభవము కావున.

---

1. యకారస్య పదాత్పరే లోప స్స్యాత్. త్రి. శ. 1. 32.
వికృత్యాదిగతో యోఽత్ర స్యాచ్ఛబ్దాన్తరయోగతః।
ప్రాణమాత్రావశేష స్స్యాదత్ర శ్రీకవి సమ్మతేః॥ (అ. కా. 22).

రాముఁడు+యెవ్వఁడనుచో, ప్రస్తుత సూత్రముచే యకారము లోపింపఁగా రాముఁడు+ఎవ్వఁడని యుండును. 'నిత్యముతోఽచి'(సంధి-2) యను సూత్రముచే సంధి జరిగి రాముఁడెవ్వఁడని యగును.

ఇట్లె గురుఁడు+యిచ్చోట, గురుఁడు+ఇచ్చోట, గురుఁ డిచ్చోట. వాక్కు+యెక, వాక్కు+ఎక యని రాఁగా వాఽతః (సంధి-6) యనుసూత్రముచే సంధి యైన వాక్కెడ యని యగును సంధి రానిపక్షమున. దు 'యంః' ప్రాణస్య (పరి-21) యను సూత్రముచే యకారము చేరి వాక్కు యెక యని యగును. శబ్దాంతరమునకుఁ బరముగా లేకుండుటచే వాక్కెడ (వాక్కుయెక) యను నీచోట్ల మొదటి దగు యకారము లోపింపలేదని గ్రహింపఁ దగును.

ఉఊః ఒఓలు ముందు వకారముతో వువూవొవోలుగను ఇఈ ఎఏలు ముందు యకారముతో యియీ యెయేలుగను దెనుఁగు పదముల మొదట వ్యవహరించుఁబడును. అట్టియవలు ప్రస్తుతలక్షణములచే శబ్దాంతర యోగమున లోపించును. 'వస్త్వోష్ఠ్యస్య' యనుచో నోష్ఠ్య స్వరయుక్త మని చెప్పిన ట్లిటఁ దాలవ్యస్వరయుక్త మని చెప్పలేదు. వంకర వాఁగు-ఇత్యాదిగా నోష్ఠ్యేతరస్వరయుక్త మయిన వకారమున్నది గాన నట లోపము రాకుండుటకు 'సౌష్ఠ్యస్య' యనుట యవసరము. దాని యకారము ఇఈ ఎఏల కంటె నితరమయిన యచ్చులతోఁ గూడి పదాది నుండదు. అందుకెవివృతి యందును నిట ఇ ఎ లె చూపఁబడినవి. యకారము పదాది నుండునదే. (ఇ ఈ ఎ ఏలతోఁగూడి) లోపము వచున్నది. ఇతర స్థలముల యకారమే లేకుండుటచే నట లోపమును విధించుట గాని వారించుటగాని యనవసరము. అందుచేతనె తాలవ్యస్వరయుక్త మయినయకారమే లోపించు నని ప్రత్యేకముగాఁ బేర్కొనఁబడలేదు సాధారణముగా యకారమునకు లోపము చెప్పుటవలన నెట్టి యిబ్బందియును లేకపోవుట చేతనె యట్లు చెప్పఁబడినది.

వువూవొవోల వకారమునకు వలెనె యీయకారమునకును నచ్చతెనుఁగు పదములకు మొదట నున్న దానికే లోపము. రాఁగ సంస్కృత సమశబ్దముల మొదట నున్న యకారమునకు లోపము లేదు. బ్రాహ్మణుఁడు+యజ్ఞ మనుచో, బ్రాహ్మణుఁడు+అజ్ఞ మనునిరుగా యకారము లోపింపదు. బ్రాహ్మణుఁడు యజ్ఞము సేసె.

ఇట్లిట నచ్చతెనుఁగుల మొదట యకారముండుట యంగీకరింఁబడినది. సిద్ధిర్లోకా ద్వ్యశా (పరి-1) యని తెలుఁగుపదములకుఁ ద్రిలింగ దేశవ్యవహారమె మూల మగుట చేతను నట్టి వ్యవహారమున నిటఁ బదాదిని యకారముండుటయుఁ గారణము గావోపును. సంస్కృత సమములందు నిట్టియుచ్చారణ మున్నను నయ్యది యసాధు వగుట సంస్కృతము ననుసరించి స్పష్టము. యిష్టము అయిషమ ననురీతి వసాధువు లగుటకు

సంస్కృతము ప్రమాణము తెలుఁగునఁ వ్యవహారమె యాధార మగుట నట్టి నిర్ణయమచ్చ తెనుఁగు శబ్దములనెడఁ గుదురకున్న దని గుర్తింపవచ్చును.

పదాదిని వు,వూ,వొ,వోలను బ్రస్తావింపని చింతామణ్యాదులును బదాది యకారమును బ్రస్తావించియే యున్నవి. 'విభక్త్యాదిగతోయోఽత్రస్యాచ్ఛబ్దాన్తయోగతః. ప్రాణమాత్రావశేషస్స్యాదత్ర శ్రీపాది సమ్మతః' అని శబ్దాంతరయోగమున యకారమునకు లోపమును వికృతివివేకాదులు పేర్కొన్నవి. 'వికృతిపదాదౌ ప్రథమాన్తస్థ తృతీయాను నాసికౌ స్వరః' మొదలగు లక్షణములచే నప్పకవి ప్రభృతు లీ పదాది యకారమును దిరస్కరించిరి.

'తెలుఁగు త్రిలింగదేశ వ్యవహారము నుండి తెలియవలసినదే లయ్యును' లక్షణ గ్రంథములు అద్యః క్రియాసు భూతార్థద్యోతినమాద్యగం వినా సర్వః' (ఆం. శ. చిం. సం. 2) అని యవఁ దనురీతి యుచ్చారణము దుష్టమని, యెవఁ దనురీతి యుండ వలె నని యుచ్చారణమును సంస్కరించినవి. అట్లే 'లద్దన్త్యస్తాలవ్యశ్చుర్వక్రః' అని చాము, జాము యనురీతి వ్యవహారము దుష్టమని చేము, జేము యనురీతి నుండవలెనని యుచ్చారణమును సంస్కరించినవి గదా. అట్లే పదాది యకారమును, వు వూ వొ వో లను వ్యవహారమందలి దోషములుగా నిర్ణయించుట యేల పొసఁగదు? అప్పకవి ప్రభృతు లట్లు చేయుట సక్రమము.

28. పద్యాదేర్విభాషా. [1]

వ్యా. పద్యాదేః = పద్యమున మొదట నున్న యకారమునకు లోపము విభాషా = వికల్పముగా నగును.

వి. పద్యాద్యతత్సనామాద్యయకారస్య వా లోపస్స్యాత్; అథర్వణ భారతే - కీచక వాక్యమ్.

చం. యిఁక నొకసారి పల్కిన ఘటిల్లని చిందుగొనోపి ముత్యముల్
వికచ సరోరుహాక్షి వినవే నను మన్నన చేసి కావుమీ
యకట మనోభవాశుగ చయంబుల నా తను వెల్లనొచ్చిపో
యె కరుణ సూపి యేలుకొనుమీ కిసు కిప్పుడు సేయ నేటికిన్.

---

1. పద్యాదిగతస్య వా స్యాత్. త్రి. శ. 1. 33.

వ్యా. పద్యము మొదట నున్నట్టి సంస్కృతసమేతర శబ్దము మొదటి యకారమునకు వికల్పముగా లోపమగును. 'యిఁక నొకసారి పల్కిన ఘటీ లని' యనునది యుదాహరింపబడిన దిందులకు. కాని యిం దుదాహరణ స్థలము గానరాదు. ఇందు 'యిఁక' ననుచోఁ బద్యాదిని యకారము లోపింపలేదు. కాని యతి యెక్కడ? 'ఘటీలు' అనునది ధ్వన్యనుకరణ శబ్దము. ఇందు యతి గుదిరిన జాడయె కానరాదు.

మూఁడవ పాదమున 'యకటమకోభవాశుగచయంబుల' ననుచో 'యకట' యను చోట మొదటి యకారమునకు 'చయం' బనుచో యకారముతోఁ జెల్లినదని చెప్పినచో నిది యుదాహరణము కాఁగలదు. కాని 'యకట' యనుచోటిది 'పద్యాది' యగుట యెట్లు? ఇది మూఁడవ పాదము మొదటిది గదా! పద్యాది యనఁగా బాదాది యని యెట్లు చెప్పుదుము. ఇంకను నిందలి యకారము యిఁక యెవఁ డిత్యాదులందువలె శబ్ద గతము గాదు. కావుమీ + అకట యనుచో నాగమముగా వచ్చిన యకారము. ఆగమముగా వచ్చిన యకారమునకు లోపము రాదు గదా! మఱల రాదని నిషేధింప నేల? ఇందలి మూఁడవ పాదమె యుదాహరణ మని యెంచఁబడినచో నయ్యది ప్రమాద మనక తీఱదు.

అది యట్లుండ వకారమునకువలె యకారమునకు లోపమును వారించుటవలన నిచటఁ బ్రయోజన ముండదనియె చెప్పవలెను. ఉదాహరణమునకు 'యెవ్వఁడు మెచ్చఁడాయెను' అనుచో 'యెవ్వఁడు' అనుచో లోపింపని యకారమునకు 'ఆయె' ననుచో యకారముతో యతి చెల్లినది. కాని యిట లోపము చేసి 'ఎవ్వఁడు మెచ్చఁడాయె' నని యుండిన మాత్రమున యతి కుదురదా? స్వరమైత్రి ననుసరించి యకార మున్న యచ్చుతో యతినందును గదా. సరసయతి కనుగుణముగా యకారము లోపించిన దున్నను యతి చెల్లును. ప్రాస రెండవ యక్షరము గావున నట నిద్దాని ప్రసక్తియె యుండదు. వకారము విషయమున లోపాభావము చెప్పుచున్న "వువిద - - తొడవుల్" అను రీతిగా నూఁద వీలులేక యతి చెల్లదు గావున వకారము విషయమున లోపాభావము చెప్పుట యవసర మయినట్లుగా యకారము విషయమునఁ గాదు.

'తసౌచవ్యస్య వాష్నా లుక్, పద్యాదేర్విభాషా' యను పూర్వ సూత్రమునందు వు,వూ,వొ,వోలలో వలోపమునే కాక, పద్యాదులందు లోపాభావమును జెప్పఁబడియున్నది. కాఁగా 'యశ్చ' యను సూత్రమునందలి 'చ' శబ్దము చేత యకారలోపముతోపాటు పద్యాదియందు లోపాభావము (వ్యావృత్తముగ) గూడ సిద్ధించుచునే యున్నది. మఱల నిట్లు 'పద్యాదేర్విభాషా' యని ప్రత్యేకముగఁ జెప్పుట స్పష్టతకే యని చెప్పవచ్చును. ప్రయోజన విశేషము గానరాదు.

అవి క్వాచిత్కము గాఁగా నిది వైభాషిక మని చెప్పఁబడుట యొక భేదము గావచ్చును. ఇది చెప్పుటలో భేదముగాని లక్ష్యస్థలమున నట్టి భేదములేదని గుర్తింప వచ్చును. వృత్తియందును నట్టిభేదము ప్రస్తావింపఁబడకుండుటయె యందుకు నిదర్శనము.

ఇంకను నుదాహృత మయిన పై యపర్వాణుని పద్యమునం దొక విశేషము. నాలుగవపాదమునందు 'నొచ్చిపోయె-కరుణ, అనుచో 'పోయెను' అనునది దృతప్రకృతి కము (ఈవ్యాకరణము ననుసరించి చూచిన నిది సంకీర్ణ మయ్యెడు నవకాశమును లేదు. కావునఁ జివర ద్రుతము నిత్యముగా నుండవలసినదే.) దీనికి 'కరుణ' యనుచోఁబరుషము పరమయినది. కావున సరళాదేశాదులు గలుగఁగా 'పోయెఁ గరుణ' యని కావలయును. అపుడు కకారప్రాస మిటఁ దప్పును. పరుషపరకతలో ద్రుతము లోపించు నవకాశమును లేదు.

## 29. యోగ్యాస్సదాదయః[1]..

వ్యా· సదా ఆదయః = సదా మొదలగు సంస్కృత శబ్దములు, యోగ్యాః = తెలుగు నఁ బ్రయోగించుటకు నర్హములు.

వి. అస్మిన్ శాస్త్రే సదా సర్వత్ర వినాదయః ప్రయోగస్య యోగ్యాస్స్యుః. శేషభా గవతే-పరీక్షిద్వాక్యమ్.

ఉ. హరి సర్వత్ర మెలంగుచున్ భువి సముద్యత్ఖడ్గధారన్ సదా
సురవిద్వేషులఁ ద్రుంప నేఁడు వినన్ జోద్యంబు నా కయ్యెడిన్
బరమానంద రసైక కంద కరుణాపాథోనిధీ సంయమి
శ్వర కౌటిల్యమునున్ వినా మునమునీషన్ నీ వెఱింగింపవే.

వ్యా. సదా, సర్వత్ర, వినా మొదలగునవి తెలుఁగుభాషలోఁ బ్రయోగించు కొనఁదగి నవి. పయి యుదాహరణపద్యమున మొదటి పాదమున సర్వత్ర, సదా యనునవి యును నాల్గవపాదమున 'వినా' యనునదియుఁ బ్రయుక్త మయినవి.

---

1. సదాదయోయోగ్యాస్స్యుః. త్రి. శ. 1.39.
అవ్యయస్యేతరస్యాపి ప్రయోగో విష్ణుకర్మణా (అ. కౌ. సం. 28).
నావ్యయస్యావృథాదేః. వై. చం. సంధి. 20.

'నావ్యయ సుప్తిఙ్ప్రకృతి తుముసః' అనుచెప్పఁబోవు (పరి-32) సూత్రము నను సరించి కేవలసంస్కృత శబ్దములు తెలుఁగులోఁ బ్రయోగించుటకు వీలు లేదు. 'వాక్య మనుకృతౌ సోమవద్వేస్య' (పరి. 33) యగు లక్షణము ననుసరించి యనుకరణము నందు సంస్కృత వాక్యము తెలుఁగునఁ బ్రయోగించుకొనవచ్చును. అట్టి యెడల 'సదా' మొదలగు సంస్కృత శబ్దములు యథాతథముగాఁ దెలుఁగునఁ బ్రయోగించుకొనఁదగునని యీసూత్రము చెప్పుచున్నది. ఇవి యనుకరణము లేకుండఁగనె తెలుఁగులోఁ బ్రయోగిం పవచ్చును. 'సదా' యనునది యవ్యయములకు సూచక మనవచ్చును. 'సదా' మొదలగు కొన్ని యవ్యయము లగు సంస్కృత శబ్దములు తెలుఁగున ననుకరణము లేకయె ప్రయోగించుకొనవచ్చునని సారాంశమగును.

**30. యః ప్రాణవత్.**

వ్యా. యః=యకారము ప్రాణవత్=ప్రాణతుల్య మగును.

వి. అతత్సనామాద్య యకారస్య ప్రాణవత్కార్యం స్యాత్. ఎప్పుడు (యెప్పుడు)

వ్యా. సంస్కృత సమముకంటె వేఱయిన తెనుఁగుశబ్దము మొదటి **యకారము**నకుఁ బ్రాణమునకువలెఁ గార్యములగును. ఎప్పుడు (యెప్పుడు)

'యః' అని సూత్రమున సామాన్యముగాఁ జెప్పఁబడినది. అయ్యును సంస్కృత సమేతర శబ్దమునందలిదనియును, శబ్దమునందు మొదటిదనియును, విశేషముగా గ్రహింప వలయును. 'ప్రాణవత్' అనుటచే నదియే యచ్చువంటి దగునని చెప్పఁదగును. శబ్దాంత రమునకుఁ బరమైనను గాకున్నను నచ్చతెనుఁగుపదాది యకార మచ్చువంటిదే యగునని భావము. ఎప్పుడు **య**కారము నిలిచి యుండఁగా నది యచ్చువంటి దగుట లేదా యచ్చుతో సమానమైన కార్యమును బొందుట గాని కుదురదు. కావున నందలి వల్భాగమునఁగా '**య**కారము' లోపించు నని గ్రహింపఁదగును.

'యెప్పుడ'ను రీతిగాఁ బదాదిని యకార ముచ్చారణమునం దున్నది. కాని 'ఎప్పు' డనురీతిగా లేఖనమునందే యచ్చున్నది. 'ఎప్పుడని' యచ్చుగా వ్రాయఁబడుచు 'యెప్పుడ' నురీతిగాఁ బదాదిని యకారముతో నుచ్చరించుటను గలిపి సమన్వయ మార్గమునఁ బ్రాణ మువంటి దగుటగా నిందుఁ జెప్పఁబడియుండవచ్చును.

అచ్చతెనుఁగుపదము మొదటి ఇ, ఈ, ఎ, ఏలు పదాది యకారముతో యి,యీ,యె, యేలుగా నుచ్చరింపఁబడును. ఇతర స్వరముల సందర్భమునఁ బదాదిని యకారముం

---

1 అజ్వత్పదాదెయస్యస్యాత్. త్రి. శ. 2. 32.

డదు. అమ్మ, మొ॥ కాఁగాఁ దెనుఁగుపదము మొదటి యి, యీ, యె, యే ల యందలి యకారమీసూత్రముచే లోపించును. ఇటుక- ఈఁగ, ఎలుక-ఏనుఁగు మొ॥

కాఁగా నీసూత్రమును బట్టి యింతకుఁ బూర్వము చెప్పఁబడిన 'యశ్చ పద్యాదేర్విభాషా' యను సూత్రము లనవసరములే యని నిర్ణయింపఁదగును. ఆరెంటి సూత్రముల యభిప్రాయము నింక నధికముగనె యీసూత్రము సాధించుచున్నది. 'పద్యాదేర్విభాషా' యను లక్షణము యొక్క యసంగతి గూడ నిందు వాచింపఁబడుచున్నది.

ఆం. కౌ. ద్రుతిని స్సర్వత్ర యోఽచ్ అని చెప్పినలక్షణము 'ద్రుతప్రకృతి కాత్పరతః ఆదియకార స్సర్వత్రాజ్వత్ స్యాత్' ని (సంధి. 36) సర్వత్రాజ్వత్కార్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః అను ఆం. శ. చిం (సంధి. 27) లక్షణమును బోలి యున్నది.

31. వశ్చోష్ఠ్యప్రాణే[1].

వ్యా. ఓష్ఠ్యప్రాణే = ఓష్ఠ్యములయిన ఉఊఒఓలు పరముగా నున్నపుడు వః చ = వకారమునకు నయిత మచ్చువంటి దగును.

వి. నామాద్యవకారస్య చోష్ఠ్యప్రాణే పరే ప్రాణవత్కార్యంస్యాత్. ఉవిద- ఉంగరము. ఒక్కఁడు - ఓయారము.

వ్యా. శబ్దము మొదట నున్నదియును, నోష్ఠ్యప్రాణములు పరముగా నున్నదియు నయిన వకారము ప్రాణమువంటి కార్యమును బొందును. ఉవిద- (వువిద) మొ॥

'వః' అని సూత్రమున సామాన్యముగాఁ జెప్పఁబడినను నయ్యది సంస్కృత సమముకంటె వేఱయిన శబ్దములందలిదే కావలయుటయు, శబ్దమునందు మొదటిదే కావలయుటయు నన్నది విశేషముగా గ్రహింపవలెను.

అచ్చతెనుఁగు పదముల మొదటి ఉఊఒఓలు వకారము ముందు గలిగి వువూవొవో యనురీతిగా నుచ్చరింపఁబడును. అయ్యది ప్రస్తుత సూత్రముచే నచ్చువంటి దగును. అచ్చువంటి దగుట యనఁగా వకారము లోపించుట యనియు, నుచ్చారణము నందు వువూవొవో యనురీతిగా నున్నను లేఖనమున ఉఊఒఓ యనురీతిగా నచ్చు లగుటయు నను నంశమును సమన్వయ మార్గమున సాధించుటకయి 'ప్రాణవత్' అని

1. వస్యతు ఓష్ఠ్యేచి తద్వత్ కార్యంస్యాత్ ద్రి. శ. 2. 34.

వకారము విషయమును జెప్పఁబడిన దని 'యః ప్రాణవ' త్తను పూర్వసూత్రస్థలమున వలెనె గ్రహింపఁదగును.

(వువిద)- ఉవిద, (వోయారము)- ఓయారము.

ప్రాణమువంటి దగుట శబ్దము మొదటి వకారమునకె కావున 'ఆవు' మొదలగు చోట్ల నవాటి స్థలమున నున్న వకారము నెడల నీ కార్యము లేదు.

'ఓష్ఠ్యప్రాణి' యనుటచే 'ఉఊఒఓ'లకంటె వే అయిన యచ్చుల పరముగా గల్గిన వకారమునకు శబ్దాదిని గూడ లోపము లేదు. వంపర - వాగు మొ॥

'యః' అనుటచే నోష్ఠ్యప్రాణము పర మయిన దైనను వకారేతర మగు హల్లునకు లోపము లేదు. పుత్తుక, బోయిం మొ॥

'తసౌచష్ఠ్యస్య నామ్నాలుక్' ను సూత్రము సాధించు నర్థమును బ్రస్తుత సూత్రముచే సిద్ధ మగుటచే నా సూత్రమునకిది పునరుక్తియె యగుచున్నది. వివృతి యందిట 'ఉవిద' యనిన లోపించిన రూప ముదాహృతము. శబ్దాంతరమునకుఁ బరముగా లేకున్నను శబ్దాదిమము లగు వువూవొవోల వకార మిట లోపించునని స్పష్టమె. ఇట్టియెడల 'వువిద యొకర్తు మేనఁ దొడపుల్' అని 'నపద్యాదేః క్వచి' త్తనుదానికి జూపిన యుదాహరణము ప్రస్తుత సూత్రముచే సాధు వగు నవకాశము లేదు. ఉఊఒఓ లతో యతిని ఛందోగ్రంథములు విశేషముగా జెప్పకొనిన 'నపద్యాదేః క్వచి' త్తను సూత్రము గూడ 'తసౌచష్ఠ్యస్య నామ్నాలుక్'ను దానివలెనె చెప్ప నక్కరలేదు. ప్రస్తుత సూత్రమొండు చాలు.

పదాదిని యకారమును, వువూవొవోలు నంగీకరించి వాని కెల్ల యెడల లోపము చెప్పుటకంటెఁ బదాదిని యకారమును వువూవొవోలును లే వనుటయె యుక్తము. అట్టి చోట్ల ఇఈఎఏలును ఉఊఒఓలు నుండు నని గుర్తింపవచ్చును. చామ అనురీతి వాని యందు వలెనె యిచ్చటను యకారము వువూవొవో లుచ్చారణము నందలి ప్రమాదములుగా నిర్ణయించుట సక్రమమె యగు నని గుర్తించియుంటిమి గదా.

## 32. నావ్యయసు ప్తిక్త్వా తుమునః.[1]

---

1. సంస్కృతాఙ్గం వినాన్యత్ప్రియోక్తవ్యమ్ (త్రి. శ. 1. 33).
   నావ్యయసు ప్తిక్త్వా తుమునః (ఆం. కౌ. పరి. 55).
   నపదాన్యవ్యయ సు ప్తిక్త్వా తుమునామ్ (ఆం. శ. చిం. సం. 42).

వ్యా. అవ్యయ = అవ్యయములును, సుప్ = సుబంతములును, తిఙ్ = తిఙంతములును, క్త్వా = క్త్వాప్రత్యయాంతములును, తుమునః = తుమున్ ప్రత్యయాంతములు నయిన సంస్కృత పదములు, న = తెలుఁగునఁ బ్రయోగింపఁదగవు.

వి. వికృతౌ సాంస్కృతికావ్యయ సుప్తిఙ్ క్త్వా తుమునాదయో న స్యుః

వ్యా. అవ్యయములు, సుబంతములు, తిఙంతములు, క్త్వాంతములు, తుమున్నంతములు మొదలగు సంస్కృత పదములు తెలుఁగునఁ బ్రయోగింపఁదగవు.

వివృతియందుఁ 'దుమునాదయ' యనుచో నాదిశబ్దము విశేషము. ప్రయోజనముఁగానరాదు.

సూత్రమున 'క్త్వాతుమున్' అనువాని గ్రహణమె వ్యర్థము. సంస్కృత పదము తెలుఁగునఁ బ్రయోగింపఁదగ దని సాధారణముగఁ జెప్పఁదగును. (పదము లనామంబులు క్రియ లవ్యయంబు లని త్రివిధంబు లని ప్రౌఢవ్యాకరణము) క్త్వాతుమున్నంతము లవ్యయములే యగుటచేతను సూత్రమునందలి 'యవ్యయ' దశముచేతనె క్త్వా తుమున్నంతములును నిషేధింపఁబడగాఁ బుర్గ్రహణము వ్యర్థ మగుచున్నది.

'నపదాన్యవ్యయసుప్తిఙ్క్త్వాతుమునా' మ్మనుచోఁ జింతామణి యందు నిట్లే. అట వ్యర్థ మైన యీ శబ్దమునుచే సంస్కృతావ్యయములు గొన్ని తెలుఁగులోఁ బ్రయోగింపఁబడు నని యర్థాంతరము జ్ఞాపకము చేసినది లట్లయ్యును క్త్వాతుమున్నంతములు మాత్రము ప్రయోగింపఁబడ వని యీ క్త్వాతుమున్గ్రహణము చరితార్థ మైనది. కాఁగా సదా మొదలగు కొన్ని యవ్యయములకుఁ దెలుఁగునఁ బ్రయోగార్హతను సాధించుట ఫల మైనది. మొత్తముమీఁద 'క్త్వాతుమున్' అనువాని గ్రహణమునకుఁ బ్రయోజనము సదాదులకుఁ దెలుఁగునఁ బ్రయోగార్హత సాధించుట యని స్పష్టము.

కాని యీ వ్యాకరణమున నింతకుముందే 'యోగ్యాస్సదాదయః' (పరి 29) అని సదాదుల ప్రయోగార్హత ప్రత్యేకముగా సూత్రింపఁబడినది. కాఁగా నిందు క్త్వాతుమున్ అనువాని గ్రహణము వ్యర్థమనుట తప్పఁ బ్రయోజనము గానరాదు. లట్టియెడల వృత్తియం దింకను 'నాది' శబ్ద మనవసర మనుట స్పష్టము.

ఇంకను 'యోగ్యాస్సదాదయః'లని పూర్వము చెప్పబడిన లక్షణముచే సదాదుల కర్హత చెప్పుటచే నితరము లను సంస్కృత పదములకుఁ దెలుఁగునఁ బ్రయోగార్హత

లే దన్న యంశ మా సూత్రముకడనే సిద్ధించుచున్నవి. అనఁగా 'నావ్యయసు ప్రిజ్వ్యాప్తుమున' యను నీ సూత్రము యొక్క యర్థము 'యొగ్యాస్సదాదయ' యను పూర్వ సూత్రముకడనే సిద్ధించుచున్నది. అందుచే మొత్త మీ సూత్రమె సిద్ధార్థమును జెప్పుచుఁ బునరుక్తి యయియున్నది. కాఁగా నీ లక్షణము స్పష్టతకయి చెప్పఁబడిన దని గ్రహింపఁదగును.

## 33. వాక్యమనుకృతౌ సోమచన్ద్రస్య.[1]

వ్యా. సోమచన్ద్రస్య=సోమచంద్రుని మతమునందు, వాక్యమ్=సంస్కృతవాక్యము, అనుకృతౌ=అనుకరణమునందుఁ దెలుఁగునఁ బ్రయోగింపఁదగును.

వి. అనుకరణే సాంస్కృతిక వాక్యం సోమచన్ద్రస్య మతే వనుచరిత్రే- "జ్ఞాలిశ్చేదనలేన కి మ్మనెడివాచారూఢి తథ్యమ్ముగన్"

వ్యా. సోమచంద్రుఁ డను లాక్షణికుని మతమునందు సంస్కృతవాక్య మనుకరణమునఁ దెలుఁగునఁ బ్రయోగింపవచ్చును జ్ఞాలిశ్చేదనలేన కి మ్మనెడి వాచారూఢి యందు 'జ్ఞాలిశ్చేదనలేన కిమ్'అను సంస్కృత వాక్యమను కరణముతోఁ (అనెడి) దెలుఁగునఁ బ్రయోగింపఁబడినది.

'నావ్యయసు ప్రిజ్వ్యాప్తుమున' యను పూర్వసూత్రము ననుసరించి యవ్యయములు మొదలగు సంస్కృత పదములు తెలుఁగునఁ బ్రయోగింపరాదు. అట్టి యెడ ననుకరణమున మాత్రము సోమచంద్రుని మతమున సంస్కృత వాక్యమునకుఁ దెలుఁగునఁ బ్రయోగార్హత చెప్పఁబడినది.

'సోమచన్ద్రస్య' యనుటచే మతాంతరమును సూచింపవలసియున్నది. కాని యనుకరణమునందును సంస్కృత వాక్యము తెలుఁగునఁ బ్రయోగింపరాదనుట కవి ప్రయోగ విరుద్ధము కావున నిందలి సోమచంద్రుని ప్రస్తావనము పూజ్యతా సూచకమె కాని మతాంతరము నుద్దేశించినది గాదని గ్రహింపఁదగును.

కాఁగా సంస్కృతవాక్యము తెనుఁగున ననుకరణమునఁ బ్రయోగార్హ మన్నది సర్వ లాక్షణిక సమ్మత మనియుఁ బ్రస్తుతవ్యాకర్తకును సమ్మతమె యనియు గ్రహింపఁదగును.

---

1. వాక్యమనుకృతే సోమచన్ద్రస్య (ఆం. కౌ. పరి. 56)
అనుకృతేఽస్తి వాక్యం తు (ఆం. శ. చిం. సం. 39)

అనుసరించి గ్రహించుట యనుకరణము యథాతథముగా స్వీకరించి చెప్పుట అను. కరణమునందు తెలుఁగున ననుధాతువు రూపములు ప్రయోగింపఁబడును. 'వాక్యమ్' అనుటచేఁ సంస్కృత పద మనుకరణమందైనను తెలుఁగునఁ బ్రయోగార్హము గా దని చెప్పవలయును. అనుకరణమునందైనను సంస్కృత పదము మాత్రము ప్రయోగింపఁ బడుట వెదుకవలసియున్నది. ఒకేపదమున్నను సపద సమ్యూటి వాక్యలక్షణము గలిగియే యుండునని గ్రహింపవచ్చును.

సుప్తిఙామ్-సుపాం తిఙాం చ ప్రయోగోఽనుకరణ ఏవ (వై. చం. సంధి.22) అనుచోఁ బదములు ననుకరణమునఁ బ్రయోగార్హము లగుట చెప్పఁబడినట్లు తోఁచు.

## 34. పఞ్చాశ దాద్యాయాః.[1]

వ్యా. ఆద్యాయాః=సంస్కృతమునకు పఞ్చాశత్=ఏఁబది. వర్ణములని యర్థము.

వి. సంస్కృతభాషాయాః పఞ్చాశ ద్వర్ణాస్స్యుః

వ్యా. సంస్కృతమున కేఁబది వర్ణములు.

భాషలన్నిటికి మొదటి వరుసలను తెలుపునవి యేవియో వానిలో (సంస్కృత ప్రాకృతములలో) మొదటి దానిని బట్టి సంస్కృత భాషకు అక్షరమాల వ్యవహారము. ఏఁబదివర్ణము లేయవియో యందు నిరూపింపఁబడలేదు 'ఆద్యాయాః పఞ్చాశ ద్వర్ణాః' అనుసూత్రస్థలమున సూరిబాలుఁడు విస్తృత చర్చ చేసి సంస్కృత వర్ణములను స్పష్టము చేసెను.

ద్వివిధాక ఏచోఽనుస్వారో విసర్గ షోడశస్వరాః॥ స్పర్శాఅన్తస్థశోష్మాణ శ్చతు స్త్రింశ ద్ధల స్స్మృతాః॥ కవిశి

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ (ద్వివిధా లక్) ఏ ఓ ఐ ఔ (ఏచ్) అం అను స్వారము అః (విసర్గ) అనునవి పదునారును స్వరములు.

కఖగఘఙ చఛజఝఞ టఠడఢణ తథదధన పఫబభమ (స్పర్శాః) యరలవ (అన్తస్థా) శ- మఱియు షసహ (శ- ఊష్మాణః) యను 34 వర్ణములు హల్లులు. స్వరములు 16, హల్లులు 34- కలిసి మొత్తము సంస్కృతభాషకు వర్ణము లేఁబది.

## 35. ప్రకృతే శ్చత్వారింశత్.[2]

---

1. పఞ్చాశదాద్యాయాః (ఆం. కౌ. పరి. 14).
   ఆద్యాయాః పఞ్చాశద్వర్ణాః (ఆం. శ. చిం. సం. 12).

2. ప్రకృతే శ్చత్వారింశత్ (ఆం. కౌ. పరి. 16).
   ప్రకృతేస్తు తే దశోనా స్స్యుః (ఆం. శ. చిం. సం. 13).

వ్యా. ప్రకృతే = ప్రాకృతమునకు, చత్వారింశత్ = నలువది వర్ణము లని యర్థము.

వి. ప్రాకృతభాషాయా శ్చత్వారింశ ద్వర్ణా స్స్యుః

వ్యా. ప్రాకృతమునకు వర్ణములు నలువది.

ప్రకృతి యనఁగాఁ బ్రాకృతము. ప్రాకృతమునందలి వర్ణములు నలువది యేవియో యిట స్పష్టము చేయఁబడలేదు.' ప్రకృతేస్తు తే దశోనా స్స్యుః' అను చింతా మణి సూత్ర సందర్భమున నహోబలుఁడు వీనిని వివరించెను.

ఋౠవర్ణౌ వినైకారౌకారాభ్యాం దశస్వరాం।
శషావసంయుక్తఙఞౌ వినాన్యే హలో మతాః॥

సంస్కృతమున కున్న వర్ణము లేఁబఁదింటిలోను బది దగ్గి ప్రాకృతమునకు వర్ణములు నలువది యగుచున్నవి.

సంస్కృత మందలి యచ్చులు పదునాఱింటిలోను, ఋౠఌౡఐఔ అను నాఱును దగ్గి ప్రాకృతమున స్వరములు పది యగుచున్నవి.

అఆ ఇఈ ఉఊ ఎఏ ఒం అః

సంస్కృతమునందలి హల్లులు ముప్పదినాల్గింటిలోను ఙఞశష- యనునవి నాలుగు తగ్గఁగాఁ బ్రాకృతమునకు ముప్పది హల్లు లగుచున్నవి.

కఖగఘ చఛజఝ టఠడఢణ తథదధన పఫబభమ యరలవ సహళ.

ఇట్లు స్వరములు పదియును, హల్లులు ముప్పదియును గలుఁగఁగాఁ (10+30) బ్రాకృతమునకు వర్ణములు నలువది యైనవి.

ప్రాకృతవర్ణముల విషయమున లాక్షణికులలో నభిప్రాయభేదము గలదు. 'సిద్ధి ర్లోకా చ్చ' యనుటవలన నాయాశబ్దము లోకవ్యవహారవేద్యము లగుటయు నివి వర్ణము లని లక్షణము చేయబడకుండుటయు సందుఁగా గారణము గాఁదోపును

'కావ్యాభియుక్త వ్యవహారస్థో హ్రస్వపజ్ సాధురితి సిద్ధమ్. తేన నీడమ్ నెడ్డం-పొత్థఅం (ప్రాకృత మణిదీపవ్యాఖ్య) దీనిచేఁ బ్రాకృతమున, సంస్కృతమున లేని ఎ, ఒ అను హ్రస్వ వక్రములు గలవు.

ఇంకను బ్రాకృతమున ఐఔలు గలవు. అసంయుక్తములయ్యును ఙఞలు గలవు. నకారమును, విసర్గమును లే వని మొదలుగా వజ్ఝలవారు వివరించిరి (వ్యా. సం. స. 55).

36 షట్త్రింశ తద్వికృతేః. [1]

వ్యా. వికృతేః = తెలుఁగుభాషకు, షట్త్రింశత్ = ముప్పదియాఱు వర్ణము లని యర్థము.

వి. ఆంధ్రభాషాయాః షట్త్రింశ ద్వర్ణాస్స్యుః.

వ్యా. అప్పదెలుఁగు భాషకు వర్ణములు ముప్పదియాఱు. ఆంధ్రశబ్ద చింతామణి వానిని నిరుపించెనది. "ద్వివిధా విదుదేదోతోఽచో వక్రతామా వనుస్వారౌ। కగచజ యుగ టడణ తదన పబమ యరలవ సహళస్తు హల్వర్గః" ॥
ఆఇఈఉఊఎఏఐఒఓఔ అం, అఁ అనునవి పదునాల్గు నచ్చులు.

కగచ̄ (దంత్యము) జ జ̄ (దంత్యము) టడణ తదన పబమ యరలవ సహళ యనునవి యిరువది రెండును హల్లులు.

అచ్చులు పదునాల్గును, హల్లు లిరువది రెండును గలిసి మొత్తము తెనుఁగునకు వర్ణములు ( 4 + 22) ముప్పదియాఱు.

ఈ వ్యాకర్త ప్లుతాదులను గూడఁ బేర్కొనెను. ప్రస్తుత వ్యాకరణము ననుస రించి తెనుఁగునకు వర్ణములు ముప్పదియాఱింటికంటె నధికము. కావున నీ సూత్రము మతాంతరమును దెల్పుచున్న దనవలె.

37. పఞ్చచత్వారింశ త్ప్రపదస్య.

వి. స్పష్టమ్

1. షట్త్రింశ ద్వికృతేః (ఆం. కౌ. పరి. 15).
షట్త్రింశ ద్రత (ఆం. శ. చిం. 14).

వ్యా. పుష్పదన్తస్య = పుష్పదంతుని మతమున, పఞ్చ చత్వారింశత్ = నలువది యైదు వర్ణము లని యర్థము.

పుష్పదంతుఁ డను లాక్షణికుని మతమునందుఁ దెలుఁగునకు నలువదియైదు వర్ణములని 'షట్త్రింశ ద్విక్రృతేః' అను పూర్వసూత్రము ననుసరించి యీ సూత్రమున జెప్పబడినది తెలుఁగుభాష యందలి వర్ణములే యని స్పష్టమగుచున్నది.

'పఞ్చపఞ్చాశ' త్తని సూత్రపాఠ మయియున్నయెడలఁ దెనుఁగున నున్న ముప్పదియారు వర్ణములను 'అన్యేచ' యను సూత్రము ననుసరించి సంస్కృత సమాదుల మూలమునఁ దెలుఁగులోనికిఁ బ్రవేశించు వర్ణములతోఁ గూడ 'నేఁబదియైదు' లెక్క సరిపోవును. 'ఆంధ్రభాషకు వర్ణంబు లేఁబదియయి'దని ప్రౌఢవ్యాకర్త పేర్కొనెను. పుష్పదంతుని గ్రంథ మలభ్యమగుటంబట్టి యెట్టులును నిర్ణయింపరాదు. ఇట వివృతియందును 'స్పష్టమ్' అని మాత్రమే యుండుట విశేషము.

'చత్వారింశ' త్తనుట నీ వ్యాకరణము ననుసరించి చూతము. 'అణేచో త్రివిధా' (పరి. 6) యను లక్షణమునుబట్టి, అ, ఇ, ఉ, ఎ, ఒ- అనునవి హ్రస్వదీర్ఘ ప్లుత భేదములచే నొక్కొక్కటి మూఁడు విధము లయి యున్నవి. కావున 5 × 3 = 15. మొత్త మివి పదునైదు వర్ణము లగును. ఐచ్ న హ్రస్వః (పరి. 7) అను లక్షణమును బట్టి ఐ, ఔలు దీర్ఘప్లుతభేదములచే నొక టొకటి రెండు విధములు. కావున నివి ( 2 × 2 ) నాలు గగును. బిన్దు ర్ద్వివిధః ( పరి. 8 ) అనుటనుబట్టి పూర్ణార్ధ భేదముచే బిందువు రెండు విధములు. ఇట్లచ్చులు (15 + 4 + 2 ఇరువది యొకటి. 'వింశతిః ప్రాణినః' (పరి. 4) అనుట హల్లు లిరువది. కాఁగా నిటకు మొత్తము 21 + 20 = 41 మాత్రమే యగును. దన్త్యౌ శ్చురతాలవ్యౌ (పరి 18) దంత్య చజలను రెండు సశ్చ (పరి. 19) యని తాలవ్య మగు సకార మొకటి, రో నిత్యమ్ (పరి. 15) అని రెండు విధము లగు రేఫములలో (సాధురేఫము పయి 20 హల్లులలోఁ జేరినది గావున నింక మిగిలిన) శకటరేఫ మొకటి యున్నది. ఇవి నాలుగు. 41 + 4 = మొత్త మచ్చతెనుఁగు నందలి వర్ణములు నలువదియైదగును. దవల వలె సాధుశకటరేఫములను రేఫము యొక్క లఘ్వలఘురూపములుగా భావించుట యిట స్పష్టము గాదు. అనఁగా శకటరేఫ మలఘువుగా స్పష్టము చేయకుండుటనుబట్టి యది ప్రత్యేక వర్ణముగాఁ బరిగణించితిమి (కావున వర్ణములు నలువదియైదుగనే యగును).

దీనికంటెఁ గూడ సంస్కృత సమాదులనుండి తెలుఁగునఁ బ్రవేశించు వర్ణములతోఁ గూడ మొత్తము తెలుఁగువర్ణములు చెప్పుటయే 'పఞ్చచత్వారింశత్' అనుటలో నభిప్రాయ మేమో యనిపించును.

ఆలెక్క యిట్లు సముచితముగా సరిపడుచున్నది.

| | | |
|---|---|---|
| సప్త ప్రాణాః (పరి. 3) | అచ్చులు-7 | |
| వింశతిః ప్రాణినః (పరి. 4) | హల్లులు-20 | |
| అనుస్వారము (ఇది పయియెడింటిలోఁ బరిగణింపఁబడలేదు) | | 1 |
| | | — |
| ఇది యచ్చ తెనుఁగు నందలి వర్ణములు మొత్తము | | 28 |

ఇంక 'అన్యేచ' (పరి-5) అను సూత్రము ననుసరించి సంస్కృత సమాదుల నుండి తెలుఁగునఁ జేరునవి.

| | | |
|---|---|---|
| ఋ, ౠ, విసర్గ- | అచ్చులు | 3 |
| ఖఘజ, ఛఝఞ, ఠఢ, థధ, ఫభ, శష- | | 14 |

(ఇవి మొత్తము పదునేడు)

తెనుఁగునందలి వర్ణము లిరువదియెన్మిది సంస్కృత సమాదులనుండి తెలుఁగునఁ జేరునవి పదునేడు కలిసి మొత్త మాంధ్రభాషకు (28+17) నలువదియై దగుచున్నవి.

ఈ లెక్కయె యుచితముగాఁ దోఁచు. ముందు సంస్కృత వర్ణములు పిదప ప్రాకృతవర్ణములు ఆపిదపను నచ్చతెనుఁగునందలి వర్ణములు నాపిదప సంస్కృత సమాదులమూలమునఁ దెలుఁగులోని కదనముగాఁ బ్రవేశించిన వర్ణములతోఁ గూడ మొత్త మాంధ్రభాషకు వర్ణములు నను క్రమమున నిట్లు లక్షణము చెప్పుటలో నొక క్రమము సముచితముగా నీపక్షమున స్థిరింపఁదగును.

ఇట్టిమొదల సంస్కృత సమసహిత మయిన యాంధ్రభాషకు వర్ణములు నలువది యై దగుట ప్రస్తుతవ్యాకర్తయుద్దేశము నయియున్నది. కావున నీసూత్రమున పుష్ప దంతుని ప్రస్తావనము గౌరవసూచకమని గ్రహింపఁదగును.

దీర్ఘ ప్లుతాదుల అకారాదుల యందలి భేదములు సప్తప్రాణాః, లను నీ సమ్మది యాూవ్యాకరణమునను ప్రత్యేకముగాఁ బరిగణింపలేదు పరిగణించిన ఏడగుట పొదుగదు గదా కావున 'అన్యేచ' యనుచో ఋౠలయొకఁ గూడ నితరభేదములను ననఁగా దీర్ఘ ప్లుతములను గలుపక రెండుగానె పరిగణించితిమి బిన్దుర్ద్వివిధః అనుచో బిందువొకటి రెండు విధములని గణింపఁబడును. ఇట్లె రేఫ ద్వివిధము కాక నొక రేఫ మొకటి పరిగణింపఁబడి నది 'లకేజా త్రివిధా' యన్నను 'సప్తప్రాణాః'అనుచో నొకటొకటె గదా గణింపఁబడినది.

**ఇతి పరిభాషా పరిచ్ఛేదః**

**ఇతి పరిభాషా పరిచ్ఛేదము**

# సారస్వత
# త్రిలిఙ్గ శబ్దానుశాసనమ్
## సంజ్ఞా పరిచ్ఛేదః

**1. నామప్రాతిపదికమ్.**[1]

వృ. ప్రాతిపదికమ్ = ప్రాతిపదికము, నామ = నామము (అను సంజ్ఞగలది యగును)

వి. తత్సమాది ప్రాతిపదికం నామ సంజ్ఞం స్యాత్. రామ (రాముఁడు), జన్న (జన్నము) నవలా.

వ్యా. తత్సమము మొదలగు ప్రాతిపదికలకు నామమను సంజ్ఞయగును. రామ యన్నది సంస్కృతనామము జన్న యన్నది తద్భవ ప్రాతిపదికము. నవలా యన్నది దేశ్యనామము.

సంస్కృతము ననుసరించి దేనికిఁ బ్రాతిపదికసంజ్ఞ గలుగునో దానికి దెలుఁగున నామ మనియు సంజ్ఞ. అనఁగా బ్రాతిపదిక మను సామాన్య సంజ్ఞయు నామమను విశేష సంజ్ఞయుఁ దెలుఁగునఁ జెల్లును. అర్థవ దధాతుర ప్రత్యయః ప్రాతిపదికమ్-డిత్థ. కృత్తద్ధిత సమాసాశ్చ-కృదంతము-రామ. తద్ధిత ప్రత్యయాంతము-భార్గవ. సమాసము-రాజపురుష.

ఇట్లే తెలుఁగునఁదద్భవాదిశబ్దములకును బ్రాతి పదికనామ సంజ్ఞలుగలుగును-జన్న-అలుక (కృదంత) నల్లన (తద్ధితాంత) నల్లని కలువ (సమాస)ము॥

**2. ధాతుః క్రియా.**[2]

---

1. రామాది ప్రాతిపదికం నామేతిచ నిగద్యతే (త్రి. శ. 1-1).
ప్రాతిపదికం నామ వై. చం. సం. 20 ఆం. శ. చిం. సం. 28.
నామ ప్రాతిపదికమ్ (ఆం. కౌ. పరి 39).

2. కనివిన్యాద యస్సర్వే ధాతవశ్చ క్రియా స్త్వమీ
ధాతుః క్రియా (ఆం. కౌ. పరి 41) వై. చం. సం. 22 (త్రి. శ. 1-2).
క్రియా ధాతుః ఆం. శ. చిం. సం. 30.

వ్యా. **ధాతుః = ధాతువు, క్రియా = క్రియ** (అను సంజ్ఞ గల్గిన దగును)

వి. కని విన్యాది **ధాతవః** క్రియా సంజ్ఞా స్స్యుః. కని, విని, వచ్చి.

వ్యా. కని విని మొదలగు ధాతువులకుఁ గ్రియలని సంజ్ఞ యగును కని విని-ఆదయః అనుచో

సంస్కృతమున 'భూవాదయో ధాతవః' అని భూ మొదలగు వానికి 'ధాతు' వను సంజ్ఞ చెప్పఁబడినది. దానికిఁ దెలుఁగున సంస్కృతానుసారముగా ధాతువను సంజ్ఞతోపాటు క్రియ యనువిశేష సంజ్ఞయును గల్గునని యభిప్రాయము· ఇట్లె యాచ్ఛికము లును-కను-విను మొ॥

క్రియ యనఁగా వ్యాపారము, ధాత్వర్థము. వండు - అనునది ధాతువు కాఁగా 'వంటచేయుట' యన్నది క్రియ యగును. కావున ధాతువునకు గ్రియ యనుదానికి నర్థమున నించుక భేదముగల దని చెప్పవలసియున్నది. చిన్నయసూరి ప్రభృతులు ధాతువులను గ్రియలని వ్యవహరించుట గానరాదు కాని చింతామణ్యాదు లిట్లు వ్యవహరించినవి. చింతామణి యందును ధాతువను నర్థమునఁ గ్రియా పదమనియు వ్యవహరించినది. భవతి క్రియాపదానాం త్రివిధానా మింద్రగాగమః మొ॥

కాఁగా నీవ్యాకరణమునందుఁ 'గ్రియ' యను పెంపక్షరము ప్రసిద్ధమైన క్రియా శబ్దమునకు భిన్నమైనది సంజ్ఞగా స్వీకరింపఁబడిన దని యెంచవలయును. సారూప్యము వలన భ్రమప్రమాదముల కవకాశ ముండును గావున సూరిప్రభృతులీ సంజ్ఞను స్వీకరింపలేదు. షట్టీ వర్ణకంబు హేతువులగు గుణ క్రియల కగు, క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికంబుగా నగు మొ॥

ఈ వ్యాకరణమునందు (అధర్వణుని త్రి. శ. మొ॥) తెలుఁగుధాతువులు కని-విని అనుతీరుగా నిదంతములుగాఁ జెప్పఁబడినవి "అవి వక్షిత మిత్" (త్రి 89) లను సూత్రముచే నీయిత్వ మవి వక్షితమై, తస్యలుక్ (త్రి.90) లనుసూత్రముచే నది లోపింపఁగాఁ దెలుఁగున ధాతువులివి హలంతములె యగుచున్నవి.

### 3. డుజాదిప్రత్యయో వర్ణకః[1].

---

1. డుజాద్యాశ్చప్రత్యయాస్స్యుః (త్రి. శ. 1.3).
   ప్రత్యయో వర్ణకః ఆం. కౌ. పరి 40 వై. చం. సం. 21.
   ప్రత్యయఇహవర్ణకః ఆం. శ. చిం. సం. 20.

వ్యా॥ తుజాది ప్రత్యయః=తుజ్ మొదలగు ప్రత్యయము, వర్ణకః=వర్ణకము.

వి. తుజ్ల్యాదయః ప్రత్యయాః వర్ణక సంజ్ఞా స్యుః.

వ్యా. తుజ్ లు మొదలగు ప్రత్యయములకు వర్ణకము లని సంజ్ఞ.

సంస్కృతాను సారముగాఁ బ్రత్యయ సంజ్ఞ గలుగుటకు తెలుఁగునఁ బ్రత్యయసంజ్ఞతో పాటు వర్ణక మని విశేషసంజ్ఞయును గల్గినని యర్థము.

'ధాతుః క్రియా' యని యింతకుఁ బూర్వము పేర్కొనినట్లే యిచటఁ గూడ 'ప్రత్యయో వర్ణకః' అని మాత్రమె చెప్పఁదగును. చింతామణ్యాదు లట్లే చెప్పియున్నవి. నృసింహకవియు ఆం. కౌ. లో నిట్లె చెప్పెను. కాఁగా నీ సూత్రమునందు 'తుజాది' యను విశేషణమునకు విశేషమైన ప్రయోజనమేమియుఁ గానరాదు. స్పష్టతకై యిది వివరణాత్మకముగా నట్లు చెప్పఁబడిన దనుకొనవలయును.

నామములపై నగు ప్రథమాది విభక్తులు ధాతువులపై నగు తుజాదులును మొద లగునవి ప్రత్యయములు, నామములు, క్రియలు నను ప్రకృతులను బేర్కొన్నవిపుడు నృసింహకవి ప్రత్యయములను బేర్కొనుట యొప్పుచున్నది.

4\. **ఆదిః ప్రాణః.**[1]

వ్యా. అ+ఆదిః=అకారము మొదలగునది, ప్రాణః=ప్రాణమను సంజ్ఞ గల దగును.

వి. అకారాది స్వరసముదాయః ప్రాణసంజ్ఞః స్యాత్.

వా. అ కారము మొదలగు స్వరములకుఁ బ్రాణ మని సంజ్ఞ. వకారము మొదలగు వానికిఁ బ్రాణి యని సంజ్ఞ. కావునఁ దదితరములకుఁ బ్రాణిసంజ్ఞ సిద్ధ మగు చున్నది. 'సప్త ప్రాణాః' (పరి-3) అని తెనుఁగునఁ బ్రాణము లే డని చెప్పఁ బడినవి. అవి అ, ఇ, ఉ, ఎ, ఒ, ఐ, ఔ లు హ్రస్వ దీర్ఘ ప్లుత భేదములును బ్రాణసంజ్ఞ నందును. ఇంక సంస్కృతము నుండి సంస్కృత సమములు ద్వార చేరు ఋ, ౠ, లును బ్రాణసంజ్ఞను బొందును. 'సప్త ప్రాణాః' అనుచో

1\. అకారాది స్వరాః ప్రాణాః - త్రి. శ. 1.4.
ఆదిః ప్రాణాః. ఆం. కౌ. పరి. 18, అచ్ ప్రాణః. వై. చం. సం. 25.
ప్రాణాస్సమానతోఽచః. ఆం. శ. చిం. సం. 31.

నందు ననుస్వారము పరిగణింపఁబడలేదని స్పష్టము. తదను సారముగా విసర్గకును బ్రాణసంజ్ఞ సిద్ధింప దని యెంచదగును. కాఁగా ననుస్వారవిసర్గము లచ్చులు గావని యీ వ్యాకరణము మతము నెంచవచ్చును. ఇయ్యవి 'వింశతిః ప్రాణినః' అనుచోఁ బ్రాణులలోను గణింపఁబడలేదు. కాఁగా ననుస్వారవిసర్గలు ప్రాణులును గావన వలసియున్నవి.

### 5. కాదిః ప్రాణీ.[1]

వి. కకారాదయః ప్రాణిసంజ్ఞా స్స్యుః.

ఈ సూత్రవివృతు లుపలభ్యమాన గ్రంథమునఁ గానరావు. కాని 'ఆదిః ప్రాణః' అను సూత్రము ననుసరించి యాపిదప 'కాదిః ప్రాణీ' యని చెప్పఁబడి యుండునని యూహింపఁదగును. అథర్వణుని త్రిలిఙ్గ శబ్దానుశాసనమును బట్టి యూహ కవకాశ మిచ్చును. 'వింశతిః ప్రాణినః' లని యింతకుముందు (పరి.4) ప్రాణి సంజ్ఞ యిందు నుపయుక్త మయియున్నది. ఆం.కౌ.లో నృసింహ కవియు 'హాదిః ప్రాణీ'యని పేర్కొనె. ఇది మాహేశ్వర సూత్రముల ననుసరించి చెప్పఁబడినది. ఆం. కౌ. లో 'ఆదిః ప్రాణః' అన్నదియు నింతే.

కకారము మొదలగువానికిఁ బ్రాణులని సంజ్ఞ. 'వింశతిః ప్రాణినః' అని చెప్పిన యచ్చతెనుఁగునందలి యిరువదింటికే గాక 'యన్యేచ' యను సూత్రము ననుసరించి సంస్కృత సమాదుల మూలమునఁ దెలుఁగునఁ జేరు ఖకారాదులును బ్రాణిసంజ్ఞ గల వగును.

అచ్చులు, స్వరములు, హల్లులు, వ్యంజనములు మొదలగునవి సంస్కృతాను సారముగాఁ దెలుఁగునఁ జేరుసంజ్ఞలు. ప్రాణములు, ప్రాణులు నన్నవి యిట విశేషముగాఁ జెప్పఁబడినవి.

అచ్చు చేరని పొల్లు హల్లులను బ్రాణు లన రాదని యప్పకవి వివరించెను.

ప్రాణములు నాఁగ స్వరసమాహ్వయము లయ్యె
నవి కలిమిఁ జేసి హల్లులు ప్రాణు లయ్యెఁ
బొల్లు హల్లుల నచ్చులు పొంద కునికిఁ
బ్రాణులని పల్కఁగూడదు వానినెందు. (అప్ప. 3.44)

వృత్త్యర్థము ననుసరించి పొల్లులకుఁ బ్రాణిసంజ్ఞ యుచితము గాదను నప్పకవి యభిప్రాయ ముచితమె.

---

1. కాదయః ప్రాణినోహలః (త్రి. శ. 1.5).
హాదిః ప్రాణీ. (ఆం. కౌ. పరి. 19).

ధాతువునకుఁ గ్రియ యనుదానివలెనె పొల్లు లయిన హల్లులకుఁ 'బ్రాణి' యను సంజ్ఞ చేయఁబడిన దని గ్రహింపఁదగును. ప్రాణిశబ్దముపై మతుబర్థకము చేరుటచే నేర్పడిన ప్రాణిశబ్దము కా దనియు నిది యట్లర్థము చేయ రాని భిన్న మగు ప్రత్యేకశబ్ద మనియుఁ జెప్పుట యొక మార్గము. అథర్వణుఁడు మొదలగు కొందఱట్లు చెప్పియుండిరి.

భ్రమ ప్రమాదములకవకాశము లేకుండ వేఱొకశబ్దమును సంజ్ఞగా నెన్నుకొనిన బాగుండెడి దనుట దోషము గా దనవచ్చును. అందుకే కావచ్చును బాలవ్యాకరణాదులలో నీ సంజ్ఞ పేర్కొనఁబడలేదు.

౬. **ఆద్యే**[1].

వ్యా. ఆద్యే = రెండును నాద్యములు.

**వి.** సంస్కృత ప్రాకృతభాషే ద్వే ఆద్యే స్తః.

వ్యా. సంస్కృత ప్రాకృత భాషలు రెండును నాద్యములు.

ఆద్యే యను సూత్రమునందలి ద్వివచనముచే రెండు గ్రహింపఁబడును. అయ్యవి సంస్కృతమును ప్రాకృతము నని వివృతి నుండి గ్రహింపవచ్చును. 'ఆద్యప్రకృతిః ప్రకృతిశ్చాద్యే' యని చింతామణి స్పష్టముగా సూత్రమునఁ జెప్పినది. తెలుఁగుభాషకు సంస్కృతమును, ప్రాకృతము నాద్యములని యభిప్రాయము.

సంస్కృతమునుండియును, ప్రాకృతమునుండియు ననేకములగు శబ్దములు తత్సమములుగను, తద్భవములుగను తెలుఁగునఁ జేరియున్నవి. కావున సంస్కృత ప్రాకృతములు తెనుఁగునకు నాద్యము లగుచున్నవి.

రాముఁడు, సిరి మొదలగునవి తత్సమములు. ఆకసము, ఉబ్బరుపు మొదలగునవి తద్భవములు.

7. **వికృతిరేషా.**[2]

---

1. ఆద్యే. ఆం. కౌ. పరి. 12.
   ఆద్యప్రకృతిః ప్రకృతిశ్చాద్యే. (ఆం. శ. చిం. సం. 12).
2. వికృతిరేషా. ఆం. కౌ. పరి. 13.
   ఏషాతయోర్భవేద్వికృతిః. ఆం. శ. చిం. సం. 12.

వ్యా. ఏషా = ఈ యాంధ్రభాష, వికృతిః = వికృతి.

వి. ఏషా ఆంధ్రభాషా తయో ర్వికృతి స్స్యాత్. వికృతి రేవ వికారః.

వ్యా. ఈ యాంధ్రభాష యా సంస్కృత ప్రాకృతముల వికృతి యగును వికృతయే వికారము.

'ఆద్యే' యను పూర్వసూత్రమునుబట్టి తెలుఁగునకు సంస్కృత ప్రాకృతములు మూలములు. పిదప 'వికృతిరేషా' యనుటఁబట్టి యీ యాంధ్రభాష యా సంస్కృత ప్రాకృతముల వికృతి యని గ్రహింపవచ్చును.

సంస్కృతమును బ్రాకృతమును నైన శబ్దము లాయా వర్ణవికారములతోఁ దెలుఁగునఁ జేరుట వలనఁ దెలుఁగు సంస్కృత ప్రాకృతములకు వికృతి యగుచున్నదని యర్థము.

'వర్ణక వికృతం తత్సమ్' (సం. 29) అను లక్షణమునుబట్టి తత్సమము ప్రత్యయ సంబంధి వికారము గల్గిన సంస్కృత ప్రాకృతశబ్దమగును. 'సమస్తవికృతం తజ్జమ్' (సం. 30) లను లక్షణమునుబట్టి ప్రకృతి ప్రత్యయాంశములు రెండింట వికృతిగల సంస్కృత ప్రాకృతశబ్దములు తద్భవములు. ఇట్లు వర్ణక వికృతితోను (తత్సమములు) సమస్త వికృతితోను (తద్భవములు) సంస్కృత ప్రాకృత శబ్దములు దెలుఁగునఁ బ్రవేశించుచున్నవి. కావునఁ దెలుఁగు సంస్కృత ప్రాకృతములయొక్క వికృతి యని చెప్పఁబడుచున్నది.

తత్సమ తద్భవేతర మగు దేశ్యశబ్దములలో నీ 'వికృతి' లక్షణ ముండదు. అయినను దేశ్యముతోఁ గూడ మొత్తము తెలుఁగు భాష వికృతిగా వ్యవహరింపఁబడుచున్నది.

కొన్నియెడల సంస్కృత సమముకంటె నితర మయిన తెలుఁగుభాషనె వికృతి యని వ్యవహరించుట గలదు. 'వికృతియం దికారాంతముల యుపోత్తమేత్వంబునకు బహుళ్వనము పరంబగునపు డుత్వం బగు' (బాల. తత్స.)

8. ప్రః ప్రాసస్య.

వ్యా. ప్రాసస్య = ప్రాసమునకు, ప్రః = ప్ర అని సంజ్ఞ.

వి. ప్రాసస్య ప్ర ఇతి సంజ్ఞా స్యాత్.

ప్రాసమునకు 'ప్ర' యని సంజ్ఞ. ఈ వ్యాకరణము నందుఁ బ్రాస 'ప్ర' యనియు వ్యవహరింపఁబడును. 'నప్రేరయో స్సావర్ణ్యమ్' (పరి-23) అను లక్షణమున నింతకు ముందే యుపయుక్తము.

**9. నో ద్రుతమ్[1].**

వ్యా. నః = నకారము, ద్రుతమ్ = ద్రుతము.

వి. నకారో ద్రుతసంజ్ఞా స్యాత్.

నకారమునకు ద్రుత మని సంజ్ఞ.

నకారమునకు హల్లు ప్రాణి యను సంజ్ఞలతోపాటు విశేషముగాఁ దెలుఁగున ద్రుత మను సంజ్ఞయును గలదు.

**10. ఆద్యాః పరుషా[2].**

వ్యా ఆద్యాః = వర్గాద్యములు, పరుషాః = 'పరుషము' లను సంజ్ఞగలవి.

వి. వర్గాద్యాః కచటతపా వర్ణాః పరుషా స్స్యుః

వర్గలయందు మొదటి వర్ణము లయిన కచటతపలకుఁ బరుషము లని సంజ్ఞ.

'కచటతప' యనుచో కకారాదులమీఁది యత్తు లుచ్చారణ సౌకర్యమునకై వివృతియం దుంచఁబడినది. కావున క్ చ్-లనురీతి పగు పొల్లులకే పరుషములని సంజ్ఞ. కావున 'దన్త్యాస్చరతాలవ్యే' (పరి. 18) యను సూత్రము ననుసరించి దంత్యస్వరము లతోఁ గూడియుండఁగా దంత్య మైనను నా చకారపుఁబొల్లు పరుషమె యగును.

**11. తృతీయా స్వరళాః[3].**

1. ద్రుతం నః. వై. చం. సం. 32.
ద్రుతాఖ్యో నః - ఆం. కౌ. పరి. 48, ఆం. శ. చిం. సం. 36, నో ద్రుతాభిధః త్రి. శ. 34.
2. ఆద్యాః పరిషాః. ఆం. కౌ. పరి. 49, కచటతపాః పరుషాఖ్యాః.
ఆం. శ. చిం. సం. 37, కచటతపాః పరుషాః - వై.చం.సం. 29.
3. తృతీయాస్సరళాః. ఆం. కౌ. పరి. 50.
గజడదబాస్తు సరళాః. ఆం. శ. చిం. సం. 38.
గజడదబాస్సరళాః. వై. చం. సం. 30.

తృతీయాః – వర్గతృతీయాక్షరములు, సరళాః — సరళములు.

వి. వర్గతృతీయా గజడదబా వర్ణా స్సరళా స్స్యుః.

వర్గము లందలి మూఁడవ వర్ణములగు గజడదబలు సరళము లగును.

ఇచటను గజడదబ యనుచో మీఁది యకార ముచ్చారణార్థము గూర్పఁబడినది. కావున గ్ మొదలగు హల్లులకే సరళము లని సంజ్ఞ. కావున 'దన్త్యశ్చర తాలవ్యే' (పరి. 18) యను సూత్రము ననుసరించి దంత్యములగు నచ్చులతోఁ గూడి యుండున పుడు దంత్యము లగు జకారపుహల్లు సయితము మీ సూత్రము ననుసరించి సరళ సంజ్ఞను బొందును.

దంత్య మైనను దాలవ్య మైనను 'చకారము' పరుషము కాఁగా నట్లె జకారము సరళ మగును.

## 12. అన్యే స్థిరాః[1].

అన్యే=పూర్వోక్తము లగువానికంటె నితరములు, స్థిరాః = స్థిరములు.

వి. ఏతద్వ్యతిరిక్తా హయవరాదయో వర్ణాః స్థిరసంజ్ఞా స్స్యుః.

పై వానికంటె భిన్నము లగు హకారాదు లగు వర్ణములకు స్థిరము లని సంజ్ఞ.

'అన్యే' యనఁగా నింతకు ముందు చెప్పినవానికంటె వే ఱయినవి. ఈ సూత్రమునకుఁ బూర్వము 'నోదృతమ్; ఆద్యాః పరుషాః; తృతీయాస్సరళాః' అను సూత్రములచేఁ జెప్పఁబడినవి. ద్రుతము, పరుషసరళములు వానికంటె నితరము లయిన హల్లులు స్థిరములు. అవి :-

ఖఘఙ, ఛఝఞ, ఠఢణ, థధన, ఫభమ, యరలవశషసహళ. అనునవి యిరువది నాలుగు వర్ణములు. ఇందు నకారమునకు ద్రుత మను సంజ్ఞను విధించు నదియుఁ బ్రస్తుత సూత్రమునకుఁ బూర్వమునందే చెప్పఁబడినది. కావున నకారమునకు ద్రుతమని యె కాని స్థిర మను సంజ్ఞ సిద్ధించు నవకాశములేదు కాఁగా ద్రుతసంజ్ఞను చెప్పు లక్షణము ప్రస్తుత సూత్రమునకుఁ బిదప చెప్పిన సూత్రముగా నుండెడి దనిపించును. ఇట్టి స్థితియె చింతామణి యందును గలదు. ఏవృత్తి యందు హయవరాదు లనుట 'హయవరట్'

---

1. అన్యే స్థిరాః ఆం. కౌ. పరి. 51, వై. చం. సం. 31.
స్థిరా ఇతరే. ఆం. శ. చిం. సం. 36.

మున్నుగల మాహేశ్వర సూత్రముల క్రమమున సంస్కృతము ననుసరించి చెప్పఁబడినది. 'వింశతిః ప్రాణినః' అనుచో మాత్రము కగచజ-మొదలగు విధముగా కకారాదులుగనె చెప్పఁబడినది. 'ఆద్యాః; పరుషాః; తృతీయాస్సరళాః' అను పూర్వసూత్రములందు వర్గాద్యములు, వర్గతృతీయములు నని చెప్పిన క్రమము ననుసరించి యిచటఁ గూడ ఖకారాదులను రీతిగనె పేర్కొను టుచిత మనిపించును నడుమ మాహేశ్వరసూత్రక్రమము ననుసరింపవలసిన యవసరము కానరాదు.

'ఆద్యాః తృతీయాః' అను పూర్వసూత్ర ప్రసంగము ననుసరించి యిచట 'నన్యే' యనఁగాఁ బరుషాది భిన్నములగు హల్లులనే గ్రహింపవలయును. అచ్చులలోని భేదములు పిదపఁ జెప్పఁబడు చున్నవి. కావున నచ్చులకు స్థిర సంజ్ఞ లేదని గ్రహింపవచ్చును.

## 13. ఏఙ్వక్రః[1].

ఏఙ్ = ఏఓ అను వర్ణములు, వక్రః = వక్రసంజ్ఞ గలిగిన వగును.

వి. ఏఙ్ప్రత్యాహారో వక్రసంజ్ఞా స్యాత్.

ఏఙ్ప్రత్యాహారము వక్రసంజ్ఞను బొందును. ఏఙ్ప్రత్యాహార మనఁగా నా ప్రత్యాహారముచే బోధింపఁబడు వర్ణములు 'ఏఓఙ్' అను మాహేశ్వరసూత్రమునుబట్టి ఏఙ్ప్రత్యాహారముచే 'ఏఓ' యను వర్ణములను బోధించును. అయ్యవి వక్రసంజ్ఞను బొంది వక్రము లగును.

'అకేచా త్రివిధా' (పరి-6) యను సూత్రము ననుసరించి ఏఓలు హ్రస్వ దీర్ఘ ప్లుత భేదములచేఁ ద్రివిధములు, కావున హ్రస్వ దీర్ఘ ప్లుత భేదములతోడి రూపము లన్నియు వక్రములే యగును. 'ద్వివిధో[?]రావణస్య' (పరి-14) అను లక్షణముచే రావణుని మతమున హ్రస్వదీర్ఘములుగా రెండే విధములు. ఎ, ఒ యను వక్రములు హ్రస్వములు గావున వీనిని హ్రస్వవక్రము లనియు ఏ,ఓ, అను వక్రములు దీర్ఘములు గావున దీర్ఘవక్రము లనియు వ్యవహరింతురు.

## 14. వక్రతమ ఐచ్[2].

---

1. ఏఓ వక్రః. (ఆం. కౌ. పరి. 43).
ఏ జఘో వక్రః. ఆం. శ. చిం. సం. 33.
వక్రవక్రతమావేజైచౌ. వై. చం. సం. 26.

2. వక్రతమ ఐచ్. ఆం. కౌ. పరి-44, ఆం. శం. చిం. సం. 34.
వక్రవక్రతమా వేజైచౌ. వై. చం. సం. 26.

ఐప్ — ఐప్ ప్రత్యాహారము, వక్రతమః = వక్రతమము.

వి. ఐప్ప్రత్యాహారో వక్రతమ సంజ్ఞా స్యాత్.

ఐప్ ప్రత్యాహారము వక్రతమ మను సంజ్ఞను పొందును అనఁగా ఐచ్ లను ప్రత్యాహారముచే బోధింపఁబడు వర్ణములు వక్రతమము లని సంజ్ఞ. 'ఐఔచ్' లను మాహేశ్వర సూత్రము ననుసరించి ఐప్' 'ప్రత్యాహారముచే 'ఐఔ' యను రెండు వర్ణములు బోధింపఁబడును. కావున నవి యీ సూత్రముచే వక్రతమ సంజ్ఞను బొంది వక్రతమము లగును.

'ఐచి న హ్రస్వః' (సం-7) అను సూత్రము ననుసరించి తెలుఁగున ఐఔలు దీర్ఘ ప్లుత భేదములచే రెండు విధములు. అట్లు రెండువిధము లయిన ఐఔలకును వక్రతమ సంజ్ఞ గలుగును. రావణుని మతమునఁ బ్లుతము లేదు గావున ఐఔలు దీర్ఘము లై యొకే తీరుగ నుండును.

ఈ వక్రవక్రతమ సంజ్ఞ లథర్వణుని త్రిలింగ శబ్దానుశాసనమునఁ జెప్పఁబడినట్లు లేదు. అయ్యు 'ఏఓ? వక్రతమత్వం చ యత్ర శ్రుతిశ్చేతి రావణః1' (6. కాం) అనుటనుబట్టి నీ సంజ్ఞ లథర్వణునకును బూర్వమె ప్రసిద్ధము లయినట్లు గుర్తింపవచ్చును.

15. దిర్దీర్ఘస్య[1].

దీర్ఘస్య = దీర్ఘమునకు, దిః = 'ది' యని సంజ్ఞ.

16. హో హ్రస్వస్య[2].

హ్రస్వస్య = హ్రస్వమునకు, హః = 'హ' యని సంజ్ఞ.

వి. దిరితి దీర్ఘస్య చ హ ఇతి హ్రస్వస్య చ సంజ్ఞా స్యాత్.

'ది' యనునది దీర్ఘమునకును, 'హ' యనునది హ్రస్వమునకును సంజ్ఞలు.

ప్రస్తుత వ్యాకరణము హ్రస్వ దీర్ఘ ప్లుతములను మూఁడింటిని దెలుఁగునఁ బేర్కొన్నది. అయినను హ్రస్వ దీర్ఘములకు మాత్రమె హ, ది, యను సంజ్ఞలను విధించినది.

1. దిర్దీర్ఘస్య. ఆం. కౌ. సం 45, దిర్దీర్ఘః. వై. పం. సం. 6, వా. 1. 1. 6.
2. హః హ్రస్వస్య. ఆం. కౌ. పరి. 46.

ప్లుతమున క ట్లేదియుఁ జెప్పకుంటనుబట్టి హ్రస్వ దీర్ఘములవలెఁ ప్లుతము తెలుఁగునఁ బ్రసిద్ధము గాదని తెలియఁదగు ననవచ్చును.

ఇట సూత్రవివృతులలో 'హ్ర' యని కలదు. కాని హః యని యుండఁదగుఁ బ్రాకృత వ్యాకరణము ననుసరించి దీర్ఘమునకు 'ది' యని సంజ్ఞ. ఇందునదియె హ్రస్వమున కందు 'హ' యనియె (వా. 1. 1. 15) చెప్పఁబడినది. వై. చం. హోహ్రస్వః (సం. 5) అని దానినే యుద్ధరించినది. ఆం. కౌ. లో 'హః' అనియె యున్నది. ఇటఁగూడ 'హ' యనునదే విధింపఁబడిన దనఁదగు. హోదేత్త్రిషు (అజన్త. 42) అనుచో నీ గ్రంథమునను 'హః' అనియె యున్నది.

17. **ద్విర్ద్విత్వస్య**[1].

ద్విత్వస్య = ద్విత్వమునకు, ద్విః = ద్వి యని సంజ్ఞ.

**వి. ద్విత్వస్య ద్విరితి సంజ్ఞంస్యాత్.**

ద్విత్వమునకు 'ద్వి' యని సంజ్ఞ. "దీర్ఘో ద్విర్వ్యఞ్జనపరో గురుః" (త్రి. శ. 1. 10) అనుచో నథర్వణుఁడు ద్విత్వమును 'ద్వి' యను పేర వ్యవహరించినట్లు గాననవుచున్నది.

18. **మాదయో గణాః**[2].

మాదయః = 'మ' మొదలగునవి, గణాః = గణములు.

**వి. మగణాదయో గణసంజ్ఞాస్స్యుః**

మగణము మొదలగునవి గణసంజ్ఞగల వగును సంస్కృత సంప్రదాయానుగుణముగా 'మ' మొదలగు గణములు తెలుఁగునను గలవని యభిప్రాయము.

మ,న, భ,జ,స, య,ర,త- యను గణములు ప్రసిద్ధములే.

19. **వళిరాద్యమ్**[3].

ఆద్యమ్ = మొదటిది, వళిః = వళి.

---

1. ద్విర్ద్విత్వస్య. ఆం. కౌ. పరి. 47.
2. మాదయోగణాః. ఆం. కౌ. పరి. 52.
3. **వళిరాద్యః.** ఆం. కౌ. పరి. 53; వళిరాద్యమ్. ఆం. శ. చిం. సం. 37.

వి. పాదాద్యక్షరం వళిసంజ్ఞం స్యాత్.

పాదమునందు మొదటి యక్షరమునకు వళి యని సంజ్ఞ.

పద్యమున నెల్ల పాదములందును మొదటి యక్షరమునకు 'వళి' యని సంజ్ఞ. ఇదియె 'వడి' యనియు వ్యవహరింపఁబడును.

'వికచసరోరుహాక్షి వినవే నను మన్నన జేసి కావుమీ' ఇందుఁ బాదమున మొదటి దగు 'వి' వర్ణము 'వళి' యగును.

20. ప్రోఽనన్తరమ్.[1]

అనన్తరమ్ = తరువాతిది, ప్రః = ప్ర.

వి. వళ్యనన్తరాక్షరం ప్రాస సంజ్ఞంస్యాత్.

వళికిఁ దరువాతి దగు నక్షరమునకు 'ప్రాస' యని సంజ్ఞ.

'వళిరాద్యమ్' అను పూర్వసూత్రము, పద్యమునఁ బాదమునందు మొదటి యక్షరమునకు 'వళి' యను సంజ్ఞను బేర్కొన్నది. కాఁగా నిచట 'ననన్తర' మ్మనగా వళికిఁ దరువాతి యక్షరము, అనఁగాఁ బద్యమునందుఁ బాదమునందు రెండవ యక్షరమని యర్థ మగును. 'ప్రః ప్రాసస్య' (సం. 7) యను సూత్రమునుబట్టి 'ప్ర' యనఁగా ప్రాస యని యర్థము. కావునఁ బాదమునందలి రెండవ యక్షరమునకుఁ బ్రాస యని, సంజ్ఞం యని సూత్రార్థ మగుచున్నది.

'వికచసరోరుహాక్షి వినవే నను మన్నన జేసి కావుమీ' ఇందు మొదటి దగు వి' వర్ణము వళి కాఁగా రెండవ దగు 'క' వర్ణము ప్రాసము.

21. గుగౌ గురోః.

గురోః = గురువునకు, గుగౌ = గు మఱియు గ యని సంజ్ఞలు.

వి. గురోర్గుగావితి సంజ్ఞౌస్తః.

---

1. అనన్తరం ప్రాసః. ఆం. కౌ. పరి. 54. అనన్తరాక్షరం ప్రాసః. ఆం. శ. చిం. సం. 37.

గురువునకు 'స' అనియును, 'గ' యనియును రెండు సంజ్ఞ లగును. 'గవోద్యత్ స్త్వవ్యఞ్జనపరపూర్వ సబిన్దు విసర్గనీయ హల్పరాః' (పరి, 16) అను సూత్రమున 'స' అను సంజ్ఞ యుపయుక్తము 'గ' యనునది సంస్కృతాదుల నుండి ప్రసిద్ధమె.

22. లో లఘోః.

లఘోః = లఘువునకు, లః = 'ల' యని సంజ్ఞ.

వి. లఘోర్ల ఇతి సంజ్ఞం స్యాత్.

లఘువునకు 'ల' యని సంజ్ఞ యగును. 'హ్రస్వరోలః' (పరి. 17) అనుచో 'ల' యను నీ సంజ్ఞ యుపయుక్తము. గురు లఘువులకు 'గల' సంజ్ఞలు గురు లఘు సంజ్ఞల వలెనే పూర్వ ప్రసిద్ధములు. గురువునకు 'స' అనున దిట విశేషము.

23. కిఞ్చిత్ప్రథమా శేషషష్ఠీ కిమేవ సన్తాప తిఙ్మధ్య కిల క్త్వా తూష్ణీం కర్మ ప్రవచనీయజ (విభక్తిః) యదా తదేదానీం ప్రశంసనాద్భుతాద్యాః కళాః [1]

వి. ఇత్యాద్యాః కళా సంజ్ఞాస్స్యుః

కిఞ్చిత్ = కిఞ్చిత్తను శబ్దము యొక్క యర్థము గలిగిన యించుక మొదలగు శబ్దములును, ప్రథమా = ప్రథమా విభక్తి చివరఁ గలిగిన శబ్దములును; శేషషష్ఠి = శేషార్థమున వచ్చు 'యొక్క' యను షష్ఠీ విభక్తి చివరఁ గలిగిన శబ్దములును, కిమ్ = కిమర్థక మయిన యేమి శబ్దమును, ఏవ = ఏవార్థకము లయిన ఏ - అ. మొదలగు నవ్యయ శబ్దములును, సన్తాప = సంతాపమును దెలుపు 'అయ్యో' మొదలగు శబ్దములును తిఙ్మధ్య = మధ్యమ పురుష క్రియలును

1. కిఞ్చిత్ప్రథమాశేషషష్ఠీ కిమేవ సన్తాపతిఙ్మధ్యకిల తూష్ణీమ్. (యథాతథా) క్త్వా యదాతదా ప్రశంసాద్భుతాద్యాః కళాః (ఆం. కౌ. పరి. 56)

ప్రథమాశేషషష్ఠీచ మధ్యమస్తిఙ్ యదాతదా
తూష్ణీం కిమేవ సంతాపక్త్వా కిలాదిస్తథా కళాః. త్రి. శ. 1. 35
తిఙ్మధ్యశేషషష్ఠీ సుస్ కర్మప్రవచనీయజ విభక్తిః కిఞ్చిత్ప్ర
శంసనాద్భుత సన్తాప యదాతదా కిమేవాంచ
క్త్వాకిల 'తూష్ణీమాద్యా నక్షదభతి కళాః. ఆం. శ. చిం. సం, 44.

ప్రథమ మఱియు నుత్తమ పురుషల యందు బహు వచనాంతములగు శబ్దములును, కిల = కిలార్థకమగు లట మొదలగు శబ్దములును, క్త్వా = క్త్వార్థకమగు 'ఇ'త్వము కపర్ణకము చివరఁ గలిగిన శబ్దములును. తూష్ణీమ్ = తూష్ణీమర్థకము లయిన ఊరక మొదలగు శబ్దములును, కర్మ ప్రవచనీయజ (విభక్తిః)[1] = కర్మ ప్రవచనీయార్థమునందు వచ్చు కూర్చి యను ప్రత్యయ మంతమందుఁ గలిగిన శబ్దములును, యదా = యదార్థక మయిన ఎప్పుడు అను శబ్దమును, తదా = తదార్థక మయిన అప్పుడు లను శబ్దమును, ఇదానీమ్ = ఇదానీ మర్థక మయిన ఇప్పుడు అనుశబ్దమును, ప్రశంసన = ప్రశంసార్థకము లయిన బాగు, మేలు మొదలగు శబ్దములును, అద్భుత= అద్భుతమును దెలుపు ఆహా మొదలగునవియు, ఆద్యాః = మున్నగు శబ్దములు కళాః = కళ యను సంజ్ఞ గలవి యగును.

వీని యుదాహరణములు పై సూత్రము నొద్ద స్పష్ట మగును.

## 24. న ద్రుతమ్[2].

ద్రుతమ్ = ద్రుతము, న = ఉండదు.

## వి. కళానాం ద్రుత సంజ్ఞం న స్యాత్.

కళ లను శబ్దములకు ద్రుత ముండదు. 'నో ద్రుతమ్' అను సూత్రమునుబట్టి ద్రుతము నకారము కావునఁ గళలగు శబ్దములకు ద్రుత మగు నకార ముండదు కళలు ద్రుతాంతములు గావని యర్థము.

వి. ఉదాహరణాని :-

కిఞ్చిత్-ఇంచుక-ప్రథమా-రాముఁడు, హరి, విష్ణువు. ధాత, కన్నె, గోవు. గ్లౌ, వనము, భామ, శేషషష్ఠీ-రామునియొక్క, కిమ్-ఏమి, ఏవ-అ, ఎ, సన్తాప-అయ్యో, అక్కట, తిఙ్మధ్య-వచ్చిరి, వచ్చితివి, వచ్చితిరి, వచ్చితిమి, వత్తుము, కిం-కద, క్త్వా-వచ్చి-పోయి, తూష్ణీమ్-ఊఱక, మిన్నక, కర్మప్రవచ నీయజ విభక్తిః-కూర్చి, యదా-ఎప్పుడు తదా-అప్పుడు, ఇదానీమ్-ఇప్పుడు, ప్రశంస-మంచిది-లెస్స, అద్భుత-సెబాసు, మజ్జు, భళి ఇత్యాది.

---

1. విభక్తి యన్నది వివృతిలో నున్నది. సూత్రమున వ్రాఁతప్రతిలో లేదు.

2. నద్రుతమ్. ఆం. కౌ. పరి. 57

ద్రుతోనయేషాం స్యాత్. ఆం. శ. చిం. సం. 44

కిఞ్చిదిత్యాది సూత్రమున కిట నుదాహరణములు చూపఁబడుచున్నవి. ప్రథమాంతములకు వివృతి యందుఁ గ్రమముగా నకారాద్యంతము లనఁగా నజంతములు చూపఁబడినవి.

**ఉదాహరణములు:**

కిఞ్చిత్ = ఇంచుక-మొ॥

ప్రథమా = రాముఁడు, వనము, విష్ణువు గోడ-రాములు మొ॥

శేషషష్ఠీ = రామునియొక్క మొ॥, కిమ్ = ఏమి

ఏవ-ఎ-ఏ- (రాముఁడ,రాముఁడే మొ॥)

సన్తాప-అయ్యో, అక్కట మొ॥, తిఙ్మధ్య = చదివితివి, చదివితిని, చదివెను, చదివితిమి, కిల=అఁట, అట, అష్టే మొ॥, క్త్వా=చదివి, చదువక మొ॥ తూష్ణీమ్=మిన్నక, ఊరక మొ॥, కర్మప్రవచనీయ-రామునిఁగూర్చి- మొ॥ యదా = ఎప్పుడు తదా = అప్పుడు, ఇదానీమ్=ఇప్పుడు, ప్రశంసన = బాగు మొ॥ అద్భుత=ఆహా మొ॥

ఆద్యాః అనుచోట నాద్యశబ్దముచే కర్మ, షష్ఠి విభక్త్యంతములు వర్తమానాద్యర్థము లందలి ప్రథమపురుషైకవచనములు మున్నగునవి గ్రహింపఁదగును.

సూత్రమున-కిఞ్చిత్, ఏవ, సన్తాప, కిల, క్త్వా, తూష్ణీమ్ ప్రశంసన, అద్భుత-లను పదము లాయా యవ్యయములను పేర్కొనుచున్నవి.

కిమ్ యదా తదా ఇదానీ మను శబ్దములు పేర్కొను- ఏమి ఎప్పుడు అప్పుడు ఇప్పు డనునవి యవ్యయములు గావు. ఏమిటికిన్, ఏమిటన్, అప్పటికిన్ మొదలగు రీతిగా వీనిపై నితరవిభక్తులు గలవు. కావున నీయవి నిత్యైకవచనాంతము లగుటచే బహువచనాంతరూపము లుండవు. కాఁగా ఏమి, ఎప్పుడు, అప్పుడు, ఇప్పు డనునవి ప్రథమాంతములగు శబ్దములు కావున సూత్రమునందలి 'కిఞ్చిత్ప్రథమా' యనుచోటి ప్రథమా యను పదముచేతనె యాయవి కలితె యగును సూత్రమునందు కిమ్ యదా, తదా ఇదానీమ్-అను నవి చేర్చుటవలనఁ బ్రత్యేకమగు ప్రయోజనము గానరాదు. స్పష్టతకొఱకె (బాల. సంధి 4. సూ) మొత్తముపై నింపుఁ బేర్కొన్నవి యనేకము లవ్యయములే యైనపుడు వాని నెల్ల వేఱువేఱుగాఁ జెప్పుట స్పష్టతకొఱకే యనవలయును. తెలుఁగునలోఁ గల యైన యవ్యయములు సమగ్రముగా నిరూపింపఁబూనినపుడు విస్తరించి చెప్పవచ్చును గాని యిందుఁ బేర్కొనఁబడని యవ్యయము లేవియును గలవు గావనఁగలమా? ఎక్కిలి ఒక్కిలి ఏల అను నవ్యయములను సూరి పకలపట్టికలోఁ బేర్కొనెను. అప్పకవి మొదల నీ యవ్యయశబ్దములను గూడ వేర్వేఱుఁగా బ్రస్తావింపక కిఞ్చిదాదు లను నవ్యయము లని

సంగ్రహించుట దోసఁగు లేదు. అయినను గేవలము స్పష్టత కొఱకే ప్రత్యేకించి చెప్పె ననవలయును మొత్తముపైఁ దెలుఁగులోని కళల నిట్లు చూపవచ్చును. సుబంతములలో ప్రథమాంతములు కొన్నియు షష్ఠి యొక్క ప్రత్యయాంతములును క్రియాపదములలో మధ్యమపురుష క్రియలు ప్రథమోత్తమపురుష బహువచనాంతములు ధాతద్ధర్మా (ప్ర) ర్థకేతరములఁ బ్రథమపురుషైక వచనాంతములును కిఞ్చి దర్థకాదులగు నవ్యయము లును గళలు. ఆం. కౌ. నావ్యయానామ్ అవ్యయానాం పదానాం ద్రుతం న స్యాత్. (పరి. 60) అని యవ్యయము లెల్ల సామాన్యముగా ద్రుతాంతములు గావని చెప్పుట విశేషము. అట్టియెడల నంతకు ముందు కళలలోఁ గించిదాదులను జెప్పుట యనవసర మగుటయె కాక వలె ప్రభృతుల ద్రుతాంతత్వ మసాధు వగుట యనర్థము.

ప్రశంసార్థకములగు విభృతియందుఁ జూపఁబడిన మంచివి తెన్ను యనునవి సూత్రమందలి ప్రథమా యనుదానికే లక్ష్యము లగును. మంచి+అవి-అన్నది మంచివి యని యైనవి. తెన్నులు పల్కు మొ॥ సూత్రమునందలి ప్రశంసన శబ్దమువే నిదియె యుద్దేశింపఁబడిన నాదరము సూత్రమున ననవసరమే యనవచ్చును.

25. ద్వితీయాద్యుత్తమ లడ కాంగనం తాదయస్సంకీర్ణాః.[1]

వి. ఏతత్ప్రభృతయ స్సంకీర్ణాస్స్యుః

ద్వితీయాది = ద్వితీయ మొదలగు విభక్తు లంతమందుఁ గలిగిన శబ్దములును ఉత్తమ = ఉత్తమ పురుషయందేకవచనాంతము లగు శబ్దములును, లట్ = వర్త మానార్థకమగు చువర్ణకాంతములగు శబ్దములును, అక = వ్యతిరేకక్త్వార్థక మగు 'అక' అను ప్రత్యయము చివరఁ గలిగిన యవ్యయములును, అంగన్ = అంగన్ అను నది చివరఁ గలిగిన యవ్యయములును, అంత ఆదయః = అంత మొదలగు శబ్ద ములు, సంకీర్ణాః = సంకీర్ణములు,

ఇంతకు ముందు కళలు పేర్కొనఁబడి వానికి ద్రుత ముండ దని చెప్పఁబడినవి. దీనికిఁ బిదప ద్రుతప్రకృతికములు పేర్కొనఁబడి వానికిఁ జివర నిత్యముగా ద్రుత ముండునని చెప్పఁబడుచున్నది. కాఁగా నడుమ నిచట సంకీర్ణము లనఁగా నీ శబ్దము లొక పర్యాయము కళలవలెఁ జివర ద్రుతము లేకుండును. వేఱొక పర్యాయము ద్రుత ప్రకృతికములవలెఁ జివర ద్రుతము గలిగియుండును. కళాద్రుతప్రకృతికములు

1. (ద్వితీయాదిరుత్తమశ్చలడకాఙ్గనం)
తాదయ స్సంకీర్ణాస్స్యుః. (త్రి. శ. 1. 36))
అందు కి కుచు కావా. వై. చ. సంధి. 9.

రెండింటి లక్షణములతో రెండింటికి భిన్నమై యివి సంకీర్ణము లనఁబడుచున్న వని గ్రహింపవచ్చును. ఇట్టి స్థితినే యప్పకవి వైకల్పిక ద్రుతప్రకృతికత్వముగాఁ బేర్కొనెను.

ద్వితీయాదు లనఁగా ద్వితీయ మొదలుకొని సప్తమివఱ కున్నవిభక్తులంత మందుఁ గల శబ్దములు ప్రథమాంతములను కూర్చి కయి షష్ఠి యొక్క ప్రత్యయాంతములు కళలు. కాఁగా కూర్చికి భిన్నములగు ద్వితీయాదివిభక్తు లంతమందుఁ గలవి చేత తోడ అను తృతీయ కొఱకు అను చతుర్థి వలన నను పంచమి, పై లోపల నను షష్ఠి అందు న అను సప్తమీవిభక్తు లంతమందుఁ గలవి సంకీర్ణము లగును. చే, తో, అను తృతీయలు కంటె నను పంచమియు నన్నవి యంతమందుఁ గల శబ్దములు నిత్యముగా ద్రుతాంతము లయి ద్రుతప్రకృతికము లగు నని తోఁచుచున్నది. కాని యీ లక్షణముచే నట్లు చెప్పునవకాశము మృగ్యము. అట్లగుని నాతుండె (నాతో నుండె) నని యుండదు.

ఉత్తమ పురుషయందు బహువచనాంతములు టిఙ్వర్థ సంజ్ఞ గలవి. టిఙ్వర్థ ములు కళలలోఁ బఠింపఁబడి యున్నవి. కావున నిప్పట నుత్తమపురుషయం దేకవచ నాంతములు మాత్రమే సంకీర్ణము లగును.

'సుబ్బంతం బగు నను ధాతువు క్రియావిశేషణంబుల నిత్యప్రయుక్తం బగు నుఙికి విభాష నగు' నను సూరి సూత్రమునకు లక్ష్యము లనదగిన సుబ్బంత క్రియలపై నను ప్రయుక్తమైన కానునకు హ్రస్వము రాఁగా నేర్పడిన రూపములే యిచట 'అంగన్' అంతమందుఁ గలవి స్పష్టతకై సూరిసూత్ర మిచటఁ బ్రస్తావించుకొంటిమి. (చేయు- చేయన్, చేయఁగాన్-) చేయఁగన్ మొ॥

అక అను దానివలెనె దీనిని గూడ అంగ అనియే నిర్దేశించి అంగాంతాదయు యనఁ దగియున్న అంగనంతాదయ యని ద్రుతము చేర్చుట స్పష్టత కని గ్రహింపఁదగును. ఇంకను 'చేయంగా' నను రీతి వానిని వారించుట ప్రయోజన మనియుఁ జెప్పవచ్చును. అంగ+అంత- అయినను, అంగా+అంత అయినను 'నంగాంత' యనియె యగును గావున నట్లు చెప్పిన చేయఁగా అనురీతి వానికి నిటఁ బ్రవేశము గల్గును. అది వారిం చుటకయి 'అంగన్' అని దీనిని మాత్రము ద్రుతాంతముగాఁ బేర్కొనె ననవచ్చును.

వి. ఉదాహరణాని:- నిన్నందురు-నిన్ను నందురు, నీచే తేమి-నీచేతనేమి, నీకొఱ కిచ్చెద-నీకొఱకు నిచ్చెద, నీవల నేమి-నీవలన నేమి నీ కిచ్చెద-నీకు నిచ్చెద, నీయం దేమి-నీయందు నేమి ఇత్యాది. ఉత్తమ-వచ్చితెక్కడికి-వచ్చితి నెక్కడికి, లట్-వచ్చుచున్నాఁడు- వచ్చుచు నున్నాడు, అక-చేయకేమి-చేయక నేమి, అంగ-చేయంగ గిక్కడ, చేయంగ నిక్కడ, అంత-అంతక్కడ-అంతనక్కడ ఇత్యాది.

ఈ యుదాహరణములనుబట్టి చూడఁగా ద్రుతాంతము గాకుండుట స్థితిలో సంధి యగుటయు, ద్రుతాంత మయిన పక్షమున సంధి గాకుండుటయు సంకీర్ణత (వలని ప్రయోజనము) అని యూహింపవలసి యున్నది. నిన్నందు రనుచో ద్రుతము గాన నగుట లేదు, నిన్ను నందురనుచో ద్రుత మున్నది. కావున నిది సంకీర్ణము. ద్వితీయాంతము సంకీర్ణ మను రీతిగా నిట సమన్వయము. స్వర పరకత్వమున ద్రుతమునకు లోపము (సంశ్లేషమును) లేదు. కావునఁ జివర ద్రుత మున్నపుడు సంధి రాదు. కావున వైకల్పిక సంధిని సాధించుటయె సంకీర్ణతకుఁ బ్రయోజనమా యనిపించుచున్నది. ఇట్లే భావించిన యప్పకవి-

"ప్రథమఁ దక్కంగ నితర విభక్తులందుఁ
దుదఁ గొమ్ములు గల విభక్తులందు షష్ఠిఁ
బలుకు రాగుడికిని వికల్పంబువలన
నిల ద్రుతప్రకృతికత్వంబు గలుగుచుండు" (అప్ప 5. 66)

ననెను. ఇవి వైకల్పిక ద్రుతప్రకృతికత్వమును, నిచ్చట సంకీర్ణతయును దుల్య ప్రయోజకములే యని గుర్తింపవచ్చును. అప్పకవి చేతాదులను నిత్య ద్రుతప్రకృతులనియే భావించెను. ఇందుఁ గొంత భిన్నముగా నున్నది.

1. ద్వితీయాదులు : నిన్ను– నిన్ను+అందురు = నిన్నందురు.
నిన్నున్- నిన్నున్+అందురు = నిన్నునందురు.

2. ఉత్తమ- వచ్చితి- వచ్చితి+ఎక్కడికి = వచ్చితెక్కడికి
వచ్చితిన్- వచ్చితిన్+ఎక్కడికి = వచ్చితినెక్కడికి.

3. లట్- వచ్చుచు- వచ్చుచు+ఉన్నాడు = వచ్చుచున్నాడు.
వచ్చుచున్- వచ్చుచున్+ఉన్నాడు - వచ్చుచునున్నాడు

4. అక- చేయక-చేయక+ఏమి చేయకేమి
చేయకన్- చేయకన్+ఏమి = చేయకనేమి

5. అంగ- చేయంగ- చేయంగ+ఇక్కడ = చేయంగిక్కడ
చేయంగన్+ఇక్కడ = చేయంగనిక్కడ

6. అంత- అంత- అంత+అక్కడ = అంతక్కడ
అంతన్+అక్కడ = అంత నక్కడ

అక ప్రత్యయాంతము సంకీర్ణ మని ద్రుతాంతత గూడ నిందుఁ జెప్పఁబడినది. తెలుఁగు వ్యాకరణాదులు నవీన వ్యాకరణములు గొన్ని యిట్లు చెప్పినవి. 'అక ప్రత్యయాంతావ్యయంబు కళయ' యని ప్రౌఢవ్యాకర్త కేవలము కళయగుటను స్పష్టము చేసెను. కళలలోఁ గొట్టక తిట్టక యని యుదాహరించి సూరి మునుపె యా విషయమును సూచించెను.

ఈ వ్యాకరణమునం దప్పకవీయమున వలె ద్రుతప్రకృతికముల కసలు సంధి లేదని చెప్పరాదు. ఇట సంకీర్ణములని పేర్కొన్న వానిలోఁ గొన్నింటికి వైకల్పికసంధిని ప్రత్యేకముగా సూత్రించుట సంధిపరిచ్ఛేదమున గమనింప గలము. అట్టి సంధి విధానము లేనిచోట్ల సంధి యగుట కవిప్రయోగ ప్రసిద్ధమును గాదు. కాఁగా సంకీర్ణములను విభాగ మీ వ్యాకరణము నను ప్రయోజనవంతము గాదనియే చెప్పవలసి యున్నది. ఇదే స్థితి అందు కి సమకావా (సంధి.9) లోను వైకృతచంద్రికలోను గాంచవచ్చును.

కళ ద్రుతప్రకృతిక మను వానివలెనె 'సంకీర్ణము' అనునదియును ప్రత్యేకమగు సంజ్ఞయె. సంకీర్ణములు ద్రుతాంతములై యున్న పక్షమున ద్రుతప్రకృతిక మనియు, ద్రుతాంతత్వాభావ పక్షమునఁ గళ యనియుఁ జెప్పుట యుచితము గాదని ప్రస్తుత లక్షణమును బట్టి గ్రహింప వచ్చును. [illegible] ద్రుతాంతత ద్రుతప్రకృతికత్వము భిన్నము లయినవి. ప్రౌఢవ్యాకర్త "లేకను ద్రుతాంతముగా నుండుట వలనఁ గొంద ఱయ్యది ద్రుతప్రకృతిక మని భ్రమించిరి (సంజ్ఞా. 8) యని ద్రుతాంతము ద్రుత ప్రకృతికము భిన్నములని చెప్పుట నిట స్మరింపఁదగును. అప్పకవి 'కల్పముగా' ద్రుతప్రకృతికము లనుట స్వాతంత్ర్యమె.

ఏమైనను, సంకీర్ణత, వైకల్పిక ద్రుతప్రకృతికత్వము, ద్రుతాంత ద్రుతప్రకృతికముల భేదము శాస్త్రమునఁ బ్రయోజనవంతములు గావనియె సూరిమతాను సారముగా నర్థింప వచ్చును. ఈ వ్యాకర్తయు ఆం.కౌ. లో సంకీర్ణములను బ్రస్తావింపలేదు. అది యుచితము.

## 26. ద్రుతప్రకృతయోఽన్యే[1].

అన్యే = ఇతరములగు శబ్దములు, ద్రుతప్రకృతయః = ద్రుతప్రకృతులు.

వి. కళాసంకీర్ణేతరాశ్శబ్దాః ద్రుతప్రకృతిక సంజ్ఞాస్స్యుః.

---

1. ద్రుతప్రకృతయోఽన్యే. (ఆం.కౌ. పరి.58)
పరేనాస్త్రాద్రుతప్రకృతిరామతాః. (త్రి.శ. 1-37) అన్యే ద్రుతప్రకృతయః.
(ఆం. శ. చిం. సం. 41)
సుప్స ద్రుతః? - వై. చం. సంధి. 6.

కళా సంకీర్ణములు కంటె వేఱయిన నకారాంతములగు శబ్దములకు ద్రుత ప్రకృతికములని సంజ్ఞ; (స్వార్థమునందయిన కప్రత్యయముతో), ద్రుతప్రకృతి ద్రుతప్రకృతిక శబ్దములు రెండు నీ శబ్దములకు సంజ్ఞలె.

చెప్పఁగా మిగిలిన వన్యములు. కిఞ్చిత్ప్రథమా — మొదలగు సూత్రముచే గళలును, ద్వితీయాద్యుత్తమ - మొదలగు సూత్రముచే సంకీర్ణములు నింతకు ముందు పేర్కొనఁబడియున్నవి. కావున నిచట నన్యము లనఁగాఁ గళా సంకీర్ణముల కంటె నితరములగు శబ్దములని యర్థమగును. ద్రుతప్రకృతికములగు శబ్దముల నిట్లు గుర్తింపఁ దగును.

భూత తద్ధర్మార్థకము లైన ప్రథమపురుషైకవచనములు, పోయెన్ - పోవున్, ఇవి సంకీర్ణములలోఁ గూడఁ బరిగణింపఁ బడలేదు కాని 'పద్యాదేర్వాభాషా' (పరి.28) యను సూత్రము నొద్ద నుదాహరింపఁబడిన యక్షర్వయని పద్యమునందు పోయె కరుణ-నని కకారప్రాస రోఁ బ్రయోగింపఁ బడినది. పరుషపరతలో ద్రుతలోపము లేదు. సంకీర్ణముల యెడ నిట్టి పుదాహరింపఁబడలేదు దీనిని బట్టియును సంకీర్ణముల కల్పనము ప్రయోజనవంత మగుట లేదని గ్రహింప వచ్చును.

ఆశీరర్థకములగు ఎడు, తప్రత్యయాంతములగు క్రియా పదములును ద్రుత ప్రకృతికములు. శుభంబు కలిగెడున్ కలుగుతన్. తుమానంతర్య చేదాద్యర్థకంబులు ద్రుతప్రకృతములు.

చదువన్, చదువుడున్, చదివినన్ మొ॥

వలె మొదలగునవి ద్రుతప్రకృతములు, వరెన్-పోన్ తెన్ మొ॥ సుబంతములలో, చె, తో, కంటె, లో ప్రత్యయాంతములు సంకీర్ణములలోఁ జేరక ద్రుతప్రకృతికములే యగునని తోచుచున్నది. ఇంక ను గాగమాంతములు మొదలగునవి ద్రుతప్రకృతికములు.

మొత్తముపై నిట్లాంధ్రభాష యందలి పదముల నన్నింటిని 1. కళలు, 2. సంకీర్ణములు, 3. ద్రుతప్రకృతములు నని మూడు విధములుగా నీ వ్యాకరణము విభాగించినది.

చింతామణ్యాదులు, కళలు, ద్రుతప్రకృతికములు నని రెండు విధములుగా మాత్రమే విభాగించు టుచితముగా నున్నది. ఇట్లే ఆం.కౌ. లో నీ వ్యాకర్తయును.

## 27 ద్రుతినో నిత్యమ్[1].

నిత్యమ్=నిత్యముగా, ద్రుతినః = ద్రుతము గలిగిన పదం.

వి. యే నిత్య మను జీవిత ద్రుతాశ్శబ్దాస్తే ద్రుత ప్రకృతికా ఇతి బోద్ధవ్యాః.

ఏ శబ్దములు నిత్యముగా ననుసరించి యున్న ద్రుతము గలిగిన పదములో యా శబ్దములు ద్రుతప్రకృతికము లగును.

ఇట వ్రాఁత ప్రతియందీ సూత్రము లేదు. వివృతిని బట్టియును పెక్కు విషయములఁ గల పోలికలు గల యథర్వణుని త్రిలింగ శబ్దానుశాసనమును బట్టియును 'ద్రుతినో నిత్య'మ్మని సూత్రముండి యుండవచ్చునని యిట్లు గ్రహింపఁబడినది. ఇంతను నే మండ లక్ష్మీనృసింహకవియే రచించిన యాంధ్ర కౌముది యందును 'ద్రుతినో నిత్య' మ్మనియే లక్షణ మున్నది.

'ద్రుత ప్రకృతయోఽన్యే' యను పూర్వ సూత్రము ననుసరించి యిట ద్రుత ప్రకృతికములు నిత్యముగా ద్రుతము గలిగిన పదములని యర్థ మగుచున్నవి. కళ లనగా ద్రుతము లేనివి కాఁగా సంకీర్ణములు ద్రుత ముండుటయు, లేకుండుటయుఁ గలవి. (అనఁగా సంకీర్ణములందు ద్రుతము వికల్పముగా నుండును) కాఁగా ద్రుత ప్రకృతికము లందు మాత్రము చివర ద్రుతము నిత్యముగా నుండును. అందువలన నా కంటెను+ప్రభువులు = నాకంటెఁ బ్రభువులను రీతిగా యుండును. కాని నా కంటప్రభువులను రీతి నుండదు.

## 28. నాసంస్కృతాఙ్గమ్[2].

అ సంస్కృతాఙ్గమ్ = సంస్కరింపఁబడని యంగము కలిగిన శబ్దము, న = ప్రయోగార్హము గాదు.

వి. అసంస్కృతాఙ్గం పదం నప్రయోజ్యం స్యాత్.

---

1. ద్రుతినోనిత్యమ్ ఆం. కౌ. పరి. 59
   పరేనాన్తాః ........ త్రి. శ. 1. 37
   .... యేస్యుర్నిత్యను జీవిత ద్రుతానిత్యమ్. ఆం. శ. చిం. సం. 45
   ద్రుతం సద్రుతాత్. వై. చం. సన్ధి. 8

2 సంస్కృతాఙ్గం వినాన్య త్ప్రయోక్తవ్యమ్. త్రి. శ. 1. 38

సంస్కరింపఁబడని యంగము కలిగిన శబ్దము ప్రయోగింపఁదగదు. సంస్కార మనఁగా వ్యాకరణ సంస్కార మని గ్రహింపఁదగును. తెలుఁగునను విభక్తి ప్రత్యయాదుల తోడి లక్షణ సంస్కారమును బొందని ప్రకృత్యాదు లగు శబ్దములు ప్రయోగార్హములు కావని దీని యభిప్రాయము గావచ్చును. రామ, తమ్మ - అనురీతిగాఁ బ్రయోగింపరాదు

## 29. పఞ్చవిధం త్రైలిఙ్గ్యమ్. [1]

త్రైలిఙ్గ్యమ్ = త్రిలింగ దేశమునకు సంబంధించిన భాష యనఁగాఁ దెలుఁగు భాష, పఞ్చవిధమ్ = అయిదు తెఱఁగులై యున్నది.

**వి. త్రిలిఙ్గ శాస్త్రం తత్సమజ్ఞ దేశ్యగ్రామ్యాచ్ఛ భేదైః పఞ్చవిధంస్యాత్.**

త్రిలింగ భాష తత్స, తజ్జ, దేశ్యము, గ్రామ్యము, అచ్ఛ - యను భేదములతోఁ నయిదు విధములు. త్రిలింగ శాస్త్రమని వివృతి. త్రిలింగ భాష యని యర్థము చేయఁదగును. సప్త ప్రాణాః (పరి 3) మొదలగు సూత్రముల సందర్భమునను వివృతియం దిట్లే యుండుట గమనింప వచ్చును.

ఈ యయిదు భేదములును నైని వేర్కొనఁబడుచున్నది. తత్సమమును 'తత్స యని యిందు విశేష సంజ్ఞ. పర్ణక వికృతంతత్సమ్ (సం. 30). తత్సేచరాసు' ర్ణశస్సదా (త్రి. శ. 2,8) అని యభర్వుఁనను తత్స యనెను. తజ్జ యనఁగా. తద్భవము.

తెలుఁగు భాష తత్సమము, తద్భవము, దేశ్యము, గ్రామ్యము, అచ్ఛ యనఁగా నచ్ఛ తెలుఁగు నని యయిదు విధములని యిటఁ జెప్పఁబడినది.

> 'తత్సమంబు గాఁగఁ దద్భవం బన నచ్చ
> తెనుఁగు నాఁగ మఱియు దేశ్య మనఁగ
> గ్రామ్య భాష నాఁగఁ గల వైదుతెఱఁగులు
> వేఱ వేఱ వాని విస్తరింతు' (ఆం. భా. భూ. 19) అని

కేతనయును దెలుఁగును విధములుగాఁ బేర్కొనెను. అయినను విదప నాతఁడు "తత్సమంబు దక్క తక్కిన నాలుగు నచ్ఛ తెనుఁగు లందు రఖిలజను (27) లని

---

1. తత్సమం తద్భవం దేశ్యం గ్రామ్యం చేయ చతుర్విధం
   అచ్ఛం స్యాత్పఞ్చమం చేతి పరే తజ్జంహిప స్తుతః (త్రి. శ. 1 - 16)

పేర్కొనెను. అట్టి యెడల నా నాల్గింటిలో నచ్చ తెనుఁగన్నది ప్రత్యేక మగు నొక భేదముగా నేల పరిగణించెనో స్పష్టము గాకున్నది.

అప్పకవి దేశ్యములను శుద్ధాంధ్ర దేశ్యములు, అన్య దేశజాంధ్రములు నని విభాగించెను. కాని యీ రెండింటి కాతఁడు చూపిన యుదాహరణములలో భేదము గాన రాదు. అట్టి విభాగ మనవసరమే. ఇంకను నప్పకవి - తెనుఁగు మఱుఁగులు, ప్రాఁదెనుఁగులు నను విశేషములు ప్రస్తావించెను, (అప్ప - 1-111, 112, 113) ఇట్టి భేదకల్పనము ప్రయోజన రహిత మనుట ప్రసిద్ధమే. తాతంభట్టు - "ప్రాఁదెల్గును నచ్చతెనుంగచ్చం బనఁగా సంస్కృతము గలయ నాడనిది" (క. చిం. 1-36) యని ప్రాఁదెను గన్నది గూడ నచ్చ తెనుఁగునకు నామాంతరమే కాని యది యొక భేదముగా దని స్పష్టము చేసెను. సంస్కృత సమేతర మచ్చ తెనుఁగనుటలో లాక్షణికులు దాదాపుగ నెల్లరు నేకాభిప్రాయముననే యుండిరి. అప్పకవియును "నెలకొను సంస్కృత తత్సమములు దొరలక తజ్ఞ దేశ్యముల మాటను సంధిలి కేవలాంధ్రములు నా నలరుఁ గృతుల నచ్చ తెనుఁగు లంద్రు తెనుఁగునన్" (అప్ప 1-101) అని స్పష్టము చేసెను.

మొత్తముపై వీనినిబట్టి తద్భవదేశ్యములు ప్రాకృత సమములు మూఁడును నచ్చ తెనుఁగు లగు ననుట సారాంశము. అచ్చను వేఱుగాఁ జూపుట సదురమి పైని గమనింతము.

లఘుమ తెలుఁగు నాలుగు విధములే యగును. 'తజ్జా సమాచ దేశ్యా గ్రామ్యా చేయం చతుర్విధా భవతి' యని ఆం. శ. చిం. నాలుగు విధములుగనె పేర్కొన్నది చింతామణికిఁ దర్వాతి దయ్యు నీ వ్యాకరణమునుఁ బహువిధమ్మనుట కథర్వణుని త్రిలింగ శబ్దానుశాసనము గారణమని యూహింపవచ్చును. ఈ నృసింహకవియె తన యాంధ్రకౌముదిలో 'చతుర్ధైషా' 'ఏషా వికృతిభాషా తత్సమ తజ్జదేశ్యగ్రామ్యభేదైశ్చతుర్విధాస్యాః' (ఆం. కౌ. పరి. 61) త్తని స్పష్టము చేసెను.

ఇంకను దాతంభట్టు "తత్సమంబు తద్భవంబును, దేశ్య మనఁగఁ ద్రిప్రకార మయ్యెఁ దెలుఁగు" (క. చిం. 1.28) అని తెలుగు, తత్సమ తద్భవ దేశ్య భేదములచే మూఁడే విధము లనెను.

నాలుగవ దగు గ్రామ్యమును గూర్చి "గ్రామ్య జనులు పల్కఁగా నగు గ్రామ్యంబు వినఁగ వీనికంటె వేఱు గా" దని గ్రామ్యము వీనిలోనె యంతర్భవించు నదని నిర్ణయించెను. ఇది యెంతయు నుచితము.

లక్షణ విరుద్ధ మయినది గ్రామ్య మని యెంచునపుడు ప్రత్యేక మగు భేద మెట్లగును? కూతురిని చేతురు- మొదలగునవి గ్రామ్యము లేయని దేశ్యేతరములా? దేశ్యము లగు నీ శబ్దములు లక్షణ విరుద్ధము లగుట గ్రామ్యము లయినవి. ఇట్లే భవిష్యత్తు, యుష్మత్తు- అను రీతిని తత్సమము లయ్యు నందలి లక్షణ వైరుధ్యముచే గ్రామ్యములు తత్సమ గ్రామ్యములు. ఇట్లు పరిశీలింపఁగాఁ దత్సమ తద్భవ దేశ్య శబ్దములే లక్షణ విరోధములవలన గ్రామ్యము లగుచున్నవి. కావున గ్రామ్య మనుదాని నొక భేదముగాఁ బరిగణింప నవసరము లే దను తాతంభట్టు నభిప్రాయము సముచితముగనే తోఁచుచున్నది.

## 30. వర్ణక వికృతం తత్సమ్.[1]

వర్ణక వికృతమ్ = ప్రత్యయములవలని మార్పులు గల (సంస్కృత) శబ్దము. తత్సమ్ = తత్స.

**వి. డుజాది వర్ణకై ర్వికృతం యదాద్యనామ తత్తత్స సంజ్ఞం స్యాత్' రాముఁడు, విష్ణువు, ధనువు, విధాత, కన్య ఇత్యాది.**

డుజ్ మొదలగు ప్రత్యయములచేత మార్పులను బొందిన సంస్కృత శబ్దము నకు 'తత్స' యని సంజ్ఞ. రాముఁడు మొ॥ డుజ్జను ప్రత్యయముతో మార్పును బొందిన రామ శబ్దము సంస్కృతము. కాఁగా నీ రాముఁడు అనునది తత్స శబ్దము.

ఆద్యే యను సూత్రము ననుసరించి సంస్కృతముతోఁ బ్రాకృతము నాద్యమె కావునఁ బ్రాకృత శబ్దమును వర్ణక వికృత మైనచోఁ దత్సమ మగు నని గ్రహింప వచ్చును ఇట వివృతి యందుఁ బ్రాకృతసమ ముదాహరింపఁబడలేదు. కావునఁ బ్రాకృతము నుండి వచ్చు శబ్దము తత్సమము గా దని తలఁచెనా యనిపించును.

'యత్కేవలం ప్రత్యయాంశే వికృతం తత్తత్సమమ్' అను ప్రాకృత చంద్రిక యభిప్రాయ మిందు గోచరించు. 'సంస్కృతంబులపైఁ బొరయు తెలుంగు విభక్తు లిడఁగఁ దత్సమం బగుంబ్రదర మనఁ' (శ. చిం. 1-29) యని తాతంభట్టు నిట్లె చెప్పెను.

'తత్స' యను సంజ్ఞ లభర్వణుని త్రిలింగశబ్దానుశాసనములో "తత్సే చయో న స్యురశస్సదా" యని యుపయుక్తము కాని యీ సంజ్ఞావిధాన మందుఁ గానరాదు. అ తనికిఁ బూర్వమే యీ సంజ్ఞ ప్రసిద్ధమని గ్రహింపఁదగును. ఆధునికముగా నీ సంజ్ఞ యుపయోగింపఁబడుటలే దనియె చెప్పనగును. తత్సమము, సమము (సంస్కృత సమము) లని నేఁడు ప్రసిద్ధము.

---

1. ప్రత్యయేన వికారం యత్తత్సమం తదుదాహృతమ్. (త్రి. శ. 1. 17).

**31. సమస్త వికృతం తజ్జమ్.**[1]

**సమస్త వికృతమ్** = ప్రత్యయముతోపాటు ప్రకృతి యందును వర్ణ వికృతి కలిగిన శబ్దము, **తజ్జమ్** = తజ్జ యగును.

**వి. సావర్ణ్యః ప్రాకృతాదిస్సమస్తం వికృతం యదాద్యనామ తత్తజ్జ సంజ్ఞం స్యాత్. విష్ణుఁడు - వెన్నుఁడు, ద్యూతము - జూదము, గుణము - గొనము ఇత్యాది.**

ప్రాకృతాదులందు వలె నన్నింట వికారమును నొందిన సంస్కృత శబ్దము తజ్జ యగును. వెన్నుఁడు మొ॥

'వర్ణైక వికృతమ్' అను పూర్వ సూత్రము ననుసరించి యిచట సమస్త వికృత మనఁగాఁ బ్రత్యయము, ప్రకృతి యను రెండింటికి సంబంధించిన వికార మని యర్థము సిద్ధించును. ప్రాకృత చంద్రిక యందుఁ బ్రాకృత తద్భవములను గూర్చి చెప్పిన 'ప్రకృతి ప్రత్యయాంశాభ్యాం వికృతం తద్భవమ్' అను వివరణ మిట్టి యభిప్రాయమునె తెలుపు చున్నది.

ప్రకృతికి సంబంధించిన యాయా వర్ణ వికారములు ప్రాకృతమునందుఁ జెప్పఁబడినట్లుండు నను నభిప్రాయము వివృతి నుండి తోఁచుచున్నది. అపుడు ప్రాకృత లక్షణము ననుసరించి ప్రకృతి యందును వికారమును బొందిన సంస్కృత శబ్దము తద్భవ మగును.

"ప్రాకృత లక్షణయుతమై శ్రీ కర మగుఁ దద్భవం" (క. చిం. 1-30) బని తాతంభట్టు పేర్కొనెను - ఇట్లు పరిశీలింపఁగా సంస్కృతము నుండి సరాసరిగాఁ దెలుఁగులోనికిఁ బ్రవేశించినవి తత్సమములును, ప్రాకృతము ద్వారాఁ దెలుఁగునఁ బ్రవేశించినవి తద్భవము లనియు నభిప్రాయ మేమో యనిపించును. ప్రాకృత భాష (తెలుఁగునుఁ బ్రాకృత భేదమే?) లన్ని సంస్కృత శబ్దములందు సమస్త వికృతి చేత, ననఁగాఁ బ్రత్యయాదులతోనే కాక ప్రకృతి యందెల్ల వర్ణ వికృతిచే నేర్పడును గాన నవి యెల్లఁ దద్భవములే యనియు నభిప్రాయము గావచ్చును.

కాని సూత్రము ననుసరించి మాత్రము సంస్కృత ప్రాకృతములు రెంటి నుండి తద్భవము లేర్పడు నని చెప్ప నవకాశము గలదు. ఈ వ్యాకరణమునఁ దద్భవములను సంస్కృతము నుండియే సాధించుట గ్రంథాంతమునఁ గానవచ్చును.

అప్పకవి ప్రభృతులు సంస్కృతప్రాకృతములు రెంటి నుండి తత్సమ తద్భవము లేర్పడుటను వివరించిరి. (అప్ప. 1)

---

1. సమస్త వికృతం తజ్జం సావర్ణ్యాత్సంస్కృతోద్భవమ్. (త్రి. శ. 1.18)

32. ఏకదేశ తజ్జా జటా (డా) దయః.[1]

జటా(డా) దయః = జట(డ) మొదలగునవి, ఏకదేశ తజ్జాః = ఏకదేశ తజ్జములు.

వి. జటా(డా) దిశబ్దా ఏకదేశతద్భవాస్స్యుః
జట - జడ ద్రస్మము-ద్రచ్చము.

జట (డ) మొదలగునవి యేకదేశతద్భవములు. శబ్దమునం దేకదేశమున మాత్రమె తద్భవ లక్షణము గలిగి, మిగిలినచోట మూల లక్షణమె కలిగియున్న శబ్దముల నేకదేశ తద్భవములుగా నీ లక్షణమునఁ బ్రస్తావించినట్లు తోఁచుచున్నది.

జట జడ అని యగుచోఁ బ్రకృతిలోని టకారము తెలుఁగున డకారముగా వికృత మైనది. ఇది తజ్జ లక్షణము. జటలోని జకారము తాలవ్యము. 'జడ'లోను దెలుఁగున జకారము తాలవ్యమె యయినది. దంత్య మగునత్తుతోఁ గూడిన జకారము తెలుఁగు లక్షణము ననుసరించి దంత్యము గావలసి యుండఁగా నట్లు గాక. ప్రకృతి ననుసరించి తాలవ్యమె యయినది. కాఁగా నిట జకారము తాలవ్య మగుటలోఁ బ్రకృతి లక్షణమె యుండఁగా జటా శబ్దమున నేకదేశ మగు టకారము డకార మగుట తద్భవ లక్షణ మగుటచే నీ శబ్ద మేకదేశ తద్భవ మైన దని సమన్వయింపవచ్చును. సూరి 'అక్కజా దిషు' అను సూత్రముచే సూత్రాంధ్ర వ్యాకరణమున నిందలి జకారము తాలవ్యముగనె భావించెను. కాని బాల వ్యాకరణమునం దిది దంత్య మని నిర్ణయించెను.

ఈ పద్ధతి నాధారముగఁ జేసికొని యేకదేశతద్భవములను సాధారణముగ గ్రహింపనగును హంసయాన-అంచయాన-ప్రాణకుట్టము - ప్రాణగొడ్డము మొదలగున వేకదేశ తద్భవములు.

ఈ విభాగము వింతాముఖ్యాపలు పేర్కొనని విశేషము. ప్రయోజనము పరిశీల నార్హము.

33 దేశ్యముశేషతః[2]

అశేషతః = మిగిలిన వెల్లను, దేశ్యమ్ = దేశ్యము.

1. జటాదయోఽప్యేకదేశ తజ్జాః (త్రి శ. 1. 19).

2. దేశ్యంత్వశేషతః త్రి. శ. 1. 18.
దేశ్యాన్యజా? ఆం. కౌ. పరి. 63.

వి. ఆంధ్ర, ద్రావిడ, కర్ణాట, మహారాష్ట్ర, ఘూర్జరాఖ్య ద్రావిడ పఞ్చకాజ్జాతం యత్పదం తద్దేశ్యసంజ్ఞం స్యాత్ - గొబ్బు, గొడ్డలి, కత్తి, ఎల్లప, హొన్ను, హాయి, నేయి, బాపురె, సెబాసు ఇత్యాది.

సిద్ధిర్లోకాచ్ఛబ్దైః (పరి. 1) యను లక్షణమునుబట్టి యాంధ్రభాషాసిద్ధి త్రిలింగ దేశ జనుల వ్యవహారము నుండి తెలియదగును. అందు సంస్కృత (ప్రాకృతముల) నుండి యేర్పడిన తత్సమ తద్భవములు పోఁగా మిగిలిన శబ్దజాలము దేశ్యమగును.

వివృతి యందు ద్రావిడ, కర్ణాటాది దేశముల ప్రస్తావనము విశేషముగా నున్నది. లేక తెలుఁగునఁ దమిళ, కన్నడాదులగు ద్రావిడ భాషలతోఁ దెలుఁగునఁ గొన్ని పదములు సామ్యము గలిగి యుండుటనుబట్టి యిట్లు పేర్కొనఁబడి యుండె నేమో.

కాని యీ వివృతినిబట్టి తెలుఁగు భాషయందలి దేశ్యశబ్దము లితర ద్రావిడ భాషలతో సన్నిహిత సంబంధము గలిగియుండుట గుర్తింపఁబడుట గమనింపఁదగును.

ఆంధ్రదేశోద్భవం దేశ్యమిత్యుచ్యతే బుధైః (త్రి. శ. 1. 14) అను లక్షణ్యములని లక్షణములకు భిన్నముగా నిట వివృతియందు ద్రావిడాదులు ప్రస్తావింపఁబడుట విశేషము. దీనికి సూత్రమున నాధార మెంతయో నిర్ణయింపరాదు.

34. అన్యదేశాగతం గ్రామ్యమ్:[1]

అన్యదేశాగతమ్ = త్రిలింగదేశమునకంటె నితరము లగు దేశములకు సంబంధించిన శబ్దము, గ్రామ్యమ్ = గ్రామ్యము.

వి. ద్రావిడపఞ్చకేతర దేశ్యేభ్య ఆగతం యత్పదం తత్ గ్రామ్య సంజ్ఞం స్యాత్. దేఖో, జావు, ఇదరావు, డాల్, లాఠీ పూఛా, మారో, ఆవో, ఘరు, పత్తరు, బొమ్మన్, ఫీపు యూకం, సిడౌన్, ఇత్యాది.

పైని పేర్కొన్న ఆంధ్రము, ద్రావిడము, కర్ణాటము, మహారాష్ట్రము, ఘూర్జరము నను నయిదు ద్రావిడ దేశములకంటె వేఱయిన దేశమునకుఁ జెందిన భాషా పదము గ్రామ్యమగు నని యర్థము వివృతి యందలి దేఖో మున్నగునవి హిందీ శబ్దములు కాఁగా యూకం మొదలైనవి యాంగ్ల పదములు.

అన్యదేశీయములు గావున నివి యన్యదేశ్యము లని చెప్పవచ్చును.

---

1. అన్యదేశాగతం గ్రామ్యమ్. (త్రి. శ. 1-21)

ఇట్లన్యదేశ్యములను గ్రామ్యములుగాఁ బేర్కొనుటవలనను 'అనర్హం చ' (సం. 35) యను సూత్రము ననుసరించి గ్రామ్యము ప్రయోగార్హము గాకుండుట వలనను, నన్య దేశ్యము తెలుఁగునఁ బ్రయోగార్హము గాదని నిర్ణయింపఁబడి నట్లగు చున్నది. కాని 'యత్త్వేవ' (పరి. 5) యను సూత్రము వివృతి యందు 'ఇతరే వర్ణాస్తత్ర మాన్య దేశ్యాది శబ్దయోగవశాత్ స్యుః' అని యనాంధ్ర వర్ణము లన్య దేశ్య శబ్దముల మూలమునను దెలుఁగునఁ బ్రవేశించునని చెప్పి నట్లయినది. ఇచట నుదాహరించిన దేఖో మొదలగు నన్యదేశ్య శబ్దములలో నట్టి వర్ణములును గలవు. కాని యన్యదేశ్యములు గ్రామ్యములై ప్రయోగానర్హము లగుట వలన నన్యదేశ్యముల నుండి యాయా వర్ణములు దెలుఁగునఁ బ్రవేశించు ననుట యెట్లు?

గ్రామ్యముతోఁ గూడ 'పఞ్చ విధం త్రైలింగ్య'మ్మని చెప్పి యుండుటచే గ్రామ్యమున కరుదుగాఁ బ్రయోగార్హత గలదని చెప్పవచ్చును. అహోబలుఁ డిట్లే యంగీకరించె. (కవి.శి. 256) ఆ చొప్పున నన్యదేశ్యములు కొన్ని తెలుఁగునఁ బ్రయోగింప నవకాశము గల్గును. 'ఖుసి మీజాన్' అను రీతిగాఁ గవి ప్రయోగములు సాధువు లగుచు నన్యదేశ్యము నుండియుఁ దెలుఁగున ఖకారాదులగు వర్ణములు ప్రవేశించు ననుటను బ్రమాణీకరించును.

ఏమైన నన్యదేశ్యములను గ్రామ్యములుగాఁ జెప్పుట యంతగాఁ దోఁపకమానదు. ఈ యన్యదేశ్యములగు గ్రామ్యములే తెలుఁగులోని యైదవ భాగముగా నొకవేళఁ జెప్పఁ దలఁచినను వీనికి గ్రామ్యత్వ విధానము విచార్యము.

**35. అలక్షణం చ.** [1]

అలక్షణం చ = లక్షణ రహితమైన శబ్దమును గ్రామ్యమగును

**వి. లక్షణ రహితమాన్ధ్రపదం చ గ్రామ్యం స్యాత్.**

**వస్తాను, చూస్తిని, తినుకొంటాం, యాడ, వుండారు ఇత్యాది.**

లక్షణ రహిత మయిన యాంధ్ర పదమును గ్రామ్య మగును ఉదా: వస్తాను మొ॥

---

1. అలక్షణమ్. ఆ. త్రి. శ. 1-23

గ్రామ్యా నర్హా. గ్రామ్యభాషాత్వ లక్షణత్వాత్ ప్రయోగానర్హాస్యాత్. (ఆం. కౌ. పరి. 65)

అనియమా ద్గ్రామ్యంహి. ఆం. శ. చిం. సం. 9

వ్యాకరణమునకు విరుద్ధ మగు తెలుగు పదమునకుఁ గూడ గ్రామ్యమను సంజ్ఞ గలుగును. వస్తాను - (వత్తును - లక్షణ బద్ధము) చూస్తిని (చూచితిని) తీసుకొంటాం (తీసికొందుము) చూడక (లేక) వుంటారు (ఉన్నారు)

'అన్య దేశాగత గ్రామ్య'మ్మను పూర్వ సూత్రము ననుసరించి యిచట 'అలక్షణం చ' యనఁగా లక్షణ విరుద్ధమైనదియును గ్రామ్య మగునని యర్థ మగును.

38. అనర్థం చ[1].

అనర్థాంచ = (గ్రామ్యము) ప్రయోగించుట కర్హమును గాదు.

వి. యద్గ్రామ్యం తదలక్షణత్వాత్కావ్యానర్హం చన స్యాత్.

గ్రామ్య మయిన శబ్దము లక్షణ రహిత మయిన దగుటచేఁ గావ్యములందు బ్రయోగించుట కర్హము గాదు.

'అన్యదేశాగతం గ్రామ్యమ్, అలక్షణంచ' యను పూర్వసూత్రముల ననుసరించి యన్యదేశ్యములును, లక్షణ విరుద్ధములును గ్రామ్యము లగును. కాఁగా నిచట 'ననర్హాంచ' యని చెప్పఁబడిన లక్షణము పూర్వోక్తములగు గ్రామ్యములకుఁ జెందినదే యని స్పష్టము.

అన్యదేశ్యములకుఁ దెలుఁగున లక్షణము చెప్పఁబడదు. కావున నన్యదేశ్యమును దెనుఁగున లక్షణ రహితమె యగుచున్నది. అట్లె లక్షణ బద్ధము గానట్టి తత్సమ తద్భవ దేశ్యాదిక మగు శబ్దములును లక్షణరహితములె యగును. ఇట్లన్య దేశ్యములును లక్షణ విరుద్ధములును లక్షణ రహితము లగుటచే నవ్వాని కావ్యములందుఁ బ్రయోగించుటకుఁ దగవని ప్రస్తుత సూత్రము నందలి యభిప్రాయము. లోక వ్యవహార మున నున్నను గావ్య వ్యవహారమున మాత్రము గ్రామ్యము లుండరాదని యభిప్రాయము.

'పఞ్చవిధం త్రైలిఙ్గ్య'మ్మనుచో గ్రామ్యము గూడాఁ దెలుఁగు నందలి యొక భేదముగాఁ బరిగణించుటచే గ్రామ్యమును బ్రయోగార్హమె యనియు 'ననర్హాంచ' యని నిషేధించుట మూలమున నరుదుగాఁ బ్రయోగార్హ మనియుఁ జెప్పవచ్చును. 'అనర్హాంచ' యనుచో సూత్రము నందలి చ శబ్దమునకు నీ యర్థమును ముడి పెట్టవచ్చును.

గ్రామ్య మనఁగ 'నెవ్వరొప్ప రొరులఁ దెగడు చోటులొప్పునదియు' (ఆం.భా.భూ.27) 'పరులఁ దెగడుచోట భాసిల్లు నా గ్రామ్యఘటిలి తగదు సత్ప్రబంధములను' (క.చిం.37) అను మొదలగు రీతిగాఁ గొందఱు గ్రామ్యప్రయోగార్హతను గూర్చి ప్రస్తావించిరి. కాని

---

1. కావ్యానర్హమ్. (త్రి.శ. 1.22) గ్రామ్యానర్హ. (ఆం. కౌ. పరి. 64).

యట్టి స్థలములను, వీనికిఁ బూర్వపుఁ గావ్యములందు వెదుకవలసి యున్నది. 'లక్షిత పదకవిత నమరు (క.చిం. 138) నను తాతంభట్టు వచనమునకు లక్ష్యము మున్నది.

అన్యదేశ్యములను గ్రామ్యములుగాఁ బరిగణించుటచే గ్రామ్యములతో నన్యదేశ్య ములకు మాత్రము కొన్నింటికిఁ బ్రయోగార్హత చెప్పుకొనవచ్చును బూర్వ కవి ప్రయో గముల ననుసరించి. 'ఒరుఁదెగకుచోటఁ' గానరాకున్నను మహాకవి ప్రయుక్తమైన స్థలములలోని లక్షణ విరుద్ధములను గ్రహింప వచ్చును.

37. ముగ్ధాదీ స్సచ్ఛాయా తజ్జః.[1]

ముగ్ధాదిః ముగ్ధ మొదలగు శబ్దములు, సచ్ఛాయాతజ్జః=సామ్యముగల తద్భవ ములు.

వి. స్పష్టమ్-ముగ్ధ-ముగుద ముద్ద; అర్ఘః-అగ్గువ, ఇచ్ఛా-ఇచ్ఛ, ఇత్యాది

ముగ్ధాదుల తద్భవములు సమానమైన ఛాయవలె నుండునట్టి తద్భవములు ఏకదేశ తద్భవములవలె నిదియు నిందుఁ బ్రతిపాదింపఁబడిన విశేషము.

దీని తద్భవ రూపము 'సచ్ఛాయ' గా నుండుట నిట్లు గుర్తింప వచ్చును. ముగ్ధయను దానిలో రెండవ యక్షర మొక్కటి తద్భవత్వ వికారమున ముగుద, ముద్ద అని యగును. కాని మొదటి యక్షరమగు ముకారము మాత్రము వికృతి నందక ప్రకృతి యందు వలెనె యున్నది. ఇట్లె ఇచ్ఛ-ఇచ్చ, అర్ఘః-అగ్గువ యను నితరోదాహృతుల యందును గమనింప వచ్చును.

ఇందు నేకదేశమున మాత్రమే తద్భవ లక్షణ ముండుటచే నివియు నేకదేశ తద్భవములే యనవచ్చును. మఱియింతకు ముందు చెప్పిన జటాదులకును నీ ముగ్ధాదుల కును భేద మెట్టులు? అనఁగా జటాదులలో జకారము తాలవ్య మగుటచేఁ దద్భవత్వ వికార ము గలుగని చోటఁ బ్రకృతి లక్షణము గలదు. కావున నందుఁ గొంత యనాచ్ఛిక లక్షణమును గొంత యాచ్ఛిక లక్షణమును గలదు. ముద్ద మొదలగు వానియం దేక దేశమునఁ దద్భవత్వ లక్షణము లేదన్నను నయ్యది యనాచ్ఛిక లక్షణముగాదు. నిర్వి కారముగాఁ బ్రకృతి లక్షణమె యున్న నందు నాచ్ఛికేతరలక్షణము లేకుండుట జటాదుల కంటె వీని యందలి భేదము గుర్తింపఁదగును.

ఈ భేదకల్పనమువలనఁ బ్రయోజనము గానరాకున్నను నీ వ్యాకరణము పూర్వ ముగాఁ దద్భవములను విభాగించి యున్నది.

---

1. ముగ్ధాదయ స్స్యు వ్సచ్ఛాయా స్తద్భవా స్స్యుః. (త్రి.శ. 1-25)

ఏకదేశ తద్భవములు, సచ్ఛాయ తద్భవములు అను విభాగములో సంకేతములు. విశేషదృష్టి యున్నదేమో నిశితముగఁ బరిశోధింప వలసియున్నది. (దీనిని 32 సూత్రమునకుఁ బిదపఁ జెప్పిన దానిం జూడుఁడి). నృసింహ కవి ఆం. కౌ. లో నీ విభాగము లేకుండుట గమనింపఁగా నిది ప్రయోజనహీన మనియె నిశ్చయింప వచ్చునేమో, పరిశీలింప వలయును.

## 38. అచ్ఛాః కృత్తద్ధితావ్యయ ధాతవః. [1]

కృత్ తద్ధిత అవ్యయ ధాతవః = కృత్తులును, తద్ధితములును, అవ్యయములును ధాతువులును, అచ్ఛాః = 'అచ్ఛ' శబ్దము లగును.

వి. అచ్ఛా ఏతే స్యుః కృత్ = చూపు, వీను, చూచుట,

నిలుపు, పిలుపు, రాక, పోక (ఇవి కృత్తులు)

తద్ధిత = బత్తెగాఁడు, గొప్పవాఁడు, గొప్పది. బిచ్చకత్తె ఆవిడ, అమ్మణ్ణి, ఆయన, అదిగో, ఎవ్వఁడు, అచ్చట. అవ్యయ = కద, ఓ, మఱి, చాలు. ధాతు = వచ్చి, చేసి, కని, ఇచ్చి, పోయి, విని ఇత్యాది.

కృత్ప్రత్యయాంతములును, తద్ధిత ప్రత్యయాంతములును, అవ్యయములును ధాతువులును, 'నచ్ఛ' యను సంజ్ఞ గలిగియుండును.

కృత్తులు - చూచు ధాతువునకు పు వర్ణము ప్రత్యయము చేరి - చూపు అయినది.

**తద్ధితము**-బత్తెమను శబ్దముపై మతుబర్థమునందు గాఁడు అను తద్ధిత ప్రత్యయము వచ్చి బత్తెగాఁడని యగును. కద-ఓ-మొదలగునవి **యవ్యయములు**. వచ్చు మొదలగునవి **ధాతువులు**.

కృత్ అను శబ్దముచేఁ గృదంతములే గ్రహింపఁబడును. ఇట్లే తద్ధిత శబ్దముచేఁ దద్ధితాంతములు గ్రహింపఁబడును.

రాముఁడు లగు సంస్కృత కృదంతములు గాని, గ్రహించుట-మొదలగు నాచ్ఛిక కృదంతము లయిన సంస్కృత సమ శబ్దములును,

---

1. కృతోఽవ్యయాస్తద్ధితా ధాతవోఽప్యచ్ఛాః (త్రి. శ. 1.27)

**భార్గవాదు** లగు సంస్కృత తద్ధితాంతములును, రాముని తన మొదలగు నాచ్ఛిక తద్ధితాంతము లగు సంస్కృత సమ శబ్దములును,

సదా - మొదలగు సంస్కృతావ్యయములును, ప్రహరించు-మొదలగు సంస్కృత సమ ధాతువులు నిటఁ బరిగణింపఁబడవు - వానికి 'నచ్ఛ' యను సంజ్ఞ యిష్టముగాదు. వాని యట్లు గ్రహింపఁ బడకుండుటకు లక్షణమున కవకాశము గానరాదు.

ఇతఃపూర్వము పేర్కొనఁబడిన తత్సమ తద్భవ దేశ్య (గ్రామ్య)ముల కంటె వేఱుగా నిటఁ జెప్పిన కృత్తద్ధితావ్యయధాతువు లేవి యేని గలవా? వివృతి యం దుదాహరింపఁబడిన శబ్దములలో నొకటి నట్టిది గలదా?

సంస్కృత సముల యెడల నచ్ఛ వ్యవహారము తగునా! కాఁగా నిటఁ గృత్తద్ధి తాదు లనఁగా సంస్కృత సమేతరములగు పూర్వోక్తములగు భేదములందలివే కాని వేఱు గావు కాఁగా వాని కంటె భిన్నముగా 'నచ్ఛ' యనునది వేఱొకటి లేనే లేదు. 'అచ్ఛ' యను దానిని ప్రాకృత సమ తద్భవ దేశ్యముల కంటె వేరుగా నిరూపించుట కవకాశము లేదని నిశ్చయింపవచ్చును.

ఇట్టి విభాగము ఆం. కౌ. లోఁ గానరాకుండుట యుచితముగా నున్నది.

దేశ్యములుగా (పరి. 33) నిట నుదాహరింపఁ బడిన గొట్టు మొదలగు శబ్దము లలో నిటఁ బేర్కొన్న కృదంతాదులు లేవు. లభ్యోత్పన్నము లనదగినవి దేశ్యములు గాఁగా కృత్తులు మొదలుగాఁ (ప్రకృతులందే) బ్రకృతి ప్రత్యయములుగా విభాగింప నవకాశము గల్గినవి యా 'అచ్ఛ' విభాగములోఁ జేరునని దీని యుద్దేశ్య మేమో యని పించుచున్నది.

'అజన్య జన్య భేదేన శబ్దాస్స్యు ర్ద్వికృతౌ మతాః' (అ. రా. అజన్త. 95) అను రీతి లక్షణమునకు దీనికిఁ బోలిక గలదా?

ఏమైనను (ప్రాకృతసమ) దద్భవ దేశ్యముల కితరముగా 'నచ్ఛ' యను విభాగము సార్థకముగా దనుటలోఁ దప్పు లేదు.

- ఇతి సంజ్ఞా పరిచ్ఛేదః -

ఇది సంజ్ఞా పరిచ్ఛేదము.

# అథ సన్ధి పరిచ్ఛేదః

## అథసన్ధిః

ఇంక సంధి విషయము చెప్పఁబడుచున్నది.

### 1.సన్ధిః పరరూపమ్[1].

పరరూపమ్ = పరరూప మగుట, సన్ధిః = తెలుఁగున సంధి.

వి. అస్మిన్ శాస్త్రే పరరూప మేవ సన్ధిస్స్యాత్.

ఈ తెలుఁగు వ్యాకరణము నందుఁ బరరూప మగుటయె సంధి యగును.

మొదటిశబ్దము చివరి వర్ణమునకుఁ బర మైనరెండవ శబ్దము మొదటివర్ణము నిల్చుట పరరూపము. తెలుఁగున సంధియందుఁ బూర్వపరస్వరములకు మాఱుగాఁ బరస్వరము నిల్చుటయె యగు నని భావము. సంస్కృతమున సంహితయం దనేకము లయినమార్పులు గల్గును. తెలుఁగుభాషలో మాత్రము సంధియందుఁ బరరూప మగుటమాత్రమె సంహితయందుఁ గల్గువికారము సంధి యనఁబడును.

రాముఁడు + అనఘుఁ డని యుండఁగాఁ బూర్వస్వర మగు 'ఉ'కారమునకును బరస్వరమగు 'అ'కారమె నిల్చి రాముఁ డనఘుఁ డని యగును.

### 2. నిత్యముతోఽచి[2].

అచి = అచ్చు పర మగుచుండఁగా, ఉతః = హ్రస్వ మయినయుకారమునకు, సన్ధిః = సంధి, నిత్యమ్ = నిత్యముగా నగును.

---

1. పరరూపం సన్ధిః. (ఆం.కౌ.సంధి)
   పరరూపం స్యాత్సంధి రాన్ధ్రే. (త్రిశ.2-1)
   పూర్వస్యపరరూపత్వమత్రైవనియతం భవేత్. అ.కా.సంధి.1.
2. నిత్యము తోఽచి. ఆం.కౌ.సంధి.2.
   నిత్యముతఃపరమ్. త్రి.శ.2.2.
   ఉతోఽతద్ధర్మే (నిత్యమ్). వై.చం.సంధి.15.

వి. ఉదన్తస్య ప్రాణే పరే సన్ధిర్నిత్యం స్యాత్ రాముఁ డనఘుఁడు, కృష్ణుఁ డితడు, లక్ష్మణుఁ డుండె, దేవుఁ డెవ్వఁడు, విష్ణుఁ డొక్కఁడు.

ఉదంతశబ్దము (యొక్క ఉత్తు)నకు నచ్చు పరముగా నున్నపుడు సంధి నిత్యముగా నగును. రాముఁడు + అనఘుఁడు = రాముఁ డనఘుఁడు మొ॥

'సన్ధిః పరరూప'మ్మనుపూర్వసూత్రమునుండి సంధి యనుపద మిం దనువర్తించును. హ్రస్వ మైనయుకారమున కచ్చు పరమైనపుడు సంధి నిత్యముగా వచ్చు నని సూత్రార్థము. 'సన్ధిః పరరూప' మ్మను లక్షణమునుబట్టి సంధి యనఁగాఁ బరరూపమె కావున నిచ్చటఁ బరరూపమె (పరస్వరమె) యగును.

రాముఁడు + అనఘుఁడు = రాముఁ డనఘుఁ డని మొదలుగ అ,ఇ,ఉ,ఎ,ఒ. అనునచ్చులు పరమైనందుకుఁ గ్రమముగా విపృతియం దుదాహరణము చూపఁబడినవి. ఇట్లే రాదు + ఐశ్వర్యము = రా దైశ్వర్యము. పొందుము + ఔజ్జ్వల్యము = పొందు మౌజ్జ్వల్య మనురీతిగా యచ్చు పర మైనను సంధి సాధారణము.

ఉతః అనుచోటి తపరకరణముచే ఊకారమునకు సంధి రాదు. ఎట్టూ యనె. కాని 'దేః' అనుసూత్రము దీర్ఘాచ్చులకుఁ బ్రత్యేకముగా సంధి నిషేధించుచున్నది. కాన నిట 'ఉత్' అనుచో తకార ముచ్చారణార్థ మన్నను బాధ లేదు.

'అచి' యనుటచే రాముఁడు వచ్చెను మొదలగు చోట్ల హల్‌పరకత్వమున సంధి లేదు. ఋ౹ఌ లచ్చులే యై యున్న నవి రేఫలకారములతోఁ దుల్యములగుటవలన హలత్వమువలన నవి పరమయినపుడు సంధిగాని యకారముగాని రాదు,అతఁడుఋషి. మొ॥

'నిత్య' మ్మనుటచే రాముఁడు యనఘుఁ డనురీతిగా నుత్తున కచ్చు పర మైనపుడు సంధి రానిరూపము లుండవు.

## 3. శేషాత్ స్వేఽచి విభాషా[1].

శేషాత్ = మిగిలినశబ్దములందు, స్వే + అచి = అదే యచ్చు పర మైనపుడు, సంధిః = సంధి, విభాషా = వైకల్పికముగా నగును.

---

1.. శేషాద్వి కల్పం స్వేఽచి స్యాత్. (త్రి.శ. 2.3)

వి.తత్సమ తద్భవ శేషాదికారాత్ స్వే ప్రాణే పరే వికల్పేన సన్ధి స్స్యాత్. ఇం తిది, ఇంతీ యిది, కూరి మిచ్చోటు, కూరిమి యిచ్చోటు; వెలఁ దిక్కడ, వెలఁది యిక్కడ, మేలి మిట్టులు, మేలిమి యిట్టులు, పణఁ తిచ్చె, పణఁతి యిచ్చె.

తత్సమ తద్భవములకంటె వే ఱయిన (దేశ్య) శబ్దములయందలి యిత్తునకు నదే యచ్చనఁగా హ్రస్వ మయిన యికారము పర మైనపుడు సంధి వికల్పముగా నగును. 'సన్ధిః పరరూప' మ్మను లక్షణమునుబట్టి యట సంధి, యనఁగా బరరూపము గల్గును.

ఇంతి + ఇది అనుచోఁ బ్రస్తుతసూత్రముచే సంధి రాఁగా ఇం తిది యని యగును. విభాష గావున సంధి రాని పక్షమునందు 'యః ప్రాణస్య' (పరి.20)యను సూత్రముచే యకారము చేరి ఇంతి యిది యని యగును. ఇట్లే యితరములు గ్రహింపఁదగును.

శేషశబ్దమునకుఁ దత్సమ దతద్భవేతర మను నర్థమును, ఇత్తున కను నర్థమును వివృతి ననుసరించియె తెలియవలయును. కాక వీనికిఁ దర్వాతి రెండవసూత్ర మగు 'తద్ధితతిజీవ్యయేతోనిత్య' మ్మను(సంధి.5)సూత్రమునుండి పూర్వ మున్న రెండుసూత్రముల లోనికి 'నిత' అనునది యపకర్షింపఁజేసికొనవచ్చును. "శేషాద్వికల్పం స్వేచిస్యాన్నిత్యంత త్తద్ధితేష్వితి"మ్మను సధర్వణుని త్రిలింగ శబ్దానుశాసనమునను ని ట్లపకర్షింపఁబడుచున్నది.

వి. శేషాత్ కిమ్ ? హరి యిచ్చె, శూలి యిచ్చట, జోగి యెక్కడ.

సూత్రమునందు 'శేషాత్' అనుటచేఁ దత్సమ తద్భవములం దిత్తున కిత్తు పర మైనను సంధి రాదు. హరి + ఇచ్చె = హరియిచ్చె జోగి + ఎక్కడ = జోగి యెక్కడ. వృత్తియందు హరి, శూలి తత్సమములు. జోగి తద్భవము.

ఇట్లు తత్సమ తద్భవములం దిత్తునకు సంధిని వారించుటచే నీ సూత్రముచే దేశ్యములందు మాత్రమె సంధి యంగీకరించిన ట్లయినది. ఏమ్యాదుల యిత్తున కనుచో సూరి యేమ్యాదులలోఁ జూపిన శబ్దము లన్నియు (కిషష్ఠి దప్ప) దేశ్యములే యగుట గమనింపవచ్చును. కాని యది యాకృతిగణ మగుటచే, బ్రయోగములందు గానవచ్చుటను బట్టి (తత్సమ) తద్భవములందు నిత్తునకు సంధిని గ్రహించు నవకాశము లేకపోలేదు. ఏమైనను దేశ్యములందుఁ బ్రచుర మనవచ్చును. ఏ మంటివి, 'స్వేఽచి' యన్నది యిందలి విశేషము.

వి. స్వేఽచీతి కిమ్? వెలఁది యెవ్వతె, పణఁతి యే మఁనె, ఇంతి యరిగె. ఇత్యాది.

సూత్రమునందు 'స్వేఽచి' యని చెప్పుటచే దేశ్యములందలి యిత్తున కయినను ఇకారముకంటె వే ఱయినయచ్చు పరమైనపుడు సంధి రాదు. వెలఁది + ఎవ్వతి = వెలఁ దెవ్వతి యని గాదు. 'యః స్త్రియోస్య' (పరి.20)యని యకారము చేరి వెలఁది యెవ్వతి యని యగును.

ఏ మంటివి, మ ఱేమి యని యుదాహరించిన సూరిమతము ననుసరించి స్వేఽచి యను నియమ ముపేక్ష్య మనఁదగు. చింతామణ్యాదులు నిట్లు (స్వేఽచి) పేర్కొనలేదు. ఇందుఁ దరువాతిసూత్ర మిట్టివాని కించు కవకాశ మిచ్చుచున్నది.

4. క్వచిచ్చాన్యస్మిన్.

అన్యస్మిన్ చ= ఇతరమైనయచ్చు పరమైనపుడు సయితము శేషాత్ = దేశ్యశబ్దములందలి, ఇతః = హ్రస్వమగు నికారమునకు, క్వచిత్ = కొన్నియెడల సంధి యగును.

వి. అన్యాచి పరే వైకృతేకారస్య క్వచిత్ స్థలే వా స్యాత్. మేటైనవాఁడు (గ్లాలయ,పిండెత?) ఇత్యాది.

వే ఱొకయచ్చు పర మయినను వైకృతశబ్దములం దిత్తునకుఁ గొన్నియెడల సంధి యగును.

మేటి + ఐనవాఁడు = మేటైనవాఁడు మొ॥

'తద్ధితతిఙ్ఙ్వ్యయేతో నిత్య' మ్మను తరువాతిసూత్రమునుండి 'ఇతః' అనుపద మీ సూత్రములోని కపకర్షింపఁబడును. 'శేషాత్ స్వేఽచి' యను పూర్వసూత్రమున 'స్వేఽచి' యనుటచే నిత్తు పర మయినపుడు సంధి పేర్కొనఁబడినది. కావున నిచట 'అన్య' శబ్దమునకు ఇకారముకంటె వే ఱయిన య చ్చను నర్థము సిద్ధ మగును. 'అన్యస్మిన్' అనుచోటిసప్తమిచే 'తస్మిన్నితి నిర్దిష్టే పూర్వస్య' యనుపాణినీయపరి భాష ననుసరించి యికారేతరస్వరము పర మగుచుండఁగా నని యర్థమై పూర్వమునందలి దేశ్యశబ్దేకారమున కే కార్యము (సంధి) యగు నను నర్థము సిద్ధ మగును.

మేటి + ఐనవాఁ డనుచో 'ఐ' కార మికారేతస్వరము ప్రస్తుతలక్షణముచే సంధి కాఁగా మేటైనవాఁ డని యగును.

'క్వచిత్' అనుటచే నీ సంధి క్వాచిత్కము గావున సంధి గానిరూపములే తఱుచుగా

ముండును. 'యః ప్రాణస్య' యని యకారము చేరిన మేటి యైనవాఁడను విధ మయిన స్థితియె ప్రచుర మని తాత్పర్యము.

ఇత్వము పర మగుచుండఁగా సంధి వికల్పము గాఁగా, నికారేతరము పర మగుచుండఁగాఁ గ్వాచిత్క మగుట యనుభేదమునుబట్టి యివి యిట్లు వేఱు చేయఁబడిన వని యూహింపఁదగును. కవిప్రయోగములం దీభేద మెంతవఱకుఁ గలదో పరిశీలింపవలసి యున్నది.

## 5. తద్ధితతిఙవ్యయేతో౽నిత్యమ్. [1]

తద్ధిత = తద్ధితప్రత్యయాంతములందును, తిఙ్ = తిఙంతములయందును, అవ్యయ = అవ్యయములయందును నున్న , ఇతః = హ్రస్వ మైన యికారమున కచ్చు పర మగునపుడు, నిత్యమ్ = సంధి నిత్యముగా నగును.

వి. తద్ధితతిఙవ్యయానా మికారస్య ప్రాణే పరే సన్ధిర్నిత్యం స్యాత్. తద్ధితః– కల్ల రితఁడు; బాపన దెవ్వతి, అమ్మ క్కెక్కతె, అం తే నేమి అయ్య దెక్కడ . తిఙ్ః– వచ్చి రెందు; వచ్చితి రెక్కడికి, నీవు వచ్చితివందు, వచ్చితి మందురు. అవ్యయః– మ ఱేమి, ఏ మంటివి, మంచి దెక్కడ, మిక్కిలయ్యె. ఇత్యాది.

తద్ధి తాంతములు, క్రియాపదములు, నవ్యయములయందు నున్నయిత్తున కచ్చు పర మయినపుడు సంధి నిత్యముగా నగును. కల్లరి + ఇతఁ డనుచో తద్ధితేకారమునకు సంధి యై కల్ల రితఁడు. వచ్చిరి + ఎందు ననుచో గ్రియేకారమునకు సంధి యై వచ్చి రెందు. మఱి + ఏమి యనుచో నవ్యయేకారమునకు సంధి యై మ ఱేమి. ఇట్ల యితరములు.

వివృతియందు బాపనది మొద లగునవి తద్ధితాంతములుగాఁ జూపుట విశేషము.

ఏమి, మంచిది, యనువాని నవ్యయములుగా భావించుట ప్రమాద మనక తప్పదు. ఏమి శబ్ద మౌపవిభక్తిక మై ఏమిటికి– ననుమొదలుగా నాయా విభక్తులతో రూపములు గలవు. ఇది నిత్యైకవచనాంతము మాత్రమె కాని యవ్యయము గాదు. బాపనది తద్ధితాంతము కాఁగా మంచిది యవ్యయ మగుట యొకవిశేషము. మంచిదాని నిత్యాదిగా నితరవిభక్తివ చనములరూపములు గలిగియుండును. శుభ మనునర్థమున 'మంచిది' యనుట వ్యవహారమునఁ గలదు. దీని కితరవిభక్తివచనములరూప ముండదు. కాని యచ్చట 'మంచిది' శబ్దము

---

1. నిత్యం తత్తద్ధితేష్వితామ్, తిఙవ్యయేతాం సర్వేషామ్. (త్రి.శ.2,4,5)నిత్యంతిఙ్మధ్యస్య. వై.చం.సంధి.12

తచ్ఛబ్దాంత మగు మంచిది శబ్దముకంటె భిన్న మగుట విచార్యరము.

ఏమి యవ్యయ మనుకొనుట వలననే కళలలో 'కిమ్'శబ్దము ప్రత్యేకముగాఁ బరిగణింపఁబడిన దేమో యదా తదా ఇదానీ మనునవి గూడ నిట్టివేయగుట యట గుర్తించితిమి

వీనికి సంధి నిత్య మనుట ప్రయోగానుగుణము గాదనక తప్పదు. మ ఱేమి, ఏ మంటివి యనుచోట్లఁ జిన్నయసూరి వీనినే గ్రహించి మఱి యేమి, ఏమి యంటి వని సంధి రాని రూపముల నుదాహరించుట ప్రసిద్ధమే. చింతామణియును 'ప్రాయస్తు.స్యాత్కి-మాదికస్యేతః' అని కిమాదులకు సంధి ప్రాయిక మని చెప్పియుండగా నీ వ్యాకర్త నిత్య మని పేర్కొనుట యథర్వణుని త్రిలింగ శబ్దానుశాసనము ననుసరించుటవలనఁ గావచ్చును. కవిప్రయోగములను బరిశీలించినఁ బ్రాయిక మనుటయె సముచితముగాఁ బ్రయోజనవంతముగా నిర్ణయింపలేమి నిత్య మనుట గుదుర దనక తప్పదు.

తద్ధిత తిజంతములవిషయమునను. తిజంతములలో మధ్యమపురుషక్రియలయందు మాత్రమె సంధి నిత్య మై యున్నట్లు పెక్కురు లాక్షణికులు నిర్ణయించిరి.

వీనియందు సంధి నిత్య మనుకొనుట వలన నీలక్షణము ప్రత్యేకముగాఁ జెప్పఁబడియుండును. ఇంకను నిం దొకభేదము. ఇతఃపూర్వ మిత్తు పర మైనపుడే సంధి వికల్పము ఇతరస్వరము పర మైనఁ గ్వాచిత్కము. ఇచట నా వివక్ష లేమి నేయచ్చు పర మైనను సంధి నిత్యమె. వివృతియందు వేర్వే ఱచ్చులు పర మగుట యుదాహరింపఁబడుట గమనింపవచ్చును.

ఇంకను తిజంతములు తత్సమము లైనను సంధి యగుట గుర్తింపవలె. ఘటించితిరి + అపుడు = ఘటించిత రపుడు.

కాఁగా నీ లక్షణముల నిట్లు గాక వే ఱొకప్రణాళికతోఁ జెప్పుట యుచిత మనవచ్చు నదే సూరి సమ్మతమార్గము.

## 6. వాఽతః[1]

అతః = హ్రస్వ మయినయకారమున కచ్చు పర మైనపుడు, వా = వికల్పముగా సంధి యగును.

వి. అతత్స తజ్జస్యాస్త్రీపశువాచకస్య కేవలవికృతిసంభవస్యాకారస్యాచి పరే సన్ధిర్వా స్యాత్. ఏం తయ్యె, ఏంత యయ్యె, కో కిక్కడ, కో కయిక్కడ, ఊర కుండె, ఊరక యుండె, తులు వెచ్చట, తలువ

1. వాతః (త్రిశ.2.6, ఆంకౌ.సంధి - 3) ఆం.శ.చిం.సంధి.3.

యెచ్చట, ఆయ నొక్కఁడు. ఆయన యొక్కఁడు, అం తౌర, అంత యౌర.

తత్సమము, తద్భవముకంటె వే ఱయినది యనఁగా దేశ్యశబ్దము, స్త్రీవాచకము గాని, పశువాచకము గాని, కాని దేశ్యశబ్దములందలి యత్తున కచ్చు పర మగునపుడు సంధి (పరరూపము) వికల్పముగా నగును.

వింత + అయ్యె ననుచో నిట్లు సూత్రముచే సంధి రాఁగాఁ బరరూపముతో విం తయ్యె నని యగును. 'వా' యనుటచే సంధి వికల్పము గావున సంధి లేనిపక్షమునందు 'యఃప్రాణస్య' యనుసూత్రముచే యకారము వచ్చి వింత యయ్యె నని యగును. ఇట్లె యితరములు.

అతః అనుదానికి వివృతియందు మిక్కిలివిశేషములతోడియర్థము చెప్పఁబడినది. దానికిఁ బ్రయోజనము వివృతియందుఁ గ్రమముగాఁ జూపఁబడుచున్నది.

వి. అతత్సపదం కిమ్? వనిత యచ్చోట, రమ యిక్కడ, తాత యుండె, హంస యేది. దర్భ యోసరె.

వివృతిలో 'అతత్సపదమ్' అనుటచేత, తత్స (సంస్కృతసమ) శబ్దములందలి యత్తునకు సంధిరాదు. హంస + ఏది యనుచో హంసేది యనికాదు. ఇంక 'యఃప్రాణస్య' యని యకారమై హంస యేది యని మాత్రమే యగును. దర్భ + ఓసరె = దర్భయోసరె.

వి. అతజ్జపదం కిమ్? ముగుదయెవ్వతె, కతయెంత.

అట్లె వివృతియందు 'అతజ్జ' యనుటచేఁ దజ్జ (తద్భవ)శబ్దములందలి యత్తునకును సంధిలేదు. కత + ఎంత = క తెంత యని కాదు. యకారముతోఁ గత యెంత అనియె యగును.

వి. అస్త్రీపదం కిమ్? ఉవిద యెందు, నెలఁత యచ్చోట, కొమ్మ యేది.

వివృతియందు 'అస్త్రీ-వాచకస్య యనుటచేత దేశ్యశబ్దమె యైనను స్త్రీవాచకమయినచో నందలి యత్తునకు సంధి రాదు. ఉవిద + ఎందు = ఉవి దెందు నని కాదు. ఉవిద యెం దని యె యగును.

ఇట్లు దేశ్యములైనను స్త్రీవాచకములందు సంధిలేదు. కావునఁ బైచోట్ల వివృతియందు స్త్రీవాచకము లుదాహరించుట యనవసరము. తత్సమపదములయెడ వనిత, రమ యన్నవి తత్సమము లగుట య ట్లుంచి స్త్రీవాచకములు నైనవి. అట్లే తద్భవస్థలమున ముగుద స్త్రీవాచకము. స్త్రీవాచకములుగాని వానినే యటఁ జూపుట యుక్తముగా నుండును.

వి.అపశుపదం కిమ్? దున్న యెచ్చట, పిట్ట యిచ్చట, చిలుక యెక్కడ, చిలువ యెుప్పె.

వివృతిలో 'అస్త్రీ పశువాచకస్య' యనుట చేత పశువాచకములకును సంధి లేదు. ఇచటి పశుశబ్దము పక్షులు మొద లగువానికిని నుపలక్షణ మని పిట్ట , చిలుక, మున్నగు నుదాహృతులను బట్టి తెలియవచ్చును.

తిర్యక్కులను దెలుపునట్టి(దేశ్య)శబ్దములయందు నత్తునకు సంధిలేదు. దున్న యేది మొ॥

వి. కేవలవికృతిసంభవపదం కిమ్? వెన యయ్యె, మజ్జ యనె, రూక యిచ్చె.

కేవలము వికృతిశబ్దములందె యనఁగ దేశ్యములందె యత్తునకు సంధి యగును. 'వికృతి శేషే' (సంజ.6)యను లక్షణము ననుసరించి యాంధ్రభాష కంతకును వికృతి యనుపేరు గలుగుచున్నది. ఇచ్చటికేవల(వికృతి)శబ్దముచే, సంస్కృతప్రాకృతాదు లగు నితరభాషలతో సంబంధము లేనిశబ్దము గ్రహింపవలె ననఁగా ని ట్లనుటవలన నన్యదేశ్యములయందలి యత్తునకును సంధి రా దని చెప్పుట యుద్దిష్టమయి యుండును. మజ్జ + అనె = మజ్జయనె మొ॥వెన?రూక యన్యదేశ్యము లని యూహింపవలయును.

వీనిలో స్త్రీవాచకతత్సమములలో సంధి లే దని చెప్పిన సూరి యాధునికకృతుల నొకానొకచోట నుండుటను బేర్కొనెను. తద్భవములలోను దిర్యగ్వాచకములలోను సంధి లే దను నిర్ణయము కవిప్రయోగానుగుణముగాఁ గానరాదు.

ఇట్లు వివృతియందు విశేషముగాఁ బ్రతిపాదింపబడిన యంశములు కొంత వివాదమునకు హేతువు లయి యున్నవి.

అతః అనుచోటి తపరకరణముచే దీర్ఘమైన 'యా' కారమునకు సంధి లేదు. ఆహా + అనె = ఆహా యనె. కాని 'దేః' అను నిషేధమునుబట్టి యిచటితకార ముచ్చారణార్థము చేర్పఁబడిన దని తోఁచు.

వెలయాలు మొద లగుచోట్ల సంధి లేదని సూత్రమునందలి వా శబ్దమునకు వ్యవస్థ చేసికొనుట మూలమున సాధింపవచ్చును.

## 7. నైకాచః [1].

ఏకాచః = ఒకేయచ్చురూపము గలశబ్దములకు వచ్చు పర మగునపుడు , న = సంధి లేదు

**౨. ఏకాచోఽచి పరే సన్ధిర్నస్యాత్. స్త్రీ యిది, శ్రీ యెక్కడ, ధీ యితనికి.**

ఒకే య చ్చయినశబ్దముల కచ్చు పరమైనపుడు సంధి రాదు. స్త్రీ + ఇది. ఇట స్త్రీ యను శబ్దమొకే యచ్చుగలదికావున నీ సూత్రముచే సంధి రాక 'యః ప్రాణస్య' యని యకారము రాఁగా స్త్రీ యిది యని యైనది. ఇట్లె శ్రీ యెక్కడ, ధీ యితనికి.

వివృతియందుఁ జూపఁబడిన యుదాహరణములకొఱకే లక్షణము చేయఁబడినచో నీ సూత్రము వ్యర్థ మని నిర్ణయింపవచ్చును.

ఉతః, ఇతః, అతః అని పూర్వము సంధి విధించిన స్థలములందలి తకార ముచ్చారణసౌకర్యమునకై చేర్పఁబడినది. అ ట్లయ్యును 'దేశ్య' (సంధి.10) యను సూత్రముచే దీర్ఘాచ్చునకు సంధి లేదు కావున స్త్రీ, శ్రీ, ధీ శబ్దములందలి దీర్ఘాచ్చునకు 'దేశ్య' యను సూత్రముచేతనె సంధినిషేధము సిద్ధించుచుండఁగా నిట మఱల 'నైకాచః' అని నిషేధించుట వ్యర్థమే కదా. అచ్చట నన్నియు నాచ్ఛికములే యుదాహరింపబడినవి ఆచ్ఛికశబ్దములకు నిషేధ మనియు నీయది తత్సమములయెడ నిషేధించునదియు నందుకే యిచట నన్నియుఁ దత్సమములే యుదాహరింపఁబడిన వనియుఁ జెప్పుట కవకాశము గలదు.

నిజమున కొకేయచ్చు గలిగిన తత్సమశబ్దములు దీర్ఘాంతము లయియె గానగును. కావున నిట నిట్టిశబ్దములు చూపఁబడియుండవలెను.

కాని, ఇత్వసంధిస్థలమున నయ్యది దేశ్యములకే గదా వచ్చు నని వివరించినది. తత్సమపదముల కు రా దనుటవలననే హరి యిచ్చె , శూలి యిచ్చె నిత్యాదులు సంధి లే దని వివృతి వివరించినది. అట్టియెడల స్త్రీ, శ్రీ మొదలగు నీ శబ్దములకు మాత్రము సంధి యెట్లు ప్రాప్తించును? ప్రాప్తింపనిచో నిషేధమేల?

'ఏచోఽచి' య ను తరువాతిసూత్రమువలెనె యిదియు సిద్ధార్థమును సాధించునదె యనవచ్చును. అట్లయినను 'దేశ్య' యనున దాచ్ఛికములకే పరిమితము చేసి తత్సమములు గూడ నటనే సిద్ధించు నవకాశ ముండగా వేఱు చేసిచెప్పుట యనవసరము.

---

1. సంబోధనైకాజ్ఞ్యద్ధ్వస్తదీర్ఘానాం ద్రుతినాం చ న (ఏకాచ్-) త్రి.శ.2.9.

కాని అ, మొదలగు దేశ్యములైన యవ్యయాదులకు హ్రస్వములందె యీ సూత్రము సంధిని నిషేధించుచున్నదని చెప్పనఁగొంతమేర దీనికిఁబ్రయోజనముండు నని తోఁచుచున్నది. తమ్ముఁడ + ఇష్టమనుచో తమ్ముఁడనుశబ్దముపై నవధారణార్థక మగు 'అ' అను నవ్యయశబ్దము చేరి తమ్ముఁడ యని యైనది. ఈ యత్తునకు సంధి వాఽతః అని ప్రాప్తించును దాని నీ సూత్రము నిషేధించును. ఇట్లే ప్రార్థనాద్యర్థవిశేషములందు నకారాదు లగు నేకస్వర శబ్దములకును నిది సంధిని నిషేధింపఁగలదు. కావుమ + అనెను = కావుమ యనెను. ఇట్లే కావుఁ యనెను మొ॥.

## 8. ఏచోఽపి [1]

ఏచః అపి = ఏచ్ ప్రత్యాహారసిద్ధము లగువర్ణములకు నచ్చు పర మగుచుండఁగా సంధి లేదు.

వి. ఏచామచి పరే సన్ధిర్నస్యాత్. కన్నె యరిగె, నీకో యనె, అతఁడై యొప్పె, గ్లౌ యుదయించె.

ఏచ్చుల కచ్చు పరమైనపుడు సంధి రాదు. కన్నె + అరిగె = కన్నె యరిగె మొ॥

ఏఓ(ఙ్) ఐఔ(చ్) అనువర్ణములు 'ఏచ్' అనుప్రత్యాహారముచే బోధింపఁబడును. తెనుఁగున ఏఓలు హ్రస్వములును గలవు కావున నేచ్చు లనఁగా ఎఏఒఓ ఐఔ- అనునవి 'నైకాచః' అనుపూర్వసూత్రము ననుసరించి (నసన్ధిఃఅని) వీని కనఁగా ఎఏఒఓఐఔల కచ్చు పరమగుచుండఁగా సంధి రా దను నర్థము సిద్ధించును.

'కన్నె + అరిగె' నని యుండ నీ సూత్రముచే నిషేధింపఁబడుటవలస సంధి రాకుండఁగా 'యః ప్రాణస్య' యనుసూత్రముచే యకారము చేరి కన్నె యరిగె నని యగును. ఇట్లే యితరములును.

ఇందు ఉత్తు, ఇత్తు, అత్తు ననుమూఁడచ్చులకే సంధి విధించుట జరిగినది. కాఁగాఁ దద్భిన్నము లగు ఎకారాదులకు సంధి ప్రాప్తించుటకె యవకాశము లేదు. రానిసంధిని మఱల రా దని నిషేధించుట యనవసరము.

దీనివలనఁ బ్రయోజనాంతరమును గానరాదు. కాక మఱల సంధి లే దనుట స్పష్టతకె యని యెంచవలసియుండును.

---

1. సంబోధనైకాజ్బ్రదన్త ద్వీర్ఘాచాంద్రుతినాం చ వ (ఏచామ్-) త్రి.శ.2.9.

ఏచోఽచి యని వ్రాతప్రతిలో 'అచి' అని యున్నది. అది యనవసరము. పూర్వోత్తరసూత్రములందును లేదు. నడుమఁజేర్చుటవలన వింకను ననర్థమె. కావునఁ బూర్వోక్త మగు సంధినిషేధమును సంగ్రహించుచు 'నపి' శబ్దమె యుండియుండు నిట.

## 9. సంబుద్ధిప్లుతాభ్యాంచ [1].

సంబుద్ధి = సంబోధనమునఁ బ్రథమైకవచనాంతములకును, ప్లుతాభ్యామ్ చ = ప్లుతస్వరములకును సంధి లేదు.

వి. ఆభ్యామచి పరే న సన్ధిస్స్యాత్. కృష్ణ యేమి? హరి యిందు రమ్ము, గురువ యిచ్చోట నుండు, హరీ యెందు వచ్చితివి, విష్ణూ యిచ్చట నుండుము, కన్నె యాట లాడుము.

సంబోధన ప్రథమైకవచనాంతములకును, ప్లుతస్వరమునకును నచ్చు పరమగుచుండఁగా సంధి లేదు. కృష్ణ + ఏమి = కృష్ణ యేమి. ఇచట సంబుద్ధియందు సంధిలేదు. విష్ణూ యిచ్చట. ఇది ప్లుతమునకు సంధి రానందు కుదాహరింపఁబడియుండు. విష్ణూ౩ యిచ్చట.

'సంబుద్ధి' యను సామాన్య నిర్దేశమువలన సంబుద్ధియం దన్నియచ్చులకును సంధి రాదు. కన్నె యాటలాడుము మొ॥విష్ణూ౩ యిచ్చట ననుచోఁ బ్లుతము గల దన్నను నయ్యది గూడ 'సంబుద్ధ్యంతమె' యగుటచే సూత్రమునందలిసంబుద్ధి యను దళముచేతనె యిచటి ప్లుతమునకును సంధి నిషేధింపఁబడుచున్నది. హ్రస్వదీర్ఘములతోపాటు ప్లుతమును గూడఁ దెలుఁగునను బ్రత్యేకముగా నంగీకరించుటచేత సంబుద్ధికి భిన్న మయిన స్థలమునందలి ప్లుతము నిచ్చట నుదాహరించిన బా గుండెడిది. ప్లుతము తెలుఁగున నప్రసిద్ధము. ప్రామాణికు లగు పెక్కురు లాక్షణికు లంగీకరింపనిదియు. అట్టి స్థలము కవి ప్రయోగములందును మృగ్యమె యని చెప్పఁదిగియున్నది. (అథర్వణుఁడు దీర్ఘము లనె.)

'ప్రథమైకవచనం సంబుద్ధిః' అను నాద్యలక్షణము ననుసరించి సంబుద్ధి యనఁగా సంబోధన ప్రథమైకవచనమె. కావున సంబోధనమున బహువచనాంతమునకు సంధినిషేధము లేదు. అట్టిది వివృతియందు నుదాహరింపఁబడియు నుండలేదు, అన్నలార + అని = అన్నలా రని యని సంధి కావచ్చును. కాని యిట్టి ప్రయోగము లప్రసిద్ధములు. ఆధునికములును విరళములే యగుట గమనార్హము.

ఈ సూత్రమునకు వివృతికారుఁడు తత్సమశబ్దము ల నుదాహరించుట విశేషము. ఔచిత్యము చింత్యము.

---

1. సంబోధనైకాజ్బ్రదన్త దీర్ఘైచాంద్రుతినాం చ న (సంబోధన – దీర్ఘ–) త్రి.శ.2.9

## 10. దేశ్చ[1].

దే: చ = దీర్ఘమునకు నయిత మచ్చు పర మగుచుండఁగా సంధి రాదు.

వి. దీర్ఘాక్షరాదచి పరే సంధిర్న స్యాత్. నేజా యెవ్వరిది ?నవలా యిచ్చట, లకొరీ యొక్కటి.

దీర్ఘమున కచ్చు పర మగునపుడు సంధి లేదు. నేజా + ఎవ్వరిది = నేజా యెవ్వరిది.

దిర్దీర్ఘస్య (సం-14)యనుసూత్రము ననుసరించి దీర్ఘమునకు 'ది' యని సంజ్ఞ. దీర్ఘమునకుఁ గూడ సంధి రాదు.

'నేజా + ఎవ్వరిది' యనుచోఁ బ్రస్తుతలక్షణముచే సంధి రాకుండఁగా 'యః ప్రాణస్య' యని యకారము వచ్చి నేజా యెవ్వరిది యని యగును. ఇట్ల యితరములు.

ఉతః, ఇతః, అతః అని యింతకుముందు సంధిని విధించిన సూత్రములలో తకారము పరముగాఁ జేర్చుటకలదు. అది 'తపరస్తత్కాలస్య' యను బాణినీయపరిభాషానుగుణ మగుప్రయోజనము నుద్దేశించియున్నచో నీ సూత్రమె యనవసరము. కావున దీనిని సార్థకము చేయవలయు న్న నాచోట్ల తకార ముచ్చారణసౌకర్యము మాత్రమె ప్రయోజనముగాఁ జేర్పఁబడిన దని యెంచవలయును. ఈ సూత్రము చెప్పె నని య ట్లనుకొనుట దప్ప నది యంతగా నుచిత మనరాదు. ఏలయనఁ దత్కాలమాత్రగ్రహణప్రయోజనము నుద్దేశించినదానితోపా టు చ్చారణసౌకర్యము గూడ సిద్ధించెడిదే గద. ఈ సూత్ర మనవసర మనఁదగును. 'ఏచోఽపి' యను లక్షణమువలెనె యిది సిద్ధార్థమును వివరించునదిగాఁ జెప్పుట దప్పును గాదు.

ఇచట వివృతియం దన్నియు దేశ్యశబ్దములే యుదాహరింపఁబడినవి. సంస్కృత సమములయెడ నీ లక్షణము వర్తింప దని చెప్పుటకు సూత్రమున నెట్టియాధారమును లేదు. వివృతియందు నట్లు పేర్కొనఁబడలేదు. (అవసరమును లేదు. వివృతి యాయా సంధులు తత్సమములకు రా వని వివరించుట గమనించితిమి గదా.)కావున 'నైకాచః' అను సూత్రమునకుఁ జూపిన యుదాహరణము లన్నియును బ్రస్తుతసూత్రమునకే యుదాహరణములు గాఁగలవు. ఇంక నిది దీర్ఘమునకు సాధారణముగా సంధిని నిషేధించుటచేత నేకాచ్ఛబ్దములతోపాటు, బహ్వచ్కములందును నంధినిషేధమును సాధింపఁగలదు. 'నైకాచః' అన్నది యేకాచ్ఛబ్దములందు మాత్రమె వర్తిల్లును. కావున నదియే వ్యర్థ మని తిరస్కరింపఁదగును. 'దేశ్చ' యను నీ సూత్రమె యన్నింటికి సాధక మయి యున్నది.

---

1. దీర్ఘె చాంద్రుతీనాం చ న (దీర్ఘ-) త్రి.శ. 2.9.

విప్రతియం దుదాహరింపఁబడునట్లుగాక 'నైకాచః' అనుసూత్రము మనము గ్రహించిన యర్థము చెప్పునది యగునపుడే యది సార్థకము గాఁగలదు.

ఈ సూత్రము గూడ స్పష్టతకె గాని విశేషప్రయోజనము లేని దని యిటనే గుర్తించి యుంటిమి.

## 11. నిత్యం పరిమితౌ సర్వేషామ్ [1].

పరిమితౌ = పరిమాణార్థకప్రత్యయమునందలియచ్చు పర మగుచుండఁగా, సర్వేషామ్ = అన్నియచ్చులకును, నిత్యమ్ = సంధి నిత్యముగా నగును.

వి. పరిమాణార్థక ఎఁడ్వాదిపరె సర్వేషా మదిదుదెదన్తానాం నామ్నాం సన్ధిర్నిత్యం స్యాత్. బారెఁడు, ఏడెఁడు, తూమెఁడు, గురిగింజంత, కంచంతకాపురము, దుడ్డంత, మిద్దంత. ఇత్యాది.

పరిమాణార్థకము లయిన ఎఁడు మొదలగునవి పరముగా నున్నపు డన్నియచ్చులకును సంధి నిత్యముగా వచ్చును. బార + ఎఁడు అనుచో లక్షణముచే సంధి జరిగి బారెఁ డని యగును. నిత్య మ్మనుటచే సంధి రాని బారయెఁడు అనురీతిరూపము లుండవు.

అంతఅన్న ది'గింజాదిభ్యోంతః' అనిపరిమాణార్థక ప్రత్యయముగా నీ వ్యాకరణమున విధింపఁబడినది. కాని కంచియంత (ఉద్భట) ప్రయోగమునుబట్టి యంతశబ్దము అంతశబ్దపరకత్వమున సంధి నిత్యము గా దని విమర్శకులు పేర్కొనిరి.(వ్యాసంస.224)

## 12. అంబాద్యచి చ [2]

అంబాది + అచి, చ = అంబ మొద లగువాని యర్థము గల యమ్మ' మొదలగు శబ్దములందలియచ్చు పరముగా నున్నపుడు సయితము, సర్వేషామ్ = అన్నియచ్చులకును; నిత్యమ్ = సంధి నిత్యముగా వచ్చును.

వి. అంబాదీనాం నామ్నాద్యచి పరే పూర్వవత్ స్యాత్ అంబాక్కాత్తామ్మాప్పాయ్యాన్నాదయః అంబాదయః. సుబ్బమ్మ ఇత్యాది.

---

1. మావే నిత్యమ్. ఆం.కౌ.సం.9.
   పరిమితౌ సముస్తానామ్. ఆం.శ.చిం.సంధి.5.
   వర్ణకవిహితయోరప్యస్య చ.వై.చం.సం.13.
2. తథార్యాది గతస్యచ. అ.కా.సంధి.4.

అంబ మొదలగు శబ్దముల యచ్చు పరముగా నున్నపుడు పూర్వమువలె నగును. అనగా 'నిత్యం పరిమితౌ సర్వేషా' మ్మను పూర్వసూత్రమునవలెనె యన్నియచ్చులకును సంధి నిత్యముగా వచ్చును. సుబ్బ + అమ్మ = సుబ్బమ్మ. సంధి నిత్యము గావున సంధి రాని సుబ్బయమ్మ యనురీతి రూపము లుండవు.

వివృతియం దంబశబ్దము ప్రత్యేకముగాఁ జూపఁబడినది. అమ్మశబ్దముతోపాటు. కాని సుబ్బంబ, సీతంబ యనురీతి రూపములు గానరావు. కావున సూత్రమందలి యంబాదిశబ్దమునకు సంబాద్యర్థకములు, అమ్మాదు లని యర్థము చేయనవును. అమ్మ అయ్య అక్క అన్న అత్త అప్ప మున్నగునవి యంబాద్యర్థకశబ్దములు. (అంబశబ్దభవము 'అప్ప' అని తద్భవ పరిచ్ఛేదమునఁ జెప్పట గమనార్హము.)

మా + అమ్మ = మామ్మ యని గాదు. సీత అమ్మతోఁ బల్కె ననుచోట సీతమ్మతోఁ బల్కె నని గాదు. ఇట్లే సీతయొక్క అమ్మ- సీతమ్మ యని గాదు. కాఁగా వ్యస్తతలోఁ గాని, సమాసముల నన్నింటఁ గాని సంబాద్యచ్చులు పరమైన సంధి యవు నని చెప్పరాదు. ప్రౌఢవ్యాకర్త 'శ్రేష్ఠతావాచకంబు లగు నార్యాంబాద్యర్థకంబులు' అని పేర్కొనెను. అట్టి స్థలములందు మాత్రమె సంధి.

అమ్మాజియమ్మ (పాండు.1.67) కందాళయప్ప (పాం.1.77) గారనురీతి నరుదుగ సంధి రాని రూపములు గలవు. అట్టివి యల్పస్థలము లగుటనుబట్టి విశేషస్థలములుగా గుర్తించి యీ సంధిని నిత్య మను టొప్పును.

## 13. లుక్సంశ్లేషా నాచి ద్రుతస్య [1].

అచి = అచ్చు పర మగుచుండఁగా, ద్రుతస్య = ద్రుతమునకు, లుక్సంశ్లేషా = లోపమును, సంశ్లేషమును, న = లేవు.

వి. ద్రుతస్యాచి పరే లోపసంశ్లేషా న స్తః. రాము నాశ్రయించు,కృష్ణు నర్చించు, వచ్చె నొక్కఁడు.

అచ్చు పర మగుచుండఁగా ద్రుతమునకు లోపమును సంశ్లేషమును రావు.

రామున్ + ఆశ్రయించు, లోపసంశ్లేషములు రాక ద్రుతము మీఁదియచ్చుతోఁ గలిసి రామునాశ్రయించు నని యగు. ఇట్లె యితరములు.

లోపము లే దనుటవలన రాము + ఆశ్రయించు - (ఉత్వసంధియై) రా మాశ్రయించు నని కాదు. సంశ్లేషమున నేమో యిట వివరింపఁబడలేదు. రాము నాశ్రయించు నను

(అం.కౌ.సంధి.37) లుక్సంశ్లేషావిచి (ద్రుతస్య). ఆం.శ.చిం.సంధి.29.

1. ద్రుతప్రకృతిక సంకీర్ణాద్బహులం సద్విలక్షణమ్ (త్రి.శ.2.8) నలుక్సంయోగావచినస్య. (అం.కౌ.సంధి. 37) లుక్సంశ్లేషావిచి (ద్రుతస్య). ఆం.శ.చిం.సంధి. 29.

నుదాహృతినిబట్టి మీఁదియచ్చుతోఁ గూడుకొనుట సంశ్లేషము గా దని గ్రహింపవచ్చును. 'లుక్సంశ్లేషానాచి' యను చింతామణి వివరణమునం దప్పకవి 'సంయుతంబయ్యె నేని దుస్సంధి యగు' (అప్ప 5.44) నని పేర్కొనుచు 'చూచె నింతి ' ననెడుచోటఁ జూచెన్నింతి ననిన సంధిదోష మయ్యెఁ గృతుల' (అప్ప 5.41) ననుటనుబట్టి ద్రుతమునకు ద్విత్వ మగుటయె యచ్చరకత్వమున సంశ్లేష మని గ్రహింపఁదగును. ప్రౌఢవ్యాకర్తయును నిట్లే భావించుట స్పష్టము (ప్రౌఢ.సంధి.3. సూత్రవివరణము).

ద్రుతాంతములకు సంధిని, ద్రుతమునకు ద్విత్వమును వారించుట యీ విధానమునకుఁ బ్రయోజన మని చెప్పవచ్చును. పూర్వోత్తరసూత్రములందలి పిసంధిప్రసంగ మీ యంశమును స్పష్టము చేయఁగలుగును.

ఇట విపృతియందుఁ జూపఁబడిన రామున్,కృష్ణున్ అనునవి ద్వితీయాంతము లగుటచే సం.25 సూత్రము ననుసరించి యివి సంకీర్ణము లగును. వీని సంధినిగూర్చి పైసూత్రము ప్రస్తావించుటచే వీని నిటఁ జూపుటలో నౌచిత్యము గానరాదు.

## 14. విభాషా సంకీర్ణాత్ [1].

సంకీర్ణాత్ = సంకీర్ణశబ్దముల కచ్చు పర మయినపుడు, విభాషా = సంధి వికల్పముగా నగును.

వి. సంకీర్ణాదచి పరే సన్ధిర్వా స్యాత్. న న్నేలుము, నన్ను నేలుము, నాచే తయ్యె, నాచేత నయ్యె, నీకొఱ కిచ్చితి, నీకొఱకు నిచ్చితి, నీవల నేమి, నీవలన నేమి, నీ కిచ్చెద, నీకు నిచ్చెద, నీయం దేమి, నీయందు నేమి; వాఁ డనం గేమి, వాఁ డనంగ నేమి, వచ్చి తిక్కడకు, వచ్చితి నిక్కడకు, చేయు చున్నాడు, చేయుచు నున్నాఁడు. విన కేమి , వినక నేమి.

సంకీర్ణము లగు శబ్దముల కచ్చు పరమగునపుడు సంధి వికల్పముగా వచ్చును. నన్ను + ఏలుము సంధి యైనపక్షమున న న్నేలుము, కానిపక్షమున ద్రుతముతో నన్ను నేలుము మొ॥

ద్వితీయాద్యుత్తమలడకాంగనంతాదయ స్సంకీర్ణాః (సంజ్ఞా.25) అను సూత్రమునఁ జెప్పఁబడినవానికిఁ గ్రమముగా వివృతియం దుదాహృతులు సూపఁబడినవి.

ఈ విధానమువిషయమునఁ గొన్ని సందేహములు గల్గుట సహజము.

---

1. సంకీర్ణశబ్దతః. త్రి.శ.7.

కళలు పేర్కొని 'సద్రుతే' మ్మని కళలకుఁ జివర ద్రుతముండ దని చెప్పఁబడినది. ఇంక నా తరువాత కళాసంకీర్ణేతరములు ద్రుతప్రకృతకము లని 'ద్రుతినో నిత్యమ్' అని ద్రుతప్రకృతికములకు ద్రుతము నిత్యముగా నుండునని చెప్పఁబడినది. నడుమఁ జెప్పిన సంకీర్ణములకు మాత్రము ద్రుతము విషయము చెప్పఁబడలేదు. ద్రుత మసలు లేనిచోఁ గళ యగును. ద్రుతము నిత్యముగా నున్నచో ద్రుతప్రకృతిక మగును. ఆ రెండింటికంటె భిన్నముగా సంకీర్ణశబ్దములక్షణ మెట్లు? అనఁగా ద్రుతము వికల్పముగా నుండుట. 'ద్రుతినో నిత్య' మ్మనుటనుబట్టియు ద్రుతప్రకృతికములు నిత్యముగా ద్రుతము గలవి కాఁగా సంకీర్ణములకు ద్రుత మనిత్యముగా నుండు నని గ్రహింపవలయును. ఇట్లు స్పష్ట మగుటనుబట్టియె వీనిద్రుతమునుగూర్చి వేఱుగాఁ జెప్పలే దనఁదగును.

ఇట్టి యెడల నీ సంధిసంకీర్ణములు ద్రుతాంతము లయినపక్షమునను, ద్రుతాంతములు గానిపక్షమునను వర్తింపవలయును. ద్రుతాంత మైనపక్షమున సంధివిధానమువలనఁ బూర్వస్వరమునకు ద్రుతాంతమునకుఁ బరరూపము గలిగి నన్నున్ + ఏలుము = న న్నేలు మని యగును. బాలవ్యాకరణమున ద్రుతపూర్వస్వరసంధి సందర్భము లిట్లే గదా. కాఁగా సంధి రాని పక్షమునందు ద్రుతము పైయచ్చుతోఁగూడి నన్ను నేలు మని యగును.. అనఁగా వివృతియం దుదాహరింపఁబడినరెండు రూపములును ద్రుతాంతపక్షముననే సిద్ధించుచున్నవి.

ఇంక ద్రుతాంతము గానిపక్షమునందు 'నన్ను + ఏలుము' అనుచో సంధి యై న న్నేలు మని యగును. సంధ్యభావపక్షమున 'యః ప్రాణస్య' యని యకార మై నన్ను యేలు మని యగును. 'నిత్యముతోఁ ఉచి' యనుదానిచే నిట నిత్యసంధియే యని భావింపరాదు. ప్రస్తుతవిశేషాస్త్రమువలన నా సామాన్యవిధి బాధిత మై వైకల్పికసంధియే యగును.

కాఁగా ద్రుతాంతము గానిపక్షమున సాధింపఁబడు రూపములలో నొక టగుసంధి యైన రూపము ద్రుతాంతత్వపక్షమునను సంధియవుపక్షమున నవునదే కాని విశేషము గలది గాదు. ఇంక నద్రుతాంతపక్షమున సంధి కానపు డేర్పడు, నన్ను యేలుము, నాచేత యయ్యె నను రూపము లనిష్టములు. కవిప్రయోగములందును లేనివి.

ఇట్టి రూపములు వివృతియందు నుదాహరింపఁబడకుండుట గమనార్హము. (వై.చం. వికల్పముగా సద్రుతము లగు ననుచో నిట్టి యపరూపము లుదాహరించినది[1]. అని గ్రాహ్యములు గా వనక తప్పదు.)

ఇష్టరూపములు ద్రుతాంత్యపక్షముననే యేర్పడుట ననుసరించి యీ శబ్దములను సంకీర్ణము లనుట వ్యర్థము. కాక సంకీర్ణము లని విభాగించి నపుడు 'విభాషా సంకీర్ణాత్' అని వైభాషికసంధిని విధించుట యేని వ్యర్థము గాక తప్పదు.

---

1. కృపి తఖ్యిమా మితః – రామునికి యభివాదము. వై.చం.సంధి.10.

వివృతి యుదాహరణములనుబట్టి సంధి కానపుడు ద్రుతము నిలుచుటయు, సంధి యవునపుడు ద్రుతము లేకుండటయు నన్నదే సమ్మత మని చెప్పవలెను.

అట్టియెడల ద్రుతాంత మై 'నన్నున్' + ఏలు మని యున్నపక్షమున 'లుక్సంశ్లేషేనాచి' యను పూర్వసూత్రముచే రామునాశ్రయింతు నని యైనట్లే నన్ను నేలు మని యగును. రామున్ + ఆశ్రయింతు ననుచో రామున్ అనునది ద్వితీయాంతమే కదా. ఇట్లె కృష్ణు నర్చింతు అనుచో కృష్ణున్ - ఇది ద్వితీయాద్యుత్తమేత్యాదిసూత్రముచే సంకీర్ణము కాకుండు టెట్లు? అది సంస్కృతసమ మిది యాచ్ఛికము (నన్నున్). ఈ భేద మీ సందర్భములఁ బరిగణనీయమె కాదు. ఇంక ద్రుతాంతము గానిపక్షమునందు నన్ను + ఏలు మని యుండఁగా 'నిత్యముతోఽచి' యను సూత్రముచే నిత్యముగా సంధి యయి 'నన్నేలుము' అని యగును. ఇంక 'విభాషా సంకీర్ణాత్' అను నీ ప్రస్తుతవిధాన మేల?

నీచేత + ఏమి – యనుచో 'వాఽత' యని సంధివికల్పము గావున 'నీచేత యేమి' యను రూపముగాకుండ వారించుట దీనికిఁ బ్రయోజన మను కొందమా? అనఁగా నిచ్చటఁ గూడ ద్రుతాంతత్వాభావపక్షమునందలి వైకల్పికసంధిచే నట్టి యప రూపము లేర్పడుచునే యుంట గమనించితిమి.

ఇంక నిచ్చట విభాష యనుదానికి ద్రుతాంతత్వపక్షమున సంధ్యభావమును, ద్రుతాంతత్వాభావపక్షమున సంధియే యగు ననియుఁ జెప్పవలెను. అది సక్రమముగాఁ దోఁపదు. రెండురూపము లుండఁగా నొక్కొక్కచోట నొక్కొక్క కార్య మగుచుండఁ గా నట్లు సూత్రింపవలెను గాని సామాన్యముగాఁ జెప్పిన నెట్లు?

ఇంక సంకీర్ణములకు ద్రుతము వికల్పముగా నుండ దనియు, నెప్పుడును ద్రుతమె యుండు ననియుఁ జెప్పుదుమా? అట్టియెడల వానిని ద్రుతప్రకృతికములలోనె చేర్పక సంకీర్ణము లని వేఱు చేయుట వ్యర్థము గాక తప్పదు.

కాఁగా సంకీర్ణము లని విభాగింపక వీనిని గూడ ద్రుతప్రకృతికములుగానె గ్రహించి ద్వితీయాద్యుత్తమలడకాంగసంతాదు లగు సంకీర్ణములకు సంధి వికల్ప మని చెప్పుకొనుట యుచితము. 'నన్ను కాంచె' ననురీతి వెట్లు ననిష్టములె. వివృతియు నుదాహరింపలేదు. అందుకే తరువాతఁ గూడఁ బెక్కురు లాక్షణికులు సంకీర్ణములు లేదా వైకల్పికద్రుతాంతము లని వింగడింపలేదు, చింతామణియు (కళలనుగూర్చి ద్రుతోన యేషాం స్యా త్తనియు) ద్రుతప్రకృతికములనుగూర్చి 'నిత్య మను జీవితద్రుతాః' అని నిత్యశబ్దమును బ్రయోగించియు సంకీర్ణములను పేర్కొనక కళేతరము లన్నియు నిత్యానుజీవితద్రుతము లయి ద్రుతప్రకృతికము లగు నని నిర్ణయించినది. అది యెఱిఁగియు నీ వ్యాకరణ మిట్లు పేర్కొనుట యథర్వణు ని త్రిలింగశబ్దానుశాసనానుసరణమువలననే యనుకొనవచ్చును. సంకీర్ణము లను విభాగ మనవసరము ననర్థకమును.

ఇంక నిచ్చటను, సంకీర్ణములయెడలను, నీచే తేమి యనురీతి రూపము లిందుఁ జూపఁబడినవి. అయ్యవి కవిప్రయోగదృష్టములు గాకుండుటయు, నితర ప్రామాణిక లాక్షణికు లంగీకరింపకుంటయుఁ బ్రసిద్ధమే.

రామున్,కృష్ణున్, అనునవి సంకీర్ణములు. రాము నాశ్రయింంతు, కృష్ణు నర్చింతు ననురీతిగా ద్రుతము మీఁదియచ్చుతోఁగూడినరూపములు 'లుక్సంశ్లేషె నాచి ద్రుతస్య' యనుచో నుదాహరించిన వివృతి యవి యటనే సిద్ధించు నని పేర్కొన్నది. ఇట నుదాహరించినచో నన్నేలు మని యైన ట్లట రా మాశ్రయింంతు నని కావలయునుగదా! అట్టి రూపములు లేవు. (కవి.శి.273)వివృతి వీని నట నుదాహరించుటలో నివి సంకీర్ణములు కావని తలఁచినదా? (ఇట నుదాహరించిన నీచే తేమి, యనురీతివి మాత్రము గలవా?) అయిన ద్వితీయాద్యంతము లెల్ల సంకీర్ణములు గా వనవలె. రామునిచే, రామునికంటె అనురీతిగా 'రామున్' అను ద్వితీయాంతమును సంకీర్ణము గాక ద్రుతప్రకృతియే యగు ననవలె. 'ద్వితీయాది' యనుచో నాదిశబ్దముచే గ్రహింపవలసినవి ప్రయోగానుసారము గా నెన్నవలె నన్ను నన్ను, నిన్ను, తన్ను, మమ్ము, మిమ్ము, తమ్ము, అను నాఱు ద్వితీయాంతములు, కొఱకు, కు, కి, అందు అనువానిని గ్రహింతమా? నీచే తేమి అని యిట చేతను గూడఁ జూపెనే. ఇట్టిది మిక్కిలి వివాదగ్రస్త మయ్యెను.

## 15. నర్తః .[1]

ఋతః = ఋకారమున కచ్చు పర మగునపుడు, న = సంధి లేదు.

వి. ఋదన్తస్యాకారస్యాచి పరే న సన్ధి స్స్యాత్. ధాత యెక్కడ, విధాత యెక్కడ, సవిత యెచ్చట.

ఋకారాంతము లగు శబ్దముల య త్తున కచ్చు పర మగునపుడు సంధి లేదు. ధాత (ధాతృశబ్దము) ఎక్కడ సంధి లేదు గావున 'యః ప్రాణస్య' యని యకార మై ధాత యెక్కడ. ఇట్ల యితరములు.

ఋదంతము లగు సంస్కృతశబ్దములు దెలుఁగున నదంతము లయి నిల్చును, సవితృ, విధాతృ, మాంధాతృ శబ్దములు మూఁడు ఋకారాంతములుగఁ గూడ దెలుఁగున నున్నను వాని కచ్చు పర మగుట సంభవింపదు. షష్ఠీసమాసమున సంభవించినను నట నుమాగుమువలన సంధినిషేధ మనవసరము. (సంధినిషేధమాత్రమువలన విధాతృ ఆనతి యనురీతిగ నపరూపములె యగును.) ఋకారాంతశబ్దములు తెలుఁగున నదంతము లగును గావున ఋదన్తశబ్దములయ త్తునకు సంధి లే దని చెప్పుకొనవలసియున్నది.

1. ఋదన్త – (త్రి.శ.2.9)

కాని తెలుఁగున నదంతము లై నిల్చిన యీ ఋదంతశబ్దములు సంస్కృతీయములు. తత్సమములు. 'వాఽఽత' యను సూత్రమున వివరణమునందు 'అతత్సతజ్జ'-ఇత్యాదిగా దేశ్యశబ్దములందే యత్తునకు సంధి యని చెప్పఁబడినది. కాఁగా నీ తత్సమాకారమునకు 'వాఽఽత' యను సూత్రముచే సంధియే లేదు. మఱల నిట నిషేధింప నేల? ఇంక నిట్లు ఋదంతముల యత్తునకుఁ జేసిన నిషేధమువలన నితర మైన తత్సమాకారమునకు సంధి జ్ఞాపకసిద్ధమగును. గంగ + అనుకాసె = గం గనుకాసె యను రీతిరూపములు సాధింపఁబడఁగలవు. కాని రంగభర్త + అంచు = రంగభర్తంచు ననియుఁ గలదే. భర్తృశబ్దము ఋకారాంతము గదా. దాని యత్తునకును సంధి గలదు. గంగనుకాసె సాధించి 'రంగభర్తంచు' నిషేధింప నేల?

తత్సమ మైన యత్తునకు సంధి లే దనుట యేతన్మతము. కాఁగా 'వాఽఽత' అను సూత్రమున తత్స మేతరముల కని లేదు. సూత్రవివృతికర్తలు భిన్ను లగుటచే నిట్టి విరోధము గల్గిన దని యైన నెంచవలె. లేదా 'ఏచోఽచి' యనురీతిగా నీ లక్షణమును ప్రయోజనహీనముగనె ప్రస్తావింపఁ బడిన దని యెంచవలసి యుండును.ఎ ట్లయిన ఋదంతములు మాత్రమె ప్రస్తావించుటయు నుచితము గాదు. దూ తితఁ డని యగు ననుట లక్ష్యవిరుద్ధము గదా.

## 16. ర్లోరుతః ప్రాయో లుగ్ఘలి [1].

హలి = హల్లు పర మగుచుండఁగా, ర్లోః = రేఫలకారములయొక్క, ఉతః = హ్రస్వ మయిన యుకారమునకు, ప్రాయః = తఱచుగా, లుక్ = లోప మగును.

వి. నామాంతరేఫలకారయోరుకారస్య ప్రాయో లుక్ స్యాద్ధలి పరే - వేర్మొలిచె, గొర్విరిగె, రోల్పట్టిది, మేల్వాటిల్లె.

పదము తుది నున్న రేఫలకారములయొక్క యుకారమునకు హల్లు పర మగుచుండఁగాఁ దఱుచుగా లోపము వచ్చును. వేరు + మొలిచె = వే ర్మొలిచెమొ॥. 'ప్రాయః' అనుటచే నుత్వమునకు లోపము రాకుండవచ్చును. వేరు మొలిచె.

'ర్లోః' అని సామాన్యముగాఁ జెప్పుటచే 'రులు' వర్ణములు ప్రాతిపదికావయము లైనను ప్రత్యయము లైనను గావచ్చును. వివృతియం దన్నియు నాచ్ఛికశబ్దములే యుదాహరింపబడినవి. కాని తత్సమాదులయందును ప్రత్యయము లయిన రులువర్ణములం దుత్వము లోపింపవచ్చును. తత్పాలురు + భయంబదఁగన్ = తత్పాలుర్భయం బందఁగన్,

---

1. ఉకారలోపః పదాన్తే ప్రాయస్స్యాద్రలయోర్హలి త్రి.శ.2-10
కవిభల్లటైః క్రియాణాం నామ్నాంచోల్లోప ఇష్యతే ఆం.శ.చిం.హల్స.23
కుత్ర చిద్రేఫ గస్యస్యాదుతో లోపః ప్రయోగతః. అ.కా.అజంత.58.

రాములు + వచ్చిరి = రాముల్వచ్చిరి. వీని కవసానమునను నుత్వలోపము గలదు. పలువుర్, రాముల్ మొ॥.

ఉతః అనుటచే నుదృన్న మైన యచ్చునకు లోపము లేదు. మేర లేదు, జోలి తగదు మొ॥

'ర్లోః' అనుటచే రలలకంటె వే ఱయిన హల్లులమీఁది యుకారమునకు లోపము లేదు ఆకు పండెను. మొ॥.

## 17. నశ్చ .[1]

నః చ = నకారముయొక్క యుత్వమునకును హల్లు పర మగుచుండఁగాఁ బ్రాయికముగా లోప. మగును.

## వి. పూర్వవత్ స్యాత్. మున్వలికె. కన్గీటె.

'ర్లోరుతః ప్రాయోల్యుగ్ఘలి' యను పూర్వలక్షణము ననుసరించి పదముతుది ను న్న నువర్ణమునందలి యుకారమునకును హల్లు పర మగునపుడు ప్రాయికముగా లోపము గల్గ నని సూత్రార్థ మగుచున్నది.

మును + పలికె = మును + పలికె ననుచో నీ సూత్రముచే నుత్వము లోపింపఁగా మున్వలికె నని యగును. ప్రాయిక మనుటచే లోపాభావపక్షమునందు మునువలికె నని యుండును. ఇట్లే కనుగీటె, కన్గీటె మొ॥.

## 18. ఏకపదే. [2]

## వి. 'జశ్చయ్' సూత్రపర్యన్త మధికారో యమ్.

ఏకపదే = ఏకపదమునందు ఒకేపదమునందు సమానపదమునం దని యర్థము. ఇది యధికారసూత్రము. దీనికి సమగ్ర మగు నర్థ ముండదు. ఇది తరువాతి సూత్రములలో జేరి వాక్యార్థమును బూరించును. 'జశ్చయ్' అను రాఁబోవు 24 సూత్రమువఱకు నీయది యన్వయించును.

## 19. ఇణస్టోర్దలి. [3]

ఏకపదే = సమానపదమునందు, హలి = హల్లు పర మగుచుండఁగా ,టోః = టవర్గముయొక్క,

---

1. ద్రుతస్యచ (త్రి.శ. 2 - 11)
ప్రథమైకవచనమాత్రే వికృతౌ వాన్తాదయోఽపి కథ్యన్తే. ఆం.శ.చిం. హలన్త .23.
2. అథైకపదే (త్రి.శ.2.12)
3. ఇణః (త్రి.శ.2.13)

ఇణః = ఇ,ఉ అనువానికి, ప్రాయః = తఱుచుగా, లుక్ = లోపమగును.

ఇఉణ్ అను మాహేశ్వరసూత్రము ననుసరించి ఇణ్ ప్రత్యాహారముచే ఇఉలు బోధింపఁబడును. 'ర్లోరుతః ప్రాయోలుగ్హలి (సంధి. 16 ) సూత్రమునుండి క్రమముగా ప్రాయః లుక్కనునది యిం దనువర్తించును. ఏకపదే యను నధికారసూత్ర మిందన్వయించును.

వి. టవర్గస్య(మధ్యస్య) ఇణో లుక్ స్యాద్ధల్యేకపదే. మెటికె - మెట్కె పుటికె-పుట్కె, కాటుక - కాట్క, అటుకులు - అట్కులు, విడిది - విడ్ది, బూడిదె - బూడ్దె, గోడుగు - గొడ్గు, పిడుగు - పిడ్గు.

సమానపదమునందు టవర్గీయాక్షరము(టడణ)లందలి ఇకారమునకును, ఉకారమునకును హల్లు పర మగుచుండఁగాఁ బ్రాయికముగా లోపము గల్గును.

మె టికె. ఇత్వము లోపింపఁగా మెట్కె. ప్రాయికము గావున లోపము రానిచో మెటికె. ఇట్లె గొడుగు శబ్దములో డకారము మీఁదియుత్వము లోపింపఁగా గొడ్గు. లోపము రానిచో గొడుగు.ఈ లోప మాచ్ఛికశబ్దములందే యని గ్రహింపవలెను. అచ్చతెనుఁగున ఠఢలు లేవు గావున టవర్గ మనఁగా టడణలు మూఁడే. గొడుగు - గొడ్గు.

ఈ లోపము సార్వత్రికము గాదు. ప్రయోగానుగుణముగనె గ్రహింపఁదగు నని తోఁచుచున్నది.

'ఇణః' అనుటచే ఇఉలకే లోపము. కావున అటక, గడన మొదలగు చోట్ల నితరస్వరములకు లోపము రాదు.

'టోః' అనుటచే టవర్గమునందె యీ లోపము. కావున నితరహల్లులమీఁద లోపము రాదు. మూకుడు మొ॥.

వి. ఏకపద ఇతి కిమ్? ఉదుట్గుబ్బలి, అగుడ్సేసె ఇతి న.

ఈ లోపము సమానపదమునందె. కావున హల్లు పర మయినను బదాంతమున నున్నటవర్గయందలి యిత్వోత్వములకు లోపము రాదు. ఉదుటు + గుబ్బలి = ఉదుట్గుబ్బలి యని కాదు. ఇట్లె అగుడుసేసె.

వి. హలి కిమ్?ఆడుది, అంటుది ఇత్యాది.

'ఇణష్టోర్హలి' యనుటచే హల్లు పర మయినపుడే లోప మగును. కావున ఆడుది ఇత్యాదులందు లోపము రా దని వివృతి వివరించినది.

కాని 'ఆడుది' యనుచో 'ది' వర్ణమునందలి దకారము హల్లె పర మైనది కాని ఆడు + అది

యని యుండఁగా నచ్చు పర మయిన దని యభిప్రాయ మేమో. కాని ఆడుశబ్దమునందు 'డు' వర్ణము పదాంతమునం దున్నది గదా 'ఏకపదే' యనుదానిచేతనే ఆడు + అది ఇత్యాదుల లోపాభావము సిద్ధ మగుచున్నది. ఆడుశబ్దముపై 'ది' వర్ణక మైన దన్నచో నచ్చు పర మగుట యన్నది లేదు.

పరిశీలింపఁగా నేకపదమునం దని నిర్ణయించునపుడు డచ్చుపర మగుట యన్న దసంభవము. ఎప్పుడును హల్లె పరముగ నుండును. పదమధ్యమునందు హల్లులేక కేవల మచ్చే యుండుట యసంభవము కదా. కాఁగా నీ సూత్రమున 'హలి' యని ప్రత్యేకించి చెప్పుటలో నేది యేని బ్రయోజన మున్నదేమో యింకను బరిశీలింపవలెను. ప్రస్తుత మది కేవలము స్పష్టతకై చేర్పఁబడిన దని మాత్రమె తలంపవలసియున్నది.

## 20. ఉక్తానాం చ.[1]

ఉక్తానాం చ = పూర్వోక్తము లగువానికిఁ గూడ, ఏకపదే = సమానపదమునందు- ఇకారోకారములకు లోప మగును.

వి. పూర్వోక్తానాం మధ్యానాం లకారరేఫనకారాణా మిణో లుక్ స్యాద్ధల్యేకపదే. కలికి – కల్కి, ములికి – ముల్కి, చిలుక – చిల్క, తలుపు – తల్పు, కోరికె – కోర్కె, కూరిమి – కూర్మి, చేరువ – చేర్వ, ఉనికి – ఉన్కి, పూనికి – పూన్కి, చినుకు – చిన్కు, మినుకు – మిన్కు ఇత్యాది.

ర్లోరుతః ప్రాయోల్పుగ్లి (సంధి-16) నశ్చ (సంధి -17) అని పూర్వమునం దుక్తము లయిన ర,ల,న అనువర్ణములయందలి యికారోకారములకును, సమానపదమునందు హల్లు పర మగునపుడు ప్రాయికముగా లోప మగును.

'కలికి' యనుచో లకారముపై నిత్తు లోపించి 'కల్కి' యని యగును. 'చినుకు' అనుచో నకారముపయి నుత్తు లోపించి 'చిన్కు' అని యగును. ఈ లోపమును బ్రాయికమె, నిత్యము గాదు. కావున లోపము రాని పక్షమునందు కలికి, చిను కను రీతిగా రూపము లుండును.

ఇదియు నాచ్ఛికశబ్దములందే.

---

1. పూర్వోక్తస్యాప్యసౌ హలః – త్రి.శ.2.14
నలడాదే రకః ఆం.కౌ.సంధి,53.
నలడాదే రస్తరుతశ్చ, అన్యేషాఞ్చ ప్రయోగముహితానామ్. అం.శ.చి.సంధి.40,41
నలడాదేః. వై.చం.వైకృత.9.
నలడాదేః. వై.చం.వై.9.అ.41.

## 21. చ స్సపరుషహలః[1].

సపరుషహలః = సకారముతోఁ గూడిన పరుషమునకు, చః = చకార మగును.

వి. పరుషహల స్సవర్ణే పరే తయోః పూర్వపరహలోశ్చకార ఏకాదేశస్స్యాత్.

పరుషమునకు సకారము పరముగా నుండఁగా నా పరుషమునకును సకారమునకును రెండింటిస్థానమును 'చ'కార మాదేశముగా వచ్చును. సపరుషహలః అనుటచే సకారముతోఁ గూడఁ బరుషమునకు ననఁగా సకారపరుషములు రెండింటికిని చ'కార మాదేశ మగును. ఆద్యాఃపరుషాః అని కచటతపలు పరుషములు.

అప్సర 'ప్స' యనుచో పకారము పరుషము. ఇది సకారముతోఁ గూడి యున్నది. కావున పకార సకారములు రెంటికిని చకారము రాఁగా అచర అని యగును.

వి. శేషాదేశస్యేతి ద్విత్వమ్. అప్సరాః – అచ్చర, మత్సరః – మచ్చరము, ఉత్సాహః– ఉచ్చాహము, ద్రప్సం – ద్రచ్చము, వీప్సా – విచ్చ, మత్స్యః – మచ్చెము.

'శేషాదేశస్య'తద్భవ.23 యను సూత్రముచే ద్విత్వ మగును. పరుషసకారములకు నాదేశముగా వచ్చినది కావున 'చస్సపరుషహలః' అను సూత్రముచే వచ్చిన 'చ'కారమునకు ద్విత్వ మగును.

'అచర' యనుచో చకారమున కిట్లు ద్విత్వము రాఁగా 'అచ్చర' అని యైనది. ఇట్లే ఇతరోదాహృతుల గమనింపఁదగును.

సూత్రమునందు 'హలః' అనుట స్పష్టతకె. పరుషములు హల్లులె కదా. కావున 'చస్సపరుషస్య' యని మాత్రమె చెప్పినను నుద్దిష్టార్థము సిద్ధించెడిది.

ఈ సూత్రము దీనితరువాత సూత్రమును దద్భవాకారమును నిరూపించుట విశేషము. దత్భవప్రకరణ మిందు వేఱుగ నున్నది. అవి యన్నయు సమానపదమునం దగు కార్యములే. ఈ రెండుసూత్రములను సంధిప్రకరణమున నడుమ నెట్లు చేరినవో.

---

1. సవర్ణేబహాళశ్చంశఛ్చత్వమ్? త్రి.శ. 2.15.

## 22. షే కో వా.

షే = షకారము పరముగాఁ గలిగిన , కః = కకారమునకు, వా = వికల్పముగా 'చ'కారమువచ్చును.

వి. కకారహలః షకారే పరే చకార ఏకాదేశో వా స్యాదేకపదే. భైక్షమ్ - బిచ్చము, దక్షిణ - దచ్చి(చ్చ)న. లాక్షా - లాచ్చ, లక్షణమ్ - లచ్చనము.

షకారము పరముగాఁ గలిగినకకారమునకు ననఁగా, కకార షకారములు రెండింటియొక్క స్థానమునను గూడ 'చ'కారము వికల్పముగా నాదేశ మగును 'చస్పపరుషహలః' అను పూర్వసూత్రము ననుసరించి దీనికిని చకార మగు నని యర్థ మగుచున్నది.

లాక్ష - అను శబ్దమున కకార షకారములు రెండింటికి 'చ'కార మాదేశము గాఁగా 'లాచ' యని యగును. 'శేషాదేశస్య(తద్భ.3) యను సూత్రముచే నీ యాదేశచకారమునకు ద్విత్వము రాఁగా లాచ్చ యని యగును.

మిగిలినవియు నిట్ల గ్రహింపఁదగు విశేషములు. తద్భవప్రకరణమున స్పష్ట మగును.

వి. వేతి కిమ్? చిక్కము, దక్కినము, లక్క. లక్కనము ఇత్యాది.

'షేకోవా' యనుచో సూత్రమున 'వా' యనుటచే చకార మగుట వికల్పము. కావున చకారము రానిపక్షమునందు 'క్షఃకః' అను సూత్రముచే క్షకారమునకు కకార మాదేశ మై బిక్ష- బిక అని కాఁగా 'శేషాదేశస్య(తద్భ.23) యను సూత్రముచే ద్విత్వము వచ్చి చిక్క - లిక్క మని యగును. ఇట్లు షకారముతోఁ గూడిన కకారమునకు కకారమదేశ మైనస్థితి నష్టము గాకుండుటకై సూత్రమున 'వా' యను శబ్ద ముపయుక్త మయినది.

## 23. న నహల స్సరళః.

ఏకపదే = సమానపదమునందు, నహలః = నకారముపొల్లుకంటెఁ బరముగా నున్నపరుషమునకు, సరళః = సరళము, న = లేదు.

వి. ఏకపదే నకారహలః పరస్య పరుషవర్ణస్య సరళవర్ణో న స్యాత్. అనుకు - అన్కు, అనుచు - అన్చు, అనిటి - అన్టి, మనుతు - మన్తు, మునుపు - మున్పు ఇత్యాది.

సమానపదమునందు నకారపుఁబొల్లుకంటెఁ బరముగా నున్నపరుషమునకు సరళము గాదు. 'మునుపు' అను శబ్దమునందు 'ఉక్తానాం చ' యను(సంధి.20)సూత్రముచే నుత్వము

లోపింపఁగా మున్పు అని యగును. ఇట నకారపుఁబొల్లునకు 'ప'కారము పరుషము పర మై యున్నది. కాఁగా నా పరుషమునకు సరళ మీ సూత్రముచే రాదు. మున్పు అనియె యుండును. గాని 'మున్పు' అనురీతి గాదు. వివృతియం దుదాహరింపఁబడినవానిలో (అనుకు) అన్క్కు, అన్టి అనునవి విశిష్టములు.

ఇట్లు సరళాదేశమును నిషేధింపవలసిన యవసరము గానరాదు.. 'ప్రాప్తిపూర్వకోహి నిషేధః' అను సంప్రదాయము ననుసరించి ప్రాప్తి యున్నపుడే నిషేధ ము చేయఁబడవలెను. ఇచట నేకపదమున సరళములు రా వని నిషేధించుటకు సరళములు ప్రాప్తించుచున్నవా?

'జశ్త్వం పరుషస్య' (సంధి.44) యను సూత్రమునకు వివృతిలో 'పదాన్తాద్ద్రుతాత్పరస్య పరుషస్య జశ్త్వం వా స్యా' త్తని పదాంతమందలి ద్రుతముమీఁదనే పరుషములు సరళము లగుటను వివరించినది.పదాంతమునం దనుటవలనఁ బదమధ్యమునందు నకారమునకుఁ బర మైన పరుషములకు సరళములప్రాప్తియే లేదు. కాఁగా మఱల నిట సరళములు రా వని నిషేధించుట వ్యర్థము.

ఈ వైయర్థ్యమువలనఁ గొండొకచో శబ్దమధ్యమునను నకారముపైఁ బరుషములు సరళము లగుట గల దని యర్థము చెప్పవచ్చును. ఈ సూత్రముచే నట్లు రా వీలులేకున్నను గొన్నియెడల శబ్దమధ్యమునను నకారముపైఁ బరుషములు సరళము లగుటఁ గలదు. వండన్ + కలఁడు = వండఁగలఁడు, వండన్ + పడదు = వండఁబడదు, జ్ఞానమున్ + పట్టి = జ్ఞానముఁబట్టి మొ॥ ఈ యర్థము నిది సాధించుటలో బాధకాంశము గల దేమో పరిశీలింపవలయును.

కాని యీ నిషేధమునుబట్టి యొక యంశము స్పష్ట మగును. 'నో ద్రుతమ్' (సంజ్ఞా.8) అను సూత్రము ననుసరించి భాషయం దెచ్చట నున్నను నకారమునకు ద్రుత మనుసంజ్ఞ యుండును. పదాంతము నందలిదే ద్రుత మను నియమము లేదు.

చినుకు – చిన్కు ఇత్యాదిగాఁ బదమధ్యనకారముయొక్క ఇకారోకారములకు లోపమును జెప్పుచో నథర్వణుఁడు 'ద్రుతస్య చ' (అ.త్రి.శ.2.) యని పదమధ్యనకారమును ద్రుత మనియె పేర్కొనెను. 'అల ద్రుతమునకు మద్యమానుసికమునకు' ఇత్యాదిగా నప్పకవియును నకారమును సాధారణముగనె యనఁగా శబ్దమునం దెచట నున్నను ద్రుత మని వ్యవహరించుట గమనింపవచ్చును. 'నలిన' యను శబ్దమున రెండుద్రుతములు గల వన్నమాట.

'ప వ హలస్సరళ' యనుచో సూత్రమున 'హలః' అను దళమువలనఁ బ్రయోజనము గానరాదు. ననాత్సరళః అనియో నాన్నసరళః. ఇత్యాదిగ నెట్లో సూత్రింపవలసినది.

ఇంక స్వరవిశిష్టము గానపుడు సరళములు లే దనఁగా స్వరవిశిష్టము లయినపుడు సరళము లగునా? 'చినుకు' అనునది 'చినుగు' కావలె. కాఁగా నిట సరళములప్రాప్తి లేదు.

కాఁగా ద్రుతము పొల్లునకారమె కాని స్వరవిశిష్టము గా దని వీరిమతముగా నెన్నుట కిది యొక్క యాధారము గాఁగలదు.

## 24. జశ్శ్చయ్. [1]

ఏకపదే = సమానపదమునందు, జశః = జశ్శులకుఁ బరుషములు పరమగునపుడు, చయః = చయ్యు లగును.

జబగడదశ్' అను మాహేశ్వరసూత్రమునుబట్టి జశ్ప్రత్యాహారము జబగడద యను వర్ణములు బోధించును. ఈ వర్గతృతీయాక్షరములకె తెలుఁగున 'తృతీయా స్సరళాః' అని సరళసంజ్ఞ. కాఁగా సంస్కృతానుసరముగా జశ్శునకుఁ దెలుఁగున సరళము లని యర్థమగును. ఖఫఛఠథచటతవ్, కపయ్ యను మాహేశ్వరసూత్రములనుబట్టి చయ్ ప్రత్యాహారముచే చటతకప యనునవి బోధింపఁబడును. వీనికిఁ దెలుగునఁ బరుషము లని సంజ్ఞ . (ఆద్యాః పరుషాః)

వి. సరళవర్ణస్య పరుషాక్షర స్స్యాదేకపదే పరుషాక్షరే పరే. వేడుక - వేడ్క (వేట్క), పడుచు - పడ్చు (పట్చు), విడుతు - విడ్తు(విట్తు), గాడుపు-గాడ్పు (గాట్పు) తడుపు - తడ్పు (తట్పు).

సమానపదమునఁ బరుషము పరముగా నున్నపుడు సరళమునకుఁ బరుష మాదేశ మగును. 'చస్సపరుషాః' అను సూత్రము నుండి క్రమముగా 'పరుషహాలః' అన్నది యిం దన్వయించును

'వేడుక' యను శబ్దమునందు 'ఇణష్టోర్లలి' యను సూత్రముచే డకారము ప యి నుత్వము లోపింపఁగా వేడ్క యని యగును. కకారము పరుషమునకుఁ బర మైనది గావున ముందరి డకారము సరళమునకుఁ బరుష మగు టకారము గాఁగా వేట్క యని యగును. ఇట్లే యితరములందును గుర్తింపఁదగు.

వ్యవహారమునం దిట్టిది కలదు. కాని దానికి గ్రంథప్రామాణ్యము లేమి నీ విషయము లక్షణబద్ధము చేయు టెంతవఱ కుచిత మనఁగలము?

ఈ సూత్రముతో 'ఏకపదే' యను నధికారము ముగిసినది. ఇంకఁ దరువాతి కార్యములయెడ 'నేకపదే' యను నియమము లేదు.

---

1. జశశ్చయశ్చై కపదే . (త్రి.శ.2.16)

## 25. పూర్వరూపమదౌ.[1]

అదౌ = అది యనుశబ్దము పర మగుచుండఁగా, పూర్వరూపమ్ = పూర్వరూపము కలుగును.

వి. అదౌ పరే పూర్వరూపం స్యాత్. బాపనది, ముసలిది, అంటు ది, కన్నెది.

అది శబ్దము పర మగుచుండఁగాఁ బూర్వరూపము గలుగును. కన్నె + అది = కన్నెది.

సన్ధిః పరరూప మ్మనుటనుబట్టి తెలుఁగున సంధి యనఁగాఁ బరరూపమె. ఇది పూర్వరూపమును జెప్పునది. పూర్వరూప మనుటవలనఁ బరస్వరమునకును బూర్వస్వరమె యగును.

వివృతియందుఁ గ్రమముగా నాయా యచ్చుల కుదాహరణములు చూపఁబడినవి. బాపన + అది = బాపనది (అత్త్వము), ముసలి + అది = ముసలిది (ఇత్తు), అంటు + అది = అంటుది (ఉత్తు), కన్నె + అది = కన్నెది (ఎత్తు).

ఇంక నిచ్చటఁ బూర్వరూపము వికల్పముగా నగును. కావున బాపనయది యను తీరుగాఁ బరస్వరము నిల్చిన రూపములు నుండును. అవి శబ్దము పర మైనపుడు నీ కార్యము గలదు. ముసలి + అవి = ముసలివి. ఈ కార్యము వివృతియందె యగును. వాని నది పిల్చెను. మొదలగు నంశము లిటఁ బ్రస్తావింపఁబడలేదు.

## 26. వా పరరూపమ్.[2]

అదౌ = అది శబ్దము పర మగుచుండఁగా, పరరూపమ్ = పరరూపము, వా = వికల్పముగా నగును.

వి. అదౌ పరే పరరూపం చ వా స్యాత్. ముసిలది, కన్నది ఇత్యాది.

అది శబ్దము పర మగుచుండఁగాఁ బరరూపమును వికల్పముగా నగును. పరరూపవిధానమువలనఁ బరస్వరము నిల్చును. ముసిలి + అది = ముసలది. మొ॥.

'పూర్వరూప మదౌ' యను పూర్వసూత్రమునుండి 'అదౌ' యనున దిచ్చటి కనువర్తించును.

---

1. పూర్వరూపంచాదిపరే (త్రి.శ. 2.18)
 శబ్దాత్తచ్ఛబ్దాతః. ఆం.శ.చిం.సన్ధి.14.
2. పరరూపంచవాఽవ్యసా. (త్రి.శ.2.19)

పూర్వసూత్రమునఁ జెప్పఁబడిన పూర్వరూపముతోపా టది శబ్దము పర మగుచుండఁగాఁ బరరూపము సైత మగునని సూత్రాభిప్రాయము. పరరూపము వికల్ప మనుటలోఁ బూర్వరూపమును గల దనియే తాత్పర్యముగా, (పూర్వ)పరరూపముతో బా టది రానపుడు యకారముతో ముసిలి య దను రీతిగా నుండు నని యభిప్రాయము గాదు. వివృతియందును బరరూపము వచ్చినట్టి యుదాహరణ మొక్కఁడే చూపఁబడుట గమనింపఁదగును.

కాని ప్రస్తుతసూత్రము సాధించుచున్న పరరూప మయినరూపములు గానరావు. ముసలి + అది =ముసలది యనురీతిగా నుండదు. ఇంకను కన్నె + అది = కన్నది యని యవు నని తలఁచిన నది ప్రమాదమె యనక తప్పదు.

ముసలిది యని కాకున్న ముసలియది యనియె యుండును. పూర్వరూపము రాని పక్షమునందు యకారము చేరుటయె గాని పరరూప మగుట లేదు. కావునఁ బరరూపమును విధించుటకంటెఁ బూర్వసూత్రము నొద్దనె 'వా పూర్వరూప మదో' యనిపూర్వరూపమునె వికల్పముగా విధించుట లెస్స. అది, యవి శబ్దంబులయత్తునకు వివృతిని లోపముగా నీయనిది పిదప లాక్షిణికులు స్పష్టము చేసిరి. ఆం.కౌ.లో నీ వ్యాకర్త 'పదాత్పరతః'(సంధి.12) అని యత్వలోపముగాఁ జెప్పెను. దీనివలనఁ బైని బరరూపవిధానముచేఁ గల్గు నిబ్బందులు తొలఁగినవి.

## 27. మోర్లుగ్వా పత్యర్థే. [1]

పత్యర్థే = పతిధాత్వర్థక మగు'పడు'పర మగుచుండఁగాఁ బూర్వమునందున్న, మోః = మువర్ణకమునకు, వా = వికల్పముగా, లుక్ = లోప మగును.

వి. పతిక్రియార్థకే పదే పరే నామధాతోః[2] ముర్ణకస్య వా లోపస్స్యాత్. భయముపడి – భయపడి.

పతిధాత్వర్థక మైన'పడు' అను దేశ్యధాతువు పరముగా నున్నపుడు నామధాతువునందలి ముపర్ణకమునకు వికల్పముగా లోపము వచ్చును. భయము + పడు అనుచో ముపర్ణకము లోపింపఁగా భయపడు అని యగును. 'వా' యనుటచే లోపము రానిపక్షమున ముపర్ణకముతో భయముపడె నని యుండును.

'భయపడు' అను నిట్టివానిని నామధాతువులుగాఁ జెప్పుట వివృతియందలి విశేషము.

---

1. మోర్లుగ్వాపత్యర్థే. (ఆం.కౌ.సంధి.19)
2. మోర్లుక్పడౌనామధాతోః. (త్రి.శ.2.20.)
   మోః పత్యర్థే. వై.చం.సంధి. 39.

ఇది యథర్వణుని త్రి.శ. ననుసరించి చెప్పఁబడినది. శయన-ఇంచు = శయనించు అనుతీరుగా వివక్షచే ధాతుత్వ మందిన నామము నామధాతువు. భయ + పడు అనుచో ధాతుత్వమును బొందిన నామము ముపర్ణాంత మగుటయుఁ దానిపైఁ బడుధాతువు చేరుటయు నపూర్వము. శయనించు, పయనించు మొదలగుచోట్లఁ బ్రాతిపదియ పయినె యించుగాగమము చేరినట్లుగా నిచటఁగూడ నామము పయినె (పడుధాతువు) చేరినచో ములోపవిధానము వ్యర్థమె యగును. నామధాతువులలో నామములపైనెనఁగాఁ బ్రాతిపదికలపై నించుకు్కు చేరుచుండ నిట మాత్రము (ద్వితీయార్థక) ప్రథమాంత మగుపదముపైఁ జేరుట యెట్లు? నామధాతువుల కించు క్కుగుచుండఁగా నీవానికి 'పడు'ధాతావు చేరుటయు భేదమె. లాక్షణికులు పేర్కొనిన 'శబ్దపల్లవము'లలో నిట్టివి చేరియుండును.

ఈ సందర్భమునఁ జిన్నయసూరి "యీ కార్యము కర్తృవాచి ముపర్ణకంబునకుఁ గలుగదు. అశ్వము పడియె, గజము పడియె" నని పేర్కొన్న యర్థమును బ్రస్తుతము సూత్రములోని'వా'శబ్దమునకు వ్యవస్థ చేసికొనవచ్చును.

వివృతియందు 'నామధాతోః' అని పేర్కొనుట అశ్వముపడియె మొదలగుస్థలముల నీ లోపాభావము దృష్టియం దుండుటవలన నే మో. స్పష్టము చేయఁబడలేదు.

## 28. సిద్ధ స్సోమచన్ద్రస్య.[1]

సోమచన్ద్రస్య = సోమచంద్రునిమతమున, పత్యర్థే = పత్యర్థక మగుపడు ధాతువు పరమగుచుండఁగా, మోః = ముందటి ముపర్ణకమునకు, సిద్ధః = పూర్ణబిందు వగును.

వి. తస్య ముపర్ణకస్యాదేశః పూర్ణబిన్దు స్స్యాత్పడౌ పరే
సోమచన్ద్రస్య మతే. భయంపడి, పదంపడి.

పడుధాతువు పర మగుచుండఁగా నామధాతువునందలి ముపర్ణకమునకు సోమచంద్రుఁడను లాక్షణికుని మతమునందుఁ బూర్ణబిందువు వచ్చును.

భయము + పడు అనుచో నిట్లు ముపర్ణకమునకుఁ బూర్ణబిందు నాదేశము కాఁగా భయంపడు, అని యగును.

'మోర్లుగ్వా పత్యర్థే' యను పూర్వసూత్రమునుండి 'మోః పత్యర్థే' యనునవి యిం దనువర్తించును. హోత్సిద్ధః, సాధ్యోదేః- అను సూత్రములయెడ సిద్ధ మనఁగాఁ బూర్ణబిందు వనియు, సాధ్య మనఁగా ఖండబిందు వనియు గుర్తించితిమి. సిద్ధః పూర్ణః, సాధ్యోఽర్ధః (పరి. 22, 23) అని యాంధ్రకౌముదిలో నీ వ్యాకర్తయే స్పష్టముగా సూత్రించియున్నాఁడు.

---

1. వానుస్వారశ్చ. ఆం.కౌ.సంధి.19
ప్రథమావైభక్తిక మోర్బిన్దుశ్చమహాస్పతిక్రియార్థేను: ఆం.శ.చిం.సంధి.16

'మోర్లుగ్వా' యను సూత్రమునుండి 'వా'శబ్దము నిం దనువర్తింపఁజేయ నక్కఱ లేదు. 'సోమచన్ద్రస్య' యను దళము వలనఁ బక్షాంతరము సిద్ధ మగుచు నొకపక్షమున మువర్ణకమునకుఁ బూర్ణబిందువు రాకుండుట సిద్ధించుచున్నది. ఆ పక్షమున 'భయముపడు' అనియు నుండును. ఇట్లు లోప(భయపడు) పూర్ణబిందు(భయంపడు) స్వత్వము (భయముపడు)లతో మూఁడురూపము లేర్పడుచున్నవి.

సిద్ధ మనఁగాఁ బూర్ణబిందువు గావున 'భయఁపడు' అనుతీరుగా ఖండబిందువు తోడిరూప ముండదు.

సూత్రపట్టు, భయపెట్టు మున్నగువిధముగా పట్టు, పెట్టు మున్నగునవి పర మగునపుడు నీ కార్యము గలదు. అందుకే సూరి 'పద్వాదులు' అని యొకగణము నేర్పఱచెను.

'పదంపడి' యన్నది విశేషము.

## 29. ఆమ్రేడితపరస్య చ. [1]

ఆమ్రేడితపరస్య = ఆమ్రేడితము పరముగా నున్నపుడును, మోః = మువర్ణకమునకు, చ = పూర్వోక్తకార్యములు వికల్పముగా నగును.

వి. ఆమ్రేడితపరస్య మువర్ణకస్య వికల్పేన లోపబిన్దూ స్తః.
కటకటము పడి కటకటపడి. (కటకటంపడి).

ఆమ్రేడితము పరముగా నున్నపుడును ముందటి మువర్ణకమునకు లోపపూర్ణబిందువులు వికల్పముగాఁ గలుగును. కటకటము + పడి – లోప మైన, కటకటపడి – పూర్ణబిందు వయిన కటకటంపడి – యని యగును. వికల్పము గావున రెండును రానిచో 'కటకటముపడి' యనియే యుండును.

'మోర్లుగ్వాపత్యర్థే' యని చెప్పిన మువర్ణకలోపమును 'బిన్దుస్సోమచన్ద్రస్య' యని చెప్పఁబడిన పూర్ణబిందువును రెండు నిచ్చటవివృతియందు గ్రహింపఁబడినవి. కాని పూర్ణబిందువు వచ్చిన కటకటంపడి యనురీతి రూపములు గానరావు. వివృతియం దట్టిరూప ముదాహరింపఁబడలేదు. (నష్ట మయ్యె నేమో.) బిందువు సోమచంద్రునిమతము గావున నిచటఁ బూర్ణబిందువు గ్రహింపఁబడకుండుట కవకాశముగలదు. కావున లోపము మాత్రమే వికల్పముగా వచ్చు నని వ్యాఖ్యానించుకొనఁదగును.

లోపము వికల్పము గావున లోపము రానిచో 'కటకటము పడి' యని యుండవలయును. వివృతియం దట్టు లుదాహరింపఁబడినది గూడ. కాని యట్టిరూపము గానరాదు. లోపము నిత్య మనవలెను.

---

1. ఆమ్రేదితపరస్యచ. (త్రి.శ.2.12)

కాని యస లిచ్చట 'కటకటము' అని శబ్దము ముపర్ణకాంత మయి యున్నదా? అట్టిశబ్దమె కానరాదు. కటకట యనియే శబ్దము. కటకట + పడు = కటకటపడు అనుచో ముపర్ణక లోపప్రసంగము లేదు. పోనీ యిట్టివి వే ఉదాహరణములును గానరావే.

అస లది య ట్లుండఁగా 'నామ్రేడితపరస్య మోః' - అనఁగా, ఆమ్రేడితమునందలి ముపర్ణకమా? ఆమ్రేడితము పరముగా నున్నముపర్ణకమా? అట్లయిన కటకటము + పడు అనుచోటు లక్ష్యస్థానము గాదు. కటము + కటము, అని యుండఁగా మొదటిదగు 'కటము' అను శబ్దములోని ముపర్ణకము లోపించి కటకటము, బిందు వైన కటంకటము, స్వత్వముత్ కటముకట మని కావలెను. అట్టి శబ్దము లున్నవా? కట, కటకట యనియే కాని 'కటము' అని యీ శబ్దము, ముపర్ణకాతముగాఁ గానరాదే? ఈ వ్యాకరణమే కట, కటకట, అనురీతి రూపములనె సాధించుచున్నది.

ఆమ్రేడితము పరమైనచో ముపర్ణకము లోపించుట యనఁగా నయ్యది మధ్యమపురుష ముపర్ణకము గావలయును. ఉండుము + ఉండుము = ఉండుండుము. వికల్పము గావున లోపము రానిపక్షమున ఉండుముండుము.

సూత్ర మిట్టి వానిని సాధించుచు సార్థకమె కాఁగలదు. కాని వివృతివలన నయ్యది వ్యర్థమగు చున్నది. నిజమున కొకవేళ కటకటము + పడి = కటకటపడి యని కావలయున్న నీ సూత్ర మేల? భయము + పడు = భయపడు అని యైనట్లుగా 'మోర్లుగ్వాపత్యర్థే' యను దానిచేఁ గాదా? బిందువును గూడ వివృతి యంగీకరించినది గదా. ఇంక కటకట మను శబ్దమె లేదు గావున నీ యపరూపములబాధ లేదు.

## 30. పరస్యాదేశ్చ.[1]

పరస్య = పరముగా నున్నట్టి యనఁగా నామ్రేడితముయొక్క, ఆదేః చ = ముందటి దగు మొదటిశబ్దమునకు, లుక్ = లోపము, వా = వికల్పముగా నగును.

మోర్లుగ్వాపత్యర్థే యను సూత్రమునుండి 'లుగ్వా' యను పదము లిం దనువర్తించును.

వి. ఆమ్రేడితే పరస్యాదివర్ణస్యాదేః పరవర్ణస్య చ
వా లోపస్స్యాత్. కట.

ఆమ్రేడితము పర మగుచుండఁగా ననఁగా మొదటిశబ్దమునందు పరముగా నున్నదానికి ముందువర్ణమును, మురదటిదానికిఁ దర్వాతివర్ణము (ననఁగా మొదటిశబ్దమున రెండక్షరము లును) వికల్పముగా లోపించును.

---

1. పరస్యాదేశ్చ. (త్రి.శ.2.22)

కట + కట యనుచో నామ్రేడితము రెండవ పదమగు కటశబ్దము అది పరముగాఁ గలది మొదటికటశబ్దము. అది యీ సూత్రముచే లోపింపఁగా 'కట' యని మిగులును.

'పరస్యాదివర్ణస్య ఆదేః పరవర్ణస్య' యని వివృతి విపులీకరించినది. కాని మొదటిశబ్దము మొత్తము లోపించు నని లాఘవముతోఁ జెప్పవచ్చును. దీని కిం కొక యుదాహరణ మేది?

ఈ కార్యము 'కటకట' యను సంతాపార్థకశబ్దమునందే యని గ్రహింపవలయును.

కానిచో నిది యన్వయింపఁబడు నవకాశమే కానరాదు.

ఈ లోపము వికల్పము గావున లోపము రాని పక్షమునందు కటకట అనియే యుండును.

ఇచటినుండి సంతాపార్థకములగు కట, అకట మొదలగువాని విషయము ప్రస్తావింపఁబడు చున్నది. సంధిప్రకణమున నీ శబ్దనిరూపణవిషయము విశేషమే.

## 31. ద్విరాదేః పరస్య. [1]

ఆదేః = ఆ మిగిలియున్న శబ్దమునందు మొదటిదానికి (అనఁగా మొదటి యక్షరమునకు), పరస్య = పరముగా నున్నహల్లునకు, ద్విః = ద్విత్వము, వా = వికల్పముగా నగును.

'మోర్లుగ్వాపత్యర్థే ' యను సూత్రమునుండి వా యనున. దిం దనువర్తించును. 'ద్విర్ద్విత్వస్య' యను సూత్రము ననుసరించి 'ద్వి' అనఁగా ద్విత్వము.

వి. ఆమ్రేడితాలుప్తసన్తాపార్థకపదస్యాద్యక్షర పరవర్ణస్య ద్విత్వం వా స్యాత్.

సంతాపార్థక మగు కటకట శబ్దమున నామ్రేడితము పరముగా నుండఁగా (మొదటి శబ్దము) లోపింపఁగా (లోపింపక) మిగిలియున్న శబ్దమునందు మొదటియక్షరమునకుఁ దరువాతి వర్ణమునకు వికల్పముగా ద్విత్వము వచ్చును.

'కటకట' 'పరస్యాదేశ్చ' యని మొదటి 'కట' శబ్దమునకు లోపము రాఁగా 'కట' యని మిగిలియుండును. ఇందు మొదటియక్షరమునకుఁ బరమైన వర్ణ మనఁగా (క-ట-)టకారము దాని కీ సూత్రముచే ద్విత్వమురాఁగా కట్ట యని యగును. వికల్పము గావున ద్విత్వము రానిపక్షమునందు 'కట' అనియె యుండును.

1. ద్విత్వంచ. (త్రి.శ.2.23)

## 32. అటఃకః (ద్వి) వా.

అటః = అట్టునకుఁ బరముగా నున్న, కః = కకారమునకు సయితము, ద్విః = ద్విత్వము వా = వికల్పము.

మోర్లగ్వా యను సూత్రమునుండి వా యనునదియు ద్విరాదేః పరస్య యను పూర్వసూత్రమునుండి 'ద్విః' అనునదియును నిం దనువర్తించును.

వి. అటః పరస్య సన్తాపార్థకపదస్య కకారస్య చ వా ద్విత్వం స్యాత్

అట్టునకుఁ బర మయిన సంతాపార్థక మగు కటశబ్దము నందలి కకారమునకును వికల్పముగా ద్విత్వ మగును.

'కట' యను శబ్దమునకు "అగోరడ్వాఽనామ్రేడితే" యను తరువాతి సూత్రముచే అడాగమము రాఁగా అ + కట యని యగును. అడాగమమునకుఁ బరముగా నుండుటచే నీ సూత్రముచే కకారమునకు ద్విత్వము రాఁగా అక్కట యని యగును. వికల్పము గావున ద్విత్వము రానిపక్షమునందు 'అకట' యని యుండును.

'అటః' అను దళముచే అడాగమము రానిపక్షమునందు ద్విత్వమును లేదు. కట యనియె యుండును.

## 33. అగోరడ్వాఽ నామ్రేడితే.

అనామ్రేడితే = ఆమ్రేడితము పరముగా లేనపుడు, అగోః = గురువిరహితమైన సంతాపార్థక శబ్దమునకు, వా = వికల్పముగా, అట్ = అడాగమము వచ్చును.

వి. అనామ్రేడితే సంన్తాపార్థకపదస్య లఘ్వక్షర స్య వికల్పే నాడాగమస్స్యాత్. టిత్వాదాద్యవయవః అటః కశ్చేతి ద్విత్వే ప్రాప్తే అక్కట.

ఆమ్రేడితము పరముగా నుండనపుడు గురువిరహిత మయిన సంతాపార్థకశబ్దమునకు వికల్పముగా 'అడాగమము వచ్చును. అట్- అనుచో టకారము ఇత్తు. కావున నది లోపించును. అకారము మాత్రమె యాగమ మగును. టకార మిత్తుగాఁ గలిగినది గావున 'అ'కారము టి త్తయినది. కావున 'ఆద్యన్తౌటకితౌ'యను పాణినీయపరిభాష ననుసరించి విధింపఁబడినదానికి (ఇచట సంతాపార్థకశబ్దమునకు) నాద్యవయవముగా ననఁగా ముందుగా వచ్చిచేరును.

'కట' యనుదాని కి ట్లీ సూత్రముచే ముం దకార మాగమము కాఁగా అకట యని యగును. 'అటఃకళ్ళ' యను పూర్వసూత్రముచే ద్విత్వము వచ్చిన పక్షమునం దక్కట యని యగును.

'వా' యనుటచే అడాగమనకువికల్పము కావున నడాగమము రానిపక్షమునందు 'కట' యనియె యుండును.

వి. అనామ్రేడితే కిమ్? కటకట.

సూత్రమునందు 'అనామ్రేడితే' యని పేర్కొనుటచే నామ్రేడితము పర మైనచో అడాగమము రాదు. కటకట ఇట నకటకట యని ముండదు. అకట + అకట యనుచో సంధివలన నకటకట యని యగును.

వి. అగోః కిమ్? కట్ట.

సూత్రమునందు 'అగోః' అనుటచే గురువిరహిత మయినపుడే యడాగమము వచ్చును. 'గుగౌ గరోః' అను సూత్రము ననుసరించి 'గు' అనఁగా గురువు. 'కట' యనుశబ్దమునందు 'ద్విరాదేః పరస్య (సంధి.30) యను సూత్రముచే 'ట'కారమునకు ద్విత్వము వచ్చినపక్షమునందు 'కట్ట' యని యగును. ఇందు కవర్ణము గురువు. కావున సూత్రమునందలి 'అగోః' అను దళముచే గురుమంతం బగు నీ శబ్దమున కడాగమము రాదు. కావున 'అకట్ట' యను విధముగా నుండదు.

## 34. దిశ్చాధాత్వంతరస్య.

అధాత్వంతరస్య = ధాతువుతో వ్యవహితము గానపుడు, వా = వికల్పముగా, దిః చ = సంతాపార్థకపదమునకు దీర్ఘము సయితము వచ్చును.

వి. ధాతోరన్తరం యస్యనేతిసమాసః అన్తరం తాదర్థ్యం. అధాత్వన్తరస్య సన్తాపార్థకపదస్య వా దీర్ఘస్స్యాత్. అలోఽన్త్యస్యేత్యన్త్యస్యైవ. కటకటా, కటా, కటా, అకటా,

'ధాతోరన్తరం యస్య న' అనువిగ్రహముతో సమాసముగా నేర్పడిన శబ్దము 'అధాత్వన్తరః' అనునది. అంతర మనఁగా నెడము. ధాతువు పరముగా లేని దని యిచ్చటి యభిప్రాయముగాఁ జెప్పఁదగును. దీర్ఘ మేకాల్లు (ఒకే వర్ణము) కావున 'అలోఽన్త్యస్య' యను పాణినీయపరిభాష ననుసరించి విధింపఁబడినదానిలోఁ జివరివర్ణముయొక్క స్థానమున నాదేశముగా నగును. ధాతువు పరముగా లేని, సంతాపార్థకశబ్దమునందుఁ జివరియచ్చునకు **వికల్పముగా దీర్ఘ**

మగును. 'అగోరడ్వానామ్రేడితే' యను పూర్వసూత్రమునుండి 'వా' యనునది యిం దనువర్తించును. 'దిర్దీర్ఘస్య' యను సూత్రముచే 'ది' అనగా దీర్ఘము.

అనామ్రేడితము, గురువిరహిత మిత్యాది నియమములు లేకుండుటచే, కటకట, కట్ట, అకట, కట మున్నగు నన్ని శబ్దములయందును వైకల్పికముగా నీ సూత్రముచే దీర్ఘము వచ్చును. కటకటా, కటా మొ॥ చివరియచ్చునకుఁ గావున కటాకట యను తీరుగాఁ గా దని గ్రహింపవచ్చును. వికల్ప మగుటచే దీర్ఘము రానిపక్షమునందు కటకట యను రీతిగా హ్రస్వాంతము నయి యుండును.

వి. అధాత్వన్తరస్య కిమ్? కటకటపడె. నేహ.

సూత్రమునం 'దధాత్వన్తరస్య' యనుటచే ధాతువు పరముగా నున్నచో దీర్ఘము రాదు.- కటకటపడు ఇచటఁ బడుధాతువు పర మైనది గావున దీర్ఘము లేదు. కావున కటకటాపడు - అను రీతిగాఁ గాదు.

## 35. టస్య వాలుక్.

టస్య = సంతాపార్థక మగు 'కట'యను శబ్దమునందలి'ట'వర్ణమునకు, వా = వికల్పముగా, లుక్ = లోప మగును.

వి. సన్తాపార్థకపదస్య టస్య వా లుక్ స్యాత్ -(క)

సంతాపార్థక (కట) పదమునందు 'ట'వర్ణమునకు వికల్పముగా లోప మగును. కట శబ్దమునం దిట్లు టవర్ణము లోపింపఁగా 'క' యనునది మిగిలియుండును.

'అగోరడ్వానామ్రేడితే' యను సూత్రముచే అడాగమము వచ్చి యేర్పడిన 'అకట' యను శబ్దమునందు 'ట'వర్ణము లోపింపఁగా 'అక' యని యుండును.

ఇట 'కట' శబ్దముననే టవర్ణము లోపించి పిదపనే యడాగమము చేయుటయు లక్షణానుగణముగనె గానవచ్చుచున్నది.

## 36. ఓదన్త్యస్య

అన్త్యస్య = చివరి వర్ణమునకు, ఓత్ = ఓత్వ మగును.

వి. సన్తాపార్థకపదస్య లుప్తశేషస్య హ్యట్పరస్య చ
కవర్ణస్యాన్త్యస్య ఓత్ స్యాత్ -కో,అకో.

సంతాపార్థకపదమునందు, లోపింపఁగా మిగిలినవదియు, అడాగమమునకుఁ బరముగ

నున్నట్టియు, చివరి దగు కవర్ణమునకు నోత్వము వచ్చును. ఓత్వ మేకాల్లు గావున'ఆలోఽన్త్యస్య' యను పాణినీయపరిభాష ననుసరించి కవర్ణమునందుఁ జివరి దగు నకారము స్థానమున నగును.

'అన్త్యస్య కః' అని కవర్ణముచివరిది కావలయు ననుటవలన 'టస్య వాలుక్' అను సూత్రముచే 'ట'వర్ణము లోపింపఁగా మిగిలియున్న స్థలముననే యీ కార్య మగు నని తెలియవచ్చును.

'కట' యనుచో 'టస్య వా లు' క్కని టవర్ణము లోపింపఁగా మిగిలిన 'క'వర్ణమున కీ సూత్రముచే ఓత్వము రాఁగా 'కో' యని యగును.

అడాగమము వచ్చిన సందర్భమున అకట, అక – అకో యని యేర్పడును.

'అన్త్యస్య(కః) అనుటచే కటో యను తీరుగాఁ గాదు.

వి. అటః కశ్చేత్యనేన ద్విత్వమ్ – అక్కో

'అటః కశ్చ' యను సూత్రముచే ద్విత్వము వచ్చిన 'అక్కో' యని యగును.

## 37. ఓద(ఙ్డో?)టశ్చ.

అటః చ = అడాగమమునకు (అత్వమునకు) సయితము. ఓత్ = ఓత్వ మగును.

వి. లుప్తశేషస్య సన్తాపార్థకస్య కవర్ణస్య పూర్వా
డాగమస్య హ్రస్వఒదాదేశో వికల్పేన స్యాత్.
చశబ్దో వికల్పార్థః. ఆదేశః స్థానివత్ స్యాత్.
ఒకో, ఒక్కో.

'టస్య వాలుక్' అను సూత్రముచే 'ట'వర్ణము లోపింపఁగా మిగిలియున్న సంతాపార్థక మగు కవర్ణమునకుఁ బూర్వమునందలి యడాగ మాకారమునకు వికల్పముగా హ్రస్వ మగు ఒత్వ మాదేశ మగును. కాఁగా నడాగమము వచ్చినసందర్భముననే యీ లక్షణము ప్రవర్తించును. సంస్కృతమున ఎ,ఒ యను హ్రస్వములు లేకుండుటచే దీర్ఘములే సూత్రమునఁ జెప్పఁబడినవి. అయ్యు లక్ష్యానుగుణముగా హ్రస్వమో దీర్ఘమో యుభయమో తెలుఁగున గ్రహింపవలయును. చింతామణ్యాదులందు నిట్టిది ప్రసిద్ధమె. 'ఏదాతౌ ప్రశ్నలక్షణౌ భవతః'– అలిగితివె, అలిగితివే. అందువలననె యిటఁ బూర్వసూత్రమున 'ఓత్' అనుచో హ్రస్వముగాఁ జెప్పని వివృతి యిట నట్లె సూత్రమున ఓ త్తని యున్నను 'హ్రస్వ' మని వివరించినది. ఓ త్తన్నది పూర్వసూత్రమున మున్నను మఱల నీ సూత్రమునఁ జెప్పుట యిందుకు సాధక మగుపీలును గలదు.

అకట శబ్దమునందు టవర్ణము లోపింపఁగా (టస్య వా లుక్) నున్న 'అక' యను దానియందు 'ఓదన్త్యస్య' యను సూత్రముచే కవర్ణమున కోత్వము వచ్చి అకో యని కాఁగా నీ సూత్రముచే ముందటి యడాగమమున కొత్వము వచ్చి ఒకొ యని యైనది. అడాగమమునందు నిల్చునది 'యత్వ మొక్కటి గావున దానికె యొత్వ మగుచున్నది.

'ద్విరాదేః పరస్య' (సంధి. 31) యను సూత్రముచే ద్విత్వ మయిన పక్షమున 'ఒక్కొ' యని యగును.

సూత్రమునందలి'చ'శబ్దము వికల్పార్థక మనియు నందుచే ఒదాదేశము వికల్పముగా వచ్చు ననియు వివృతియందుఁ జెప్పఁబడినది. దీని ననుసరించి యొత్వము రాని అకొ, అక్కొ యను రూపములు నొకొ, ఒకొ యను నర్థమును నేర్పడుచున్నవి. కాని యట్టిరూపములు ప్రయోగదృష్టములు గావు. వివృతియం దట్టిరూపము లుదాహరింపఁబడనులేదు.

ఈ చశబ్దమునకు వికల్ప మని యర్థము చేయక యది సముచ్చయార్థకముగనె గ్రహించు టుచిత మనిపించు. ఇది పూర్వసూత్రమునఁ జెప్పిన'కవర్ణమున కోత్వము వచ్చుటతోపాటు ముందటి యడాగ మాకారమునకుఁ గూడ నొత్వము వచ్చు నని చెప్పును. దీనివలన వివృతియందుఁ జెప్పఁబడిన'లుప్తశేషస్య' యను నర్థమునకు లక్షణము నందలిచశబ్ద మాధార మగుటయు గుర్తింపవచ్చును.

ఇట్టియెడల సూత్రవివృతికర్తలు భిన్ను లనిపించును. కాక యొక్కరే యయి, అకొ, అక్కొ యను రూపములను సాధింపఁబడినట్లు చెప్పె ననక తప్పదు. అట్టి రూపములు మృగ్యములు.

కానిపక్షమునందు చశబ్దముచే కవర్ణమున కోత్వము వచ్చినపక్షమునందు ముందటి యత్వమునకును నొత్వము నిత్యముగనె యగుచు, ఒకో, ఒక్కో యన్నవి మాత్రమె సాధింపఁబడును. కావున అకో, అక్కో యను రూపము లుండవు.

'ఆదేశఃస్థానివత్' అనుటలో ఒకో ఒక్కొ యనునవి సంతాపార్థకములె యగు నని చెప్పుట వివృతియందలి యభిప్రాయ మై యుండవచ్చును.

కాని యివి సందేహార్థకము లైన యవ్యయములుగాఁ గోశములు స్పష్టము చేసినవి. అది యుక్తము. ఇవి అకటశబ్ద నిష్పన్నము లనుట విచార్యము.

ఒక్కొసంశయే - సంశయే ఒక్కొఇతి నిపాత్యతే - (వై.చం.అవ్యయ.14)

## 38. వస్సతాలవ్యస్య చ. [1]

సతాలవ్యస్య = తాలవ్యము లగుస్వరములతోఁ గూడినట్టి, వః చ = వకారమునకు నయితము, వా = వికల్పముగా, లుక్ = లోప మగును.

'టస్య వా లుక్' అను సూత్రమునుండి యిచ్చటకు 'లుక్ వా' యను పదము లనువర్తించును.

వి. తాలవ్యాచ్సహితస్య దేశ్యనామాదివకారస్య చ
వా లోపస్స్యాత్. విత్తులు – ఇత్తులు, విడెము – ఇడెము,
వేటు–ఏటు, వెట్టి – ఎట్టి ఇత్యాది.

తాలవ్యము లగు నచ్చులతోఁ గూడినపుడు దేశ్యశబ్దములకు మొదట నున్న వకారమునకును వికల్పముగా లోప మగును. 'ఇదేతౌ తాలవ్యౌ' యను సూత్రము ననుసరించి ఇ,ఈ,ఎ,ఏ అను నాలు గచ్చులును దాలవ్యములు. దేశ్యశబ్దములకు మొదటి దను నంశము వివృతి యందలి విశేషము.

విత్తులు – ఇచటఁ దాలవ్య మగు 'ఇ'కారముతో గూడినది కావున విత్తను దేశ్యశబ్దము మొదటి వకార మీ సూత్రముచే లోపింపఁగా ఇత్తులు అని యగును. 'వా' యనుటచే వికల్పము గావున లోపము గానిపక్షమునందు విత్తు లని యుండును.

ఇత్తులు, ఎట్టి యనురీతి రూపములులోకవ్యవహారముసందున్నవి. కావ్యవ్యవహారమున నున్న వేమో వెదుకవలసి యున్నది.

'సతాలవ్యస్య'- యనుటచేఁ దాలవ్యేతరము లగు నచ్చులతోఁ గూడియున్నచో వకారమునకు లోపము రాదు. వంకర, వాఁగు మొ॥

'వః' అనుటచే వకారేతర మగు హల్లునకు లోపము లేదు. కిటికీ మొ॥

'దేశ్యనామాదివకారస్య' యనుటచే తావి, బావి మొదలుగా ననాదియం దున్నను, విపులము, వేగము మొదలుగాఁ దత్సమములయందును వకారమునకు లోపము రాదు. నిజమునకు ఇత్తులు, ఎట్టి యనురీతిగా ఇనయము (యినయము) ఈరుఁడు (యీరుఁడు) అనురీతిఁగా దత్సమశబ్దములలో వకారలోపము లోకవ్యవహారమున లేకపోలేదు. ఆం.కౌ. విభుఁడు–ఇభుఁడని చూపిన దిట. కాని దేశ్యశబ్దములకు మాత్రమె లోకవ్యవహారము ప్రమాణ మని దేశ్యశబ్దములందె యీ కార్య మంగీకరింపఁబడిన దేమో.

---

1. సర్వత్రవోవాలుక్. (ఆం.కౌ.సంధి.26)

అవి – అయి, తవిదలు – తయిద లు అనురీతిగా ననా దియందును వ్యవహారమున నీ కార్యము గలదు. ఏ మైనను ఇనయము ఇత్యాదులు దుష్టములు గాక తప్పదు. అదే పద్ధతిలో ఇత్తు లనురీతివి గూడ భ్రష్టోచ్చారణమున నేర్పడినవిగా (గ్రామ్యములుగా) నసాధువులుగా గుర్తించుటయె యుచిత మనిపించుచున్నది.

## 39. అనుకృతేశ్చ: [1]

అనుకృతేః చ = అనుకరణముననను, ద్విత్వము వికల్పముగా నగును.

వి. అహమాద్యనుకరణస్య ద్విత్వం వా స్యాత్.

దాసోఽహ మని–దాసోఽహ మ్మని, ధన్యస్త్వమని–ధన్య స్త్వమ్మని, కక్షః కి మనుచు – కక్షః కి మ్మనుచు ఇత్యాది.

అనుకరణమున(కు)ను వికల్పముగా ద్విత్వముగా వచ్చును. ఇచ్చట విధింపఁబడుచున్నది వైకల్పికద్విత్వ మను నంశము వివృతి ననుసరించియె తెలియవలసియున్నది. 'ద్విరాదేః పరస్య' యనుచోఁ బూర్వమున నెచ్చటనో ద్విత్వప్రసక్తి కలదు. అ.త్రి.శ.లో 'ద్విత్వం చ' యనుదానితర్వాత నీ సూత్ర ముంట ద్విత్వ మట ఁగుదిరె. పూర్వసూత్రమున వైకల్పిక లోపము సంగ్రహింపఁబడుచుండఁగాఁ బిదపఁ జెప్పిన యీ లక్షణమున 'వైకల్పికద్విత్వ' మను నంశ మెచ్చటనుండియో వచ్చుట విశేషమె.

'అనుకృతేః' అని షష్ఠిని గాక అనుకృతౌ యని సప్తమి నుంచిన బా గుండెడి దనిపించును. 'అనుకృతౌ చ లుగ్విసర్గస్య' అను తరువాతి సూత్రమును గూడ నిందుఁ గలిపినఁ గొంత స్పష్టత యేర్పడఁ గలదు. కాని యనుకరణమున ద్విత్వ మింకొకచోట విధించిన జాడలేదు.

దాసోఽహమ్ + అని – ఇచట నీ సూత్రముచే ద్విత్వము రాఁగా దాసోఽహ మ్మని యని యగును. వికల్పము గావున ద్విత్వము రానిపక్షమునందు దాసోఽహ మని యనియే యగును.

'అహమాదీనాం ద్విత్వ' మ్మని చింతామణి యహమాదులకు ద్విత్వము నిత్య మనఁగా నిచట వైకల్పిక మని చెప్పఁబడుట విశేషము. ఆంధ్రకౌముదియందును నీ వ్యాకర్త వికల్ప మనియే చెప్పెను. 'అహమాదీనాం వానుకరణేద్విత్వమ్' (సంధి.20)

---

1. తథానుకరణస్య చ. (త్రి.శ.24)
ఆహమాదేర్వాచ్యనుకరణే ద్విత్వమ్. (ఆం.కౌ.సంధి.20)
అహమాదీనాం ద్విత్వమ్. ఆం.శ.చిం.సంధి.19
ద్విత్వమ్మః. వై.చం.సంధి.23.

అహమాదుల మకారమునకు ద్విరుక్తి 'విభాష' గాఁ జెప్పిన చిన్నయసూరి 'త్వమ్' శబ్దములోని మకారమునకు ద్విత్వము నిత్య మనియే స్పష్టము చేసెను. ఈ వ్యాకర్త త్వమ్ శబ్దమునను వికల్పమే యని తలఁచుట విశేషము. అట్టి ప్రయోగములు మృగ్యములు. అట్లె - కి మను మొ।

## 40. లుగ్విసర్గస్య. [1]

విసర్గస్య = విసర్గ కనుకరణమునందు, లుక్ = లోపమగును. 'అనుకృతేశ్చ' యనుపూర్వ సూత్రము ననుసరించి యీ కార్య మనుకరణమునం దగునదిగా గుర్తింపఁదగును.

### వి. నమఃప్రభృతీనాం విసర్గస్య లోపస్స్యాత్.[2]

### నమోనమ యనుచు మ్రొక్కె, పరస్పర యని.

నమః మొద లగు శబ్దములందలి విసర్గమునకు లోప మగును. అనుకరణమునందు సంస్కృత వాక్యాంతమునందు నున్నవిసర్గకు లోపము వచ్చును.

నమోనమః + అనుచు, అనుచో నిట్లు విసర్గము లోపింపఁగా నమోనమ + అనుచు, సంస్కృతీయాచ్చునకు సంధి లేదు గావున (వాఁతః సూత్ర వివృతి) 'యః ప్రాణస్య' యను సూత్రముచే యకారము వచ్చి 'నమోనమ యనుచు' నని యగును.

'లోపో నమ ఆదికే విసర్గస్య' యని చింతామణి నమఃప్రభృతులలో విసర్గ లోపించునన్నది. ఆంధ్రకౌముదిలో నీ వ్యాకర్తయును 'నమఃప్రభృతేర్లుగ్విసర్గస్య (సంధి.22) యని పేర్కొనెను. ఇటఁ గూడ వివృతియందు 'నమఃప్రభృతీనా'మ్మని యున్నది. అనుకరణమునందు సంస్కృతవాక్యాంతమున నున్నవిసర్గలోపింపకుండుట యెచ్చటను లేదు. వాక్యాంతమం దెల్ల శబ్దములందును విసర్గ లోపించుచుండఁగా నమఃప్రభృతు లని యొకగణము నేర్పఱచుటవలనఁ బ్రత్యేకముగాఁ బ్రయోజనము లేదు. విసర్గాంతము లెల్ల నమఃప్రభృతులలోఁ జేర్చుకొనవలసి యుండును. కాఁగా ననుకరణమున విసర్గకు లోప మగు నని సాధారణముగఁ జెప్పుటయె యుక్తము. ప్రస్తుతస్థలమున సూత్ర మట్లె పేర్కొన్నది.

---

1. విసర్గస్యలుక్ (వ?) (త్రి.శ.2.25)
2. నమఃప్రభృతేర్లుగ్విసర్గస్య. (ఆం.కౌ.సంధి.23)
లుగ్విసర్గస్య. వై.చం.సంధి.21
లోపోనమ ఆదికే విసర్గస్య. ఆం.శ.చిం.సంధి.18

## 41. నో హలి వా. [1]

హలి = హల్లు పర మగుచుండఁగా, నః = నకారమునకు, వా = వికల్పముగా, లుక్ = లోప మగును. 'లుగ్విసర్గస్య' యను పూర్వసూత్రమునుండి 'లుక్' అనునది యిం దనువర్తించును.

వి. పదాన్తస్య నస్య లుగ్వా స్యాద్ధలి పరే. వచ్చెన్ గణపతి - వచ్చె గణపతి, ఇచ్చెన్ జగన్నాథుఁడు - ఇచ్చె జగన్నాథుఁడు, మెచ్చెన్ రాముఁడు - మెచ్చెరాముఁడు.

హల్లు పరముగా నున్నపుడు పూర్వశబ్దము చివరి నకారమునకు వికల్పముగా లోప మగును.

వచ్చెన్ + గణపతి యని యుండఁగా నీ సూత్రముచే నకారము లోపించి వచ్చె గణపతి యని యగును. 'వా' యనుటచే లోపము రానిపక్షమునందు 'వచ్చెన్ గణపతి' యని ద్రుత మట్లే యుండును. ఇది సరళము పర మైనపుడు నకారము లోపించుట కుదాహరణము. ఇట్టిదే - ఇచ్చె జగన్నాథుఁ డను తరువాదియును, మెచ్చె రాముఁ డన్నది స్థిరపరకతలో లోప మయినందుల కుదాహరణము.

'హలి' యని సామాన్యముగాఁ జెప్పుటచేఁ బరుషము పర మయినపుడు నకారమునకు వికల్పముగా లోపము రావచ్చును. 'పద్యాదేర్విభాషా' యను సూత్రమునొద్ద నుదాహరింపఁబడిన యథర్వణుని భారతపద్యమందుఁ బ్రాసఘటిత మై యున్న 'పోయె కరుణలేక' యన్నది దీనిచే సాధువు కాఁగలదు కాని యిచ్చటఁ బరుషము పరమై నపుడు నకారము (ద్రుతము) లోపించినందు కుదాహరణము వివృతియందుఁ జూపఁబడలేదు. దీనినిగూర్చి 'న పరుషే పుమ్పదన్తస్య (సంధి.42)యను సూత్రమునొద్ద వివరింపఁడుచున్నది. గావున నిటఁ బేర్కొనలేదు.

కాఁగా 'హలి' యనుటచే నచ్చు పర మై నపుడు పదము తుదినున్ననకారమునకు లోపము రానేరదు. కావున 'లుక్సంశ్లేషే నాచి ద్రుతస్య' (సంధి.13) యని యచ్పరకతలో లోపాభావమును వేఱుఁగాఁ జెప్పవలసిన యవసరము లేదు. ఇచట నః అనియు నచట ద్రుతస్య యనియుఁ జెప్పుటయె భేదము. 'నో ద్రుత' మ్మను లక్షణమునుబట్టి యివి రెండును బర్యాయములే యనుట స్పష్టము. ఇంకను 'బిన్దుస్సోమచన్ద్రస్య' యను సూత్రము

---

1. నస్యస్యాద్వా హలి. (త్రి.శ.2.26)
ద్రుతేవ స్థిరసరళేషు, నస్యషు వా లుక్. (ఆం.కౌ.సంధి.32)
స్థిరసరళయోర్ద్రుతస్య.వై.చం.సంధి.27
లుగ్వాద్రుతప్రకృతికాత్పరతస్సరళే స్థిరేచ నస్య స్యాత్. ఆం.శ.చిం.సంధి.25.

వివృతిలో నః అనుదానికి ద్రుతస్య యని యర్థము చేయఁబడుట గమనింపఁదగును. కాఁగా లుక్సంశ్లేషా యనుచో 'లుక్' అను దళము వ్యర్థమే యని యీ సూత్రముచే నిశ్చయింపఁ దగును. అయినను బ్రౌఢవ్యాకర్త సంశ్లేషవిషయమునఁ బేర్కొన్నట్లుగనె లోపనిషేధమువలన నరుదుగా లోప మగుట సమ్మత మనవచ్చునేమో.

'నః' అనుదానికిఁ 'బదాన్తస్య నస్య' యను వివృతియందలి విశేషవివరణము గమనార్హము. దీన శబ్దమధ్యమున నకార మున్నను దాని కే కార్యములు లేవు. అనుగు – అన్గు. అగు అని కాదు.

## 42. సంశ్లేషో రావణస్య.[1]

రావణస్య = రావణునిమతమునందు, హలి = హల్లు పర మగుచుండఁగా, నః = నకారమునకు, సంశ్లేషః = సంశ్లేష మగును.

'నో హలి వా' యను పూర్వసూత్రమునుండి 'నో హలి' యనునవి యనువర్తించును. వా శబ్దమును గూడఁ దెచ్చినను, సంశ్లేషము వికల్ప మను నర్థమును సిద్ధించును. కాని యది 'రావణస్య' యనుదానిచేతనె సిద్ధ మగుచున్నది. కావునఁ దే నక్కఱ లే దని తోఁచుచున్నది.

వి. లోపాభావపక్షే తస్య నకారస్య పరప్రాణినా సహ సంశ్లేష స్స్యా ద్రావణస్యమతే. కృష్ణ స్దేవునిగా నెంతున్, రామున్బలరిపుసేవ్యున్, దేవున్భూషింతున్.

'నో హలి వా' యను పూర్వసూత్రముచే నకారమునకు లోపము, రానిపక్షమునందు మీఁదిహల్లుతోఁ గూడుట యను సంశ్లేషము వచ్చు నని రావణుఁ డను లాక్షణికుని మతము. ప్రాణి యనఁగా హల్లు, 'పరప్రాణినా సహ సంశ్లేషః' అనుచో సంశ్లేష మనఁగా నకారము మీఁదిహల్లుతోఁ గూడుకొనుట యని వివరించిన ట్లయినది.

కృష్ణన్ + దేవునిగా ననుచో 'నోహలి వా' యను సూత్రముచే నకారము లోపించిన కృష్ణ దేవునిగా నని యగును. 'వా' యనుటచే లోపము రానిపక్షమునందుఁ బ్రస్తుతసూత్రముచే సంశ్లేషము గలుగును. అపుడు నకారము మీఁదిహల్లుతోఁ గూడి కృష్ణ స్దేవునిగా నని యగును.

'రావణస్య' యను దళముచే నిది యొకమతముననె యగును. కావున మతాంతరమున సంశ్లేష ముండదు. ఇట్లు సంశ్లేషము వికల్ప మని యర్థ మగుచున్నది. కావున సంశ్లేషము రానిపక్షమునందు కృష్ణన్ దేవునిగా ననియె యుండును. ఇట నకార మెట్టి వికారమును బొందక సహజస్థితిలో నున్నది గావున దీనిని స్వత్వ మనవచ్చును. కాని యీ స్వత్వ

1. సంయోగశ్చాలుకి కణ్వ స్య. ఆం.కౌ.సంధి. 33
అలుకిచ సంశ్లేష స్స్యాత్. ఆం.శ.చిం.సంధి.26.

సంశ్లేషములకు లిపి యందు మాత్రమె గాని యుచ్చారణమున భేదము గానరాదు. అందుకే సంశ్లేషము మతాంతరముగాఁ జెప్పఁబడిన దేమో.

ఇట్లు నకారమునకు సంశ్లేషము హల్లు పర మైనపుడె యని స్పష్టము. కాఁగా నచ్చు పర మైనపుడు నకారమునకు సంశ్లేషము ప్రాప్తించుటయె లేదు. అయ్యును 'లుక్సంశ్లేషౌ నాచి ద్రుతస్య' యను సూత్రమున నచ్పరకతలో సంశ్లేషమును నిషేధించుట విశేషము. అట మీఁద హల్లు లేదు గావున మఱి యొక నకార మై సంశ్లిష్ట మగుట యనఁగా ద్రుతద్విత్వ మని చెప్పి యది నిషిద్ధ మైన దందురు. ద్రుతద్విత్వమైనను బ్రాప్తింపకయే నిషేధించుట కొన్నియెడల నంగీకరించుట కని ప్రౌఢవ్యాకర్త చింతామణి విషయమున నభిప్రాయపడెను.

## 43. న పరుషే పుష్పదన్తస్య.

పుష్పదన్తస్య = పుష్పదంతుని మతమునందు, పరుషే = పరుషము పర మగుచుండఁగా, న = పూర్వోక్తము లగు కార్యములు 'లేవు'. అనఁగా 'నో హలి వా యని చెప్పఁబడిన లోపమును, సంశ్లేషో రావణస్య యని చెప్పఁబడిన సంశ్లేషమును లే వని యర్థము.

వి. పరుషాక్షరే పదాన్తస్య నస్య న లుక్ స్యాత్పుష్పదన్త స్య మతే. వచ్చె కమలాక్షుఁడు, చూచె చంద్రుఁడు, తెచ్చె టంకాయుధుఁడు, తలంచె తామరసాక్షి ఇచ్చె పరమాత్ముఁడు, ఇతి తున.

పరుషవర్గములు పర మగుచుండఁగా దానికిఁ బూర్వమునం దున్నపదముచివరి నకారమునకు లోపము రాదు. 'వచ్చెన్ + కమలాక్షుఁడు' అనుచో కకారము హల్లు పర మగుచుండఁగా 'నోహలి వా' యను సూత్రముచేఁ బ్రాప్తించుచున్న నకార లోప మా కకారము పరుష మగుటచే నీ సూత్రముచే రాదు. కావున వచ్చె కమలాక్షుఁ డనుతీరుగా నకారము లోపించిన రూప ముండదు. ఇట వివృతియందు వరుసగాఁ బరుషము లన్నింటికి నుదాహరణములు చూపఁబడినవి. 'సంశ్లేషోరావణస్య' యను సంశ్లేషము రావణునిమతముగాఁ జెప్పఁబడినది గావునఁ బరుషపరకతలో నకారమునకు సంశ్లేషమును రా దను నంశము ప్రత్యేకముగాఁ జెప్పవలసిన యవసరము లే దనవచ్చును. అందుకే వివృతియందు లోపము రా దనియె చెప్పఁబడినది. సంశ్లేష మెట్లును లే దని యభిప్రాయము.

వి. కిఞ్చ సూత్రే 'హలి' త్యుక్తత్వా ద్ద్రుతస్య పరుషాక్షరే పరే లోపే ప్రాప్తే పతి, -పరనిత్యాన్తరఙ్గాపవాదానముత్తరోత్తరం బలీయ ఇతి న్యాయేన పుష్పదన్త సూత్రస్య ప్రబలత్వాత్తస్మిన్ పరే నకారస్య న లుక్ స్యాదితి బోద్ధవ్యమ్.

'నో హలి వా' యను సూత్రమున 'హలి' యని సామాన్యముగాఁ జెప్పుటచే నే హల్లు పర మై నను నకారమునకు లోపము రావలసినదే. కాఁగాఁ బరుషములును హల్లులే యగుటచే నవి పరముగా నున్నను నకారమున కా సూత్రముచే లోపము ప్రాప్తించుచున్నది. అయినను పరనిత్యాన్తరంగాపవాదానాముత్తరోత్తరం బలీయః'అను న్యాయము ననుసరించి తరువాతఁ జెప్పఁబడిన యీ పుష్పదంతునిసూత్రము బలీయ మగుటచేఁ బ్రస్తుతసూత్రము ననుసరించి పరుషపరకతలో నకారమునకు లోపము రా దని గ్రహింపవలయును.

కాని 'పోయె కరుణ లేక' యనుచోఁ బ్రాసస్థానమున నథర్వణుఁడు తనభారతములోఁ బరుషపరకతలో నకారమునకు లోపము చేసెను. చేయకున్నఁ బ్రాసభంగము.

పరుషపరకతలో ద్రుతము లోపింపకుండుట తనకు నిష్టమె యగుట 'న పరుషే' యని మాత్రమె చెప్పక పుష్పదంతునిఁ బ్రస్తావించుట పూజ్యతాసూచనమున కని గ్రహింపవచ్చును.

## 44. బిన్దు స్సోమచన్ద్రస్య.[1]

సోమచన్ద్రస్య = సోమచంద్రుని మతమునందు, హలి = హల్లు పర మగుచుండఁగా, నః = నకారమునకు, బిన్దుః = బిందువు వచ్చును. నో హలి వా యను సూత్రమునుండి నో హలి యనునవి యిచట కనువర్తించును.

వి. పదాన్తస్య ద్రుతస్య పూర్ణ బిన్దు స్స్యా ద్ధలిపరే
సోమచన్ద్రస్య మతే. రాముం జానకీ పతిన్,
కృష్ణం దయానిధిన్, నృపతిం మూర్ధన్యునిన్, హరిం
లోకేశ్వరున్, విష్ణుం బరమున్, నిన్నుం భూషింతున్.

హల్లు పరముగా నున్నపుడు పదముతుది నున్నద్రుతమునకుఁ బూర్ణబిందువు వచ్చు నని సోమచంద్రుని మతయు. అనఁగా లోపము, రావణుని మత మందలి సంశ్లేషములతోపాటు, సోమచంద్రుని మతము ననుసరించి పూర్ణ బిందువు సైతము వచ్చును. బిందు వని సామాన్యముగాఁ జెప్పఁబడినను నిచ్చటఁ బూర్ణబిందువె గ్రహింపఁబడునది. సిద్ధస్సోమచన్ద్రస్య (సంధి.27) యని చెప్పినట్లుగా నిచటఁ గూడ సిద్ధ మని పేర్కొన్న స్పష్టముగా నుండెడిది. 'ప్రథమావైభక్తికయో ర్బి న్దుశ్చ మహాన్' అనుచో మహాన్ బిన్దుః అన్న చింతామణి, బిన్దుం

1. బిన్దుశ్చా చార్యాణామ్. (ఆం.కౌ.సంధి.34)
బిన్దురిష్యతే హలి వర్ణేషు. (త్రి.శ.2.27)
హ్రస్వాద్బిందుశ్చ. వై.చం.సంధి.27
బిన్దుంప్రవదన్తి తంక్వచిత్కేచిత్. ఆం.శ.చిం.సంధి.-27

ప్రవదన్తి తం క్వచిత్కేచి త్తను మొదలగుచోట్లఁ గేవలము బిందు వనియె చెప్పుట స్మరింపఁదగును.('సిద్ధాచ్చ' (సంధి 45) యను తరువాతఁజెప్పఁబోవు సూత్రమును బట్టి యిట బిందు వనఁగాఁ బూర్ణమె యని చెప్పుట కవకాశము కొంతమేర గలదు.)

రామున్+ జానకీ పతిన్ అనుచో 'నో హలి వా' యని లోప మైన రాము జానకి పతిన్, 'సంశ్లేషోరావణస్య' యని సంశ్లేష మైన రాము న్జానకీపతిన్, ప్రస్తుత సూత్రముచేఁ బూర్ణబిందు వయిన రాముంజానకీపతిన్ అను రూపము లేర్పడును.

'సోమచన్ద్రస్య' యనుటను బట్టి పూర్ణబిందు వొకపక్షమునె యగును. కావున మతాంతరమునఁ బూర్ణబిందువు లేదు. అపుడు స్వత్వముతో రామున్ జానకీ పతిన్. ఇట్లు సరళ స్థిరపరకతలో లోపము, సంశ్లేషము, పూర్ణబిందువు, స్వత్వము అతోనయిదు రూపములు గలుగును.

'హలి' యని సామాన్యముగాఁ జెప్పుటవలననే హల్లు పర మైనను బూర్ణబిందు వగును. అందుకే వివృతియందును, నృపతిం మూర్ధన్యు, హరిం లోకేశ్వరు నని స్థిరపరకతలోను బూర్ణబిందు వుదాహరింపఁబడినది, కాని వర్గయుఙ్మకారేతరస్థిరపరకతలో ద్రుతమునకుఁ బూర్ణబిందువు పెక్కురు లాక్షణికు లంగీకరింపలేదు. హరింలోకేశ్వరు ననురీతి రూపములు కవి ప్రయోగములందు వెదకిన దొరుకు నేమో చెప్పఁజాలము. నృపతిం మూర్ధన్యున్-కూడ విశేషమె.

పరుష పరకతలో నీ సూత్రముచేఁ బూర్ణబిందువు రాఁగా విష్ణున్ + పరమున్ = విష్ణుం + పరమున్ అని కాఁగా 'సిద్ధాచ్చ' యను సూత్రముచే సరళమై విష్ణుంబరమున్ అని యగును.

వి. హలి కిమ్ ? రాము నాశ్రయింతున్ – నేహ.

'హలి' యనుటవలనఁ బర్ణబిందువు హల్లు పరమయినపుడే యగును. కావున హల్భిన్న మనఁగా నచ్చు గాని యవసానము గాని పర మైనచోఁ బూర్ణబిందువు రాదు. రామున్ + ఆశ్రయింతు = రాముంఆశ్రయింతు నని కాదు 'లుక్సంశ్లేషా నాచి ద్రుతస్య' యను సూత్రము ననుసరించి రాము నాశ్రయింతు నని యగును.

అచ్పరకతలో బిందువు ప్రాప్తింపకుండఁగా 'లుక్సంశ్లేషానాచి ద్రుతస్య' యను సూత్రము బిందువును నిషేధింపలేదు. కాని 'నోహలి వా' యన్న సూత్రముచే హల్లు పరమైనపుడు చెప్పిన లోపమును మాత్ర మచ్పరకతలోఁ బ్రాప్తింపకయు నిషేధించినది.

వివృతియందు నకారమును ద్రుతముగా వివరించుట గమనింపఁదగును.

## 45. జశ్త్వం పరుషస్య.[1]

పరుషస్య = ఆ నకారమునకుఁ బరముగా నున్న పరుషమునకు, జశ్త్వమ్ = జశ్త్వ మగును. 'నోహలి వా' యను సూత్రము నుండి 'నః' అనునది యనువర్తింపఁజేసిన నయ్యది పంచమ్యంతముగా 'నకారముకంటెఁ బరముగా నున్న' ('తస్మాదిత్యుత్తరస్య' యను పాణినీయ పరిభాషననుసరించి) యని యర్థ మిచ్చును. జబగడదశ్ అను మాహేశ్వర సూత్రమును బట్టి జశ్ ప్రత్యాహారముచే జబగడదలు బోధింపఁబడును. వీని కిట సరళము అను సంజ్ఞ విధింపఁబడినది. కాఁగా జశ్శు లనఁగా సరళము లని యర్థ మగును.

వి. పదాన్తాద్ద్రుతాత్పరస్య పరుషస్య జశ్త్వం (వా) స్యాత్.

కృష్ణున్ గంజాక్షున్, రామున్ జంద్రవదనున్,

భార్గవ్యున్ డంకాయుధున్, దేవున్ దలఁతున్.

పదముతుది నున్న ద్రుతము (నకారము) కంటెఁ బరమై యున్న పరుషములకు సరళము లగును. కచటతపలకుఁ గ్రమముగా గజడదబ లగు నని గ్రహింపఁదగును.

కృష్ణున్ + కంజాక్షున్ అనుచో నీ సూత్రముచే కకారమునకు గకారమై కృష్ణున్ గంజాక్షున్ అని యగును. ఇట్లే యితరములు. వివృతిలో విష్ణుం బరమున్ అని పకారమునకు బకార మగుట పూర్వసూత్రమునొద్ద నుదాహరింపఁబడినది.

ఇట వివృతియందు జశ్త్వం 'వా' స్యా త్తని 'వా' శబ్దము గానవచ్చుచున్నది. కాని కృష్ణున్ కంజాక్షు ననురీతి రూపములు లేకపోవుటను బట్టియును, అట్టిరూపము లిట వివృతియందు నుదాహరింపకుంటం బట్టియును 'సిద్ధాచ్చ'యను తరువాత సూత్రము వివృతిలో నీ 'వా'శబ్దము లేకుండుటను బట్టియును, నిచ్చట వవృతియందుఁ గన్పించు 'వా' శబ్దము ప్రమాద పతితమని నిశ్చయింపఁదగును. ద్రుతముపైఁ బరుషములకు సరళాదేశము నిత్యమె.

## 46. సిద్ధాచ్చ.[2]

సిద్ధాత్ చ = పూర్ణబిందువు కంటెఁ బరముగా నున్నను, పరుషస్య = పరుషమునకు, జశ్త్వమ్ = సరళము లగును. జశ్త్వం పరుషస్య యను పూర్వసూత్ర మిందన్వయించును.

---

1. జశ్త్వం చ వర్గాద్యానాం తతఃపరం. (త్రి.శ.2.28)
   ద్రుతేన ఆదే స్తృతీయః. (ఆం.కౌ.సంధి.24)
   ద్రుతాత్పరలాః పరుషాణామ్. వై.చం.సంధి.26
   పరుషాద్రుతప్రకృతికాత్సరళాస్స్యుః. ఆం.శ.చిం.సంధి 21.
2. తతఃపరమ్? (త్రి.శ.27)
   అనుస్వారాచ్చ. (ఆం.కౌ.సంధి.35)

వి. ద్రుతప్రకృతిక నకార సంబన్ధిన స్సిద్ధబిన్దోః పరస్య పరుషస్య జశ్త్వం స్యాత్. రాముం గరుణానిధిన్, కొలుతుం జంద్రమౌళిన్, భాస్కరుం డంకాయుధున్, హరిం దలంతున్, పొగడుదుం బుణ్యశ్లోకుని ఇత్యాది.

ద్రుతప్రకృతికమునకుఁ జెందిన నకారమున కాదేశముగా వచ్చినట్టి పూర్ణబిందువునకుఁ బరముగా నున్న పరుషములకును సరళము లగును.

రామున్ + కరుణానిధిన్ అని యుండఁగా 'బిన్దుస్సోమచన్ద్రస్య' యను సూత్రముచే ద్రుతమునకుఁ బూర్ణబిందువు రాఁగా రాముం + కరుణానిధిన్ అని యగును. ఇపుడు సిద్ధము (పూర్ణబిందువు) నకుఁ బరముగా నున్న పరుషమునకు నీ సూత్రముచే సరళ మాదేశము కాఁగా రాముం గరుణానిధిన్ అని యగును. ఇట్ల యితరోదాహరణముల గుర్తింపఁదగును.

సిద్ధ మనఁగాఁ బూర్ణబిందువు. 'బిన్దుర్ద్వివిధ' యను సూత్రమున నిది స్పష్టము. ఇచ్చట సిద్ధాత్ అని పూర్ణబిందువు ప్రస్తావింపఁబడుటచే బిన్దు స్సోమచన్ద్రస్య యను సూత్రముచే నగు బిందువు పూర్ణమె యని గుర్తింప వీలు గలదు. కాని యట బిందు వనఁగా ఖండపూర్ణములు రెండును నగుననియు, నందుఁ బూర్ణబిందువునకుఁ బర మైనపుడు మాత్రమె పరుషములు సరళము లగుట నుద్దేశించి యిట్లు చెప్పె ననియుఁ గావున నచట సిద్ధాత్తన్నాఁడు గావున నిచటఁ బూర్ణబిందువే యగు నని చెప్పరా దనియు నూహింపవచ్చును. దానికిఁ దగిన ప్రత్యుత్తరము లభింపదు. దీనివలన రాముఁగంజాక్షు, రాముఁగారవింతు ననురీతిగా నపరూపములు మాత్రము సాధింపఁబడును. కావున బిందు వనఁ బూర్ణబిందు వని సూత్రకర్త యభిప్రాయముగాఁ జెప్పుట యుచిత మనుట యుత్తమ మార్గముగాఁ దోఁచుచున్నది.

ద్రుతముపయి నొకసారి ద్రుతమున కయిన పూర్ణబిందువుపై నొకసారి రెండు పర్యాయములు సరళాదేశమును విధించుటలో గౌరవమె గానవచ్చుచున్నది. ద్రుతముపైఁ బరుష మల్లె యుండుట యెపుడును లేదు కావున సాధారణముగా ద్రుతప్రకృతికముపైఁ బరుషము సరళ మగుట నొక్క సూత్రము ననే చెప్పుటలో లాఘవము గలదు. చిం.లో నిట్ల యున్నను ఆం.కౌ. మఱల రెండు సార్లు చెప్పు టేలకో అనవసరమే.

ఇంక సరళస్థిరపరకతలో వలెఁ బరుషపరకతలో ద్రుతమున కలుసున్న యీ వ్యాకరణము ననుసరించి సాధింపఁబడుట యెట్లో స్పష్టము గాకున్నది. 'హో త్సిద్ధసాధ్యౌ' యను దానింబట్టి రాముం గంజాక్షు, రాముఁగంజాక్షు నన్నవి రెండును సాధింపఁబడు నని యూహింత మన్న రాముం గారవింతు, రాముఁ గారవింతు నన్నపు డతివ్యాప్త మై యనర్థ మేర్పడు చున్నది. కాఁగా నిప్పటి కీ వ్యాకరణముచే రాముఁగంజాక్షు ననురీతిరూపము లనఁగాఁ బరుషపరకతలో ద్రుతమునకు ఖండబిందు వసాధ్యముగ నున్న దనక తప్పదు.

అం.కౌ. ముందు సరళములను విధించి పిదప నస్య వా బిన్దుశ్చ (సంధి.25) యని యాదేశ సరళ పరకతలో బిందువును విధించినది. అయ్యు మఱల ననుస్వారాచ్చ యనె. ఇది కేవల మనవసరము గదా.

## 47. సే నేర్వా లుక్.

సే = సమాసమునందు, నేః = నివర్ణమునకు, వా = వికల్పముగా, లుక్ = లోప మగును.

'సస్సమాసః' అను ప్రాకృత వ్యాకరణ సూత్రమును బట్టి సమాసమునకు 'స' యని సంజ్ఞ. ప్రాకృత వ్యాకరణమునుండి పెక్కు సంజ్ఞ లిందు వివరింపఁబడినవి. (ఇది సంస్కృతమునను గలదు). 'స' యను సంజ్ఞ మాత్ర మిందుఁ జెప్పఁబడకుండుటచే 'ననుక్త మన్యస్మా' (పరి. 2) అను లక్షణము ననుసరించి ప్రాకృతవ్యాకరణమునుండి దీనిని గ్రహింపవలయును. కాక పూర్వము లగు కణ్వాది వ్యాకరణములం దుక్త మయియున్న నందుండి గ్రహింపవలె.

వి. సమాసే మహతః ప్రకృతి నివర్ణ కస్య వా లుక్ స్యాత్. రాముని కోడలు – రాము కోడలు. శంకరుని రాణి – శంకరు రాణి, కృష్ణుని చెల్లెలు – కృష్ణు చెల్లెలు.

సమాసమునందు మహత్తులకుఁ జెందిన ప్రకృతిసంజ్ఞ గలిగిన నివర్ణమునకు వికల్పముగా లోపము వచ్చును. మహత్తునకుఁ జెందినప్రకృతి నివర్ణక మన్నది వివృతి యందలి విశేషము.సూత్రమున దీని కాధార మస్పష్టము.

రాముని (యొక్క) కోడ లనుచో నీ సూత్రముచే 'ని' వర్ణము లోపించిన రాముకోడ లని యగును. 'వా' యనుటచే నివర్ణకము లోపింపని పక్షమునందు రామునికోడ లని యగును. ఇట్లె దశరథేశ్వరు కోడలు, దశరథేశ్వరుని కోడలు, రాము భార్య, రాముని భార్య మొ॥.

వి. మహతః ప్రకృతి నివర్ణ కస్యేతి కిమ్? రంగని కోడలు, రంగకోడలు ఇతి న. కిఞ్చ రామాయణే –
ఏజనకాత్మజన్ దశరథేశ్వరు కోడల రాము
భార్యఁ జూండో జనులార – ఇతి.

రామాయణము నందలి దశరథేశ్వరుకోడల, రాముభార్య నన్నవి 'సేనేర్వాలు' క్కను నీ సూత్రము చే (రాముకోడ లనుచో వలె) నివర్ణము లోపించిన దనుట స్పష్టమే. అందు లక్షణవిరోధము లేదు.

మహత్తులయొక్క ప్రకృతినిక్షర్ణకమునకు లోపము వచ్చు ననుటచే రంగని (యొక్క) కోడలు మొదలగుచోట్ల 'ని' లోపము లేదు. కావున 'రఙ్గకోడ' లను రీతి రూపము లుండవు. ఇవి పుమ్మహత్తులుగాఁ జెప్పబడినట్లు దోఁచు.

'ఉన్నిలాదిః ప్రకృతిః' అని (శబ్ద.48) నివర్ణకమునకుఁ బ్రకృతి యని యిందు విశేషముగా సంజ్ఞ చెప్పఁబడినది. కాని యిది నిత్యము గాదు. మువర్ణకాదులు నిత్య ప్రకృతులుగాఁ (శబ్ద.49) జెప్పఁబడె. 'నటాదౌనిః కణ్యస్య'. (శబ్ద.40) కాన 'ని'వర్ణకము వికల్పమగుట సమాసమున దీనికి లోపము చెప్పి రాముకోడ లన్నవానిని సాధింప నవసరము గానరాదు. పరిశీలింపవలెను.

## 48. నుమచ్యుతః షష్ఠ్యాః.[1]

సే = సమాసమునందు, షష్ఠ్యాః = షష్ఠ్యంతమగు శబ్దముయొక్క,ఉతః = హ్రస్వ మగు నుకారమునకు, అచి = అచ్చు పర మగుచుండఁగా, నుమ్ = నుమాగమ మగును. 'సే నేర్వాలుక్' అను పూర్వసూత్రమునుండి 'సే' యనున దిట ననువర్తించును.

వి. సమాసే షష్ఠ్యర్థక పదస్యోకార స్యాచి పరే
నుమాగమ స్స్యాత్. రాజునాజ్ఞ, చెఱకునడవి ఇత్యాది.

సమాసమునం దుదంత మగు షష్ఠ్యర్థక శబ్దమున కచ్చు పర మయినపుడు నుమాగమము వచ్చును. రాజు (యొక్క) ఆజ్ఞ = రాజునాజ్ఞ మొ॥

'నుమ్' ఆగమమున మకార మిత్తు. కావున నది లోపించును. మిగిలిన నువర్ణమునందు 'ఉ'కార ముచ్చారణ సౌకర్యమునకయి చేర్పఁబడినది. కాఁగా మిగిలిన నకారపుఁబొల్లు మాత్రమె యాగమ మగును. మకార మిత్తుగాఁ గలది గావున నిది యిత్తు అగుటచే "మిదచోఽన్త్యాత్పరః' అను పాణినీయపరిభాషననుసరించి విధించిన దానిలో చివరియచ్చునకుఁ బరముగా నగును. ఇట ఉత్తునకు విధింపఁబడినది గావున నుత్తునకుఁ బిదపఁ జేరును. ఈ నుమాగమ విధి యుత్వసంధి కపవాదము. కావున నుత్వసంధిని బాధించి నుమాగమము వచ్చును.

రాజు (యొక్క) + ఆజ్ఞ = ఇచ్చట నుత్తున కచ్చు పర మయినది గావున 'నిత్యము తోఽచి' యను సూత్రముచేఁ బరరూపము రావలసియుండఁగా దానిని బాధించి యీ సూత్రముచే నుమాగమము రాఁగా రాజున్ + ఆజ్ఞ = రాజునాజ్ఞ యని యగును. ఇట్లే

---

1. నుమచ్చుత షష్ఠ్యా స్సమాసే. (ఆం.కౌ.సంధి.23)
షష్ఠ్యుతోఽచి నుమ్సే. ఆం.శ.చిం.సంధి. 17
నుమ్ సమాసే. వై.చం.సంధి.16

చెఱకునడవి మొ॥.

నుమాగమము నిత్యముగాఁ జెప్పఁబడుటచే చెఱ కడవి మొదలగురీతిగా నుమ్ము రాని రూపములు సాధువులు గాదు. కాని కొన్ని యెడల నిట్టివి గలవు. అరుదయిన యట్టి స్థలము 'లాగమశాస్త్రమనిత్య' మ్మను న్యాయము ననుసరించి నుమాగమము రాకుండుటవలన సంధిమై యేర్పడుచున్నట్లు గ్రహింప వీలు గలదు.

'అచి' యనుటచే హల్లు పర మైనచో నుమాగమము లేదు రాముకోడలు.

'ఉతః' అనుటచే ననుదంతములకు నుమాగమము రాదు. రమ (యొక్క) ఆజ్ఞ = రమయాజ్ఞ. హరియానతి, పదినెయాదరము, గ్లౌముందము మొ॥

'షష్ఠ్యాః' అనుటచే నితర సమాసములందు లేదు. కాఱు + అడవి = కాఱడవి మొ॥.

## 49. వా హలి కర్మధారయే. [1]

కర్మధారయే = కర్మధారయసమాసమునందు, హలి = హల్లు పర మగుచుండఁగా, ఉతః = హ్రస్వమయిన యుకారమునకు, వా = వికల్పముగా, నుమ్ = నుమాగమ మగును. 'నుమచ్యుతః షష్ఠ్యాః' అను పూర్వసూత్రమునుండి 'నుముతః' అనుపదము లిం దనువర్తించును.

వి. కర్మధారయ సమాసే వికల్పేన నుమాగమస్స్యా దుదన్తస్య హలి పరే. చిగురుకైదువు – చిగురుంగైదువు, చెఱకు వింటి దొర – చెఱకువ్వింటి దొర, ఊరుకాయలు – ఉరుంగాయలు.

కర్మధారయసమాసమునం దుదంతమునకు హల్లు పరముగా నున్నపుడు వికల్పముగా నుమాగమ మగును. నుమ్ములో మకార మిత్తు. ఉకార ముచ్చారణార్థ మిత్తయిన నకార ముదంతము శబ్దము తుది యుత్తునకుఁ బరముగాఁ జేరును.

చిగురు+కైదువు అనుచో నీ సూత్రముచే నుగామము వచ్చి చిగురున్ + కైదు వని కాఁగా, 'బిన్దుస్సమచన్ద్రస్య' యని పూర్ణబిందువును, సిద్ధాచ్చ యను సూత్రముచే మీఁది పరుషమునకు సరళమును రాఁగా చిగురంగైదు వని యగును. 'వా' యనుటచే నుమాగమము రానిపక్షమునందు 'చిగురుకైదు' వని యట్లే యుండును.

---

1. క్వచిద్ధలివిభక్త్యుత్వాతోనుమ్. (ఆం.కౌ.సంధి. 39)
సరళ పరుషయోరుతో నుమ్ స్యే. వై.చం.సంధి. 40
నుమ్వోతః. ఆం.శ.చిం.సంధి. 31
నుమ్వాలోః హల్యథర్వణాచార్యమతే. (అప్ప.చిం)

'హలి' యనుటచే నచ్చు పర మైనపుడు నుమాగమము లేదు. కాఱడవి మొ॥

'కర్మధారయే' యనుటచేఁ గర్మధారయేతరసమాసములలో నుమాగమము లేదు. ఆలుబిడ్డలు మొ॥

ఇది యుదంతములకె కావున ననుదంతములకు నుమాగమము లేదు. సన్నబియ్యము.

సింగపుంగొదమ, కుందనపుందావి మొదలగు స్థలములను బట్టి షష్ఠీతత్పురుషములందు నుమాగమ మంగీకరింపఁదగియున్నది.

ఇంక నిచ్చటివిశేషములు రెండు గుర్తింపఁదగియున్నవి. 'చిగురుకైదువు', ఊరుకాయలు మొదలగు రీతిగా నుమాగమమురాని రూపము లుండునా? తరువాత లాక్షణికులు నుమాగమము నిత్య మనియె భావించిరి.

'హలి' యని సామాన్యముగాఁ జెప్పుటచే చెఱకువ్వింటిదొర యని స్థిరపరకతలోను నుమాగమ మంగీకరింపఁబడినది. 'సరళే పరుషే చైవ సమాసే నుముతో భవే' త్తని వికృతివివేకము పరుష సరళములు పర మైనపుడు మాత్రమె యగు నని పేర్కొన్నది. ఇట్లే చెప్పిన సూరి 'ఈ యాగమం బొకానొకచో స్థిరంబు పరం బగునపుడును గానంబడియెడి' నని పేర్కొని గరువపునుస్మరు వని చూపెను.

దీనిని బట్టి సూత్రమునందలి 'వా' శబ్దమునకుఁ బరుషసరళపరకతలో నిత్యముగా నగుటయు, స్థిరపరకతలో నరుదుగామాత్రమె యగుటయు నను నంశములు వ్యవస్థ చేసికొను వీలుగలదు. కాని వివృతియందు చిగురుకైదు వని యుదాహరింపఁబడుట ప్రయోగానుగుణ మై యుండ లేదనవచ్చును.

కర్మధారయమునఁ బూర్వపదము త్రికస్త్రీసమముగంతధాతుజ విశేషణములె యవును. ముగంతములును, ధాతుజవిశేషణములును దత్సమములు గావచ్చును. సరసపుఁ 'గోరిక ఇత్యాదు లిష్టములే. ఇఁక ఊరుఁగాయలు గూడ నిట నుదాహరింపఁబడుటచే రంజిల్లుఁగాంత మొదలగువాని కవకాశము గలుగును. చేయుకొడుకు ఇత్యాదిగా నచ్చతెనుఁగులకు నీ కార్యము లేదు. కాఁగా ధాతుజవిశేషణముల కాచ్ఛికములకే యగుటయు నది యరుదుగా నగుటయు 'వా' శబ్దముచే నియమించుకొనఁదగును.

## 50. టుగచి. [1]

కర్మధారయే = కర్మధారయ సమాసమునందు. అచి = అచ్చు పర మగుచుండఁగా, ఉతః = హ్రస్వమైన యకారమునకు, టుక్= టుగాగమ మగును. 'సమచ్యుతఃషష్ఠ్యాః' అను ప్రపూర్వసూత్రమునుండి క్రమముగా ఉతః అనునదియును, 'హా హలి కర్మధారయే' యను పూర్వసూత్రమునుండి 'కర్మధారయే' యనునదియు నిం దనువర్తించును.

వి. ఉదన్తస్యాచి పరే కర్మధారయ సమాసే టుగాగమ స్స్యాత్. మెఱుఁగుటందెలు, కఱకుటమ్ములు, పట్టపు టేనుఁగు. నిగ్గుటద్దము, చివురుటాకులు.

కర్మధారయమున్నం దుత్తున కచ్చు పర మగునపుడు టుగాగమము వచ్చును. 'టుక్' అను నాగమములో 'క్'కార మిత్తు. టు వర్ణము నందలి యుకార ముచ్చారణ సౌకర్యమునకై చేర్పఁబడినది. కావున నదిలోపింపఁగా టకారపుఁ బొల్లు మాత్రమే యాగమమగును. కకార మిత్తుగాఁ గల దగుటచే నీ టకారము కి త్తయినది గావున 'ఆద్యన్తౌ టకితౌ' యను పాణినీయపరిభాషననుసరించి యుదంతముల కంత్యావయవముగా ననఁగా నుదంతములకుఁ బైని వచ్చి చేరు నని గ్రహింప వలయును. 'నిత్యముతోఁ చి' యనుదాని కిది యపవాదము.

మెఱుగు + అందె లని యుండఁగా నుత్తున కచ్చుపర మయినది గావున 'నిత్యముతోఁ చి' యని రావలసిన పరరూపమును బాధించి ప్రస్తుతసూత్రముచే టకారము చేరఁగా మెఱుఁగుట్ + అందెలు = మెఱుఁగు టందె లని యగును. ఇట్లే యితరములు గుర్తింపఁదగును.

వి. లోకే పట్టపేనుఁగు, గోరంచు ఇత్యాది ప్రయోగాః అలక్షణాద్గ్రామ్యా ఏవ. అపి చ శిష్టప్రయోగబాహు ల్యాన్నిర్భయేన ప్రయోక్తవ్యా ఏవ.

పట్టపేనుఁగు, గోరంచు మొదలగు ప్రయోగములు లక్షణవిరుద్ధము లగుటచే గ్రామ్యములే యైనను శిష్టప్రయోగములందుఁ దఱచుగా నుండుటచే నిర్భయముగాఁ బ్రయోగింపఁదగినవే.

'టుగచి' యని సూత్రమునందు టుగాగమము నిత్యముగాఁ జెప్పఁబడినది. కావున టుగాగమము రాకుండుట కవకాశము లేదు. పట్టపేనుఁగో, గోరంచు మొదలగుచోట్ల నిత్యమైన యీ టుగాగమము చేయకపోవుటచేత నవి లక్షణవిరుద్ధము లగుచున్నవి. కావున

---

1. టుగచ్యు తః కర్మధారయే. (ఆం.కౌ.సంధి. 41)
   టుక్స్యా మావాది కరణ్యే. వై.చం.సంధి.18
   సామావాదికరణ్యేసూదన్తానాంటుగాగమోఽచి స్యాత్.ఆం.శ.చిం.సంధి.33

'అలక్షణం చ' యను సూత్రముచే నయ్యవి గ్రామ్యములే యగును. గ్రామ్య మయినచో 'స న్దర్గం చ' యను లక్షణమును బట్టి కావ్య ప్రయోగమునకుఁ దగవు. అయినను నీ గ్రామ్యములు మహాకవి ప్రయోగములందుం దఱచుగా నుండుటచేఁ బ్రయోగార్హములే యగు నని భావము.

ఇట్లు మహాకవి ప్రయోగములం దుండుట గుర్తించియును, నయ్యవి ప్రయోగార్హములే యని తలఁచుచును గూడ వానిని లక్షణ బద్ధములు చేయక విడుచు టేలకో యర్థము గాదు. పూర్వులు చెప్ప లేదనియో లేక, సూత్రవివృతి కారులు భిన్నులో పరిశీలింపవలయును. ఆగమశాస్త్ర మనిత్య మ్మనున్యాయము నహోబలుఁ డుపయోగించెను. (కవిశి.257)అచి యనుటచే హల్లు పర మైనచో టుగాగమము లేదు. చిగురుసాగసు మొ||.

ఇది యుదంతములకె కావున ననుదంతములకు టుగాగమము రాదు. పెద్దయిల్లు మొ|| పడకటిల్లు, దుక్కిటెద్దు, తేనెటీఁగ ఇత్యాదులు ననుదంతములపై టుగాగమ మరుదుగా గోచరించును.

కర్మధారయే యనుటవలనఁ గర్మధారయేతరస్థలములందు టుగానము లేదు. 'చిగు రెట్టు వైయున్నది' మొ||

షష్ఠీతత్పురుషసమాసములందు మాత్రము టుగాగమము గన్పించుచున్నది. వేల్పుటావు మొ||

కాఱడవి ఇత్యాదులఁ గర్మధారయమందును టుగాగమ మసలు లేకుండుటను విమర్శకులు గుర్తించి యున్నారు.

'వా హలి కర్మధారయే' యను సూత్రము నుండి 'వా' శబ్దము ననువర్తింపఁజేసిన 1. 'నిగ్గుటద్ద మిత్యాదులకు నిత్యముగా నగుటయు, 2. చివురుటా కిత్యాదులకు వికల్పముగా నగుటయు, 3. కాఱడవి యిత్యాదులకు నసలు లేకుండుటయు సంగ్రహిం పఁబడు నవకాశ ముండెడి దని తోఁచును.

అపుడు షష్ఠీ తత్పురుషములందున్న ననుదంతములపై నరుదుగా నుండుట విశేషములె యగును.

## 51. వః పబయోరాదేః.[1]

ఆదేః = ప్రథమావిభక్తి కంటెఁ బర మయియున్న, పబయోః = పకార బకారములకు, వః = వకార మగును.

వి. ప్రథమావిభక్తేః పరయోర్దేశ్యానామాది పబయో
ర్వస్స్యాత్. రాముఁడు పల్కె - రాముఁడు వల్కె,
కృష్ణుఁడు బల్లిదుఁడు - కృష్ణుఁడు వల్లిదుఁడు.
హరిపుట్టె - హరివుట్టె ఇత్యాది.

ప్రథమావిభక్తి కంటెఁ బర మయియున్న దేశ్య శబ్దము మొదటి పకార బకారములయొక్క స్థానమున 'వ' కార మాదేశ మగును.

రాముఁడు + పల్కె నని యుండఁగా నీ సూత్రముచే పకారమునకు వకార మై రాముఁడు వల్కె.

కృష్ణుడు + బల్లిదుఁడు కృష్ణుఁడు వల్లిదుఁడను చో బకారమునకు వకారము మయినది.

వి. దేశ్యానామాది పబయోః కిమ్? కృష్ణుఁడు బలవంతుఁడు.
నేహ వకారః.

దేశ్యశబ్దము మొదటి పబలకే వకార మగుటవలన సంస్కృత సమశబ్దము మొదటి పబలకు వకారము రానేరాదు. 'దేశ్యానామాది' యన్నది వివృతిలోని విశేషము. కృష్ణుఁడు బలవంతుఁ డనుచో కృష్ణుఁడు వలవంతుఁ డని వకారము రాదు.

బకారమునకు వకారము రాకుండుటకె వివృతి యం దుదాహరణ మీయఁబడినది. చింతామణ్యాదులను బట్టి పకారమునకు వకార మగుటలో బాధలేదు. రాజ్యశ్రీ వాలింపఁగ నను రీతిగా సంస్కృతసమముకంటెఁ బర మైన సంస్కృతసమాది పకారమునకు వకారము గనఁబడుచునె యున్నది. రాముఁడు పరమపావనుఁడు, రాముఁడు వరమ పావనుఁడను రీతిగాఁ గానరాదు. ఏ మైనను సంస్కృతసమము మొదటి పకారమునకు వకారము రానేర దని నిశ్చయింపరాదు. కాని దేశ్యశబ్దముల పకారమునకువలె సంస్కృతసమాది పకారమునకు వకార మగుట సాధారణము గా దని మాత్రము చెప్పవచ్చును.

---

1. వఃపబయోరాదేః. (ఆం.కౌ.సంధి.27)
   వత్వంచపబయోః. (త్రి.శ.2.29)

ఇంక నిట్లు చూడఁగా దేశ్యశబ్దము మొదటి బకారమునకు మాత్రము వకార మగుచున్నదా? కృష్ణుఁడు వల్లిదుఁ డని యిట నుదాహరింపఁబడినది. కాని యట్టిదానిని నిరూపింపఁగల కవిప్రయోగము మాత్రము మృగ్యము.

బకారమునకు వకారమును జెప్పుట విశేషమె.ఇది యవసర మని మాత్రము చెప్పఁజాలము.

ఆదేః అనుటచే రామునిగూర్చి పోయె మొదలుగా నితరస్థలముల నీ కార్యములేదు.

నిత్యముగాఁ జెప్పుటచే రాముఁడు పల్కె నని యుండునా? వివృతిలో జూపిన దుదాహరణ మగునా? విచార్యము.

## 52. సశ్చజయోః. [1]

ఆదేః = ప్రథమావిభక్తి కంటెఁ బర మయియున్న, చజయోః = చకార జకారములకు, సః = సకార మగును. 'వః పబయో రాదేః' అను పూర్వసూత్రమునుండి 'ఆదేః' అను దళమిం దనువర్తించును.

వి. ప్రథమావిభక్తి పరయో ర్దేశ్యనామాది చజయో

స్సస్స్యాత్. రాముఁడు సెప్పె. శివుఁడు సింక ధరించె.

ప్రథమావిభక్తి కంటెఁ బర మయియున్న దేశ్య శబ్దముల మొదటి చకారము యొక్కయు, జకారము యొక్కయు స్థానమున సకార మగును. ఇంతకుఁ బూర్వమున వలెనె యిచ్చటఁ గూడ 'దేశ్య నామాది ' యనుట వివృతి యందలి విశేషము.

రాముఁడు + చెప్పె ననుచో చకారమునకు సకారము రాఁ గా రాముఁడు సెప్పె యైనది. ఇచటఁ గూడ సకారము వికల్పముగాఁ జెప్పకుండుటచే సకారము రాని రూపమున కవకాశము లేదు. రాముఁడు చెప్పె నని యుండుట లక్షణ విరుద్ధ మగుచున్నది.

శివుఁడు + జింక యనుచో జకారమునకు సకార మై 'శివుఁడు సింక' యని యయినట్లు వివృతి యం దుదాహరింపఁబడినది. కాని యిట్టివి కవిప్రయోగ దృష్టములు.

బకారమునకు వకారము చెప్పుటవలెనె జకారమునకు సకారము చెప్పుటయును విలక్షణముగా నున్నది.

వి. దేశ్యనామాది చజయోః కిమ్? హరుఁడు చంద్ర

ధరుఁడు, హరి జగత్పతి, నేహ సకారః.

---

1. సశ్చజయోః. (ఆం.కౌ.సంధి.28)
సత్వంచజయోస్స్యాద్విభక్తితతః ప్రథమాయాః (త్రి.శ.29)

దేశ్యశబ్దము మొదటి చజలకు మాత్రమె సకార మగు ననుటవలన సంస్కృతసమశబ్దము మొదటి చజలకు సకారము రానేరదు. హరుఁడు చంద్రధరుఁడు, హరిజగత్పతి. హరుఁడు సంద్రధరుఁడు. హరి సగత్పతి యనుతీరుగా నిట చజలకు సకారము రానేరదు.

సంస్కృతసమము పైని సంస్కృతసమమందలి చకారమునకును సకారము వచ్చుటకుఁ దగిన ప్రయోగ ప్రామాణ్యము లభింప కున్నది. కావున తత్సమ చకారమునకు సకారము లే దనుట యొప్పుచున్నది. జకారమున కాచ్చికమునకును సకారము లేకుండుట ప్రసిద్ధమె. కావునఁ దత్సమ జకారమునకు లేకుండుట విశేషము గాదు.

దేశ్య మనునది సంస్కృత సమేతర మనునర్థమున నుపయోగింపఁబడుట గమనార్హము.

## 53 పరే చ.[1]

ఆదేః = ప్రథమావిభక్తి కంటెఁ బరమైన, పరే చ = ఇతరము లగు పరుషములకును నితరము లగు సరళము లాదేశ మగును. 'వః పబయో రాదేః' అను సూత్రమ్మునుండి 'ఆదేః' అనునది యనువర్తించును.

వి. అన్యేషాం దేశ్యానామాది పరుషాణాం ప్రథమావిభక్తేః పరతః పరే సరళాస్స్యుః. కృష్ణుఁడు గనుగొనె, తండ్రి గాచె, తమ్ముఁడు డెక్కియము దాల్చె, అన్న డాటోటు,తల్లి దప్పుగాచె, హరి దన్నె శకటము.

దేశ్య శబ్దములకు మొదట నున్న యితరములగు పరుషములకును ప్రథమావిభక్తి కంటెఁ బైనున్నపు డితరము లగు సరళము లాదేశము లగును.

'వః పబయోరాదేః' అను సూత్రమున చకారమును బ్రస్తావింపఁబడినది. కావున నితరము లగు పరుషము లనఁగా, కచటతప యను పరుషములలోఁ బూర్వోక్తము లగు, చపలను దొలఁగింపఁగా మిగిలియున్న 'కట త' యనునవి. వీనికి గడద యను సరళములు క్రమముగా నగును. గజడదబ యను సరళములలో 'వఃపబయోః' అనుచో బకారమును, 'సశ్చజయోః' అనుచో జకారమునకు జెప్పఁబడినవి కావున నితరములు గడద యనునవే యగును. ఇంతకు ముందు సూత్రస్థలములఁ జెప్పిన సరళములు (జబ) స్థానులు కాఁగా నిట్లె మిగిలిన సరళము లాదేశ మగుట విశేషము. ఏ మైనను 'పరే చ' యను నీ సూత్రముయొక్క యర్థ మిట్లని వివృతిని బట్టి మాత్రమె స్పష్ట మగుచున్న దనక తప్పదు.

---

1. గడదాశ్చ. (ఆం.కౌ.సంధి.29)

ప్రథమావిభక్తి కంటెఁ బర మైన దేశ్యశబ్దము మొదటి కటతలకుఁ గ్రమముగా గడద లగు నని సూత్రాభిప్రాయము.

క-గ-కృష్ణుఁడు + కనుగొనె = కృష్ణుఁడు గనుగొనె.

ట-డ- అన్న + టాటోటు = అన్న డాటోటు

త-ద- హరి + తన్నె = హరి దన్నె

ఇటఁ గూడ నాదేశము నిత్యముగనె చెప్పఁబడుట విశేషము. వాఁడు కొట్టె ననురీతిగా నాదేశము లేని రూపముల నసాధువులుగా నిర్ణయించుట యుక్తముగాఁ దోఁపదు.

ఇటఁ గూడ వివృతి యందు దేశ్యశబ్దము మొదటనే కటతలకు గడద లగునని చెప్పఁబడినది. కావునఁ దత్సమశబ్దము మొదటి కటతలకు గడద లు రావీలు లేదు. ఎంత గుమతులు మొదలగు రీతిగాఁ గొలఁదిగాఁ బ్రయోగము లున్నవి. అయ్యును దేశ్యశబ్దము మొదట నున్నవానికి వలె సంస్కృతసమశబ్దాది నున్నవాని కీ యాదేవము సామాన్య మై యుండలేదని మాత్రము గుర్తింపవచ్చును.

పూర్వశబ్దము సంస్కృతసమమా యాచ్ఛికమా య న్నవివక్ష లేదు. రెండును వివృతి యందుదాహరింపఁబడియే యున్నవి. పరశబ్దము మాత్రము దేశ్యమె కావలయు నని తెలుపుటచే నచ్చ తెలుఁగులపై సాంస్కృతిక పరుషముల కీ యాదేశము ప్రసక్తము గాకుండఁబోయినది. అచ్చతెనుఁగుపై నైనను, సంస్కృతసమముపైనె యై నను సాంస్కృతిక పరుషముల కీ యాదేశము క్వాచిత్కముగాఁ గలుగుట విశేషముగా గుర్తింపఁదగును.

కచటతపలు పరుషములు, గజడదబలు సరళములు. వీనిలోఁ బరుషములకు సరళము లగుటలో కటతలకు గడద లగుట వలెనె సరిపడుచున్నది. చపలకు జబలు గాక సవ లగుటను బట్టి వానిని వేఱు చేసి సవాదేశము నీ వ్యాకరణములు ప్రత్యేకించి సూత్రించి యుండును.

అయినను 'జ బ' లకును సవలను విధించుటె వింతగ నున్నది. రాముఁడుబుట్టె, వేదములు జదివె ననురీతిగా లోకవ్యవహారమునఁ గళలపైఁ గూడ చపలు జబలుగా నుచ్చరింపఁబడుచుండుట గమనింప వచ్చును. అట్టి యెడలఁ గూడఁ గవిప్రయోగములందు సవలే యుండుట వలన చపలతోఁ బాటు జబలకును సవాదేవము చెప్పుట జరిగినదా యనిపించును. కాని వివృతియందు సహజముగా నున్నజబలకే సవలను జూపుటవలనఁ బై యూహ కవకాశము సన్నగిల్లును. సూత్రకర్త మత మదియె యై యుండ వివృతి కర్త భిన్నముగాఁ దలఁచె నని చెప్పుచో సూత్ర వివృతి కర్తలు భిన్ను లని చెప్పవలసియుండును.

'ద్వంద్వే వినిత్యమ్' (సంధి.56) అను సూత్రము ననుసరించి యీ యాదేశము లిట ననిత్యములుగాఁ జెప్ప వచ్చును. రాముఁడుకొట్టె, రాముఁడు చనె మొ॥

## 54. నాత్మా స్మదోః.[1]

ఆత్మాస్మదోః = ఆత్మాస్మదర్థకశబ్దముల ప్రథమావిభక్తి కంటెఁ బరముగా నున్నచో, న= పూర్వోక్తము లగు కార్యములు లేవు.

వి. ఆత్మనస్మచ్ఛబ్దయోః ప్రథమావిభక్తేః పరతో
దేశ్య నామాది పరుష బజానాం సరళ వసా న
స్యుః. తా కొనె, నే కంటి, తా చదివె, నే చెప్పితి,
తా టెక్కెమెత్తె, నే టంకుగాను, తా తలచె, నే తెలిసితి,
తా పోయె, నే పిలిచితి, తా జన్నియ నిచ్చె, నే బంటును,
ఇత్యాది.

ప్రథమాంతము లగు నాత్మాస్మదర్థకశబ్దములకుఁ బర మయిన కటతలకు గడదలును, పబలకు వకారమును, చజలకు సకారమును రావు. తా + కొనె = తాగొనె నని కాదు. పరుష మట్లె యుండు. తా కొనె. ఇట్లె యితరములును.

'వఃపబయో రాదేః' అను సూత్రముచే పబలకుఁ జెప్పిన వకారమును, 'సశ్చజయోః' అను సూత్రముచే చజలకుఁ జెప్పిన సకారమును 'పరే చ' యను సూత్రముచే కటతలకుఁ జెప్పిన గడదలును (ప్రథమాంతము లగు) నాత్మాస్మదర్థక శబ్దములపై లే దని యీ సూత్రాభిప్రాయము. ప్రథమాంత మగు నాత్మార్థకశబ్దము 'తాను' అనునది. ప్రథమాంత మగు నస్మదర్థక శబ్దము నేను అనునది. కాఁగా నిచట వివృతియందు తా కొనె, నే పిలిచితి నను రీతిగా తా, నే – అను శబ్దములనే చూపుట సమన్వయింపఁ బడకున్నది. గడద సవలు లేనపుడు పరుషములును, (జబలు) నట్లే యుండుట కవిప్రయోగానుగుణ మని నిర్ణయింపరాకున్నది. తాకొనె అని గాని, తాను కొనె నని గాని పరుషము లట్లె యుండు నని నిర్ణయించుటకుఁ దగిన ప్రయోగ ప్రమాణము లేకుండుటచే నీ యంశ మంగీకార యోగ్యముగా లే దనక తప్పదు.

తాను, నేను అన్నవి ప్రథమాంతము లగుటచే వానిపైఁ బూర్వోక్తము లగు కార్యముల ప్రసక్తి యుండుటచే నది లే దని చెప్పునంతవఱకు సూత్రాభిప్రాయము యుక్తమె యన్నను నా పరుషములు సరళము లని చెప్పకుండుట యొప్పకున్నది. అట్లు సరళములను జెప్పుచోఁ బ్రత్యేకముగా నీ నిషేధ మనవసరమే యని గుర్తింపవలయును.

---

1. నాత్మాస్మదోః. (ఆం.కౌ.సంధి.30)
అప్యస్మదః ప్రథమామాత్రాద్గసడదవాః. వై.చం.సంధి 32
గసడదవాస్స్యుః ప్రథమా మాత్రాదాత్మస్మదోర్నైవైతే. ఆం.శ.చిం.సంధి.23

## 55. వికృతే స్తత్స చయశ్చ. [1]

వికృతేః ఆదేః = తెనుఁగుశబ్దమునకుఁ బరమై యున్న, తత్సచయః చ = తత్సమములందలి చయ్యులకును, న = సరళములు రావు. వఃపబయోరాదేః అనుదాని నుండి ఆదేః అన్నదియు, నాత్మేస్మదోః అన్నదానినుండి న అనునదియు నిం దనువర్తించును.

వి. వికృతి ప్రథమావిభక్తేః పరత స్తత్స పరుషాణాం
వససరళా న స్యుః సూత్రే చకారగ్రహణం బజ
యోరపి వత్వ సత్వ నిషేధార్థ మితి జ్ఞాతవ్యమ్.
రాముఁడు కరుణానిధి, కృష్ణుఁడు చక్రధరుఁడు,
హరి టంకధారి, భామ తరుణాంగి, మాతల్లి పుణ్యవతి,
మాతండ్రి బలశాలి , నీవు జనకుఁడవు.

ప్రథమాంత మగు తెలుఁగు శబ్దము కంటెఁ బరముగా నున్న సంస్కృత పదములందలి పరుషములకు గసడదవలు రావు. 'చయ్' అను ప్రత్యాహారముచే 'ఖ ఫ ఛ ఠ థ చటతవ్ కపయ్' అను మాహేశ్వర సూత్రముల ననుసరించి చటతకప యనునవి బోధింపఁబడును. వీనికిఁ దెలుఁగునఁ బరుషము లని సంజ్ఞ.సూత్రము నందలి చశబ్దముచే (చయశ్చ) జబలు గ్రహింపఁబడును. కావున జకారమునకు సకారమును, బకారమునకు వకారమును రా వని యర్థము. కృష్ణుఁడు, మాతల్లి యను తీరుగా వివృతియం దుదాహరింపఁబడుటను బట్టి యిచ్చటి వికృతి శబ్దము సంస్కృతసమ సహిత మయిన యాంధ్రభాషను బోధించునదిగా గ్రహింపవలయును. కావునఁ బ్రథమాంత మగు సంస్కృతసమము పైనైన, నాచ్ఛికముపైనైన సంస్కృతసమము లందలి పరుషములకును, జబలకును, గసడదవ, సవలు రా వని సారాంశ మగుచున్నది.

రాముఁడు + కరుణానిధి. రాముఁడు గరుణానిధి యని గకారాదేశము లేదు. రాముఁడు కరుణానిధి యని యట్లే యుండును. ఇట్ల యితరోదాహరణములును.

వి. తత్సపదం కిమ్? తండ్రి గనుగొనె, (వేల్పుదొర
సన్నె యిచ్చె?) నీవు పిలుపు గాంచితివి ఇత్యాది.

---

1. తత్సేచయో నస్యుర్లశస్సదా. (త్రి.శ.2.31)
న వికృతి పదాదాద్యానామ్. (ఆం.కౌ.సంధి 31)
నా సంస్కృతాత్సం స్కృతస్య. వై.చం.సంధి.34
నవికృతి శబ్దాత్పరతస్సాంస్కృతికానాంభవన్తి గసడదవాః. ఆం.శ.చిం.సంధి.24.

సూత్రమునందు 'తత్సచయశ్చ యనుట' చే సంస్కృతసమములందే యీ నిషేధము కావున నాచ్చికములందలి పరుషములకు గసడదవ లగుటలో సవరోధము లేదు. తండ్రి + కనుగొనె = తండ్రి గనుగొనె.

'పః పబయో రాదేః' మొదలగు సూత్రముల యెడ వివృతిలో 'దేశ్యనామాది' యని పేర్కొనుచు నట్లనుటవలనఁ దత్సమముల కీకార్యము లే దని స్పష్టము చేయఁబడియున్నది. ఆ వివృతి ననుసరించి చూచిన నీ సూత్రము సిద్ధార్థసాధక మై వ్యర్థ మనఁదగియున్నది. కాని యచట దేశ్య శబ్దముల యందే యని చెప్పుట కా సూత్రములలో నాధారము లేదు. కావునఁ జెప్పఁబోవు చున్న ప్రస్తుతసూత్రమును దృష్టియం దుంచుకొని వివృతియం దచట ముందుగా దేశ్యనామాది యని వివరింపఁబడినట్లు చెప్పవచ్చును. కాని దేశ్యనామములం దనుటచేతఁ దత్సమముల నా కార్యము లే దని యటఁ జెప్పఁబడినది. మఱి 'వికృతే స్తత్సయశ్చ' యను నీ సూత్రముచే నాదేశము రా దని వివరింపక వివృతి యందలి మాటచే లే దని వివరించుట యెట్లు?

'న వికృతిశబ్దాత్పరతస్సాంస్కృతికానాం భవన్తి గసడదవాః' అను సూత్రవ్యాఖ్యలో నహోబలుఁడు పేర్కొన్న ట్లిచటఁ గూడ 'వికృతి' శబ్దమున కాచ్ఛిక మని యర్థము చేయు టొప్పును. మొత్త మాంధ్రభాషయె యుద్దేశించిన నీ సూత్రమున 'వికృతేః' అను దళ మేల? 'తత్సచయశ్చ' యని మాత్రమే చెప్పిన నీ యర్థము సిద్ధించుచునే యుండును.

అపు డచ్చతెనుఁగులపయి మాత్రమె యీ యాదేశము నిషిద్ధ మగుచు రాముఁడు గరుణాభిరాముఁడు, రాజ్యశ్రీ వాలింపఁగ ననురీతి వాని కవకాశము గలుగును. ఆంధ్రకౌముదిలో నన్నియు నచ్చతెనుఁగుమీది పరుషములే యుదాహరింప బడినవి.

అయ్యు నీ యాదేశ మరుదే యగుటయు, రాముఁడు సంద్రముఖుఁ డిత్యాదు లసలు గానరాకుండుటయును విశేషముగా గుర్తింపక తప్పదు.

దీనికంటెఁ దత్సము పరుషములకు గసడదవ లరుదుగ నని చెప్పుట యొప్పు ననవచ్చును.

## 56. ద్వంద్వే నిత్యమ్. [1]

ద్వంద్వే = ద్వంద్వ సమాసమునందు, నిత్యమ్ = పూర్వోక్తము లగు కార్యములు నిత్యముగా నగును.

---

1. ద్వంద్వే నిత్య మాదేః. (ఆం.కౌ.సంధి 40)
   ద్వంద్వే పదాత్. వై.చం. సంధి. 33
   పరుషాణాం గసడదవా స్స్యు పదాద్ద్వన్ద్వే. ఆం.శ.చిం.సంధి.32

వి. ద్వంద్వ సమాసే పదాత్పరతః గసడదవాః నిత్యం స్యుః. కూడు గూరలు, కాలుసేతులు, టంకు డాటోటులు, అన్నదమ్ములు, కాయవండ్లు ఇత్యాది.

ద్వంద్వసమాసమునందుఁ బదంబుమీఁది పరుషములకు గసడదవలు నిత్యముగా నగును.

కూడును గూరయు ననున ర్థమున ద్వంద్వసమాస మేర్పడి కూడు + కూర యని కాఁగా నీ సూత్రముచే నిత్యముగా గకార మయి కూడు గూర యని యై బహువచనముతోఁ గూడు గూర లని యగును. ఇట్ల యితరములు.

ఇతఃపూర్వము ప్రథమాంతము పైని నీ యాదేశమును నిత్యేతరముగాఁ జెప్పియుండలేదు. అట్టి యెడల నవి నిత్య మని యె చెప్పవలసియున్నది. కాఁగా నీ సూత్రమున నిత్య మన నేల? ఇట్లు నిత్య మనుటను బట్టి పూర్వ మాదేశము నిత్యము గా దని చెప్పవచ్చును. అపుడు ః(రాముఁడు కరుణామయుఁడు) రాముఁడు కొట్టె ననురీతిగా నాదేశము రాని రూపములకు నవకాశము గలుగును.

ఇట కేవలము ద్వంద్వే యన్నచోఁ బూర్వము చెప్పిన నిషేధములను బట్టి ద్వంద్వమునను నాదేశము నిషేధించినట్లు యగు నని 'నిత్య' మ్మని ప్రత్యేకముగా జెప్పెనా యనియు ననుమానింపఁదగియున్నది.

## 57. శుచో రాదే ర్వా లుక్.[1]

శుచోః = వర్తమానార్థక మైన చువర్ణము పర మగుచుండఁగా, ఆదేః = దానికిఁ బూర్వము నందున్న (ఉత్తునకు) వి = వికల్పముగా, లుక్ = లోప మగును.

వి. నాన్తధాతోః పరస్య వర్తమానార్థక (శు) చు వర్ణకస్యాద్యు కారస్య వా లోపస్స్యాదేకపదే.
అనుచు - అన్చు - వినుచు - విన్చు.

సమానపదమునందు వర్తమానార్థక మయిన చువర్ణకము పర మగుచుండఁగా దానికిఁ బూర్వమునందలి నువర్ణాంతధాతువు యొక్క చివరి యుకారమునకు వికల్పముగా లోపమగును.

'లటశ్శుచుప్' అని శంచుప్(లట్టునకు) వర్తమా నార్థమున విహితము.

---

1. శ్వత్ర్థే చేహారులోవాలుక్. (ఆం.కౌ.సంధి.10)
శత్ర్థేతూతశ్చనోః. ఆం.శ.చిం.సంధి. 12

'అనుచు' అని యుండఁగా నీ సూత్రముచే నుత్వము లోపింపఁగా 'అన్చు' అని యగును. 'వా' యనుటచే నుత్వము లోపింపని పక్షమునందు 'అనుచు' అని యుండును.

ఇచట 'ఆదేః' అని మాత్రమె సూత్రమునఁ జెప్పఁబడినది. ధాతువు నాంతము గావలయు ననియు నందుఁ జివరియుత్వము లోపించు ననియు వివృతి యందలి విశేషము. ఉత్వమె యుండును గాన నిబ్బంది లేదు. నాంత మనుట లక్షణమునఁ జెప్పవలసిన యంశ మనక తప్పదు.

'ఏకపదే' యన్నదియు వివృతి యందలి విశేషము. 'వర్తమానార్థక చువర్ణకము పర మగుచుండఁగా ననుటచేతనె యిది యేకపదము నందలి కార్య మను నంశము స్పష్ట మగుచున్నది. వే ఱొకపదమునకు నీ చువర్ణకము పరముగావలయు నన్న నిది యెప్పుడును బదము మొదట నుండదు గదా.

ఈ లోపము నువర్ణమునందే కావున పడుచు, లేచుచు మొదలగుచోట్ల నితరస్థలములం దుత్వమునకు లోపము లేదు.

## 58. బిన్దు శ్చ పుష్పదన్తస్య. [1]

పుష్ప దన్తస్య = పుష్పదంతుని మతమునందు, బిన్దుః చ = ఆ నకారమునకుఁ బూర్ణబిందువు నగును.

వి. శుచుప్రత్యయస్య చువర్ణకే పరే నాన్తధాతో
ర్లుప్తస్యాదేశః పూర్ణబిన్దుస్స్యాత్పుష్పదన్తస్య మతే.
అంచు, వించు.

శుచుప్రత్యయమునకు సంబంధించిన చువర్ణకము పర మగుచుండఁగా నువర్ణాంత మగు ధాతువున కుత్వలోపముతో పాటు, బిందువు గూడ నగు నని పుష్పదంతుని మతము. బిందు వనఁగాఁ బూర్ణానుస్వార మని గ్రహింపఁదగును.

'అనుచు' అని యుండఁగా 'శుచోరాదేర్వా లు' క్కను సూత్రము ననుసరించి యుత్వలోపముతో పా టీ సూత్రముచే మిగిలియున్న నకారమునకుఁ బూర్ణబిందువును రాఁగా 'అంచు' అని యగును.

---

1. బిన్దుశ్చ. (ఆం.కౌ.సంధి . 11)
చుదోర్బిన్దు కశ్చ గ్రహాదే ర్నః. (హైకాచోయుజి). వై.చం.సంధి.37
తస్య స్యాచ్చపూర్ణబిన్దురపి. ఆం.శ.చిం.సంధి.13

'పుష్పదన్తస్య' యనుటచే నిది యొక పక్షము కావునఁ బక్షాంతరమునందు బిందు వుండదు. కాఁగా 'శుచోరాదేర్వాలు' క్వ్రను సూత్రముచే నుత్వలోపము మాత్రయె యయిన 'అన్చు' అని యగును. అచట 'వా' యనుటచే లోపము రాని పక్షమునందు 'అనుచు' అనియు నుండును.

ఇట్లిచట పూర్ణబిందువు, ఉత్వలోపము, స్వత్వములతో మూఁడు రూపము లేర్పడును.

'శుచోరాదేర్వా లు' క్వ్రను సూత్రముచే నుత్వము లోపింపఁగా అన్ చు అని కాఁగా నిట నకారమునకు హల్లు పర మయినది గావున 'బిన్దుస్స్వమచన్ద్రస్య' యను సూత్రముచేఁ బూర్ణబిందువు రావచ్చును. (అది ద్రుత కార్య మగుటయు, నెచ్చట నున్నను నకారమునకు ద్రుతసంజ్ఞ యుండుటయు నీ వ్యాకర్తల మతమున గమనార్హము) మఱి నీ బిందువిధాన మేల? ఇట్లీ విధానము వ్యర్థమై 'బిన్దుస్స్వమచన్ద్రస్య' యను సూత్రముచేఁ జెప్పఁబడిన బిందువు పదమధ్యమున వర్తింప దను నర్థమును జ్ఞాపకము చేయును. దీనివలన నా సూత్రముచేఁ బదాంతమందున్న నకారమునకె బిందు వగును. ఇట్లీ సూత్రముచే జ్ఞాపకసిద్ధ మైన యర్థము ననుసరించియె యా సూత్రము నొద్ద వివృతియందు 'పదాన్త స్య నస్య' యని చెప్పఁబడిన ట్లూహింప వచ్చును.

ఇట్లు పదమధ్యమున నకారమునకు బిందువు సిద్ధింపకుండఁగా 'అంచు' అను రీతి రూపములకు బాధ గల్గుటచే నీ సూత్ర మది సాధించుట జరితార్థ మగుచున్నది. కాఁగా చినుకు, చిన్కు ఇత్యాదులందుఁ బదమధ్యమున బిందువు వారింపఁబడుట యన్యత్ర ఫలముగా స్పష్టము.

ఇట్లు 'బిన్దుస్స్వమచన్ద్రస్య' యను దానివలెనే 'నో హలివా' మొదలగు నచ్చోటి విధులు పదము తుది ద్రుతమును గూర్చియే చెప్పఁబడినట్లు తెలియుచున్నది. ఇట్లు 'సిద్ధాచ్చ' యను దానిచేఁ గూడఁ బదాంతమునందలి ద్రుతమునకు నయిన బిందువు పైనె సరళములను జెప్పుటఁ బదమధ్యమందలి నకారమున కయిన ద్రుతములపై సరళమును జెప్పదు. కావున అన్ చు - అంచు అనుచో అన్జు, అంజు అనురీతిగా రూపములేర్పడవు. ఇట్టి యెడల 'ననహలస్సరళః' అను సూత్రము ప్రయోజనము మృగ్యము. ఇంక నది నకారముపైని సరళములనె నిషేధించుటచే 'సిద్ధాచ్చ' యను సూత్రముచే నగు బిందువు పైని సరళము దుర్వార మయి అంజు (అంబు) అను రీతిరూపము లేర్పడు. ఇట్లె పెనుగులాట పెన్ గులాట పెన్గులాట కావలె (నో హలివా) కావున 'ననహలస్సరళః' అను లక్షణము చెప్ప కున్న మంచి దనిపించు.

## 59. ఋచో రచి చ. [1]

ఋచః చ = శత్రర్థక మగు చువర్ణకమునకును, అచి = అచ్చు పర మగుచుండఁగా, (వా = వికల్పముగా) సంధి యగు నని భావము.

వి. శత్రర్థకఋచు వర్ణ స్యాచి పరే సన్ధి ర్వా స్యాత్.
చూచు చి ట్లనె, చూచుచు ని ట్లనె, ముంచు చప్పుడు,
ముంచుచు నప్పుడు ఇత్యాది.

శత్రర్థక ఋచువర్ణకమున కచ్చుపర మగునపుడు సంధి వికల్పముగా నగును. లటశ్శుచుప్ అని (లట్టునకు) ఋచుప్ ప్రత్యయము విహితము. చూచుచున్ + ఇ ట్లనె – పరరూపమై నచో చూచు చిట్లనె. వికల్పము గావున సంధి రానిపక్షమునందు ద్రుతము పై యచ్చుతోఁగూడి చూచుచు నిట్లనె – అని యగును.

ఇందు సంధి, వా యనుపదము లెచ్చటినుండి వచ్చినవో కాని వివృతి యందుఁ జూపఁబడినవి. 'ఋచోరాదేర్వాలుక్' అను ప్రపూర్వ సూత్రమునందు వా శబ్దము గలదు. లుక్ అనునది గూడ ననువర్తించి యుత్వము లోపించు నని చెప్పవచ్చును. కాని యిటఁ గొన్ని యిట్టి (సంధి) విధుల పిదప మఱల 'ద్వినుల్వోరాదేర్వాలు'క్కని మఱల లుక్ శబ్ద ముంచఁబడినది. 'నశోః' అను పూర్వపునిషేధమును వారింప నుంచినది గావచ్చునేమో. ఏమైనను నిట వివృతి ననుసరించి సంధి యని గ్రహించిన నీ ద్రుతాంతమునకుఁ బరరూప మగుటలో నిష్టరూపసిద్ధి కవకాశ మెక్కుడేమో యనిపించుచున్నది. లోప సందర్భమునఁ బై నకారము లోపించు నవకాశము గానరాదు.

ఏ మైనను శత్రర్థక చువర్ణము నందలి యుత్తున కచ్చుపర మగునపుడు సంధి (పరరూపము) వికల్పముగా నగును.

చూచుచున్ + ఇట్లనె ననుచో నీ సూత్రముచేఁ బరరూపము గలుగఁగా చూచు చిట్లనె నని యగును. పరరూప ముత్వమునకె యైనను మీఁద నకార ముండఁగా నది యసంభవము గావున విధాన సామర్థ్యము ననుసరించి నకారమును బోయి పరస్వరమె నిలుచును. చూచు చిట్లనె.

వికల్పము గావునఁ బరరూపము రాని సందర్భమునందు ద్రుతము నిలుచుట కవరోధము లేదు. కావ నది మీఁది యచ్చుతోఁ గూడి చూచుచు ని ట్లనె నని యగును.

---

1. సంధిశ్చోర్వా. (అం.కౌ.సంధి.14)
   టోర్వా స్యాద్వ్రత్తూనవిహితస్య. అం.శ.చిం.సంధి.7

ఇంతకు ముందు పేర్కొన్న కళాసంకీర్ణ ద్రుత ప్రకృతికములలో నీ శత్రర్థక చువర్ణకాంతము సంకీర్ణము గాక తప్పదు. 'ద్వితీయాద్యుత్తమలడకాంగ నంతాదయ స్సంకీర్ణాః' అని చెప్పిన సంకీర్ణములలో లడక అను దానిచే 'లటశ్శుచుప్' అని లట్టునకు విధింపఁబడిన శః శుచుప్ గ్రహింపఁబడును. ఇట్లు సంకీర్ణ ము కాఁగా 'విభాషా సంకీర్ణా' త్తను సూత్రముచే నీ వైకల్పిక సంధి యుక్తపూర్వమె. లట లట్టున కుదాహరించిన చేయుచున్నాఁడు, చేయుచునున్నాఁడు వంటిదే యిది. కాని చేయుచున్నాఁడు మున్నగు లడంతక్రియా పదములలో చేయుచున్' మొ॥ యేకదేశ మగుచుండ దానికి ద్వితీయాద్యంత పదములకు వలె (సంకీర్ణ) సంజ్ఞను విధించుట యుచితమా?

ద్రుతప్రకృతికమునకును నిట్లు వైకల్పిక సంధిని జెప్పి యిష్టరూపములు సాధించుకొనఁజాలినపుడు సంకీర్ణముల నేల పేర్కొనవలెనో స్పష్టముగాదు. వానిని గూడ ద్రుతప్రకృతు లనియే చెప్పి యిట్లు వైకల్పికసంధిని విధించుకొననగునె. (విభాషా సంకీర్ణా త్తని సంకీర్ణములకె యిట్లు విధించె నాయె.) కావున సంకీర్ణముల కల్పన మనవసర మని గుర్తింపఁదగును.

అది గుర్తించియె కావచ్చు నీ వ్యాకర్తతన ఆంధ్రకౌముదిలో సంకీర్ణములను బేర్కొనక వానిని గూడ ద్రుతప్రకృతికములుగనె చెప్పుచు 'వానాది విభక్త్యుతః' ఇత్యాదిగా సంధిని వేఱుగా విధించుకొనెను. ఇదియె సముచిత మగు మార్గము.

## 60. ఇత స్త దాదేశ్చ. [1]

తదాదేః = అది మొదలగు వానియొక్క, ఇతః చ = హ్రస్వ మగు నికారమునకుఁ గూడ, అచి = అచ్చు పర మగుచుండఁగా వైకల్పికముగా సంధి యగును.

వి. తదాది గణస్యేకారస్యాచి పరే సన్ధిర్వా స్యాత్.

అ దేమి, అది యే మి, అ దొక్కటి, అది యొక్కటి.

తదర్థకము మొదలగునవి తదాదులు అది మొదలగునవి. అది మొదలగు శబ్దములందలి యిత్తున కచ్చు పర మగునపుడు సంధి వైకల్పికముగా నగును.

అది + ఏమి అని యుండఁగా నీ సూత్రముచే సంధి యై నఁ బరరూపముతో న దేమి యని యగును. వికల్పము గావున సంధి రానిపక్షమునందు 'యః ప్రాణస్య' యను సూత్రముచే యకారము వచ్చి అది యేమి యని యగును.

---

1. తదాదే ర్వా. (ఆం.కౌ. సంధి.16)
తద్వృత్తదాది జన్య. ఆం.శ.చిం.సంధి.8

అది, ఇది, ఏది, అవి, ఇవి, ఏవి మొదలగునవి తదాదు లని గ్రహింపఁదగును.

*శేషాత్స్వచి విభాషా, క్వచిచ్ఛాన్యస్మిన్, తద్ధిత తిజవ్యయేతో నిత్య మ్మను లక్షణము లింతకు ముందు ఇత్తునకు సంధిని విధించుచున్నవి. తద్భిన్నముగా నిందలి వైశిష్ట్యము* పరిశీలనార్హము. పయిలక్షణములును త్రి.శ.లో తదాది, కిమాదిసంధి విధానము గానరాదు.

## 61 కిమాదేః ప్రాయః.[1]

కి మాదేః = కి మర్థకము మొదలగు శబ్దముల యొక్క, ఇతః = హ్రస్వ మగు నికారమునకు, అచి = అచ్చు పర మగు చుండఁగా, ప్రాయః = సంధి తఱచుగా నగును. 'ఘచోరచి చ' యను సూత్రమునుండి 'అచి' యను నదియును, 'ఇతస్తదాదేశ్చ' యను సూత్రమునుండి 'ఇతః' అనునదియు నిం దనువర్తించును.

వి. కి మాదిగణస్యేకారస్య సన్ధిః ప్రాయస్స్యాత్ – ఏ మతఁడు

ఏ మంటి నతని, మ ఱేమి.

కిమర్థకము మొదలగునవి కిమాదులు. అనఁగా 'ఏమి' మొదలగునవి. ఏమి మొదలగు వాని యందలి యిత్తున కచ్చు పర మగునపుడు సంధి ప్రాయికముగా నగును.

ఏమి + అతఁ డనుచో నీ సూత్రముచే సంధి రాఁగాఁ బరరూపముతో ఏ మతఁడని యగును. ప్రాయః అనుటచే నరుదుగా సంధి రాకుండవచ్చును. అపుడు 'యః ప్రాణస్య' అను సూత్రనుచే యకారమయి ఏమి యతఁ డని యగును.

ఏమి, మఱి మొదలగునవి యేమ్యాదులు.

మ ఱేమి, ఏ మంటివి యనునవి 'తద్ధిత తిజవ్యయేతో నిత్య' మ్మను సూత్రము నొద్ద నుదాహరింపఁబడినవి. అట నివ్వానియందు సంధి నిత్యమని చెప్పఁబడినది. ఇట వానికి సంధి ప్రాయిక మని చెప్పఁబడుచున్నది. ఇటఁ గూడ సంధి వికల్పమె యని సూరి ప్రభృతులు పేర్కొనిరి.

ఏ మయినను నిట వైరుధ్యము గమనార్హ మయియున్నది. దీనివలన నింతకు ముందు చెప్పిన యిత్వ సంధి లక్షణము లెంతవఱకు గ్రాహ్యములో నిర్ణయింపరా కున్నది.

పూర్వుల వేర్వేఱు వ్యాకరణములనుండి లక్షణము లట్లు గ్రహించుటలో నిట్టి పునరుక్తి కల్గినదా యని సందేహము. ఇత్వసంధిని గూర్చి రెండులక్షణములె చాలును. పూర్వోక్తము లేల? ఇందును గిమాదులకు సంధి ప్రాయిక మను తలఁపుచే భేదము గల్గెను. వివృతియం

1. కిమాదేర్బహుళమ్. ఆం.కౌ.సంధి.15.
ప్రాయస్తు స్యాత్కిమాది కస్యేతః. ఆం.శ.చిం.సంధి.9.

దీనను సంధి రాని ఏమి యత్రఁ డనురీతి వుదాహరింపఁబడ కుంట గమనింపఁదగును. కిమాదులకును సంధి వైకల్పిక మగుట గుర్తించినఁ బ్రస్తుతపు రెండు సూత్రములును గలిపి యొకటిగాఁ జెప్పవచ్చును. (తిఙంతములంగూర్చి వేఱుగాఁ బ్రస్తావింపఁదగు.)

## 62. నశేః.[1]

శేః = తద్ధర్మార్థక మైన 'శ' వర్ణకము సంబంధి యుకారమునకు, అచి = అచ్చు పర మగుచుండఁగా, న = సంధి రానేరదు.

ఏ. తద్ధర్మార్థక శవర్ణకస్య సన్ధిర్న స్యా దచి పరే.
కరుణించు నంబ, సేవింతు నమ్మవారి, చేయు నీశ్వ
రుఁడు, పలుకు నింటి ఇత్యాది.

తద్ధర్మార్థక మైన క్రియాపదములందలి యుత్తున కచ్చు పర మగునప్పుడు సంధి లేదు. 'శప్లేట్' యని తద్ధర్మార్థమున శట్ విహితము. శవర్ణము సంబంధి యుకార మే నిల్చును.

కరుణించున్ + అంబ - అనుచోటఁ బ్రస్తుత సూత్రముచే సంధి లేదు. కావున ద్రుతము మీఁది యచ్చుతోఁ గూడి కరుణించు నంబ యనియే యగును.

ఈ ప్రథమాపురుషైకవచనములు 'ద్రుతప్రకృతయో ఽ న్యే' యను సూత్రము ననుసరించి ద్రుతప్రకృతికములు 'ద్రుతినో నిత్య' మ్మని చివర నకారము నిత్యముగా నుండును. కావున 'లుక్స్యంశ్లేషా నాచి ద్రుతస్య' యను సూత్రమున కనుగుణముగ 'కరుణించు నంబ' యనియే యగును. కాని సంధి లేదని నిషేధింపవలసిన యవసరము గానరాదు. దీనికి సంధి ప్రాప్తియే లేదు. ద్రుతాంతములు గాని తద్ధర్మార్థక క్రియాపదములందలి యుత్తునకుఁ బ్రాప్తించుచున్న సంధి నిషేధింపఁబడదు. అవటు, వత్తు మనియు ననురీతిగా సంధి యవును.

ఇట్లు ప్రాప్తింపకయే సంధిని షేధించుట సంగతముగా లేదు.

---

1. నతద్ధర్మేతః. ఆం.కౌ.సంధి. 13
నస్యా త్తద్ధర్మేతః. ఆం.శ.చిం.సంధి.6
ఉతోఽ తద్ధర్మే. వై.చం.సంధి.15

## 63. ద్వినుల్వోరాదేర్వా లుక్.[1]

ద్వినుల్వోః = ద్విత్వముతోఁ గూడిన ను, లు వర్ణముల యందు. ఆదేః = మొదటి హల్లునకు, వా = వికల్పముగా, లుక్ = లోప మగును.

వి. పదాన్తయోర్ద్విత్వ యుక్త నులు వర్ణయోరాద్య (ద్విత్వ) వర్ణయో ర్వా లుక్ స్యాత్. కన్ను - కను; మిన్ను- మిను; ఇల్లు - ఇలు; విల్లు - విలు.

పదము తుది నున్నన్ను,ల్లు, వర్ణముల యందలి మొదటి హల్లులకు ననగా న,ల, యను వానికి వికల్పముగా లోపము వచ్చును.

'కన్ను' అను శబ్దమున 'న్ను'వర్ణమునందలి నకారము లోపింపగా - కను అని యగును. వా యనుటచే లోపింపని పక్షమునందు 'కన్ను' అని ద్విత్వ మట్ల యుండును. ఇట్లె ఇల్లు ఇలు మొ॥

ఇది పదాంతమునందే యగునన్నయంశము వివృతియందలి విశేషము. దీనివలన అన్నువ, వెల్లువ ఇత్యాదులందుఁ బదమధ్యమున నీ లోపము రాదు. అనువ, వెలువ యని యిట నేర్పడవు.

## 64. ఇచ్చ విభక్త్యన్త్యస్య.[2]

విభక్త్యన్త్యస్య = విభక్తియందలి చివరి వర్ణమునకు, ఇత్ చ = ఇత్వము నగును.

వి. చేత తోడ వలన లో పలాది విభక్తీ నామన్త్యాకారస్య వికల్పే నేకారస్స్యాత్సమాసే. నీచేతిపూవులు - నీచేత పూవులు; నీతోడి చెలిమి - నీతోడ చెలిమి; నీ వలని కరుణ - నీ వలన కరుణ; నీలోపలిదేవుఁడు - నీలోపలదేవుఁడు; నీ చేత నుండెడు.

---

1. ద్వినుల్వోరాదేర్వాలుక్. (అ.కౌ.సంధి 44)
   ప్రథమ లుగ పి ద్వినుల్వోః. ఆం.శ.చిం.సంధి. 36
   ద్వినుల్వో రనచి పూర్వస్యలుగ్వా. వై.చం. సంధి 44
2. వావిభక్త్య న్త్యస్యేత్. ఆంకౌ.సంధి.45
   ఇచ్చ విభక్త్యన్తిమస్య. ఆం.శ.చిం.సంధి.37
   భవేది న్తసి చేతయో స్తథా తోడవిభక్తౌచ. అ.కౌ.సంధి.28
   ఇత్ను పోనలాతః. వై.చం.సంధి.42

పూవులు, నీతోడ చేసిన చెలిమి, (నీ వలన నుండెడు కరుణ)
నీ లోపలనుండెడు దేవుఁడు, ఇతి మధ్యమలోపి సమాసః ఇత్యాది.

చేత తోడ వలన లోపల మొదలగు విభక్తులచివరి యత్త్వమునకు సమాసమునం దిత్వము వికల్పముగా వచ్చును.

'నీ చేతను గలుగు ప్రోవు' అనుచో కలుగు అను మధ్యమ పదము లోపింపఁగా నీ చేతన్ + ప్రోవు అని యగును. (సమాసము కావున ద్రుతము లోపించి) నీ చేతప్రోవు అనుచో నీ సూత్రముచే నత్వమున కిత్వము వచ్చి నీచేతిప్రో వని యగును. ఇట్ల యితరములు.

సూత్రమునందు 'విభక్త్యన్త్యస్య' యని సూత్రమె చెప్పఁబడినది. కాని యవి యేవిభక్తులో స్పష్టము చేయఁబడలేదు. చేత తోడ వలన లోపలాదు లని వివృతి పేర్కొన్నది. లోపలాదు లను చోటి యాదిశబ్దముచే నేది గ్రహింపఁబడవలయునో స్పష్టము గాదు. నీలోని దేవుఁడని కావచ్చును. లోనన్ అనునది విభక్తిగా నిందును బరిగణింపఁబడిన జాడలేదు. లోపలకు నిత్వ మగు నన్నది నిర్ధారణమునందు వచ్చినలోపల సమాసమందుట యసంభవము. ఉదాహరణమునందును 'నీలోపలి దేవుఁ డన్నచోటి లోపల యధి కరణార్థకమునం దున్నది. కాఁగా లోపలవిభక్తి సప్తమ్యర్థమున నయినపుడె సమాసమగును గావున నపుడె యం దిత్వము వచ్చును.

మొత్తము మీఁద చేత తోడ, వలన లోపల యనువానికె యిత్వము గాన నగుచున్న దనియు నందుచే వివృతియం దాది శబ్దమును బ్రయోగించుటవలనఁ బ్రయోజనము మృగ్యమనియుఁ జెప్పఁదగియున్నది.

'అన్త్యాకారస్య' యనుచో నకారస్య యన్నది వివరణమె. సూత్రమునం దత్వమున కనకున్నను ఇత్వము చేతాదుల యం దనిగుర్తింపఁగా నందుఁ జివరనున్న దత్వమె కావున అ'కారస్య' యనునది వివరణ మగుచున్నది.

ఇత్వము వికల్ప మని వివృతియందుఁ జెప్పఁబడినది. అనఁగా 'ద్వినుల్వోరాదేర్వా లు క్చ'ను సూత్రమునుండి 'వా' యనునది యనువర్తింపఁ జేసియుండవలెను. లేదా 'ఇచ్చ' యనుచోటి చశబ్దము వికల్పార్థ మని యేని జెప్ప వచ్చును. వికల్ప మగుట వలన నీ చోట్ల నిత్వము రాకుండ నీ చేత ప్రో వని యుండును.

కాని యిచట నిత్వము రాని రూపములు గానరావు. ఇత్వము వికల్ప మనుట ప్రయోగానుగుణముగాఁ దోఁపదు. సూత్రమునందలి చశబ్దము కేవలము సముచ్చ యార్థకమె కాని వికల్పార్థకము గా దని చెప్పు టుచిత మని తోఁచుచున్నది. చింతామణి యందు ఇచ్చ విభక్త్యన్తిమస్య యనుచో నహోబలుఁడు నిట్ల తలఁచెను. 'జేరలిచ' యనుచోఁ గూడ చశబ్ద మున్నను 'లలి' వికల్ప మని చెప్పఁబడ కుంట గమనార్హము.

వివరింపఁబడిన దని చెప్పఁదగు. 'టుగచి' యను సూత్రమునకుఁ బిదప నున్న కర్మధారయే యన్వయర్థము సిద్ధించెడి దని తోఁచును.

కాంచనము + అందియలు అని యుండఁగా నీ సూత్రముచే మువర్ణకమునకు 'పు' వర్ణము వచ్చిన కాంచనపు + అందియ లని కాఁగా 'టుగచి' యను సూత్రముచే టుగాగమము వచ్చి కాంచనపు టందియ లని యగును. మువర్ణకమునకుఁ బూర్ణబిందు పూర్వకమైన పువర్ణము వచ్చినచో కాంచనంపుటందియ లని యగును.

సరసము + పలుకు. సరసపు + పలుకు అని కాఁగా 'హా హలి కర్మ ధారయే' యను సూత్రముచే నుగాగమ మైనపక్షమున సరసపుంబలు కనురీతిగ నగును, నుమాగిమము రాని పక్షమున సరసపు పలు కనియె యుండును. నుమాగమము వైకల్పికముగాఁ జెప్పుటం గూర్చి యచటఁ బరిశీలించితిమి. సరసపు పలు కను రీతిగా నుమాగమరహితరూపములను నిర్ధారించు ప్రయోగములు వెదుకవలసియున్నది.

'పుంపులు' నిత్యముగా విధించుటచే కాంచనము టందియ లనురీతిగా పుంపులు రాని రూపము లుండవు.

కర్మధారయ సమాసము నం దనుటచే నితరస్థలములందు పుంపులు రావు. సరసమైనపలుకు మొ॥

సముద్రపుటొడ్డు, సింగపుఁగొదమ యనులీరుగా పుంపులు షష్ఠీ తత్పురుషమునందుఁ గానవచ్చుచున్నవి.

## 66. జేరలి చ.[1]

జేః చ = సప్తమీవిభక్తికి ని, అలి = అలి యనునది యగును.

వి. సప్త మీవిభక్తే రుకారాత్పరతః కర్మధారయ సమాసార్థక అల్యాగమస్స్యాత్. నీయందలి భక్తి, నా యందలి కరుణ.

సప్తమీ విభక్తికి సంబంధించిన ఉకారముకంటెఁ బరముగఁ గర్మధారయ సమాసార్థక మగు 'అలి' అను ఆగమము వచ్చును.

---

1. అందొరలిక్ప. త్రి.శ.4.15 హేమచంద్ర సూత్రము
   జేరలి. ఆం.కౌ.సంధి.48, జేరలిచ. ఆం.శ.చిం.సంధి.33
   అలిజేః. వై.చం.సంధి.43 అల్యాగమస్స్యదరి ద్విందోః. ఆ.కౌ.సంధి.28

నీ యందున్ + భక్తి యని యుండగా (సమాసమున ద్రుతము లోపించి) ఈ సూత్రముచే అలి ఆగమముగా రాగా నీయందు + అలి – నీయందలి భక్తి యని యగును. ఇట్లె నాయందున్ + కరుణ – నాయందలి కరుణ.

వి. ఉకారాత్పరతః కిమ్? సప్తమీ నవర్ణస్య న (కాలేలేన?)

సప్తమీవిభక్తి యుకారమునకుఁ బరముగా వచ్చు ననుటచే నవర్ణకము సప్తమి యైన నదంత మగుటచే దాని కలి గాగమము రాదు. కువలయంబునవారు,ఇట లోపల సప్తమిగా వివృతి యందును జూపఁబడలేదు. ఒకటి చాలును యేమో?

వివృతియందలియాగమము కర్మధారయసమాసార్థక మనుటను యెట్లు సమన్వయించునో విచార్యము.

'జేః' అని సూత్రమున సామాన్యముగాఁ జెప్పఁబడని నుదంత మగు సప్తమికే 'అలి' వచ్చు నని వివృతి యందు విశేషముగాఁ జెప్పఁబడినది. అది యవసరమె. కాని యా యంశము లక్షణమున నున్న బా గుండెడిది. సప్తమి యం దుదంత 'మందు' ఒక్కటి కావున అందుకె అలిని విధించిన స్పష్టముగను నిర్బాధముగను నుండెడిది.

వీనిని తరువాతి సూత్ర వివరణము ననుసరించి వీనిని మధ్యమ పదలోపిసమాసములు గా వివృతి తలఁచె. నీ యందు ఉండెడు భక్తి, నాయందు నుండెడి కరుణ యనుతీరుగా వీయవి మధ్యమ పదలోపి సమాసములు.

జేః అనుచోట జేయనునది సప్తమ్యేకవచనమె. అయ్యు నిది సప్తమి కంతటికి ననఁగా నేక బహువచనములు రెంటి కుపలక్షణ మని యెంచఁదగును. అపుడు మీ యందలి భక్తి యను తీరుగా,బహువచన మగు అందునకు నలి వచ్చును. 'అందోరలిచ' యన్న నీ యిబ్బందియు లేకుండెడిది.

'జేః చ' యను నప్పటి చశబ్దముచే ఇందు ఎందునకును అలి వచ్చు ననవచ్చు. ఇందలి జనులు.

## 67. లుగమహతి.[1]

అమహతి = అమహదర్థమునందు (జేః = సప్తమికి), లుక్ = లోప మగును.

వి. అమహత్యందలోర్లుక్ స్యాత్. వనము చిలుక, నీరు కొంగ, కొలను రాయంచ.

1. లుక్ క్లిబే. త్రి.శ.4.16. హేమచంద్రసూత్రము

వనము చిలుక ఇత్యత్ర వనమం దుండెడి చిలుక ఇత్యర్థః.
నీరుకొంగ ఇత్యత్ర నీరునం దుండెడి కొంగ ఇత్యర్థః.
కొలనురాయంచ ఇత్యత్ర కొలనియం దుండెడి రాయంచ ఇత్యర్థః
నీయందలి భక్తి ఇత్యత్ర నీ యందు నుండెడిభక్తి ఇత్యర్థః.
నాయందలి కరుణ ఇత్యత్ర నాయందునుండెడి కరుణ ఇత్యర్థః.

అమహత్తులపైని 'అందలి' యనుదానికి లోపము వచ్చును. వనమందు + చిలుక యనుచో 'జేరలి చ' యను సూత్రముచే అలి రాఁగా వనమునందలి + చిలుక యని కాఁగా నీ సూత్రముచే 'అందలి' యన్నది లోపించి వనము చిలుక యని యగును. ఇట్లె యితరములు. నీరుకొంగ, (నీరునందు) కొలనురాయంచ (కొలనియం దని వివృతియందుఁ జూపఁబడుట ప్రమాద మనఁదగు) యనుచో నౌపవిభక్తికము రాలేదు. వచ్చుచో నీటి కొంగ, కొలని రాయంచ యని కావలయును. ఔపవిభక్తికము లాయ్యె యెడ వికల్పముగాఁ జెప్పఁబడుట పయిని గమనింపఁగలము.

వి. అమహతి కిమ్? రామునియందుఁ బుట్టె, హరియందు ఁబెరిగె.

సూత్రమునం 'దమహతి' యనుటచే మహత్తులపై నీ లోపము లేదు. రామునియందుఁ పుట్టె -ననుచో రామునిపుట్టె నిత్యాదిగఁ గాదు.

ఇచట వివృతి వ్యస్త స్థలముల నుదాహరించుట సంగతము గాదు. అమహత్తైమయినను వ్యస్తతలో నీ లోపకార్య ముండునా? వనమందుఁ బుట్టె ననుచో వనము పుట్టె, నీటియందుఁ బెరిగె, లేదా నీరునందుఁ బెరిగె ననుచో నీటి పెరిగె లేదా నీరు పెరిగె నని కాదు గదా. ఇంక మహత్తులపై లోపింపకుండుటలో విశేషమేమి?

పయిఁగా వివృతి 'అందలి' యనుదానికి లోపము వచ్చు నని చెప్పుచున్నది. అలి సమాసమునందుఁ గాక వ్యస్తలో నగునా? - కావున రామునియందలి భక్తి - రామునిభక్తి యనురీతిగాఁ గా దని సమస్తస్థలమునే యిట నుదాహరింప వలసినది.

ఇంక వివృతి సూత్రము చే 'అందలి' యనుదానికి లోపమును వచ్చు ననుటయు నవసరముగాఁ దోఁచదు. అలికిని లోపము చేయవలయునన్న ముందుగా 'జేరలిచ' యని 'యలి' చేయవలయును. అట్టియెడ 'నలి' చేయు గౌరవ మేల? 'జేరలి చ' యను పూర్వసూత్రమునుండి 'జేః' అనుదాని నీ సూత్రములోని కనువర్తింపఁజేయఁగా నమహతి జేర్లుక్స్యాని యర్థ మవుచు సప్తమియె లోపించును. 'అలి' ని జేయుటయు మఱల లోపింపఁజేయుటయు నను ననవసరప్రక్రియ యుండదు. వనమందలి యనుచో 'వనమ్' అనియె మిగులఁగా వనము చిలుక యె ట్లయినదను ప్రశ్నయు నుండదు.

ఇంక నీ లోపము నిత్య మన్నట్లుగనె లక్షణమునను విస్మృతి యందును జెప్పఁబడినది. దీనివలన వనము చిలుక, యనుచో వనమందలి చిలుక యనుదానిని సాధువు గా దని నిర్ణయింప వలసి వచ్చును. అది యుక్తము గాదు. ఈ లోపము వికల్ప మనవలయును.

'ఉభయవిధమ మహతీనా' మ్మను చింతామణి సూత్రమునందు 'అమహతి' యనుదానికి స్త్రీ వాచకేతరము లగునమహత్తు లని యర్థము గ్రహించినట్లె యిప్పటి 'అమహతి' శబ్దమునకును గ్రహింపవలయును. లేనిచో సీతయందలి భక్తి, సీతభక్తి యనురీతిగా నపరూపము లేర్పడును. రాముని (యందలి) భక్తి యసాధు వని చెప్పి సీత (యందలి) భక్తి సాధువే యనుటలో నౌచిత్యము గానరాదు.

ఇట్లె ధేనువు నందలి ప్రేమ, ధేనువుప్రేమ యని యగునా? చూడంజూడ నిక్కార్యము జడములయందు మాత్రమె కలదా యని సందేహము గల్గును.

అరు దగు నిట్టి స్థలములందును వనముయొక్క చిలుక, వనముచిలుక యనురీతిగా షష్ఠీ సమాసములుగాఁ జెప్పి యచటి యొక్క షష్ఠికి సప్తమ్యర్థమును జెప్పుకొను టుచితమా యనియు నాలోచింపఁదగి యున్నది.

విభక్తులు చేరవు. గోవింద కొఱకు అని యుండదు. గోవిందుని కొఱకు ననురీతిగా ఉత్వనివర్తకములు ప్రకృతులు చేరిన పిదప నే విభక్తి చేరును. ఇట్లే వనచేత నని గాదు. వనముచేత (హరిచేత ?)

## 69. ఔపవిభక్తి కాష్టిన్ టి జాదయః.[1]

టిన్, టిజాదయః = టిన్, టిజ్ - అను మొద లగునవి ఔపవిభక్తికాః = ఔపవిభక్తికములు.

వి. అస్మిన్ వికృతి శాస్త్రే టిన్ టిజాదయో వర్ణా ఔపవిభక్తిక సంజ్ఞా స్స్యుః.

ఈ తెలుఁగు వ్యాకరణమునందు టిన్, టిజ్ అను మొద లగు వానికి నౌపవిభక్తికము అని సంజ్ఞ. ఇందు టిజ్జు జిత్తు గావున ముందు బిందువు వచ్చును. కంటిని,

ఆదిశబ్దముచే అటిన్, అటిజ్ మొద లగునవి గ్రహిం పఁబడును. ఇవి పైని విధింపఁబడుచున్నవి.

ఔపవిభక్తికములను సంధిపరిచ్ఛేదముననే ప్రస్తావించుట యీ వ్యాకరణములయం దొకవిశేషము. ఆం.శ.చిం.లోను దదనుగణముగ ఆం.కౌ.లోను నిట్లె. శబ్దపరిచ్ఛేదమునం దాచ్ఛిక శబ్దనిరూపణ సందర్భమున వీనిని జెప్పఁదగు నని సూరిప్రణాళికను బట్టి స్పష్టము. ఇందు సంధికార్య విశేషములు నేవియుఁ దోపవు.

## 70. రులు ప్రభృతే ర్నామ్నామ్.[2]

ఔపవిభక్తికాః = ఔపవిభక్తికములు, నామ్నామ్ = ప్రాతిపదికలచివరి, రులు ప్రభృతేః =రు,లు, మొద లగువాని స్థానమున నగును.

వి. ఔపవిభక్తికాస్తే టిన్ టిజాదయోవర్ణా దేశ్యాది నామ్నామి దుద న్తానామే కవచనే[3] అమాదిషువిభక్తి షు + పరేషు స్యుః.

---

1. ఔపవిభక్తిక వర్ణా ష్టింట్యాదయో భవన్తి హ. ఆం.శ.చిం.
ఔపవిభక్తికాష్టింట్యాదయః. (ఆం.కౌ.సంధి.47)
రలో పథాత్ టిన్ టిజౌ? (త్రి.శ.4.4 హేమచంద్ర సూత్రము)
2. రులు ప్రభృతే ర్నామ్నామ్. (ఆం.కౌ.సంధి.48)
రులు ప్రభృతే ర్నామ్నాం స్యుస్తేహ. (ఆం.శ.చిం.)
అమాదే రేకవచనస్య. వై.చం.అజన్త.68.సూత్రవృత్తి
3. విభక్తి షుచ - ద్వితీయాది విభక్తిషుచ. ఆం.కౌ.సంధి.49.
రలో పథాత్. (ఆ.త్రి.శ.4.హేమచంద్రసూత్రము)

ఔపవిభక్తికము లగుటిన్, టిజ్ మొద లగు వర్ణములు ఇకారాంతములు, నుకారాంతములు నగు దేశ్యములు మొదలగుశబ్దములకు, ద్వితీయాది విభక్తులయం దేకవచనము పర మగుచుండఁగా నగును. ఇట వివృతి యందు రెండు విశేషములు చెప్పఁబడినవి.

ఔపవిభక్తికములు దేశ్యములు మొదలగు శబ్దముల కగు ననుట యొకటి, ఆది శబ్దముచేఁ దద్భవములు గ్రహింప వచ్చును. కాఁగా సంస్కృతసమేతరము లగు శబ్దముల కే యౌపవిభక్తికములు చేరు నని యర్థ మగుచున్నది. పై నాయాసూత్రములలో నేయే శబ్దముల కేయే యౌపవిభక్తికములు వచ్చునో చెప్పఁబడుచున్నది. దానిని బట్టి యవి సంస్కృత సమేతరములకే యగు ననియు, నాచ్ఛికశబ్దములకు నన్నింటికిఁ గా వనియుఁ దెలియవచ్చును. స్థూలముగా నీయవి యమహత్తు లగు నచ్చ తెనుఁగు శబ్దములు గొన్నింటికిఁ జేరు నని నిర్ణయింపఁదగును. (ఆలికి) తాఁబేటికి, త్రాటికి.

దేశ్యాదిశబ్దము లి దు దంతము లకు వచ్చు నన్నది వృత్తి. ఇదు దన్తానా మనుట విశేషము. 'రులుప్రభృతేః' అని సూత్రమున నుండుటనుబట్టి 'రులు' మొదలగు వాని కని చెప్పఁదగును. ప్రభృతిశబ్దముచే, ళు, లి, రి, వెుదలగునవి గ్రహింప వచ్చును. ఏ మై నను బైని సూత్రములలో నాయాశబ్దముల కగుట చెప్పఁబడుచున్నది కావునఁ బ్రస్తుత సూత్రము కేవలము స్పష్టతకు మాత్రమె యగుట గమనింపఁదగును.

ఇంక 'ఏకవచనే అమాదిషు విభక్తిషు పరేషు' అనునది ముఖ్యము. 'అమ్' సంస్కృత ద్వితీయైకవచనము కాఁగా, నౌపవిభక్తికములు ద్వితీయాద్యేకవచనములు పరమగునపు డగు నను నంశము మిక్కిలి ప్రధానమైనది. 'రులుప్రభృతేః' అనుటకంటెఁ గూడ ద్వితీయాద్యేకవచన పరకత్వమున (గొన్ని యమహన్నామములకు) నగు ననుట ప్రయోజనవంతమై యుండెడి దనవచ్చును.

వి. టిజ్+ ఇత్యాద్యనుస్వారః. టి, ంటి.

గోరు, నీరు, నోరు, నూఱు, (నోరు) కదురు, కుదురు, నుదురు,

ఎదురు, (ఏఱు) ఎసరు,

చూలు, బయలు, రోలు, నాఁగేలు, తాఁబేలు, కుందేలు,

కౌగిలి, ముంగిలి, ఎంగిలి, సందిలి, పందిరి (లి?)

నొసలు (పగలు?) మొదలు,

కాడు, కూడు, కోడెడు, బోడు, జాడు, గూడు, త్రాడు,

నాఁడు, నేఁడు,వీఁడు, బీడోడు, పండు, పుండు.

టిజ్ అనుచో జకార మిత్తు. జకార మిత్తగుఁ గలది గావున 'టి'వర్ణము జిత్తగును. జిత్తగుటచే 'జిదనుస్వారశ్చ' (శబ్ద 40) యనుసూత్రముచే ముందు బిందుపు చేయును. 'ంటి'. టిన్ లో నకారమిత్తు కావున 'టి' వర్ణము మాత్రమె యగును.

రు, లు, డు, లి వర్ణాంతము లగు నిట్టి యౌపవిభక్తికములు చేరు శబ్దములు గొన్ని వివృతి చూపినది. వాని యౌపవిభక్తికాంతరూపములు పయిసూత్రము నొద్దఁ జూపుచున్నది. కోడేడు – కోడు, ఏడు అనుశబ్దము లిం దేడు సంవత్సరవాచకము. దీ డోడు – దీడు శబ్దమును, ఓడు శబ్దమును పరరూప మయినది.

## 71. పుండ్వాదీనాం టిన్.

వి. ఏషాం టిన్ స్యాత్.

పుండు ఆదీనామ్ = పుండు మొద లగుశబ్దములకు టిన్ = టిన్ అను నౌపవిభక్తిక మగును.

ద్వితీయాద్యేకవచనములు పర మగుచుండఁగా పుండు మొద లగుశబ్దముల యంత్యాక్షరము స్థానమున 'టిన్' అను నౌపవిభక్తిక మగును. టిన్ లో నకార మిత్తు గావున టివర్ణమె నిల్చును. ఉదాహరణములు వివృతియందు గమనింపఁదగును. పూర్వసూత్రమునఁ జూపిన శబ్దములకుఁ గ్రమముగా నిట నౌపవిభక్తికాంతరూపము గుర్తింపవచ్చును.

వి . గోటిని, నీటియందు, నూటికి, నోటి వల్లి. క దుటికి,
కదుటిలోను, నుదిటిమీఁద, ఎదుటివాఁడు,
ఏటినీళ్లు, ఎసటి నీళ్లు,
చూటి పసరము, బయటికి, రోటిమీఁద, నాఁగేటిచాలు,
తాఁబేటిపెంకు, కుందేటి పిల్ల,
కౌఁగిటిలోను, ముంగిటి వడ్లు, ఎంగిటి మెతుకు,
సందిటి తాయెతు, పందిటి గుంజ,
నొసటి బొట్టు, పగటి చుక్క, మొదటి చూపు,
కాటి బూచి, కూటి మెదుకు, కోటినులక, ఏటి మీఁద,
జోటి కేమి,జాటినేల, గూటి చిలుక, త్రాటిమీఁద,
నాఁటిదొర, నేఁటి రాజు, వీటిలోను, బీటినేల,
ఓటి చెఱువు, పంటిని, పుంటి తోలు,
ఇత్యాదీనాం టిన్స్యాత్.

జాడు - క్షీణసస్యము. వీనిలో నొసటి బొట్టు మొదలగు మూడు శబ్దములు లువర్ణాంతములు. వానిని జైని చూటివసరమిత్యాదులలోఁ జూపిన నొక క్రమ ముండెడి దనిపించు.

సూత్రమున వా టిన్, అని సూత్రమున వ్రాతప్రతిలో వా శబ్ద మున్నది. కాని వివృతిలో వికల్పమని చెప్పబడలేదు. వాశబ్దము ప్రమాదపతితము కావున వుండును, వుండుచేత నిత్యాదివ్యవహారము గుదుర కున్నది.

తాఁబేటి పెంకు, కుందేటి పిల్ల యనునుదాహృతులను బట్టి యౌపవిభక్తికములు ప్రాణివాచకములకు రావను నభిప్రాయము సరి గాదని స్పష్టము.

ఇందు నడుమ నడుమ సమాసములు నుదాహరింపఁ బడినవి. అట విభక్తి పరకతలో నైన యౌపవిభక్తిక మె సమాసమున నిల్చిన దని గ్రహింపఁదగును. కుదుటియొక్క - కుదుటి లోను మె॥

## 72. కను చను మిను విను పొను పలు విలు ములు.

వి. ఇలు జున్వాదీనాం టిజ్

ఏషాం టిజ్వా స్యాత్.

కను - జున్వాదీనామ్ = కను -- జును మొదలగు శబ్దములకు ద్వితీయాద్యేకవచనము పర మగునపుడు, టిజ్ = టిజ్ అను నౌపవిభక్తికము వా = వికల్పముగా నగును.

ద్వితీయాద్యే కవచనము పర మగునపుడు కను, చను, మిను, విను, పోను, పలు, విలు, ములు, ఇలు, జును మొద లగు శబ్దముల యంత్యాక్షరము యొక్క స్థానమున 'టిజ్' అను నౌపవిభక్తికము వికల్పముగా వచ్చును. 'టిజ్' అనుచో జ కార మిత్తు. కావున 'జి దనుస్వారశ్చ' యను సూత్రముచే నీ 'టి' వర్ణమునకు ముందుబిందువు వచ్చిచేరును.

ఏషాం టిజ్ 'వా' స్యాదనుచో వివృతి యందలి వాశబ్దము గలదు. కాన 'రోఁకలి, ఆకలి మొద లగు తరువాతి సూత్రమునుండి 'వా' శబ్దమిం దపకర్షింపఁబడినట్లు గ్రహింప వచ్చును. ఉదాహరణములు వివృతియందుఁ జూడదగును.

వి .కంటిరెప్ప, చంటి పాలు, మంటిమీఁద, మింటి కెగసె.

వింటి చంద్రుఁడు, పొంటి చెలిమి, పంటికప్పు, వింటి

కొప్పు, ముంటి మొన, ఇంటి మీఁద, జుంటి తేనె,

ఇత్యాదీనాం టిజ్వా స్యాత్.

ఇం దెక్కుడు సమాసములే చూపఁబడినవి.

వి. వేతికిమ్, గోరుమొన, గోటి మొన, నీరువడి, నీటివడి,
నూఱుమీఁద, నూటిమీఁద, నోరుచవి, నోటిచవి.
నుదురుచుక్క, నుదుటిచుక్క ఇత్యాది. కన్ను ఱెప్ప, కంటి ఱెప్ప.
చన్నుపాలు, చంటిపాలు, మ న్నుమీఁద, మంటిమీఁద, మిన్నువాఁక
మిం టివాఁక ఇత్యాది.

టిజ్వర్ణము వికల్పమని చెప్పుటవలన గోరుమొన, నీరువడి మొదలగు రీతిగా నౌపవిభక్తికము రాకుండుట సాధింపఁబడు చున్నది. ఇట నన్నియు సమాసములే చూపఁబడినవి. కాని వ్యస్తతలో గోరునకు, నీరును, నూఱుకొఱకు ననుతీరుగా నౌపవిభక్తికములు రాకుండుట గానరాదు. అట్టి యెడల సాధారణముగా వికల్పమని చెప్పుట యెంతవఱ కుచితమో నిర్ణయింపరాకున్నది. వాసేమ (84) అని ప్రత్యేక లక్షణ మెట్లు ను న్నది.

ఇంతకు ముందు వివృతిలో నివి ద్వితీయాద్యేకవచనములు పర మగునపు డగుటయే ప్రస్తావింపఁబడినది. సమాసములు ప్రస్తావింపఁబడలేదు. వీనికి మార్గాంతర మనుసరింపఁదగు. లేదా సూరివలె నౌపవిభక్తికములు ప్రాయికముగా నగునని, రాకుండుట, యరు దగుట సాధింపఁదగు ననిపించును.

కను, చను ఇత్యాదిగా శబ్దములను బెక్కింటిని సూత్రమున నిర్దేశించుట వలనఁ బ్రయోజనము గానరాకున్నది. ఇంతకు నాశబ్దము లెల్ల నివి యని స్పష్టముగాఁ బేర్కొనలేదు. 'జాన్వాదీనా' మని యాది శబ్ద మిట్లు ను దప్ప లేదు. అట్టి యెడలఁ గను చను ఇత్యాదిగా బెక్కుశబ్దములను సూత్రమునఁ బఠింప నేల. 'పుంద్వాదీనాం టిన్' అన్నట్లుగా 'కన్వాదీనాం టిజ్' అని మాత్రమె సూత్రింపఁజాలును.

73. రోఁకలి ఆఁకలి గొడ్డలి గుద్దలి కొడవలి విడవలి.

బాణల్యాదీనాం వా టిన్- టిజౌ

వి.ఇత్యాదీనామ్ టిన్ టిజౌ (వికల్పేన) స్తః.

**రోఁకలి ---భాణల్యాదీనామ్ = రోఁకలి -- బాణలి మొద లగు శబ్దములకు, వా = వికల్పముగా టిన్, టిజౌ - టిన్, టిజ్ అను నౌపవిభక్తికము లగును.**

ద్వితీయాద్యే కవచనము పర మగునపుడు రోఁకలి, ఆఁకలి, గొడ్డలి, గుద్దలి, కొడవలి,

పీడవలి, బాణలి మొదలగుశబ్దముల యంత్యాక్షరమునకు (లివర్ణమునకు) వికల్పముగా టిన్, టిజ్+ అను నౌపవిభక్తికము లగును.

ఇంతకుఁ బూర్వపు సూత్రమున వలనె యిచ్చట, గూడ 'నాది' శబ్దము ప్రయోగించునపుడు రోఁకలి మొదలుగాఁ బెక్కుశబ్దములను సూత్రమునఁ బఠింపవలసిన యవసరము లేదు. రోఁకల్యాదీనా మని మాత్రమె చెప్పనఁజాలును. ఆఁకలి ప్రభృతులు రోఁకల్యాదుల లోనివే యగును గదా.

ఇచట సూత్రము నందును, వివృతియందును 'అటినటిజౌ' యని యౌపవిభక్తికములు అటిన్, అటిజ్+ అని యకారపూర్వకములుగా వ్రాఁత ప్రతియం దున్నవి. కాని యది ప్రమాద మని నిశ్చయింపవచ్చును. రోఁకలి ప్రభృతు లగు నీశబ్దము లన్నింట లివర్ణమునకుఁ బూర్వ మత్వమె యున్నది. ఈ యౌపవిభక్తికములులివర్ణమున కాదేశ మగుచున్నవి. రోఁక – టి–రోక టిజ్ అని మాత్రమె యనఁగా టిన్ 'టిజ్లులుగా మాత్రమె వీనిని విధింపఁజాలును. అకారపూర్వకములుగాఁ జెప్పుట వలన (రోఁక + అటి) సంధి చేయవలసిన గౌరవము తప్పఁ బ్రయోజనము లేదు.

ఇంకను 'అటిజ్' అనుచో 'అటి' అన్న మొత్తము జిత్తగును గావున 'జిదనుస్వారశ్చ' యనుసూత్రముచే నగు బిందువు 'అటి' అనుదానికి ముం దయి 'అంటి' యని యగును. 'రోకంఅటి' అనురీతిగా నిచట నేర్పడు నవపరూపములే. 'అటి' అను మొత్తము జిత్తుగాఁగా నారెంటి నడుమ బిందు వెట్లు వచ్చును? అంటి యని యె ట్లగును? ఇంకను 'అంటి' యని తప్పక రావలసిన సందర్భమునందు' అప్పుడిప్పుడెప్పుడ్వాదీనా మటి జంటిచౌ (77) యని 'అంటి' అనియే విధించుట గమనింపవచ్చును. తరువాత సూత్రమున 'ఇంటిక్ విధింపఁబడినది. అట అటిజ్+, ఇటిజ్+ అని విధింపఁబడకుండుట పై య నౌచిత్యము వలననే యని గ్రహింప వచ్చును.

కాఁగా వీనిని బట్టి యిట సూత్రవివృతులలో అటిన్ – టిజౌ యని యుంట ప్రమాద మని నిర్ణయింపఁదగును. టన్ – టిజౌ యనియే యుండవలయును.

మొత్తము పై నీ సూత్రము రోఁకల్యాదీనాం వా టిన్ టిజౌ యని మాత్రమె చెప్పనఁ జాలు నని స్పష్టము. ఉదాహరణములు వివృతి యందు గమనింపఁదగును.

వి. రోఁకలిని, (రోఁకటిని,) రోఁకంటిని, ఆఁకలిచేత.
(ఆఁకటి చేత) లఁ కంటి చేత, గొడ్డలి కొఱకు,
గొడ్డటి కొఱకు, గొడ్డంటి కొఱకు, గుద్దలివల్ల,
గుద్దటివల్ల, గుద్దంటివల్ల, కొడవలికి, కొడవటికి,

కొడవంటికి, విడవలియందు, విడవటి యందు,
విడవంటి యందు, బాణలిచిప్ప, బాణటిచిప్ప,
బాణంటిచిప్ప ఇత్యాదీనాం త్రివిధం రూపమ్.

విడవలి = ఇండ్లకు కప్పెడు తృణ విశేషము. సూత్రమునందలి యాదిశబ్దమునకు వివృతి యందు నాది శబ్దమె ప్రయోగానుసారముగా గ్రహింపవలె.

## 74. కాలమానయోశ్చ.

కాల మానయోః చ = కాలమును, మానమును దెల్పు శబ్దములకుఁ గూడ టిన్, టిజ్+ మొదలగు నౌపవిభక్తికము లగును.

వి. కాలవాచి మానవాచీనాం శబ్దానాం టిన్ టిజా
దయస్స్యుః.

కాలమును దెల్పు (రాత్రి మొ॥) శబ్దములకును, పరిమాణమును దెల్పు (దోసిలి మొ॥) శబ్దములకును, టిన్, టిజ్ మొదలగు నౌపవిభక్తికములు ద్వితీయాద్యేకవచనములు పర మగునపు డగును.

ఏయే శబ్దముల కీయౌపవిభక్తికము లగునో మీఁది సూత్రములందుఁ జెప్పఁబడుచున్నది. కాఁగా నీ సూత్రముచేఁ బ్రత్యేకముగాఁ గొన్ని శబ్దముల కౌపవిభక్తికములు వచ్చునవకాశము లేదు.

ఈ సూత్రము చెప్ప కున్నను నష్టము లేదు. 'రులు ప్రభృతేర్నామ్నా' నను దాని వంటిదే యిదియును.

## 75. రాత్రి తొల్లి ఎల్లి దోసిలి పిడికిల్యా దీనాం టిన్ టిజౌ స్పష్టమ్.

రాత్రి-- పిడికి ల్యాదీనామ్ = రాత్రి----పిడికిలి మొదలగు శబ్దములకు టిన్ టిజౌ = టిన్, టిజ్, అను నౌప విభక్తికములు వచ్చును.

ఇచటఁ గూడ నాది శబ్ద మున్నది. కాఁగా రాత్ర్యాదీనామని మాత్రమే చెప్పనఁజాలును.

వీనిలో రాత్రి, తొల్లి, ఎల్లి, యన్నవి కాల వాచకములు గాఁగా దోసిలి పిడికిలి యన్నవి మానవాచకములు కాఁగా భేదమును దెల్పవలయు నన్న నొక కాలవాచక శబ్దమును నొక మానవాచక శబ్దమును జేరి రాత్రి దోసిల్యాదీనాం టిన్ టిజ్ అనవచ్చును. కాని కాలవాచకములను మానవాచకములను వేఱుచేయుటవలనఁ బ్రయోజనము గానరాదు. కావున రేయ్యాదీనాం లేదా రేయి ప్రభృతీనాం టిన్ టిజౌ యన్నఁ జాలు.

ఉదాహరణములు వివృతి యందు గమనింపఁదగును.

వి. రాత్రిటివెన్నెల, రాత్రింటి వెన్నెల, తొల్లిటిదారి, తొల్లింటిదారి, ఎల్లిటికి, ఎల్లింటికి, దోసెటినీళ్లు, దోసెంటి నీళ్లు, పిడికెటి ముత్యాలు, పిడి కెంటి ముత్యాలు ఇత్యాది.

వీనిలో రాత్రితొల్లి శబ్దములకు టిన్ - టిజ్లు లాగమముగా వచ్చుట గమనార్హము. సూత్రమున దోసిలి పిడికిలి యనిలివర్ణాంతశబ్దములే చూపఁబడినవి. కాని యుదాహరణములందు దోసెటి నీళ్లు, పిడికెంటి ముత్యా లనుచో దోసెఁడు, పిడికెఁడు అనురీతిగా ఎఁడు ప్రత్యయాంతములపై నుండుట విశేషము. దోసింటిని ఇత్యాదు లుండవు. సూత్రముననే ఎఁడు ప్రత్యయాంతములు చెప్పలే దేలకో? వీనికిఁ జివరి యక్షరమున కాదేశమైనవి. ఆదేశములా? ఆగమములా? యన్న సంశము లక్షణమున నిర్దేశింపఁబడకుండుటచే లక్ష్యానుసారముగనె వానిని గుర్తింపవలసియుండును.

ఇంక వీనిలో రాత్రిశబ్దము సంస్కృతసమము. (ఈ గ్రంథమునఁదద్భవముగను దలఁపఁబడినట్లు తోఁచు. తద్భ) దానిపై నౌపవిభక్తికము చెప్పుట విచార్యము. రాత్రికి నని యే యుండు. రాత్రిటికి ననురీతి రూపములు మృగ్యములు. రేయి శబ్దము చెప్పఁదగినది.

## 76. వెనుక ముంద్వో(దరో) ర్వా.

వెనుక ముంద్వోః (దరోః) = వెనుక ముందు(దర) అనుశబ్దములకు, వా = వికల్పముగా టిన్ టిజౌ = టిన్, టిజ్ అనునవి యగును.

వి. తయోరవ్యయనామ్నో టిన్ టిజౌ వా స్తః. వెనుకటికి, వెనుకంటికి, ముందటికి, ముందంటికి.

వెనుక ముందు(దర) అను శబ్దములకు ద్వితీయాద్యేకవచనము పర మగునపుడు టిన్ టిజ్ అనునౌపవిభక్తికములు వికల్పముగా నగును. రాత్రి తొల్లి మున్నగు పూర్వ సూత్రమునుండి 'టిన్ టిజౌ' యనుదశమిం దనువర్తించును.

షష్ఠ్యేకవచన పరకతలో వెనుక శబ్దమునకు 'టి' వర్ణ మాగమము గాఁగా వెనుకటికి 'ంటి' వచ్చిన వెనుకంటికి.

వి. (వెనుకకు) ముందర శబ్దస్య సర్వనామత్వా దిత్వమ్. ముందరికి

'వా' యనుటచే వికల్పము గావున టిన్ టిజ్జులు రానిపక్షము నందు వెనుక శబ్దమునకు వెనుకకు (ముందుకు).

ముందర యనునది సర్వనామము గావున ('అవ్యయసర్వనామ్నోః' అని) యిత్వము వచ్చి ముందరికి అని యగును.

ద్వితీయాద్యేకవచన పరకత్వమున వచ్చునౌపవిభక్తికములను జూపుచునే వివృతి వెనుక - ముందు శబ్దము లవ్యయము లనుట యసంగతము. ఇయ్యవి నిత్యైకవచనాంతములు. నిత్యైకవచనాంతముల నవ్యయము లనుట సరి గాదు గదా.

సూత్రమునందు 'ముంద్వోః' అని యున్నది. ఇది యిట్లె యైన ముందుశబ్దమునకు టిన్ టిజ్జులు వచ్చిన ముంధుటికి ముందుంటికి నని యగును గాని యత్వ మెట్లు వచ్చును? పూర్వసూత్రమమున విధించిన వి టిన్ టిజ్జులే గదా. పోనీ తరువాత సూత్రమునుండి అటిచ్ - అంటిచ్ అగు నందమా? అది యెంతవఱ కుచిత మనుట య ట్లుంచి వివృతి 'టిన్ టిజో' యనియే వివరించినది.

పోనీ సూత్రమునందు ముందర శబ్దము గ్రహింతమా? ('వెనుక ముందరోర్వా')-'వెనుక' కాగమములును, ముందర నంత్యాక్షరమున కాదేశ మగు నవ వచ్చును. పూర్వసూత్రమున(రాత్రి) తొల్లి ఎల్లి అనువాని కాగమములు గాఁగా దోసెఁడు పిడికెఁడు అనుచో నాదేశము లగుట గుర్తించితిమి గదా.

కాని పిదప 'ముందరశబ్దస్య సర్వ నామత్వాత్' అనుట యొక విరోధముగాఁ దోఁచుచున్నది. 'తయోరవ్యయనామ్నః' అనుచో నిది యవ్యయముగాఁ బేర్కొన్నది గదా.

దీనిచే ముందుశబ్ద మవ్యయమును, ముందర శబ్దము సర్వనామము నని వివృతికర్త తలఁచెనా యనిపించు. అవ్యయ సర్వనామములు సమములు గావు గదా. సర్వనామములు నవ్యయములగునని వివృతి కర్త తలఁచి యున్న ముందర అనునదే పైని గ్రహింపవచ్చును.

కాలమానములనురీతిని వివక్షింపక పూర్వ సూత్రముననే వీనిని గూడఁ గలుపుట లాఘవము.

## 77. అప్పు డిప్పు డెప్పుడా దీ నామటిజంటిచౌ.

అప్పుడిప్పుడెప్పు డాదీనామ్ = అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు మొద లగుశబ్దములకు, అటిచ్, అంటిచౌ = అటిచ్, అంటిచ్ అనునౌపవిభక్తికము లగును.

వి. ఏషా మవ్యయనామ్నా మటి జంటి జావాదేశౌ స్తః.

అప్పటికి, అప్పంటికి, ఇప్పటిరాజు, ఇప్పంటి రాజు,

ఎప్పటిరీతి, ఎప్పంటి రీతి.

ద్వితీయాద్యేకవచనము పర మగు నపుడు, అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు మొదలగు శబ్దముల యంత్యాక్షరమునకు, అటిచ్, అంటిచ్ అనునవి యగును. అటిచ్, అంటిచ్ అనువానిలోని చకార ముచ్చారణార్థము చేర్పఁబడినది. కావున అటి, అంటి యనునవి యగును.

అప్పుడు అనుశబ్దమునకు షష్ఠ్యేకవచనము నందు 'డు' వర్ణమునకు 'అటి' యనున దాదేశము గాఁగా అప్పు + అటి - సంధి యై అప్పటికి నని యగును. అంటి యను నది యైనచో అప్పంటికి నని యగును. ఇట్లే యితరములు.

అప్పుడిప్పుడెప్పుడాదీనా మనుచో సంస్కృతమునఁ దెలుఁగు సంధి కార్యము లుంట విశేషము. పుంద్వాదీనా మున్నట్లుగా అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడ్వాదీనా మని యైనఁ జెప్పవలసినది, రోఁకలి ఆఁకలి అను సూత్రమున నిట్లు చూపఁబడినది. అచట రోఁకల్యాకలి యనురీతి నున్న నిచట నప్పుడ్విప్పుడ్వెప్పు డ్వాదీనా మని యుండవలె నదియె యుచిత మనిపించును.

## 78. ఒకట్యాదే రిటి గింటి కౌ.

ఒకట్యాదేః = ఒకటి మొదలగు శబ్దములకు, ఇటిగింటికౌ = ఇటిక్, ఇంటిక్ అనునౌపవిభక్తికములు అగును.

వి. (ఒకటి) ఇత్యాదీనాం పదానామంత్యస్య ఇటి గింటి కౌ వాగమౌ స్తః.

ద్వితీయాద్యేకవచనము లు పర మగునపుడు ఒకటి మొదలగు శబ్దములకు ఇటిక్, ఇంటిక్, అనునౌప విభక్తికము లాగమము లగును. ఇటిక్ ఇంటిక్–అను చోట్ల కకార మిత్తు. కావున ఇటి, ఇంటి యనునవి కిత్తులు. 'ఆద్యన్తౌ టకితౌ' యనుపాణినీయ పరిభాష ననుసరించి, ఇటి, ఇంటి యనునవి ఒకటి మొదలగు శబ్దములకుఁ జివర వచ్చి చేరును.

ఉదాహరణములు వివృతి యందు గమనింపఁదగును.

వి. ఒకటిటికి, ఒకటింటికి, రెండిటికి, రెండింటికి,
మూఁడిటికి, మూఁడింటికి, నాలుగిటికి, నాలుగింటికి,
అయిదిటికి, అయిదింటికి, ఆఱిటికి, ఆఱింటికి,
ఏడిటికి, ఏడింటికి, ఎనిమిదిటికి, ఎనిమిదింటికి,
తొమ్మిదిటికి, తొమ్మిదింటికి, పదిటికి, పదింటికి,
నూఱిటికి, నూఱింటిక్కి, వేయిటికి, వేయింటికి ఇత్యాది.

ఇచట తొమ్మిదియింటికి పదియింటికి ననియుఁ బ్రయోగములు గానవచ్చును.

ఇట సూత్రమున వ్రాఁతప్రతిలో 'వా' శబ్దము గానవచ్చును. కాని వివృతియందుఁ గాని యుదాహరణములందుఁ గాని వికల్పత చెప్పఁబడకుండుటచే 'వా' శబ్దము పొరపాటునఁ జేరిన దని గ్రహింపఁదగును.

ఒక టిటికి, ఒకటింటికి ననురూపములు లభ్యమై నపుడు ఒకటి శబ్దము నౌపవిభక్తికముగాఁ జెప్పఁదగును. అట్టివి కావ్య వ్యవహారమునఁ గానరావు. సూరి ఒకటి యౌపవిభక్తికముగాఁ బేర్కొనలేదు.

## 79. ఏకద్విత్ర్యొండు వేయిశతానామన్త్యస్య.

ఏక ద్వి త్రి ఒండు వేయి శతానామ్ = ఒకటి, రెండు, మూఁడు, ఒండు, వేయి, నూఱు అను శబ్దములకు, అన్త్యస్య = చివరి యక్షరము యొక్క స్థానమున టిన్ టిజ్లు లగును.

వి. ఏషాంశబ్దానా మన్త్యాక్షరస్య టిన్ టిజావాదేశౌ స్తః.

ఒకటి రెండు మూఁడు ఒండు వేయి నూఱు అను శబ్దముల యందుఁ జివరియక్షరమున కాదేశముగా,టిన్, టిజ్ అను నౌపవిభక్తికము లగును. ఉదాహరణము వివృతియందు గమనింపఁదగును.

వి. ఒకటికి, ఒక్కంటికి, రెంటికి, మూఁటికి, ఒంటికి,
వేయింటికి, వేయిటికి, నూటికి ఇత్యాది.

ఈ సూత్రమును వివృతియు నంతయు మిక్కిలి ప్రమాదభరిత మై యున్నది.

సూత్రమునం దేక ద్వి త్రిశత శబ్దములు సంస్కృతములు కాఁగా నడుమ నున్న ఒండు వేయి శబ్దములు తెలుఁగులు. వీని కూర్పే విశేషము.

అంత్యాక్షరమున కాదేశము గావలె నీయవి. వేయి శబ్దమున కాగమములే కాని యాదేశములు గావు. ఆదేశము లయిన వేటికి నని కావలె. ఇటఁ జూపిన వేయిటికి, వేయింటికి నన్నవి పూర్వసూత్రస్థలమున నుదాహరింపఁబడియే యున్నవి.

'ఒండు' శబ్దము ప్రథమై కవచనాంతము. ప్రథమై కవచనాంతముపై ద్వితీయాదులు చేరుటయు నౌపవిభక్తిక మగుటయు నసంగతము లనక తీఱదు. ఒంటిని, ఒంటిచేత ఇత్యాది రూపములే యుండవు. (ప్రౌఢవ్యాకర్త ఒంటి యను తద్ధితాంత రూపము సాధించె నవి యా ఒంటిశబ్దము చే నేర్పడినవి గావచ్చును గాని ఒకటికి నిత్యార్థములందు లేవు.) కాఁగా లక్షణమునఁ జూపిన తెలుఁగు శబ్దములు రెండు నసంగతము లైనవి.

'ఏకార్థక' శబ్దమునను సంత్యాక్షరమున కాదేశము గావలెఁ గదా. ఒకటికి, ఒకంటికి నని చూపుటనుబట్టి ఒకటి శబ్దము గ్రహింతుమా? ప్రథమైకవచనాంతరూపముననే టివర్ణ ముండఁగా నదియే ద్వితీయాదులందు నుండును గదా. కావున నది యౌపవిభక్తికము గానేరదు. ఒకఁడు గ్రహించెద మన్నను నందలి డజ్జ ప్రథమైనవచన మగుటచే దానిపై ద్వితీయాది విభక్తులు చేరుటయు డువర్ణమునకు టింటు లగుటయు నసంగతములు. అందుకే సూరి సంఖ్యా వాచకములలో రెండు మొదలగునవి యౌపవిభక్తికము లని పేర్కొనెను.

ఇంక ద్వి త్రి శత శబ్దములు మూఁడే మిగిలినవి. వీని నంత్యాక్షరమున కాదేశ మగుట యథార్థమె. రెంటికి, మూఁటికి, నూటికి. కాని యిట టిన్ ప్రత్యయము మాత్రము చాలు. ఉన్నచోట బిందువు పూర్వ సిద్ధమె కావున టిజ్విధాన మనవసరము. వివృతియందు టిజ్జుగూడఁ జెప్పఁబడినది.

'పుంద్వా దీనాం టిన్' ఇత్యాదులలో నంత్యాక్షరమున కాదేశ మైనను నది లక్షణమునఁ జెప్పఁబడలేదు. ఇట నన్త్య స్య యనుట విలక్షణమె. పూర్వసూత్రముచే నాగమములు గాఁగా నిట నాదేశము లగుటకై యిట్లు చెప్పఁబడిన దందుమా. పూర్వ సూత్రమున ఇటిక్ ఇంటిక్ అని కిత్తులుగా నిర్దేశించుటచే న ట్లయినవి. అది య ట్లుండఁ బూర్వ సూత్రమున ఇటిక్, ఇంటిక్కులు విధింపఁబడఁగా నిట టిక్, టిజ్జు లగు నను నర్థము గలుగుట యొకవిశేషము.

'ద్విత్రిశతానాం టిన్వా' యన్నఁజాలు నేమో. సంఖ్యావాచకములను వేఱు చేయుట వలనఁ బ్రయోజనము లేమి గుర్తింపఁగా రెండు, మూఁడు, నూఱు, శబ్దములను పుంద్వాదులలోఁ జేర్చిన నీ రూపములు సిద్ధించి మొత్తముపై నీ సూత్ర మనవసర మవి వ్యక్త మగును.

## 80. నిన్న మొన్న రేపు మాపు మునుపంతసే(పు ఆ) ప్వా దిభ్యోఽటిగంటికౌ.

నిన్న---అంత సేప్వాదిభ్యః = నిన్న -- అంత సేపు మొదలగు శబ్దములకు, అటిగంటికౌ = అటిక్ అంటిక్ అను నౌపవిభక్తికము లగును.

## వి. ఏభ్యోఽవ్యయనామభ్యః పరతోఽటి గంటికౌ ప్రత్యయౌ స్తః కిత్వాదన్త్యావయవౌ.

నిన్న, మొన్న, రేపు, మాపు, మునుపు, అంతసేపు మొదలగు (నవ్యయ) శబ్దములకు ద్వితీయాద్యేకవచనము పర మగునపుడు అటిక్ అంటిక్ అను నౌపవిభక్తికములు చేరును. అటిక్, అంటిక్ అనుచోట కకార మిత్తు. కావున కిత్తు లగు అటి, అంటి యనునవి 'అద్యన్తౌటకితౌ' యను పాణినీయ పరిభాష ననుసరించి నిన్న మొదలగు శబ్దములకుఁ జివరఁ జేరును.

ఉదాహరణములు వివృతి యందు గమనింపఁదగును.

వి. నిన్నటికి, నిన్నంటికి, మొన్నటికి, మొన్నంటికి, రేపటికి,
రేపంటికి, మాపటికి, మాపంటికి, మునుపటికి,
మునుపంటికి, అంత సేపటికి,
అంతసేపంటికి ఇత్యాది.

సేపు అనునది విడిగా నుండదు గావున నంత శబ్దముతోఁ గూర్చి చెప్పఁబడినది. (తద్ధిత - 65) అంత శబ్దమునకు వేఱుగా నీయవి విధింపఁబడలేదు. ఇవి యెల్ల కాలవాచకము లగుట స్పష్టము. అంతాదులకు కాలబోధనమున సేపు అగుట (తద్ధిత - 65) పిదపఁ జెప్పఁబడుచున్నది. 'అంత' అన్నది వేఱుగాఁ జెప్పిన నీ కాలవాచకముల నడుమఁ బరిమాణవాచకశబ్ద ముంట సక్రమముగా నుండదు. కాన నట్లు తలఁప రాదు.

ఇఁక మిగిలిన వానిలో 'నిన్న మొన్న' అనునవి యదంతములే కావున వీనికి అటిక్, అంటిక్కులు విధింప నక్కఱ లేదు. తరువాతి రేపు మాపులను బట్టి నిన్న మొన్న లిక్కడకు వచ్చియుండు ననిపించును. కాని 'రాత్రి' తోల్లి ఎల్లి' యను సూత్రమునను వీని కవకాశము గలదు. కాన వానిలో నిన్న మొన్నలు చేర్పఁదగును. ఇక్కడ ననవసరము.

ఈ సూత్రమునను నాదిశబ్దము తప్పలేదు. కావునఁ గొన్ని యైనశబ్దములను సూత్రమునఁ బఠించుట కంటె మాప్యాదిభ్యః అనియో లేక పువర్ణాంతే ర్యోఽటిగంటికౌ యనియో చెప్పుట యొప్పు ననఁదగును.

## 81. హా ట్టిన్ టిజౌ.

హాత్ = హ్రస్వముకంటెఁ బరముగా, టిన్ టిజౌ = టిన్ టిజ్ అను నౌపవిభక్తికములు రెండు నగును.

వి. హ్రస్వాక్షరాత్పరతష్టిన్ టిజౌ స్తః ఎనిమిదిటిని, ఎనిమిదింటిని.

హ్రస్వము కంటెఁ బరముగా టిన్ టి జ్‌లు వచ్చును.ఎనిమిదిటిని ఎనిమిదింటిని దివర్ణము నందలి యికారము హ్రస్వాంతము గావున హ్రస్వము. కావున దానిపై రెండు నయినవి. (హ్రా హ్రస్వస్య. సంజ్ఞా - 15) అను సూత్రముచే 'హ' యనఁగా హ్రస్వము.

ఇచట టినిటిజౌ యని సూత్ర వివృతుల నుంట ప్రమాదము. 'ఇటిజ్' అనుచో 'ంఇటి' అన్నరీతిగాఁ గావలసివచ్చును. ఎనిమిదింటికి నని కానేరదు, ఒకట్యాదుల ఇటిక్ ఇంటిక్ అనునవి విధింపఁబడినవి. అచట నొకట్యాదులలోఁ జూపిన ఎనిమిదిశబ్దమునే గ్రహించి దానిపై టిన్ టిజ్లు లయిన పనులు వివృతి యందలి విశేషము.

'హోత్విద్ధసాధ్యో' యని చెప్పినట్లుగా హ్రస్వము పై మాత్రము టివర్ణమును, బూర్ణ బిందుపూర్వకటివర్ణము నవు నని చెప్పుట దీని యుద్దేశ మై యుండు ననఁదగును.

అంటిచ్ అంటిక్ ఇంటిక్ అనుచో బిందువు హ్రస్వపూర్వకముగ విధింపఁబడియున్నది. కావున అంటిచ్ అంటిక్, ఇంటిక్కులు హ్రస్వముపై నగు నని చెప్ప నక్కఱ లేదు. కావున టిఙ్ విషయమె చెప్పఁబడినది. కాని యీటిఙ్లు కూడ హ్రస్వముపై నగు నని వేఱుగాఁ జెప్పవలసిన యవసరము గానరాదు. ఆయా యౌపవిభక్తికము లాయా శబ్దములపై నగుట ప్రత్యేకముగాఁ జెప్పఁబడుటవలన దీర్ఘముపై టిఙ్లు వచ్చునవకాశమె లేదు.

ఇది సంఖ్యా వాచకముల యెడనే యుద్దేశించె నన్నను నిట్లు చెప్ప నక్కఱ లేదు. నూఱిటిని, నూఱింటిని అనుచో హ్రస్వముపై టిన్ టిఙ్లు రెండు నగుటయు నూటిని, మూటిని అనురీతి నయినచో దీర్ఘముపై టివర్ణము మాత్రమె యగుటయుఁ గలమాట నిజమె. అట్టి యెడల దీర్ఘముపై టిఙ్లు నాశంకింప నేల? టిన్నునే విధింపఁ దగును. అట్లయ్యును 'సాధ్యో దేః' అనుటచే దీర్ఘముపై సిద్ధ మనఁగాఁ బూర్ణబిందు వుండ వీలు లేదు. టిఙ్లు దీర్ఘముపై నైనను బిందుపూర్వకము గా దని నిశ్చయింప వచ్చును.

ఇదియు దీనికిఁ దరువాత సూత్రమును జెప్ప నక్కఱ లేనివిగా గుర్తింపఁదగును.

## 82. దేష్టిన్.

దేః = దీర్ఘముపై, టిన్ = టిన్ అను నౌపవిభక్తికము మాత్రమె యగును.

వి. దీర్ఘాక్షరాత్పరతష్టి న్నర్ణక స్స్యాత్. మూఁటికి, నూటికి.

దీర్ఘముకంటెఁ బరముగా 'టిన్' ప్రత్యయ మగును. మూఁడు – మూఁటికి – నూఱు – నూటికి.

దిర్ఘీర్ఘస్య (సం.14) యను సూత్రము ననుసరించి 'ది' యనఁగా దీర్ఘము.

దీర్ఘముపై 'టిన్' అగు నని ప్రత్యేకముగాఁ జెప్పుటచే, టిఙ్, అటిచ్ మొదలగు నితరములు రా వని స్పష్ట మగుచున్నది.

దీర్ఘముపై నట్టి వానికిఁ బ్రాప్తియుఁ గానరాదు. ఏయే శబ్దముల కేయే యౌపవిభక్తు లగునో ప్రత్యేకముగాఁ జెప్పుచుండఁగా నిట మఱల హ్రస్వముపై దీర్ఘముపై ననువివక్ష యేలొకో స్పష్టము గాకున్నది.

'ఏకద్వి–' మొదలగు సూత్రమును నియమించెను టకె హోట్టిన్‌టిఙ్టౌ, దేష్టిన్ అను నీ లక్షణములు చెప్పఁబడి యుండును. అది యెంతయు ననుచితముగా నుంట దాని స్వరూపము భిన్నముగా నుండవలయుట గుర్తించి యున్నారము. కాఁగాఁ బూర్వసూత్రమునకు నీ సూత్రమునకు విశేషప్రయోజన మేమియుఁ గానరాకున్నది.

## 83 యోపధాత్తిః. [1]

యోపధాత్ = యకార ముపధగాఁ గలిగినశబ్దముకంటె – ద్వితీయాద్యేకవచనము పర మగునపుడు, తిః= 'తి' యను నౌపవిభక్తిక మగును.

వి. దైశ్యై కాక్షరనామ్నః పరస్య యి ప్రత్యయస్య
ద్వితీయాదిషు పరేషు ఔపవిభక్తి కస్తి రాదేశస్స్యాత్.
చే - నూ - నే -మూ - దా -వా - ప్యాదయో యోపధ
శబ్దాః. చేయి, నూయి, మూయి, దాయి, వాయి, పీయి,

ఒకే యక్షరము గలిగిన వగు దేశ్యశబ్దములయొక్క యి ప్రత్యయము స్థానమున ద్వితీయాద్యేకవచనము పర మగునపుడు 'తి' యను నౌపవిభక్తిక మాదేశ మగును. వా, చే, నూ, మొదలగునవి యేకాక్షర దేశ్య శబ్దములు, వీనికి 'వాదేర్యిః' (తద్ధిత- 80) అను సూత్రముచే 'యి' అను ప్రత్యయము వచ్చి వాయి, చేయి ఇత్యాదిగ నేర్పడును. వీనికి యివర్ణము స్థానమున 'తి' అను నౌపవిభక్తిక మగును. ఇంకను గోయి, నేయి, రోయి మొ॥ కలవు. ఉదాహరణములు వివృతి యందు గమనింప వచ్చును.

వి. చేతి చెంబు, నూతి జలము, నేతిబావి, మూతిమీసము,
రాతికుక్క, వాతికడి, పీతికంపు ఇత్యాది.

ఇచట నన్నియు సమాసరూపములె వివృతియం దుదాహరింపఁబడినవి. చేతిని, చేతికి ఇత్యాదిగా విభక్తి పరత్వమున నగుట స్పష్టమె.

వి. ఏకాక్షరనామ్నః కిమ్? (కబాయి) కబాయిని, రూపా
యిచేత, దగళాయి కొఱకు, లడాయివల్ల, గంజాయికి,
సారాయియందు. ఇత్యాది.

దేశ్యములు నేకాక్షరములకే యనుట వలన ననేకాక్షరశబ్దముల కి కార్యము లేదు. కబాయిని – కబాతిని అని తివర్ణము రాదు.

ఇచట వివృతియం దుదాహరింపఁబడిన శబ్దము లన్యదేశ్యములు. దేశ్యశబ్దములకే యీ కార్యము కావున నేకాక్షరములనుటవలన ననేకాక్షర శబ్దములకు రాదనుచు నన్య దేశ్యములను జూపుట విశేషము.

---

1. యోపధాత్తిః. (త్రి.శ.4.6. హేమచంద్రసూత్రము.)

ఔపవిభక్తికము లన్నియు నాచ్ఛికముల కగునవి గావున దేశ్యముల కను వివరణము తివర్ణము నెడలనే విశేషముగాఁ జెప్పరాదు. కాఁగా 'ఏకాక్షరనామ్నః' వేయి, రేయి అన్నది యిచ్చట విశేషము. దీనికి వివృతియం దాధారము గానరాదు. చేయికి – చే అని రూపాంతర మరుదుగాఁ గలదు. ఇట్లు కొన్నింటి కుండవచ్చును. కాని వివృతియందు – తద్ధిత.80 సూత్రము నొద్దను జూపని గోయి, యనుచో 'గో' అని రూపాంతరము లేదు. అది ఏకాక్షర శబ్ద మగునా? వీని యివర్ణమునకు తివర్ణ మాదేశ మగుట చేయి, నూయి యనురీతిగా నీ సందర్భమున నీయవి ద్వ్యక్షరశబ్దములు గాక తప్ప దను ట ట్లుంచి, గోయి ప్రభృతులు పూర్వావస్థలోను నేకాక్షర శబ్దము లనుట కాధారము లేనివి. కాఁగా నేకాక్షర శబ్దముల కనక చేయి ప్రభృతుల కని వివరించిన బా గుండెడిది. యివర్ణాంతములలోఁ గూడ, వేయి, రేయి, మొదలగు శబ్దముల కీ కార్యము లేదు గావున చేయి ప్రభృతు లిత్యాదిగఁ జెప్పిన నిట్టి యిబ్బందియు లేకుండెడిది. అందుకే సూరి గోయి ప్రభృతు లనెను చే, వా, ఇత్యాదులవలె, వేయి రేయి శబ్దములకు వే, రే అని రూపాంతరములు గానవచ్చుట నివి యేకాక్షరశబ్దము లనుటకు వివృతి కర్తృపద్ధతి ననుసరించిన యవకాశము గలదు.

'యోపధాత్, అని సూత్రమున సామాన్యముగఁ జెప్పుట సరిగా లేదనక తప్పదు. కాయ, పాయ మొదలగునవి యోపధములే. ఈ కార్యము లెదు 'యోపధాతి' అనుచోటి పంచమిచే నీ తివర్ణము పరముగా వచ్చెడు ప్రమాదమును గలదు. పూర్వ సూత్రములలో శబ్దములను నిర్దేశించిన వారిక్కడఁ గూడ నట్లె పుంద్వాదీనామ్, ఒకట్యాదీనా మన్నట్లుగా చేయ్యాదీనామి త్యాదిగాఁ జెప్పినఁ జక్కనై యుండెడి దనవచ్చు. ఈ సూత్రము హేమచంద్రోక్తముగా అ.త్రి.శ.లో నున్నది. అదియట్లె గ్రహించుటవలన నిట్లయి యుండవచ్చును. పుంద్వాదీనా మ్మను నవి యెచ్చటిదో.

గోతులు, గోతులను అనురీతిగా 'తి' వర్ణము ప్రథమాది బహువచనములందు నగుట విశేషముగా గుర్తింపఁదగియున్నది.

## 84. వాసేమ.[1]

సేమ = సమాసములందు, వా = ఔపవిభక్తికములు వికల్పముగా నగును.

వి. సమాసేషు వికల్పేన టిన్ టిజాదయ ఔపవిభక్తి

కాస్స్యుః. గోరుమొన, గోటిమొన, ఏఱునీళ్లు, ఏటినీళ్లు,

నుదురు గంధము, నుదుటి గంధము ఇత్యాది.

1. వా సమాసేమ.

'స స్సమాసః' అను ప్రాకృత వ్యాకరణసూత్రము ననుసరించి 'స' అనఁగా సమాసము. 'స' అను శబ్దము సప్తమీ బహువచనాంత రూపము 'సేషు' అన్నది.

సమాసములందు టిన్ టిజ్ మొదలగు నౌపవిభక్తికములు వికల్పముగా నగును.

గోటిమొన యనుచో 'టి' వర్ణమైనది. వికల్పమనుటచే రానిపక్షమున గోరుమొన. ఇల్లాలు అనుచో నిల్లు శబ్దమునకు 'టిజ్' అను నౌపవిభక్తికము రాలేదు. ఇట నింటియాలని గానరాదు. కావున 'వా' శబ్దమునకుఁ గొన్ని యెడల సమాసములం దౌపవిభక్తికములు రాకుండుట నిత్య మని వ్యవస్థ చేసికొనఁదగును. ఇట్లె మిన్నేఱు.[1] జుంటి మోవి మొదలగు చోట్ల నౌపవిభక్తికము రాని జున్నుమోవి యను రీతిరూపము లుండవు. అచట నౌపవిభక్తికము లగుట నిత్యమని వాశబ్దమునకు వ్యవస్థ చేయఁదగును.

వి. [2] మిన్నేఱు గోరంచు ఇత్యాది ప్రయోగా శ్చిగురాకువత్.

'వాసేషు' అను నీ సూత్రముచే నౌపవిభక్తికము రాక. మిన్ను + ఏఱు, గోరు + అంచు అను యుండఁగా 'టుగచి' యను సూత్రముచే టుగాగమము రావలసియున్నది. కాఁగా మిన్నేఱు, గోరంచు అని టుగాగమము రాలేదు. చిగురా కనుచోవలె నిట టుక్కు లే దనియు ని ట్లిది లక్షణవిరుద్ధ మై గ్రామ్యమె యైనను శిష్ట ప్రయోగ బాహుళ్యముచే నిర్భయముగాఁ బ్రయోగింపఁదగు ననియు (టుగచి - వివృతి) నభిప్రాయము.

మొత్తముపై నీ సూత్రము సమాసములం దౌపవిభక్తి కములు వికల్ప మని చెప్పినది. కాఁగా ద్వితీయాద్యేకవచని పరకతలో వికల్పము గా దను నర్థము దీనిచే సిద్ధము కాఁగలదు. 'కనుచను - (సంధి - 72) అనుచో వికల్ప మనుట వలన నౌపవిభక్తికములు రానందు కే సమాసము లే యుదాహరింపఁబడినవి. అవి యీ సూత్రముచే సిద్ధించునవె కదా. కాఁగా నిట సూత్రమున లేని వికల్పార్థము వివృతియందుఁ జేరుట సంగతము గా దనియె చెప్పఁదగును.

'సేషు' అని కాక సామాన్యముగా నౌపవిభక్తికము లరుదుగా రాకుండుటను జెప్పినఁ బూర్వలక్షణముల నెచటను వాశబ్ద మవసరమె లేకుండెడిది. లక్షణము ప్రయోగప్రాచుర్యమున కనుగుణము నై యుండెడిది.

ఇంతటితో నౌపవిభక్తిక ప్రకరణము ముగిసినది..

---

1. సమాసేషు చతేవర్ణాః వ్యవస్థిత వికల్పే
   నన్న్య:- ఆం.కౌ.సంధి.50.
2. వ్యవస్థిత వికల్ప భేదసామర్థ్యాత్. (మిన్నేఱు ఇత్యత్ర మింటేఱు
   ఇతినాస్తి. (ఆం.కౌ.సంధి.50 వృత్తి)

## 85. లుగ్వా క్యాన్త ద్రుతస్య [1].

వాక్యాన్త ద్రుతస్య = వాక్యమునఁ జివర నున్న ద్రుతమునకు, వా = వికల్పముగా, లుక్ = లోప మగును.

వి. వాక్యాన్త పదద్రుతస్య వికల్పేన లుక్ స్యాత్.

అలరె నెత్తావికేళి వనాగ్రసీమ

ఇత్యాది.

వాక్యము తుది నున్న పదము తుది నకారముకు వికల్పముగా లోపము వచ్చును. 'వాసేమ' అను పూర్వ సూత్రమునుండి 'వా' యను పద మిం దనువర్తించును.

అలరె నెత్తావి కేళివనాగ సీమన్ - అనుచో వాక్యాంతమునం దున్న ద్రుత మీ సూత్రముచే లోపించి అలరె--సీమ. అని యైనది.

'వా' యనుటచే ఁ గొన్ని యెడల లోపింపదు. 'అతిశయముగ బుద్ధిమంతుఁ డగు బుధసేవన్' మొ॥

ఇయ్యది పద్యములయందు గణానుసారముగ వ్యవస్థితమై యుండుటను సూరి పేర్కొనె.

---

1. వాక్యాన్త గత పదస్య. ఆం.కౌ.సంధి.52
   వాక్యాన్త గతపదానాఞ్చ. ఆం.శ.చిం.సంధి.41
   వాక్యాన్తే నస్యలుగ్వా. వై.చం.సంధి.35

# అథశబ్ద పరిచ్ఛేదః

## అథ అజన్త ప్రకరణమ్

## 1. సుస్లున్లన్చేత కొఱకు వల్ల క్వందుప్[1].

వి. సుప ఏతే స్యుర్మ హదమ హతోః.

సుస్, లు, న్, లన్, చేత కొఱకు వల్ల కు అందు ప్ అనునని తెలుఁగునఁ బ్రథమాదివిభక్తులు. 'అందుప్' అనుచోట పకారము ప్రత్యాహారమునకై కూర్పఁబడినది. 'సు'. అనుదానితో, 'అందుప్' అనుదానిలో ని త్తగుపకార మును గూర్పఁగా 'సుప్' అను ప్రత్యాహర మేర్పడును. ఇట్లు చెప్పుట సంస్కృతమునవలెఁ దెలుఁగున నీ సుప్పులు ప్రథమాదివిభక్తు లని తెలుపుట కని యూహింపవచ్చును. ఈ విభక్తు లంతమందుఁ గలిగిన శబ్దములు సుబంతము లయి 'సుప్తిజన్తం పదమ్మ'ను పాణినీయ లక్షణాను గుణముగాఁ బదత్వము నందు చున్నవి.

కాని యీ వ్యాకరణమునను జింతామణి యందువలెనె సంస్కృత సుబ్విభక్తుల స్థానముననె తెలుఁగు విభక్తులు చెప్పఁబడినవి. అరుతోడపోంటి సహార్థే టాసః మొ॥ అందుకే వృత్తి యందు మహత్తులు నమహత్తులునగు శబ్దముల పైని జేరిన సంస్కృత సుబ్వి భక్తుల స్థానమున నీ పేర్కొనఁబడిన ప్రత్యయము లగునని చెప్పఁబడినది. సంస్కృత విభక్తుల కాదేశించుటవలననే వీనికి సుబంతత (పదత్వమును) సిద్ధింపఁగలదు.

ఇంకఁ బైని బేర్కొనఁబడినవానిలో చేత-తృతీయ, కొఱకు-చతుర్థి, వల్ల-పంచమి, కు-షష్ఠి, అందు-సప్తమి యగుచు స్పష్టమె. కాని ప్రథమ ద్వితీయావిభక్తుల నిర్దేశమె వింతగ నున్నది. 'సుస్' అన్నది ప్రథమైక వచనము, లు-ప్రథమా బహువచనము, 'న్' అనునది ద్వితీయైకవచనము, 'లన్ ' అన్నది ద్వితీయా బహువచనము. చేతాదులను ద్రుతరహితముగా నిర్దేశించి ల వర్ణమును ద్రుతాంతముగాఁ జూపుట విశేషము. ల ద్వితీయా విభక్తిగాఁ జెప్పుట యీ వ్యాకరణములం దెల్లఁ గన్పించుచున్నది. కాని ప్రథమైకవచనము 'సుస్' అని చెప్పుట వీనఁ గొన్నిటఁ గన్పించు విశేషము.

---

1. త్రి.శ.కి. బృహస్పతి సూత్రముగాఁ జూపఁబడినది. అం.కౌ.శబ్ద.1.

ఆయా విభక్తులయందుఁ బ్రత్యయములు దెలుఁగున ననేకములు. వానిని వేఱుగా మఱల సూత్రించుట మీఁద జరుగుచున్నది. అయ్యు నీ సూత్రము నిట్లు చెప్పుట వలనఁ బ్రయోజనము పరిశోధించి గుర్తింపవలె.

## 2.ద్వేర్బహు[1].

ద్వేః = ద్వివచనమునకు, బహు = బహు వచన మగును.

వి. అస్మిన్ వికృతిశాస్త్రే ద్వి వచన స్య బహువచనం స్యాత్.

ఈ యాంధ్ర వ్యాకరణమునందు ద్వి వచనమునకు బహువచన మగును.

సంస్కృతమునం దేక బహు వచనములతో పాటు ద్వి త్వ సంఖ్యను బోధించుటకు ద్వి వచనము ప్రత్యేకముగా నున్నది. తదనుసారముగాఁ దెలుఁగునను ద్విత్వ సంఖ్యను బోధింప వలసి వచ్చినప్పుడు ద్వి వచనము రాఁగా దాని కీ సూత్రముచే బహువచన మగును. కాఁగాఁ దెలుఁగున నేక వచనము, బహు వచనము నని రెండు వచనములు మాత్రమే కన్పించును.

రాముఁడు అనుచో డు జ్ఞే కవచనము. రాములు అనుచో లువర్ణము బహు వచనము. ద్వి = ఇద్దఱు రాములు, ఇద్దఱు రాములను అనురీతిగా ద్వి వచనమునకును బహువచనమె యగును.

## 3. డుమువు లవః ప్రథమాయాః[2].

ప్రథమాయాః = ప్రథమా విభక్తికి, డుమువులః = డుమువులు అనునవి యగును.

వి. ప్రథమా విభక్తేః డుమువులు ఏతే స్యుః.

రాముఁడు, వనము, గురువు, రాములు, వనములు,

గురువులు.

ప్రథమా విభక్తికిఁ దెలుఁగున డుమువులు అనునవి యగును. ప్రథమా విభక్తిని వివక్షింపఁగా సంస్కృతము ననుసరించి సు-జస్- అనునవి కలుగఁగా వాని స్థానమునఁ దెలుఁగున డుమువు-లు అనునవి యగును.

---

1. ఆం.కౌ.శబ్ద.2
ద్వివచనస్య బహువచనమ్. వా .2-3-34.

2. డుమువులవస్సు సః ఆం.కౌ.శబ్ద.4
డుమువులవః ప్రథమాస్యాత్. ఆం.శ.చిం.అ.1.

డుః– రామ + సు = రాముఁడు, ముః– వన + సు = వనము, వు ః– గురు + సు = గురువు. 'డుమువు' అనునవి మూఁడును ప్రథమావిభక్తి యం దేకవచనములు. అన్నింటికిని బహువచనమున లు వర్ణ మగును (లు జసః) రాము + జస్ = రాములు, వనములు, గురువులు.

ఇంకఁ గూఁతురు, వారు మొద లగు రీతిగాఁ బ్రథమ యందు విశేష ప్రత్యయములు గలవు. సుజస్సుల స్థానమున నగుటను బట్టి వానిని బ్రథమా విభక్తులుగా గ్రహింప వచ్చును. ప్రాచుర్యము ననుసరించిఁ డుమువులు' ప్రథమా విభక్తులుగాఁ జెప్పఁబడినవి.

## 4. కూర్చిలనునయో ద్వితీయాయాః[1].

ద్వితీయాయాః = ద్వితీయావిభక్తికి, కూర్చిలను నయః, = కూర్చి, ల, ను, ని అనునవి యగును.

వి. ద్వితీయా విభక్తేః కూర్చి ల ను ని ఏతే స్యుః.
రాముని గూర్చి, రాముల, వనముల, గోవుల రాజును,
కృష్ణుని ఇత్యాది.

ద్వితీయావిభక్తికి కూర్చి ల ను ని అనునవి యగును. సంస్కృతము ననుసరించి ద్వితీయా విభక్తి వివక్షలో నయిన అమ్‌శస్ అను విభక్తుల స్థానమునఁ దెలుఁగున కూర్చి ల ను ని అనునవి యగును. 'లశసః' అనుట ల వర్ణము ద్వితీయా బహువచనము. మిగిలిన వేక, బహు వచనములు రెండు నగును.

ల–రాముల, వనముల, గోవుల. కూర్చి – రామునిఁ గూర్చి, రాములఁగూర్చి ను–రాజును. ని – కృష్ణుని–మొ॥

## 5.చేతమై తృతీయాయాః[2].

తృతీయాయా = తృతీయావిభక్తికి, చేత మై = చేత, మై అనునవి యగును.

వి. తృతీయా విభక్తే శ్చేతమై ద్వావేతౌ స్తః.
కీర్తిచేత వెలసె, గుణముమై నొప్పె.

1. కుర్చిలను నయోఃభవేద్ద్వితీయాతు. ఆం.శ.చిం.అ.2
కూర్చినునయోఽమః, లశసః. ఆం.కౌ.శబ్ద.6,7.
విర్లక్ష? త్ర.శ.3.
2. మై చతృతీయాయాః త్రి.శ.4.7 హేమచంద్ర సూత్రము.

తృతీయా విభక్తికి, చేత, మై అను రెండు వర్ణకము లగును. తృతీయా వివక్షలో సంస్కృతాను సారముగా నయిన టా, భిస్ అనువానికి చేత, మై యనునవి యవును. ఇవి యేన్ బహువచనములు రెంట నగును. కీర్తి చేత వెలసె, గుణములమైన్.

వి. మై పదస్య సోమయాజి భారతే – "సింగం బాఁకటితో
గుహాంతరమునం జేడ్పాటుమై నుండి మా – తంగ స్ఫూర్జిత
యూథ దర్శన సముద్యత్క్రోధమై వచ్చునోజన్."

చేడ్పాటుమై, ననుచో బైఁ దిక్కన పద్యము నందు 'మై' అనునది ప్రయుక్తము.

'మై' అనుదానిని వివృతి పద మనుట యొప్పుకున్నది. తృతీయా విభక్తిగాఁ జెప్పుటచే ఈ 'మై' అనునది ప్రత్యయము. అపదమె యగును. ప్రకృతులను బ్రత్యయములను బదము లనుట యిం దందందుఁ గాన వచ్చును. (ఒకటి) ఇత్యాదనాం పదానామ్ (సంధి.78 సూత్రవివృత్తి)

## 6. అయితోడ పాంటే సహార్థే టాసః[1].

సహార్థే – సహార్థము నందు, టా సః = తృతీయా విభక్తికి, అయితోడపాంటే = అయి, తోడ, పాంటె – అనునవి యగును.

వి. తృతీయా విభక్తే స్సహార్థే అయి, తోడ, పాంటె స్యుః.
రామునియయి వచ్చె, సీత తోడఁ జనె రాముఁడు,
రాముఁడు పాంటె నేఁగె ఇత్యాది.

సహార్థమునందుఁ ద్రుతీయావిభక్తికి అయి, తోడ, పాంటె అనునవి యగును. టా, (భ్యాం) భిస్, అనుచో 'సుప్స్వాది రన్త్య హలా' యను ప్రాకృత వ్యాకరణ లక్షణము ననుసరించి చేయఁబడిన ప్రత్యాహారము టాస్ అనునది. కావున టాసః = తృతీయా విభక్తి ఏకబహువచనము లగు, టా, భిస్ అనువాని స్థానమున నీ 'అయి' మొదలగు ప్రత్యయము లగు నని యర్థము.

సీత తోడఁ జనె, సీతను గూడి చనె నని యర్థము

రాముని యయి వచ్చె నను రీతిగా 'అయి' అనునది (సహార్థక) తృతీయావిభక్తిగా నిటఁజెప్పఁబడినది. ఇది భాషయం దప్రసిద్ధము. ఒండు రెండు ప్రాచీన ప్రయోగములు గలవు.

---

1.సహార్థే తోడశ్చ. త్రిక,3.5. బృహస్పతి సూత్రము. తోడ సహార్థే టాసః. అం.శ.వి.అ.8 పాంటేచ. అం.కౌ.శ.36, సహార్థతో తోడ.వై.చం.వి.9. పాంటెశ్చ.త్రి.శ.4.11. హేమచంద్రసూత్రము.

రాముని పొంటె నేఁగె ననుచో 'పొంటెన్' అనునది సహార్థమునఁ బయుక్త మయినది కాని కావ్యములం దిట్టిస్థితి మృగ్యము. 'పొంటె' నను నది చతుర్థీవిభక్తి యని యితరులు దలఁచిరి. 'చతుర్థి కిం బొంటె వర్ణకంబునగు' కార్య సంప్రయోగము పొంటెన్ - అనుచోఁబొంటె సహార్థకలోగాదు గదా.

'గుణముమై నొప్పె' ననుచోఁ బూర్వ సూత్రమునఁ జెప్పఁబడిన 'మై' అనునది సహార్థముననేయైనది. కావున 'మై' సహార్థమునం దిటఁ జెప్పఁదగినదే. ఇది జడవాచకముల మీఁద మాత్రమే యుగుటను గూడఁ గలిపి ప్రౌఢవ్యాకర్త "జడపదంబు మీఁది తోడకు మెయి మైలు విభాష నగు" నని సూత్రించెను.

ఉదాహరణములు, తడ యోర్లు క్సానుసూత్రమునొద్దఁ జూడఁదగును.

## 7. ఉతశ్చాలుతోడయోః[1].

అలుతోడయోః = అలు తోడ అనువానికి, ఉతః చ = ఉత యను నదియు నగును.

వి. అలుతోడయో ర్వికల్పేన ఉత ప్రత్యయ స్స్యాత్సహార్థే. తోడుత, అలుత, తన యలుత వచ్చె, దాని తోడుత పోయె.

సహార్థమునందు, అలు తోడ అను తృతీయావిభక్తులకు వికల్పముగా 'ఉత' ప్రత్యయము నగును. ఇది ప్రత్యయముగాన అలు తోడల కుఁబరముగా వచ్చును. అలు + ఉత = అలుత, తోడ + ఉత = తోడుత. 'ఉతశ్చ' యను చోటి చశబ్దము వికల్పార్థకము. కావున 'ఉత' అనునది చేరని పక్షము నందు అలు, తోడ అనియే యుండును.

అలు ఉదంతమే కాని తోడ అదంతమగుటచే తోడుత అని ఉత్వమునకై యిట 'ఉత' అనునది విధింపఁబడిన దని గ్రహింపవచ్చును. తనయలుత - దానితోడుత.

వి. అల్వలుతశబ్దౌ కంఠార్థ వాచకౌస్యాతామ్.
అలు అలుత-కంఠము ఇత్యర్థతః.

అలు, అలుత అనునవి కంఠము అనునర్థము గలిగిన శబ్దములు కాఁగా నవి తృతీయా విభక్తులుగాఁ జెప్పఁబడిన యీ 'అలు అలుత' అనువాని కంటె భిన్నములు. ఇవి యపదములు గాఁగా; గంఠార్థకము లగు నయ్యవి పదములు.

అలు (అల్లు) అనునది కంఠార్థక మగుట స్పష్టము (మెడ యని యర్థము). కాని

1. అటోస్త : తోడుతశ్చ. త్రి.శ.4.8.9, హేమచంద్ర సూత్రములు.
టాసస్తోచే చేతలోడ తోడుతాః ఆం.కౌ.శబ్ద.8.

'అజుత' అనుదానికి '(గ్రంథము' అని యర్థము చేయు టొప్పదు. ఔపవిభక్తిక మగు అజ్జు శబ్దమునకు తివర్ణము రాఁగా దాని పైని సప్తమ్యేకవచనమున కయిన యత్వముతో అజుతన్ అని యగు ననుట ప్రసిద్ధమె. దానికి మెడయం దని యర్థము. అజుశబ్దము ప్రథమాంత మైన అజుత నన్నది అజుశబ్దము యొక్క సప్తమ్యేక వచనాంతరూపము. అంతే గాని అజ్జు అనియే యర్థ మిచ్చునట్టి వేఱొక శబ్దము గాదు.

## 8. తడయోర్లుక్[1].

తడయోః = త, డ వర్ణములకు, లుక్ = లోప మగును.

వి. చేత తోడ యో స్తడయో ర్వా లుక్ స్యాత్.

చే-తో సహార్థే - తో ఇత్యాది.

చేత, తోడ, అనువానియందలి తడవర్ణములకు వికల్పముగా లోప మగును.

లోపము వికల్ప మగుట సూత్రమునందుఁ జెప్పఁబడలేదు. కాని య ట్లని తడలు నిత్యముగా లోపించు నన్నచో నీ ప్రత్యయములను బూర్వసూత్రములందు చేత తోడ అని పేర్కొనుట వ్యర్థ మగును. కావున వికల్పముగా లోపించునని గ్రహింపఁదగును. ఈ సూత్రముననే 'తడయో ర్వా లు'క్కని వా శబ్దమును ప్రయోగించిన బాగుండెడిది. ప్రాచీనుల లక్షణ మట్ల గ్రహించి విశేషము వివృతియందుఁ జెప్పె నేమో. 'ఉత్తశ్చ'యను పూర్వ సూత్రము నందలి వికల్పార్థక మగు చ శబ్దము నిం దను వర్తింపఁ జేయుటయు నొక మార్గము గాకపోదు.

'చేత'లో తవర్ణ మిట్లు లోపింపఁగా 'చే', తోడలో 'డ' వర్ణ మీ సూత్రముచే లోపింపఁగా 'తో' వికల్పము గావున లోపము రాని పక్షమునందు, చేత, తోడ నని యట్లే యుండును. పూర్వ సూత్రముల యంశములకును వివృతి యీ సూత్రము నొద్ద నుదాహరణములు చూపుచున్నది. 'అజు తోడ పాంటె సహార్థకలాసః' అని సహార్థమునఁ జెప్పఁబడిన 'అజు' ప్రత్యయమున కు దాహరణము.

వి. భీమకవి కృతే శతకంఠరామాయణే -

దవసీమన్ విహరింపు రామునఁజు సీతాదేవి సౌమిత్రులు

ద్దవిడిన్ బోవఁగ మింట నుండి దివిషద్ద్వారంబు వీక్షించి సం

స్తవముల్ సేసె - ఇత్యాది.

1. తడోర్లు . [illegible] క్రమముగా తృతీయా విభక్తులుగాఁ బరిగణించుటచే ఆం.కౌ.లో ఈ లక్షణ మ్మనవసర మయ్యె.

రామునఱు = రామునితో - విహరింపు - అని, తద్దర్మార్థ కవిశేషణమున చకారమునకు పత్వము వచ్చుట యిందిం కొక విశేషము.

తోడ ప్రసిద్ధ మ నిగాఁ బోలు నుదాహరణము చూపలేదు. 'పాంటె'కు -

వి. బడబాగ్ని భట్టారకకృతే - రామచంద్రాభ్యుదయే -
ఇనవంశ రా జపుడు సాం
పున విశ్వామిత్ర మౌని పాంటె (నరిగి) య
జ్జనకునియింట హరశరా
సనము విఱిచి పెండ్లి యాడె జగతీ కన్యన్.

విశ్వామిత్ర మౌని పాంటె (నరిగి) అనఁగా విశ్వామిత్రునితో (నరిగి) అని యిటఁ బాంటె సహార్థమునం దున్నది. ఈ ప్రయోగము విశిష్టమే.

'ఉతశ్చారుతోడ యోః' అనుసూత్రముచే 'అఱు'కు 'ఉత' వచ్చినందుకు, అఱుతకు-

వి. పునశ్చ అధర్వణ భారతే - ఆరణ్యపర్వణి -
వరధౌమ్యాచార్య పుర
స్సరులై స్వాధ్యాయహోమజపతత్పరులై
యరువదివే లసవులు ధ
ర్మరాజు మఖ మఱుతఁ జనిరి రాజ్యంబునకున్.

'మఖమఱుత' ననుచో అఱు కుత మైనది. తోడుతకుఁ బ్రయోగ మీయ లేదు ప్రసిద్ధ మని యేమో.

ఏ మైన నీ యుదాహరణముం నాయా సూత్రములకడనే చూపిన బా గుండెడి దనిపించును.

## 9. కై కొఱకూ చతుర్థ్యాః.

చతుర్థ్యాః = చతుర్థీ విభక్తికి, కై కొఱకూ = కై అనునదియు, కొఱకు అనునదియు నగును.

వి. చతుర్థీవిభక్తేః కై కొఱకు ఏతౌ స్తః[1].

రామునికై, వనము కొఱకు.

చతుర్థీ విభక్తికి కై, కొఱకు నను రెండు ప్రత్యయము లగును. చతుర్థీ విభక్తి వివక్షలో సంస్కృతానుసారముగా వచ్చిన ఙే భ్యస్ అనుచతుర్థీ విభక్తుల స్థానమునఁ దెలుఁగున కై కొఱకులు రెండు నగును. ఇవి యేకబహువచనములు రెండు నగును. రామునికై రాములకై, వనము కొఱకు, వనముల కొఱకు.

10. ఉంచుండి కుండా వంక వల్ల వలనాః పఞ్చమ్యాః[2]

పఞ్చమ్యాః = పంచమీ విభక్తికి, ఉంచుండి కుండా వంక వల్ల వలనాః = ఉంచి, ఉండి, కుండా, వంక, వల్ల, వలన అనునవి యగును.

వి. పఞ్చమీవిభక్తేః ఉంచి ఉండి కుండా వంక వల్ల
వలన ఏతే స్యుః – ఇంటి నుంచి వెడలె, వనము నుండి వచ్చె,
వాకిటి గుండా పోయె, అమ్మ వంక చుట్టము,
రాముని వల్ల, రాముని వలన – ఇత్యాద్యాః.

పంచమీ విభక్తి ఉంచి, ఉండి, కుండా, వంక, వల్ల, వలన అనునవి యగును. పంచమీ విభక్తి వివక్షలో సంస్కృతానుసారముగ నైన ఙసి భ్యస్ అనువాని స్థానమున నీ యవి యగును. ఉదాహరణములు వివృతి యందు స్పష్టము.

వీనిలో ఉంచి, ఉండి, (కుండా) అనునవి యవ్యయములు. ఇట సూరి ఉండి నను ప్రయుక్తము చేసి 'ఉంచి' సాధుకవిప్రయోగారూఢము గా దని ప్రయోగానుగుణముగాఁ దిరస్కరించెను. 'వనము వలన నుండి' యను రీతి రూపములను బట్టియు 'ఉండి' పంచమీ విభక్తిగాఁ జెప్పఁదగ దనుట యొప్పును. వంక – యనునది దిక్కు అను నర్థమునను ప్రత్యేక శబ్దముగాఁ గోశములు చూపినవి. అది ది క్కను నర్థమున (ఇతరార్థ మిట సమన్వయింపఁబడదు గదా) స్వతంత్రముగాఁ గానరాకుంట యొకవిశేషమె. అయిన ఆవంక, ఈవంక, అనురీతి వానిని బట్టి యిది ప్రత్యయముగా మాత్రము చెప్పఁదగినది గా దనకతప్పదు. అమ్మ వంక చుట్ట మనుచో అమ్మ వలనఁ జుట్ట మని యుండునా.

---

1. కైకొఱకు ఙేసః ఆం.కౌ.శ.9 (ఆం.శ.చిం.అ.22) కొఱకుకైచతుర్థ్యాస్తః ఆం.శ.చిం.అ.4,

2. ఉంచికుండా వల్ల వలన వంక యుండీతి పఞ్చమీ. త్రి.శ.4.12. హేమచంద్రమాత్రము.
ఉంచి కన్న పట్టి కంటె నుండి వల్ల వలన వం కొండయోఙసః (ఆం.కౌ.శ.10)

ఇంక 'కుండా' యన్నది లోకవ్యవహారమునఁ గలదు కాని కావ్య వ్యవహారమున లేదు. ఉంచియు నిట్టిదే.

'వల్ల వలన' అన్నవి రెండే పంచమీ విభక్తులుగాఁ జెప్పఁదగిన వనుట లెస్స. 'వల్ల'ను వలన నుండి సాధించు టింకయు నుత్తమము.

## 11. నిర్ధారణే కన్న కంటె[1].

నిర్ధారణే= నిర్ధారణము నందు, పంచమ్యాః= (పంచమికి), కన్న కంటె = కన్న, కంటె నను నవి యగును. ఉంచుండి-మున్నగు పూర్వ సూత్రము నుండి పఞ్చమ్యాః అన్నది యిట ననువర్తించును.

వి. అన్యారాదాద్యర్థ వాచక పదే పరే నిర్ధార
ణార్థే పంచమీ విభక్తేః కన్న కంటే ద్వ్యౌస్తః[2].
రాముని కన్న వే ఱొక రాజు లేఁడు, అంతకంటె
దూరము లేదు.

అన్య, ఆరాత్ - మొదలగు వాని యర్థము నిచ్చు పదము పరముగా నున్నను, ననఁగా నట్టి యర్థముతో నన్వయ మున్నను, నిర్ధారణార్థమునందును, బంచమీ విభక్తి (జసి భ్యస్) స్థానమున కన్న, కంటె, అను ప్రత్యయము లగును.

రాముని కన్న వే ఱొక రాజు - ఇట నన్యార్థక మగు 'వేఱు' శబ్దముతో యోగము వలనఁ బంచమియు దానికిఁ గన్న ప్రత్యయము నయినది.

జానపదుల కంటె నాగరులు వివేకులు. ఇట నిర్ధారణమునఁ బంచమియుఁ బంచమికిఁ గంటె ప్రత్యయము నైనది. కన్నను బ్రత్యేకముగాఁ బ్రత్యయముగాఁ బరిగణించుట యిందలి విశేషము.

## 12. పట్టేశ్చ[3].

పఞ్చమ్యాః= పంచమీ విభక్తికి, పట్టేః చ = పట్టె అనునదియు నగును. ఉంచుండి-మున్నగు సూత్రము నుండి క్రమముగా 'పఞ్చమ్యాః' అన్నది యిం దనువర్తించును.

---

1. నిర్ధారణే కన్నకంటే. త్రి.శ. 4-13. హేమచంద్ర సూత్రము.
2. అన్యాదౌ కన్నకంటే. అం.కౌ.శ.39.
   కంటేఽన్యారాదాదేః, అం.శ.చిం.అ.30, వై.చం.వి.10.
3. పట్టేశ్చ అం.కౌ.శ.40

వి. గుణే హే తౌ జసి.సః పట్టి స్స్యాత్[1].

భక్తి (బట్టి జ్ఞానము, జ్ఞానముఁ బట్టి ముక్తి.

గుణము హేతు వయినపుడు, గుణవాచక మగు శబ్దము యొక్క పంచమీ విభక్తికి (జసి, భ్యస్) 'పట్టి' అను ప్రత్యయ మగును.

సూత్రమున 'పట్టిశ్చ' యని మాత్రమే కలదు. పట్టి యే యర్థమునం దవు నన్నది చెప్పఁబడలేదు. చింతామణ్యాదుల కనుగుణముగ వివృతి గుణము హేతువగునపు డని స్పష్టము చేసినది.

జ్ఞానముఁబట్టి ముక్తి. ముక్తి యను దానికి హేతువు జ్ఞానము. ఇది గుణము కావున హేతు వగుటచే గుణవాచక మగు జ్ఞానశబ్దమునకుఁ బంచమియు దానికిఁ బట్టి ప్రత్యయమును రాఁగా జ్ఞానముఁ బట్టి యైనది.

క్రియ హేతు వగునపుడు నగును. (బాల) వచ్చుటంబట్టి ధన్యుఁడను. మొ॥

## 13. పారుడిశ్చ [2].

పఞ్చమ్యాః= పంచమీ విభక్తికి, పారుడిః చ = పారుడి అనునదియు నగును. ఉంచుండి--ము న్నగు సూత్రము నుండి 'పఞ్చమ్యాః' అనునది క్రమముగా నిం దనువర్తించును.

వి. దేశ్యే జసిసః పారుడి శ్చ స్యాత్. లచ్చి పారుడి వచ్చె కలిమి, రాముని పారుడి నిలిచె ధర్మము. ఇత్యాది.

తెలుఁగునఁ బంచమీ విభక్తికి 'పారుడి' అనునదియు నగును. లచ్చి పారుడి వచ్చె కలిమి. లచ్చి వలనఁ గలిమి వచ్చె నని యర్థము. ఇట్లె రాముని పారుడి నిలిచె ధర్మము. రాముని వలన ధర్మము నిలిచె నని యర్థము. రాముని పారుడి యని చూపుటను బట్టి 'పారుడి' సంస్కృత సమములపైఁ గూడ నగును.

'పారుడి' యన్నది నేఁడు వింతగాఁ గన్పించును. లాక్షణికులు పెక్కురు దీనిని బ్రస్తావింపనే లేదు. ఇట్ల ప్రసిద్ధ మగుట వలననే కావచ్చు వలనా దులకుఁ గవిప్రయోగములు చూపకయు నీ 'పారుడి' యను దానికి వివృతి యందుఁ గవి ప్రయోగము చూపఁబడుచున్నది.

1. పట్టేతుపఞ్చమీ గుణే హేతౌ ఆం.శ.చిం.అ.29
   పట్టి గుణే హేతౌ.వై.చం.వి.11.
2. దేశ్యే పారుడిశ్చ. ఆం.కౌ.శ.38
   దేశ్యే పారుడి రిష్యతే. త్రి.శ.4.14. హేమచంద్రసూత్రము.

వి. అథర్వణ భారతే - ఆదిపర్వణి - అజగర నహుష

నేనిదిగొ మత్కృ లోద్భ వుఁ డైన జముని
పట్టి పొరుడి శాపంబు వాసి తింక
సొర్గమున కేఁగెదను మీరు సుఖముఁ జెంది
యుండుఁ డనుచు విమానము ('నొంది యెగసె!)[1]

జముని పట్టి పొరుడి శాపంబువాసితి ననఁగా జముని పట్టి వలన శాపము వాసితి నని యర్థము. వాసితిన్+ఇంక - ననుచోఁ బాసితింక నని సంధియవులయు, సొర్గ మనురూపము (ఇది తద్భవముగా వ్యాకరణమున సాధింపఁబడినది) నీ పద్యము నందు విలక్షణముగాఁ గన్పించు విశేషములు.

'పొరుడి' యనునది యిప్పుడు వ్యవహారము నందుఁ గూడ వినిపింపదు. ఇతర ప్రామాణిక కవి ప్రయోగముల కెక్కుదు.

## 14. కికూషష్ఠ్యాః[2].

షష్ఠ్యాః = షష్ఠీ విభక్తికి, కికూ = కి,కు, అనునవి యగును.

వి. షష్ఠీ విభక్తేః కి కు ఏతౌ స్తః. (రామునికి రామునకు)

షష్ఠీ విభక్తికి, కి, కు అనునవి యగును. షష్ఠీ విభక్తి వివక్షలో సంస్కృతానుసారముగా వచ్చిన జస్ ఆమ్ అను నేక బహువచనముల స్థానమున, కి, మఱియు, కు అనునవి యగును. రామునికి, రామునకు, రాములకు, వారికి మొ॥

## 15.నిర్ధారణే లోలోపలౌ[3].

నిర్ధారణే= నిర్ధారణార్థమునందు, షష్ఠ్యాః = షష్ఠీ విభక్తికి, లోలోపలౌ= లో, లోపల అనునవి యగును. కికుషష్ఠ్యాః అనుపూర్వసూత్రము నుండి షష్ఠ్యాః అను పదమనువర్తించును.

---

1.ఇట'నెక్కి' యని వ్రాత ప్రతియందస్పష్టముగ నున్న పాఠమున యతిభంగము.

2.జమో లోపల కికుయొక్కాః ఆం.కౌ.శ.11
అథలోపల కికుయొక్కాన్యా. ఆం.శ.చిం.అ.6

3.లోపల నిర్ధారణోద్భవా షష్ఠీఆం.శ.చిం.అ.31.
లోలోపలౌ నిర్ధారణే.త్రి.శ.3-2.బృహస్పతిసూత్రము. ఆం.కౌ.శ.37, వై.చం.వి.13.

వి. నిర్ధారణే షష్ఠ్యాః లోలోపలౌ స్తః
రాజులలో రాముఁడెక్కుడు, చెలులలోపల సీత మేటి.

నిర్ధారణము నందు షష్ఠీ విభక్తికి లో, మఱియు లోపల అనునవి యగును. "జాతి గుణ క్రియా సంజ్ఞలచేత సముదాయంబునుండి యేకదేశంబునకుం బృథక్కరణంబు నిర్ధారణం బనంబడు".

రాజులలో రాముఁ డెక్కుడు. రాజుల సముదాయము నుండి యం దేకదేశ మయిన రాముని సంజ్ఞను బట్టి పృథక్కరింపఁగా సముదాయవాచి యగు రాజశబ్దమునకు నీ సూత్రముచే లో అను షష్ఠీ విభక్తి యైనది. 'లోపల' వచ్చిన రాజులలోపల రాముఁ డెక్కు డని యగును.

వ్రాతప్రతిలో నీ సూత్రము లేదు. కాని యుదాహరణము లున్నవి. వానింబట్టియు, నృసింహకవి ఆం.కౌ. మరియు నధర్వణుని త్రిలింగశబ్దానుశాసనములను బట్టియు నీ సూత్ర మిట్లు యుండు నని నిశ్చయింపఁదగును.

## 16. శేషే యొక్కః[1]

శేషే = శేషార్థమునందు, షష్ఠ్యాః = షష్ఠీవిభక్తికి, యొక్కః = యొక్క అని యగును.

వి. షష్ఠీ సమాసవిగ్రహవాక్యే శేషషష్ఠ్యాః యొక్క స్యాత్.[2]

షష్ఠీ సమాసము యొక్క విగ్రహ వాక్యము నందు, శేషార్థమున షష్ఠీ విభక్తికి యొక్క యగును 'కికు షష్ఠ్యా' అను సూత్రము నుండి క్రమముగా 'షష్ఠ్యాః' అనునది యిం దనువర్తించును.

శేష మనఁగా సంబంధము. సంబంధార్థము నందు సంబంధి పదమునకు షష్ఠియు, ఆ షష్ఠికి యొక్క ప్రత్యయము నగును.

రాముని యొక్క గుణములు. గుణములు రామునికి సంబంధించిన వగుట 'సంబంధి' శబ్ద మగు 'రామ' అనుదానికి యొక్క ప్రత్యయ మయి రాముని యొక్క యని యయినది. ఇట్లే లాముల యొక్క శక్తి మొ॥

---

1 ఆం.కౌ.శ.41; ఒక్క శేషే వై.చం.సమా.3. అని ఒక్క విధించుట విశేషము. యొక్క చ శేషే షష్ఠీ ఆం.శ.చిం.ఆ.32.

2.షష్ఠీ సమాస విగ్రహ వాక్యే యొక్క. త్రి.శ.3-3. బృహస్పతి సూత్రము. షష్ఠీ సమాస విగ్రహవాక్యే చేతి వాచ్యమ్ ఆ.ం.కౌ.41. సూత్రవృత్తి.

తరువాతి దగు 'ప్రయోగానర్హశ్చ' యనుసూత్రము ననుసరించి యొక్క ప్రయోగార్హము గా దనును ద్దేశముతో నిట యొక్క ప్రత్యయాంతమునకు వివృతియం దుదాహరణము చూపఁబడలే దని గ్రహింపవచ్చును.

## 17. ప్రయోగానర్హశ్చ[1].

యొక్కః = యొక్క యను షష్ఠీ విభక్తి ప్రయోగానర్హః చ = ప్రయోగించుటకుఁ దగినది గాదు. శేషే యొక్కః అనుపూర్వసూత్రము నుండి యొక్కః అనునది యిం దను వర్తించును.

వి. కావ్యేషు యొక్కశబ్దః ప్రయోగానర్హస్స్యాత్.
రాముని యొక్క చరిత్ర ఇత్యత్ర రాముని చరిత్ర.
దేవతల యొక్క వీడు ఇత్యత్ర దేవతలవీడు ఇత్యాది.

కావ్యములందు యొక్క ప్రత్యయము ప్రయోగింపఁదగదు. రాముని యొక్క చరిత్ర మను నర్థమున రాముని చరిత్ర యను తీరుగా నుండునె కాని యొక్క ప్రత్యయము కావ్యములందుఁ బ్రయోగింపఁబడ దని యభిప్రాయము.

కావ్యములందుఁ బ్రయోగింపఁదగ దనుటను బట్టి యితర గ్రంథములలో యొక్క ప్రయోగించుట దుష్టము గా దని స్పష్ట మగుచున్నది. వ్యస్తతలోను 'యొక్కకు లోపంబు బహుళం' బని పాఢ వ్యాకర్త చెప్పెను. ఇంకను 'అనేక కర్తృక క్రియకు సమీప కర్తయొక్క లింగవచనంబు లగు' (వాక్య.15) ననుచో సూత్రమున యొక్క ప్రత్యయమును బ్రయోగించెను. కావ్యములం దిట్లు యొక్క గానరాకుండుట స్పష్టము.

## 18. జిపౌ విషయనిమిత్తే[2].

జిపః = సప్తమీవి భక్తికి, విషయ నిమిత్తే = విషయము, నిమిత్తము అనునవి యగును.

వి. సప్తమీవిభక్తే ర్విషయనిమిత్తే ద్వే స్తః.
వెలఁది విషయము రాముఁడు విల్లు విఱిచె;
గోవుల నిమిత్త మాహరి

1. ఆం.కౌ.శ.42
త్రి.శ.3.4, బృహస్పతి సూత్రము.

2. జౌవాది సమే విషయనిమిత్తే. ఆం.కౌ.శ.43. విషయనిమిత్తాదిజా తద్వైవాహ్యా. ఆం.శ.చిం.అ.33.

గోవిందుఁడు కేల నెత్తె గోవర్ధనమున్.
గ్రావమణి చలము మీఱఁగ – ఇత్యాది.

సప్తమీవిభక్తికి విషయము, నిమిత్తము నను రెండు శబ్దము లగును.

వెలఁది విషయము = వెలఁది యం దని యర్థము. గోవుల నిమిత్తము = గోవుల యం దని యర్థము. వెలఁది యందు విల్లు విఱిచె, గోవులయందు గోవర్ధన మెత్తె నను వాక్యము తెలుఁగున నుండదు.

చర్మణి ద్వీపినం హన్తి = చర్మము నిమిత్తము ద్వీపిని జంపెను, అనురీతిగా సంస్కృతమును దెలుఁగుఁ జేయుటయం దిట్టి యవస్థ యేర్పడియుండును. ఇటుఁ దెలుఁగున వెలఁది కొఱకు రాముఁడు విల్లు విఱిచె. గోవుల కొఱకు గోవర్ధన మెత్తె ననుతీరుగా నీ య ర్థమున కొఱకు ప్రత్యయ మగును. ఇట్లె చర్మము కొఱకుఁ జంపెను మొ॥

ఇంకను విషయము, నిమిత్తము నను శబ్దములతో సమాసమయి వెలఁది విషయమున విల్లు విఱిచె, గోవుల నిమిత్తమున గోవర్ధన మెత్తె నని యేని వ్యవహరింప వచ్చును.

అది య ట్లుండఁగా 'విషయము, నిమిత్తము' అనునవి ము ప్రత్యయాంతము లై ప్రథమాంతము లగుపదము లగుచుండఁగా నయ్యవి సప్తమి కాదేశములుగాఁ జేయఁబడుట సంగతము గా లేదు.

ఈ సంస్కృత శబ్దములను దెలుఁగు ప్రత్యయములుగాఁ జెప్పుట యింకను నసంగతము.

## 19. నాందూ చ [1].

ఙిపః = సప్తమీవిభక్తికి, నాందూ చ = న, అందు అనునవియు నగును. పూర్వోక్తము లగు విషయము నిమిత్తము అనునవే కాక అందు న అనునవియు నగు నని యభిప్రాయ మన్నమాట. దీనిని బట్టియు విషయనిమిత్త శబ్దములు జెప్పున కాదేశముగాఁ బూర్వసూత్రముచే విధింపఁబడిన వని చెప్పక తప్పదు.

ఙిపో విషయనిమిత్తే యను పూర్వ సూత్రము నుండి 'ఙిపః' అనునది యిట నను వర్తించును. ఙి (టస్) సుప్ అను రెంటి ననఁగా సప్తమ్యేకబహు వచనములను రెంటిని ఙిప్ అను ప్రత్యాహారము బోధించును.

---

1. ఙిపో ఽ0 ద్విందునా౽ ఆం.కౌ.శ.12.
అంద్విందు నాస్తు సప్తమీ. ఆం.శ.చిం.ఆ.7.

వి.సప్తమీ విభక్తేః నాందూ స్తః. నశ్చ అందుశ్చ నాందూ;
న, అందు, వనమున, ఊరున, రామునందు,
భామయందు - ఇత్యాది.

సప్తమివిభక్తి కనఁగా ఙి సుప్ అనువాని స్థానమున, న, అందు అనునవి యగును.

'నశ్చ అందుశ్చ' అను విగ్రహము చొప్పున, న - అందు అను శబ్దములు రెండింటి కేర్పడిన ద్వంద్వసమాసము 'నాందూ' కావున 'నాందూ' అను దానిచే, న-అందు అను రెండు గ్రహింపఁ బడు నని యభిప్రాయము.

వనమున, భా మయందు, భామలయందు. మొ॥

వీనిలో 'న' అనునది సప్తమి యం దే కవచనమునకు, 'ఙి' అను దానికి మాత్రమె యగును. అందు అనునది ఙిసుప్పులకు రెంటికి నవును.

## 20. మహత స్సోర్డు జనితః[1].

అనితః = ఇకారాంతము గాని, మహతః = మహత్తు కంటెఁ బర మయియున్న, సోః = సు ప్రత్యయము యొక్క స్థానమున, డుజ్= డు జ్ఞనునది యగును.

వి. ఇదన్త వ్యతిరిక్తస్య మహతః ప్రథమై కవచన స్య డుజ్ స్యాత్.
రాముఁడు, గురుఁడు, సవితృఁడు.

ఇకారాంతము కాని మహద్వాచకము కంటెఁ బర మయియున్న సుప్రత్యయము స్థానమున డు జ్ఞ నునది వచ్చును.

ఇందు మహత్సంజ్ఞ యుపయుక్త మగుటచే మహ త్తన నేమియో దీనికి ముందే చెప్పిన బాగుండెడి దనిపించును. 'మహన్తోఽన్యే (శబ్ద-44) యను సూత్రమును బట్టి' (అమహన్తః స్త్రీ పశుజడా.శబ్ద-42) తద్విశేషణంచ-43) స్త్రీ పశు (తిర్యగ్) జడముల కంటె భిన్న మైనదియు దానివిశేషణమును మహ త్తగును.

'సు' అన్నది సంస్కృత ప్రథమై కవచనము. 'సోః' అనుషష్ఠిచే 'షష్ఠీ స్థానే యోగా' యను పాణినీయ పరిభాష ననుసరించి సుస్థానమున నని యర్థ మగును. 'మహతః' అనునది పంచమ్యంతము. 'తస్మాదిత్యుత్తరస్య' యను పరిభాష నను సరించి దానికిఁ బరమైన - అను నర్థము సిద్ధించును.

---

1. మహతోఽతో డుజ్సోః పుంసి. ఆం.కా.శ.18. మహతస్సోర్డుజనితోభవే త్పుంసి. ఆం.శ.చిం.అ.12. డుజ్సునః పుంసి త్రి.శ.3.7. బృహస్పతిసూత్రము. సోర్మహతోడుజనితః.వై.చం.అ.3.

'రామ' అనునది ఇకారాంతము గాదు. పురుషవాచక మగుటచే మహతు కావున 'మహతస్సుప్యుదతో' యని యుత్వమురాఁగా, రాము అనియును దీనిపై నున్న ప్రథమా విభక్తియేకవచన మగు'సు' ప్రత్యయము యొక్క స్థానమున నీ సూత్రముచే డుజ్జు వచ్చును. డుజ్జులో జ కార మిత్తు కావున నది లోపించును. డు వర్ణము జి త్తగుటచే 'జి దనుస్వారశ్చ' యను సూత్రముచే డు వర్ణమునకు ముందు బిందు వగును. రాముండు (అనునాసికంచ-కృత్-47. అను సూత్రము చే సరసున్నయైన-రాముఁడు?) రాముఁడనుచో రామశబ్ద మదంతము, గురుఁ డనుచో గురు శబ్ద ముదంతము, సవిత్రుఁ డనుచో సవితృశబ్దము ఋదంతము క్రమముగా వివృతియం దుదాహరింపఁబడినవి.

వి. మహతః కిమ్? వనము, తరువు.

సూత్రమునందలి 'మహతః' అనుటచే మహత్తులు గానివానికి డుజ్జు లేదు. వనము, తరువు. ఇవి యనిదంతము లైనను నమహత్తు లగుటచే డుజ్జు రాలేదు.

వి. అనితః కిమ్? హరి.

సూత్రము నం 'దనితః' అనుటచే ఇకారాంతములపై డుజ్జు రాదు. 'హరి' శబ్దము మహద్వాచక మయిన నిదంత మగుటచే డుజ్జ రాలేదు. 'సోర్లు గితః' అను సూత్రముచే దానిపైని సువిభక్తి లోపించును.

ఇ ట్లి కారాంతములకు 'సు' లోప మగుచుండఁగా డుజ్జు ప్రాప్తించుట కవకాశము లేదు. కావున నీ సూత్రమున 'అనితః' అను దళము లేకున్నను నిబ్బంది లే దనియే చెప్పవచ్చును.

'మహతః' అనుచో శబ్దము మహ త్తగుటతోపాటు పుంలింగము గూడఁ గావలయును. దైవ, మొద లగునవి మహత్తు లయినను బుంలింగములు కావు. కావున దైవుఁ డ నురీతిగా డుజ్జు రాదు. దైవము.

'సోః' అనుటచేఁ బ్రథమై కవచనము కంటె నితరము లైన విభక్తులలో డుజ్జు రాదు. రాములు, రాములందు. మొ॥

## 21. లుజసః [1].

జసః = 'జస్' స్థానమున, లు = లు వర్ణక మగును.

వి. మహదమహతః ప్రథమా బహువచనస్య లుప్రత్యయస్స్యాత్.

రాములు, హరులు, వనములు భామలు, తేరులు. ఇత్యాది.

1. ఆం.శా.శ.6, వై.చం.అ.7.
లుజసోలశహోఽ లాన్తాత్. ఆం.శ.చిం.అ.14.

మహత్తు లైన నమహత్తు లైన నన్ని శబ్దములకును బ్రథమా బహువచన మగు 'జస్' ప్రత్యయము స్థానమునఁ దెలుఁగున 'లు' అనునది యగును.

'స్వౌజసమౌట్' మొదలగు పాణినీయ లక్షణమునుబట్టి 'జస్' ప్రథమాబహు వచనము.

పూర్వ సూత్రమున 'మహతః' అనుదళము గలదు. అది యిం దనువర్తించిన నీ కార్య మమహత్తులకుఁ గాదు. కాని దీనికిఁ దరువాతి సూత్రమున 'మహతో నిరమః' అని మఱల మహతః అనుటచే నీ సూత్రమునఁ బూర్వ సూత్రము నుండి 'మహతః' అనుదాని నను వర్తింపరా దని గ్రహింప వచ్చును. ఇ ట్లీ సూత్రములోని కనువర్తించిన నది తరువాతి సూత్రములోనికి ననువర్తించును గాన నట 'మహతః' అనుదళము వ్యర్థ మగును గదా. కాఁగాఁ దరువాతి సూత్రమున 'మహతః' అనుట ననుసరించి ప్రస్తుత సూత్రములోనికి మహతః అన్నది పూర్వ సూత్రము నుండి యనువర్తింపదు. కావున నెల్ల శబ్దములకును బ్రథమా బహువచన వివక్ష యం దయిన 'జస్సు' స్థానమున నీ సూత్రముచే లు వర్ణక మగును.

రాములు - మహత్తు - అదంతము, హరులు - మహత్తు - ఇదంతము. ఇ ట్లన్నితెలుఁగు లయిన మహత్పుంలింగములకు 'లు' అయినది.

వనములు అమహత్తు. భాములు స్త్రీలింగము. తేరులు ఆచ్ఛికము.

ఇట్లు వివృత్తి వేర్వే ఉదాహరణములతో నీ లు వర్ణక మెల్ల శబ్దములకు నగుట స్పష్టము చేసినది.

## 22. మహతో నిరమః[1].

మహతః= మహద్వాచకములకుఁ బర మై యున్న, అమః='అమ్' అనుదాని స్థానమున నిః='ని' అనునది యగును.

వి. మహత్పదస్య ద్వితీయైకవచనస్య ని ప్రత్యయ స్స్యాత్. రాముని.

మహత్తులకుఁ బరముగా నున్న ద్వితీయా విభక్తి యేకవచనము స్థానమున 'ని' అను ప్రత్యయ మగును.

స్వౌజస మ్మను పాణినీయ లక్షణము ననుసరించి 'అమ్' అనునది ద్వితీయా విభక్తి యేకవచనము. మహ త్తగు శబ్దము పుంలింగమును గావలె నని గ్రహింపవలయును. కాఁగా మహత్పుంలింగ శబ్దముపైని ద్వితీయైకవచన మగు 'అమ్' స్థానమునఁ దెలుఁగున ని వర్ణక మగును.

---

1. ఆం.కౌ.శ.25.
నిరమో మహతాం. ఆం.శ.చిం.అ.16.
న్యమోడుమతః. వై.చం.అ.11

'రామ' అనుదానిపై ద్వితీయైకవచనవివక్షలో 'అమ్' చేరి, రామ + అమ్ అని యుండఁగా 'మహతస్సు ప్యదతః' అని యుత్వమై రాము+అమ్, ప్రస్తుత సూత్రముచే అమ్మునకు ని వర్ణక మై రాముని అని యగును.

మహతః అనుటచే నీ కార్య మమహత్తులకులేదు. వనమును, 'సు రమహతామ్.' ఆం.కౌ.శ.26.

మహ త్తయినను బుంలింగము గానిచో ని వర్ణకము రాదు. దైవమును. మొ॥

మహత్పులింగ మగు శబ్ద మెట్టి దైనను ని వర్ణక మగును. రాముని, హరిని, గురుని, సవిత్రుని.

'అమః' అనుటచే నితర విభక్తులయందు రాదు. రాముఁడు.

## 23. ల శసః[1].

శసః = 'శస్' స్థానమున, ల = లవర్ణక మగును.

వి. మహదమహతోః ద్వితీయాబహువచనస్య ల స్స్యాత్.

రాముల, హరుల, గురుల, భామల, ఇంతుల. ఇత్యాది.

మహత్తులు నమహత్తులు నైన శబ్దములకుఁ బరముగా నున్న ద్వితీయాబహువచనమునకు ల వర్ణక మగును.

స్వౌజసమౌట్ఛ స్సను పాణినీయ లక్షణము ననుసరించి శస్సు ద్వితీయా బహువచనము.

'రామ' శబ్దముపై ద్వితీయాబహువచనమును వివక్షింపఁగా 'శస్' అయి, రామ+శస్ అనుచో 'మహతస్సుప్యదతః' అను సూత్రముచే నత్వమున కుత్వ మయి, రాము+శస్ అని కాఁగా నీ సూత్రముచే శస్సు స్థానమున లవర్ణక మయి రాముల అని యగును. ద్వితీయాద్యుత్త మేత్యాది సూత్రముచే ని సంకీర్ణము గావున దీనిపై ద్రుతము చేరి రాములన్ అని యగును. పక్షమున రాముల అనియు నుండవచ్చు ననవలెను సంకీర్ణము గదా.

ప్రథమాబహువచన మగు'లు' వర్ణకము వలెనె, యీ 'ల' వర్ణకము మహదమహత్తుల కనఁగా నెల్ల శబ్దములకు నగును. అది నిరూపించుచు 'లు జసః' అను సూత్రమునొద్దవలె వివృతి యిట నుదాహృతులు సూపినది.

---

1. ఆం.కౌ.శ.7.

ఆం.శ.చిం.అ.14, వై.చం.అ.12.

## 24. కర్మప్రవచనీయకే కూర్చిః[1].

కర్మ ప్రవచనీయకే = కర్మ ప్రవచనీయార్థము నందు, కూర్చిః = కూర్చి యనునది యగును.

వి.ద్వితీయా విభక్తేః కర్మ ప్రవచనీయార్థే కూర్చి స్స్యాత్.
రాముని గూర్చి తప మాచరించె, హరుని గూర్చి వచ్చె.

కర్మ ప్రవచనీయార్థము నందు ద్వితీయావిభక్తికి 'కూర్చి' యనునది యగును. రాముని గూర్చి.

'కూర్చిలను నయో ద్వితీయాయాః' అను సూత్రమున 'కూర్చి' యనునది ద్వితీయా విభక్తిగాఁ జెప్పఁబడినది. కావున ద్వితీయపైఁ గూర్చి యగుటకు వీలు లేదు. కాని రాముని గూర్చి యను యుదాహరించుచో వివృతి యందు ని వర్ణక మెట్లు వచ్చినదో వివరింపఁబడలేదు.

నన్నుఁగూర్చి, మమ్ముఁగూర్చి యనురీతి రూపముల ననుసరించియుఁ గూర్చి ద్వితీయ కనుప్రయుక్త మగునదే కాని ద్వితీయ గా దని చెప్పుట యుచిత మని గుర్తింపవలసి యున్నది.

'ద్వితీయా కూర్చి యోగే' (కార.7) యని పైని జెప్పఁబడును.

## 25. లుక్కాణ్వస్య[1].

కణ్వస్య = కణ్వుని యొక్క మతమునందు, లుక్ = (ని వర్ణకమునకు) లోప మగును.

వి. ద్వితీయైకవచనస్య నిప్రత్యయస్య లుక్ స్యాత్కాణ్వ స్య మతే.
రాము భజించెద, హరిఁగొలిచెద,
గురు నాశ్రయించెద.

ద్వితీయావిభక్తి యేకవచన మగు ని వర్ణకమునకు లోపము వచ్చును.

ఈ వ్యాకర్తల మతమున ద్రుతము పొల్లు నకార మగుటచే రామునిన్+భజించెద నుచుచో

1. ఆం.శ.చిం.అ.17.
కూర్చిః కర్మణి. ఆం.కౌ.శ.28.
కర్మప్రవచనీయస్య కూర్చిత్యాదేశ ఉచ్యతే.వై.చం.వి.12.సూత్రవృత్తి.

2. విభక్త్యర్థలుక్కాణ్వా దీనామ్ త్రి.శ.3.10.బృహస్పతి సూత్రము. - - లుక్వస్యాత్. ఆం.శ.చిం.అ.16.
తయోర్లుక్వ. ఆం.కౌ.శ.27.

ద్రుతము లోపించినను రాముని భజించెద నని కావలయునే కాని రాము భజించె దని కానేరదు. అట్టి రూపము గావలయు నన్న ని వర్ణకమే లోపింపవలయును హరి (గొలిచెద' గురునాశ్రయించెద నను చోట్ల సరళాదేశమును, బరమైన యచ్చుకుముందటి ద్రుతమును దీని ద్రుతాంతతను స్పష్టము చేయుచున్నవి. అనఁగా 'మహతోనిరమః' అను సూత్రముచే అమ్మునకు ని వర్ణకము చేసిన పిదప సంకీర్ణతను బట్టి వానిపై ద్రుతము చేరి రామునిన్, హరినిన్, గురునిన్, అని యగును. ఈ సూత్రముచే ని వర్ణకము లోపింపఁగా రామున్, హరిన్, గురున్ అని యగును. హరిన్+కొలిచెద = హరిఁగొలిచెద. (ఇట ద్రుతకార్యములలో ఖండబిందువు స్పష్టముగా విధింపఁబడినట్లు గానరాదు). గురున్+ఆశ్రయించెద = గురునాశ్రయించెద నని మయినది.

'కణ్వస్య' యనుటచే నిది యొకమతము. కావున మతాంతరమున లోపము లేదు. అనఁగా 'కణ్వస్య' యను దళముచే లోపము వికల్ప మని యర్థ మగుచున్నది.

కావున లోపము రాని పక్షము నందు రాముని భజించెద, హరినిఁ గొలిచెద, గురుని నాశ్రయించెద నని యుండును.

ఈ సూత్రమును 'మహతోనిరమః' అను సూత్రమునకుఁ బిదపఁ జెప్పిన బా గుండెడి దని పించును. అమః అనుదాని ననువృత్తము చేసి 'ని' వర్ణకమునకుఁ గాక అమ్మునకే లోపము చేయఁదగును. అపు డమ్మునకు ని వర్ణకము చేసి యా ని వర్ణకమునకు లోపము చేయు ప్రక్రియాగౌరవమును దప్పును. కాని కణ్వుఁడు 'నిన్వోర్లుక్కణ్వస్య' యను త్రి.శ.లక్షణమును బట్టి ని,ను లకే లోపము చెప్పినట్లు తెలియవచ్చును. వివృతికర్త యా కణ్వగ్రంథము చూచియె ని వర్ణకలోప మని చెప్పియుండు. అ ట్లయ్యు 'మహతోనిరమః' అను దాని తరువాతఁ జెప్పఁదగు ననుట మాత్ర ముచితము.

## 26. నోశ్చ సోమచన్ద్రస్య[1].

సోమచన్ద్రస్య = సోమచంద్రునిమతమున, నోః చ = ను వర్ణకమునకు నయితము, లుక్= లోప మగును.

వి. మహదమహతో ర్నువర్ణకస్య లుక్ స్యాతో్స మచన్ద్రస్య మతే.

రామును–రాము.

మహత్తులకు నమహత్తులకును బైనున్న ను వర్ణకమునకును సోమచంద్రుని మతమున

1. తయోర్లుక్. ఆం.కౌ.శ.27.
నిన్వోర్లుక్కణ్వాదీనామ్. త్రి.శ.3.బృహస్పతి,సూత్రము.

లోప మగును. 'లుక్కృణ్యస్య' యను పూర్వసూత్రము నుండి 'లుక్' అనునది యిం దను వర్తించును.

'నోశ్చ' యనునప్పటి 'చ' శబ్దముచే నీ ను వర్ణము ద్వితీయా విభక్తియేకవచన మని గ్రహింపవచ్చును. వివృతి యందును మొదట, రామును, ఢాము అని ద్వితీయైకవచనాంతరూప ముదాహరింపఁబడుట గమనింపవచ్చును. కాని 'రామును' అనురీతిగా మహత్పుంలింగములకుఁ బ్రథమైకవచనమున డుజ్జువచ్చు వానికి ద్వితీయైకవచనమున ను వర్ణకము వచ్చుట లేదు. కావున 'రామును' అను వివృతి చూపిన యుదాహరణము ప్రమాదము వలనిదే యని నిశ్చయింపక తప్పదు.

అప లింతకుఁ బూర్వము గాని, పిదపఁ గాని ను వర్ణము విధించిన జాడ గానరాదు. ను వర్ణము దేని కగును?

'కూర్చి ల ను ని' అను ద్వితీయావిభక్తులలో కూర్చి (కర్మ ప్రవచనీయకే కూర్చిః) ల (లశసః) మహతోని రమః అని ని వర్ణకము విధింపఁబడినది. కాఁగా మిగిలినది ను వర్ణక మొక్కటి, కూర్చి, ల-అనునవి ప్రత్యేక స్థలముల నగునవి. కాఁగా ద్వితీయైక వచనమున 'ని' అనునది మహత్తులకే చెప్పఁబడినది. అమహత్తులపై నమ్మన కేమి యగును. కావునఁ బరిశేష న్యాయము ననుసరించి యా మిగిలిన యమహచ్ఛబ్దముల కీ ద్వితీయా విభక్తులలో మిగిలిన దగు'ను' వర్ణకము వచ్చును.

'నోశ్చ' (శబ్ద 48) యను సూత్ర మిదంతములకు 'ను' లోపము చెప్పినది. హరిను అనుచో ను వర్ణకము లోపించు ననుటచే ని వర్ణమగు నని వివృతి వివరించినది. 'హరి' యనునది మహత్తయి యుండఁగా 'మహతోనిరమః' అని ని వర్ణకమే గదా యవునది. రాని ను వర్ణకమునకు లోపము చెప్పుటయు నందువలన ని వర్ణక మగు ననుటయు నెట్లు? ఇది వ్యర్థమై యొక యర్థమును జ్ఞాపకము చేయును. 'మహత స్సోర్డుజనితః పుంసి' యను సూత్రముచేఁ బ్రథమైకవచనము నందు వేనికి డుజ్జు వచ్చునో వానికే ద్వితీయైకవచనమున ని వర్ణక మగును. దీనివలన అనితః అనుదశముచే నిదంతములకు 'ని' వర్ణకములేదు కావునఁబైనట్లు పరిశేషన్యాయముచే ను వర్ణకమె యగును. దానికి లోపము చెప్పుట వలన 'ని' వర్ణక మగును. (ఇట్టి ప్రక్రియ వలన నిదంతము లగు నమహత్తులకుఁ గూడ ని వర్ణకము సిద్ధించుట యచటి ప్రయోజన మందుము. ఇదంతములకు ని వర్ణకము విధించుట సూటియగు మార్గ మనుట నిస్సంశయము) దీని వలన గురువు, రాజు అనురీరుగాఁ బ్రథమైకవచనమునందు డుజ్జును బొందని మహత్తులకును బరిశేషన్యాయముచే 'ను' వర్ణకమే యగును.

కాఁగా 'మహతోనిరమః' అను సూత్రముచే ని వర్ణకము ప్రథమైకవచనమున డుజ్జు వచ్చు శబ్దములకు మాత్రమె. కావునఁ బ్రథమైకవచనమున డుజ్జు రాని మహదమహచ్ఛబ్దముల

కెల్లఁ బరిశేషన్యాయమునే ను వర్ణక మగును.

వి వర్ణకము వలెనె యీ ను వర్ణకము నయితము లోపించు నని సోమచంద్రుని మతము. సోమచంద్రుని మత మనుటవలన మతాంతరమున లోపము లేదు గావున వికల్ప మగుట సిద్ధించును.

కావున గురువును, గురువు – అనురీతి నిట నుదాహరింపఁదగినవి. కాని 'రామును, రాము అను తీరు వని కాదు.

ప్రస్తుత లక్షణము ననుసరించి ను వర్ణకము లోపింపఁగా గురువుంగొలిచె, వనముఁజేరె. ఇత్యాదిగా నుండును. సోమచంద్రస్య యనుటచే లోపము రాని పక్షము నందు గురువునుం గొలిచె, వనమునుంజేరె ననురీతిగా నుండు నని గుర్తింపఁదగును.

ఇట విభ్రుతియం దమహత్తులను గూర్చిన యుదాహరణము నష్ట మైన దేమో.

'వినోర్వర్ణక్కచ్ఛాస్య' యను నథర్వణుని త్రి.శ. కణ్వుఁడు ని వర్ణముతోపాటు ను వర్ణమునకును లోపము చెప్పినట్లు బృహస్పతి మతము నుద్ధరించినది. ఈ గ్రంథము ని లోపము కణ్వమతముగాఁ జెప్పి ను లోపము సోమచంద్రమతముగాఁ జెప్పుట విశేషము.

## 27. మహత స్సుప్యదతః[1]

సుపి = ప్రథమాదివిభక్తులు పరముగా నున్నప్పుడు, మహతః = మహత్తు లయిన శబ్దముల యొక్క, అతః = హ్రస్వ మయిన యకారమునకు, ఉత్ = ఉత్వ మగును.

వి. (మహత్పదస్యాకారస్యోత్ స్యాత్సుపిపరే. రాముఁడు, రాముని,)
రాము చేత, రాము కొఱకు, రామువల్ల, రామునకు, రామునందు.
మహతః కిమ్? భామచేత. అతః కిమ్? హరిచేత.

'సుప్' అనునది ప్రథమనుండి సప్తమి వఱకు నున్నవిభక్తులను దెలుపునది.

ప్రథమాది విభక్తులు పరముగా నున్నపుడు మహత్తు (పుంలింగమును) అయిన ప్రాతిపదికము యొక్క అత్వము స్థానమున నుత్వ మగును.

నుప్పు పర మగునది ప్రాతిపదిక యందలి చివరియచ్చునకే కావునఁ బ్రాతిపదికమునఁ

1. శ్లో. రుచ్ఛ? త్రి.శ.3.బృహస్పతిసూత్రము.
మహతోఽత ఉద్విభక్తౌ. అం.శ.విం.ఆ.11.
విభక్తౌ పుదతస్తస్య పుంపి. అం.కౌ.శ.19.
సుపిమహతోఽతస్యాత్ ఉత్ వై.చం.ఆ.2.

జివర నున్న యత్తునకె యుత్వమగు నని 'సుపి' యను దానిచే స్పష్టము. 'సుపి' అను సప్తమిచే 'తస్మిన్నితి నిర్దిష్టే పూర్వస్య' యను పాణినీయ పరిభాషననుసరించి సుబ్విభక్తులకుఁ బూర్వమునం దున్నయత్తునకే య నఁగాఁ బ్రాతిపదికము తుదియత్తునకె యుత్వ మగును.

రామ + సు అనుచో నీ సూత్రముచే నుత్వము రాఁగా 'రాము' అని యగును. దీనిపై 'మహత స్సోర్డు' జని డు జయి రాముఁడు అని యగును. ఇట్లె రాముని, రాము చేత. మొ

మహతః అనుటచే నీ సూత్రముచే మహత్తులు గాని ప్రాతిపదికల కుత్వము రాదు. భామచేత, భామ స్త్రీ వాచకమగుటచే మహత్తు గాదు. కావున నుత్వము రాలేదు.

'అతః' అనుటచే మహ త్తయినను బ్రాతిపదిక యందుఁ దుది నత్వము గాని యచ్చున కుత్వము రాదు. హరిచేత, ఇం దున్నది ఇత్వము గాన నుత్వము రాలేదు. ఇట్లే సవితృఁడు. మొ॥

'సుపి' యనుటచే 'హరి' యనుచో హ వర్ణము నందలి యత్తున కుత్వము రాదు. సుప్పునకుఁ బూర్వమున నున్న యత్త్వము గాదు. రి వర్ణముతో వ్యవధానము గలదు గదా. ఈ లక్షణము దుర్వ్యధానమునకు ముందు చెప్పిన బా గుండెడిది.

(ఇచట రాములను, రాముల, రాముచేత ఇత్యాదిగా నీవివృతి భాగము పూర్వ సూత్రము వివృతిలోఁ గలిసి యున్నది. దీని కా సూత్రముతో నెట్టి సంబంధమును లేదు. పైగా మహతః కిమ్, అతః కిమ్ అను వివరణ భాగము ననుసరించియు స్థలాంతరమున నుద్ధరింపఁబడి సూత్రముగాఁ గానఁబడని యీ సూత్ర మిచ్చట నుండవలసినది. అందుకె మొదటి రెం డుదాహృతులు పైరీతిని గ్రహింపఁబడినవి.)

## 28. ఓ దామన్త్రణే[1].

ఆమన్త్రణే = సంబోధనమునందు, ఓత్ = తెలుఁగున 'ఓ' కారము వచ్చును.

వి. వికృతౌ ఓత్ స్యాదామన్త్రణే. ఓరామ, ఓ జానకి.

తెలుఁగున సంబోధనము నందు 'ఓ' కారము వచ్చును. 'ఓత్' అనుచోటి తకార ముచ్చారణ సౌకర్యమునకై చేర్పఁబడినది. కావున 'ఓ' అనునదే వచ్చును.

సంస్కృతము నందు హేరామ మొద లగురీతిగా 'హే' ప్రభృతులవలెఁ దెలుఁగున నీ 'ఓ' శబ్దమును సంబోధ్య వాచకమునకుఁ బూర్వము నందుఁ బ్రయోగింపఁబడును. వై.చం. ఓహో

1. ఓయాత్యామన్త్రణశ్చవికృతౌ స్యాత్. అం.శ.విం.అ.8.
ఓ ఓయ్యా మన్త్రణే. అం.కౌ.ష.13.
ఓ సంబోధనే వై.చం.అవ్య.15.

– (అజన్త.9) అని హే స్థానమున ఓ అనునవ్యయము నాదేశము చేసినది.

'రామ' అను సంబోధన ప్రథమాంత మగు శబ్దమున కీ సూత్రముచే ముందు 'ఓ' చేరి ఓరామ అని యగును.

ఓ దామంత్రణేయని సామన్యముగాఁ జెప్పుటచే మహదమహత్తు లగునెల్ల శబ్దములకు నో శబ్ద మగును. ఓ జానకి, ఓ భృంగము, ఓ వనము.

అట్లె సామాన్య విధానమును బట్టియే యేక బహువచనములు రెంట నగును. ఓ రాములార! ఓ వనితలారా! మొ॥, సంస్కృతమున హే ప్రభృతులవలె ఓశబ్దమును నిత్యము గాదు. 'రామ' యని ఓశబ్దము లేకుండఁ గూడ సంబోధ్య వాచకము ప్రయోగింపఁబడవచ్చును.

## 29. పూజ్య[1] తుచ్ఛాతుచ్ఛానామ్యిసి[2] రయః

పూజ్య తుచ్ఛ అతుచ్ఛానామ్ = పూజ్యత, తుచ్ఛత్వము, అతుచ్ఛత్వము నగు నర్థములయందు, యిసి రయః =(ఓ శబ్దమునకుఁ బరముగా) యి,సి,రి యనునవి యగును.

వి. పూజ్య తుచ్ఛా తుచ్ఛానాం సంబుద్ధౌ ఓ కారాత్పర
తః క్రమేణ యి,సి,రి వర్ణాస్స్యుః – ఓయి రామచంద్ర,
ఓసి కులద్రోహి, ఓరి దుష్టాత్మ.

పూజ్యార్థమునందును, తుచ్ఛతను దెల్పుచోను, అతుచ్ఛతలోను సంబోధనమునందు వచ్చు 'ఓ' శబ్దమునకుఁ బరముగా యి,సి,రి అనునవి వచ్చి చేరును.

ఓయి రామచంద్ర (పూజ్యత), ఓసి కులద్రోహి, ఓరి దుష్టాత్మ (తుచ్ఛత).

అతుచ్ఛతయం దనఁగా ఁదుచ్ఛార్థము గాకున్నను సి,రి,వర్ణములు వచ్చును. అందుకు వివృతి యం దుదాహృతి గానరాదు. ఓరి ముద్దుకృష్ణ, ఓసి ముద్దు బాల. మొ॥

యి వర్ణకము మాత్రము నీచార్థము నందు ఁప్రసిద్ధము గాదు. సి,రి, వర్ణములు మాత్రము నీచతయందును, నీచార్థము లేకున్నను నవును.

ఇందు యి,రి, వర్ణములు పురుష సంబోధనమునెడలను, సి వర్ణము స్త్రీ సంబోధనము నెడలను నవుటఁ బ్రయోగానుసారముగా గుర్తింపవలసియున్నది. (ఇవి యేకత్వముననె

1. పూజ్య వడుదాతుచ్ఛ యని సూత్రమును, పూజ్యన్ చాతుచ్ఛ యని వృతిలోను వ్రాఁతప్రతియం దున్న భాగ మర్థరహితము గావునఁబైరీతిని గ్రహింపఁబడినది. లేక పూజ్యనీచాతుచ్ఛానా మ్మన్నను విబ్బంది లేదు.

2. నీచతాయాం రిసీ స్యాతామ్. అ.కా.అ.2.
ఓసిదాస్యాశ్చ. వై.చం.అ.16.

తఱుచుగా నగును. బహువచనాంతరూపమును వివృతి యుదాహరింపలేదు. కాని ఏకవచనమున నని చెప్పలేదు.) ఓయి రామచంద్ర, యనుచో 'ఓ రామచంద్ర' యున్నను బూజ్యార్థమునకు భంగము లేదు. కావున 'యి,సి,రి' వర్ణములు వచ్చుట లేదా వికల్ప మని యెంచఁదగును. తతువాతిసూత్రము నుండి వా శబ్దము నిటకు నపకర్షింపవచ్చును.

వివృతి యందు 'క్రమేణ' యనుట యి,సి,రి వర్ణములు మూఁడును ఓ శబ్దముపైనె యగు నని చెప్పుట కని యెంచవలయును, యి వర్ణమునకును సి,రి వర్ణములకు నర్థభేదము పొసఁగినను, సి,రి వర్ణములు వేర్వే ఱర్థములంద గుననుట పొసఁగదు గదా. (పూజ్యనీచ తుచ్ఛము లని చెప్పినను భేద మగపడదు. తుచ్ఛ శబ్దము పైని బహువచనమును బట్టి యతుచ్ఛ శబ్దమునకు 'నీచ' లేదా తుచ్ఛశబ్దము దప్పదన వచ్చును.)

## 30. ఆమన్త్రణసుజసో ర్వాగారకౌ[1].

అమన్త్రణసుజసోః = సంబోధనమునందలి సు, జస్సులకు, వా = వికల్పముగా, అగారకౌ = అక్, అరక్ అనునవి యగును.

వి. ఆమన్త్రణైకవచన బహువచనయో ర్వికల్పేన
అక్, అరక్, ఏతావాగమౌ క్రమేణ స్తః.
కిత్త్వాదన్త్యావయవౌ. ఓయి రామచంద్రుఁడ,
ఓ కృష్ణుఁడ, ఓ రామచంద్రులార, ఓ సురలార, ఓ మహాత్ములార.

సంబోధనమునం దేకవచనమునకును, బహువచనమునకును గ్రమముగా అక్, అరక్ అనునవి వికల్పముగా నాగమ మగును. 'సు' అనునది ప్రథమైకవచనము. 'జస్' ప్రథమా బహువచనము. అక్, అరక్, అనుచో కకార మిత్తు గావున లోపించును. అ, అర, అనునవే యాగమము లగును. కకార మిత్తుగాఁ గలవి యగుటచే, అ, అర, అనునవి 'ఆద్యన్తౌ టకితౌ' యను పాణినీయ పరిభాష ననుసరించి విధించిన దానికిఁ జివరఁ జేరును. కాఁగా సంబోధనమునఁ బ్రథమైకవచనము(సు)నకుఁ జైవి 'అ' అనునదియును, ప్రథమా బహువచనము (జస్)నకుఁ జైవి 'అర' అనునదియు నాగమము లగును.

రామచంద్ర + సు అనుచో నీ సూత్రముచే 'సు'విభక్తికి అగాగమ మయి రామచంద్ర + సు + అ అని కాఁగా 'మహతస్సువ్యదతః, మహతస్సోర్దుజనితః', అను సూత్రములచే

1. అగ్వాస్యాన్విమన్త్రణే, అనేక వచసోలారః. త్రి.శ.4.44,45
ఆమన్త్రణసుజసోస్తః క్రమేణచాదారదాగమావన్తే. ఆం.శ.చి.అ.13.
ఈ రదవితామ్, సర్వత్రారజ్జసః - ఆం.కౌ.శ.21, 22.
మహాఽ గారగావామన్త్రణే. వై.చం.అ.8.

ఉత్వడుజ్జు లయి రామచంద్రుఁడు + అ = రామచంద్రుఁడ అని-యగును.

బహుత్వమున రామచంద్ర + జస్ అని యుండఁగా నీ సూత్రముచే జస్సున కార గాగమ మై రామచంద్ర + జస్ + ఆర అని కాఁగా 'మహతస్సుప్యుదతః' అని ప్రాతిపదిక కుత్వమును, 'లు జసః' అనుదానిచే జస్సునకు 'లు' వర్ణమును వచ్చి రామచంద్రులు + ఆర = రామచంద్రు లార యని యగును.

అగారగా గమములు సామాన్యముగాఁ జెప్పుట మహదమహత్తు లన్నింటికి నగును. ఓ ధేనువ, ఓ వృక్షములార. మొ॥

వి. సూత్రే వా పదగ్రహణాదమహత్సదస్య నిత్య
మితి బోద్ధవ్యమ్. ఓ వనమ, ఓ సముద్రమ, ఓ వనములార.
భామలార, గోడలార, ఇత్యాది.

సూత్రమునందు 'వాగారకౌ' యనుచో వా శబ్దమును ప్రయోగించుట వలన నమహత్తుల కీ యాగమములు నిత్య మని గ్రహింపవలెను. అమహత్తుల కీ కార్యము నిత్య మన్న యంశము 'వా' పదమునకు వ్యవస్థ చేయవలయు నని వివృతి యభిప్రాయము గావచ్చును. ఓ వనమ, ఓ వనములార.

'నాక్సంబుద్ధౌ' యని యికారాంతములకు అగాగమము నిషేధించుట 'గిరి' మొదలగు నికారాంతముల కమహత్తులకును 'అగాగమము' అసలు లేదు. ఓ గిరి, ఓధీ. మొ॥ ఆరగాగమము నిత్యమె. ఓ గిరులార. మొ॥

ఇంక నమహత్తులకు నిత్య మనుట వలన మహత్తులకు నీ కార్యము నిత్యము గా దని వివృతి వలని యభిప్రాయ మగుచున్నది. 'ప్రథమాన్తం పుంసి రావణస్య' యను తరువాతి సూత్ర మీ మర్థమును బ్రతిపాదించుచున్నది. ఈ విషయ మట గమనింతము. ఈ యాగమములు వికల్పముగాఁ జెప్పుట యనవసరము. చెప్పుటనుబట్టి ప్రయోగములనుబట్టి మధ్యమపురుషయోగము నందు మాత్రమె ఆరగాగమ మొక్కటె వికల్పము. (కలఁగకుఁడీ నభశ్చరులు) నవలా, వదినె, రై, గ్లౌ మొదలగు ననుదంతములపై నగాగము లే దను నర్థము 'వా' శబ్దమునకు నియమింపవచ్చును. ఇకారాంతములకు 'నాక్సంబుద్ధౌ' యని నిషేధింపఁబడినది.

చింతామణియు నీ యాగమములను నిత్యముగనె విధింప నిట నేల? 'వా' యని చెప్పఁబడినదో స్పష్టము గాదు. ఆం.కౌ.లో నిత్యముగనె విధింపఁబడుట యుచితముగా నున్నది.

## 31. ప్రథమాన్తం పుంసి రావణస్య [1].

రావణస్య = రావణుని మతమున, పుంసి = పురుష వాచకము లగు శబ్దములకు సంబోధనమునందు, ప్రథమాన్తమ్ = ప్రథమా విభక్త్యంతములు మాత్రమె యగును.

వి. సమ్బోధనే పుంసి ప్రథమాన్తమేవ స్యా ద్రావణస్య మతే.

రాములు, ఓ హరి, ఓ ఋషి.

రావణుఁ డను లాక్షణికుని మతము నందు సంబోధనమునఁ బురుష వాచక శబ్దములు ప్రథమా విభక్త్యంతము లయి యుండును.

సంబోధనము సం దెట్లును బ్రథమాంతములే యగును. అందుకే సు జస్సుల కగారగాగమములు చెప్పఁబడినవి. ద్వితీయాద్యంతములు సంబోధనమున నుండవు. కాఁగా విటఁ 'బ్రథమాన్త' మనుటకు అగారగాగమములు లేకుండఁ బ్రథమాంతపద మట్లే ప్రయోగింపఁబడు నని యర్థము.

రాములు ఇట ఆరగాగమము రాలేదు. ఓ హరి, ఓ ఋషి – ఇట నగాగమము రాలేదు. ఇట్లు పురుషవాచక శబ్దములు ప్రథమాంతములే సంబోధనమునఁ బ్రయోగింపఁబడు నని సూత్రాభిప్రాయము.

వి. పుంసి కిమ్? వనము, ఓ, వృక్షము ఇతి న.

సూత్రమునందు 'పుంసి' యనుటచేఁ బురుషవాచకములు గాని శబ్దముల కగారగాగమములు నిత్యముగా రావలసినదే. కాని కేవలప్రథమాంతము ప్రయోగింపరాదు. కావున ఓ వనము, ఓ వృక్షము అని యుండదు. అగాగమముతో వనమ – ఓ వృక్షమ అనియె యుండును.

ఇ ట్లీ సూత్రమునందలి 'పుంసి' అను దళముచే నమహత్తుల కీ యాగమములు నిత్య మని సిద్ధించుచునే యున్నది గదా. ఈ యర్థమును సాధించుట కై పూర్వ సూత్రమున 'వా' శబ్దమునకుఁ బ్రయోజన మనుట యెట్లు? అట వా శబ్దము చేర్చకున్నను నీ సూత్రము ననుసరించి యమహత్తుల కీ కార్యము నిత్యమె యని యర్థ మగుచున్నది.

ఇంకఁ బురుష వాచకములకు రాకుండుట దీనికిఁ బూర్వ ముదాహరింపఁ బడినవి రాములు, హరి, ఓ ఋషి యన్నవి.

ఇందు హరి, ఋషి యన్నవి యికారాంతములు కావున 'నాక్పంబుద్దౌ' సూత్రముచే అగాగమము ప్రత్యేకముగా విషేధింపఁబడినది. కావున హరి, ఋషి యారీతిగాఁ బురుష

---

1. ప్రథమాన్తాన్యేవ కార్యం పుంసి. త్రి.శ.4.43.

వాచకములకే యేమి? ఓ స్త్రీ ఓగిరి యనుతీరుగా నమహత్తులకును అగాగమము లేదు. అట్టి చోట్ల నిక్కడి 'పుంసి' యను దళ మవరోధ మగునా? కావున నికారాంతములపై అగాగమము రాకుండుట కీ సూత్ర మక్కఱ లేదు. ఓ రాముఁడా, ఓ గురువు అని యుండుటకు లక్షణముచే నవకాశము గలదు. కాని యట్టివి కవి ప్రయోగముల నెందును గానరావు. వృత్తియందు నయ్యవి యుదాహరింపఁబడలేదు.

ఇంక మిగిలినది 'రాములు' అనునది. ఇట్టిది మధ్యమపురుషయోగమునందే ఆరగాగమ రహితమై యుండవచ్చును. 'అన్న లార మిమ్ము నడిగెద' ననుచో అన్నలు మిమ్ము నడిగెద నని యారగాగమము రాకుండుటకు వీలు లేదు. మధ్యమపురుషయోగము నందుఁ బురుషవాచకములకే కాదు అమహత్తులకును ఆరగాగమము రాకుండవచ్చును. వివృతియం దుదాహరించిన పద్యముననే గమనింపవచ్చును.

వృ. భాస్కర రామాయణే – యుద్ధకాండే –
కనియెద రెల్లరక్కసులు గన్నులు పండువుగాఁగఁబైపయిన్,
శతకణ్ఠ రామాయణే – క్షీరాబ్ధిశయన హరి
వాక్యమ్ –
కలఁగకుఁడీ నభశ్చరులు కంపముఁ జెందకుఁ డెప్డు కిన్నరుల్
తలఁకకుఁ డచ్చరల్ మునులు తత్తర మందకుఁ డేన వచ్చి మీ
యలజడు లెల్ల బాపి మిము నందఱఁ గాచెద నంతపట్టు మీ
గలిబిలి మాని యుండుఁ డని కైటభదైత్యమర్దనుఁ డోలిపల్కనన్.
ఇత్యాదయో మహాకవి ప్రయోగః

వీనిలో కనియెదరు రక్కసులు, కలఁగకుఁడీ నభశ్చరులు మొద లగు నెల్లచోట్ల మధ్యమ పురుష యోగము స్పష్టము.

'తలఁకకుఁ డచ్చరల్' అనుచో 'అచ్చరలు' అనునదియు ఆరగాగమరహితమె. ఇది పురుష వాచకముగాదు గదా. సూత్రము నందలి 'పుంసి' యనుదానికి విరుద్ధముగా నున్నయియ్యది యుదాహరణము గాఁగా లక్షణ మసమగ్ర మగుటను స్పష్టము చేయుచున్నది.

కాఁగా 'స్యాన్మధ్యమ క్రియాయోగే వినా కుత్రచిదాగమ' మ్మని వికృతి వివేకము మొ॥ చోట్లఁ జెప్పఁబడినట్లుగా మధ్యమ పురుషయోగమునఁ బురుష పురుషేతర వివక్ష లేక యెల్లవానికి ఆరగాగమము రాకుండుట సాధించుట యుక్తము గాని యీ రీతిగా లక్షణము చేయుట సరి గా దనక తప్పదు.

వేర్వేరు గ్రంథముల నుండి లక్షణము లిటకుఁ దెచ్చినను విశేషములు చెప్పఁదగును గాని పునరుక్తు లను గల్పింప నేల? ఇట్లు కాఁగాఁ బూర్వ సూత్రము నందు హా శబ్దమేల? ఉదంతములకే యగాగమము చెప్పిన 'నాక్సంబుద్ధౌ' యన్నదియు ననవసరమె యయ్యెడిది. అగాగమ ముదంతములకె యనుట యొప్పును.

తలఁకకుఁ డచ్చరల్ అన్నట్లుగనే చలింపకుఁడో గిరుల్ ఇత్యాదిగ నుండఁదగును.

## 32. డుజో లుక్చ [1].

రావణస్య = రావణుని మతము నందు, డుజః = ఆమంత్రణమునందలి డుప్రత్యయమునకు, లుక్ చ = లోపము నగును.

వి. ఆమన్త్రణే డుజ్వర్ణకస్య లుక్ స్యా ద్రావణస్య మతే.

ఓ రామ, ఓ రాఘవ.

రావణుని మతమున సంబోధనము నందు డుజ్వర్ణకమునకు లోప మగునని సూత్రము నందలి చ శబ్దముచే 'రావణస్య' యను పూర్వ సూత్రోక్తాంశమును వృత్తి కర్త సంగ్రహించినట్లు తెలియుచున్నది. రావణస్య యనుదాని ననువర్తింపఁజేయుచు 'చ' శబ్దముచే రావణునిమతమునను డుజ్లోపము వికల్ప మని చెప్పవచ్చును.

రామశబ్దముపై సంబోధనమున నేకత్వమునందు రామ + సు అని యుండఁగా 'ఆమన్త్రణసుజసోర్వాగారకౌ' యని యగాగమమై రామ + సు + అ అనుచో మహతస్సుప్యుదతః అని యుత్వమును మహతస్సోర్డు జనితః అని డుజును రాఁగా రాము + డుజ్ + అ అనుచోఁ బ్రస్తుత సూత్రముచే డుజ్జు లోపించి రాము + అ - రామ అని యగును ( ఓ దామన్త్రణే - ఓరామ) డుజ్జు లోపింపని పక్షమున రాముఁడ మొ॥

'డుజః' అనుట వలన, ఓ వనమ, ఓ ధేనువ, ఓ రాములార ఇత్యాదులందు ఓ వనా, ఓ ధేనా - ఓ రామాలా యనురీతి రూపము లుండవు.

వి. మహదమహతో ర(క్స)యోగః.

- - - - - - - - - - - -

మోహి నీరామాయణే సీతావాక్యమ్-

---

1. డుజో లుక్చ? త్రి.శ.3. బృహస్పతిసూత్రను.
నామన్త్రణేడుజ్సోమచన్ద్రస్య. ఆం.కౌ.శ.23.
నామన్త్రణేడుజిత్యన్యే. ఆం.శ.చిం.అ.20.

దేవగణములార! దిక్పాలవరులార! –
వృక్షజాతులార! పక్షులార!
కుటిలదానవుండు గొనిపోవుచున్నాఁడు
కరుణ తోడ నన్నుఁ గావ రయ్య. ఇత్యాది.

'అక్రుయోగః' అని చెప్పఁబడినది కాని పైపద్యమున నారగాగమము గలదు. కావున నక్రుయోగము గల పద్యము పోయియుండవలెను.

మోహినీ రామాయణమందలి దని చెప్పఁబడిన యీ పద్యము మొల్ల రామాయణ మునందలిది. (అరణ్య-42)

## 33. నిష్టాదా వ(నిత్య) ప్రకృతేః[1].

టాదౌ = తృతీయావిభక్తులు పరముగా నున్నపుడు, అ (నిత్య) ప్రకృతేః = నిత్యప్రకృతులు చేరని (మహత్) ప్రాతిపదికలకు, నిః ='ని' అను ప్రత్యయ మగును.

వి. నిత్యప్రకృతి ప్రత్యయ రహితస్య మహతో
నామ్న స్తృతీయాది విభక్తిషు పరేషు ఏకవచనే
నిస్స్యాత్. కృష్ణుని చేత, శివుని కొఱకు, బ్రాహ్మణుని.
వల్ల, క్షత్రియుని యందు.

నిత్య ప్రకృతి సంజ్ఞ గలిగిన ప్రత్యయములు చేరనట్టి మహత్తగు ప్రాతిపదికకు దృతీయాది విభక్తులు పర మగుచుండఁగా నేకవచనమున 'ని' అను ప్రత్యయ మగును.

'ముఙ్వుసగావగియ (జోసే) దాదిర్నిత్యః' (శబ్ద-56) అను సూత్రముచే ముల్, వుస్ మొదలగు ప్రత్యయములకు నిత్య ప్రకృతు లను సంజ్ఞ విధింపఁ బడినది. 'ఉన్నివాచిః ప్రకృతిః' (శబ్ద.55) అను సూత్రముచే ఉత్, ని, ల అనువానికి 'ప్రకృతి' యని సంజ్ఞ కాఁగా ములాదులు నిత్యప్రకృతులు కావున 'సర్వంప్రకృతేః' (సంధి.69) అనుచో ప్రకృతి యని సామాన్యముగాఁ జెప్పుటచే ఉత్ ముల్, మున్నగు సాధారణ ప్రకృతులు నిత్య ప్రకృతులు గ్రహింపఁబడి విభక్తులు వానిపై నె యగు నని యర్థ మయినది. రాముఁడు, వనమువల్ల ననురీతిగా నట నుదాహరింపఁబడినది. ఇంకను 'ప్రకృతేః' అనుటచే గోవిందకొఱ కని కా

1.నిర్లక్ష్య? త్రి.శ.3.బృహస్పతి సూత్రము.
టాదౌమహతోనిః. అం.కౌ.శ.29.
మహతోనిలౌవిభక్తౌ టాదౌ వచనద్వయేక్రమేణస్త్రః. అం.శ.చిం.అ.19.

దనుచో ఉత్వము ప్రకృతి లేమి నద్దానిపై విభక్తి రా దని చెప్పఁబడినది. కాని యిచ్చట రామునిచేత ననురీతిగా నుత్వము (ప్రకృతి) పైనె ని వర్ణక మైనది. కావున నిచట సాధారణముగా 'ప్రకృతేః' అనక నిత్య ప్రకృతేః అనవలయును. అపుడే ఉత్వము ప్రకృతి యైనను, నిత్య ప్రకృతి గాదు గావున దానిపై 'ని' వర్ణక మగుటలో బాధ యుండదు. కావున నీ సూత్రమున 'ప్రకృతేః' అని మాత్రమె యుండుట ప్రమాద మనియు, 'నిత్యప్రకృతేః' అని యుండవలయు ననియు గ్రహింపవలెను. సూత్రార్థ వివరణమున 'నిత్యప్రకృతి ప్రత్యయరహితస్య' యని వివృతియం దుండుటయు గమనింపఁదగును.

ప్రకరణము ననుసరించి యిది మహత్తులకే యగు నని గ్రహింపవలెను. (అస్సర్వత్ర యను తరువాతి సూత్రమున సర్వత్ర యనుటను బట్టియు) ఇంకఁ దృతీయాదుల నేకవచనము పరమైనపుడే యగుటను విశేషముగా గుర్తింపవలెను. (సూత్రమునందలి 'టా'యనున దేకవచనమున కుపలక్షణ మనుట యొక మార్గము గావచ్చును).

'రామ' శబ్దముపైఁ దృతీయైకవచన వివక్షయందు సంస్కృతము ననుసరించి (స్వౌజసమౌట్ఛస్టా) టా ప్రత్యయ మై రామ + టా అని యుండఁగా 'మహతస్సప్వ్యుదతః' అని యుత్వ మయి రాముని + టా అనుచో నీ సూత్రముచే నివర్ణక మయి రాముని + టా యని కాఁగా 'చేతమై తృతీయాయాః' అనుదానిచే 'టా' స్థానమున చేత ప్రత్యయ మై రాముని చేత - ద్రుతముతో రాముని చేతన్ అని యగును. ఇట్లితరము లూహింపఁదగును.

వి. అ(నిత్య) ప్రకృతేః కిమ్? విష్ణువునిచేత,

ధాతనివల్ల, సవితనియందు, రాజానికొఱకు ఇతి న.

సూత్రము నందు అ(నిత్య) ప్రకృతేః అనుటచే ముల్ మొదలగు నిత్యప్రకృతులు చేరిన ప్రాతిపదికకు ని వర్ణకము రాదు. మిత్రమునిచేత నని గాదు. మిత్రముచేత వివృతి యం దుదాహరింపఁబడిన వానిలోఁ గ్రమముగా విష్ణువుచేత (వుస్) ధాతవల్ల, సవిత యందు (అక్) రాజా కొఱకు (ఙు) నిత్యప్రకృతులు గలవు. కావున వానిపై 'ని' వర్ణకము రాదు. కావున విష్ణువునిచేత నిత్యాదు లేర్పడవు. విష్ణువుచేత మొ॥

ఈ ని వర్ణకము మహత్తులకే కావున నమహత్తులకు రాదు. భానుచేత, మొ॥

'టాదౌ' యనుటచేఁ బ్రథమద్వితీయా విభక్తులం దీని వర్ణకము రాదు. రాముఁడు మొ॥

ఏకవచనముననే గావునఁ దృతీయాదులందు బహువచనము పర మైన ని వర్ణకము రాదు. రాములచేత మొ॥

'ఉన్నివాచిః ప్రకృతిః' అను సూత్రముచే నీ 'ని' వర్ణకమునకుఁ బ్రకృతి యని సంజ్ఞ.

## 34. ల స్సర్వత్ర [1].

టాదౌ = తృతీయాది విభక్తులు (బహువచనము) పర మగుచుండగా సర్వత్ర = అన్ని యెడలను (మహదమహచ్ఛబ్దము లన్నింటికిని) లః = లవర్ణకము వచ్చును. 'నిష్ఠాదావనిత్య ప్రకృతేః' అను పూర్వసూత్రము నుండి 'టాదౌ' యను దళ మిం దను వర్తించును.

వి. ఆదేశాగమ ప్రకృతి ప్రత్యయరహితా నామ్మహ
తా మమహతాం చ తృతీయాదిషు పరేషు సమాసేషు
బహువచనే ప్రకృతి ల ప్రత్యయ స్స్యాత్.
బ్రాహ్మణులచేత, హరులకొఱకు, గురువులచేత,
గురులచేత, సవితృలవల్ల, సవితలవలన, భామలకు,
కొండలకు, తీఁగెలయందు, రాజులయందు, తటత్తుల
కొఱకు, కురులచేత, తరువులకొఱకు, (కలవాఁడు)
కుక్కల కొడుకులు, ఆవుల పాలు, బ్రాహ్మణుల యిండ్లు,
విప్రుల సొమ్ములు ఇత్యాది.

ఆదేశములు నాగమములు నైన ప్రకృతు లగు ప్రత్యయములు లేని మహత్తులకు, న మహత్తులకు ననఁగా నన్ని శబ్దములకును దృతీయాది విభక్తుల బహువచనము పర మగు నపుడును సమాసమందును ల వర్ణకము వచ్చును.

ఆదేశాగమేత్యాది యగు వివరణమునఁ బ్రయోజన విశేషము గానరాదు.

ఉత్వము మొదలగు ప్రకృతి సంజ్ఞ గలుగు ప్రత్యయము లున్నను 'ల' వర్ణక మగును. బ్రాహ్మణులచేత ముల్ మొదలగు నిత్య ప్రకృతి సంజ్ఞ గల ప్రత్యయములు చేరినను 'ల' వర్ణకము వచ్చును. గురువూచేత ప్రకృతి ప్రత్యయము లేవియుఁ జేరని శబ్దములకును ల వర్ణక మగును. భామలచేత.

మొత్తముపై నెల్ల శబ్దములకుఁ దృతీయాది విభక్తుల యందు బహువచనము పర మయినపుడు ప్రాతిపదికకు ల వర్ణక మగు నని సూత్రాభిప్రాయ మగును.

'ఉన్ని లాదిః ప్రకృతిః' అను సూత్రముచే నీ 'ల' ప్రత్యయమునకుఁ బ్రకృతి యనుసంజ్ఞ

1. విర్లక్ర. త్రి.శ.3.
బహువచనేలః. ఆం.కౌ.శ.30.
మహాతోవితా - - ఆం.శబ్దచిం.అ-1,9
బిసాదౌలః.వై.చం.అ.15.

యగును. కావునఁ 'ప్రకృతి ల ప్రత్యయః' అని వివృతి యందు వివరింపఁ బడినది.

పూర్వోక్త మగు వి వర్ణము మహత్తులకె. ఈ వర్ణ. మెల్ల శబ్దములకు నగుటకై 'సర్వత్ర' యని చేర్పఁబడినది. దీనిచే సమాసము నందును నగు నని వివృతి కుక్కల కొడుకు లిత్యాదిగా నుదాహరించినది.

సానేర్వా లు క్కను విధానమును జూడఁగా-నిట 'సమాసే' యనునది విశేషము గా దనిపించును.

'కుర్ణమస్సర్వత్ర' యని తరువాతి సూత్రమునను 'సర్వత్ర' కలదు. కాని కు వర్ణకము సమాసములం దుండునా? అటవలెనె యిటఁ గూడ మహదమహత్తుల కెల్ల నవుటయె సర్వత్రశబ్దముచే నుద్దేశింపఁబడిన దనిపించు.

ఇట సమాసములందును ల వర్ణమును వివరించి కుక్కల కొడుకులు మున్నుగా షష్ఠీ తత్పురుషసమాసములనుదాహరించుటగ్గమునిప గా కార 46 సూత్రము (ఇట్లయున్నది. వివృతి భిన్నము) మఱల షష్ఠీతత్పురుషమున లవర్ణమును జెప్పుటయే. పునరుక్తి యనవలసియున్నది. ఇట వివృతి సమాసములను బ్రస్తావింపకున్నఁగొంతమేలేమో. ఆ యర్థము సూత్రమున నున్నపుడు వివరింపని మాత్రమునఁ బ్రయోజనము గల్గదు గదా.)

## 35. కుర్ణ మస్సర్వత్ర [1].

సర్వత్ర = ఎల్ల శబ్దములకును బరముగా నున్న, ణ మః = షష్ఠీవిభక్తి స్థానమున, 'కుః' = కు అను ప్రత్యయ మగును.

వి. మహదమహతాం షష్ఠీవిభక్త్యేక బహువచన యోః

కు ప్రత్యయస్స్యా త్సర్వత్రాదంతే

దంతోదంతావిషు – రామునకు, రాములకు,

హరులకు, గురునకు, గురువునకు, గోవులకు, గోవునకు,

కన్నెకు, కన్నెలకు, భామకు, భామలకు, ఇంతులకు,

---

1ణమః కురవితామ్. ఆం.కౌ.అ.శ.49.
ణమః కురవితామ్. ఆం.శ.చిం.అ.25.
కుణమః కురవితామ్. వై.చం.అ.19.

వధువులకు, వధువునకు, ధాతకు, ధాతకలకు, విధాతకు, విధాతలకు, దర్భకు, దర్భలకు, వనమునకు, వనములకు ఇత్యాది.

మహత్తులును, నమహత్తులు, నదంతములు నిదంతములు నుదంతము లెట్టివయిన ననగా నన్ని శబ్దములకును బై నున్న షష్ఠీవిభక్తి యం దేక బహువచనములు రెంట కు వర్ణకము వచ్చును.

'సుపాన్సాది రన్త్య హలా' అను ప్రాకృత వ్యాకరణానుసారముగా నేర్పడిన జమ్ అను ప్రత్యాహారము జస్ (ఓస్) ఆమ్ అను షష్ఠీ విభక్తులను బోధించును. కావున జస్, ఆమ్ అను షష్ఠీ ఏక బహువచనములు రెండింటి స్థానమునను కు వర్ణక మాదేశ మగును.

రామ శబ్దమునకు షష్ఠ్యేకవచన వివక్షలో రామ + జస్, 'మహతస్సుప్యదతః' రాము + జస్, 'విష్ణాదావనిత్యప్రకృతేః' – రాముని + జస్ – ప్రస్తుత సూత్రముచే జస్సునకు 'కు' వర్ణకము రాముని + కు 'నేరదితఃకౌ' – రామునకు. ఇతరము లూహింపఁ దగును.

ఇదంతములకు షష్ఠీ ఏకవచనము నందు 'కి' చెప్పఁబడుచున్నది. కావున నిదంతములకు బహువచనముననె (ఆమ్) కు వర్ణక మగును.

ఈ విధి యుండఁగా లాత్కు రసర్వనామ్నః (తద్ధి.41) మున్నగు కు విధానముల యవసరము చింత్యము.

## 36. నేరదితః కౌ[1].

కౌ = కు వర్ణకము పరమగునపుడు, నేః = ని వర్ణకము యొక్క, ఇతః = హ్రస్వ మయినయికారమునకు, అత్ = అత్వ మగును.

వి. కుప్రత్యయే పరే ప్రకృతినివర్ణకస్యేకారస్య
అత్ స్యాన్మహ దమహతోః షష్ఠ్యేకవచనే.
రామునికు ఇతి స్థితే అనేన సూత్రేణ ఇకారస్య
అకారే ప్రాప్తే రామునకు – విష్ణునకు – వధువునకు
మధువునకు – విధాతృనకు – వనమునకు – గోవునకు.

---

1. నేర్నః కావదన్తస్య. త్రి.శ.3.17 ?

కు ప్రత్యయము పర మగుచుండగాఁ బ్రకృతి సంజ్ఞ గల మహదమహత్తుల షష్ఠ్యేకవచనములందలి ని వర్ణకము యొక్క యిత్వమున కత్వము వచ్చును. 'రామునకు' అనుదాని ప్రక్రియ పూర్వ సూత్ర స్థలమునఁ జూడఁదగును.

'నిష్ఠాదావనిత్య ప్రకృతేః' అను సూత్రముచే విధింపఁబడిన ని వర్ణకము 'ఉన్నిలాదిః ప్రకృతిః' అను సూత్రముచే 'ని' ప్రకృతి సంజ్ఞను బొందును. కావునఁ 'బ్రకృతి ని వర్ణకస్య' యని వివృతి యందుఁ జేర్పఁబడినది.

కాని 'మహదమహత్తుల' ని వర్ణకమున కత్వమగు ననుటయు వనమునకని యుదాహరించుటయు సంగతములుగా లేవు.

'నిష్ఠాదావనిత్య ప్రకృతేః' అను దానిచే ని వర్ణక మనిత్య ప్రకృతులపై నగుటయు, మహత్తులకే యగుటయు వివరింపఁబడియే యున్నది. అట్టియెడ నమహత్తులకు ని వర్ణకము. వచ్చుటయే లేదు. ('వనమున కనుచో 'ముల్' నిత్యప్రకృతియు గలదు.) అట్టి యెడల ని వర్ణమున కత్వ మగుటయు వనమునకు నని యేర్పడుటయు సమన్వయింపఁబడవు. ఈ సూత్రము వ్యర్థ మగుట పిదప గుర్తింతము.

వి. నేః కిమ్ ? ధాతకు, మాతకు.

సూత్రమున 'నేః' అనుటచే నితరమున కత్వము రాదు. కాని దీనికి వివృతి చూపిన ధాతకు, మాతకు అను నుదాహృతులలో ని వర్ణము లేదు. కాని నివర్ణేతర మైన నిత్వమె లేదు గదా అత్వ మగుటకు.

వి. కౌపరే కిమ్? కొండనికి.

'నేరదితః కౌ' యనుచో వలన 'కౌ' యనుట ని వర్ణకమున కత్వము 'కు' వర్ణము పర మగునపుడే యగును. కావున 'కు' వర్ణకేతరము పర మయినచో నత్వము లేదు. కొండనికి ఇచట 'కి' వర్ణము పరమైనది కాని కువర్ణము లేదు. కావున నత్వము లేదు.

వి. కిఞ్చ ఇదన్త వ్యతిరిక్త స్య మహత్షష్ఠ్యేకవచనే
కు వర్ణకే పరే ని వర్ణకో నిత్యత్వా న్నే రదితః
కా విత్యనేన సూత్రేణ కుప్రత్యయే పరే ప్రకృతి
ని వర్ణేకారస్య అకారాస్య నిత్యత్వాద్భారతే
ద్రోణపర్వణి – "ఎట్లకో యతని కడిమి కుంభజు
నికి వారింపంగ రామి నిక్కం బరయన్" – ఏవమదన్త

సృ కి ప్రత్యయ ప్రయోగస్య కృతత్వా దశాస్త్రీయ ప్రయోగో గ్రామ్యమిత్యనేనా ధర్వణ వచనేన సోమ యాజి ప్రయోగస్త్వసాధుః – ఇతి జ్ఞాత్వా.

'కుర్ధమస్పర్వత్ర' యను సూత్రముచే ఇకారాంతములు గాని శబ్దములకు 'కు' వర్ణకము నిత్యము. (ఇకారాంతములకు 'పు మహదితోజసః కిః, తద్ధితసర్వనామ్నోశ్చ' యని కి వర్ణ మగును) అది పర మగుచుండగా 'నిష్ఠాదావనిత్యప్రకృతేః' అను సూత్రముచే నివర్ణకమును నిత్యము. (కువర్ణకే పరే యన్నది వివృతి. కాని 'నిష్ఠాదా' యను సూత్రమును బట్టి జస్సునకు 'కు' వర్ణకము గాక మునుపే యనగా జస్సు పర మగునపుడే నివర్ణమగును. ఇట కువర్ణకే పరే యనుట 'జసి పరే యను నర్థముననే యై యుండును.) కు ప్రత్యయము పర మగుచుండగా నివర్ణమునందలి యుత్వమున కి సూత్రముచే నత్వమును నిత్యమె యగును. అట్టి యెడల భారతమున ద్రోణ పర్వము నందు 'కుంభజానికి అను సోమయాజి ప్రయోగ మెట్లు? ధర్మజానికి వారింపంశక్యంబనుచోటి నివర్ణముతోటి రామి నిక్కం బరయన్' అనుచో యతివలన నీ ప్రయోగమున నివర్ణమున కత్వము రాలే దనియుఁ బైని కి ప్రత్యయమె యున్నదనియు గ్రహింపవచ్చును, నిత్య మగు కు వర్ణకము రాకుండుటయు, నిత్యమగు (ని వర్ణకమునకు) నత్వము రాకుండుటయు ననులక్షణ విరోధములచే నిది యశాస్త్రీయ మగుచున్నది. ఇట్టి యశాస్త్రీయత వలన 'అశాస్త్రీయ ప్రయోగో గ్రామ్యమ్' – (త్రి.శ.3పకాండ 16.శ్లో) అను లక్షణమును బట్టి యధర్వణుని మతమున నీ 'కుంభజానికి' అను ప్రయోగము గ్రామ్య మగుచున్నది.

వి. – – ఇతి జ్ఞా త్వా "మయా, వేంగినాఁటి యేన, మండ కుల కలశ జలధి సుధాకరేణ, శ్రీ మదష్ట భాషా సరస్వతినా, సహస్రావధానినా, సరస కవిశేఖరేణ, కవిరాజ కంఠీరవేణ, ఆంధ్రభాషా కవితాపితామహశిరోమణి (నా,) శ్రీనకులీవాగీశ్వరీ వరప్రసాదలబ్ధ సర్వంకష సరస సాహిత్య సకలానవద్య విద్యా పాండిత్యధౌరేయేణ, లక్ష్మీ నృసింహ విద్వత్కవీంద్రేణ" తిక్కన సోమయాజి ప్రయోగస్స్పష్టీకృతోఽధునా "ఎట్లాకొ యతని కడిమి కుంభజానికి వారింపంగ రామి నిక్కం బరయన్" ఇత్యేవం లోకే ప్రసిద్ధశ్చ" – ప్రకృతే –

ఇం దంతయు లక్ష్మీ నృసింహ కవికి సంబంధించిన వివరములే. (దీనిని బట్టి వివృతియు లక్ష్మీనృసింహకవి విరచిత మనుట స్పష్టము.)

'కుంభజానికి' నన్నది యగ్రామ్య మని తెలిసిన యీ నృసింహకవి సోమయాజి ప్రయోగమును సాధించిన జాడ గానరాకున్నది. అట్టి ప్రయోగమును జూపుట యొక్కటే యిచటి విశేష మని తలఁచె నేమో. 'కుంభజానికి' ననురీతి రూపములు సాధించిన జాడయుఁ గానరాదు. (చూ.శబ్ద.37)

ఇదంతేతరములకు నివర్ణము నిత్యమను వివరణమె సరికాదు. (ఇదంతముల కెల్లను నివర్ణము రాదు) (నటాదౌనిరితః శబ్ద.54) నటౌదౌనిః కణ్వస్య (శబ్ద.47) యను లక్షణముచే నివర్ణము రాకుండ వచ్చు.ఒ క పక్షమున అట్టిచో నిత్యమనుట యెట్లు? ని వర్ణము రాని పక్షమున[1] నఃకావుతః[1] శబ్ద–39 అని నవర్ణమయి కుంభజానకు నివర్ణమైన కుంభజానికి జస్ సంస్కృత ప్రత్యయపరకతలో 'ని' ప్రత్యయము చేసిన – నిదంతమగుటచే 37చే కి ప్రత్యయమయి కుంభజానికి శబ్ద47 చే 'ని' రాని పక్షమున శబ్ద.35చే కు వర్ణకమయి శబ్ద39 చే కుంభజానకు నసూత్రముచే నవకాశము గలదు. వివృతి నరిగా నుపయోగించుకొనలేదనిపించును.

## 37. పుమమహదితోర్జసః కిః[1].

పుమ, మహదితోః = పురుషుని దెల్పునదగు నమహచ్ఛబ్దమునకును, ఇకారాంతమునకును బైనున్న, జసః = షష్ఠీ విభక్తియేకవచనమునకు, కిః = కి ప్రత్యయ మగును.

వి.పుమర్థవాచ్యమహత్పదస్యే దన్తస్య చ తయోః
షష్ఠ్యేక వచనస్య కి వర్ణక స్స్యాత్. "నిష్టాదావ (నిత్య) ప్రకృతే" రిత్యనేన ని ప్రత్యయః.

(పుమర్థవాచి + అమహత్పదస్య)

పురుషుని బోధించు నమహత్తునకును, ఇగంతములకు ననగా నిదంతములకు మహదమహత్తులకును బర మై యున్న జస్ స్థానమున 'కి' అను ప్రత్యయ మగును.

రంగ + జస్ – అనుచో నీ సూత్రముచే జస్సునకు 'కి' వర్ణకము రాగా రంగకి అని యగును. 'నిష్టాదావప్రకృతేః' అను సూత్రముచే 'ని' వర్ణకము వచ్చు నని వివృతి యందు వివరింపఁబడినది. కాని యట నది మహత్తుల కని చెప్పి యిట నమహత్తుల కగు ననుట యెట్లు? పూర్వ సూత్రము నను వివృతియిం దట్లు పేర్కొనుట గమనార్హము.

---

1.జసఃకిః – ఆం.కౌ.శ.58.

ఇతాంజసఃకిస్స్యాత్. ఆం.శ.చిం.అ.39.

కోర్నోరిత్యమితః. త్రి.శ.3.18. బృహస్పతి సూత్రము.

ఇంక సూత్రము వ్రాతప్రతిలో పుమహ॥ అని యున్నది వివృతి యందు నట్లే. 'రంగ' శబ్ద మమహత్తగుట యెట్లు? అ ట్లయినను పుమ్మహతః అని యుండవలె. పురుషుని బోధించుమహచ్ఛబ్దమేమి? మహ త్తనుట చేతనె పురుష బోధక మగుట స్పష్టము గదా.

ఇంకను జైని పు (మ) మహతః కిమ్, రామునకు అని రామునకి అని కి వర్ణకము రా దని వివృతి పేర్కొన్నది రామ శబ్దము మహత్తుగాదా? పురుష బోధకము గాదా? ఆచ్చికములే యెల్ల నమ హత్తులగునా?

'అమహత్త్వదస్య పుమర్థ వాచినః' అని వివరించును. స్థలాంతరమున రంగఁ డని యుదాహరించినది (సూ.81) ఇట్లె. తద్ధి-9.

'పుమమహతరి' అనుటలో నచ్చతెనుఁగు శబ్దము లుద్దేశించె నేమో. అది యట్లుండఁ గా నమహత్తు లన్నపుడు వీనికి ని వర్ణక మెట్లు? 'ఇట' నిష్పాదావ (నిత్య) ప్రకృతేః అనుదానిచే ఫి వర్ణక మగునన్నవివృత్తి 'టాదిషుచ' (తద్ధి10) – సూత్రముచే 'రంగనిచేత' సాధించినది. కాఁగా 'టాదిషుచ' అను దానిచే ని వర్ణకమగు నని యూరకొందము. వీనియమహత్త్వము మాత్రము వివాదాస్పదము. మహదమహత్సంజ్ఞ లచ్చతెనుఁగు శబ్దముల కుండవా? విచార్యము. ఇట్లే పాపనికి మొ॥.

## వి. పుమమహతః కిమ్? రామునకు, వనమునకు.

పుమమహతః అనుటచే రామునకు అనుచో కి ప్రత్యయము లేదు. రామశబ్దము పురుష వాచక మగుటతో పాటు మహత్తు నయినది గదా. 'వన' శబ్దము పురుషవాచకము గాదు గాని అమహత్తె. అందువలన దానికిఁ గి వర్ణకము లేదు. పురుషవాచక మ్మై యమహత్తు గానందులకు రామునకు అమహ త్తయి పురుషవాచకము గానందులకు వనమునకు అను నీ రెండు ప్రత్యుదాహరణము లర్థవంతము లై సూత్రము 'పుమమహతః' అని యుండవలయునుచుని నిరూపించుచున్న దని గ్రహింపవచ్చును. కాన వ్రాత ప్రతిలో సూత్రవివృతుల నెల్లెడల 'పుమహతః' అని యుండుట ప్రమాదమని గ్రహింపదగును. 'నాక్సంబుద్ధౌ' యను సూత్రము వివరణములో 'పుమమహతః' అని చూపబడుట గమనింపవచ్చును. మొత్తముపై నీ వ్యాకరణము రామునికి అనురూపము నసాధువు చేసిన దని మాత్రము స్పష్టము.

## వి.జసః కిమ్ ? కొండలకు, తిప్పలకు, రంగలకు.

'జసః' అనుటచే 'జస్' కానిదానికి కి ప్రత్యయము రాదు. 'జస్' సంస్కృతానుసారముగా షష్ఠీవిభక్తి యేకవచనము కావున కొండలకు ఇత్యాదు లగు షష్ఠీ బహువచనముల యెడ కి ప్రత్యయ మీ సూత్రముచే లేదు.

'ఇతః' అనుటచే నిదంతములు మహత్తు లైన నమహత్తు లైన నెట్టివయిన 'కి' వర్ణక

మగును. హరికి, గిరికి మొ॥.

నిజమున కిచట 'ఇతో జసః కిం' అని మాత్రమె సూత్రము చెప్పఁజాలును, నిష్ఠాదౌ, టాదిషు చ – అను సూత్రములచే నగు ని వర్ణకము సంస్కృత విభక్తి పర మగునపు డవునది గావున రాముని + జస్, రంగని + జస్, అని యివి యిదంతములుగాఁగా వీనిపై నీ సూత్రముచే 'కి' వర్ణము వచ్చి యిష్టరూప మయ్యెడిది. 'కుంభజానికి' అనునదియు సాధింపఁబడియెడిది.

నిష్ఠాదౌ నముదానిచే నగు ని వర్ణకము న టాదౌ నిః కణ్వస్య' యను సూత్రముచే రాని పక్షమునం దిదంతము గాదు గావున 'కుర్జమస్సర్వత్ర' యని కువర్ణ మయ్యెడిది. తరువాత వక్ష్యమాణ సూత్రముచే న వర్ణ మాగమమై రామునకు ననురూపమును సిద్ధించెడిది. నేరదితఃకౌ అన్నది చెప్ప నక్కఱయె లే దని యట స్పష్ట మగును.

'ఇతో జసః కిం' అని చెప్పఁగా నీ తరువాతి సూత్రము ననవసరమె కాఁగలదు.

## 38. తద్ధి తసర్వ నామ్నోశ్చ .

తద్ధితసర్వనామ్నోః చ = తద్ధితాంతములకును, సర్వనామములకును బరమై యున్న జసః = 'జస్' స్థానమున, కిః = కి ప్రత్యయ మగును. పుమమహదితోర్జసః కిః అను పూర్వసూత్రము నుండి 'జసః కిః' అనునది యిట ననువర్తించును.

వి. తద్ధితాన్త సర్వ నామ్నోశ్చ షష్ఠ్యేకవచనస్య
కివర్ణస్స్యాత్ – తద్ధిత – దానికి – వీనికి – ఎవ్వనికి.
సర్వనామ – ఒక్కనికి – ఎల్లనికి.

తద్ధిత ప్రత్యయాంతములకును సర్వనామములకును బర మైయున్న షష్ఠీవిభక్తి యేకవచన మగు'జస్' స్థానమున 'కి' ప్రత్యయ మగును.

తద్ధితాంతము దానికి – మొ॥ అది మొదలగునవి సర్వనామములుగాఁ బ్రసిద్ధములు. వాని నీ వ్యాకరణము తద్ధితాంతములుగా నిరూపించినది. (సంధి.5).

ఒక్కనికి – సర్వనామము. 'ఎల్ల' శబ్దము నుండి 'ఎల్లనికి' అను రూపము వివృతి చూపినది. అట నట ఎల్లఁడు ఇత్యాదిగను (తద్ధిత–36) జూపె నట్టి రూపములు గావ్యములందు గాని వ్యవహారమునఁ గాని లేవు. 'ఇతోః జసః కిః' అని చెప్పిన నీ సూత్రము ననవసరమెయని పైని గమనించితిమి.

కౌ = కు వర్ణకము పర మగుచుండఁగా, ఉతః = ఉకారమునకు, నః = 'న' వర్ణమగును.

వి. మహతామమహతాం చోదన్తానాం కు ప్రత్య
యే పరే న స్స్యాత్ రామునకు, వనమునకు, విష్ణువునకు,
రాజునకు, ఇంద్రజిత్తునకు సుశర్మునకు తటిత్తునకు -

ఉదంతము లగు శబ్దముల కెల్లను - కువర్ణకము పర మగుచుండఁగా న వర్ణకము వచ్చును.

రామునకు, వనమునకు.

రాము + జస్ అనుచో మహతస్సుప్యుదతః - రాము + జస్, 'నిష్ఠాదౌ' యను సూత్రముచే రావలసిన ని వర్ణకము 'నటాదౌ నః కణ్వస్య' యను సూత్రముచే రాని పక్షము నందు కుర్జమస్సర్వత్ర - రాము + కు అని కాఁగా ప్రస్తుత సూత్రముచే న వర్ణకము వచ్చి రామునకు - ఇట్లిత రోదాహృతు లూహింపఁ దగును.

వి. కుప్రత్యయే కిమ్? హలికి, శూలికి.

సూత్రము నందు 'కౌ' యని యుండును. ఇట్టి స్థితి గానరాదు 'నేరదితః కౌ' యనుచో 'కౌ' యని సూత్రమున నుండ 'కౌపరేకిమ్' అని వృత్తి ప్రశ్నించున దిట స్మరింపఁదగును.

సూత్రము నందు న వర్ణము కుప్రత్యయము పర మగునపు డగునని చెప్పుట వలన 'కు' వర్ణకము కంటె వే ఱయినది పరమయినపుడు న వర్ణము రాదు. హలికి శూలికి ఇట 'పుమమహదితోర్జసః కిః' అను సూత్రముచే కి ప్రత్యయ మైనది. గావున న వర్ణము రాలేదు.

కాని యీ వివృతి సరి కాదు. సూత్రము నందు 'ఉతః' అనుటచే కుప్రత్యయము పర మైనను ప్రాతిపదిక ముదంతము కావలయును గదా. హలి, శూలి యన్నవి యిదంతము లగుటచే నిదంతతనుబట్టియు వీనికి న వర్ణము రాదు. ఉదంతముపై కు వర్ణక ముండక తప్పదు గావున కువర్ణకము పరముగా నుండని యుదంతమునకు న వర్ణము. రాలే దని చెప్పుటకు నిట్టియుదాహరణము దొరుకదు. ఇంక వనములోపల ఇత్యాదిగా నితరముల నుదాహరించిన సరిపడును.

---

1. రామునకు విత్యాదిగా నుదాహరణములును దళసార్థక్య వివరణము మాత్రమె వ్రాతప్రతియందుఁ గానవచ్చు. సూత్రవివృతులు నష్టమైనవి. కాని యట నుండెడి వనిమా త్రము లభ్య మగుచున్న వివరణమును బట్టి గుర్తింపవచ్చును.

నఃకౌ. ఆం.కౌ.శ.50, ఆం.శ.బం.అ.24.

నేర్నఃకావుదన్తస్య. త్రి.శ.3.17 బృహస్పతిసూత్రము.

ఉకోనకౌనిత్యమ్.వై.చం.అ.20

వి.ఉతః కిమ్? విధాతకు, ధాతకు, భామకు, కుశకు, దర్భకు ఇత్యాది.

సూత్రమునందలి 'ఉతః' అను దళముచే మహ త్తయిన సమహత్తయిన సదంతమునకే న వర్ణమగును. కావున విధాతకు, దర్భకు మొదలగు చోట్ల కుప్రత్యయము పర మయినది గాని ప్రాతిపదిక ముదంతము కాకపోవుటచే న వర్ణకము రాదు. విధాతనకు అనురీతి నుండదు.

ఇట్లె వదినెకు, గ్లాకు మొ॥

'రామునకు వనమునకు' అనురీతిగా నిట కుప్రత్యయ పరకతలో న వర్ణము విధింపఁబడుచుండుటచే నింక 'నేరదితఃకౌ' యని ని వర్ణమునకత్వము చెప్పుట యనవసరము.

ని వర్ణకము నిత్యము గాఁగా నది రాకుండుటయు, నపుడు కు వర్ణకము వచ్చి న వర్ణము నగుట యె ట్లనుప్రశ్న లేదు.

ఈ వివృతికారుఁడే తరువాతి సూత్రమును వివరించుచో నిప్రత్యయాభావే - రామునందు - - - అగన్తానాముత్వ ని ప్రత్యయయో రభావపక్షే - విధాతేయందు - అనురీతిగా నిప్రత్యయము రాకుండు స్థితిని వర్ణించెను.

ఇట్లు రామునికి, రామునకు నను రెండు రూపములు సాధించు నవకాశ ముండఁగా 'కుంభజునికి' ననుదానికి పరిష్కారము చేయకవిడుచుట యేలా? రామునియందు? రామునందు ననికాలేదా? ఇది 'న' విధ నము మతాంతరమె యైనను దానిని బట్టి సాధింపరాదా అట్లు సాధించన విం దెన్ని లేవు. బిన్దుస్సోమచన్ద్రన్య మొ॥

## 40. [1] అందౌచ[2].

అందౌ చ = అందు విభక్తి పరముగా నున్నపుడు గూడ, ఉతః = ఉకారమునకు, నః = నకార మగును. పూర్వసూత్రము నుండి నః అనునది యిం దను వర్తించును.

వి. ఉదన్తానామ్మహతా మమహాతాం చ నస్స్యా దందౌ పరే[3].

---

1,3 (ఈ సూత్రమును వివృతియును వ్రాతప్రతిలోఁ గానరావు. తరువాతి సూత్రమును బట్టియు విచ్చట నున్న యుదాహరణ వివరణములను బట్టియుఁ బైలక్షణ మధర్వణ గ్రంథము నుండి యట్లుండి యుండు నని గ్రహింపఁబడినది, కువర్ణకమునకు నుదాహరణములు వేరుగాను నందునకు వేరుగాను జూపుటను బట్టి యివి వేర్వేరు సూత్రము లని యెంచఁదగును. లేనిచో రామునకు, రామునందు ననురీతిగా వాకచోటునే కువర్ణమున కొకటి. యందున కొకటి చొప్పున నుదాహరణము లితఃపూర్వపుఁబద్ధతిలో జెప్పుట జరిగెడిది గదా.)

2. అందౌచ. త్రి.శ.3.19. బృహస్పతిసూత్రము.
నిలోపేనుమ్. వై.చం.అ.20

అందు అను విభక్తి పరముగా నున్నపుడు గూడ నుదంతము లగు శబ్దములకు నకారము వచ్చును. పూర్వ స్థలమున రామునకు ననురీతిగా నత్వముతోఁ గూడ నకారమే నిల్చిన నిచట మాత్రము పొల్లయె యగును. అకార ముచ్చారణార్థ మని యిట గ్రహింపవలెను. (టు గచి యిత్యాదుల వలె నుగందౌ యనుట కవకాశము లేక పైసూత్రమున నస్యాత్ర్యని వివరింపఁబడినది) లేనిచో రాములయందు వలె రామునయం దని యపరూపములు నేర్పడు నవకాశము గలదు.

వి. నిప్రత్యయాభావే ఉకారాంతత్వాత్ – రాము
నందు, వనము నందు, విష్ణు నందు, విష్ణువు నందు,
తరునందు, తరువునందు, రాజు నందు, సుశర్మ
నందు, ఇంద్రజిత్తునందు, తటిత్తు నందు ఇత్యాది.
నిప్రత్యయే పరే – రాముని యందు, విధాతృనియందు,
సుశర్మని .యందు, ఇంద్రజిత్తుని యందు ఇత్యాది.

రామశబ్దముపై సప్తమ్యేకవచనమును వివక్షింపఁగా రామ + జీ యనుచో – మహత స్సుప్యుదతః – రామ + జీ, 'నిష్టౌదౌ' యనుసూత్రముచే రావలసిన ని వర్ణకము 'నటాదౌ నిః కణ్వస్య' యను సూత్రముచే రాని పక్షమునందు రాము + జీ అని యట్లయుండఁగా 'నాందూ చ' యను సూత్రముచే జీ స్థానమునం దందు వర్ణక మై రాము + అందు అని యుండును. ఇపు డందు ప్రత్యయము పర మయినది గావునను ని వర్ణకము రాకపోవుట వలన 'రాము' అనుతీరుగాఁ బ్రాతిపదికము 'ఉ' కారాంత మయియున్నది గావునను నీ సూత్రముచే 'ఉ' కారమునకుఁ బరముగా నకారము వచ్చి రామున్ + అందు = రామునందు అని యగును. ఇట్లె యితరము లూహింపఁదగును.

ని వర్ణకము వచ్చిన పక్షమున – రాముని + జీ, రాముని + అందు అని యుండఁగా 'యః ప్రాణస్య' యను సూత్రముచే యకారము చేరి రామునియందు అని యగును.

వనమునందు మొద లగుచోట్ల వనమం దను రీతిగా నకారము రాని రూపములు గలవు.

వి. అగన్తాదీనా ముత్వనిప్రత్యయయో. రభావపక్షే.
"యః ప్రాణస్యే"త్యనేన – విధాతయందు,
ధాతయందు, హరియందు, భామయందు, కుశయందు,
హంసయందు ఇత్యాది.

అగంతములు మొదలగువానికి నుత్వమును (మహత స్సుప్యుదతః) నిప్రత్యయమును

(విష్టాదావనిత్య ప్రకృతేః) రావు (కావున వివృతియం దభావపక్షే యనక అభావాత్ అన్న పరి పోయెడిది) కావున ధాత + అందు, హరి + అందు, మొద లగు చోట్ల 'యః ప్రాణస్య' యని యకారము వచ్చి ధాతయందు, హరియం దని యగును. ఇవి యుదంతములు గావు గావున నీ సూత్రముచే నకారము గూడ లేదు. అందుచే యకారముతో ధాతయం దనురీతిగా మాత్రమె రూపము లుండును.

## 41. జస్యచి సర్వేభ్య శ్చ.

జసి = పంచమీ విభక్తుల యందలి, అచి = అచ్చు పర మగుచుండగా, సర్వేభ్యః చ = అన్ని యచ్చులకంటెను, నః = నకార మగును. ప్రపూర్వ సూత్రము నుండి నః అనునది క్రమముగా విందు ననువర్తించును.

వి. సర్వేభ్యోఽజన్తేభ్యో మహదమహద్భ్యో నామ
భ్యః పరతో నిత్యం న స్యాత్పంచమ్యచి పరే.
రాము నుంచి, నూతి నుండి, హంస నుండి, వెలఁది నుంచి,
వనము నుంచి, విష్ణువు నుండి, వనము నుండి, ధాత
నుండి, హంసనుంచి, కన్నెనుంచి,
రోనుంచి, నావ నుండి, గ్లౌనుండి, కమలనుండి ఇత్యాది.

పంచమీవిభక్తుల యందలి యచ్చులు పరమగునపు డన్ని యచ్చులకును బైని నకారము వచ్చును. అందు పర మగుచుండగా నుదంతములకు మాత్రము నకారము చెప్పఁబడినది. కాఁగా నిట మాత్ర మన్నియచ్చులకు వచ్చుటకై 'సర్వేభః' అని చెప్పఁబడినది. 'ఉంచుండి కుండా వంక వర్ల వలన పంచమ్యాః, నిర్ధారణే కన్నకంటె, పట్టిశ్చ, పారుడిశ్చ' యని చెప్పఁబడిన పంచమీవిభక్తులలో నజాదులు ఉంచి, ఉండి యున్నవి రెండే. కావున నవి పర మగునపుడే నకార మగును.

రామ శబ్దముపైఁ బంచమీవిభక్తి ఏకవచనమును వివక్షింపఁగా, రామ + జసి మహత స్స్వప్యదతః, రాము + జసి, నిష్టాదౌ యని నిప్రత్యయమైన రాముని + జసి ఉంచుండి మొదలగుసూత్రముచే జసికి ఉండి రాఁగా రాముని + ఉండి ప్రస్తుత సూత్రముచే నకార మై రామునినుండి ముక్తి గొనియె. న టాదౌ నిః కణ్వస్య యని ని వర్ణకము రాని పక్షమునందు రాము నుండి - ఇట్లే యితరము లూహింపఁదగు.

ఇట్లే ఇండ్ల నుండి వెడలుఁడు మొ॥ అని యీ కార్యము బహువచనమునను గలదు.

'జసి' యనుటచే నితరవిభక్తులందలి యచ్చు పర మైనను నకారము రాదు. కాని

'రామునకు 'సీతా దేవి' యనుచో నకారము గలదు. ధర్మరాజా ముఖమలుత యనుచో లేదు.

'అచి' యనుటచేఁ బంచమీవిభక్తులందును హల్లుపర మైన నకారము లేదు. రామునికన్న రామునికంటె. పట్టి (కుండా?) పరకతలోను నన్ని యచ్చుల కగుచున్నది. జ్ఞానముఁబట్టి. (వాకిటిఁగుండా?)

## 42. అమహన్త స్త్రీపశుజడాః[1].

స్త్రీ పశుజడాః = స్త్రీలను, పశువులను, జడములను దెలుపు శబ్దములు, అమహన్తః = అమహత్తులు.

వి. స్త్రీపశుజడవాచకాశ్శబ్దాః అమహత్సంజ్ఞా స్స్యుః.

జడము లనఁగా నచేతనములు, ప్రాణము లేనిదానిని బోధించునవి. స్త్రీ, పశు, జడములను బోధించు నట్టి శబ్దములకు అమహత్తు అని సంజ్ఞ. 'రమ' ఇది స్త్రీని బోధించునది గావున నమహత్తు. 'గోవు' ఇది పశువును బోధించుచున్నది గావున నమహత్తు. 'మేఘము' ఇది జడమును బోధించుచున్నది గావున నమహత్తు.

సూత్రమందలి 'పశు' శబ్దము పక్షులు కీటకములు మొద లగువానికి నుపలక్షణ మని గ్రహింపవలయును. తిర్యగ్బోధక మని భావము కావున చిలుక, చీమ మొద లగునవియు తిర్యగ్వాచకములు గావున నమహత్తుల అను సంజ్ఞను బొందును.

## 43. తద్విశేషణం చ[2].

తద్విశేషణం చ = ఆ స్త్రీ పశుజడవాచకము లైన శబ్దముల యొక్క విశేషణము లగు శబ్దములు గూడ, అమహన్తః = అమహత్తులు.

వి. తద్విశేషణ శబ్దా శ్చ తత్సంజ్ఞా స్స్యుః.

'అమహన్తస్త్రీ పశుజడాః' అని పూర్వసూత్రమునఁ జెప్పబడిన యమహత్తు లగు శబ్దముల యొక్క విశేషణములు నమహత్సంజ్ఞ గలిగిన వగును. వరప్రదాయిని యైన రమ. 'రమ' యను నమహత్తునకు (స్త్రీ వాచకమునకు) విశేషణ మగుటచే 'వరప్రదాయిని'యను శబ్దము నమహత్తు.

---

1. ఆం.కౌ.అ.14
   స్త్రీపశుజడాన్ వినాన్యేమహదాఖ్యాః. ఆం.శ.చిం.అ.9
   మహదస్త్రీజడః. వై.చం.అ.1.
2. తద్విశేషణా శ్చ ఆం.కౌ.శ.16.
   తద్విశేషణా శ్చాపి. ఆం.శ.చిం.అ.10.

ప్రశస్తమైన గోవు, ఇచట గోవు అను నమహత్తు (పశువాచకము) నకు విశేషణ మగుటచే 'ప్రశస్త' శబ్ద మమహత్తు.

సజల మగు మేఘము ఇచట మేఘ మను నమహత్తు (జడవాచకము) నకు విశేషణము గావున 'సజల' శబ్ద మమహ త్తయినది.

ఇట్లె యితరములను గుర్తింపఁదగును.

## 44.మహాన్తోఽన్యే[1].

అన్యే = ఇతరము లగు శబ్దములు, మహాన్తః = మహత్తులు.

వి. తదితరశబ్దా మహత్సంజ్ఞా స్స్యుః. ఏతత్సూత్ర
మభయత్రాపి మానమ్.

అన్యము లనఁగాఁ బూర్వము చెప్పఁబడిన వాని కంటె వే ఱయినవి, అనఁగాఁ బూర్వోక్తముల మహత్తులు, అవి గానివి 'అమహన్త స్త్రీ పశుజడాః' అనుసూత్రము స్త్రీ తిర్యగ్జడ వాచకము లగు శబ్దములకు 'అమహత్తు' లను సంజ్ఞను జెప్పినది కావున స్త్రీ తిర్యగ్జడముల కంటె భిన్నమైన దానిని బోధించు శబ్దమునకు మహత్తు అని పేరు. ఇట్లె 'తద్విశేషణం చ' యను సూత్రము ననుసరించి మహత్తులకు, విశేషణము లగు శబ్దములకును మహ త్తను సంజ్ఞ గలుగును.

రాముఁడు-ఇట. రామశబ్దము స్త్రీ తిర్యగ్జడములకంటె భిన్నమును దెలుపుచున్నది గావున నిది మహత్తు.

ముక్తిదాయకుఁ డగు రాముఁడు . రాముఁ డను మహత్తునకు విశేషణ మగుటచే 'ముక్తిదాయక' శబ్దమునకును మహత్సంజ్ఞ గలిగినది.

మహత్కార్యము లింతకు ముందు పెక్కు పేర్కొనబడినవి. కావున నీ సంజ్ఞలను ప్రారంభమునఁ జెప్పిన బా గుండెడి దనవచ్చును.

## 45.క్వచి దమహన్మహత్[2].

క్వచిత్ = కొన్ని యెడల, అమహత్ = అమహత్తు, మహత్ = మహ త్తగును.

---

1.ఆం.కౌ.క.15.

2.ఆం.కౌ.క.17

భవే దమహతోఽప్యర్థవిశేషే మహదాకృతిః. అ.కా.అ.7.

వి. అమహత్పదం క్వచిత్ స్థలే మహత్పదం చ స్యాత్.
సముద్రము – సముద్రుఁడు, మేఘము – మేఘుఁడు,
ఘనము – ఘనుఁడు, ఉరగము – ఉరగుఁడు.

కొన్నియెడల నమహత్తు మహత్తగును. అర్థము మాఱుట యసంభవము. తిర్యగ్జడవాచక మైన శబ్దము తర్భిన్న మైన దాని నెట్లు బోధించును? కావున అమహత్తు మహత్తగును. మహద్రూపమును బొందు నని గ్రహింపవలెను.

అనఁగా నమహచ్ఛబ్దములకుఁ గొన్ని యెడల మహత్కార్యములు వచ్చి మహద్రూపముతో నుండుట గల దని సూత్రాభిప్రాయ మగుచున్నది.

'సముద్ర' శబ్దము జడ వాచక మగుటచే నమహత్తు అయిన నీసూత్రముచే మహత్కార్యము గలుగఁగా 'మహత స్స్వప్యదతః' అని యుత్వమును, మహత స్సోర్డుజనితః అని డుజ్జును వచ్చి సముద్రుఁడు అని యగును. ఇట్లు 'రాముడు' అనురీతి మహచ్ఛబ్దముతో సమాన మైన యాకారమును బొందుట యీ లక్షణము విధించుచున్నది. ఇట్లె యితర విభక్తుల యందు, సముద్రులు, సముద్రుని సముద్రుని చేత మొ॥

'క్వచిత్' అనుదళముచే నీకార్యము కొన్ని యెడలనే కావున నమహత్తుల కన్నింటికి మహద్రూప ముండదు. ప్రయోగానుసారముగనె యిట్టి వానిని గ్రహింపవలయును. కావున మహత్కార్యము గలుగని పక్షమునం దమహత్కార్యముతో 'సముద్రము' అనురీతిగా మువర్ణ కాంతరూపముతో నుండును. ఇ ట్లాయా శబ్దముల కాయారూపములను గుర్తింపఁదగును.

జనులు జనము లను రీతిగా మిక్కిలియరుదుగా మహత్తులకు నమహత్కార్యమును గుర్తింపఁదగియున్నది.

## 46. జిదనుస్వారశ్చ[1].

జిత్ = జ కారము ఇత్తుగాఁ గలిగినది, అనుస్వారః చ = అనుస్వారమును గలిగినది యగును.

వి. జిత్ప్రత్యయోఽనుస్వారసహిత స్స్యాత్.
డుజ్ జప్రత్యయః. ఘనుఁడు ఘనుండు.

---

1. త్రి.శ.4.1 హేమచంద్రసూత్రము
డుజోఽనుస్వారః – ఆం.కౌ.శ.20
జితోఽనుస్వారశ్చ.ఆం.కౌ.త్రి.శ.బృహస్పతిసూత్రము

జి త్తయిన ప్రత్యయము బిందువుతోఁ గూడిన దగును.

జ కార మిత్తుగాఁ గలిగినది జిత్తు. 'మహత స్సౌర్దుజ్' అనుచో డుజ్ అనుదానిలోని జకార మిత్తు. జ కారము ఇత్తుగాఁ గలిగినది గావున 'డు' వర్ణకము జిత్తు. ఇట్లు జి త్తయినది బిందువును గలె దగును. ఆ బిందువును బూర్వము నందుఁ గలిగియుండు నని గుర్తింపవలయును. అనునాసికంచ - ఘనుఁడు - ఘనుండు అని యదాహరణము. ('బిన్దు ర్ద్వివిధః' అని యనుస్వారము రెండు విధములు. కావున ఖండ, పూర్ణబిందువులు రెండునవును. ఘనుఁడు ఘనుండు సాధ్యేదేః' అను సూత్రము ననుసరించి దీర్ఘముపై నుండవలసినచో ఖండబిందువు మాత్రమె యుండును వాఁడు మొ॥హసిద్ధ సాధ్యా యనుట హ్రస్వముపై రెండు నుండనగు ఘనుఁడు ఘనుండు.)

## 47. న టాదౌ నిః కణ్వస్య[1].

కణ్వస్య = కణ్వని మతమునందు, టాదౌ = తృతీయాది విభక్తులు పర మగునపుడు, నిః = నివర్ణకము, న = లేదు.

వి. తృతీయాదిషు పరేషు నిప్రత్యయో న స్యాత్కాణ్వస్య మతే. రాముచేత, కృష్ణుకొఱకు, భీమువల్ల ఇత్యాది.

కణ్వని మతమున తృతీయాది విభక్తులు పర మగుచుండఁగా నివర్ణకము రాదు.

'నిష్టాదావనిత్యప్రకృతేః' అను సూత్రముచేఁ దృతీయాదివిభక్తులం దేకవచనము పర మగుచుండఁగా నివర్ణకము విధింపఁబడినది. ఆనివర్ణకము కణ్వనిమతమున లే దని యర్థము.

ఈ సూత్రము ననుసరించి నివర్ణకము రాని పక్షము నందు రాముచేత, ననురీతిగా రూపము లుండును. నివర్ణక మైనచో రామునిచేత 'కణ్వస్య' యనుట వలన వికల్పత సిద్ధించిన దగును. షష్ఠీసప్తములందు (కు-అందు) నివర్ణకము రాని పక్షమున రామునకు, రామునం దమరీతిగా నేర్పడును.

ఇట్లు కణ్వప్రస్తుతి వలన నివర్ణకము వికల్ప మగుట సిద్ధించుచుండఁగా 'రామునికి' అను రీతి రూపములను సాధింపక విడిచి పెట్టుట యుచితముగా గానరాదు.

ఇంకను 'షేనే ర్వా లుక్' అని సమానమయిన నివర్ణమునకు వికల్పముగా లోపము చెప్పవలసిన యవసరమును గానరాదు.

---

1. టాదౌ నిర్నాచార్యాణామ్. అం.కౌ.శ.32.
   టాదివిభక్తౌ నిర్వైత్యేకే. అం.శ.చిం.అ.19.
   నిష్టాదౌ మహానిలోవా వై.చం.అ.13.

రాముని యొక్క బాణము, రాముని బాణము , రాము యొక్క బాణము, రాము బాణము, అని నివర్ణక, తద భావములచే ద్వైరూప్యము సిద్ధ మగుచుండగా దానికై 'పేవేర్వాలు' క్కని చెప్ప నెల?

కాక రాముచేత ననురీతిని కణ్వుని మతముననే కాని యీ వ్యాకర్త మతమునఁ గా దని తలఁచిన నీ కణ్వమతమును వర్ణించుట వలనఁ బ్రయోజన మేమి?

## 48. ప్రత్యక్ష దూరాహ్వాన సంశయ మహారోదనేషు ప్లుతః[1].

వి. ఏష్వర్థేషు ప్లుత స్స్యాత్.

ప్రత్యక్షదూరాహ్వాన సంశయ మహారోదనేషు = ఎదట నున్న వానిని సంబోధించునపుడును, దూరమునం దున్న వానిని సంబోధించునపుడును, సందేహార్థమునను, మిక్కిలి దుఃఖమునను, ప్లుతః = ప్లుత స్వర మగును.

ప్రత్యక్షాహ్వానము, దూరాహ్వానము, సంశయము, మహారోదనమునను నర్థములయందు ప్లుతస్వర మగును. 'అణీజౌ త్రివిధౌ' యని యీ వ్యాకరణము ప్లుతస్వరము నంగీకరించినది. కావున నిటఁ బ్లుతమును జెప్పుట యొప్పుచున్నది. ఉదాహరణములు **వివృతి యందు** గమనింపఁదగును.

వి. సంబుద్ధౌ = ప్రత్యక్షే – వెలఁదీ యెవ్వరిదానవు.
దూరాహ్వానే – ఓరామా వినవే.
సంశయే – వీఁడు రాముఁడా.
మహారోదనే – అయ్యో దేవుఁడా ఇత్యాది.

ఎవ్వరిదానవు అను ప్రశ్న ననుసరించి "వెలఁది" ప్రత్యక్ష మగుట స్పష్టము కావున వెలఁదీ యను చోటి ప్లుత మగు 'ఈ' కారము ప్రత్యక్షాహ్వానము నం దయినది. ఓరామా వినవే యనుచో శ్రీరాముఁడు దూరమునం దున్నవాఁడు గావున 'రామా' యనుచోటియాకారము ప్లుతము దూరాహ్వానమునందలిది.

ఇంకను సంశయ (మహా) రోదనము లందే గాక యాశ్చర్యాద్యర్థములందును బ్లుత ముండ వచ్చును ప్లుతస్వరము నంగీకరించిన పిదప నట్టిదానికి దోష మేమి?

---

1. వాదిదులాం ప్లుత స్సంబుద్ధౌ. అం.కౌ.శ.64.
సంబోధనే ప్లుతం ప్రాహుఃకే'చిద్దూరాదికేఽ భితఃఅ.కా.11

వి. స్యాదుత్పత్తిః కథమితి చేత్ - శ్రూయతామ్
రామ + సు ఇతిస్థితే 'మహత స్సోర్డుజనిత' ఇత్యనేన
సూత్రేణ డుట్ప్రత్యయే కృతే, మహత స్సుప్యదత
ఇతి సూత్రేణ అకారస్య ఉత్వే కృతే రాముఁడు
ఏవం కృష్ణ గోవింద ముకుందా దయః[2]

'రాముఁడు' అనుదాని ప్రక్రియా క్రమము నిట వివృతికారుఁడు ప్రదర్శించుచున్నాఁడు మహత స్సోర్డుజనిత యను సూత్రము నొద్దనే చెప్పిన బాగుండెడిది.

రామ + సు అనుచో ముందు సుస్థానమున డుజ్జు చేసి యాపిదపఁ బ్రాతిపదిక యత్వమున కుత్వము చెప్పఁబడినది. డుజ్జును సుస్థానమున నైన దగుటచే 'సు' విభక్తి లక్షణముతో, 'సుప్' అనుదానిచే బోధింపఁబడకపోదు.

కాని సంస్కృత విభక్తి పరకత్వముననే ప్రాతిపదికకు వికారము లన్నియుఁ జేసి తుదికి సంస్కృత విభక్తికిఁ దెలుఁగువిభక్తి చేయుట యుత్తమము. ముందుగాఁ దెలుఁగువిభక్తి చేయుట వలననే 'రామునికి' ననురీతిరూపములీవ్యాకరణమున నసాధ్యము లై గ్రామ్యములు గావలసి వచ్చిన దనుటలో ననుమాన మక్కఱ లేదు.

ఇంకను మహతస్సుపి, నిష్ఠాదౌ యని కొన్నియెడల లక్షణమున సంస్కృతవిభక్తులు నిర్దేశింపఁ బడుటయు, 'నఃకావుతః' ఇత్యాదిగాఁ గొన్ని యెడలఁ దెలుఁగు విభక్తులు నిర్దేశించుటయు ననుభేదము సార్థకము గావలయు నన్నను సూత్రమున సంస్కృత విభక్తిని నిర్దేశించి ప్రాతిపదిక కాయా కార్యములు విధించిన చోట్ల నెల్ల సంస్కృత విభక్తులకుఁ దెలుఁగు విభక్తులు తుట్టతుదికిఁ జేయుటయె యుచితము. రాముఁడు ప్రక్రియ - 'మహతస్సోర్డుజనితః' సూత్రవ్యాఖ్యలో గమనింపఁదగును.

## 49. హ్రా దే స్త్రిషు[1].

త్రిషు = అ,ఈ,ఊ అనునవి చివరఁగల శబ్దములు మూఁడింటి కిని, దేః = తుదిదీర్ఘ మునకు హ్రః = హ్రస్వ మగును.

---

1. ఆదీదూదదిదుత్. ఆం.కౌ.శ.59.
దీర్ఘాణాంహ్రస్వస్స్యాత్ ఆం.శ.చిం.అ.46.
త్రిషుహ్రస్వను దీర్ఘాణామ్ త్రి.శ.3.23.
దేర్హ్రోఽదేశ్చైకవర్ణే. వై.చం.అ.49.

2. ఇట్టి వివరణమూ ఆం.కౌ.లోను గానవచ్చు.

వి.మహదమహత్సు ఆదీఘూదన్తేషు దీర్ఘాణాం
 హ్రస్వః స్యాత్ విశ్వపాః - విశ్వపుఁడు,
 గ్రామణీః - గ్రామణి, ఖలపూః - ఖలపుఁడు,
 శేషం రామ హరి విష్ణువత్.

మహత్తులు న మహత్తులు నైన, ఆకారాంతములకును, ఈకారాంతములును ఊకారాంతములు నైన శబ్దముల యొక్క దీర్ఘమునకు హ్రస్వమగును. ఇట్లు దీర్ఘములకు హ్రస్వము అయిన పిదప, సహజముగా హ్రస్వాంతము లగు శబ్దములకు వలెనె వీని కాయా విభక్త్యంత రూపము లేర్పడును, దిర్ఘీర్ఘస్య, హ్రె హ్రస్వస్యయను లక్షణములను బట్టి 'ది' అనఁగా దీర్ఘము 'హ' అనఁగా హ్రస్వము.

'విశ్వపా' అను ప్రాతిపదికము తుది దీర్ఘమున కీ సూత్రముచే హ్రస్వము రాఁగా విశ్వపయని హ్రస్వాదంత మగును. 'రామ' అను అదంతము నకువ లె దీనికి రూపము లగును.రాముఁడు - విశ్వపుఁడు.

గ్రామణీ యనుచోఁ దుది దీర్ఘమున కీసూత్రముచే హ్రస్వము రాఁగా గ్రామణి యని యగు. సహజముగా నిదంత మగు హరిశబ్దమునకు వలె దీనికి రూపములు హరి - గ్రామణి.

'ఖలపూ' యనుచో దీర్ఘమునకు హ్రస్వము రాఁగా ఖలపు. సహజముగా నుదంత మగు విష్ణు శబ్దమునకువలె దీనికి రూపములు. విష్ణువు, విష్ణుఁడు, - ఖలపువు, ఖలపుఁడు మొ॥

ఇట్లు పుంస్త్రీ నపుంసకలింగ శబ్దములు మూటికిని హ్రస్వ మగును.

వధూ - వధువు మొ॥

## 50. సో ర్లుగితః[1].

ఇతః = ఇకారము కంటెఁ బరముగా నున్న, సోః = సువిభక్తికి, లుక్ = లోప మగును.

వి. ఇదన్తస్య సోర్లుక్ స్యాత్సర్వత్ర.
 హరి, మతి, వారి, ఇంతి ఇత్యాది.

ఇకారాంత శబ్దములకుఁ బర మై యున్న సువిభక్తికి ననఁగా ప్రథమైకవచనమున కెల్ల యెడల లోప మగును.

---

1.ఆం.కౌ.శ.55, ఆం.శ.చిం.ఆ.36.
 డుబో నోశ్చలోపః. త్రి.శ.3.14. బృహస్పతిసూత్రము.
 ఇతః.వై.చం.ఆ.50.

హరిశబ్దముపైఁ బ్రథమైకవచన వివక్షలో సుప్రత్యయమై 'హరి + సు' అని యుండఁగా నా'సు'విభక్తి కీ సూత్రముచే లోప మై 'హరి' యని యగును. సువిభక్తి చేరి (లోపించి) నది గావున నిది 'సు' అంతమునఁగల దై పదత్వము నందుచున్నది. వివృతి యం దుదాహరింపఁబడిన వానిలో, హరి – పుంలింగము, మతీ – స్త్రీ లింగము 'వారి' నపుంసకలింగము 'ఇంతి' దేశ్యము. అన్ని విధము లయిన ఇకారాంతశబ్దములపైని సువిభక్తి లోపించు నని తాత్పర్యము.

('ఇతః' అనుచోట తకార ముచ్చారణార్థము కావున, శ్రీ, తేజీ మొదలగు నీ కారాంత శబ్దములపైఁ గూడ సువిభక్తి లోపించును.)

## 51. నోశ్చ[1].

ఇతః = ఇకారమునకుఁ బరముగా నున్న, నోః చ = ను వర్ణకమునకు సయితము, లుక్ = లోప మగును.

'సోర్లుగితః' అనుపూర్వసూత్రము నుండి 'లుక్ ఇతః' అనుపదము లిం దనువర్తించును.

వి. ఇదన్తస్య నుప్రత్యయస్య నిత్యం లోపస్స్యాత్.
నుప్రత్యయాభావే నిప్రత్యయస్స్యాదితి బోద్ధవ్యః –
హరిను గొలిచెద ఇతి న. హరిని గొలిచెద.

ఇకారాంతములకంటెఁ బర మై యున్న ను ప్రత్యయమునకు లోపము నిత్యముగా వచ్చును. 'కూర్చిలసునయోర్ద్వితీయాయాః' అను లక్షణము ననుసరించి ప్రత్యయ మైన ను వర్ణకమిట ద్వితీయావిభక్తి యనుట స్పష్టము.

నిత్యముగా లోపించుట మూలమున ను వర్ణకము లేకపోవుటచే 'ని' అను ద్వితీయావిభక్తి వచ్చునని వివృతి వివరించినది. కావున హరిను గొలిచెద నను తీరుగా నికారాంతములపై ద్వితీయయందు ను వర్ణక ముండదు. ఇంక హరిని గొలిచెద నను తీరుగా 'ని' వర్ణకమె యుండును.

మొత్తము మీఁద ను వర్ణకము రాని వానికి నే వర్ణకము వచ్చుటయు, ని వర్ణకము రానివానికి ను వర్ణకము వచ్చుటయు నిట సూచింపఁబడినది

'నోశ్చ' యని యికారాంతములకుపై ను వర్ణక లోపవిధానముచే 'మహతోనిరమః' అను సూత్రముచే వీనికి ని ప్రత్యయము రా దనియు, మహత్తు లయినను బ్రథమైకవచనమున డుజ్ఞు వచ్చు వానికే యీ సూత్రముచే 'ని' వర్ణక మగున నవియు నట గమనించితిమి. పరిశేష

---

1. డుజో నోశ్చలోపః. త్రి.శ.3.14.బృహస్పతిసూత్రము.

న్యాయముచేఁ బ్రథమైకవచనమున డుబ్జు రాని శబ్దముల కెల్ల 'అమ్' స్థానమున ను వర్ణకము వచ్చును. 'మహతస్సోర్డుజనితః' అనుటచే నిదంత మగు హరి శబ్దమునకుఁ బ్రథమైకవచనమున డుబ్జు లేదు. కావున దీనిపై 'నమ్' స్థానమున ని వర్ణకము రాదు. ను వర్ణకమె యగును. ఆ ను వర్ణక మీ సూత్రముచే నిత్యముగా లోపించును.

'ను' నిత్యముగా లోపించుటచే 'ని' వచ్చు నను వివరణము సమంజసముగాఁ దోఁచదు. 'ను' వర్ణక మైనను 'అమ్' స్థానమున రావలసినదే గదా. హరి + అమ్ అనుచో అమ్మునకు 'ను' వర్ణక మై హరి + ను అని కాగా ఆ ను వర్ణకము ప్రస్తుత సూత్రముచే లోపింపగా నింక నివర్ణకము మెచట వచ్చును. అమ్మునకైన ను వర్ణకము లోపించుటచే నిఁక 'అమ్' విభక్తి లేదు గదా. అమ్మునకైన ను లోపించుటచే మిగిలిన 'హరి' అమంత మైనది. దానిపై మఱల 'ని' గాని మఱియొకటి గాని విభక్తి యె ట్లగు? హరి + ను అనుచో నువిభక్తి లోపింపగా మిగిలియున్న 'హరి' ప్రథమాంతము గాదా? అట్లె యనుట 'నమ్' కు వచ్చిన ను వర్ణకము లోపించుటచే 'హరి' ద్వితీయాంత మగును.

'ను' లోపము చెప్పు టుచితము గాదు. ని వర్ణకమును విధించుటే యుచితము ఇంకను ను వర్ణకము రా దని నిషేధించుటేని కొంతవఱకైన నుచిత మగు నేమో కాని 'ను' లోపము చెప్పి యందువలన ని వర్ణక మగు ననుట సక్రమముగా లేదు.

'న టాదౌ నిరితః' అను సూత్రము తృతీయాద్యేకవచన పరకత్వమున నిదంతములకు ని వర్ణకమును నిషేధించుచున్నది. 'ప్రాప్తి పూర్వకో హి నిషేధః' అని యసలు ప్రాప్తింపవలెఁ గదా. 'నిష్ఠాద-వనిత్యప్రకృతేః' అని ని వర్ణకము ప్రాప్తించుండగా 'న టాదౌ నిరితః' అని నిషేధింపఁబడిన దనవలె. 'నిష్ఠాదౌ' యను సూత్రమునఁ జెప్పిన ని వర్ణకము హరి ప్రభృతు లగు నిదంతమహత్తులకు రాగా, నవ్వానికి 'మహతోనిరమః' అని చెప్పిన నివర్ణకమేల రాదో సమన్వయింపఁ బడకున్నది.

ఏ మైనను నిదంతము లగు మహదమహచ్ఛబ్దముల కెల్ల ద్వితీయైకవచనమున ని వర్ణకము వచ్చును. 'నోశ్చ' యనక 'నిరమః' అన్నను జాలెడిదే. అమహత్తులకు వగుటకై యిట్టి విధానమవసరమె. 'మహతోనిరమః' మహత్తులకు మాత్రమె గదా చెప్పినది.

ఏ మైన నిదంతము లగు మహదమహచ్ఛబ్దములకు ద్వితీయైకవచనమున 'ని' వర్ణము వచ్చుటయె యుద్దిష్టము. హరిని, గిరిని – మొ॥

వి. కణ్వస్యమతే నేర్లోపః. హరి గొలిచెద ఇత్యాది.

---

1. చావుక్ప. త్రి.శ.3.15. బృహస్పతిసూత్రము.
   ఉద్భహుత్వే. ఆం.కౌ.శ.56, ఆం.శ.చిం.అ.37.
   ఇతోజసాదావుల్. వై.ఎం.అ.51

కణ్వుని మతమున వి వర్ణకమునకు లోపమగును. 'లుక్క్వణ్యస్య' యని వి వర్ణకము లోపింపఁగా హరిఁ గొలిచెద. (పరళాదేశము ద్రుతము వలన నైనది) లోపింప కున్న హరినిఁ గొలిచెద. 'లుక్క్వణ్యస్య' యను సూత్రవ్యాఖ్య చూడఁదగును.

## 52. ఉద్బహుత్వే[1].

బహుత్వే = బహుత్వమునం దనఁగా, బహువచనము పరముగా నుండఁగా ఇతః = హ్రస్వ మగు ఇకారమునకు, ఉత్ = ఉత్వమగును.

'పోర్లుగితః' అనుసూత్రము నుండి క్రమముగా ఇతః అనునది యిం దనువర్తించును.

వి. ఇదన్తస్య బహువచనే పరే ఉత్ స్యాత్. హరులు, కామినులు.

ఇదంతములకు బహువచనము పరముగా నున్నపుడు తుదియిత్వము యొక్క స్థానమున నుత్వ మగును.

హరి శబ్దముపైఁ బ్రథమా బహువచన వివక్ష యందు 'జస్' - హరి + జస్, ప్రస్తుత సూత్రముచే ఇత్వమున కుత్వము హరు + జస్. లుజసః హరులు ఇట్లే మతులు, వారులు. ఇంతులు. మొ॥

బహుత్వే యని సామాన్యముగాఁ జెప్పుటచే నెల్ల విభక్తుల యందును బహుత్వమున నుత్వ మగును. హరులను, హరులందు. మొ॥

ఈ సూత్రముచే నుత్వము 'ఈ' కార మంతమందుఁ గల వానికి లేదు. శ్రీలు, ధీలు మొ॥ ఇచట 'ఇతః' అనుచోట తకారమునకు 'తపరస్తత్కాలస్య' యను పాణినీయపరిభాష ననుసరించి తత్కాల మాత్రగ్రహణము ప్రయోజన మనవలెను. అపుడే హ్రస్వ మగు ఇకారమునకే యుత్వమగును.

## 53. నాక్సంబుద్ధౌ[1].

సంబుద్ధౌ = సంబోధనము నందు, ఇతః = ఇకారాంతములకు, అక్ = అగాగమము, న = లేదు.

వి. ఇదన్తస్య సంబుద్ధౌ వగాగమో న స్యాత్. ఓ హరి
ఓ యువతి, ఓ నారి, ఓ యింతి.

---

1. సంబుద్ధౌనాత్. అం.శ.చిం.అ.
పొరదవితామ్.ఆం.కౌ.శ.21.

ఇకారాంత శబ్దములకు సంబోధనమునం దగాగమము రాదు. "ఆమన్త్రణసుజసోర్వా రగాగమౌ" యను సూత్రముచే అగాగమము సంబోధనమున సువిభక్తికి విధింపఁబడినది. ఇట నది నిషేధింపఁబడినది.

హరి + సు అనుచో 'ఆమన్త్రణసుజసోః' అను సూత్రముచే రావలసిన 'అగాగమము' ప్రస్తుత సూత్రముచే రాదు. 'సోర్లుగితః' యని సుప్రత్యయము లోపింపఁగా ఓ హరి – అని యగును. ఇట్లే ఓ యువతి. మొ॥

అగాగమము సువిభక్తికి రావలసి యుండఁగా, ఇదంతములపైని 'సు' విభక్తి 'సోర్లుగితః' యను సూత్రముచే లోపించుచున్నది. కావున సువిభక్తియే లేకుండ అగాగమ మెట్లు వచ్చును. అగాగమము రా వీలు లేకుండ నిషేధింప నేల? ఇ ట్లీ విధానము వ్యర్థము.

దీనిచే సువిభక్తి లోపించు స్థలమునను లోపించిన సువిభక్త్యంత మగు శబ్దమునకె యవు నను నర్థాంతరము జ్ఞాపిత మవును.

జ్ఞాపక సిద్ధ మైన యీ యర్థము వలన నికారాంతములపై సువిభక్తి లోపించినను అగాగమము ప్రాప్తించుచుండుటచే రా దను నీ విధానము చరితార్థము.

దీని వలన ఓ కొడుకు – కొడుక – వేల్పు – వేల్ప మొదలగు రీతిరిగా 'సు' లోపించువాని కగాగమ మగుట యన్యత్ర ఫలము.

అన లారగాగమము సామాన్యముగాఁ జెప్పి అగాగమ ముదంతములపై మాత్రము చెప్పియున్న నింతటి శ్రమయే యుండెడిది గా దని సూరి రచనా మార్గము స్పష్టము చేయుచున్నది.

ఇది యిదంతములకె గావున నితరములపై నీ నిషేధము లేదు. ఓ రాముఁడ, ఓ ధేనువ. మొ॥

వి. అనేన సూత్రేణ ఇదన్తస్య ఏకవచనస్య అగాగమా
భావే అనుక్తత్వాద్ బహువచనస్య ఆరగాగమస్స్యా
దేవేతి జ్ఞాతవ్యః. ఓ హరులార, ఓ యువతులార!
ఓ యింతులార, ఓ సుందరులార! ఇత్యాది.

'ఆమన్త్రణసుజసోర్వాగారకౌ' యను సూత్రమున నేకవచనమునకు (సు) అగాగమమును బహువచనమునకు (జస్) ఆరగాగమమును విధింపఁబడినవి. వానిలో ఏకవచనమునకు రావలసిన, అగాగమము మాత్రమే ప్రస్తుతసూత్రముచే నిషేధింపఁబడినది. ఇంక బహువచనమునకు (జస్) రావలసిన ఆరగాగమ మిట నిషేధింపఁబడలేదు. కావున ఇకారాంతములకును

సంబోధనము నందు బహువచనమునకు రావలసిన ఆరగాగమము వచ్చు నని గ్రహింపవలయును.

హరి + జస్ – ఉదృహుత్వే, హరు + జస్, – 'ఆమన్త్రణసుజసోర్వాగారకౌ' హరు + జస్ + ఆర, లుజసః, హరులు + ఆర = హరులార. ఇట్లె యితరములు.

వి. 'పుమమహదితోర్జసః కిః' ఇత్యనేన ఇదంత షష్ఠ్యేకవచనస్య కిప్రత్యస్స్యాత్. హరికి, యువతికి, వారికి, ఇంతికి ఇత్యాది.

ఇకారాంతము లగు శబ్దములకుఁ బైనున్న షష్ఠీవిభక్తి యేకవచన మగు జస్ స్థానమునఁ 'పుమమహదితోర్జసః కిః' అను సూత్రముచే 'కి' ప్రత్యయ మగును. కావున హరి + జస్ హరికి – అని యగును. ఇట్లే యితరములు.

వృ. జసః కిమ్? హరులకు, ఇంతులకు. సూత్రే జస ఇత్యేకవచనగ్రహణా ద్బహువచనే కు ప్రత్యయ స్స్యా దితి బోద్ధవ్యః.

సూత్ర మిట 'పుమమహతోః' అని చూపఁబడుట నుబట్టి యింతకు ముందుః 'పుమహతోః' అని యున్నపాఠము సరి గా దని యు 'పుమమహతోః' అని యుండవలయు ననియు గ్రహింప వచ్చును.

'పుమమహదితోర్జసః కిః' అను సూత్రమున 'జసః' అని చెప్పఁబడినది. జస్ – ఆమ్ అనుచో జస్ అనునది షష్ఠీవిభక్తి యేకవచనము. ఇ ట్లేకవచనముననే కి ప్రత్యయము నా సూత్రము చెప్పుటవలన బహువచనమునకు (ఆమ్) కి రాదు. కాగా 'కుర్డమస్సర్వత్ర' యను సూత్రముచే 'కు' వర్ణకము వచ్చును. హరులకు.

హరి + ఆమ్ – ఉదృహుత్వే – హరు + ఆమ్ – లస్సర్వత్ర – హరుల + ఆమ్ – కుర్డమస్సర్వత్ర – హరులకు –

ల వర్ణకముచే నిదంతము లెల్ల నదంతములై యగును, కాని 'పుమమహతోః' అను సూత్రమున పుమమహత్తులకు మాత్ర మిదతరములకే యను నియమము లేదు. కావున 'జసః' అని చెప్పుట యవసరము. పుమమహత్తులకు వేఱుగను ఇదంతములకు వేఱుగను నట 'కి' విధింపఁబడుట గమనించి యున్నారము.

## 54.న టాదౌ .నిరితః[1].

ఇతః = ఇకారాంతము లగు శబ్దములకు, టాదౌ = తృతీయాదు లం దేకవచనము పర మగునపుడు, నిః = న్విర్ణకము, న = లేదు.

వి. ఇదన్తస్య తృతీయాదిషు పరేషు ని ప్రత్యయో న స్యాత్. హరిచేత, కవికొఱకు, ఇంతివల్ల, సామికి, శౌరియుందు ఇత్యాది.

ఇకారాంతములకుఁ దృతీయాది విభక్తులు పర మైనపుడు ని వర్ణకము రాదు. 'నిష్ఠాదావనిత్యప్రకృతేః' అను సూత్రముచేఁ దృతీయావిభక్తులలో నేకవచనము పర మైనపుడు మహత్తులకు ని వర్ణకము చెప్పఁబడియున్నది. ఆ ని వర్ణకము ఇకారాంతము లగు శబ్దములకు రా దని యీ సూత్రము నందలియభిప్రాయము.

హరిశబ్దముపైఁ దృతీయైకవచనమున 'టా' విభక్తి యై హరి + టా యని యుండఁగా, 'నిష్ఠాదావనిత్యప్రకృతేః' అను సూత్రముచే రావలసిన ని వర్ణకము ప్రస్తుతసూత్రము చేరాదు. కావున హరి + టా యని యుండఁగా 'చేతమై తృతీయాయాః' అని 'టా'కు చేత వచ్చి హరిచేత అని యగును.

ఇంతివల్ల నను నమహ త్తిట నుదాహరింపఁబడుట విచార్యము.

## 55. ఉన్నిలాదిః ప్రకృతిః[2].

ఉన్నిలాదిః = ఉత్, ని, ల, మొదలగునవి, ప్రకృతిః = ప్రకృతి (యనుసంజ్ఞ నందును)

వి. ఉత్,ని,ల ఇత్యాది ప్రత్యయాః ప్రకృతిసంజ్ఞాస్స్యుః. హరులు, రాములు, కృష్ణుని చేత, రాముల కొఱకు ఇత్యాది.

ఉత్,ని,ల, మొదలగు ప్రత్యయములు ప్రకృతి యను సంజ్ఞ గలిగిన వగును.

విభక్తి పరకత్వమునఁ బ్రాతిపదికమున విధింపఁబడినవాని కెల్ల నీ సంజ్ఞ విధింపఁబడినట్లు

---

1. టాదౌనేతోఽనిః. ఆం.కౌ.శ.57.
   టాదావితోననిస్స్యాత్.ఆం.శ.చిం.ఆ.40.
   నిష్ఠాదౌమహతోఽనితోవా. వై.చం.అ.13.
2. (?ఉచ్చ, నిర్లక్ష్య). ప్రకృతయస్స్యేతే? త్రి.శ.3.11,12)

తోఁచుచున్నది. (ముళాదులకుఁ దరువాతి సూత్ర మింకొక సంజ్ఞ చెప్పుచున్నది)

హరులు, రాములు - అను వివృతియందలి యుదాహరణములను బట్టి 'ఉద్వహాత్వే' యని యిత్వమున కయిన యుత్తును, మహతస్సృవృదతః' అని యత్తున కయిన యుత్వము రెండును, 'ఉత్' అనుదానిచే బోధింపఁబడును..ఆదేశముగా వచ్చునీ యుత్వమును గూడఁ బ్రత్యయమని వృత్తియందుఁ జెప్పఁబడుట విశేషమె. విష్వాదావనిత్యప్రకృతేః అని చెప్పఁబడిన ప వర్ణకము, లస్సర్వత్ర యని చెప్పఁబడిన ల వర్ణకమును బ్రకృతి సంజ్ఞ గలవి.

'ఉన్నిళ్లాదిః' అనుచోటి యాదిశబ్దముచే రామునకు, మొదలగు చోట న వర్ణకము, రామునందు, రామునుండి మొదలగు చోట్ల నకారమును (మొదలగువానిని?) గ్రహింప వచ్చు ననిపించుచున్నది.

## 56.ముల్వ్యసగావగియ (జోసే?) దాదిర్నిత్యః[1].

**ముల్వ్యసగావగియ (జోసే?) దాదిః = ముల్, వుస్, అక్, అవక్, ఇయచ్, (ఓస్, ఏల్) మొదలగునవి, నిత్యః = నిత్యమైన, ప్రకృతిః = ప్రకృతి సంజ్ఞ గలవి.**

**'ఉన్నిలాదిః ప్రకృతిః' అను పూర్వసూత్రము నుండి 'ప్రకృతిః' అనునది యిం దనువర్తించును.**

## వి. ములాదిప్రత్యయా నిత్యప్రకృతిసంజ్ఞా స్యుః.

ముల్ మొదలగు వానికి నిత్యప్రకృతు లని సంజ్ఞ. ఈ సంజ్ఞావిధానమువలనఁ బ్రత్యేక మగు ప్రయోజనము గానరాదు. ఇది లేకయు విష్టరూపసిద్ధికి బాధ లేదు. అం.కౌ.లో నివి పేర్కొనకుం టుచితముగా నున్నది. 'నిత్యస్సుపి చ' ఇత్యాదిగా లాఘవ ముద్దేశింపఁబడి నదేమో పరిశీలింపవలె.

ఆది శబ్దముచే 'రాజ్ఞోణుర్నిత్యమ్' అని (హల్.17) అని చెప్పఁబడినణు మొదలగునవి గ్రహింపఁదగును. చూ.శబ్ద.33 సూ. వివృతి.

## 57. నిత్య స్సుపి చ.

నిత్యః = నిత్యప్రకృతులు, సుపి చ = సుబ్విభక్తులు పర మగుచుండఁ గా నగును.

## వి. నిత్యప్రకృతి స్సుపి పరే చ స్యాత్.

---

1.ముప్రత్యయఃప్రకృతివత్. (త్రి.శ.4.21)
ప్రకృతిశ్చ. త్రి.శ.3.29.

నిత్యప్రకృతులు ప్రథమాదివిభక్తు లన్నింట నగును. ఉదాహరణములు వివృతియందు గమనింపఁదగును.

వి. ముల్ - వనము - వనములు, వుస్ - గురువు - గురువులు,
అక్ - ధాత, ధాతలు, ఆవక్ - నావ, నావలు,
ఇయచ్ - కన్నియ - కన్నియలు.

ఉన్ని వాదిః ప్రకృతిః అని పూర్వము చెప్పిన ప్రకృతులలో నుత్వము తప్ప మిగిలినవి యాయా విభక్తులు గొన్నింటనె యగును. వి - తృతీయాద్యేకవచనములందు, ల - తృతీయాది బహువచనముల, న - షష్ఠ్యేకవచనమున - ఇ ట్లివి కొన్ని యెడ లనే యగుచున్నవి. ఇత్వమున కగునుత్వము ప్రథమాది బహువచనములందే యగును.

ఇటఁ జేర్కొని న ముల్ ఉస్ మొద లగునవి ప్రథమైకవచనము మొదలుకొని సప్తమీబహువచనము వఱకు నన్ని విభక్తులందియందును నగును కావున వీనిని నిత్యప్రకృతులుగాఁ జెప్పియుండవచ్చును.

మహత్తుల యత్వమున కగునుత్వము మాత్రము ములాదులవలె నెల్లెడల నగును. ఆం విధానముననే 'సుపి' యనుట గమనార్హము.

58.యు రనుత స్సర్వస్మాత్కాణ్వస్య[1]

కణ్వస్య = కణ్వునిమతమునందు, అనుతః = ఉదంతములు గావి, సర్వ స్మాత్ = మహదమహత్తు లగునన్ని శబ్దములకంటెను, యుః = యువర్ణకము వచ్చును.

వి. ఉదన్తరహి తేభ్య స్తత్స తజ్జ దేశ్యానామభ్యః
యు (ఉ) స్స్వ్యాదేక వచనే కణ్వస్యమతే.

ఉదన్తములు గాని తత్సమ తద్భవ దేశ్యశబ్దముల కన్నింటికిని ఏకవచనమున ప్రథమైకవచనాంతములపై కణ్వుని మతమున యు ప్రత్యయ మగును. భామ + యు = భామయు అని యగును. ఇట్లె వృత్తియందలియాయుదాహరణములు గ్రహింపవలెను.

వి. భామయు, హరియు, రమయు, కవియు, కరియు,
మతియు, విధాతయు, ధాతయు, కన్నెయు,

---

1. వాయుఃదైలో స్వః ఆం.కౌ.శ.60.
యువర్ణక స్స్వ్యదన్తాత్తు.ఉ.కౌ.అ.22
అవిలో ర్యు న్సుముచ్చయే. వై.చం.త.25

వేధయు, వేయు, చానయు, షూటయు
దర్భయు, కశయు, హంసయు, ఇంతియు, వెలఁదియు
గిన్నెయు, మిద్దెయు, చిలుకయు, ఇత్యాది.

ఈయది ప్రథమాంతముపై నగుటయు, సముచ్చయాద్యర్థ విశేషములం దగుటయు గమనింపవలసి యున్నది. ఆంధ్రకౌముది యందు 'యు' వర్ణకము సుస్థానమున విధింపఁబడీ నది (ఆం.కౌ.శబ్ద - 60, 61) ఇటఁ గూడ నేకవచనే యనుటంబట్టి సువిభక్తికే యగు నని యెంచఁబడినదా యనిపించు.

వనమును అనురీతిగా నుదాహరించుటను బట్టి పై 'యు' వర్ణకము 'సు' స్థానమున నగు నని వృత్తి కర్త తలఁపలే దనియె నిశ్చయింపవచ్చును. వనము అన్నదే స్వంతము గదా కాఁగాఁ బైని వృత్తి యందు 'ఏకవచనే' యనఁగా నాయా శబ్దములు ప్రథమైకవచనాంతములయినపుడే యనుదంతము లగుట న్నట్లు చెప్పఁబడిన దనవలయును. బహువచనాంతము లైన నెల్ల శబ్దములు నుదంతములగును గావున అను దంతములకుఁ జెప్పిన యాకార్యము బహువచనాంతముకు రాదు. ఆ యంశమును దృష్టియం దుంచుకొనియె 'ఏకవచనే' యని చెప్పఁబడియుండు నని యూహింపఁదగును.

వి.అనుతః కిమ్? గురువు, వనము ఇతిస్థితే.

ఇచ్చఁ బ్రస్తుత స్థలమున 'అనుతః' అనుటచే 'గురువు + ఉ, వనము + ఉ' అని వివృతి యందు గన్పించును. కాని యిది యెట్లు గుదురును. అనుతః అనుటచే నుదంతములకా కార్యము వచ్చుటకు వీలు లేదు గదా. కావున నిచట గురువు - వనము ఇతిస్థితే అని మాత్రమె యుండు నని యూహించు టొప్పును.

దీనిని బట్టి ఉవర్ణకము విధింపఁబడిన దన్న, భామ + ఉ మొద లగు పైచోట్ల నెచ్చటను సంధి లేదు. 'యఃప్రాణస్య' యని యకారము వచ్చు నని వివృతి యందు వివరింపఁబడ లేదు. దీనిని బట్టి సూత్రముచే 'యు' అనునదే విధింపఁబడిన దని చెప్పుట యొప్పును గదా. ఆంధ్ర కౌముదిలోను 'వా యురిదేతో స్సోః' అని యు వర్ణకమె విధింపఁబడినది.

కాని యిట సూత్రవివృతులలో 'ఉ' అనియె యున్నది 'యు' అని యుండఁదగును.

మొత్తముపై నుదంతముల కీయు వర్ణకము రాకుండుటచే నవి - గురువు - వనము అనురీతిగా నుండఁగా.

## 59. ను రుతః[1].

ఉతః = ఉకారాంతము లగు శబ్దములకుఁ బరముగా, నుః = ను వర్ణక మగును.

వి. ఉదన్తేభ్య స్తత్స తజ్జ దేశ్యనామభ్యః
నుస్స్యాదేకబహువచనయోః కణ్వస్యమతే.
గురువును, వనమును, జన్నమును, పేరును,
భామలును, గురువులును ఇత్యాది.

ఉదంతము లగు తత్సమ తద్భవ దేశ్యశబ్దముల కేకబహువచనములు రెంట ననఁగా ప్రథమై కవచనాంతములపైని బహువచనాతంములపైని గణ్వని మతమున నువర్ణక మగును.

గురువును – భామలును మొ॥

## 60. ఉత వు స్సర్వత్ర.[2]

ససర్వత్ర = ఎల్లయెడలను, ఉతః = ఉకారాంతము లగు శబ్దములకు, వుస్ = 'వు' అను ప్రత్యయ మగును. వుస్‌లో సకార మిత్తు కావున వువర్ణకమె యగును.

వి. ఉదన్తస్య వుస్ ప్రత్యయ స్స్యాత్సర్వత్ర లిఙ్గత్రయే.
విష్ణువు, గురువు, మేరువు, త్రపువు, తనువు,
తరువు, మధువు ఇత్యాది.

ఉకారాంతము లగుశబ్దములకు వువర్ణకము వచ్చును. ఉకారాంతశబ్దము పుంలింగ మయిన, స్త్రీ లింగ మయిన నపుంసకలింగ మైనను, (మహ త్తయిన నమహ త్తయినను) వువర్ణకము వచ్చును. 'డుమువులవః ప్రథమాయాం' అను సూత్రమున 'వు' ప్రథమై కవచనముగాఁ జెప్పఁబడినది కావున, నీ సూత్రముచే నగు'వు' వర్ణకము ప్రథమై కవచన మగు 'సు' ప్రత్యయము స్థానమునం దగు నని గ్రహింపఁదగును.

'గురు' శబ్దముపైఁ బ్రథమై కవచన వివక్షయందు సుప్రత్యయము చేరి 'గరు + సు' అని యుండఁగా నీసూత్రముచే సుస్థానమున 'వు' వర్ణము వచ్చి గురువు అని యను. ఇట్లె

---

1. ఈ సూత్రమును వివృతియును ప్రాతప్రతియుందు లేవు. పూర్వము నందలి వివరణము ననుసరించి యొక సూత్రము మాత్ర ముండితీఱవలయును. అది పైన బ్లూహింపఁబడినది.
నువర్ణక ఉతోఽథ వేల్. ఆ.కా.అ.22
(ను చార్థే. వై.చం.అ.10)

యితరములు గ్రహింపఁదగును. తను(వు) స్త్రీ లింగము మధు(వు) నపుంసకలింగము.

వి. వుస్ ప్రత్యయస్య నిత్యప్రకృతికత్వాత్
నిత్య స్సుపిచేతి సూత్రేణ సుపి పరే చ స్యాత్సర్వత్రో
దన్తస్య. విష్ణువులు, గురువులు, తరువుల చేత,
చేరువుల కొఱకు, తనువు వలన, త్రోపవువలన,
త్రోపవులకు, బంధువులయందు ఇత్యాది.

'ముల్వునగావక్' - మొద లగు సూత్రము ననుసరించి యీవుస్ ప్రత్యయము నిత్యప్రకృతి సంజ్ఞ గలిగిన దగును. కావున 'నిత్య స్సుపి చ' యనుసూత్రము ననుసరించి యన్నివిభక్తులయందును నుకారాంత మగుప్రాతిపదికకుఁ బరముగా నగును.

విష్ణు + జస్ అనుచో 'నిత్యస్సుపి చ' యను సూత్రముచే 'వుస్' రాగా విష్ణువు + జస్ లుజసః విష్ణువులు ఇట్లాయావిభక్తులయం దాయారూపము లూహింపఁదగును.

61.వా లుక్చ.

వా = వికల్పముగా, లుక్ చ = ఆవుస్ ప్రత్యయమునకు లోపము నగును.

వి. వుస్ ప్రత్యయస్య వికల్పేన లుక్ స్యాత్. గురు,
విష్ణు, బంధులు తరులచేత, మేరుకొఱకు, తను
వలన, త్రోపునకు, బంధునందు ఇత్యాది.

ఉకారాంతములపైఁ బూర్వము విధింపఁబడిన వుస్ ప్రత్యయమునకు వికల్పముగా లోపము వచ్చును. వుప్రత్యయమునకు సామాన్యముగా లోపము చెప్పుటచేఁ బ్రథమైకవచనము నందును వువర్ణకము లోపించును.

విష్ణు + సు అనుచో 'ఉత వుస్సర్వత్ర' యని వువర్ణక మై విష్ణువు అవి కాగా

---

ఈసూత్రము వ్రాత ప్రతిలో లేదు కాని దీని కైన వివృత్తి గలదు. దానిని బట్టి సూత్ర మిదియే యై యుండు నని నిశ్చయింపవచ్చును. ఉదన్తానాంవున్సుపస్యాత్ త్రి.శ.3.20
ఉదోతోవున్సర్వత్ర ఆం.కౌ.శబ్ద.62
సర్వత్రోదోతోర్వ్యర్పవతిమువక్. ఆం.శ.చిం.అ.43
ఉలోపుర్వా వై.చం.అ.61
ఓలోపుః వై.చం. అ.75 (ఈ వివరణ ఉరి వు, సూత్రానిది)

నావువర్ణకమున కీసూత్రముచే లోపమయి విష్ణు అని యగును. ఇట్లే 'నిత్యస్సుపి చ' యని వచ్చు వుప్ ప్రత్యయమును లోపించును. విష్ణులు మొ॥

'వా' యనుటచే లోపము రానిపక్షము నందు విష్ణువు, విష్ణువు లను రీతిగ నుండును.

ప్రథమైకవచనమున లోపము సామాన్యముగాఁ జెప్పుట యిందలి విశేషము. రాహు, బాహు అనునొండు రెండు శబ్దములకు మాత్రమె యిట్టి స్థితిని ప్రౌఢవ్యాకర్త ప్రస్తావించెను. ప్రథమైక వచనమున 'విష్ణు' అనురీతిగా రూపముగానరాదు. (తాళపత్రప్రతులఁ గొన్నింటఁ గల దందురు)

స్త్రీవాచకము లగు స్త్రీ లింగ శబ్దములకు వువర్ణకము లోపించుట గాన రాదు. కావున సూత్రము నందలి వా శబ్దమునకుఁ గొన్ని యెడల లోప మసలు లేకుండుటను నియమించుకొనఁదగును.

ఇటఁ గొన్నికవిప్రయోగములను వివృతికర్త చూపుచున్నాఁడు.

వి. కవిమేధాతిథిభట్టార్యకృతే -భల్లాణరాయచరిత్రే -
ద్విపద ప్రబంధే - మోహినీ సౌందర్యవర్ణనే -
కాము మామను రాహు కబళించుమాడ్కి
కోమలి మొగము ముంగురు లాక్రమించె - ఇత్యాది
మహాకవి ప్రయోగాచ్చ.

రాహు కబళించుమాడ్కి - ననుచో రాహుశబ్దము వువర్ణక లోపముతోఁ బ్రయోగింపఁబడినది. ఇట్లె బాహుశబ్దమును గల దందురు. కాని యీ యొక్క శబ్దమును బట్టి విష్ణు, గురు అనురీతిగా సాధారణముగా నెల్ల శబ్దములకు రూపము లంగీకరించు టుచితముగాఁ గానరాదు. మఱి యొక శబ్దము నే దేని జూపవలసినది. అట్టివి లే వనవచ్చును.

వి. 'మహత స్సోర్ధుజనిత' ఇత్యనేన సూత్రేణ
మహత్పదస్యోదన్తస్య వికల్పేన డుజ్ప్రత్యయే
ప్రాప్తే గురుఁడు, బంధుఁడు; భానుఁడు, గురులు,
బంధులు, భానులు.

ఈ వుప్ ప్రత్యయమును బొందు ఉకారాంతశబ్దములు మహత్తు లయినచో 'మహతస్సోర్ధుజనితః' అను సూత్రముచేఁ బ్రథమైకవచనమున డుఁబ్రత్యయము వచ్చి విష్ణు + డు విష్ణుఁడు అని యగును. ఇట్లే గురుఁడు మొ॥

ఇ ట్లు దంతము లగుమహత్తులకు వువర్ణకము, తల్లోపము, డుజ్జు అనువానితో విష్ణువు, విష్ణు, విష్ణుఁడు అనురీతిగా మూఁడు రూపము లేర్పడును.

ఇట్లె ద్వితీయాదులందు విష్ణుని - విష్ణువును - మొ॥ ఇట డుజ్జు గూడ నగుటకు వివృతివచనమె యాధారము. సూత్రమున లేదు. బహుశః వా లోపశ్చ యను సూత్రముచే వువర్ణకము లోపించిన పక్షమున 'మహతస్సోర్డుజనితః' అని డుజ్జగు నని సూత్రమున నభిప్రాయమేమో అందుకే పిదప డుజశ్చ యని డుజ్జునకు లోపము చెప్పెనేమో. లేనిచో వులోపముచేతనె విష్ణు అనురూపములు సిద్ధించుచుండ డుజ్లోపవిధాన మేల? కాని వృత్తి యిటనె విష్ణు అని యుదాహరించుట ట్లుండఁగా బ్రథమైకవచనమున వు లోపింపఁగా బ్రథమైకవచనాంత (విష్ణు) పదముపై (డుజ్) ప్రథమైకవచన మగు ననుట యెట్లు?

## 62. డుజశ్చ.[1]

ఉతః = ఉదంతములమీఁది, డుజం చ = డుజ్ ప్రత్యయమునకు సయితము, వా = వికల్పముగా, లుక్ = లోప మగును.

వి. ఉదన్తస్యడుబ్రప్రత్యయస్య వా లోపస్స్యాత్
గురు - గురువు - గురుఁడు ఇతి త్రివిధం రూపమ్.

ఉకారాంతములకుఁ బైనున్న డుబ్రప్రత్యయమునకు సైతము వికల్పముగా లోపము వచ్చును.

విష్ణు + సు అనుచో 'మహతస్సోర్డుజనితః' అను సూత్రముచే సుస్థానమున డుబ్రప్రత్యయమై విష్ణు + డుజ్ అనుచో డుజ్జున కీసూత్రముచే లోప మయి విష్ణు అని యగును. వికల్పము గావున లోపము రాని పక్షమునందు విష్ణుడు అని యుండు, వువర్ణకమైన విష్ణువు.

ఇట్లు గురు, గురుఁడు, గురువు అనురీతిగా మూఁడు విధము లయిన రూపము లేర్పడును.

ఈసూత్ర మనవసరము. ఈసూత్రము విశేషముగా సాధించునది విష్ణు, గురు - అనురీతి రూపములు 'వా లుక్చ' యను పూర్వసూత్రమున వువర్ణకలోప విధానము చేతనె యీ రూపము లేర్పడును. గురు విష్ణు అను వువర్ణకము లోపించిన రూపము లా సూత్రము నొద్దవివృతిలో నుదాహరింపఁబడియు నున్నవి. ఇట్లు వువర్ణకలోపముచేఁ బూర్వ సూత్రము నొద్దనె యీ రూపములు సిద్ధించుచుండఁగా మఱల డుజ్జునకు లోప మేల చెప్పవలె?

---

1. డుజస్తథా. త్రి.శ.3.22.
డుజ్మహతోవోతః అం.కౌ.శ.63.
డుజ్మహత్సదానాంవా. అం.శ.చిం.అ.44.

వువర్ణకము వచ్చి లోపించుటచే లోపించిన పక్షము నందు డుబ్జు వచ్చుట కవకాశము లేదు. కావున వువర్ణకపక్షమున వువర్ణకముతోను, దాని లోపముతోను రెండు రూపములు గురువు – గురు. డుబ్జతో గురు(డు అనురీతిరూపములు సిద్ధించుటకు డుబ్జును విశేషముగా విధించుట యవసరము. చిం.ననుసరించి ఆం.కౌ. 'డుజ్మహతో వోతః' అని డుబ్జును విధించు టుచితముగా నున్నది.

వి. జైమినిభారతే – ఆదిపర్వణి ద్రౌపదీవరణానంతర
మర్జునం ప్రతి ధౌమ్యాచార్యస్తుతివాక్యమ్.

మ॥ కడ(క నీ్నవు సుయోధనాదుల మహాగర్వాంధులం గెల్చి రా
పడ(తిం దెచ్చితి పాండునందన, మహాబాహా! పృథాపుత్ర! యి
ప్పుడమిన్ నీ కెన యైనజేత గల(డే పూరుక్షితీశాన్వయే
శు(డు పాలాయెని వేమఱుం బొగడె హర్షోత్సాహము ల్మీఱ(గన్.
ఇత్యాది.

ఇందు 'మహాబాహా' యన్న దుదాహరణము మహాబాహుశబ్దమునకు డుబ్జు లోపించుటచే నేర్పడిన దన్నమాట. ఒకవేళ డుబ్జునకు లోపము వచ్చునన్నను నందు కిది సరి యైనయుదాహరణము గాదు. 'రామా' యనుదానింబట్టి రాము(డు అనుచోట డుబ్జ వికల్పముగా లోపించు ననుట యెట్లు? 'డుజో లుక్చ' యను సూత్రముచే నామంత్రణమున( బ్రత్యేకముగా డుబ్లోపము చెప్ప(బడినది గదా – రామా యైనట్లే మహాబాహా యనియు నగును. కాని యిచట విష్ణు(డు విష్ణా యగునా? యని ప్రశ్న. విష్ణా యనురీతిరూపము లనిష్టము లైన 'డుజో లుక్చ' యను సూత్రముచే నామంత్రణమున( బ్రత్యేకముగా డుబ్లోపము చెప్ప(బడినది గదా – రామా యని యైనట్లే మహా బాహా యని యునగును. కాని యచట విష్ణు(డు విష్ణా యగునా? యని ప్రశ్న. విష్ణా యనురీతిరూపము లనిష్టము లైన 'డుజో లుక్చ' యన్నది కృతకోదంతముల యెడనె యని నియమింతము. ఇచట డుబ్లోపముచే మహాబాహా యని యైన దని యెంచిన విష్ణా యని యేల గాదు? డుజోలుక్చ యనుదానిచే సహజోదంతముల డుజ్జేల లోపింపదు.

విష్ణూ యనియె యగునన్న మహాబాహూ యననియె యగును. మహాబాహూ యనుపాఠ మం దుందుచ్ఛేదకోర్లు డుక్ అను తర్వాతి సూత్రముచే లోపించు. డుజశ్చ యను దానిచే లోపించెననుట యెట్లు? ప్లుతః పుష్పదన్తస్య యని ప్లుత మగునందము. ఈపద్యము నందు గురు, అనురీతిగా డుబ్జు లోపించిన దనుటకు( దగిన యుదాహరణములే దనకతప్పదు. మహాబాహుః మహాబాహు(డు మహాబాహా యయ్యె. నిది యుదంత మనియె చెప్ప నక్కఱ లేదు.

## 63. డుజకో ర్లుగామన్త్రణే సోమచన్ద్రస్య.[1]

సోమచన్ద్రస్య = సోమచంద్రుని మతమున ఆమన్త్రణే = సంబోధనమున, ఉతః = ఉదంతములపైని, డుజకోః = డుజ్జునకును, అగాగమమునకును, లుక్ = లోప మగును.

వి. ఉదన్తస్య మహత స్సంబుద్ధౌ డుఙ్ప్రత్యయాగమ
యో ర్లోప స్స్యాత్సోమ చన్ద్రస్య మతే. పూర్వం
కణ్వమతే. ఓగురుఁడు, ఓబంధుఁడు (ఓగురుఁడ,
ఓబంధుఁడ) ఇతి స్థితే అనేన లుగ్విధాయక సూత్రేణ
డుజకో ర్లోపే ప్రాప్తే సతి – ఓగురు – ఓబంధు.

సోమచంద్రునిమతమున సంబోధనమునందు ఉకారాంతము లగు మహద్వాచకముల కంటెఁ బరమై యున్న డుఙ్ప్రత్యయమునకును అగాగమమునకును, లోపము వచ్చును. 'ఉతవు స్సర్వత్ర' యను సూత్రము నుండి ఉతః అనునది యిందనువర్తించును.

'డుజశ్చ' యను పూర్వ సూత్రముచే డుజ్జునకు లోపము సామన్యముగాఁ జెప్పఁబడినది. అది కణ్వనిమతము. ఇంక సోమచంద్రుని మతమున నామంత్రణమున మాత్రమె యుదంతమహత్తుల పైని డుజ్జు లోపించును. కావునఁబ్రథమయందు గురు అను తీరుగా సోమచంద్రుని మతమున నుండదు. కణ్వని మతమున నుండును.డుజ్జు తోపాటు దాని సంబోధనమునం దయిన అగాగమమును లోపించును.

గురు + సు అను,చో 'ఆమన్త్రణసుజసో ర్వాగారకౌ' యని అ.అగాగమమై గురు + సు + అ. 'మహతస్సోర్డుజనితః' గురు + డుజ్ + అ అని యుండఁగా నీ సూత్రముచే డుజ్జును అగాగమము రెండును లోపించి గురు అని యగును. ఓదామన్త్రణే ఓగురు. సంబోధనమునందు ఓగురు అని యుండుట లేదు. ఇది యసాధు వని పై సూత్రమున స్పష్ట మగు చున్నది.

'సోమచన్ద్రస్య' యనుటచేఁ బక్షాంతరము నందు డుజక్కులు లోపింపక ఓగురుఁడ అని యుండును.

వి. వుప్రత్యయలోపే ఓగురు – ఓగురువ –
అక్ప్రత్యయస్య వా పక్షే ఏవమ్ప్రయోగః ఓగురుఁడు, ఓగురుఁడ.

ప్రథమైకవచనమునం దయిన వు వర్ణకము 'వా లుక్చ' యను సూత్రముచే లోపింపగా

---

1. డుజతౌ తున – – ఆం.శ.చిం.ఆ.45.

ఓగురు అని యుండును. వుప్రత్యయము లోపింపని పక్షము నందు అగాగమము గూడ వచ్చిన పక్షమున ఓగురువ అని యగును. అగాగమము వికల్పము గావున రానిచో ఓగురువు అని యుండవలెను.

వువర్ణకలోప పక్షమున 'ఓగురు' అనియె వివృతి యందు జూపఁబడినది. ఇపుడు సూత్రమగాగమ మేల రాలేదు? వచ్చిన పక్షమునందు ఓగురవ అనియుఁ గావలెనే. దుజ్లుతో నగాగమమునకు సోమచంద్రుఁడు లోపము చెప్పెఁ గావున వాతని మతమున ఓగురు అని యుండును. కాని వువర్ణకము లోపించునన్న వారి పక్షమున నగాగమ మేల రాదు? 'ఆమన్త్రణసుజసో ర్వాఽ గారకౌ' యను సూత్రము నందలి వాశబ్దముచే విట నగాగమ మనలు రా దని వ్యవస్థ చేసి కొనవలె నేమో. ఇంకను గణ్వుఁడు 'దుజశ్చ' యని సాధారణముగ దుజ్లోపము చెప్పె. అక్కునకు లోపము చెప్పలేదు. కావునఁ గణ్వుని మతమునను అగాగమములో ఓగుర అని కా నక్కఱ లేదా?

ఓగుర, ఓగురు, ఓగురువు, ఓగురుఁడు అనురీతి వసాధువు లనక తప్పదు.

ఇతరలాక్షణి కుల మతములను సంగ్రహించుచో లక్షణము సమగ్రముగా బాషాపయోగిగాఁ జేసికొనక కలుపుట వలన ననర్థము శ్రీగ్రంథమునఁ బెక్కు వాటిల్లి యుండును. కణ్వాదుల వ్యాకరణములు దొరుకమింజేసి వాని పద్ధతి యేదో యామూలాగ్రము తెలియునవకాశము గానరాదు.

ఇచ్చట వివృతి 'అక్' ప్రత్యయ మనుట విచార్యము.

వి. బహువచనే ఆరక్ గురులార, బంధులార ఇత్యాది.

బహువచనము నందు జస్సునకు రావలసిన యారగాగమము వచ్చు గురులార మొ॥ ఆర వికల్పమనుట 'గురులు' అనియు (మధ్యమపురుష క్రియాన్వయము నందు ) నుండ వచ్చును.

## 64. ప్లుతః పుష్పదన్తస్య.[1]

ఉతః = ఉకారాంతములకు, ఆమన్త్రణే = సంబోధనమునందు, పుష్పదన్తస్య = పుష్పదంతుని మతము నందు, ప్లుతః = ప్లుత మగును.

---

1. ప్లుతహ్స్వత్వంబుద్ధావిత్యూతాంవిదుఃశేషిబ్ అం.క.వి౦.అ.45.
వాదిదు తాంప్లుతసంబుద్ధౌ అం.కౌ.క.64.

వృ. ఉదన్తస్య సంబుద్ధౌ ప్లుత స్స్యాత్పుష్పదన్తస్య
మతే – ఓ గురూ, ఓ బంధూ, ఓ మహాబాహూ[1],
ఓ జరత్కారూ, ఓ రత్నసానూ, ఓ పురుషమేరూ ఇత్యాది.

ఉకారాంతము లగుశబ్దములకు సంబోధనమునఁ బ్రథమైకవచనమునందు (ప్రథమైకవచనం సంబుద్ధిః) చివరి యుకారమునకుఁ బ్లుతమగు నని పుష్పదంతుని మతము. ఉకారమునకు బ్లుతమును విధించిన సామర్థ్యముచేఁ బైని డుజ్, వు, అగాగమములకు లోపము గల్గు గని గ్రహింపవలెను.

గురు + సు అని యుండఁగా 'ఆమన్త్రణసుజసో ర్వాఽగారకౌ' యనీ యగాగమము రాఁగా గురు + సు + అ ప్రస్తుత సూత్రముచే గురు శబ్దమునఁ దుదియుకారమునకుఁ బ్లుతము, ప్లుతవిధానము వలనఁ బైని సుప్రత్యయము నగాగమమును లోపింపఁగా గురూ3 అని యగును. పూర్వసూత్రముచే డుజక్కులు లోపింపఁగా మిగిలిన శబ్దమున నుత్వమునకుఁ బ్లుతమగు ననుటుచితము.

వి. సూత్రే ప్లుతగ్రహణాన్న తు హ్రస్వదీర్ఘౌ.

'ప్లుతః పుష్పదన్తస్య' అని సూత్రమునఁ బ్లుతమును విధించుటచే హ్రస్వ దీర్ఘములు లేవు కావున ఓగురు – అనురీతి రూపము లుండ వని యభిప్రాయము. దీర్ఘ నివారణము ప్రయోజనము లేని దనవచ్చును.

వి. అపి చ కేషాంచిత్ ప్రాచాం పక్షే ప్లుతగ్రహణాదేవ
డుజకో ర్లోపః. ఓగురు, ఓవిష్ణు ఇత్యేకం రూపం
స్యాదితి జ్ఞాతవ్యమ్ తదసాద్వేవ.

కొందఱు ప్రాచీనుల మతమునఁ బ్లుత విధానము వలననే డుజ్వర్ణకమునకు అగాగమమునకును లోపము వచ్చును. ఓగురు అనురీతి రూపము లుండవచ్చును. కాని యవి యసాధువులు.

ప్లుతమును, ప్లుతము లేనపుడు డుజ గాగమములు లేదా వు వర్ణకాగమములతోనే రూపము లుండుట ప్రసిద్ధలాక్షణిక సమ్మతమె కాక ప్రయోగానుగుణమై యున్నది.

ఉదంతములయెడ మాత్ర మెల్లరు వాకరిననుసరించి యొకరు ప్లుతమును చేర్కొనిరి.

---

1. ప్లుత స్స్యాత్సంబుద్ధావిత్యుతాం విదుః కేచిత్ ఆం.శ.చిం.ఆ.45.
వాదిదుతాం ప్లుతసంబుద్ధౌ ఆం.కౌ.శ.64.

దాని ప్రత్యేకత యేమియో నిర్ణయింపరాకున్నది. దీర్ఘముమాత్రమె చెప్పఁజాలు ననిపించు ద్వివిదోఽద్రావణన్య యని రావణుని మతమునఁ బ్లుతము లేకుండుటచే నిట్టి యెడలను దీర్ఘమె యని చెప్పవలసి యున్నది.

వి. అమహత్యక్ప్రత్యయస్య నిత్యత్వాదక్
ప్రత్యయేకృతే ఓమేరువ, ఓతరువ, ఓధేనువ ఇత్యాది.

ఆమన్త్రణసుజసో ర్వా గార్గ్యా యను సూత్రము నందలి వా శబ్దముచే నమహత్తుల కా యాగమములు నిత్య మని యట స్పష్టము చేయబడినది.. అక్ ఆగమ మని యట వివరించియు నిట అక్ప్రత్యయ మని వివృతికర్త వ్యవహరించుట విలక్షణ మై యున్నది.

ఏ మైన నమహత్తుల కగాగమము నిత్యమగుటవలన ఓమేరువ యనియే యుండును. ఓమేరువు అని యుండదు.

కాని యిచట అక్కు నిత్యమె గాని వువర్ణకమె నిత్యముగాదు. 'వాలుక్ప' యను సూత్రముచే వుప్రత్యయ మమహత్తుల పైని గూడ లోపింపవలెను గదా లోపింపఁజేసినపుడు నగాగమము నిత్యముగా నయి ఓతర, ఓమేర ఇత్యాదిగ గావలసి యుండును. వానిని గూర్చి వృత్తి యిట నేమియుఁ బ్రస్తావింపదయ్యెను.

'వా ళ్యే' యని ప్రథమై కవచనమునను వులోపము చెప్పుట వలన ఓవిష్ణ, ఓవిష్ణు, ఓతర అనువిధముగా నపరూపములు పెక్కు లగును. కాన నట్లు సామాన్యముగఁ జెప్పుట తగ దనియే నిర్ణయింపఁదగును.

వి. హ్రాదేస్త్రిష్వితి సూత్రేణ ఖలప్వాదీనా
మప్యుదన్తవత్ కార్యం స్యాదితి జ్ఞాతవ్యమ్.
ఖలపువు – ఖలపుఁడు – ఖలపు
సంబుద్ధౌ – ఓఖలపువు ఓఖలపుఁడు ఓఖలపుఁడ
ఓఖలపువ ఓఖలపూ – ఓఖలపు,
ఖలపుచేత, ఖలపువుకొఱకు, ఖలపువువలన,
ఖలపునకు, ఖలపునియందు ఇత్యాద.

హ్రాదే స్త్రిషు-అను సూత్రముచే ఆదీదూదంతముల దీర్ఘమునకు హ్రస్వము వచ్చును. ఇట్లు ఖలపూ మొద లగు ఊకారాంతశబ్దముల తుది దీర్ఘమునకు హ్రస్వము రాగా 'ఖలపు' ఇత్యాది పీయవి హ్రస్వాంతము లగును. ఇట్లు హ్రస్వము వచ్చుట వలన హ్రస్వాంతము

లయిన యీశబ్దములకు సహజముగా హ్రస్వోదంతము లయిన విష్ణు మొద లగు శబ్దములకు వలెనే రూపము లేర్పడును.

ప్రథమైకవచనమున 'ఉతోవు స్వర్వత్ర' యని వువర్ణక మైన - ఖలువు, 'హలుక్స' యని 'వు' లోపించిన ఖలు, 'మహత స్సోర్దు జనితః' అని డు జ్ఞయినఖలుడు అని మూఁడు రూపములు (విష్ణువు, విష్ణు విష్ణుఁ ననురీతిగా) ఇందు 'ఖలువు' అనురూప ముండ దనుట స్పష్టమె.

ఇతరవిభక్తులం దన్నచో వు, తల్లోపములతో ఖలువులు, ఖలువు లనురీతి నగును. ఇట్లె ఖలువు చేత వుక్ లోపింపఁగా ఖలు చేత ననుచో నిత్యప్రకృతి వుక్ లేదు గావున 'విష్టాదావప్రకృతేః' అని నివర్ణక మైన ఖలువుని చేత ననియు నగును. న టాదౌనిః కణ్వస్య యని నివర్ణకము రానిపక్షమున ఖలు చేత ననియు నుండును. ఇ ట్లితరము లూహింపఁదగును.

సంబోధనమున - సువిభక్తి కగాగమము రాని పక్షము నందు, ఓఖలువుడు ఓఖలువు అని యగును. ఇట్టి రూపము లుండవు. ఇవి యసాధువులు. అగాగమ మయిన ఖలువుఁడ, ఖలువ యను రూపములగు ఇవి యుచితములే. 'ప్లుతః పుష్పదన్తస్య' యని ప్లుత మైన ఖలూ - ఇదియు లక్షణ సమ్మతమె. దీర్ఘముగాఁ బ్రయోగప్రసిద్ధము ననఁదగు.

## 65. ఓతశ్చ[1]

ఓతః చ = ఓ కారాంతములకు సైతము పూర్వోక్తము లగు కార్యము లగును.

వి. ఓదన్తస్య వుసాది సర్వముప్య దన్తవత్కార్యం స్యాత్.
గోవు, గోవులు, గోవుచేత, గోవు కొఱకు, గోవు
వలన, గోవులకు, గోవు నందు, గోవులయందు,
ఓగోవు, ఓగోవ, ఓగోవులార ఇత్యాది.

ఓ కారాంతము లగు శబ్దములకు 'వుక్' మొదలగు కార్యము లుదంతములకువలెనె యగును. 'ఉత వు స్సర్వత్ర' మొదలుగా నుదంతములకుఁ జెప్పిన కార్యములే యోదంతములకు నగును.

ఓదంతము తెలుఁగున గోశబ్ద మొక్కటియె కలదు. అందుకే వృత్తియందు గోశబ్ద మొక్కటియె యుదాహరింపఁబడియున్నది. కావున 'ఓతః' అని సామాన్యముగాఁ జెప్పక గోశబ్దమున కని స్పష్టముగాఁ జెప్పు నవకాశము గలదు. చిన్నయసూరి 'ఉకారాంతగోశబ్దంబుల

1. ఉదోతోవున్సర్వత్ర. ఆం.కౌ.శ.62.

కంతట వువర్ణకం బగు' నని గోశబ్దమునకె చెప్పెను.

గోశబ్దముపైఁ బ్రథమైకవచన వివక్షలో సువిభక్తి యై గో + సు అని యుండఁగా నీ సూత్రముచే సుస్థానమున వుస్ ప్రత్యయ మై గోవు అని యగును.

'వుస్' నిత్యప్రకృతి గావున 'నిత్యస్సుపి చ' యను సూత్రము ననుసరించి యితర విభక్తులు పరముగా నున్నపుడు ప్రాతిపదికకు వచ్చి చేరును. గోవులు మొ॥

దీనికి, గో, గోలు అను రీతిగా వువర్ణకము లేని రూపములు లేవు కావున 'వా లుక్చ' యన్నది యిట వర్తింపదు.

వుస్సు వలన గోశబ్ద ముదంతమె యగుటచే ఉదంతములకు కువిభక్తి పరకతలో నగు 'న' వర్ణకము దీనికి వచ్చును. గోవునకు ఇట్లె సప్తమిలో నకారము మొ॥ గోవునందు గోవునుండి మొ॥

ఉదంతములకు వలె నగునది 'వుస్' అనునదొక్కటె కావున గోశబ్దమునకు వుస్సును విధించినఁ బైరూపము లెల్ల సిద్ధించెడివి. వా లుక్చ మొద లగునవి ప్రవర్తింప నక్కర లేకుండెడివి. అట్లు చేయవలసినది.

సంబోధనమున అగాగమము వచ్చిన గోవ బహువచనమున ఆరతో గోవులార వికల్ప మగుటచే అగాగమము రానందుకుఁ జూపిన 'ఓగోవు' అనురీతి రూపములు మృగ్యములు.

## 66.క్వచిన్ముల్లో వా లుక్.[1]

క్వచిత్ = కొన్ని యెడల, ములః = ముల్ ప్రత్యయమునకు, వా = వికల్పముగా, లుక్ లోప మగును.

వి. క్వచిత్ క్వచిత్ స్థలేషు కేషాంచిత్తత్సమానామ
దన్తానాం ముల్ ప్రత్యయస్య వికల్పేన లుక్ స్యాత్.
పాలన సేసె, శాసనము – శాసన, రక్షణ, వీక్షణ,
దండన, ఖండన, వితరణ, కీర్తన, రంజన, సంఘటన,
తర్జన, గర్జన, భర్జన, శిక్షణ, సంభాషణ, దూషణ,
పోషణ, ఉద్వాపన, వేదన, ఆరాధాన, వారణ, ఉద్వర్తన,
సంపాదన, వర్తన, బంధన, కల్యాణ ఇత్యాది.

---

[1] చరితాదికశబ్దానాం రూపంతూభయధా భవేత్ అ.కా.39.

కొన్నితత్సమాదంతశబ్దములకుఁ బైనున్నముల్ ప్రత్యయమునకు వికల్పముగా లోప మగును. 'ములతసోః క్లీబే' యను సూత్రముచే ముల్ప్రత్యయ మయి పాలనము అని కాఁగా నా ము వర్ణకమునకుఁ బ్రస్తుత సూత్రముచే లోపమయి 'పాలన' అని యగును. వా యనుటచే లోపము రాని పక్షము నందు పాలనము అని యుండును.

ములః అని సామాన్యముగాఁ జెప్పుటచేఁ బ్రథమై కవచనేతర విభక్తులు పర మగునపుడు 'నిత్యస్స్వపి చ' యను సూత్రముచే నయిన ముల్ప్రత్యయమునకును లోప మగును. కీర్తనలు, కీర్తనములు.

ఇట్టి ప్రథమై కవచనేతర స్థలములందును కీర్తన అను రీతి రూపములను సాధించుటకై సూత్రమున 'సు' విభక్తికిఁ గాక ముల్ప్రత్యయమునకు లోపము చెప్పఁబడిన దని గుర్తింపఁదగును.

వి. క్వచిత్ కిమ్? వదనము, రదనము, వచనము,
లోచనము, వ్యాఖ్యానము, వందనము
ఇత్యాదిషు న లుక్.

సూత్రమునందు 'క్వచిత్' అనుటచే నీలోపము కొన్ని శబ్దములయందే కావున 'వదనము' మున్నగుపెక్కు శబ్దములయందు 'ము' వర్ణకమునకు లోపము రాదు.వదన, వదనలు అనురీతి రూపము లుండవు.

క్వచిచ్ఛబ్దముచే చరిత్ర మొదలగు కొన్ని శబ్దములందే ములోపము వికల్పముగా నగును.

## 67. ధాత్రాదే రగుః.[1]

ధాత్రాదేః = ధాతృ మొద లగుశబ్దములయొక్క, ఉః = ఋకారము యొక్క స్థానమున, అక్ = అక్ అనునది యగును.

వి. ధాత్రాదిగణస్య ఋకారస్య అక్ప్రత్యయ స్స్యాత్.
కకారస్య, ఇత్వాల్లోపః. ధాత, త్రాత, నేత,
ధాతృ, త్రాతృ, నేతృ, గాతృ, జేతృ, దాతృ, హోతృ,
పోతృ, భ్రాతృ, యాతృ, శ్రోతృ, పాతృ పితృ,
కర్తృ, భర్తృ, ధర్తృ, ప్రష్టృ, త్వష్టృ, నేష్టృ, రాష్ట్రృ,

1. ఋదన్తస్య - - త్రి.శ.3.4. డాబృతః నై.చం.ఆ.72.
డాబవిధాత్రాదేరుః ఆం.శ.చిం.ఆ.48, ఆం.కౌ.శ.67.

క్షంతృ, రంతృ, స్వశృ, మాత్రాదయ ఇత్యాది
ర్ధాత్రాది గణః.

ధాతృ మొద లగు శబ్దముల యొక్క తుది ఋకారము స్థానమున 'అక్' అను ప్రత్యయ మగును. ప్రత్యయము పరముగా నవుట సాధారణము అయినను, ధాత్రాదేః అనియు ఉః అనుటచే ఋకారము స్థానముననే అక్ చేయు టొప్పును 'అక్' అనుచో కకార మిత్తు గావున లోపింపఁగా 'అ' కారము మాత్రమె యగును. ముల్యసక్ – మొద లగు సూత్రమున 'అక్' అని చెప్పఁబడుటయు వివృతి యందు అగంతకము నకు ధాత – ధాత లని యుదాహరింపఁ బడుటయు ననుసరించి యిచట విధింపఁబడినది అక్ ప్రత్యయమె యని నిర్ణయింపఁదగును. (వ్రాఁతప్రతిలో నస్పష్టముగ నున్నది)

'నిత్యస్సుపి చ' యను సూత్రముచే ని 'అక్' ప్రత్యయము ప్రథమైకవచనేతరము లగు విభక్తులు పర మగునపుడు నగును.

ధాతృ – ధాత – ధాతలు మొ॥ ధాతృ మొద లగు శబ్దములు కొన్ని వివృతి యందుఁ జూపఁబడినవి.

వీనికి అక్ప్రత్యయము నిత్యముగా విధించుటచే 'ధాతృఁడు' అనురూప ముండదు. వికృతివివేకము ధాతృఁ డను రూపము చెప్పినది. సూరియు నంగీకరించె. కాని కవి ప్రయోగములందు మాత్ర మట్లు గానరాకున్నది.

### 68. వా విధాత్రాదేః పుంసి.[1]

పుంసి = పురుష వాచకము లైయున్నట్టి; విధాత్రాదేః = విధాతృ మొదలగుశబ్దముల యొక్క, ఉః = ఋకారమునకు, వా = వికల్పముగా, అక్ = అక్ ప్రత్యయ మగును.

వి. విధాత్రాదిగణస్య వికల్పేన అక్స్యాత్పుంసి – విధాత,
దమిత, శమిత, విధాతృ, జామాతృ, ప్రశాస్తృ, ఉద్గాతృ,
కమితృ, గమితృ, దమితృ శమితృ, రమితృ, క్షమితృ
సవితృ, భవితృ, శయితృ, జంతృ, నియంత్రాదయః –
ఇత్యాది ర్విధాత్రాదిగణః

---

1. విధాత్రాదేర్వా. ఆం.కౌ.శ.67.
తస్యచవా. ఆం.శ.చిం.అ.49.
విధాతృగేతు. వై.చం.అ.73.

మహత్త్వాన విధాతృమొదల గు శబ్దములఋకారము యొక్క స్థానమునందు 'అక్' వికల్పముగా నగును. 'ముల్వ్యసగావక్' ఇత్యాదిసూత్రముచే 'అక్' నిత్యప్రకృతి కావున 'నిత్యస్స్వపి చ' యను సూత్రముచే నెల్ల విభక్తులయందు నగును. విధాతృ - విధాత - విధాతలు మొ॥

వి. వా కిమ్? 'మహతస్సోర్డుజనితః ఇతి
సూత్రేణ విధాతృఁడు, శమితృఁడు, సవితృఁడు,
దమితృఁడు.

సూత్రమునందు 'వా' యనుటచే అక్ప్రత్యయము వికల్పము కావున అక్ప్రత్యయము రాని పక్షమునందు "మహతస్సోర్డుజనితః' అనుసూత్రముచే డుప్రత్యయము వచ్చి విధాతృఁడు అని యగును. ఇట్లే సవితృఁడు మాంధాతృఁడు ఇతరవిభక్తులయందు విధాతృని, విధాతృనిచేత మొ॥

డుఙ్బుతోడి రూపాంతరమునకె యిట విధాత్రాదులకు 'అక్' వికల్పముగా జెప్పినట్లే మహదుదంతములకు వుస్ వికల్పముగాఁ జెప్పదగు.

విధాత్రాదులను లెక్కింటిని వివృతి యిటఁ బ్రదర్శించెను. కాని వికృతివివేకము 'విధాతా ధాతా దాతా సవితా నేతా చ వా డుజీ భవన్తి –వివిధాత్రాదిః' అని విధాతృ ధాతృ దాతృ సవితృ నేతృ శబ్దము లయిదు మాత్రమె విధాత్రాదుల లని నిర్ణయించెను. ధాతృశబ్దము ధాతృఁ డనురీతిగా డుఙ్బుతోఁ బ్రయోగింపఁబడలేదు. ధాత యనియే యుండును. కావున దీనికి డక్ ప్రత్యయము నిత్యముగనె వచ్చు నని చెప్పవలయును. కాఁగా నింతకు ముందు సూత్రమున 'ధాత్రాదేః' అని ధాతృ మొదల గు వానికి డక్ ప్రత్యయము నిత్యముగాఁ జెప్పు టుచితమె.

కాని డక్ ప్రత్యయము గాక డుప్రత్యయముతో రూపములు, విధాతృ, సవితృ మాంధాతృశబ్దములు మూటికి మాత్రమె లభ్య మగుచున్నట్లు విమర్శకులు గుర్తించిరి. కావున శమితృఁడు ఇత్యాది రూపములు లేకుండుటచే, శమిత యని మాత్రమె యుండుటచే విధాతృ, సవితృ, మాంధాతృ శబ్దముల కంటె వే ఱయిన ఋకారాంతశబ్దము లెల్ల ధాత్రాదులలో జేర్పఁదగినవే కాని విధాత్రాదులలోఁ జేరవు.

వి. పుంసి కిమ్? దుహిత.

సూత్రమునందు పుంసి యనుటచేఁ బురుషుని. బోధించునపుడే యనఁగా మహత్తగునపుడే 'డక్' వికల్పము. పురుషవాచకము గానిచో వికల్పము గాదు. 'దుహితృ' శబ్దము స్త్రీవాచకము గాదు. కావున 'పుంసి' యనుదళము ననుసరించి దాని కీసూత్రముచే డక్కు

వికల్పము గాదు. మఱేమగును. 'దుహిత' యని కావలె. ననఁగా డక్కు నిత్యమన్నమాట. అట్టి డక్కు త్వముగా వచ్చు, వానిని ధాత్రాదుల నేల చేర్పరాదు. నిత్యముగా డక్కగువానిని విధాత్రాదులలో నేల చేర్పవలె. దుహిత యన్నది సరియగు ప్రత్యుదాహరణము గాదు.

లక్ష్మి భాగ్యవిధాత వంటివానిని జూపు టొప్పును.

వైకల్పికముగా నయినవాని నుదాహరించుచున్నాఁడు.

వి. విధాత, విధాతృఁడు, విధాతలు, విధాతృలు,
విధాతచేత, విధాతృనిచేత, సవితకొఱకు, సవితృని
కొఱకు, జామాతలవలన, జామాతృలవలన,
ఉద్గాతలకు, ఉద్గాతృలకు, శమితలయందు, శమితృ
లయందు ఇత్యాది.
స్త్రీలింగే దుహిత, దుహితచేత, దుహితకొఱకు,
దుహితవల్ల, దుహితయందు ఇత్యాది.
పుంసి - ధాతలు, భ్రాతచేత, హోతకొఱకు, ధాతవల్ల,
క్షంతయందు ఇత్యాది.

విధాతృ మాంధాతృ సవితృశబ్దములు మూఁడు మాత్రమె విధాత్రాదు లనియు నితరము లగు ఋకారాంతము లెల్ల ధాత్రాదులె యనియు వానికి డక్ ప్రత్యయము నిత్య మనియు నింతకు ముందు గుర్తించియున్నారము.

వివృతియందుఁ బైనిజూపఁబడినవానిలో - ధాత్రాదులలో - ధాతృ భ్రాతృ ప్రభృతులు పురుషవాచకములు దుహితృప్రభృతులు స్త్రీవాచకములు అనియె యర్థము గలిగిన వైనను ధాత్రాదులలోఁ బరిగణింపఁబడినచో డక్కు నిత్యమె.

## 69. రోరాయః కణ్వస్య.[1]

కణ్వస్య = కణ్వునిమతమున, రాయః = రైయను శబ్దమునకు, రో = రో అనునది వచ్చును.

వి. రైశబ్దస్య రో ఇతి సర్వాదేశస్స్యాద్దేశ్యే కణ్వస్య మతే.

కణ్వునిమతమున 'రై' శబ్దమునకు 'రో' అనునది సర్వాదేశ మగును. అనఁగా రై అనుదానికి

1. అనాహో రైనావో: అం.కౌ.శ.71, వై.చం.అ.76.
స్త్రీఁవాహో రైనావో: అం.శ.చిం.అ.63.

మొత్తమునకును 'రో' యనున దాదేశ మగును. 'రో' అనేకా ల్లగుటచే (ర్,ఓ) అనే కాల్ శిత్ సర్వస్య యను పాణినీయ పరిభాషననుసరించి 'రై' యనుదానికి మొత్తమునకు రోనాదేశముగా వచ్చును.

'కృణ్యాస్య' యనుటచే నిది యొకపక్షము గావున బక్షాంతరమందు 'రో' ఆదేశము రాక 'రై' అని యై కారాంతశబ్ద మట్లే యుండును.

ఈ రో శబ్దమును గూర్చి వివృతియందుఁ బెద్దవివాదము నడచినది.

రై శబ్దమున కాదేశ మయిన రో శబ్దము దేశ్య మని వివృతి తలఁచినట్లు తోఁచును.

౨. రోశబ్ద రైశబ్దయో రవ్యయత్వా త్త్రిలింగ
భాషాయాం, రోయింతి, (రోరెట్టు?) రోవెలఁది,
రోతొడవులు.

తెనుఁగున రోరై శబ్దము లవ్యయములు కావున రోయింతి ఇత్యాదు లగు సమాసరూపము లున్నవి.

ఇవి యవ్యయము లనుట గుదురదు. రైని రైకి ఇత్యాదిగా నిద్దానికి విభక్త్యంతరూపము లుండును. 'రోయింతి' ఇత్యాదుల నున్నది 'రై' కాదేశ మైన రోశబ్దము గాదు. రై కాదేశమైన రో శబ్దము సంస్కృతసమము.

తెలుఁగున 'రోయి' అనుశబ్దము వే ఱొకటి గలదు. రోతిని, రోతుల నురీతి నవుటను జిన్నయసూరి ప్రస్తావించెను. (విభక్తిపరం బగునపుడు గోయి ప్రతభృతుల తుదియక్షరంబు తివర్ణకం బగు.)

కావునఁ దెలుఁగునందలి 'రోయి' శబ్దమును సంస్కృతసమము లగు రై, రో శబ్దములను గలుపుపొరపాటు. రోతొడవు లనుదానికిఁ బ్రయోగము.

౩. అపిచ – అథర్వణభారతే – ద్రౌపదీవివాహే –
సఖం ప్రత్యర్జునవాక్యమ్.
ఆతటి నెచ్చెలి కిచ్చిన
రోతొడవులు దొడిగె నాసరోజ దళాక్షి
కౌతుకముగఁ జెప్పుము వినఁ
బ్రీతి జనించెడిని దన హృదయంబునకున్.
ఇతిప్రయోగస్య విద్యమానత్వాచ్చ.

పై పద్యమున రోతొడవు అను శబ్ద మధర్వణుని చేఁ బ్రయుక్తము. రోతొడవు అనుచో 'రో' వర్ణకమునకు 'సరోజ' అనుచోటి 'రో' తోడియతియు తొడవు అనుచోటి తకారము ప్రాసనుబట్టియు రోతొడవు అనుశబ్దము గలదనుట కిది ప్రబల మైన ప్రమాణ మగుచున్నది.

వి. కిఞ్చ - అన్నంభట్టారకవ్యాకరణే రైశబ్దస్య "స్తోవావౌరైనావో" రితి బార్హస్పత్యసూత్రస్య ప్రయోగాచ్చ - రో ఇతిదేశ్యరూపమ్.

ఇంకను అన్నంభట్టారకుని వ్యాకరణమునందు 'స్తోవావౌరైనావోః' అను బృహస్పతి వ్యాకరణసూత్ర ముండుటను బట్టియు - రోశబ్దము గల దనుట ప్రమాణ మని తాత్పర్యము. 'స్తోవావౌరైనావోః' అనునది రైశబ్దమున (ఐకారమునకు) ఓత్వమును విధించుచు 'రో' యనురూపమును సాధించుచున్నది. కావునఁ దెలుఁగున రోశబ్దము గల దనుట కిదియు (లక్షణ) ప్రమాణము.

'స్తోవావౌరైనావోః' అను సూత్ర మాంధ్రశబ్దచింతామణిలోఁ గలదు. చింతామణి నన్నయ భట్టారకుని వ్యాకరణముగాఁ బ్రసిద్ధమె. నన్నయ భట్టారకుఁ డన్నం భట్టారకుఁ డగుట య ట్లుంచి అందలి 'స్తోవావౌరైనావోః' బృహస్పతి (వ్యాకరణ) సూత్ర మనుట విశేషము.

అధర్వణని ప్రయోగము, స్తోవావౌరైనావోః అను సూత్రమును దెలుఁగున రోశబ్దము గల దని నిరూపింపఁగలవు కాని యది దేశ్యరూప మని వివృతి పేర్కొనుట విచార్యము. సంస్కృతమున కాదేశ మైన లేదా సంస్కృతశబ్దమునందు వర్ణవికారములచే నేర్పడిన యీశబ్దము దేశ్య మగుట యెట్లు? సంస్కృతసమముగాక తప్పదు.

వి. అపి చ అధర్వణవ్యాకరణే "ఐదన్తానా మిదన్తవ దితి రావణీయసూత్ర మధర్వణాచార్యే ణోక్తత్వాత్. రయి , రయిని, రయిచేత, రయి కొఱకు, రయివల్ల, రయికి, రయియందు ఇత్యేవం రూపసిద్ధే స్సుప్రయోగ ఏవ రయిశబ్దః

రో యనియె కాక 'రయి' యనియు దీనికి రూపము గల దని యిట వివృతి నిరూపించుచున్నది.

అధర్వణుఁడు తనవ్యాకరణములో (త్రిలింగ శబ్దానుశాసనము) 'ఐదన్తానామిదన్తవత్' -

---

1 త్రి.శ.3.32.

(3వకాండ 22శ్లో) అను రావణుని సూత్రము నంగీకరించి పేర్కొనెను. ఇట్లు ఐకారాంతము ఇకారాంతము వంటి దగు ననుట వలన రై అనునైదంతము 'రయి' అని ఇకారాంత మగును. రయిని రయిచేత మొద లగు రీతిగా నాయా విభక్తులయందు రూపముల నందును. కావున నథర్వణుని మతము ననుసరించి 'రయి' అని యిదంతముగా నేర్పడిన శబ్దమును 'సుప్రయోగమె' యవును.

ఇట్లు 'రై'కి 'రయి' యను రూపాంతర మగుచున్నది. దీనింబట్టి యిది దేశ్య మని యుదేశ్యమేమో. కై.కయి. వివృతి చేసిన పై సమన్వయము సరి కాదనుట ప్రసిద్ధమె. 'ఐదన్తానమిదంతవత్' అనఁగా నైదంతశబ్ద మిదంత మగుట యెట్లు? ఐదంత మయిన శబ్దమున కి దంతమునకువలె నాయయి కార్యము లగును. హరిని - రైని, హరికి - రైకి మొ॥ అంతే గాని ఐదంత మిదంత మె ట్లగును. అట్లె యవుట నుద్దేశించిన - రై - ఐకారాంతము అది ఇకారాంత మైన 'రి' యగును 'రయి' అని యగు టెట్లు? కవిప్రయోగములకు నిది విరుద్ధ మనక తీఱదు - రయి శబ్ద మంగీకార్యము గాదు.

ఇంక 'రే' యను నేకారాంతశబ్దస్థితిని గూర్చి వివృతి పేర్కొనుచున్నది.

వి. సంస్కృతే రే శబ్దరైశబ్దయోరపి ద్రవ్యావాచక
త్వాదాంధ్రే తత్సతజ్జదేశ్యేష్వపి రేశబ్దస్యాపి
ప్రయోగస్య విద్యమానత్వాత్, రేవాన్ -
రేవతీ, రేవంతుఁడు, రేఁడు, ఇత్యేవం ప్రయోగస్య
ప్రసిద్ధతయా -

1.సంస్కృతమునందు రే-రై అనునవి రెండును ద్రవ్యము (ధనము)ను బోధించున వై యున్నవి. 2. అట్లె తత్సతద్భవదేశ్యాత్మక మయిన తెలుఁగుభాషలోను గూడ 'రే' అనుశబ్దము యొక్క ప్రయోగము గలదు. 3.రేవాన్, రేవతీ యనురీతిగా సంస్కృతమునను, రేవంతుఁడు రేఁడు మొద లగు రీతిగాఁ దెలుఁగునను 'రే' యనుశబ్దము ప్రసిద్ధము.

కావున 'రై' యనుశబ్దముయొక్క యర్థమున (రో రయి యనువానితోపాటు) 'రే' యను శబ్ద మిక్కొకటి తెలుఁగునను గల దని తాత్పర్యము.

వివృతికారుని యీకల్పనమునకుఁ దగిన ప్రయోగప్రమాణము వెదుకవలసియున్నది. వివృతికర్తయె చూపినది ప్రమాణముగా లేకుంట పైని గమనింతము.మొత్తముపైయంశములను సంగ్రహించి రూపములను బ్రదర్శించుచున్నాఁడు వివృతికర్త.

వి. రోశబ్దస్య అవ్యయత్వాత్, రేశబ్ద
రైశబ్దయోర్నిత్యైకవచనాచ్చ -
రే - రేను - రేచేత - రేకొఱకు - రేవలన - రేకు - రేయందు,
రై -రైని - రైచేత - రైకొఱకు - రైవలన - రైకి - రైయందు
ఇత్యేవం రేశబ్ద రైశబ్దయోరపి రూపసిద్ధిః.

రోశబ్దము అవ్యయము కావున రోలు - రోను రోచేతనను రీతిగా దానికి వివిధవిభక్త్యంత రూపము లుండవు. ఎల్లెడల 'రో' యని మాత్రమె యుండును.

రే, రై యనుశబ్దములు నిత్యైకవచనాంతములు - కావున నేవిభక్తి యం దయినను నేకవచనము తోనే రూపము - రేశబ్దమునకు - రే (ప్రథమ) రేను (ద్వితీయ) రేచేత (తృతీయ) మొ॥ రైశబ్దమునకు - రై (ప్రథమ) రైని (ద్వితీయ) రైచేత - (తృతీయ) మొ।
।

రోశబ్ద రైశబ్దయోరవ్యయత్వా త్తని యింతకు ముం దీవృతి యందే చెప్పఁబడినది. రోను రోచేత ననురీతిరూపము లుండరాదనుటకుఁ దగిన యాధారము లేదు. ఇంక రే రేను - అనురీతిని - మృగ్యములు -

అయినను బ్రసిద్ధములే యని యి ట్లనుచున్నాఁడు వివృతికారుఁడు.

వి. ఆంధ్రభాషాయామపి ప్రసిద్ధౌ - రేవేటు,
రేయీవి, రేవెలఁది, రైవేటు, రైయీవి, రైవెలఁది,
రయివేటు, రయియీవి, రయివెలఁది ఇత్యాది.
రే - రై - (రయి) యనునవి
యాంధ్రభాషలోను బ్రసిద్ధములే రేయీవి, రైయీని
రయియీవి మొ॥ రైయీవి ప్రసిద్ధము గావచ్చును
రేయీవి, రయియీవి కలవా?

అందుకుఁ బ్రయోగము చూపుచున్నాఁడు.

వి. నాచనసోమయాజి కృతే? కృష్ణవిలాసే
రుక్మిణీవాక్యమ్ -
నావంటిదాని నెంచక

నేవంచన సేసిపోయి వృష్ణికులుఁడు స
త్యావనిత యింట నరెరే
వావులు గురిసె నట హరిణనయనా వినవే
ఇత్యేవమాంధ్రీయరేశబ్దస్యాపి మహాకవిప్రమో
గేషు విద్యమానత్వాత్ - రోశబ్దరేశబ్దరయి
శబ్దాస్త్రయోఽపి రైశబ్దార్థకా ఏవ.

వాచనసోముని ప్రయోగమున 'రే' శబ్దమును నిర్ధారించు స్థలము గానరాదు. నాల్గవపాదమున యతిమైత్రి కనఁబడదు (వావులు - నావులు? వాలోనః?)

ఏ మయినను రై, రయి, రే, రో యనునవి సమానము లని వివృతికర్త భావించినట్లు మాత్రము స్పష్టము. రై,రో శబ్దములు సంస్కృతసమములు. అచ్చికము రోయి - ప్రసిద్ధములు. మిగిలిన యంశములు విచార్యములు.

ఇంతయు ననవసరమైనచర్చయే యనవచ్చును ఇంకఁ ప్రకృతమునకు వచ్చిన -

రై శబ్దమునకుఁ గణ్వునిమతమున రో యనునాదేశము రో - రోలు, రోను మొ॥

కణ్వస్య యనుటచేఁ బక్షాంతరమున 'రో' ఆదేశము లేనిచో రై అని యట్లే యుండును

'ఐదన్తామిదన్తవత్' అను నథర్వణుని లక్షణమును బట్టి రైని రైకి మొ॥

వి. ప్రకృతే -

ఇంకఁ ప్రకృతమునకు వచ్చిన -

## 70. ఆవఙ్నావః.[1]

నావః = 'నౌ' అనుశబ్దమునకు, ఆవక్ = ఆవక్ అనునది యగును.

వి. నౌశబ్ద(స్యాన్త్య)స్య ఆవ (ఆదేశః) స్యాత్.

నౌ + ఆవ = నావ - పరరూపం సన్ధిః నావ - నావచేత

నావ దెప్పించి, నావయొక్క.

---

1. అవావైరైనావో ఆం.కౌ.శ.71
   స్త్రోహావైరైనావో ఆం.శ.చిం.అ.62

నౌ శబ్దమునకు ఆవక్ అనునది యగును. నౌ + ఆవ + అనుచోఁ బరరూప మగు సన్ధి జరిగి నావ యని యగును. ఇది స్త్రీలింగశబ్దము గావున 'స్త్రియామనుతస్సుః' అనుసూత్రముచే సుప్రత్యయము లోపించును. నావ.

ముల్యసగవగావక్ - అను సూత్రముచే 'ఆవక్' నిత్యప్రకృతి సంజ్ఞ గలది. కావున 'నిత్యస్సుపి చ' యను సూత్రముచే నెల్ల విభక్తుల యందు నగును.

నౌ + జస్ - నావ + జస్ - నావలు మొ॥

వ్రాతప్రతి యందు అన్తస్య యనియు ఆవజాదేశః అనియు నుండుట ప్రమాదము. 'అన్త్యస్య ఆదేశం' అనుచో 'ఔ' కారమున కావ యాదేశము గావలెను. పిదప వివృతి 'నౌ + ఆవ' యని చూపి పరరూపసంధి యగు నని వివరించినది. ఆదేశ మైనపుడు సంధి ప్రసంగ మెట్లు? ఆవక్ + నావః - ఆవజ్నవః అని యవును. ఇందు విధింపఁబడిన 'ఆవజ్' అని జిత్తుగా వివృతియందు వ్రాతప్రతిలో నుండుటయుఁ బ్రమాదమే. జీ త్తగుట వలన నిట 'జిదనుస్వారశ్చ' యని బిందువు వచ్చుట లేదు. 'ముల్యసగావక్' - అను సూత్రమునను, అచటి వివృతిలోను ఇది 'ఆవక్' అని కిత్తుగానే చెప్పఁబడినది. 'కి త్తగుట వలన' 'ఆద్యన్తౌటకితౌ' యని యంత్యావయవముగా నాగమ మగును. అప్డు నౌ + ఆవ నావ పరరూపం సన్ధిః అను వివృతియందలి వివరణమును సందర్భపడును. 'ఆవ' య నేకాల్లు గాఁగా (జివరి వర్ణమున కని సూత్రమునఁ బ్రత్యేకముగాఁ జెప్పఁబడకుండుటచే 'నౌ'శబ్దమునకు సర్వాదేశముగా రావసి యుండును. 'రో రాయః' అనుచో రైశబ్దమునకు మొత్తమునకు 'రో' యగుటకుఁ గారణము 'రో' యనునది యనేకా ల్లగుటయే కదా. అట్లే యిటఁగూడ ననేకాల్లగు 'ఆవ' నౌ శబ్దమునకు మొత్తమున కాదేశము గావలసి యుండును. 'ఆవక్' అని కిత్తుగా గ్రహించుటలో నాయిబ్బందియు నుండదు. (పరరూపసంధియె విశేషము అపదాదిస్వరపరకతలో నది సాధారణమె)

## 71.జివన్నావః పుష్పదన్తస్య.[1]

పుష్పదన్తస్య = పుష్పదంతుని మతము నందు, నావః = నౌ శబ్దమునకు, జివత్ = సంస్కృతమందలి సప్తమ్యేకవచనాంతముతో సమ మైనరూప మగును.

వి. నౌశబ్దస్య సంస్కృతసప్తమ్యేకవచనవద్రూపం
స్యాత్పుష్పదన్తస్య మతే. నావి, నావిచేత, నావి
వల్ల, నావి యొక్క.

1. ద్యౌ భూనావాం జివద్రూపమ్. త్రి.శ.4.83.

పుష్పదంతుని మతమునందు 'నౌ' శబ్దమునకు సంస్కృతమందలి సప్తమ్యేకవచనాంతరూపముతో సమాన మైన రూపము తెలుఁగునఁ బ్రాతిపదికముగా నిలుచును. 'జి' అనునది సంస్కృతమందలి సప్తమ్యేకవచనము గావున 'జ్యంతవద్రూపమనఁగా సప్తమ్యేకవచనాంతము వంటి రూప మగు నని యర్థమయినది. 'నౌ' శబ్దమునకు సంస్కృతమున సప్తమ్యేకవచనమునందు 'నావి' యని రూప మగును. కావున నట్టి దగు 'నావి' యనునది యీసూత్రముచేఁ దెలుఁగునఁ బ్రాతిపదికమగును. ఇది యిదంత మైనది గావున 'సోర్లుగితః' అనుసూత్రముచే దీనిపైని 'సు' విభక్తి లోపించును. ఇట్లే యితర విభక్తుల యందు నావిని నీవిచేత మొ॥.

'శేషేయొక్కః' అనుసూత్రము నొద్ద యొక్క ప్రత్యయాంత ముదాహరింపలేదు 'ప్రయోగానర్హశ్చ' యని యది ప్రయోగింపఁదగ దని కావచ్చును. కాని యిట 'నావియొక్క' యని యొక్క ప్రత్యయాంతము దాహృతము కావ్యేతరము గావున నుండవచ్చు నని యుద్దేశము గావలె. అయిన 'శేషే యొక్కః' అనుచో గూడ నుదాహరింపవచ్చును.

'నావి'కిఁ గవి ప్రయోగముః

వి. అథర్వణ భారతే – ఆరణ్యపర్వణి –
నయమార రాఘవుఁడు నా
వి యెక్కి వడి దాటె జాహ్నవీ శైవలినిన్
జయజయ యని వినువీధుల
వియచ్చరులు సన్నుతింప వేడుకతోడన్ – ఇత్యాది.

'నావి' యను చోటి 'వి' వర్ణమునకు 'జాహ్నవీ' – యనుచోటి 'వీ' వర్ణముతో నీయథర్వణునిపద్యమున యతి చెల్లింపఁబడినది. యతి స్థలమునఁ గూర్పఁబడుటచే నిది ప్రబల మైన ప్రమాణము.

సూరి 'నావి యనియుఁ గొందఱు నాదేశంబగు నం' డని మాత్రము చెప్పి యూరుకొనెను.

'పుష్పదన్తస్య' యనుటచే నిది యొకని మతము కావున మతాంతమయినందు ఆవజ్ఞావస్య - నావ.

ఇట్లు నావ, నావి యని రెండు రూపములు నేర్పడుచున్నవి.

## 72. భూద్యోదివాం చ[1]

భూద్యోదివాం చ = భూ ద్యో దివ్ శబ్దములకుఁ గూడఁ జీవత్ = సంస్కృత సప్తమ్యేకవచనాంతములతోఁ దుల్య మయిన రూప మగును.

'జీవన్నావః పుష్పదన్తస్య' యను పూర్వసూత్రమునుండి 'జీవత్' అనునది యిందనువర్తించును.

వి. భూశబ్ద ద్యోశబ్ద దివ్‌శబ్దానాం చ సంస్కృతసప్తమ్యేకవచనవద్రూపాణి స్యుః భువి – దివి.

భూశబ్దమునకు, ద్యో దివ్ శబ్దములకును సంస్కృతమున సప్తమీవిభక్తి యేకవచనమునందున్న రూపములతో సమానమైన యాకారములు గల శబ్దములు తెలుఁగునఁ బ్రాతిపదికలుగా నిలుచును. భూశబ్దమునకు 'బువి' యనియు, ద్యో దివ్ శబ్దములకు 'దివి' యనియు సంస్కృతమున సప్తమ్యేకవచనము నందు రూపము లుండును. కావున వానితోఁ దుల్యములగు భువి దివి యనునవి యీ సూత్రముచేఁ దెలుఁగునఁ బ్రాతిపదికలుగా నిలుచును. ఇవి యిదంతములైనవి గావున 'సోఽల్లిగతః' అను సూత్రముచే 'సు' లోప మగును. భువి – దివి ఇట్లె యితర విభక్తులలో భువిని దివిచేత బహుత్వమున 'ఉద్బహుత్వే' యని యుత్వము రాఁగా భువులు దివులన్ మొ॥

'దివి' యను నొక్క రూపమును సాధించుటకు ద్యోదివ్ శబ్దములు రెండింటిని గ్రహింపనక్కరలేదు.

వీనికిఁ బ్రయోగము.

వి. శ్రీకంఠ రామాయణే

భువిఁ బుట్టి పేఁచ మణఁచెను
దివిజారాతుల దినేశ దీప్తు లడరన్‌రా
ఘవుఁ డనుచు మునులుఁ బొగడిరి
దివిని దివౌకసులు వొగడి మిగుల దీవించి రొగిన్ – ఇతి చ.

మొదటి పాదమున భువిని బుట్టి యనుచో 'భువి' శబ్దమును, దివిని దివౌకసు లనుచో నాల్గవపాదమున 'దివి' శబ్దమును బ్రయుక్తములు. ప్రాసఘటితములై యున్న వివి. ఒకే

1. జీవ ద్భూదివోః. ఆం.కౌ.శ.79.
   ద్యోభూనావాం జీవద్రూపమ్. త్రి.శ.4.23.

పద్యమున రెండింటికిని బ్రయోగము లభ్య మైనది.

## 73. గ్లౌః స్త్రీవత్.[1]

గ్లౌః = 'గ్లౌ' యను శబ్దము, స్త్రీవత్ = స్త్రీ లింగము వంటి దగును.

వి. గ్లౌ శబ్దః స్త్రీ లింగవత్ స్యాత్. సులోపః గ్లౌ – గ్లౌను,
గ్లౌచేత, గ్లౌవలన, గ్లౌనకు, గ్లౌనందు, గ్లౌయుదయించె.

'గ్లౌ' శబ్దము స్త్రీ లింగము వంటి దగును. ఇది పుంలింగ మగుటచే మహత్కార్యములు ప్రాప్తము లవుచుండఁగా నిట స్త్రీవత్త్వము చెప్పఁబడినది. దీనివలన నీశబ్దమునకు మహత్కార్యములు రావు. 'స్త్రీ యామనుతస్సాం' అనుసూత్రముచే దీనిపైని సువిభక్తి లోపించును. గ్లౌ.

ఇట్లే ద్వితీయైకవచనమున 'మహతోనిరమః' అని నివర్ణకము రాదు. రమను ఇత్యాది స్త్రీ లింగ శబ్దముల వలె గ్లౌను అని యగును. 'నిష్ఠాదావప్రకృతేః' అను సూత్రము విధించిన నివర్ణకము రాదు. రమచేత, ననురీతిగా గ్లౌచేత నని యగును.

గ్లౌనకు, గ్లౌనందు అనుచో వివృతియందు నకారము చూపఁబడినది. అట్టి రూపమును గవిపై ప్రయోగములందు వెదుకవలసి యున్నది. గ్లౌకు, గ్లౌయందు ననియె సూరిప్రభృతుల మతమున నెన్నవలసి యున్నది.

దీనికిఁ బ్రయోగము

వి. మొల్లరామాయణే – బాలకాండే –
యజ్ఞ సంరక్షణంబు సేయఁ దనుభవుని
సూర్యవంశాంబుధి గ్లౌ నవార్యబలుని
రాము నప్పగించెను దశరథుఁడు మౌని
చేత సౌమిత్రితోఁ గూడఁ జిత్తమలర – ఇత్యాది.

ఇచ్చట 'గ్లౌను' అని గ్లౌ శబ్దము ద్వితీయాంతము ప్రయుక్తము.

కాని యిది ప్రబలము గాదు. రాము నవార్యబలుని అని యవునట్లు 'లుక్కాన్యస్య' యని నివర్ణకము లోపించున దన్నను సరిపోవును. కావున 'గ్లౌ' యను ప్రథమాంతమును జూపిన మిక్కిలి బలవంత మై యుండును.

---

1. స్త్రీవద్గ్లౌః ఆం.కౌ.శ.78, ఆం.శ.చిం.అ.63.

## 74. ములతస్సోః క్లీబే.[1]

క్లీబే = నపుంసకలింగము అయిన, అతః = అదంతము అగు శబ్దములకుఁ బరమై యున్న, సోః = సుప్రత్యయము యొక్క స్థానమున, ముల్ = 'ముల్' అను ప్రత్యయ మగును.

వి. అదన్తస్య సోర్ముల్ ప్రత్యయస్స్యాత్ క్లీబే.
వనము, ధనము, కులము.

హ్రస్వ మయిన యకారము చివరఁ గలిగిన నపుంసకలింగశబ్దములకుఁ బరముగా నున్నట్టి ప్రథమైకవచన మగు సుప్రత్యయము యొక్క స్థానమునందు 'ముల్' ప్రత్యయమగును. 'ముల్' అనుదానిలో 'ల' కార మిత్తు కావున లోపించును. 'ము' అనునదే నిలుచును.

సూత్రము నందలి క్లీబ శబ్దము. అమహత్పర్యాయము. మహత్తనుటకు 'పుంసి' యనుట వంటిదే యిది యని గ్రహింపఁదగును. కావున శబ్దము పుంలింగ మైన నమహత్తయినచో ముప్రత్యయమె యగును.

వన శబ్దముపైఁ బ్రథమైకవచనవివక్షయందు సుప్రత్యయ మయి వన + సు అని యుండఁగాఁ బ్రస్తుత సూత్రముచే 'సు' స్థానమున ముప్రత్యయ మయి 'వనము' అని యగును. ఇట్లె ధనము కులము మొ॥

వి. 'నిత్యస్సుపి' చేతి సూత్రేణ జసాదిషు పరేషు
ములి కృతే. వనములు, వనములచేత, వనమునకు,
వనమునందు ఇత్యాది.

ముల్వసగిత్యాది సూత్రముచే 'ముల్' ప్రత్యయమునకు నిత్యప్రకృతి యని సంజ్ఞ. కావున 'నిత్యస్సుపిచ' యను సూత్రముచే నీముప్రత్యయము ప్రథమైకవచనేతర విభక్తులు పరముగా నున్నను ప్రాతిపదికకుఁ బరముగా నగును. సుస్థానమునఁ బ్రస్తుతసూత్రము విధించినది. కావున జస్ మొద లగు విభక్తు లనఁగా బ్రథమాబహువచనము మొద లయిన విభక్తులుపర మైనపుడు 'నిత్యస్సుపి చ' యను సూత్రముచే నగును.

వన + జస్ 'నిత్యస్సుపి చ' యను దాని ననుసరించి ప్రస్తుత సూత్రముచే వనము + జస్ లుజసః వనములు – ఇట్లే వనమును మొ॥

---

1. నపుంసకే ముసోము స్స్యాత్. త్రి.శ. 3.28.
అమహ తస్సోర్ముః. అం.కౌ.శ.44.
స్యాదమహతాం విభక్తౌ సోశ్చము. ఆం.శ.చిం.అ.34.

ముల్ప్రత్యయముచే నుదంత మగును గావున నపుడు కు, అందు పరకత్వమున నకారము వచ్చును. వనమునకు, వనమునందును

## 75. అదేర్మ్మో ర్మ్మ బూ పుష్పదన్తస్య.[1]

పుష్పదన్తస్య = పుష్పదంతునిమతమునందు, అదేః = దీర్ఘము గాని యనఁగా హ్రస్వము కంటెఁ బరముగా నున్న ముపర్ణకముపై దిరిగి, ముబూ = ము, అనునదియు, బు అనునదియు నగును.

ఏ. అదీర్ఘాక్షరాత్పరస్యాముపర్ణకాత్పరతః పున
ర్మ్మబు వర్ణకౌ స్తః పుష్పదన్తస్య మతే. వనముము,

వనము – బు, ఇతి స్థితే – పుష్పదంతుని మతమునందు – హ్రస్వముకంటెఁ బరముగా నున్న ముపర్ణకముపై మఱల ము, బు అనునవి చేరును. ఇవి రెండును ముపర్ణముపైనె రావలయును గావున, నొకటి రానపుడె రెండవ దగును.

వనము అనుచో హ్రస్వముపై నున్నము పర్ణకముపై నీసూత్రముచే నిం కొక ముపర్ణము వచ్చి వనముము అని యగును.

బు వర్ణము వచ్చినచో వనము బు అని యగును ఇట్టియెడల.

## 76. ముబ్వో రనుస్వారః.[2]

ముబ్వోః = ముబులు పర మగుచుండఁగా ఁబూర్వమునందలి, మోః = ము వర్ణకము యొక్క స్థానమున, అనుస్వారః = అనుస్వార మగును.

'అదేర్మ్మోర్మ్మబూపుష్పదన్తస్య' యను పూర్వసూత్రము నుండి మోః అనునది యిం దనువర్తించును.

---

1. ముమ్ముంబు నవ్యకోఽమహత్వ్య.వై.చం.అ.23
అదీర్ఘాన్మోర్మ్మంబువర్ణే, త్రి.శ.4.37
ముబుమోరాచార్యాణామ్, నదీర్ఘాన్మోః ఆం.కౌ.శ.46, 48
తదుపరి పునర్మ్మబూప్రాచామ్ ఆం.శ.చిం.అ.35

2. ముబ్వోరనుస్వారః ప్రాచామ్. ఆం.కౌ.శ.47.
జాపరేముస్యబిన్దుస్స్యాత్.అ.కా.అ.21.

3. మౌపరేమేళనంభవేత్.అ.కా.అ.21.

వి. నిత్య మువర్ణకస్యాదేశోనుస్వార స్స్యాన్మబ్వోః పరయోః పుష్పదన్తస్య మతే. వనంము, వనంబు.[3]

'ముల్యసేత్యాది' సూత్రముచే నిత్యప్రకృతి సంజ్ఞను బొంది నము వర్ణకమునకు పుష్పదంతుని మతాన ము బులు పరమగుచుండఁగా ననుస్వార మగును. 'మోః' అను నిర్దేశము వలన మువర్ణకమునకు మొత్తమునకు ను సున్న యాదేశ మగును. ఇట 'ననుస్వారము' పూర్ణము మాత్రమె యగును.

వనముము, అనుచో ముందరిమువర్ణకమున కీసూత్రముచే నిండు సున్న కాఁగా వనంము అని యగును. ఇట్లే వనముబు అనుచో మువర్ణకమునకుఁ బూర్ణబిందువు రాఁగా వనంబు అని యగును.

'వనంము' అనురీతిరూపము లిచట విలక్షణముగాఁ గనఁబడుచున్నవి.

వి. అదేః కిమ్ - పాము, మోము, జాము, గీము, దీము, గాము - ఏభ్యః పరతో ముబూవర్ణకౌ న స్తః దీర్ఘా క్షరపరత్వాత్.

'అదేర్మోర్మ్బూ' యను సూత్రమున 'అదేః' అనుటచే దీర్ఘముపై నున్న మువర్ణముపై ము బులు రావు. గాము గీము అనుచో మువర్ణము దీర్ఘముపై నున్నది గావున దానిపై ము బులు రావు కావున వనంము వనంబు అని యైనట్లు గాంము గీంబు అనురీతిరూపము లుండవు.

కాని యిది సరి కాదు 'ములతస్స్యోః క్లీబే' యను సూత్రముచే అదంతములకే మువర్ణకము విధింపఁబడినది. వివృతి యందు నట్టివే యుదాహరింపఁబడినవి. కావున గా(ము) గీ(ము) అనురీతిగా హ్రస్వాకారాంతములు గాని శబ్దములపై మువర్ణకమె రాదు. దీర్ఘముపై మువర్ణకమే లేదు గావున దానిపై ము బులు వచ్చు ప్రశ్నయే లేదు. ఇంక గాము గీము మొదలగు చోట్ల నున్నమువర్ణముప్రాతిపదికావయవమె కాని ప్రత్యయము గాదు ముందు, చమురు అనురీతిగా నాది మధ్యస్థలములందు నామగత మై యున్నట్లు పాము ప్రభృతులఁ జివర నున్నది. అది ప్రాతిపదికావయవమె.చివర నున్న మాత్రనఁ బ్రత్యయము గాదు గదా. ఆవు ప్రేవు.

ఇంక నొకవేళ పుష్పదంతఁడు పాము మొః లగుచోట్ల నున్నవి గూడఁ బ్రథమైకవచనముగు మువర్ణకము గనె తలఁచె నేమో ఆతని వ్యాకరణము మనకు లభ్యము గాదు గదా.

ఇంక నాసూత్రమున 'పుష్పదన్తస్య' యనుటచే మువర్ణకముపై 'ముంబు' లగుట యొక పక్షము కావునఁ బక్షాంతరము నందు ము బులు రాకుండ, 'వనము' అని యట్ల యుండును.

'మోః' అనుసామాన్య నిర్దేశము వలనఁ బ్రథమైక వచనేతర స్థలములందును మువర్ణకముపై ము బు లగును. వనంములు, వనంబులును మొ॥.

## 77. న్లో ర్మ్వతో ర్లు గ్దీ సోమచన్ద్రస్య.[1]

సోమచన్ద్రస్య = సోమచంద్రునిమతమునందు, న్లోః = న,ల,లు పర మగునపుడు, మ్వతో = ము,అత్ లకు, లుగ్దీ = లోపదీర్ఘము లగును.

వి. మువర్ణకస్య తదాద్యకారస్య చ క్రమాల్లోప
దీర్ఘౌ స్తో నలయోః పరయో స్సోమచన్ద్రస్య మతే
వనములు, వనాలు, ధనాలచేత, గుణాల కొఱకు,
రత్నాలకు, ప్రాణానకు, ప్రాణమునకు, ధనానకు,
ధనాల యందు, గురాలకు, గురానకు ఇత్యాది.

సోమచంద్రుని మతమున మువర్ణకమునకు దానికి ముందఱి యకారమునకును నలలు పర మగునపుడు క్రమముగా లోపదీర్ఘములు వచ్చును. అనఁగా మువర్ణకమువలన కు లోపమును, దానికి ముందున్న యత్తునకు దీర్ఘమును నగు నని యర్థము.

వన + జస్, 'నిత్యస్సుపిచ' వనము + జస్, లుజసః వనములు ఈసూత్రముచే మువర్ణము లోపించి ముందరియత్వమునకు దీర్ఘము రాఁగా వనాలు ఇట్లె వనాలను మొ॥

'న్లోః' అనుచో నకార లకారములను సామాన్యముగా నిర్దేశించుట వలన, లు జసః, లస్సర్వత్ర యని యగు. 'లుల' యందలి లకారము పర మగునపు డెల్ల నీకార్య మగును. బహుత్వమున సాధారణ మని చెప్ప వచ్చును.

ఇట్లె నకారమును గ్రహించిన, సప్తమీలో నవర్ణకమును షష్ఠీలో 'న' అను నాగమమును గలవు. వనాన - వనానకు - కాని ద్వితీయానువర్ణమునను, సప్తమి యందు అందు పరమైనను గూడ నకారము గలదు వనమును, వనము నందు ఇచట నకారము పర మైన నీకార్యము గానరాదు. కావున సూరి లులనలు అని స్పష్టముగా నిర్దేశించుట సముచితముగా నున్నది. నలులేమ అని వై.చం.

---

1. క్వచిన్మోర్లుగ్విభక్తౌ, దీర్ఘశ్చాతః. ఆం.కౌ.శ.53, 54
   లుక్తైమోర్ధీఘపివల్నోః త్రి.శ.4.22
   నలులేమమోఃళ్లుగ్వా వంప్క్రాలాత్.వై.చం.ఆ.48
   వికృతౌక్వచిచ్చలోపోమోర్ధీర్ఘశ్చాతాదిమన్యభవేత్.ఆం.శ.చిం.అ.42.

వి. లుగ్గ్రీ కిమ్? వనములు, ధనమునకు, గుణముల వలన, కులములకు, ప్రాణములకు, ప్రాణములయందు ఇత్యాది.

'లుగ్గ్రీ' యనుటచే ము, అత్తులకు లోపదీర్ఘములు కలిసియే వచ్చును. అనఁగా నొకసారి ముపర్ణలోపమును, వే ఱొకసారి యత్తునకు దీర్ఘమును రాదు కాఁగా వనలు, వనాములు అనురీతి నుండవు. అయినచో వనాలు రానిచో లోపదీర్ఘములు రెండును లేక వనములు ఇత్యాదిగనే యుండును.

78. దేర్లు గ్దేశ్యైకాచో స్సోః[1]

దైశ్యైకాచోః = దేశ్యములును, నేకాక్షర శబ్దములు నయిన శబ్దముల యొక్క, దేః = దీర్ఘమునకుఁ బరముగా నున్న, సోః = సువిభక్తికి లుక్ = లోప మగును.

వి. దేశ్యశబ్దానామేకాక్షరశబ్దానాం దీర్ఘాత్పరస్య సోర్లుక్ స్యాత్. నేజా, నవలా, లకోరీ, నేజాలు, నవలాలు, లకోరీలు, శ్రీ, ధీ, ప్రా జ్యా క్ష్మా, శ్రీలు, ధీలు; ప్రాలు, జ్యాలు, క్ష్మాలు.

దేశ్యశబ్దముల యొక్కయు, ఏకాక్షరశబ్దముల యొక్కయు దీర్ఘము కంటెఁ బరముగా నున్న సువిభక్తికి లోపము వచ్చును. దేశ్యశబ్దములు ప్రత్యేకముగాఁ బేర్కొనఁబడినవి. కాఁగా ఏకాక్షరశబ్దములు సంస్కృతములే యగును.

నవలా + సు, శ్రీ + సు అనుచో నీసూత్రముచే సువిభక్తి లోపింపఁగా నవలా – శ్రీ అని యుండును.

వి. అన్తరఙ్గత్వాద్ధ్రస్వో నాస్తి. దీర్ఘాత్సు లోపత్వాజ్జసాదౌ పరే దీర్ఘఏవ ప్రకృతిస్స్యా దితి జ్ఞాతవ్యా.

దీర్ఘము పైని సువిభక్తి కి లోపమును జెప్పుటచే నితర విభక్తులయందును బ్రకృతి దీర్ఘాంతమె య్యై యుండును. కాని 'హ్రూదేస్త్రిషు' అను సూత్రముచే హ్రస్వముండ దని యభిప్రాయము.

నవలా + సు, శ్రీ + సు అనుచో నీసూత్రముచే దీర్ఘముపై సులోపము రాఁగా నవలా, శ్రీ

1. దేశ్యదీర్ఘాత్సునస్తులుక్ త్రి.శ.4.32.

– అని యగును. ఇపుడు 'హోదేస్త్రిక్రమః' అనుదానిచే హ్రస్వ మేల రా దను సందేహమునకు 'అంతరంగ ' మగుటచే హ్రస్వము రా దని సమాధానము.

సులోపముచే నివి సుప్రత్యయమంత మందుఁ గలిగిన వగుటచే దీర్ఘము చివరిది గాక పోవుటచే హ్రస్వము రాదు.

వీనికి హ్రస్వము రా దని చెప్పుట యుచితము. భ్రూవు అనుచో వువర్ణక మగుచున్నది. సులోప మగుట లేదు గదా. స్త్రీ లింగత్వము, లేదా స్త్రీ సమత్వము బట్టి సులోపము సిద్ధించును.

## 79. ద్వ్యాదిలోపధాద్వా లో రః పుంసి.[1]

పుంసి = పురుషుని బోధించునట్టి యనఁగా మహద్వాచకము లగు శబ్దములు, దీఆది లోపధాత్ = దీర్ఘము ముందు గలిగిన లకారము ఉపధగాఁ గల శబ్దము కంటెఁ బర మైన, లః = లకారమునకు, వా = వికల్పముగా, రః = రేఫ మగును.

వి. దీర్ఘాది లకారోపధశబ్దాత్పరస్య ప్రత్యయ లకారస్య రేఫోఽస్యాత్పుంసి. భూపాలులు – భూపాలురు – సుశీలులు – సుశీలురు, బాలులు – బాలురు, భూపాలురచేత, సుశీలురచేత, బాలురకొఱకు, భూపాలురవల్ల, సుశీలురకు, భూపాలురయందు ఇత్యాది.

దీర్ఘము ముందుఁగలిగిన లకార ముపధయైన మహద్వాచకము లగుశబ్దములకుఁ బైనున్న ప్రత్యయ మగు లకారమునకు వికల్పముగా రేఫ మాదేశ మగును.

ప్రాతిపదికము 1.మహత్తు కావలెను. 2.లోపధము గావలెను. 'అలోఽన్త్యాత్పూర్వ ఉపధా' యను పాణినీయముఁబట్టి ఉపధ యనఁగాఁ దుది వర్ణమునకు ముందు వర్ణము. అదిలకారము గావలెను. 3. అట్టి యుపధయగు లకారమునకుఁ బూర్వము నందు దీర్ఘ ముండ వలయును ఈ లక్షణములు గలిగిన ప్రాతిపదిక పైని (గల బహువచన) లకారమునకు వికల్పముగా రేఫ మగును.

'బాల' అను ప్రాతిపదికకుఁ బ్రథమా బహువచనము నందు 'జస్' రాఁగా బాల + జస్,

---

బాలాదేర్లోపధాల్లోలః వై.చం.అ.30.
లాన్తాత్తురురౌ తయోః క్రమేణస్తః ఆం.శ.చిం.అ.15
దీర్ఘాదిలోపధాత్పుంసి రుస్యాద్వానేకతాపదే త్రి.శ.4.19 హేమచంద్రసూత్రము.
లాన్తస్యరురౌజశ్శసోః ఆం.కౌ.శ.24

మహతస్సుప్వ్యదతః' బాలు + జస్, 'లుజసః' బాలు + లు అని కాఁగా నీ సూత్రముచే బహువచన లకారమునకు రేఫ మై 'బాలురు' అని యగును.

'వా' యనుటచే వికల్పము గావున రేఫము రాని పక్షము నందు 'బాలులు' అని యుండును ఇట్లే యితరాలు.

సూత్రమునందు 'ద్వ్యాది' యనుటచే లోపధము దీర్ఘపూర్వకము గానిచో నీకార్యము లేదు. అయిదుగురు 'నలులు' 'నలురు' అని కానేరదు.

'లోపధా' త్తనుటచే సుపధ లకారము గానిచో రేఫము లేదు. రాములు మొ॥

'పుంసి' యనుటచే మహద్వాచకము గాని యెడల రేఫము లేదు. బాలలు మొ॥

'వా' యనుటచే రేఫము వికల్ప మై బాలులు భూపాలులు అని యుండును. కాని యట్టి ప్రయోగములు మృగ్యములు.

'లోపధా' త్తని సామాన్యముగాఁ జెప్పుట వలన బలశాలులు, మొద లగుచోట్ల రేఫము రావలసి యున్నది. దయాళు రనునది సాధు వవును గాని యపహాసములు పెక్కింటి కవకాశము గల్గును.

## 80 సర్వనామ్నోఽన్యచ్చగురోః[1]

గురోః = గురువుల మతము నందు, సర్వనామ్నః = సర్వనామములతో సంబంధము గలిగిన, అన్యత్ చ = ఇతరములకు సయితము, పూర్వసూత్రోక్త మగు రేఫము వచ్చు నని యభిప్రాయము.

వి. సర్వనామ్న స్సంబంధాంద్రస్యాదిలోపధ
శబ్దాత్పరస్య ప్రత్యయలకారస్య చ రేఫస్స్యాద్గురోర్మతే.
సూత్రే అన్యదితిప్రయోగాదన్యస్యే త్యేవం
కర్మణి షష్ఠి - ఇద్దరు రఘుకులురు, అందఱు ఖలురు,
వారు మహాబలురు.

సర్వనామముతో సంబంధము గల్గినపుడు దీర్ఘపూర్వకము గాని లోపధశబ్దముకంటెఁ బర మయిన ప్రత్యయ ల కారమునకును రేఫ మగును.

సూత్రమునందలి 'అన్యత్' అనుశబ్దమునకు 'అన్యస్య' యని యర్థము.

1. సర్వనామ్నాంచ, సంబంధాదన్యద్గ్రాహ్యం విశేషతః త్రి.శ.4.20 హేమచంద్రసూత్రము.

దీర్ఘాదియగులోపధశబ్దమునకు బై జెప్పిన పూర్వ సూత్రోక్త కార్య మన్యమున కనఁగా దీర్ఘాది గాని లోపధ శబ్దమునకు సైతము వచ్చు నని గురువుల మతముగా నిందు వర్ణింపఁబడినది.

ఇద్దరు రఘుకులురు. ఇద్దరను సర్వనామముతో సంబంధము కలిగియుండుటచే నుపధ యగులకారముదీర్ఘపూర్వకము గాకున్నను రఘుకుల - అనుదానిపై ప్రథమాబహువచన లకారమునకు రేఫ మై రఘుకులురు అని యైనది. ఇట్లే అందఱు ఖలురు - అనుచో అందఱు సర్వనామము ఖల దీర్ఘ పూర్వకము గాని య నఁగా హ్రస్వపూర్వక మైన లోపధశబ్దము - ఖలురు అని రేఫ మైనది వారు మహాబలురు - (మహాబల) మొ॥

వి. కిఞ్చ భారతే సోమయాజి ప్రయోగే

'వారు మహా బలుల్ హరియు వారికిఁ బ్రాపు గలండు - ఇతిచ'.

అపి చ - అధర్వణ భారతే సంజయధృతరాష్ట్రసంవాదే -

అరయఁగవా రెల్లరు ప్రబ

లురు గావున వారితో విరోధము మనకే

లరయగ నను సంధికిఁ బం

పు రాచబెబ్బులిని మీరఁ బోయి మఱలెదన్ - ఇతి చ.

తిక్కన వారు మహాబలుల్ అనుచో వారు అనుసర్వనామముతో సంబంధ మున్నను 'మహాబలుల్' అనుచో హ్రస్వపూర్వక లకారముపై రేఫము చేసి యుండలేదు. కాని యధర్వణుఁడు 'వా రెల్లరు ప్రబలురు' అనుచో రేఫమును బ్రానయందుఁ బ్రయోగించియున్నాఁడు కావున రేఫము వికల్పముగా నగుట సమ్మతింపవలసినదే యని పైప్రయోగముల వలన స్పష్ట మగుచున్న దని యభిప్రాయము. ఇందు - లురు - విరోధ - అనుచో రెండవపాదమున రలయతి. ఇట్టి ప్రాసయు నంగీకరించిన ప్రబలులు అని యుండవచ్చు.

సర్వనామములతోడి సంబంధ మనునది యొక విశేషమె ప్రసిద్ధకావ్యములందు మాత్ర మెప్పుడును నిట్టి యెడల రేఫము గానరాదు.

వి. అపి చ అన్నంభట్టారకవ్యాకరణే 'లాన్తాత్తు

రురౌ తయో' రితి రావణీయసూత్రే సకల భాషావాగ

నుశాసనేనోక్తత్వాచ్చ హ్రస్వాదిలోపధప్రయోగో

యమపి సాధురేవ.

ఇంకను – అన్నం భట్టారకుని వ్యాకరణమున 'లాన్తాత్తు రురౌ తయోః' అను రావణుని సూత్రము గలదు. సకలభాషావాగనుశాసనుఁ డైన అన్నం భట్టారకుడు లాన్తా త్తనుచో నాలకారము దీర్ఘపూర్వకము గావలె నని పేర్కొనలేదు. కావున హ్రస్వపూర్వకలోపధముపై రేఫ మయిన "వారెల్లరు ప్రబలురు" అనురీతి ప్రయోగము సాధువే యగును.

నన్నయభట్టారకుని గ్రంథముగాఁ బ్రసిద్ధమైన 'ఆంధ్రశబ్దచింతామణిలో' లాన్తాత్తు రురౌ తయోః క్రమేణ స్తః అని యున్నది. సూత్రము మొత్త మిం దుదాహరించియుండకపోవచ్చును. మిగిలిన దంత ముఖ్యమును గాదు. కాఁగా నది అన్నంభట్టారకవ్యాకరణ మనుటయు, నందలి సూత్రము రావణుని దనుటయు విశేషములు. ఇంతకు ముందు 'రోరాయః కణ్వస్య' యను సూత్రము నొద్ద 'స్తోవావోరైనావోః' అను సూత్రము బార్హస్పత్య మని చెప్పె. అచ్చటను తత్కర్త అన్నం భట్టాకుఁడే యనియె వాగను శాసనుఁ డై భారత కర్త యైన నన్నయ భట్టారకుని కంటె భిన్నుఁ డయిన యన్నంభట్టారకుఁ డెవరో?

పైని నన్నయభట్టు పేర్కొనఁబడె.

## 81.పుమమహత స్సోర్డుజ్ జసాదౌ చ.[1]

పుమమహతః = పురుషుని బోధించునట్టి వగున మహచ్ఛబ్దములకు, సోః = సుప్రత్యయము యొక్క సాధనమునను, జ సాదౌ చ = ప్రథమాది విభక్తుల బహువచనము పర మగునపుడును డుజ్ = డుఙ్ప్రత్యయ మగును.

వి. అమహత్పదస్య పుమర్థవాచినః సోర్డుజ్ ప్రత్యయస్స్యాత్ జసాదౌ పరే బహువచనే చ.

రంగఁడు, తిప్పఁడు, జన్నఁడు.

పుమర్థమును బోధించునట్టియమహత్తు లగు శబ్దములకంటెఁ బరమైన సువిభక్తి స్థానమున 'డుజ్' ప్రత్యయ మగును. జస్ మొద లగు బహువచనములు పరముగా నున్నపుడు నగును. 'జసాదౌ' యనునప్పటి సప్తమిచే 'తస్మిన్నితినిర్దిష్టే పూర్వస్య' యను పాణినీయపరిభాష ననుసరించి జసాదులు పరముగా నుండఁగాఁ బూర్వమునందలి పుమమహత్ ప్రాతిపదిక కగును. డుజ్ ప్రత్యయము గావున పరముగా నగును. 'జస్' అనునది బహువచనమున కుపలక్షణ మని గ్రహింపవలెను. కావున జసాదుల యందు బహువచనము పర మైనపుడే యగును. అనఁగా ద్వితీయాద్యేకవచనములు పర మైనపుడు డుజ్జు రాదు.

1. ?డుంఙ్డుండ్లు ప్రథితాఖ్యేయాః? (త్రి.శ.4.3)
?క్వచిదేకాద్యమహతోర్డుజ్ ఆం.కౌ.శ.68.
క్వచిదమహతోఽపిడుజ్ ఆం.శ.చిం.అ.51

'రంగ' అను ప్రాతిపదికపైఁ బ్రథమైకవచన వివక్షయందు సుప్రత్యయము రాఁగా రంగ + సు అనుచో 'నాఽఽతస్సుప్యుత్' అనుసూత్రముచే ఉత్వము రాదు. కాఁగా నీసూత్రముచే సుస్థానమున డు జ్ఞయి 'జిదనుస్వారశ్చ' యని ముందు బిందువు రాఁగా రంగఁడు, రంగండు మొ॥

పుమర్థమును బోధించునవి యమహత్తు లగుట యను నంశము వివాదాస్పదము. ఆచ్ఛికము లెల్ల నమమహత్తులే యగునా? రంగలింగశబ్దముల నాచ్ఛికములుగనె తలఁపవలయునా? యని సందేహములు.

బహువచనమున రంగ + జస్ అనుచో నీసూత్రముచేఁ బ్రాతిపదికకుఁ బరముగా నీసూత్రముచే డుజ్వర్ణక మయి రంగండు + జస్ అని కాఁగా పిదప -

## 82. ఉతో లుగ్జసాదౌ డుజః

జసాదౌ = ప్రథమాది బహువచనములు పర మగుచుండఁగా, డుజః = డుజ్వర్ణకమునందలి, ఉతః = హ్రస్వ మైనయుకారమునకు, లుక్ = లోప మగును.

ఇట వ్రాఁత ప్రతియం దీసూత్రము లేదు కాని వృత్తియు నుదాహరణములు గలవు. వానిని బట్టి సూత్రమి ట్లూహింపఁదగును.

వి. డుజ్వర్ణకస్యోకారస్య లుక్ స్యాజ్జసాదౌ పరే
బహువచనే. రంగఁడు - రంగని, రంగండ్లు, రంగనిచేత,
రంగండ్ల చేత, రంగనికి, రంగండ్లకు ఇత్యాది.

ప్రథమాదిబహువచనములు పరముగా నున్నపుడు ముందటిడుజ్వర్ణకమునందలి యుత్వమునకు లోప మగును.

రంగండు + జస్ అనుచోఁ బ్రస్తుతసూత్రముచే డువర్ణమునందలి యుత్తు లోపించి రంగండ్ + జస్ లు జసః - అని జస్సునకు లువర్ణకమై 'రంగడ్లు' అని యగును. ఇట్లే యితర విభక్తుల గ్రహింపఁదగును.

(జసాదౌ డుజః) జసాది విభక్తులు పర మైనప్పటి డుజ్జనకే యుత్వలోపము కావున 'రంగఁడు' అనుచో సుస్థానమున వచ్చిన డుజ్వకము నందు మాత్ర ముత్వలోపము లేదు.

ద్వితీయాద్యేకవచనములందు డుజ్జే రాదు. కావున నుత్వలోప ప్రసక్తియే లేదు. రంగని, రంగనిచేత ననురీతిగ రూపము లగును.

ఇట వీని ప్రక్రియానిర్వహణమైనఁ గొంతవఱకుచితముగా నున్నది. కాని

తద్ధితపరిచ్ఛేదమున (10మొ॥సూ॰) నిదిపునరుక్తమగుటయట్లుంచి ప్రక్రియా నిర్వహణము సక్రమముగా నున్నట్లుదోఁపదు.

## 83. నాఽతస్సుప్యుత్.[1]

సుపి = ప్రథమాది విభక్తులు పర మైనపుడు, అతః = అత్వమునకు, ఉత్ = ఉత్వము, న = రాదు.

వి. తద్ధితాన్తానాం సర్వనామ్నాం మహతాం చాతస్సుపి పరే నోత్ స్యాత్. రంగుఁడు కుప్పుఁడు, జున్నుఁడు, ఇతిన

విభక్తిపరమగుచుండఁగా తద్ధితాంతములు, సర్వనామములు, పుమమహత్తులు నయినశబ్దముల యత్వమున కుత్వము రాదు.

రంగఁడు రంగని అనురీతిగనె యుండును రంగుఁ డనురీతి నుత్వము రాదు.

తద్ధితాంతములు మొద లగునవి వివృతియందలి విశేషాంశములు వాని కుదాహరణము లందు గమనింపఁదగు

వృ. తద్ధిత :- గొల్లఁడు, గొల్లాఁడు, మాలఁడు, మాలాఁడు, అడపఁడు, అడపగాఁడు, కల్లఁడు, కల్లవాఁడు ఇత్యాది. గొల్లుఁడు, మాలుఁడు, అడుపుఁడు, కల్లుఁడు ఇతి న సర్వనామ :- ఎల్లుఁడు, ఒకుక్ఁడు, ఎవ్వుఁడు, అతుఁడు ఇతి న

గొల్ల(ఁడు) తద్ధితాంత ముత్వము లేదు. గావున గొల్లుఁ డని కాదు.

ఒక్క(డు) సర్వనామము ఉత్వము రాదు గావున ఒకుక్ఁ డని గాదు.

ఎల్లశబ్దమునకు 'ఎల్లఁడు' అనురూపము వివృత్తియందుఁ బ్రస్తావింపఁబడినది అది మృగ్యము.

'అతః' అని సూత్రమున నుండఁగా గొల్లాఁడు, అడపఁగాడు, అనురీతిగా దీర్ఘాకారమున కుత్వము రాలే దని చెప్పు టనవసరము.

---

1. ఏకాదేరమహతాంచడావున్న. ఆం.శ.అ.52
నడావుత్తయోః ఆం.కౌ.శ.69

వీని కుత్వము ప్రాప్తించుట కాధార మేది? 'మహతస్సప్యదత' అని యుత్వము ప్రాప్తించుచో 'మహతస్స్వర్ధజనిత' యని దుజ్జు నగును గదా పుమమహతస్స్వర్ధ జ్జని వేఱుగా విధింప నేల?

ఇటఁ బనరుక్తులు జాగరూకతతోఁ బరిశీలించి నిర్ణయింపవలసి యున్నది.

దీనిచే నసుప్యత్ (తద్ధి-36) అనులక్షణము వ్యర్థమనఁదగును.

## 84. స్త్రీబహుత్వే సురాదేరసౌ.[1]

అసౌ = సమాసము గానపుడు, సురాదేః = సుర మొదలగుశబ్దములకు, స్త్రీ బహుత్వే = స్త్రీత్వమును బహుత్వమును గల్గును.

వి. సమాసాభావే సురాదిగణస్య స్త్రీ బహుత్వే స్తః.
స్త్రీత్వా దక్. సురలు, లాజలు, అక్షతలు.

సమాసము గానిచో సురాదిశబ్దములకు స్త్రీత్వమును బహుత్వము నగును. స్త్రీత్వము వలన 'అక్' అగు నని వివృతి. ఇది విచారింపఁదగినది.

సుర శబ్ద మదంతము మహత్పుంలింగము. ఉత్వాదులు రావలసి యున్నవి. కాని స్త్రీత్వమువలన మహత్కార్యము రాదు గావున 'మహతస్సప్యదతః' అని సురాదిశబ్దముల కుత్వము రాదు.

బహుత్వవిధానము వలన నివి యెప్పుడును బహువచనముతోనె ప్రయోగింపఁబడును. కావున నేకవచనాంతరూపము లుండవు సురలు లాజలు మొ॥

వి. అసౌ కిమ్? మహీసురుఁడు, శోభనాక్షతములు.
మంత్రాక్షతములు ఇత్యాది.

సూత్రమునం 'దసౌ' యనుటచే నీకార్యము సమాసములందు లేదు 'సస్సమాసః' అనుప్రాకృతవ్యాకరణము ననుసరించి 'స' అనునది సమాసమునకు సంజ్ఞ. ఈసంజ్ఞ సంస్కృతముననను గానవచ్చు.సమాసమునందు స్త్రీత్వము లేదు. బహుత్వమును లేదు.

'మహీసురుఁడు' ఇట మహత్కార్య మగు నుత్వ డుజ్జు లయినవి. డుజంత మయి యిది యేకవచనాంతము నైనది. సమాస మనఁగా సిద్ధసమాసమె యగు ననవలె నిట ఎల్లసుర

1. సురతాతాద్యాః స్త్రియాం స్యు త్రి.శ.4.39
స్త్రీత్వబహుత్వే సురాదే రసమాసే. ఆం.శ.చిం.అ.53.ఆం.కౌ.శ.70
కృద్వ్యదేజన్తాపసురాసురయోధాఃస్త్రీసమాః వై.చం.అ.32

లనుచో దెలుఁగు సమాసమున స్త్రీత్వబహుత్వము లగును. ఒక్కొసురుఁ డనురీతి నుండదు.

వి. సుర,లాజ,తిలాక్షతాదిస్సురాదిగణః.

సుర, లాజ, తిల, అక్షత మొద లగునవి సురాదులు. లాజాదు లమహత్తులు గావున 'క్వచిన్మలోపా లుక్కును' సూత్రముచే ములోపముతో నిష్టరూపము గాఁగలదు, బహుత్వమె విశేషము.

## 85. స్త్రీత్వం తాతాదేః.[1]

తాతాదేః = తాత మొద లగు శబ్దములకు, స్త్రీత్వమ్ = స్త్రీత్వ మగును.

వి. తాతాది గణస్య స్త్రీత్వం స్యాత్. స్త్రీత్వాత్ అక్.

తాత – తాతలు, దూత – దూతలు, శేషం రమావత్

తాత దూత యోధాది స్తాతాదిగణః

తాత మొద లగుశబ్దములకు స్రీత్వ మగును. (స్త్రీత్వముచే అక్? అగును?) ఇవి మహత్తులు కావున ఉత్వడుఁటాదు లగు మహత్కార్యములు ప్రాప్తించుటచే తాతుఁడు దూతుఁ డనురీతి గావలె. అట్టి యెడల నీస్త్రీత్వము వలన మహత్కార్యములు రావు. అట్లె యమహత్తులకు మువర్ణకాదులును రావు, ప్రథమైకవచనలోపమె యగును.

తాత + సు ప్రస్తుత సూత్రముచే స్త్రీత్వముగల్గఁగా'స్త్రీయామనుతాం సోర్లుక్' అని సులోపము తాత – ఇతర విభక్తులలో తాతలు మొ॥.

దూత యోధ మొద లగునవి తాతాదులలో జేర్పఁబడినవి. వీనికి దూతుఁడు యోధుఁ డనురీతిగా స్త్రీత్వము లేని రూపములును గలవు. తెలుఁగు లోని 'తాత' శబ్దము సంస్కృతము గాదు. అయ్యది యచ్చ తెనుఁగు స్త్రీ సమము అర్థభేదము గమనార్హము.

## 86.మొ ర్లుక్కుశాదేః.[2]

కుశాదేః = కుశ మొద లగు శబ్దముల యొక్క, మోః = మువర్ణమునకు, లుక్ = లోప మగును.

---

1. సురతాతాద్యాః స్త్రీయాంస్యుః త్రి.శ.4.39

2. లుక్కుశాదిమోః అం.కౌ.శ.71, దర్భాదిస్తునపుంవకే?త్రి.శ.4.7.
లుగ్వేత్కుశాదేర్మోః అం.శ.వి౦.అ.54 కుశేవా.వైచం.అ.34

వి. కుశాది గణస్య ముర్వణకస్య లుక్ స్యాదసమాసే.
కుశ, చీర, దర్భ, హంస, కోకిల.

కుశ మొద లగుశబ్దముల యొక్క ముర్వర్ణకమునకు లోపము వచ్చును.

కుశ + సు అనుచో 'ములతస్స్వి క్లీబే' యను సూత్రముచే ముప్రత్యయ మయి కుశము అని కాఁగాఁ బ్రస్తుత సూత్రముచే ముప్రత్యయము లోపించి కుశ అని యగును.

'సోర్లుక్కుశాదేః' అని సువిభక్తికి లోపము చెప్పక 'మోర్లుక్' అనుటచే నెల్ల విభక్తివచనము లందును ముర్వర్ణము లోపించును కుశలు, కుశను మొ॥

'క్వచిన్మలోపాలుక్' అను సూత్రము గూడ (చరిత్రాదుల) ముర్వర్ణకమునకే లోపము చెప్పుచున్నది. కాని యట లోపము వికల్పము కాఁగా నిట ములోపము నిత్యము. చరిత్రము అనుతీరుగా కుశము అనురూప ముండదు. కావున వీనికి వేరుగా 'ము' లోపము చెప్పఁబడిన దని గ్రహింపఁదగును.

చీరము, హంసము అనురీతిరూపములు నుండుటచే వానిని గుశాదులలోఁ జేర్చుట యుచితముగాఁ గానరాదు.

ఇంక నీలోపము సమాసము గానపుడే యనఁగా వ్యస్తతలోనె యగు నని వివృతి యందుఁ జెప్పఁబడినది.

వి. అసమాసే కిమ్? (కుశలి, జలహంసః, చక్రాంగః?)
సమాసపక్షే నిర్మలకుశములు. ధౌతచీరములు,
మత్తకోకిలములు, నిర్మల కుశలు, ధౌతచీరలు,
రాజహంసలు మత్తకోకిలలు.

ఈ లోపము సమాసము గానపుడే యనుట వలన సమాసములం దీసూత్రముచే లోపము రాదు. ('స్త్రీత్వబహుత్వే సురాదేరాసా' యనుప్రపూర్వసూత్రము నుండి అసా అను దానిని వివృతి యను వర్తింపఁ జేసి యుండును) కావున ధౌతచీరములు అని ముర్వర్ణముతో రూప ముండును. ధౌతచీరలు అని ముర్వర్ణరహితరూపమును గూడ నుదాహరించుటచే 'క్వచిన్మలోపాలుక్' అను సూత్రముచే వికల్పముగా ములోప మగు నని గ్రహింపవలెను. ఏ మైనను అసమాసే యనుటచే సమాసమునందు ముప్రత్యయ మున్నందుల కుదాహరణములు కవి ప్రయోగముల నుండి వివృతి కర్త చూపుచున్నాఁడు.

వి. సమాసే ముప్రత్యయస్యోదాహరణాని.
(రుక్మా) రత్నాంగదచరిత్రే - మోహినీవిరహే -
సఖీం ప్రతి నాయికా వాక్యమ్.
కలువల రాజు మారుఁడును గయ్యమోనర్పఁగ వచ్చినా రొకో
చెలియలు వేగ రండు మరుసేనల శారికలన్ మత్తకో
కిలములు రాజహంసముల కీరములం జలపట్టి పట్టి యా
వల చెరఁ బెట్టుఁ డని పల్కెను బిత్తరి తత్తరంబుగన్.
ముప్రత్యయాభావస్య అల్లసాని పెద్దనార్యశిష్యేణ
భట్టు మూర్తి మహాకవినా విరచితే వసుచరిత్రే -
“రాజహంసలు గాని రాజహంసలు గారు సరస కళాసార రుచుల
ఇత్యాది మహా కవి ప్రయోగాచ్చ.

మత్తకోకిలములు, రాజహంసములు అనుచో మొదటి పద్యము నందు మువర్ణకము లోపింపలేదు. ‘రాజహంసలు’ అనుచో రెండవ పద్యము నందు మువర్ణకము లోపించినది. ఇట్లు సమాసమున లోపము వికల్ప మని యభిప్రాయము.

వీనిక సమాసములోను లోపము వికల్పమె కావున నివి కుశాదులలోఁ జేర వని గ్రహించు టుచితము.

నిర్మల కుశములు పవిత్ర దర్భము లనురీతి ఉదాహరించినఁ జెల్లును కాఁగా ‘అసా’ అన్న దను వర్తింపఁజేయ రాదు కుశాదులందీ లోప మెల్లయెడల నగును. కుశాదులలో చీరాదులు చేరవు. అని నిశ్చయింపఁదగును.

## 87. ప్రథమా షష్ఠీ విశేషణస్య.[1]

షష్ఠీ విశేషణస్య = షష్ఠ్యంత మగు విశేషణము నకు, ప్రథమా = ప్రథమా విభక్తి యగును.

వి. షష్ఠ్యంతపద విశేష్యస్య విశేషణస్య ప్రథమా స్యాత్.

షష్ఠ్యంత మగు విశేష్యమునకు విశేషణ మై యున్న శబ్దము యొక్క షష్ఠీ విభక్తికిఁ ప్రథమావిభక్తి యగును.

ఆం.కౌ.శ.72 షష్ఠీ విశేషణానాంస్యాత్ప్రథమా త్రి.శ.7.6
షష్ఠీ విశేషణానాం ప్రథమాస్యాత్. ఆం.శ.చిం.55 జమో విశేషణస్య. వై.చం.వి.4

'కర్తృకర్మాదికం సమ' మ న్నను లక్షణమును బట్టి తెలుఁగున విభక్తులు సంస్కృతానుసారము గనె యుండును కావున విశేష్యము యొక్క లింగవిభక్తివచనములే విశేషణమునకు నగును. ఇట్లు విశేష్యము షష్ఠ్యంత మై యున్నపుడు దాని విశేషణశబ్దమునకును షష్ఠీవిభక్తియె యగును. అట్లయిన విశేషణముల యొక్క షష్ఠికిఁ బ్రథమ యగు నని యీ సూత్రమునర్థము. అందుకుఁ గవి ప్రయోగము.

వి. కళాధరకవికృతే – జాంబవతీ కళ్యాణే – ద్విపదప్రబన్ధే –
వసుదేవతనయుండు వాసుదేవునకు
బిసకుసుమేక్షణ ప్రీతిమై మ్రొక్కె ఇత్యాది.

వాసుదేవునకు – విశేష్యము – షష్ఠ్యంతము దాని విశేషణ మగు 'వసుదేవతనయ' శబ్దమున కీ సూత్రముచేఁ బ్రథమ రాఁగా 'వసుదేవతనయుండు వాసుదేవునకు' అని ప్రయుక్త మయినది.

వి. పునశ్చ – విజయరామచరితే – శశాంకవిరచితే –
కైకయీనందనుం డతికౌతుకమున
మునిజనానతుఁడు రఘురామునకు మ్రొక్కె.

రఘు రామునకు అనువిశేష్యము షష్ఠ్యంతము దాని విశేషణ మగు 'మునిజనానత' శబ్ద మీసూత్రముచేఁ బ్రథమాంత మైనది.

'వసుదేవతనయునకు వాసుదేవునకు' ననురీతిగా విశేషణము షష్ఠ్యంత్యము నయి యుండునవకాశము కల్పింఁదగియున్నది. 'వారో సంబుద్ధౌస్త్రియా' మ్మను తరువాతి సూత్రమునుండి 'వా' శబ్దము నిం దపకర్షించు కొన్న విశేషణముల షష్ఠికిఁ బ్రథమ యగుట వికల్ప మై విశేషణము షష్ఠ్యంతము నైయుండుటను సాధించు నవకాశము గల్గును.

## 88. వా రో సంబుద్ధౌ స్త్రియామ్.[1]

స్త్రియామ్ = స్త్రీ వాచకములకు, సంబుద్ధౌ = సంబోధనమున ప్రథమైకవచన స్థలమున, వా = వికల్పముగా, రో = రో యనునది (పరముగా) అగును.

1. రోఇతిస్త్రీవాచ కో భవేత్ పరత్రైవ.అ.కా.అ.1
స్త్రియాం రోస్యాత్ మునస్తువా త్రి.శ.4.46
రోవళ్యా వై.చం.అవ్య.4
స్త్రియాం వా రోసాః అం.కౌ.శ.80

వి. తత్సాదీనాం స్త్రీ వాచకపదానాం రో వా స్యాత్సంబుద్ధౌ. భామ - భామరో, యువతి- యువతిరో, వధువు - వధువురో, కలికిరో కన్నెరో, అమ్మరో, అక్కరో ఇత్యాది.

స్త్రీ వాచకము లయిన తత్సమాచ్ఛిక శబ్దములకుఁ బరముగా సంబోధనమునందు 'రో' యనునది వికల్పముగా నగును. ఈరోశబ్దము స్త్రీ సంబోధ్యవాచకమునకుఁ బరముగాఁ జేరునని గ్రహింపఁదగును.

భామ - సంబోధనమున నీ సూత్రముచే రో చేరఁగా భామరో. అదిదుదంతములకుఁ దత్సమములకు నితరము లాచ్ఛికములకుఁ గ్రమముగా వివృతి యం దుదాహృతులు చూపఁబడినవి.

రోశబ్ద మేకవచనాంతములపయినే చేరుచున్నది. రమణులారరో యనుతీ రగు ప్రయోగములు లేవు. 'సూత్రమునందలి సంబుద్ధి' శబ్దముచే నేకవచనాంతములపయినే యగుటను గుర్తింపఁదగును. 'ప్రథమైకవచనం సంబుద్ధిః' అని సంబుద్ధి యనఁగా సంబోధనమునఁ బ్రథమైకవచనమే కదా.

రమణిరా యనురీతి హ్రస్వాంతరూపములును గల వని ప్రౌఢ వ్యాకర్త స్పష్టము చేసెను.

## 89. మహదుద్వదల్ల్వాదేః[1]

అల్ల్వాదేః = అల్లు మొద లగు దేశ్య శబ్దములకు, మహత్ ఉత్ వత్ = ఉదంతము లగు మహచ్ఛబ్దములకువలె రూపము లగును.

వి. అల్ల్వాదిగణస్య మహదుదన్తవత్ కార్యం స్యాత్ అల్లు, మనుము, కొడుకు, తమ్ము రల్వాది గణః - అల్లు - అల్లుఁడు - అల్లువు, మనుము - మనుముఁడు- మనుమువు, కొడుకు, కొడుకుఁడు, కొడుకువు, తమ్మ(ంబు) - తమ్మ(ంబు)డు- తమ్మం(ంబు)వు, అల్లువు, మనుముల, కొడుకులచేత, తమ్ముల కొఱకు, అల్లుని వలన, కొడుకువులకు

1. అల్ల్వాద్యాగురుశబ్దవత్ త్రి.శ.4.30

అల్లువుల యందు ఇత్యాది.

అల్లు మొద లగు ఉదంతము లైన మహద్వాచకము లగు విష్ణు మొద లగు శబ్దములకు వలె నాయా విభక్తులందు రూపము లగును.

'అల్లుఁడు' అనుచో 'అల్లు' శబ్దము పురుషవాచకమె మహత్తై. 'మహదుద్వత్' అనుటలో నీయాచ్ఛికశబ్దములు మహత్తులు గా వనునభిప్రాయము సూచిత మగునట్లున్నది.

విష్ణుశబ్దమునకు 'ఉతవుస్సునః' అని వువర్ణమై నట్లు- అల్లు శబ్దమునకును వువర్ణకమయి అల్లువు అని యగును. వా లుక్చ - (విష్ణు) అని వులోప మై 'అల్లు' అని యగును. 'మహతస్సోర్డుజనితః (విష్ణుఁడు) అనునట్లు అల్లుఁడు అని యగును.

ఇట్లితరోదాహృతు లూహింపఁదగును. కాని దీనికి అల్లు, అల్లువు తమ్ము, తమ్మువు అనురీతిరూపములు గానరావు. ఆచ్ఛిక శబ్దములకుఁ బ్రథమై కవచనమునందు వువర్ణకమే రాదని 'క్వాప్యా' చ్ఛికస్యవుః, (సూత్రాంధ్ర) విజ్ఞుల మతము. ఇట అల్లువు, కొడకువు అను రీతిగా సాధింపఁబడిన రూపములకుఁ దగిన ప్రయోగాధారము లేదు. 'మనుము' అను శబ్దమె లేదు. మనుమఁడు అనియె యుండును. కొడుకు అనుదానికి కొడుకఁ డనియు రూప మరుదుగఁ గలదు. కాని కొడుకుఁడు (కొడుకువు) అని లేవు.

ఈ లక్షణమె సమసంజసముగాఁ గానరాదు.

వి. బడబాగ్ని భట్టారకకృతే - అనిరుద్ధ విజయే -
కడువడి మేరువు కంటెను
పొడు వగురథ మెక్కి దివియు పుడమి యదిరెడున్
గడిమి గలిగి పూవిలుతుని
కొడుకుడు వెలువడ లేని కుతుకముతోడన్ ఇత్యాది.

ఈ పద్యము 'కొడకుండు' అని ప్రయోగింపఁబడి నందు కుదాహరింపఁబడినది. కొడుకు ప్రసిద్ధమె కదా. ఇఁక కొడుకువు ఊహించుకొన్నట్లే యితరము లనుకొనవలె నన్నమాట.

కాని భాషలో నెచ్చటను 'కొడుకుఁడు' అనురూపము గానరాదు. 'కొడుకఁడు' అని యత్వముతోఁ గల దీపద్యమున నదియె ప్రయుక్త మయియుండును.

---

1. స్వస్రా న్నామ్నః కుజ్నో ర్బహువచనే. ఆం.శ.చిం.అ.68
కుజ్నోర్బహువచనే ఆం.కౌ.శ.87
నోఃకుజ్ బహుళమ్ వై.చం.అ.62

## 90. వా [మాన్వాదేః కుజ్నో ర్బ హౌ.[1]

బహౌ = బహువచనము పర మగు చుండఁగా, మ్రాన్వాదేః = మ్రాను మొదలగు శబ్దముల యొక్క, నోః = నువర్ణమునకు, వా = వికల్పముగా, కుజ్ = కుజ్ అగును.

వి. మాన్వాదిగణస్య నువర్ణస్య కుజ్వర్ణకో వా స్యాద్బ
హువచనే - మ్రాను - మ్రాకులు, వికల్పే మ్రానులు.
తూను - తూనులు - తూఁకులు, కొలను - కొలనులు-
కొలఁకులు ఇత్యాది.
మానుతూనుకొలన్వాది : (మాన్వాది) గణః

బహువచనము పరముగా నున్నపుడు మ్రాను మొదలగుశబ్దముల యొక్క నువర్ణము స్థానమున వికల్పముగా కుజ్ అనునది యాదేశ మగును. కుజ్జులో జ కార మిత్తు గావున నది లోపించును. కువర్ణమె యగును.

మ్రాను + జస్ అని యుండఁగా నీసూత్రముచే నువర్ణమునకు కుజా దేశ మై మాకు + జస్. కు(జ్) జిత్తు గావున 'జిదనుస్వారశ్చ' (అను నాసికంచ?) యను సూత్రముచే కువర్ణమునకు ముందు బిందు వై మ్రాఁకు + జస్ = లు జసః - మ్రాకులు అని యగును.

బహౌ యని సామాన్యముగా బహువచనము పర మై నపు డనుట వలన నెల్ల విభక్తులయందు బహువచనమున నీకార్య మగును. మ్రాఁకులను మొ॥

'వా' యనుటచే కు జాదేశము రాని పక్షమున మ్రానులు, మ్రానుల ననియె యుండును.

కుజ్జు రానందుకుఁ గవిప్రయోగము.

వి. భట్టుమూర్తి కవికృతే - వసుచరిత్రే - "ముసలిమానుల్
గారె" ఇతి శ్లేషేఽపి మానురితి ప్రయోగో విద్యమా
నత్వాత్ - తత్ప్రయోగస్త్వతిసాధురేవ.

భట్టుమూర్తి వసుచరిత్రలో 'ముసలిమానుల్ గారె' యని ప్రయోగించెను. ఇచట నొక యర్థమున 'ముసల్మాను'లు మహమ్మదీయు లనియు నర్థాంతరమున వృద్ధవృక్షము లనియు స్పష్టము. రెండవ యర్థమున ముసలివి యైన 'మానులు' అనుచో కుజ్జు లేదు. శ్లేషయందే యైనను కుజ్జు రాని యీ ప్రయోగమును బట్టి కుజ్జు వికల్ప మని గ్రహింపవలె నని వివృతి కర్త యభిప్రాయము.

కాని యరు దగు విట్టి స్థలములను బట్టి యెల్ల యెడల వికల్ప మని చెప్పుట సమంజసముగాఁ గానరాదు.

బహౌ యనుట వలన నేకవచనస్థలమున నీకార్యమున కవకాశము లేదు. కాని యరుదుగ నేకవచనమునను కుఱ్ఱు గలదు.

## 91. మీన్వాదే ర్వా లుక్.[1]

బహౌ = బహువచనము పర మగుచుండఁగా, మీన్వాదేః = మీను మొదలగు శబ్దముల యొక్క, నోః = నువర్ణమునకు, వా = వికల్పముగా, లుక్ = లోపమగును.

వి. మీన్వాదిగణస్య నువర్ణకస్య బహువచనే వా లుక్ స్యాత్. పూర్వసూత్రానువృత్త్యా బహావిత్యధ్యాహార్యం. మీను - మీనులు, మీనుల చేత - మీలచేత, మీను లకు - మీలకు, మీనులయందు - మీల యందు, మీను చేను పేన్వాది ర్మీన్వాదిగణః. చేను - చేనులు- చేలు, పేను - పేనులు - పేలు.

బహువచనము పర మగుచుండఁగా మీను మొదలగు శబ్దముల యొక్క నువర్ణమునకు వికల్పముగా లోపము వచ్చును. 'హ్రమాన్వాదేః కుణ్ణోర్బహౌ' యను పూర్వసూత్రమునుండి 'బహౌ' యనుదాని ననువృత్తి రూపమున నీసూత్రములోనికిఁ దెచ్చుకొనవలెను.

మీను + జస్ అనుచోఁ బ్రస్తుతసూత్రముచే నువర్ణము లోపింపఁగా మీ + జస్ 'లు జసః' మీలు ఇట్లే చేలు పేలు మొ॥

బహౌ యను సామాన్య నిర్దేశముచే నీలోపము బహువచనమున నెల్ల విభక్తులయందు నగును. చేలను, మీలయందు మొ॥

ఇంక నేకవచనమున 'ను' లోపము లేదు. మీను, చేనికి మొ॥

'వా' యనుటచే లోపము వికల్పము గావున 'ను' లోపింపని పక్షమున మీనులు అనురీతిగ నుండును. ఇట్టివి మిక్కిలి యరుదు. 'వా' యనుట విచార్యము.

మీను, చేను పేన్వాదిః అని వివృతి యం దాదిశబ్దము గలదు. కాని సూరి యీమూడింటనే యీలోపమును బేర్కొనెను. ఇతరము మృగ్యము.

1. మీన్వాదీనాం లుక్ క్వచిత్. త్రి.శ.4.42.
కన్నత చిన్ను లోపస్య. ఆ.శ.చిం.అ.69 క్వచిన్ను లోపస్య. అం.కౌ.శ.88. లు ర్మీన్వాదేః వై.చం.అ.63.

## 92. ఉభయమస్త్రీవాచకస్య[1].

అస్త్రీవాచకస్య = స్త్రీ వాచకము గాని (స్త్రీలింగా మహద్విశేషణ) శబ్దమునకు, ఉభయవిధమ్= రెండు విధము లగురూపము లుండును.

వి. స్త్రీవాచకరహితానాం కేవలస్త్రీలింగవాచకానాం
లతాదీనాం స్త్రీవాచక క్లీబవాచకవిశేషణ ముభయవిధం స్యాత్.
లలిత సుమభార భరిత మీలత యతివరో,
శుభ్రవర్ణము ధేనువు, చిత్రవర్ణధేనువు ఇత్యాది.

సూత్రమస్పష్ట ముగానున్నది. వివృతియం దర్థము చాలవఱకు సంగ్రహింపఁబడినది.

స్త్రీ వాచకములు గాక స్త్రీ లింగము లయిన లత మొద లగుశబ్దముల యొక్క విశేషణములు స్త్రీలింగ కార్యముతోను, క్లీబకార్యముతోను రెండు విధము లైయుండును.

భరితము ఈలత యనుచో భరితశబ్దమునకుఁ గ్లీబకార మయినది. 'ముంలతసోః క్లీబే' యని మువర్ణక మైనది.

ఇంక విశేష్యము స్త్రీలింగము నందున్నది గావునఁ దదనుసారముగా విశేషణమునకును స్త్రీ లింగము కల్గఁగా 'స్త్రీయామనుతాం సోర్లోపః' అని సువిభక్తి లోపించి భరిత లత యని యగును.

విశేష్యము స్త్రీలింగము నందుండ విశేషణము స్త్రీ లింగమునం దుండుట విశేషము గాదు. క్లీబరూపమున నుండుటయే విశేషము. కావుననే 'లలితసుమభారభరితము' లత అని క్లీబరూపమయినందు కుదాహరణము ప్రముఖముగాఁ జూపఁబడినది.

ఈ కార్య మప్రాణివాచకములకే యని కొందఱు తలఁచిరి. కాని 'శుభ్రవర్ణము ధేనువు' అని యుదాహరించుచో స్త్రీ లింగ శబ్దము ప్రాణివాచక మయినను విశేషణమునకుఁ గ్లీబరూప మగునని స్పష్టమగుచున్నది. చిన్నయసూరియు 'కోమల వరిష్ఠంబు' అని యుదాహరించెను.

స్త్రీ లింగ మగు విశేష్యము స్త్రీవాచక మైనచోఁ గ్లీబరూప ముండదు. వనిత లాంఛన ధారిణి యను రీతిగా విశేషణము స్త్రీలింగరూప మొక్కటి మాత్రమె కలిగి యుండును.

1. ఉభయవిధమమహతీనామ్. ఆం.కౌ.శ.75, ఆం.శ.చిం.ఆ.58
అప్రాణిన్యావా.వై.చం.స్త్రీ.3
అస్త్రీవాచకశబ్దానాం బహుళంస్యాద్విశేషణమ్.త్రి.శ.7.2

# అథ హలన్త ప్రకరణమ్

## 1. జగదాదే స్సువన్నిత్యమ్[1].

వ్యా. జగాదాదేః = జగత్ – మొద లగు శబ్దములకు, నిత్యమ్ = నిత్యముగా, సువత్ = సుప్రత్యయాంతము వంటి రూప మగును.

వి. జగదాదిగణస్య హ::న్తస్య త్రిషు లిఙ్గేషు
నిత్యం ప్రథమైకవచన వద్రూపం స్యాత్. జగత్.

జగత్ అను మున్నగు హలంతశబ్దములు మూఁడు లింగములందును సంస్కృతమునం దాశబ్దము యొక్క ప్రథమైకవచనాంతముతోఁ దుల్యమయిన రూపము తెలుఁగునఁ బ్రాతిపదికగా నిల్చును.

జగచ్ఛబ్దమునకు సంస్కృతమునఁ బ్రథమైకవచనాంతరూపము జగత్ జగద్ అని యుండును. దానివంటిది యగు అనఁగా అట్టి వర్ణ క్రమము గలిగిన 'జగత్' అను శబ్దము తెలుఁగునఁ బ్రాతిపదిక యగును.

## 2. ద్వ్యుత్వే సుపి[2].

వ్యా. సుపి = ప్రథమ మొద లగు విభక్తులు పరముగా నున్నపుడు, ద్వి + ఉత్వే = పూర్వమునం దున్న హల్లునకు ద్విత్వమును బైని నుత్వము నగును.

వి. సుపి పరే హలో ద్విత్వోత్వే స్తః. జగత్తు + సు
ఇతి స్థితే.

---

1. హలగుణవద్గుణః ప్రథమైకవచనవత్సర్వత్ర.ఆం.కౌ.హ.1.
ప్రథమైకవచనతుల్యం సర్వత్ర హలన్తమగుణవత్ప్రభృతి. ఆం.శ.చిం.హ.1.

2. ద్విత్వోత్వే సర్వహలామ్.ఆం.కౌ.హ.3.
ద్విత్వోత్వే సర్వహలాం హ్రస్వాత్.ఆం.శ.చిం.హ.3.
ద్విత్వంచ దిగాదేః.వై.చం.హ.32.
ద్విత్వం స్యాదేకవచనే హలన్తానామ్ తతఉతా? త్రి.శ.3.33.

'సుప్' అను ప్రత్యాహారము ప్రథమాది విభక్తులను బోధించును. ద్విర్ద్విత్వస్య (సం-16) యను సూత్రము ననుసరించి ద్వి యనునది ద్విత్వమునకు సంజ్ఞ. ప్రథమ మొదలగు విభక్తులు పరముగా నున్నపుడు దానికిఁ బూర్వమునం దున్న ప్రాతిపదికము యొక్క చివరి హల్లునకు ద్విత్వమును బైని హ్రస్వ మయిన యుకారమును వచ్చును.

జగచ్ఛబ్దమునకు 'జగదాదిస్సువన్నిత్య' మ్మను సూత్రముచే జగత్ అనునది ప్రాతిపదికము గాఁగా, ప్రథమైకవచన వివక్షయందు సుప్రత్యయ మయి జగత్ + సు అని యుండఁగాఁ బ్రస్తుతసూత్రముచే ద్విత్వమును (జగత్ త్) ఉత్వమును (జగత్ త్ ఉ) వచ్చి జగత్తు + సు అని యగును.

### 3. జగదాదే స్సోర్లోపః.[1]

వ్యా. జగదాదేః = జగత్ మొద లగు శబ్దములకుఁ బరముగా నున్న, సోః = సువిభక్తికి, లోపః = లోప మగును.

వి. హలన్తస్య జగదాదిగణస్య సోర్లోపస్స్యాత్.
జగత్తు 'నిత్యస్సుపి చే'తి సూత్రేణ జగత్తులు,
జగత్తుచేత, జగత్తునకు, జగత్తునందు.

హలంతము లగు జగదాదిశబ్దములపైని 'సు' అనునది ప్రథమావిభక్తి యేకవచనము. సువిభక్తికి లోప మగును. జగత్ మున్నగు శబ్దములకుఁ బర మయియున్న ప్రథమైకవచనమునకు లోపము వచ్చు నని సూత్రార్థము. జగత్తు + సు అనుస్థలమున నీసూత్రముచే సువిభక్తి లోపింపఁగా 'జగత్తు' అను ప్రథమైకవచనాంతరూప మేర్పడును.

'ముల్యసగావక్' - (అజంత-49) యను పూర్వ సూత్రము ననుసరించి ' ద్వ్యుత్వే సుపి' యను పూర్వసూత్రముచే విధింపఁబడిన యుత్వము నిత్యప్రకృతి సంజ్ఞ గలిగి యుండును. కావున 'నిత్యస్సుపిచ' (అజన్త-50) అను లక్షణము ననుసరించి యీద్విత్వోత్వములు ప్రథమాదివిభక్తులలో నేది పర మయినను వచ్చును. అని వివృతి యందు వివరింపఁబడినది.

కాని 'ద్వ్యుత్వేసుపి' యను పూర్వసూత్రమునందే 'సుపి' యనుదళముచే జగత్తులు, జగత్తునందు మొద లగు విధముగాఁ బ్రథమైకవచనేతర విభక్తులు పర మయినపుడును ద్విత్వోత్వములు సంభవించును. కావున 'నిత్యస్సుపి చ' యను సూత్రముచే దీనిని

---

1.హలామగుణవతాంసోర్లుక్.ఆం.కౌ .హ.8.
అగుణవతాంసర్వహలాంసోర్లోపః.ఆం.శ.చిం.హ.5.

సాధింపవలసిన యవసరము లేదనిపించును. ఇంతకును 'ముల్వసగావ' గిత్యాది సూత్రమున నిద్విత్వోత్వము లుచ్చరింపఁబడియు నుండలేదు, ఆదిశబ్దముచే వివృతికారుఁడు గ్రహించియుండనోపును.

పయి సూత్రము 'ద్వ్యుత్వే సౌ' యను తీరుగా సువిభక్తి పరకతయందు మాత్రమే ద్విత్వోత్వములు విధించియున్నచో నితరవిభక్తిపరకతలో వే ఆౕకలక్షణము నాశ్రయింపవలసి యుండెడిది. కాని సూత్రముననను వివృతియందు సయితము 'సుపి' యను దళమే యుండుట గమనార్హము.

4. గ,వ,శ,తా,స,హ,య,ద్యు,రు,కృ,ధృ,భృ,చి,జి,టి,రి,షి,క్షిత్యాదిభ్యః.

వి. ఇత్యాదిభ్యోవర్ణేభ్యః పరస్య జగదాదిగణహలన్త
హల్ తకారస్య త్రిషు లిఙ్గేషు, హలన్తప్రథమైక
వచన వద్రూపం స్యాత్. జగత్తు, బలవత్తు, త్రింశత్తు,
హతాత్తు, సత్తు, మహత్తు, వియత్తు, విద్యుత్తు, మరుత్తు,
శుభకృత్తు, చక్రధృత్తు, భూమిభృత్తు చిత్తు,
ఇంద్రజిత్తు, తటిత్తు, సరిత్తు, యోషిత్తు, పరీక్షిత్తు ఇత్యాది.

వ్యా.గ = గ అను అక్షరము కంటెఁ బర మైన తకారము చివరఁ గలిగిన శబ్దము (జగత్ - జగత్తు), వ = 'వ' కంటె తకారము గలశబ్దము (బలవత్ - బలవత్తు), శ = 'శ' వర్ణముపై తకార మున్న శబ్దము (త్రింశత్ - త్రింశత్తు), 'తా' = తా అనుదానికిఁ బై తకారము గల శబ్దము (హతాత్ - హతాత్తు), స = 'స' పై తకారము గల శబ్దము (సత్ + సత్తు), హ = 'హ' వర్ణముపై తకార మున్న శబ్దము (మహత్ - మహత్తు), య - 'య' కంటె తకారము గలది (వియత్ - వియత్తు), ద్యు = ద్యువర్ణముపై తకార మున్నది (విద్యుత్ - విద్యుత్తు), రు = రువర్ణముపై తకార మున్నది (మరుత్ - మరుత్తు), కృ = కృవర్ణముపై తకార మున్నది (శుభకృత్ - శుభకృత్తు), ధృ = ధృవర్ణముపై తకార మున్నది (చక్రధృత్ - చక్రధృత్తు), భృ = భృ వర్ణముపై తకార మున్నది (భూమిభృత్ - భూమిభృత్తు), చి = చివర్ణముపై తకార మున్నది. (చిత్ - చిత్తు), జి = జి వర్ణముపై తకార మున్నది. (ఇంద్రజిత్ - ఇంద్రజిత్తు), టి = టివర్ణముపై తకార మున్నది (తటిత్ - తటిత్తు), రి = రివర్ణముపై తకార మున్నది (సరిత్ - సరిత్తు), షి = షివర్ణముపై తకార మున్నది (యోషిత్ - యోషిత్తు), క్షి ఆదిభ్యః = క్షివర్ణముపై తకారమున్నది (పరీక్షిత్ - పరీక్షిత్తు) మొద లగు శబ్దములు జగదాది గణమున నున్నవి.

'జగదాదేస్స్వవన్నిత్యమ్' అని ప్రథమైకవచనాంతతుల్యరూపము ప్రాతిపదికమగుటయు, 'ద్య్వేత్వేసుపి' యనుసూత్రముచే దుదిహల్లునకు ద్విత్వము నుత్వమును, 'జగదాదేస్సులోపః' అను సూత్రముచేఁ బ్రథమైకవచనలోపము నీశబ్దములకు సిద్ధించును.

జగత్ మొదలగు శబ్దములను నిరూపించుట యీ సూత్రమునకుఁ బ్రయోజన మని గుర్తింపఁదగును.

వి. జగద్గరుత్ చ్ఛకృత్త్రింశద్వియచ్చిత్పుర
జిదబ్దభృత్, అరిహృచ్ఛుభకృద్యూభృన్ముఖ
త్సద్ధరిదింద్రజిత్ - హలన్తశబ్దపాఠే స్యాదిత్యా
దిః ప్రథమైకవచనవదితి జగద్గణపాఠః.

జగద్గణమందలిశబ్దము లిటఁ గొన్ని వృత్తి చూపినది. ఇందు జగత్, త్రింశత్, వియత్ మున్నగునవి యింతకు ముం దుదాహరించినవే. గరుత్, శకృత్, పురజిత్, అబ్దభృత్, అరిహృత్, ముత్, సత్, హరిత్ అనున విందు విశేషము. దీనికి నింతకు ముందు చూపిన బలవత్తు ఇత్యాదులకుఁ బ్రయోగములు వెదుకవలె.

## 5. సదాదేర్వా సే.

సే = సమాసమునందు, సత్ + ఆదేం = సత్ మొదలగు శబ్దములకు, వా = పూర్వము చెప్పిన కార్యము వికల్పముగనగును.

వి. సదాదిగణస్యసమాసే వికల్పేనప్రథమైకవచన
వద్రూపంస్యాత్. సత్, హృత్ ఇత్యాద్యేకాక్షరహలన్త
స్సదాదిగణః. సమాసే పరిషత్తు - పరిషదులు,
సుహృత్తు - సహృదులు, సచ్చిత్తు - సచ్చిదము,
శరణమనః పరమాత్మార్థేషు సదాదయస్స్వాది
గణః. అసమాసే కోవిద హరణమనీషార్థే సదా
దయో జగదాదిగణ ఇతిజ్ఞాతవ్యః.

సదాదిగణమందలి శబ్దములకు సమాసమున వికల్పముగాఁ బ్రథమైకవచనాంతతుల్యరూపము తెలుఁగునఁ బ్రాతిపదికమగును. సత్, హృత్ మొదలగు నేకాక్షరములైన హలంత శబ్దములు సదాదులు. శరణమున్నగు నర్థములందివి స్వాదిగణమున జేరును. అపుడు స్వాదేరమ్వేత్ అని ద్వితీయైకవచనాంతతుల్యరూపము ప్రాతిపదికమగును. పరిషదులు మొ॥ అసమాసమున కోవిదాద్యర్థములందివి జగదాదిగణమునందలివి. అపుడు ప్రథమైకవచనాంతతుల్యరూపము

ప్రాతిపదికమగును. సత్తు, చిత్తు మొ॥.

సదాదులు జగదాది గణమునం దున్నవి. కావున 'జగదాదేస్స్వన్నిత్యమ్' అను సూత్రముచేఁ బ్రథమైకవచనాంతతుల్యరూపమె నిత్యముగాఁ బ్రాతిపదికము గావలసియుండఁగా,, సమాసమునందు వికల్పముగాఁ బ్రథమైకవచనాంతతుల్యరూప మగునని యర్థము. ప్రథమైకవచనాంత తుల్యరూపమయినపుడు, పరిషత్తు - సుహృత్తు - అనువిధముగా ద్విత్వోత్వములతో రూప మేర్పడును.

వే ఆొకపక్షమునందు సృగాదిగణమునఁ జేరును. కావున 'సృగాదేరమ్వత్' అను సూత్రముచే ద్వితీయైకవచనాంత తుల్యరూపము ప్రాతిపదిక మగును. పరిషద - సుహృద 'డుమ్యూ ప్రాగ్వత్' అను సూత్రము ననుసరించి మహత్త్వాదుల ననుసరించి డుజౌదులు సంభవించును. పరిషదులు, సుహృదుఁడు మొ॥.

సదాదు లేకాక్షరశబ్దము అని వివృతి వివరించినది. కాని సూత్రమున నట్టి నియమము గానరాదు. వివృతి కారుఁ డాపిదప 'డుమ్యూప్రాగ్వ త్తను సూత్రవివరణమున చిత్తు - చిదము' అని చూపుట గుర్తింపవచ్చును. ఏకాచ్ఛ శబ్దములు పెక్కు వ్యస్తతలో ద్వైరూప్యముతో నుండుట యచట నుదాహరింపఁ బడినది. దీనికిఁ బ్రయోగప్రామాణ్యము పరిశీలింపవలసి యున్నది.

సే అనుటచే సమాసములందు మాత్రమె యీ వికల్పత కావున నసమాసమునందు 'సువత్'కార్యము నిత్యము. సే యని యీ లక్షణము సమాసములందు మాత్రమె కాక వ్యస్తతలోఁ గూడ నయిన (చిత్తు-చిదము) ఈ సూత్రమె వ్యర్థ మగును. సదాదులు సృగాదులలోఁ జేరిన వానికి వలె వీనికిని ద్వైరూప్యము సాధారణముగ సిద్ధింపఁగలదు. వ్యస్తతలో 'సత్తు' అనియె గాని సదుఁ డనురీతిగా నుండదు. వ్యస్తతలో 'సత్తు' = కోవిదుడు - హృత్తు - హరణము చిత్తు - మనీష యను రీతిగా వివృతి యర్థములను జేర్కొన్నది.

## 6.సృగాదే రమ్వత్.[1]

వ్యా. సృక్ + ఆదేః = సృక్ మొదలగు శబ్దములు. అమ్వత్ = అమ్ ప్రత్యయాంతము వంటి రూపము కలిగిన వయి తెలుఁగునఁ జేరును.

వి. సృగాదిగణస్య హలన్తస్య హలన్తద్వితీయైకవచన వద్రూపం స్యాత్త్రిషులిఙ్గేషు. సృక్ ఇతి స్థితే

1. గుణవర్ణో ద్వితీయై వచనవత్.ఆం.కౌ.హ.2
   గుణవర్ణో ద్వితీయైకవచనతుల్యోభవేద్వికృతౌ.ఆం.శ.చిం.హ.2.

ద్వ్యత్వే సుపి చేతి సూత్రేణ ద్విత్వోత్వయోః ప్రాప్త
యోః స్పృక్కు - స్పృక్కులు స్పృగాదేరమ్వదిత్యనేన
సూత్రేణ ద్వితీయైకవచనవద్రూపే ప్రాప్తే స్పృచ ఇతి స్థితే.

'అమ్' అనునది సంస్కృతమున ద్వితీయావిభక్తియేకవచనము. స్పృక్ మొదలగు హలంత శబ్దములు మూఁడు లింగములందును సంస్కృతమున వానివాని ద్వితీయావిభక్తి యేకవచనాంతరూపములతో సమాన మయిన యాకారముతోఁ దెలుఁగునఁ బ్రాతిపదికలుగా నిలుచును.

స్పృక్ అనుదాని ద్వితీయైకవచనాంతరూపము స్పృచమ్ అనునది. అట్టి స్పృచ (మ్) అనురూపము తెలుఁగునఁ బ్రాతిపదికగా నిలుచును.

'జగదాదిస్స్వవన్నిత్యమ్' అను సూత్రమున 'నిత్యమ్' అనుదళ ముండఁగా నిందు 'అమ్వత్' అని మాత్రమె ప్రయుక్త మయినది గాని నిత్యపదము ప్రయుక్తము గాలేదు. ఈ భేదమును బట్టి స్పృగాదులు ద్వితీయైకవచనాంత తుల్యరూపము లగుట నిత్యము గా దనునర్థము సిద్ధింపఁగలదు. ఆపక్షమున 'జగదాదేస్స్వవన్నిత్య' మ్మనులక్షణముచేఁ బ్రథమైకవచనాంత తుల్యరూపమును బొంది నిలుచును. ఇట్లు స్పృక్ అనునది ప్రాతిపదిక కాఁగా 'ద్వ్యత్వే సుపి' యను సూత్రము ననుసరించి ద్విత్వోత్వములతో స్పృక్కు, స్పృక్కులు అనురీతి రూపము లేర్పడును. ఈ యభిప్రాయముతోనే వివృతి స్పృక్కు అనురీతి రూపముల నిటఁ బ్రస్తావించినది.

## 7. డుమూప్రాగ్వత్[1].

ప్రాగ్వత్ = పూర్వ మజంత శబ్దములకుఁ జెప్పఁబడిన తీరుగనె, డుమూ = ద్వితీయైకవచనాంత తుల్యరూపములు ప్రాతిపదిక లగునట్టి స్పృగాదిశబ్దములకును డుమ్మ వర్ణకాదు లగును.

వి. ద్వితీయైకవచనతుల్యహలన్తస్య స్పృగాదిగణస్య
మహద మహచ్ఛబ్దయో రదన్తవత్స్వర్డుజ్
ప్రత్యయమువర్ణకౌ స్తః. స్పృచము.

'స్పృగాదేరమ్వత్' అను సూత్రము ననుసరించి ద్వితీయైకవచనాంత తుల్యరూపమును బొందిన మహత్తులకు, నమహత్తులకు స్పృగాది హలంతశబ్దములకు - ఇంతకు బూర్వ

1. గుణవతాండుమూప్రాగ్వత్.ఆం.శ.చిం.హ.6
గుణవతాండుమూ ఆం.కౌ.హ.9.

మజంతములకుఁ జెప్పిన విధముగనె దుణ్ముమ్వర్ణకములు వచ్చును. అనఁగా బుంలింగ శబ్దము మహత్తును నయిన దుణ్వర్ణకములును, అమహత్తయినను, నపుంసకలింగ మయినను (ఇవి యదంతములే యగును) మువర్ణకమును వచ్చు నని యర్థము. స్త్రీలింగ మయిన సులోప మగు.

ద్వితీయై కవచనాంత తుల్యత్వపక్షమున 'స్రుచ' యని యుండును. దీనిపైఁ బ్రథమా విభక్తియం దేకవచనమును వివక్షింపఁగా సుప్రత్యయము వచ్చి స్రుచ + సు అని యుండఁగా నిది యమహత్తు గావున సుస్థానమున మువర్ణకము వచ్చి స్రుచము అని యగును. ఇతర విభక్తులయం దిట్లే స్రుచములు స్రుచములం దిత్యాదిగ నగును.

వేదవిత్ అను శబ్దమునకు వేదవిదమ్ - వేదవిద - అని కాఁగా నిది మహత్తు గావున సుత్వడుజ్జులు వచ్చి వేదవిదుఁడను రీతిగా నగును. ఇట్లె యితర విభక్తులలో వేదవిదులు వేదవిదునిచేత మున్నగు రీతిగా నగును.

వి. జగదాదిగణసూత్రే నిత్యమితి పఠనసామ
ర్థ్యాత్ స్రుగాదిగణస్యాపి ద్వితీయై కవచనవద్రూ
పం వికల్పేన స్యాదితి స్పష్టమేవ. స్రుక్కు - స్రుచము,
స్రుక్కుల చేత - స్రుచములచేత, స్రుక్కునకు - స్రు
చమునకు, స్రుక్కునందు - స్రుచమునందు.

'జగదాదేస్సువన్నిత్యమ్' అను సూత్రమున 'నిత్యమ్' అని చెప్పఁబడినది. ఇం దట్లు చెప్పఁబడలేదు. కావున నీ సూత్రముచే నగు అమ్వద్రూపము - ద్వితీయై కవచనాంత తుల్యరూపము వికల్పముగా నగు నని స్పష్టము. దీనివలన స్రుగాదులకు రెండేసి రూపము లుండును. ప్రథమై కవచనాంతతుల్యరూపము గలుగుచో ద్వ్యుత్వేసుపి యని ద్విత్వోత్వములు గలిగి స్రుక్కు, స్రుక్కులు అనురీతిగ రెండవ విధముగ రూపమగును. ద్వితీయై కవచనాంతతుల్య రూపముతో స్రుచము, స్రుచములు, అనురీతి రూపములు ప్రస్తుత సూత్రముచేనె సిద్ధము లగును.

నిత్యశబ్దము లేకుండుటనుబట్టి వివృతి యిట విశేషార్థమును సాధింపఁబూనినది. కాని ఋత్విగాదులకు సూరి ద్వివిధము లైన రూపములను గొన్నింటికి మాత్రమె పేర్కొనెను. ద్వితీయై కవచనతుల్యరూపము ప్రాతిపదికమగు నన్ని శబ్దములకును బ్రథమై కవచనాంత తుల్యరూపముతో రూపాంతరము లేదు.

'జగదాదేస్సువన్నిత్యమ్' అనుచోను నిత్యశబ్ద మేలకో స్పష్టము గాదు.

వి. స్పృగ్విపశ్చిద్భిషగ్వార్మగ్వేదవిద్దివిష
త్కకుప్స్వప్నక్సభాసద్త్విడ్ద్విడ్విశ్యహవ్య
వాడ్గూఢపాత్స్రగాహార్యభిద్దిగ్దృ
గ్భూభుగ్వారిరుట్త్వక్తురాషాణ్మధులిట్స
మిదిత్యాది ద్వితీయైకవచనవదిత్యాదిహలన్త
పారకే ఇతి స్పృగాది గణ ఏవం విద్వాన్, వరీయాన్, గరీయాన్,
కనీయాన్, వర్షీయా ననడ్వాని త్యాదయ స్స్పృగాది గణః

స్పృక్, విపశ్చిత్ మొదలుగా స్పృగాది గణమునందలి శబ్దములు వికృతి యందు విస్పష్టముగాఁ జూపఁబడినవి. ఇందలి శబ్దముల కన్నింటికి ద్వైరూప్యము గానవచ్చుట లేదు. ప్రయోగములం బరిశీలింపవలెను. విధాత్రాదులవలెనె స్పృగాదులనుగూడఁ బ్రయోగములకు భిన్నముగనె యెన్నుట యొప్పునా యని సందేహము. ముద, విపద యను రూపములు వింతగాఁ దోఁచక తప్పదు. వికృతి యుదాహరణములు -

వి. స్పృక్కు - స్పృచము, విపశ్చిత్ - విపశ్చితుఁడు,
భిషక్కు - భిషజుఁడు, వార్మక్కు - వార్మచము,
వేదవిత్తు - వేదవిదుఁడు, దివిషత్తు - దివిషదుఁడు,
కకుప్పు - కకుభము, స్వప్నక్కు - స్వప్నజుఁడు,
సభాసత్తు - సభాసదుఁడు, త్విట్టు - త్విషము,
ద్విట్టు - ద్విషుడు, విట్టు - విశుఁడు; (వైశ్యః;)
హవ్యవాట్టు - హవ్యవాటు, హవ్యవాహుఁడు, హవ్యవాహము;
గూఢపాత్తు - గూఢపాతు; గూఢపాదుడు,
స్రక్కు - స్రజము; అహార్యభిత్తు - అహార్యభిదుఁడు,
దిక్కు- దిశ; దృక్కు; దృశ, భూభుక్కు - భూభుజుఁడు;
వారిరుట్టు - వారిరుహము; త్వక్కు - త్వచము,
తురాషాట్టు - తురాషాటు, తురాషాహుఁడు;
మధులిట్టు - మధులిహము, సమిత్తు - సమిధలు, సమిధములు;
బలిభుక్కు - బలిభుజము, బలిభుజుడు;
ముత్తు - ముదము, ముద; పత్తు - పదము;

పొత్తు – పొతు, పొదము; చిత్తు – చిదము;
ద్విషత్తు – ద్విషదుఁడు; ప్రతిపత్తు – ప్రతిపదము;
సంపత్తు – సంపద, సంపదము; విపత్తు – విపద,విపదము;
దృషత్తు – దృషదము; వీరుత్తు – వీరుధము;
కృత్తు – కృథము; యుత్తు – యుధము;
రుట్టు – రుషము – రుష; విప్రుట్టు – విప్రుషము
ఇత్యాది సృగాదిగణః.

8. రషపొపక్వనుమయుసుమభివిధ్యాదిభ్యోవా.

రష = ర, ష మొదల గువానికంటెఁ బరముగా నున్న తకారము చివరఁ గల్గిన శబ్దములు వికల్పముగా ప్రథమైకవచనాంత తుల్యరూపము నందును. పక్షమున ద్వితీయైకవచనాంత తుల్యరూపము నందును.

వి. ఇత్యాదిభ్యో వర్ణేభ్యః సృగాదిగణహలంత హల్త
కారస్య త్రిషు లిఙ్గేషు హలంతప్రథమైకవచన
వద్రూపంవా స్యాదితి బోద్ధవ్యమ్.
కృత్తు – కృతము, తమోనుత్తు – తమోనుదుఁడు,
సంపత్తు – సంపదము, ద్విపొత్తు – ద్విపొదము,
ఉద్భృత్తు – ఉద్భృదము, కరిభిత్తు – కరిభిదము,
సమిత్తు – సమిధము, ముత్తు – ముదము, సంయుత్తు–
సంయుధము, శరత్తు – శరదము, వేదవిత్తు –
వేదవిదము, పరిషత్తు – పరిషదము,
విపశ్చిత్తు – విపశ్చిదుఁడు ఇత్యాది.

వివృతి ననుసరించి యుదాహరణముల నిట్లు క్రమముగా గుర్తింపదగును.

| | | | ప్రథమైక | ద్వితీయైక |
|---|---|---|---|---|
| 1. | ర | శరత్ | శరత్తు | శరదము |
| 2. | ష | పరిషత్ | పరిషత్తు | పరిషదము |

| | | | | |
|---|---|---|---|---|
| 3. | పా | ద్విపాత్ | ద్విపాత్తు | ద్విపాదము |
| 4. | ప | సంపత్ | సంపత్తు | సంపదము |
| 5. | కృ | కృత్ | కృత్తు | కృతము |
| 6. | ను | తమోనుత్ | తమోనుత్తు | తమోనుదుఁడు |
| 7. | ము | ముత్ | ముత్తు | ముదము |
| 8. | యు | సంయుత్ | సంయుత్తు | సంయుధము |
| 9. | సు | – | – | – |
| 10. | మి | సమిత్ | సమిత్తు | సమిధము |
| 11. | భి | ఉద్భిత్ | ఉద్భిత్తు | ఉద్భిదము |
| | | కరిభిత్తు | కరిభిత్తు | కరిభిదుఁడు |
| 12. | వి | వేదవిత్ | వేదవిత్తు | వేదవిదుఁడు |
| 13. | చి | విపశ్చిత్ | విపశ్చిత్తు | విపశ్చిదుఁడు |

## 9. దేర్బహలమ్.[1]

వ్యా. దే = దీర్ఘము కంటెఁ బరముగా, బహుళమ్ = బహుళముగా వచ్చును. ఇట నేమి యన్నది యస్పష్టముగా నున్నది. దేర్ద్విహులమ్ అని చెప్పఁబడిన దేమో.

వి. దీర్ఘాత్పరస్య హలోద్విత్వం బహుళం స్యాత్.

వాక్కు – వాకు, ద్విపాత్తు – ద్విపాతు, తురాషాట్టు –
తురాషాటు, హవ్యవాట్టు – హవ్యవాటు ఇత్యాది.

దీర్ఘముకంటెఁ బరముగా నున్న హల్లునకు 'ద్విత్వేసుపి' యను సూత్రముచే రావలసిన ద్విత్వము బహుళముగా వచ్చు నని సూత్రాభిప్రాయము. 'దిర్దీర్ఘః' అని 'ది' యనునది దీర్ఘమునకు సంజ్ఞ. ద్విత్వోత్వములు రెండింటిలోను ద్విత్వము బహుళమనుట వలన నితర మగునుత్వము మాత్రము దీర్ఘము మీఁది హల్లునకుఁ గూడ (బరముగా) నిత్యముగనె వచ్చును.

1. దీర్ఘతోబహులమ్.ఆం.కౌ.హ.7
ద్విత్వంతుదీర్ఘతోబహుళమ్.ఆం.శ.చిం.హ.4.

వాక్ + సు అను చోట 'ద్వ్యుత్వేసుపి' యని రావలసిన ద్విత్వోత్వములలో ద్విత్వము మాత్రము ప్రస్తుత సూత్రముచే బహుళము. ద్విత్వమయిన వాక్కు, బహుళ మనుటచే రానిపక్షమునందు వాకు ద్విత్వ మయినఁ గాకున్న నుత్వము మాత్రము నిత్యము.

## 10.హాన్నిత్యమ్[1].

హాత్ = హ్రస్వముకంటెఁ బరముగా (ద్విః = ద్విత్వము), నిత్యమ్ = నిత్యముగా నగును.

వి. హ్రస్వాక్షరాత్పరస్య హలోద్విత్వం నిత్యం స్యాత్. జగత్తు, తటిత్తు, మరుత్తు, హరిత్తు, సరిత్తు ఇత్యాది.

హ్రస్వముకంటెఁ బరమై యున్న హల్లునకు ద్విత్వము నిత్యముగా వచ్చును. జగత్తు మొ॥.

'దే(ర్ద్వి)ర్బహులమ్' అనుపూర్వసూత్రము ననుసరించి యిట ద్విత్వ మని గ్రహింపవచ్చును. 'హెూహ్రస్వస్య' - అనులక్షణమును బట్టి 'హ' యనునది హ్రస్వమునకు సంజ్ఞ. హ్రస్వము మీఁది హల్లునకు ద్విత్వము నిత్యము. ఉత్వ మెల్ల యెడల నిత్యమె. జగత్తు ఇట జగతు అను ద్విత్వము రాని రూప ముండదు.

'ద్వ్యుత్వేసుపి' యను సూత్రము ద్విత్వోత్వములను సామాన్యముగాఁ జెప్పినది. అట్టియెడల దే(ర్ద్వి)ర్బహులమ్ అను పూర్వసూత్రము ననుసరించి దీర్ఘము మీఁద బహుల మనుటచే హ్రస్వము మీఁద నట్లు గా దనియు ద్విత్వము తప్పక వచ్చు ననియు నర్థము సిద్ధ మగుచునే యున్నది. 'హాన్నిత్యమ్' అనునర్థము పూర్వ సూత్రము చేతనే సిద్ధ మగుచుండఁగా మఱల నిట్లు చెప్పుట వలనఁ బ్రత్యేకముగాఁ బ్రయోజనము గానరాదు. స్పష్టప్రతిపత్తి యని మాత్రము చెప్పు కొనవచ్చును.

వి. విద్వదాదిగణస్య స్పృగాదిగణత్వాత్ - విద్వాంసుఁడు, వర్షీయాంసుఁడు, గరీయాంసుఁడు, కనీయాంసుఁడు, పాపీయాంసుఁడు, అనడ్వాహము.

విద్వత్ మున్నగు శబ్దములు స్పృగాదిగణమునం దున్నవి. కావున 'స్పృగాదేరమ్వత్' అనుసూత్రముచే ద్వితీయై కవచనాంతతుల్యరూపము ప్రాతిపదిక మయి 'డుమ్మాహ్వత్' అను సూత్రము ననుసరించి మహదమహత్త్వములను బట్టి డుబ్మువర్ణకములు వచ్చును.

1. నిత్యంహ్రస్వాద్విః అం.కౌ.హ.6.

విద్వత్ శబ్దము దీని ద్వితీయైకవచనాంతతుల్యరూపము 'విద్వాంస' - దీనిపై సువిభక్తికి డుజ్జు వచ్చి విద్వాంసుఁడు. 'అనడ్వాహ' - ఇది యమహత్తు గావున మువర్ణకము వచ్చి అనడ్వాహము.

వి. ద్విషత్తు - ద్విషదుఁడు, భూభృత్తు, ఇంద్రజిత్తు,
మహజ్జగదాదిగణస్య భూభృత్తుఁడు, ఇంద్రజిత్తుఁడు
ఇత్యేవం సులోపానంతరం డుజ్ప్రత్యయో నాస్త్యేవ.

జగత్ మున్నగు వానిలో నుండి ప్రథమైకవచనాంతతుల్యరూపము ప్రాతిపదికగా నిల్చిన శబ్దములకు 'జగదాదేస్సులోపః' అను సూత్రముచే సుప్రత్యయము లోపించును. కావున భూభృత్తు, ఇంద్రజిత్తు ఇత్యాదిగనె యుండును. మహత్తు లయినను వీనికి డుజ్జు రాదు. భూభృత్తుఁడు అనురీతిగా నుండ వని యర్థము. ఇంద్రజిత్తుఁ డని ప్రయోగములు గలవు.

11. హనుమతోడ్డగ్రావణస్య.

రావణస్య = రావణుని మతమునందు, హనుమతః = 'హనుమత్' అను శబ్దమునకు, 'డక్' = డక్కు అనునది యగును.

వి. హనుమచ్ఛబ్దస్య మతుపో మధ్యాన్తయో
రజ్ఝలో ర్డగాదేశ స్స్యాత్ రావణస్య మతే.

'హనుమత్' అనుశబ్దములో మతుప్ ప్రత్యయమునందలి నడిమి చివరి వర్ణములకు డక్ అనునది యాదేశ మగు నని రావణుని మతము 'మధ్యాన్తయోరజ్ఝలోః' అనుటలో హనుమత్ లో 'అత్' అను భాగమున 'డ' గాదేశ మగు నని వివృతికర్త యుద్దేశ్యము గానోపును.

కాని యట్లు చెప్ప నాధార మేమి? 'డక్' లో కకారమును ముందటి డకారము నిద్వర్ణములు గావున నవి లోపింపఁగా 'అ' అనునదే నిల్చును. డిత్తు గావున దీని పరకత్వమున 'టి' (హనుమత్ - అత్) లోప మగు ననవచ్చును. హనుమ్ + అ 'హనుమ' యని రూప మగును. కాని 'శేషాదేశయోశ్చ' యనుతర్వాతి లక్షణముచే సులోపము రావలెను. గాన నిట్లు గాక 'హనుమత్' అనుచో నంత్యవర్ణము తకారమున కాదేశమై (హనుమ + అ) సంధి జరిగి 'హనుమ' అని యయ్యె నని చెప్పు టుచితమా? ఇది యాచ్ఛికముగా గుర్తించిన శేషాదేశయోశ్చ యను దాని ప్రసక్తి లేక స్త్రీ సమత్వముచే సులోపము గుర్తింపవచ్చు.

కాని ఈ ప్రకరణమును బట్టి హనుమ యనునది సంస్కృతసమ మనవలయును. మహాహనుమ ఇత్యాదిగా నిది సంస్కృతసమమే యని నిరూపించు నాధారము గానరా కున్నది. ఈ లక్షణమును దద్భవప్రకరణమునం జెప్పిన బాగుండెడిది. తరువాతి లక్షణ మట్టిదే.

'రావణస్య' యనుటచే నియ్యది యొక పక్షము. కావున మతాంతరమున రూపాంతర మేర్పడును.

'హనుమతోడక్' అని సామాన్యముగాఁ జెప్పుటచేఁ బ్రాతిపదికకు సామాన్యముగనె కలుగును గావున 'డక్' అన్ని విభక్తులయందును గాననగును.హనుమను, హనుమచేత మొ॥
।

## 12.శేషాదేశయో శ్చ.

వ్యా. శేషాదేశయోః చ = శేషమునకును, నాదేశమునకును బర మయియున్న సువిభక్తికిఁ గూడ లోపము వచ్చును. వివృతి యాధారముగా దీని యర్థ మిట్లు చెప్పుకొనవలసి యున్నది.

వి. శేషాదేశయోః పరస్య సోర్లోప స్స్యాత్. హనుమ –
ఓ హనుమ, హనుమచేత, హనుమ కొఱకు, హనుమకు ఇత్యాది.

హనుమత్ అనుచో 'హనుమతోడగ్రావణస్య' యను సూత్రముచే డగాదేశము వచ్చినది. కావున నా దేశమునకుఁ బరముగాఁ బ్రథమైకవచనవివక్షలోఁ జేరియున్న సుప్రత్యయమునకు లోపము వచ్చి 'హనుమ' అను ప్రథమైకవచనాంతరూప మేర్పడును.

వి. మాన్వానోర్మంతవంతావిత్యనేన హనుమంతుఁడు
ఇత్యేకం రూపంచ.[1]

'మాన్వానోర్మంతవంతౌ' (తద్భ.95) యను లక్షణము ననుసరించి 'మాన్' అనుదాని స్థానమున 'మంత' అనియును 'వాన్' అనుదానికి 'వంత' అనియు నాదేశ మగును. ఇట్లు 'హనుమాన్' అనుదానిలో 'మాన్' అనుదానికి 'మంత' యనునది యాదేశమై 'హనుమంత' అని యగును. దీని కుత్వము ను డుజ్జును రాఁగా 'హనుమంతుఁడు' అని యగును. 'భగవాన్' అనుచో 'వాన్' అనుదానికి 'వంత' అనునది యాదేశమై 'భగవంత' అని యగును. ఉత్వడుజ్జులతో 'భగవంతుఁడు' అని యేర్పడును.

ఈ మేతుబంతములను గూడ విద్వదాదులలోను, దన్మూలమున నృగాదులలోను జేర్చుకొన్న ద్వితీయైకవచనాంతతుల్యరూపము ప్రాతిపదిక మగును. కావున హనుమంత,

---

1. అంతో.హ.4.తద్భ.95 (హ.త్రి.శ)
మతుహోమంతు.వై.చం.హ.31.

భగవంత – అని యే యుండును. ఇప్పక్షమున మాన్, వాన్ అనువానికి విశేషముగా మంత, వంత, అనునవి యాదేశములు చేయ నక్కఱ లేదు. 'మాన్వానోర్మంతవంతౌ' (తద్భ).

ఇదియుఁదద్భవమా? (కవిశి.547) (తద్భ.95)

## 13. లుజ్నాన్తస్య హలః.

వ్యా. నాన్తస్య = నకారాంతశబ్దముల, హలః = తుదిహల్లునకు, లుక్ = లోపము వచ్చును.

వి. నాంతపదస్య హలోలుక్ స్యాత్.కరి, పథి,శార్ఙ్గి, ధన్వి, మాలి, శూలి ఇత్యాది.

నకారాంతము లగు శబ్దముల చివరి హల్లున కనఁగా ఁదుదినకారమునకు లోపము వచ్చును.

'కరిన్' అను శబ్దమునం దిట్లు నకారము లోపింపఁగా 'కరి' అని యగును. 'సోర్హల్గితః' అని దీనిపై సువిభక్తి లోపించును.

ఇట్టి శబ్దములను జగదాదులలోఁ బఠించుకొని యున్నచోఁ బ్రథమైకవచనాంత తుల్యరూపము ప్రాతిపదిక మగును. అపుడు ప్రాతిపదికమె 'కరి' అనురీతిగా ఇదంతమయి యుండును. కావున 'లుజ్నాన్తస్య' యని నకారమునకు లోపము చెప్పుట గాని, 'ఇద్వదిన్నంతస్య యన్నదియుఁ జెప్ప నవసరము లేక లాఘవము సిద్ధించెడిది.

## 14. ఇద్వదిన్నన్తస్య[1].

వ్యా. ఇన్ + అన్తస్య = 'ఇన్' అను భాగము చివరఁ గలిగిన దానికి, ఇత్ వత్ = ఇకారాంతమునకువలెనె కార్యము లగును.

వి. ఇన్నన్తస్య ఇదన్తవత్ కార్యం స్యాత్. ఇదన్తత్వాత్ సులోపః. శంఖి, కరి, శూలిచేత, ధనికొఱకు, మాలి వలన, శార్ఙ్గికి, చక్రియందు ఇత్యాది.

ఇకారాంతశబ్దములకు విధింపఁబడిన కార్యములే ఇన్నంతము లగు శబ్దములకు వచ్చును. శంఖిన్, కరిన్, మొద లగునవి యిన్నంతములు. వీనిచివరినకారమునకుఁ 'లుజ్నాంతస్యహలః' అనుపూర్వసూత్రముచే లోప మగును. కావున శంఖి, కరి అను రీతిగా నివి యిదంతములే యగును. కృతకముగా నిదంతము లయిన యీ శబ్దములు సహజముగా నిదంతము లయిన

1. ఇతామివేన్నన్తానాంస్యుః త్రి.శ.3.39.

శబ్దములకు వలె సొర్లుగిత (అజన్త-43) యని ప్రథమైక వచనలోపమును, ఉదృహుత్వే (అజన్త-45)యని బహుత్వమున నిత్యమున కుత్వము మొద లగు కార్యములు గలుగును. శంఖి, శంఖులు, ఓశంఖి మొ॥.

'సొర్లుగితః' మొద లగు సూత్రములకడ నిదంతత సహజమా కృతకమా యనువివక్ష చేయనవసరముగానరాదు. అట్టి వివక్ష లేనపుడు నకారలోపానంతర మిదంతము లయిన యాశబ్దముల కా కార్యములు కల్గుటలో బాధ లేదు. ఈ సూత్రము స్పష్టత కనవచ్చును.

## 15. అద్వదన్నన్తస్య[1].

వ్యా. అన్నన్తస్య = అన్ అనునది చివరఁ గలిగినశబ్దమునకు, అదన్తవత్ = అదంతశబ్దములకువలెఁ గార్యము లగును.

వి. అన్నన్తస్య అదన్తవత్ కార్యం స్యాత్.

నకారాంతము లగు శబ్దములు చివర 'అన్' అనునది కలిగియున్నచో వానికి నదంతము లగు శబ్దములకుఁ గలుగు కార్యములె వచ్చును. ఈ శబ్దములకుఁ జివర నున్న నకారమునకు 'లుజాన్తస్య హలః' అను సూత్రముచే లోపము రాఁగా నవి యదంతములె యగును. దేవశర్మన్ - దేవశర్మ. కర్మన్ - కర్మ మొ॥ ఇట్టి శబ్దములకు సహజముగా అదంతము లగు శబ్దములకువలె నాయాకార్యము లగును. పుంలింగమహద్వాచక మయినచో నుత్వడుజాదులు, నపుంసకము గాని యమహత్తు గాని యయినచో మువర్ణకాదులును గలుగును.

దేవశర్మ(న్) అనునది పుంలింగమగు మహద్వాచకము గావున నుత్వడుజ్జులతో దేవశర్ముఁ డని యగును. కర్మ(న్) అనునది నపుంసకము (అమహత్తును) కావున మువర్ణకముతో కర్మము అని యగును.

నకారలోపముచే నేర్పడిన యదంతత కృతక మనుట వాస్తవమె యయ్యును నదంతములకుఁ జెప్పినయాయా కార్యములు సహజ మగు శబ్దములకే యని నియమ మున్నదా? సహజమా కృతకమా యను వివక్షయే చేయకున్నచోఁ బ్రస్తుతసూత్రమునవసరమే లేదు. స్పష్టతకయి యిట్లు చెప్పఁబడిన దనవచ్చును.

అన్నంతములను జగదాదులలోఁ జేర్చినచోఁ బ్రథమైకవచనాంతతుల్యరూపము ప్రాతిపదికముగా నిల్చును గావున వీనికిఁ దుదిని నకారలోపము చెప్ప నవసర ముండదు. కాని 'జగదాదేస్సులోపః' అని సామాన్యముగా సులోపము చెప్పుటచే దేవశర్మ, కర్మ అనురీతిగా నేర్పడును. కాఁగా వీనికి డుజాదులు సిద్ధింపకుండఁబోవును. అందుకయి యీవిధానము ప్రత్యేకముగా నుద్దేశించి యుండును.

1. అన్నంతానామదంతానామివ. త్రి.శ.3.35.

## 16. వాఽక్చ.

వ్యా. అన్నన్తస్య = అన్ అనునది చివరఁ గలిగిన శబ్దమునకు, వా = వికల్పముగా, అక్ చ = (సుస్థానమున) అక్ప్రత్యయమును వచ్చును. 'అద్వదన్నన్తస్య' యనుపూర్వసూత్రమునుండి 'అన్నన్తస్య' అనుపద మనువర్తించును.

వి. అన్నన్తస్య వికల్పేన అక్చ స్యాత్. అక్పక్షే ఋదన్తవత్[1].
ఆత్మ, మహిమ, గరిమ. అగభావపక్షే అదంతవన్ముల్ ప్రత్యయః. ఆత్మము, మహిమము, పీడిమము, గరిమము, పరమాత్మ - పరమాత్ముఁడు, అర్యమ - అర్యముఁడు, సూత్రామ - సూత్రాముఁడు, హిమధామ - హిమధాముఁడు ధామ - ధామము, మఘవ - మఘవుఁడు ఇత్యాది.

అన్ అనుభాగము చివరఁ గలిగిన శబ్దమునకు వికల్పముగా 'అక్' అనుప్రత్యయము వచ్చును. 'ధాత్రాదేరగుః' అని యక్ప్రత్యయాంతము లగు ఋకారాంత శబ్దములకువలె వీనికి రూము లగును. కకార మిత్తు గావున లోపింపఁగా 'అ' అనునదే నిలుచును.

'ఆత్మన్' అనుశబ్దమున 'లుజాన్తస్య హలః' అను సూత్రముచే నకారము లోపింపఁగా ఆత్మ అని యగును. దీనిపై సుప్రత్యయమునకు అక్ ప్రత్యయము వచ్చి ఆత్మ + అ - అనుచో సంధి జరిగి 'ఆత్మ' అని యగును. 'రాజ్ఞోణుర్నిత్యమ్' అను తరువాత విధించిన ణు ప్రత్యయము సుస్థానమున నని వివరింపఁబడుటనుబట్టి యీ అక్ప్రత్యయము సుస్థానమున విధించినట్లు గ్రహింపఁదగును. 'ముల్యసగావ' ఇత్యాది సూత్రము ననుసరించి 'అక్కు' నిత్యప్రకృతి గావున 'నిత్యస్సుపిచ' యని జసాది విభక్తిపరకత్వమునను వచ్చి ఆత్మలు ఇత్యాదిగ రూపసిద్ధి యగును.

'వా' యనుటచే నిది వికల్పము గావున రాని పక్షమునందు డుజాదులు వచ్చును. మహత్త్వమునం దాత్ముఁడు, నమహత్త్వమున నాత్మము.

ఆత్మన్ శబ్దమునకును, ఇమనిచ్ ప్రత్యయాంతములకును. నాంతము లగు మనుజసంజ్ఞలకు నిట్టి ద్వైరూప్యము నితర లక్షణ గ్రంథములనుబట్టి గుర్తింపవచ్చును. కావునఁ దదితరములకు 'అక్' ప్రత్యయ మునలు రానేర దని యీ సూత్రమందలి 'వా' శబ్దమునకు వ్యవస్థ చేసికొనఁదగును. సుధన్వుఁడు, సుధన్వ యనురూప ముండదు. వివృతియం దిచట అర్యమ, హిమధామ - మొదలగు రూపములు చూపఁబడినవి. కాని యట్టి ప్రయోగములు వెదుకవలసి యున్నది.

---

1. పక్షేఋదన్తవత్. త్రి.శ.3.36.

అశ్వత్థామన్ మున్నగుశబ్దములకు 'నశ్వత్థాముఁడు' అనువిధ మయిన రూపములు లేకుండుటనుబట్టి వానికి 'అక్' ప్రత్యయము నిత్యముగా వచ్చు నని 'వా'శబ్దమున కర్థమును నియమించుకొనఁదగును. అశ్వత్థామ విశ్వకర్మ మొ॥

## 17. రాజ్ఞో ఞు ర్నిత్యమ్[1].

వ్యా. రాజ్ఞః = రాజన్ శబ్దమునకు, నిత్యమ్ = నిత్యముగా, ఞుః = ఞుఅనుప్రత్యయము వచ్చును.

వి. రాజన్శబ్దస్య సోర్ఞుప్రత్యయో నిత్యం స్యాద్విభక్తౌ సమాసే చ. రాజన్శబ్దస్య (అ)నోలోపే రాజ + సు ఇతి స్థితే చుటూ ఇతి ఞకారస్య ఇత్సంజ్ఞాయాం సత్యాం పరరూపసిద్ధిః. రాజు, రాజులు, రాజుచేత, రాజుకొఱకు, రాజువల్ల, రాజునకు, రాజునందు, రాజుకొడుకు, రాజువిల్లు, రాజునాజ్ఞ ఇత్యాది.

రాజన్ శబ్దమునకు విభక్తి పరమగునపుడును సమాసమందును ఞు ప్రత్యయము వచ్చును. ఈ ఞుప్రత్యయము సువిభక్తి కాదేశముగను, జసాదివిభక్తిపరకత్వమునఁ బ్రాతిపదికకును జేరు నని (వివృతిననుసరించి) గ్రహింపఁదగును. ఈ ప్రత్యయము సమాసములందు నగును. 'చుటూ' యని ఞువర్ణకమందలి ఞకార మిత్తు గావున లోపించును. ఉకారము మాత్రమే మిగులును.

రాజన్ శబ్దమున 'లుప్తాన్త స్య హలః' అను సూత్రముచే నకారము లోపించి రాజ అని యుండఁగా దీనిపైఁ బ్రథమైకవచనవివక్షలో సుప్రత్యయము చేరి రాజ + సు అని యుండును. ప్రస్తుతసూత్రముచే సుస్థానమున ఞుప్రత్యయము వచ్చి - రాజ + ఉ అని కాఁగా సంధి యై రాజు అనురూప మేర్పడును. ఇతర విభక్తులలోఁ బ్రాతిపదికకుఁ జేరి రాజులు ఇత్యాదిగా రూపము లగును.

ఞుప్రత్యయము సమాసములందును వచ్చు నని వివరించుచు వివృతి రాజుకొడుకు మొదలగునవి యిందుల కుదాహరించెను. అలౌకిక విగ్రహమున సంస్కృతవిభక్తులే లోపించుపక్షమున రాజ + కొడుకు అని యుండును. అపుడు సమాసమునందును ఞుప్రత్యయము రావలసియే యుండును. కాని యిదే పద్ధతిలో 'సేనేర్వాలుక్' అని

---

1. రాజ్ఞో ఞుర్నిత్యమేవ స్యాత్. త్రి.శ.3.37.

రామునికొడుకు అనుచోట్ల నివర్ణలోప మేల చెప్పెనో సమన్వయింపఁబడదు. సిద్ధసమాసాంతమున నున్న రాజశబ్దమునకు (టచ్ ప్రత్యయాంతమునకు) ణుప్రత్యయము రావసియున్నది. లేకున్న మహారాజు ఇత్యాది రూపములు సిద్ధింపవు. సమాసములందు నగుననుదాని కట్టి సమన్వయనముతోఁ బ్రయోజనమును సాధించిన బా గుండెడిది.

## 18. తత్పురుషే కణ్వస్య[1].

వ్యా. కణ్వస్య = కణ్వునిమతమున, తత్పురుషే = తత్పురుషసమాసములందు రాజన్ శబ్దములోని జకారమునకు చకారము వచ్చును.

వి. షష్ఠీతత్పురుషసమాసే రాజన్ శబ్దజకారస్య చకారస్యాత్కణ్వస్య మతే. రాచపట్టి, రాచకొడుకు, రాచకూఁతురు, రాచవాఁడు, రాచవారు, రాచటీకము, ,రాచవీడు రాచకులము ఇత్యాది.

షష్ఠీతత్పురుష సమాసమున రాజశబ్దములోని జకారమునకు చకారమగును. ఇట నేది విధింపఁబడుచున్నదో యది సూత్రమున స్పష్టముగా లేదు. కణ్వాదివ్యాకరణము లిపుడు లభ్యము గావు. కావున నవి యెఱిఁగిన వివృతికారుని వాక్యములే ప్రమాణముగా నీసూత్రము రాజు శబ్దములో జకారమునకు చకారము విధించుచున్నదని గ్రహింపవలెను.

(షష్ఠీ) తత్పురుషసమాసములో రాజశబ్దమునందలి జకారమునకు చకారము వచ్చు నని కణ్వునిమతము రాజు యొక్క పట్టి = రాచపట్టి, జకారమునకు చకారమనుటవలన రాజ + పట్టి, యనియె చూపవలసి యుండును. లేక రాజు (యొక్క) పట్టి యని గ్రహించుచో రాచుపట్టి కావలెను. అట్లును గాదన్న జువర్ణమునకు చవర్ణము విధింపవలెను.

షష్ఠీతత్పురుష సమాసములం దని వివరించినను, రాచటీక మను తద్ధితాంత ముదాహరింపఁబడుట గమనార్హము. రాజుయొక్క భావ మని యిందును రాజన్ శబ్దము షష్ఠ్యంత్యమె కావచ్చును, కాని దీనిని షష్ఠీతత్పురుష సమాస మనుట యొప్పదు గదా. సూత్రమునందలి తత్పురుషశబ్దము వివృతిసామాన్యమున కుపలక్షక మని గ్రహింపఁదగును. బాలవ్యాకరణమున 'సమాసములందు' జెప్పిన ద్రుత స్వత్వాభావము మొదలగునవి తద్ధితప్రత్యయపరకతలోను సమన్వయింపఁబడుట ప్రసిద్ధమే.

'రాచ' అనుశబ్దము వ్యస్తతలోఁ గానరాకుండుటచేత చకారమును వివృతికి సంబంధించిన వికారముగాఁ జెప్పుట యెంతయు నుచితముగా నున్నది. రాకుమారుఁడు రాసుతుఁడు మున్నగు కొన్ని సమాసములలో 'జ' లోపించుటయుఁ గలదు.

---

1. గుజామూనాంకచహా వై.చం.సంధి.46.

'కణ్వస్య' యనుటచే నిది యొకపక్షమె. కావునఁ బక్షాంతరమున జకారమునకు 'చకారము' రాదు. కావున రాజుపట్టి రాజుకొడుకు మొద లగుతీరుగా రూపము లుండవచ్చును. రాచటీక మనుచో రాజటీకమనియు వినిపించును. రాజు తద్భవ మనుటకుఁ దగిన బలమైన యాధారము కనఁబడుచో తొత్తటీకము వలె రాజటీక ముండు ననవచ్చును.

## 19. డుజో లోపశ్చ.

వ్యా. రాజన్ శబ్దమునకుఁ బైనున్న, డుజః = డుఙ్ప్రత్యయమునకు, లోపఃచ = లోపము సయితము వచ్చును. ఙువర్ణముతోపాటు డుఙ్లోపమును వచ్చునని యర్థము.

వి. రాజన్ శబ్దస్య డుఙ్ప్రత్యయస్య లోపస్స్యాత్. రాజు ఇత్యత్ర ఉదన్తత్వాత్ డుజి ప్రాప్తే సతి అనేన సూత్రేణ డుజో లోపస్స్యాదిత్యర్థః.

రాజన్ - 'లుఙ్నాన్తస్యహలః' - రాజ. 'రాజ్ఞోఙుర్నిత్యమ్' - రాజు + సు అనుచో రాజు శబ్ద మనిదంత మయినది గావున 'మహతస్సోర్డుజనితః' అనుసూత్రముచే డుజ్జు రాఁగా రాజు + డుజ్ అనుచో బ్రస్తుతసూత్రముచే డుజ్జు లోపించి 'రాజు' అని యేర్పడును.

ఈ లక్షణము కొంతవివాదాస్పద మగుచున్నది.

'రాజ్ఞోఙుః' అను సూత్రమునొద్ద వివృతిలో 'సోర్ఙుప్రత్యయోనిత్యం విభక్తౌ చ' యని ఙుప్రత్యయము సుస్థానముననే వచ్చు నని పేర్కొనఁబడినది. ఆ తరువాతి నలోప పరరూపముల ప్రస్తావనమును బట్టియును ఙుప్రత్యయము సువిభక్తి స్థానమున (ఇతరవిభక్తులు పరమైనఁ బ్రాతిపదికకును) వచ్చు ననియే వివృతి యభిప్రాయము స్పష్టమగుచున్నది.అట్లు ఙుప్రత్యయము సుస్థానముననే వచ్చుచుండఁగా నింక డుజ్జు వచ్చుట కవకాశ మెక్కడిది?

'రాజు ఇత్యత్ర ఉదన్తత్వాత్ డుజి ప్రాప్తే' యన్నది యిట వివృతి అనిదంతముల సుస్థానమున డుజ్జు వచ్చును. గావున నుదంత మైనను దీనిపైని సువిభక్తికి డుజ్జు వచ్చును. కాని 'సు'పరముగా నట్లయుండఁగా నిది యుదంతము గానలయునన్నఁ బ్రథమైకవచన స్థలమునను ఙుప్రత్యయము ప్రాతిపదికకే యగు ననవలయును. 'డుజోలోపశ్చ' యని డుజ్లోపమును జెప్పుటనుబట్టి యచ్చోట వివృతి 'సోర్ఙుః' అనుట ప్రామాదిక మని యెంచుదము.

అట్టియెడల నసలు 'ఙు'ప్రత్యయమును విధించుట యేల? 'రాజన్' శబ్దమున 'లుఙ్నాన్తస్య' అని నకారము లోపింపఁగా విభక్తి పరకత్వమున నెల్లయెడల నుత్వము

---

డుజోలోపశ్చనమ్మతః త్రి.శ.3.38.

'మహతస్సప్తమ్యదతో' యనుసూత్రముచేతఁ బ్రాప్తించుచునే యున్నది. ఇంకఁ బ్రథమైకవచనమున దుజ్జే నిలుచుట యొక్కటే యిష్టముగాదు కావున నిట్లు దుజ్జునకు లోపము చెప్పుకొనఁదగును. కాఁగా ణుప్రత్యయము లేకు న్నను నిబ్బంది యేమి? రాజునిచేత (రామునిచేత) ఇత్యాదిగా నివర్ణము రావలసియుండ నది వారించుటకై 'ణు' ప్రత్యయమును విధించె ననువచ్చును. అట్లు వారింపఁబడు మార్గమును మృగ్యమై యున్నది. చూడంజూడ ణుప్రత్యయము చేతను, దుజ్లోపముచేతను నీరూపములు రెండువిధములుగా సాధింపఁబడినవా యని సందేహము.

## 20. అద్వ్యదసంతస్య.[1]

వ్యా. అసన్తస్య = 'అస్' అనుభాగము చివరఁగలిగిన శబ్దములకు, అత్ వత్ = అదంతములగు శబ్దములకు వలె నాయా కార్యములగును.

వి. అసంతస్య అదంతవత్ కార్యంస్యాత్.

అసంతముల కదంతములకువలెఁగార్యములగును.

అకార ముపధగాఁ గలిగిన సకారాంతశబ్దములకుఁ గొన్నింటికి 'సళ్ళ' యను సూత్రముచేఁ దుదిసకారమునకు వికల్పముగా లోపము వచ్చును. అట్లు సకారము లోపింపగా మిగిలియున్నశబ్ద మదంత మగును. సహజముగా అదంతము లయిన శబ్దములకు యే కార్యములు గలుగునో వీనికి నవియే కార్యము లగును. ముపర్ణకాదులు గలుగు నని భావము.

మనస్ – మన – మనము – మనములు మొ॥ 'అద్వ్యదన్వంతస్య' యను లక్షణమువలె నిదియు స్పష్టతకయి చెప్పఁబడినదే యనవచ్చును. దీనికిఁ బ్రయోజనాంతరము గానరాదు. 'అసన్తస్య' యను నిర్దేశమునుబట్టి సాంతములతుది సకారము లోపింపకున్నప్పటికి నదంతములకువలెఁ గార్యము లగు నని చెప్పుటకు వీలు లేదు. సాంతము లైనపుడు జగదాదులలోఁ జేరి ద్విత్వోత్వములును, సులోపాదులను బొందును మనస్సు.

## 21.ద్వేర్లుగ్వా మనః ప్రభృతేః[2].

వ్యా. మనః ప్రభృతేః = మనస్ మొదలగుశబ్దములయొక్క, ద్వేః ద్విత్వమునకు, వా = వికల్పముగా, లుక్ = లోపము కలుగును.

---

1. అనంతానామ్మతానమివ త్రి.శ.4.24.

2. ద్విత్వాభావః క్వచిద్ జ్ఞేయః త్రి.శ.4.25.

వి. మనోగణస్య సాన్తస్య ద్విత్వస్య వా లోప స్స్యాత్.

మనస్సు - మనసు, శిరస్సు - శిరసు, యశస్సు - యశసు,

తపస్సు - తపసు, నభస్సు - నభసు, తమస్సు - తమసు ఇత్యాది.

సకారాంతము లగు మనస్ మొదలగుశబ్దముల తుది సకారము యొక్క ద్విత్వమునకు వికల్పముగా లోప మగును. 'సశ్చ' యను సూత్రముచే వికల్ప మయిన సలోపము రానిపక్షమునందు 'మనస్' అనురీతిగా నున్న యీశబ్దము (జగదాదిగణమునఁ జేరియుండును) ల తుదిహల్లునకు 'ద్వ్యత్వేసుపి' యను సూత్రముచే ద్విత్వము నుత్వమును వచ్చును. 'హ్రస్విత్యే' మ్మను సూత్రము ననుసరించి హ్రస్వముమీఁది హల్లునకు ద్విత్వము నిత్యముగ వచ్చును. అట్లయిన ద్విత్వమునకు 'మనస్' మొదలగు శబ్దములలో వికల్పముగా లోపము వచ్చు నని యీసూత్రము చెప్పుచున్నది. ద్విత్వోత్వములు రెండింటిలోను, ద్విత్వమునకు మాత్రమె లోపము చెప్పుటచే నుత్వము సూత్ర మట్లేయుండును. మనసు, శిరసు మొ॥.

'వా' యనుటచే ద్విత్వము లోపింపని పక్షమునందు మనస్సు, శిరస్సు అనురీతిగ నుండును. 'మనఃప్రభృతేః' అనుటచే సాంతములకు మనఃప్రభృతులలో లేనివానికి ద్విత్వలోప మసలు లేదు. పయస్సు మొ॥

## 22. సశ్చ.

వ్యా. మనఃప్రభృతేః = మనస్ మొద లగు శబ్దములయొక్క, సః చ = తుది సకారమునకు సైతము, వా = వికల్పముగా, లుక్ = లోప మగును.

వి. మనోగణస్యాన్త్యసకారహలశ్చాపి వికల్పేన లుక్ స్యాత్. మన,శిర,యశ,తప,తమ,ఇతి స్థితే అదన్తత్వాద్డుమ్వోః ప్రాప్తయోః - మనము, శిరము, యశము, తపము, తమము; జాతవేదుఁడు, జాతవేదస్సు, జాతవేదసు; బిడౌజుఁడు, బిడౌజస్సు, బిడౌజసు; (అంగిరసుఁడు) అంగిరుఁడు, అంగిరస్సు అంగిరసు; ఉచ్చైశ్శ్రవము, ఉచ్చైశ్శ్రవస్సు, ఉచ్చైశ్శ్రవసు; సర్పి, సర్పిస్సు, సర్పిసు, ఉదన్తత్వాత్ - ధనువు, ధనుస్సు ధనుసు - చక్షువు, చక్షుస్సు చక్షసు.

'ద్వేర్లుగ్వా మనః ప్రభృతేః' అను పూర్వసూత్రమునుండి 'లుగ్వా మనః ప్రభృతేః' అనునది యిట ననువర్తించును. మనస్ మొదలగు శబ్దములయందలి చివరి సకారమునకు వికల్పముగా లోపము వచ్చును. సకారము లోపించినపక్షమునందు 'అద్వదసన్తస్య' యను సూత్రము ననుసరించి యదంత శబ్దముల కగుకార్యములె వీనికిఁ గలుగును. పుంలింగ మగుమహద్వాచక మయినచో ఉత్వడుజాదులును, నితర మయిన మువర్ణకము నగును.

మనస్ అను శబ్దమున నీ సూత్రముచే సకారము లోపించి 'మన' అని యుండఁగా నిది నపుంసకలింగము గావున దీనిపైని సువిభక్తికి 'ములత స్సోః క్లీబే' (అజన్త-61) యను సూత్రముచే ముప్రత్యయము వచ్చి మనము అని యగును.

జాతవేదస్ అను శబ్దమున సకారము లోపించి జాతవేద అని యుండఁగా నిది మహత్పుంలింగము గావున మహతస్సుప్యుదతః, మహతస్సోర్డుజనితః అని ప్రథమైకవచనమునం దుత్వడుజ్జులు వచ్చి జాతవేదుఁడు అని యగును.

వికల్పము గావున సకారము లోపింపని పక్షమునందు 'ద్వ్యుత్వేనుపి' అని సకారమునకు ద్విత్వోత్వము లగును. పైని ప్రథమైకవచనమునకు 'జగదాదేస్సులోపః' అనుసూత్రముచే లోపము కల్గును. మనస్సు, జాతవేదస్సు, 'ద్వేర్లుగ్వా మనః ప్రభృతేః' అను సూత్రముచే ద్విత్వము లోపించిన పక్షమునందు మనసు, జాతవేదసు అనురీతిగను రూపము లుండును.

వీనిలో మహచ్ఛబ్దములకు జాతవేదస్సు, జాతవేదసు అనురీతిరూపములు ప్రసిద్ధములుగాఁ గానరావు.

సర్పిస్ అనుచో సలోపానన్తర మిదంతమైనది గావున 'సోర్లుగితః' యని పైనున్న సువిభక్తి లోపించును.

'అద్వదసన్తస్య' అన్నట్లుగాను, ఇద్వదిన్నంతస్య యన్నట్లుగను 'ఇద్వదిసంతస్య' యను సూత్రమిందుఁ గానరాకున్నది. అయ్యును గార్యము లట్లే యని గ్రహింపకతప్పదు.

ఇట్లే ఉసంతములలో సకారము లోపించి యుదంతము లయిన వీనికి సహజోదంతములకువలెనె వువర్ణకాదు లగును. ధనుస్ – ధను అనికాఁగా 'ఉతపుస్సర్వత్ర' యను సూత్రముచే సుస్థానమున వువర్ణక మయి 'ధనువు' అని యగును.

పక్షమునందు మనస్సు, మనసు అనురీతిగనె సర్పిస్సు, సర్పిసు, ధనుస్సు, ధనుసు అనువిధముగా రూపము లుండు నని వివృతి ననుసరించి చెప్పుకొనవలయును. 'సర్పిస్' అను మొదలగునవి మనః ప్రభృతులలోఁ జేర్చుటకుఁ దగిన ప్రయోగ ప్రమాణము వెదుకఁ దగియున్నది.

మనః ప్రభృతు లట్లు పేర్కొనఁబడినవి.

వి. గణపాఠః– "మనశ్శిరసురస్వక్షస్యశస్తేనభస్తమస్తపశ్చక్షుర్ధనుస్సర్పిస్ – 'చేత్యాదిఃస్యాన్మనోగణః' ఇత్యాదిదిర్మనోగణః.

మనస్సు, మనసు, మనము; శిరస్సు, శిరసు, శిరము, ప్రోవణాంకకృతే ప్రబంధసారకృష్ణాభ్యుదయే -

సీ॥ చెలువకు మనసార శిరసంటువేడుక
 నీకె గాక మఱొకనికి నలవియె – ఇత్యాది.
 ఉరస్సు, ఉరసు, ఉరము; వక్షస్సు, వక్షసు, వక్షము;
 తేజస్సు, తేజసు, తేజము; నభస్సు, నభసు, నభము;
 తమస్సు, తమసు, తమము; తపస్సు, తపసు, తపము;
 చక్షుస్సు, చక్షుసు, చక్షువు; ధనుస్సు, ధనుసు, ధనువు;
 సర్పిస్సు, సర్పిసు, సర్పి.

వ్యా. మనస్ శిరస్, మొదల గునవి మనోగణము అవి వివృతియందు స్పష్టముగాఁ జూపఁబడి యున్నవి.

వి. సృగాదిగణత్వాత్ జాతవేదసుఁడు, బిడౌజసుఁడు,
 అంగిరసుఁడు, దుర్వా సుఁడు, ప్రచేతసుఁడు, ఉచ్చైశ్శ్ర
 వసము ఇత్యాది.

వ్యా. జాతవేదస్ మొద లగు సకారాంతశబ్దములు సృగాదిగణములలోఁ జేరియున్నవి. 'సృగాదేరమ్వత్' అనుసూత్రము ననుసరించి సృగాదులలోఁ జేరిన జాతవేదస్ – మొద లగుశబ్దములు ద్వితీయైకవచనాంతతుల్యరూపము ప్రాతిపదికగా నిలుచును. జాతవేదస – అనుశబ్దమునకు 'డుమూప్రాగ్వత్' అను సూత్రమునుబట్టి యదంతములకువలె నుత్వడుజ్ఞులు వచ్చి జాతవేదసుఁడు అని యగును. ఇట్లే అంగిరసుఁడు మొ॥.

ఉచ్చైశ్శ్రవస – అనునది యమహత్తు గావున మువర్ణకము వచ్చి ఉచ్చైశ్శ్రవసము అని యగును. ఇట్టి ప్రయోగము వెదుకవలసి యున్నది.

## 23. న పయః ప్రభృతేః[1].

వ్యా. పయః ప్రభృతేః = పయస్ అనుమొదలగుశబ్దములకు, న = సలోపద్విత్వలోప కార్యములు లేవు.

వి. పయోగణస్య ద్విత్వలోపాంత్య సకారయో ర్లోపౌ
నస్తః పయస్సు, హవిస్సు, రక్షస్సు, చేతస్సు, మహస్సు.

పయస్ మొదలగు శబ్దములలో సక్కాద్విత్వమునకును, సకారమునకును లోపములు లేవు.

'ద్వేర్లుగ్వా మనః ప్రభృతేః' – సశ్చ – యనులక్షణములు మనస్ మొదలగు శబ్దములకు, ద్విత్వమునకును, చివరి సకారమునకును, వికల్పముగా లోపము చెప్పఁబడినది. పయస్ మొద లగుశబ్దములకు నాకార్యములు లేవు. అనఁగా వీనిలోఁ జివరి సకారమునకుఁ గాని ద్విత్వమునకుఁ గాని లోపము రాదు.

'పయస్' అన్నశబ్దమున సకారమునకు 'ద్వ్యుత్వేసుపి' యనుసూత్రముచే ద్విత్వోత్వములు వచ్చి పయస్సు అని కాఁగా దీనిపైని ప్రథమైకవచనమునకు 'జగదాదేస్సులోపః' అనుసూత్రముచే లోపము వచ్చి పయస్సు అనుపద మేర్పడును. ప్రస్తుతసూత్రము ననుసరించి సలోపము లేదు గావున 'పయము' అనువిధ మయిన రూప ముండదు. అట్లే యీసూత్రముచే ద్విత్వలోపమును లేదు గావున 'పయసు' అనురీతిరూప ముండదు.

మనఃప్రభృతులలోఁ జేర్పకుండుటచేతనే పయఃప్రభృతుల కీస్థితి స్ఫష్టమగుచుండఁగా నీసూత్రము స్పష్టత నుద్దేశించి చెప్పఁబడిన దని గ్రహింపఁదగును.

## 24. ద్విలుగ్వయసః కణ్వస్య[2].

వ్యా. కణ్వస్య = కణ్వుని మతమునందు, వయసః = 'వయస్' శబ్దమునకు, ద్విలుక్ = ద్విత్వలోపము గల్గును.

వి. వయశ్శబ్దమాత్రస్య పయోగణే ద్విత్వలుక్
స్యాత్ కణ్వస్య మతే. వయస్సు – వయసు.

వయశ్శబ్దమునకుఁ గణ్వునిమతమున ద్విత్వలోప మగును. వయ స్సనుశబ్దము పయోగణమునందలిది. కావున 'న పయః ప్రభృతేః' అనుసూత్రముచే సకారలోపము గాని,

1.సాన్తాదుపయఃప్రభృతేస్సోపః ఆం.కౌ.హ.13, ఆం.శచిం.హ.9.
పహ్యాపయఃప్రభృతేర్లుక్.వై.చం.హ.34.
2. ద్విత్వాభావఃక్వచిద్ జ్ఞేయః త్రి.శ.4.25.

ద్విత్వలోపము గాని వచ్చుట కవకాశము లేదు. కాని పయఃప్రభృతులయందలి వయశ్శబ్దమునకు మాత్రము కణ్వనిమతమునందు ద్విత్వలోపము గల దని సూత్రార్థము.

వయస్ - ద్వ్యత్వే సుపి - వయస్సు - అని కాఁగా 'న పయః ప్రభృతేః' అనులక్షణముచే ద్విత్వమునకు లోపము లేకుండఁగాఁ బ్రస్తుతసూత్రముచే ద్విత్వము లోపించి వయసు అని యగును. 'జగదాదేస్సులోపః' అనుసూత్రముచే దీనిపయిని ప్రథమైకవచనమునకు లోపము వచ్చి 'వయసు' అనుపద మేర్పడును.

'కణ్వస్య' యనుటచే మతాంతరమున ద్విత్వలోపము రాదు. కావున నాపక్షమున 'వయస్సు' అని యుండును.

వి. గణపాఠః- పయస్వయస్సరస్రక్షస్హవి
శేతసాయుస్మహస్రంహస్వచస్సదస్పాథసంహ
సాదిః పయోగణః - ఇతి పయోగణపాఠః -
పయస్సు, వయస్సు, రక్షస్సు, సరస్సు, హవిస్సు,
చేతస్సు, అయుస్సు, వచస్సు, సదస్సు, పాథస్సు,
అంహస్సు, ఇత్యాదిః పయోగణః

పయస్, వయస్ మొద లగు పయఃప్రభృతులు పైని వివృతియందుఁ బెక్కు స్పష్టము.

## 25. వాగ్వార్గీరాడ్జగదాదే ర్వా లుగంత్యస్య.

వ్యా. వాక్ వార్ గీర్ రాట్ జగత్ - ఆదేః = వాక్, వార్, గీర్, రాట్, జగత్ - అను మొదలగు శబ్దముల యొక్క, అంత్యస్య = చివరివర్ణమునకు, వా = వికల్పముగా, లుక్ = లోపము వచ్చును.

వి. వాగాదీనామంత్యస్య హలోవా లుక్ స్యాత్. వాక్ - వాక్కు -
వాకు, వా- (వాః),వార్ - వారు - వా, గీః - గీర్ - గీరు -
గీరు గీ(రము), రాట్ - రాట్టు - రాటు - రాజము,
అమహతి రాజు, రా, జగత్ జగత్తు, జగము, ఇత్యాది.

వాక్ మొదలగుశబ్దములయందలి తుదిహల్లునకు వికల్పముగా లోపము వచ్చును.

'వాక్' అనుశబ్దములో నీ సూత్రముచే 'క' కారము లోపింపఁగా 'వా' యని మిగులును. ఇట్లే వార్ - వా మొ॥ జగత్ - జగ - అని కాఁగా నిది యదంత మయినది గావున (అమహత్తు) 'ములతస్సోఃక్లీబే' యను సూత్రముచే ముప్వర్ణకము వచ్చి జగము అని యగును. 'ఇంద్రజిత్' అనుమొదలగునవి సూత్రమునందలి యాది శబ్దముచే గ్రహింపఁబడును.

'వా' యనుటచే నీలోపము వికల్పము గావున లోపము రానిపక్షమునందు "ద్వ్యత్వే సుపి" యను సూత్రముచే ద్విత్వోత్వము లగును. 'దేర్బహులమ్' అను సూత్రముచే ద్విత్వము మాత్రము బహులము కావున వాకు, వాక్కు అని యగును.

వార్, గీర్, అను శబ్దములకు లోపము రానిపక్షమునందు, వార్రు, వారు, గీర్రు – గీరు అని కావలెను. వార్రు, గీర్రు, అను రూపములు వివృతియందుఁ జూపఁబడలేదు. 'బహుళ' 'దేర్బహులమ్' అను సూత్రమునందలి బహుళశబ్దముచే వీనికి ద్విత్వలోపము నిత్యముగా సమన్వయింపఁబడియుండును. కాఁగా ద్విత్వరహితము లయిన వారు, గీరు అను రూపములును వినఁబడవు. రేఫాంతము లగు సంస్కృతశబ్దములు తెలుఁగులోనికి రావని సూరిపేర్కొనెను. 'భవద్గీర్మఃశబ్దానాం నాత్రయని వికృతివివేకము చెప్పినది.

వా(ర్) గీ(ర్) అనుశబ్దములును దెలుఁగున వినరావు. 'వాఘ' శబ్దమునుండి యేర్పడినదిగా 'వా' యనుశబ్దము సమన్వయింపఁదగియున్నది. సూరి జగత్, ఇంద్రజిత్, అను శబ్దములు రెండింట మాత్రమె యంత్యహల్లోపమును బేర్కొనెను.

## 26. పథిమథ్యాదేర్వాదితః

వ్యా. పథిమథ్యాదేః = పథి, మథి మొద లగుశబ్దములయందలి, ఇతః = ఇకారమునకు, వా = వికల్పముగా, అత్ = అత్వము వచ్చును.

వి. పథిమథ్యాదీనామంత్యేకారస్య వికల్పేన అత్ స్యాత్.

నలోపానంతరమ్ – పథి – పథము, మథి – మథము ఇత్యాది.

పథి,మథి మొద లగుశబ్దములయందలి యిత్వము నకు వికల్పముగా నత్వము వచ్చును.

'పథిన్' శబ్దము 'లుఙ్నాన్తస్య హలః' అను సూత్రముచే నకారము లోపించి 'పథి' అని యుండఁగాఁ బ్రస్తుతలక్షణముచే నిత్యమున కత్వమై 'పథ' అని యగును. 'ములతస్సోః క్లీబే' యని సువిభక్తికి ముద్వర్ణకము వచ్చి పథము అని యగును. ఇట్లే మథము మొ॥

'వా' యనుటచే నత్వము రానపుడివి యిదంతము లయియుండును గావున (ఇద్వదిన్నన్తస్య) సోర్లుగిత యని సువిభక్తి లోపించి పథి, మథి యనుతీరుగా రూపము లేర్పడును.

## 27. పుమర్థేసఖ్యుశ్చ

వ్యా. పుమర్థే = పురుష వాచక మయినపుడు సఖ్యుః చ = సఖిశబ్దమునకు సైతము, ఇతః = ఇకారమునకు, అత్ = అత్వము (వా = వికల్పముగా) వచ్చును.

వి. సఖిశబ్దస్యేకారస్య పుంలింగార్థే వాఽత్ స్యాత్.

చకారో వికల్పార్థః. మా సఖుఁడు వచ్చె, నీ సఖుడు

మెచ్చె ఇత్యాది.

'పథిమథ్యాదేర్వాదితః' అనుపూర్వ సూత్రమునుండి (వా) అదితః అనునవి యనువర్తించును. పురుషుని బోధించునపుడు సఖిశబ్దమునందలి యికారమునకును నత్వము వచ్చును. సఖి – సఖ – అని కాఁగా ప్రథమైకవచనమునందు 'మహత స్సుప్యుదతః' 'మహతస్సోర్డుజనితః' అని యుత్వడుజ్ఞులు వచ్చి 'సఖుఁడు' అని యగును. నరుఁడు నారాయణుని సఖుఁడు.

పుమర్థే యనుటచేఁ బురుషుని బోధించునపుడే యత్వము కావున స్త్రీ మొద లగునర్థములం దత్వము రాదు. 'సోర్లుగిత' యని ప్రథమైకవచనమున 'సు' ప్రత్యయము లోపించును. సీత రామునిసఖి.

'సఖ్యుశ్చ' అన్నప్పటి చశబ్దము వికల్పార్థక మని వివృతి పేర్కొన్నది. ఇది సముచ్చయార్థక మని చెప్పి 'పూర్వసూత్రమునుండి అదితః అనువానితోపాటు 'వా' యన్నది గూడ నను వర్తింపఁజేసికొనవచ్చును. ఏ మయినను బుమర్థమునందుఁ గూడ సఖిశబ్దమున కత్వము వచ్చుట వికల్పము కావున నత్వము రాని పక్షమునం దిదంత మై 'సఖి' యని యుండఁగా ప్రథమైకవచనమున 'సోర్లుగిత' యని సుప్రత్యయము లోపించి 'సఖి' యనియు రూప ముండును. నరుఁడు నారాయణుని సఖి అనియు ననవచ్చు నన్నమాట.

### ఇతి హలంత ప్రకరణమ్.

ఇది శబ్దపరిచ్ఛేదమునందలి హలంతప్రకరణము.

# అథ సర్వనామ ప్రకరణమ్

ఇకసర్వనామములు నిరూపింపఁబడుచున్నవి.

## 1. సర్వవాచ్యం సర్వనామ.[1]

వ్యా. సర్వవాచ్యమ్ = అన్నింటికిని బోధక మగునట్టిశబ్దము, సర్వనామ = సర్వనామ మను సంజ్ఞ గలిగియుండును.

వి.సర్వేషాం వాచ్యం యత్పదం తత్ సర్వనామసంజ్ఞం స్యాత్.

నామములన్నింటికి బర్యాయముగా వానిని బోధించుశబ్దమునకు సర్వనామ మని సంజ్ఞ. రాముఁ డొక్కఁడ బలవంతుఁడు, సీతయొక్కతె గుణవతి మొ॥ వన మొక్కఁ డధికరమ్యము, ఇచట ఒక్క యనుశబ్దము రాముని, సీతను, వనము నన్నింటిని బోధింపఁజాలి యున్నది. కావున నిది సర్వనామ సంజ్ఞను బొందును.

## 2. ఒక్కెల్లవావ్యాదయ స్సర్వనామశబ్దాః

వ్యా. ఒక్క ఎల్ల వా వీ ఆదయః = ఒక్క, ఎల్ల, వా, వీ, మొదలగు నవి, సర్వనామశబ్దాః = సర్వనామములు.

వి. ఒక్క – ఎల్ల – వా – వీ – ఇత్యాదయశ్శబ్దాః సర్వనామసంజ్ఞా స్యుః

ఒక్క మొదలగునవి సర్వనామములు. ఆది శబ్దముచే నీ, నా, తా మన మొదలగునవి గ్రహింపఁబడి సర్వనామసంజ్ఞను బొందును. 'ఎల్ల' శబ్దము సర్వనామముగా నిటఁ జేర్కొనఁబడినది. సూరి దీనిని ద్రుతాంతమయిన యవ్యయముగాఁ జేర్కొనెను.

## 3. జసోరుః[2]

వ్యా. జసః = జస్సునకు, రుః = రువర్ణమగును.

---

1. సర్వవాచ్యం సర్వనామ త్రి.శ.4.48.
2. వారుశ్చ ఆం.కౌ.హ.57.

వి. సర్వనామ్నాం ప్రథమాబహువచనస్య రుస్స్యాత్.

ఒక్కరు, ఎల్లరు, ఏరు, వీరు ఇత్యాది.

సర్వనామముల ప్రథమా బహువచనమునకు రువర్ణమగు.

ప్రకరణమునుబట్టి సర్వనామముల కనునర్థము సిద్ధమగును. 'జస్' అనునది ప్రథమాబహువచనము. ఇది మహదర్థమునందె యగుట గుర్తింపవలయును. కాఁగా మహదర్థమునందు సర్వనామశబ్దములకుఁ బరముగా నున్న ప్రథమాబహువచన మగు'జస్సు'స్థానమున 'రు' అనునది వచ్చును.

ఒక్క + జస్ అనుచో నిట్లు రువర్ణము రాఁగా ఒక్కరు ఇట్లె ఎల్లరు మొ॥

## 4. అమాదౌ చ

వ్యా. అమాదౌ చ = ద్వితీయాది విభక్తులు పరముగా నున్నపుడు సయితము, సర్వనామములకు, రుః = రువర్ణము వచ్చును.

వి. అమాదౌ పరే చ బహువచనే రు స్యాత్. వారుని, ఒక్కరుని చేత ఇతి స్థితే.

'అమ్' అనునది ద్వితీయైకవచనము. వారిని మొద లగునవి ద్వితీయాదులలో బహుత్వమున నేర్పడు రూపములు. అందుకే వివృతి అమాదౌ పరే చ యనుచునే 'బహువచనే' యన్నది. బహుత్వమున 'అమ్' ప్రత్యయము రానేరదు. ద్వితీయయందును బహువచనమును వివక్షింపఁగా 'శస్' ప్రత్యయమే వచ్చును. కావున 'జసోరుః' అని యింతకు ముందు చెప్పినట్లుగా నిచ్చట 'శసాదౌ చ' యను తీరుగా బహువచనమునే యుచ్చరించుట సక్రమ మని గుర్తింపవలసి యున్నది. ప్రాగ్వద్విసాదికే యని చిం.చెప్ప నిట నాత్మవత్ప్రాదౌ యనుటయు నిట్టిదే.

'జసోరుః' అనుచో జసః' అనుచోటి షష్ఠీవిభక్తిని బట్టి జస్సుస్థానమున రువర్ణము వచ్చును. 'అమాదౌ' అనుచోటి సప్తమీ విభక్తిచే ద్వితీయాది బహువచనములు పరముగా నుండఁగాఁ బూర్వమున నన(గాఁ బ్రాతిపదికమునకు రువర్ణము వచ్చి చేరును.

వా + శస్ – అని యుండఁగా నీసూత్రముచేఁ బ్రాతిపదికకు రువర్ణము చేరి వారు + శస్ అని యవును. 'నిత్యముతఇత్' అను సూత్రముచే నుత్వమున కిత్వము వచ్చి వారి + శస్ అని యవును.

## 5. నిత్యముత ఇత్[1].

వ్యా. అమాదౌ = ద్వితీయాది విభక్తులు పరముగా నుండఁగా, ఉతః = పూర్వమునం దున్న రువర్ణము యొక్క, ఉతః = ఉకారమునకు, నిత్యమ్ = నిత్యముగా, ఇత్ = ఇత్వ మగు.

వి. అమాదౌ పరే రోరుకారస్య నిత్య మిత్ స్యాత్. అమాదౌ చేతి పూర్వసూత్రానువృత్త్యా జ్ఞాతవ్యమ్. వారిని, ఒక్కరిచేత ఎల్లరి కొఱకు, ఏరికి, ఎవ్వరియందు, ఇత్యాది.

ద్వితీయాది బహువచనములు పరముగా నుండఁగా 'అమాదౌ చ' యనుపూర్వసూత్రముచేఁ బ్రాతిపదికకు వచ్చిన రువర్ణము నందలి యుత్వమునకు నిత్యముగా నిత్వము వచ్చును. వారిని మొ॥.

ఉత్వమునకు నిత్యముగా నిత్వము వచ్చుటను గుర్తించియు, రువర్ణమును విధించుట విశేషము. శసాదిపరకత్వమున రివర్ణమె విధించినఁ బ్రక్రియయందు లాఘవము సిద్ధించెడిది.

## 6. సే చ

వ్యా. సే చ = సమాసమునందు సయితము సర్వనామశబ్దములకు రువర్ణమును, దాని యుత్వమున కిత్వమును వచ్చును.

వి. రోరుత ఇత్ స్యాత్సమాసే చ – వారిబిడ్డ – ఒకరియల్లుఁడు ఎవ్వరిసొమ్ము ఇత్యాది.

సమాసమునందును రువర్ణమున కిత్వ మగును. వారిబిడ్డ. ఇట వివృతి రువర్ణమున కిత్వ మగుటయొక్కటియే ప్రస్తావించినది. దీనివలన నీసూత్రము సమాసమునందు రువర్ణ మగుటను సాధింపదనవలయును. అపుడు 'రు'వర్ణము మాత్రము 'అమాదౌ చ' యనుదానిచేతనె యగు ననవలయు. 'అమాదౌ చ' యనుసూత్రముచే నగు రువర్ణము సమాసమునందును వచ్చునపుడు 'నిత్యముత ఇత్' అనుసూత్రముచే రువర్ణమునకు వచ్చునిత్వము సమాసమునందు రా దనుట కాధార మేమి? అట్లు వచ్చునెడం 'సే చ' యని ప్రత్యేకముగా నిత్వమును విధింప నేల? కావున నీసూత్రము పూర్వోక్తము లగు, రువర్ణము, దానికిత్వము ననురెండు కార్యములను సమాసమునందు సాధించుచున్న దని చెప్పుట యొప్పును.

వా + జస్ సొమ్ము + సు అనుచో నలౌకికవిగ్రహమున విభక్తులు లోపింపఁగా వా + సొమ్ము అనుచోఁ బ్రస్తుతసూత్రముచే వాశబ్దమునకు రువర్ణమును దాని కిత్వమును రాఁగా వారిసొమ్ము అని యయినది.

1. రోరుత ఇదమాదౌ ఆం.కౌ.హ.58.

## 7. అస్మద్యుష్మదాత్మనో నీనాతాః[1]

అస్మద్యుష్మదాత్మనః = అస్మత్, యుష్మత్, ఆత్మన్, అనుశబ్దములకు, నీ,నా,తాః = క్రమముగా,౹ దెలుఁగున నీ,నా,తా అనునవి యగును.

వి. ఏతే ప్రకృతివర్ణా స్త్రయోఽపి దేశ్యాదస్మద్యుష్మ దాత్మన్ శబ్దాస్స్యుః

నా, నీ, తా, అనుదేశ్యప్రకృతులు అస్మద్యుష్మదాత్మార్థకములు.

నా - అస్మదర్థక దేశ్యప్రాతిపదిక

నీ - యుష్మదర్థక దేశ్యప్రాతిపదిక

తా - ఆత్మార్థక దేశ్యప్రాతిపదిక

## 8. (నుగమాదౌ ద్విశ్చ)[2]

వి. యుష్మదస్మదోః నుక్స్యాదమాదౌ విభక్తిచతుష్టయే. తస్య నకారస్య చ ద్విత్వం స్యాత్) చకారోఽపి వికల్పార్థః నాన్ను, నాన్నుచేత, నాన్నుకొఱకు, నాన్నువల్ల; నీన్ను, నీన్నుచేత, నీన్నుకొఱకు, నీన్నువల్ల; నాను, నానుచేత, నానుకొఱకు, నానువల్ల; నీను, నీనుచేత, నీనుకొఱకు, నీనువల్ల.

(అమాదౌ = ద్వితీయాదులు పర మగునపుడు, నుక్ = నీనా శబ్దములకు నువర్ణ మగును. ద్విః చ = ఆనువర్ణమందలి నకారమునకు ద్విత్వము నగును.

---

1. అస్మద్యుష్మదోర్నానీ తాత్మనః. ఆం.కౌ.హ.16,24
 నీ నా యుష్మదస్మదోః వై.చం.హ.23.
వ్యస్యతా వై.చం.ఆ.44

2. కుండలీకరణమునం దుంచినభాగము వ్రాఁతప్రతిలో లేదు. మిగిలియున్నదానింబట్టియుఁ దరువాతిసూత్ర వివృతి ననుసరించియు వధర్వణునిత్రి.శ.నుబట్టియు వసూత్ర వివృతులు పై రీతి నూహింపఁబడినవి. బహుశః ఇట్లుండియుండవచ్చును.
నుగ్వాస్యాదస్మదాత్మనోః ద్రుతస్స్యాద్విః - (త్రి.శ.4.40)

నీనాశబ్దములకు ద్వితీయ మొదలగు నాలుగువిభక్తులు (ద్వితీయ తృతీయ, చతుర్థి పంచమి) పర మగునపుడు నువర్ణమును, ఆనువర్ణమందలి నకారమునకు ద్విత్వము నగును) చశబ్దముచే ద్విత్వము వికల్పము. నువర్ణము ద్విత్వమును వచ్చిన నాన్ను మొ॥ వికల్పము గావున ద్విత్వము రానిచో నాను, నానుచేత ననురీతి నుండును.

తరువాతి సూత్రముచే హ్రస్వమయి నన్ను నను, నన్నుచేత, ననుచేత ననురీతి నేర్పడును. ద్వితీయయందు నన్ను, నను అని యుండుట ప్రసిద్ధమే. కాని తృతీయాదులందు నన్నుచేత ననుచేత ననురీతి రూపములు వింతగా నున్నవి. షష్ఠ్యాదులందు రూపము నన్నుకు నన్నందు అనురీతి నుండవనుట మేలె. మూల మనఁదగిన యధర్వణుని గ్రంథము నిట్టి రూపములు సాధించుచున్నట్లు తోఁపకున్నది. ఇది ద్వితీయయందు మాత్రమె చెప్పుట. కవి ప్రయోగానుగుణము.

## 9. హ్రా నౌ చ.

వ్యా. నౌ = నువర్ణము పర మగుచుండఁగా, హ్రః చ = ముందటి నీనా శబ్దముల దీర్ఘమునకు హ్రస్వము నగును.

వి. అమాదివిభక్తి చతుష్టయస్య నౌ పరే యుష్మ
దస్మదోర్దీర్ఘస్య చ హ్రస్వస్స్యాత్ నను, ననుచేత,
ననుకొఱకు, ననువలన; నిను, నినుచేత, నినుకొఱకు,
నినువలన ఇత్యాది.

ద్వితీయ మొదలగు నాలుగువిభక్తులయందునుఁ బూర్వసూత్రముచే నయిన నువర్ణము పర మగునపుడు ముందున్న నానీ శబ్దముల దీర్ఘమునకు హ్రస్వ మగును. నను, నినుచేత మొ॥

'నౌ' యనుదానిచే నాన్ను నాన్నుచేత ఇత్యాదులయందును నీలక్షణముచే హ్రస్వ మగును. నన్ను నన్నుచేత. కాని వివృతియం దిట్టి రూపములు గానరా వేలకో.

ఇటఁ జిం. కనుగుణ మగు ఆం.కౌ.ప్రక్రియ యుచితముగా నున్నది.

ఏమైనను (నాన్నుచేత) నన్నుచేత, ననురీతివి కావ్యవ్యవహారమున లేవని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. వివృతి కర్త నాఁటికి లోకవ్యవహారమునం దుండెనేమో యిపు డూహకందదు గదా.

## 10. నానుతః

వ్యా. అనుతః = ఉదంతము కాని నమలకు, న = ద్విత్వము లేదు.

వి. హ్రస్వాత్పరస్య అనుదన్తస్య నువర్ణకస్య ద్విత్వం న స్యాత్.
తన్న - తమ్మ ఇతి న.

హ్రస్వముకంటెఁ బరముగా నున్న యుదంతము గాని నువర్ణకమునకు ద్విత్వము రా దని వివృతి పేర్కొన్నది. కాని 'తమ్మ' యనియుఁ జూపుటచే నమలు రెండు నిటఁ బ్రస్తావింపఁదగిన వని గ్రహింపవలె.

ను,ము, అనుతీరుగా నుదంతము లయినపుడె వీని యందలి హల్లునకు ద్విత్వ మగును. నను - నన్ను, నిను - నిన్ను ఇత్యాది. ఉదంతము కాని నకార మకారములకు ద్విత్వము రాదు. తనచేత, తమచేత ఇత్యాదిగా నదంతములైన నమలకు ద్విత్వము లేదు. కావున తన్నచేత తమ్మచేత అనురీతిగా రూపము లుండవు. ద్వితీయయం దన్నచో తను, తము అని నమ లుదంతము లగును గావున ద్విత్వ మగుటలో బాధ లేదు. తన్ను తమ్ము.

ఈ నీనాతా రూపములను సాధించుటలో సమగ్రత గాని స్పష్టత గాని యిందు గోచరింపకున్నది.

తనచేత ఇత్యాదులందలి యత్వమును జెప్పకయె యీలక్షణమును బ్రస్తావించుటఁ వింత.

## 11.విభాషా మో జసి.[1]

వ్యా. జసి = జస్ ప్రత్యయము పరముగా నుండఁగా, మః = నీనాశబ్దముల నకారము స్థానమున మకారము, విభాషా = వికల్పముగా నగును.

వి. యుష్మదస్మచ్ఛబ్దయో ర్నకారస్య మకారో వా స్యాజ్జసి
పరే. నీరు, నేము, మీరు, మేము - పక్షే -

జస్ అనునది ప్రథమాబహువచనము. అది పర మైనపుడు నీనాశబ్దములయందలి నకారంపుఁబొల్లు స్థానమున మకారపుఁబొల్లు వచ్చును.

---

1. ఏతయో ర్బహుత్వే మః ఆం.శబ్దం.హ.19
తయో ర్బహుత్వే మామ్యో ఆం.కౌ.హ.18.
బహువచనేమః.వై.చం.హ.26
అస్మదో వార్మో బహుంమ్.త్రి.శ.4.55.

నీ + జస్ అని యుండఁగాఁ 'ప్రస్తుతసూత్రముచే నకారమునకు మకారము వచ్చి మీ + జస్ అని కాఁగా 'జసోరుః' అనుసూత్రముచే జస్సు స్థానమున రువర్ణకము వచ్చి 'మీరు' అని యగును.

అస్మదర్థకమునకు మేము అని యగును. 'వా' యనుటచే మకారము రానిపక్షమున యుష్మదర్థమున 'నీరు' అనియు నస్మదర్థమున నేము అనియు నకారమట్లే యుండును. వీనిలో 'నేము' అనునది ప్రసిద్ధమె. కాని యుష్మదర్థక ప్రథమాబహువచనము 'నీరు' అని యుండుట వినము. నేము అనుదానింబట్టి 'వా' శబ్ద ముచితమె. వివృతి 'నీరు' అనునదియుఁ జూపినది. కాకున్న యుష్మదర్థకమునకు మాత్రము మత్వము నిత్య మని వాశబ్దమునకు వ్యవస్థ చేసికొను నవకాశ మున్నది.

ఇంక ద్వితీయాది బహువచనములో నస్మచ్ఛబ్దమునకు సయితము మకార మగుట నిత్యమె. నమ్ము, నాను(నా)చేత ననురీతిగాను రూపము లుండవు ఇట్లె యుష్మదర్థమునకును నిమ్ము ఇత్యాదు లుండవు. కావున మత్వము వికల్ప మగుట అస్మచ్ఛబ్దమునకు మాత్రమెయదియుఁ ప్రథమావిభక్తియం దొక్కచోటనె యని గుర్తింపవలయును. యుష్మదర్థమునకు, ప్రథమ, యందును, షష్ఠియందును మకారము లేనపుడు నకారమును లేదు. ఈరు. ఈకు.

సూత్రమునందలి 'జసి' యనునది బహువచన సామాన్యమున కుపలక్షక మని గ్రహింప వలయును. అపుడు ద్వితీయాది విభక్తులయందును మత్వము సిద్ధ మయి - మిమ్ము, మమ్ము - మొదలగు రీతిగా నిష్టరూప సిద్ధి యగును.

## 12. న్మోర్వా లుక్ప్రథమాయామ్.

వ్యా. ప్రథమాయామ్ = నీనాశబ్దములకుఁ బ్రథమావిభక్తియందు, న్మోః = నకారమకారములకు, వా = వికల్పముగా, లుక్ = లోప మగును.

వి. యుష్మదస్మచ్ఛబ్దయో ర్నకారమకారయోః ప్రథమావిభక్తౌ వికల్పేన లుక్ స్యాత్. నీవు - ఈవు, నీరు - ఈరు, నేను - ఏను, నే - ఏ - నేము - ఏము - మేము - ఏము ఇత్యాది.

యుష్మదస్మచ్ఛబ్దములకుఁ బ్రథమయందు నకారమకారములు వికల్పముగా లోపించు నని యర్థము. ఇటుఁ గ్రమముగాఁ బ్రథమావిభక్తియం దేకవచనమున నకారమునకును, బహువచనమున మకారమునకును వికల్పముగా లోపము వచ్చు నని యన్వయింపఁదగును.

నీవు - ఈవు, నేను - ఏను

మీరు - ఈరు, మేము - ఏము

వృత్తి యెల్లెడల సాధారణముగా నములు లోపించు ననుచు (ఏకవచనమున నకార మొక్కటియె యుండును) బహువచనమున (విభాషా మోజసి యని మత్వము వికల్పము గావున) నకారమకారములు రెండును లోపించినను, 'ఏము' అనియే యగును. 'మేము'లో మకారము లోపించినను 'ఏము' అనియే యగును. కావున నములు రెంటికిని లోపమును జెప్పుట వలన సాధింపఁబడు విశేషప్రయోజన మేమియు లేదు. కావున నేకవచనమున నకారమును, బహువచన స్థలమున మకారమును లోపించు నని యర్థము చేసి లాఘవమును సంపాదించుట యుచితము.

ఇచట 'మ' కారమునకుఁ బ్రథమయందే లోపము చెప్పుటనుబట్టి - యితరవిభక్తులయందు లోపింప దని యర్థ మగుచున్నది. ఇట్లగుటవలన 'విభాషా మో జసి' యను సూత్రము నందలి జస్ ప్రథమాది విభక్తుల బహువచనముల కన్నింటికి నుపలక్షణ మనియు, నందువలన ద్వితీయాది బహువచనములందును మకార మున్నప్పటికిని బ్రథమయందే వైకల్పిక లోపము దానికి సిద్ధించు నని యిట గ్రహింపవచ్చును. - (మీకు అనునొక్క దానికి మాత్రమె 'ఈకు' అని మకారము లోపించు.)

## 13. ఆత్మన శ్చ.[1]

వ్యా. ఆత్మనః చ = ఆత్మార్థక మయిన తాశబ్దమునకుఁ బైనున్న (నకారమునకుఁ గూడ) జస్ ప్రత్యయ(పరకత్వము)న కు ముదర్ణము వికల్పముగా వచ్చును. (విభాషా మో జసి' యనుసూత్రమునఁ జెప్పఁబడిన కార్య మాత్మార్థకశబ్దమునకు సయితము కలుగు నని యర్థము.)

వి. ఆత్మన్ శబ్దశ్య నకారస్య ప్రథమాబహువచనే మకారో వికల్పేన స్యాత్. తాను, తాము. వా పక్షే సర్వ నామత్వాత్ రువర్ణకః. తారు ఇతచ.

తా శబ్దమునకు నువర్ణము వచ్చి 'తాను' అని కాఁగా నీసూత్రముచే మకారము వచ్చి తాము అని యగును. వికల్పము గావున ముదర్ణము రానిపక్షమునందు సర్వనామము గావున 'జసో రుః' అనుసూత్రముచే రువర్ణము వచ్చి 'తారు' అని యగును.

1. బహుళ మాత్మనోఽథ ముదర్ణకః త్రి.శ.4.56.

## 14. అస్మదో నిత్యమ్[1].

వ్యా. అస్మదః = అస్మదర్థక మయిన నాశబ్దము కంటెఁ బరముగా నున్న జ(స్ప్రత్యయమునకు, నిత్యమ్ = నిత్యముగా ముఁవర్ణము వచ్చును.

వి. అస్మచ్ఛబ్దస్య నకారస్య ప్రథమాబహువచనే మకారో నిత్యం స్యాత్. నేము – మేము. సర్వనామాత్వాత్ నేరు, మేరు ఇతి న.

నాశబ్దమునకుఁ బరముగా నున్న ప్రథమాబహువచన మగు జస్సుయొక్క స్థానమున 'ము'వర్ణము నిత్యముగా వచ్చును.

(నా) (మే) + జస్ అని యుండఁగా 'జసోరుః' అనుసూత్రముచే జస్సునకు రువర్ణము రావలసియుండఁగాఁ బ్రస్తుతసూత్రముచే ముఁవర్ణకము వచ్చి 'మేము' అని యగును. 'నిత్యమ్' అనుటచే ముఁవర్ణకము రాకుండుట కవకాశము లేదు గావున మేరు నేరు అనుతీరుగా రువర్ణము తోడి రూపము లుండవు.

వి. కిఞ్చ అస్మదో నకారస్య మకారో నిత్యత్వా దాత్మనో బహుళత్వాచ్చ[2] యుష్మదస్సూత్రమనుక్తత్వా త్తస్య రు ఏవేతి జ్ఞాతవ్యః – నీవు, నీరు, మీరు ఇతి – నీము, మీము ఇత్యేవం మకారో నాస్త్యేవ.

'తా' శబ్దమునకు ముఁవర్ణకము వికల్పముగా జెప్పఁబడినది విప్రతికారుఁ డట విప్రతిలో 'వికల్పేన స్యాత్' అని చెప్పియు నిచ్చట 'బహుళత్వాత్' అనుట విశేషము. ఇది యథర్వణ లక్షణానుగుణము. ఇంక 'నా' శబ్దమునకు ముఁవర్ణకము నిత్యముగా నగు నని 'అస్మదోనిత్య' మ్మను నీసూత్రము చెప్పుచున్నది. యుష్మదర్థక మయిన నీ శబ్దమునకు బ్రత్యేకముగా విధాన మేమియుఁ జేయఁబడలేదు. కావున 'జసోరుః' అను సూత్రముచే రువర్ణకము నిత్యముగా వచ్చి 'మీరు' అని యేర్పడును. మీము అనువిధముగా ముఁవర్ణకముతోడిరూపము లసలుండవు.

## 15. న జమః కిః[3].

వ్యా. జమః = షష్ఠీ విభక్తికి కిః = 'కి' అనుప్రత్యయము న = రాదు.

1. అస్మదో లో ర్మః (మః?) త్రి.శ.4.11
2. బహుళమాత్మనోధముఁవర్ణకః. త్రి.శ.4.11.
3. కిర్నజమః అం.శ.విం.హ.17, అం.కౌ.హ.23, జసఃక్యయుష్మదః వై.చం.అ.18.

వి. త్రయాణాం శబ్దానాం షష్ఠీవిభక్తేః కిప్రత్యయో
న స్యాత్. నాకి, నీకి, తనకి ఇతి న. కి ప్రత్యయా
భావే షష్ఠీవిభక్తేః కుప్రత్యయ ఏవ స్యాదితి బోద్ధవ్యః.
నాకు, మాకు, నీకు, మీకు, తనకు, తమకు ఇత్యాది.

నీనాతా అనుశబ్దములు మూఁడింటికిని బరముగా నున్న షష్ఠీస్థానమున కిప్రత్యయము రాదు. 'ఙస్, ఆమ్' అనువాని ప్రత్యాహారము ఙమ్. కావున షష్ఠీవిభక్తియం దేకవచనమునను బహువచనమునను 'కి' ప్రత్యయము రాదు. కిప్రత్యయమును నిషేధించుట వలన 'కు' ప్రత్యయము వచ్చు నని గ్రహింపఁదగును. నీకు మీకు మొ॥

కివర్ణకమును నిషేధించుట కంటె కువర్ణకమును విధించుటలోనె స్పష్టత యధికముగా నుండెడి దని తోఁచు.

'పుమహతోరితోర్ఙసఃకిః' అని ఇకారాంతములపైని కి విధింపఁబడినది కావున నీ – శబ్దముపై మాత్రము కినిషేధము కొంతవఱ కుచిత మనఁదగు. నాతన – అనువానిపై ప్రాప్తియె లేమి నిషేధము ననవసరము.

## 16. స్వస్య తముః

వ్యా. స్వస్య = స్వశబ్దార్థమున, తముః = 'తము' అను శబ్ద మగును.

వి. దేశ్యే నిత్యబహువచనస్య స్వశబ్దస్య తము రితి
ప్రకృతి స్స్యాత్. ప్రథమాబహువచనస్య తము
సర్వనామత్వాత్ స్వశబ్దస్య రువర్ణః. తమురు ఇత్యేకం రూపమ్.
శేష మాత్మన్ శబ్దబహువచనవత్. తము, తమచేత,
తమకొఱకు, తమవల్ల, తమకు, తమయందు.
కించ తము శబ్దప్రయోగః

కం॥ తము తామె వత్తు రర్థులు
క్రమ మెఱిగిన దాతకడకు రమ్మన్నారా?
కమలంబు లున్న కొలనికి
భ్రమరంబుల నచ్యుతేంద్రరఘునాథనృపా॥
ఇతి ముద్దుగోపాలభక్తేన క్షేత్రకవినా ఉక్తత్వాచ్చ.

'స్వ' (తాను) శబ్దార్థమున నిత్యబహువచన మగు. దేశ్య శబ్దము 'తము' అనునది ప్రకృతిగా నుండునని ఇయ్యది నిత్య బహువచనము గావున దీనిపై నెల్ల విభక్తులయందును బహువచనమే చేరును గాని యేకవచన ముండదు.

'తము' అనుశబ్దముపైఁ బ్రథమావిభక్తిని వివక్షింపఁగా బహువచనమున తము + జస్ అని యుండ నిది సర్వనామము గావున 'జసోరుః' అనుసూత్రముచే ఈ జస్సునకు రువర్ణము వచ్చి 'తమురు' అని యగును. 'తమురు' ఇత్యేకం రూప మ్మనుచు వివృతి 'తము' అనునది గూడఁ బ్రథమ యం దేర్పడు నని చెప్పినదనిపించును. 'ప్రథమాబహువచనస్య తము' అనుచు నంతకు ముందే 'తము' అనునది ప్రథమాబహువచనాంతరూపముగాఁ బేర్కొన్నది. పిదప 'తముతామె వత్తురర్థులు' అనుక్షేత్రయ్య ప్రయోగమును జూపుట యీయంశమునె నిరూపించును. తముశబ్దముపై జస్విభక్తి యే మైనదో, ప్రస్తావింప లేదు. సూత్రముచేఁ 'దము' అనునది యట్లు నిపతింపఁబడిన దనుకొనవలయు నేమో. కాని పిదప సర్వనామ మగుటచే 'రు'వర్ణము వచ్చి తమురు అని యగు నన్నది, వికల్పముగా జస్ లోపించు నేమో అని యగు నన్నది, వికల్పముగా జస్ లోపించునేమో 'తమురు' అనురూపము నేడు వినిపింపదు. ఇది 'తమరు' అనురూపుతోనె ప్రసిద్ధము. 'తాము తమరు తారునగు' నని యిది యాత్మార్థకముగను నన్మధ్యముగను లాక్షణికులచేఁ బిదప స్పష్టము చేయఁబడి యునున్నది. 'తముతామ' వంటి రూపముల నుద్దేశించి 'తము' అనుశబ్దము కల్పింపఁబడినట్లు గుర్తింపవచ్చును. ఇతరవిభక్తులలో నాత్మార్థకముతో సమానముగా రూపము లందు నని తమ్ము (ద్వితీయ) తమచేత నిత్యాదిగాఁ జెప్పుటనుబట్టి భేదము ప్రథమయందు మాత్రమే తము రనునది గాక శబ్దము 'తమరు' అని గుర్తించినచో 'దము' అనుశబ్దమున కవకాశము 'తముదామ' యనురీతి స్థలములే యనవచ్చును. ఇది యు నాత్మార్థక 'తా' శబ్దముయొక్క ద్వితీయైకవచనాంతముగా గుర్తించిన నింక 'తము' శబ్దము గలిమి కాధారమె లేదు.

'తముఁదామ' యనురీతివానినిబట్టి 'తము' శబ్దము గలదనచో 'తనుఁదాన తొరఁగినకప్పురపురజము' (స్వా2-55) అనురీతిప్రయోగములనుబట్టి 'తను' శబ్దమును గల్పించి యది నిత్యైకవచనాంత మని చెప్పవలసియుండును. ద్రుతకార్యములు వ్రాఁతప్రతులలోను నుచ్చారణములోను నొకక్రమములో నుండవు గావున దానిని బట్టి నిర్ణయింపరాదు.

ఇట్టి ప్రయోగములనుగూర్చి ప్రౌఢవ్యాకర్త 'షష్ఠ్యంతతదేతద్యుష్మదాత్మశబ్దపూర్వకంబు లగు ప్రథమాంతతదాదిశబ్దంబు లవధారణార్థకాంతంబులు తఱచుగ స్వయమర్థకంబు లగు' (శబ్ద-108) నని 'తఱచుగ ననుటచే తనుదాన, తారుదారె ఇత్యాదులు గ్రాహ్యములని పేర్కొనెను. అమ్మార్గమె సముచితముగా నున్నది. కావున తనుఁదాన, తముఁదామె యిత్యాదులలో మొదటి శబ్దము తను, తము, అనునవి క్రమముగా తాశబ్దముయొక్క ద్వితీయ, ఏకవచనబహువచనాంతము లగుశబ్దములే యని నిర్ణయింపఁదగును.

౬ (గా స్వశబ్దార్థమున 'తము' అనుశబ్దము నొకదానిని గల్పించుట యనవసర మని గుర్తింపఁదగును.

## 17. ఉభయార్థవాచీ మనః[1]

వ్యా. మనః = మన అనుశబ్దము, ఉభయార్థవాచీ = నీ నా, అర్థములు రెంటిని బోధించునది.

### వి. మన ఇతి ప్రకృతిశబ్దో యుష్మదస్మచ్ఛబ్దయో రుభ యార్థవాచీ స్యాత్.

'మన' అనునది ఉభయార్థమును బోధించు శబ్దము. యుష్మదర్థమును, నస్మదర్థమును రెంటిని బోధించునది. మనము అనఁగా నీవును నేను ననియర్థము (ఇట్లే మీరును, మేమును, మనము)

## 18.జశ్శసో ర్ముళౌ.[2]

వ్యా. జస్ శసోః = మనశబ్దమునకుఁ బరముగా నున్నజస్సు యొక్కయు శస్సుయొక్కయు స్థానమునఁ గ్రమముగా ము, ల, అనుప్రత్యయములు వచ్చును.

### వి. ప్రథమాబహువచనద్వితీయాబహువచనయోః క్రమా న్ముళప్రత్యయ ళప్రత్యయౌ స్తః. మనశబ్దస్య నిత్య బహు వచనత్వాత్, మనము - మనల.

మనశబ్ద ముభయార్థక మగుటచే నెప్పుడును, బహుత్వమునందే యుండును. కావున దీనిపై బహువచన ప్రత్యయమే వచ్చును.

మనశబ్దముపైఁ బ్రథమావిభక్తియందు జస్సు స్థానమున నీసూత్రముచే ముప్రత్యయము వచ్చి మనము అని యగును. ద్వితీయావిభక్తియందు బహువచనమున శస్సు రాఁగా మన + శస్ - అని యుండఁగా నీసూత్రముచే శస్సు స్థానమున లవర్ణకము వచ్చి మనల అని యగును. ఇది క్లీబము గాదు గావున సుస్థానమున మువర్ణకము 'ములతస్సోఃక్లీబే' యను సూత్రముచే రాదు. కావున మువర్ణకము విధింపఁబడినది. ఇది సర్వనామము గావున ఒక్కరిని ఇత్యాదిగా 'మనరిని' అని కావలసియుండుటచే శస్సునకు లవర్ణము ప్రత్యేకముగా విధింపఁబడిన దని గ్రహింపఁదగును.

1. భూయ ఉభయార్థవాచి యః కశ్చిద్భవతి నిత్యబహువచనః ఆం.శ.చిం.హ.21

2.తస్య జసో ముశ్శసోలః ఆం.శ.చిం.హ.21,
మనసస్తసోముఃఆం.కౌ.హ.26.

'ఆత్మవత్' అని మాత్రమె సూత్రమునఁ జెప్పఁబడియున్నది. ఇది యేకవచనాంతమువలె నని స్పష్టముగా లేదు. వివృతినిబట్టి యి ట్లర్థము చేసి కొనవలయును. బహువచనాంత మగు మనశబ్దమునకు నేకవచనాంతమునకువలె రూపము లగుట విశేషమె కావున నట్లు సూత్రమున స్పష్టముగాఁ జెప్పిన బా గుండెడి దనిపించును. అట్లు గా దన్న నాత్మవద్విధానము కంటె, ల, లేదా రి – అనువికారము రా దని చెప్పుట యింకను సూటి యగు మార్గ మని తోఁచుచున్నది.

## 19. ఆత్మవట్టాదౌ.[1]

వ్యా. టాదౌ = మనశబ్దమునకుఁ దృతీయావిభక్తులందు, ఆత్మవత్ = తాశబ్దమునకువలె రూపము లగును.

వి. మనశబ్దస్య తృతీయాది విభక్తి పఞ్చకే పరే ఆత్మన్ శబ్దైకవచనవద్రూపాణి స్యుః. మనచేత, మనకొఱకు, మనవలన, మనకు, మనయందు ఇత్యాది.

ఉభయార్థక మయిన మనశబ్దమునకుఁ దృతీయాదివిభక్తులలో బహువచనములందు ఆత్మార్థక మగు'తా' శబ్ద (ఏకవచనాంత) ములవలె రూపము లగు నని యర్థము.

తనచేత అనుదానివలె మనచేత ఇట్లె తనయందు ననుదానివలె మనయందు.

ఆత్మార్థకము 'తా' యనునదే శబ్దము కావున తనచేత మొదలగు స్థలములలోఁ బ్రాతిపదిక మార్పులకు లో నైనది. కాని యిచట 'మన' అనునది శబ్దము 'మనచేత' ఇత్యాదులలోఁ బ్రాతిపదిక మెట్టి వికారము నందలేదు. కావున 'నాత్మవత్' అనుకున్న నష్టమేమి? బహువచనపరత్వమునఁ దృతీయాదులలో 'ల' స్సర్వత్ర యని లవర్ణము వచ్చును. లేదా సర్వనామము గావున ఒక్కరిచేత నన్నట్లుగా మనరిచేత ననురీతిఁ గావలయు నది వారించుటకై యిట్లు చెప్పఁబడియుండును.

## 20. రిన్యోర్లుక్.[2]

వ్యా. రిన్యోః = రి,ని, అనువానికి, లుక్ = లోప మగును.

వి. అస్మదాదీనాం శబ్దానాం రిప్రత్యయ నిప్రత్యయ యో ర్లుక్ స్యాత్. నేనిని, మేమిరిచేత, నీవిని, మీరిచేత,

1. ప్రాగ్వత్సర్వంబిపాదికేఽన్యత్ర ఆం.శ.చిం.హ.22

2. ఏషాం నేరిత్యలోపః త్రి.శ.4.53.

తానిని, తామికొఱకు, తారివలన ఇతి న.

నీనాతా శబ్దములకుఁ బైని, ని,రి, అను ప్రత్యయములకు లోపము కలుగును.

లోపవిధానమువలన నేనిని, మేమిరిచేత ననురీతిగా రూపములుండ వని వివృతి వరించినది.

ఈ లక్షణముయొక్క ప్రయోజనము స్పష్టము గాదు. ని,రి,ప్రత్యయములు చేసి లోపింపఁజేయుటకంటె రాకుండ నిషేధించుట లాఘవము. మేమిరిచేత ననురీతిగాఁ బ్రథమాంతముపైఁ జూపుటయు లక్షణానుగుణముగాఁ గానరాదు.

## 21. క్వచిన్న సర్వేషామ్.[1]

వ్యా. సర్వేషామ్ = సర్వనామముల కితరముల కన్నింటికిని, క్వచిత్ = కొన్ని యెడల, ని,రి,వర్ణకము లోపించుట, న = లేదు.

వి. సర్వనామశబ్దానాం క్వచిత్ స్థలేషు నిరిప్రత్యయ
యో ర్లోపో న స్యాత్. వాని, వారిచేత, వీరికొఱకు,
ఎల్ల(వ్వ)ని, ఎల్ల(వ్వ)రి వలన – ఒక్కరిని, ఒక్కరికి ఇత్యాది.

నానీతా శబ్దములకంటె వే ఱగు సర్వనామశబ్దములకుఁ గొన్నియెడల నిరిప్రత్యయములు లోపింపవు.

ఒక్కని, ఒక్కరిచేత ఇత్యాదులలో ఒక్క, ఒక్కరిచేత అనువిధముగా ని,రి,వర్ణములకు లోపము వచ్చినరూపము లుండవు.

ఇది స్పష్టప్రతిపత్తి కనఁదగుఁ బ్రయోజనవిశేష మీలక్షణమునకుఁ గానరాదు.

## 22. సమా స్త్రిషు.[2]

వ్యా. త్రిషు = మూఁడు లింగములయందును, సమాః = నీ,నా,తా (మన)శబ్దములు సమముగా నుండును.

వి. యుష్మదస్మదాత్మన్ శబ్దా లింగత్రయేఽపి సమాస్స్యుః.
నీవురాముఁడవు , నేను సీతను, తానుగజము ఇత్యాది.

నీ,నా,తా, (మన) శబ్దములు, పురుషులను, స్త్రీలను నపుంసకమును, దేనిని బోధించున

1. న సర్వేషాంతు క్వచిత్క్వచిత్.త్రి.శ.4.54.
2. ప్రకృతిశ్చ సమా త్రిషు.త్రి.శ.4.58.

దయినను సమాన మయిన యాకారము గలిగియుండును. అన్నిటిని బోధించుశక్తి సర్వనామముల కన్నింటికిని గలదు. అట్టివే సర్వనామము లని 'సర్వవాచ్యం సర్వనామ' యను సూత్రమునఁ జెప్పబడియున్నది. ఒక్కఁడు రాముఁడు, ఒక్కతె సీత, ఒక్కటి వనము. ఒక్కయను శబ్దము పుంస్త్రీనపుంసకము తిర్యగ్జడాదు లన్నింటిని బోధించును. అయినను నాయాయర్థములందు నాయాప్రత్యయములతో స్వరూపమున మాత్రము వేఱుగా నుండును. నీనాతా అనుశబ్దములు స్వరూపమునందు నయితము మూఁడర్థములయందును సమానముగా నుండుట విశేష మది యిట సూత్రింపఁబడినది.

నీవు రాముఁడవు, నీవుసీతవు, నీవు ఏనుఁగవు,

నేనుభక్తుఁడను, నేను భక్తురాలను, నేను భక్తిని,

తాను రాముఁడు, తాను సీత, తాను ఏనుఁగు. ఇట్లె

మనము భక్తులము, మనము భక్తురాండ్రము, మనము గొఱ్ఱెలము మొ॥

ఇతి సర్వనామ ప్రకరణమ్
ఇతి సర్వనామ ప్రకరణము

ఇతి శబ్ద పరిచ్ఛేదః
ఇది శబ్ద పరిచ్ఛేదము

# అథ తద్ధిత పరిచ్ఛేదః

## అథ తద్ధితాః[1]

ఇఁక దద్ధితములు నిరూపింపఁబడుచున్నవి.

### 1. అనవిత్తద్ధితః[2].

వ్యా. తద్ధితః = తద్ధితములు, అనవిత్ = అసంఖ్యములు.

వి. ప్రాతిపదికాదుక్త ప్రత్యయస్తద్ధిత స్స్యాత్[3]

ప్రాతిపదికము కంటె విధింపఁబడిన ప్రత్యయము తద్ధితము.

తద్ధితప్రత్యయము లత్యధికముగాఁ గల వని సూత్రార్థము. తద్ధితప్రత్యయము ల నన్నింటిని నిరూపించుట సాధ్యము గా దనియు, నయ్యవి మహాకవి ప్రయోగముల ననుసరించి తెలియఁదగు ననియు 'అనవిత్' అనుదళముచే సూచింపఁబడినట్లు గ్రహింపవచ్చును.

వివృతి తద్ధితము ప్రాతిపదికపై నగుటను జెప్పుచున్నది. స్వార్థమునం దగుతద్ధితములు ప్రాతిపదికకే యగును భావాద్యర్థములందు వచ్చు తద్ధితములు షష్ఠ్యాదివిభక్త్యంతము లగు పదములపయినే చేరును. ఈప్రకరణమున ననేకములు తద్ధితములుగా నిరూపింపఁబడుచున్నవి.

### 2. గాండ్వరి డుజీండు గీండ్వాండు వాండ్వా దయస్తద్ధితాః[4]

వ్యా. గాండు అరి డుజ్ ఈండు గీండు ఆండు వాండు, ఆదయః = గాండు మొద లగునవి, తద్ధితాః = తద్ధిత ప్రత్యయములు.

---

1. తద్ధితా అథవక్ష్యన్తే. త్రి.శ.5.1
2. బహుళం తన్నిదర్శనమ్. త్రి.శ.5.2
3. ఉక్తం ప్రత్యయదిష్టంయత్ ప్రాతిపది కాత్పతు తద్ధిత. త్రి.శ.5.3
4.గాండ్వరీత్యాదయోమతాః. త్రి.శ.5.45

కాఁడుర్గాఁడుర్వదీఁడు రస్త్యాద్యర్థబోధకా ॥ అ.కా.అ.50

అరిమిమ్యా మో మతువ ॥ వై.చం.త.1.బహుహ్రీ ణేపదాద్గాడుః బృహస్పతి సూత్రము. ఆం.కౌ. త్రి.శ.

వి. ఇత్యాద్యాస్తద్ధిత ప్రత్యయాస్స్యుః. వఁడుర్యత్క్రిమోః (ఇతి) యత్క్రింశబ్దయో ర్వడుస్తద్ధితస్స్యాత్. గాండు అరి డుజ్ ఈండు గీండు ఆండు వాండు వఁడు ఇత్యాదయస్తద్ధితాః.

'వఁడుర్యత్క్రిమోః' అని చెప్పఁబడిన వఁడు ప్రత్యయమును దద్ధితమె. గాండు మొదలగునవి తద్ధితములు.

గాండు – (అందఁగాడు) అరి – (జాలరి) డుజ్ – (గొల్లఁడు) ఈండు – (అటమటీఁడు) గీండు – (దుండగీఁడు) ఆండు – (వగలాఁడు) వాండు – (పగవాఁడు) వఁడు – (ఎవఁడు) మొదలగునవి తద్ధితములు.

### 3. మతుపి ధర్మాత్.[1]

వ్యా. ధర్మాత్ = ధర్మమును బోధించు శబ్దములకంటెఁ బరముగా, మతుపి = మతుప్ప్రత్యయార్థమునందే గాండు అరి మొదలగు తద్ధితములు వచ్చును.

వి. తద్ధితే ధర్మనామ్నః పరతః ప్రాయో మత్వర్థ ఏవ గాండ్వర్యాదయస్స్యుః. అందగాఁడు, కావలిగాఁడు, విలుగాఁడు, కొండెగాఁడు, సొగసుగాఁడు. ఇత్యాది.

ధర్మవాచకములగు శబ్దములకుఁ బరముగా మతుబర్థమునందు గాండు మొదలగు ప్రత్యయములు వచ్చునని యర్థము. అందముగలవాఁడు అంద-గాఁడు.

ఇట్లిట తద్ధితప్రత్యయపరకత్వమున విభక్తిలోపప్రసంగమేలయని యీప్రత్యయములు ప్రాతిపదికము పైనె యగు నని తలఁపఁబడిన దేమో.

'విలుగాఁడు' అనుచోట 'విలుకాఁడు' అని కకారమె యుండుట ప్రసిద్ధము. ఈవ్యాకరణమిట కాండును బ్రస్తావింపలేదు. ఆదిశబ్దముచే సూత్రమున గ్రహించుట కవకాశము గలదు. కాని వివృతికారుఁడు కాఁడు ప్రత్యయమును బేర్కొనకుండఁగా 'విలుగాఁడు' అని గాఁడుగనే ప్రత్యయమును జూపెను.

---

1. ధర్మాన్మత్వర్థ ఏవస్యాన్నామ్నః ప్రాయస్తు తద్ధితే త్రి.శ. 5-4

## 4. ధర్మిణశ్చ.

వ్యా. ధర్మిణః చ = ధర్మివాచకము లగుశబ్దములకుఁ గూడ ఋరముగా గాండ్వాది ప్రత్యయములు వచ్చును.

వి. ధర్మినామ్ని పరతశ్చానుగుణ్యేన గాండ్వర్యాదయస్స్యుః.[1]
మద్దిగాఁడు, మొక్కలిగాఁడు, గూనిగాఁడు,
తండ్రిగాఁడు ఇత్యాది. ఒంటరి, ముడుఫరి ఇత్యాది.

ధర్మివాచకములకంటెను నదేయర్థమునఁ 'స్వార్థమున' గాండు మొదులగునవి యగును. 'ధర్మిణశ్చ' యనుచోటి 'చ' శబ్దముచే ధర్మివాచకములకివి సాధారణము గాదనియుఁ బ్రయోగానుగుణముగ గ్రహింపవలయు ననియు స్పష్టము. ధర్మము గలది ధర్మి. మొక్కలము ధర్మము. అది కలవాఁడు మొక్కలి ధర్మి. దానిపై నీసూత్రముచే గాఁడు ప్రత్యయము వచ్చి మొక్కలిగాఁడు. ఈశబ్దము ధర్మివాచకమె యగుటచే నీప్రత్యయములు ఇచ్చట స్వార్థమునం దయిన వని గ్రహింపవచ్చును.

## 5. ఆదేయాచ్చ.

వ్యా. ఆదేయాత్ చ = సంస్కృతమునకు సంబంధించిన శబ్దముకంటెఁ గూడ గాండు మొద లగుప్రత్యయములు వచ్చును.

వి. సాంస్కృతిక పదాత్పరతశ్చ గాండు వాండ్వాదయస్స్యుః.
వేషగాఁడు, నయగాఁడు, భిక్షగాఁడు, భీరుగాఁడు,
కోసగాఁడు, రోషగాఁడు, ఇత్యాది. విద్దెవాఁడు, దయవాఁడు, జాతివాఁడు, ఇత్యాది.

సంస్కృతమునకు సంబంధించుచుఁ దెలుఁగునఁ దత్సమములును, దద్భవములును గలవు. అట్టిశబ్దములపైఁ గూడ గాండు మొద లగుతద్ధితప్రత్యయములు వచ్చును. దేశీయము పైన తద్ధితములు సంస్కృత (సమ) శబ్దములపై విశేషము కావున నాయంశము ప్రత్యేకముగాఁ బ్రస్తావింపబడిన దని గుర్తింపవచ్చును. వేషగాఁడు, జాతివాఁడు మొ॥ అరి మొద లగునవి సంస్కృతసమములపైఁ గానరావు. 'చ' శబ్దముచేఁ బ్రయోగానుసారముగ నెచ్చటెచ్చట నేయేప్రత్యయము లగుచున్నవో వానిని మాత్రమె యట స్వీకరింపఁ దగు నని చెప్పవచ్చును.

---

1. ధర్మిణస్స్యానుగుణ్యేన గాండ్వరీత్యా దయోమతాః. త్రి.శ.5.5.

వి. ఆద్యేయశబ్దస్య తద్భవార్థకత్వాత్తద్భవ పదా
త్పరతశ్చ గాండు, వాండ్వాదయస్స్యు రితి బోద్ధవ్యః.
ఎఱుకవాఁడు, బోగివాఁడు, దాసరివాఁడు, కమ్మరవాఁడు ఇత్యాది.

వ్యా. 'ఆద్యేయాచ్చ' యనుసూత్రమునందలి 'యాద్యేయ' శబ్దము సంస్కృతమునకు సంబంధించున దని తెలపును. సంస్కృతమునుండి సమములుగాను భవములుగాను శబ్దములు దెలుఁగునఁ జేరును గావునఁ దత్సమములవలెఁ దద్భవములను సంస్కృతమునకు సంబంధించినవె. అనఁగా ఆద్యేయములే యగును. కావున నీసూత్రమందలి 'యాద్యేయ' శబ్దముచేఁ దద్భవములపైఁ గూడ గాండు మొదలగు ప్రత్యయములు కలగును, బోగివాఁడు యోగిశబ్దభవ మైన బోగిశబ్దముపై వాఁడు అనుతద్ధితము చేరినది.

## 6. గొల్లాదిభ్యో డుజాదిః.

వ్యా. గొల్లఆదిభ్యః = గొల్ల మొదలగు శబ్దములకు – డుజాదిః = డుజ్ మొద లగుతద్ధిత ప్రత్యయములు వచ్చును.

వి. గొల్ల, కల్ల, బండ, పేద, పెద్ద, మాలాదిభ్యః పరత,
స్తద్ధిత డుజాది ప్రత్యయా వికల్పేనస్యుః.
గొల్ల – గొల్లఁడు, గొల్లాండు, గొల్లవాఁడు.
కల్ల – కల్లఁడు, కల్లాండు, కల్లవాఁడు.
మాల – మాలఁడు, మాలాండు, మాలవాఁడు. ఇత్యాది

గొల్ల మొదలగు శబ్దములకంటెఁ బరముగా డుజ్ మొదలగుతద్ధితప్రత్యయములు వికల్పముగా వచ్చును. గొల్ల, గొల్లఁడు మొ॥

గొల్ల శబ్దముపై డుజ్జు రాఁగా గొల్లఁడు, ఇట్లే మాల మాలఁడు మొ॥గొల్లయే గొల్లఁడు, మాలయే మాలఁడు. కావున నీ డుజ్జు గొల్లాదులకు స్వార్థమునందు వచ్చిన దని గుర్తింపఁదగును.

ఆది శబ్దముచే ఆండు ప్రత్యయమై గొల్లాండు, వాఁడు ప్రత్యయమైన గొల్లవాఁడు మొ॥ ఇవియు స్వార్థమునం దయినవే.

వివృతియందివి వికల్పముగా నగు నని చెప్పఁబడినది. స్వార్థమునం దగుటచే నట్లు గ్రహింపవచ్చును. డుజాదితద్ధితములు రానిచో 'గొల్ల' గొల్లను అనురీతిగానె రూపము లుండును.

గొల్లని, మాలనిచేత మొదలగుద్వితీయాద్యంతరూపములనుబట్టి ఈఁడుజ్ఞు తద్ధిత మనుట యనవసర మని నిర్ణయింపవచ్చును. ఇంక నీయది 'రాముఁడు' మొదలగుచోట్లఁ బ్రథమైకవచనముగా వచ్చు'డుజ్ఞు' కంటే వేఱుగాఁ జెప్ప నవసరము లేదు. డుజ్ఞు లేని గొల్ల, గొల్లను, అనురీతి స్త్రీసమరూపములను సాధించుకొనఁదగును. బాలవ్యాకర్తమతము ననుసరించిన నిట్టివి స్త్రీసమములు, పుంలింగతుల్యములు (మగాదులలోనివి) నగు నని గుర్తింపవచ్చు.

అట్టివాఁడు, పెద్దవాఁడు, మొదలగుచోట్ల 'వాఁడు' తద్ధిత మనవలసినయవసరమును గానరాదు. 'వాఁడు' అనునది తచ్ఛబ్దముయొక్క మహదర్థక ప్రథమైకవచనరూప మగుట స్పష్టమె. అమహదర్థమున నీతగొప్పవాఁ డనము గదా. వాఁడు తద్ధితమె యన్నను కాఁడు ఇత్యాదులవలె మహదర్థముననె యగును. ఇంకఁ బ్రాతిపదికకుఁ దచ్ఛబ్దానుప్రయోగము మాత్రమె విధింపఁదగును. 'గొల్లాఁడు' అనురీతిరూపములు ప్రసిద్ధములు గావు. లోకవ్యవహారమునుబట్టి మాత్రమె వాని నంగీకరింపవలసియుండును. అట్టియెడలను 'వాఁడు' శబ్దములోనివకారము లోపింపఁజేయుటం చేతనే ఆఁడు సిద్ధించును. కావున దీనిని బ్రత్యేకముగాఁ బరిగణింపవలసిన యవసరమును లేదు. మొత్తముపై నిట గొల్లాదులకు వచ్చు తద్ధితప్రత్యయ మేదియుఁ గానరాదు. ఇట వివృతి యితరము ల గూతద్ధితముల నుదాహరించుచున్నది.

వి. కొండీఁడు, మన్నీఁడు, మావటీఁడు మణయగాఁడు
కొండెగాఁడు, (గొల్లవాడు) మిండగాఁడు
మిండఁడు, ముత్తాండు. చిన్నాండు, పెద్దాండు,
చంటివాఁడు, దొమ్మరివాఁడు, కల్లరి, జూదరి, ఒంటరి
నేర్పరి, వేడుకవాఁడు, మంచివాఁడు, బత్తెగాఁడు
వేటగాఁడు, ఒంటరిగాఁడు, కల్లరిగాఁడు, పోటరి,
పోటరిగాఁడు, మడ్డి, మడ్డిగాఁడు, తుంట తుంటరి
తుంటరిగాఁడు, ముడుపరిగాఁడు ఇత్యాది.

వ్యా. 1 ఈండు: కొండె(ము) - కొండీఁడు మన్నె(ము) - మన్నీఁడు; మావటి - మావటీఁడు.

2. గాండు: మణయ(ము) మణయగాఁడు, కొండె(ము) - కొడెగాఁడు మిండ - మిండగాఁడు బత్తె(ము) బత్తెగాఁడు వేట - వేటగాఁడు మిండ మిండగ్గాఁడు, బత్తె(ము) బత్తెగాఁడు వేట - వేటగాఁడు, ఒంటరి - ఒంటరిగాఁడు, మడ్డి - మడ్డిగాఁడు, పోటరి - పోటరిగాఁడు, కల్లరి - కల్లరిగాఁడు, ముడుపరి - ముడుపరిగాఁడు

3. ఆండు: – ముత్తు – ముత్తాండు, చిన్న – చిన్నాండు, పెద్ద – పెద్దాండు.

4. వాఁడు: చన్ను – చంటివాఁడు (ఇట నౌపవిభక్తికము) దొమ్మరి – దొమ్మరివాఁడు, వేడుక – వేడుకవాఁడు, మంచి – మంచివాడు.

5. అరి: – కల్ల – కల్లరి, జూదము – జూదరి, ఒంటి – ఒంటరి, నేర్పు – నేర్పరి, పోటు – పోటరి, తుంట – తుంటరి, డుక్ – మిండ – మిండఁడు.

ఒంటరిగాఁడు, కల్లరిగాఁడు ఇత్యాదులలో మతుబర్థమునందు అరిప్రత్యయము రాఁగా దానిపై స్వార్థమునందు 'గాఁడు' అయిన దని గుర్తింపదగును.

ప్రౌఢ వ్యాకర్త నీచార్థమునందుఁ జెప్పిన 'ఇగా' యనుప్రత్యయము గూడ నిందు 'గాఁడు'లోఁ గలిసి తద్ధితముగాఁ జెప్పఁబడినట్లు తోఁచుచున్నది.

చిన్నాండు, పెద్దాండు అనురీతిని కావ్యములందుఁ బ్రయోగింపఁబడుట మృగ్యము. గ్రంథకర్త నాఁటి వ్యవహారమున నుండి యుండును.

## 7. వడుర్యత్కిమోః[1].

యత్కిమోః = యత్కిమర్థక మగు 'ఏ' శబ్దమునకు, వడుః = వడు అనుప్రత్యయ మగును.

వి. యత్కింశబ్దయోర్వడు ప్రత్యయస్స్యాత్. ఎవఁడు.

యత్, కిమ్ అనుశబ్దములయర్థము గలిగిన 'ఏ' అనుదేశ్యశబ్దమునకు వఁడు అనుతద్ధితప్రత్యయము వచ్చును. ఏ + వఁడు = ఎవఁడు. అర్థవిశేషము ప్రస్తావింపకపోవుటచే విది స్వార్థిక మనవలయును. స్వార్థ మనఁగా నిటఁ బ్రాతిపదికార్థమే.

ఇందలి డు(జ్ఞు) ప్రథమైకవచమనఁదగు 'వడు' అనునది తద్ధితమనుట విచార్యము. చూ.తద్ధి 22

## 8. తద్ధిత పుమమహతోర్ని రమః.

వ్యా. తద్ధిత పుమమహతః = తద్ధితప్రత్యయాంతమగు మహత్తునకు, పుమహత్తులకును బరమై యున్నఅమః = ద్వితీయైకవచనము యొక్క స్థానమున, నిః = ని అనుప్రత్యయము వచ్చును.

---

1. వడుశ్చ? త్రి. శ. 5.13.

వి.తద్ధి తాంతానాం పుమమహ తాంచ ద్వితీయై కవచనస్య డుజో నిరాదేశస్స్యాత్. వాఁడు - వాని, చెలిగాఁడు - చెలిగాని, కొండఁడు - కొండని రంగఁడు-రంగని ఇత్యాది.

తద్ధితాంతములకును, పురుషుని బోధించు న మహద్వాచకశబ్దములకు పర మయియున్న ద్వితీయావిభక్తి యేకవచనమగు 'అమ్' ప్రత్యయముయొక్క స్థానమున 'ని' అనునది యాదేశ మగును. తద్ధితప్రత్యయములతుది డుజ్జునకును (అమ్మునకును) నిది యాదేశ మని వివృతి వివరించినది ఈ యర్థమునకు సూత్రమునం దాధారము లేదు.

లక్షణమునుబట్టి చూడఁగా 'గాండు ప్రభృతి తద్ధితములలోని డుజ్జు ప్రథమై కవచనమే యనియు, నచటగా మొదలగునవి మాత్రమె ప్రత్యయము లనియుఁ జెప్పుకొన్న అందగా+ అమ్ అందగాని అని యగును. అందగాఁడు మొదలగువానిపై సువిభక్తి యేమైన దనుప్రశ్న యుండదు. గాండు ఇత్యాదిగాఁ బూర్ణబిందువుతో సూత్రమునఁ బ్రత్యయము నిర్దేశించినను, అందగ్గాడు అనురీతిగా నరసున్న యుండుట యెప్పును. (ఆండుమాత్రము ముత్తాండు అనురీతిగా నిండుసున్నతోనె యుదాహరింపబడినవి) ఇన్నియు సముచితముగా సమన్వయించును గాని 'గొల్లాదిభ్యోడు జాది' అనుచో డుజ్జైతద్ధితముగాఁ జెప్పఁబడినది గదా. అది ప్రథమై కవచనమైన నిఁ దద్ధిత మేది? కావున 'గాండు' మొదలగునవే తద్ధితము లనక తప్పదు. అట్టియెడల వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తి యని డుజ్జుతోఁ గూడ అమ్మునకు నీసూత్రముచే నివర్ణ మాదేశ మగు నని గ్రహింపకయుఁ దప్పదు.

అందగాఁడు + అమ్ అందగాని అని యగును. డు జ్జనుటచే బిందువుతోఁ గూడిన డువర్ణము గ్రహింపఁబడి దానికిని, దానికిఁ బైనున్న అమ్ప్రత్యయమునకును మొత్తమునకు 'ని' వర్ణ మాదేశ మగును.

అమ్పరకతలో డుజ్జున కాదేశ మగు నని సూత్రించిన 'మహతో ని రమః అని యమ్మునకు వేఱొకనివర్ణము వచ్చి చెలికానిని అనురీతిగా నయ్యెడిది.

## 9.టాదిషు చ.

వ్యా. టాదిషు చ = తృతీయాద్యేకవచనములు పరముగా నున్నప్పుడు సయితము తద్ధితోమహతః = తద్ధితాంతములు, పురుషవాచకములగు నమహచ్ఛబ్దములకు, నిః = నివర్ణము వచ్చును.

---

1. డోర్నిః. ఆం.కౌ. హ. 67.

వి. తృతీయాదిషు పరేషు తద్ధితామహతోఽనేకవచనస్య డుజశ్చ నిరాదేశస్స్యాత్.

వానిచేత, చెలికానికొఱకు, ముత్తానివల్ల, మిండ గానికొఱకు, కల్లరీనికి, మిండనియందు, రంగనిచేత, తిప్పనికొఱకు, కొండనివల్ల, తొత్తనికి, కుప్పనియందు ఇత్యాది.

ఆది శబ్దమున నేకవచనమును మాత్రమే గ్రహింపవలయును. తృతీయాదివిభక్తులలో నేకవచనము పరముగా నున్నపుడు పురుషవాచకములో మహద్వాచకములయు తద్ధిత ప్రత్యయాంతము లగు శబ్దములయొక్కయు డుజ్జుస్థానమున నివర్ణ మాదేశ మగు నని సూత్రాభిప్రాయము.

చెలికాఁడు + టా అని యుండఁగా డుజ్జున కనఁగా బిందువుతోఁ గూడ డువర్ణమునకు 'ని'వర్ణమాదేశమై చెలికాని – టా – చెలికానిచేతనని యగును. ఇట్లే యితరవిభక్త్యంతరూపములు నాయాతద్ధితాంతశబ్దముల కూహింపఁదగును.

## 10 లులా[1]వుకః.

వ్యా. ఉకః = తద్ధితప్రత్యయములందలి డుజ్జులోని యుకారమునకు, లులౌ = లులలు వచ్చును.

వి. జశ్శసోః పరయోస్తద్ధితామహతాం డుప్రత్యయస్య ఉకో[2] లులావాదేశౌ క్రమాత్ స్తః.

మన్నెవాఁడు – మన్నెవాండ్లు, చెలికాండ్లు, మాలవాండ్లు మాలాండ్లు – కొండఁడు – కొండండ్లు, రంగండ్లు, తిప్పండ్లు మన్నెగాండ్లు, మాలావాండ్ల, మాలాండ్ల, కొండండ్ల, రంగండ్ల, తిప్పండ్ల, ఇత్యాది.

మహత్తులగు తద్ధితాంతములకు జస్, శస్ విభక్తులు పరముగా నున్నపుడు, ఆజస్సు శస్సులఁతో గూడఁ దద్ధితప్రత్యయమునందలిడువర్ణములోని యుత్వమునకును, (ఉజస్,

---

గాండ్లుర్వహా. బృహస్పతి మాత్రము ఆం.కౌ. త్రి.శ.

[1] లులావుజః 2. ఢుజః అని వ్రాఁతప్రతి. జత్వఫలము పోయిన ననుస్వార మెక్కడనుండి వచ్చును? మన్నెవాం డ్లని యగు టెట్లు?

ఉశస్ అనుభాగములకు) లు,ల, అనునవి క్రమముగా నాదేశము లగును. 'ఉజస్సు'నకు లున్నకారము, ఉశస్సునకు లవర్ణమును నాదేశములగు నని యర్థము.

చెలికాండు + జస్ - చెలికాండ్లు, చెలికాండు + శస్ - చెలికాండ్ల.

ఇట బహువచనమునందుఁ జెలికాండులు అనురీతిరూపములు లేకుండుటనుబట్టి లులలను శజశ్శస్సుతోపాటు పూర్వమునందలి యుత్త్వమునకుఁ గూడఁ గలిపి విధింపఁబడియుండును.

కాఁగా బహువచనస్థలములలో చెలికాండ్లు అనురీతిగాఁ బూర్ణబిందువు నియతముగా నుండును. ఏకవచనస్థలమునను ముత్తాండు ఇత్యాదిగాఁ బూర్ణబిందువు విప్రతి చూపియున్నది. అట్లే 'చెలికాండు' అనురీతిగా నుండు నను నుద్దేశముతోనే గాండ్వరి ఇత్యాదిగాఁ దద్ధితములు పూర్ణబిందువుతోఁ గూడిన డువర్ణముతో నిర్దేశింపఁబడిన వేమో. వికృతివివేకము కాఁడు ర్గాఁడుః అని యలఱసున్నతోఁ జెప్పినది.

ఏది యే మైనను రంగండ్లు, మాలవాండ్లు అనురీతి రూపములు ఇతర ప్రామాణిక వ్యాకరణముల ననుసరించి యసాధువులు వాని మార్గమునం దన్నచో రంగలు. (మాలవారు), అనురీతిగనె యుండవలయును. కాప్రత్యయమునకు మాత్రమునకు చెలికాంద్రను రీతి వుపదిష్టములు రంగలు, కొండలు ఇత్యాదుల రంగండ్లనురీతి రూపములు కవిప్రయోగము లందును మృగ్యములు. ('లులౌడుజః' అని డుజ్లోపముచెప్పుటయొప్పు నేమో )

ఈరూపములు శబ్ద - 81, 82 సూత్రములలో సక్రమముగా సాధింపబడినవి. ఇది పునరుక్తియేకాక లక్షణము సరియైన పద్ధతిలో నున్నట్లు గానరాదు.

## 11 లశ్చ.

వ్యా.లః చ = లవర్ణము గూడ నట్లే తద్ధితప్రత్యయములతుది డు జ్వర్ణమునందలి యుకారమునకు నగును.

షి తృతీయాదిషు పరేషు మహతోబహువచనస్య
డుప్రత్యయస్య[1] ఉకో లప్రత్యయ ఆదేశస్స్యాత్.
మన్నెవాండ్లచేత, చెలికాండ్లకొఱకు. మాలవాండ్ల వలన,
పేదాండ్లకు, గల్లండ్లయందు, కొండండ్లచేత,
రంగండ్ల కొఱకు, తిప్పండ్లవల్ల, మల్లండ్లకు,
తిమ్మండ్ల యందు ఇత్యాది.

---

1 డుజః అని వ్రాఁతప్రతి. ఆ పక్షమున మన్నెవాంచే తననిగావలయు.
ఈసూత్రమవసరము గాదు. చూ.శబ్ద. 81, 82. సూ.

మహత్తు లగు తద్ధితాంతశబ్దములకుఁ దృతీయాది బహువచనములు పరముగా నున్నపుడు తద్ధితప్రత్యయమునందలి డు వర్ణములోని యుకారమునకు 'ల' అనునది యాదేశముగా వచ్చును. ప్రథమాద్యేక వచనములును, ప్రథమద్వితీయల బహువచనములును నుక్తము లగుటచేఁ దృతీయాది బహువచనములం దీకార్య మగు నని గ్రహింపవచ్చును.

మన్నెవాండు + భిస్ - ఈ సూత్రముచే మన్నెవాండ్ల + భిస్ - మన్నెవాండ్ల చేత మొ॥ ఇట్లె యితరాలు. ఇట్టిచోట్ల మన్నెవాండ్రచేత ననురీతిగ నుండుట సాధు వని ప్రామాణిక వ్యాకరణములమతము. మన్నెవారిచేత ననియు నుండును.

## 12 పూర్వస్యేత్[1].

వ్యా. పూర్వస్య = పూర్వవర్ణమునకు, ఇత్ = ఇత్వము వచ్చును.

వి. తుచ్ఛార్థేగాడు శబ్దాత్పూర్వపదస్య అకారస్య ఇత్ స్యాత్.[2] ఉపాధ్యాయిగాఁడు, శేషిగాఁడు, కొప్పిగాఁడు, తెప్పిగాఁడు, అయ్యిగాఁడు, మల్లిగాఁడు ఇత్యాది.

గాఁడు ప్రత్యయము పరముగా నున్నపుడు నీచతను బోధించునపుడు, గాఁడునకు పూర్వమునం దున్న వర్ణమున కిత్వము వచ్చు నని యర్థము.

శేషగాఁడు అని యుండఁగా నీసూత్రముచే గాఁడు ప్రత్యయమునకుఁ బూర్వమునం దున్నయత్వమున కిత్వము వచ్చి శేషిగాఁడు అని యగు. ఇట్లె ఇతరములు. ఉపాధ్యాయిగాఁడు, అయ్యిగాఁ డనురీతి వానాట వ్యవహారమునం దుండెడి వేమో.

ధర్మివాచకములకు సాధారణముగా గాఁడు రాఁగాఁ దుచ్ఛార్థవివక్షలో బూర్వమున నిత్వ మగు నని యుద్దేశ్యము గావలె. తుచ్ఛార్థవివక్ష లేనిచో ఉపాధ్యాయగాఁ డని యుండునా? ఇటుఁ బెక్కు వింతరూపము లేర్పడుచున్నవి. ప్రమాద మెటనో పరిశోధింపవలె.

## 13. డుజోవాలుక్ .

వ్యా. డుజః = డుజ్ప్రత్యయమునకు, వా = వికల్పముగా, లుక్ = లోపము కలుగును.

వి. తుచ్ఛార్థక పదాత్పరస్య గాఁడు శబ్దస్య డు(జ్)వర్ణకస్య వా లుక్ స్యాదామ న్త్రణే[2] ఓరి శేషిగా.

---

1. అర్థభేదే క్వచిచ్ఛబ్దాది గా స్యాచ్ఛ తలోఽపి డుజ్. (అ.కా.7)
2. తుచ్ఛార్థే పూర్వస్యేత్తస్మాత్. బృహస్పతి సూత్రము, ఆం.కౌ.త్రి.శ.

ఓరికుప్పిగా, ఉపాధ్యాయిగా, బహువచనే
పూర్వవత్. కుప్పిగాండ్లు, కుప్పిగాండ్లారా,
బ్రహ్మచారిగాండ్లు, బ్రహ్మచారిగాండ్లారా[1] ఇత్యాది.

నీచార్థమునం దున్న గాఁడు అను తద్ధితప్రత్యయములోని డుజ్జునకు వికల్పముగా లోపము కలుగునని సూత్రాభిప్రాయము. వివృతి ననుసరించి గ్రహింపఁదగును.

(ఓరి) కుప్పిగాఁడు అనుచో నీసూత్రముచే డుజ్జు లోపించును. డుజ్ అని జిత్తుగా నిర్దేశించుటచే బిందువుతోఁ గూడ డువర్ణము లోపింపఁగా కుప్పిగా అని యగును. 'ఓరి' యనుశబ్దమును ముందు చేర్చుటతో నుదాహరణమునందు నీచార్థమింకను స్పష్టము చేయబడినది.

'వా' యనుటచే నీలోపము రాని పక్షమునం దగాగమముతో ఓరి కుప్పిగాఁడ, ఓరి కుప్పిగాఁడా అనురీతిగా నుండును. లాక్షణికులు గొంద ఱిట సంబోధనమున డుజ్ అసలు నిలువ దని యెంచిరి. 'నామ న్త్రణేడుజ్' అని వికృతి వివేకము. ఈ వ్యాకరణము 'వా' శబ్దముచే 'కుప్పిగాఁడా' వంటిరూపములు గూడ సాధించినది. ఇది లోక వ్యవహారమునందు విన్పించును.

'డుజః లుక్' అనుటచే బహువచనమునం దీకార్యము లేదు. కుప్పిగాండ్లారా యనురీతి నుండు నన్నది వివృతి. కాని నీచార్థమున బహువచనముతో రూపమె యుండదని ప్రామాణికులు భావించియుండిరి. (బహుతాత్వత్రనేష్యతే.వి.వి) వ్యవహారమునందరుదుగ విన్పించు. ఈలోపము సంబోధనమునందనుటచే నితర స్థలమునందు లేదు. కుప్పిగా వచ్చెను అనురీతి నుండదు.

## 14. సంబంధ జాత్యాదావదిః.

వ్యా. సంబంధజాత్యాదౌ = సంబంధము, జాతి మొదలగు వానిని దెలుపునపుడు, అదిః = అది అనుతద్ధితప్రత్యయము వచ్చును.

వి. మహ దమ హతోర్ధర్మధర్మినామభ్యః
పరతస్సంబంధ జాత్యాదిష్వది ప్రత్యయ స్స్యాత్.
సొగసుది, అంటుది, క్రొత్తది, మంచిది, కన్నెది.

---

1. నామన్త్రణేడుజ్. అ.కా. 71
బహుతా త్వత్ర నేష్యతే. అ.కా.71
తుచ్ఛార్థే డుజో లుగామన్త్రణే. బృహస్పతి సూత్రము. అలక్. త్రి.శ.

బాపనది, సూదరిది, రామునిది, సీతది, గౌరిది,
దొమ్మరిది, గొల్లది, రంగనిది, ఒక్కనిది, దానిది,
వారిది, దీనిది, వీరిది, నాది, నీది. మనది ఇత్యాదీ.

సంబంధము జాతి మొదలగువానిని దెలుపునపుడు మహత్తులు, నమహత్తులు, ధర్మ వాచకములు, ధర్మి వాచకములు నగు నన్ని శబ్దములకును 'అది' అను ప్రత్యయము వచ్చును. కన్నెకు సంబంధించినది అని సంబంధార్థమున 'కన్నె' అనుశబ్దమునకు 'అది' ప్రత్యయము రాఁగా కన్నె + అది అని యుండఁగా 'పూర్వరూపమదౌ' (సంధి-25) అనుసూత్రముచేఁ బూర్వరూప మయి కన్నెది అని యగును.

'బాపనజాతికిఁ జెందినది' యని జాతిని దెలుపునపుడు బాపన శబ్దముపై నీసూత్రముచే అది ప్రత్యయము వచ్చి పూర్వరూపము గలుగగా 'బాపనది' అని యగును. ఆం.కౌ.లో 'ది' విహితము.

## 15. హయదాదిభ్యో దిరమహదేకస్య.[2]

వ్యా. హయదాదిభ్యః = హ్రస్వమును బొందిన 'యత్' మొదలగువానియర్థము గలిగిన శబ్దములకంటె, అమహదేకస్య = అమహదర్థమునందు ఏకవచనమునకు, దిః = 'ది' అను ప్రత్యయ మగును.

వి. హ్రస్వేభ్యో యత్తదేతచ్ఛబ్దేభ్యః పరతోదిస్స్యాత్.
ఏది, అది,ఇది.

హ్రస్వములగు యత్, తత్ ఏతత్ శబ్దములకుఁ బరముగాదివర్ణ మగును. యత్, తత్, ఏతత్ అనునవి యదాదులు. తెలుగున ఏ, ఆ, ఈ అనుశబ్దములు, ఇవి హ్రస్వమును బొందఁగా ఎ,అ,ఇ, అని యగును. హ్రస్వమును బొందిన యీశబ్దములకు అమదర్థమునందుఁ బ్రథమావిభక్తి యేకవచనమున 'ది' అనుప్రత్యయము వచ్చును. ఎది, అది, ఇది.

'ఏది' అనియుఁ గలదు.

---

1. అది స్సంబంధ జాత్యాదౌ. త్రి.శ.5.7
జాతినామ్నాం దిః, సంబంధార్థే చ సర్వస్మాత్. ఆం.కౌ.హ. 34, 35
దిస్స్యా త్సంబంధార్థే సర్వస్మాత్. ఆం.శ.చిం.హ. 25

2. (లిఙ్గ కార్యం చ సమ్మతః త్రి.శ.5-5)
యదేతత్తదామేదీద్యదీవి పుం నపుంసకార్థే. ఆం.కౌ.హ.41
దిసో. వై.చం.హ.8

ఈ దివర్ణకమును దప్డిత ప్రకరణమునఁ జేర్కొనుట విశేషము. ఇవి సర్వనామములని ప్రామాణికుల మతము. ఇందును పైని 17 మొదలగు సూత్రములయొద్ద నివి సర్వనామములని చెప్పుట గమనింపఁదగును.

## 16. ద్యన్తాదే ర్న్యమాది పరే.[1]

వ్యా. ని + అమాదిపరే = ద్వితీయాదులయందలి నివర్ణము పర మగుచుండఁగా, దేః = ది ప్రత్యయమునకుఁ బరముగా, ద్యన్తాః = యత్తదేతచ్ఛబ్దములు దీర్ఘాంతము లయి యుండును.

వి. అమాది పరే నివిర్ణకే ది వర్ణకాత్పరతో దీర్ఘాం
తా యత్తదేతచ్ఛబ్దాస్స్యుః. దే - దా - దీ -
దేనిని, దానిని, దీనిని, దేనిచేత, దానిచేత, దీనిచేత,
దేనికొఱకు, దానివల్ల, దీనికి, దానియందు ఇత్యాది.

ద్వితీయాదులందలి నివర్ణకము పర మయినపుడు యత్తదేతచ్ఛబ్దములు ది వర్ణమునకుఁ బరముగా దీర్ఘాంతములై ఏ, ఆ, ఈ, అనురూపములతో నుండు నని యర్థము. ఏ + అమ్, ఏ + ని అని యుండఁగా ముందు దివర్ణక మై, ది + ఎ శబ్దము దీర్ఘ మై, ది + ఏ + ని అని యగును. పరరూపసంధితో దేని అని యగును. ఇట్లె ది + ఆ + ని = దాని, ది + ఈ + ని = దీని. ఇట్లే దేనిచేత, మొ॥

ప్రథమయం దేకత్వమునఁ బరముగా వచ్చిన దివర్ణము ద్వితీయాద్యే కవచనములందు యత్తదేతచ్ఛబ్దములకుఁ బూర్వము నందు వచ్చు ననియు, హ్రస్వము లగు నాశబ్దములు దీర్ఘము లగుననియు నభిప్రాయము.

ఇట ది ప్రత్యయమును (ముందుగా) చెప్పి పరరూపసంధిని గూర్చి ప్రక్రియా గౌరవము కల్పించుటకంటె, నీశబ్దములకుఁ బూర్వమునందు ధకారపుఁబొల్లు నాగమము చేయుటలో లాఘవము గలదు.

## 17. తతో వాపుంసి[2]

వ్యా. పుంసి = పురుషవాచక మగునపుడు, తతః = తదర్థకమునకు 'వా' యనునది యగును.

వి. తచ్ఛబ్దస్య వాస్యాత్పురు షార్థే సర్వనామ - సు -
డుజ్ ప్రత్యయః - వాఁడు. బహువచనే - వారు.[3]

---

1. తేషా మమాదౌ, దేని, దీని, దానీని. ఆం. కౌ.హ. ౧42.
2. వాఁడు తదర్థే పుంసి. ఆం. కౌ.హ. ౧51
3. వాండ్లు అని వ్రాత ప్రతి

పురుషవాచక మయినపుడు తదర్థకమున 'వా' యనునది యగును. (ఇది సర్వనామము. వా + సు అనుచో సుస్థానమున డుజ్జు వచ్చి వాఁడు అని యగును బహుత్వమునందు సర్వనామమని చెప్పుటనుబట్టి 'జసోరుః' అని రువర్ణము వచ్చి 'వారు' అని యగును.

## 18. వ్యే తదః[1].

వ్యా. ఏతదః = ఏతచ్ఛబ్దార్థమునకు, పుంసి = పురుష వాచక మయినపుడు, వీ = వీ అనునది వచ్చును.

వి.ఏతచ్ఛబ్దస్య వీ స్యాత్. సర్వనామ. సు – వీఁడు బహువచనే –వీరు[2]

పురుషుని బోధించునపు డేతచ్ఛబ్దార్థమున 'వీ' శబ్ద మగు నని యర్థము. ఈ శబ్దము సర్వనామము ప్రథమైకవచనమునందు సుస్థానమున డుజ్జు వచ్చి – వీఁడు అని యగును.

బహుత్వమునందు 'వీ' అను ప్రాతిపదికముపై జస్సునకు (వీ + జస్) జసో రుః అని రువర్ణకము రాఁగా వీరు అని యగును. ఇచ్చట 'వీరు' అని చూపుటనుబట్టి పూర్వసూత్రమునొద్దఁగూడ వారు అని యె చూపబఁడి యుండును. ఇంకను ఏ శబ్దమునకు ను 'ఏరు' అని తరువాతిసూత్రమునొద్దఁ జూపఁబడుటనుబట్టియు నట్లే చెప్పవలయు. వ్రాఁత ప్రతిలో 'వాండ్లు' అని యుండుట పొరపాటని నిశ్చయింపఁదగును. 'జసోరుః' అను సూత్రము నొద్దను 'ఏరు, వారు, వీరు' అని యత్తదేతచ్ఛబ్దము లీ క్రమములోనె యుదాహరింపఁ బడుటను బట్టియు 'వారు' అను నదే పూర్వస్థలమున నుదాహృతము. ఇవి సర్వ నామములగుట వివృతి యిటఁ బ్రస్తావించియు నున్నది.

## 19. ఏద్యత్కిమోః[3].

వ్యా. యత్కిమోః = యదర్థమునను, కిమర్థమునను, ఏత్ = ఏ కారము కల్గును.

వి. దేశ్యే యచ్ఛబ్దకింశబ్దయో ర్యే స్యాత్. పుంలింగ త్వా డ్డుజ్ – ఏఁడు – ఏరు.

యత్, మఱియు, కిమ్ అనుశబ్దముల యర్థమునఁ దెలుఁగున 'ఏ' యనుశబ్దము కలుగును. ఇది సర్వనామము. సుస్థానమున 'సోరేకాదేః' అనుసూత్రముచే డుజ్జు వచ్చి ఏఁడు

1. ఏతదర్థేవీఁడు ఆం.కౌ.హ.61.
2. వీరుశ్చ ఆం.కౌ.హ. 62
3. యత్తదోరేకారాకారౌ. ఆం.కౌ.హ.29

అని యగును. బహువచనమునందు జస్సునకు 'జసోరుః' అనుసూత్రముచే రువర్ణము వచ్చి ఏరు అని యగును.

## 20. ఆత్తదః[1].

వ్యా. తతః = తచ్ఛబ్దమునకు, ఆత్ = ఆ శబ్ద మగును.

వి. దేశ్యే సర్వనామ్ని తచ్ఛబ్దస్య ఆత్ స్యాత్. ఆ డుజ్.
ఆడు – ఆరు.

తదర్థమున 'ఆ' యనుశబ్ద మగును. ఇదియు సర్వనామము. దీనిపైని సువిభక్తికి డుజ్జు వచ్చి (సోరేకాదేః) ఆఁడు అని యగును. ప్రథమాబహువచన మగు 'జస్సు'నకు రువర్ణము వచ్చి ఆరు అని యగును తచ్ఛబ్దమున. కాఁడు, ఆరు, అనురూపములు నేఁడు విన్పింపవు.

## 21. ఇదమదసేతదామీత్[2]

వ్యా. ఇదమ,దసేతదామ్ = ఇదమ్, అదస్, ఏతత్ – అను శబ్దములయర్థమున, ఈత్ = ఈకార మగును.

వి.ఇదమ దసే తచ్ఛబ్దానామీత్ స్యాద్దేశ్యే సర్వ
నామ్ని. ఈ డుజ్ – ఈఁడు, ఈరు.

ఇదమ్, అదస్, ఏతత్ అనుశబ్దములయర్థమునఁ దెలుఁగున 'ఈ' అనుశబ్దమగును. ఇది సర్వనామము కావున సుస్థానమున 'సోరేకాదేః' అనుసూత్రముచే డుజ్జు వచ్చి ఈఁడు అనియు, బహువచనమున జస్సునకు 'జసోరుః' అని రువర్ణము వచ్చి ఈరు అనియు నగును. ఈరూపములును నేడు విన్పింపవు (పుంస్త్రీ నపుంసకలింగములు మూఁడింట నీశబ్ద మింతియ)

## 22. సర్వనామ్నిచ[3]

వ్యా. సర్వనామ్ని చ = సర్వనామ మగు ఏ శబ్దమునకును వడు అనునది యాగమ మగును.

---

1. ఆతదః. వై.చం.హ.22.
2. ఇదమద సేతదామీ ఆం.కౌ.హ.28
   ఇదమద సేతదామీ వై.చం.హ.13
3. వడువాయతః. ఆం.కౌ.హ.53
   వడుశ్చ త్రి.శ.5.6.

వి. దేశ్యే సర్వనామసు హ్రస్వయచ్ఛబ్దకింశబ్దయో ర్వడురాగమస్స్యాత్ పుమర్థే, ఎవడు, ఎవరు.

సర్వనామ మగు 'ఏ' శబ్దము హ్రస్వముతో 'ఎ' అనురూపముతో నున్నపుడు, దానికి 'వడు' అనునది యాగమ మగును. ఎవఁడు

'ఎవరు' అనునది బహువచనాంతరూపముగా నుదాహరింపఁబడినది. 'వ' అనునది మాత్రమె యాగమముగా విధించినచో డుఁ్రులు ప్రథమైక బహువచనములుగా సిద్ధించి యుండెడివి.

'వడుర్యత్కి-మో' 'తద్ది' -7 అనుదాని ననుసరించి వడు తద్ధితప్రత్యయముగా చెప్పుట యనవసరమని యీలక్షణమును బట్టి గుర్తింపవచ్చును.

## 23 ద్విర్వా[1].

వ్యా. వా = వి కల్పము గా, ద్విః = ద్విత్వ మగును.

వి. యచ్ఛబ్దాత్పరస్య వడ్వాగమ వకారస్య వికల్పేన ద్విత్వం స్యాత్. ఎవ్వఁడు, ఎవ్వరు.

'సర్వనామ్ని చ' యనుపూర్వసూత్రముచే ఎ(ఏ)శబ్దమున కాగమ మయిన వ(వడు) కారమునకు వికల్పముగా ద్విత్వము వచ్చును ఎవ్వఁడు - ఎవ్వరు. 'వా' యనుటచే ద్విత్వము రానిపక్షమునందు ఎవఁడు, ఎవరు అని యుండును.

## 24 దిః పుంసి[2]

వ్యా. పుంసి = పురుషుని బోధించుసందర్భమున, దిః = 'వ' వర్ణమునకు దీర్ఘమును, వా = వికల్పముగా నగును 'ద్విర్వా' యను పూర్వసూత్రమునుండి 'వా' యనునది యిట ననువర్తించు 'ఏ'శబ్దమునకుఁ బరమైన వడుగాగమ వ వర్ణమునకు దీర్ఘమును వికల్పముగా నగు నని యర్థము.

వి. పురుషార్థే ప్రకృతి ప్రత్యయయోర్దీర్ఘశ్చ వా స్యాత్. ఏవాఁడు, ఎవ్వాఁడు, ఏవారు, ఎవ్వారు.

ఎవఁడు - దీర్ఘమైన ఏవాఁడు ఇట్లేఏవారు, ద్విత్వమును దీర్ఘమును వచ్చిన ఎవ్వాఁడు - ఎవ్వారు.

---

1. వాద్విత్వం
2. పుయిదీర్ఘశ్చ త్రి.శ.5.14-15. ద్విస్తరాదిభ్యా అం.కౌ.హ.52.

ఎవాఁడు, ఎవారు అనువిధమయినరూపములు ఇతర ప్రామాణిలాక్షణికులచే నంగీకరింపఁ బడలేదు.

'పుంసి' యనుటచే స్త్ర్యర్థమున 'ఎవతె, ఎవర్తె ఇత్యాదిగా 'ఎ' శబ్దముపై నున్న 'వ' వర్ణమునకు దీర్ఘము రా దని యభిప్రాయము గావలయును. ఎవఁడు అనురీతిగా వడు అను ఆగమము వచ్చునదే పురుషార్థమున.

## 25 చాటోశ్చ[1]

వ్యా. చాటోః చ = చాటు శబ్దమున సయితము మొదటియచ్చునకు వికల్పముగా దీర్ఘ మగును.

## వి. చాటుశబ్దస్య చ వా దీర్ఘస్స్యాత్.

చాటు, చోటు, చటు, చాటు. మొ॥ చాటు, చటు, అనునవి ప్రత్యేకముగాఁ గానరావు ఆఈఏలపై కృతహ్రస్వములపై మాత్రమె గానవచ్చును అచాటు, అచటు మొ॥ 'చాటు' అనుశబ్ద మసలు విన్పింపదు చోటు అనునది దీర్ఘము లగు ఆఈఏలపైనె కన్పించును 'చోటు' అనునది గాక 'చాటు' 'చటు' అనువానిని మూలరూపములుగా భావించుట యిందలి విశేషము.

'చ' శబ్దమునుబట్టి యీకార్యము పూర్వము నందువలె 'ఎ' అనుశబ్దముపైనె యగు ననియు, ద్విర్వా, దీఃపుంసి, యని పూర్వముచెప్పఁబడిన ద్విత్వదీర్ఘములు రెండు నిటఁ చశబ్దముచే నుద్దిష్టము లనియుఁ జెప్పవీలు గలదు. ఎచాటు, ఎచటు, ఎచ్చోటు, ఎచ్చటు ఇత్యాది. ఎచోటు, అనురూపము మాత్రము ఎవాఁడు అనురీతిగానె విన్పింపదు.

## 26. చోట్వాది ర్హదో[2].

వ్యా.హదీ = హ్రస్వమును దీర్ఘము నయిన అ, ఈ, ఏ శబ్దములపై, చోట్వాదిః = చోటు మొదలగు శబ్దములు చేరు.

వి. తదాదిభ్యః దేశ్యహదీర్ఘాదిభ్యః పరతశ్చోట్వాద

యస్స్యుః. అచాటు, ఆచోటు, అచ్చోటు, అచోటు,

అచ్చోటు, అచటు, ఆచటు, అచ్చటు, అటు, ఆటు, అట్టు

ఆచో, అచ్చో, అచో, అవల, ఆవల, అవ్వల,

అటులు, అట్టులు, ఇటులు, ఇట్టులు, ఎటులు, ఎట్టులు ఇత్యాది.

---

1. చోటువివచ త్రి.శ.5.16
2. చటుశ్చవల టుట్టు న్యు. త్రి.శ.5.17

ఆ ఈ ఏ, అనువిధముగా దీర్ఘములును, అ, ఇ, ఎ, అనుతీరుగా హ్రస్వములు నయిన శబ్దములపై చోటు మొదలగు శబ్దములు చేరు నని యర్థము. అచోటు, ఆచోటు, ఇచోటు ఈచోటు, ఎచటు, ఏచటు, మొ॥

ఇందు నిరూపింపఁబడినవానిలో ఆచోటు అనుతీరుగా ఆ ఈ ఏలు దీర్ఘములపై చొటు, చటు, శబ్దములు గానరావు. అచో, ఆటు నను నదియుఁ గానరాదు.

ఈ లక్షణముచే చొటు చటు అనునవి ఆ, ఈ, ఏ,లపైనె గాని విడిగా నుండ వని చెప్పవచ్చును. కాని చోటుశబ్దమునకు నట్టిస్థితి గల్గుట సరికాదు.

## 27 వతె వరితె వరిత్వాది స్త్రియామ్[1].

వ్యా. స్త్రియామ్ = స్త్రీని బోధించునపుడు 'ఏ' శబ్దమునకు – వతె, వరితె, వరితు ఆదిః = వతి, వరితె, వరితు – మొదలగునవి యగును.

వి. స్త్ర్యర్థే యత్కిం శబ్దాభ్యాం[2] పరతో వతె, వరితె,
వరిత్వాదయ ఏతే తద్ధితస్త్రీప్రత్యయా స్స్యుః.
ఎవతె, ఎవరితె, ఎవర్తె, ఎవరితు, ఎవర్తు,
ఎవతి, ఎవరితి, ఎవర్తి. ఇత్యాది.

'ఏ'శబ్దమునకు స్త్రీనిబోధించునపుడు వతె, వరితె, వరితు, మొదలగు ప్రత్యయములు వచ్చు నని యర్థము. ఆదిశబ్దముచే వరితి, మొదలగునవి వచ్చును. – ఎ – వతె,

ఎ – వరితె, ఎ – వరితు, ఎ – వరితి. మొ ॥

## 28 ఏకాద్వలుక్.

వ్యా. ఏకాత్ = ఏకార్థక మయిన ఒక, శబ్దమునకుఁ బరమైన వతె మొదలగు ప్రత్యయములందు, వలుక్ = 'వ' వర్ణమునకు లోపము వచ్చును.

వి. ఏకశబ్దాత్పరే వతిప్రభృతీనాం వస్య లుక్ స్యాత్.
ఒకతె, ఒకరితె, ఒకరితి, ఒకర్తు, ఒకర్తి ఇత్యాది.

ఒక శబ్దమునకుఁ బైనున్న వతె మొదలగు ప్రత్యయములయందలి 'వ' వర్ణమునకు

---

1,2. వతె వరితె యత్కిమో. త్రి.శ.5.19.
యతః కిమోవతె వరితెచ. బృహస్పతిసూత్రము. ఆం.కౌ.అనుబంధం.

లోపము వచ్చును. దీనిని బట్టి పూర్వసూత్రము ననుసరించి యొక, యొక్క శబ్దములకును స్త్ర్యర్థమునందు వతె మొదలగు ప్రత్యయములు వచ్చు నని గ్రహింపవలయును.

ఒక + వతె అని యుండగా నీ సూత్రముచే వ వర్ణము లోపించి ఒకతె యని యగును. ఇట్లే ఒక్క + వరితె = ఒక్కరితె, ఒక + వరితు = ఒక్కరితు, ఒక + వరితి = ఒకరితి మొ॥

## 29 కె మె పె బిడాద్యా దితదాదిభ్యః స్త్ర్యర్థే[1].

వ్యా. స్త్ర్యర్థే = స్త్రీని బోధించునపుడు, దితదాదిభ్యః = దీర్ఘము లైయున్న, ఆ, ఈ, ఏ, యను శబ్దములకు,కెమెపె బిడ ఆద్యాః = కె, మె, పె, బిడ అను ప్రత్యయము లగును.

వి. దీర్ఘతదాదిభ్యో ధర్మధర్మినామభ్యః పరత స్సంబంధజాత్యాదిషు ఏతే తద్ధితస్త్రీప్రత్యయాః స్యుః. ఆకె, ఈమె, ఈపె, ఏమె, ఏపె, ఆబిడ, మంచియాపె, సొగసాబిడె, క్రొత్తామె, చాకలాపె, రాచామె, బాపనాబిడె, సూదరాకె ఇత్యాది.

ఆఈఏ యను శబ్దములకు స్త్ర్యర్థమున కె,మె,పె మొదలగు ప్రత్యయములు వచ్చును.

ఆ + కె = ఆకె. ఈ + మె = ఈమె, ఏ + పె = ఏపె. బిడ ప్రత్యయ మయినచో నాబిడ మొ॥

ఆ కె ప్రభృతులు పూజ్యస్త్రీవాచకము లని సూరిమతము. 'స్త్ర్యర్థే' యని యిట సామాన్యముగాఁ జెప్ప బడినది. వివృతియును పూజ్యాపూజ్యవివక్ష సేయకయె యుదాహరించినది. మఱల నిట నీ తద్ధిత (స్త్రీ) ప్రత్యయము లనుట వింత.

## 30 కత్తెధర్మ ధర్మినామభ్యః.

వ్యా. ధర్మధర్మినామభ్యః = ధర్మవాచక శబ్దములును, ధర్మివాచకము లయిన శబ్దములకును, స్త్ర్యర్థే = స్త్రీని బోధించునపుడు, కత్తె = కత్తె యను ప్రత్యయము వచ్చును. స్త్ర్యర్థే యన్నది పూర్వ సూత్రమునుండి యనువర్తించును.

---

1. (కత్తె) కెమెపెబిడాద్యా స్త్రియామ్ తదాదేః. త్రి.శ.5.9.
కెమెపెబిడాద్యాస్త్రియాం తదాదిభ్యః. బృహస్పతి సూత్రము. ఆం.కౌ.అనుబంధం.

వి. దితదాదిభ్యో ధర్మధర్మినామభ్యః పరతశ్చ సంబంధజాత్యాదిషు స్త్ర్యర్థే కత్తె స్యాత్.
ఆకత్తె, ఈకత్తె, ఏకత్తె, సొగసుకత్తె, సీటుకత్తె, బత్తెకత్తె, వింతకత్తె, చాకలకత్తె, సూ దరకత్తె ఇత్యాది.

ధర్మవాచకములకు మతుబర్థమునను, ధర్మివాచకములకును స్వార్థమునందును స్త్రీత్వమున కత్తె యను ప్రత్యయము వచ్చును. సొగసు అనునది ధర్మవాచకము, సొగసుగలస్త్రీ యను నర్థమున దీనిపై 'కత్తె' ప్రత్యయము వచ్చి సొగసుకత్తె అని యగును.

హెగ్గడి అనునది ధర్మివాచకము దానిపై నదే యర్థమున కత్తెప్రత్యయ మై హెగ్గడికత్తె అని యగును

ఆ ఈ ఏ శబ్దములకును గత్తె ప్రత్యయము వచ్చునని, ఆకత్తె, ఏకత్తె, ఈకత్తె, యని వివృతి పేర్కొనుచున్నది. ఇందుకై 'కె, మె, పె, బిదాధ్యాః' అను పూర్వసూత్రమునుండి 'దితదాదిభ్యః' అనునది యనువర్తింపఁజేసిన దనవచ్చును. కాని యట్టిశబ్దములం దెక్కడను గానరావు. కావున దానిని బరిహరించుటయే యుచిత మని తోఁచుచున్నది.

ఇంకను వివృతి యందుఁ జూపఁబడిన చాకలకత్తె, సూదరకత్తె యన్నవి (ఇవి ధర్మివాచకములపై నయినందు కుదాహరింపఁబడి యుండును) గూడ నెటనేఁ గల వేమో వెదుక వలసియున్నది.

### 31 తె జాతిపుంయోగయోః[1].

వ్యా. జాతి పుంయోగయోః = జాతిని దెల్పు శబ్దమునకు, పురుషవాచక శబ్దమున కా పురుషునికి సంబంధించిన స్త్రీ యను నర్థమునను, తె = 'తె' అను ప్రత్యయము వచ్చును.

వి. స్త్ర్యర్థే జాత్యర్థపుంయోగార్థయో స్త ప్రత్యయస్స్యాత్. బాపనతె, బాపనతెలు, గొల్లతె, చాకలతె, దొమ్మరితె, మాలతె, మాలతెలు ఇత్యాది.

జాతివాచక, పురుషవాచకశబ్దములకు, దానికి సంబంధించినస్త్రీ యను నర్థమున 'తె' అను తద్ధితప్రత్యయము వచ్చు నని సూత్రార్థము.

బాపన జాతికిఁ జెందినస్త్రీ యను నర్థమున బాపనశబ్దముపై నీ సూత్రముచే 'తె' ప్రత్యయము వచ్చి బాపనతె యని యగును.

1. తే చాచార్యాణామ్. ఆం.కౌ.హ.36

అట్లే బాపనునితో యోగము గలది యను నర్థమునను తెప్రత్యయము వచ్చి బాపనతె యని యగును. బ్రాహ్మణుని స్త్రీ యని దీని కర్థము.

ఈ ప్రత్యయము 'త' అను స్వరూపముతోని తరప్రామాణిక లాక్షణికులచే ఁజేర్కొనఁబడినది. పుంయోగార్థ మిట విశేషమె, జాతి స్త్రీత్వము సామాన్యము.

## 32. దయాయా మణ్ణ్యల్లాళ్వాద్యాః[1].

వ్యా.దయాయామ్ = వాత్సల్యమును దెల్పునప్పుడు, అణ్ణి, అల్లి, ఆళు – ఆద్యాః = అణ్ణి, అల్లి, ఆళు మొదలగు ప్రత్యయములు వచ్చును.

వి.పితృమాతృాణాం సదయాహ్వానే తన్నామభ్యః
పరతో ణ్ణ్యల్లా ళ్వాద్యాః స్యుః. అయ్యణ్ణి, అన్నల్లి,
అమ్మణ్ణి, అక్కల్లి, అమ్మాళు, అక్కాళు.

అమ్మ మొదలగు శబ్దములకు వాత్సల్యమును (మొదలగు) నర్థవిశేషమునందు అణ్ణి, అల్లి, ఆళు మొదలగు ప్రత్యయములు వచ్చును, పరరూపము గల్గును.

అమ్మ + అణ్ణి = అమ్మణ్ణి, అమ్మ + అల్లి = అమ్మల్లి, అమ్మ + ఆళు = అమ్మాళు మొ॥

## 33 సో రేకాదేః[2].

వ్యా. ఏకాదేః = మహత్తు లయినఒక్క మొదలగు సర్వనామశబ్దములకుఁ బరముగా నున్న, సోః = సుప్రత్యయము యొక్క స్థానమున వచ్చును.

వి. సర్వనామ్నస్త్యే కాది గణస్య సోర్డుజ్ స్యాత్.
ఒక్కఁడు, ఎల్లఁడు, వాఁడు, వీఁడు, అతఁడు, ఎవఁడు.
తదభావే ఒక్కటి, ఒక్కతె.

మహత్తు లగు ఒక్క మొదలగు సర్వనామశబ్దములకుఁ బర మై యున్న ప్రథమా విభక్తి యేకవచనము (సు)స్థానమున డుబ్రుత్యయము వచ్చును.

---

1. దయాయా మణ్ణి రల్లా ద్యాస్త్రి.శ. 5.11.
   దయామమ్మకక్కాదిభ్యో ణ్ణ్యల్లాద్యాః. బృహస్పతి సూత్రము. అం.కౌ.త్రి.శ.

2. క్వచిదేకాద్యమహతో డుజ్. అం.కౌ.అ.68.
   క్వచిదమహతోఽపి డుజ్స్యాత్. అం.శ.చిం.అ.51.
   ఏకాదిభ్యోఽప్. వై.చం. తద్ధి. 16.

ఒక్క + సు = అని యుండఁగా 'మహతస్సుప్యృదతః' అను సూత్రముచే రావలసిన యుత్వము 'ససుప్యృత్' అను సూత్రముచే రాదు. ప్రస్తుత సూత్రముచే సుస్థానమున డుజ్జు రాఁగా, డువర్ణము జి త్తయినది గావున 'జిదనుస్వారశ్చ' యను సూత్రముచే ముందు బిందువు వచ్చి ఒక్కఁడు ఒక్కండు అని యగును.

అమహత్త్వమునందు, స్త్రీని బోధించుచో తె మొదలగు ప్రత్యయములతో ఒక్కతె ఇత్యాదు లగును. తిర్యగ్జడ వాచక మైనపుడు ఒకటి అని యగును.

ఎల్ల శబ్దమున కెల్లఁడు అనురూప మెచ్చటను గానరాదు.

## 34 క్వచిదమహతశ్చ[1].

వ్యా. క్వచిత్ = కొన్నియెడల, అమహతః చ = అమహత్తు లగు శబ్దములకుఁ బరముగానున్న, సోః = సుప్రత్యయము యొక్క స్థానమున, డుజ్ = డుప్రత్యయ మగు.

వి.క్వచిత్ స్థలేష్వదన్తామహత్పదస్య చ సోర్డుజ్ స్యాత్. కొండఁడు, చెన్నుఁడు, ముత్తఁడు, కత్తళఁడు ఇత్యాది.

కొన్ని యమహచ్ఛబ్దములపైఁ గూడ సుప్రత్యయము స్థానమున డుజ్జే వచ్చును. క్వచిచ్ఛబ్దముచే నమహత్తుల కన్నింటికి డుజ్జురాదు. కయిర మొదలగు కొన్ని శబ్దములకు మాత్రమే యగును. కయిరఁడు, కత్తళఁడు మొ॥ 'ససుప్యృత్' అను వక్ష్యమాణ సూత్రమునుబట్టి యీ ప్రాతిపదికల కుత్వము రాదు.

కొండఁడు ఇత్యాదు లమహత్తులుగా వివృత్తి చూపుట పరిశీలనార్హము. పర్వత మను నర్థమునఁ గొండఁ డనురీతి రూపములు విన్పింపవు. ఎవరికైన సంజ్ఞ యయినపుడు మహత్తుగాక తప్పదు కావున నట్టిచోట్ల డుజ్ అమహత్తులకుఁ జెప్పిన యీ లక్షణము చేత సిద్ధించునది గాదు.

## 35 వాఽతోధర్మిణః.

వ్యా. ధర్మిణః = ధర్మివాచకము లయిన, అతః = అదంత శబ్దములకు, వా = వికల్పముగా, సోః = సుస్థానమున డుప్రత్యయము వచ్చును.

---

1. క్వచిదేకాద్యమహతోడుట్. ఆం.కౌ.శ.68.
క్వచిదమహతోఽపిడుట్స్యాత్. ఆం.శ.చిం.అ.51.

వి. తద్ధితాప్రక్రియ స్యాదంత దేశ్యపదస్య డుజ్వా స్యాత్పుంసి. గొల్ల – గొల్లఁడు, మాల – మాలఁడు, కల్ల – కల్లఁడు, బండ – బండఁడు ఇత్యాది.

తద్ధితాంతము గాని కొన్ని దేశ్య శబ్దములకు డుజ్జు వికల్పముగా వచ్చును.

'సోరేకాదేః' అను ప్రపూర్వ సూత్రమునుండి క్రమముగా సుస్థానమున డుజ్జేకలుగు నను నర్థమిట సిద్ధించును. మహత్తు లయిన యదంత శబ్దములకును సుప్రత్యయస్థానమున వికల్పముగా డుజ్జు వచ్చును.

గొల్లఁడు, 'వా' యనుటచే డుజ్జు రాని పక్షమునందు 'గొల్ల' యని యే యుండును.

'గొల్లాదిభ్యోడుజాదిః' అను సూత్రముచే డుజ్జొకటి తద్ధితప్రత్యయముగాఁ జేర్కొనఁబడినది. ప్రస్తుతసూత్రమునుబట్టి చూడఁగా నది యనవసర మని చెప్పఁదగియున్నది.

మగఁడు – ఇత్యాదులనుబట్టి కొన్ని శబ్దములకు డుజ్జు నిత్యముగాఁ బ్రవర్తించు నని యీ సూత్రము నందలి వా శబ్దమునకు వ్యవస్థ చేయఁదగు నని తోచుచున్నది.

## 36 న సుప్యుత్[1].

వ్యా. సుపి = ప్రథమాదివిభక్తులు పరముగా నున్నప్పుడు, ఉత్ = ప్రాతిపదికము తుదియత్వమున, కుత్వమున = రాదు.

వి. తద్ధితాన్తానాం సర్వనామ్నామ్మహతామమహతాం చ సుపి పరే నోత్వం స్యాత్. ఎవ్వఁడు. ఒక్కఁడు, ఎల్లఁడు, అతుఁడు, కొండుఁడు, చెన్నుడు, ఇత్యుత్వం న.

తద్ధితప్రత్యయాంతము లగు శబ్దములకును, సర్వనామములకును, మహత్తు లయినను, నమహత్తు లయినను, ప్రథమాది విభక్తులు పర మైనపుడు తుదియత్వమున కుత్వము రాదు.

ఎవఁడు, ఒక్కఁడు అనురీతిగా నత్వమె యుండును. ఇట్లే ఎవని, ఒక్కనియందు మొ॥

నాతస్సుప్యుత్ – (శబ్ద –83) అను లక్షణ మీ యర్థమునే చెప్పుచున్నది. ప్రస్తుత సూత్రము పునరుక్తియె.

---

1 నదావుత్తయో. అం.కౌ.అ.69. ఏకారే రమహతాంచదావున్న. అం.శ.చిం.అ.52.

## 37 ద్విభ్య స్తదాదిభ్య స్తత్.

వ్యా. తదాదిభ్యః ద్విభ్యః = రెండు విధము లయిన అ,ఈ,ఏ శబ్దములకును, సుపి = ప్రథమాది విభక్తులు పర మగునపుడు, తత్ = 'త+అత్' చేరును.

వి. హ్రస్వదీర్ఘ భేదాభ్యాం ద్వివిధేభ్యో దేశ్యతదాదిభ్యః
(సుపి) పరతస్తత్ స్యాత్తదర్థే పుంసి సర్వనామసు.
అతఁడు – ఆతఁడు; ఇతఁడు – ఈతఁడు;
ఎతఁడు – ఏతఁడు, బహువచనే – అతరు – ఆతరు,
ఇతరు – ఈతరు, ఎతరు – ఏతరు, ఎతనిచేత, ఎతనికొఱకు,
ఎతనివల్ల, ఎతనియందు ఇత్యాది.

హ్రస్వము వచ్చి, అ,ఇ,ఎ, అనియు దీర్ఘముతో, ఆఈఏ అనియు రెండు తీరులుగా నుండు తదాదిశబ్దములకు విభక్తి పర మయినపుడు పురుషుని బోధించు సందర్భములో అదే యర్థమున 'త' అను ప్రత్యయము వచ్చును. 'తత్' లో తుదితకార ముచ్చారణార్థము కావున 'త' వర్ణమె యగును.

అ + సు అనుచో నీ సూత్రముచే తవర్ణము చేరి అత + సు అని కాఁగా 'సోరేకాదేః' అను సూత్రముచే సుస్థానమున డుబ్బు వచ్చి అతఁడు అని యగును. ఇట్లే ఆ + సు. ఆతఁడు[1] మొ॥ ఇట్టి రూపములు పూజ్యతయందే యను నియమ మిచ్చట లేదు.[2]

బహుత్వమునందు అతరు, ఆతరు అనురీతిగా రువర్ణముతో రూపములు వివృతియందుఁ జూపఁబడినవి. కాని యట్టి రూపములు కవిప్రయోగములలోఁ గానరావు. నేఁడు వినిపింపవు గూడ.

మొత్తముమీఁద నేకవచనమునందే యిట్టి రూపము లుండుటనుబట్టి తవర్ణము నేకత్వమున మాత్రమె విధించిన నది కవిప్రయోగానుగుణ మై యుండెడిదని నిర్ణయింపఁదగును. బహుత్వమున వారు ఇత్యాదిగనె యుండును.

ఆం.కౌ. 'తఁడుః' అనుట గమనార్హము.

---

1 తడౌవాదిః పూర్వస్య. ఆం.కౌ.హ.61
2 పూజ్యార్థే తఁడుస్తస్య. ఆం.కౌ.హ.60
మహతోఽన్యత్ర్యామోశ్రుతః. వై.చం. హ.5.

## 38. తద్ధితామహతోర్లుగమాదౌ.

వ్యా. అమాదౌ = ద్వితీయాద్యేకవచనములు పర మగునపుడు, తద్ధితఅమహతామ్ = తద్ధితప్రత్యయాంతములకును, అమహచ్ఛబ్దములకును, లుక్ = డుజ్లోప మగును.

వి. తద్ధితానా మహతాం చ డుజో లుక్ స్యాదేక వచనేఽమదౌ పరే. గొల్లవాని, గొల్లవాండ్ల, గొల్లవానిచేత, గొల్లవాండ్లచేత, గొల్లవానికి, గొల్లవాండ్లకు, కొండనిచేత, కొండండ్లచేత, కొండని కొఱకు, కొండండ్ల కొఱకు, కొండనికి, కొండండ్లకు, మహతౌ నిలా వితి నిలౌ.

ద్వితీయా ద్యేక వచనములు పర మగునపుడు తద్ధితాంతములు, (గాని) అమహత్తులు (గాని) అయిన శబ్దముల డుజ్జనకు లోపము వచ్చును.

గొల్ల అనుశబ్దమునకు 'వాఁడు' అను తద్ధిత ప్రత్యయము వచ్చి గొల్లవాఁడు + అమ్ అని యుండఁగా ప్రస్తుతసూత్రముచే డుజ్జులోపించి 'అమ్మునకు' 'తద్ధితామహతోర్ని రమః' అను సూత్రముచే నివర్ణము రాఁగా గొల్లవాని అని యగును. (శబ్ద. 81,82 సూత్రములను బట్టి చూడ నీ లక్షణ మవసరముగాఁదోఁచదు.)

గొల్లవాఁడు + టా అనుచో డుజ్జు లోపింపఁగా 'మహతో నిలౌ' యను సూత్రముచే నివర్ణము వచ్చి గొల్లవానిచేత నని యగు నని వివృతి పేర్కొన్నది. కాని యా ప్రకరణముననే 'టాదిషు' అను సూత్రము 'ని' వర్ణమును విధించుచున్నది. ఆ సూత్ర మనవసరమని యీ వివరణ స్పష్టము చేయుచున్నది. గొల్లవాండ్లచేత, ఇత్యాదులందు 'లశ్చ' యని లవర్ణ మ్మైన దనవచ్చును.

కొండు - పు మమహత్తుగా నింతకుముందు చెప్పఁబడినది (తద్ధి.8) ఇటఁగూడ సూత్రము 'తద్ధితపుమహతోః' అని యగునేమో.

వి. లుజసో లశస : గొల్లవాండ్లు, గొల్లవాండ్ల; కొండండ్లు కొండండ్ల ఇత్యాది.

గొల్లవాడు + జస్ అని యుండఁగా 'లుజసః' అను సూత్రముచే జస్సునకు లువర్ణము వచ్చి 'లులావుకః' అను సూత్రముచే ఉత్వము లోపించి గొల్లవాండ్లు అని యగును. ఇట్లే ద్వితీయైకవచనమున గొల్లవాండ్ల - మొ ||

'లులావుకః' అను సూత్ర వివృతియందు 'జశ్శసోఃపరయో స్తద్ధితామహతాం డుప్రత్యయస్య

ఉకో లులావాదేశౌ క్రమాత్స్తః' అని డుజ్జులోని యుత్వమునకు లులాదేశ మగుట చెప్పఁబడినది. జశ్శస్‌లు అట్లే యున్నవానిని లులై గొల్లవాండ్లులు అనురీతి నగును. ఇచ్చటి వివృతి 'లులావుకః' (తద్ధి.10) అను దానితో సంపదించుటలేదు. అది యుల్లోపము చెప్పున దగుచోఁ గుదురు. అయినను శబ్ద. 81,82 సూ.ల ననుసరించి యీ ప్రక్రియ యనవసరము.

## 39 ఈగ్యాదీనాం వా లుగ్జసాదౌ.

వ్యా. జసాదౌ = ప్రథమాది బహువచనము పరముగా నున్నపుడు, ఈః గీ ల దీనామ్ = ఈఁడు, గీఁడు, మొదలగు తద్ధిత ప్రత్యయములయందలి డుజ్జునకు, వా = వికల్పముగా, లుక్ = లోప మగును.

వి. ఈకార గీవర్ణ ధర్మ్యాదన్తానాం డుజ్వర్ణకస్య వికల్పేన లుక్ స్యా జ్జసాదౌ పరే బహువచనే. కొండండ్లు - కొండలు, మావుటీండ్లు - మావుటీలు, మస్కీండ్లు - మస్కీలు, మిండగీండ్లు - మిండగీలు, మిండండ్లు - మిండలు, దుండగీండ్లు - దుండగీలు, బండండ్లు - బండలు. శేషం పూర్వవత్.

జస్ ప్రథమాబహువచనము ప్రథమ మొదలగు విభక్తులయందలి బహువచనము పరముగా నున్నప్పు దానికిఁ బూర్వమునం దున్న ఈఁడు, గీఁడు మొదలగు తద్ధితప్రత్యయముల యొక్క డుజ్జునకు వికల్పముగా లోపము వచ్చును.

మావుటీఁడు + జస్ అనుచో నీ సూత్రముచే డుజ్జు లోపించిన 'లుజసో లశసః అని జస్సునకు లువర్ణము వచ్చి మావుటీలు అని యగును. వా యనుటచే డుజ్జు లోపింపనిచో ('లులావుకః? అని' డుజ్జునందలి యుత్వము మాత్రము లోపించి) మావుటీండ్లు అని యగును. ఇట్లే మావుటీల, మావుటీండ్ల ననురీతిగా ద్వితీయాది విభక్తులందు రూపము లేర్పడును. మావుటీఁడు అనుచో ఈఁడు ప్రత్యయము.

గీఁడు, మిండగీఁడు - మిండగీలు - మిండగీండ్లు. ఆదిశబ్దములచే గొల్లాఁడు, గొల్లలు, గొల్లండ్లు మొ॥

## 40 నేః కిః.

వ్యా. నేః = నివర్ణమునకుఁ బరముగా, కిః = కిప్రత్యయము వచ్చును.

వి. తద్ధితాన్తానాం సర్వనామ్నామమహతాం చ
షష్ఠీ విభక్తే రేకవచనే నిప్రత్యయాత్పరతః.
కి స్స్యాత్; వానికి, ఒక్కనికి, కొండనికి.

తద్ధితాంతములు, సర్వనామములు మొదలగు నీ శబ్దములయొక్క నివర్ణకమునకుఁ బరమయియున్న షష్ఠీ విభక్తియేకవచనము స్థానమున 'కి' అను ప్రత్యయము వచ్చును: ఉదా:- వానికి.

'తద్ధితసర్వనామ్నోశ్చ' (శబ్ద-38) యను లక్షణ మీ ర్థమునె చెప్పుచున్నది. ఇదియుఁ గేవలము పునరుక్తియె.

## 41 లాత్కుర సర్వనామ్నః.

వ్యా. అసర్వనామ్నః = సర్వనామముకంటె వే రయిన శబ్దమునకుఁ బర మయియున్న, లాత్ = లవర్ణకముకంటెఁ బరముగా నున్న షష్ఠీ బహు వచనముయొక్క స్థానమునకు, కుః = కుప్రత్యయము వచ్చును.

వి. తద్ధితాన్తానా మమహతాం చ సర్వనామరహి
తానాంః షష్ఠీబహువచనే లప్రత్యయాత్పరతః
కుప్రత్యయస్స్యాత్. గొల్లవాండ్లకు, కొండండ్లకు, గొల్లలకు
ఇత్యాది. అసర్వనామ్నః కిమ్? వీరికి, ఒకరికి ఇత్యాది.

సర్వనామముకంటె వే రయిన శబ్దముల కనఁగా నిటఁదద్ధిత ప్రత్యయాంతములకును, అమహత్తులకును దరువాత బహుత్వమందలి లవర్ణ ముకంటెఁ బరముగా నున్న షష్ఠీ (బహువచన) విభక్తి స్థానమున 'కు' ప్రత్యయము వచ్చును.

కొండల + ఆమ్ కొండలకు, కొండండ్ల + ఆమ్ కొండండ్లకు మొ॥

'అసర్వనామ్నః' అనుటచే సర్వనామముల కీ కార్యము లేదు. ఒకరికి మొ॥ ఇచట లవర్ణమును లేదు కావున 'లాత్కుః' అన్నను నేర్పడు నిబ్బంది గనఁబడదు.

ఈః కు విధానమె యవసరమా యన్నదియు విచార్యము. శబ్ద.35 సూత్రముచే నిట కు వర్ణక మగుటలో బాధలేదు. ఇది యనవసరమె.

## 42 జనసంఖ్యా సంప్రశ్నే ందః.

వ్యా. జనసంఖ్యా సంప్రశ్నే = జనములను గూర్చి విచారణమునందు 'ందః' = 'ంద' అనునది చేరును.

వి. జననాం సంఖ్యా సంప్రశ్నే హ్రస్వ దేశ్యకిమే
తదాదిభ్యంః పరతోందస్యాత్. సర్వనామ్ని
బహువచనీరుః అందురు, ఇందురు, కొందరు.

హ్రస్వము నందిన ఆఇఎ మొ॥ శబ్దముల కనఁగా అ.ఇ.ఎ. అనువానికిఁ బరముగా జనసంఖ్యను గూర్చిన ప్రశ్నమునందు పూర్ణబిందుపూర్వక మైన దవర్ణము (ంద) చేరును.

అ - ంద ; ఇ - ంద ; ఎ - ంద. అని కాఁగా 'జసోరుః' అను సూత్రముచే నీ సర్వనామశబ్దములకు బహుత్వమున (జస్సునకు) రువర్ణము వచ్చి అందరు అని యగును.

## 43 దాక పర్యంతే .

వ్యా. పర్యంతే = పర్యంతము (వఱకు) అను నర్థము నందు, దాక = 'దాక' అనునది యగును.

వి.పర్యంతార్థే దాక స్యాత్.
నాదాక, నీదాక, వారిదాక, రామునిదాక, ఇంటిదాక,
ఊరిదాక - ఇత్యాది.

పర్యంతము అను నర్థమున దాఁక అనునది వచ్చును.

నాదాక = నాపర్యంతము మొ॥

## 44 పరిమితావంతః .

వ్యా. పరిమితౌ = పరిమాణార్థమునందు, ంతః = హ్రస్వమును బొందిన ఏ మొదలగు శబ్దములకుఁ బరముగా 'ంత' అనునది వచ్చును.

వి. దేశ్యే హ్రస్వకింతదాదిభ్యః పరస్మాత్పరిమిత
పదాత్పరతో , యావత్, తావత్ కియావదర్థేషు
దాకస్యాదవ్యయే. అంతదాక, ఇంతదాక, ఎంతదాక, కొంతదాక.

హ్రస్వమును బొందిన తదాద్యర్థకము లగు అ,ఇ,ఎ,కొ అను శబ్దములకుఁ బరిమాణార్థము నందు 'ంత' అనునది వచ్చును. అంత, ఇంత, కొంత. దీనిపై 'బర్యంతార్థమునఁ బూర్వసూత్రమును బట్టి దాఁకచేరి, అంతదాఁక మొదలగురీతిగా నేర్పడును.

## 45 లుక్తస్య గురౌ.

వ్యా. గురౌ = బృహస్పతిమతమున, తస్య = 'ంత' లోని తవర్ణమునకు, లుక్ = లోప మగును

వి. పర్యాంతార్థక దాక పదే పరే పరిమితి పద తకారస్య లుక్ స్యాద్బృహస్పతేర్మతే. అందాక ఇందాక, ఎందాక, కొందాక, ఇత్యాది.

పర్యంతార్థక మగు 'దాక' పరముగా నున్నపుడు పరిమాణార్థమునందు వచ్చిన 'ంత' అనుదానిలోని 'త' వర్ణము లోపించు నని బృహస్పతి మతము.

అంతదాక అనుచో నీ సూత్రముచే తవర్ణము లోపించి అందాక అని యగును.

'గురౌ' యని యిది బృహస్పతి మతముగాఁ బేర్కొనుటనుబట్టి పక్షాంతరమున 'త' లోపము లే దను నర్థము సిద్ధము. కావున 'అంతదాక' అను విధముగను రూపము లుండును.

## 46. పుడుర్యదాద్యర్థే[1].

వ్యా. యదా ఆది అర్థే = యదా, తదా, ఇదానీమ్, అను అర్థములందు గ్రమముగా హ్రస్వమును బొందిన ఏ అ ఇ శబ్దములకు, పుడుః = పుడు అనునది వచ్చును.

వి. హ్రస్వయదాదిభ్యః పరతః పుడు స్యాద్యదా తదేదానీ మర్థేషు. ఎపుడు, అపుడు, ఇపుడు.

యదాశబ్దార్థమున 'ఎ' అనుదానికి 'పుడు' వచ్చును. ఎపుడు.

తదార్థమున 'అ' అనుదాని కి 'పుడు' వచ్చు. అపుడు ఇదానీమర్థమున 'ఇ' అనుదానికి 'పుడు' వచ్చును. ఇపుడు.

## 47 ద్విశ్చ[2].

వ్యా. ద్విఃచ = 'పుడు'లోని పకారమునకు ద్విత్వము గూడ వచ్చును. చశబ్దముచే వైకల్పికము.

వి. పుడోః (పకారస్య) ద్విత్వం వా స్యాత్. ఎప్పుడు, అప్పుడు, ఇప్పుడు.

---

1. పుడుర్థః. వై.చం.త.36.
2. ద్విత్వంచ. అం.కౌ.సంధి.18

అ ఇ ఎ శబ్దములకు యదాద్యర్థములలోఁ జేరినపుడు వాని పకారమునకు వికల్పముగా ద్విత్వము వచ్చును. అపుడు అనుచో ద్విత్వము రాఁగా అప్పుడు. 'చో' శబ్దముచే వికల్పము గావున ద్విత్వము రానిచో అపుడు. ఇట్లే ఇప్పుడు, ఇపుడు; ఎప్పుడు, ఎపుడు.

## 48 ఉతో వా లుక్[1].

వ్యా. ఉతః = పుడులో పువర్ణమునందలి యుకారమునకు, వా = వికల్పముగా, లుక్ = లోప మగును.

వి. పువర్ణ స్యోకారస్య వా లుక్ స్యాత్. అప్డు. ఇప్డు. ఎప్డు.

అ,ఇ,ఎ, శబ్దములకుఁ జేరిన 'పుడు' నందు పువర్ణములోని యుకారమునకు వికల్పముగా లోపము వచ్చు నని యర్థము.

అపుడు - ఇచ్చట నడిమి యుత్వము లోపింపఁగా అప్డు అని యగును. వా యనుటచే నుత్వము లోపింపని పక్షమునందు అపుడు అనియు నుండును. ఇట్లే ఇప్డు - ఇపుడు, ఎప్డు - ఎపుడు.

## 49. వంటి స్సాదృశ్యే.

వ్యా. సదృశే = సాదృశ్యార్థమున, వంటిః = 'వంటి' యను శబ్దము కలుగును.

వి. సాదృశ్యార్థే వంటిస్స్యాత్. రామునివంటివాఁడు, జానకివంటి యాబిడ, మెఱుపువంటి మేడ.

సదృశ మను నర్థమున వంటి అను శబ్దము చేరును. రామునివంటివాఁడు మొ॥

## 50 యాదృశాదౌ టిటువంటి.

వ్యా. యాదృశాదౌ = యాదృశ - మొదలగు నర్థములలో, టి, టువంటి = టి యనునదియును, టువంటి, యనునదియు నవును.

వి. యాదృశకీదృశైతాదృశార్థే దేశ్య హ్రస్వ యదాదిభ్యః పరతః టిటువంటిస్తః.

యాదృశ, కీదృశ, ఏతాదృశ అను వాని యర్థములో, హ్రస్వము లగు అఇఎ శబ్దములకు పరముగా అ,ఇ,ఎ, అనువానికి - టి, అనునదియును, టువంటి, అనునదియును, వచ్చును.

---

1. పాక్షతదాద్యర్థ వాచకేషూతః. ఆం.శ.చి.సంధి.5; తదాప్రభృతి పోరుతోవాలుక్. ఆం.కౌ.సంధి.17. పోరు. వై.చం.వై.8.

అ శబ్దమునకు 'టి' వర్ణము రాఁగా, 'టినోర్ద్విః' అని ద్విత్వము వచ్చి 'అట్టి' అని యగును. అ శబ్దమునకు 'టువంటి' అనునది వచ్చి 'అటువంటి' యని యగును.

ఇట్లే ఇట్టి, ఇటువంటి, ఎట్టి, ఎటువంటి మొ॥

ఇంతకుముం దిది యాదృశాది శబ్దతద్భ వములుగా నిరూపింపఁబడినవి (తద్భ.).

## 51. సంఖ్యా సంప్రశ్నే[1] (నిః).

వ్యా. సంఖ్యాసంప్రశ్నే = సంఖ్యను, ప్రశ్నను దెలియఁజేయునపుడు - (నిః =) ని వర్ణక మగును.

వి. పశుజడ సంఖ్యాసంప్రశ్నే హ్రస్వయదాదిభ్యః పరతో నిస్స్యాత్.

సంఖ్యనుగూర్చిన ప్రశ్నమునందు, హ్రస్వము లయిన అ, ఇ, ఏ - యను శబ్దములకు అ - ఇ - ఎ - అను శబ్దములకు 'ని' అను వర్ణము చేరును.

అని - ఇని - ఎని.

## 52 టినోర్ద్విః.

వ్యా. టినోః = టి వర్ణ ని వర్ణములయందలి టకార నకారములకు ద్విత్వము వచ్చును.

వి. సాదృశ్యటివర్ణస్య పశుజడసంఖ్యాసంప్రశ్న నివర్ణస్య ద్విత్వం స్యాత్. ఎట్టివాఁడు, అట్టిదేవుఁడు, ఇట్టి మనుష్యుఁడు, ఎన్నిగుఱ్ఱాలు, కొన్నియేనుఁగులు, అన్నిగోపురములు, ఇన్ని రూకలు, ఎటువంటివాఁడు అటువంటిదొర, ఇటువంటి రత్నము ఇత్యాది.

'యాదృశాదౌ టటువంటి' యను సూత్రముచే విధింపఁబడిన టి వర్ణ టకారమునకును, 'సంఖ్యాసంప్రశ్నే నిః' అను సూత్రముచే విధింపఁబడిన ని వర్ణమునందలి నకారమునకును ద్విత్వము వచ్చును.

అట్టి, ఇట్టి, ఎట్టి - అన్ని, ఇన్ని, ఎన్ని.

ని వర్ణము 'కొ' శబ్దమునకును వచ్చును. కొన్ని దీనికి 'టి' వర్ణము రాదు. కొట్టి అని యుండదు.

---

1 నిర్ణదాల్. వై.చం.త.23

## 53 తత్రాద్యర్థే ందుః[1].

వ్యా. తత్రాద్యర్థే = తత్ర – మొదలగుశబ్దముల యర్థమునందు, "ందుః" = 'ందు' అనునది వచ్చు.

వి. తత్ర యత్ర[1] కుత్రాత్రర్థేషు 'ందు' స్యాత్ హ్రస్వ దేశ్యతదాదిభ్యః పరతః. అందు, ఇందు, ఎందు ఇత్యాది.

తత్ర, (అ) యత్ర, కుత్ర (ఎ), అత్ర (ఇ) అను శబ్దముల యర్థమునందుఁ గ్రమముగా అ,ఇ,ఎ అనుశబ్దములకు 'ందు' అనునది చేరును. అందు, ఇందు, ఎందు, మొ॥

## 54. ఎఁడుః ప్రస్థాదిమానే[2].

వ్యా. ప్రస్థాదిమానే = ప్రస్థము మొదలగు పరిమాణములకు, ఎఁడుః = ఎఁడు అనుప్రత్యయము వచ్చును.

వి. ప్రస్థాదిభ్యః పరతః ఎఁడుస్యా దంతర్మానే.
పట్టెఁడు, పడెఁడు, తూమెఁడు, కుంచెఁడు, చిట్టెఁడు,
మిళ్లెఁడు, చెంచెఁడు ఇత్యాది

పట్టు, మొదలగు శబ్దములకుఁ బరిమాణార్థమునందు 'ఎఁడు' అను ప్రత్యయము వచ్చును. పట్టు + ఎఁడు. పరరూప సంధి యై పట్టెఁడు. ఇట్లే తూమెఁడు మొ॥

## 55 మానదేసిః[3].

వ్యా. మానాత్ = పరిమాణవాచక శబ్దములకుఁ బరముగా,ఏసిః = ఏసి యనునది వచ్చును.

వి. మానార్థక పదాత్పరతస్తదర్థే స్యాదేస్యాగమః.
చెంచెఁడేసి, ముంతెఁడేసి, చిట్టెఁడేసి, పడెఁడేసి,
కుంచెఁడేసి, గురిగింజంతేసి, రూకంతేసి, ఏనుఁగంతేసి,
ముత్తెమంతేసి ఇత్యాది.

---

1. తదాదేస్త్రలోందుమ్. వై.చం. త.34.
2. ఎడుః ప్రస్థాదిమానేస్స్యాత్. త్రి.శ.5.
   కుత్రాద్యర్థే చ.ఆం.కౌ.హ.44. ఎడుమ్ పరిమాణే. వై.చం.త.5.
3. ఎఁడుః ప్రస్థాదిభ్యోమానే. బృహస్పతి సూత్రము. ఆం.కౌ.అను బంధం.

మానార్థకశబ్దములపై 'ఏసి' యను శబ్దము వచ్చి చేరును. చెంచేఁడు + ఏసి = చెంచెఁడేసి మొ॥

## 56. గింజాదిభ్యోఽంతః[1].

వ్యా. గింజాదిభ్యః = గింజ మొదలగు శబ్దములకుఁ బరిమాణార్థమున, అంతః = అంత యనునది వచ్చును.

వి. గింజ దుడ్డ్వాదిభ్యః పరతః మానే ఽంత స్యాత్.
గురిగింజంత, రూకంత, దుడ్డంత, కట్టంత, ఇత్యాది.

పరిమాణార్థమునందు గింజ మొదలగు శబ్దములకు 'అంత' అను శబ్దము చేరును.

గింజ + అంత పరరూపము గలిగి గింజంత మొ॥

## 57. గోదేః[2].

వ్యా. దేః = దివర్ణమునకుఁ బరముగా, గో = గో యను శబ్దము వచ్చును.

వి. ప్రత్యక్షదృశ్యార్థే హ్రస్వదేశ్యయదాది పరస్మా
ద్దివర్ణకాత్పరతోగో స్యాత్. అదిగో, ఇదిగో,
ఎదిగో, ఇత్యాది.

హ్రస్వము లైన, అ,ఇ,ఎ, అను శబ్దములకము వచ్చిన దివర్ణకమునకుఁ బరముగా 'గో' అను శబ్దము చేరును. అదిగో, ఇదిగో, ఎదిగో.

## 58. అనః పుంసి[3].

వ్యా. పుంసి = పురుషుని బోధించునపుడు, అనః = 'అన' అనునది వచ్చును.

వి. దేశ్య దీర్ఘతదాదిభ్యః పుంస్యనస్యాత్తదర్థే
తద్ధితే. ఏయన, ఆయన, ఈయన – ఇత్యాది.

ఆ, ఈ, ఏ, అను శబ్దములకుఁ బురుషుని బోధించునపుడు 'అన' అను శబ్దము వచ్చును. ఆ + అన = ఆయన. ఇట 'యః ప్రాణస్య' యవి యకార మయినది.

---

1. గింజాదిభ్యోంతః. బృహస్పతిసూత్రము. ఆం.కౌ., అనుబంధం -- (ఏ వ్యంతగోయనాః. త్రి.శ.5.12) మానార్థాచ్చైసిరత్రస్యాత్ భవేత్సో ఽ పి విభాషయా. అ.కౌ.అ.55
2. -- ఏవ్యంతగోయనాః. త్రి.శ.5.12.
3. ఏవ్యంతగోయనః. త్రి.శ.5.12.

## 59. ఆలుర్మతుపః[1].

వ్యా. మతుపః = మతుబర్థమునందు, ఆలుః = ఆలు అను శబ్దము కలుగును. మతుబర్థము నందుఁ గొన్నింటి కాలు శబ్దము చేరును.

వి. మతుబర్థస్య ఆలు స్యాత్. ఇల్లాలు, చూలాలు, వరాలు ఇత్యాది. ఇల్లు కలిగినది ఇల్లాలు, చూలు కలిగినది చూలాలు.

ఇల్లు గలిగినది యను నర్థమున 'ఇల్లు' శబ్దముపై 'ఆలు' చేరి పరరూపము రాఁగా ఇల్లాలు అని యగును. ఇట్లు యితరములు.

## 60. దారార్థే చ.

వ్యా. దారార్థేచ = 'దార' అను నర్థమునఁ గూడ, ఆలుః = ఆలు అనుశబ్ద మగును

వి. ఆలుర్దారార్థే చ స్యాత్. ఆలు - పెండ్లాము.

ఆలు అనుదానికి దార - పెండ్ల మని యర్థము. ఇది యొక లక్షణముగాఁ జెప్పుట యవసరముగాఁ దోఁచదు. తరువాతి సూత్రములోఁ గలిపిన బాగుండెడిది.

## 61. అతో రో ధర్మిణః[2].

వ్యా. ధర్మిణః = ధర్మిని బోధించునవి యగు, అతః = అదంత శబ్దములకు ఆలుశబ్దము పర మగుచుండఁగా, రః = రేఫము వచ్చును.

వి. అదంతతజ్జదేశ్యే ధర్మిపదాత్పరతః రేఫస్స్యాదాలౌ పరే. పేదరాలు, ముద్దరాలు, జవరాలు.

ధర్మివాచకము లగు నదంతశబ్దముల కాలు శబ్దము పర మగునపుడు రేఫము వచ్చి చేరును.

పేద + ఆలు అని యుండఁగా నీ సూత్రముచేఁ బేద శబ్దమునకు రేఫము చేరి పేదరాలు. ఇట్లే ముద్ద + ఆలు = ముద్దరాలు, జవ(జవ్వని) + ఆలు = జవరాలు.

---

1. ఆలుః ? త్రి.శ.5.20.
2. రోదుతోః ? త్రి.శ.5.21.

## 62. ఉచ్చ్[1].

వ్యా. ఉత్ చ = ధర్మివాచకము లగు నదంత శబ్దములు కొన్నింటికి రేఫముతో పాటు అత్వమున కుత్వము నయితము గలుగును.

వి. తత్సధర్మి పదస్యాకారస్య రేఫే పరే ఉత్వం స్యాత్ క్వచిత్ స్థలేషు. శూరురాలు, ధీమంతురాలు, ధీరురాలు ఇత్యాది.

ధర్మివాచకము లగు నదంతశబ్దములు సంస్కృతసమము లయినచో నత్వమున కుత్వమును రేఫము నాలుశబ్దము పర మగునపు డగును. ఆచ్ఛిక శబ్దములకు రేఫము మాత్ర మగును.

ధీమంత + ఆలు ధీమంతురాలు మొ॥

## 63. ఏసి స్సంఖ్యాయాః[2].

వ్యా. సంఖ్యాయాః = ఒకటి మొదలగు సంఖ్యను దెలుపు శబ్దములకు, ఏసిః = ఏసి అనుశబ్ద మగును

వి. ఏకాది సంఖ్యాయాః పరత ఏస్యాగమస్స్యాత్ ప్రమాణార్థే. ఒక్కటేసి, రెండేసి, మూఁడేసి, పదేసి, ఇరువదేసి, ఎనుబదేసి, నూరేసి, వెయ్యేసి ఇత్యాది.

సంఖ్యా వాచకములకుఁ బరిమాణము (విభాగార్థ మనఁదగు - అప్ప 3.) నందు ఏసి అనుశబ్ద మగును. ఒకటి + ఏసి = ఒక టేసి మొ॥

## 64. సేపుః కాలేంతాత్[3]

వ్యా. కాలే = కాలమును బోధించునపుడు, 'ంతాత్' = 'ంత' అను దానికంటెఁ బరముగ, సేపుః = 'సేపు' అనునది యగును.

---

1. దారార్థే ఉత ఉదపరః. ఆం.శ.చిం.సంధి.34.
 ఉద్రావాలావతః ఆం.కౌ.సంధి. 42.
2. ఏసిరిత్యాది రథసంఖ్యాదికే మ తమ్. త్రి.శ.5.7.
3. సేపుః కాలవ్యనంమతః. త్రి.శ.5.6.

౨. దేశ్యహ్రస్వకిమేతదాది పరస్మాత్ ంతాత్ పరతః కాలార్థే సేపుః స్యాత్. కొంతసేపు, అంతసేపు, ఇంతసేపు, ఎంతసేపు ఇత్యాది.

హ్రస్వము లగు ఆ ఈ ఏ (అ,ఇ,ఎ) అను శబ్దములకు 'పరిమితౌంతః' అను సూత్రముచే వచ్చిన 'ంత' అనుదానికంటెఁ బరముగాఁ గాలమును బోధించునపుడు సేపు అను శబ్దము చేరును. అంత + సేపు = అంతసేపు. అంతకాల మని యర్థము. ఇట్లే ఇంతసేపు మొ॥

# అథఏకపదవిధిప్రకరణమ్

## 1. అథ - ఏక పదస్య[1].

వ్యా. ఏకపదస్య - ఇది యధికార సూత్రము. సమాస విధివఱకు నీ సూత్ర మను వర్తించును. ఈ అంతవఱకు విధింపఁబడు కార్యములన్నియు నేకపదము నందే యగును. సంధి పరిచ్ఛేదమున నిట్టి యధికార సూత్రము గలదు. ఇట మఱల నుంట త్రి.శ లోను విశేషమె. ఈ ప్రకరణ మెల్ల త్రి.శ. కనుగుణము.

వి. ఆసమాసవిధే రధికారోఽ యమ్[2].

## 2. ఐదౌతోరయ్యవూ[3].

వ్యా. ఐత్ ఔతోః = ఐకారమునకును, ఔకారమునకును క్రమముగా, అయి, అవూ = అయి అనునదియును. అవు అనునదియును నగును.

వి. ఐకార, ఔకారయోః క్రమాత్ అయి, అవూ స్తః.
(ఐ) - అయి; (ఔ) - అవు.

అచ్చికశబ్దములందలి ఐ కి 'అయి' అనునదియును, ఔ అనుదానికి 'అవు' అనునదియు నగును. ఐ-అయి; ఔ-అవు.

అయి, (అగుధాతుక్త్వార్థక రూపము) అవును అను వీని క్రమమును బట్టి ఐ, ఔ, లకు అయి యవులను గాక, అయి యవులకే ఐ,ఔ, అనునవి యగు నని చెప్పిన బా గుండెడిది.

'ఏక పదస్య' అను నధికార సూత్రము ననుసరించి యేకపదమునందె యగును. వెల యిచ్చెను అనుచో వెలైచ్చెను అనుతీరుగా అనేక పదములం దీ కార్యము లేదు.

---

1. అధిక పదస్యాత్ప్రమ్. 2. ఆసమాసవిధేరిదమ్. త్రి.శ.6.1,2
3. ఐదౌతోరయ్యవూస్యాతామ్. త్రి.శ. 6.3
అయ్యవూవాప్రకలమౌ. ఆం.కౌ.హ.81
వాయిరవుర్వ క్రలమౌ. ఆం.శ.చిం.అ.65

## 3. అతోయావయ్యైతౌ[1].

వ్యా. అతః = హ్రస్వ మకు 'అ' కారముకంటెఁ బరముగా, 'యౌ' = యివర్ణ మున్నపు డది, అయి + ఐతౌ = అయి, అనియు, ఐ, అనియు నగును

వి. అకారస్య యివర్ణే పరే అయి చ, ఐ స్తః.

అయి–ఐ, రయికె – రైకె.

ఏకపదమునందు హ్రస్వ మగు 'అ' కారముకంటెఁ బరముగా 'యి' వర్ణమున్నచో, అయి, ఐ, అను విధముగ నగును. అ + యి– అయి అనియే యగును. దానికి 'ఐ' వచ్చుట యీ విధికిఁ బ్రయోజనముగా నెన్నఁదగును. రయికె – రైకె.

## 4. అతోవావవ్వౌతౌ[2].

వ్యా. అతః = హ్రస్వ మగు 'అ' కారమునకు, 'వౌ' = వువర్ణము చేరియున్నపుడు, అవు + ఔతౌ = అవు అనునది యును 'ఔ' అనునదియును నగును.

వి. అకారస్య వువర్ణకే పరే అవుశ్చ ఔశ్చ స్తః.

అవు – ఔ; సవురు – సౌరు.

ఏకపదమునందు హ్రస్వ మగు 'అ' కారముకంటెఁ బరముగా వువర్ణ మున్నపుడు దానికి అవు అనునదియు, 'ఔ' అనునదియు నగును. అ + వు అవు అని యవును గావున 'ఔ'ను సాధించుట యీ విధికిఁ బ్రయోజనముగా గుర్తింపవచ్చును. అవును – ఔను.

సవురు – సౌరు మొ॥

## 5. సాచ్కే తోదో రావణస్య[3].

వ్యా. రావణస్యమతే = రావణుని మతమునందు, సాచ్, కె = అచ్చుతోఁ గూడిన కకారము తరువాత నుండఁగా, దః = దకారమునకు, తః = తకారము వచ్చును.

---

1. అయేరవో రాయౌ తతః ? త్రి.శ.6.4
2. అయేరావోరాయౌ తతః ? త్రి.శ.6.4.
3. సాచ్కకారే తోదోరిష్టః క్వాచిత్కాషితిరావణః । త్రి.శ.65

వి. అచ్చహితకకారే పరే పూర్వతో విద్యమాన[1] దకారస్య తకారస్స్యాద్రావణస్య మతే. బ్రతుకు - బ్రదుకు, మెతుకు - మెదుకు, ముతుక - ముదుక, అతుకు - అదుకు, చొతుకు - చొదుకు ఇత్యాది.

రావణుఁ డను లాక్షణికుని మతమునం దచ్చుతోఁ గూడిన కకారము తరువాతగా నున్నపుడు దానికి వెనుకనున్న దకారమునకు తకారము కొన్ని యెడల వచ్చునని సూత్రార్థము.

బ్రదుకు = ఇచ్చట దకారమున కీ సూత్రముచే తకరాము వచ్చి బ్రతుకు అని యగును.

'రావణస్య' యనుటచే నిది యొక పక్షము. కావునఁ బక్షాంతరమున తకారము రాక బ్రదుకు అనురీతిగా దకారముతోను రూపము లుండును.

## 6. క్వచిదాదేర్దో డః[2].

వ్యా. క్వచిత్ = కొన్నియెడల, ఆదేః = మొదటి దయిన, దః = దకారమునకు, డః = డకారము వచ్చును

వి. క్వచిత్ స్థలే ఆంధ్ర శబ్దేషు పదాదేర్ద కారస్య డకార స్స్యాత్. దాయఁడు - డాయఁడు, దుగ - డుగ, దెబ్బది - డెబ్బది. దొక్కు - డొక్కు ఇత్యాది.

కొన్ని యెడల తెలుఁగు శబ్దము మొదట నున్న దకారముయొక్క స్థానమున డకారము వచ్చును.

దాయు. ఇట మొదటి దకారమునకు డకారము రాఁగా డాయు అని యగును. క్వచిత్ అనుట చేఁ బదాది దకారమున కెల్ల యెడల డకారము లేదు. కావున దటి, దాపు మొదలగు చోట్ల డటి డాపు యను రీతిరూపము లుండవు. డకారము వచ్చుట గూడ నిత్యము గాదు. కావున డకారము వచ్చు స్థలముల యందును డాదేశము లేని రూపము లుండును. దాయు.

---

1. తకారదకారయో స్త కారౌసోస్తః అను వ్రాత ప్రతి చింత్యము. క్వచిత్త్రోదః అ.కౌ.అ.90
2. క్వచిదాంధ్రే ష శబ్దేషుదత్వండత్వేన సిద్ధ్యతి. త్రి.శ.6.6
   కేచిత్తు వైకృతాశ్శ బ్దా డాదిత్వేనైనసాధవః. (అ. కా.అ.63)
   క్వచిద్దోడః. అం.కౌ.హ.85

వివృత్తి యందు డెబ్బది యను దానికి దెబ్బది యను దకారాది రూపము మూలముగాఁ జూపఁ బడుట విచార్యము. దెసప్తానామ్ (సంఖ్య.40) అని దె విధానము ప్రయోజనము మృగ్యము.

## 7. అనాదిణశ్చ[1].

వ్యా. అనాదిణః చ = శబ్దమునందు మొదటిది కాని ణకారమునకును, డః = డకారము క్వాచిత్కముగా వచ్చును.

వి. మధ్యాంత్యణకారస్య చ డస్స్యాత్.[2] అణంచె – అడంచె, వణఁకు – వడఁకు, అణఁకువ – అడఁకువ, కణక – కడక, పూబోణి – పూబోడి, వాణి – వాడి ఇత్యాది.

శబ్దమునందు మొదటిది గాని యనఁగా మధ్యావసానములం దున్న ణ కారము యొక్క స్థానమునను డకార మగును. 'క్వచిదాదేర్డోడః' అను పూర్వ సూత్రము ననుసరించి క్వాచిత్కముగను డకార మగు ననియు నర్థము సిద్ధించును.

వణఁకు – పూబోణి అని యుండఁగా నిందలి ణకారము స్థానమునఁ బ్రస్తుత సూత్రముచే 'డ' కార మాదేశ మయి వడఁకు, పూబోడి అని యగును.

ఈ విధి క్వాచిత్కము గాన ననాది యయినను నెల్లయెడల ణకారమునకు డకారము రాదు. తడవు మేడ మొ॥ డకారము వచ్చుచోట్లఁ గూడ నాదేశము నిత్యము గాదు. కావున ణకారము తో, వణఁకు, పూబోణి యనురీతి రూపము లుండును.

ణకారము యొక్క స్థానమున డకారమును విధించుటచే ణకారమే యాద్యవస్థ యగుచున్నది. నాణెము, పోణి మొదలుగా నుండఁగా స్థిర మగుటచే ణకారమునకు ముందు బిందు వుండదు. కావున ణకారమునకు డకార మాదేశ మయిన సందర్భములందును ముందు బిందు వుండుట కవకాశము లేదు. కాని యీ శబ్దములందు నాఁడెము, పోఁడి యను తీరుగా డకారమునకుఁ బూర్వమున బిందువు గలదు. అది యిట సాధింపఁబడుట కవకాశము లేదు. అందుకే కొందఱు లాక్షణికులు డకారమునకు ణకారమును విధించిరి.

---

1. అనాదిణస్య. త్రి.శ.6.7. అనాదిణశ్చ. అం.కౌ.హ.86
క్వచిడ్డోణః, అ.కా.అ.90
2. ణకార కకారయోశ్చ.

## 8. క్వచిద్వోగస్య[1].

వ్యా. క్వచిత్ = కొన్ని యెడల, గస్య = గకారమునకు, వః = వకార మగును.

వి. క్వచిత్ స్థలేషు గస్య వస్స్యాత్. పగడము – పవడము, చిగురు – చివురు, అగిసాకు – అవిసాకు, పగలు – పవలు, పొగ – పొవ, తీగె – తీవె, తొగురు – తొవురు ఇత్యాది. ఏతద్వివక్షా ధీన మేవ[2].

కొన్ని యెడల గకారమునకు వకారము వచ్చును. పగడము పవడము. క్వచి త్తనుటచే నెల్లయెడల నీ యాదేశ ముండదు. కావున వాదేశము రాక పగడ మనుతీరుగా గకారము తోను రూపము లుండును. కొన్ని యెడల గకారమునకు వకార మస లుండదు. లగ్గ, పగ మొ॥ 'అనాదిణశ్చ' యను పూర్వ సూత్రమునుండి 'యనాది' యను భాగము పిం దను వర్తింపఁజేయు టుచితముగాఁ దోఁచును. ఆ పక్షమున అనాది యగు గకారమున కే కొన్నియెడల వకారము విధించినట్లగును. కావున శబ్దాది నున్న గకారమునకు వకార మెప్పుడు నుండదు. గుటి, గోఁగు, మొ ॥

వివక్షనుబట్టి గాక కవిప్రయోగానుసారముగా, సూత్రము నందలి క్వచిచ్ఛబ్దముచే నాయా చోట్ల నాదేశమును దదభావమును గుర్తించు టొప్పును కాక కవి ప్రయోగానుసారముగా వివక్షింపఁ దగును.

## 9. అత్సానునాసికస్య[3].

వ్యా. సానునాసికస్య = అనునాసికముతో (అరసున్నతో) కూడినదానికి, అత్ = అత్వ మగును.

వి. దేశ్యపదమధ్యాక్షరస్య సానునాసికస్య అత్వమేవ స్యాత్. చెలఁగె, కలఁక, జెలఁగ, పొలఁతి, పడఁతి, వెలఁగ, కడఁక, ఇత్యాది.

---

1. వోగస్య.
2. వివక్షాధీనమేవహి. త్రి.శ.6.8,9
క్వచిద్వోగస్య. ఆం.కౌ.హ.83, క్వ చిద్గకారోవః. ఆం.శ.చిం.ఆ.67
3. సానునాసికవర్ణస్య మధ్యస్యాత్వం హి వోపరః. త్రి.శ.6.10

పయి నఱసున్న యున్నపుడు దానికి ముం దత్వమె యుండును. అఱసున్నకు ముం దత్వమె యుండు నని సూత్రాభిప్రాయము. కలఁక, పొంఁతి, చెలఁగె మొ॥

హ్రస్వ మగు నకారము కంటె భిన్న మయిన యచ్చునకుఁ బరముగా నఱసున్న యుండ దని ఫలించు చున్నది. కాని వాఁడు చీఁకటి, నూఁకు, వ్రేఁక, యను తీరుగా నితర స్వరములపై నఱసున్న గానవచ్చును.

## 10. ఉచ్ఛుద్ధస్య[1].

వ్యా. శుద్ధస్య = శుద్ధమయిన శబ్దమున, ఉత్ = ఉత్వ ముండు.

వి. శుద్ధసంజ్ఞస్య దేశ్యపదస్య మధ్యాక్షరస్య ఉత్వమేవ స్యాత్. మకురు, అగుడు, పిచ్చుక, బొజుగు, కాటుక, కొడుము, కణుతి, ముతుక, బొదుకు, మునుగ, తబుకు, చబుకు, చమురు, చెరుకు, పలుకు, చివురు, పసుపు ఇత్యాది.

శుద్ధ మయిన దేశ్య శబ్దములలో నడుమ నుత్వ ముండు నని సూత్రాభిప్రాయము. మకురు, అగుడు మొ॥ వివృతి యందుఁ గ్రమముగా, క,గ,చ,జ, ట, డ, ణ మొదలగు వరుసలో నాయయి వర్ణములపయి నుత్వ ముదాహరింపఁబడి యున్నది.

ఈ నియమమును విచార్యమె. చెఱకు సాధువు కాఁగా చెరుకు లోకవ్యవహారమండె. ఇతర స్వరము లుండ వనుట లక్ష్యానుగుణమును గాదు.

## 11. ఉపోత్తమోత్తమౌ.

వ్యా. ఉపోత్తమ ఉత్తమౌ = ఉపోత్తమము నుత్తమము నగును.

వి. ఆద్యక్షరాత్పరతో యోవర్ణ స్స ఉపోత్తమః తస్మాత్పరోవర్ణః ఉత్తమ సంజ్ఞం స్యాత్.

దీని యర్థమును వివృతిని బట్టి యూహింపవలె. మొదటి యక్షరమునకుఁ బరముగా మున్న యక్షరమున కుపోత్తమ మని సంజ్ఞ. ఆ యుపోత్తమమునకుఁ బరముగా నున్న యక్షర ముత్తమ మను సంజ్ఞ నందును. ఉదా. కలికి ఇందు మొదటి దయిన కవర్ణమునకు దరువాత

1. శుద్ధాక్షరస్య మధ్యస్యోత్వమేవ ప్రయుజ్యతే. త్రి.శ.6.11

నున్న 'లి' వర్ణ ముపోత్తమము కాఁగా దానికి దరువాత నున్న కి వర్ణ ముత్తమము.

వివృతి ననుసరించి యుపోత్తమము రెండవ యక్షరము గాఁగా నుత్తమము మూఁడవ యక్షర మగుచున్నది. రెండక్షరములే యున్న శబ్దమునను రెండవయక్షర ముపోత్తమ సంజ్ఞను బొందుటలో విరోధము గానరా దీ వివృతి ననుసరించి. అయినను మూఁడుక్షరముల శబ్ద మయియుండ వలయు ననుకొన్నను మూఁడిటికంటె నెక్కువ యక్షరములు గల శబ్దమునం దిబ్బంది యేర్పడును, ఎనిమిది యను శబ్దమున నాద్యక్షరమునకుఁ (ఎ) బర మయిన నివర్ణ ముపోత్తమమును, దానికిఁ బరమై యున్న మివర్ణ ముత్తమము నగును. చివరి దగు దివర్ణము యొక్క ప్రసక్తి యిచట లేదు. కాని యిట్టి నిర్ణయ మాద్యసంప్రదాయమునకే కాక, తెలుఁగు లక్షణమునకును విరుద్ధ మనక తప్పదు.

'కావున నుపోత్తమోత్తమముల నిట్లు నిర్ణయింపరాదు. సంస్కృత సంప్రదాయాను సారముగా మూఁడుగాని యంతకంటె నెక్కువ గాని యక్షరము లున్న శబ్దమునఁ జివరి యక్షర ముత్తమము కాఁగా దానికి సమీప మందలిది యనఁగా జివరి నుండి రెండవది యైన యక్షర ముపోత్తమ మని గ్రహింపఁదగును.

కాఁగాఁ బ్రస్తుత సూత్రము సంస్కృతము నందలి యుత్తమోపోత్తమ సంజ్ఞలు దెలుఁగునను గల వని పేర్కొనునదిగా గుర్తింపఁదగును.

ఆం.కౌ.లో. ఉత్తమోఽన్త్యస్య (హ.78) పూర్వస్యోపోత్తమః (79) అని చెప్పఁబడినది. దీని ననుసరించి జిగి యిత్యాదు లగు ద్వ్యక్షర శబ్దములందును నీ సంజ్ఞలు చెల్ల నవకాశము గన్పించు. అది యుద్దిష్టము గాదనఁదగు.

## 12. ఇ(ర)యోః[1].

వ్యా. అయోః = ఉత్తమోపోత్త మాక్షరముల యందలి యత్వమునకు, ఇః = ఇత్వ మగును.

వి. ఆద్యక్షరాత్పరవర్ణ తత్పరవర్ణయోః అకారస్యే కారస్యైదేక వచనే కేషాంచిన్నామ్నామ్[2].

కలమ – చెలమ – మేలమ – వేలమ – తాలమ – మాలమ – బలమ – కొఱవ. అనేన సూత్రేణ – కలిమి, చెలిమి, మేలిమి, వేలిమి, తాలిమి, మాలిమి, బలిమి, కొఱివి.

---

1.2. ఇదుపోత్తమోత్తమానామ్ – ఉపోత్తమోత్తమానాం ఇకార స్యైదేకవచనే కేషాంచిన్నా మ్నామ్ – ఆం.కౌ.హ.80

సూత్రమిది 'ఇరయోః' అని యుండెనేమో. అయోః అనగా నుత్తమోపోత్త. మాక్షరములందలి రెం డకారములకును ఇః = ఇత్వ మగు నని యర్థము. అట్లు గాదన్న ఇ + అయోః అనుచోఁ బూర్వ రూప మగుట సౌత్రముగా భావింపవలసి యుండును. ఏ మైనను వివృతి ననుసరించి దీని యర్థము పై నట్లు చెప్పుకొనవలయును.

'కలమ' అని యుండ నత్వమున కిత్వమై కలిమి యని యగును. ఇట్లితరముల యెడ గ్రహింపవలయును. 'కలిమి' అనుదానికి మూలరూపము కలమ అను తీరయిన యీ పద్ధతి విచార్యము. 'ఉమ్నృర్ధస్య' అని నడుమ నుత్వ ముండ దాని కిత్వ మయ్యె నని యుద్దేశ్య మేమో విచారింపవలె.

## 13. ఉదుపోత్తమేతః[1].

వ్యా. ఉపోత్తమేతః ఉపోత్తమమునందలి యికారమునకు (బహువచనము పర మయినపుడు) ఉత్ = ఉత్వ మగును.

వి. బహువచనే ఉపోత్తమేకారస్య ఉత్ స్యాత్. కలుములు,

చెలుములు, మెలుములు, మాలుములు, తాలుములు,

బలుములు, కొరువులు ఇత్యాది.

మూఁడు గాని యంతకంటె నెక్కువ గాని యక్షరములు గల శబ్దములందుఁ జివరి నుండి రెండవ యక్షర ముపోత్తమము. అందలి యికారమునకు ఉకారము వచ్చును. ఈ ఉత్వము బహువచనము పర మగునపుడె యగును. శబ్దము ఇ దంతము కూడాఁ గా వలయును.

కలిమి – లు కలుమిలు అని కాఁగా ఉద్బహుత్వే యనులక్షణముచేఁ దుదియిత్వమున కుత్వము వచ్చి కలుములు అని యగును.

1 ఇదన్త బహూక్తౌతు మధ్య స్యోత్యంచ కల్ప్యతే. త్రి.శ.6.12.
ఉదుపోత్తమేతో బహువచనే. ఆం.కౌ.హ.81.
ఇదుపోత్తమోత్తమానాం బహువచన ఉపోత్తమేత ఉద్భవతి. ఆం.శ.చిం.హ.35
ఇమ్యాదేః పూర్వస్యచ.వై.చం.అ.53

## 14. వక్రతమ యశ్రుతి రావణస్య[1].

వ్యా. రావణస్య = రావణుని మతమున,వక్రతమ యశ్రుతీ = వక్రతమత్వమును యశ్రుతియు నగును.

వి. [2]ఏజ్‌వికారయ శ్రుతీస్తో రావణస్యమతే.; చె – చ్యైనే – మ్యై – చెయి, మెయి, చెలు, చ్యైలు మెలు – మ్యైలు మేను – మేనులు – చేతులు

పతంజలిరేజ్ వివృత తరమితి భాష్యే నిగీర్ణవాన్.[3]

రావణుఁడను లాక్షణికుని మతమున ఎకారమునకు ఐ అనువక్రతమమును, యకారమును వచ్చును. ఐకారము యశ్రుతి రెండును నొకే పర్యాయము వచ్చునట్లుగా భావించి వివృతి చ్యై యనురీతిగా నుదాహరించినది.

చె – చ్ + ఎ – చ్ + య్ + ఐ – చ్యై యని యవు ననవలె. కాని వక్రతమ మొకపర్యాయమును యశ్రుతి యొక పర్యాయము నగు నని భావించినచో వక్రతమత్వ పక్షమున – చె – చ్ + ఎ – చ్ + ఐ – చై. అని యగును. యశ్రుతి మాత్రము వక్రమునకుఁ బిదపనై 'చెయ్' అని యగును. 'చెయి' అనుదానికిట నవకాశము గానరాదు ఏ మైనను చై, చెయ్ అనురీతి రూపములును లోక వ్యవహారమునందె కాని కావ్య వ్యవహారమునఁ గానరావు. చ్యై యనురీతివి లోకవ్యవహారమునను వినఁబడవు.

## 15. శుద్ధాచ్ఛస్యదిః[4].

వ్యా. శుద్ధాచ్ఛస్య = ఏకాక్షరము లయిన (దేశ్య) శుద్ధాచ్ఛ శబ్దములక్కు దిః = దీర్ఘ మగును.

వి. ఏకాక్షరస్య శుద్ధాచ్ఛశబ్దస్య దీర్ఘస్స్యాత్.
చే – రా – నూ – పీ – నే – వా – ఇత్యాది.

శుద్ధదేశ్యము లగు నేకాక్షర శబ్దములకు దీర్ఘము వచ్చును. చె. యనుచో దీర్ఘము రాఁగా 'చే' యని యగును.

---

1. 2. ఏజో వక్రతమత్వంచ యశ్రుతిశ్చేతిరావణః త్రి.శ. 6-13
3. పతంజలిరే వివృత తతమితి (భాష్యే) నిగీర్ణవాన్. త్రి.శ.6.14
4. శుద్ధాచ్ఛస్యతుదీర్ఘోవా. త్రి.శ. 6.15

ఈ లక్షణము విశిష్టము. చే - (చేయి) సేత మొదలగు వానింబట్టి యిట్టి యేకాక్షర శబ్దములను గుర్తించుట యీ లక్షణోద్దేశమై యుండును.

## 16. వాదేర్యిః.

వ్యా. దేః = దీర్ఘము కంటెఁ బరముగా, వా = వికల్పముగ్గా, యి ః = యివర్ణము వచ్చును.

వి. వికల్పేన తేషాం శుద్ధాచ్ఛశబ్దానాం దీర్ఘాత్పరతో యిస్స్యాత్. చేయి, రాయి, నూయి, పీయి, నేయి, దాయి ఇత్యాది.

'శుద్ధాచ్ఛస్య దిః' అను పూర్వ సూత్రముచే దీర్ఘమును బొంది యేర్పడిన చే మొదలగు శబ్దములకు బయిని యివర్ణము వికల్పముగా వచ్చిచేరు నని సూత్రార్థము. చేయి - వాయి - మొ॥

'వా' యనుటచే యివర్ణము రాని పక్షమునందు చే, రే - యనురీతిగ రూపము లుండును.

## 17. క్వచిద్దేశ్యస్య[1].

వ్యా. క్వచిత్ = కొన్నియెడల, దేశ్యస్య = దేశ్య శబ్దముల యందును, దేః = దీర్ఘమునకుఁ బరముగా, యిః = యివర్ణము వా వికల్పముగా నగును.

వి. క్వచిత్ స్థలేష్వనేకాచో దేశ్యదీర్ఘాత్పరతశ్చ వికల్పేన యి స్స్యాత్. తురా - తురాయి, కబా - కబాయి, రూపా - రూపాయి, లడా - లడాయి, నేజా - నేజాయి ఇత్యాడి.

'వాదేర్యిః' అను పూర్వ సూత్రమిం దను వర్తించును. కొన్ని దీర్ఘాంతము లగు దేశ్య శబ్దములకుగడపల 'యి' వర్ణము వికల్పముగాఁ జేరును. లడా - లడాయి మొ॥ యి వర్ణాంతములు గాక యీశబ్దములు గనుపట్టవు. కాని యి వర్ణము వికల్పముగనె చెప్పఁబడినది. ఇవి దేశ్యము లనుట వింత. అన్యదేశ్యము లని లక్షణమున జెప్పఁ బడినదేమో కాక శుద్ధదేశ్య మాంధ్ర దేశ్యము గాఁ గాదేశ్య మన్యదేశ్యమునకును వాచకమా?

---

1. వాతత్పరం యిః క్వచిత్క్వచిత్ త్రి.శ. 6.16

## 18. లయశ్చ[1].

వ్యా. లయః = లఘువైన యకారము సయితము వచ్చును.

వి. ఏఙ్ వివృతతరస్యలఘు యకారో ఽ పి వా స్యాత్.[2]

ముత్తె – ముత్త్యము, గిన్నె – గిన్య – పాళెము – పాళ్యము

కన్నె – కన్య, మిద్దె – మిద్య ఇత్యాది.

(అచ్చిక) శబ్దము చివరి యెత్వమునకు లఘు వైన 'య' వర్ణము ను వచ్చు నని యీ సూత్రమునభిప్రాయము 'లోలఘోః (సం.21) అను సూత్రము ననుసరించి 'ల' యను నది లఘువునకు సంజ్ఞ. అట 'ల' యనునది క్రమముగా ఛందశ్శాస్త్ర సంబంధి యగు గురు లఘువులలోని లఘువును బేర్కొనున దనవచ్చును. ఆ లఘుత్వమునకును యరలవల లఘుత్వమునకును బోలిక లేదు. అయ్యు నిట లఘు యకార మనుటకు 'లయః' అనుటను బట్టి 'లోలఘోః' అనునది యిట్టి లఘుత్వమునకును బోధక మని గుర్తింపఁదగి యున్నది.

కన్నె అని యుండఁగా 'ఎ' కారము స్థానమునఁ బ్రస్తుతసూత్రముచే 'య' వర్ణ మాదేశ మై కన్న్+ఎ- కన్న్ య కన్న్య అని యగును. వివృతియం దిట్ల ద్విత్వము చూపఁబడి యున్నది. కాని భిన్న హల్సంయోగమున సజాతీయము లగు హల్లులలో నొకదానికి లోపమగును. కన్య.

ఇట్లు లఘు వైనయవర్ణము సాధారణముగాఁ జెప్పబడఁగా సూరి 'ముత్తియ' శబ్ద మొక్క దానికి మాత్రమె ముత్య మనురీతిరూపము నంగీకరించినను[3] ప్రౌఢ వ్యాకర్త యితరములను ప్రస్తావించెను.

'ఇయాన్తత్వే కుత్రచిత్ స్యాదేత్వం యశ్చాపి తద్భవే లఘుస్యాఽపి' యని వికృతివివేకముగూడ 'య' వర్ణమును విధించుటయు, నయ్యది లఘు వని పేర్కొనుటయు గమనింపవచ్చును.

'లయశ్చ' యనునప్పటి 'చ' శబ్దముచే నీ లఘు'య'వర్ణము సార్వత్రికముగాదని గుర్తింపఁదగును. బల్లెము – మొదలగు చోట్ల బల్యము అనురీతిరూపము లుండవు అనఁగా యత్వ మిచ్చట నసలు రాదు. వా యనుట వలన కన్నె, ముత్తెము అనురీతిరూపములు నుండును.

1.2 ఏఙో వివృతతరస్య లఘు యత్వమ్. త్రి.శ.6.17

యశ్చాపి తద్భవే లఘుస్యో ఽ పి చ సంయుక్త ఇతికే షాఞ్చి దీరణా. ఆ.కౌ ఆం.61

3 లుగితః కన్యాదేస్తు. వై.చం.వై.4

## 19. ఇయశ్చ[1]

వ్యా. ఇయః చ = ఇయ యనునది సయితము వికల్పముగా నగును

వి. ఇయాదేశశ్చ వా స్యాత్. కన్నె - కన్నియ, గిన్నె - గిన్నియ, ముత్తెము - ముత్తియము, పాళెము-పాళియము ఇత్యాది.

శబ్దము తుది నున్న 'ఏ'త్వమున లఘుయవర్ణమే కాక 'ఇయ' యనునది గూడ వికల్పముగా నాదేశమగు నని యర్థము.

కన్నె - అనుచో కన్‌న్ ఎ - ఎత్వమునకు ఇయ రాఁగా, కన్‌న్ ఇయ కన్నియ యని యగును ఇయాదేశము వికల్పము గావున రాని పక్షమునందు 'కన్నె' యను తీరుగా 'ఏ'త్వమె యుండును.

ఇయ కెత్వము గాక యెత్వమున కియ ను విధించుటచేత, సందియము, కాటియ మొదలగు చోట్ల సందె మనురీతిరూపములు లేకుండుటను బట్టి కొన్నియెడల నెత్వమున 'కియ' నిత్యముగా నగు నని 'వా' శబ్దమునకు వ్యవస్థ చేసికొనఁదగి యున్నది. సందియము మొ॥

'ముత్తెము' ఇత్యాదులలో నెత్వముపై మువర్ణకము విధింపఁబడమి[2] ఇయ కెత్వము చెప్పిన మార్గ ముచితము.

## 20. మధ్యయోఽదేతౌ[3].

వ్యా. మధ్యయః = శబ్దమున నడుమ నున్న యకారమునకు, అత్ ఏతౌ = అత్వమును, ఎత్వము నుఁడును.

వి. మధ్యయకారస్య అకార ఎకారౌ ద్వౌ స్తః.
నెయ్యము - నెయ్యెము, కయ్యము - కయ్యెము
చయ్యన - చయ్యెన ఇత్యాది.

అచ్చ తెనుఁగు పదములలో నడుమ నున్న యకారముపై అత్వమును, ఎత్వమును

---

1. ఇయః క్వచిత్. త్రి.శ.6.18

2. ఎదియాన్తామ్. ఆం.కౌ.అ.107 ఏదన్త తాచవామ్నామన్య తరస్యామియాన్తావామ్. ఆం.శ.చిం.అ.81 ఇయేహేల్. వై.చం.అ.38

3. అత్వమేత్వం మధ్యయస్య నైకపవేతి విశ్రుతః త్రి.శ.6.19

నుండు నని యర్థము. కయ్యము అనుచో అత్వము వ్వది ఎత్వముతో కయ్యే మని యుండును.

ఎత్వముతోడి రూపములు జనవ్యవహారమం దుండెడి వేమో. కావ్య వ్యవహారమునఁ గానరావు. బహుశః పదమధ్యమున య కారముపై నెత్వ ముండునన్న యిట్టి లక్షణమును దిరస్కరించుటకె (అద్య॰ క్రియాసు భూతార్థద్యోతినిమాద్యగం వినాసర్వ॰) దోలా భూషోత్తరీయాణి వినై త్వం నాస్తి మధ్యయే యనురీతి లక్షణము లేర్పడిన వేమో.

## 21 చోదన్త్యత్వమ్.

వ్యా. చః = చకారమునకు, దన్త్యత్వమ్ = దన్త్యత యగును.

వి. చస్య[1] దన్త్యే ఽచి పరే దన్త్యత్వం స్యాత్. చప్పుడు, చనవు చాన చాపు. చుక్క, చూపు, చౌకు, చొక్కు చోటు. చందమామ ఇత్యాది.

'తద్వతి తాలవ్యత్వమ్' అను తరువాతి సూత్రమును బట్టి యిచట దంత్యము లయిన యచ్చులతోఁ గూడినపుడు చకారము దంత్య మగు నని యర్థము చేయఁదగును. అట్టి యచ్చులతోఁ గూడినపుడు జకారమును దంత్యమె యగును. కావున చోర్దన్త్యత్వమ్' అని చెప్పు టొప్పు. తెలుఁగున చవర్గలో చ, జ లు రెండే యుండును ఛ, ఝ, ఞ, అను మిగిలిన వర్ణము లచ్చ తెనుఁగున లేవు గావున 'చుః' అనఁగా చ జ లే యగును. అవి దంత్యస్వరములతోఁ గూడినపుడు దంత్యము లగును.

చందమామ జౌకు మొ॥

అదుదోదైదౌతోదన్త్యాః (సం.11) అనుటను బట్టి అ ఆ, ఉ,ఊ, ఒ ఓ ఔ అను లచ్చులు దంత్యములు ఐకారము గూడ నీసూత్ర మిట దంత్యముగాఁ బ్రస్తావించినది. వీనితోఁ గూడిన చజలు దంత్యము లగును.

## 22. తద్వతి తాలవ్యత్వమ్[2].

వ్యా.తద్వతి = అట్టి యచ్చులతోఁ గూడినపుడు చ(జ) కారమునకు, తాలవ్యత్వమ్ = తాలవ్యత గలుగు.

---

1,2. చస్యదేన్త్యేఽ చిదన్త్యత్వమ్ త్రి.శ.6.20
చుర్దంత్యోఽతాలవ్యాచ్. వై.చం.అ.52?
2. తాలవ్యత్వంచ తద్వతి త్రి.శ.6.21

వి. తాలవ్యాచి పరే తాలవ్యత్వం స్యాత్. చికిలి చిలుక
చెక్కిలి, చెత్త ఇత్యాది.

తాలవ్యము లయిన యచ్చులతోఁ గూడినపుడు చ(జ) కారము తాలవ్య మగు నని యర్థము. చికిలి. జేజే మొ॥

'ఇదేతౌతాలవ్యౌ (సం.12) యని ఇఈఎఏ యను నాలు గచ్చులు తాలవ్యము లగును. కావున వానితోఁ గూడిన చజలు తాలవ్యములు.

'దన్త్యశ్చురతాలవ్యే' (సం.18) అను సూత్రము పయిరెండు సూత్రముల (చోదన్త్యత్వమ్, తద్వతి తాలవ్యత్వమ్) యభిప్రాయమును సంగ్రహించుచునే యున్నది. మఱల నిట నిట్లు ప్రస్తావించుటకుఁ బ్రయోజనము మృగ్యము.

## 23. నిందాయాం గిః[1].

వ్యా. నిందాయాం = నిందార్థమునందు, గిః = గివర్ణ మగును.

వి. ఆమ్రేడి తపదస్యాదివర్ణస్య నిందార్థే గిరాదేశస్యాత్.
సురలు - గిరలు, తెన్నె - గిన్నె, ఇల్లు - గిల్లు, దేవుఁడు - గీవుఁడు,
శ్రీమద్భాగవతే - "ఈ స్తంభంబునఁ జూపఁగలవె
చక్రిన్ గిక్రిన్[1] ఇతి పోతరాజ ప్రయోగాచ్చ.
ఆంధ్రహరివంశే -
"సురలంచుం గిరలంచుఁ బల్కెదవు నీ సుద్ద ల్వినం గూడ ది
త్తఱి మద్బాహుబలంబుచేఁ దుని మెదన్" ఇత్యాది.

నిందార్థమునందు నామ్రేడితము యొక్క మొదటి యక్షరమునకు 'గి' యాదేశ మగును. ఆమ్రేడి తాద్యక్షరము హ్రస్వ ఘటిత మయినచో 'గి' యనునదియు, దీర్ఘ మయిన 'గీ' యనునదియు నగు నని గుర్తింపవలె. సురలు గిరలు, దేవుఁడు గీవుఁడు మొ॥

ఈ గిత్వము నిత్యము గావున నిందార్థ మునందు సురలు సురలు అను తీరుగా గిత్వము రానిరూప ముండదు.

---

1 ఆమ్రేడి తాదేర్గిత్వం తు నిందాయాం చ ప్రయుజ్యతే. త్రి.శ.6.23
తత్రస్యాద్గిత్వమాద్యస్య సమతా హ్రస్వ దీర్ఘయోః. అ.కా.ఆ.64.

అథర్వణుని త్రి.శ ను బట్టియు విట వర్గసం దర్భమునుబట్టియు నీ సూత్రము తరువాత సూత్రమునకుఁ బిదప నుండవలసినది. వ్రాతప్రతిలో ముందుకు వచ్చింది.

## 24. ద్విర్దేశ్య సంజ్ఞాయామ్[1].

వ్యా. దేశ్యసంజ్ఞాయామ్ = దేశ్య నామములకు

ద్విః = ద్వి రుక్తి కలుగును.

వి. దేశ్యనామసు వీప్సార్థే ద్విర్వచనత్వం బహుళం స్యాత్.[2] ఒక్కొక్కటి, మాటి మాటికి, అంతంత, ఎక్కడెక్కడ, ఎప్పుడెప్పుడు ఇత్యాది.

వీప్సాద్యర్థ విశేషములందు (దేశ్య) శబ్దములు ద్విరుక్తి కలుగు నని యర్థము. అంతంత మొ॥

ఒక్కొక్కటి, మాటిమాటికి ననుచో నామ్రేడిత పరక వికారములు గమనార్హములు.

---

1,2 బహుళం దేశ్య సంజ్ఞాను వీప్స యాంద్విత్వమేవచ. త్రి.శ.6.22.
కుత్రచిత్పర్వ శబ్దానాం పునరుక్తిర్న దోషకృత్. అ.కా.అ.64

# కారకపరిచ్ఛేదః

## అథకారక ప్రక్రియా.

ఇఁకఁ గారక ప్రక్రియ విధింపఁబడుచున్నది.

### 1. కర్తృ కర్మా దికం సమమ్[1]

వ్యా. కర్తృ కర్మ ఆదికమ్ = కర్తృ కర్మ మొదలగునవి, సమమ్ = సంస్కృత వ్యాకరణముతో సమానముగ నుండు.

**వి. అస్మిన్ త్రిలిఙ్గశాస్త్రే కర్తృ కర్మాదికం సర్వం పాణినీయసమం స్యాత్[2].**

కర్మకారకము, కర్తృకారకము, కరణకారము, సంప్రదానకారకము, అపాదాన కారకము, అధికరణకారకము మొదలుగా కారకములు మొదలగునవి పాణినిమహర్షి సంస్కృత వ్యాకరణ సంప్రదాయమున కనుగుణముగనె తెలుఁగుభాష యందును జెల్లును.

### 2. తత్సాదేశ్చ[3].

వ్యా. తత్స ఆదేః చ = తత్సమము మొదలగు వానియందు కర్మ కర్త్రాదిక మగు కాకరములు సంస్కృతవ్యాకరణ సంప్రదాయాను గుణముగనె యుండును. పూర్వసూత్రాభిప్రాయ మిందు స్పష్టముగా వివరింపఁబడిన దనఁదగును.

**వి. తత్సమ, తద్భవ, దేశ్యాచ్చానాం చ సమానం కారకాదికం స్యాత్.[4]**

---

1,2, కర్తృ కర్మాదికంసర్వం పాణినీయసమంమతమ్. త్రి.శ.7.1

3,4. తత్సతజ్జాచ్చదేశ్యానాం సమానం కారకాదికమ్. త్రి.శ.7.2

సర్వవిభక్తి సంస్కృతతుల్యేతి వాచ్యమ్. అం.కౌ.కా.1, బహుళం విభక్తి ర్యథాస్థానమ్. వై.చం.వి.1

సర్వవిభక్తి స్సంస్కృతతుల్యా. అం.శ.విం.హ.40

తత్సమము తద్భవము దేశ్యము అచ్చ యను తీరులుగా నున్న తెలుఁగు భాషయం దన్నిట కారకము సంస్కృతానుసారముగనె యుండు నని యర్థము.

3. అర్థశాస్త్రం చ[1].

వ్యా. అర్థశాస్త్రం చ = అర్థములకు సంబంధించిన లక్షణమును, సమమ్ = సంస్కృత సంప్రదాయము ననుసరించియె యుండును.

వి. సర్వాసాం భాషాణామర్థ శాస్త్రం చ సమం స్యాత్[2].

తెలుఁగునందును నాయావిభక్తుల యర్థము గూడ సంస్కృత సంప్రదాయము ననుసరించియే యుండును.

4. పదాని స్వేచ్ఛమ్[3].

వ్యా. పదాని = వాక్యమునందలి పదములు, స్వేచ్ఛమ్ = యథేచ్ఛముగా నన్వయ యోగ్యము లగును.

వి. ఆకాంక్షాయోగ్యతావన్తి పదాని స్వేచ్ఛ మన్వయేస్యుః[4]
తదుక్తం భాష్యే (సంస్కృత్య) సంస్కృత్యశబ్దా ఉత్సృజ్యన్తే
తేషాం యథేష్ట మభి సంబంధః.

'వృద్ధిరాదైచ్' (1-1-1) సూత్ర భాష్యమున "సంస్కృత్య సంస్కృత్య పదాన్యుత్సృజ్యన్తే తేషాంయథేష్ట మభిసంబన్ధో భవతి తద్యథా - ఆహర ప్రాతమ్. పాత్రమాహరేతి." యను నంశమిం దుద్ధరింపఁబడినది.

ధృఢముగా సంస్కరించి లక్షణ బద్ధములు చేసి విడిచిన పదముల నిచ్ఛాను సారముగాఁ బూర్వముగను బరముగను బ్రయోగింపఁజెల్లును. 'ఆహరపాత్రమ్' అన్నట్లుగనె 'పాత్రమాహర' యనియు నుండును. గాలి చల్లగా వీచెనను వాక్యమును గ్రహించి చిన్నయ మూరియు, చల్లగా వీచెనుగాలి, వీచెను గాలి చల్లగా మున్నుగాఁ గ్రమనిరపేక్షతోఁ బ్రయోగింపఁ జెల్లుటను స్పష్టము. ఏక వాక్యంబునం దొకానొక్కండు దక్క బదం బులెల్లం గ్రమ నిరపేక్షంబుగ బ్రయోగింపఁజనును. ఏని ప్రభృతులు కొన్ని క్రమము నపేక్షించి యుండును.

---

1.2, కించార్థ శాస్త్రంచ సర్వాసాంభాషాణాం సమమేవహి. త్రి.శ.7.32
3,4, ఆకాంక్షా యోగ్యతావన్తి పదాని స్వేచ్ఛ మన్వయైః. త్రి.శ.7.4

## 5. సుససా వా వలెయోగే.[1]

వ్యా. వలె యోగే = వలెతో నన్వయించు శబ్దమునకు, సుససా, = సుస్, (ప్రథమ) అస్ (ద్వితీయ) విభక్తులు, వా = వికల్పముగా నగును.

వి. వలె యోగే వికల్పేన ప్రథమాద్వితీయా విభక్తీ స్తః.
నీవలె, నినువలె, మీవలె, మిమువలె, నాకరణి, నను కరణి;
రాముఁడు వలె, రాముని వలె;

వలె అను దానితో నన్వయించునట్టి శబ్దమునకు వికల్పముగాఁ బ్రథమా ద్వితీయా విభక్తు లగును. రాముఁడు వలె ననుచోఁ బ్రథమ యైనది, నినువలె ననుచో ద్వితీయ యైనది.

నీవలె, మీవలె, ననుచోఁ బ్రథమ యైనట్లు వివృతియందుఁ జూపఁబడినది. నీవువలె, మీరువలెనని కావలయుఁ బ్రథమ యైన నీ, మీ అన్నవి ప్రథమాంతములు గావు. ఇట షష్ఠీ విభక్తి యగు యొక్క ప్రత్యయ మయిన దని చెప్పఁదగును. యొక్క లోపించును గావున నావలె మీవలె ననురీతి నుండును.

'రామునివలె' ననుచో ద్వితీయ యైన దని వివృతి యభిప్రాయము. ఇది యును యొక్క షష్ఠ్యంతమె యనఁదగి యున్నది.

## 6. జేస్జమః.[2]

వ్యా. జమః = షష్ఠీవిభక్తికి, జేస్ = చతుర్థీ విభక్తి యగును.

వి. షష్ఠీ విభక్తే శ్చతుర్థీ విభక్తి స్స్యాత్. నీ కిచ్చెద, నీ కొఱకిచ్చెద, కృష్ణుని కిమ్మనె, కృష్ణునికొఱ కిమ్మనె, ఇత్యాది.

జస్ ఆమ్ అనువాని ప్రత్యాహారము 'జమ్' - జే భ్యస్ అనువాని ప్రత్యాహారము జేస్ షష్ఠీ విభక్తికిఁ జతుర్థీ విభక్తి యగు నని యర్థము.

నీకు ఇచ్చెద కుషష్ఠి దానికిఁ జతుర్థి లో కొఱకు రాగా నీకొఱకు నిచ్చెద అని యగును - ఇట్లె రాములకు ఇచ్చె, రాముల కొఱకు ఇచ్చె మొ॥

1. ప్రథమాచద్వితీయాచ వలెయోగే వికల్పతః త్రి.శ.7.5.

2. షష్ఠ్యాశ్చతుర్థీ. త్రి.శ.7-7
షష్ఠ్యాశ్చతుర్థీ. ఆం.కౌ.కా.4

చతుర్థి రాని పక్షమున షష్ఠీ విభక్తితోనె రూపము లుండును.

షష్ఠి కన్నను నాయాయర్థముల కు విభక్తికిని, యొక్కాదులకును జతుర్థి రాదు. సంస్కృత సంప్రదాయానుసారముగాఁ జతుర్థి వచ్చుచోట్లఁ దెలుఁగున కుషష్ఠియు నగు నను రీతి విధానము సూరిసమ్మతము లక్ష్యాను గుణము నైయుండు నని తోఁచు.

## 7. ద్వితీయా కూర్చియోగే.[1]

వ్యా. కూర్చియోగే = కూర్చి యను దానితో నన్వయించునపుడు, ద్వితీయా = ద్వితీయా విభక్తి యగును.

### వి. కూర్చియోగే ద్వితీయా విభక్తిస్స్యాత్.
### రాముని గూర్చి తపము లొనర్చె.

కూర్చి యను శబ్దముతో నన్వయించు నామమునకు ద్వితీయా విభక్తి యగు నని యర్థము. రామ - కూర్చి = రాముని గూర్చి బహుత్వమునందు రాములఁ గూర్చి మొ॥

కూర్చి యోగమునందు ద్వితీయ యగు నని చెప్పుటను బట్టి-యీ 'కూర్చి' ద్వితీయా విభక్తి కానేరదని యేతన్మతము గుర్తింపబడియున్నది. కూర్చియే ద్వితీయా విభక్తి యయినచో ప్రక్రియలో మఱి యొక్క విభక్తిని చెప్పుట సంప్రదాయ విరుద్ధము. కాని 'కూర్చ్యనునయోర్ద్వితీయాయా' అనుచో నిందే 'కూర్చి' ద్వితీయా విభక్తిగాఁ జెప్పబడినది. కర్మప్రవచనీయకే కూర్చిః (8.24) అని కూర్చి ద్వితీయగా విహితము. ద్వితీయయందుఁ గూర్చి రాఁగా నది మఱల మఱొక్కచోఁ ద్వితీయ యగుట విరుద్ధము. ప్రస్తుత స్థలము మతాంతరము గాఁబోలు.

## 8. పంచమీ తృతీయాయాః.[2]

వ్యా. తృతీయాయాః = తృతీయా విభక్తికి, పంచమి = పంచమీ విభక్తి యగును.

### వి. తృతీయా విభక్తేః పంచమీ విభక్తి స్స్యాత్.
### నీచేత నే మయ్యాని, నీవలన నే మయ్యాని.

నీచేత నే మగును అనుచో (జేతవిభక్త్యర్థమునఁ దృతీయకు నీ సూత్రముచేఁ బంచమి 'వలన' రాఁగా నీవలన నే మగును అని యగును.

---

1. కూర్చియోగేద్వితీయాచ. త్రి.శ.7.8.
2. తృతీయాయాస్తు పఞ్చమీ. త్రి.శ.7.9

ఇట గ్రహ్యాది యోగజంబగు పంచమికిఁ జేతవిభక్తిగా సూరి నిరూపించెను. అది యుచితము.

## 9. జిబ్జమోరస్నపుంసకే.

వ్యా. నపుంసకే = నపుంసకలింగ శబ్దములపై నున్న, జిప్ జమో॰ = సప్తమీ షష్ఠీ విభక్తులకు, అస్ = ద్వితీయా విభక్తి యగును.

వి. నపుంసకే సప్తమీషష్ఠ్యోః ద్వితీయా స్యాత్.

(నపుంసకే) కుండయందేమి? కుండనేమి? నిన్నటి కనె, నిన్న నవె,

రాముని కోడలు, ఆవుల పాలు, గిరిని విలసిల్లె.

తరుల నొప్పారె, అతని సొమ్ము, బ్రాహ్మణులగుంపు,

భువిని పెంపొందె, గొడుగుల నీడ, ఘనులఁ గొండల

పాలుఁగా జేసిన కొలంత ఇత్యాది.

జి - సుప్ - అనువాని ప్రత్యాహారము జిప్ అను సప్తమీ విభక్తియం దేక బహువచనములు, జస్ ఆమ్ అనువాని ప్రత్యాహారము జమ్. అనఁగా షష్ఠీ విభక్తియం దేకబహువచనములు అమ్-శస్ అనువాని ప్రత్యాహారము అస్- అనఁగా ద్వితీయా విభక్తియం దేక బహువచనములు.

నపుంసకలింగము లగు శబ్దములకుఁ బైనున్న షష్ఠీ సప్తమీ విభక్తులకు ద్వితీయా విభక్తి యగు నని సూత్రార్థము. ఇచ్చటి నపుంసక శబ్ద మమహత్పర్యాయముగా గ్రహింపఁదగును.

నిన్నటికి - నిన్నను, కుండయందు, కుండను మొ॥ రాముని యొక్క (కోడలు) అనుచో షష్ఠికి ద్వితీయయై రాముని కోడ లని యైనట్లు వివృతియందుఁ జూపఁబడినది. ఇట రామశబ్దము నపుంసకము గాదు అమహత్తును గాదు. కావున ద్వితీయ వచ్చుటకు లక్షణము ననుసరించి యవకాశమె లేకుండఁగా నిట్లు చూపుట ప్రామాదిక మని చెప్పఁదగును. ఇట్లే అతని సొమ్ము బ్రాహ్మణుల గుంపు, మొ॥ మనుజాల (యందు) విప్రు డనురీతిని మిక్కిలి యరుదు.

ఆవులపాలు, కొండలపాలు మున్నగు చోట్లఁ గూడ షష్ఠికి ద్వితీయ యి ట్లయిన దన్న నివి వ్యస్తరూపములు గావునను, ద్వితీయాంతము ద్రుతప్రకృతికము (పోనీ సంకీర్ణ

---

1 సప్తమ్యాశ్చైవషష్ఠ్యాశ్చ ద్వితీయా స్యాన్నపుంసకే. త్రి.శ.7.10
ద్వితీయా సప్తమీ షష్ఠ్యోః. ఆం.కౌ.కా.3

మనన్నను నొకపక్షమున ద్రుతాంత మగును గావునను ఆవులఁబాలు కొండలబా లనురీతి నుండ వలసి యుండును. ఇవి షష్ఠీ తత్పురుష సమాసములు గనె గుర్తింపఁదగి యున్నవి. వ్యస్తములె యన్నను "యొక్క" లోపించన రూపములుగనె యెన్నఁదగును గాని యిట షష్ఠికి ద్వితీయ యైనట్లు చెప్పవలను పడదు.

నిన్నటికి నిన్నను అనువానికి ని నడుమ నర్థభేదము తోఁచుచున్నది కాఁగా షష్ఠికి ద్వితీయను జెప్పుట వలని ప్రయోజనము వెదుక వలసి యున్నది. కాక యిది సమాసములందగుననియేఁజెప్పవలె.

## 10. ఙిబ్జసిసోస్సుస్.[1]

వ్యా.నపుంసకే = నపుంసక లింగశబ్దములకుఁ బైనున్న, ఙిప్ జసిసం॰ = సప్తమీ పంచమీ విభక్తులకు, సుస్ - ప్రథమా విభక్తి యగును.

వి. నపుంసకే సప్తమీ పంచమ్యోః ప్రథమా స్యాత్.

రథమెక్కె[2] రథమం దెక్కె కొండ దిగె కొండనుంచి దిగె.

ప్రాతంః కాలమె లేచిపోయిరి, ప్రాతఃకాల మందె లేచిపోయిరి.

ఙ్ - సుప్ = ఙిప్ - సప్తమి, జసి - భ్యస్ = జసిస్ - పంచమి, సు - జస్ = సుస్ - ప్రథమ. 'ఙిబ్జమో రస్నపుంసకే యను పూర్వ సూత్రము నుండి నపుంసకే యన్నది యిట నను వర్తించును.

నపుంసకలింగ శబ్దములకుఁ బైనున్న సప్తమీ విభక్తికిని, బంచమీ విభక్తికిని బ్రథమా విభక్తి యగును. ఇటఁ గూడ నపుంసక మన్నది యమహత్పర్యాయము.

తీర్థమందు ఆడి = తీర్థము ఆడి.

కొండనుంచి దిగె - ఇట 'ఉంచి' అన్నది పంచమీవిభక్తి. ఉంచుండి కుండా వంక వర్లి వలన పంచమ్యాః (అజంత-10) కొండవలన నని యభిప్రాయము ఆ పంచమి కీ సూత్రముచేఁ బ్రథమ రాఁగా కొండ దిగె నని యుండును.

రథ మెక్కె అనుచో రథ మధికరణముగ వివక్షించినపుడు సప్తమి రాఁగా నాసప్తమికి ప్రస్తుతసూత్రముచేఁ బ్రథమ యై రథము ఎక్కె అని యగును. కాక కర్మగా వివక్షిత మయినపుడు రథము నెక్కెను అని ద్వితీయ యుండును.

---

1 తస్యాః ప్రథమాచ జడపదానాంస్యాత్. ఆం.శ.విం.అ.61 జడస్యాసః వై.చం.వి.3

2 అన్యస్యా క్వచిదన్యా. అధ.కౌ.కా.2

## 11. జ సశ్చ.

వ్యా. నపుంసకే = నపుంసక లింగము లైన శబ్దములపై నున్న, జస : చ = షష్ఠీ విభక్తికిఁ గూడ సుస్‌ప్రథమ యగును.

వి. షష్ఠీ విభక్తేశ్చ ప్రథమాస్యాత్ నపుంసకే.
పట్టణము పోయె, పట్టణమునకుఁ బోయె, తీర్థ
మువచ్చె, తీర్థానకు వచ్చె ఇత్యాది.

'జబ్బమో రస్నపుంసకే' యను సూత్రమునుండి క్రమముగా 'నపుంసకే' యున్నదియును, 'జీబ్జసిసోస్సుస్' అను పూర్వసూత్రము నుండి సుస్ అనునదియు నిం దనువర్తించును

నపుంసకలింగ శబ్దములకుఁ బైనున్న షష్ఠీవిభక్తికిఁ గూడఁ బ్రథమా విభక్తి యగు నని యర్థము.

పట్టణమునకు - పోయె - పట్టణము పోయె తీర్థానకు వచ్చె అనుచో షష్ఠ్యర్థమున తీర్థమువచ్చె ననురీతిగాఁ బ్రథమ యగుట పరిశీలింప వలసి యున్నది.

## 12. జీబ్జసోష్టాస్జేసాః.

వ్యా. జీప్‌జసోః = సప్తమికిని, షష్ఠికిని, టాస్ జేసా = తృతీయయును జతుర్థియు నగును.

వి. సప్తమీషష్ఠ్యో స్తృతీయా చతుర్థౌ స్తోనపుంసకే
చెఱువున నేమి, చెఱువులో నేమి, కోలను గొట్టె,
కోలచేతఁ గొట్టె, ఖడ్గమున నఱికె, ఖడ్గముచేత నఱికె,
నీ కిచ్చితి, నీకై యిచ్చితి ఇత్యాది.

జీ ప్ప నునది సప్తమికిని, జ స్పనునది షష్ఠికిని, టాస్పనునది తృతీయకును, జే స్పనునది చతుర్థికిని ప్రత్యాహారములు. నపుంసక లింగ శబ్దములకుఁ బైనున్న సప్తమీ విభక్తికిఁ జతుర్థీ విభక్తియును-షష్ఠీ విభక్తి కిఁజతుర్థీ విభక్తియు లగు నని సూత్రార్థము.

ఖడ్గమున నఱికె ననుచోట సప్తమి (నవర్ణకము) తృతీయ యై ఖడ్గముచేత నఱికె నని యగును.

నీకు ఇచ్చితి ననుచోట షష్ఠికిఁ జతుర్థి రాగా నీకై యిచ్చితి నని యైనది.

---

1. తృతీయా చ చతుర్థీ చ వృద్ధానుమతమేవ హి. త్రి.శ.7.6

ఇ ట్లిట షష్ఠికిఁ జతుర్థి చెప్పఁబడినది కాని జేస్థనః అను (6) మునుపటి సూత్రము నీ యర్థమునే విధించుచున్నది. కావున నిచ్చట షష్ఠికిఁ జతుర్థిని బేర్కొనుట పునరుక్తి యే యనక తప్పదు. జేస్థమః అనుచో కుషష్ఠికి కొఱకు అను చతుర్థి యుదాహరింపఁబడఁగా నిట 'కై' యనునది చూపఁబడినది, కొఱకు, కై యున్నవి రెండును జతుర్థీ విభక్తులే యగుట చే వీనిని వేర్వేఱుగాఁ దలంప నక్కఱ లేదు. లక్షణమునం దట్టి వేర్పాటున కవకాశమును లేదు. కావున నీ యంశము పునరుక్తి యవుచున్నది. ఇంకను షష్ఠికిఁ జతుర్థిని గాక చతుర్థికే షష్ఠిని విధించుటలోఁ గ్రగు ముందు ననియు నింతకు మందు జేస్థమః అను సూత్రము నొద్ద గుర్తించితిమి.

ఇంక నీ సూత్రము వివృతిలో చెఱువున నేమి, చెఱువులో నేమి యనియు, కోలను గొట్టి, కోలచేతఁ గొట్టె ననియు నుదాహరింపఁబడినది. ఇవి యీ సూత్రమున కుదాహరణము లయ్యెడు నవకాశము గానరాదు. చెఱువున అన్నది సప్తమి యైనను దానికిఁ దృతీయ కాలేదు. 'చెఱువులో' ననుచో 'లో' అనునది తృతీయ కాదు గదా! ఇంకఁ గోలచేత ననుచోఁ దృతీయ యున్నది కాని పూర్వము చూపఁబడిన కోలను అనుచో నున్నది సప్తమి కాదు. కావున సప్తమికిఁ దృతీయ యైన దన వీలు లేదు.

## 13. వ్యత్యయవ్యవహితయోశ్చ.[1]

వ్యా. వ్యత్యయ వ్యవహితయోః చ = విశేషణములును విశేష్యములును ఇతరశబ్దములచే వ్యవధానము కలిగియుండుటయు, వెనుక ముందులుగాఁ బ్రయోగింపఁ బడుటయును గలదు.

వి. షష్ఠీ సమాసే సర్వే విశేష్య విశేషణ శబ్దాః పదాం
తరైర్వ్యత్యయే వ్యవహితే చ ప్రయోజ్యా స్స్యుః.
'నరసింహరాయ చంద్రుని కర మరుదుగ కీర్తి వెలసె'.
బడబాగ్ని భట్టారక కృత రామచంద్రాభ్యుదయే –
'రాముని మహిలోన మిగుల ప్రబలె కీర్తి'.
భల్లట కృతే విక్రమాదిత్య చరిత్రే – కీర్తి
విలసిల్లె విక్రమ క్షితివరుని, – ఇత్యాది.

---

1. వ్యవహితాశ్చ పర్వేస్స్యుః. ఆం.శ.చిం.ఆ.56
వ్యత్యయేవ్యవహితి ఒ పి. త్రి.శ.8.3

రాముని మహిలోన మిగులఁ బ్రబలె కీర్తి. అనుచో రాముని - కీర్తి - అనునవి 'మహిలోన, మిగుల, ప్రబలె, అను పదములచే వ్యవధానముతోఁ బ్రయోగింపఁబడినవి, ఇది వ్యవహితత్వమున కుదాహరణము ఇట్లు వ్యవధానముతోఁ బ్రయోగింపఁబడినను, రాముని కీర్తి మహిలోనఁ బ్రబలె ననియే యన్వయము.

'కీర్తి విలసిల్లె విక్రమక్షితివరుని' - విక్రమక్షితి వరుని కీర్తి విలసిల్లె నని యభిప్రాయము, కీర్తి - విక్రమక్షితివరుని అనునవి 'విలసిల్లె' నను పదముచే వ్యవహితముగాఁ బ్రయోగింపఁబడుటయే కాక, విక్రమక్షితివరుని - కీర్తి యని యుండఁదగిన యీ శబ్దముల ముందు వెనుకలు తార్మారయి, కీర్తి - విక్రమక్షితివరుని అని ప్రయోగింపఁబడినవి. ఇది వ్యత్యయమున, (వ్యవహితత్వమున ) కుదాహరణము.

వివృతి యందు విశేషణ విశేష్యములుగాఁ బ్రస్తావింపఁబడినది. కాని రాముని కీర్తి యనుచో రాముని అనునది విశేషణ మని చెప్పుట విచార్యము. ఇట సంబంధి సంబంధ పదములు వ్యవహితము లగుటయు వ్యత్యయముతో నుండుటయుఁ జూపఁబడినది.

ఇంక నీయవి యాయయి కవుల ప్రయోగములుగాఁ జూడబడినవి. ఆ కవుల పేర్లును, నా గ్రంథముల పేర్లును శ్రుత పూర్వములు గావు. ఇతర గ్రంథములందుఁ గాని, వ్యవహారమునఁ గాని సంబంధి సంబంధ పదములు వ్యవహితము లగుట గాని వ్యత్యస్తము లగుట గాని తోఁపదు.

ఈ లక్షణము నభిప్రాయము నింకను బరిశీలించి గుర్తింపవలసి యున్నది. వివృతి యందలి యభిప్రాయము మాత్రము విశ్వసనీయముగా లేదు.

## 14. ద్వంద్వే ఉరః.[1]

వ్యా. ద్వంద్వే = ద్వంద్వ సమాసమునందు, ఉః = ఋకారమునకు, రః = రవర్ణ మగును.

వి. ద్వంద్వసమాసే ఋకారస్య రేఫస్స్యాత్. విధాత్ర
శంకరులఁ గొలుతు, సవిత్రచంద్రుల భజింతు.
భారతే ఆదిపర్వణి అన్నంభట్టారకస్య మహాప్రయోగః -
'రామమాంధాత్రరఘు క్షితీశులు ముదంబున నేలిరె
యేయుగంబులన్' ఇత్యాది.

---

1. ఉర్ద్వంద్వేరః. ఆం.శ.చిం.66. వై.చం.ప.38 ఆం.కౌ.అ.82

ద్వంద్వ సమాసమునందుఁ బూర్వపదము తుదినున్న ఋకారము యొక్క స్థానమున రవర్ణము వచ్చునని సూత్రాభిప్రాయము.

'విధాతృశంకర' అను సిద్ధద్వంద్వమున నీ సూత్రముచే ఋకారమునకు రవర్ణము రాఁగా విధాత్ర శంకరు లని యేర్పడును. ఇట్లే సవిత్రచంద్రులు మొ॥

ఈ యుదాహరణములను బట్టి చూడఁగా నీ చోటి ద్వంద్వ సమాసము నందలి పదము లన్నియును ఋకారాంతములే కావలయు నను నియమము లే దనవలయును. ద్వంద్వంబునందు ఋకారంబునకు రవర్ణంబు వి భాషనగు నను చిన్నయసూరి లక్షణమును నిట్టి యభిప్రాయము తోడిదే యగు ననిపించు. కాకున్న 'ఆనఙస్త్ర్యేదృతో ద్వన్ద్వేర్ రేఫశ్చారి కవేర్మతే' యని వికృతి వివేకమునందు జెప్పఁబడినట్లుగా రవర్ణమును ఋకారమునకుఁ గాక యానఙ్ఙనకే విధింపఁడా యనియు సందేహము.

మొత్తముపై నిట ద్వంద్వము ఋదంతసర్వావయవము గావలయు నను నియమము లే దని సూత్రము గుర్తింపవలసి యున్నది. కావుననె నన్నయభట్టారకుని ప్రయోగము 'రామ మాంధాత్రరఘుక్షితీశ' లను తీరుగా రవర్ణ మయినదిగా నుదాహరింపఁబడినది.

నన్నయభట్టారకుని అన్నంభట్టారకునిగాఁ బేర్కొనుట యిచ్చుటనే గాక యింతకు ముందు నన్నయ భట్టు చింతామణి యందలి 'స్త్రోవావౌరైనావో॰ లాన్తా త్తురరౌ తయోః - అను సూత్రమును ప్రస్తావించు సందర్భమునను గుర్తింపఁదగు.

## 15. సలలో స్సబిన్దు ర్వాడుః[1].

వ్యా. సలలోః = లకారముతోఁ గూడిన లువర్ణమునకు, సబిన్దుః = పూర్ణబిందువుతోఁ గూడిన, డుః = డువర్ణకము, వా = వికల్పముగా నగును.

వి. ద్విత్వసహితలు వర్ణస్య గృహాదిగణస్య బిందు విశిష్ట డువర్ణకో వికల్పేన ఆదేశస్స్యాల్లులయోః పరయోః[2]. ఇల్లు - ఇల్లులు - ఇండులు, విల్లు - విల్లులు విండులు, ముల్లు - ముల్లులు - ముండులు ఇత్యాది.

ఇల్లు మొదలగువానిలో 'ల్లు' వర్ణమునకు లులలు పరమగుచుండఁగా బిందువుతోఁ గూడిన డువర్ణక మాదేశమగును.

---

1,2 సలలోర్బిన్దుయుతోడుర్వాలులయోః. ఆం.శ.చిం.ఆ.70

ద్విల్లోర్లుల యోర్వానుస్వారడు-? ఆం.కౌ.ఆ.89 ద్విలోశ్చ వై.చం.ఆ.66

ఈ కార్యము బహువచనము పర మగునపుడే యగును. కాఁగా లులలు పరముగా నున్నపుడు లకారముతోఁ గూడిన లువర్ణము స్థానమున బూర్ణబిందు పూర్వక మయిన డువర్ణకము వికల్పముగా నగును.

ఇలు + లు = ఇండులు ఇట్లే విండులు మొ॥ 'వా' యనుటచే నీ యాదేశము రాని పక్షమునందు ఇల్లులు, విల్లు లనురీతిగా నుండును.

ఈ కార్య మేకవచనమున రాదు. ఇల్లు,విల్లు.

## 16. ఉల్లుక్చ.[1]

వ్యా. ఉత్ లుక్ చ = ఆ పూర్ణబిందుపూర్వ కడువర్ణకము నందలి యుత్తునకు లోపము నైతము వచ్చును.

వి. తస్యడువర్ణ కోకారస్య వికల్పేన లుక్ స్యాల్లులయోః పరయోః. ఇండ్లు, విండ్లు ఇత్యాది.

'సంలో స్వబిన్దుర్వాగుః' అను పూర్వ సూత్రముచే సిద్ధ మగు డువర్ణకమునందలి యుత్తునకు లోపము వికల్పముగా నగును. చశబ్దము వికల్పార్థము.

ఇండులు అనుచో నీ సూత్రముచే నుత్వము లోపింపఁగా నిండ్లు. చశబ్దముచే వికల్పము గావున నుత్వము లోపింపని పక్షము నందు ఇండులు అని యుండును.

## 17. నిత్యం దారాదేః (లులయోరురౌచ)[2]

వ్యా. దారాదేః = దారార్థక మగు 'అలు' మొదలగు వానికి, నిత్యమ్ = నిత్యముగా నగును.

వి. దారాది గణస్య లులయో రురావాదేశౌ స్తః.
చకారో వికల్పార్థః. ఆండురు. ఉల్లుక్
ఆండ్రు, ఆండ్ర, చెల్లెలు, చెల్లెండ్రు, చెల్లెండ్ర,
కోడలు, కోడండ్రు, కోడండ్ర, మరదలు, మరదండ్రు,
మఱదండ్ర, వరాలు, వరాండ్రు, వరాండ్ర,

---

1. ఉల్లుగపితయోః పరతః. ఆం.శ.చిం.అ.71
తయోరుల్లక్చ ఆం.కౌ.అ.90
2. నిత్యందారాదిలోః, తత్రరురౌ. ఆం.కౌ.అ.92, 93
నిత్యందారాదేశ్చస్యాల్లో ర్లులయోరురౌ తత్రస్య ఆం.శ.చిం.అ.72

## ఇల్లాలు, ఇల్లాండ్రు, ఇల్లాండ్ర, రలయోరభేదాత్ వికల్పే - చెల్లెండ్లు, కోడండ్లు, మఱదండ్లు ఇత్యాది.

సూత్రమునం దేవి విధింపఁబడినదో స్పష్టముగా లేదు. వివృతి యందు లులలకు ఱర లని చెప్పఁబడినది అట్లయ్యు నాల్వాదు ల వర్ణమునకు ఁబూర్ణబిందు పూర్వకఁ డువర్ణము రావలసి యున్నది. క్రమము ననుసరించి దారాదుల లువర్ణకమునకుఁ బూర్ణబిందుపూర్వక డువర్ణకము నిత్యముగా వచ్చు నని యర్థ మగును. వివృతియం దాయర్థ మసలు గానరాదు. ఇంకను 'చకారో ని కల్పార్థః' అని యున్నది. ఈ సూత్రమున 'చ' శబ్దమె లేదు. కాఁబట్టి సూత్రమునఁ గొంతభాగము నష్టమైన దని తోఁచు. అట్లయినచో 'నిత్యం దారాదేర్లులయోః ఱరౌచ' యని యుండె నేమో.

మొత్తముమీద అలు మొద లగు వానియందలి లువర్ణమునకుఁ బూర్ణబిందు పూర్వకడు వర్ణము నిత్యము గా నగును. పైనున్న లులలకు (వికల్పముగా) ఱరలు వచ్చు నని మాత్రము సూత్రము నీ యభిప్రాయ మని చెప్ప వలసి యున్నది.

అలు + లు = అండురు అని యగును 'ఉల్లుక్చ' యనుపూర్వ సూత్రముచే డువర్ణము నందలి యుత్తునకు లోప మయిన పక్షమునందు అండ్రు అని యగును, చశబ్దముచే లోపము రానిపక్షమునం దాండురు అనియె యుండును.

'రలయోరభేదాత్ వికల్పే' యని వివృతియందు లులలకు ఱరలు వచ్చుట వికల్ప మన్నట్లు పేర్కొనఁబడినది. చెల్లెండ్లు, కోడండ్లు అనురీతి రూపములు నేఁడు గానరావు. వినరావు నని చెప్పవచ్చు. అట్టి యెడల వివృతి కర్త కాలమున నట్టి శబ్దము లున్న వన్నను రలలయభేదతచే వికల్ప మనుట యసంగతము 'చకారో వికల్పార్థః' యని యంతకు ముందు చెప్పబడె. కాని 'ఉల్లుక్చ' యనుచోట చకార మట నుద్దిష్ట మని పేర్కొన్న లులలకు ఱర లీ సూత్రము విధింపనేలే దనియు, రలయభేదతవలననే యట్లు రేఫము (వికల్పముగా) వచ్చిన దనియుఁ గాఁగా సూత్ర మటఁ జూపఁబడినట్లు 'నిత్యందారాదేః' యని మాత్రమె యనియుఁ జెప్పవచ్చునా?

అట్ల యయిన నా రలల యభేదత చేతనే వికల్పముగా నయినను 'కొండవండులు' ఇత్యాది స్థలముల కొడవండురు అనురీతి రూపముల ప్రసక్తి యేల కలుగదు?

ఏ మయినను ఱరలు రాని కోడండ్లు అనురీతి రూపముల ప్రస్తావనము కవి ప్రయోగానుగుణముగా గుర్తించుటకుఁ దగిన యాధారము లే దనియే చెప్పకతప్పదు.

## 18 రలయోగే ళ్ల[1]

వ్యా. రలయోగే = రేఫలకారముల సంయోగమునందు, 'ళ్ల' = ళ్ల అనునది యగును.

వి. రేఫలకారయోః ళ్ల స్యాత్. గోరులు, గోళ్లు, వేరులు, వేళ్లు, పేరులు, పేళ్లు ఇత్యాది.

'ళ్ల' అనుచోటి యుకార ముచ్చారణ సౌకర్యమున కయి చేర్పఁబడిన దని గుర్తింపఁదగును.

ప్రాతిపదికము తుది నున్న రేఫము బహువచనము లగు లులలతో సంయోగము చెందినపు డారల సంయోగస్థానమున 'ళ్ల' అనునది యగును. ఇట రేఫ మాత్రమునకు ళ కారమాత్రము విధించినఁ జాలు నని తోఁచు. కాక ళ్ళ అనురీతిగా బహువచన లకారమునకు సయితము ళ కారమగుట యుద్దేశింపఁ బడినచో ద్విరుక్త ళ కారము, రలలు రెంటికి విధించుట యొప్పును. కాని సూత్రము నందు నుదాహరణములందుఁ గూడ బహువచన ల కారమునకు ళ కారము చూపఁబడలేదు.

గోరులు - (గోర్లు-) గోళ్లు మొ॥

## 19 సలలో రులోపశ్చ[2].

వ్యా. సలలో = లకారముతోఁ గూడిన లువర్ణమునకు, ఉలోపః చ = ఉ కారలోపము సయిత మగును.

వి. ద్విత్వసహిత లువర్ణాన్తానాముకారస్య వా లోప స్స్యాత్.

పందిళ్లువేసి - పందిళ్వేసి, అంబళ్లుగాచి - అంబళ్గాచి[3], కంభళ్లు గట్టి - కంబళ్గట్టి ఇత్యాది

1. వారలోర్లుయోగేళ్లుః ఆం.కౌ.అ.94
రలదా ముతాంశః వై.చం.అ.56
డోలః. ఆం.శ.చిం.అ.73
రలయోగేళ్లుః - త్రి.శ.4.3 (హేమచంద్రసూత్రము)
2. వలోలోశ్చ. ఆం.శ.చిం. అ.75.
ద్విలోరుర్లో పావా. ఆం.కౌ.అ.100. 3. కవి. శి.

లకారముతోఁ గూడిన లు వర్ణమునందలి యు కారమునకు లోపము గూడ వచ్చును. ఈ లోపము హల్లు పరమగునపు డని గుర్తింపఁదగును.

పందిళ్లు + వేసి = పందిళ్ వేసి భిన్న హల్సం యోగమున ద్విరుక్త మగు లకారములో నొకటి లోపించి పందిళ్వేసి యని యగును. చశబ్దముచే లోపము వికల్పము గావున లోపము రాని పక్షమునందు పందిళ్లు వేసి యని యుండును.

'ళ్లు' అనుచో నొకటి ళకారము కాఁగా మఱియొకటి లకారము. లళల యభేదమును బట్టి, వివృతియందు ద్విత్వముగాఁ బ్రస్తావింపఁబడిన దని చెప్పఁదగును. ఇట్లే లక్షణమున 'సలలో॰' అనునదియు ళ్లు రెండును ళకారము లై 'పందిళ్లు' అని యుండు నని తలఁచి నపుడు సళళో॰ అనియు, ద్విత్వసహితళువర్ణస్య యని మొదలుగను నుండవలె.

## 20. లీనామితశ్చ[1].

వ్యా. లీనామ్ = ప్రాతిపదికము తుది లివర్ణము యొక్క, ఇతః చ = ఇకారమునకును, లోపః = లోపము వచ్చును.

వి. ఔపవిభక్తికయోగ్య లివర్ణానా మికారస్య లుగ్వా స్యాత్[2].
లివర్ణాంతత్వాద్భిన్ను సహిత డువర్ణకశ్చ - బాణ లి - బాణండులు - ఉల్లోపే - బాణండ్లు - బాణలులు, ఇకార లోపవికల్పే - బాణల్లు, గొడ్డలి - గొడ్డండ్లు - గొడ్డండు - లు - గొడ్డలులు - గొడ్డళ్లు, ఏవమేవ కొడవలి, గుద్దలి, తిరుగలీత్యాదయః.

సలలో రులోపశ్చ యను పూర్వసూత్రము ననుసరించి లోపము వికల్పముగా నగు నను నర్థ మిట సిద్ధించును. ఇది యౌపవిభక్తిక శబ్దముల యందే యగు నని వివృతి స్పష్టము చేయుచున్నది. ఔపవిభక్తికము లయిన శబ్దముల తుది లివర్ణమునందలి యికారమునకు లులు పర మయినపుడు వికల్పముగా లోపము వచ్చు నని యర్థము.

కొడవలి + లు - ఇత్వము లోపింపఁగా కొడవల్లు. వివృతి యందు గొడ్డళ్లు అనుచో ళకారము చూపఁబడినది. లళల యభేదమును బట్టి ప్రాతిపదిక తుది లకారమునకు ళకార

---

1,2 ఔపవిభక్తిక లీనామిల్లుగ్వాహళం - దుశ్చ. ఆం.కౌ.అ.101. ఔపవిభక్తికలీనా మిల్లుగ్వాహళం
తద్ధితేడుశ్చస్యాత్. ఆం.శ.చిం.అ.76
ఔపవిభక్తికస్య డుక్. వై.చం.అ.57

మగు నను తలంపు గావచ్చును. వికల్పము గావున నిత్యమునకు లోపము రాని పక్షమునందు 'కొడవలులు' అని యుండును. (ఇచ్చటఁ గూడ నభేద మార్గము ననుసరించిన కొడవళులు అని కాఁగలదు.)

'లివర్ణానత్వాద్బిన్దుసహిత డు వర్ణకశ్చ' యని వివృతి పేర్కొనుచున్నది. బిందుసహిత మగు డువర్ణకము వచ్చు ననుచు, లివర్ణాంత మగుటచేత నను కారణము చూపుట యిందలి విశేషము. లివర్ణాంత మయినచో 'ండు' వర్ణము వచ్చు నని చెప్పిన శాస్త్ర మిటఁ గానరాదు. ఇది (వివృతి) ఆంధ్రశబ్దచింతామణికిఁ దరువాతి గ్రంథ మగుట స్పష్టమే. కాని చింతామణిలో 'ఔపవిభక్తిక లీనామిల్లుగ్బహుళం తథైవ డుశ్చస్యా' త్తని ఔపవిభక్తికత్వమును, 'ండు' వర్ణ మగుటయు స్పష్టముగాఁ జెప్పఁబడినది. సూత్రమున నట్టిది లేదు. ఆం.కౌ.చిం. ననుసరించియ యున్నది.

ఏ మైనను ఔపవిభక్తికము లయిన శబ్దముల తుది లివర్ణమునకుఁ బూర్ణబిందు పూర్వక డువర్ణము వికల్పముగా వచ్చుట మాత్ర మిష్టము. అట్లు 'ండు' వర్ణ మాదేశము కాఁగా కొడవండులు 'ఉల్లక్చ' యని యుత్వము లోపింపఁగా కొడవండ్లు. ఉల్లోపము లేనిచోఁ గొడవండులు; అనియు, వైకల్పిక మగుట. 'ండు' వర్ణమును లేనిచో కొడవలి+లు = కొడవలులు, ఇత్యాదిగా నగుటయు గమనింపఁదగును.

## 21. లు స్సంయుక్త సమాప్తస్య[1].

వ్యా. సంయుక్త సమాప్తస్య = ప్రాతిపదికము యొక్క చివరి వర్ణము బహువచన మగు లుప్రత్యయముతో సంయోగమును బొందిన రూపముతో సమానమై, లుః = బహువచనమును బొందును.

వి. సంయుక్త సమాప్తశబ్దస్య భూయోఽన్తే లుప్రత్యయస్స్యాత్ చకారో వికల్పార్థః పందిళ్లువేసి. పందిళ్లులు వేసి, కంబళ్లు గట్టి – కంబళ్లులు గట్టి, అంబళ్లు గాచి – అంబళ్లులు గాచి, త్రాళ్లు ముళ్లు వేసి – త్రాళ్లులు ముళ్లులు వేసి ఇత్యాది.

కొన్ని ప్రాతిపదికలు – ప్రథమా బహువచనము నందు లుప్రత్యయముతో సంయోగమును బొందిన రూపము నందినవై పైని ప్రథమాది బహువచన ప్రత్యయములను బొందును. ఉదాహరణమునకు (గొడవలి యను శబ్దమునకు ప్రథమా బహువచనమున

---

1. అపి సంయుక్త సమాప్తౌ భూయోన్తేలుః ప్రదృశ్యతేనామ్నామ్. ఆం.శ.చిం.అ.77
   అపి సంయుక్త సమాప్తౌ భూయోన్తేలుః ప్రదృశ్యతేనామ్నామ్. ఆం.కౌ.అ.102

కొడవండులు, కొడవండ్లు, కొడవళులు, కొడవళ్లు అనుతీరుగా రూపము లేర్పడును. ఇందుఁ దుదిని సంయుక్తత కలిగినది. కొడవండ్లు, కొడవళ్లు అను రూపములందే, కొడవండులు ఇత్యాదులంతోఁ దుదిని సంయుక్తత లేదుగదా. కొడవలి అనుప్రాతిపదికము సంయుక్త సమాప్త రూప మగు కొడవండ్లు లేదా కొడవళ్లు అను దానివంటి యాకారమును బొందును. ఇట్లు ఏర్పడిన యీ రూపము ప్రాతిపదికమె కావున దీనిపైని ప్రథమా విభక్తులు చేరవచ్చును. కాని కొడవలి అను ప్రాతిపదికము పొందిన కొడవండ్లు అనురీతి దగు సంయుక్త సమాప్త రూప ప్రాతిపదికముపై (ప్రథమాది) బహువచనము మాత్రమె చేరును. కొడవండ్లులు, కొడవండ్లులును.

సూత్రమునందలి 'లుః' అను ప్రథమాబహువచనము బహువచన సామాన్యమున కుపలక్షక మని గ్రహింపఁదగును.

'అపి సంయుక్త సమాప్తోభూయోఽన్తే లుః ప్రదృశ్యతే నామ్నః' మన్నది చింతామణి లక్షణము. దీని ప్రభావము సూత్రమునవలె వివృతియందును బ్రస్ఫుటముగా నున్నది. అయ్యును 'నామ్నామ్' అను దళము నభిప్రాయమును సంగ్రహింపకుండుట యిం దొకలోటుగనె చెప్పఁదగును.

## 22. నడమహతా ముతామ్.[1]

వ్యా. అమహతామ్ = అమహద్వాచకము లయిన, ఉతామ్ = ఉదంతశబ్దములకుఁ బైని, నట్ = నవర్ణకము వచ్చును.

వి. కేషాంచిద్దేశ్యానా ముదన్తానాం సప్తమ్యేకవచనే నట్ స్యాత్. టకారస్య ఇత్సంజ్ఞా. ఊరున, మేనున, పేరున, గట్టున ఇత్యాది.

కొన్ని దేశ్యములగు నుదంత శబ్దములపై సప్తమియం దేకవచనమున నవర్ణక మగును. వివృతిని బట్టి యిది సప్తమీ న వర్ణకమని గ్రహింప వచ్చును. ఉదంతములగు నమహచ్ఛబ్దమునకుఁ బైని సప్తమీ విభక్తియందు న వర్ణకము వచ్చును. 'నట్' లో టకార మిత్తు. కావున 'న' అనునదే వచ్చును. ఇది టిత్తుగా నిర్దేశింపవలసిన యవసరము గానరాదు. ఇంకను సప్తమ్యేకవచనమునకు వచ్చు నని సూత్రమున స్పష్టముగాఁ జెప్పఁదగు.

ఊరు అనుదానిపై సప్తమీవిభక్తి ఏకవచనమును వివక్షింపఁగాఁ బ్రస్తుతసూత్రముచే నవర్ణకము వచ్చి ఊరున అని యగును.

---

1. బొహుళ్యచిదుతామ్.ఆం.కౌ.అ.103
(ఉలోపా. వై.చం.వి.15)

ప్రాణివాచకములపై నీ నవర్ణకము కల్గుట గానరాదు. సూత్రమున 'అమహతామ్' అని యమహత్తుల కిది సామన్యాముగాఁ జెప్పఁబడినది. స్త్రీతిర్యగ్జడము లమహత్తులుం కావున స్త్రీతిర్యగ్వాచకములపై నవర్ణకము కలుగుట లక్షణానుగుణమె. కాని (వధువునందు) వధువున, (గుల్మమునందు) గుల్మమున అనుతీరుగా నీ నవర్ణకము స్త్రీతిర్యగ్వాచకములపైఁ గానరాదు. చిన్నయసూరి 'ఉకారాంతజడంబు సప్తమికి నవర్ణకం బగు' ననెను. వికృతివివేకము 'అమహన్నామజడగంబోదన్త' మ్మని అమహచ్ఛబ్దమును బ్రయోగించియు జడవాచకములకే యని స్పష్టము చేసినది.

ప్రాణివాచకములపై సప్తమీనవర్ణకము కవిప్రయోగములందును లేకుండుట స్పష్టమె. సూత్రమునుందలి యమహచ్ఛబ్దము జడపర్యాయ మని లక్ష్యముల ననుసరించి చెప్పుకొనవలె..

## 23. ఉనో వా లుక్[1].

వ్యా. ఉనః = జడోదంతములకు సప్తమీనవర్ణకము పరముగా నున్న స్థలములో 'ఉన్' అను భాగమునకు, వా = వికల్పముగా, లుక్ = లోప మగును.

వి. తయోర్ద్దేశ్యపద విభక్తిపదయోర్విద్యమానఉనో వా లుక్ స్యాత్. ఊర్ + అ - సన్ధిః - ఊర, మేన్ + అ = మేన, పేర్ + అ = పేర, గట్ట్ + అ = గట్ట ఇత్యాది.

'నడమహతాముతామ్' అను పూర్వసూత్రముచే సప్తమియందు నవర్ణకము వచ్చిన స్థలములలోఁ బ్రాతిపదికము తుది యుకారమును మీఁది నవర్ణకము మొదటి నకారమును, మొత్తము 'ఉన్' అను భాగమునకు వికల్పముగా లోపము గల్గును.

ఊరున - అనుచో ని ట్లీ సూత్రముచే 'ఉన్' లోపింపఁగా ఊర్ + అ = ఊర అని యగును. ఇట సంధి యని విపృతియందుఁ బేర్కొనఁబడినది. పా ల్లయిన రేఫము మీఁది యచ్చుతో మేళవించు నని మాత్రమె యభిప్రాయ మయియుండును. రాముఁ డతఁడు ఇత్యాదుల వంటి సంధి ప్రసక్తి యిచ్చట లేదు. 'ఉన్' కుఁ గాక నకారంపుఁబొల్లునకు మాత్రమె లోపము చెప్పిన సంధి ప్రసక్తి యుండెడిది. అట్టి ప్రక్రియాగౌరవము నాపాదింపక ఉన్లోపము చెప్పు టుచిత మై యున్నది.

'కేషాంచి దుదన్తానాం నేతి విభక్తా వునోలుక్స్యాత్' అని చింతామణిలక్షణము. ఇందు నవర్ణకము ప్రత్యేకముగా విధింపఁబడక జ్ఞాపకసిద్ధ మగుచున్నది. కాగాఁ బ్రస్తుతగ్రంథమున

---

1. విభక్తౌలుగునః. ఆం.కౌ.అ.4

కేషాంచిదుదన్తానాంనేతివిభక్తావునోలుక్స్యాత్. ఆం.శ.చిం.అ.79

'నడమమహతాముతా' మ్మని దానిని విధించుటయు, అమహతామ్ అని కొంతవఱకు స్పష్టము చేయుటయు నుచితముగా నున్నది. కావున 'న' విభక్తి యని చింతామణి పేర్కొనుచుండ 'నట్' అని దానిని టిత్తుగాఁ జెప్పుటలో నిందుఁ బ్రయోజనము గానరాదు.

'కేషాంచిత్' అను దళముచే నందు నవర్ణకము పరమయిన యన్ని స్థలముల నున్లోపప్రసంగ ముండదు. ప్రస్తుతగ్రంథమున 'వా' శబ్దముచే ద్వైరూప్యముతోపాటు 'వా'శబ్దమునకుఁ జేసికొను వ్యవస్థచేఁ గొన్నియెడల నున్లోపము లేకుండ సాధింపఁదగును. వివృతియందు గట్టున 'గట్ట' అని చూపఁబడినది. గట్టున అని యుండును గాని 'గట్ట' అని యుండదు. కాన నిట నున్లోపము లేదన్న మాట. ఇట్టి లోపాభావమును వా శబ్దముచే నియమించుకొనవలయును.

## 24. అట్టాస్జిపః[1].

వ్యా. టాస్జిపః = తృతీయ, మఱియు, సప్తమీవిభక్తుల స్థానమున, అత్ = హ్రస్వ మగు అకారము, వా = వికల్పముగా నగును.

వి. తృతీయాసప్తమ్యోరర్థే ఔపవిభక్తికనామ్నా మత్ స్యాత్. కేగంటఁ జూచె, పంటఁ గొఱికె, మింటఁ దిరిగె, కూటఁ గట్టె నిత్యాది.

టా(భ్యాం) భిస్ అనువాని ప్రత్యాహారము టాస్. తృతీయైకబహువచనము లని యర్థము. ఙి,(ఓస్) సుప్ అనువాని ప్రత్యాహారము ఙిప్. సప్తమ్యేక బహువచనము లని యర్థము. 'తృతీయాసప్తమ్యోరర్థే ఔపవిభక్తిక నామ్నా మత్ స్యాత్' అన్న వివృతి వాక్యము 'ఔపవిభక్తిక నామ్నా మత్వం స్యాత్సప్తమీ తృతీయార్థే' యనుచింతామణి వచనమును దాదాపు యథాతథముగనె యనుసరించి యున్నది. ఇది యౌపవిభక్తికములకె యగు నని సూత్రమున స్పష్టము చేయఁబడలేదు.

ఔపవిభక్తికము లగు శబ్దములకుఁ బైనున్న తృతీయ మఱియు సప్తమీవిభక్తుల స్థానమున హ్రస్వ మయిన యకార మాదేశ మగునని సూత్రాభిప్రాయము.

కంటి + టా అని యుండఁగా టాస్థానమున 'అ'త్వము వచ్చి కంటి + అ అనుచో సంధి యై 'కంట' నని యేర్పడును. ద్రుతప్రకృతికము గావునఁ బైని ద్రుత ముండును.

ఇట్లే కన్నుల + సుప్ అనుచో సుప్పు స్థానమున నీ సూత్రముచే అత్వమై, (కన్నుల

---

1. అత్సప్తమీ తృతీయార్థే. అం.కౌ.అ.105.
ఔపవిభక్తికనామ్నామత్వంస్యాత్సప్తమీతృతీయార్థే అం.శ.చిం.అ.79.
అఔపవిభక్తికేచటాఙ్యోరద్వా.వై.చం.వి.17

+ అ) సంధి జరిగి కన్నుల - ద్రుతము చేరి కన్నులన్ అని యగును.

'ఉనోవాలుక్' అను పూర్వ సూత్రము నుండి యనువృత్త మయిన 'వా' శబ్దముచే నీ యత్వాదేశము వికల్పము. కావున అత్వము రాని పక్షమునం దాయా విభక్తుల స్థానమున సాధారణము లగు నాయా తెలుఁగు విభక్తులు వచ్చును. (కంటన్) కంటిచేత, కంటితోడ, కంటియందు, (కన్నులన్), కన్నులచేత, కన్నులతోడ, కన్నులయందు.

ఇది యౌపవిభక్తికములకే కావున అనౌప విభక్తిక శబ్దములపై అత్వము రాదు. గట్టునందు అను చో గట్ట అని యుండదు.

కుందేటికొమ్ము, తాఁబేటికి, మొదలుగా నౌపవిభక్తికములు ప్రాణివాచకముల కగుట గలదు. కాని ప్రాణివాచకము లయిన యౌపవిభక్తిక శబ్దములకు మాత్ర మీ కార్యము లేదు. కుందేటితోడ తోఁడేటియందు ఇత్యాదులలో కుందేటన్, తోఁడేటన్, అనురీతిరూపము లుండవు. అనువర్తించిన 'వా' శబ్దమున కీ యర్థమును వ్యవస్థ చేసికొనవలయును.

## 25. స్త్రియామనుతాం సోర్లుక్[1].

వ్యా. అనుతామ్ = ఉదంతములు కానట్టి, స్త్రియామ్ = స్త్రీలింగశబ్దములకుఁ బరమయియున్న, సోః = సుప్రత్యయమునకు, లుక్ = లోప మగును.

వి. ఉదన్తవ్యతిరిక్తానాం స్త్రీయాం సోర్లుక్ స్యాత్.
మాత, భామ, రమణి, కన్నె, ఇంతి, ముపుద, లచ్చి,
అనుతాం కిమ్? వధువు, తనువు.

ఉదంతములు గాని స్త్రీలింగశబ్దములకుఁ బరమై యున్న 'సు' ప్రత్యయమునకు (ప్రథమావిభక్తి యేకవచనమునకు) లోప మగును. ఉదాః- రమ మొ॥

రమాశబ్దమున దీర్ఘమునకు హ్రస్వము రాఁగా దానిపైఁ బ్రథమైకవచన వివక్షయందు సుప్రత్యయము వచ్చి రమ + సు అని యుండ నా సువిభక్తి కీ సూత్రముచే లోప మయి' రమ' యనునది ప్రథమైకవచనాంతపదముగా నేర్పడును.

'అనుతామ్' అనుటచే నీ లోప ముదంతములయిన శబ్దములకు లేదు. ధేను, మొదలగును దంత స్త్రీలింగశబ్దములకుఁ బ్రథమైకవచనమున వు వర్ణకము వచ్చి ధేనువు అనురీతిగా నగును.

---

1. అనుతాంస్త్రి యాంసోర్లుక్. ఆం.కౌ.అ.106
అనుతాంస్త్రియాం సమాన్నాం సర్వస్య స్త్రీసమస్యచ సులోపః. ఆం.శ.చిం.అ.81.
స్త్రీయామనుదోతోలుక్. వై.చం.అ.33

ఇచట వివృతి యందు దాదాపుగా నన్నియును స్త్రీవాచకము లగు శబ్దములే చూపఁబడినవి. కావున సూత్రమునందలి 'స్త్రియామ్' అనుదానికి స్త్రీవాచకముల కని యర్థము చేసికొనరాదు. వివృతియందే 'అనుతా' మ్మనుటకుఁ బ్రయోజనమును జెప్పుచో 'తనువు' అని యుదాహరింపఁబడినది. ఇది స్త్రీని బోధించునది కాదు కావున స్త్రీ వాచకము గాదు. కాని యిది స్త్రీ లింగశబ్దమె. కావున సులోపము స్త్రీలింగముల కగునని గుర్తింపఁదగును. విద్య, కపిల, మొ॥ 'స్త్రియా' మ్మనుటచే స్త్రీలింగములు గాని శబ్దములకు నిట సులోపము రాదు. కళత్రము కళత్రశబ్దము స్త్రీ వాచక మయ్యును స్త్రీలింగము గాదు. కావున దానిపైని సువిభక్తి లోపింపదు. ఇంక నిది నపుంసకలింగము గావున 'ములతస్సొఃక్లీబే' యను సూత్రముచే ముపర్ణకము వచ్చి కళత్రము అని యైనది.

## 26. అమహత స్సమస్య చ[1].

వ్యా. అమహతః = అమహ త్తయిన, సమస్య చ = స్త్రీలింగ సమశబ్దములకును, సోర్లుక్ = సువిభక్తికి లోప మగును.

వి. అమహత స్సర్వస్య స్త్రీలింగసమశబ్దస్య చ సులోప స్స్యాత్. గోడ, మేడ, పేట, తోడు, కోట, కూరి, వాడి, మిద్దె, గిన్నె, ఇత్యాది.

'స్త్రియామనుతస్సోర్లుక్ః' అను పూర్వసూత్రము నుండి 'సోర్లుక్' అనునది యనువర్తించును. అమహత్తు లయిన స్త్రీలింగసమశబ్దములకును సులోప మగును. గోడ, మేడ మొ॥.

ఇట నుదంతములకు నిషేధము లేకుండుటచే ఊరు, పేరు, ఇత్యాదిగా నుదంతములపయి గూడ సులోప మగును. కాఁగా స్త్రీలింగ సమశబ్దముల కన్నింటికి నీ కార్యము కల్గును. 'సర్వస్య స్త్రీలింగ సమశబ్దస్య' అని వివృతి యందుకే యట్లు స్పష్టము చేసినది. 'ఇది' అనుతాం స్త్రియాం సమానాం సర్వస్య స్త్రీసమస్య చ సులోపః' అను చింతామణిలక్షణమును స్ఫురింపఁజేయును.

స్త్రీ సమత్వముయొక్క యతిదేశమువలననే స్త్రీలింగకార్యము కలుగును. దానిని బ్రత్యేకముగా విధించుట యనవసరము.

అట్లు విధింపవలసి వచ్చుచో స్త్రీలింగసమత్వమె వ్యర్థ మగును.

ఇంకను నీ సూత్రమునందు 'అమహతః' అను దళము ప్రయోజనవంతముగా లేదు. మహత్తులు స్త్రీలింగసమము లయినచో సులోపము రాదను నపార్థము నిది కల్గించును.

---

1. సర్వస్యస్త్రీసమస్య చ సులోపః. అం.శ.విం.అ.81.

అన్న, అయ్య, జాణ యగు కృష్ణుఁడు, మొదలగుచోట్ల అన్న మొదలగునవి మహత్తులే. అయినను స్త్రీలింగసమము లయి ప్రథమైకవచన లోపాదిక మగు కార్యములను బొందును. కాఁగా నీ సూత్రమునందు 'అమహతః' అను దళ మనర్థక మని నిశ్చయింపఁదగును. వివృతియందు అన్నియు సమహత్తులే యుదాహరింపఁబడినను, నీ కార్యము మహత్తులకును గలదు.

ఆచ్ఛికము లెల్ల సమహత్తులె యని యుద్దేశ్యమా? అందుకే రంగఁడు మున్నగునవి పుమమహత్తులు అనఁగాఁ బురుషుని బోధించునట్టి యమహత్తు లని చెప్పఁబడినదా యని సందేహము. పరిశీలింపవలెను. ఈ భేద ముద్దేశించిన నది సరి కా దనక తప్పదు. ఇంతకు నిట మహత్కోటియు నుదాహరింపఁబడలేదు.

## 27. ములగన్తాః[1].

వ్యా. ములగన్తాః = ముల్, అక్, అనునవి యంతమందుఁ గల్గినవి యగును. ఆచ్ఛతెనుఁగుశబ్దములు, ములంతములు లేదా అగంతము లవును.

వి. అస్యాం త్రిలిఙ్గభాషాయాం సర్వే శబ్దాః ములన్తా అగన్తా ఏవస్యుః సూత్రే ములగన్తా ఇత్యుక్తత్వాన్నాన్యే శబ్దా స్స్యు రితి బోద్ధవ్యాః[2]. సింగము, గుజ్జము, పల్లము, పళ్ళెము, కళ్లెము, గొళ్లెము, పాళెము, కోట, పేట, గోడ, మేడ, గంప, గొడ్డలి. కొడవలి, పసుపు, గోరు, గిన్నె, తిన్నె, వన్నె, పీట, మాల, పెద్ద, లక్కన, ఇత్యాది.

'ములతస్సోఃక్లీబే' యను సూత్రమును బట్టి యదంతము లగు నపుంసకలింగశబ్దములకు ముప్రత్యయము వచ్చును. కావున ములంతము లగు ననుటవలనఁ గ్లీబములతో సమము లగునని యర్థ మగును. '(అక్త్రైకవచనే') - అక్ -స్త్రీలింగకార్యము. అగంత మనుట స్త్రీ సమత్వము నుద్దేశించిన దని గ్రహింపవలయును. కావున నాచ్ఛికశబ్దము లన్నియు ములంతములు (క్లీబసమములు) అగంతములు (స్త్రీసమములు) నగును. ఇట్లగుటవలన స్త్రీక్లీబసమమయము గానివి యనఁగాఁ బుంలింగసమము లాచ్ఛికములు లే వని యర్థము. వివృతియందలి యీ యభిప్రాయము 'వికృతౌ సర్వే శబ్దాః క్లీబసమాస్త్రీసమాశ్చ నాన్యే

1. క్లీబస్త్రీసమాస్సర్వే. ఆం.కౌ.అ.108. క్లీబేముప్రత్యయః? త్రి.శ.4.35
కేచిదుపగ్రాకవిసమ్మతా. త్రి.శ.4.36
2. వికృతౌ సర్వే శబ్దాః స్త్రీసమాశ్చ క్లీబసమాశ్చ నాన్యేస్యుః. ఆం.శ.చిం.అ.83.

స్యు॥' అనుచింతమనిని స్ఫురింపఁజేయును.

## 28. ఉల్లోపో భల్లటస్య[1].

వ్యా. భల్లటస్య = భల్లటుఁ డనువాని మతముననుసరించి, ఉల్లోపః = ఉత్వమునకు లోపమగును.

వి. నాన్తలాన్తానాం నామ్నాం క్రియాణా మన్త్యోకారస్య
లోపస్స్యాద్భల్లటస్య మతే[2] వనములు - వనముల్,
పెద్దలు - పెద్దల్, మేను - మేన్, తాను - తాన్, తలంతును -
తలంతున్, చూచెను - చూచెన్, చేసెను - చేసెన్ ఇత్యాది.

ఈ యుత్వలోప మెచ్చట నగునో సూత్రమునఁ జెప్పఁబడలేదు. 'నాన్తలాన్తానాం నామ్నాం క్రియాణామన్త్యోకారస్య' అని వివృతి వివరించినది. ఇది 'కవిభల్లటైః క్రియాణాం నామ్నాంచోల్లోపఇష్యతేష్వేషు ప్రథమైకవచనమాత్రే నాన్తాదయోఽపి కథ్యన్తే' యను చింతామణిలక్షణము ననుసరించిన దనవచ్చు.

పదము తుది నున్న నులు వర్ణముల యందలి యుత్వమునకు భల్లటునిమతము ననుసరించి లోప మగు నని యర్థము. 'భల్లటస్య' యనుటచే నీ యుల్లోపము పాక్షికము కావున నొకపక్షమున నుల్లోపము లేదు. వనములు - వనముల్, తాను - తాన్ మొ॥.

నాంతము లేకవచనాంతములు మాత్రమె. లాంతములు బహువచనాంతములుగా నుదాహరించుట గమనార్హము.

## 29. అన్త్రృహ్శోః పరస్య హద్వీ వా [3]

పరస్య = ఆఈఏలకుఁ బర మైన, అన్త్రృహ్శోః = (నక్ + ఋ,హ్,ర,శ) = ఋకారము,

---

1,2. కవిభల్లటైః క్రియాణాం నామ్నాం చోల్లోపఇష్యతేష్వేషు
ప్రథమైకవచనమాత్రేవికృతౌనాన్తాదయోఽపికథ్యన్తే. ఆం.శ.చిం.సూ.23
3.ఇదమదేత చ్ఛబ్దాశబ్దాన్తరాన్వయేబహులం
హ్రస్వప్రపద్యద్విత్వముపర్యక్షరవ్యంజనయన్తి. ఆం.శ.చిం.సూ.24.
ఉష్మరేషాన్వాద్విత్వముయుక్తస్యహలోమతమ్
ఋకారంచవిముచ్యస్యాత్ప్రాణానాందిత్వసంజ్ఞితిః.అ.కా.సూ.6.
హద్వైవైశేషముజ్ఞలో, వరేషామ్మణి,
ఋవర్ణయోశ్చ, ఆం.కౌ.సూ.31,32,33.
తద్యోర్విమిదమాంహేపరస్యారోష్మణిః. వై.చం.ప.14

హకారము, రేఫ, శషసలును దప్ప ఇతర మైన హల్లులకు, వా = వికల్పముగా, హద్వీ = ఆఈః ఏలకు హ్రస్వమును మీఁది హల్లునకు ద్విత్వమును, వా = వికల్పముగా నగును.

శషసాఖ్యః (వా.1.1.8), (వై.చం.సం.8) అని 'ఖ' అనునది శషసలకు మూఁడింటికి సంజ్ఞ. ఇది ప్రాకృతము నుండి గ్రహింపఁబడిన సంజ్ఞ.

వి. [1]యత్తదేతత్తద్భవానామ్ ఏకారాకారేకారాణాం
ఋకార హకార రేఫ శషసవర్జితస్య, తేషాం
పరస్య కకారాది వర్ణసముదాయస్య హ్రస్వద్విత్వే
క్రమాద్వికల్పేన స్తః.

యత్, తత్, ఏతత్ శబ్దముల నుండి యేర్పడిన ఏ,ఆ.ఈః అను శబ్దములకు, ఋకార, రేఫ,హకార,శషసలకు భిన్న మైన వర్ణము పర మగునపుడు, వానికిని గ్రమముగా హ్రస్వ ద్విత్వము లగును. అనఁగా ఆ ఈః ఏలకు హ్రస్వమును, వానికిఁ బర మైన వర్ణమునకు ద్విత్వము నగునని యర్థము.

ఆ + కలకంఠి యనుచో నిట్లు హ్రస్వద్విత్వములు రాఁగా 'అక్కలకంఠి' అని యగును. వా యనుటచే నీ కార్యము లేనపుడు (హ్రస్వద్విత్వములు రెండును రాక) ఆకలకంఠి అనియె యుండును.

వివృతియం దుదాహరణములు దాదాపుగా నన్నిహల్లులకుఁ జూపఁబడుచున్నవి.

ఆకలకంఠి - అక్కలకంఠి, ఈఃఖేచరుఁడు - ఇక్ఖేచరుఁడు, ఏగజము - ఎగ్గజము, ఈఃఘనుఁడు ఇగ్ఘనుఁడు, ఆచపలాక్షి - అచ్చపలాక్షి; ఆఛత్రము - అచ్ఛత్రము;

ఆఝషకేతనుఁడు - అజ్ఝషకేతనుఁడు, ఈఃటంకాయుధుఁడు - ఇట్టంకాయుధుఁడు, ఏఠకారము - ఎట్ఠకారము; ఆడంభము - అడ్డంభము. ఆఢక్క - అడ్ఢక్క, ఆతపస్వి - అత్తపస్వి ఈఃదనుజారి - ఇద్దనుజారి, ఈఃధనదుండు - ఇద్ధనదుండు, ఏనగంబు - ఎన్నగంబు, ఈః పద్మనేత్ర - ఇప్పద్మనేత్ర, ఆఫాలాక్షుఁడు - అప్ఫాలాక్షుఁడు, ఈఃబలిధ్వంసి - ఇబ్బలి ధ్వంసి, ఆభూపాలుఁడు - అప్ఫాలాక్షుఁడు, అప్ఫాలాక్షుఁడు, ఇబలిధ్వంసి, ఆభూపాలుఁడు, అబ్భూపాలుఁడు, ఆమాత, అమ్మాత, ఆయజ్ఞభోక్త ఆయ్యజ్ఞభోక్త అయ్యజ్ఞభోక్త ఆలక్ష్మీపతి, అల్లక్ష్మీపతి, ఈఃవసుమతి, ఇవ్వసుమతి, ఆక్షతియుఁడు అక్షతియుఁడు ఇత్యాది.

---

1. యత్తదేతత్తద్భవానాం హ్రస్వంద్విత్వ(ం) పరస్యచ.త్రి.శ.7.17.

ఇం దుదాహరణములలోఁ జివర అక్షత్రియుఁడు అక్షత్రియుఁ డనునది చూపఁబడినది. 'క్ష' యనునది కకారదులవలె పృథగ్వర్ణముగాఁ దలఁపఁబడిన దేమో. కాక కకార షకారముల సంయుక్తాక్షరముగా నెంచిన దనుటకుఁ దగిన యాధారము లేదు. ఈ + ప్రవరుఁడు = ఇప్ప్రవరుఁ డనురీతిగా నరుదుగ నెట నేని సంయుక్త మైనను ఆ ఈ ఏల మీఁది హల్లునకు ద్విత్వము వచ్చునన్నను, క్షత్ర అనురీతి సంయుక్తములలో మాత్రము మీఁది హల్లునకు ద్విత్వము వచ్చుట గానరాదు.

ఈ ఆ ఈ ఏలమీఁది హల్లొక వేళ సంయుక్తమైనను హ్రస్వద్విత్వములు వచ్చుటలో నడ్డంకి యిచ్చుటఁ బ్రస్తావింపఁబడలేదు.

వి. అనృహ్రశోః కిమ్? ఆ ఋషి, ఈ హరి, ఏ రాముఁడు
ఈ శరమ్ము ఏ షణ్ముఖుఁడు, ఆ సారసాక్షి,
ఇత్యేవం రూపాణి సన్త్యేవ. అఋ్ఋషి, ఎర్రాముఁడు
ఇశ్శరము ఎష్షణ్ముఖుఁడు అస్సారసాక్షి
ఇతి తు న.

సూత్రమునందు 'అనృహ్రశోః' అనుటచేత ఋ,హ,ర,శషస, యనునవి పర మైనపు డీ ద్విత్వహ్రస్వములు లేవు. ఆ + ఋషి = అఋ్ఋషి యని కాదు. కావున ఆ ఋషి యని యట్ల యుండు. ఇట్లే యితరములు. ఋకారేతర మైనయచ్చు పర మైనపుడు యకార మగును కాన ఆ + అశ్వము = ఆయశ్వము, అయ్యశ్వము అను తీరుగ నగును.

## 30. త్రిషు తజ్జాదయః[1].

వ్యా. తజ్జాదయః = తద్భవము మొదలగునవి, త్రిషు = మూఁడు లింగములందును అజంతములె యగును.

వి. తద్భవదేశ్యాచ్ఛశబ్దాస్త్రిషు లిఙ్గేషు నిత్యాజన్తా
స్స్యుః[2]. అక్కన, వెజ్జు, చందు(రుఁడు), సిరి, జవ్వని,
పక్కి, చక్కెర, పువ్వు, వేరు, తాత, అన్న, అక్క, అవ్వ
అమ్మ, మూట, వేల్పు, గుజ్జు, తండ్రి, ఉవిద, చెలియ,
కను, చూపు, ఈవి, మేపు, చేయి, వ్రాఁత, కొంత ఇత్యాది.

---

1,2. తద్భవాదిపదానాం తు నిత్యాజన్తా త్రిషు ధ్రువమ్. త్రి.శ.4.28.

తద్భవము, దేశ్యము, అచ్చ, యైన శబ్దములు పుంస్త్రీనపుంసకములు మూఁడింటను, నజంతములే యగును. అచ్చ తెలుఁగు భాషలో సంస్కృతమునందువలె హలంత శబ్దములు లే వని తాత్పర్యము.

'ములగన్త్రా' అను లక్షణము ననుసరించి యచ్చతెనుఁగునందలి శబ్దములు క్లీబసమములో స్త్రీసమములో మాత్రమె యగును. కాఁగా నిట మూఁడు లింగము లనుటఁ బుంలింగము కూడఁ బ్రస్తావింపఁబడినది. కావున నిది యర్థము ననుసరించిన దని గుర్తింపఁదగును.

పుంలింగములు అన్న, తండ్రి, ఎద్దు మొ॥

స్త్రీలింగములు అక్క, తల్లి, ఆవు మొ॥

నపుంసకలింగము గోడ, మొ॥ ఇట్లె శబ్దములన్నియుఁ జివర నచ్చు గలిగినవి మాత్రమె యగును.

## 31. సింగాదేరద్వత్[1].

వ్యా. సింగాదయః = సింగ మొదలగు శబ్దములు, అద్వత్ = అదంత నపుసంకలింగ శబ్దములకువలె నుండును.

వి. సింగాది గణస్య అకారాంతనపుంసకలింగవత్ కార్యం స్యాత్.
సింగము, సింగ, గడ, పల్ల, జెణ? పాళె చిన్నాదయస్సింగాది
గణః. భారతే విరాటపర్వణి – 'సింగం బాఁకటితో
గుహాంతరమునం జేడ్పాటు పైనుండి' ఇత్యాది.

సింగ మొదలగుశబ్దము లదంత నపుంసకలింగశబ్దములవంటి రూపమును బొందు నని యర్థము. 'ములతస్సః క్లీబే' యని అదంతనపుంసకలింగ శబ్దములకు మువర్ణకము వచ్చును. కావున సింగ మొదలగు నచ్చతెలుఁగు శబ్దములకుఁ గూడ నట్లే మువర్ణ కాదు లగు కార్యము లగును. సింగము మొ॥ అద్వన్నిర్దేశమువలన, 'పాళె' మున్నగునవి యదంతములు గాకున్నప్పటికిని మువర్ణకాదు లగు నని గుర్తింపవచ్చును. పాళెము.

'ములగన్త్రా' అను సూత్రమున ములంతములు క్లీబసమములుగా గుర్తింపఁదగినవే యీ సింగాదులు అని గ్రహింపవచ్చును. స్పష్టార్థ మిట్లు విస్తరించి చెప్పఁబడిన దని చెప్పుకొనవలసియుండు.

---

1. సింగాదయోఽప్యదన్తాస్స్యుః త్రి.శ.4.29.

## 32. దుర్వా యుష్మదస్మదాత్మభ్యః.[1]

వ్యా. యుష్మదస్మదాత్మభ్యః = నీ నా తా శబ్దములకు సంబంధార్థమున, దుః = దువర్ణము, వా = వికల్పముగా నగును.

వి. యుష్మదస్మదాత్మన్ శబ్దేభ్యః పరతస్సంబంధ జాత్యాద్యర్థేషు దుర్వా స్యాత్. నీదుచరిత్ర, నాదుకులము, తనదుమహిమ, వికల్పే - నీచరిత్ర నాకులము, తనమహిమ ఇత్యాది.

సమాన (సంబంధాద్యర్థ)ములందు, యుష్మదర్థక మైన నీ శబ్దమునకు, అస్మదర్థక మయిన నా శబ్దమునకు, ఆత్మార్థక మయిన తా శబ్దమునకును దువర్ణము వికల్పముగా నగును.

నీ(యొక్క) చరిత్ర - నీ శబ్దమునకు దువర్ణము రాగా నీదుచరిత్ర 'వా' యనుటచే దువర్ణము రానిపక్షమునందు నీచరిత్ర.

'మనదుశక్తి' యనురీతిగా నుభయార్థక మయిన మనశబ్దమున కొక్కచో దువర్ణము గాన్పించుచున్నది (శృం.శా.)

## 33.ఉక స్వార్థే[2].

వ్యా. స్వార్థే = స్వార్థమునందు, ఉకః = ఉకప్రత్యయ మగును.

వి. అమహతోనామ్నః పరత ఉక స్వార్థే స్యాత్.[3]
ఇంతి - ఇంతుక, పడతి - పడతుక, వెలది - వెలదుక, నెలత - నెలతుక, నిప్పు - నిప్పుక, చాటు - చాటుక, మిడుత - మిడుతక, ఇత్యాది. కించస్వార్థేకప్రత్యయస్స్యాత్.

---

1. షష్ఠీసమాసే కేషాంచిద్దుస్యాద్యుష్మదస్మదోః. త్రి.శ.8.2
దుర్బహాలం సమాసే ఆం.కౌ.హ.47,
యుష్మదస్మదాత్మభ్యో ద్వితిరవర్ణకః. ఆం.శ..చిం.హ.26.
2. స్త్రియాముకస్స్వార్థే. ఆం.కౌ.హ.50
3. నామ్నః కవర్ణకస్స్యాత్స్వార్థేస్యాదుత్వముపపరేతస్మిన్. ఆం.శ.చిం.హ.29
అవి నన్నయ కప్రత్యయము చెప్పి ముం దుత్వము విధించె నది చెప్పుట వివృతియుద్దేశ్య మేమో.
స్వార్థే కమ్. వై.చం.త.7

సకలభాషావాగనుశాసన నన్నయభట్టారక ప్రణీత
రాఘవాభ్యుదయే మహాప్రబంధే -
"(న?)కకులుని ఖరదూషణముఖ
సకలపలచరులఁ బొదివిరి సమదముగ ని
ప్పుకకప్పుగ మూఁగెడు మిడు
తుకపిండు వితాన బ్రాఁతితోఁ జెడుబుద్ధిన్" - ఇత్యాది.

కొన్ని యమహచ్ఛబ్దములకు స్వార్థమున 'ఉక' అను ప్రత్యయము వచ్చును. ఇంతి + ఉక అని యుండఁగా సంధియై ఇంతుక అని యగును.

మిడుతుక - బ్రాఁతితో - అనుచోట యతిస్థానమునందుఁ నిబంధింపఁబడినది.

## 34. అణ్ దేశ్యస్య[1].

వ్యా. దేశ్యస్య = దేశ్యము అయిన శబ్దములకు, అణ్ = అ,ఇ,ఉ,అనునవి యగును.

వి. దేశ్య[2]స్త్రీవాచకశబ్దాంతస్య అణ్ స్యాత్. అకారేకారో కారాస్త్రయోటేస్స్యురితి బోద్ధవ్యాః అణితి ప్రత్యాహారః.
లచ్చ - లచ్చి - లచ్చు, కొండ - కొండి - కొండు, యెల్ల - యెల్లి - యెల్లు, నాగ - నాగి - నాగు; గౌర - గౌరి - గౌరు, ఇత్యాది.

దేశ్యము అయిన స్త్రీవాచకము లగు శబ్దములకు (టిస్థానమున అచోఽన్త్యాది టి' శబ్దమునందుఁ దుది యచ్చు మొదలుకొని చివరివఱ కున్నభాగమునకు టి యని సంజ్ఞ) అ, ఇ,ఉ, అనునవి యాదేశములుగా నగును. లచ్చ,లచ్చి,లచ్చు.

## 35. (యుష్మదస్మద్వాచ్యాదితో విసీ[3]).

వ్యా. యుష్మదస్మద్వాచ్యాత్ = యుష్మదర్థమును, అస్మదర్థమును దెలుపునట్టి, ఇతః = ఇదంతము అయిన శబ్దములకు; విసీ = వివర్ణకమును, నివర్ణకము నగును.

---

1,2. అఇఉస్త్రీవిషయాః. ఆం.శ.చిం.సూ.27
అఇఉస్త్రియోఽంతః. ఆం.కౌ.సూ.48.
3. అస్మదితోవిః,యుష్మదితోవిః, ఆం.కౌ.సూ.67, 69.
అస్మద్యుష్మద్వాచ్యాదితోవిసీ,ఆం.శ.చిం.సూ.36
ఇతోవిసీ. వై.చం.త.28

వి. యుష్మదస్మద్వాచ్యా దిదంతాత్పరతో వినివర్ణకౌ
స్తః. నీవు కవివి, నేను కవిని, నీవు హరివి, నేను హరిని ఇత్యాది.

ఇదంత మయిన యుష్మద్విశేషణమునకు 'వి'వర్ణకమును, ఇదంత మయిన యస్మద్విశేషణమునకు ని వర్ణకమును నగును.

నీవు – కవి ఇటు(గవి యుష్మద్విశేషణము ఇదంతము కావున నీ సూత్రముచే వివర్ణకము వచ్చి 'నీవుకవివి' యని యగును. నేను – కవి అనుచో నస్మద్విశేషణ మగుటచే ని వర్ణక మయి నేనుకవిని అని యగును.

బహుత్వమునందు 'లు' వర్ణకముచే నిదంతము లగు శబ్దములుగూడ నుదంతము లగును. కావున బహుత్వమున శబ్ద మిదంతము గామి, నచట వి ని వర్ణకములు రావు. ఇదంతముల కనుటచేతనే యీ యంశము ఏకవచనాంతములకే యవును.

36. ధర్మోత్తమమధ్యమవత్పరేషామ్[1].

వ్యా.పరేషామ్ = ఇతరములకు, ధర్మఉత్తమమధ్యమవత్ = తద్ధర్మార్థములనందలి యుత్తమ పురుష, మధ్యమపరుష ప్రత్యయము లగును.

వి. పరేషామిదంత బహువచనానా మదంతోదంతబుదం
తానా మేకవచనబహువచనానాం చ ధర్మో
త్తమమధ్యమవత్క్రమాత్సుసః పరతో ను వు ము రు
వర్ణకాస్స్యుః. మేము కవులము మీరు సుమతులురు.

యుష్మదస్మద్విశేషణములకు ఇదంతములకు 'వి ని' వర్ణకములు పూర్వసూత్రమున( జెప్ప(బడినవి. కావున నిచ్చట 'పరేషామ్' అన(గా ఇదంతములు కాని యస్మదుష్మ ద్విశేషణములని యర్థమగును. ఇదంతముగాని యస్మద్విశేషణమునకు( దర్ధర్మార్థ మధ్యమపురుషప్రత్యయము వంటి దగును. ఇదంతముగాని యస్మద్విశేషణమునకు( దద్ధర్మార్థకోత్తమ పురుష ప్రత్యయము వంటిదగును.

క్రమముగా నేకవచనమున( దద్ధర్మార్థకమధ్య మోత్తమపురుషైకవచనములును, బహు వచనమున( దద్ధర్మార్థకమధ్యమోత్తమ పురుషబహువచనములు నగు నని గ్రహింపవచ్చును.

---

1. పరేషాంతుగర్మోత్తమమధ్యమవత్. ఆం.శ.చిం.హ.37
మధ్యమోత్తమోయోరదుతాం పునా.ఆం.కౌ.హ.70
. యుష్మదస్మదర్థాత్తత్సుస. వై.చం.త.26

నీవు త్రాత అనుచోట 'త్రాత' అనిదంతమగు యుష్మద్విశేషణము. ఇది యేకవచనాంతము కావున దీనికి మధ్యమపురుషైకవచన మగు'వు'వర్ణకము వచ్చును. నీవు త్రాతవు.

మీరు త్రాతలు అనుచో నిదంత మగు యుష్మద్విశేషణము బహువచనాంత మయినది కావున మధ్యమపురుష బహువచనప్రత్యయము వంటి దగు 'రు' వర్ణకమగును. త్రాతలు + రు అని కాఁగా 'ఉతోఽత్సర్వేషు' అని యత్వ మై త్రాతలరు అని యగును.

నేను 'అన్న' అనుచో, అనిదంత మగు నీ శబ్ద మస్మద్విశేషణము. ఇది ఏకవచనాంతము కావున దీనికి నుత్తమపురుషైకవచన మగు'ను'వర్ణకము వచ్చును. నేను అన్నను అని యగును.

మేము అన్నలు అనుచో ననిదంత మగు నస్మద్విశేషణము బహువచనాంత మయినది గావున నుత్తమపురుషబహువచన మగు 'ము'వర్ణకము వచ్చి అన్నలు + ము అనుచో 'ఉతోఽత్సర్వేషు' అని యత్వ మై అన్నలము అని యగును.

ఇదంతము లగు శబ్దములును బహువచనమున లువర్ణకాంతము లయి యుదంతము లగును. కావున వానికిని ప్రస్తుతసూత్రమునందలి 'పరేషామ్' అను శబ్దముచే గ్రహణము గల్గును. కావున నయ్యవి యుష్మద్విశేషణము లయినచో (మధ్యమపురుషబహువచనము) 'రు' వర్ణకమును, నస్మద్విశేషణము లయినచో (ఉత్తమపురుషబహువచనము) 'ము' వర్ణకమును వచ్చును. మీరు – (కవి) కవులు – కవులరు, మేము కవులు – కవులము.

## 37. న ప్రథమవత్.[1]

వ్యా. ప్రథమవత్ = ప్రథమపురుషకువలె, న = ఉండదు.

వి. ఇదంతబహువచనానాం ప్రథమపురుషబహువచన
ఏద్రూపాణి న స్యుః. మేము కవులమి, మీరు కవులరి
ఇతి న.

ఇదంతశబ్దములు బహువచనాంతములు యుష్మదస్మద్విశేషణము లయినపుడు ప్రథమ పురుషయందువలె నుండ వనియు నందువలనఁ గవులమి కవులరి అని కా దనియు వివృతియందుఁ జెప్పఁబడినది. పూర్వసూత్రమున 'ధర్మోత్తమమధ్యమవ' త్తనుట ననుసరించి యిచటఁ బ్రథమ యనఁగాఁ దద్ధర్మప్రథమపురుషయే యగును. అందు, మి, రి, అనునవి యెందును లేవు. మి, అనునది భూతార్థమున నైన నుత్తమపురుషయందే కాని ప్రథమ పురుష యం దుండదు. కావునఁ బై వివృతిలో మొదటఁ గూడ మేము కవులరి అని రి వర్ణమే

1. బహుషునమధ్యమవత్.అం.శ.వి.హ.38.
బహుషున – అం.కౌ.హ.71

చూపఁబడి యుండె నేమో. ఆ రి వర్ణము గూడ తద్ధర్మార్థమున నుండదు. ఇంక వత్తురు ఇత్యాదిగా 'రు' వర్ణమే యుండును కావున 'కవులురు' అని కాదని యె చూపవలె. 'ఉతోఽత్త'ని అత్వము రాఁగా 'కవులరు'అని యగును. కాఁగా యుష్మద్విశేషణమున కట్టిరూపమె యుండును. గాన నిషేధమవసరము గాదు. ఇంక నస్మద్విశేషణమును మేము గవులరు అని కావలసియుండఁ గా దని నిషేధింప వచ్చును.

యుష్మదస్మద్విశేషణము లగు ఇకారాంతశబ్దముల బహువచన రూపముల కే ప్రత్యయము లగునో పూర్వసూత్రమునందే స్పష్ట మగుట గుర్తింపఁబడినది. కాఁగా దానిని వేఱు చేసి మఱలఁ జెప్పవలసినయవసరము లేదు. ఇంక నట్లు చెప్పె నన్నను నీ సూత్రముచే ననిష్టరూపములకు నవకాశము గల్గుచున్నది. న ప్రథమవత్ అనుటచే (బరిశేషన్యాయముచే మధ్యమోత్తమవత్ అని గ్రహింపవచ్చును. అది పూర్వ సూత్రోక్త విషయము కంటె భిన్నము గానేరదు. దురుక్తికంటెఁ బునరుక్తి యైన నంగీకరించుట కొంతమేలు గావున 'నప్రథమవత్' అను నీ నిషేధము 'మధ్యమోత్తమవత్' అను నంశమును జ్ఞాపకముచేయు ననుకొందము. అయ్యది చెప్ప నవసరము లే దనియు గుర్తింపఁదగును.

## 38. ఉతోఽత్సర్వేషు[1].

వ్యా. సర్వేషు = పూర్వోక్తము లయిన మధ్యమోత్తపురుష ప్రత్యయములు పర మగుచుండఁగా, ఉతః = పూర్వమునందలి హ్రస్వ మయిన యుకారమునకు, అత్ = హ్రస్వ మయిన యకార మాదేశ మగును.

వి. నుమువురుషు పరేషు డుల్వాదీనాముకారస్య అకార
స్స్యాత్. నేను ఘనుఁడను, మేము ఘనులము; నీవు ఘనుఁడవు,
మీరు బంధులరు, మేము కవులము, మీరు మహాకవులరు,
నేను నియంతృఁడను, నీవు విధాతృఁడవు, మీరు
నియంతృలరు, మీరు విధాతృలరు.

నుమువురుప్రత్యయములు పర మగుచుండఁగాఁ బూర్వమునందలి, యుష్మదస్మ ద్విశేషణముల తుదియుకార స్థానమున నత్వము వచ్చును.

**దేవుఁ + డు + వు = దేవుఁడవు, భక్తుఁడు + ను = భక్తుఁడను, దేవతలు + రు = దేవతలరు, భక్తులు + రు = భక్తులరు.**

---

1. ఉతోఽచ్చసర్వేషు. ఆం.శ.చిం.హ.39
ఉతోఽదంత్యానాంనుమువురుషు. ఆం.కౌ.హ.73
యుష్మదస్మదర్థవ్యతత్పుసి.వై.చం.త.27

ఋకారాంతశబ్దములను గూర్చి వివృతి నియంతృఁడు, నియంతృలు అనునవి చూపినది. అవి యీ వ్యాకరణము ననుసరించి సాధ్యములె యైనను గవి ప్రయోగములు నితర ప్రామాణిక వ్యాకరణముల ననుసరించి నియంత యని యిది యదంతము మాత్రమె యగును.

## 39. అస్మద్వదాత్మనః.

వ్యా. ఆత్మన = ఆత్మార్థముయొక్క విశేషణమునకు, అస్మద్వత్ = అస్మద్విశేషణమునకువలెఁ బ్రత్యయము లగును.

వి. ఆత్మన్ శబ్దవాచ్యేదంతస్య ఏకవచనబహువచన
యోః అస్మచ్ఛబ్దవాచ్యేదంతవద్రూపాణి స్యుః.
తాను కవిని, తాము కవులము, తాను ఘనుఁడను,
తాము ధన్యులము ఇత్యాది.

తాను, తాము అనువానికి విశేషణము లయిన శబ్దములకు, నేను, మేము అనువానికి విశేషణము లయిన శబ్దములకు వలెఁ బ్రత్యయము లగును.

నేను - కవిని - తాను కవిని, నేను భక్తుఁడను - తాను భక్తుఁడను, మేము కవులము - తాము భక్తులము.

ఇదంతముల, యేకవబహువచనముల కని వివృతియందుఁ జెప్పఁబడినది. కాని యనిదంతములకు సైత మస్మద్విశేషణములకువలెనె యగును. తాను గవిని అని యయినట్లుగనె తాను భక్తుఁడను అనియు నగు ననుట సక్రమమె. కావున నిదంతములకు ననిదంతములకు ననువివక్ష సేయక ఆత్మన్విశేషణముల కస్మద్విశేషణములకువలె నా యాప్రత్యయములు లగునని సాధారణముగ సూత్రార్థము నెన్నఁదగును.

నేను గవిని, మేము కవులము, అన్నట్లుగా, తానుగవిని, తాము కవులము అనుతీరుగా వాక్యము ప్రయోగింపఁబడుట గానరాదు. అయినను, తాను గవి నని చెప్పును. తాము ఘనుల మనుకొందురు. అనువాట్ల నీ ప్రత్యయముల స్థితి కాననగును. కాని పైనున్న యనుకరణమును బట్టి తాను "(నేను) కవిని' అని చెప్పును, తాము (మేము) 'ఘనులము' అనుకొందురు. అను తీరుగా నీయవి యస్మద్విశేషణములే యవుట గుర్తింపవలసి యున్నది.

## 40. లడ్వర్తమానే.

వ్యా. వార్తమానే = వర్తమానార్థ మందు ధాతువునకు, లట్ = లట్ అను ప్రత్యయ మగును.

వి. సర్వేషాం క్రియాపదానాం వర్తమానకాలే (లట్ స్యాత్).

వర్తమానార్థమునందు ధాతువునకుఁ బరముగా లట్ అను ప్రత్యయము వచ్చును.

లట్టులో టకార మిత్తు. అకార ముచ్చారణార్థము లకారము మాత్రమె మిగులును. (మా.క్రి..32)

## 41. లటశ్శు చుప్[1].

వ్యా. లటః = లట్టునకు, శుచుప్ = శుచుప్ అను ప్రత్యయ మగును.

వి.(టలః) శుచుప్ స్యాత్ శకారపకారయోరిత్సంజ్ఞా.

కనుచు, చూచుచు, ఇచ్చుచు - ఇత్యాది.

'లడ్వర్తమానే' యను సూత్రముచే నయిన లట్టు స్థానమున 'శుచుప్' అను ప్రత్యయము వచ్చును.'శుచుప్' అనుదానిలో శకారమును పకారమును నిత్తులు కావున నవి లోపింపఁగా (ఉచు) వర్ణము మాత్రమె నిలుచును. ఉత్వము ప్రత్యేకముగా విధింపఁబడిన దనఁదగు ధాతువు లీవ్యాకరణమున హలంతములుగాఁ జెప్పఁబడినవి గావున ధాతువునకు - 'లడ్వర్తమానే' లట్టురాఁగా ఇచ్చి + ల్ ప్రస్తుతసూత్రముచే లడ్లకారస్థానమున ఉచు ప్రత్యయము నిలిచి ఇచ్ + ఉచు = ఇచ్చుచు అని యయ్యె. సంకీర్ణములలోఁ బరిగణింపఁబడిన లడంతమును శత్రర్థకముగాఁ బ్రసిద్ధమైనది. రెండు నిదియ యగు నేమో పరిశీలింపవలె. (మా.క్రి.33)

ఈ సూత్రముల కిటఁ బ్రసక్తి చింత్యము.

## 42. నణ్నిటౌ లిట్ప్రతిషేధయోః[2].

వ్యా. లిట్, ప్రతిషేధయోః = లిడర్థమునను, ప్రతిషేధార్థమునను, క్రమముగా, నట్, నిటౌ = నట్, నిట్, అను ప్రత్యయములు వచ్చును.

వి. కర్మధారయసమాసే భూతార్థాప్రతిషేధార్థయో
ర్ధాతోః పరతో నట్ప్రత్యయో నిట్ప్రత్యయశ్చ క్రమాత్
స్తః కర్తృపదేషు పరేషు - వచ్చినచుట్టము, కూడినమగఁడు,
కనని తండ్రి, రానిరాజు ఇత్యాది.

---

1. చుర్లటి. ఆం.కౌ.హ.66
మరితి క్రియాపదానాం సర్వేషాంవర్తమానకాలే స్యాత్. ఆం.శ.చిం.హ.30.
వర్తమానే చుః. వై.చం.తి.4.
2. నోలిటః, విః ప్రతిషేధస్య. ఆం.కౌ.హ.75,74.
భూతార్థానాంయనః క్రియాణాంస్యాత్.ఆం.శ.చిం.హ.32
ప్రతిషేధవాచినాంవిః. ఆం.శ.చిం.హ.31 వ్యతిరేకేనిః, భూతేనః. వై.చం.కృ.28, 29, అని (నని).
త్రి.శ.9.32.

భూతార్థమునందు ధాతువునకు (విశేషణత్వమున) 'నట్' అను ప్రత్యయమును, ప్రతిషేధార్థమున 'నిట్' అను ప్రత్యయమును వచ్చును. నట్, నిట్; అనువానిలో టకారము లిత్తులు. కావున, న, ని వర్ణములే నిలుచును.

వివృతియందు కర్మధారయ సమాసములందుఁ గర్తృపదము పర మగుచుండఁగా నగు నని విశేషము వివరింపఁబడినది. విశేషణత్వమును బేర్కొనుట ఫలముగా గ్రహింపఁదగును.

వచ్చిన చుట్టము, రానిరాజు.

వి. "కర్తృత్వప్రథమానాస్త(స్తు)ద్వదితివక్తవ్యః"[1]

సంస్కృతవత్కర్మాదేః, కర్తృత్వప్రథమా, నవర్ణకా

స్స్యురితి వృత్తికారాః, నీవు బహుమాన మందిన

రాజు, నీవుపగతుల వధించిన ఖడ్గము, నేను

దేవుని సేవించినచోటు, నీవు వాలిని జంపిన బాణము' ఇత్యాది.

వ్యా. గర్తృత్వవివక్షలోఁ గర్మ మొదలగువానికిఁ గర్తృత్వమును, అప్పుట్టున వానికిఁ బ్రథమావిభక్తియు, (భూతార్థక) ధాతుజవిశేషణమునకు నవర్ణకమును వచ్చును. ఇవి వివృతికారుని మతముగాఁ జెప్పఁబడినది. ఇతఁ డెవరో స్పష్టము గాదు.

కర్మాదులకుఁ బ్రాధాన్యమును వివక్షించినపుడు కర్తతోవలె కర్మాదులతోను ధాతుజవిశేషణ రూపములు న వర్ణకాద్యంతము లై యుండును.

ఖడ్గముతో వధించితివి, బాణముతోఁ జంపితివి అనుచోట్ల ఖడ్గము, బాణము, కరణములు. దీనికిఁ బ్రాధాన్యమునఁ బ్రథమావిభక్తి యయి, వధించిన ఖడ్గము, చంపిన బాణము అని యైనది.

చోటన వసించితిని అనుచో నధికరణము వసించిన చోటు అని దానికిఁ బ్రాధాన్యమున రూపము.

రాజువేత (నీవు బహుమానము) అందితివి అనుచో గ్రహ్యాదియోగజం బగు పంచమికిఁ దృతీయ యైనది. (నీవు బహుమానము) అందినరాజు అని ప్రాధాన్యమున రూపము.

ఇట్లే వధింపని ఖడ్గము, చంపెడు బాణము, వసింపఁగలచోటు మొ॥

---

1. తస్యకర్తృ త్వేపథమానశ్చేతి వక్తవ్యమ్. ఆం.కౌ.హ.76.
కర్మాదేః కర్తృత్వం ప్రథమాచన వర్ణకశ్చతద్వత్ స్యాత్. ఆం.శ.చిం.హ.33.

## 43. నిర్వా డుజంతస్య.

వ్యా. డుజంతస్య = ప్రథమైకవచనమున డుజ్వర్ణకము చేరుశబ్దములకు - అనఁగా డుమంతములకు, వా = వికల్పముగా, నిః = ని ప్రత్యయ మగును.

వి. డుజంతస్య మహత్షష్ఠీతత్పురుషసమాసే
నిప్రత్యయో వికల్పేన స్యాదేకవచనే - రాముని
కొడుకు, గురునిపత్ని, రాముకొడుకు, గురుపత్ని,
సవితృనికొడుకు, సవితృకొడుకు ఇత్యాది.
వికల్పస్య భాస్కరరామాయణే - "ఏ జనకాత్మజన్
దశరథేశ్వరుకోడల రాముభార్యఁ జూం డో జను
లారా" ఇత్యాది.

షష్ఠీతత్పురుష సమాసమునందు డుమంతము లగు శబ్దములకు విల్పముగా ని వర్ణక మగు నని సూత్రాభిప్రాయము. రామునిబాణము ని వర్ణకము రాని పక్షమున రాముబాణము దశరథేశ్వరుకోడల, రాముభార్య యని కవిప్రయోగము.

'సేనేర్వా లుక్' అను సూత్రము సమాసమున వికల్పముగా ని లోపమును బ్రస్తావించినది. దానిచేత నే రాముభార్య మొద లయిన రూపములు సాధ్యము లగుచున్నవి. అసలు 'న టాదౌ నిః కన్వస్య' (అజంత. 40) యను లక్షణమును బట్టి ని వర్ణకము పాక్షిక మగుటయే చెప్పఁబడుటచే 'సే నే ర్వా లుక్' అనునదే యవసర మగుట లేదు. రాముని(యొక్క) భార్య రామునిభార్య కాఁగాఁ గణ్వమతానుసారముగా నున్న రాము (యొక్క) భార్య' యనునది సిద్ధమైనది. మరల నిట 'నిర్వా'యని చెప్పుట వ్యర్థమే. కాక సమాసములం దలౌకిక విగ్రహమును, సంస్కృతవిభక్తులకే లోపము నని చెప్పుకొనుచో రామ(+ఙస్) భార్యా(సు) అనుచో ప్రస్తుతవిధానమునుబట్టి రామనిభార్య రాముభార్య యగును. ఉత్వ మెట్లు? ఉత్వము నిలిచిన ని వర్ణకము మాత్ర మేల నిలువదు? (ఉత్వమును బ్రత్యయమె) ఇచ్చినక విప్రయోగమునుబట్టి చూడఁగా (దశరథేశ్వరుకోడల రాముభార్య') ని వర్ణకము లేని రూపములను సాధించుటయే యుద్దేశింపఁబడినదా యని సందేహము గల్గును.

ఏ మయినను నీ విధానము వ్యర్థము.

ఈ భాస్కరరామాయణప్రయోగమునే 'సే నే ర్వాలుక్' అను సూత్రమునొద్దను జూపుట గమనింపఁదగును. పెక్కురు లాక్షణికుల గ్రంథములను గలుపుటలో నిట్టి పునరుక్తులు గల్గిన వేమో విచారింపవలె.

## 44. తద్ధితపుమమహతోర్నిత్యమ్.

వ్యా. తద్ధితపుమమహతః = తద్ధితప్రత్యయాంతములును పుంలింగరూపమునం దుండు నమహచ్ఛబ్దములకును, నిః = ని వర్ణకము, నిత్యమ్ = నిత్యముగా నగును.

వి. తద్ధితాంతానాం పుమమహతాం చ షష్ఠీతత్పురుష సమాసే ని ప్రత్యయో నిత్యం స్యాదేకవచనే. మాలవాని కొడుకు, పిండగీనికొడుకు, తిప్పనిమనుమఁడు ఇత్యాది.

తద్ధితాంతములును, డుజంతము లగు నమమచ్ఛబ్దములకును, షష్ఠీతత్పురుషసమాసము నందు ని వర్ణకము నిత్యముగా నగును. 'నిర్వాడుజంతస్య' యను పూర్వసూత్రముచే ని వర్ణకము వికల్పము గావలసి యుండఁగా తద్ధితప్రత్యయాంతాదులకు నిత్య మగుట నీ లక్షణము పేర్కొనుచున్నది.

పిండగీనికొడుకు, నిత్య మనుటచే పిండగీకొడు కనురీతి రూపము లుండవు.

ఈ ని వర్ణక మనుడంతము లగు తెనుఁగు డుమంతములకుఁ ద్వితీయాదివిభక్తులం దన్నింట నిత్యమె. షష్ఠీతత్పురుషమునందా యంశము విశేషముగాఁ జెప్పనవసరము మృగ్యము.

(తద్ధితపుమమహతోర్నిరమః), టాదిషు చ యను సూత్రముచే నీ ని వర్ణక నిత్యస్థితి సాధ్యమె. అలౌకిక విగ్రహమున సంస్కృతవిభక్తులు లోపింపఁజేయుచో మాత్రమె ప్రస్తుతలక్షణము ప్రయోజనవంత మగును. అయ్యె 'సేనేర్వాలుక్' వ్యర్థము. అది మతాంతర మనుకొందమా. తత్పక్షమునఁ దెలుఁగు విభక్తిలోపము.(సూరివిధానము).

## 45. మహాదమహతోర్నాంత్యస్య[1].

వ్యా. మహాదమహతోః = మహత్తులు నమహత్తులు నయిన శబ్దములయొక్క, అంత్యస్య = చివర, నిః = ని వర్ణకము, న = రాదు.

వి. అదిదుదెదంతానా మ్మహతామమహతాం చైకవచనే నిప్రత్యయో న స్యాత్. షష్ఠీతత్పురుష సమాసే – భామకొడుకు. రమణ్ణి మనుమఁడు, వధువుబిడ్డ, ధాతకొడుకు, మాత మను మఁడు, తండ్రికొడుకు, వెజ్జుతమ్ముఁడు, వేల్పురాణి, కన్నె

1. నామహతోనిః. ఆం.కౌ.అ.31.

కొడుకు, కుక్కపిల్ల, పిల్లికూన, ఆవుపాలు, కొండచఱి,
పందికోలు, కొప్పుసొగసు, గిన్నెచందము, పేదసొమ్ము,
ఇంతిచెల్లెలు, ఇత్యాది.

డుజంతములకు షష్ఠీతత్పురుషమున 'ని' వర్ణక మింతకుముందు సూత్రములలోఁ బేర్కొనఁబడినది. కాఁగా నిట డుజంతములు కాని మహత్తులు లేదా యమహత్తులు నైన శబ్దముల కెల్ల షష్ఠీతత్పురుష సమాసమున ని వర్ణకము రా దని సూత్రాభిప్రాయము నెఱ్ఱపలయును. భామయొక్క కొడుకు, భామకొడుకు మొ॥.

ఈ సూత్రము కేవలము వ్యర్థము. పూర్వసూత్రములచే డుజంతములకే ని వర్ణకము విధింపఁబడినది. కావున నడుజంతములకు ని వర్ణక ప్రాప్తియే లేదు. కావున నీ నిషేధ మనవసరము. తృతీయాది విభక్తి పరకత్వమునను ని వర్ణకము డుజంతములకే విహితము. కాన నడుజంతముల కదియు లేదు.

## 46. లస్సర్వత్ర[1].

వ్యా. సర్వత్ర = అన్ని యెడల, లః = లవర్ణము వచ్చును.

వి. డుజంతానాం, తద్ధితాంతానాం, పుమమహతా మదం
తేదంతోదంతైదంతానాం తత్సతజ్జాచ్ఛదేశ్యానామ్
మహతామమహతాం చ తత్పురుషషష్ఠీసమాసే బహు
వచనేషు సర్వత్ర లింగత్రయేఽపి లప్రత్యయ స్స్యాత్.
రాములకొడుకులు; గురులపత్నులు; గురువుల కొడుకులు;
కవులగుంపు; సవితృలరాజు, మాలవాండ్లకొడుకులు,
మిండగీండ్ల కొడుకులు, మిండలకూఁతుండ్లు, కోడండ్ల
కొడుకులు, తిప్పండ్ల మనుమలు, భామల కొడుకులు,
రమణులమాటలు, వధువులబిడ్డలు, ధాతలకొడుకులు ఇత్యాది.

**షష్ఠీతత్పురుష బహువచనసమాసమున నన్నిశబ్దములకును, ల వర్ణము వచ్చును. ఏకవచనమున ని వర్ణము వికల్పముగా వచ్చు. (నిర్వాడుజంతానామ్) శబ్దములకును, నిత్యముగా వచ్చు (తద్ధితపుమమహతోర్నిత్యమ్) శబ్దములకు ననలురాని (మహద**

1. **శబ్ద.34.సూత్రవివృతి ననుసరించి యీవిధి పునరుక్తి యన దగియున్నది.**

మహతోర్నాంత్యస్య) శబ్దములకు నన్నింటికిఁ గూడ బహువచనస్థలమున మాత్రము ల వర్ణము వచ్చును. రాముల(యొక్క) కొడుకులు, భాముల(యొక్క) సొగసులు మొ॥.

తృతీయాదివిభక్తి పరకత్వమునను 'లస్సర్వత్ర' - యను సూత్రముచే ల వర్ణము నిత్యముగనె యగును. ఈ సూత్రము చెప్పకున్నవచ్చు నిబ్బంది యేమియుఁ గాన రాకున్నది. ఇట నలౌకిక విగ్రహము సంస్కృతవిభక్తిలోపము నన్న రామల కొడుకు అని కావలెనే కాని యుత్వము రా వీలు లేదు.

## 47. ఆద్యాతుల్యా[1].

వ్యా. తెలుఁగున నాయా యర్థములం దాయావిభక్తులు, ఆద్యాతుల్యా = సంస్కృతముతో సమానముగా నగును.

వి. త్రిలింగభాషాయాం సర్వవిభక్తిః సంస్కృతతుల్యా[2] స్యాత్.
విప్రాయ గాం దదాతి - విప్రునికొఱకు గోవు నిచ్చుచున్నాఁడు,
రామం భజతి - రాముని భజించుచున్నాఁడు.
ఇత్యనేన సంస్కృతేయద్యదర్థే యద్యత్తత్తత్ స్యాదిత్యర్థః.

సంస్కృతమునం దేయే యర్థములం దేయే విభక్తు లగునో తెలుఁగుభాషలోను నాయా యర్థములం దాయా విభక్తు లగు నని సూత్రార్థము. ఉదాహరణమునకు కర్మణిద్వితీయా - యని కర్మకు ద్వితీయావిభక్తి సంస్కృతమున నగును. తెలుఁగునను నట్లే రాముని భజించుచున్నాఁడు అని ద్వితీయ యగును. ఇట్లితరవిభక్తు లూహింపఁదగును.

## 48. అన్యోన్యమేకబహుత్వే[3].

వ్యా. ఏకబహుత్వే = ఏకవచనబహువచనములు, అన్యోన్యమ్ = విశేషణ విశేష్యములకుఁ బరస్పరము (మారుట) కలుగును.

వి. అస్మిన్ శాస్త్రే ఏకవచనవిశేష్యస్య బహువచనవిశే
షణం చ, బహువచనవిశేష్యస్య ఏకవచనవిశేషణమిత్య

---

1,2. సర్వవిభక్తిస్సంస్కృతతుల్యేతివాచ్యమ్. ఆం.కౌ. కార.1.
సర్వవిభక్తిస్సంస్కృతతుల్యా. ఆం.శ. విం.హ.40
బహుళం విభక్తి ర్వ్యత్యాస్థానమ్. వై.చం.వి.1
3. బహోరేకత్వం, బహ్వేకస్య. ఆం.కౌ. కా.5,6.
ఏకత్వంబేదకగతబహువచనానాంచదృశ్యతే వికృతౌ. ఆం.శ.విం.హ.42

న్యోస్యం స్తః. నీ కీర్తి విఖ్యాతము లయ్యె, నీ పేరు ప్రఖ్యాతు లయ్యె, నీ చరిత్ర సుప్రసిద్ధములు, నీ గుణంబులు విస్తార మయ్యె, నీ మాటలు ఘన మయ్యె, నీ మహిమలు శ్రేష్ఠ మయ్యె ఇత్యాది.

కొన్నియెడల విశేష్యము బహువచనముం డుండఁగా విశేషణ మేకవచనాంత మగును. విశేష్య మేకవచనాంతము కాఁగా విశేషణము బహువచనాంత మగును.

నీ మహిమలు శ్రేష్ఠ మయ్యె. ఇచట మహిమ లను విశేష్యము బహువచనాంతము కాఁగా 'శ్రేష్ఠము' అని విశేషణ మేకవచనాంత మయినది. పక్షమునం 'దాద్యాతుల్యా' యను సూత్రము ననుసరించి విశేష్యముయొక్క (బహు)వచనమే విశేషణమునకును గాఁగా విశేషణమును బహువచనాంత మయి నీమహిమలు శ్రేష్ఠము లయ్యె.

విశేష్యమేకవచనాంతము కాఁగా విశేషణము బహువచనాంత మగుటయు నిటఁ బ్రస్తావింపఁబడినది.

దానికి వివృతియందుఁ జూపఁబడిన యుదాహృతులు.

నీకీర్తి విఖ్యాతములు లయ్యె, నీపేరు ప్రఖ్యాతు లయ్యె, నీచరిత్ర

సుప్రసిద్ధములు. కాని యిట్టి ప్రయోగములు మృగ్యములు.

మహత్త్వమూహార్థకశబ్ద మమహత్త్వార్థయుక్త మయి యేకవచనాంత మయినపుడు దానివిశేషణమునకు మహత్త్వార్థము కలుగు సందర్భమున బహువచన మగుట గుర్తింపవచ్చును.

గర్వోన్నతు లగు సురసంఘము, ఘను లగు మునిసముదాయము మొ॥

## 49. తదో వాల ః[1].

వ్యా. తదః = తదన్తక మైన 'త'శబ్దమునకు, వా = వికల్పముగా, అలః = అల అనునది యగును.

వి. దేశ్యేతచ్ఛబ్దస్య వికల్పేన అల స్యాత్. అలరాముఁడు - ఆరాముఁడు, అలసీత - ఆసీత.

తచ్ఛబ్దార్థక మగు 'ఆ' అనుదాని స్థానమున వికల్పముగా 'అల' యనునది యాదేశ

---

1. తదో వాలః. ఆం.కౌ.హ.64

మగును. అలరాముఁడు, అలాదేశము లేనిపక్షమునం దాశబ్ద మట్లే యుండును గాన 'ఆరాముఁడు.

## 50. లస్య ద్విత్వంచ[1]

వ్యా. లస్య = అల శబ్దమునందలి లకారమునకు, ద్విత్వంచ = ద్విరుక్తి నయిత మగును.

ఏ. అల్లరాముఁడు, అల్లసీత.

'చ' శబ్దముచే నిది వికల్పము. 'తదోవాలః' అనుసూత్రముచే తదర్థకము(ఆ)నకు ఆదేశమయిన 'అల' శబ్దములోని ల కారమునకు వికల్పముగా ద్విత్వము వచ్చును. ద్విత్వము వచ్చినపక్షమునందు అల్ల రాముఁడు, వికల్పము గావున ద్విత్వము రానిపక్షమునందు అలరాముఁ డని యుండు.

అల్ల – (ద్విత్వలోపముతో - అల) అనునది నిర్దేశాత్మక మయిన ప్రత్యేకావ్యయముగాఁ జేర్కొందురు. కాని యీ వ్యాకరణము పెక్కు దేశ్యశబ్దములకువలెనె దీనిని గూడ నాదేశముగ సాధించినది.

ఇతి కారక పరిచ్ఛేదః

ఇది కారక పరిచ్ఛేదము

---

1. ద్విలశ్చ. అం.కౌ.సా.65.

# అథ సమాస పరిచ్ఛేదః

ఇంక సమాసములు పేర్కొనఁబడుచున్నవి.

## 1. ఔపవిభక్తిక వదంతవిధిః.[1]

వ్యా. అంతవిధిః = సమాసమునఁజివరఁగలుగువర్ణవికారములు, ఔపవిభక్తికవత్ = ఔపవిభక్తికములవంటివి.

వి. ఏషాం సమాసానా మంతవిధిః ప్రత్యయాదికార్య మౌపవిభక్తిక వత్ స్యాత్. పూవిలుతుఁడు[2] ఇత్యత్ర తవర్ణః (తు?) పుష్పం చాపో యస్య సః సలువ[3] ఇత్యాది.

టింట్యాదు లగు నౌపవిభక్తికములను బోలుచుఁ దెలుఁగు సమాసముల చివర నాయయి వర్ణవికారములు గలుగును. పూవు విల్లుగాఁ గలవాఁడనుచో నేర్పడిన పూవిలు అనుబహువ్రీహి సమాసమునందుఁ జివర 'త' (తు?) వర్ణము సమాసాంత కార్యముగా నీసూత్రముచేఁ జేరఁగా మహత్త్వమును బట్టి యుత్వమును డుజ్జును వచ్చి పూవిలుతుఁ డని యగును.

నాలుగువాయిలు కలవాఁ డనుచో సలువా అనుబహువ్రీహి యందు సమాసాంత మత్వము రాగా 'సలువ' యగును పలకంటి[4] మొ॥.

## 2. విభక్త్యాదేర్లోపః[5].

వ్యా. విభక్త్యాదేః = సమాసమునందు విభక్తి మొదలగువానికి, లోపః = లోప మగును.

వి. సమాసాంగేషు శబ్దేషు విభక్త్యాదీనాం లోపస్స్యాత్[6].

మల్లెమొగ్గలు, తామరపూలు, కలువకంటులు ఇత్యాది.

---

1. కార్యాణౌపవిభక్తకవదంతవిధయశ్చ.ఆం.శ.చిం.హ.44.
తద్వత్కార్యాఅంతవిధయశ్చ ఆం.కౌ.స.2
2. విల్లోస్తుః. వై.చం.స.35,
3. అమంత్యపదస్య. వై.చం.33
4. నోర్లోచనన్యంటిమ్.వై.చం.స.34.
5,6. విభక్త్యాదే స్సమాసాంగేషు లోపః.ఆం.కౌ.స.3
లోపశ్చవిభక్త్యాదేఃశబ్దేషుస్యాత్సమాస కాంగేషు.ఆం.శ.చిం.హ.45.

సమాసావయవము లగు శబ్దములందలి విభక్తులు మొదలగువానికి లోపము గలుగును.

మల్లెయొక్క మొగ్గలు - మల్లెమొగ్గలు, మొ॥

దొంగవలన భయము అనుచో వలన విభక్తి లోపింపఁగా దొంగభయము అని యగును.

ఈ విధానమును బట్టి యిట లోపించు విభక్తులు తెలుఁగునకుఁ జెందినవే యనుటలో బాధ గానరాదు. సమాసపదము సంజ్ఞను జెప్పి యిట సమాస సామాన్యమున విభక్తి లోపము చెప్పుటచే దొంగభయ మిత్యాదులు నిట సిద్ధ మగుచున్నవి.

## 3. ద్విగుకర్మధారయ

### తత్పురుషద్వంద్వబహువ్రీహ్యుపమానోత్తరపదలోపరూపకాః[1].

వ్యా. ద్విగు = ద్విగువు, కర్మధారయ = కర్మధారయము; తత్పురుష = తత్పురుషము; ద్వంద్వ = ద్వంద్వము; బహువ్రీహి = బహువ్రీహి, ఉపమాన = ఉపమితము, ఉత్తరపదలోప = ఉత్తరపదలోపము, రూపకాః = రూపకము అను భేదములతోఁ దెలుఁగున సమాస మెనిమిది విధము లయియున్నది.

వి. అష్టావేతే సమాస భేదాస్స్యుః

1. ద్విగుసమాసో యథాః ఇరువెస, నలువెస ఇత్యాది.
2. కర్మధారయ సమాసో యథాః పండుటాకులు, అలరుటమ్ములు ఇత్యాది.
3. తత్పురుషో యథాః తమ్మిమొగ్గలు, కలువపువ్వులు ఇత్యాది.
4. ద్వంద్వో యథాః తల్లిదండ్రులు, కూరగాయలు ఇత్యాది.
5. బహువ్రీహి ర్యథాః నలువ, ముక్కంటి, ఇత్యాది.
6. ఉపమితసమాసో యథాః కనుఁగవ, మోముదమ్మి ఇత్యాది.
7. ఉత్తరపదలోపసమాసో యథాః పునుగుపిల్లి, జవ్వాదిసెట్టి ఇత్యాది.
8. రూపకసమాసో యథాః తమ్మినెమ్మోము, చిగురుకైదండ? ఇత్యాది.

---

1. ద్విగు తత్పురుష ద్వంద్వ కర్మధారయ బహువ్రీహ్యుపమిత ఉత్తర పదలోప రూపకాది స్సమాసః అం.కౌ.స.1.
ద్విగుకర్మధారయయౌ తత్పురుష ద్వంద్వౌ బహువ్రీహిః
అన్యే చ కేచిదు పమానోత్తరపదలోప రూపకాఖ్యాద్యాః పరిదృశ్యా ఇహ. అం.శ.చిం.హ.43.

సమాస మిట్లు తెలుఁగున నెనిమిదివిధములు. ఉత్తరపదార్థ ప్రధాన మగుతత్పురుషము సమానాధికరణము, వ్యధికరణము నని రెండు విధములు. సమానాధికరణమే – కర్మధారయము.

1. కర్మధారయము – విశేషణమునకు విశేష్యముతోఁ జేయఁబడిన సమాసమునకుఁ గర్మధారయ మని పేరు. చిగురుటాకులు.

2. ద్విగువు : ఈ కర్మధారయమునందు విశేషణ మయినపూర్వపదము సంఖ్యావాచక మయినచో దానికి ద్విగు వని సంజ్ఞ. ఇరుదెస – నలుదెస – ఇందు ఇరు (రెండు) నలు (నాలుగు) అనుపూర్వపదములు సంఖ్యావాచకములు.

3. (తత్పురుషము) వ్యధికరణము – ద్వితీయాదివిభక్త్యంతములకు మీఁదిపదముతో నయిన సమాసము వ్యధికరణము ఇదియే యిచటఁ దత్పురుష మనుపేరితోఁ జెప్పఁబడినది. తమ్మి (యొక్క) మొగ్గలు మొ॥

4. ద్వంద్వము: ఉభయపదార్థము ప్రధానముగాఁ గలిగినది ద్వంద్వసమాసము. తల్లియును దండ్రియును – తల్లిదండ్రులు మొ॥.

5. బహువ్రీహి–బహువ్రీహి యన్యపదార్థము ప్రధాన మగునట్టి సమాసము. నాలుగువాయిలు గలిగినవాఁడు నలువ.

6. ఉపమానము: కర్మధారయసమాసము నందు ఉపమానోపమేయములకుఁ జేయఁబడినవి యుపమితసమాసములు. చిగురువంటి కేలు – చిగురుఁగేలు తమ్మివంటి మోము మోముదమ్మి.

7. ఉత్తరపదలోపము: ఉత్తరపదము లోపించునట్టి సమాసములుఁ గొన్నిగలవు. జవ్వాదిని అమ్ము సెట్టి – ఇందు 'అమ్ము' అను పదము సైతము లోపించి జవ్వాదిసెట్టి అని సమాసరూప మేర్పడును. ఇట్లే గాజులసెట్టి మొ॥

8. రూపకము:

ఇవార్థకములతోడి విగ్రహము గలవి యుపమితసమాసములు గాఁగా నేవార్థకము తోడివిగ్రహము గలవి రూపకసమాసముగా స్థూలముగా గుర్తింపవచ్చును. భాష్యాబ్ధి, యశఃకందళములు మొద లగునవి. భాష్యమేవ అబ్ధిః– భాష్యాబ్ధిః – ఇట్లే తెలుఁగునను మోముదమ్మి వికసించినది మొదలగు స్థలము లందు మోముదమ్మి మున్నగునవి రూపక సమాసములుగా నున్నవి.

## 4. వైకృతస్సమాసకః[1].

వ్యా. వైకృతః = వికృతి పదములతో నేర్పడిన సమాసమునకు, సమాసకః = సమాసకము అని సంజ్ఞ.

### వి. కేవల వికృతిపద సంబంధి సమాస స్సమాసక సంజ్ఞస్స్యాత్.

### కలువనెచ్చెలి, కలుములపొలంతి, విరివంటిదొర ఇత్యాది.

సంస్కృతసమములకంటె వేఱయిన తెలుఁగుశబ్దములకుఁ జేయఁబడిన సమాసమునకు సమాసక మని పేరు. కలుములయొక్క పొలఁతి - కలుముల పొలఁతి మొ॥ ఇదియే యాచ్ఛిక సమాసము.

## 5. ఉభయోర్మిశ్రః[2].

వ్యా. ఉభయః = సంస్కృతసమమును, అచ్చతెనుఁగును గలిసి యున్న సమాసము, మిశ్రః = మిశ్రము అనుసంజ్ఞను బొందును.

### వి. సంస్కృత వైకృతపద మిళిత సమాసో మిశ్రసంజ్ఞ స్స్యాత్.

### కనకపుమేడ, కామునితూపులు సరసపు పలుకులు ఇత్యాది.

ఏ సమాసము నందు సంస్కృతసమమును, ఆచ్ఛికమును మిశ్రమయి యుండునో దానికి మిశ్రసమాస మని పేరు. కామునియొక్క తూపులు కామునితూపులు - ఇందుఁ గాముని (యొక్క) అనునది సంస్కృతసమము కాఁగా తూఁపు లన్నది యాచ్ఛికము. ఇవి రెండును గలిసి యున్నవి. గావున నీ సమాసము మిశ్రము.

## 6. పరిమితమాద్యేయేన.[3].

వ్యా. ఆద్యేయేన = సంస్కృతమునకు సంబంధించినవానితో, పరిమితమ్ = పరిమిత మైన యక్షరములు గలిగిన యచ్చతెనుఁగు శబ్దము మాత్రమే సమసించును.

---

1. వైకృత స్సమాసకః ఆం.కౌ.స.4.
కేవల వికృతిపదై ర్కృతస్సమాసకం తం బ్రువన్తి వాక్యజ్ఞాః. ఆం.శ.చిం.హ.46.
2. ఆం.కౌ.స.5?
సంస్కృత వైకృత శబ్దై ర్మిశ్రస్సమాసస్స ఏవ విజ్ఞేయః. ఆం.శ.చిం.హ.47.
3,4. సంస్కృతేన పరిమితం కర్మాధారయః ఆం.కౌ.స.6.
సంస్కృతపదేన పరిమితమాంధ్రపదం కర్మధారయో భవతి.ఆం.శ.చిం.హ.48.

వి. సంస్కృతసంబంధిపదేన స్వల్పాంధ్రపదం కర్మధార
య సమాసస్స్యాత్ . మేటిమునిదంపతి, గొప్పబ్రహ్మ
దండము, వాఁడి కిరణంబులు, వేఁడి పయోధారలు, ఇత్యాది.

పరిమిత మైన యక్షరములు గల యచ్చతెనుఁగు శబ్దము మాత్రమే సంస్కృతమునకు సంబంధించిన శబ్దముతో ననఁగా సంస్కృతసమముతో (కర్మధారయ) సమాసము నందు నని సూత్రార్థము.

గొప్పబ్రహ్మదండము. అచ్చతెనుఁగు శబ్దము యొక్క యక్షర పరిమితి యిట నిర్దేశింపఁబడలేదు. 'ఆంధ్రంషడ్వర్ణపర్యన్తమ్, పదే భవతి కర్మధారయే' యని వికృతి వివేకమునం దాఱక్షరము లని నియమము చేయఁబడిన లక్షణ మున్న ట్లహోబలుఁడు కవిశిరోభూషణమునఁ బ్రస్తావించెను. (కవిశి.651)

వి. [1]'బహవస్స్వస్వవిభక్తి వికారై స్సమస్యన్తే యథాతథ మితి వాచ్యమ్' - అనేన సంస్కృతాంధ్ర శబ్దాస్సర్వ
విభక్తి వికారై ష్షింట్యాదేశై ర్యథేచ్ఛమల్పానల్ప
రహితా స్సమాసితా స్స్యుః. నవ కనకపుమేడలకాంతి,
చెన్నొందిన వీథుల సొగసు, వాలుఁగంటి, నవమోహ
నంపుటెనరు చూపు ల్వాడితూపుటంపర లెనయ ఇత్యాది.

వ్యా. విభక్తిని నిమిత్తముగాఁ జేసికొని వచ్చిన యాయా వర్ణవికారములతో నెల్లశబ్దములు ననఁగా సంస్కృతసమములు నాచ్ఛికములును యథేష్టముగా సమసించు నని పైకారిక యభిప్రాయము. 'స్వస్వవిభక్తివికారై ర్బహవశ్చ సమస్యన్తే యథాతథమ్' అను ఆం.శ.చిం. లక్షణమె దాదాపు యథాతథముగ నిట వృత్తియందుఁ జెప్పఁబడినది. ఇట్లు చెప్పుటవలన సంస్కృతసమములకు సమేతరములకు సమాసము ధారాళముగా నంగీకరింపఁబడిన ట్లగుచుండఁగా నింతకు ముందు 'పరిమితమాద్యేయేన' యని (సంస్కృతపదేన పరిమితమాంధ్రపదం కర్మధారయో భవతి ఆం.శ.చిం) చెప్పుటలోని యవసరము పరిశీలింపఁదగియున్నది.

---

1. ఇదివృత్తికార వచనముగావచ్చును.
ఆం.కౌ.లోనీవాక్యము యథాతథముగా నున్నది.
స్వస్వ విభక్తివికారై ర్బహవశ్చ యథాతథంసమస్యన్తే ఆం.శ.చిం.మ.49.

## 7. మోః పో వా నోపధస్య[1].

వ్యా.నోపధస్య = నకారము ఉపధగాఁ గలిగిన శబ్దముల యొక్క, మోః = మువర్ణమునకు - వా = వికల్పముగా, పః = పవర్ణము వచ్చును.

వి. నకారోపధస్య మువర్ణకస్య పో వాస్యాత్తత్పురుష సమాసే.

ఇనుము - పెనము = ఇనుపపెనము; మినుము - దోసె = మినుపదోసె; అనుము.

నకార ముపధగాఁ గలిగిన శబ్దముల యొక్క మువర్ణము స్థానమున సమాసము నందు 'ప' వర్ణము వికల్పముగా నాదేశమగునని సూత్రార్థము.

ఇనుము + పెనము - అనుచో నినుము శబ్దము యొక్క మువర్ణమునకు 'ప'వర్ణము రాఁగా ఇనుప పెనము అని యగును.

వా యనుటచే ప వర్ణము రాక 'ఇనుముపెనము' అనియు నుండవలయును. కాని యట్టిరూపములు గానరావు. కాఁగా నిట 'వా' యనుశబ్దమునకుఁ దగిన ప్రయోజనము మృగ్య మై యున్న దని చెప్పఁదగును.

## 8. క్వచి త్తామరాదే రాకౌ

వ్యా. ఆకౌ = ఆకు అను శబ్దము పరముగ నుండఁగా, తామరాదేః = తామర మొదలగు శబ్దములకు, క్వచిత్ = కొన్నియెడల. పః = పవర్ణము వచ్చును.

వి. తత్పురుష సమాసే, ఆకౌ పరే తామరాది గణస్య పః క్వచిత్ స్యాత్. కింత్వం త్యావయవః క్వచిచ్ఛబ్దో వికల్పార్థకః తామరపాకులు, తామరాకులు, తముల పాకులు, తములాకులు, ఆముదపాకులు, ఆముదాకులు సోముదపాకులు (సోముదాకులు?) ఇత్యాది.

'మోః పో వా నోపధస్య' యనుపూర్వసూత్రము నుండి 'పః' అనునది యిట ననువర్తించును. సమాసమునం దాకు శబ్దము పర మగుచుండఁగా తామర మొదలగు శబ్దములకు చివర 'ప' వర్ణము అరుదుగా వచ్చి చేయి నని యర్థము.

---

1. పుంస్యాన్నోర్నోపధస్య.త్రి.శ.8.3.

తామర + ఆకు తామరప + ఆకు అని కాఁగా సంధి య్యై తామరపాకు అని యగును. క్వచిత్తనుటచే పవర్ణము రానిచో తామర + ఆకు అనుచోట సంధియై తామరాకు అని యగును.

'ప' వర్ణమును విధించుటవలన మఱల నపుడు సంధి చేయవలసి వచ్చుచున్నది. అట్లు గాక పకారమునే విధించిన నీ గౌరవము లేకుండెడిది. ఇంకను సత్వమునకు సంధి నిత్య మగుట యిచ్చటి యిం కొక విశేషము.

'తామరాదేః' అనుచోటి యాదిశబ్దముచే తములము, ఆముదము అను శబ్దములందును నీ కార్యమయినట్లు వివృతి యుదాహరించినది. 'తామర' శబ్దమునకు 'ప' వర్ణ మంత్యావయవముగా వచ్చి చేరుచుండఁగా తములము ఆముదము అను శబ్దములలో నంత్యవర్ణమున కాదేశముగా వచ్చుచున్నది. ముపర్ణకాంతము గాక, తముల, ఆముద అను శబ్దము లుండవు గదా. కాక యలౌకికవిగ్రహమును వ్రాసి యందు సంస్కృత విభక్తులకు లోపము చేయు పక్షమున 'ప'వర్ణము తామరశబ్దమునకు వలె వీనికిఁ గూడ నాగమము లయినట్లు చెప్పవచ్చును.

క్వచి త్తనుటచే పవర్ణము రాకుండుటయే తఱుచుగాఁ గలదని చెప్పవలెను. కాని తామరాకు అనుదానివలె వివృతి యుదాహరించిన తములాకు, ఆముదాకు అనురీతివి గానరావు. ఇచట పవర్ణము నిత్యమె యనవలసి యుండును. ఇవి ముపర్ణకమున కగు పుంపులకు సంబంధించిన పకారము లగునెడఁ బుంపులు నిత్యము గావున ఆముదమాకు అనురీతిగాఁ గూడా నుండ నవసరము గానరాదు.

వి. యదాహగౌతమః[1]

సమస్తాని నిత్యయోగేన పదాన్యేవేతి.

గౌతమః = గౌతముఁడు, యత్ = ఏమి ఆహ - చెప్పె ననఁగా.

పదాని = పదములు, నిత్యయోగేన = నిత్యముగు సంబంధముచ్చే సమస్తాని ఏవ ఇతి = కలిసియె (వాక్యముగ) యుండును. అని (గౌతముఁడు పేర్కొనెను.)

ఆకాంక్షాది రూపమైన సంబంధము చేత పదము లఖండవాక్యరూపమున మాత్రమె యర్థబోధకము లగునని గౌతముఁడు పేర్కొనెను. వాక్యమును బద ప్రకృతి ప్రత్యయాదులుగా విభాగింపరాదని యేతన్మతము.

వి. యదాహ కైయటః[2]

1. నిత్యయోగవశాన్యేవసమస్తానీతిగౌతమః త్రి.శ.7.13.
2. ద్వౌశబ్దౌనిత్యయోగేనస్యాదస్యార్థబోధకా

కైయటః = కైయటుడు

యత్ = ఏమి

ఆహ = చెప్పెనుగా

వి. నిత్యయోగేన ద్వౌశబ్దావన్యార్థవిబోధకౌ
ధాతునాయుజ్యేతే. సంస్కృత ద్విరేఫవదితి.[1]

నిత్యయోగేన = నిత్యమగు సంబంధముచేత ద్వౌ శబ్దౌ = రెండు శబ్దములు, అన్యార్థవిబోధకౌ = వేఱొక యర్థమును బోధించునవియై ధాతునా = క్రియతో యుజ్యేతే - అన్వయించును. సంస్కృత ద్విరేఫవత్ = సంస్కృతమగు ద్విరేఫ శబ్దమువలె ఇతి అని కైయటుడు పేర్కొనెను.

నిత్యమైన సంబంధముతోఁగూడిన శబ్దము ఇతరమైన యర్థమును బోధించుచుఁ క్రియతో నన్వయము గలిగి యుండును.

సంస్కృతమందలి ద్విరేఫాదిశబ్దములిట్టివి. 'ద్విరేఫ' అనుచో ద్విశబ్దమొక్కటి రేఫశబ్దమొక్కటి గూడియున్నవి. పరస్పర సంబంధముచే నీ శబ్దములు రెండును గలిసి 'భ్రమర' మను నర్థముతో 'ద్విరేఫస్సంతి' మున్నగు రీతిగాఁ క్రియతో నన్వయము నందుచున్నవి.

వి. యదాహ ప్రభాకరః[2]
ప్రభాకరః ప్రభాకరుడు, యత్ = ఏమి ఆహ = చెప్పెనుగా.

వి. శబ్దధర్మేణార్థస్య వ్యపదేశో యథా[3]
భ్రమర ఇతి -

శబ్దధర్మేణ = శబ్దముయొక్కధర్మముచే అర్థస్య = వాచ్యార్థము యొక్క వ్యపదేశః = తెలుపుట కలుగును. యథా = ఎట్లనగా భ్రమరః = భ్రమరశబ్దము వలె ఇతి అని ప్రాభాకరుల మతము.

భ్రమరాది పద ప్రయోగముచే నిశ్చితరూపమైన శబ్దముయొక్క శక్తి వలన వాచ్యముగా భ్రమరాదిశబ్దములు తుమ్మెద మున్నగు నర్థమును దెలుపుచున్నవి.

---

1. ధాతునాయుజ్యేతే సంస్కృతేవ ద్విరేఫవత్ - యదాహకైయటః - త్రి.శ.7.14.
2,3. శబ్ద ధర్మేణార్థస్య వ్యపదేశో యథా
భ్రమరశబ్దస్య ద్విరేఫవత్వాద్విరేఫో భ్రమర ఇతి ప్రభాకరః. త్రి.శ.7.15.

ద్విరేఫశబ్దము రెండు రేఫలు గల భ్రమరశబ్దమును సూచించుచుఁ దన్మూలమునఁ దుమ్మెదయను నర్థమును లక్షణావ్యాపారముచే నిచ్చుచున్నది.

## 9 సూ. [1]లడాదిలకారై రవ్యయై ర్వినా సమస్యతే (సుబన్తేన) సుబన్తమ్ (ఇతిచ).

లడాదిలకారైః = లట్ మొదలగు లకారములును, అవ్యయైః = అవ్యయములును, వినా = తప్ప మిగిలిన సుబన్తమ్ = ప్రథమాది విభక్త్యంతమగు పదము (సుబన్తేన) = సుబంతముతో; సమస్యతే = సమసించును.

తెలుఁగున దిజంతములకును నవ్యయములకును మీఁది పదముతో సమాసము లేదనియు, సుబంతమునకు సుబంతముతోనె సమాస మగుట తెలుఁగున ఁగానవచ్చు ననియు దీని యభిప్రాయము.

సంస్కృతమున సుపాంసుపాతిజా, నామ్నా, ధాతునాఽథ తిజాంతిజా, సుబన్తే నేతి విజ్ఞేయః సమాసష్షడ్విధోగుణైః' అని తిజంతములకు సుబంతములతోను తిజంతములతోను సమాసము గలదు సుబంతములకు సుబంతముతోను, ఁజంతములతోను, ప్రాతిపదికలతోను ధాతువులతోను, సమాసము గలదు.

అట్టియెడలఁ దెలుఁగున నేర్పడు సమాసములందుఁబూర్వోత్తరపదములు సుబంతములు మాత్రమె యగునుగాని తిజంతములు గాని యవ్యయములు గాని గానేరవని ప్రస్తుత లక్షణము నభిప్రాయము.

వ్రాఁతప్రతిలో నీవాక్యమునకు బిదప 'ఇతిచ' యని యుండుటచే నీవాక్యమును బూర్వవాక్యము వలె ప్రభాకరోక్తముగాఁజెప్పఁబడినట్లర్థమగును. కాని యిది సందర్భానుగుణమె కాక సంస్కృతసంప్రదాయమునకును విరుద్ధమె. కృష్ణవిచక్షణా, జహిజోడః, జహిస్తంబః అనురీతిగా సంస్కృతమునఁదిజంతములకు సుబంతములతో సమాసము గలదు. అవ్యయీభావ సమాసములు ప్రసిద్ధమె కావున నిది తెలుఁగునందలి సమాసమును గూర్చి చెప్పఁబడిన వాక్యమై గావలెను. 'లావ్యయై ర్వినా సుబన్తం సుబన్తేన సమస్యతే'యని యథర్వణుని గ్రంథమునను ష్టుప్ శ్లోకార్థమై యిది త్రిలింగ శబ్దానుశాసన లక్షణమై యున్నది.

ప్రకృతే

ఇంకఁ బ్రకృతమునకు వచ్చిన —

---

1. లావ్యయై ర్వినా సుబన్తం సుబన్తేన సమస్యతే. త్రి.శ.7.16.

## 10. షష్ఠీసమాసో బలవాన్[1].

వ్యా. షష్ఠీసమాసః = తెలుఁగుభాషలో షష్ఠీతత్పురుషము, బలవాన్ = బలీయ మయినది.

వి. ఆంధ్రే షష్ఠీసమాసో బలవాన్ స్యాత్.[2]

ఆంధ్రమునందు సమాసము లన్నింటిలోను షష్ఠీతత్పురుషము బలీయ మని యర్థము. తెలుఁగున షష్ఠీతత్పురుషము ప్రచురము. కొన్ని యితరసమాసములు గూడ షష్ఠీతత్పురుష ములుగా సమన్వయింపఁబడుట కవకాశము గల్గుట, షష్ఠీతత్పురుషము లనఁదగు పదములను బట్టియు దెలుఁగున షష్ఠీతత్పురుషమెంత బలీయమో గుర్తింపవచ్చును.

ఉదాహరణమునకు మాటనేర్పు అనుచోట మాటయందు నేర్పు (మాటయందలినేర్పు) అను సప్తమీ తత్పురుషము. కాని మాటయొక్క నేర్పు మాటనేర్పు అనురీతిగా నిది షష్ఠీ తత్పురుషముగా సమన్వయింపఁదగియున్నది. ఇట్లే దొంగభయము దొంగవలని భయము, దొంగయొక్క భయము, నీప్రాపు నీచేతిప్రాపు నీయొక్కప్రాపు మొ॥

## 11. అన్యే క్వచిత్ క్వచిత్[3].

వ్యా. అన్యే = షష్ఠీతత్పురుషముకంటె నితరము లయిన ద్వితీయా తత్పురుషాదులు గూడ, క్వచిత్ క్వచిత్ = అరుదుగ నుండును.

వి. అన్యే సమాసాః క్వచిత్ క్వచిత్ స్యుః

తెలుఁగుభాషలో షష్ఠీతత్పురుష సమాసములే మిక్కిలి యధికము. అయ్యు ద్వితీయాతత్పురుషాదు లగు నితరసమాసములు నరుదుగ లేకపోలేదు. క్వచిచ్ఛబ్దము రెండు పర్యాయము లుచ్చరించుటలో నయ్యవి మిగుల నరు దగుట స్పష్టము చేయఁబడినట్లు గుర్తింపఁదగును. మఱియు నంతగా నరు దనుట చింత్యము. బహువ్రీహులు తక్కువ. షష్ఠీతరము లగు వ్యధికరణములు నెక్కువయే యనవచ్చును. కాని కర్మధారయములు, ద్వంద్వములు మున్నగునవి కేవల మరు దన్న విధి యని నియమింపలేము గదా.

---

[1,2] షష్ఠీసమాసోబలవానాంధ్రే. త్రి.శ.7.24.

[3] అప్యన్యేక్వచిత్క్వచిత్. త్రి.శ.7.25.

## 12. అన్యంటీ గుణానామ్[1].

వ్యా. గుణానామ్ = గుణవాచకము లగు, నల్లాదిశబ్దములకు, అని అంటీ = అని, అంటి అనునవి యగును.

వి. [2]కర్మధారయసమాసే గుణానా మన్యంటీ స్తః
నల్లని వలువ, నల్లంటివలువ, ఇత్యాది.

కర్మధారయ సమాసమునందు నల్ల మొద లగు గుణవాచక శబ్దములకు అని, అంటి, అనునవి వచ్చునని యర్థము.

నల్ల + వలువ - అనుచో 'అని' అనునది రాఁగా నల్ల + అని సంధి జరిగి నల్లని (వలువ) అని యగును. అంటి యనునది వచ్చినచో నల్ల + అంటి - సంధి యై నల్లంటి (వలువ) అని యగును.

అని, అంటి, అనుచో ముందుగా నకారమును జేర్చుటలోఁ బ్రయోజనము గానరాదు. అనదంతములపై నివి కానరావు. సంధి చేయవలసిన గౌరవమె తప్ప. కావునఁ బ్రక్రియా లాఘవము ననుసరించియును, నంటి, అనువానినే విధింపఁదగును. 'అంటి' అనువానికిఁ గవిప్రయోగములు మృగ్యములు.

నల్లటివాఁ డనురీతిగా వ్యవహారమునందు మాత్రమిది నేటికిని వినిపించుచున్నది.

## 13. యత ఏ

వ్యా. యతః = 'యత్' అనుశబ్దమునకు, ఏ = ఏకారమగును.

వి. యచ్ఛబ్దస్య ఏ స్యాత్ - ఏ.

'యత్' అనుశబ్దము మొత్తముస్థానమున 'ఏ' అనునది యాదేశ మగును. యత్ - ఏ.

## 14. యతానాద్యచాం లోపః.

వ్యా. య,త, అనాది అచాం = యకారము, తకారము, మొదటిది గానియచ్చు - అనువానికి, లోపః = లోప మగును.

వి. యత్తదేతచ్ఛబ్దానాంయకారతకారాణామనా
ద్యచాం లోపస్స్యాత్.

---

1.2. అనిరంటి ర్వ్యగ్రోహితు గుణానాం కర్మధారయే త్రి.శ.7.12.

యత్,తత్,ఏతత్, అనుశబ్దము లందలి యకారమునకును, తకారమునకును, మొదటిది గాని యచ్చునకును లోప మగును.

యత్ - ఇందు యకారతకారములు లోపింపగా - (య్ + అ + త్) అకారము మిగిలియుండును - యత్ - అ.

తత్ - ఇందు 'త'కారములు రెండు లోపింపగా (త్ + అ + త్) అకారము మిగిలియుండును తత్ - అ.

ఏతత్ అనుశబ్దమునందు తకారములు రెండు లోపింపగా (ఏ + త్ + అ + త్ -) ఏ - అ అని మిగులును. ఇందు అకారము మొదటిది గానియచ్చు గావున నదియు నీసూత్రముచే లోపింపగా 'ఏ' అను నొక్కటి మిగులును ఏతత్ - ఏ.

15. అత ఏత్.

వ్యా. అతః = హ్రస్వమయిన అకారమునకు, ఏత్ = ఏకార మగును.

వి. లుప్తయకారస్య ఏ స్యాత్.

వివృతి ననుసరించి 'యత్' శబ్దముయొక్క అకారము స్థానమున 'ఏ'కార మగును.

'యత్' అను శబ్దమున 'యతానాద్యచాం లోపః' అనుసూత్రముచే యకార తకారములు లోపింపగా మిగిలి ఉన్న 'అ'కారము స్థానమున 'ఏ'కార మగును. ఏ -

'యతేః' అనుసూత్రముచే యచ్ఛబ్దమునకు మొత్తమున కేత్వ మొకేపర్యాయము విధింపబడినది. మరల రెండు యకారాదిక మగు ప్రక్రియాధిక్యముతో నిరూపించుట కేవల మనవసరము.

వివృత్తికారుడు (సూ - 20) - అని యంతకు ముందుగూడ నొకసారి యత్కిమర్థమునకు నేత్వము విధింపబడియున్నది

ఐనాశ ఇవి రెండును వ్యాకరణములందలి లక్షణము లగు నేమో.

16. అదతః

వ్యా. అతః = హ్రస్వమయిన అకారమునకు, అత్ = అత్వ మగును.

వి. తకారావశిష్టస్య అకారస్య అత్ స్యాత్ - ఆ.

వివృతి ననుసరించి తచ్ఛబ్దము యొక్క అకారమునకు 'ఆ'కార మాదేశ మగునని సూత్రార్థము.

'తత్' అనుశబ్దమునొ యతానాద్యహాం లోపః' తకారములు లోపింపఁగా మిగిలియున్న హ్రస్వ మయిన యకారము స్థానమున 'అ' అనునది యాదేశ మగు.

'తద ఆ' అను తరువాతిసూత్రము 'తత్' అను శబ్దము మొత్తమున కాత్వమును జెప్పుచున్నది. అట్టి యెడ నిట మఱలఁ దకార లోపాది ప్రసంగము పునరుక్తియే.

## 17. తద ఆ.

వ్యా.తదః = 'తత్' అనుశబ్దమునక్కు ఆ = అకార మగును.

వి. తచ్ఛబ్దస్య ఆ స్యాత్.

'తత్' అనుశబ్దము మొత్తముస్థానమున 'అ' అనునది యాదేశ మగును. తత్ - అ.

ఆత్తతః (తద్ధి20) సూత్రముచే నితః పూర్వమే 'తత్' అనుదాని స్థానమున 'అ' అనునది విధింపఁబడియున్నది. కావున నిట్లు మఱలఁ జెప్పుట పునరుక్తి.

## 18. ఈదేతః.

వ్యా. ఏతః = ఏకారమునకు, ఈత్ = ఈత్వ మగును.

వి. (ఏతద) ఏత ఈత్ స్యాత్ - ఈః.

ఏతచ్ఛబ్దము యొక్క యేకారము స్థానమున నీకార మగును.

'ఏతత్' అనుదానియందు 'యతానాద్యహాం లోపః' అనుసూత్రముచే తకారములు నకారమును లోపింపఁగా 'ఏ'కారము మిగులును. ఆ ఏకారము స్థానమున నీసూత్రముచే 'ఈః'కార మాదేశము గాఁగా 'ఈః' అని యగును.

'ఇదమదసేతవామీత్' (తద్ధి-21) అనుసూత్రముచే ఇదమ్, అదస్, ఏతత్ అను శబ్దములు మూఁడింటికిని 'ఈః' అనునది యాదేశ మగుట చెప్పఁబడియేయున్నది. కావున నిచ్చట తకారాది లోపప్రసంగము కేవలము ప్రక్రియా గౌరవము తోఁ బునరుక్తియే యవుచున్నది.

సమాసవిధిలోఁ గ్రికమును గూర్చి వివరించుట విశేషము. సర్వనామ ప్రకరణమున నుక్త పూర్వము గదా.

"ఇతి సమాసపరిచ్ఛేదః"

ఇది సమాసపరిచ్ఛేదము

---

ఇట వ్రాతప్రతిలో 'తత్సమప్రక్రియా' యని యున్నది తత్సమపరిచ్ఛేద మిందుఁ గానరాదు సర్వనామ తద్ధిత, ఏకపదవిధి, కారకము లింతకుముందు చెప్పఁబడినవి. ఇది సమాసప్రకరణము. కాన నిటఁ దత్సమ ప్రక్రియ' యనుట వింత. ఆం.శ.చిం.లో అజంతహలంతప్రకరణములలోనే కారక సమాసములును చెప్పఁబడుట గమనార్హము.

# అథతద్భవపరిచ్ఛేదః

## 1. ఆదిహలో వద్వ్యతోర్లుగ్ ద్వ్యౌతౌ.

వ్యా. ఆదిహలః = శబ్దము మొదటి హల్లునకుఁ బరముగా నున్న (సంయుక్తమై యున్న) వ-ద్వి-అతోః = వకారమునకును, హ్రస్వదీర్ఘము లయిన అకారములకును, లుక్ = లోపమును, ద్వి + ఔతౌ = హ్రస్వదీర్ఘము లయిన ఒకారమును వచ్చును.

పదాదిహలః పరయోః వకార ద్వివిధాతోర్లుగ్ ద్వివిధౌకారౌ క్రమాత్ స్తః. ద్వివిధాత్-అకారాకారౌ. ద్వివిధౌత్ ఒకారౌ హ్రస్వదీర్ఘౌ.

శబ్దమునందలి మొదటిహల్లునకుఁ బరముగా నున్న వకారమునకు లోపము వచ్చును. ఆ వకారమునకుఁ బైనున్న అ, ఆ లస్థానమున ఒ, ఓ లాదేశ మగును. స్వర- స్వ్ అ- అనుచో వకారమునకు లోపమై, హ్రస్వ మగు సకారమునకు హ్రస్వ మగు ఒకారము రాఁగా స్ + ఒ -సొ-సొరము అని యగును. ద్వార - అనుచో (ద్ + వ్ + ఆ) వకారము లోపింపఁగా ఆకారము దీర్ఘము గావున దానికి దీర్ఘమగు 'ఓ'కారము వచ్చి ద్ + ఓ - దోరము అని యగును. ఉదాహరణములు వివృతియం దింకను గమనింపఁదగు.

వి. స్వరః - సొరము, జ్వరము-జొరము, ద్వారక-దోరక, ద్వయం-దొయము, ధ్వనిః - దొని, ధ్వానః-దోనము, ద్వారం- దోరము, ద్వియ-దొయ, స్వయం-సొయము, స్వధా - సొధ, త్వరా-తొర, స్వాతి-సోతి, స్వప్నః - సొప్పనము, స్వర్ణం-సొర్ణము, (సొన్ను హొన్ను-హొన్నుశబ్దః కన్నడభాషాయాం) త్వష్టా-తొష్ట-స్వాహా-సోహా. ఇత్యాది.

## 2. లానః.

వ్యా. లః = లకారమునకు, వా = వికల్పముగా, నః = నకార మగును.

వి. తజ్జదేశ్యయోరేకపదే లస్య వా న స్స్యాత్ క్వచిత్ స్థలేషు. తెలుఁగు- తెనుఁగు, పులుగు-పునుగు వెలుగు - వెనుగు, తలుపు-తనుపు, పొలఁకువ - పొనఁకువ, తొలపు - తొనపు ఇత్యాది.

తద్భవ దేశ్య శబ్దము లందలి లకారము యొక్క స్థానమున వికల్పముగా నకార మగును. తెలుఁగు - తెనుఁగు, వా యనుటచే నకారము రానిపక్షమునందు తెలుఁగు అని లకార మట్లే యుండును.

వెనుగు (వెలుగు) తనుపు(తలుపు) ఇత్యాదులు మృగ్యములు. లకారమునకు నకారమగుట కొన్నియెడలనే యని వా శబ్దమునకు వ్యవస్థ చేసికొనఁదగును.

వి. త్రిలింగ ఇతి స్థితే -. త్రిలింగ శబ్దమునందు

## 3.ఉభయత్ర రవలామ్[1].

వ్యా. ఉభయత్ర. సంయుక్తాక్షరములో ముందు గాని వెనుక గానియున్న, రవలామ్ = రేఫము, వకారము, లకారములకు లోప మగును.

వి. సంయోగే పురతః పశ్చాద్వా ఉచ్చార్యమాణానాం రవలాం లోపస్స్యాత్ ఇత్యనేన రేఫస్య లోపే త్రిలింగ ఇతి స్థితే.

సంయుక్త మైనస్థితిలోఁ బూర్వవర్ణముగాఁ గాని లేక పరవర్ణముగాఁ గాని యున్న రేఫ వకార లకారములకు లోప మగును.

త్రిలింగ అను శబ్దమున త్రి అనుచో తకార రేఫలు సంయుక్తములై యున్నవి. ఇందు రెండవహల్లుగా నున్న రేఫమున కీ సూత్రముచే లోపము రాఁగా తిలింగ అని యగును.

వి. [2]ఉభయత్ర రవలామితి. కర్మార- కమ్మర.
ధర్మః- దమ్మము. వేత్రమ్-బెత్తము. ద్రభమ్-
డబ్బు, ఈశ్వరః- ఈసరుఁడు. విశ్వాసః-
విస్వాసము. ఉల్బణః- ఉబ్బణము, స్వల్పమ్-
సొప్పము ఇత్యాది.

కర్మార-కమ్మర, ధర్మ-దమ్మము. ఇట ముం దున్న రేఫ లోపించినది. వేత్రమ్-బెత్తము, ద్రభమ్- డబ్బు. ఇట దరువాత నున్న రేఫ లోపించినది.

ఈశ్వరః-ఈసరుఁడు, విశ్వాసః- విస్వాసము. ఇట మీఁద నున్న వకారము లోపించినది.

ఉల్బణం, -ఉబ్బణము, -స్వల్పమ్-సొప్పము. ఇట మీఁదనున్న లకారము లోపించినది.

---

1. లవరామధశ్చ. వా.1.4.50.
   రవలామధశ్చ - బృహస్పతిసూత్రము. (త్రి.శ.అనుబంధము)
2. యుదాహరణములు
   యుక్తన్యవికర్షః తద్భ. 22 సూత్రము నొర్దవ్రాఁత ప్రతిలోఁ జూపఁబడియున్నవి. స్పష్టతకై యిట దేఁబడినది.

## 4. ఇణ ఏజ్?[1].

వ్యా. ఇణః = ఇ ఉలకు, ఏజ్ = ఏకారమును ఓకారము నగును.

వి. తద్భవ పదాద్యేకారోకారయో రేకారౌకారౌ స్తః.
ఇత్యనేన తెలింగ ఇతి స్థితే.

ఇణ్ అను ప్రత్యాహారముచే (ఇఉణ్) ఇకారమును ఉకారమును బోధింపఁబడును. పదము మొదటనున్న ఇకారముయొక్క స్థానమున 'ఎ'కారమును, ఉకారముయొక్క స్థానమున ఒకారము నగును. (ఇ-ఎ, ఈ-ఏ, ఉ-ఒ, ఊ-ఓ) 'ఉభయత్ర రవలామ్' అని రేఫము లోపింపఁగా మిగిలియున్న 'తిలింగ' అనుశబ్దమున మొట్టమొదటి యికారమున కీ సూత్రముచే నెత్వము రాఁగా తెలింగ అని అగును.

దిశ-దెస, దివసము - దెవసము మొ॥ చో నిత్వమున కెత్వము. కులము-కొలము. తువరః - తొవరము మొదలగుచోట్ల నుత్వమున కొత్వము. (చూ.7.సూ.వివృతి.)

పూగ-పోక. ఊకారమున కోకారము.

## 5. ఉదితః.

వ్యా. ఇతః = హ్రస్వ మయినయికారమునకు, ఉత్ = హ్రస్వ మయిన యుకార మగును.

వి. తద్భవే ఇకారస్య ఉత్ స్యాత్ అనాదౌ క్వచిత్ స్థలే.
ఇత్యనేన లివర్ణ స్యేకారస్య ఉత్వే కృతే తెలుంగ ఇతి స్థితే.

వివృతి ననుసరించి శబ్దమునందు మొదటిది గాని హ్రస్వ మయిన యికారము యొక్క స్థానమున హ్రస్వ మయిన యుకార మగును. తెలింగ అను శబ్దమున లి వర్ణమునందలి యికారమున కుత్వము వచ్చి తెలుంగ అని యగును

పిదప-

---

1. ఇణఏచ్. ఆం.కౌ.అ.84.

## 6. ఉదతస్సౌ.

వ్యా. సౌ = సువిభక్తి పరముగా నుండఁగా, అతః = నామము తుది యత్వమునకు, ఉత్ = ఉత్వ మగును.

వి. తద్భవే మహదమహతోః పదాంతస్య అకారస్య ఉత్ స్యాత్ సౌ పరే. తెలుంగు, ముప్రత్యయస్యాపవాదః అలోన్త్యస్యేత్యన్త్యస్య. -సౌ పరే-

'సు' అనునది ప్రథమావిభక్తి యేకవచనము. అది పర మగుచుండఁగా మహత్తు గాని యమహత్తు గాని యైన తద్భవప్రాతిపదికము తుది యత్వము యొక్క స్థానమున నుత్వ మగును.

తెలుంగ- అను శబ్దముపైఁ బ్రథమావిభక్తి యేక వచనమును వివక్షింపఁగా సూ ప్రత్య మయి తెలుంగ + సు అని యుండఁగాఁ బ్రస్తుతసూత్రముచే నత్వమున కుత్వ మయి తెలుంగు అని యగును.

'అతః' అని స్థానము నిర్దేశింపఁబడుటచే 'అలోన్త్యస్య' అనుదాని నిటఁ బ్రస్తావించుట యవసరము గాదు.

తెలుఁగులు, తెలుఁగులందు అనుతీరుగా నీ యుత్వ మెల్లవిభక్తుల నగును. 'నిత్యస్తుపి'- ఇది ముప్రత్యయమున కపవాద మనుట విచార్యము.

ములతః - ముల్ అదంతములకు వచ్చును. ఇట ఉత్వవిధానముచే నిది యుదంత మైనది గాన ముప్రత్యయము రా దని యుద్దేశ్య మో.

## 7. సోర్లోపః.

వ్యాః సోః = సుప్రత్యయమునకు, లోపః = లోప మగును.

వి. ఇత్యుభయత్రాపి సులోపః.

మహదమహత్తుల కెల్ల సులోపమగును.

తెలుఁగు + సు అనుచోటి సువిభక్తి యీ సూత్రముచే లోపింపఁగా తెలుంగు అను ప్రథమైకవచనాంతరూప మేర్పడును.

## 7. బిన్దోరర్ధత్వమ్.

వ్యా. బిన్దోః = పూర్ణబిందువునకు, అర్ధత్వమ్ = అర్ధబిందు వగుదు.

వి. తద్భవే పూర్ణబిన్దోరర్ధత్వం స్యాత్. తెలుఁగు - తెలుంగు, దిశ-దెస, దివసః - దెవసము, దినపర్యాయః ఇత్యాది. గుణము - గొనము, కులము-కొలము, తువరః-తొవరము తుండా-తొండము ఇత్యాది.

తద్భవములలో నిండుసున్న కఱసున్న యగును. 'తెలుంగు' అనుచోటి నిండుసున్న కీ సూత్రముచే నఱసున్న రాఁగా 'తెలుఁగు' అని యేర్పడును. అర్ధబిందువగుట వికల్ప మని గ్రహింపవలయును. కావున నఱసున్న రాని పక్షమునందు నిండుసున్న యట్లే యుండఁగా 'తెలుంగు' అను రూపము నుండును.

దిశ-దెస మొదలగు నీ సూత్రము క్రింది వివరణమునకుఁ బ్రస్తుతలక్షణముతో నెట్టి సంబంధమును లేదు. 'తెలుఁగు' శబ్ద ప్రక్రియ నారంభించుటచే 'ఇణఏజ్' అను సూత్రము నొద్ద వే ఉదాహరణములు చూపఁబడలేదు. ఇవి యా సూత్రమున కుదాహరణములు.

## 8. క్వచిన్నోలః.

వ్యా. క్వచిత్ = కొన్నియెడల, నః = నకారమునకు, లః = లకార మగును.

వి. క్వచిత్స్థలేషు తద్భవ(త్సమ)పదేషు నస్య లస్స్యాత్. రావణుఁడు - రావలుఁడు, జన్మము - జల్మము, మన్మథుఁడు - మల్మథుఁడు, నణ(రల)యో రభేదాత్ ఇత్యాది.

కొన్నియెడలఁ దద్భవములందు నకార స్థానమున లకార మగు నని సూత్రార్థము.

ఉదాః- జన్మము-జల్మము.

రావలుఁడు, మల్మథుఁడు అనురీతిగా వివృతియందుఁ జూపఁబడిన రూపములు మృగ్యములు. రావ(ణు)లుఁడు అనుచో ణకారమునకు లకార మయినది. నణల కభేద మని రావణశబ్దమున ణకారమునకును లకార మైన దని వివృతి యభిప్రాయము గ్రహింపఁదగును.

'తత్సమపదేషు' అని వివృతి యం దున్నది. జల్మ మనురీతిలో కవ్యవహారమునందుఁ గన్పించుస్థలములను దత్సమము లనుట కంటెను బ్రస్తుత ప్రకరణమును బట్టియుఁ దద్భవ మనుట మే లని తోఁచు. ఇది యుచ్చారణలోని విలక్షణత్వమె కాని కావ్యప్రయోగము లందు మృగ్యము.

## 9. కగచజతదపయవానా మనాదౌ కాత్యాయనస్య.

వ్యా. కాత్యాయనస్య = కాత్యాయనుని మతమునందు, అనాదౌ = మొదటఁగాక యున్న, కగచజతదప యవానామ్ = క,గ,చ,జ,త,ద,ప,య,వ, వర్ణములకు లోప మగును.

వి. అనంతరయుక్తానా మనాదౌ వర్తమానానాం కాదీనాం లోప స్స్యాత్ -

శబ్దమునందు మొదట నున్నవి కానట్టి కకారాదులకు తద్భవములందు లోప మగునని కాత్యాయనుని మతము. మకిల- మఇల మొ॥

వి. కశ్మలమిత్యత్ర-

'కశ్మల' అను శబ్దమున-

## 10. [1] కగటడతదప ≍ క ≍ పశోరుపర్య ద్రే.

వి. సంయుక్త పరతస్థితానాం కాదీనాం జిహ్వామూలీయో పధ్మానీయయోశ్చ శషసాం చ లోపస్స్యాదద్రశబ్దే ఇత్య నేన సూత్రేణ కమలమితి స్థితే.

వ్యా. అద్రే = 'ద్ర' కంటెవేఱయిన, ఉపరి = సంయుక్తాక్షరమున మీఁద నున్న, కగటడతదప ≍క≍ పశోః = క,గ,ట,త,ద,ప,లకును జిహ్వామూలీయమునకును, ఉపధ్మానీయమునకును, శషసలకును లోపము వచ్చును.

సంయుక్తము లయియున్న హల్లులలో మొదటి ది కాని కకారాదులకు లోప మగును. ద్రవర్ణమునందు మాత్రము గల్గదు.

'కశ్మల' అను శబ్దమునం దీ సూత్రముచే శకారమునకు లోపము రాఁగా 'కమల' అని యగును.

శషసాశ్శుః అని శషసలకు శు అని ప్రాకృతీయసంజ్ఞ.

దీని యుదాహరణములు అయుక్తస్య రిరూ. తద్భ.26. సూత్రమునందు వివృతిలోఁ జూపబడినవి.

---

1. కగటడతదపష్లకగ పశోరుపర్యద్రే. (హె.1.4.66)
ఇది బృహస్పతి సూత్రము గాను త్రి.శ.కనుబంధములోఁ జూపఁబడినది.

వి. క్షిదతః ఇత్యనేన
కకారస్య ఇకారే కృతే మకిల ఇతి స్థితే.
కగచజ సూత్రేణ కకారస్య లోపే మఇల ఇతి స్థితే.

హ్రస్వ మయిన యకారముయొక్క స్థానమున నిత్వ మాదేశ మగును.

ఇత్వ మయి 'మకిల' అని యగు నని వివృతి యందుఁ జూపఁబడినది. ముందు 'మకల' అని యుండవలె 'కశ్మల' అను శబ్దమునందు 'కగటడ' మొదలగు పూర్వ సూత్రముచే శకారము లోపించిన 'కమల' యని యగును. ఇది మకల యని కావలయు నన్న వ్యత్యయము రావలయును. అప్పుడు మకల అనికాగా నిత్వమయి మకిల యని యగును. పిదప 'కగచజ తదపయవానామనాదౌ కాత్యాయనస్య' (తద్భ.10) యను - సూత్రముచే కకారము లోపింపఁగా మఇల అని యగును.

## 11. యశ్రుతిరచ్.[1]

వ్యా. అచ్ = అచ్చు, యశ్రుతిః = యకారము వంటి శ్రుతికలిగిన దగును. అనఁగా ముందు యకారము చేరు నని యర్థము.

వి. హల్లోపావశిష్టాచః యశ్శ్రుతిస్స్యాత్. అనేన సూత్రేణ
అవిశిష్టేకారస్య యశ్రుతౌ సత్యాం మయిల ఇతి స్థితమ్.
మరిచమ్ - అకారస్య ఇకారః, చకారలోపః, యశ్రుతిః-
మిరియము. వచనమ్ - వయనము, మదనమ్ - మయనము,
ప్రయాణమ్-పయనము, కవి-కయి, ప్రవాళః - పవడము.

ముందటి హల్లు లోపింపఁగా మిగిలియున్న కేవలాచ్చునకు ముందు యకారము చేరును.

మఇల అను శబ్దమునం దికారమునకు ముం దీసూత్రముచే యకారము చేరఁగా మయిల యని యగును.

'మరిచ' యను శబ్దమున 'ఇదతః' (తద్భ.99) అను సూత్రముచే నిత్వము వచ్చి **మిరిచ అని** కాఁగా కగచజ-మొదలగు సూత్రముచే చకారము లోపించి మిరి అ అని కాఁగాఁ **ప్రస్తుతసూత్రముచే** 'అ' కారమునకు ముందు యకారము చేరి 'మిరియ' అని యగును. **ప్రథమైకవచనమున** మిరియము. కవి-కగచజ-(తద్భ.9) కఇ-యశ్రుతిరచ్- కయి.

1. **యశ్రుతిరః?** వా. 1.3.6.

12. క్వచిద్వోగః.

వ్యా. క్వచిత్ = కొన్ని యెడల, వః = వకారమునకు, గః చ = గకారము నగును.

వి. తద్భవే వకారస్య గస్స్యాత్.

కొన్నియెడల వకారముయొక్క స్థానమున గకారము వచ్చును.

తువర అనుచో 'ఇణఏచ్' (తద్భ.4) అను సూత్రముచే నుత్వమున కొత్వము వచ్చి 'తొవర' అని కాఁగాఁ బ్రస్తుతసూత్రముచే వకారముయొక్క స్థానమున గకార మై 'తొగర' అని యగును. ప్రథమైకవచనమునందు ముప్వర్ణకముతోపాటు 'తొగరము' అని యగును. 'చ' శబ్దముచే గకారము రాని పక్షమునందు వకార మట్లే యుండి 'తొవరము' అని యగును.

13. హ్రాదేః.

వి. దీర్ఘస్య హ్రస్వస్స్యాత్, ఇత్యనేన హ్రస్వః. వస్య గకారః పగడము.

వ్యా. దేః = దీర్ఘమునకు, హః = హ్రస్వ మగును.

తద్భవశబ్దములలో దీర్ఘమునకు హ్రస్వ మగును. 'ప్రవాళ' అను శబ్దమునందు 'ఉభయత్రరవలామ్' (తద్భ.3) అను సూత్రముచే రేఫము లోపించి, 'పవాళ' అని కాఁగాఁ బ్రస్తుతసూత్రముచే దీర్ఘమునకు హ్రస్వ మయి 'పవళ' అని యగును. ఇందలి వకారమునకు 'క్వచిద్వోగః' (తద్భ.12) అను సూత్రముచే గకారము రాఁగా పగళ–'చ'శబ్దముచే గకారము రాని పక్షమున పవళ. ళశయోరభేదః, ళడయోరభేదః – అని ళశడ లభిన్నములు గావున శకారమునకు డకార మై (తద్భ.20 వివృతి) పగడము, పవడము అని యగు.

14. అధోమనయామ్.[1]

వ్యా. అధః = క్రింది వగు, మనయామ్ = మకార నకార యకారములకు లోప మగును.

వి. సంయోగే పశ్చాదుచ్చార్యమాణానాం మనయాం లోప స్స్యాత్. రుక్మమ్ – రూక, వర్ష్మ– బాట. టుస్తోరిత్యనేన తస్య టకారః ఇత్యాది. అగ్నిః – అగ్గి.

1. మనయామ్. హె. 1.4.51

సంయుక్త స్థలములలోఁ దరువాతి వగు మ, న, య కారములకు లోపము వచ్చును. రూక -'రుక్మ' అను శబ్దమునందు 'మ' కారమునకు లోపము రాఁగా 'రుక' అని యగును. బాట -'వర్త్మ' అను శబ్దమున 'ఉభయత్రరవలామ్' (తద్భ.3) అను సూత్రముచే రేఫమును ప్రస్తుత సూత్రముచే మకారమును లోపింపఁగా 'వత' అని కాఁగా 'టుస్తోః' తద్భ.39 అను సూత్రముచే తకారమునకు టకారమై 'వట' అని యగును.

వి. బ్రధ్నః- ప్రొద్దు.

వోబః (తద్భ.40) అని బకారము రాఁగా 'బట' యని యగును.తద్భ. 91 సూత్రముచే బాట.

## 15. ఓదతః.

అతః = అకారమునకు, ఓత్ = ఓత్వ మగును.

వి. అత ఓత్ స్యాత్. ఇత్యనేన. సన్యాసిః = సన్నాసి.

అత్వమున కొత్వ మగును. కావున ప్రొద్దు అని యేర్పడును.

బ్రధ్నశబ్దమునందు పూర్వ సూత్రముచే నకారము లోపింపఁగా బ్రధ. ప్రస్తుతసూత్రముచే నత్వమున కొత్వ మయి బ్రోధ. తద్భ.108 సూ.చే. బ్రోద. తద్భ.96.చే బకారమునకు పకారమై ప్రోద, తద్భ 23 చే ద్విత్వము ప్రొద్ద. తద్భ 6.చే ఉత్వము ప్రొద్దు.

'సన్యాసి' యనుచోఁ బూర్వసూత్రముచే యకారము లోపించి సనాసి అని కాఁగా తద్భ.23 సూ.చే ద్విత్వ మయి సన్నాసి అని యగును.

## 16. ఇదృతః.

వ్యా. ఋతః = హ్రస్వ మయిన ఋకారమునకు, ఇత్ = ఇత్వ మగు.

వి. ఋకారస్య ఇత్ స్యాత్. మృత్యుః - మిత్తి.

మిత్తి - ఋకారము యొక్క స్థానమున ఇత్వ మగును. 'మృత్యు' అనుశబ్దమున ఋకారమున కిత్వము రాఁగా 'మిత్యు' అని యగును. అధోమనయామ్ (తద్భ.14) అను సూత్రముచే యకారము లోపింపఁగా 'మితు' అని యగును. పిదప శేషాదేశస్యాహౌ చాఽఽద్యచోః (తద్భ.23) అను సూత్రముచే తకారమునకు ద్విత్వమయి 'మిత్తు' అని యగును.

## 17. ఇదుతః.

వి. ఉత ఇత్ స్యాత్ ఇత్యనేన ఉత ఇత్. మిత్తి. కాంస్యం-కంచు కావ్యం-కబ్బము ఇత్యాది.

హ్రస్వ మైన యుకారమున కిత్వ మగును. 'మిత్తు' అనుచో నీ సూత్రముచే నుత్వమున కిత్వము రాఁగా 'మిత్తి' అని యేర్పడును. కంచు - చూ.తద్భ.86. సూ. కావ్య - అధోమనయామ్ (తద్భ.14.) కావ. తద్భ.13. చే దీర్ఘమునకు హ్రస్వమై. కవ-అని కాఁగా తద్భ.23చే ద్విత్వమయి కబ్బ అని యగును. ములంతము - కబ్బము.

వి. జ-రాజా-రాయఁడు. త-ఘాతః - గాయము,
ప-తాపః - తాయము ఇత్యాది.

'కగచజ తదపయవానా మనాదౌ కాత్యాయనస్య' (తద్భ.9) అనుచోఁ జెప్పఁబడిన కకారాది లోపమునకుఁ గ్రమముగా నుదాహరణములు చూపుచున్నాఁడు క-కశ్మల, (తద్భ.9) చ-మరిచ, ద-మందనమ్, య-ప్రయాణమ్, వ-కవి. (తద్భ.12) అనునవి లోఁగడఁ జూపెను.

మిగిలిన విఁటఁ జూపుచున్నాఁడు రాజ-యనుచో జకారము లోపింపఁగా యశ్రుతిరచ (తద్భ11) రాయ-రాయఁడు.

ఘాత యనుచో తకారములోపించి ఘా + అ 'యశ్రుతిరచ్' (తద్భ.11) ఘాయ. తద్భ.109. గాయ = గాయము. తాప అనుచో పకారము లోపించి తా + అ. యశ్రుతిరచ్-తాయ-తాయము.

## 18. గః కః.

వ్యా. గః = గకారమునకు, కః = కకార మగును.

వి. అసంయుక్తస్య అనాదౌ స్థితస్య గస్య క స్స్యాత్.
పూగః-పోక. భగః - పూకు; పూయ. (వికటః - వెగటు) ఇత్యాదిః.

సంయుక్తము కానిదియును, శబ్దమున మొదటిది గానిదియు నయిన గకారము యొక్క స్థానమున కకారము వచ్చును.

'పూగ' అనుశబ్దమున ఇణేపేట్ (తద్భ.4) అనుసూత్రముచే ఊకారమున కోకారము వచ్చి పోగ అని కాఁగాఁ బ్రస్తుతసూత్రముచే గకారమునకు కకారము వచ్చి పోక యని యగును.

## 19. కోగః.

వి. అసంయుక్తస్యానాదౌస్థితస్య కస్య గస్స్యాత్.

వికటః-వెగటు. ఒకటి-ఒగటి, ఒకతి-ఒగతి.

కం॥ ఒగతెకు జగములు వణికెడు

నగణితముగ నిద్ద తైన నంబుధు లింకున్ ఇత్యాది.

సిక- సిగ, మొకము - మొగము.

సంయుక్తము గానిదియును, శబ్దమున మొదటిది గానిదియును నయిన కకారమునకు గకారము వచ్చును.

వికట యను శబ్దమున 'ఇణఏజ్' (తద్భ.4) అను సూత్రముచే నిత్యమున కెత్వమయి వెకట అని కాఁగా ప్రస్తుతసూత్రముచే కకారమునకు గకారము వచ్చి వెగట అని యగును. 'ఉదతస్సౌ' (తద్భ.6) అని యుత్వమై వెగటు. (సోర్లోపః తద్భ.7).

ఒగటి (ఒకటి) ఒగతె (ఒకతె) అనురీతివి కొన్ని ప్రాంతములఁ గొందఱి వ్యవహారమున విన్పించు. పై పద్య మెచ్చటిదో. ఒగ టి అనురీతి గకార ఘటిత రూపములు కావ్యములందుఁ గల వేమో వెదుకవలె.

## 20. ఖఃకః.

వ్యా. ఖః = ఖకారమునకు, కః = కకార మగును.

వి. ఖస్య కస్స్యాత్. సఖి - సకి-సగి, శిఖ, సెక - సెగ- ఇత్యాది.

ఖకారమునకు కకారము వచ్చును.

'సఖి' యను శబ్దమున ఖకారమునకు కకారము రాఁగా 'సకి' అని యగును.

'ముఖ' శబ్దమున 'ఇణఏజ్ (తద్భ.4) అను సూత్రముచే నుత్వమున కొత్వము రాఁగా మొఖ అని కాఁగాఁ ప్రస్తుతసూత్రముచే ఖకారమునకు 'క'కారము రాఁగా మొక - అని యగును. 'కోగః' (తద్భ.19) అను సూత్రముచే కకారమునకు గకారము వచ్చిన పక్షమునందు మొగ- అని యగును. మొక, మొగ- అను శబ్దములు ములన్తము లగును. మొకము-మొగము.

ఇట్లే శిఖ- శషోస్సః (తద్భ.24) సిఖ-ఇణఏజ్, సెఖ, ఖఃకః-సెక. కోగః -(తద్భ.19 సెగ.

తత్స.108 సూత్రము ననుసరించి యిది యవసరముగాఁ దోఁడదు.

## 21. లుప్త యశ్చ.

వ్యా. లుప్తయః చ = లోపించిన యకారము గల్గిన దానికి నగును.

వి. లుప్తోయోయ స్త స్యాంత ఏత్వం స్యాత్. వ్యాసః = వేసులు. త్యాగః = తేగము.

వివృతి ననుసరించి యకారము లోపించిన స్థలమున నేత్వ మగు నని సూత్రార్థము.

'వ్యాస' అను శబ్దమున 'అధోమనయామ్' అను సూత్రముచే యకారము లోపింపఁగా 'వాస' అని యగును, ఈ సూత్రముచే అకారమున కేత్వము రాఁగా వేస - పూజ్యతయందు బహువచనము రాఁగా వేసులు. త్యాగ - తేగ- ములంతకము. తేగము. ఆదిహలో వద్వ్యతోఽప్లగ్ద్వ్యతౌ - యనుదాని కిది యపవాదముగా నెంచఁబడయును.

వి. వ్యాఘ్రః - బెగడము. వస్యబః - ఘస్యగః రస్యడః-

వ్యాఘ్ర శబ్దమున 'అధోమనయామ్' (తద్భ.12) అను సూత్రముచే యకారలోపము. వాఘ్ర. 'లుప్తయశ్చ' యని యేత్వము. బేఘ్ర- ఘస్యగః- అను సూత్రముచే ఘకారమునకు గకారము బేగ్ర - ర్యోడః. తద్భ.37 - అనుదానిచే రేఫకు డకారము- బేగ్డ. యుక్తస్య విశ్లేషః (తద్భ.22) బేగడ, హ్రాదేః (తద్భ) అని హ్రస్వ మయి బెగడ- అని యగును. ములంతము-బెగడము.

వి. ధ్యానమ్ - దేనము, వ్యాధః - వేదుఁడు, వ్యాళః- వేడము, లడయోరభేదః వ్యత్యయాః - వెత్తియము, వ్యత్యస్తము - వెత్తెస్తము. వ్యసనమ్-వెసనము, ద్యావా పృథివీ-దేవాప్రిదివి, న్యాయః - నేయము, ఖ్యాతిః(తి) - కీతి చ్యవనః - చెవనము, చెవనుఁడు ఇత్యాది.

'వ్యత్యస్త' శబ్దము రెండు చోట్ల నున్న యకారములు లోపింపఁగా నారెండు చోట్ల నెత్వ మయినది. ఈ యకారము లోపింపఁగా హ్రస్వ మయిన యచ్చునకు హ్రస్వ మగు 'ఎ'త్వమును, దీర్ఘ మయిన యచ్చునకు దీర్ఘ మయిన'ఏ'కారమును నగు నని గుర్తింపఁదగును. వ్యసన-వెసనము వ్యాధః - వేదుఁడు మొ॥

## 22. యుక్తస్య వికర్షః.

వ్యా. యుక్తస్య = సంయుక్తములయిన హల్లులకు, వికర్ష = వేరుపాటు కలుగును.

వి. సంయుక్తస్యాచా మధ్యే వ్యవధానం స్యాత్.

మంత్రః - మంతరము, మంద్రః- మందరము.

భద్రః - బద్దరము, శూద్రః = సూదురుఁడు. ఇత్యాది.

సంయుక్తము లయిన హల్లులకు నడుమ అచ్చు చేరి భిన్నత కలుగును. మంత్ర- మంతరము మొ॥ శూద్రశబ్దమున నుత్వము చేరినది సూదర యనుతీరుగా నత్వము గలదు. శేషాదేశ - (తద్భ.23) మున్నగు సూత్రముచే బద్దర అన్నపుడు ద్విత్వము. ఇట్లె సూద్దురుఁడు అనుచో ఆదౌ దీర్ఘాల్లుక్ అని ద్విత్వము లోపించి సూదురుఁడు అని యగును.

## 23. శేషాదేశ స్యాహ్రాహోచోఽఖోః.[1]

అచః = అచ్చుకంటెఁ బర మై యున్న, శేష ఆదేశస్య = సంయుక్తము లగుహల్లులలో నొకటి లోపింపఁగా మిగిలినది (హల్లు)యు, ఆదేశముగా వచ్చినదియును, అహ్రః = హకార రేఫల కంటె వే ఱయినదియు, అఖోః = శబ్దమున మొదటిది గానిదియు నైన హల్లునకు ద్విత్వమగును.

ఇది ప్రాకృతలక్షణము 'ఖు' సంజ్ఞప్రస్తుత వ్యాకరణమున ననుక్తము. ప్రాకృతమునందు 'ఆదిఃఖుః' అని (వా.1.1.9) మొదటి వర్ణమునకు ఖుసంజ్ఞ విహితము. (వై.చం.) దీనిని దెలుఁగునకుఁ దెచ్చుట (సం.9) యంతకు ముం దీసంజ్ఞ తెలుఁగునను బ్రసిద్ధ మనవచ్చు. ' అనాదౌ స్థితస్య' యని దీనికి వివృతి.

వి. సంయుక్త వర్ణయోర్మధ్యే ఏకస్య వర్ణస్య లోపే కృతే యోఽవశిష్యతే స శేషః తస్య చ, ఆదేశ స్య చ. అచః పరస్య హకార రేఫ వర్జితస్య అనా దౌస్థితస్య ద్విత్వం స్యాత్.

సంయుక్తములగు హల్లులలో నొకటి లోపింపఁగా మిగిలి యున్నది శేషము. ఇట్లు శేషించిన హల్లును, (సంయుక్త స్థలమున) నాదేశముగా

---

1. శేషాదేశస్యాహ్రాహోచోఽఖోః వా. 1.4.54.
బృహస్పతి సూత్రముగా త్రి.శ. అనుబంధములో.

వచ్చిన హల్లును, హకారరేఫములకంటె వే ఱయి, శబ్దము మొదటిదిగాక యచ్చుకంటెఁ బర మయియున్నపడు ద్విత్వమును బొందును.

వి. ఇత్యనేన కర్మార ఇత్యత్ర సంయుక్తరేఫస్య లోపే కృతే అనేన సూత్రేణ శేషస్య మకారస్య ద్విత్వే హ్రాదేః - దీర్ఘస్య హ్రస్వస్స్యాదిత్యనేన హ్రస్వే కృతే - కమ్మరవాఁడు.

కర్మార శబ్దమునందు 'ఉభయత్ర రవలామ్ (తద్భ.3) సూత్రముచే రేఫము లోపింపఁగా మిగిలి యున్న మకారము 'శేషము'. దీనికిఁ బ్రస్తుతసూత్రముచేత ద్విత్వము రాఁగా 'కమ్మార' అని యగును. పిదప హ్రాదేః (తద్భ.13) అను సూత్రముచే హ్రస్వము వచ్చి 'కమ్మర' అని యగును.

అప్సర అను శబ్దమున 'చస్సపరుషహలః' (సంధి.21) అను సూత్రముచే చకార మాదేశము కాఁగా 'అచర' అని యగును. ఇట చకార మాదేశము. కావున నీ సూత్రముచే ద్విత్వమయి 'అచ్చర' యని యగును.

అఖోః అనుటచే మొదటి హల్లునకు ద్విత్వము రాదు. మంచి దేనము మొ॥.

## 24. శషోస్సః.[1]

ఈశ్వర ఇత్యత్ర = ఈశ్వర శబ్దమున

వ్యా. శషోః = శకార షకారములకు, సః = సకార మాదేశ మగును

వి. అసంయుక్తయోశ్శషయోస్స స్యాత్. వకారలోపా నంతరమీశర అనేన సూత్రేణ ఈ సర ఇతి స్థితే శేషాదేశ స్యేతి సూత్రేణ సకారస్య ద్విత్వే ప్రాప్తే ఈస్సర ఇతి.

సంయుక్తము గాని శషలయొక్క స్థానమున సకార మాదేశ మగును.

'ఈశ్వర' అనుశబ్దమున 'ఉభయత్ర రవలామ్' అను సూత్రముచే వకారము లోపింపగా 'ఈశర' అని యగును. ప్రస్తుతసూత్రముచే శకారమునకు సకారము వచ్చి ఈసర అని యగును. శేషాదేశస్యాహ్రహోచోఽఖోః (తద్భ.23) అను సూత్రముచే ద్విత్వము రాఁగా

1. శషోస్సః. ప్రా.3.2.46.

ఈస్సర అని యగును.

## 25. ఆదౌ దీర్ఘా లుక్.

వ్యా. ఆదౌ = మొదటి దగు, దీర్ఘా = దీర్ఘముకంటెఁ బరముగా నున్న ద్విత్వమునకు, లుక్ = లోప మగును.

వి. పూర్వస్వరే దీర్ఘే సతి ద్విత్వస్య లోపస్స్యాత్

ఈస్సర ఇతి ఈసరుఁడు.

శబ్దమున మొట్టమొదటి దీర్ఘమునకుఁ బరముగా నున్న ద్విత్వమునకు లోపము వచ్చును. పూర్వసూత్రోక్తలమును బట్టి 'ఈస్సర' అని కాఁగా ప్రస్తుతసూత్రముచే ద్విత్వమునకు లోపము వచ్చి 'ఈసర' అని యగును. ఈసరుఁడు.

దీర్ఘముపై ద్విత్వము రా దని చెప్పినఁ బ్రక్రియలో లాఘవము కల్గెడిది.

## 26. అయుక్త స్య రిరూ.

వ్యా. అయుక్తస్య = హల్లుతోఁ గూడని ఋకారమునకు, రిరూ = రివర్ణమును, రువర్ణము నగును.

వి. ఓష్ఠ్యాక్షరాత్పరస్య హలా అసంయుక్తస్య ఋతో

రిరూ స్తః - ఋతురాజు - రుతురాజు, రితురాజు,

ఋణము - రిణము - రుణము, ఋషి-రిషి -రుషి,

ఋషభము - రిసబము - రుసభము,

ఋక్షము - రిక్షము, రుక్షము.

హల్లుతోఁ గూడక భిన్నముగా నున్న ఋకారముయొక్క స్థానమున రి, మఱియు, రు-అను వర్ణము లాదేశ మగును.

'ఋషి' అనుచోట నీ సూత్రముచే ఋకారమునకు రి వర్ణము రాఁగా రిషి-శషోస్సః (తద్భ.24) అని షకారమునకు సకారము రాఁగా 'రిసి' అని యగును. రు వర్ణమయిన 'రుసి' అని యగును.

రిషి, రుషి, రిక్షము రుక్షము అనుతీరుగా నుదాహరించుటను బట్టి యివి తద్భవములు గాక సంస్కృతసమములుఁగనే యుద్దేశింపఁబడినట్లు తోఁచుచున్నది. ఉచ్చారణమున సంస్కృతసమములయందును. ఋకారము, రిరు వర్ణములుగా నుచ్చరింపఁబడుట లేకపోలేదు.

కాని యది ప్రామాణిక మనలేము. రిసి-రుసి, రిక్కము రుక్కము అనియె యుండెనేమో.

వి. కగటడతదేతి సూత్రేణ దిక్కరుఁడు.

దిచ్చరుఁడు, సత్కారః - సక్కారము, ఉద్గతము-
ఉగ్గతము, ద్రప్సమ్-ద్రచ్చము, వృశ్చికః -
విచ్చికము, గోష్ఠమ్ - కొట్టము, నిశ్చింతా-నిచ్చింత,
హస్తి-హత్తి, శిరఃకంపము - శిరక్కంపము. మ నః
పద్మః- మనప్పదుమము, రుద్రః - రుద్దురుఁడు,
ఇత్యాది.

'కగటడతదప ఃకః టశోరుపర్యద్రే' (తద్భ.10) యను సూత్రముచే దిక్కర శబ్దమున కకారము లోపింపఁగా దివర 'శేషాదేశస్యాహోఽ ఖోః (తద్భ.23) అను సూత్రముచే ద్విత్వ మయి దిచ్చర-ప్రథమైక వచనమున దిచ్చరుఁడు.

పూర్ణి మేత్యత్ర రేఫలోపే పః, హ్రస్వః,

## 27. అదితః.

వ్యా. ఇతః = ఇకారమునకు, అత్ = అత్వ మగును.

వి. ఇకారస్య అత్ స్యాత్.

హ్రస్వ మగు నికారము యొక్క స్థానమున హ్రస్వ మగు నకారము వచ్చును.

పూర్ణిమ అనుశబ్దమున 'ఉభయత్ర రవలామ్' అను సూత్రముచే రేఫము లోపింపఁగా, పూణిమ. అని కాఁగాఁ ప్రస్తుతసూత్రముచే నిత్వమున కత్వమయి పూణమ అని యగును'హ్రాదేః' అను సూత్రముచే దీర్ఘమునకు హ్రస్వ మయి పుణమ అని యగును.

వి. నణావన్యోన్య మిత్యనేన ణస్య నకారః - ద్విత్వం చ.

పున్నమ.

వ్యా. 'నణావన్యోన్యమ్' అనులక్షణము ననుసరించి నకార ణకారములు పరస్పరము మారుచుండును. కావున 'పుణమ ' అను శబ్దమునందు ణకారము యొక్క స్థానమున నకారము రాఁగా పునమ అని యగును. ఇది యాదేశముగావున శేషా దేశస్య-(తద్భ.23) అని

- ఆ నకారమునకు ద్విత్వము నగును. అట్లు ద్విత్వము రాఁగా పున్నమ అని యేర్పడును.

## 28. బో లుక్.

వ్యా. బః = బకారమునకు, లుక్ = లోప మగును.

వి. తాంబూలశబ్దే విద్యమానస్య బకారస్య లోపస్స్యాత్
దీర్ఘస్య హ్రస్వః. తమ్ ఉలము - తములము,
ద్విత్వమ్ తమ్ములము.

తాంబూల శబ్దమునం దున్న బకారపు పొల్లునకు లోప మగును. తాంబూల అను చో నిట్లు బకారము లోపించి తాం ఊల - అని యగును హ్రాదేః అను సూత్రముచే దీర్ఘములకు హ్రస్వము వచ్చి తంఉల - బిందువునకు మకారమయి తముల - అని యగును. ములంతము గాన ప్రథమైకవచనమున మువర్ణము వచ్చి తములము అని యగును. మకారమాదేశము? గాన తద్భ.23 సూత్రముచే మకారమునకు ద్విత్వ మయిన పక్షమునందుఁ దమ్ములము అని యగును.

## 29. వాదుతః.

వ్యా. ఉతః = హ్రస్వమగు 'ఉ'కారమునకు, వా = వికల్పముగా, అత్ = అత్వ మగును.

వి. తముల శబ్దోకారస్య వికల్పేన అత్ స్యాత్.
తములము - తమలము, తమ్ములము - తమ్మలము.

తముల శబ్దమునందలి యుత్వము యొక్క స్థానమున వికల్పముగా నత్వ మాదేశ మగును. తమలము 'వా' యనుటచే నత్వము రానిపక్షమునందు తములము, (తద్భ.23) ద్విత్వమయి తమ్ముల అని యున్న పక్షమునను నత్వము వచ్చిన తమ్మలము అనియు నత్వము రాకున్నఁ దమ్ములము అనియు నగును.

వి. 'జ్ఞషహణః ఇత్యనేన - విజ్ఞానమ్ - విన్నాణము,
యజ్ఞః - జన్నము ఇత్యాది.

వ్యా. జ్ఞకారమునకు నకారము వచ్చును.

యజ్ఞ యనుశబ్దమున జ్ఞకారమునకు నకారము రాఁగా యన్న- యకారమునకు

ఆదేర్యోజః (తద్భ.45) జకారము జన్న- జన్నము అని యగును.

## 30. న (ణ) నామవేషు.[1]

వి. ఏషు సర్వేషు అనుస్వారో వా స్యాత్. లక్షణము- లక్షణవంతుఁడు, జన్నము - జంనము, సమరము- సంరము, కమలవనము - కంలవనము. ఇత్యాది.

వ్యా. నణమవేషు = న, ణ, మ, వ, అనువాని స్థానమున బిందువు వికల్పముగా నగు నని వివృతి ననుసరించి సూత్రాభిప్రాయము నెన్నఁదగును. జన్నము అనుచో నకారమునకు సున్న రాఁగా జంనము అని యైనది. ఇట్లే అమ్మ అంమ మొ॥ .

జన్నము - జంనము.

సమరము - సంరము.

కమలవనము - కంలవనము.

లక్షణవంతుఁడు - లక్షణమంతుఁడు అనురీతినే మైన నుద్దేశింపఁబడిన వేమో పరిశీలింపవలెను.

## 31. ఏజైచః.[2]

వ్యా. ఐచః = ఐకారమునకును ఔకారమునకును, ఏజ్ = ఏకారమును ఓకారమును వచ్చును.

వి. ఐచ ఏజ్ స్యాత్. వైద్యః - వెజ్జు, వైరం - వేరము, జ్యౌతిషమ్- జోతిసము, ఉపాధ్యాయః - ఒజ్జ ఇత్యాది.

ఐకారము యొక్క స్థానమున ఏకారమును ఔకారముయొక్క స్థానమున ఓకారమును ఆదేశ మగు.

వైద్య- అనుచో ఐత్వమున కెత్వ మై వెద్య - వెజ్జ- అని యైనది.

జ్యౌతిష - అనుచో ఔకారమునకు ఓత్వ మై జోతిష- శషోస్యః(తద్భ.24) జోతిస - అని యైనది. అధోమనయామ్ అను సూత్రముచే యకారలోపము.

---

1. ఇది మిగుల నస్పష్టముగా నున్నది. పరిశీలింపవలె.
2. ఐచేజ్ వా. 1-2.60.

ఉపాధ్యాయ- ఒజ్జ అనుచో నుత్వమున కోత్వ మయినది. ఇది యీ సూత్రమునకు లక్ష్యము గానేరదు.

## 32. ణనమలయవాం వా.

వ్యా. ణనమలయవామ్ = ణ, న, మ, ల, య, వ- అను

హల్లులకు, వా = వికల్పముగా ద్విత్వము వచ్చును.

వి. అనాదావేషాం ద్విత్వం వా స్యాత్. అమ్మణి- అమ్మణ్ణి, అన - అన్న, అమ - అమ్మ, ఇలు - ఇల్లు, అయ- అయ్య, అవ- అవ్వ ఇత్యాది.

శబ్దమునందు మొదట నున్నవి గాని ణ, న, మ, ల, య, వ- అనువానికి వికల్పముగా ద్విత్వము వచ్చును.

అమ్మణి = అమ్మణ్ణి, అన-అన్న మొ॥

ఇది దేశ్యశబ్దములకును సంబధించిన లక్షణముగా నెన్నఁదగును. ఉదాహరణములు వివృతియందుఁ గ్రమముగా గుర్తింపఁదగును.

## 33. ఉదోతోర్వశ్శేషా.

వి. (వెన్నుఁడు?) అనాదౌ స్థితయో శ్శేషాదేశయోరు దోతో ర్వా వ స్స్యాత్. రాజు- రావు, పాదు - పావు, చతురః- సవురు, చకోరః - చవోరము ఇత్యాది.

వ్యా. శేషా = లోపము రాఁగా మిగిలి యున్నస్థలమున, ఉదోతోః-- ఉత్వమునకు వోత్వమునకును, వః = వకార మగును.

లోపము, ఆదేశము మొదలగు వికారములు గల్గిన చోట్ల ఉత్వముతోఁ గాని, లేదా ఓత్వముతోఁ గాని గూడియున్నహల్లన కొక్కచో వకారము వికల్పముగా నగు నని యభిప్రాయము.

రాజన్ - రాజు. జకారమునకు వకార మై రావు. ఇట్ల యితరములు. చకోరము-

చవోరము అనుచో నోత్వముతోఁ గూడిన కకారమునకు వకార మయినది. ఇట్టిరూపము వెదుకవలసి యున్నది.

## 34. ఋక్షాదౌ రిః.[1]

వ్యా. ఋక్షాదౌ = ఋక్ష మొదలగు శబ్దములయందు ఋకారమునకు, రిః = రివర్ణ మగును.

వి. ఋతోరిస్స్యా దృక్షాదౌ. ఋక్షః - రిక్క,
ఋణమ్- రిణము ఇత్యాది.

ఋక్ష మొదలగు శబ్దములలో ఋకారము యొక్క స్థానమున రి వర్ణము వచ్చును. ఋణము - రిణము మొ॥.

అయుక్తస్యరిరీ అను సూత్రము నొద్ద రిక్షము, అనురీతిగా నుదాహరించుటను బట్టి యీ లక్షణము సంస్కృతసమముల నుద్దేశించి చెప్పఁబడిన దనియు, నిట రిక్క అనురీతిగా నుదాహరించుటను బట్టి యిది తద్భవ నిరూపక మనియు భేద మెన్నదగు నేమో. రిచ్చము, అని యటఁ జూప నుద్దేశ్యమో. అయిన నిట 'రి' విధానము వ్యర్థ మనఁదగు.

ఋక్ష-శబ్దమున 'క్షః కః' అనుసూత్రముచే క్షకారమునకు కకార మై ప్రస్తుతసూత్రముచే ఋకారమునకు రి వర్ణము రాఁగా రిక- 'క' ఆదేశముగా నైనది గావున శేషాదేశస్య (తద్భ.23) అను సూత్రముచే ద్విత్వము వచ్చి రిక్క అని యగును.

## 35. ఋష్యాదావిచ్చ.

వ్యా. ఋష్యాదౌ = ఋషి మొదలగు శబ్దములందు, ఇత్ చ = ఋకారమున కిత్వము నగున.

వి. పూర్వ సూత్రాద్రిశ్చ. ఋషి - ఋద్ధి. శృంగార ఈ దృశ
తా దృశాన్యాదృశాః ఇత్యాది. ఋష్యాదిః. ఋషి-ఇసి-
రిసి, ఋద్ధి-ఇద్ధి - రిద్ధి. శృంగారము-సింగారము -
స్రింగారము. ఈ దృశ-ఇట్టి, తాదృశ-అట్టి, యాదృశ-
ఎట్టి, ఇటు అటు ఎటు ఇత్యాది.

ఋషి మొదలగు శబ్దములలో ఋకారము యొక్క స్థానమున నిత్వము నయిత మగును. సూత్రమునందలి చ శబ్దముచే 'ఋక్షాదౌ రిః- అను పూర్వసూత్రమునఁ జెప్పఁబడిన రి వర్ణమును వీని కగును. ఋషి-ఇషి 'శషోస్సః (తద్భ.24) అను సూత్రముచే షకారమునకు సకార మయి 'ఇసి' అని యగును. ఋకారమునకు రివర్ణము వచ్చినపక్షమునందు 'రిసి' అని -

1. కేవలస్వరం వా.. 1.2.67

యగును.

అట్టి, మున్నగునవి తద్ధితప్రకరణాంతమున నిరూపించుట యైనది.

## 36. ఋతోऽద్వృద్ధ్యాదౌ.[1]

వ్యా. వృద్ధ్యాదౌ = వృద్ధి మొదలగు శబ్దములందు, ఋతః = ఋకారమునకు, అత్ = అత్వ మగును.

వి. వృద్ధిః - వడ్డి, మృత్తికా - మట్టి, వృత్తం- బటువు.

వృద్ధి మొదలగు శబ్దములయందలి ఋకారము యొక్క స్థానమున నత్వ మగును.

వృద్ధి - వ్ ఋ-వ్ అ-వద్ధి. ( మా.39సూ).

వి. వృంత్ మ్ తస్యాకారస్య ఓకారః

ఓదతః- అస్య స ఓత్ స్యాత్. ఇత్యనేన ఓకారః

తొ -

వ్యా. వృంత అను శబ్దమునందలి తకారము నందలి యత్వమునకు 'ఓదతః' అను సూత్రముచే ఒత్వము రాగా 'తొ' అని యగును.

(ముందరి 'వృం' అనుదాని గూర్చి యిటఁ బ్రస్తావింపఁబడలేదు.) దీనికి ముం దేది యేని లక్షణము నష్టమైన దేమో.

## 37. రోడః.

వ్యా. రః = రేఫమునకు, డః = డకార మగును.

వి. ఇత్యనేన రేఫస్య డకారః.

రేఫము యొక్క స్థానమున డకార మాదేశ మగును. ఇచట 'వాడి' అని యుదాహరింపఁబడినది. కాని యిచట రేఫము గానరాదు. డకార మగుటకు -

వి. 'ఋత ఇత్' ఇత్యనేన ఇకారః డి.

---

1. ఋతోऽత్. వా. 1.2.53.

ఋకారమునకు ఇకార మగు నని 'చెప్పు' ఋత ఇత్' అను సూత్రముచే ఋకారముయొక్క స్థానమున నిత్యము వచ్చును.- 'డి- అని యుదాహరింపఁబడినది. ఆధారము మృగ్యము.

## 38. వోమః.

వ్యా. వః = వకారమునకు మః = మకార మగును.

వి. అయుక్తస్య వస్య మస్స్యాత్ వ స్యమకారః. తొడిమ వ్యత్యయశ్చ - ఇత్యాది.

సంయుక్తము గాని వకారము యొక్క స్థానమున మకార మాదేశ మగును.

'వృంత' అను శబ్దమున వకారముయొక్క స్థానమున మకార మయి తొడిమ యని యగును.

'వృంత' అను శబ్దమున వ్యత్యయ మయి తంవ్వ అని యయిన దన్నను దీనిని 'తొడిమ' యని యేర్పడుట సంభవముగాఁ దోఁచుట లేదు. పరిశీలింపవలె.

## 39. టుస్తోః.

వ్యా. తోః = తవర్గమునకు, టుః = టవర్గ మగును.

వి. అయుక్త స్య తవర్గస్య టవర్గస్స్యాత్.

సంయుక్తము గాక ప్రత్యేకముగా నున్న తవర్గీయాక్షరములయొక్క స్థానమున టవర్గీయాక్షరము లగును.

'వృద్ధి' అనుచో 'ఋతోఽద్వృద్ధ్యాదౌ' అను సూత్రముచే ఋకారమున కత్వ మై 'వద్ధి' అని కాఁగాఁ బ్రస్తుతసూత్రముచే టవర్గీయము లగు డఢ లై వడ్డి యుని యగును. ఢకారమునకు డకార మై వడ్డి. మృత్తికి- మట్టి మొ॥.

## 40. వోబః.

వ్యా. వః = వకారమునకు, బః = బకార మగును.

వి. ఆదేరయుక్తస్య వస్య బస్స్యాత్ - బేతాళః - వేతాళము- 'వంది- బట్టు.

శబ్దాదియం దున్న సంయుక్తము గాని వకారముయొక్క స్థానమున 'బ'కారము వచ్చును.

ఇట నుదాహరణములు పరస్పర విరుద్ధముగా నున్నవి. పండి బట్టు. (భేతాళ-బేతాళ-బోపః తద్భ51- వేతాళ.?)

## 41. పోవః [1].

వ్యా. పః = పకారమునకు, వః = వకార మగును.

వి. అయుక్త స్యానాదేరచః పరస్య పస్య వస్స్యాత్.

వివృతి యందుఁ జెప్పఁబడిన విశేషము ననుసరించి సంయుక్తముగా నిదియు, మొదటిది గాని యచ్చునకుఁ దరువాత నున్నదియు నయిన పకారము యొక్క స్థానమున వకార మగు నని సూత్రాభి ప్రాయము.

దీప-దివ్వె. ఇట మొదటి యచ్చునకుఁ దరువాతనున్న పకారమునకు వకార మయినది.

## 42. నణావన్యోన్యమ్.

వ్యా. నణౌ = నకార ణకారములు, అన్యోన్యమ్ = పరస్పర మగును.

వి. అయుక్తస్య నస్య ణస్స్యాత్ ణస్య చ నః. లక్ష్మణః

లక్కన,

వివృతి ననుసరించి సంయుక్తములు గానట్టి నణలు పరస్పర మగును. అనఁగా ణకారమునకు నకారమును గొన్ని యెడల నకారమునకు ణకారము నగు నని యర్థము. లక్ష్మణ శబ్దమున ణకారము స్థానమున నకారము వచ్చుచున్నది. లక్కన.

వి. దీపః - దివ్వె. తపస్వీ-తపసి, వస్త్రమ్-బట్ట

కావ్యమ్-కబ్బము, జిహ్వా- జీబు.

వివృతి చూపిన యీ లక్ష్యములలో ప్రస్తుత లక్షణమునకుఁ బ్రసక్తి గానరాదు. మరం దేది యేని సూత్రము నష్ట మయ్యెనా?.

## 43. రలావన్యోన్యమ్.

వ్యా. రలౌ = రేఫ లకారములు, అన్యోన్యమ్ = పరస్పర మగును.

వి. అయుక్తస్య రేఫస్య లస్స్యాత్ లస్య చ రః.

"తలమే బ్రహ్మకునైన నీ నగ మహత్వం బెన్న " ఇత్యాది.

1. పోవః ప్రా.వ్యా.1.55

వివృతిని బట్టి యసంయుక్తము లయినపుడు రలలు పరస్పర మగును. అనఁగా రేఫముయొక్క స్థానమున లకారమును, లకారముయొక్క స్థానమున రేఫము నగు నని యర్థము. తరము- ఇట రేఫకు లకారము రాఁగా 'తలము' అని య్యైనది.

## 44. అత్ కృత ద్విత్వయవోరుపధాయాః.

వ్యా. కృతద్విత్వయవోః = చేయఁబడిన ద్విత్వముగల యకార వకారములయొక్క, ఉపధాయాః = పూర్వముననున్న వర్ణములకు, అత్ = అత్వ మగును.

వి. కృతద్విత్వాద్యకారా త్పూర్వ స్యైతః, కృతద్వ
త్వాద్వకారాత్పూర్వ స్యౌత శ్చ అత్ స్యాత్.
ద్విత్వం - నైయాయిక ఇత్యత్ర నయ్యాయికుఁడు,
దౌవారిక ఇత్యత్ర దవ్వారికుఁడు.

యౌవన వైయాత్యాదౌ ఉభయ ప్రాప్తేఽద్విత్వే అత్వమన్యత్ర స్థానివత్త్వమ్. యౌవని - యువని- యవ్వని, వైయాత్యః - వియాతః -వయ్యాత్యుఁడు.

న్యాయ-నైయాయిక అనుతీరుగా యకారమునకు బూర్వమునందు ఐత్వ ముండును.

ద్వార-దౌవారిక అనుతీరుగా వకారమునకుఁ బూర్వమునం దౌత్వ ముండును. ఇందు యవలకు ద్విత్వము రాఁగా నైయ్యాయిక-దౌవ్వారిక ఇట్లు ద్విత్వము రాఁగా నీయవలకుఁ బూర్వమునం దున్న ఐ,ఔల యొక్క స్థానమున నత్వ మగును. నైయ్యాయిక-నయ్యాయిక, దౌవ్వారిక- దవ్వారిక. ఇట్లే యౌవన - యవ్వన మెు॥.

వీని నిరూపణ మస్పష్ట మై యున్నది.

## 45. ఆదేర్యోజః.[1]

ఆదేః = శబ్దము మొదట నున్న దగు, యః =యకారమునకు, జః = జకార మగును.

వి. అయుక్త స్యాదౌ వర్త మానస్య యస్య జస్స్యాత్. యవ్వని-
జవ్వని, దన్త్యత్వమ్. యమః - జముఁడు, యోగి - జోగి
ఇత్యాది.

శబ్దము మొదట నున్నదియు వే ఱొకహల్లుతోఁ గూడని దియు నీయిన యకారపుఁ బొల్లు స్థానమున జకారపుఁబొ ల్లాదేశ మగును.

1. ఆదేర్జః వా. 1.3.34.
ఆదేర్యోజః బృహస్పతిసూత్రము త్రి.శ.

'యౌవని' యను శబ్దమునఁ బూర్వసూత్రముచే అత్వ ద్విత్వములు రాఁగా యవ్వని అని యైనది. మొదటి యకారమునకు జకారము రాఁగా 'జవ్వని'. ఈ యచ్చ తెనుఁగు శబ్దమున జకారము దంత్యస్వర మగు అకారముతోఁ గూడినది గావున జకారమునకు 'దన్త్యశ్చురతాలవ్యే' (పరి.18) యను సూత్రముచే దంత్యత్వ మగును. జవ్వని. ఇట్లే యితరములు.

## 46. ఐదతః.

అతః = అకారమునకు, ఐత్ = ఐకార మగును.

వి. అత ఐత్ స్యాత్. భయదుఁడు (భయ్యదుఁడు) బైయదుఁడు దవానలము(దవ్వానలము) దౌవానలము.

అకారము యొక్క స్థానమున ఐకార మగును. ఇదియును శబ్దాది యందే కావచ్చును. అట్లే యుదాహరింపఁబడినది గావున భయద- బైయద- బైయదుఁడు.

ఇటఁ జూపిన భయ్యదుఁడు బైయదుఁ డనురీతి వానికిఁ గావ్య ప్రమాణ మెంతవఱ కున్నదో తెలియదు.

## 47. ఎచుశో స్సావర్ణ్యాత్.

చుశోః = చవర్గమునకును, శకారమునకును, సావర్ణ్యాత్ = సవర్ణతచే, ఎ = ఎత్వ మగును.

వి. సాంస్కృతిక చవర్గ శవర్ణయో రాద్య కారస్య సావర్ణ్యా దేకారస్స్యాత్. చతురః - చెతురుఁడు. ఛత్రమ్ - చెత్తరము. జయమ్ - జెయము, ఝషః - జెసము (ఝషము?) శయః- సెయము, శయ్యా - సెయ్య - సెజ్జ. శేష్పమ్ - సెస్పము (శేష్పము?)

సూత్రార్థము వివృతి ననుసరించి గ్రహింపవలసి యున్నది. సంస్కృతమునకు సంబంధించిన శబ్దము మొదటి చవర్గ యందును, శకారముపైని నున్న అకారమునకు 'ఎ' అనునది యాదేశ మగును.

చతుర-చెతుర- ప్రథమైకవచనమున చెతురుఁడు. ఇట్టి యితరము లూహింపఁదగును. ఇవియు లోకవ్యవహారమందలివె.

వి. క్వచిన్న - అశనము - అంచలము.

పయి ఎత్వము కొన్ని యెడల లేదు. అశనము. మొ॥. ఇచట అసెనము - అంచెలము నని ఎత్వము రా దని యుద్దేశము. కాని యింతకు ముందు వివృతిలో 'ఆద్యకారస్య' యనుచో నీ కార్యము శబ్దము మొదటనె యనవచ్చును. ఉదాహరణములను బట్టియు అశనము, అంచలము అనుచో శచలు శబ్దాదియందు లేవు. శబ్ద మధ్యము నం దెత్వ మగుట పూర్వ ముదాహరింపఁబడలేదు. అశనము, అంచలము నన్నవి తత్సమ రూపములు.

వి. క్వచిద్వా విశదము - విసెదము.

విశదము, విసెదము అనుచో ఎత్వము వికల్పముగా నయిన దని యుద్దేశము. విశదము తత్సమమగుట స్పష్టము. విసెదము తద్భవము గావలె. విసద మని కలదు. ఇట ననాది యం దెత్వ మునుట విశేషము.

## 48. యయుక్తస్య తోశ్చుః.

య యుక్తస్య = యకారముతోఁ గూడియున్న, తోః = తవర్గమునకు, చుః = చవర్గ మగును.

వి. యకారయుక్తస్య తవర్గస్య చవర్గః క్రమాత్ స్యాత్.
నిత్యమ్ - నిచ్చము. రథ్యా - రచ్ఛ - చకారః రచ్చ.

యకారముతో సంయుక్త మయిన తవర్గాక్షరములకుఁ గ్రమముగా చవర్గాక్షరము లాదేశ మగును. పయియకారమునకును నాదేశ మగుట గుర్తింపఁదగును. నిత్య - నిచ్చ. రథ్యా యనుచో థకారమునకు ఛకారము రాఁగా దానికిఁ దద్భవత్వమున చకార మై రచ్చ యని యేర్పడును.

వైద్య- వెజ్జ- అనుచో దకారమునకు జకార మయినది. ఇట్లే సంధ్యా- సంఝా - సంజ. మొ॥

తత్సమములయందు నుచ్చారణమున నిది విన్పించును. నిత్యము- నిచ్యము, పథ్యము- పఛ్యము, విద్యా-విజ్య, వింధ్య - వింఝ్య, మధ్యాహ్నము - మఝ్యాన్నము, ఇది కావ్యవ్యవహారమునఁ గానరాదు గాని లోకవ్యవహారమున మాత్రము శిష్టోచ్చారణమునను గల దనవచ్చును.

## 49. అచః ప్రతీపః కాత్యాయనస్య.

కాత్యాయనస్య = కాత్యాయ ముని మతమునందు, అచః = అచ్చులకు, ప్రతీపః = మార్పు గలదు.

వి. అచోవిపరీతాచ్ (వా) స్యాత్ (కాత్యాయనస్యమతే).
ఐకారస్య ఎత్వమ్. వైరం- వేరు, వైద్యః - వెజ్జు.
సంధ్యా - సంఝా- ఝస్యజః దంత్యత్వమ్ సంజ ఇత్యాది.

కాత్యాయనుని మతమున నచ్చునకు వే ఱొకయ చ్చగును. ఇట్లు ఐకారమునకు ఎకారము వచ్చును.

వైర- అనుచో నైత్వమున కేత్వము రాఁగా వేరు. వైద్యః అనుచో 'యయుక్తస్య' యను పూర్వసూత్రముచే 'ద్య'కారములకు జకారము నయి వెజ్జు. సంధ్యా యనుచోఁ బూర్వసూత్రముచే ధకారమునకు ఝకారము రాఁగా ఝకారమునకు జకార మై సంజ అని యగును. దంత్య మగు అత్వముతోఁ గూడి యుండుటచే నిందలి జకారము దంత్య మగును.

## 50. దంభ దండ దాడిమీదోహళాదశనేషుడః.

దంభ, దండ, దాడిమీ, దోహళా, దశనేషు = దంభ -- శబ్దములందు, డః = దకారమునకు డకార మగును.

వి. డంబము, డండము, డాడిమి డోహళ డసనములు
ఇత్యాది.

దంభదండాదులకు శబ్దములందు దకారమునకు డకార మాదేశ మగును. దంభము డంబము మొ॥ డండము, ఇత్యాదిగా నితరశబ్దములు డకారాదు లయి యుండుట గానరాదు. కవిప్రయోగముల వెదుకవలసి యున్నది.

'క్వచిదాదేర్డోడః' అని దకారమునకు డకారము పూర్వోక్త మై యున్నది (ఏకపదవిధి.6) తద్భవములందలి కార్యము విశేషముగా నిందుఁ జెప్పఁబడియుండును.

## 51. బోవః.[1]

బః = బకారమునకు, వః = వకార మగును.

వి. అయుక్తస్య ఆదేరచః పరస్య బస్య వస్స్యాత్. నిబిడము-
నివిడము. బకః - వకము, బాలః - వాలుఁడు ఇత్యాది.

---

1. 'బోవః' వా.1.3.29.

వే ఔౕకహల్లుతో సంయుక్తము గానిదియు శబ్దమున మొదటి దగు నచ్చునకుఁ బరముగా నున్న దియు నయిన బకారమునకు వకార మగును.

నిబిడ - నివిడము.

వివృతియం 'దాదేరచః పరస్య' యని చెప్పఁబడినది కాని యుదాహరించిన బక, బాల శబ్దములందు బకారమె మొదటిది. కావున వివృతి నను సరించి దానికి వకారము రా వీలులేదు. వకము వాలుఁ డను రీతిరూపములును మృగ్యములే. అయ్యు సాధింపఁదలఁచినచో 'ఆదేరచఃపరస్య' యనుట సంగతము గాదు.

'ఆదే రచః పరస్య'యనుటచే వకము వాలుఁగు అని కాదని చెప్పఁదలఁచెనో.

## 52. జ్ఞానసర్వజ్ఞ శయ్యానాంజః.

జ్ఞానసర్వజ్ఞ శయ్యానామ్ = జ్ఞాన, సర్వజ్ఞ, శయ్య, యనుశబ్దములందలి జ్ఞ, యలకు, జః = జకార మగును.

వి. జ్ఞానమ్ - జానము - గేనము ఇతి చ. సబ్బజ్జు, సెజ్జ ఇత్యాది.

జ్ఞాన, సర్వజ్ఞ శబ్దములందలి జ్ఞకారమునకును, శయ్యశబ్దమున యకారమునకును జకార మగును. జ్ఞాన- జానము మొ॥ సర్వజ్ఞ యనుచో బకారముతో సబ్బజ్జు . శయ్య-సెజ్జ.

జ్ఞాన శబ్దమునకు గేనము అనురూపమును గలదు. జానము, సబ్బజ్జు అన్నవి విశేషములు.

## 53. ర్యః.

ర్యః = రేఫయకారముల సంయుక్తమునకు స్థయితము, జః = జకార మగును.

పూర్వ సూత్రమునుండి జః అనునది యనువర్తించును.

వి. ర్య ఇతిసంయోగస్య జస్స్యాత్. కార్యం - కజ్జము.

'ర్య' యనుదానికి జకార మగును. కార్య - కజ్జము. యకారమాత్రమునకు జకార మైన కర్జము ప్రసిద్ధము. రేఫమునకును జకార మయిన 'కజ్జము' ఇట విశేషము.

## 54. రియరిజౌ తూర్యాదౌ.

తూర్యాదౌ = తూర్య మొదలగు శబ్దములందలి 'ర్య' వర్ణమునకు, రియ, రిజౌ = రియ, రిజ యనునవి యగును.

వి. వికర్షాత్ - తూరియము - తూరిజము.

తూర్య మొదలగుశబ్దములందు ర్య వర్ణమునకు రియ, రిజ యనునవి యగును. రియ యైన తూరియము, రిజ యైన తూరిజము.

వికర్షచేతనే (తద్భ.22)) తూర్యశబ్దము తూరియ యని కాఁగలదు. యకారమునకు జకారము రాఁగా తూరియ, తూరిజ శబ్దములు రెండు నేర్పడును. ఈ లక్షణము విశేషము.

అనాది యందును (తద్భ.45) జకార మగుట గుర్తింపవలె.

55. అత్పరస్య రుశ్చ.

అత్ పరస్య = అకారముకంటెఁ బరముగా నున్న 'ర్య' వర్ణమునకు, (రుః)చ = (రు), రియ, రిజ యనునవి యగును.

వి. అతః పరస్య రు రియ రిజా చ స్యుః.

ఆశ్చర్యము - అచ్చెరువు - అచ్చెరియము - అచ్చెరిజము.

అకారముకంటెఁ బర మయి యున్న 'ర్య' వర్ణమునకు రు, రియ, రిజ యనునవి యాదేశము లగును. ఆశ్చర్య యనుచో 'ర్య' వర్ణమునకు 'రు' వర్ణము రాఁగా ఆశ్చరు-అచ్చెరువు. రియ యైన అచ్చెరియము, రిజయైన అచ్చెరిజము, అచ్చెరియము, అచ్చెరిజము నన్నవి వింతగ నున్నవి.

56. జ్ఞషహణః.

జ్ఞషహణః = జ్ఞ, ష, హ, ణకారములకు (న) ణకార మగును.

వి. స్పష్టమ్. విజ్ఞానము - విణ్ణాణము, రాజ్ఞీ - రాణి, కృష్ణ - కిన్నఁడు, విష్ణుః - వెన్నుఁడు, అపరాహ్ణః - అపరాణము ఇత్యాది.

ఇట వివృతి స్పష్ట మన్నది. ఉదాహరణములును బట్టియు నిది స్పష్టము గాకున్నది. జ్ఞకారమునకు ణకారము, రాజ్ఞీ రాణి, కృష్ణ, అపరాహ్ణ యనువానిని బట్టి ణకారముతోఁ గూడిన ష,హ,లకు ణకార మగు నని తోఁచుచున్నది.

విష్ణు - వెన్నుఁడు అనుచో నకార ముండఁగా అపరాహ్ణ - అపరాణ యగుచో ణవర్ణ మున్నది. నణావన్యోన్య మ్మని మారుపా టూహింపవచ్చును. విజ్ఞాన శబ్దమునకు విణ్ణాణ మను తద్భవరూపము విశేషము. విన్నాణము ప్రసిద్ధము. విణ్ణాణ మని కొండొకచో

వ్యవహారమునఁ దోఁచు.

జ్ఞవహణః ఇత్యనేన విజ్ఞానమ్-విన్నాణము, యజ్ఞ - జన్నము (తద్భ.29 ) సూత్ర వివృతిని బట్టి యిట వకారము విధింపఁ బడినదని చెప్పవలె. రాని యని యుండదుగదా.

## 57. హః.

హః = హకారమునకు లోప మగును.

వి. హస్యలోపస్స్యాత్. హంసః- అంచ.

'హంస'లో హకారము లోపింపఁగా అంస - సకారమునకు చకార మై (తద్భ.87) దంత్యయిగా అంచ.

## 58. క్షః కః.

క్షః = క్షకారమునకు, కః = కకార మగును.

వి. క్షస్య కస్స్యాత్ . యక్షాః - జక్కులు, పక్షి- పక్కి.

క్షకారమునందలి కకార షకారములు రెంటికిని కకారము లగును. పక్షి- పక్కి. యక్షా -అనుచో ఆదేర్యోజః (తద్భ.45) అను సూత్రముచే యకారమునకు జకార మై ప్రస్తుతసూత్రముచే క్షకారమునకు కకారములు రాఁగా జక్క అని యగును. ఉదతస్స్వ- (తద్భ.6) అను సూత్రముచే నుత్వమయి 'జక్కు' అని యేర్పడును. బహువచనమునందు జక్కులు అని యగును.

క్షకారమునందు మొదటిది కకారమె. దానికి మఱల కాదేశ మనవసరము. ఆదేశింపఁబడిన కకారముఁ తోఁ గూడియున్నపుడు షకారమునకు వచ్చు నని గ్రహింపఁదగు నని తోఁచు.

## 59. కారకరణాగారాణాం సమాస ఏవ.

కారకరణాగారాణాం = కార, కరణ, ఆగార- అనుశబ్దములకు, సమాసే ఏవ = సమాసము నందే యాద్యక్షరలోప మగును.

వి. స్పష్టమ్. సమాసే ఏషాం శబ్దానామాద్యక్షరాణాం లోప స్స్యాత్. శిక్షాకారః - సిక్కారు. స్వర్ణకారః - సొక్కారు. కుంభకారః- కుంబారు. పూజాకారః - పూజారు, కర్మకారః - కమ్మారు. ఏవం శిల్పకార రథకార వస్త్రకారాదయః.

బాధాకరణమ్ - బాదారణము. శిక్షాకారణః - సిక్కారణము.
భాండాగారః - బాండారము. గర్భాగారం - గబ్బారము.
మదిరాగారః - మదిరారము.

శిక్షాకారః అనుచో 'కార' శబ్దమునం దాద్యక్షరము 'కా' లోపింపఁగా, (క్షః కః 58) అని క్షకారమున కకార మై శిక్కార- శషోస్సః (తద్భ.24) సిక్కార. ఉదతసస్సా (తద్భ.6) - సిక్కారు. బాధాకరణ అనుచో కరణ శబ్దమునం దాద్యక్షరము 'క' లోపింపఁగా బాధారణ అని కాగా తద్భ.108 బాదారణ ములంతము. బాదారణము.

గర్భాగార అనుచో ఆగార శబ్దమున 'గా' వర్ణము లోపించినది. ఇట రెండవ వర్ణము లోపించుట విశేషము. గర్భార అని కాఁగా ఉభయత్ర రవలామ్ (తద్భ.3) అని రేఫ లోపించి గభార- తద్భ.108 చే గబార. శేషాదేశస్య. (తద్భ.23) అని ద్విత్వ మై గబ్బార ములంతము గబ్బారము. ఇతరము లూహింపఁదగును.

## 60. న భయాత్కార కరణ యోః.

భయాత్ = భయశబ్దముకంటెఁ బర మయియున్న, కారకరణయోః = కార, కరణ శబ్దమునం దాద్యక్షరమునకు, న= లోపము రాదు.

వి. భయశబ్దాత్పరతః కారకరణయో రాద్యక్షరయో
ర్లోపో న స్యాత్. భయకారః - బయకారుఁడు, భయకర
ణమ్ - బయకరణము.

భయ శబ్దము కంటెఁ బర మయి యున్న కార, కరణ శబ్దముల యాద్యక్షరమునకు లోపము లెదు.

భయకార- (తద్భ.108) బయకారుఁడు. బయరుఁ డని కాదు. ఇట్లే భయకరణ- (తద్భ.108) బయరణమని కాదు. ఈ రూపములును విశేషమె.

## 61. ఝయః కాత్యాయనస్య.

కాత్యాయనస్య = కాత్యాయనునని మతమునందు, ఝయః = ఝయ్ ప్రత్యాహారముచే బోధింపఁబడు వర్ణములకు (ద్విః) = ద్విత్వ మగును.

వి. ఝయో ద్విత్వం స్యాత్కాత్యాయనస్య మతే.

ఝయ్ ప్రత్యాహారముచే బోధింపఁబడు వర్ణములు వర్గప్రథమ ద్వితియ తృతీయ

చతుర్థాక్షరములు. కాత్యాయనుని మతమున వీనికి ద్విత్వ మగును.

## 62. నిత్యం జిహ్వామూలీయోధ్మానీయయోర్లుక్.

జిహ్వామూలీయోపధ్మానీయయోః = జిహ్వామూలీయో పధ్మానీయములకు, నిత్యమ్ = నిత్యముగా, లుక్ = లోప మగును.

వి. తద్భవే జిహ్వామూలీయోపధ్మానీయయోర్నిత్యం లోపస్స్యాత్ ద్విత్వం చ స్యాత్. మనక్క్రంజము, మనప్పదుమము.

సంస్కృతీయము లగు జిహ్వామూలీయోపధ్మానీయములకుఁ దద్భవత్వమున నిత్యముగా లోప మగు. కవర్గమునకుఁ బూర్వమం దున్న విసర్గము జిహ్వామూలీయము. పవర్గమునకుఁ బూర్వమునం దున్న విసర్గ ముపధ్మానీయము. మనఃకంజ శబ్దమునందు జిహ్వామూలీయ మీ సూత్రముచే లోపించి మన కంజ యని యుండఁగాఁ బూర్వసూత్రముచే కకారమునకు ద్విత్వ మై మనక్క్రంజ మని యగును.

మనఃపద్మ శబ్దమున నుపధ్మానీయము లోపించి ద్విత్వాదులతో మనప్పదుమము.

కగటడతదప ః కః పశోరుపర్యద్రే (తద్భ.10) అను (ప్రాకృత) లక్షణమునను నీ కార్యము చెప్పఁబడె. ఆ సూత్రమున కీ మనక్క్రంజము, మనప్పదుమము అనునవియు అయుక్తస్యరియా (తద్భ.26) అనుసూత్రము నొద్ద నుదాహరింపఁ బడినవి. అటఁ దెలుగున వీని లోపమును బ్రస్తావింపకున్న పునరుక్తి లేకుండెడిది.

## 63. ఆది మధ్యాన్తా నా మౌచిత్యే.

ఔచిత్యే = కవిప్రయోగ ప్రసిద్ధ రూప మైన యౌచిత్యము ననుసరించి, ఆదిమధ్యాన్తానామ్ =. కొన్నిశబ్దములందు మొదటి, నడిమి, చివరి వర్ణములు లోపించును.

వి. ఆదేర్మధ్య స్యాన్త్యక్షరస్య వా లోపస్స్యాదౌచిత్యే.
భోజన – బోనము మహారాష్ట్ర – మరాటి, కుర్కుర – కుక్క, గురువ – కొవ్వు. గస్యకః అస్య ఉకారః, (ఉకారస్య టకారః) మధ్యాక్షరలోపః
ద్విత్వం, కొవ్వు, ఇత్యాది.

కవి ప్రయోగముల ననుసరించి కొన్ని శబ్దముల నాదిమధ్యావసానములం దున్నవర్ణములు లోపించును. బోజన-ఇందు నడిమి దగు జవర్ణమునకు లోపము. (తద్భ.108) బోనము. గురువ శబ్దమునందు గకారమునకు (తద్భ.18) కకారము కురువ ఇణఏఛ్ .(తద్భ.4) ఉత్వమున కొత్వము. కొరువ ప్రస్తుతసూత్రముచే మధ్యాక్షరలోపము. కొవ ఉదతస్పా (తద్భ.6) అత్వమున కుత్వము, కొవు, శేషాదేశస్య. (తద్భ.23)? చే ద్విత్వము కొవ్వు.

## 64. ణమాద్ధేః.

ణమాదేః = ణకారమునకును, మకారమునకుఁ బూర్వమునం దున్న, హః = హకారమునకు లోప మగును.

వి. ణకారమకారాపేక్షయా పూర్వోచ్చార్యమాణస్య హస్య
లోపస్స్యాత్. పూర్వాహ్ణః - పువాణము. బ్రాహ్మణ-
బమ్మణుఁడు - వబయో రభేదః వమ్మణుఁడు.

ణకార మకారములతో సంయుక్త మయి వానికిఁ బూర్వము నం దున్న హకారమునకు లోప మగును.

అపరాహ్ణః - హకారము లోపించి అపరాణము దీనిని జ్ఞషహణః (తద్భ.56) అను సూత్రము నొద్ద నుదాహరించుట యనవసర మని యీ సూత్రముచే స్పష్టము.

బ్రాహ్మణ. ప్రస్తుత సూత్రముచే హలోపము బ్రామణ - బమ్మణ యని కాఁగా వకార బకారము లభిన్నములు గావున వకార మై వమ్మణుఁ డని యగును.

వి. రవలామిత్యనేన - శబ్ద-సద్దు. (పాణీయం పాణి)
పుస్తక-పొత్తము, ఉకారస్య ఓకారః సస్య లోపః
శేషస్య ద్విత్వమ్. పొత్తము.

దీని కీ సూత్రములో సంబంధము లేదు. 'రవలామధశ్చ' యను సూత్రముచే బకారము లోపించి (తద్భ.23) ద్విత్వముతో సద్దు.

పుస్తక శబ్దమున సకారము లోపించి పుతక 'ఆది మధ్యాన్తానా' మ్మను పూర్వ సూత్రముచే కవర్ణము లోపించి పుత యని కాఁగా ఇణఏఛ్ (తద్భ.4) ఉత్వమున కొత్వ మై పొత తద్భ.23 ద్విత్వ మై పొత్త ప్రథమైకవచనమున ముపర్ణకముతో పొత్తము.

## 65. సమాసే వా.

సమాసే = సమాసమునందు, వా = లోపము వికల్పముగా నగును.

వి. సమాసే పూర్వపదాన్త్యస్య ఉత్తరపదాదేర్వా సస్వర
వ్యఞ్జనస్య వాలోప స్స్యాత్. శక్తి ధరః – సేదరు.
వేగస్వరః – వేసరు, ముక్తస్థాయి – ముత్తాయి,
మానవేశ్వరః – మాణిసరుఁడు.

సమాసమునందు మొదటిపదము చివరి యక్షరమునకు లేదా చివదిపదము మొదటి యక్షరమునకు (అచ్చుతోఁగూడిన హల్లు మొత్తమునకు) వికల్పముగా లోప మగును.

'శక్తిధర' శబ్దమున పూర్వపదాంత్య మగు 'క్తి' వర్ణములోపము. మాణిసరుఁడు మానవేశ్వర శబ్దమున నుత్తరపదాద్యక్షరము లోపించినదని వివృతి యుద్దేశము గావచ్చును.

'వా' యనుటకు లోపము రాని యవస్థ యుదాహరింపఁబడలేదు. వీని ప్రక్రియ సమగ్రముగా స్పష్ట మగుట లేదు.

## 66. దచషాం (దుచుచౌభా?) ద్వ్యచతుష్షణ్ణామాదౌ.

ఆదౌ = (సమాసమునందు) మొదట నున్న, ద్వ్యచతుష్షణ్ణామ్ = ద్వి, చతుః, షట్, శబ్దములమొదట (దచషామ్. దకార చకార షకారములకుఁ గ్రమముగా లోప మగును.)

వి. స్పష్టమ్. ద్వా త్రింశత్ – బత్తిసా. లోపః, వస్య బః,
రేఫానుస్వారయో ర్లుక్. ద్విత్వదీర్ఘౌ చ, అంత
తకారలోపః శస్య సః దీర్ఘం చ బత్తీసా
ద్వా వింశతి. వావీసా.

ద్వాత్రింశత్ అను శబ్దమున మొదటి దకారమునకుఁ బ్రస్తుత సూత్రముచే లోపము. వాత్రింశత్. తద్వ.40. చే వకారమునకు బకారము. బాత్రింశత్. రేఫమునకు (తద్వ.3) సున్నకు(?) లోపము. బాతిశత్. (హ్రస్వము?) బతిశత్. తద్వ.23చే ద్విత్వము బత్తిశత్. తద్వ.24. శకారమునకు సకారము బత్తిసత్. తద్వ.63? తకారలోపము బత్తిస దీర్ఘము (తద్వ.91?) బత్తీసా ఇతరము లూహింపవలసియున్నది.

వి. అహంకారః– హంకారము, ఉభయకారః –
బయకారుఁడు, ఉకారలోపే భస్య బత్వమ్
ఉభయంకరోతీ త్యుభయంకారః, ఉభయ

శబ్దేన వాక్యం గానమితి, వాక్యం రచయతి
గాయతి చ స ఉచ్యతే బయకారుఁడు.

తద్భ.63 సూ.చే 'అహంకార' శబ్దమున నాద్యక్షరము 'అ' లోపింపఁగా 'హంకార' అని యగును. ములంతము హంకారము.

ఉభయకార శబ్దమున మొదటి ఉకారము తద్భ.63 చే లోపింపఁగా భయకార తద్భ 108 చే భకారమునకు బకార మై బయకార అని యగును. దీని కుత్వడుబ్జులు వచ్చి బయకారుఁడు, ఉభయమును జేయువాఁడు ఉభయకారుఁడు. ఉభయ మనఁగా వాక్యమును, గానమును, వాక్యమును రచించుటయు దానిని గానము చేయుటయు నను రెం డంశములను సమర్థుఁ డని యర్థము. ఈ తద్భవ రూపము లపూర్వముగాఁ దోఁచు.

## 67. ఇత్తాలవ్యే.

వి. స్పష్టమ్. శ్రీః- సిరి. వజ్రమ్ - వజిరము.

తాలవ్యే = తాలవ్య మగు హల్లుపై, ఇత్ = (సంయుక్తము లగు హల్లులనడుమ) ఇత్వము వచ్చును.

'శ్రీ' ఇచట శకారము తాలవ్యము కావున దానిపై నిత్యము. శిరీ- శకారమునకు (తద్భ.24) సకార మై సిరి.

వజ్ర శబ్దమున జకారము తాలవ్యము. ఇత్వ మయి వజిరము. వికర్షలో (తద్భ.22) నిట నిత్వము చేరుట చెప్పఁబడె.

## 68. ప్రేమ ద్రుతయోశ్చ.

ప్రేమ ద్రుతయోః చ = ప్రేమ ద్రుత యను శబ్దములందు సయితము సంయుక్తము లగు హల్లులనడుమ నిత్వ మగును.

వి. ఇత్యేతయో రాత్వలక్షణం బాధిత్వా తాలవ్య లక్షణ మేవ.
పిరేము, దిరేత.

ప్రేమ ద్రుత శబ్దముల సంయుక్తము నందలి హల్లు తావ్యము గాకున్నను తాలవ్యములకు వలెనె యిత్వ మగును. ప్రేమ - ప్ర్ఏ - పిరేమ. ఇట్లె దిరేత.

పిరేమ, దిరేత యను నీ శబ్దములు వింత.

## 69. ఆదౌ లిచ.

లి = లకారము పరముగా నున్నపుడు సయితము, ఆదౌ = దానికిఁ బూర్వమునందు ఇత్వ మగును.

వి. గ్లాని, గిలాని, మా.

గ్లాని యను శబ్దమున సంయుక్తాక్షరముపైఁ దాలవ్యేతరస్వర మున్నది. అయ్యది లకారముతో సంయుక్త మగుటను బట్టి యీ సూత్రముచే నడుమ నిత్వము వచ్చును. గ్లాని - గిలాని.

వి. మ్లాని, విప్లవాదౌ చ - మిలాని, విపిలవము.

మ్లాని, విప్లవ, మొదలగు శబ్దములందు సయిత మిత్వ మగును మిలాని, విపిలవము.

## 70. పూర్వస్వరోఽన్యస్మిన్.

అన్యస్మిన్ = తాలవ్యేతర మగు స్వరము పర మగుచుండఁగా, పూర్వస్వరః = ముందటి యచ్చు చేరును.

వి. అన్యస్మిన్ స్వరే పరే పూర్వస్వరస్స్యాత్. మార్గః - మారిగము, దౌర్తమ్ - దౌరతము.

'మార్గ'శబ్దమున నత్వము పరముగా నుండుటచే సంయుక్తము లగు హల్లుల నడుమ నత్వము చేరును. మారిగము, సంయుక్తము లగు హల్లులపై నున్న స్వరము వచ్చుట గమనింపఁదగు.

## 71. ప్రస్యచ.

ప్రస్య - చ = ప్ర వర్ణమునందు సయితము మత్వము సంయుక్తము లగు హల్లుల నడుమఁజేరును.

వి. ప్రశబ్దే విక్రృష్యమాణయోర్మధ్యే అత్ స్యాత్. ప్రవీణః - పరవీణుఁడు.

ప్రవీణ = పర వీణుఁడు మొ॥

## 72. చంద్రాదేర్వా.

చంద్ర ఆదేః = చంద్ర మొదలగు శబ్దములయందు, వా = వికల్పముగా నిత్వముతోను ఉత్వముతోను వ్యవధానము గల్గును.

వి. చంద్రాదావితా ఉతా చ వ్యవధానం స్యాత్.
చెందిరుఁడు – చెందురుఁడు, చందిరుఁడు – చందురుఁడు,
హర్షః = హరిసము – హరుసము.

చంద్ర = ఇత్వము చేరి చందిరుఁడు, ఉత్వము చేరిన చందురుఁడు.

## 73. ఇచ్చమత్కారే.

చమత్కారే = చమత్కార శబ్దమునందు, ఇత్ = ఇత్వమగును.

వి. చమతికారము.

చమత్కారమనుచో సంయుక్తములగు హల్లుల నడుమ నిత్వము చేరఁగా చమతికారము.

## 74 ఉద్భుక్తాదేరుదుత్తరస్య.

భుక్తాదేః = భుక్త మొ॥ శబ్దములందు, ఉదుత్తరస్య = ఉత్వము పైని గలిగిన సంయుక్త హల్లుల నడుమ, ఉత్ = ఉత్వ మగును.

వి. తకారోఽను బంధః ఉకారాత్పరసం
యోగో వా భుక్తాదిః తస్య వికృష్యమాణో
(తాలవ్యవదధాత్?) భుక్తమ్ – భుకుతము, యుక్తమ్ – యుకుతము.

ఉత్ అనుచో తకార మనుబంధము (ఇత్తు) కావున 'ఉ'కారమే యగును. భుక్తాదు లగు శబ్దములలో నుత్వముపైని గల సంయుక్తములగు హల్లులనడుమ నుత్వము చేరును.
భుక్త – భుకుత – ము. మొ॥.

## 75. వా భుక్తి ముక్తి సుప్తి భక్తి శక్తి మూర్తి భక్త శక్తాదౌ.

వి. ఏషూద్వా స్యాత్ పక్షే యథా ప్రాప్తమ్. భుకితి – భుకుతి,
ముకితి – ముకుతి సుపితి – సుపుతి, సకితి – సకుతి,
మూరితి – మూరుతి, భకితుఁడు – చకుతుఁడు, ముకితుఁడు –

ముకుతుఁడు, శకితుఁడు - శకుతుఁడు.

భుక్తి, ముక్తి, సుప్తి, భక్తి, శక్తి, మూర్తి (భక్త) మొదలగు శబ్దములయందు వికల్పముగా నుత్వ మగును. ఉత్వము రాని పక్షమున 'ఇత్తాలవ్యే' యని యిత్వ మగును.
భుకుతి- భుకితి. మొ॥.

### 76. భక్త శక్త యో రత్వమ్.

వి. స్పష్టమ్. భక్తమ్ - బకతము - బకుతము, శక్తమ్ -
సకతము - సకుతము.

భక్త, శక్త శబ్దములందుఁ బూర్వసూత్రముచే నుత్వము రాని పక్షమునం దత్వము వచ్చును. తద్భ.108 బకతము (తద్భ.24) సకతము. పూర్వసూత్రముచే నుత్వ మయిన బకుతము, సకుతము.

### 77. నక్ష్టాదేః.

క్ష్టాదేః = క్ష మొదలగు సంయుక్తాక్షరములందు, న = వికర్ష లేదు.

వి. క్ష్టాదేర్న్వికర్షః.

క్ష మొదలగు సంయుక్త స్థలములనడుమ నెట్టి స్వరమును జేరదు. 'క్ష్టః కః' అని కకార మగును.

### 78. పల్లవ సజ్జన, మజ్జన, కుక్కుట, ధక్కాదౌ.

వి. ఏషు వికర్ష లోపౌ నస్తః.

పల్లవ, సజ్జన, మజ్జన, కుక్కుట, ధక్క మొదలగు శబ్దముయందును వికర్ష లేదు. లోపమును లేదు.

### 79. సరస కరేర్వ్యాలాన బాలికా వైఢూర్య కరాళ మహారాష్ట్ర రావణస్య.

వి. ఆదీనాం ద్వితీయ తృతీయ

యోః విపరివృత్తిస్స్యాత్. వే - దియ్యము మరహోటు
ఇత్యాది.

సరసాది శబ్దముల రెండు మూడక్షరము విపర్యాసము నందు నని య భిప్రాయ మేమో.- లక్ష్య లక్షణములు రెండు నస్పష్టములు.

80. నారికేళే ద్వితీయ చతుర్థయోః.

వి. నారి కేళము - నాళి కేరము.

నారికేళ శబ్దమునందు రెండవ యక్షరమును నాల్గవ యక్షరమును దారుమరగును. నాళికెరము.

81. విచికిలే ద్వేతుర్యతృతీయానామ్.

వి. ద్వితీయాదిస్థానేషు స్థితిః విచికిలము, విలచికము,
వికచలము ఇత్యాది.

విచికిల శబ్దమునందు, రెండు, మూఁడు, నాలుగక్షరములు తారుమారగును. విచికలము మొ॥.

82. (ఇన్నెజావస్యేత్యాదినా?) మరకతాదీనాం యథేష్టమ్.

వి. మరకతము, మకరతము, కతమరము, తమకరము
కరతమము ఇత్యాది.

మరకత మొదలగు శబ్దములందు వర్ణములు యథేష్టముగాఁ దారుమా రగును. మకరతము మొ॥

83. సహ హలః.

వి. యథేష్టమత్రపరివృత్తిః హలాహలము,
హలహాలము, లాహలహము, హలలాహము, లాలహహము,
హహలాలము ఇత్యాది.

హ, ల, యను వర్ణములు యథేష్టముగాఁ దారుమారగును. హాలహలము. హలహాలము, మొ॥ లాహలహ మను రీతివి వింతగా నున్నవి.

## 84. న రహౌ.

రహౌ = రేఫమునకును హకారమునకు, న = ద్విత్వము లేదు.

వి. రహార్నద్విత్వం స్యాత్.

## 85. లుగ్దీర్ఘాత్.

దీర్ఘాత్ = దీర్ఘము కంటెఁ బర మయియున్న బిందువునకు, లుక్ = లోప మగును.

వి. దీర్ఘా ద్బిందోర్లుక్ స్యాత్. కాంస్య – కాసు.

కాంస్య సున్న లోపించి కాస ఉదతస్సా – తద్భ.6. కాసు.

## 86. సమంబాదీనామ్.

సమ్ అంబాదీనామ్ = సమ్ అను నుపసర్గకు సంబంధించినదియును, అంబా మొదలగు శబ్దములందలిదియు నయిన సున్న (దీర్ఘముకంటెఁ బరముగా లేకున్నను) లోపించును.

వి. సమిత్యుపసర్గస్య అంబాదేశ్చ సంబంధినో బిందో
ర్లుక్ స్యాత్. సంస్కృతము – సక్కియము.వృద్ధ్యాది
త్వాదత్వమ్? సంముఖః – సముకము. సంవాదః–
సవాదు, అంబా – అబా ద్విత్వం చ అబ్బ.

సంముఖము (తద్భ.108) సముకము.

సంస్కృత మనుచో నిట సున్న లోపింపఁగా నిది వృద్ధ్యాదులలోనిది గావున ఋతోఽ ద్వృ ద్ధాదౌ (తద్భ.36) అని యత్వమగును. సక్కియమనియగుటయు నా రూపము ను విశేషములే.

అంబా యనుచో సున్నలోపింపఁగా బకారమునకు (తద్భ.61?) ద్విత్వ మయి అబ్బ.

వి. కాంస్యం హ్రస్వః యలోపః కంసం ఇతి స్థితే.

కాంస్య శబ్దమున దీర్ఘమునకు హ్రస్వ మై యకారము లోపించి 'కంస' అని యగును. పిదప –

## 87. సశ్చః.

వి. అనుస్వారాత్పరస్య సస్య చ స్స్యాత్. కంస- కంచు,
'ఉదతస్సు పి మహదమహతోః' రిత్యనేన ఉత్వమ్. కంసం-
కంచము. హంస- అంచ ఇత్యాది.

సః = అనుస్వారముకంటెఁ బరముగా నున్న సకారమునకు, చః = చకార మ్తగును.

కంస శబ్దమున నిట్లు సకారమునకు చకారము రాఁగా కంచ. ఉదతస్సుపి యని యుత్వము కంచు. ఈ పరిచ్ఛేదముననె ఉదతస్సు యనియుఁ గలదు. (తద్భ.6) పునరుక్తులవలన ననర్థములు గల్గుచున్నవి. ఇ ట్లితరములు.

## 88. హ్రోద్బిందుర్వా హలి.

హలి = హల్లు పర మగు చుండఁగా, హ్రోత్ = హ్రస్వముపైని, వా = వికల్పముగా, బిందుః = బిందు వగును.

వి. తద్భవే హ్రస్వాద్ధలి పరే బిందుర్వా స్యాత్.

హల్లు పర మయినపుడు హ్రస్వముపైని వికల్పముగా బిందువు వచ్చును.

వి. కక్షః వ్యత్యయః కకారలోపః షకారస్య సకారః
సస్య చః బిందుః చంక.

కక్ష శబ్దమున వర్ణవ్యత్యయము (క్షక) కకారమునకు (తద్భ.9?) లోపము (షక) షకారమునకు సకారము (తద్భ.24) పూర్వ సూ॥చే (సక) సకారమునకు చకారము- చక. ప్రస్తుతముచే బిందువురాఁగా చంక అని యగును.

## 89. సార్ధ్యోదేః.

హలి = హల్లు పర మైనపుడు, దేః = దీర్ఘముకంటెఁబరముగా, సార్ధ్యః = ఖండబిందు వగును. పూర్వసూత్రము నుండి హలి యన్న దనువర్తించును.

వి. దీర్ఘాద్ధలి పరే అర్ధ బిన్దుస్స్యాత్. భ్రాంతి - భ్రాఁతి.

హల్లు పరముగా నున్నపుడు దీర్ఘము పైని ఖండబిందు వగు.

భ్రాంతి యనుచో 'ఖఛఠథఫ' (తద్భ.108) యను సూత్రముచే భకారమునకు బకారము 'బ్రాంతి' లుగ్దీర్ఘాత్ అని బిందులోపము - బ్రాతి. ప్రస్తుతసూత్రముచే దీర్ఘముపై నఱసున్న - బ్రాఁతి యని యగును.

## 90. శశ్చః.

శః = శకారమునకు, చః = చకార మగును.

వి. తద్భవే శకారస్య చ స్స్యాత్. పాశకాః - పాచికలు. వేశంతః - వెంచ, శష్కులిః - చక్కిలము, శ్యామాకాః - చామలు, శిశిరః - చలి ఇత్యాది.

పాశక - శబ్దమునందు శకారమునకు చకార మయి యిత్వముతో (తద్భ.47?) పాచిక అని యగును. ఇట్లె యితరములు.

## 91. చస్సః.

చః = చకారమునకు సః = సకార మగును.

వి. చస్య సస్యాత్. కాచః-కాసు, పిశాచః - పిసాసి, ఇత్యాది.

'కాచ' - చకారమునకు సకార మై - కాస - (తద్భ.6) ఉత్వ మయి కాసు అని యగును. ఇట్లితరములు.

## 92. వా హ్రస్వదీర్ఘౌ వన్యోన్యమ్.

హ్రస్వదీర్ఘౌ = హ్రస్వమును, దీర్ఘమును, అన్యోన్యమ్- పరస్పరము, వా = వికల్పముగా నగును.

వి. స్పష్టమ్.

హ్రస్వమునకు దీర్ఘమును, దీర్ఘమునకు హ్రస్వమును వికల్పముగా నగును.

వి. మాతు (బోలుబోలిలావచనే?). మాతు తస్య టకారః. ఉదత ఇత్యనేన ఉకారస్య అకారః మాట.

మాతు శబ్దమున తకారమునకు టకారము మాటు 'ఉదతః' అను సూత్రముచే ఉత్వమున కత్వము వచ్చి మాట అని యగును.

బొబ్బ బొబ్బరి బొబ్బరాస్సింహ నాదే
బొబ్బ - సింహనాదము.

బొబ్బ, బొబ్బరి, బొబ్బర అనువానికి సింహనాదము అని యర్థము.

## 93. త్రేస్తినితీనీ.

త్రేః = త్రిశబ్దమునకు , తిని తీని = తిని, తీని అని యగును.

వి. స్పష్టమ్. తిని తీని-

తిని, లేదా తీని యనఁగా మూఁడని యర్థము. ఇది విశేషమె.

## 94. ద్వేశ్చేన్నిరు వేదోనయ?.

వి. స్పష్టమ్.

ద్వి శబ్దమునకు ఇను, ఇరు, ఇద్ద- ఇత్యాదు లగుటను జెప్పుసూత్ర మిది గావచ్చును. అస్పష్టము. ఇట్టిది సంఖ్యావాచకప్రకరణమున గలదు.

## 95. మాన్వానోర్మంతవంతౌ [1].

మాన్వానోః = మతుప్పున కేర్పడిన మాన్ వాన్ అనువానికిఁ గ్రమముగా, మంత వంతౌ = మంత, వంత యనునవి యగును.

వి. మతుపో మంత వంతౌ స్తః. నీతిమంతుఁడు,
మతిమంతుఁడు ధనవంతుఁడు, గుణవంతుఁడు ఇత్యాది.

మాన్ అనుదానికి మంత, వాన్ అనుదానికి వంత అని యగును. నీతిమాన్ - నీతిమంత- నీతిమంతుఁడు. గుణవాన్ - గుణవంత - గుణవంతుఁడు.

ఇవి తత్సమములుగా గుర్తింప బడినవి. వీనిని సాధించు పద్ధతి యిటఁ బ్రాకృత వ్యాకరణానుసారిగాఁ గనఁబడుచున్నది. ఆం.కౌ. (హలంత) తత్సమములుగా సాధించినట్లు తోఁచు.

1. మాన్వానోర్మంతవంతౌ ఆం.కౌ.హ.4.
మతుపోమంతః . వై.చం.హ.31

## 96. ఉదతః

అతః = శబ్దము మొదటి య త్తునకు, ఉల్ = ఉత్వ మగును.

వి. తద్భవే పదాదేరత ఉల్ స్యాత్.

తద్భవత్వమున శబ్దాదియందలి యత్వమున కుత్వ మగును.

వి. అబ్ధమిత్యత్ర-

## 97. వర్గ్యో వర్గస్య సవర్ణః

వర్గస్య = వర్గాక్షరములకు, సవర్ణః = సవర్ణమైన, వర్గ్యః = వర్గాక్షర మగును.

వి. స్పష్టమ్. ఇత్యనేన బకారస్య పకారః, ద్విత్వం చ ఉత్వంచ ఉప్పు.

అబ్ధ శబ్దమునందు తద్భ.10. చేదకారములోపించి(అబ) ప్రస్తుతసూత్రముచే బకారమునకు పకారమై అప యని కాగా ద్విత్వము - అప్ప(23) ఉదతః అని మొదటియత్వమున కుత్వము ఉప్ప. చివర (తద్భ.6) సూ.చే చివర నుత్వ మై ఉప్పు అని యగును.

## 98. ఓదేతః.

ఏతః = ఏకారమునకు, ఓల్ = ఒత్వమగును.

వి. తద్భవే ఏకారస్య ఓకార స్స్యాత్. ఏకః - ఒకటి.

'ఏక' శబ్దమునం దేకారమున కొత్వ మై ఒక (ఒకటి) అని యగును.

## (17)ఇదుతః.[1]

---

[1]. ఇది 17వ సూత్రముగాఁ బూర్వముక్తము కాన దీనికిఁ బ్రత్యేకపరిగణనము లేదు.

ఉతః = హ్రస్వ మైన యుకారమునకు, ఇత్ = ఇత్వమగును.

వి. ఉత ఇత్ స్యాత్. శష్కులము - చక్కిలము.

శష్కుల - అనుచో శకారమునకు (తద్భ.90) చకారము షకారమునకు (తద్భ.10) లోపము. ద్విత్వము (తద్భ.23) చక్కుల అని కాఁగా నీ సూత్రముచే నిత్వ మయి చక్కిల- ములంతము - చక్కిలము.

## 99. ఏదతశ్శేషస్య.

శేషస్య = మిగిలి యున్న, అతః = అత్వమునకు, ఎత్ = ఎత్వ మగును.

వి. శేషస్య మధ్యాంత యోర్విద్యమానస్య అత ఏత్ స్యాత్.
శర్కర - చక్కెర.
-ఉక్కెర, నిష్కర్షః - నిక్కెము, కాష్ఠమ్ - కట్టె.
ముక్తాః - ముత్తెము, మర్దళః - మద్దెల, కర్పూరః - కప్పెర,
కూపరః - కొప్పెర, బర్కరః - బక్కెర - బకెర, కర్తరి - కత్తెర.

(లోపింపఁగా) మిగిలినదియు శబ్దమున అనాది యందున్నదియు నయిన యత్వమున కెత్వము వచ్చును. శర్కర యనుచో శకారమునకు చకారము (తద్భ.90. చర్కర) రేఫకు లోపము (తద్భ.3) కకారమునకు ద్విత్వమయి (తద్భ.23) చక్కర అని కాఁగా నీసూత్రముచే రేఫ లోపింపఁగా మిగిలిన దగు కకారము పై నత్వమున కెత్వము రాఁగా చక్కెర. ఇట్లితరము లూహ్యములు.

## 100. ఇదతః.

అతః = అకారమునకు, ఇత్ = ఇకార మగును.

వి. అత ఇకారస్స్యాత్. చణకః - సనిగె, చస్సః ఇత్యనేన
చకారస్య సకారః.

చణక అనుశబ్దమున 'చస్సః' (తద్భ.91) అను సూత్రముచే చకారమునకు సకార మై సణక యని కాఁగా నణావన్యోన్యమ్ (తద్భ.42) అని ణకారమునకు నకార మై సనక, కోగః తద్భ.19 కకారమునకు గకారమై సనగ అని యగును. ప్రస్తుతసూత్రముచే ఇత్వమయి సనిగ. (సెనగ అనియె ప్రసిద్ధము).

## 101. పదాదే ర్గః

వి. దేశ్యే పదాది గకారస్య ఏకారస్స్యాత్. గెజ్జలు, గెరిత, (గెలుపు) గెరిసె, గెజ్జి, గెయ్యాళి గెడ, గేడి, గెనిమె, గెంటు, గెంటము ఇత్యాది.

పదాదేః = దేశ్యపదము మొదట నున్న దగు, గః =గకారముపయిని ఎత్వ ముండును. గెజ్జలు మొ॥ ఇవి దేశ్యశబ్దములు అయ్యును గజ్జెలనురీతిగా నత్వముతోనే కవిప్రయుక్తములు లోకవ్యవహారమున మాత్ర మిట్టి స్థితి గలదు.

## 102. అత్తజ్జే.

తజ్జే = తద్భవపదములందు మాత్రము మొదట నున్న గకారముపై, 'అత్ = అత్వమె యుండును

వి. దద్భవే పదాదే ర్గస్య అకారఏవ స్యాత్.
ఘంటా – గంట (కర్పూరః – గబ్బు?).

గంట ఘంటాశబ్దభవము. కాఁగా గెంట యనుతీరుగా నిట నెత్వ ముండదు.

వి. కపర్దః అంత్యాక్షరలోపః, కస్య గః, వస్య ద్విత్వమ్ గవ్వ.

కపర్ద శబ్దము నందు చివరి యక్షరము (ర్ద) (తద్భ.63) లోపింపఁగా కప. కోగః- (తద్భ.19) అను సూత్రముచే కకారమునకు గకార మై గప. పకారమునకు వకారమై (తద్భ.41) గవ- (తద్భ.23) ద్విత్వముతో గవ్వ.

వి. కంపు ఇత్యత్ర బిందో ర్లోపః కస్యగః, పస్యబః ద్విత్వం గబ్బు ఇత్యాది.

కంపు అనుచోట బిందువు (తద్భ.85) లోపించి కపు – కకారమునకు గకారము (తద్భ.19) గపు – పకారమునకు బకార మై గబు – బకారమునకు ద్విత్వ మై (తద్భ.23) గబ్బు. అని యగును.

## 103. లతా మక్షికాఖలీనాదిష్వేత్.

వి. ఏతత్ప్రభృతిషు గకారస్య ఏత్ స్యాత్. తీగె, ఈఁగె.

లత – (తీగ) మక్షిక (ఈఁగ) ఖలీన (వాగె) మొదలగు శబ్దములందలి గకారము పైని ఎత్వ

మగును. తీఁగె మొ॥ ఎత్వము రానిచోఁ తీఁగ. తరువాత నిత్యముగాఁ జెప్పుటచే నిట నిత్యము గా దని యర్థ మగును.

## 104.(ఇతో నిత్యమ్?).

వి. ఇతః పరస్య పదాంతగతస్య నిత్య మేత్ స్యాత్.
 వళిగె, మరిగె, అరిగె, బరిగె, సరిగె, గౌళిగె, బాడిగె, పడిగె,

ఇకారము కంటెఁ బరముగా నున్నదియుఁ బదాంతమునందున్నదియు నయిన గకారము పయి నిత్యముగా నెత్వ మగును. వళిగె మొ॥ ఇదియు లోకవ్యవహారమందె.

వి. చేష్ట చస్య సకారః షస్య లోపః.

చేష్ట శబ్దమునందు చకారమునకు సకార మై (తద్భ.91) షకారము (తద్భ.10) లోపింపఁగా- సేట అని యగును.

వి. టోస్తుః[1] - టవర్గస్య తవర్గస్స్యాత్ - సేత.
 (నారాస-నారాచము)

టోః = టవర్గీయాక్షరములకు, తుః = తవర్గీయాక్షరము లగును.

'సేట' యని యైనచోట నిట టకారమునకు తకార మై సేత యని యగును. (ఇది 'చేత' గాఁ బ్రసిద్ధము).

వి. తద్భవే- వర్త్మ-(బాట) రేఫ మకారయోర్లోపః
 వస్య బః, దీర్ఘః తస్య టః బాట. వస్త్రమ్ - బట్ట.
 వర్త్మ - బాట.చూ.(తద్భ.15). వస్త్ర - తద్భ.3 - వ స్త.
 తద్భ.10. వత. తద్భ.39. వట. తద్భ.40. బట.
 తద్భ.23. బట్ట.

## 105. మో వః.

మః = మకారమునకు వః = వకార మగును.

వి. అయుక్త మస్య వస్స్యాత్. వార్త- మాట, రేఫలోపః

---

1. తద్భ.39. మఱల నిటవివృతి యుండుట యె విశేషము. ఈ పద్ధతి యటనట నిందుఁగలదు.

తస్య టః-

వార్త శబ్దమునందు, రేఫ (తద్భ.3) వాత తకారమునకు (తద్భ.39) టకార మై, వాట. ప్రస్తుతసూత్రముచే వకారమునకు మకార మై మాట యని యగును.

వి. బృందమ్ - పిండు, వృద్ధి - వడ్డి, మృదిమా - మడ్డి,
కుధ్రః - కొండ, రేఫస్య లోపః ధస్యదః దస్య డః.

కుధ్ర శబ్దమునందు రేఫ (తదభ.3) లోపించి ధకారమునకు (తద్భ.110) దకారమును, దకారమునకు (తద్భ.39) డకారమును రాఁగా కుడ ఉత్వమున కొత్వమై (తద్భ.4) హోద్బిందుర్వాహలి (తద్భ.88) మీఁద బిందువు వచ్చి కొండ అని యగును.

వి. ఓదతః వర్త్మని దోవ.

వర్త్మ శబ్దమునందు రేఫ మకారము తద్భ.3,14 లోపించి వత. వర్ణవ్యత్యయము (తవ), అత్వమున కోత్వ మయి తోవ అని యగును.

106. దస్తస్య [1].

వి. తస్య = తకారమునకు, దః = దకార మగును.

పై నేర్పడిన తోవ యనుచో తకారమునకు దకార మై 'దోవ' యని యగును.

107. వికర్షవ్యత్యయ పాదార్థోక్తి విశేషతః .

వి. ఏభిర్విశేషైస్తద్భవాస్స్యుః

సంయుక్తము లగు హల్లుల నడుమ నచ్చులు చే రుటయు, (వికర్ష) వర్ణములు ముందు వెనుక లగుటయు (వ్యత్యయము) వర్ణలోపము మొదలగు వికారములచేఁ దద్భవము లేర్పడును.

---

1. మా. గ్రంథావతారిక
దస్తస్య - త్రి.శ. అనుబంధము బృహస్పతి సూత్రము.

వి. శ్రీఘ్రమ్ - శీఘర, ఇత్యత్ర ఘస్యగః శీగర
శస్యచః దంత్యః ద్విత్వమ్.

శీఘ్ర శబ్దమునందు సంయుక్తము (తద్భ.22) వికర్షము నంది శీఘర. ఘకారమునకు గకారము (తద్భ.110) శీగర, శకారమునకు చకారము (తద్భ.90) చీగర వర్ణవ్యత్యయమతో గచీర, ద్విత్వము గచ్చిర.

## (27). అదితః.[1]

వి. ఇకారస్య అత్ స్యాత్ గ్రచ్చర.

ఇతః = ఇకారమునకు, అత్ = అత్వమగును.

గచ్చిర యనుచో నిత్యమున కత్వమై గచ్చర అని యగును. గ్రచ్చర యనుచో రేఫము విశేషము.

## 108. వాహో గః.

వి. హస్య వా గస్యాత్తజ్జ దేశ్యయోః. సింహము - సింగము,
దేహము - దేగము, దాహము - దాగము, స్నేహము - సినేగము
వాహనము - వాగనము.

హః = హకారమునకు, వా = వికల్పముగా, గః = గకార మగును.

తద్భవ దేశ్యశబ్దములయందలి హకారమునకు వికల్పముగా గకారము వచ్చును.

'సింహ' యనుచో హకారమునకు గకారము రాఁగా సింగ(సింగము) అని యగును. ఇట్లితరములు.

'వా' యనుటచే గకారము రాకుండుటయు గలదు. సింహము తద్భవము గాదు. వా యనుట విచార్యము.

స్నేహము అనుచో 'ఋస్నష్టాం రియ సిన సిటాః' (తద్భ.114) అని 'సిన' అనునది యగును. ఇచట గకారము రాఁగా సినేగ మని యగును.

వి. రజక ఇత్యత్ర 'వర్గ్యోవర్గస్య సవర్ణః' ఇత్యనేన

1. ఇది 27 సూత్రముగా బాలోక్తము. వివృతి
మఱలనున్నను దీనికిఁ బ్రత్యేక పరిగణన మనవసరము.

జస్య చః దీర్ఘః చాక రేఫస్య లకారః - చాకల.

రజక శబ్దమునందు, 'వర్గోవర్గస్య సవర్ణః' (తద్భ.97) ('ఆద్యానాం తృతీయాః' అను వక్ష్యమాణ సూత్రముచేతను నిది సాధ్యమె) అను సూత్రముచే జకారమునకు చకారము రచక. వర్ణవ్యత్యయముతో చకర. మొదట దీర్ఘ మై (తద్భ.92) చాకర, రేఫకు లకారము వచ్చి చాకల అని యగును.

## 109. ఖఛఠథఫఘఝఢధభాం కచటతప గజడదబాః[1].

ఖఛఠథఫఘఝఢధభామ్ = ఖ, ఛ, ఠ థ, ఫ, ఘ ఝ ఢ, ధ, భ అనువానికిఁ గ్రమముగా కచటతప గజడదబాః = కచటతపగజడదబ లగును.

వి. క్రమేణ దశవర్ణానాం దశవర్ణా ఆదేశా స్స్యుః
డంభః = డబ్బు- ఇత్యాది.

వర్గ ద్వితీయ చతుర్థాక్షరములు పదింటికిని గ్రమముగా వర్గ ప్రథమ తృతీయాక్షరము లాదేశము లగును.

డంభ అను శబ్దమున నిట్లు భకారమునకు బకారము రాఁగా డంబ. తద్భ.86 అను సూత్రముచే బిందువు లోపించి 'డబ' తద్భ 23 చే ద్విత్వ మయి డబ్బ - ఉదతస్సా. (తద్భ.6) చే నుత్వమై 'డబ్బు' అని యగును.

ఖః కః (19) అనునదిపు డనవసరము.

## 110. ఆద్యానాం తృతీయాః.

ఆద్యానామ్ = వర్గాద్యక్షరములకు, తృతీయాః = వర్గతృతీయాక్షరము లగును.

వి. వర్గాద్యానాం కచటతపానాం వర్గతృతీయా గజ
డదబాస్స్యుః. కాచ - గాజు.

వర్గలయందు మొదటి వర్ణములకు కచటతప యనువానికి వర్గము లందు మూఁడవ వర్ణము లో గజడదబ యనునవి క్రమముగా నాదేశము లగును.

కాచ- యనుచో, కకార చకారముల కిట్లు గకార జకారము లై గాజు అని యగును. వర్గోవర్గస్య సవర్ణః (తద్భ.97) అనుదానిచేతనె యీ యర్థము స్పష్టము.

---

1. ఇదె సూత్రము బృహస్పతికృతముగా త్రి.శ. (అనుబంధము) లోఁ గలదు.

## 111. స్నస్తః.

స్నః = సకార నకార సంయుక్తమునకు, తః = తకార మగును.

వి. స్నవర్ణస్య తవర్ణ ఆదేశ స్స్యాత్. స్నానమ్ - తానము.

సకార నకారముల సంయుక్త వర్ణమునకు తకార మాదేశ మగును. స్నాన - తాన - తానము.

## 112. జ్ఞోనః.

జ్ఞః = జ్ఞకారమునకు, నః = నకార మగును.

వి. జ్ఞవర్ణస్య నస్స్యాత్, యజ్ఞము - జన్నము, విజ్ఞానము- విన్నాణము.

యజ్ఞ శబ్దమున జ్ఞకారమునకు నకారము రాఁగా జన్నము.

## 113. ర్యస్నష్టాం రియ సిన సిటాః.

ర్య, స్న, ష్టామ్ = ర్య, స్న, ష్ట అను నక్షరములకు, రియ సిన సిటాః = రియ, సిన, సిట యనునవి యాదేశ మగును.

వి. భార్య- బారియ, స్నానము - సినానము, కష్టమ్- కసిటము.

భార్య యనుచో 'ర్య' వర్ణమున 'రియ' రాఁగా తద్భ.110 చే భకారమునకు బకారము. బారియ. స్నాన శబ్దమున స్నకారమునకు 'సిన' రాఁగా సినానము. కష్టశబ్దమున ష్టవర్ణమునకు సిట రాఁగా కసిటము.

వి. క్వచిన్న - ఆర్య - అయ్య.

పైని జెప్పిన కార్యము కొన్ని యెడల లేదు. ఆర్య యనుచో 'ర్య' వర్ణమునకు రియ లేదు. ఆరియ యుండదు. తద్భ.3.చే రేఫ లోపించి తద్భ.92 చే హ్రస్వము. తద్భ.23 చే ద్విత్వమై 'అయ్య' యని యగును.

## 114. డుండ్వోస్తుత్.

డుండ్వోః = డు, ండు అను వర్ణములకు, తుత్ = 'తుత్' అనునది యగును.

వి. డుండ్వో స్తుత్ స్యాత్. కుడుంభము - కుతుంబము.

'తుత్' అనుచోఁ దుది తకార ముచ్చారణార్థము కావున 'తు' వర్ణమె నిలుచును. కుడుంభ శబ్దమునం దిట్లు డువర్ణమునకు తువర్ణము రాగా కుతుంబ మని యగును.

## 115. తదోర్దతౌ.

తదోః = తకార దకారములకు, దతౌ = దకార తకారము లగును.

వి. తదయో ర్దకార తకారౌ స్తః. కుతుంబము - కుదుంబము.

తకారమునకు దకారమును, దకారమునకు తకారము నగు నని యర్థము.

కుతుంబ మనుచోటి తకారమునకు దకార మయి కుదుంబ మని యగును. వర్గ్యోవర్గస్యసవర్ణః? (తద్భ.97) దస్తస్య -? (తద్భ.105.) వ్యర్థ మనఁదగు.

## 116. తీరదుర్గ మందిరేషు పాడు కోటోత్తరణాః

పుర - పాడు, దుర్గ -కోట మందిర-?

వి. కోట- దుర్గము.

## 117. ఇదైతః.

ఐతః = ఐకారమునకు, ఇత్ = ఇత్వ మగును.

వి. ఐత ఇత్ స్యాత్.
వస్యబః రేఫలోపః - వ్రైహేయ - బియ్యము,
[1]తద్ధి తేష్వ చామాదే రితి ప్రాప్తస్య ఐచ స్థాని
వత్వంస్యాత్. ఐకారస్య ఇకారః. వస్యబః రేఫ
లోపః - బియ్యము.

---

1. ఈ పంక్తులు 'అదోతః' అను తరువాతిసూత్ర వివృతి లోనున్నవి. కావియట దీనికి సంబంధము గానరాదు. ఇటనుండఁదగునని తోఁచు.

వ్రైహేయ శబ్దమునందు ఐకారమున కీ సూత్రముచే నిత్వమయి వ్రిహేయ యని కాఁగా ఉబయత్రరవలామ్ (తద్భ.3) అను సూత్రముచే రేఫలోపించి విహేయ యని కాఁగా 'హే' కు యత్వము వచ్చి? వియ్‌య. హోబః (తద్భ.40) - బియ్య ములంతము బియ్యము అని యగును.

వ్రైహేయ - అని వ్రాఁతప్రతిలోఁగన్పించు చోట హేకు యత్వము చెప్పు సూత్ర మది గానగునేమో. స్థానివద్భావాది ప్రసంగము విచార్యము.

వ్రైహేయ శబ్దము బియ్య మను నర్థముగలిగినట్లు కోశములు దెల్పవు. తద్భవమున నర్థభేదమే ఈ లక్షణము స్వరూపమింకను బరిశీలింపవలె.

వి. - సంతోషము - సంతోసము.

శషోస్యః (తద్భ.23) చే సకారమురాఁగా సంతోసము.

## 118. అదోతః.

ఓతః = ఓకారమునకు, అత్ = అకార మగును.

వి. ఓకారస్య అత్ స్యాత్.

ఓకారమున కత్వమగును. 'సంతోసము' అనుచోటి యోత్వమున కత్వము రాఁగా 'సంతసము' అనియు రూప మగును.

వి. ఇదతః మరిచము- మిరియము.

మరిచ శబ్దమునందలి మొదటి యత్వమున కిత్వము వచ్చి మిరిచ యని యగును. తద్భ.9 సూత్రముచే చకారములోపించి మిరి అ అని కాఁగా తద్భ.11 సూత్రముచే య శ్రుతి యయి మిరియ అని యగును. ఇది ములంతము మిరియము.

వి. లుప్తయశ్చ.[1]

లుప్తయః చ = లోపించిన యకారము గలచోట, గూడ నత్వమున కెత్వ మగును.

వి. ఆదిమధ్యాన్తేషు లుప్త యకారసంబన్ధినో వర్ణస్య ఎస్స్యాత్. వ్యయః- వెయము, ప్రత్యయః - ప్రత్తె యము, కన్యా-కన్నె. విద్యా-విద్దె, పద్యమ్ - పద్దెము

1 ఇది. 21 సూత్రముగా నిందుఁ బూర్వోక్తము విప్రత్యుదాహరణము లించుక భిన్న మైనను గార్యము సమానమె. కావున దీనిని వేఱు సూత్రముగాఁ బరిగణింపలేదు.

గద్య-గద్దె, పుణ్యమ్-పున్నెము, బాధ్యమ్-బాద్దెము,
ఖ్యాతి-కేతి, ఖిల్యా-కళ్ళెము, సంఖ్యమ్-సక్కెము,
వర్ణ్యః-వన్నె.

ఆదిమధ్యావసానములం దున్నయకారము లోపింపఁగా మిగిలియున్నదానిపైని అకారమున కెత్వము వచ్చును. 'వ్యయ' శబ్దమునందు (అధోమనయామ్. తద్భ.15) యకారము లోపింపఁగా వయ. ఈ సూత్రము చే నత్వమున కెత్వము రాఁగా వెయము మొ॥ ట్లితరము లూహింపఁదగును. ప్రత్యయ యనుచో నడుమను, కన్య యనుచోఁ జివరను య లోపానంతర మెత్వ మయినది.

## 119. స్త్రియామే క్వచిత్.

క్వచిత్ = కొన్నియెడల, స్త్రియామ్ = స్త్రీలింగశబ్దములకు, ఏ = ఎత్వ మగును.

వి. క్వచిత్స్థలేషు స్త్రీలింగా నామ యుక్తానాం తత్స
మానాం ఆదంతానామంత్యానా మేత్ స్యాత్ - వీణా-వీణె,
మాలా-మాలె. కళా-కళె. పేటా - పెట్టె, ఆశా-ఆసె,
దిశా-దిసె ఇత్యాది.

కొన్నియెడల స్త్రీలింగ శబ్దముల తుది నున్న ఆకారమున కెత్వము వచ్చును. వీణా- ఇచట నాకారమున కెత్వమురాఁగా వీణె. యను తద్భవరూపమేర్పడును. ఇట్లితరము లూహ్యములు.

## 120. షః ఖః.

షః = షకారమునకు, ఖః = ఖకార మగును.

వి. షస్య ఖస్స్యాత్.

షకారమునకు ఖకార మగును. 'మేష' యనుచో నిల్ల షకారమునకు ఖకారము రాఁగా 'మేఖ'.

వి. ఖస్య కః, మేషః - మేక[1]

ఖకారమునకు కకార మగును. మేఖ- మేక (తద్భ.110) ఇట సరాసరిగా షకారమునకు కకార మేల విధింపఁ బడలేదో.

---

1. అక్ స్యాత్ స్త్రియామ్? త్రి.శ.4.33.

## 121. అగమహతామ్ .

అమహతామ్ = అమహత్తు లగు శబ్దములకు, అక్ = అక్ అనునది యగును.

వి. అమహతా మక్ స్యాత్. మేక, మాట (వార్త)

అమహచ్ఛబ్దములకు 'అక్' చేరును. 'అక్' లో కకార మిత్తు. కావున లోపింపగా 'అ' చేరును. మేక్ + అ - మేక.

వి. ఇదతః దీర్ఘస్య హ్రస్వః. బస్య పః అస్యేదిత్వమ్. బాలః - పిల్ల.

బాల యను శబ్దమున 'హ్రాదేః' అను(తద్భ.13) సూత్రముచే హ్రస్వమురాగా బల తద్భ.97 సూత్రముచే బకారమునకు పకారము వచ్చి పల 'ఇదతః'(తద్భ.100) సూత్రముచే నత్వమున కిత్వమై పిల అని యగును. లకారమునకు ద్విత్వమై పిల్ల అని యగును.

తద్భవముల ప్రక్రియను నిరూపించుట ప్రధానముగాఁ గలిగిన భాగమింతటితో ముగిసినది. పైని దెలుగునందలి తద్భవ పదములు చూపఁబడుచున్నవి. ప్రత్యేకముగా విప్రతి యుండుటంబట్టి పునరుక్తిదనఁదగినవి పోఁగా నాయాతద్భవరూపవివరణమునఁ గొన్ని విశేష సూత్రములును గన్పించును. అవియు దద్భవ విషయకములె కావున నా సంఖ్య నిందులోఁ గొన సాగింపఁదగునని యట్లు చేయఁబడినది.

# అథతజ్జాః.

1. శబ్దము - చప్పుడు. శస్యచః, బస్యపః దస్య డః పస్య ద్విత్వోత్వే చప్పుడు. శబ్దస్య.

   శబ్ద యను దానిలో శకారమునకు చకారము (తద్భ.89) (చబ్ద) బకారమునకు పకారము, చప్ద దకారమునకు డకారము (చప్డ) పకారమునకు ద్విత్వమును (తద్భ.23) ఉత్వమును (తద్భ.95) చివర నుత్వము. చప్పుడు.

2. యాత్ర జాతర. యస్య జః వికర్షః, దంత్యః (అర్ధానుస్వారః) జాతర. యాత్రశబ్దము నందు యకారమునకు జకారము (తద్భ.45) జాత్ర వికర్ష చే (తద్భ.22) నడుమ నత్వము చేరి జాతర.

3. శ్రవః - చెవి - ఏదతః తద్భ.3.శవ.తద్భ 89 చే. చవ. తద్భ 47 చే అత్వమున కెత్వము. చేవ.తద్భ 100- చెవి.

4. కుబ్జః - గుజ్జు.

5. కబళము_కవణము. లస్య నః, లకారమునకు నకారము (తద్భ.2) రాగా కవన తద్భ.42 కబణ తద్భ.40 కవణము 'కవళము' అని వ్యవహారము.

6. గదా -గుదె.

7. నిషాద - నిసాదము

8. ఋషభః - రిసబము

9. గాంధారః - గాందారము

10. షడ్జః - సజ్జము

11. మధ్యమః - మద్దెమము

12. ధైవతమ్ - దైయతము

13. మంద్రః - మందరము

14. మురజః - మొరజము

15. ఉర్ధ ః - పాడవు

16. ఢక్కా - డక్క

17. రాక్షసః - రక్కెస.

18. అంబా - అమ్మ

19. అత్తికా - అక్క

20. గ్రహము - గాము

21. శృంగారము - సింగారము

22. బీభత్సుఁడు - విప్పచ్చుఁడు 23. ఉత్సాహము - ఉచ్చాగము

24. కృపా - కుప.

సూ.122. ఉదృతః.

ఋతః = ఋకారమునకు, ఉత్ = ఉత్వమగును.

వి. ఋత ఉత్ స్యాత్.

ఋకారము స్థానమున నుత్వమగును. 'కృప' యనుశబ్దమున ఋత్వమున కిట్లు త్వము రాఁగా 'కుప' అని యేర్పడును.

25. ఆశ్చర్యమ్ - అచ్చెరువు

26. భయమ్ - బయము

27. కుర్వః - కొవ్వు

28. వ్రీడా - వీటు?

29. పుత్రః - పుత్తుఁడు

30. వటుః - వడుగు.

31. గ్రామణి - గామిడి

32. ఈర్ష్యా - ఈసు

33. వైరమ్ము - బీరు

34. దుఃఖమ్- దుక్కము, తుక్కము

35. రోషః - రోసము

36. ఉన్మాదః - ఉమ్మాదము

37. ప్రేమ - పిమ్మ

38. ప్రియమ్ - పిరియము, పిరెము

39. ఇచ్ఛా - ఇచ్చ

40. కాంక్షా - కాంచ

41. అభిలాషా - అబిలాస

42. కైతవమ్ - దగా

43. శౌర్యః - సొంటు

44. వ్యాజః - వేజము

45. స్వేదః - చెమట - స్వేదః. సస్యచః వస్యమః దస్యటః చెమట స్వేదశబ్దమున సకారమునకు(తద్భ.86) చకారము, వకారమునకు మకారము,(తద్భ.38) దకారమునకు టకారమును రాఁగా (తద్భ.39) చెమట యని యగును. మస్య ద్విత్వమ్ మకారమునకు ద్విత్వ మయిన (తద్భ.23) చెమ్మట.

46. యజ్ఞసూత్రమ్-జన్నిదము 47. స్థలనమ్ - కలనము.

48. నిద్రా - నిదుర, ఋయోర్ద్విత్వం - నిద్దుర 'ఋయః కాత్యాయనస్య (తద్భ.61) సూత్రముచే దకారమునకు ద్విత్వము వచ్చిన నిద్దుర యని యగును.

49. స్వప్నః - సొప్పనము, - (తండ్రీ-తండిరి - ఇచట తంఙ్రీశబ్దము సంస్కృతముగాఁ జూపుట విశేషము.)

50. స్వరూపమ్ - సొరూపము 51. స్వభావః - సొబావము

52. ఉ(ద్ధ)త్సవః. వేడుక - స్వార్థే కః స్వార్థమునం దయిన కప్రత్యయముతోఁ బైరూపము ఇది విశేషము.

53. రంధ్రః - రందరము, 54. గర్తః - బొంద, గుంట,

55. శేషః - సేసుఁడు 56. త్రిలిప్సః - తెలిచ్చము

57. సర్పః - సొపు 58. మోదకః - కుడుము

59. కూర్పాసః - కుబుసము 60. సరీసృపః - చిలువ

61. వేళః - వెడ 62. క్ష్వేళః - వేడము

(ఉదేతః ఉదోతః- ఇట నీ రెండు సూత్రము లప్రసక్తముగా నున్నవి.)

63. విషమ్ - విసము 64. విష్టః - వెట్టి

65. వృథా - విత 66. సముద్రః - సందరము

సూ. 123. వాసరోలుగతః-? సంసర్గాత్పరస్య ఉతోవాలుక్ స్యాత్. సంద్రము.

ఇట్లు ఉకారము లోపింప సంద్ర మని యగును.

67. పాణి - పాని 68. నీరమ్ - నీరు

69. ఉదకమ్ - ఉతకము 70. తరంగః - తరఁగ

71. తృషత్ - తుంపర
72. తీరమ్ - దరి
73. ద్రోణి - దోని
74. కాష్ఠకుద్దాలః - కట్టెగుద్దలి
75. అచ్ఛా - ఆచ్ఛము
76. మీనః - మీను
77. గండకః - గండె
78. జీలుకా- జెలగ
79. శంఖః - సంకు
80. భేకః - కప్ప
81. ఖాతమ్ - గుంట
82. మేఘః - మొగిలు - మొయిలు

ఓదేతః - (తద్భ.97) అను సూత్రముచే నేత్వమున కొత్వము రాఁగా మొగిలు అని యగును.

83. వేశంతః - వెచ్చ
84. మాణిక్యమ్ - మానికెము
85. వాపి - బావి
86. యమునా - జమున
87. కుల్యా - కాలువ
88. కువలయః - కలువ
89. అరవిందః - అంబెంద
90. తామరసమ్ - తామర(స)
91. స్వామి - సామి
92. మూకః - మూఁగ
93. లక్ష్మణః - లక్కన
94. శ్రీమాన - సీమానుఁడు
95. వత్సలః - వచ్చలుఁడు
96. దృష్టః - దిట్ట
97. కుత్సితః - కుచ్చితుఁడు
98. దవీయమ్ - దవ్వు
99. వక్రమ్ - వంకర
100. ప్రాకారః - గుడి
101. కర్కశమ్ - కక్కసము
102. కఠినమ్ - గట్టి
103. ప్రతనః - ప్రాత
104. మృదులమ్ - మెత్తన

105.పిశాచః - బూచి 106. జైవాతృకః - జాబిల్లి

107.గో,ఆవు - గోరాట్ః

సూ. 124. గోః - గోశబ్దమునకు ఆట్ - ఆట్ ఆదేశమగును.

వి. గోశబ్దస్య ఆడా దేశ స్స్యాత్ ఆ. వు(ప్రత్యయః.
స్థానివదాదేశః ఆవు. వు(ప్రత్యయవి కల్పే ఆలు.

గోః - ఆట్ - గో యనుశబ్దమునకు ఆట్ అనునది యాదేశ మగును. టకార మిత్తు గావున నది లోపింగా 'ఆ' అనునదే యాదేశ మగును. ఆదేశము స్థానివంటి దగుటచే ఆ యను నాదేశము స్థాని యగు గోశబ్దము వంటిదె యయి (నర్థమె కల్గి) యుండును. దీనికి వు(ప్రత్యయము రాఁగా ఆవు. వు(ప్రత్యయము వికల్పము గావున (విష్ణులు) ఆలు అనియు నగును. బహువచనమునందె యిట్టి రూపములు గలవు. విష్ణుచేత నన్నట్లుగా ఆచేత ననురీతి నుండదు.

108. ద్యూతః - జూదము 109.సింహః - సింగము

110. వ్యా(ఘః - బెగడము 111.పో(త్రీ - పంది - (అదోతః

తద్భ.117 సూ(తముచే ఓకారమున కత్వము వచ్చినది).

112.బిడాలః - పిల్లి 113.మృగః - మెకము

114.పృషతః - దుప్పి

ఉద్వృతః - ఋత్ ఉత్ స్యాత్.

తద్భ. 21.స్వాపృషతః అనుచో ఋకారమున కుత్వ మయినది.

115. పారావతః - పారువము. 116.కపోతః - గువ్వ

117. ఖంజనః - కొంజు.

సూ. 125. ఔదతః.

అతః ఔత్ అకారమునకు ఔకార మగును.

వి. అతఔత్స్యాత్.

ఖంజన యనుచో మొదటియకారమున కౌత్వ మయినది. ఖౌంజన తద్భ.108. కౌంజన తద్భ.62. కౌంజ తద్భ.88. కౌజ తద్భ.95. కౌజా.

118. కుక్కుటః - కోడి, 119. క్రకరః - క్రొక్కర

120. కోకిలః - కోయిల 121. కాలకంటకః - కుంకుడు గుడంగి?

122. గృధ్రః - గ్రద్ద

సూ. 126. అదృతః [1].

వి. ఋతోఽతస్యాత్.

అత్ ఋతః. ఋకారమున కత్వ మగు. గృధ్ర శబ్దమునం దిట్లు ఋత్వమున కత్వ మయినది.

123. క్రౌంచః. కౌంచ - ఓదౌతః - ఔతః ఓత్.

ఔకారమునకు ఒకార మగును. క్రౌంచ శబ్దము నందలి యౌకారమునకు 'ఓదౌత' యని యొత్వ మయినది.

124. రాజహంసః - రాయంచ 125. గండోలీ - కందిరీగె

ఇదోతః - ఓతః ఇత్. ఓకారమున కిత్వ మగును. గండోలీ యనుచో డకారము మీఁది యోకారమున కిత్వమయినది.

126. బర్హమ్ - పురి 127. వ్యూహః - ప్రోగు

128. భూతి - బూతి 129. మృత్స్న - మన్ను

130. ఊషరః - ఊసరము 131. భువనమ్ - బొ(వ)నము

132. సికతా - ఇసుక - సిసికాచ. 133. గోష్ఠమ్ - కొట్టము.

134. పథ్యా - తోవ 135. వర్త్మ - బాట

---

1. వివృతివి బట్టి యిది ప్రత్యేక సూత్రమె యనిపించును. కాని ఋతోఽద్వృద్ధౌ' తద్భ.36' సూ. దీనివి సాధించుచున్నది.

136. పురీ - వీడు
137. రథ్యా - రచ్చ
138. కుడ్యమ్ - గోడ
139. ధామః - దీము
140. మంటపః - మండపము
141. స్వస్తికః - సొస్తికము
142. అంతః పురము - అంతిపురము
143. ద్వారమ్ - దొండి
144. మార్గః - వాకిలి -

గస్యకః - గకారమునకు కకార మగును. (తద్భ.18) మార్గ శబ్దమునందలి గకారమునకు కకారము రాఁగ 'వాకిలి' యను తద్భవరూపమున కకారమున్నది.

145. అర్గళః - గడియ,
146. నిశ్రేణి - నిచ్చెన
147. పల్లి - పల్లె
148. వింధ్యః - వింధె
149. పురః - ఊరు
150. పర్వతః - (మహీధ్రః) - తిప్ప.

మహీధర మనునర్థమునందు పర్వతశబ్దమునకు 'తిప్ప' యని తద్భవరూపము.

151. ఝరః - సెలయేరు
152. ఖనిః - గని
153. గ్రావా - గుబ్బలి
154. అటవీ - అడవి
155. కాననమ్ - కాన
156. పఙ్క్తిః - బంతి
157. రాజిః - చాయ
158. ఫలమ్ - పండు
159. కిసలయమ్ - చిగురు
160. గుచ్ఛః - గుత్తి
161. ముకుళః - మొగ్గ
162. పుష్పమ్ - పువ్వు
163. ఫలకః - పలక
164. పున్నాగః - పొన్న
165. నేమిః - నిమ్మ

సూ. 127. ఇదేతః .

వి. ఏత ఇత్ స్యాత్.

ఏతః = ఏకారమునకు, ఇత్ = ఇకార మగును. 'నేమి' యనుచో నేకారమున కిత్వము వచ్చుట 'నిమ్మ' యైనది.

166. అంకోలిః - ఊడుగ 167. మాలూరః - మారేడు

168. లోధ్రః - లొద్దుగ 169. గుగ్గులు - గుగ్గిలము

170. గంభారీ - గుమ్మడు 171. కదంబః - కదుము

172. పూగః - పోగ 173. చించా - చింత

సూ. 128. చోస్తుః

వి. చవర్గస్య తవర్గస్స్యాత్.

చోః = చవర్గమునకు, తుః = తవర్గ మగును. చించ యనుచో రెండవ చకారమునకు తకారము రాగా చింత.

174. ఆమందః - ఆముదము 175. శమీ - జమ్మి

176. పాటలః - పాదిరి

టోస్తుః - టోః తుః టవర్గాక్షములకు తవర్గాక్షరములు క్రమముగానగును (తద్భ.39) పాటల శబ్దమున టకారమునకు యథాక్రమముగా దకార మయినది పాదిరి.

177. చంపకః - సంపంగి 178. వకుళః - పొగడ

179. దాడిమః - దాడింబ (దానిమ్మ) 180. జాతి - జాజి

సూ. 129. తోశ్చుః తవర్గస్య చవర్గస్యత్. జాతి. జాజి.

తోః = తవర్గీ యాక్షరములకు, చుః = చవర్గీయాక్షరము లగును. జాతి యనుచో తకారమునకు జకరము రాగా జాజ. ఇట యథాక్రమము గుదురుట లేదు.

181. విరువాతి - విరువాజి 182. జవాది - జవాజి

183. కురంటకః - గోరంట

సూ.130.1 ఓదుతః.

వి. ఉత ఓస్యాత్.

ఓత్, ఉతః, ఉకారమునకు 'ఓ' కార మాదేశ మగును. కురంటశబ్దమున నుత్వమున కోత్వము రాగా గోరంట - ఇణఏడ్ - తద్భ.4 . అనుదానిచే నీయది సిద్ధించుట గమనింపఁదగును.

184. ఉన్మత్తః - ఉమ్మత్త
185. మరువకః - మరువము
186. వృక్షదనీ - బదనికె
187. నీలిని - నీలి (చెట్టు)
188. వచా - వస
189. ద్రాక్షా - ద్రాక
190. బదరా - ప్రత్తి
191. పటోలికా - పొట్ల
192. తాంబూలః - తములము
193. ఏలా - ఏలకి
194. ముస్తా - ముస్తె, ముత్తి,
195. వృద్ధదారుకః - బొద్దికూర

సూ. 131. ఓదృతః.

వి. ఋత ఓత్ స్యాత్.

ఋతః = ఋకారమునకు, ఓత్ = ఓకార మగును. వృద్ధ = బొద్ది.

196. (తుండికేరి?) కూశ్మాండః-గుమ్మడి
197. మూలకమ్ - ముల్లంగి
198. గ్రంధిః - గంటు
199. తాళః - తాడి
200. ఋక్షమ్ - చుక్క-

వ్యత్యయః, ఉదతః - అస్య ఉస్స్యాత్.

ఋక్షశబ్దమున వర్ణవ్యత్యయము. దీనివలన షకారము ముందునకయి దానికి చకారమగును.

ఉత్ - అతః (తద్భ.6) అకారమున కుకార మయి చుక్క.

201. వేత్రః - బెత్తు, బెత్తము, వెదురు, 202 పాత్రః - తవిలె.

'ఇదతః' అనుసూత్రముచే నత్వమున కిత్వ మయినది.

203. ముఖ్యమ్ - ముక్కు.

ముఖే యన్ముఖ్య మంగం తన్ముఖ్యమ్ - తత్. ముక్కు.

ముఖమునందు ముఖ్య మయిన యంగ మగుటచే నాసిక 'ముఖ్యము' 'ముఖ్య' శబ్దమునకుఁ దద్భవ రూపము 'ముక్కు'.

204. ముఖమ్ - మొగము.

సూ. ఖస్య గః- , ఖకారమునకు గకార మగును. ఇట్లు ముఖశబ్దము నందు ఖకారమునకు గకారము రాఁగా ముగము. తద్భ.4.మొగము.

సూ. క'శ్చ' - మొకము (తద్భవమ్, దేశ్యమ్).

ఖకారమునకు కకారము సయితమగును. ఇట్లు కకారము రాఁగా మొకము. మొఖ యనుచో తద్భ.108చే 'మొకము' అని కాఁగలదు.

205. గ్రీవా - మెడ - (ఏదతః కొ౯తః? అదితః మెడ?).

206. గుల్ఫమ్ - పిక్క - అదుతః , ఇద తః వర్గో వర్గస్య.

పిక్క.

గుల్ఫ శబ్దమున లకారము లోపించి (తద్భ.3) వర్గప్రత్యయముతో భగు అని కాఁగా 'అదుతః' అను సూత్రముచే నుత్వమున కత్వ మై 'భగ' ఇ దతః (తద్భ.99) అను సూత్రముచే మొదటి యత్వమున కిత్వ మై భిగ 'వర్గోవర్గస్య' (తద్భ.96) యను సూత్ర భకారమున కదే వర్గకు చెందిన పకారమును, గకారమున కదేవర్గకుఁ జెందిన కకారము నయి పిక ద్విత్వము (తద్భ.23) పిక్క.

207. స్తనః - చను

208. అంఘ్రిః - అడుగు

209. జంఘా - జంగ

210. గుదం - గుద్ద.

211. ఉపస్థా - పత్త

212. స్కంధః - కందము

213. భ్రూః - బ్రుప్పుబొమ

214. కబరీ - కొప్పు, (ఓదతః)

ఓదతః అను సూత్రముచే అత్వమున కొత్వము వచ్చుటచే కొప్పు అని యైనది. అంత్యాక్షరలోపము. బకారమునకు పకారము ద్విత్వము స్పష్టము.

215. మౌళి - మూ.ల,. కొప్పుపేరు, ఉదౌతః.

ఉదౌతః అను సూత్రముచే మౌళి శబ్దమునందలి యౌకారమున కూకారము వచ్చినది. మూలి యన్నది కొప్పు పేరుగా వివరింపబడినది.

216. చికురః - కురులు 217. శిఖా-సిగ

218. శ్మశ్రూ (వుఖరు?) మీసము 219. జిహ్వా - జీలు(బు?)

220. మానుషః - మానిసి 221. స్త్రీ - చెలి

222. యోగిని - జోగిని, యోగముది. 223. కన్యా - కన్నె

224. సఖి - సగి, సగియ, 225. వృద్ధా - పెద్ద

226. అంగులీయమ్ - ఉంగరము

227. అంగుళిముద్రా - ముద్దుటుంగరము

228. అంచలమ్ - అంచు

చిరిగె-చినిగె-రోనః, రోనః అను సూత్రముచే రేఫకు నకారము రాగా చిరిగె-చినిగె నని యైనది.

229. కూర్పాసః - కుబుసము 230. తిరస్కరిణీ- తెరచీర.

231. స్నానమ్ - తానము.

సూ. స్నస్యతస్స్యాత్.

స్నకారమునకు తకారమగు నని చెప్పు స్నస్తః అను (తద్భ.110) సూత్రముచే తకారము రాగా స్నాన-తానము.

సూ. జ్ఞోనః - జ్ఞస్య న స్యాత్.

జ్ఞకారమునకు నకార మగును. (తద్భ.111).

232. ఆజ్ఞ - ఆన, 233. కుంకుమ-

234. లాక్షా-లక్క 235. అలక్తకః - లత్తుక

236. మంచః - మంచెము 237. పీఠః - పీట

238. పతద్గ్రాహః, పతద్గ్రహః- పదిగెము.

239. ఆదర్శః - అద్దము 240. వంశః - వంగసము

241. కుట్టనీ - కుంటెన కత్తె 242. ఆర్తవమ్ - అంటు

243. అపత్యమ్ - బిడ్డ 244. తాతః - తండ్రి

245. ముండనమ్ - బోడి 246. క్షవథుః - దగ్గ

247. సిధ్మము - సిబ్బెము 248. ఖర్జూః - గజ్జి

249. పిటకః - పొక్కు.

సూ. 132. ఓదితః.

వి. ఇత ఓత్ స్యాత్.

ఇతః = ఇకారమునకు, ఓత్ = ఓకార మగును. 'పిటక' - శబ్దమున మొదటి యిత్వమున కొత్వ మై 'ట'వర్ణము లోపించి యుత్వద్విత్వములతో పొక్కు.

250. కుష్ఠమ్ - కుట్టు 251. వాంతమ్ - వాంతి

252. కచ్ఛపః - గబ్బువాఁడు.

253. దద్రుణః-దద్దుర (రోగము గలవాఁడు).

254. రుధిరః - నెత్తురు 255. నారీ - నారి (నరము)

సూ.133. దోరః.

వి. దస్య రస్స్యాత్

దః = దకారమునకు, రః = రేఫ మగును.

256. సృణికా - సొంగ. ఓదృతః.

సూ. ఋతః ఓత్. ఋకారమునకు ఒకార మగును. ణివర్ణలోపము, కకారమునకు గకారము హ్రస్వముపై నున్న సొంగ.

257. విట్ - పీ

258. స్వేచః - పిచ్చి పిట్ట.

259. కక్షః - చంక

260. బ్రాహ్మణః -

ఆదిమధ్యాన్తానామితి. బ్రామ్మడు.

ఆదిమధ్యాన్తానా మను సూత్రముచే బ్రాహ్మణశబ్దమునం దంత్యాక్షరము లోపింపఁగా బ్రామ్మఁడు.

261. వైద్యః - వెజ్జు (మహదమహత్తు).

వెజ్జు అన్నది మహత్తు నమహత్తు నగును.

262. బ్రహ్మచారీ - బొమ్మచారి. దంత్యః.

బ్రహ్మచారి యనుచో సంస్కృతశబ్దమున చకారము తాలవ్యము. కాని బొమ్మచారి యనుచోఁ దెలుఁగున నది దంత్య మగును.

263. గృహస్థః - గెరస్తు. తజ్జః.

సూ. 134. ఏదృతః -

ఋతః ఎత్ - ఋకారమునకు ఏత్వమగును.

వి. ఋత ఏత్ స్యాత్. గేస్తు. దేశ్యమ్.
గెరస్తు అన్నది తద్భవము.

ఈ సూత్రముచే ఏత్వము రాఁగా గేస్తు అని యగును. ఇది దేశ్యము. గెరస్తు, గేస్తు. అనుచో నీ భేదము విశేషము.

264. సన్యాసి-సన్నేసి సన్నాసి,

265. బాడబః - పాఁపఁడు, పారుఁడు

266. ఉపాధ్యాయః - వెజ్జు.

267. సోమయాజి-సోమాసి 268. యజ్ఞః- జన్నము

269. అర్ఘః - అగ్గము 270. ఉపవాసః-ఉపాసము

271. వివేకః- (యి)ఇయేకము 272. తపస్వీ- తవసి

273. ఋషి - రిసి 274. కుండమ్- కుండ

275. చర్మ- చెమడ 276. భైక్షమ్- బిచ్చము

277. యజ్ఞసూత్రమ్- జందెము 278. రాజా - రాజు

279. రాట్- రా-రావు. 280. మన్త్రి- మంతిరి వికర్షః

వికర్ష యనఁగా సంయుక్తము అగు హల్లుల నడుమ స్వరము చేరి మంతిరి అయినది.

281. స్నిగ్ధః - నెగడు 282. సఖ్యమ్-సక్కెము

283. జ్యోతిషిక-జోసి 284. దూతః-దూత

285. శుల్కః-సుంకము 286. హరణమ్- అరణము
(ఇచ్చికూఁతురిని పంపుట) 287. భృంగారుః-బంగారు చెంబు

288. అంకుశః- అంకుసము 289. వీథు-బీద

290. తురగః- తురగము? 291. ఘోటకః -గోడ

292. కళికా - కళ్లెము 293. ఖరః- గారి(జ)

294. డోలా- డోలి 295. పదాతిః- బంటు

296. సంపత్- సంపద 297. శ్రీ రీ- సిరి

298. శల్బమ్- చెంబు.- ఎదుతః.

ఉతః ఎత్- ఉత్వమున కెత్వ మగును(శె) శళ్బః ఆని. శకారమునకు చకారము చెల్బమ్ లకారలోపము బిందువు. ఉత్వము. చెంబు.

299. ఆపత్- ఆపద 300. ఛురికా- సురియ

301. అస్త్రీ- అంచు

302. పతాకా- పడగ

303. కేతనమ్- టెక్క్యము

304. అనీకమ్- అనీ

305. చితా- సొద

306. స్మశానమ్- మసానము

307. ప్రాణాః- పాణము

308. కారా- గార

309. వ్యాపారః - బేరము

310. ఖనిత్రమ్- గుద్దలి

311. లవిత్రమ్- కొడవలి

312. లాంగలమ్-నాగేలు

3. లస్య నః లాంగల శబ్దమున మొదటి లకారమునకు నకార మయినది.

313. వ్రీహిః- వరి

314. ఆశువ్రీహిః- వరిగె

315. కలాయః--(ఉంకలపేరు)

316. చణకః- సనిగె, సెనగ, సనగ

317. కణిశమ్ - ఎన్ను

318. అంగారః - ఇంగలము

319. అలంతకా- గలంతి

320. కంసః- కంచము

321. కుతుః- గుత్తి

322. తండూరి- తెండు

323. ఆర్ద్రవమ్- అల్లము

324. కుస్తుంబరా- కొదమరి

325. శుంఠి, సొంటి

326. హింగు- ఇంగువ

327. తేమనమ్- తిమ్మనము

328. చిక్కణమ్- చిక్కనము

329. స్నిగ్ధమ్- నిగ్గు

330. లేహ్యం- లెడ

331. కబళః- కడి

332. మహీ -ఆవు- వ్యత్యయః. వ్యత్యయము చే హీ మయ్యై ఆవు అని యగును. ఇంతకు ముందు గోశబ్దమున 'కా' ఆదేశము చేసి వుప్రత్యయములో నీరూపము సాధింపబడినది.

సూ. దీనిని సాధించుచున్నది.

333. దామః- దామెన | 334. వైశాఖః - కవ్వము

(సూ?) అదైతః- అత్ ఐతః- ఐకారమున కత్వ మగును. వైశాఖ- వశాఖ యనుచో నడిమి 'శా'వర్ణము లోపించి వఖ వ్యత్యయము ఖవ. ఖకారమునకు కకారము(ఖఃకః) కవ ద్విత్వముతో కవ్వ మని యగును.

335. ఉష్ట్రః- ఒంటె | 336. గర్దభః- గాడిదె

337. వణిక్- వానెఁడు | 338. మూల్యం- వెల 'ఏదుతః'

ఏత్ ఉతః ఉత్వమునకు ఏత్వ మగును. (మెల్య) 'మోవః' (తద్భ.104) అను సూత్రముచే మకారమునకు వకారము(వెల్య) యలోపము వెల.

339. సత్యకారః- సంచకారము | 340. ద్రోణః- నలుతుము

341. ప్రస్థః- పది | 342. రూప్యమ్- రూపాయి

343. రిక్తః- రొక్కము | 344. భర్మ- వైది 'ఐదతః'

అతః ఐత్. అకారమునకు ఐత్వ మయినది.

345. శ్వేతమ్-కేది | 346. రీతిః- ఇత్తడి

347. తామ్రమ్-దుడ్డు | 348. చోళః- చోళము

349. కుసుంభా- కుసుమము(పూవు) | 350. క్షత్తాః - తచ్చెవాఁడు

351. నటః-నట్టువుఁడు | 352. మార్దంగికః- మద్దెలకాడు

353. భృత్యః-బంటు | 354. వరాహః- వరా

355. తస్కరః- దొంగ | 356. మలిమ్లుచః- ముచ్చు

357. వాగురా-వల | 358. మూషా- మూస

359. స్వర్గః -సొన్నము(స్వర్గము?) | 360. అప్సరాః- అచ్చర

361. సిద్ధాః- సిద్దులు | 362. భూతః- బూతము

363. అసురా- అసర
364. బ్రహ్మ-(బ్రహ్మ,) బొమ్మ
365. స్వయంభూః- సాయంబు
366. ధాతా- తాత
367. విష్ణుః- వెన్నుఁడు
368. లక్ష్మీ - అచ్చి, లకుమి
369. ఈశ్వరః- ఈసరుఁడు
370. స్కందః - కందుఁడు, సుద్ద
371. త్వరితమ్ - తొరితము
372. దృతమ్ - దురము
373. నిత్యః- నిచ్చము, నెత్తము
374. ద్యౌః- దివి ఇదౌతః.

ఔతః ఇత్ ఔకారమున కిత్వము వచ్చును. ద్యౌ- 'ది' అని యగును. దివి తత్సమముగా నింతకు ముందు సాధింపబడినది

375. బత్తమ్- వక్క, వంక,
376. అర్ధః- అర
377. శుక్రః - చుక్క
378. మధ్యాహ్నః - మద్దెనము
379. అర్ధరాత్రిః- అద్దరాతిరి
380. రాత్రి- రేయి.
381. యామః- జాము
382. అమావాస్యా- అమవస్స, అమవస

అమాస దేశ్యే - అమావాస్య శబ్దమునకు అమవస్స అమవస అనునవి తద్భవరూపములు. అమాస యనునది దేశ్యము (ఇదియుఁ దద్భవమె యనఁదగు)

383. గ్రహణః- గరాణము
384. ముహూర్తః-మూరుత్తము
385. పక్షః- పక్షము
386. ముదా-ముదము?
387. శుభమ్- సుబము
388. దిష్టమ్- దిట్టము
389. హృదయమ్- ఎద
390. బుద్ధిః - బుద్ది
391. (తుమ్మ-?) ద్వాపరః-దోపరము
392. భ్రమః- భమ
393. ప్రతిజ్ఞా- ప్రతిన
394. ముక్తిః- ముకుతి(ముకితి) ముత్తి

395. మోక్షః- మోకము-(టేంకము) 396. కషాయమ్- కసాయము

397. తిక్తః- చేదు 398. గంధః - కంపు

సూ. 135. పుస్తోః -

వి. తవర్గస్య ప వర్గస్యాత్

తోః = తవర్గమునకు పుః = ప వర్గ మగును. గంధ శబ్దమున తవర్గీయ మగు ధకారమునకు పకార మైనది. గకారమునకు కకారము (తద్భ.17) చే కంపు.

399. ధవళః- తెలుపు 400. శ్యామః- చామన

401. పారాశరీ-పసురు(చామ) 402. రోహి త -ఎరుపు

136.సూ. ఏదోతః

వి. ఓత్ ఏత్ స్యాత్.

ఓతః = ఓకారమునకు, ఏత్ = ఏత్వ మగును. రోహింత శబ్దమునం ద ట్లయినది. కాని యిట హెరుపు లేదా ఎరుపు అని యగుట వర్ణవ్యత్యయము. హి రోంత ఇత్వమున కెత్వము ఓత్వమున కుత్వ మిత్యాదిగా గుర్తింప వలసి యున్నది.

402. శ్యావః - పచ్చన- 403. కదారః - కదారి(వన్నె)

404. భాషా-బాస 405. వాక్-వా

సూ. 134. "తోఃకుః" - తవర్గస్య కవర్గస్స్యాత్

(406) లపితమ్-పలుకు.

తోః = తవర్గమునకు, కుః = కువర్గ మగును. లపితశబ్దమునం దిట్లు తకారమునకు కకారము రాగా వర్ణవ్యత్యయాదులతో 'పలుకు' అని యగును.

407. వాక్యమ్- వాకియము, వాకెము, 408. శ్రుతిః-సుతి

409. శిక్షా-సిచ్చ 410. కల్పః-కప్పము

411. ఛందః- చందము 412. జ్యోతిః- జోతి

413. స్వంతః- సొరితము
414. సృష్టిః - సిస్టి
415. కథా-కత
416. సమస్యా- సమస్సె
417. ఆఖ్యా- ఆకె
418. కీర్తిః- కీరితి, కిత్తి
419. చోద్యమ్-సోదెము
420. పరుషమ్ - పరుసము
421. సమ్యక్-మంచి
422. మర్మరః- మొరమొర(శబ్దము)
423. క్వణః-కొణము
424. క్వాణః- కోణము
425. కచ్ఛ- కచ్చ
426. పుచ్ఛః - బొచ్చ.
427. అచ్ఛః- అచ్చము
428. మ్లేచ్ఛః - మిలేచ్చుఁడు

ఖఛఠథఫఘఝఢధభామిత్యనేన ఛస్యచకారః

ఖఛఠథ ఫఘఝఢధభానాం కచటతప గజడదబాః' (తద్భ.108) అను సూత్రముచే పైని కచ్ఛాదిశబ్దములందు ఛకారమునకు చకార మయినది.

సూ. 137. వా గుచ్ఛ తుచ్ఛయో స్తః.

స్పష్టమ్

గుచ్ఛ తుచ్ఛయోః = గుచ్ఛతుచ్ఛశబ్దములందు ఛకారమునకు, వా = వికల్పముగా, తః ⇒ తకార మగును.

429. గుచ్ఛః - గుచ్చెము గొత్తి, గొత్తు.

430. తుచ్ఛః. తుచ్చెము. తొత్తు.

గుచ్ఛ శబ్దమునం దిట్లు ఛకారమునకు తకారము రాగా ఇత్వమును ద్విత్వము నయి గుత్తి యని యగును. గొత్తి గొత్తుఁ అని వికృతియందు.తొత్తు అనుచో నుత్వమున కొత్వమయినది. 'వా' యనుటచే నిట తకారము రానిపక్షమునందు ఖఛఠథఫ- ఇత్యాది సూత్రముచే చకారమె యయి, గుచ్చెము తుచ్చెము అని యగును.

సూ.138. రోనః -

రః = రేఫమునకు, నః = నకార మగును.

వి. రేఫస్య న స్యాత్. అరిటి - అనిటి, గెరిటి - గెనిటి - పేరు౨డు-పేనుడు, ఎరుక-ఎనుక.

అరిటి శబ్దమున రేఫకు నకారము రా౨గా అనిటి. ఇట్లితరములు అరటి అనటి యను రీతిగా నిది యకారముధ్యముగనె ప్రసిద్ధము.

431.భూలీ-పై౨డి "ఐదుతః"

ఉతః ఐత్ = ఉకారమునకై కార మగును. 'భూలి' అనుచో నుకారమున కైత్వము రా౨గా భైలి. భకారమునకు పకారము-పైలి.

సూ.139. 'లోడః'-

వి. లస్య డ స్స్యాత్.

లః = లకారమునకు, డః = డకారమగును. పైలి యనుచో లకారమునకు డకారమై పైడి.

సూ. 432.'అదేజః'ఆందోలిక- అందలము.

ఏజః = ఏఓలకు, అత్ = అత్వ మగును.

ఆందోలిక యనుచో ఓకారమున కత్వమగు. ఆందలిక అని యగును. హ్రస్వము రా౨గా (తద్భ.12) అందలిక.

అదితః (ఆక-లము).

ఇతః అత్ = ఇత్వమునకు అత్వము వచ్చును. అందలిక యనుచో లివర్ణమునం దిత్తున కత్వ మయి అందలక అంత్యక్షరము లోపింప౨గా ముపర్ణకముతో అందలము.

ఓదేతః- (433) మేఢ్రమ్-మొడ్డ.

ఏతః ఓత్ = ఏకారమునకు ఓకార మగును. మేఢ్రశబ్దమునం దేత్వమున కోత్వము. మొఢ్ర(తద్భ.3) రేఫ లోపించి తద్భ.108 సూత్రముచే ఢకారమునకు డకారమై ద్విత్వము రాగా మొడ్డ యగును.

ఏదతః 434. ధవళః - తెలుపు.

అతః ఏత్ = అకారమునకు ఏకార మగును. ధవళ. తెలుపు ధకారమునకు తకార మై యత్వమున కెత్వము.

435. మర్యాదా- మేర, మట్టు 436. శృంఖల- సంకెల.

తోః కుః- తవర్గస్య కవర్గ స్స్యాత్ 437. స్తంభః = కంబము

తోః = తవర్గమునకు, కుః = క వర్గ మగును.

స్తంభశబ్దమునందు సకారము లోపింపఁగా తకారమునకీ సూత్రముచే కకారమై భకారమునకు బత్వము రాఁగా కంబము.

తోఃపుః- తవర్గస్య పవర్గ స్స్యాత్.

ఇది 'పుస్తోః' అని యింతకు ముందు చెప్పఁబడినది.

437. గంధః- కంపు, గట్టు, 438. కర్బురః- కప్పు

439. కపర్దః- గవ్వ 440. ఘాసః- కసవు

441. చంకనయ్- చక్కెన 442. ఆక్రందః- క్రందు

443. కరః - కేలు 444. శయః - చేయి

445. కర్పూరమ్- కప్పురము, కప్రము 446. గంబూర -గంబురము

447. జలాకరః-చెరువు

లోనః- తలుపు తనుపు, వెలుగు వెనుగు, చెలికె చెనికె, పాలఁకువ పానఁకువ.

లః = లకారమునకు, నః = నకార మగును. తలుపు-లకారమునకు నకారమురాఁగా తనుపు. ఇట్లితరములు తద్భ.2-వాలోనః.

## 448.వార్తా కః-వంగ -.

ఈః ప్రకరణమునఁ దద్భవములు పెక్కులు నిరూపింపఁబడినవి.

సంస్కృతసమములుః- సంపద, ఆపద, దివి, మొద లగు సంస్కృతసమశబ్దములను దద్భవములుగాఁ జూపుట విశేషము. మహాపద రత్నసంపద మొద లగువానివిబట్టి యివి సంస్కృతసమములుగా గుర్తింప వలయును.

ప్రాకృతసమ భవములుః- ప్రాకృతమునుండి ప్రాకృతసమములుగా, భవములుగా శబ్దములు చేరుటను గొందఱు ప్రస్తావించిరి, అట్టి సిరి మొద లగు ప్రాకృతసమములను, ఇంగలము మొద లగు ప్రాకృతభవములును నిందు సంస్కృతభవములుగానె సాధింపఁబడినవి.

దేశ్యాలు - కొడవలి, (లవిత్రమ్) ఆవు- (మహి, గో) మొద లగు దేశ్యములు సంస్కృతభవములుగాఁ జూపుట యొక విశేషము. దేశ్య తద్భవముల విషయమున విస్తృత మైన పరిశోధనము జరుగవలసియున్నది. అట్టి పరిశోధనమున కిది కొంతవఱకు నుపయోగించును.

ఇతి తజ్జాః.

ఇవి తద్భవములు.

# అథ దేశ్యనామాని.

ఇక దేశ్యశబ్దములు నిరూపింపఁబడుచున్నవి.

| | | | |
|---|---|---|---|
| 1. | 1. | కరివేల్పు | : కృష్ణ దేవః |
| | 2. | ఆలగాపరి | : గోపాలః |
| | 3. | పక్కిడాలు ఱేఁడు | : ఖగకేతనరాట్ |
| | 4. | వ్రే(త)తెలమేలువాఁడు | : గోపీజనశుభవాన్ |
| | 5. | మామ మామ | : శ్వశురశ్వశురః |
| | 6. | పాలవెల్లి యల్లుఁడు | : క్షీరాబ్ధి జామాతా |
| | 7. | కల్టి నెచ్చెలి | : అర్జున సఖః |
| | 8. | రేయుఁబగలు చేయుకను దోయివాఁడు | : నిశాహస్కరలోచనయుగవాన్ |
| | 9. | తరి(గ)గెట్టుదారి | : మంథానగిరిధరః |
| | 10. | బొమ్మదే వరతండ్రి | : బ్రహ్మదేవపితా |
| | 11. | పసిడి పుట్టము దాలుపు | : కనకాంబరధరః |
| | 12. | గాలిదిండిపానుపునఁ బన్నుండుదొర | : పవనాశనశయ్యా శయానః |
| | 13. | తమ్మికంటి | : పద్మాక్షః |
| | 14. | పదివేసములసామి | : దశరూపదేవః |
| | 15. | సోకు మూ కలగొంగ | : రాక్షసగణవైరి |
| | 16. | వెన్నదొంగ | : నవనీతచోరః |
| | 17. | చుట్టుకైదువు జోదు | : చక్రాయుధేశ్వరః |
| | 18. | వలమురిదాలుపు | : దక్షిణావర్తశంఖ జన్యధరః |
| | 19. | పచ్చవిలుకాసితండ్రి | : హరిశరాసన జనకః |
| | 20. | పక్కిగుఱ్ఱపు సామి | : ఖగతురగస్వామి |

21. లచ్చిమగఁడు : లక్ష్మీభర్త
2.22. బొమ్మ : బ్రహ్మ
23. నలువ : చతురాస్యః
24. పాలునీరునేర్పఱచుపక్కిపావుఁ మెక్కియాడెడు వాఁడు : క్షీరనీరవిభాగక పక్షి హయారోహణ నృత్యత్స్వామీ
25. తాత : ధాత
26. తెలిదమ్మి గద్దె కొలువుండెడిరాయఁడు : ధవళపద్మాసన సామ్రాజ్య స్థితమహారాజః
27. పలుకువెలఁది మగఁడు : వాగ్వధూటి కావరయితా
28. నిక్కపుజగమేలెడినేర్పుకాఁడు : సత్యలోక పాలన సమర్థః
29. వేల్పుపెద్ద : సురజ్యేష్ఠః
30. బ్రతుకుప్రొద్దుల లెక్కనుదురాకు లీలల వ్రాయు వాఁడు : లలాట తాళపత్రాయుర్నిర్ణయగణనాలేఖకః
31. నలుమొగంబులవాఁడు : చతుర్ముఖః
32. కడుపు బంగారుబొక్కసము చేసిన మేటి : సువర్ణ కోశీకృతజఠరః
33. తమ్మి చూలి : పద్మప్రసూతిః
34. పొరోగిరము తిండిపోతుతండ్రి : కలహోన్నాదమౌనిజనకః
3.35. కొండవీటి జంగము : కైలాస మందిర చరిష్ణుః
36. ముమ్మొన వాలు దాలుపు : త్రిశూలాయుధధరః
37. ముక్కంటి : త్రినేత్రః
38. గుజ్జు వేలుపు తండ్రి : వామదేవజనకః
39. అరపది మొగముల జేజే : దశార్ధముఖదేవః
40. తోలుదాలుపు : చర్మధారి

| | | | |
|---|---|---|---|
| 41. | మినుసికదయ్యము | : | ఆకాశకేశ మహాభూతః |
| 42. | వెలియాలబోతురౌతు | : | ధవళ వృషభాధి రూఢః |
| 43. | మిత్తిగొంగ | : | మృత్యువైరి |
| 44. | బుడుత నెలదాలుపు | : | బాలేందుధరః |
| 45. | (గ)గెట్టు విలుతుఁడు | : | గిరిధన్వా |
| 46. | జన్నంపు వేటకాఁడు | : | యజ్ఞ ఖేట కరః |
| 47. | కరకంఠుఁడు | : | గరళ కంఠః |
| 48. | విసము మేపరి | : | కాలకూట విషాదనః |
| 49. | బేసికంటి వేలుపు | : | విషమలోచన దేవః |
| 50. | పునుక దారి | : | కపాల ధారి |
| 51. | వలిమలల్లుఁడు | : | శీతశైలజామాతా |
| 52. | బూచుల యొకి మీఁడు | : | భూత నాయకః |
| 53. | మినువాక దాలుపు | : | గగన ధునీధరః |
| 54. | వలరాజు పగతు | : | బలరాజవిరోధిః(బలరాజా మదనః) |
| 55. | వానీని చెలికాఁడు | : | కుబేర వణి క్సఖః |
| 4.56. | లచ్చి | : | లక్ష్మీ |
| 57. | సిరి | : | శ్రీః · |
| 58. | కడలి కూఁతురు | : | సాగరతనయా |
| 59. | కలుములజవరాలు | : | సంపద్యోవనీ |
| 60. | తమ్మియింటి(గ)గెరిత | : | పద్మనిలయాంగనా |
| 61. | పచ్చ విలుతుని తల్లి | : | హరిచ్ప రాసన జననీ |
| 62. | లిబ్బి పడఁతి | : | నిధివనిత |
| 63. | తల్లి తల్లి | : | మాతృజననీ |
| 64. | కరివేల్పు నిల్లాలు | : | కృష్ణదేవ పత్నీ |

| | | |
|---|---|---|
| 5.65. | పలుకు వెలఁది | : వాగ్వనితా (వాణి) |
| 66. | కలుములపైదలి కోడలు | : సంపద్వ ధూస్నుషా |
| 67. | తలవాకిట మెలఁగెడు పొలఁతుక | : శిరోద్వారఖేట ద్వనితా |
| 68. | నలువపణఁతి | : చతురానన మహిళా |
| 69. | పోత్తము ముత్తు | : పుస్తక ముక్తామణిః |
| 70. | ముక్కంటి వెలఁది | : త్రిలోచన సతీ |
| 71. | జగము తల్లి | : భువన జననీ |
| 72. | (గ) గెట్టురాయని పట్టి | : పర్వతరాజపుత్రీ |
| 73. | సామి సామేను చేకొన్నచాన | : భర్త్రర్ధాంగ గతకామిని |
| 74. | ఏనుఁగుల గొంగతత్తడి నెక్కు దంట | : ఇభవైరితురంగాధిరోహణ చతురా |
| 75. | పిళ్ళారి | : ద్రావిణగణకనామ |
| 7 76. | వెనకయ్య | : వినాయకః (?చరిమార్గ్యః తజ్జశ్చ) |
| 77. | ఇద్దరు తల్లుల బిడ్డఁడు | : ద్విమాతృపుత్రః |
| 78. | ముక్కంటిపండ్లు తిను జెట్టి | : త్రిలోచనఫల చర్వణ సమర్థః |
| 79. | పని చెరుపుల దొర | : కార్యవిఘ్నకరప్రవీణః |
| 80. | ఒంటికొమ్మదేవర | : ఏకదంతదేవః |
| 81. | ముక్కంటి యనుఁగుఁగుజ్జు | : త్రిలోచన ప్రియపుత్రః |
| 82. | చేట చెవుల వేల్పు | : శూర్పకర్ణదేవః |
| 83. | మొక్కులు తేర్చు జేజే | : మనోరథపూరణచణదేవః |
| 84. | వంకరతొండంబు వాఁడు | : వక్రతుండవాన్ |
| 85. | గుజ్జువేలుపు | : వామనదేవః |
| 86. | మీనుమనుమని యల్లిక నొడువులపంట వ్రాసినదంట | : మత్స్యపౌత్రసాహిత్యవాక్య దంతాగ్రలేఖకః |

| | | | |
|---|---|---|---|
| 87. | కొక్కుతేజిరౌతు | : | ఆఖుతురంగ సాది |
| 88. | ఏనుగుమొగముదేవర | : | గజముఖదేవః |
| 89. | కుడుముల తిండికాఁడు | : | మోదకఖాదనవాన్ |
| 90. | పాఁపజందెములమేటి | : | నాగయజ్ఞోపవీతప్రభుః |
| 91. | పెద్దకడుపువేల్పు | : | బృహజ్జఠరదేవః |
| 92. | వడుగు | : | వటుః |
| 8.93. | కొమరసామి | : | కుమారస్వామి |
| 94. | జంటముమ్మొముల దంట వేలుపు | : | ద్విగుణిత త్రిముఖ శ్రేష్ఠ దేవః |

95.పాఁపకణముతినువావురమురౌతుః భుజంగ కబళాదనతురంగ సాదీ.

| | | | |
|---|---|---|---|
| 96. | వెనకయ్య వెనుకవాఁడు | : | వినాయకచరమవాన్ (అనుజ ఇత్యర్థః) |
| 97. | ముక్కంటియింటిముద్దు పట్టి | : | త్రినయనసాధ్వీ ప్రియతనూభవః |
| 98. | వేలుపుగమికాఁడు | : | దేవతావాహినీపతి |
| 99. | ఱెల్లుఁజూలు | : | శరప్రసూతిః |
| 100. | వేలుపులమూఁకపేరిటివెలఁది మగఁడు | : | దేవవరూధినాఖ్యాంగనా రమణః |
| 101. | ఆరుగురు తల్లుల కొమరుఁడు | : | షణ్మాతృకుమారః |
| 102. | రెండారుచేతుల దండిమగఁడు | : | ద్విగుణీకృత షడ్బాహు. |
| 103. | పుంజుదాలుదాలుపు | : | రణాయుధవైజయంతి |
| 104. | కొంచ గుబ్బలి వ్రక్కలించిన బలుదిట్ట | : | క్రౌంచ మేదినీధర విదారణ సమర్థః |
| 105. | కరువలిసంగడి కాని కొడుకు | : | పవన సఖసుతః |

106. వేలుపు జేని దళవాయి : సురరాజ సేనానిః
9.107. లచ్చికొడుకు : లక్ష్మీకుమారః
108. వెడవిలుతుఁడు : వేగధన్వా
109. అలరువిలుకాఁడు : కుసుమచాపవాన్
110. మరుఁడు(తజ్జః-తద్భవము) : స్మరః
111. పచ్చవిలుతుఁడు : హరిద్ధనూః
112. వలరాజు : బలరాజా
113. (వే) ఇంచువిలుతుఁడు : తటిద్ధన్వా
114. కన్నులవిలుతుఁడు : లోచనధన్వా
115. [1] చందమామ యల్లుఁడు (దేశ్యము) : మదనమాతుస్వస్రీయః మదనః చందః (దేశ్యే)
116. తుంటవిలుగలదంట(తజ్జః) : దుష్ట కార్ముకధురీణః
117. కమ్మవిలుకాఁడు : పరిమళద్ధన్వా
118. మీను మొసలిసిడెంబువాఁడు : ఝషమకరకేతనవాన్
119. తీయవిలుగామిడి : మధుర కోదండ గ్రామిణిః
120. చక్కెర వింటివాఁడు : శర్కరాశరాసనవాన్
121. రాచిలుకతేజినెక్కురౌతు : శుకరాట్తురంగాధిరోహణ సాదీ
122. చెఱకు విలుకాఁడు : ఇక్షుకోదండవాన్
123. చౌవంచములుకులుగలదంట : చతుర్దరోద్దరైక విశిఖశ్రేష్ఠః
124. జమిలి ముక్కాలినారివిలుకాఁడు : ద్విగుణిత త్రిపథశింజినీ శరాసనవాన్

---

1. 'చందమామ' యనుచో 'చంద' శబ్దముదేశ్యమనియు దీనికి మదనుఁడని యర్థమనియు వీవివృతి యభిప్రాయము. చంద = మదనునియొక్క మామ = చంద్రుఁడు ఆతని అల్లుఁడన మదనుఁడు.

| | | | |
|---|---|---|---|
| 10.125. | గురుటామంతుడు | : | గరుత్మాన్ |
| 126. | పాములవేటకాఁడు | : | సర్పాఖేటకరః |
| 127. | మరునయ్యతేజి | : | స్మరజనకతురుగః |
| 128. | తూరుపు నేలుదొరబువ్వ గొన్నలావరి | : | ప్రాచీనపాలక ప్రభు -న్నా హా ర హరణ సమర్థః |
| 129. | పులుగుల దొర | : | పక్షిరాజః |
| 130. | చుట్టువాలుజోదు | : | వృత్తాయుధ యోధః |
| 131. | వలమురి | : | దక్షిణావర్తవాన్ |
| 132. | కలిమి కొమ్మ మగని బూరకొమ్మ | : | సంపద్వ ధూకాంతస్వన ద్వాద్య శృంగః |
| 11.133. | బటువు కైదువ | : | వర్తులాయుధః |
| 134. | చుట్టుకైదువ | : | వలయాయుధః |
| 135. | గుసు కైదువ | : | వృత్తప్రహరణః |
| 12.136. | దుక్కిడాలుపు | : | కృష్యాయుధ ధరః |
| 137. | వెన్నదొంగయన్న | : | నవనీతచోరపూర్వజః |
| 138. | నల్లవలువ దాలుపు | | నీలాంబరధరః |
| 139. | వెట్టి నీళ్ల మేలువాఁడు | : | అపస్మారజలశుభోదయః |
| 140. | తెల్లని మై దంట | : | ధవళాంగప్రతీతః |
| 141. | తాటిపడగవాఁడు | : | తాళధ్వజవాన్ |
| 142. | వడముడి | : | దక్షిణభాగ చర్మ గ్రంధి (కించ) |
| | బడముడి | : | పరసైన్యకోపవాన్ |
| | వబయోరభేదః | : | వడ-సైన్యమ్. ముడి-కోపః |

**వడముడి.**

13.143. గాడుపుకొడుకు : పవనాత్మజః (భీమః)

14.144. వివ్వచ్చుఁడు (తజ్జః) : బీభత్సః

145. కవ్వడి,
146. కవవడి } : సవ్యసాచి (శరసంధానే'కర' యుగవేగవాన్)-కర్త్రి: శరసంధానమునందు కుడియెడమ చేతులు రెంట వేగము గలవాఁడు. అర్జునుఁడు.

147. చరమభాగేమత్స్యలాంఛనవాన్

15.148. తెల్లనేనుఁగు నెక్కి తిరిగెడిదొర : శ్వేతకుజ్జారారోహణచరిష్ణుప్రభుః

149. పెట్టు చెట్లుగలిగిన వేల్పు ఱేఁడు : వితరణవృక్షవత్సురేంద్రః

150. నిక్కువీనుల జక్కి నెక్కురౌతు : ఉన్నత శ్రవణ తురంగమారోహణ సాదీ.

151. సోమాసి సొమయాజి

152. ఎక్కుడు మొగులు ప్రోడ : ఆరోహద్బలాహకప్రౌఢః

153. చట్టుపలుతెగ గట్లు కొట్టినజెట్టి : పర్వతపక్షవిభేదనకరణసమర్థః

154. జమిలి చౌవంచ పదులజన్నములు చేసిన వేలుపు : ద్విగుణితచతుర్దరోదరైకదశయజ్ఞకరణదేవః

155. నూఱంచుల డాలు గలిగిన జోదు : శతధారాయుధవచ్చూరః

156. తూర్పుమాగాణమేలెడిమ(ద్య)ణియగాఁడు : ప్రాచీనసీమపాలనకరప్రభుః

157. ఒడలి చూపాడయఁడు : శరీరదృష్ట్యధికర్తా

158. దుగబొట్ల రెంటి య్యైదులు : ద్విబిందుయుగళ

| | | |
|---|---|---|
| | కనులు గలజోదు | పంచలోచన వచ్చ్వారః |
| 159. | పారుతపసియింటి పంచకొడి | : తపస్విగృహాంతర్వితర్ది కాకకుక్కుటః |
| 160. | అగ్గి(తజ్జ) | : అగ్నిః |
| 161. | నీరుపాప | : కృపీటబాలః |
| 162. | జంట మోముల సామి | : ద్విముఖ ప్రభుః |
| 163. | (గాలిచెలి) | : వాయుసఖః |
| 164. | అంట రానివేలుపు | : అస్పృశ్యదేవః |
| 165. | కప్పుతెరువు జాడవాఁడు | : కృష్ణ వర్త్మ రీతి ర్మాన్ |
| 166. | అన్నిటి తిండి కాఁడు | : సర్వభోక్తా |
| 17.167. | జముఁడు | : యమః |
| 168. | దక్కినపు సామి | : దక్షిణాధిపతిః |
| 169. | జమున సైదోడు | : యమునాసహోదరః |
| 170. | ప్రొద్దుకొమరుఁడు(తజ్జల) | : ప్రద్యుకుమారః |
| 171. | పోతుజక్కినెక్కి యాడెడు రౌతు | : మహిషతురంగారోహణ నృత్యత్సాదీ. |
| 172. | పితరుల సామి | : పితృస్వామి |
| 173. | గొదె దాలుపు | : గదాదండధరః |
| 18.174. | సోకుమూకలరౌతు | : రక్షోగణాధిపతిః |
| 175. | నల్ల ద్రావుమగఁడు | : రుధిర పానవాన్ |
| 176. | మూ? లరేడు | : గోణాధిపః? |
| 177. | రేదిమ్మరీఁడు | : నిశాచరః |
| 178. | రక్కసుఁడు | : రాక్షసః |
| 179. | పొలసు తిండిపోతు | : పిశితాశ మహిషాపతి |
| 180. | వల్లెత్రాడు దాలుపు | : పాశధరః |
| 181. | మొదలినీరు చూలి | : పూర్వజలప్రసూతిః |

182. పడమటిదొర : పశ్చిమాధినాయకః

9.183. గాడుపు(తజ్జః) : గంధవాట్

184. గాలి : వాతః

185. మినుచూలి : ఆకాశప్రసూతిః

186. పై యర : ఊర్ధ్వగః

187. సోకు దయ్యము : (దుగల) స్పృశత్ పిశాచః

188. తెమ్మెర : దక్షిణ మరుత్

189. కరువలి : అతిశీతలః

190. నీటితాత : సలిల పితామహః

191. ఈద : శీతలః

192. సురటివీచుల బుట్టు : వ్యజన చాలన సంభవః

193. వడిగలజింకనెక్కువెఱరౌతు : బలవత్ప్రషదశా ్వరోహణ మహాసాది

194. ఒంటిమాకులపెనుముప్పు : ఏకవృక్ష మహావిపత్

195. బక్కవాండ్ర పెనుబాధ : అతికృశవృద్ధమహాపీడా

196. ఒడలుదాలుపు పిండు కుసురైన బలియుఁడు : శరీరధారి సముదయప్రాణ భూత మహాబలః

197. సుడిగొట్టు : ఆవర్తచరః

198. మబ్బువిప్పు : మేఘవిధ్వంసీ

199. పాములమేత : సర్పాదనః

200. చలినట్టు : శీతనివాసః

201. జక్కుల దొర : యక్షరాజః

202. వడచక్కనికెంజాయవాఁడు :

203. కనులమాను : లోచనతమః

204. తీయని మాను : మధురవృక్షః (ఇక్షుః)

205. జమునెక్కిరింత : యమవాహః మహిషః

| | | |
|---|---|---|
| 206. | వెడమోము మెకము | : వితతముఖమృగః |
| 207. | జడల మెకము | : జటా మృగః |
| 208. | ఏనుగుల గొంగ | : గజవిరోధిః |
| 209. | మెకముల సామి | : మృగాధిపః |
| 210. | తెల్లడాలుమెకము | : సితచ్ఛవిమృగః |
| 211. | తెరినోటిమెకము | : వివృతాస్యమృగః |
| 212. | బొమ్మ మెకము | : సంహనాదమృగః |
| 213. | (గ)గెట్టుపట్టియెక్కుతింత | : పర్వతప్రీతితురంగః (సింహః) |
| 214. | పసితిండి | : పశుభక్షకః |
| 215. | మెకములతిండిపోతు | : మృగాదనః |
| 216. | చారలమెకము | : చిత్రమృగః |
| 217. | మువ్వన్నె మెకము | : త్రివర్ణమృగః (వ్యాఘ్రః) |
| 218. | పుట్టకూడు తిండిపోతు | : వల్మీకాన్న ఘస్మరః |
| 219. | వెనకచూపులమెకము | : చరమదృష్టి మృగః |
| 220. | మోరతెలుపు మెకము | : ఆస్యధవళమృగః |
| 221. | (బల్లూకము) | : భల్లూకః |
| 222. | పలుకొమ్ములమెకము | : బృహద్విషాణ మృగః |
| 223. | ఎక్కుడు మెకము | : మహామృగః |
| 224. | హజ్జమెకము | : సమయమృగః |
| 225. | ఈగలమెకము | : మదవన్మృగః- గజః |
| 226. | పడగదారి | : ఫణధారి |
| 227. | గాలిమేతరి | : పవనాశనః |
| 228. | విసదారి | : విషధారి |
| 229. | కానరానికాళ్ళది | : అదృశ్యచరణః |
| 230. | వీనులకంటి | : శ్రవణనేత్రః |

| | | |
|---|---|---|
| 231. | పుట్టపెట్టె పట్టు | : వల్మీకపేటికానివాసః-సర్పః |
| 232. | తొలుకరి కలుకు పులుగు | : మధుమాధవ భిభ్యత్ఖగః |
| 233. | చిగురువిలుకాని తేజి | : కిసలయధనుష్మద్వాజి. |
| 234. | తొగురు ముక్కుపులుగు | : కషాయనాస ఖగః |
| 235. | పచ్చ ఱెక్కల పులుగు | : హరిత్పత్రవిహగః (శుకః) |
| 236. | సగినాలపులుగు | : శకునపక్షి |
| 237. | | కనకాక్షి |
| 238. | ఎనిమిదడుగులమెకము | : అష్టాపదమృగః |
| 239. | ఏనుఁగుల సూడు గొంగ | : గజవైరివిరోధి (శరభః) |
| 240. | కారుకొమ్ములమెకము | : అసితశృంగమృగః |
| 241. | | రామమృగః |
| 242. | సులికొమ్ములమెకము | : ఆవర్తిత శృంగవన్మృగః |
| 243. | | ఆస్పంద దత్రిః |
| 244. | వణుకుగుబ్బలి, వలితెప్ప | : శీతగిరిః |
| 245. | చలిమిరిమల | : హిమపిండద్రవ్యాచలః |
| 246. | గట్టుల ఱేఁడు | : పర్వతరాజః |
| 247. | ముక్కంటిమామ | : త్రిలోచనశ్వశురః |
| 248. | మంచుకొండ | : హిమగ్రావా, హిమవాన్ |
| 249. | వేలుపులకొండ | : నిర్జరాద్రిః |
| 250. | పుత్తడి గుబ్బలి | : కనకాద్రిః |
| 251. | పునుక కంచము దారివిల్లు | : కపాలపాత్రధారిబాణాసన మ్ (మేరుః) |
| 252. | తెలితిప్ప | : శ్వేతాద్రిః |
| 253. | ముక్కంటిమల | : త్రినయన మహీధరః |
| 254. | వెండి కొండ | : రజతభూమి భృత్-కైలాసః |

| | | |
|---|---|---|
| 255. | కవ్వపు కొండ | : మంధాన శైలః |
| 256. | తరిమల | : మథనశిలోచ్ఛ్రయః(మంథరః) |
| 257. | కడపలమల | : ప్రత్యంత శిఖరీ |
| 258. | చుట్టుకొండ | : ఆవరణాహార్యః చక్రవాళాద్రిః |
| 259. | తూర్పుకొండ | : ప్రాచీపర్వతః |
| 260. | తొలి(గ) గెట్టు | : పూర్వగిరి |
| 261. | పొడుపు గుబ్బలి | : ఉన్నత భూధరః- ఉదయాద్రిః |
| 262. | క్రుంకుమెట్టు | : అస్తగిరిః |
| 263. | పడమటికొండ | : పశ్చిమాచలః - చరమ మహీధరః |
| 264. | వాలుగంటి | : కుటిలేక్షణ |
| 265. | మచ్చెకంటి | : మీనలోచనా |
| 266. | ముద్దులగుమ్మ | : ఆనందఖనిః |
| 267. | తీఁగె బోఁడి | : లతాంగి |
| 268. | పూబోఁడి | : కుసుమగాత్రి |
| 269. | తలిరుబోఁడి | : పల్లవగాత్రి |
| 270. | కలువ కంటి | : కువలయాక్షి |
| 271. | వాలుగంటి | : బాణలోచన |
| 272. | మెఱుఁగు బోఁడి | : శంపాంగి |
| 273. | ఇంచు బోఁడి | : తటిద్గాత్రి |
| 274. | చిగురాకు బోఁడి | : భాలకిసలయ గాత్రి |
| 275. | అలరుబోఁడి | : భాసురాంగి |
| 276. | చిలుకలకొలికి | : శుకాలాపా - స్త్రీ |
| 277. | వెలిడాలు గన్నది | : బాహ్యరుచిమతే- జారిణి |

278. ముగుద, ముగుద : ముగ్ధా
279. ఎలనాఁగ : బాల
280. ఇల్లాలు : గృహపతి
281. వేలుపు బానిసె : దేవదాసి
282. వెలయాలు : విలాస స్త్రీ
283. బోగముచాన : భోగస్త్రీ
284. ఆటచేడియ : లాస్యాంగనా
285. గడనపడఁతి : ఆర్జవకామినీ
286. వన్నెకాఁడు : వర్ణవాన్
287. రూపరి : రూపవాన్
288. సొగసు కాఁడు : విలాసవాన్
289. చక్కనివాఁడు : సౌందర్యవాన్
290. సన్నలాఁడు : ఉత్సాహవాన్
291. చూడఁగలవాఁడు : దర్శనీయః, సుందరాకారవాన్
292. పాలునీరునేర్పఱచుపులుగు : క్షీరోదకవిభాగకర ఖగః(హంసః)
293. జమిలిముక్కాలి ద్విగుణిత త్రిచరణః(అళిః)
294. లో చేయి : అంతర్హస్తః
295. అరచేయి : కరతలః
296. మీ చేయి : బహిఃకరః
297. పెడచేయి : చరమకరః
298. వెనుకమేను : చరమాంగమ్
299. ఒకమాదు : ఏకవారః
300. వేమారు : బహువారః
301. పొగడితె : వినుతి
302. బారట : వారమ్ (సముహః)

303. అలంతి : అల్పత

304. బంటు-భటః 305. సూరుడు - శూరః

306. ఏస- శుభమ్ 307. దొన- తూణమ్

308. తేరు- రథః 309. గుఱ్ఱము- ఖురవాన్

310. పల్లకీ- పల్యంకః 311. కళ్లెము- కళికా

312. పంటకమ్ - పక్తమ్ 313. రొక్కము- రుక్మమ్

314. మంచినీళ్లు- సమీచీనజలమ్ కుబేరునిపేర్లు-

315. వెదచక్కని కెంజాయవాఁడుఃదక్షిణభాగ శోణమత్స్యవాన్

316. మానిసియెక్కుడుగాఁడు : నరారోహణవాన్

317. ముక్కంటి యనుగు చెలి : త్రిలోచన ప్రియసఖః

318. రొక్కమేకిమీఁడు : ధనాధిరాజః

319. వడి ముడిగలవేలుపు : ధనవద్దేవః

320. పాఁపతొడవులిడియెడిదొర : సర్పభూషణధరప్రభుః

321. కడదెసకాపుండెడి యొడయఁడు : అంత్యదిశాపాలన నివసన్మహాప్రభుః

322. చెలిజడముడిజంగము : స్త్రీజటాజూట జంగమః

వి. జంగమశబ్దస్య శూద్ర సన్యాసి పండార ఇత్యాద్యాహృతః లోకే పండార శబ్దస్య ప్రాకృతభాషాయాం పండరః గోమహేశ్వరితి వ్యాకరణ దేశ్య సూత్రేశార్దూలముని రాజేనోక్త త్వాత్.

జంగము శబ్దమునకు శూద్రుఁడు సన్న్యాసి పండారార్థములు గలవు. శార్దూలమునిరాజా తన వ్యాకరణమున గోమహేశ్వర- అను లక్షణమున పండారశబ్దము ప్రాకృతమున 'పండరః' అని యుండుటను తెల్పెను.

ఈ వివరణమున కిటఁ బ్రసక్తి విచార్యము. 'పండార' శబ్దమును విశేషమె.

323. జగముకన్ను : జగచ్చక్షుః

324. వేఁడి వెలుంగు : ఉష్ణజ్యోతిః

325. పగలుగావించువేలుపు : అహస్కరదేవః

| | | |
|---|---|---|
| 326. | పచ్చగురాలవజీరు | : హరిదశ్యమహా ప్రభుః |
| 327. | మొదటివేలుపులుముప్పురగదిసెడి టెంకి | : ఆదిదేవత్రయమిళద్ధామః |
| 328. | చాకిలిపెద్ద | : అమరోత్తమః |
| 329. | తమ్మివాల్గంటి మగఁడు | : పద్మినీ బాణనేత్రావల్లభః |
| 330. | ఏడుగురాలతేరెక్కు-జోదు | : సప్తతురంగమస్యందనారోహణ సమర్థః |
| 331. | మింటి తెరువరి | : నభోమార్గవాన్ |
| 332. | ప్రాచదువుల పెట్టియ | : పూర్వవిద్యామంజూషా |
| 333. | ఎఱ్ఱనివేలుపు | : అరుణదేవః |
| 334. | చదలుమానికెము (మానిక్కెము ఇతిచ) - అంబరమణిః | |
| 335. | చీఁకటి గొంగ | : తిమిరారాతిః |
| 336. | జక్కవల మేలు | : చక్రవాకశుభోదయః |
| 337. | జంటారు మేనులసామి | : ద్విగుణితషడాత్మప్రభుః |
| 338. | గాముల ఱేఁడు | : గ్రహరాజః |
| 339. | రేవెలుగుజోడు | : రజనీజ్యోతిస్తుల్యః |
| 340. | ప్రొద్దు (తజ్జః, కాలరూపిచ) | బ్రధ్నః |
| 341. | వేడి వేలుపు | : ఉష్ణదేవః |
| 342. | వెన్నుని వలకన్ను | : విష్ణుదక్షిణనేత్రః |
| 343. | నెల | : మాసః |
| 344. | బిత్తరిజింకదాలుపు | : చతురమృగధరః |
| 345. | కమ్మవిలుతుని మామ | : పరిమళ కార్ముకమాతులః |
| 346. | చీఁకటి వేరు విత్తు | : అంధకార మూలబీజః |
| 347. | తపసికనుపాప | : అత్రి తపస్విలోచన డింభ |
| 348. | తమ్ములపగవాఁడు | : పద్మవిరోధి |
| 349. | వేలుపులబువ్వ | : దేవతాన్నమ్ |

350. ప్రొద్దుజోడుకోడె : బ్రధ్నసమానవయస్కః
351. చందమామ : మదన మాతులః
352. దేశ్యేచందశబ్దస్య మదనత్వాత్ చందోలావణ్యమయః అతేవచందో మదనః[1].
353. చలి వెలుంగు : శీతలజ్యోతిః
354. చుక్కలదొర : తారాధినాయకః
355. రేవెలుంగు : నిశాజ్యోతిః
356. చౌకముల పాళ్ల తెలిముద్ద : చతుశ్చతుర్భాగశ్వేతపిండః
357. ముక్కంటి తలపువ్వు : త్రిలోచనశిరః పుష్పమ్
358. జాబిల్లి : యామినీ భిల్లః
యస్యజః దంత్యః : (జాబిల్లి)
జాశబ్దస్యజంగశబ్దార్థః
జాబిల్లీత్యత్ర జంగ బిల్లీ త్యర్థః
జంగశబ్దస్య దీర్ఘానుగమనం దీర్ఘపదచలనమ్
359. జంట దంట – పుష్పవచ్ఛ్రేష్ఠః
360. జక్కవ కవవిప్పు : చక్రదంపతీవియోగకరః
361. రేఱేఁడు : నిశానాయకః
362. పంటపైరుల యెకిమీఁడు : ధాన్యసస్యాధిరాజః
363. పాల్కడలిపట్టి : క్షీరసాగర పుత్రః
364. వెన్నెల ఱేఁడు : చంద్రికానాయకః
365. కడలి వెన్న : సముద్ర నవనీతమ్
366. కలువల ఱేఁడు : కుముదాధిపతిః
367. చలువల ఱేఁడు : శీతల రాజః

---

1. 'చందమామ' అనుదానింబట్టి. చందశబ్దమునకు మన్మథుఁడను నర్థము కల్పితమయ్యేనేమో మదనుఁడను నర్థముననేకాక చందశబ్దము తెలుఁగునఁ గానరాదు.

| | | |
|---|---|---|
| 368. | కరివేల్పుడాకన్ను | : కృష్ణదేవ వామనేత్రః |
| 369. | కోవెల, గుడి | : దేవళః |
| 370. | జేజేలు, దేవళ్లు, వేలుపులు | : దేవాః |
| 371. | సిద్రంపుపెద్ద పాప ఱేడు | : చిద్రశ్రేష్ఠశిశురాజః |
| 372. | తడుపులనిడుపఁడు | : పురాతనః |
| 373. | చిలువ ఱేఁడు | : సర్పరాజః |
| 374. | వెన్నుపానుపు | : విష్ణుశయ్యా |
| 375. | పుడమిదాలుపు | : పృథివీధరః |
| 376. | గాడ్పు తండ్రి | : పవన జనకః |
| 377. | మిన్ను (విన్ను) బయలు | : బహిః |
| 378. | చుక్కల తెరువు | : తారాపథః |
| 379. | మొగులు దారి | : మేఘాయనమ్ |
| 380. | దివి | : ద్యౌః |
| 381. | ఆకసము (తజ్జ) | : ఆకాశః |
| 382. | నింగి, ఉప్పరము | : అభ్రమ్ |
| 383. | చదలు, వేలుపులత్రోవ | : సురవర్త్మ |
| 384. | నలుగడలు | : చతుర్దిశః |
| 385. | దచ్చికడలు | : దిశాష్టకమ్ |
| 386. | ఈరైదుకడలు | : దశదిశః |
| 387. | తెల్ల యేనుఁగు | : శ్వేతకుంజరః |
| 388. | వేలుపుల గొరు | : దేవతాగజః |
| 389. | చౌదంతి | : చతుర్దన్తి |
| 390. | వెల్లగుఱ్ఱము | : సితాశ్వః |
| 391. | వేలుపుల దొరతేజి | : సురరాజ తురంగః |
| 392. | తాటిసిడెమువాని తల్లి | : తాళ కేతనజనని |
| 393. | కూఁతురు బిడ్డ | : పుత్రీసుతా |

| | | |
|---|---|---|
| 394. | ముత్త్రోవ ద్రిమ్మరి | : త్రిపథగః |
| 395. | విన్నువాఁక | : గగనదీర్ఘికా |
| 396. | వెన్నునడుగు పాప | : విష్ణు పాదశిశుః |
| 397. | కడలి వెలఁదుక | : సముద్రసీమంతినీ |
| 398. | వేలుపుల యేఱు | : అమరధునీ- గంగా |
| 399. | వెలిమొదవు | : శ్వేతశృంగిణి |
| 400. | వేలుపుల గిడ్డి | : దివద్గోః |
| 401. | పు డుకు దొడుకు | : కృధ్యదఘ్న్యా.? ఉష్ణగౌశ్చ కామధుక్. |
| 402. | వేలుపుల చెట్టు | : సురతరుః |
| 403. | వెల్ల మాను | : శ్వేతద్రుమః |
| 404. | ఈవులమాను | : వితరణ వృక్షః- కల్పతరుః |
| 405. | రిక్క, చుక్క | : ఋక్షః |
| 406. | తెలగంటి యన్నులు | : అనిమిషాంగనాః |
| 407. | అచ్చరలు | : అప్సరసలు |
| 408. | వేలుపుల మచ్చెకంటులు | : దేవతాస్త్రీయః (అప్సరసః) |
| 409. | పగలు, పవలు | : అహః |
| 410. | రే, రేయి, రాతిరి(తజ్జా) | : నిశా |
| 411. | రేయెండ | : నిశాతపః |
| 412. | వెన్నెల | : చంద్ర తేజః -చంద్రికా |
| 413. | మించులు, మెఱుపులు | : తటిత్ |
| 414. | మొయిళ్లు, మొగిళ్లు, మబ్బులు | : మేఘాః, |
| 415. | మున్నీరు | : పూర్వజలమ్ |
| 416. | కడలి, సంద్రము, సందరము | : (తజ్జః) సముద్రః |
| 417. | మడుగు, మడువు | : హ్రదః |
| 418. | ఆరవ సంద్రము | : షష్ఠ మాబ్ధిః |

419. పాలవెల్లి : క్షీరవేగః
420. చిద్దుకడలి : చిక్కణాంబుధిః
421. పాల్కడలి : దుగ్ధసాగరః
422. తొలుచదువులు : పురాతనవిద్యాః
423. ప్రాఁజదువులు : ప్రాగ్విద్యాః
424. తొలుమినుకులు : పురాతన వాక్యాని
425. ప్రామినుకులు : ప్రాగ్వాక్యాని
426. తొలుబలుకులు : చిరంతనవచనాని
427. ప్రాఁబలుకులు : ప్రాగ్వచనాని-వేదాః
428. పారుఁడు, బాపఁడు, పుడమివేల్పు : భూదేవః బ్రాహ్మణ
429. జన్ని గట్టు : యజ్ఞ పర్వతః
430. దొర, ఱేఁడు, సామి, ఎకిమీఁడు : భూపతిః – రాజా
ఏలికె, ఒడయఁడు, పుడమి ఱేఁడు
431. కోమట్లు : కోమటులు
మూఁడవకొలము వాండ్రు : త్రైవర్ణికః
432. బేరి : వ్యాపారి, వైశ్యః
433. కాపువాండ్రు : వ్యవసాయి
434. నాలవ వాండ్రు : చతుర్థ వర్ణః
435. బలిజెవాండ్రు, బలులంజెలవారు-భర్తృహరి వంశజః, శూద్రః
436. వడుగు : వటుః
437. గోచి బాపఁడు : కౌపీనబ్రాహ్మణః
438. బొమ్మచారి : బ్రహ్మచారి స.ఏవ.
439. ఆలుబిడ్డలు గలయతఁడు : కుటుంబవాన్
440. ఇల్లు ఱేఁడు : గృహపతిః
441. గెరస్తు, గేస్తు, (తజ్జ) : గృహస్థః (గేస్తుదేశ్యః)సపత
443. అడవిమనికిపట్టు : వనవాసి

444. జడధారి : జటాధారి
445. ఇలువాసి తిరుగుబోడి : పరివ్రాట్
446. తపసి : తపస్వీ
447. కావిపుట్టపు గోచులసామి : కాషాయవసన కౌపీనవాన్(యతిః)
448. అమ్మ, అవ్వ, తల్లి, కన్నమ్మ : జననీ అంబా
449. అయ్య, అప్ప, తండ్రి : జనకః
450. తోడఁబుట్టువు, తోఁబుట్టువు, సైదోడు : సోదరీసోదరౌ.
451. తోడికోడలు, ఏరాలు, - భర్తృ సోదరభార్యా
452. చెల్లె, చెలియ : స్వసా
453. అక్క, అప్ప : భగినీ
454. ముగుద, ముద్దరాలు : (అబల) బేల,గోల - ముగ్ధా స్త్రీ
455. గెట్టువాయ గెయ్యాళి, ఊఁగ- ధూర్తస్త్రీ
456. ఐదువ, ముత్తైదువ ఐదువరాలు - సుమంగళి
457. పేరంటాలు, జక్కని- ధృతచిరంటినీ
458. గేస్తురాలు : గృహిణీ
459. ఆలు-పెండ్లాము, ఇల్లాలు, రాణి : భార్య
తొత్తువరువుఁడ దాసి
460. జవరాలు కొమరాలు జవ్వని యౌవని
461. కన్నె, కన్నియ : కన్యకా
462. ప్రోడ, గట్టివయసుది : ప్రౌఢ
463. ముద్దియ, మిండలకోడె : లోలా
464. ముసలి, ముదియ, ముదుక, పెద్ద- వృద్ధ
465. చెడిపె, రంకులాఁడి, చెడ్డ, తొయ్యలి } : విటి?
విలిచౌలు గన్నది.
466. ఎడకాఁడు కుంటెన గాఁడు : విటదూతః

467. తేటపూ బానిసె వెలయాలు, వేడుక కత్తె, లంజె, బొగముచాన, వెల్లాటకత్తె, పడుపుపడతి, ఆటచేడియ, గడనపడతి - వేశ్యా

468. వెచ్చగాఁడు, బొజుగు వేడుకకాడు, మిండఁడు, మిండగీఁడు ననుపుకాఁడు : విటః

469. కోడెకాఁడు, గోవాళ్లు? : యువా

470. నాగవాసము, - వేశ్యాజనసమూహము?

నెలఁతుక, వ్రాల్గంటి, పొలఁతుక, నవలా, మచ్చెకంటి మగువ, ఇంతి, పొంఁతి, చాన, చెలువ, ఉవిద, కలికి, నెలఁత, వెలఁదుక, ముద్దులగుమ్మ, తీగెబోఁడి, పూబోఁడి, చేడియ, ముద్దియ, ఎలనాగ, ప్రోయాలు, తలిరుబోడి, అతివ, కలువకంటి, వాల్గంటి, తొయ్యలి, ప డతి, మెఱుగుబోడి, కొమ్మ, చామ, చిలుకలకొలికి, లేమ,ఇంచుబోఁడి, తెరవ, ఉగ్మలి, పైదలి, బోటి, చిగురాకుబోఁడి, అన్నువ, నాతి, బోడి, వెలఁది గొంతి అలరుబోడి - స్త్రీనామాని.

471. నేస్తంబు, చెలిమి, పొందు, - స్నేహః

472. సంగాతి నెచ్చెలి చెలికాఁడు నేస్తకాఁడు, అనుగు సంగడీఁడు : స్నేహితః

473. ముచ్చు, తెక్కలికాఁడు, ఎత్తుబడికాఁడు, కత్తెరదొంగ, కన్నగాఁడు, చెవాదికాఁడు, దొంగ, వల్లడికాఁడు, తెరువేటకాఁడు, దొరుకోటసన్యాసి, మునిముచ్చు, ముడియవిడుపు, గదిదొంగ - తస్కరః

474. గడుసు, బేరజము, బిసాళి, కూళ, చెడుగు, రంతు, తులువ. కైలాటికాఁడు, టంకు, పలువ, టాటోటు, నాలిబూతంబు గొంటు పాలసుఁడు, టకటొంకు, చెనటి మొంటకట్టె దొసకారి, గరాసు, కుచ్చితుఁడు, చెండిపోతు కల్లరీఁడు టవిలిగాఁడు, ముదిగాఁడు, టక్కరి - దుర్జనః

475. బుడుత, పాప, చిఱుత, బిడ్డ, కంటు, పొట్టి, కూన, కుఱ్ఱ, పట్టి నిసువు - శిశుః

476. కొడుకు- కొమరుఁడు, - తనయః

477. పిన్నవాఁడు, కొంచెమువాడు, చిన్నవాడు, పడుచువాడు - వటుః

478. కుఱుచ, గుజ్జు, చిఱుత-గిడ్డి, పొట్టి - హ్రస్వః

479. వెరవిడి, విత్తళి, వెదురు, వెంబడి, వీఱిడి వెడగు, వెంగలి, వెఱ్ఱి - అపస్మారీ.

480. జాణ, ప్రోడ, దంట, నేర్పరి, వలంతి - సరసః.

481. చూడఁగలవాఁడు, వన్నెకాఁడు, రూవరి, సోగసుకాఁడు, వన్నెవాఁడు, చక్కనివాఁడు, సింగారి- సుందరాకారవాన్

482. గుడ్డి, చీకు, - అంధః

483. మూగ మూక మూవ - మూకః

484. మే, మెయి, మేను, ఒడలు- కాయః

485. పరువము - ప్రాయః

486. జవ్వనము - యౌవనమ్

487. నెఱులు, వెంట్రుకలు, నెఱకలు, కురులు - కేశాః

488. వేనలి, క్రొవ్వెద, కొప్పు, మూలతురుము - ధమ్మిల్లః

489. క్రొమ్ముడి, కీలు గంటు - కేశబంధః

490. నుదురు, నొసలు - లలాటమ్

491. చూపు, చూడ్కి - దర్శనమ్

492. కను, కన్ను, కన్ - చక్షుః

493. చెవి, వీను - శ్రవణమ్

494. నడుము, కౌను - మధ్యః

495. వా, వాయి, నోరు - వదనగు హో

496. పల్లు, పలు - దంతః
497. వాతెఱ, పెదవి, మోవి - ఓష్ఠాధరౌ
498. ఎద, అక్కు, బోర, రొమ్ము - వక్షః
499. మోము, మొగము, మోర - ముఖమ్
500. గురువు, తొడ - ఊరుః
501. డెందము, ఎద, మది, ఉల్లము, ఎడ, గుండె - హృదయమ్
502. కేలు, కయి, చే, చేయి, కై, చ్చ్యే-హస్తః
503. అరచేయి, లోచేయి - కరతలమ్, చరమకరః
504. కడుపు, పొట్ట, బొజ్జ, డొక్క, బొజ్జ - ఉదరః
505. మీచేయి, పెనుచేయి, పెడచేయి - చరమకరః
506. పొక్కిలి, బొడ్డు - నాభిబిలమ్
507. వీపు, వెన్ను, వెనుకమేను - చరమాంగమ్
508. తలపాలుపుట్టె, పునుక - శిరోఽస్థినః
509. నెత్తి, తల, - శిరః
510. అడుగు, అజ్జ - పాదః
511. గొంతు, మెడ, అఱుతు, కుతికె-ఆరు, కుత్తుక - కంఠః
512. మెదుకు, బువ్వ, బోనంబు, పసాదము, కూడు, ఓరెము, వంటకము, ఓగిరము - అన్నమ్
513. చీర, వలువ, కోక, పుట్టము, దువ్వలువ - చేలమ్
514. సిగ్గు, నాన, సిబ్బెత, - వ్రీడా
515. త్రాగుట, ఆనుట, క్రోలుట, త్రావుట - పానమ్
516. పళ్ళెరము, తెలియ, హరివా ణము, తట్ట, పళ్లెము, రాణము, కంచము, తెలె, - పాత్రః(అమంతము)
517. కోర, దబ్బరు, గిన్నె - చషకః
518. మెత్త, పెజ్జ, పానుపు, పరుపు- శయ్యా
519. ?బోహారు, బొంత, జేజె - దండః

520. మ్రొక్కు - సమస్కారః
521. (పువిద) రోద, సద్దు, చప్పుడు, కూత - ధ్వనిః
522. దప్పి, దగు, దూప - పిపాస
523. నగు, నవు, నగవు, నవ్వు - హాస్యమ్
524. గండు, మగతనము, మగఁటిమి - పౌరుషమ్
525. ఉదుటు, బిగువు,కిట్టు, ఉక్కు, చేవ, ఉంది, చేగ, గట్టి- ద్నఢః
526. దబ్బర, బిద్దు, హుళక్కి, బొంకు, కల్ల - అసత్యమ్
527. నిక్కువము, నిజము, నిక్కము - సత్యమ్
528. అంగలార్పు, బెడద, కడగండ్లు, దెసగోరము, అంగద, ఆత్రము, చెడ్డ, దొసఁగు, కస్తి, చేడ్పాటు, ఇడుము, గొడవ, వెద - విపత్
529. విలువ, వెల, రో, జిట్ట - క్రయః
530. వంగడము, వంగసము, కొలము, కులము - కులమ్
531. తిరుగ, మగుడ, క్రమ్మర, క్రమ్మరి, మఱల, ఎప్పటి, మఱి, వెండి, - పునః పదస్య
532. ఒకపాలి, ఒకపాటు, ఒకమారు, ఒకవిడుత, ఒకతడవ, ఒకతేప, ఒకతడుపు, ఒకసారి, ఒకమరి – ఏకవారస్య
533. సారె, పలుమరు, ఎన్నోనిమారులు, పేమారు, పెక్కుమారులు - బహువారస్య
534. వడిగె, చెచ్చెర, గ్రక్కున, సరగ, - దిగ్గన, వేగిరము, క్రన్నన, వేగము, గొబ్బున, వేళము, గద్దన, వెస — త్వరితమ్.
535. పొజు, పరి, చేరువ, గమి, మొత్తము, కూటువ, బారు, పిండు, తుటుము, దాటు, దండు, మూక–సమూహః

536. అచ్చోటు, అచట, అందు, అచ్చో, అచ్చట
అచ్చోట — తత్రార్థః

537. వింతవాఁడు, లాఁతివాఁడు, పెరవాఁడు - అన్యః

538. నెపము — వ్యాజః

539. తమి, ఇచ్చ, క్రచ్చు, కొరికె, కోర్కి - కాంక్షా

540. ఎల్లప్పుడు, ఉడుగక, నిచ్చ, ఎడపక
అనయము, ఎప్పుడు - సదార్థః

541. దగ్గర, మ్రోల సముకము -

542. ముంగల, చెంత - సమీపస్య

543. అలయిక, సేద, బడలిక - శ్రమః

544. కొన, తుద, - అన్తః

545. మును, ముందర - పురతః

546. ఓరుపు, తాలిమి, తారుట - క్షమా

547. అలఁతి, సైకము, అలకము, సన్నము, కొంచెము,
అసదు — స్వల్పమ్

548. దొడ్డ, మిక్కిలి, మిగుల, పెద్ద, గొప్ప - పృథులమ్.

549. ఎక్కుడు, చాల, తద్ద - ఘనస్య.

550. బవరము, అని, క్రందు - యుద్ధః.

551. పోటరి, మొనకాఁడు, వాఁడిమగండు,
వడిగలవాఁడు, బంటు, బిరుదు - శూరః.

552. తోడ్పాటు, బాసట - సాహాయ్యమ్

553. మేలు, లగ్గు, లెస్స - శుభమ్.

554. పొది, తరకసము, తొగ, పుత్తళికె, కవ, తూణీ- తూణీరస్య.

555. అమ్ము, కోల, తూపు, ములు, - బాణః

556. జోదు, బొందళంబు, కత్తళంబు, చీర - తనుత్రాణస్య.

557. తేరు, అరదము, - రథః.

558. తలకట్టు, మేలుబంతి, కన్నాక - శ్రేష్ఠస్య.

559. తొడవు సొమ్ము, రవణము - భూషణస్య.

560. పేరులు, సరులు - హారః

561. సరములు, దండలు, ఎత్తులు, సరులు - పుష్పదామ.

562. కంపు, కమ్మని, (వ)వాలుపు, తావి - పరిమళః.

563. ఒడమె; సొమ్ము, విడిముడి, రొక్కము - విత్తమ్.

564. మిద్దెలు, మచ్చులు, మాడుగలు - దారునిర్మితగృహమ్.

565. మేడలు, ఉప్పరిగెలు - సౌధః.

566. పెట్టి, పెడ మందసము, పెట్టియ - పేటీ.

567. మోటు, మ్రోడు, మొద్దు - స్థాణుః

568. వెడద, వెడలుపు, విరివి, విప్పు, పరపు
తనరుపు - విస్తృతమ్.

569. నిడుపు నిడుద పొడుగు చాపు నిడివి - దీర్ఘః.

570. జోడు, ఈడు, సవుతు, దినుసు, మాదిరి,
సాటి, ఉద్ది, ఎన, జత, తరము, దొర,
పురుడుసరి —సమానమ్.

571. చెఱకు కనులమానులు - లోచనతరుః.

572. తీయనిమాను - మధురవృక్షః ఇక్షుః

573. దలపాడ దవ? - రసాలాగ్రమ్

574. బంగారు, పసిండి, పొన్ను, బంగరు, పైడి,
పుత్తడి, జాళువా - స్వర్ణః

575. కడాని, కుందనము, అపరంజి, - తప్తకాంచనమ్

576. చిదురుప, చెదుర, వ్రక్క, తునుక -తునియ. ఖండమ్.

577. వామి, ప్రోగు, తిప్ప, కుప్ప, ప్రోవు - రాశిః

578. కొరంత, కొదవ, వెలితి, తక్కువ, కొద, కొరత
లొచ్చు కొర, కడదు - లోపః.

579. సగము, అర, సాము - అర్ధః.

580. నల్ల, నెత్తురు - రుధిరః.

581. ఎదచి, పాల, పాలసు, ఈలువు, నంజుడు - మాంసమ్

582. చెన్ను, గొనబు, అలరు, తిన్నన, కొదురు, తనరు,
లెస్స, సొబగు, మాను, అనువు, సొగసు, ఒరపు,
విన్నాణము, చక్కన, ఒప్పు, నాణెము, చొక్కము
మరువు, బాగు, హొనరు, హెచ్చు, ఒనరు
జాను, మేలు, తోగము, తిప్పన
నలువు, చెలువు - మంజులమ్.

583. కపురము, కప్పురము, క్రపము - కర్పూరమ్.

584. విడియము, తమ్ములంబు, వక్కలాకులు, వీడెంబు,
వీర్యము — తాంబూలస్య

585. లచ్చి, సిరి, కలిమి - సంపత్.

586. ఎద్దడి, నిప్పచ్చరము, పేదరికము,
నెర్వ, లేమి, లేమిడి - దారిద్ర్యమ్.

587. పసువులు, దొడుకులు, పసరములు, పసి - పశోః.

588. తొట్టు, పట్టు, దొడ్డి - గోష్ఠమ్.

589. పదువు, మొదవు, కదుపు, మంద - ధేనుగణః.

590. దూడ, లేఁగ, క్రేపు, - వనిః.

591. ఆవు, మొదవు, ఎద్దు, జన్నె దొడుకు - ధేనుః.

592. గోంద, గిడ్డ, ఎద్దు - వృషః

593. జమునెక్కిరింత, దుంత, దున్న, ఎనుబోతు - మహిషః.

594. బఱ్ఱె, ఎనుపెంటి, ఎనుము, గేదె - మహిషీ

595. తెల్లదాలుమెకము, వెడమోముమెకము, తెర
కోటిమెకము, జడలమెకము, సింగము,

ఏనుగులగొంగ, బొబ్బమెకము, మెకములసామి,
గెట్టుపట్టియెక్కిరింత - మృగరాజః.

596. మెకముల తిండిపోతు, పసితిండి, చారల
మెకము, పులి, మువ్వన్నెమెకము - శార్దూలః.

597. ఎలువు, పుట్టకూడుతిండిపోతు, ఎలుగు
వెనుకచూపులమెకము, మోరతెలుపుమెకము - భల్లూకః.

598. హజ్జుమెకము, బలుకొమ్ములమెకము, జాగల మెకము,
ఎక్కుడు మెకము, గౌడు, ఏనుగు - హస్తిః

599. వారువము, తేజి, కత్తళము, పావురము
బాబా, మావు, జక్కి, గుఱ్ఱము, తత్తడి, తట్టువు - తురగః.

600. విసదారి, పాము, కానరాని కాళ్లది, సప్పము, చిలువ
నెడుపడు, వీనులకంటి, పడగదారి, పుట్టపెట్టెపట్టు
గాలిమేతరి - సర్పః.

601. పులుగు, పక్కి, పిట్ట - పక్షిః.

602. ఎరకలు, గరులు, చట్టుపలు, ఱెక్కలు - పక్షః.

603. ఈకె,రావు - ?గురుత్

604. పాలునీరు నేరుపరచుపులుగు, తొలుకరికళుకుపులుగు,
అంచ, నలువతేజి, తెలిపిట్ట - హంసః.

605. కొంచ - క్రౌంచః

606. కొక్కెర, కొక్కిరాయి, కొంగ, కొకుక్కి - బకః

607. నెమ్మివట్టువపులుగు, నెమ్మలి, జట్టుపులుగు; నమ్మి-కేకీ

608. తేటి, జమిలిముక్కాలి, తుమ్మెద, - భ్రమరః.

609. పారువాయ. బిడ్డి, బకదారి, కూకి, పారువము,
పల్లటి —— పారావతః

610. **తొవురు ముక్కుపులుగు, పచ్చఱెక్కలపులుగు,**
**చదువులపులుగు, చిగురువిలుకాని తేజి, చిలుక – శుకః పక్షిః**

611. జాలె, డేగ, కణుజు, కురుంజు, గెద్ద
సాళ్వము వేసడము, ఓరణము, జలకట్టె - శ్యేనః
612. గూబ, కొదట - ఘూకః
613. పసిఁడి కంటి, చిఱుత గూబ, సగినాలపులుగు - కనకాక్షః
614. గోరువంక, ఒంటెగాఁడు - శారికా
615. పసులపోలికాఁడు, ఎఱ్ఱటింత, కూకటమూగ - భారద్వాజః.
616. ఎడిగె, తగరు, పొట్టేలు - మేషః
617. ఏనుగులచూడు గొంగ, ఎనిమిదడుగులమెకము - శరభః.
618. కుందేలు, చెవులపోతు - శశకః.
619. దుప్పి, పొడలమెకము, కారుకొమ్ములమెకము, రామమృగః
620. లొటిపిట్ట, ఒంటె - ఉష్ట్రః.
621. ఇఱ్ఱి జింక - సారంగః.
622. ఇఱ్ఱి నలుకొమ్ముల మెకము - మృగః.
623. జింక - మృగీమృగయోః
624. వెనుక, పిదప, పిమ్మట, తర్వాత, పదపడి - పశ్చాత్.
625. తొలి, మునుపు, తొల్లి, మున్ను, తొలుత,
మును, ముందు - పూర్వః.
626. మడి, నారు - కేదారః.
627. మిట్టపొలము, పుంజ - మరుభూమిః.
628. మెట్టు, మల, కొండ, గట్టు, గుబ్బలి, తిప్ప - పర్వతః.
629. కల్లు, రా, రాయి, - పాషాణః.
630. గట్టులతేఁడు, వలితిప్ప, ముక్కంటి మామ,
వణకుగబ్బలి, మంచుకొండ, చలిమిరిమల-హిమవాన్.
631. వేలుపులకొండ, పుత్తడి గుబ్బలి, జెజెలగట్టు
పునుక కంచముదారివిల్లు - మేరుః.
632. ముక్కంటిమల, వెలితిప్ప, వెండికొండ - కైలాసః.

633. కవ్వపుమల తరికొండ - మందరః.
634. కడపటిమల, చుట్టుకొండ - చక్రవాళాద్రిః.
635. తొలుగెట్టు, తూర్పుకొండ పొడుపుగుబ్బలి - పూర్వాద్రిః.
636. పడమటికొండ, క్రుంకుగట్టు- అస్తాద్రిః.
637. తెంకి, ఉనికిపట్టు, ఇల్లు తావు ఇక్క, ఉనికి, నట్టు, పట్టు టెంకి, ఇరవు, ఇమ్ము, గీము, నెలవు - నివాసః
638. మేటి, మించు, పెచ్చు, వాసి, ఎచ్చు, పెల్లు- అధికస్య.
639. చెయ్వులు, పనులు, చేతలు- కర్మణః.
640. కుప్పము, పల్లె, ఊరు, గొటికె - గ్రామస్య.
641. వీడు, ప్రోలు - పట్టణస్య.

దేశ్యములను జెప్ప గడంగిన నిందుఁ దద్భవములధికముగా నుండుట గమనార్హము. అట నటఁ దద్భవము లగుట ప్రత్యేకముగాఁ బ్రస్తావించినను నిట్లు పేర్కొనని చోట్లఁ గూడఁ దద్భవము లున్నవి, తాత, సోమాసి, పడుగు, బొమ్మ మొదలగునవి ప్రత్యేకముగాఁ జూపఁబడినవి. ఇట్టివి తద్భవములుగా నంతకు ముందు సాధింపఁబడియుండుట స్పష్టమె.

మిగిలిన చోట్లగూడ దేశ్యములును దద్భవములును గలిపి సమాసము చేయుట మొద లగు విధముగ ననేకము లగు వచ్చతెనుఁగుశబ్దముల కూడికనే నేర్పడిన స్థలములే. కాని యిట్టి స్థలములను బరిశీలింపఁగా అబ్ధిమేఖల కుదయించినట్టి సీతఁ

జేకొనియె రాఘవుం డని చెప్పుచోటఁ

గడలిమొలనూలిచేడియఁ గనిన పడుచుఁ దెచ్చుకొనె రాముఁ డనఁగను దెనుఁగుమఱుఁగు' (అప్ప.1.112) అనునప్పకవి వచనములఁ దెలుఁగుమఱుఁగులు స్ఫురించును. ఇవి దేశ్య తద్భవము లను గూర్పుటచే నేర్పడినవే. కావున నిట్టి సమాసాదులందలి పదములను విభగింపఁగా నవి తద్భవములో దేశ్యములో యై యుండును. కాన నిట్టివి దేశ్యములుగాఁ జూపుట విశేషము. ఇట్టి శబ్దస్థితిని బరిచయము చేసికొనుటకు మాత్ర మిది యుపయోగించును.

# అథ నానార్థ శబ్దాః

1. కలుపు : దధి, సస్యాంతర తృణంచ

'కలుపు' శబ్దమునకు, పెరుగు మఱియు పైరునడుమ నున్న గడ్డి విశేషము నర్థములు.

2. వెలుగు : కంటకావరణమ్, కాంతిశ్చ

ముండ్లచోటు కాంతియును.

3. మావులు : హయాః చూతవృక్షాశ్చ

మావి యనఁగా గుఱ్ఱమును మామిడి చెట్లును.

4. తావులు - పరిమళాః స్థలాని చ

తావి - పరిమళము తావు చోటు, రెండింటికి బహువచనమున తావులు అని రూపము.

5. కొమ్మ - తరుశాఖా వనితా చ

కొమ్మ యనఁగా చెట్టుకొమ్మయు, స్త్రీయును.

6. తమ్ములు - పద్మాని అనుజాశ్చ

తమ్మి-పద్మము. తమ్ముఁడు, పిదపఁ బుట్టిన సోదరుఁడు, రెంటికి బహువచనమున 'తమ్ములు' అని రూపము.

7. కమ్మ - తాటంకమ్ లిఖితా బిందుపత్రికా చ

కమ్మ యన, కర్ణాభరణమును, లేఖయును.

8. తీఁగె - లతా కంఠాభరణం చ

తీగెయును (కంఠాభరణము?) మొలనూలు

9. తాళ్లు : సూత్రాణి తాళవృక్షాశ్చ.

త్రాడు = దారము, ఇది 'తాడు' అనియు వ్యవహరింపబడు.

తాడి = తాడిచెట్టు తాడు, తాడి యనువానికి బహువచనరూపము తాళ్లు.

10. కోళ్లు - కుక్కుటాః, ఖట్వాంగాని చ

కుక్కుట మనునర్థము గలది 'కోడి' శబ్దము, మంచముయొక్క

యొక అవయవము కోడు. కోడి, కోడు శబ్దములు రెంటికి బహువచనమున 'కోళ్ళు' అని రూప మగును.

11. బాము. సస్యాని. స్త్రియశ్చ.

బాము అనగాఁ బైరును, స్త్రీలును ఇదివిచార్యము

12. బాములు – భంగాః జన్మాని చ

బాము లనగా నిబ్బందులు, పుట్టువులును.

13. దంట ప్రౌఢః యుగళమ్

దంట – ప్రౌఢుఁడు, సమర్థుఁడు – జంట యనియర్థము. దకారమునకు జకారముతోడి 'జంట' శబ్దము ప్రసిద్ధము.

14. తొలి – పూర్వః సుషిరం చ

తొలి – మొదటిది సుషిరమును

15. పఱపు శయ్యా విస్మృతం చ

పఱ పనగా శయ్య. మఱచిన దనియు నర్థము. మఱచిన దగు నర్థమున 'మఱపు' అనునది ప్రసిద్ధము.

16. వెలి – ధవళః, బహిశ్చ

వెలి యనగా తెల్లన, మఱియు 'వెలుపల' యని యర్థము.

17. నెమ్మి- నీలకంఠః మంజులవృక్షశ్చ దయాచ సుఖస్థితి శ్చ

నెమ్మి = నెమలి, మంజులవృక్షము? ప్రేమ, సుఖముగానుండుట.

18. మేలు శుభమ్, ఊర్ధ్వం చ, దయా చ, ప్రశంసాలాపశ్చ.

మేలు = మంచిది, పైని, ప్రేమ, పొగడ్తను దెలుపును.

19. పాలు క్షీరాణి భాగశ్చ

పాలు - క్షీరము- భాగము

20. కాలు- చరణః- తుర్యాంశశ్చ

| | | | |
|---|---|---|---|
| | | పాదము, | నాలుగవపాలు. |
| 21. | బూరుగ | శాల్మలీవృక్షః | స్వనద్వాద్యశ్చ |
| | | బూరుగచెట్టు | మ్రోయుచున్నవాద్యము? |
| 22. | పేరు- | నామధేయమ్- | భాసురశ్చ, |
| | | సంజ్ఞ, | ప్రకాశించునది. |
| 23. | కజ్జల? | నీలిమా | గృహోపరి తృణా చ్ఛాధనంచ |
| | | నల్లన, | ఇంటిపైఁగప్పిన   తెల్ల |
| 24. | కొప్పు | ధమ్మిల్లః | గృహాగ్రం చ |
| | | జుట్టుముడి, | ఇంటికప్పు |
| 25. | క్రోవి | ధమని- | భూరుహవిశేషశ్చ |
| | | గొట్టము | కురువక వృక్షము. |
| 26. | మోవి | అధః-- | వృక్షవిశేషశ్చ |
| | | క్రిందిపెదవి- | ఒకానొకచెట్టు |
| 27. | చవులు | షడ్రసరుచయః, | ముక్తాసారశ్చ |
| | | రుచి, | ముత్తెపుఁబొడి? |
| 28. | గవురు | గర్హ్యశ్చ | పూతిగంధశ్చ |
| | | నీచము, | పీతికంపు |
| 29. | ఎల్లి | పరేద్యుః | అపరేద్యుః |
| | | రేపు | విన్న |
| | | ఛత్రంచ - గొడుగు. ఇది వెల్లిగా ప్రసిద్ధము) | |
| 30. | జక్కి | హయః | ఖరట్టశ్చ? |
| | | గుఱ్ఱము | తిరుగలి |
| 31. | వెండి | రజతం, | పునరర్థశ్చ |
| | | వెండి, | మఱల |
| 32. | బంతి- | కుందుకః | శ్రేణీచ |
| | | బంతి | వరుస |

33. దండ - పుష్పదామ(పూలదండ) సమీపంచ(దగ్గఱ)

34. దొర సదృశః(వంటి) అవనీపతిశ్చ(రాజు)

35. ఏను అస్త్రసంఖ్య(ఐదు) అహంశబ్దశ్చ(నేను)

36. సరి- సమానః(సాటి) సమసంఖ్యాచ(సరిసంఖ్య)

37. గొంతు కంఠశ్చ(కంఠము) కుక్కుటాననంచ(కోడితల)

38. నల్ల నీలగుణః(నలుపు) రుధిరం చ(నెత్తురు)

39. గట్టు పర్వతః (కొండ) తీరం చ (ఒడ్డు)

40. డాలు కేతనమ్ (పతాకము) కాంతిశ్చ (ప్రకాశము)

41. చేరువ సమూహః (గుంపు) సమీపంచ (దగ్గఱ)

42. బిరుదు శౌర్యధుర్యః (శూరుఁడు) భీకరలాంఛనంచ (గౌరవచిహ్నము)

43. గాలి పవమానః (వాయువు) పిశాచశ్చ (పిశాచము)

44. చుక్క నక్షత్రమ్ (నక్షత్రము) తిలకంచ (నుదుటిబొట్టు)

45. పలుకు భాషణమ్ (మాట) శకలంచ (ముక్క)

46. నెల కమలారిః (చంద్రుడు) మాసశ్చ (మాసము)

47. ఆలు భార్యాచ (భార్య) గావశ్చ (ఆవులు)

48. కోర చషకమ్ (పాత్ర) దంష్ట్రాచ (దంతము)

49. మొక్కలీఁడు అరిషాణదంపతీ?శూరుఁడు ముష్కరశ్చ (దొంగ)

50. పచ్చడాలు పృథులాంబరాణి (మంచివస్త్రాలు) మరకత చ్ఛవిశ్చ (ఆకుపచ్చ)

పచ్చడములు పచ్చడాలు-వస్త్రాలు పచ్చ(ని)డాలు - పచ్చడాలు పచ్చరంగు.

51. గుండు వృత్తః (గుండ్రనిది) వృత్తశిలా చ (గుండ్రనిరాయి) తురగీపతిశ్చ

52. కొఱ్ఱు సస్యమ్ (కొఱ్ఱుధాన్యము) లోపశ్చ (కొఱత)

53. అవ్వ జననీ (తల్లి) తల్లి తల్లి పితృమాతృజననీ (తండ్రితల్లి)

54. అప్ప భగినీ (అక్క) జనకశ్చ (తండ్రి)

55. పోతు మహిషః(దున్న) పురుషమృగఖగే చ(పురుషజాతివగు మృగములును పక్షులును)

56. తాత ధాత (బ్రహ్మ) పితామహమాతామహౌ చ(తండ్రితండ్రి తల్లి తండ్రి)

57. వడిగలవాఁడు శౌర్యవాన్(శూరుఁడు) వ్యాఘ్రశ్చ (పులి)

58. నడుము అవలగ్నమ్ (కౌను) మధ్యస్థలంచ(నడిమిచోటు)

59. ఎద చేతః (హృదయము) వక్షస్థలంచ (ఉరము) భీతిశ్చ (భయము)

60. జోడు సదృశః (సాటి), వర్మ చ (కవచము)

61. మూల ధమ్మిల్లభారః (కేశసంపద) కోణశ్చ(కోణము)

62. అడుగు చరణః (పాదము) అధఃప్రదేశశ్చ (క్రిందిచోటు)

63. బాస భాషా (బాస) ప్రమాణికంచ(ప్రమాణమును చేయుట)

64. నాగవాసము వేశ్యాసమాజః (వెలయాండ్రగుంపు) ఘంటాప్రతీకశ్చ

65. గుడ్డు అండమ (గ్రుడ్డు) అంధకశ్చ (శివుఁడు)

66. ఉడుకు అత్యుష్ణః (వేడి) చర్మవాద్యంచ (చర్మవాద్యవిశేషము

67. మేడి ఔదుంబరః (మేడిచెట్టు) హలాంగంచ(నాగలియంగము)

68. కల్లు సురా (మద్యము) శిలాచ (రాయి)

69. చాలు లాంగలపద్ధతి (నాగేటిచాలు) శ్రేణీచ (వరుస)

70. మానికెము, రతనము - మాణిక్యమ్

71. మెఱుగు, నిగ్గు ఉత్కర్షకాన్తిః (అతిశయించుకాంతి)

72. ఎఱుపు హెరుపు ఎఱ్ఱన - ఎఱ్ఱ- అరుణకాన్తిః

73. అళది పసుపు చాయ - హరిద్రవర్ణః

74. నలుపుచాయ - శ్యామవర్ణః

75. పిన్నెడాలు, రంగు, వన్నియ బూతి - చాయ, అనవాలు, (త్వక్షీరమ్?) అభిజ్ఞానమ్.

**ఇది దేశ్యనామ నిరూపణము.**

# అథ దేశ్య క్రియాః.

1. కఱచె - అభ్యాసమొనర్చె - (చదివెను) దంతపీడ యొనర్చె ఇతిచ- (కొఱికెను).
2. విచ్చేసె - వచ్చెన్ - గతుఁ డయ్యెన్ (వెడలెన్) ఇతి చ
3. రోసె - హేయపడెన్ (అసహ్యించుకొనెను) అన్వేషించెన్ (వెదకెను) ఇతిచ.
4. అరసె - ఆర్తివారించెన్ (బాధలు పోగొట్టెను) విమర్శించెన్ (పరామర్శ చేసెను) ఇతిచ
5. ఆనెన్ - వహించెన్(మోసెను) పానము చేసెన్ (తాగెను)ఇతిచ.
6. పఱచె - పరు వెత్తి, బాధ చేసెన్ ఇతిచ
7. ఆడె - నటించెన్ వచించెన్ ఇతి చ
8. అఁడిచె, కొట్టె మొత్తె మోదె - ప్రహరించెన్ ఇతిచ
9. తారుమారయ్యె వీడ్వడె, తడఁబడెన్, - విపర్యాసమయ్యెన్ ఇతిచ
10. వీడె, విడిచె, వదలె - త్యక్తంబు గావించె ఇతిచ
11. తడసె, మసలె, ఆలస్య మొనరించెన్ ఇతి
12. తాచె, తన్నె, కాళ్లఁగ్రుమ్మె - అంఘ్రితాడితుఁజేసెన్ ఇతి
13. దూరె చొచ్చె కూరె - ప్రవేశించెన్ ఇతి
14. చెందె, ఎనసె, పొందె, బెరసె, పొరలె, హత్తె, కూడె, ఎయిదె, ఒందె, అనిసె, కలసె - సక్త మయ్యెన్ ఇతి
15. ఎడసె, పాసె, వేరువడె, పురి విచ్చెన్ - భేద మయ్యెన్ ఇతి
16. చిక్కె, పట్టువడె, తగిలె, అగపడె, తగులుపడె, దెక్కొవడె, - అనుగృహీత మయ్యెన్ ఇతి
17. అడ్డగించె, ఆగె, నిలిపె - వారించెన్ ఇతి
18. త్రిప్పె, మగుడించె, క్రమ్మరించె - నివర్తంబు చేసెన్ ఇతి
19. తెలిపె, తడిమె, చెప్పె, మోచె, పూచె, ఆచె - ఆవహించెన్ ఇతి

20. రోసె, వెదకె, తడవె, నెమకె, ఆరసె - అన్వేషించెన్ ఇతి
21. కొనియాడె, అగ్గించె, కొండాడె, కైవారము చేసె - నుతించెన్ ఇతి
22. అనిపె, పనిచె పొమ్మనె అనిచె, గెడపు మనియె, పనిపె, పుచ్చె, అంపె, పంపె - గచ్ఛేత్యర్థః
23. వెడలె, వెలువడె, వెళ్లె - నిర్గమించెన్ ఇతి
24. విచ్చేసె, వేంచేసె, అరుగుదెంచె వచ్చె, ఏతెంచె, చనుదెంచె - ఆగతుఁ డయ్యెన్ ఇతి
25. వెళ్లె, జరిగె, తొలఁగె ఊడె పఱచె (ఊడ) నింబాడె పారె, ఉరికె - పలాయితుఁ డయ్యె ఇతి
26. ఆలించె, ఆలకించెన్, వినె, వినియెన్ - శ్రుతమయ్యెన్ ఇతి
27. ఆడె, ఆనె, వాక్రుచ్చె నొడివె చెప్పె (వక్కాణించె) పలికె - వక్కాణించె ఇతి
28. కలిసికొనె, బెరసె, ఎయిదె, కూడె, ఎనసె, దొరలె, కలయికొనె, - సక్త మయ్యెన్ ఇతి
29. కనుగొనె, కనె, కాంచెన్, కనియెన్, కన్గొనె, చూచె - వీక్షించెన్ఇతి.
30. ఏఁగె, అరిగె, పనివినె, చనె, పోయె, చనియె - గమించెన్ ఇతి
31. తినె, ఆరగించె, తినియె, కుడిచె, నమలె, భక్షణ మొనర్చె మెక్కె, మెసవె - భుజించెన్ ఇతి
32. అరిచె, ఏడిచె - రోదనము చేసెన్ ఇతి
33. ఒరగె కేలు మొగిచె, చేమోడ్చె, ఎఱగె, దెలిచె - నమస్కృతి యొనర్చె. ఇతి

34. పరుండె, పన్నుండె, పవళించె, పండె,
అత్తిమిల్లె, పవ్వళించె - శయనించె ఇతి

-ః ఇత్యాద్యా దేశ్య ధాతవః ః-

-ః ఇవి మొదలగునవి దేశ్యధాతువులు ః-

# అథ అవ్యయాః

పౌలస్త్య రావణః – అవ్యయపాఠః .

పౌలస్త్యరావణుఁ డను లాక్షణికుఁడు పేర్కొనిన అవ్యయముల పాఠము.

అయ్య, అక్క, అమ్మ, అత్త, అన్న, అవ్వ, అపుడు, ఇపుడు, ఎపుడు. ఎట్టు, కద, ఓ, మఱి, చేయంగ, వినంగ, వచ్చి, చేసి.

అంత, ఇంత, ఎంత, కొంత, ఇంచుక, కొంచెము, (రమ?) ఒకసారి, వేమారు, పలుమరు, ఎల్లప్పుడు, తొలి, తొల్లి, ముందర, ముంగల, ముందు మును, మున్ను, వెనుక, పెక్కు, ఊరక, మిన్నక కూడ అటు, ఇటు, ఎటు, మిక్కిలి, కలకాలము, కడపటు, మీఁదు, క్రిందు, అందు, అయ్యో, అందాక, ఎందాక, కొందాక, కటకటా, అక్కట కటా, అకట కాలాసు, భళి, భలా, భళ్లారె, మజ్జా, మజ్జారె, అయారె, అహహో, ఏమి, అదిగో, ఇదిగో, అంతట, ఇంతట, ఎంతట, కొంతట, మంచిది, ఆలాగు,ఏలాగు, అక్కడ, ఇక్కడ, ఎక్కడ, ఒయ్యన, చెంత, వెంబడి, రిత్త, మిగుల, దండి, అవతల, ఇవతల, అవ్వల, ఇవ్వల, తరువాత, నెరియ, ఒద, పిమ్మట, అందు, ఎందు, చూడ, విన, కన, పదపడి, తొలుత, మ్రోల, ఉడుగక, విడువక.–

ఇత్యవ్యయ శబ్దాః

రావణుఁడు పేర్కొన్న వీనిలో పెక్కు లవ్యయములు గావు.

"అథపౌలస్త్య రావణీయేఽవ్యయపాఠః" అని ప్రారంభించి యథర్వణుఁడును దన త్రిలింగశబ్దానుశాసనములో.

అయ్యాక్కాద్యాస్తథామ్మశ్చ కద ఓ మరి?

అగునన్తాః క్త్వామితశ్చాలు శ్చేత్యాద్యవ్యయసంహితః అని పేర్కొనెను. (త్రి.శ.4.59).

వీనిలోని యవ్యయము లిట్లు గుర్తింపఁదగును.

1. చేయంగ, వినంగ, మిగుల, నెరియ, చూడ, కూడ విన, కన,– అనునవి తుమర్థకములు. తుమర్థకము లెల్లనవ్యయములే.
2. వచ్చి, చేసి, యున్నవి క్త్వార్థకములు. క్త్వార్థక మైన 'యి' ప్రత్యయ మంతమందుఁ గలశబ్దము లెల్ల నవ్యయములు.

3. ఉడుగక, విడువక, యనునవి వ్యతిరేకక్త్వార్థకమగు (ఁ) క ప్రత్యయాంతములు, వ్యతిరేకక్త్వార్థకశబ్దము లెల్ల నవ్యయములే.

ఇంక నిందలి ప్రతిపదోక్తము లగు నవ్యయములిట్లు గుర్తింపఁదగును.

ఎట్టు, కద, ఓ, మఱి, ఇంచుక, ఊరక, మిన్నక, అయ్యో, కటకటా, అక్కట, కటా అకట, కాలాసు, బళి, బళా, భళారే, మజ్జా, మజ్జారె, అయారె, అహహా, బయ్యన అదిగో, ఇదిగో, వెంబడి, దండి, దాక(అందాక, ఇందాక, ఎందాక) అన్నవి అందు, ఎందు, ఇందు. ఇక నిటఁ జూపిన యవ్యయపాఠమున మిగిలియున్న శబ్దము లవ్యయములు.

అయ్య అక్క, అమ్మ, అత్త, అన్న, అవ్వ, మున్నగు వానికి నన్నివిభక్తులయందును రూపములు గలవుగదా. అయ్యలు, అక్కను, అమ్మచేత, అత్తకొఱకు, అన్నవలనఁ అవ్వకు మొ॥.

అపుడు, ఇపుడు ఎప్పుడు అన్నవి నిత్యైకవచనాంతము లవ్యయములు గావని చిన్నయసూరి స్పష్టము చేసి యున్నాఁడు, అప్పటన్, ఇప్పటికి ఎప్పటినుండి మొ॥ ద్విత్వయుక్తములు గానపుడు వివిధ విభక్త్యంతములుగాఁ గానరావు. అప్పటన్ అన్నట్లు అప్పటక అని లేదు. ఇట్లె ఇప్పటికి మొ॥ ఇట నవ్యయముగాఁ జూపఁబడిన 'ఎల్లప్పుడు' గూడ నిట్టిదే.

అట్టి యెడల అప్పుడు ఇత్యాది శబ్దములందు॥ ప్రథమావిభక్తి యందు మాత్రమె జడ్డ లోపము చెప్పుట యుచితము. అప్పుడు అవ్యయము గాదు గాని దాని రూపాంతరమే యైన 'అపుడు' అవ్యయ మనుట సక్రమము గాదు గదా.

అంత, ఇంత, ఎంత, కొంత, అనువానికి నెల్లవిభక్తులయందును రూపములు గానరాకున్నను, అంతకు, ఇంతటన్, ఎంతటికి, కొంతకు మొదలుగా గలవు. ఇవి యౌపవిభక్తికములు నయి యుంట గమనార్హము. కాఁగా నివి యవ్యయము లనరాదు గదా.

కొంచి యనుశబ్దముపైఁ ప్రథమైకవచనమున మువర్ణకము చేరఁగా నేర్పడినది కొంచియము (ఇదే కొంచిమని ఇయ కెత్వము వచ్చుటచే నేర్పడును) కొంచెముఁ జూవె.

కొంచెమునకు ఇత్యాదిగా నితరవిభక్తులరూపములు గలవు. ఇదియు నిత్యైకవచనాంతమె. కాఁగా నిది యవ్యయము గాదు.

ఇట్లే (తొలి) తొల్లి, ముందు, వెనుక; పెక్కు, మీఁదు, క్రిందు, ఏమి, ముంగల, తొలుత యనునవియు నౌపవిభక్తిక శబ్దములు. (పెక్కు-పెక్కు లని యరుదు) ఇవియు నిత్యైకవచనాంతములే. తొంటికి, ముందుకు, వెనుకకు, పెక్కింటిని, మీఁదట, క్రిందికి, ఏమిటికి, ముంగటికి, తొలుతటికి, మొ॥రూపము లుండఁగా నివి యవ్యయములుగాఁ పేర్కొనరాదు గదా.

పదము + పడి = పదపడి యని యీవ్యాకరణ మింతకు ముందు సాధించియు నిట నవ్యయ మనుట విశేషము.

అంతట, ఇంతట, ఎంతట, కొంతట, (కడపట) అని ప్రత్యేకముగా నవ్యయములుగాఁ జూపఁబడిన శబ్దములు. అంతాదుల సప్తమీ విభక్త్యంతరూపములే. కడపలశబ్దము యొక్క సప్తమ్యంతరూపము కడపట టియను నౌపవిభక్తికము చేరినది. కావున వీని నవ్యయములుగాఁ జెప్పరాదు.

ఒకసారి, ముందర, అటు, ఇటు, ఎటు, ఆలాగు, ఏలాగు, చెంత, అవతల, ఇవతల, అవ్వల, ఇవ్వల, పిమ్మట. ప్రోల, తరువాత, అనునవియు నేకవచనాంతములై విభక్త్యంతములుగాఁ గానసగుచున్నవి.

ఒకసారికి, ముందరకు, అటకు మొ॥ ఆలాగున చెంతకు, ఇవతలకు, పిమ్మటకు ప్రోలకు, (తరువాతకు) మొ॥.

కాఁగా నీగణమునఁ జూపఁబడిన శబ్దములు పెక్కు లవ్యయములు గావు. నిత్యైకవచనాంతము లవ్యయము లగు నని యభిప్రాయపడుటవలన నట్టి పెక్కు శబ్దములిం దవ్యయములుగాఁ జెప్పఁబడినవని తోఁచుచున్నది. కాని యట్టివాని నవ్యయము లనరాదు గదా. ఏడు విభక్తులను రూపము లుండ, (కొన్నివిభక్తుల యందు మాత్రమె యున్నను) నట్టివాని నవ్యయములుగాఁ దలఁచి యుండవచ్చును. ఆయావిభక్తులయర్థము వివక్షించుట కవకాశము లేనపుడు వాని కాయావిభక్త్యంతరూపము లుండకపోవుట సహజము.

ఊరు శబ్దముపైఁ దృతీయావిభక్త్యర్థ వివక్ష కుదురమింజేసియె ఊరిచేత, (లేదా, ఊరున) అను రూపముండదు. (కావున ఊరన్ అనుచో నత్వము ఉన్న సప్తమికె యవును. కావున నాశబ్దము సప్తమ్యర్థకమే యగును.) అంతమాత్రమున నది యవ్యయ మనరాదు గదా. కావున విభక్తు లేడింటిలో (గొన్నిలేనిమాత్రమున నవ్యయము లని తలఁపరాదు.

అయ్య అక్క మొదలగునవి కూడ నవ్యయములుగాఁ బ్రముఖముగాఁ జెప్పు టేలకో యర్థము గాదు.

పాడియయ్య ఇత్యాదిగా నర్థవిశేషము లం దనుప్రయుక్తములగు నట్టి యయ్యాదిశబ్దముల కట్టి రూపములుండవు. వానినె యిట నుద్దేశించె నందమా యన్నను అక్క, అత్త, అవ్వ, యనునవి గూడగలవే. వానిని బట్టియే అయ, అమ్మ, అన్న, యనునవిగుడ నర్థవిశేషములం దితరపదములపై ననుప్రయుక్త మగునవి కాపవనియె చెప్పవలయును.

రావణుఁడిట్లు చెప్పుటయు నథర్వణాదులు దాని నుద్ధరించుటయు నవ్యయముల విషయమున నవ్యవస్థకు, గారణముగ నున్న దనవచ్చును. ముంద్యాదుల నౌపవిభక్తికాంతములుగా నింతకు ముం దీవ్యాకరణము సాధించియు వాని నిట జూపుటయు రావణుని యవ్యయపాఠమున నుండఁగా నది యట్లే గ్రహించియును, యథార్థము చిన్నయగా కుండుటను బ్రస్తావింపకుండుట యునుసమర్థింపఁదగినవిగా లేవు.

'ఇత్యవ్యయశబ్దాః' అనుటలో నిట నాంధ్రమున నవ్యయము లివి మాత్రమె యని నీగణము నియతమై యింక నితరము లవ్యయములు తెలుగున లేవని యర్థము కాఁగలదు.

కాని ఏని, వలె, మొద లగు ప్రతిపదోక్తావ్యయములును, వచ్చినన్, వచ్చుచున్ మొదలగు లాక్షణికావ్యయములు నిందుఁ బరిగణింపఁబడలేదు. కావుననీ పాఠమునఁ బరిగణింపబడని యవ్యయము లింకను గల వని గుర్తింప వలసి యున్నది.

అవ్యయముల పట్టిక స్పష్టత కుపయోగించును.

ఇది యవ్యయనిరూపణము.

"ఇతి తద్భవ పరిశ్ఛేదః

ఇది తద్భవ పరిశ్ఛేదము

# అథ క్రియా పరిచ్ఛేదః

## అథ తిఙ్వ్ క్రియా

ఇఁకఁ దిజంతముల ప్రక్రియ నిరూపింపఁబడు చున్నది.

### 1. క్రియా ద్వేధా [1]

క్రియా = ధాతువు, ద్వేధా = రెండు విధములు. ధాతుః క్రియా (సంజ్ఞ-2) యను సూత్రము ననుసరించి క్రియ యనఁగా ధాతువు. ఇది తెలుఁగున రెండు విధములు.

వి. అస్మిన్ త్రిలింగ శాస్త్రే

మహదమహద్భ్యాం క్రియా ద్వివిధా స్యాత్ [2].

మహత్తు - అమహత్తు అను భేదముచేఁ దెలుఁగునఁ గ్రియ రెండు విధములు.

మహత్ కర్తృక మయినది మహత్క్రియ.

అమహత్కర్తృక మయినది యమహత్క్రియ.

'అమహన్త స్త్రీని పశుజడాః' (శబ్ద - 41) అను సూత్రమును బట్టి స్త్రీ తిర్యగ్జడ వాచక మమహత్తు. అది కర్తగాఁ గలిగిన క్రియ యమహత్క్రియ. చిలుక పలుకు చున్నది.

'మహన్తోఽన్యే' యను సూత్రము ననుసరించి స్త్రీతిర్యగ్జడభిన్నము మహత్తు.

రాముఁడు పలుకుచున్నాఁడు.

ఇచటఁ గ్రియ మహదర్థకము.

---

1. 2. క్రియద్వేధా, మహదమహదితి. త్రి.శ.18, 19, బృహస్పతి సూత్రములు.

## 2. త్రివిధా తత్సా [1].

తత్సా = సంస్కృతీయ మగు, క్రియా = ధాతువు, త్రివిధా = మూఁడు విధములు. 'క్రియా ద్వేధా' యను పూర్వసూత్రమునుండి 'క్రియా' యనునది యిం దనువర్తించును.

వి. ఉపకృతి, పరిణతి, సంవృతి భేదై స్తత్సమ క్రియా త్రివిధా స్యాత్. [2]

ఉపకృతి, పరిణతి, సంవృతి యను భేదముతో సంస్కృతీయ మగు ధాతువు మూఁడు విధములు. వీనిం గూర్చి పైని వివరించును.

## 3. మహతి డుజ్ [3].

మహతి = మహదర్థమునందు, డుజ్ = డుజ్ అను ప్రత్యయము వచ్చును.

వి. మహత్క్రియాయాః ప్రథమ పురుషైకవచనే తిపో డుజ్ స్యాత్.

మహదమహద్భేదముచే ద్వివిధ మయిన క్రియలలో మహత్క్రియకుఁ బైని ప్రథమ పురుషైకవచన మగు 'తిప్' స్థానమున డుజ్ అనునది యగును.

దీనిని బట్టి, ప్రాతిపదికలపై సుప్ప్రత్యయములకు వలెనె ధాతువులపయిఁ గూడ సంస్కృ తాను సారమయుగాఁ బ్రథమపురుషాదులందు తిబాదులు చేసి వాని స్థానమునఁ దెలుఁగు క్రియావిభక్తులను జేసికొనవలయు నని గ్రమింప వచ్చును. ఝథయోరుశ్ మొదలుగా నిట నట్లె క్రియా విభక్తులు విధింపఁ బడినవి.

ఇట్లు ప్రథమ పురుషైకవచనము నందు 'తిప్' ప్రత్యయము చేయఁగా మహత్క్రియపయి నున్న యా తిప్పునకుఁ బ్రస్తుతసూత్రముచే డుజ్ ప్రత్యయ మగును.

'డుజ్' అనుచో జకార మిత్తు. కావున లోపించును.జకార మిత్తుగాఁ గలది గావున డువర్ణకము జిత్తు 'జిదనుస్వారశ్చ' యను సూత్రముచే డువర్ణకమునకుముందు బిందువు చేరును. – వండు చున్నాఁడు

---

1,2. ఉపకృతి పరిణతి సంవృతి భేదా స్త్రి విధా క్రి యా.
ఆం.కౌ.క్రి.1
ఉపకృతి పరిణతి సంవృతి భేదాత్ త్రివిధాక్రియా.
ఆం.శం.చిం.క్రి-1

3. మహతిడుజ్. త్రి.శ.9బృహస్పతి సూత్రము.

## 4. అమహతి దిః [1].

అమహతి = అమహదర్థక మగు క్రియకు - దిః = ది అను ప్రత్యయ మగును.

వి. అమహత్క్రియాయాః ప్రథమపురుషైకవచనే తిపో
ది ప్రత్యయ స్స్యాత్.

అమహదర్థమునం దున్న ధాతువు కంటెఁ బర మగు ప్రథమపురుషైకవచన మగు 'తిప్' ప్రత్యయము స్థానమున 'ది' అను ప్రత్యయ మగును. చిలుక పలుకుచున్నది.

ఈ సూత్రము పైని మఱలఁ జెప్పబడుచున్నది. 3.4. సూత్రములు స్థానపతితములైనట్లు తోఁచు.

## 5. పుషణ్వా దిరుపకృతిః [2].

పుష, ణు, ఆది = పుష, ణు మొదలగునవి, ఉపకృతిః = ఉపకృతిధాతువులు.

వి. పుష పుష్టౌ, ణు స్తుతౌ ఇత్యాద్యాధాతవః
ఉపకృతిక్రి యాస్స్యుః.

పుష్ట్యర్థక మగు 'పుష' ధాతువు, స్తుత్యర్థక మగు ణు ధాతువు, మొదలగునవి ఉపకృతులు.

## 6. భూజ్యాదిః పరిణతిః [3].

భూ జి ఆదిః = భూ, జి, మొదలగునవి, పరిణతిః = పరిణతి సంజ్ఞ గలిగిన ధాతువులు.

వి. భూ సత్తాయాం జీ జయే ఇత్యాద్యా ధాతవః
పరిణతి క్రియాస్స్యుః.

సత్తార్థక మగు భూధాతువు, జయార్థక మగు జిధాతువు మొదలగునవి పరిణతి సంజ్ఞ గలిగిన ధాతువులు.

---

1. అ- హతిదిః. త్రి.శ.9.21. బృహస్పతి సూత్రము.
2. ఆం.కౌ.క్రి. 2, ఆం.శ.చిం. 2.- ఉపకృతిః పుష్ట్యాదిః. వై.చం.తి.1.
3. పరిణతిరిగస్త ఏకాచ్.వై.చం.సంధి. తి. 58
ఆం.కౌ.క్రి.3. అథ భూజ్యాదిః పరిణతిః. ఆం.శ.చిం.క్రి.3

## 7. సంవృతి రంజి వస్యాదిః [1].

రంజి, వసి ఆదిః = రంజ్, వస్ మొదలగునవి. సంవృతిః = సంవృతి యను సంజ్ఞ గల ధాతువులు, 'ఇక్‌స్తిపౌ ధాతునిర్దేశే' యను పాణినీయ సంప్రదాయానుసారముగా, రంజి, వసి. యని రంజ్, వస్ ధాతువులు ఇగంతములుగా నిర్దేశింపఁబడినవి.

వి. రంజ రాగే, వస నివాసే ఇత్యాద్యా ధాతవ స్సంవృతి క్రియా స్స్యుః.

రాగార్థక మగు రంజధాతువు, నివాసార్థక మగు వసధాతువు మొదలగునవి సంవృతి క్రియలు.

## 8. ఉపకృతిః కృదన్తా [2].

ఉపకృతిః = ఉపకృతి యగు ధాతువు, కృదన్తా = కృత్ప్రత్యయమంతమందుఁ గలిగినట్టిది యగును.

వి. ఉపకృతి క్రియాః కృత్ప్రత్యయాన్తా స్స్యుః. పోషించెన్, నుతించెన్ ఇత్యాది.

ఉపకృతి ధాతువులు కృత్ప్రత్యయాంతము లగును. పుష్ ధాతువు పోష, ణుధాతువు 'నుతి' యనుతీరుగా కృదంతములు గాఁగాఁ దెలుఁగున పోషించె, నుతించె ననురీతిగఁ బ్రయోగింపఁ బడుచుండును.

ఈ ధాతువులు సమీపమున (ననఁగాఁ జివర) కృత్తులు కలిగినవి కావున వీనికి 'ఉపకృతి' (సమీపమునందుఁ గృత్తులు గలవి) యను సంజ్ఞ యన్వర్థ మని చెప్పఁదగును.

నుతించె మొదలగునవి నామధాతువులుగాఁ గొందఱు మతమున గ్రహింపవలసి యున్నది. వా రిట్లె, ఉపకృత్యాదు లగు భేదములను గల్పింపలేదు.

---

1. అం.కౌ.క్రి.4
   అన్యాయురంజి, వస్యాదిః. అం.శ.
   చిం.క్రి:4
   సంవృతిర్వ స్యాదిః. వై.చం.తి.55
2. స్యాదు పకృతిః కృదన్తా. అం.శ.చిం.క్రి.5
   ఆదిః కృదన్తా. అం.కౌ.క్రి. 5

## ౯. పరిణతిరయవరన్వితా [1].

పరిణతిః = 'పరిణతి'. యగుక్రియ, అయ్, అవ్, అర్, అన్వితా = అయ్, అవ్, అర్, అనువానితోఁ గూడిన దగు.

వి. అయ్, అవ్, అర్, ఏతైరన్వితా పరిణతి క్రియా స్యాత్. జయించెన్, అనునయించెన్, సంభవించెన్, అనుభవించెన్, హరించెన్, ధరించెన్ ఇత్యాది.

అయ్, అవ్, అర్, అనువానితోఁ గూడిన సంస్కృత ధాతువు పరిణతి యగును.

సంస్కృతధాతువు చివరి ఇకారము 'అయ్' అనియు, ఉకారము 'అవ్' అనియు, ఋకారము 'అర్' అనియు మార్పుచెందును. ఇట్లు పరిణామము గల్గిన వగుటచే వీనికిఁ బరిణతి యను సంజ్ఞ యన్వర్థ మని చెప్పవచ్చును.

జి = జయ్, జయించు - జయించెన్

సంభూ - సంభవ్, సంభవించు - సంభవించెన్.

హృ - హర్, హరించు, హరించెన్ - మె॥

## 10. సంవృతి రహతాకారా. [2].

అహతాకారా = మార్పు చెందని సంస్కృత ధాతువు, సంవృతిః = సంవృతి యగును.

వి. అహతాకారా సాకారా స్యాత్సంవృతి క్రియా. రంజిల్లెన్, భాసిల్లెన్ ఇత్యాది.

ఎట్టి మార్పును బొందక సంస్కృతముతో సమాన మైన యాకారము గల్గిన సంస్కృతధాతువు 'సంవృతి' యగును.

రంజ్ - రంజిల్లు - రంజిల్లెన్. రంజ్ ధాతువట్లె తెలుఁగునఁ జేరినది కావున నది సంవృతి యవును.

---

1. సాపరిణతి రయవర న్వితైవ స్యాత్. ఆం.శ.చిం.క్రి.6
   అన్యాయవ రన్వితా. ఆం.కౌ.క్రి.6
2. ఆం.కౌ.క్రి.7, ఆం.శ.చిం.7.

## 11. పంచటితోలః [1].

టితః = టకారము ఇత్తుగాఁగలిగిన, లః = లకారము, పంచ = అయిదు తెలుఁగునఁ గలవు.

వి.ఆంధ్రే లుటం వినా [2] టి తోలకారాః పంచ లడ్లిడ్లృ

డ్లే డ్లోట ఇతి స్యుః.

'లుట్' తప్ప మిగిలియున్న టిత్తు లగు లకారము లయిదు తెలుఁగున నుండును. లట్, లిట్, లుట్, లృట్, లేట్, లోట్, అని టకార మిత్తుగాఁ గలిగిన లకారములు సంస్కృతమున నాఱున్నవి. వానిలో లుట్ అనునది తప్ప మిగిలిన యైదును దెలుఁగున నుండు నని యర్థము. లఙ్ లృఙ్ ఇత్యాదిగా ఙిత్తు లయినవి. తెలుఁ గున నసలే లే వని యర్థము.

## 12. లడ్వర్త మానే. [2].

వర్తమానే = వర్తమానార్థమునందు, లట్ = లడ్వర్ధక మగును.

వి. వర్తమా నార్థే లట్ స్యాత్.

వర్తమానార్థమునందు ధాతువునకు లడ్వర్ణక మగును. ప్రారబ్ధాపరి సమాప్తము వర్త మానార్థము. చదువు చున్నాఁడు. చదువుట ప్రారంభింపఁబడినది కాని ముగియలేదు. కావున నిది వర్తమానార్థము.

## 13. లిడ్భూ తే [3].

భూతే = భూతార్థమునందు, లిట్ = లి ట్టగును.

వి. భూతార్థే లిట్ స్యాత్.

భూతార్థమునందు ధాతువునకు లిట్టు వచ్చును. విద్యమానధ్వంస ప్రతియోగి భూతార్థము-చదివెను. ఇటఁ బ్రస్తుతము లేని చదువుట యను క్రియ యంతకు ముందు గలదు. అనఁగా 'చదువుట' ముగిసినది కావున నిది భూతార్థము.

---

1. లుటం వినా పంచటి తో లకారా ఆంధ్రలక్షణా. త్రి.శ.8.21
2. లడ్వర్తమానే. త్రి.శ.8.22
   కారక పరిచ్ఛేదమున(40) నీసూత్రము ప్రసక్తముగ నున్నది. వివృతి కొంతభిన్నము. అయ్యు నటఁదొలఁగింపఁ దగునని తోఁచు.
3. లిడ్భూతే. త్రి.శ.8.23

## 14. లృడ్భ విష్యతి [1].

భవిష్యతి = భవిష్యదర్థమునం దున్నధాతువునకు, లృట్ = లృట్ అగును.

వి. భవిష్యదర్థే లృట్ స్యాత్.

భావ్యర్థమునందు ధాతువు నకు లృట్టగును. విద్యమాన ప్రాగభావ ప్రతియోగి భవిష్యదర్థము. చదువఁగలడు. ఇప్పటికి లేనిచదువుట యను క్రియ పిదప నుండును కావున నిది భవిష్య దర్థకము.

## 15. లేట్ త్రయే. [2].

త్రయే = పూర్వోక్తము లగు భూతభవిష్యద్వర్త మానములు మూఁడింట, లేట్ = 'లేట్' అగును.

వి. లడ్లిృటాహ మేత త్త్రయాణామర్థే లేట్ స్యాత్.

లట్, లిట్,లృట్, అనుమూఁడు లకారముల యర్థమునందు లేట్ అగును. భూత భవిష్యద్వర్తమానార్థములు మూఁడింట లేట్ అగును - చదువును.

## 16. తద్ధర్మ శ్చ [3].

తద్ధర్మః చ = అది తద్ధర్మము నగును.

వి. తేషాం ధర్మాః ఆచారాః యస్య స తద్ధర్మః లేట్
తద్ధర్మ సంజ్ఞం స్యాత్.

'లేట్ త్రయే' యని పూర్వసూత్రమునఁ జెప్పఁబడిన 'లేట్' తద్ధర్మ మను సంజ్ఞయుఁ గల్గిన దగును. వర్త మానార్థమం దయిన 'లట్' వర్తమానార్థకము ఆ పద్ధతిలో నిట 'లేట్'కు చెప్పఁబడిన తద్ధర్మ సంజ్ఞచే లేట్ లకారము తద్ధర్మార్థము నం దగు నని యెంచవచ్చును. ధాతువుయొక్క ధర్మము (ఆచారము) గలిగినది. అనఁగాఁదెలుపునది తద్ధర్మము. ధాతువు యొక్క ధర్మమును బ్రకాశింపఁజేయున దగుటచే 'లేట్' తద్ధర్మసంజ్ఞ కము.

---

1. లృడ్భ విష్యతి. సమ్మతిః. త్రి.శ.8.24
2. ఏతత్త్రయే లేట్తు వాచ్యః. త్రి.శ.8.25
3. తద్ధర్మ ఇతి చోచ్యతే. త్రి.శ.9.26

## 17. లోడాశీ రాదౌ [1].

ఆశీ రాదౌ = ఆశీస్సు మొదలగు నర్థములందు, లోట్ = లోట్ లకార మగును.

వి. ఆశీః ప్రసభ విధ్యాదౌ లోట్ స్యాత్.[2]

ఆశీస్సు, శాపము, విధి మొదలగు నర్థములందు లో ట్టగును.

'ఆశీరాదౌ' అనునప్పటి యాది శబ్దముచే శాపము, విధి ప్రార్థనము మొదలగు నర్థములు గ్రహింపఁబడును. చదువుము. మొ॥

## 18. కొని రాత్మ నేపదమ్ [3].

కొనిః = కొని అనునది, ఆత్మనేపదమ్ = ఆత్మనేపదము.

వి. యస్మాద్ధాతోః కొని ప్రత్యయ స్తదాత్మనే పదం స్యాత్ [4].

ఏ ధాతువు కంటె 'కొని' యను ప్రత్యయ మగునో యా ధాతు వాత్మనేపద మగును. క్రియాఫలము కర్తృగామి యగుట యాత్మనేపదార్థము. వండుకొని.

వి. కొనేర్లేట్ ప్రత్యయత్వాత్తస్మిన్ పరే ధాతోరన్త్యస్య

శుగ్రుప్రత్యయః. చేసుకొని, ఇచ్చుకొని, చేసుకొనె,

ఇచ్చు కొనె.

కొని యన్నది లేట్ ప్రత్యయమగుటచే నది పర మగుచుండఁగా ధాతువు చివరి యక్షరమునకు శుగ్రుప్రత్యయ మగును. చేసుకొని. 'శుగ్లేటి' యని లేట్పరకత్వమున శుట్ విహితము. ఆత్మ నేపదార్థము లేదర్థ మనుట విశేషము.

---

1,2. ఆశీః ప్రవ విధ్యాదౌ లోడిష్యత ఇతి క్రమః త్రి.శ.8.27.

3,4. యస్మాత్కొని ప్రత్యయ స్యాత్తదేవ స్యాత్మ నేపదమ్.

(త్రి.శ.8.28)

చోరాత్మనే పదార్థే గృహ్ణాతావాగమస్య వేత్వం స్యాత్. ఆం.శ.చింక్తి.38

క్రియాఫలే కర్తృ గామిని గృహ్ణాతిః. వై.చం.త 41

## 19. నేర్లు గ్గురోః.

గురోః = ఆచార్యులమతమున, నేః = కొనిప్రత్యయ మందలి నివర్ణమునకు, లుక్ = లోప మగును.

వి. కొనిప్రత్యయ నివర్ణస్య లుక్ స్యాద్గురో ర్మతే.

చేసుకొవచ్చె, తీసుకొపోయె ఇత్యాది.

గురువుల యభిప్రాయమున కొనిప్రత్యయమునందలి ని వర్ణమునకు లోపమగును. చేసుకొని వచ్చెననుచో నివర్ణము లోపింపఁగా చేసుకొ వచ్చె.

'గురోః' అనుటచే 'ని' లోప మొక పక్షము. కావునఁ బక్షాంతరమునందు ని వర్ణము లోపింపక చేసుకొని వచ్చె నని యుండును.

వి. కిఞ్చ, లోకే కేచిచ్ఛాస్త్ర వేదినః కవయః కొనిప్రత్య

యస్థానే కవర్ణ ప్రయోగ స్సమాచీన ఇతి వ్యాహరన్తి

తేషాం ప్రయోగస్త్వసాధురేవ.

కాని శబ్దశాస్త్రము నెఱుఁగని కవులు కొందఱు కొనిప్రత్యయమునకు బదులుగా 'క' అను నక్షరముయొక్క ప్రయోగ ముచిత మని యట్లు వ్యవహరించుచున్నారు. చేసుకపోయె, తీసుకవచ్చె ననురీతిగా నున్నయట్టి యశాస్త్రజ్ఞు లగువారి ప్రయోగము సాధువు గానేగాదు.

ఈ నియమము వింతగనె యున్నది. వ్యవహారమునుండి పెక్కు శబ్దములకు సాధుత్వమును గల్పించియు నర్వాచీన ప్రయోగములందు, నప్ప కవి వంటి లాక్షణికులే యొనరించిన (ఆలెక్కక నీ బిడ్డఁడు. అప్ప.) యట్టి ప్రయోగములకు సాధుత్వము కల్పింపక తిరస్కరించుట సక్రమముగాఁ దోచకున్నది.

వి. ప్రకృతే

ఇచఁ ప్రస్తుతమున.

## 20. వేట్ [1].

వా = వికల్పముగా, ఇట్ = ఇట్ అగును.

వి. కొనిప్రత్యయే పరే ధాతోరన్తస్య ఇడ్వికల్పే న స్యాత్.[2]

చేసికొని, తినికొని, తీసికొని. ఇత్యాది.

కొని ప్రత్యయము పర మగుచుండఁగా ధాతువు చివరి వర్ణమునకు వికల్పముగా 'ఇట్' వచ్చును. ఇట్టులో టకార మిత్తు గావున నది లోపింపఁగా ఇత్వమె నిలుచును. చేసి ధాతువుపై క్రి.18. చేసుకొని రాఁగా 'శుడ్లేటి' యనిప్రాప్తించు. శుట్టునుబాధించి ఇత్వము రాఁగా- చేసికొని.

'వా' యనుటచే ఇట్టు రాని పక్షము నందు శట్టు వచ్చి 'చేసుకొని' యని యుండును. సూరి యిట్టి వానిని గ్రామ్యములుగా నిర్ణయించెను.

'తినికొని' యనురీతి వ్యవహారము గానరాదు.

## 21. తిఙ్శితౌ సార్వ ధాతుకౌ [2].

తిఙ్శితౌ = తిఙ్ప్రత్యయములు, శిత్తులును, సార్వ ధాతుకౌ = సార్వ ధాతుక మను సంజ్ఞ గల వగును.

వి. తిఙ్శితౌ సార్వ ధాతుక సంజ్ఞౌ స్తః.

తిఙ్ఞులును, శకార మిత్తుగాఁ గలవియును సార్వధాతుక సంజ్ఞ గలవి యగును. లటశ్చుమప్, శుడ్లేటి యను విధముగా శిత్తులుగాఁ జెప్పుట నవ్వాని కీ సూత్రముచే సార్వధాతుక సంజ్ఞ సిద్ధించు. డుజాదులను తిబాదుల స్థానమున నాదేశించుట చే నవి తిఙ్ఞు లయి సార్వధాతుక సంజ్ఞను బొందును.

---

1. ఇట్ స్యాత్ కొని ప్రత్యయేచ వలాదౌ సార్వధాతుకే.
(త్రి.శ.12)
ఇద్వాచోరాత్మనే పదే గృహ్ణాతౌ. అం.కా.క్రి.42
చో॥......అగుమున్య వేత్వం స్యాత్. అం.శ.చం.క్రి.38.
గృహ్ణాతౌవా. వై.చం.తి.42.
2. తిఙ్.శితౌ సార్వధాతుకమ్.
త్రి.శ.8.29

## 22. ఆర్ధ ధాతుక మన్యే [1].

అన్యే = ఇతరములు, ఆర్ధధాతుకమ్ = ఆర్ధధాతుక మను సంజ్ఞ గలవి యగును.

వి. తిఙ్ శితో రన్యే ప్రత్యయా ః ఆర్ధధాతుక
సంజ్ఞా స్స్యు.

తిఙ్లు, శిత్తులు గాక మిగిలిన ప్రత్యమములన్ని యు నార్ధ ధాతుకములు, 'తిఙ్ శితౌ సార్వధాతుకౌ' యను పూర్వ సూత్రము ననుసరించి యిట నన్యము లనఁగా తఙ్శిద్భిన్నములు. వాని కార్ధ ధాతుకము లను సంజ్ఞ నీ సూత్రము విధించుచున్నది.

## 23. ణిజించిరౌ చ.

ణిచ్, ఇంచిరౌ చ = ణిచ్, ఇంచిర్ అను నవి గూడ నార్ధ ధాతుక సంజ్ఞ గల వగును.

వి. ణిజించిర్ ప్రత్యయౌ చ ఆర్ధధాతుక సంజ్ఞౌ స్తః.

ణిచ్, ఇంచిర్, అను ప్రత్యయములకును ఆర్ధ ధాతుక సంజ్ఞను బొందును. 'ఇచ్చట చ శబ్దముచే 'ఆర్ధధాతుక మన్యే' యను పూర్వ సూత్రమున విధింపఁబడిన యార్ధధాతుక సంజ్ఞ బోధింపఁబడి 'ణిజించిర్' లను నార్ధధాతుక సంజ్ఞ సాధింపఁబడు చున్నది.

ఇవి తిఙ్శిద్భిన్నముల యయ్యును ప్రత్యయములుగాఁ గాక యాగమములుగాఁ జెప్పఁ బడుటనుబట్టి వీనికిఁ బ్రత్యేకముగా నార్ధధాతుక సంజ్ఞ విధింపఁబడియుండును.

---

1. ఆర్ధ ధాతుక మన్యే స్యు. త్రి.శ.8.11

## 24. కృత్సత్త్వార్థ యోరించిర్.

కృత్ సత్త్వార్థయోః = కరుణార్థమునను, సత్త్వార్థమునను, ఇంచిర్ = ఇంచిర్ అనునది చేరును.

వి. త్రివిధానాం తత్సమానా ముపకృతి పరిణతి సంవృతి

ధాతునాం నామ్నాం చ కరణార్థ సత్త్వార్థయో రించి

రాగమ స్స్యాత్. భజించెన్, పోషించెన్, నుంతించెన్,

జయించెన్, అనుభవించెన్, రంజిల్లె,వసించె, రంజించున్,

స్మరించెన్, హరించున్ ఇత్యాది.

ఉపకృతి, పరిణతి, సంవృతి యని మూఁడు విధములై యున్న సంస్కృతధాతువులకును, వివక్షానుగుణముగా ధాతుత్వమును బొందిన నామములకును, కరణ సత్త్వార్థములందు ఇంచిర్ అనునది యాగమ మగును. 'ఇంచిర్' అనుచో రేఫమిత్తు కావున నది లోపింపఁగా 'ఇంచి' అనునది యగును. (కరణార్థము,ప్రేరణార్థము, సత్త్వార్థము, స్వార్థము?)

నుతి + ఇంచి = నుతించి, జి-జయ్ + ఇంచి = జయించి, హృ-హర్ + ఇంచి = హరించి మొ॥.

వి.నామ్నామ్ - చూపించెన్, దాపించెన్, కనుపించెన్,

పిలుపించెన్, కొట్టించెన్, తిట్టించెన్, విడిపించెన్ ఇత్యాది.

నామములపై ఇంచిరాగమము వచ్చినందులకు 'చూపించెన్' మొదలగునవి యుదాహరణములు.

చూపు, దాపు, కను, పిలుపు కొట్టు, తిట్టు, విడుపు అను నామములపై నించి రాగమ మైన దని యభిప్రాయము గావచ్చును. కాని ప్రామాణికు లితరులు వీని నిట్లు నిరూపింపరు. చూచు అనుధాతువుపై ప్రేరణార్థమునందు, 'చూపించె' నని యైన దనురీతి నిర్వహణమె యుచితముగాఁ దోఁచును.

1. ఇంచి స్స్యాత్తత్స ధాతూనాం నామ్నః కృద్ భ్యర్థయో? స్మృతః. త్రి.శ. 8 -17,18.
త్రివిధానా మించుక్. ఆం.కౌ.క్రి.14 అధాతోరస్యా స్మాదించుక్. ఆం.కౌ.క్రి.24
భవతి క్రియా పదానాం త్రివిధా నామించుగాగమః. ఆం.శ.చి.క్రి.13.
అన్యస్మా చ్చాధాతోర్ధాతుత్వ వివక్షయైవ భవతీంచుక్. ఆం.శ.చిం.క్రి.21
అదేశ్యర్థాతో రించుక్. వై.చం.తి.3. క్వచిన్నామ్నః. వై.చం.తి.200

## 25. భజాదిస్తత్సః [1].

భజాదిః = భజ మొదలగునవి, తత్సః = తత్సను ధాతువులు.

వి. భజవసిరాదయస్తత్త ద్వికరణి తాః ధాతవస్తత్స

మాస్స్యుః. [2]

ఆయా వికరణప్రత్యయములతోఁగూడిన భజ, వసి మొదలగు ధాతువులు తత్సమములు.

వికరణప్రత్యయసహితము లై వచ్చు ననుట విశేషము. శప్రత్యయాన్వితములై (కర్తరిశప్) యివి యిటఁ జేరిన వని యుద్దేశ మేమో. ప్రయోజనము పరిశీలనార్హము. 'సంవృతి రంజివస్యాదిః' అనుచో వసి సంవృతి ధాతువుగాఁ జెప్పఁబడినది. తత్సమ క్రియలనుటమాత్రమె సూత్రము విధించు చున్నట్లున్నది.

## 26. (అయి పోయి) కని విన్యాదయోఽ చ్చాః [3].

(అయి పోయి) కని విన్యాదయః = (అయి పోయి) కని విని మొదలగునవి. అచ్చాః = అచ్చధాతువులు.

వి. అయి పోయి కని విన్యాదయో ధాతవోఽచ్చ సంజ్ఞా స్స్యుః. [4]
ఆయెన్, పోయెన్, కనెన్, వినెన్ ఇత్యాది.

కని, విని, అయి, పోయి మొదలగు ధాతువులకు 'అచ్చ' యని సంజ్ఞ.ఇచట అచ్చ యనునది ప్రసిద్ధ మగు 'దేశ్య' ములకుఁ బర్యాయముగాఁ జెప్పఁదగినట్లు తోఁచుచున్నది. ఆయెన్ మొ॥ కాని దేశ్యము లని మఱలఁ బిదపఁ జెప్పఁబడుచున్నది. దేశ్యాచ్చములకు భేదము స్పష్టము గాకున్నది.

---

1. భజాది స్తత్సమో ధాతుః. త్రి.శ.8. 10
2. తత్తద్వికరణాదయః. త్రి.శ.8.11
3.4 అయి పోయి కని చూచి రిత్యాద్యా ధాతవో మతా అచ్చాః. త్రి.శ.8.13

## 27. ఇచ్ఛ మందాదిస్త జ్జః [1].

ఇచ్ఛ మందాదిః = ఇచ్ఛ, మంద–మొదలగునవి, తజ్జః = తజ్జలు.

వి. ఇచ్ఛా – ఇచ్ఛ – కః – ఇంచిర్ – ఇచ్ఛ కించె,
వద – మంద – మధ్య కవర్ణోలః – ఇంచిర్
మందలించెన్ –
వద వ్యక్తాయాం వాచి ధాతోః అవరోధనమ్ –
అడ్డ. మధ్యవర్ణో గః – ఇంచిర్ – అడ్డగించెన్.
ఇత్యాది ధాతుజనితాశ్శబ్దా స్తద్భవా స్స్యుః.

ఇచ్ఛ, మంద, మొదలగునవి తజ్జ ధాతువులు 'ఇచ్ఛా' శబ్దమునుండి పుట్టినది ఇచ్ఛ. 'వద' ధాతువునుండి పుట్టినది మంద. ఇట్లు సంస్కృతధాతువులనుండి పుట్టిన తెలుఁగుధాతువులు తద్భవ ధాతువు లగును.

ఇచ్ఛ నుండి పుట్టిన ఇచ్ఛ అనుదానికి 'కాదిర్మధ్యః' అను వక్ష్యమాణ సూత్రముచే కవర్గము చేరి ఇచ్ఛక అని కాఁగా దీనిపై 'కృత్సత్తార్థయోరించిర్' అను సూత్రముచే ఇంచి రాగమము వచ్చి – భూతార్థమున 'ఇచ్ఛ కించెన్' అని యగును.

ఇట మధ్యవర్ణము 'గ' గా ప్రసిద్ధము: ఇచ్ఛగించెనని యె యుండును. ఇందే 'కాదిర్మధ్యః' అను సూత్రము నొద్ద ఇచ్ఛగించె ననియె వ్రాఁతప్రతిలో నున్నను లక్షణమునుబట్టియు నుదాహరణ క్రమమునుబట్టియు నిట 'ఇచ్ఛకించె' ననియె యుద్దేశింపఁబడినట్లు చెప్పకతప్పదు. అట్టిది నేఁడు వ్యవహారముననుఁ గానరాదు.

'వద ' శబ్దభవము – మంద దీనికి 'కాదిర్మధ్యః' అను సూత్రముచే లవర్ణము పై నించిర్ రాఁగా భూతార్థమున – మందలించెన్.

అవరోధనార్థము 'వద' శబ్దభవ మైన అడ్డ అనుదానికి నడుమ గవర్ణము, ఇంచిర్– భూతార్థమున – అడ్డగించెన్ – మొ॥

---

1. • తద్భవ ధాతుస్తు ఇచ్ఛాదిర్యచ్ఛ తద్భవః– త్రి.శ.8.14

28. వాస్యొల స్యేది తాడి మట్ట్యారి గడ్యాదయోదేశ్యాః [1].

వాసి, ఒలసి, ఏ ది, తాడి, మట్టి, ఆరి, గడి ఆదయః = వాసి-- మొదలగునవి, దేశ్యాః = దేశ్యములు.

వి. ఇత్యాదయో ధాతవో దేశ్యాస్స్యుః- వాసెన్ - బ్రతికె నిత్యర్థః ఒలసెన్- దించె నిత్యర్థః, ఏలదెన్ - వ్రేసె నిత్యర్థః, తాడెన్ - మొత్తె నిత్యర్థః, మట్టెన్ - గ్రుద్దె నిత్యర్థః, ఆరెన్ - చచ్చె నిత్యర్థః, గడెన్-మించె నిత్యర్థః.

వాసి, ఒలసి, ఏ ది, తాడి, మట్టి, ఆరి, గడి మొదలగునవి దేశ్యము లగు ధాతువులు. ఇంతకు ముందు చూపిన కని విన్యాదులకును, వీనికిని భేదము స్పష్టము గాకున్నది.

29. చిగురించ్యోలగించ్యాదయో నామధాతవః [2]

చిగురించ్యోలగించ్యాదయః = చగురించి,ఓలగించి మొదలగునవి, నామధాతవః = నామధాతువులు.

వి. ఏతే నామ ధాతవస్స్యుః - చిగురించెన్, చెట్టు చిగురు చేసె, ఓలగించెన్, కొలువు చేసెన్ కొలు వై యున్నాఁ డిత్యర్థః. రాజు కరుణించెన్, దయ చేసెన్ ఇత్యాది.

చిగురించి, ఓలగించి మొదలగునవి నామధాతువులు, చిగురు - ఓలము - అను రీతి నామములనుండే యేర్పడుచున్న ధాతురూపములు గావున వీనిని నామధాతువు లని వ్యవహరింతురు. ధాతుత్వమును వివక్షించుట నామములు కొన్ని ఇంచిరాగముతో ధాతువు లయి లడాద్యంతము లగును. నామముల కించిరాగమ మగుట కిట్టివి యుదాహరింపఁదగును.

ఓల + ఇంచి యనుచో 'కాదిర్మధ్యః' అని నడుమ గకారము చేరినట్లు గుర్తింపఁదగును.

---

1. వాసిశ్చోలసిరేదిశ్చ తాడి ర్మట్టి రారిర్గడిః
   ఇత్యాద్యా ధాతవో దేశ్యా. (బహుళం తన్నిదర్శనమ్)
   త్రి.శ.8.15

2. చిగురించి శ్చోలగించి రిత్యా ద్యానామధాతవః.
   త్రి.శ.8.16

## 30. కాదిర్మధ్యః[1]

కాధిః = 'క' కారము మొదలగునవి, మధ్యః = ధాతువునకును, ఇంచి రాగమమునకును నడుమ నగును.

వి. కకారాదివర్ణాః మధ్య వర్ణా స్స్యుః - ఇచ్చ కించెన్, అడ్డగించె, మందలించె, చనుతెంచె, ఒప్పగించెన్, దొంగిలించెన్ ఇత్యాది.

'క' కారము మొదలగునవి నడుమ వర్ణములుగాఁ జేరును. ఇచ్చ + ఇంచి అనుచో క వర్ణము చేరి ఇచ్చకించెన్. 'ఇచ్చగించెన్ అని గకారముతోఁ బ్రసిద్ధము.

అడ్డ + ఇంచి అనుచో గకారము చేరి- అడ్డగించెన్, మంద + ఇంచి - అనుచో లకారమ మయి మందలించె. ఇట్లే దొంగిలించె మొ॥ చోట్ల గుర్తింపఁదగును.

క కారమగు నవి గలవేమో వెదుకవలె.

## 31. ణేశ్చ[2].

ణేఃచ = ణిచ్ ప్రత్యయాంతమునకును ఇంచి రాగమ మగును.

వి. ణిచ్ ప్రత్యయాన్తస్య ఇంచిరాగమస్స్యాత్. రచింపించెన్, జయింపించెన్, అనుభవింపించెన్, ఇత్యాది.

ణిచ్ప్రత్యయాంతమునకు ఇంచిక్ అను ఆగమము వచ్చును. సంస్కృతమునఁ బ్రేరణార్థమునందు ధాతువునకు ణిచ్ ప్రత్యయము వచ్చును. కావున నిట ణిః అనఁగాఁ బ్రేరణము నందించి రాగమము వచ్చు నని యర్థము. సంస్కృతధాతువులకు స్వార్థమునం దించి రాగమము రాఁగా దానిపైఁ బ్రేరణార్థమునం దించిరాగమము వచ్చును.

రచించి, రచింపించెన్ మొ॥

---

1. కకారాద్యా మధ్య వర్ణాః ఇతి. త్రి.ి.8.19
   గు గుణాత్ వై.చం.తి.201
2. ఆం.శ.చిం.14, ఆం.కౌ.క్రి.15.

## 32. ధాతోస్తిఙ్.

తిఙ్ = తిఙ్ప్రత్యయములు, ధాతోః = ధాతువునకుఁ బరముగా నగును.

వి. ధాతోః పరస్తిఙ్ స్యాత్.

తిఙ్లు అనఁగా ప్రథమ మధ్య మోత్తమ పురుషప్రత్యయములు (క్రియావిభక్తులు) ధాతువు కంటెఁ బరముగా నగును.

ఈ సూత్రము స్పష్టతకై యనఁదగును.

## 33. లట శ్శుమప్ [1].

లటః = లట్టు పర మగుచుండఁగాఁ బూర్వమునం దున్న ధాతువునకు, శుమప్ = శుమప్ అను ప్రత్యయ మగును.

వి. వర్తమానార్థే ధాతో శ్శుమప్ ప్రత్యయోఽను బంధ స్స్యాత్.

మూచి. శుమప్ శకారపకారయో రిత్సంజ్ఞా. మూచ్ + ఉము, వచ్చ్ + ఉము - ఇతిస్థితే.

వర్తమానార్థమునందు ధాతువునకు 'శుమప్' అను ప్రత్యయ మగును. 'లడ్వర్త మానే' యను సూత్రముచే 'లట్' వర్తమానార్థమునం దగును. కావున లటి, యనఁగా వర్తమానార్థమునందు (లట్టు పర మగుచుండఁగా) నని యర్థము సిద్ధించును. 'శుమప్' అను ప్రత్యయములో శకారమును, పకారమును ఇద్వర్ణములు కావున నవి లోపించును. 'ఉమ' అనునది మాత్రమె నిలుచును.

మూచి యను ధాతువుపై వర్తమానార్థము నందు లట్టు రాఁగా నీ సూత్రము చే శుమప్ ప్రత్యయ మై మూచ్ + ఉమ (ప్) - సంధి జరుగఁగా మూచుమ (ప్) అని యగును. ఇట్లె వచ్చ్ + ఉము - వచ్చుమ.

---

1. మూ.కార. 41. లట నిది యప్రసక్తముగానున్నది.
లటశ్శుమః. త్రి.శ.9.16 బృహస్పతిసూత్రము.

## 34. ఉండీ రనుప్రయోగః [1].

ఉండీః = ఉండీ యనునది, అనుప్రయోగః = వర్తమానార్థమునందు శుచుప్పు ననుసరించి ప్రయోగింపఁబడును.

వి.యస్తూండీ ధాతుస్తత్ శుచుపః పరతోఽను ప్రయోగ
స్స్యాత్ - అను ప్రయోగ ఏవ అనుబన్ధః అనంతరం
తిపోడుజ్ చూచుచుండిడు ఇతి స్థితే.

వర్తమానార్థమునందు శుచుప్ ప్రత్యయమునకు 'ఉండీ' యను ధాతు వనుప్రయుక్త మగును. అనుప్రయుక్త మనఁగా ననుబంధమె. ఉండీ ధాతువు శుచుప్ ప్రత్యయము నంటి యుండు నని యర్థము. చూచుచు + ఉండీ - చూచు చుండీ. దీనిపైని లట్టునకు ప్రథమ పురుషైకవచన వివక్షలో సంస్కృతానుసారముగా తిప్ ప్రత్యయము రాఁగా. చూచుచుండీ + తిప్. తిప్పుస్థానమున 'మహతిడుజ్' అను సూత్రముచే డుప్రత్యయ మై చూచుచుండీ + డు(జ్) అని యగును. పిదప-

## 35.ఘాడ్డుమురుషు.

డుమురుషు = డుజ్, ము, రు' అను క్రియావిభక్తులు పర మగుచుండఁగా ధాతువునకు, ఘాట్ = ఘాట్ అను ప్రత్యయ మగును.

వి. డుము(వును) రుషు పరేషు ఘాట్ప్రత్యయస్స్యాత్.

ఘకారస్య ఇత్సంజ్ఞా. ఆఁడు ఇతి స్థితే.

వర్తమానార్థమునందు డు,ము,రు' అను క్రియావిభక్తులు పర మగుచుండఁగా ఘాట్ ప్రత్యయము వచ్చును. ఘాట్ అనుచో ఘకారమును, టకారమును ఇద్వర్ణములు. కావున 'ఆ' అనునదే మిగులును.

చూచుచుండీ +డు - అనుచో ఘాట్ప్రత్యయము రాఁగా చూచుచుండీ + ఆడుఁ(జ్) అని యగును.

---

1. ఉండీరనుప్రయోగః. త్రి.శ.9.17 బృహస్పతి సూత్రము.
విత్యంలటోవ సతిశ్చ. ఆం.కౌ.క్రి.10
వసతిరనుబన్ధకస్స్యా ద్యత్రలడ ర్థో వివక్షితస్తత్ర ఆం.శ.చిం.క్రి.11.
నా వసతి ర్వర్తమానస్య. వై.చం.తి.8.

'ఘాట్టు' టి త్తగుటవలన డ్వాదులకార్య వయవముగా వచ్చు నని చెప్పుటకు వీలు లేదు. డుము రుషు అనుచోటి సప్తమిచే డ్వా ది పరకత్వమున ధాతువునకె యగు నని చెప్పవలెను. కాఁగా 'ఘాట్' అనుచో టకారమునకు నాద్యవయవముగాఁ జేరుట యను ప్రయోజన ముద్దేశింపఁబడలేదు ఘకారమువంటిదే ఘాట్ అనుచోటి టకారము నని చెప్పవలయును.

డుమురుషు అనుటచే చూచుచున్నది అనుచో (నమహత్క్రియకు) ఘాట్టు లేదు

## 36. నిత్యం నగ్ఘాటి.

ఘాటి = ఘాట్ప్రత్యయము పరమగుచుండఁగా ధాతువునకు, నిత్యమ్ = నిత్యముగా, నక్ = నగాదేశ మగు.

## వి. ఆది ధాతో రన్త్యాక్షరస్య నిత్యం నగాదేశ స్స్యాద్ఘాటి పరే.

## చూచు చున్నాఁడు.

ఘాట్ప్రత్యయము పర మగుచుండఁగా దానికిఁ బూర్వమునం దున్నధాతువు యొక్క చివరి యక్షరము స్థానమున 'నక్' అనునది యాదేశ మగును. 'నక్' అనుచో 'క' కారము ఇద్వర్ణము. అకార ముచ్చారణార్థము. నకారపుఁ బొల్లె యగును.

చూచుచుండి + ఆఁడు అనుచో డివర్ణమునకు నకారము రాఁగా చూచుచుంన్ ఆఁడు. చూచుచుంన్నాఁడు అని యగును. బిందువు నకు నకార మగుటయో లేక బిందుపూర్వక డివర్ణమునకె నకారము ద్విరుక్తమయి యాదేశ మగుటయో గుర్తింపవలెను. చూచుచున్నాఁడు మొ॥

ఇంతకంటె నన్వప్రయోక్త మగునది 'ఉండి' యనికాక 'ఉన్న' అని చెప్పుకొనుటలో లాఘవము గలదు (వై.చం.) ధాతువు నన్వప్రయుక్తము చేయుట వలన నిట్టి గౌరవ మేర్పడినది.

ఘాట్ప్రత్యయము రాని యమహదర్థమునను 'చూచుచున్నది' యను తీరుగానగుచున్నది.

## 37. తిర్దుర్తే ణట్శుట చ్ణాప్శేష్వు డేర్వా లుక్.

తిర్దుర్తేణట్శుటచ్ణాప్శేష్వు = తిర్, దుర్, తే, ణట్, శుటచ్, ణాప్, శేప్ అను ప్రత్యయములు పర మగుచుండఁగా పూర్వమునం దున్న ఉండిధాతువు యొక్క, డేః = డివర్ణమునకు, వా = వికల్పముగా, లుక్ = లోప మగును.

వి. తిర్, దుర్, తె, సట్, శుటచ్, ణాప్, శేప్ - ఏషు
పరేషు ఉండి ధాతో ర్డకారస్య వా లుక్ స్యాత్.
ఉండితిరి - ఉంతిరి, ఉండుదువు - ఉందువు,
ఉండితె - ఉంతె, ఉండిన - ఉన్న, ఉండుట- ఉంట,
ఉండున - ఉన్న, ఉండునె - ఉన్నె.

తిర్, దుర్ మొద లగునవి పర మగునపుడు ముందటి యుండి ధాతువునందలి డివర్ణమునకు వికల్పముగా లోపము వచ్చును.

ఉండి దువు అనుచో డివర్ణము లోపింపఁగా ఉందువు. లోపము రాని పక్షమునం దు శుడ్లేటి' యని శుబ్రప్రత్యయము వచ్చి ఉండుదువు అని యగును.

ఉండితివి లనుచో డివర్ణము లోపింపగా సున్నపైని తకారము టకార మగుచున్నది ఉంటివి.

ఉండిన - అనురీతి నకారము పర మగుచుండఁగా డివర్ణము లోపించినపిదప సున్నకు నకార మగుచున్నది ఉన్న. మొ॥

వి. ఉన్నా, ఉన్నె ఇత్యత్ర.
(ఉండునా) ఉన్న (ఉండెనె) - ఉన్నె అనుచోట్ల.

## 38. బిన్దో ర్ను ప్నేపోః.

ణప్,శేపోః = ణప్, శేప్ అనునవి పర మగునపుడు,బిన్దోః = బిందువునకు, నుక్ = నుగాగము మగును.

వి. ణప్శేపోః పరయో ర్ధాత్వనుస్వారాత్పరతో నుమాగమ
స్స్యాత్. ఇత్యనేన ఉన్నుక్ కకారస్య ఇత్సంజ్ఞా. 'ను'
(ఊఁనా, ఊఁనె) [1] ఉన్నా, ఉన్నె.

---

1. ఇట ఊఁనా, ఊఁనె, యనురీతిగా వ్రాతప్రతి యందుంట ప్రామాదికము గావచ్చును బిందువు స్థిరపరకతచే లోపించిన దనుకొన్నను దీర్ఘము విధింపఁబడలేదు.

ణాప్ శేప్ - లు పర మగుచుండఁగా 'తిర్దర్' ఇత్యాది పూర్వసూత్రముచే డివర్ణము లోపించిన పక్షమునందు. ఉం ఆ, ఉం ఏ అని యుండును. అపు డీ సూత్రముచే నున్నపై నుగాగమము వచ్చును. 'నుక్'లో కకార మిత్తు. ఉకార ముచ్చారణార్థము కావున 'న' కారపుఁబొల్లె యగును. ఉంనా, ఉంనె. అని యగును. నకారము పర మయిన యిచట బిందువు నకు నకారము రాఁగా ఉన్నా - ఉన్నె అని యగును.

## 39. శుటజాతో నిత్యం లుక్.

బిన్దోః = బిందువు కంటెఁ బర మయియున్న, శుటజాతః = శుటచ్ ప్రత్యయమునకు సంబంధించి న యుకారమునకు, నిత్యమ్ = నిత్యముగా, లుక్ = లోపమగును. 'బిన్దో ర్నుక్' అను పూర్వ సూత్రమునుండి 'బిన్దోః' అనునది యిం దనువర్తించును.

వి. బిన్దోః పరస్య శుటప్రత్యయో కారస్య నిత్యం లుక్ స్యాత్. ఉండుట - ఉంట. (ఇత్యాది)

బిందువు కంటెఁ బరముగా నున్న శుటచ్ ప్రత్యయము యొక్క యుకారమునకు నిత్యముగా లోపము వచ్చును. శుటచ్‌లో శకార చకారము లిద్వర్ణములు గావున నవి లోపింపఁగా 'ఉట' యనునది మాత్రమె నిలుచును.

ఉండ్ + ఉట యని యుండఁగా 'తిర్దర్' మొదలగు (క్రి.37) సూత్రముచే డకారము లోపింపఁగా ఉం + ఉట అని యుండును, ఇట శుటప్రత్య యోకారము బిందువునకుఁ బరముగా నున్నది గావున నీ సూత్రముచే నందలి యుత్వమునకు లోపము రాఁగా ఉంట యని యగును.

'వాలుక్' అనుటచే డిలోపము వికల్పము గావున లోపము రానిపక్షము నందు ఉండ్ + ఉట యని యుండును. ఇపుడు శుటప్రత్యయోకారము బిందువు కంటెఁ బర మై యుండలేదు కావున 'ఉత్వమునకు లోపము లేదు. ఉండ్ + ఉట యనుచో ఉండుట యని యగును.

## 40. ఝథయో రు శ్.[1]

ఝథయోః = ప్రథమ పురుష బహువచన మగు 'ఝ' అనుదానికిని, మధ్యమపురుష బహువచన మగు'థ' అనుదానికిని, రుశ్ = రుశ్ అను ప్రత్యయమగును.

వి. మహద మహతాం సర్వేషాం క్రియాపదానాం ప్రథమ మధ్యమపురుష బహువచనయోః రుశ్ ప్రత్యయ స్స్యాత్ - ఇత్యనేన రుశి, ఘాట్బ్ర - చూచు మన్నారు.

మహత్తులు నమహత్తులు నయిన యన్ని ధాతువులపైని ఝ, థ - యనువాని స్థానమున 'రుశ్' ప్రత్యయము వచ్చును. రుశ్' లో శకారము ఇత్తు కావున నది లోపింపఁగా 'రు' వర్ణమె నిలుచును. తిప్తస్ఝి, సిప్ థస్ థ' యను మొద లగు పాణినీయ లక్షణము ననుసరించి 'ఝ' యనునది ప్రథమ పురుష బహువచనము, 'థ' యనునది మధ్యమపురుష బహువచనము.

చూచి- ల'ద్వర్తమానే. చూచ్ + లట్ 'లటశ్శుమప్' చూచుచు + లట్ , 'ఉండి రనుప్రయోగః' - చూచుచుండి +లట్ లట్టునకు ప్రథమ పురుషబహువచనవివక్షలో సంస్కృతానుసారముగా ఝప్రత్యయము కాఁగా చూచుచుండి + ఝ. అనుచో ఝ స్థానమునఁ బ్రస్తుత సూత్రముచే రు(శ్) వర్ణక మయి- చూచుచుండి + రు - ఘాడ్డము( ళును) రుమ' - చూచుచుండి + అరు 'నస్థాటి' చూచుచున్నారు.

'ఇట్లె మధ్యమపురుష బహువచన వివక్షలో 'థ' ప్రత్యయము రాఁగా దాని కీసూత్రముచే రు(శ్)వర్ణక మయి పయినట్లు రూప మేర్పడును.

---

1. అప్పురాయః 'త్రి.శ.9.22 బృహస్పతి సూత్రము బహోరుద్వర్ణకో సర్వేషామే. అం.కౌ.క్ర.30 సర్వేషాంబహువచనే రుశితిస్యాత్ అ.శ.చిం.క్ర.26

# 41. సిబ్మిపో ర్వుబ్నుకౌ [1]

సిబ్మిపోః = మధ్యమపురుషైకవచన మగు 'సిప్' ప్రత్యయమునకును, ఉత్తమపురుషైకవచన మగు 'మిప్' ప్రత్యయమునకును క్రమముగా, వుబ్నుకౌ = వుక్, నుక్ అనుప్రత్యయము లగును.

వి. మహదమహతాం సమస్తానాం క్రియాపదానాం
మధ్య మోత్తమై కవచనయో ర్వుబ్నుకౌ క్రమాత్ స్తః
ఇత్యనేన. చూచుచున్నాఁడువు. చూచుచున్నాఁడును.
ఇతి స్థితే.

మహత్తులు గాని యమహత్తులు గాని యన్నివిధములయిన ధాతువులకును, పైనున్న సిప్ స్థానమున వుక్ ప్రత్యయమును, మిప్ స్థానమున నుక్ ప్రత్యయము నగును. వుక్,నుక్, అనువానిలో కకారము లిత్తులు గావున నవి లోపింపఁగా వు, ను అనునవే యగును. తిప్తస్ ఝి, సిప్థస్థ, మిబ్వస్మస్ – అను పాణినీయ లక్షణము ననుసరించి సిప్ అనునది మధ్యమపురుషైక వచనము, 'మిప్' అనునది యుత్తమపురుషైకవచనము. మధ్యమపుషైకవచనమున (సిప్నకు) వు వర్ణకమును, ఉత్తమపురుషైకవచనమున (మిప్) కు ను వర్ణకము నగును.

ఇట చూచుచున్నాఁడువు చూచుచున్నాఁడును అనునవి క్రియాపదములుగాఁ జూపఁబడినవి. 'ఘాడ్డుమురుషు' అను (క్రియా.35) సూత్రమున 'వును' లు పేర్కొనకుండుటను బట్టి చూడఁగా, చూచుచున్నావు, చూచుచున్నాను. అనునవి యుద్దిష్టములు గాలే దని తోఁచుచున్నది వునులు పర మైనపుడును ముందు డుజ్వర్ణకము ఖచూచుచుండి + డువు, చూచుచుండి + డును అనురీతిగా డువర్ణకమె పర మగుచుండఁగా వునులు పర మగుట యుండదు కావున ఘాడ్డుము రుషు అనుచో వునులు చేర్పఁబడలే దనవలెను. డుపరకతచే ఘాట్ప్రత్యయాదు లయి చూచుచున్నాఁడను చూచుచున్నాఁడవు అని యగు నన్నమాట.

---

1. వురూచ, సమూచ. త్రి.శ.9, 26, 27 బృహస్పతిసూత్రము
ఉత్వయుతౌ వనకారౌ స్యాతాం మధ్య మోత్తమై కవచనానామ్
ఆం.శ.చిం.క్రి.25
నువూత్తమమధ్యై కయోః . ఆం.కౌ.క్రి.29
తద్యేష్మదస్మదాం నుస్
ప్రథమాదేః వై.చం.తి -10

కాని, సిబ్మిప్పులకు పునులు చెప్పఁగా నిట దుజ్వర్ణ మగున దెట్లు? 'మహతిడుజ్ (క్రి.3) అనుచో, తిప్పునకె యది చెప్పఁబడినది.

దనితరువాత సూత్రము ఈడుజ్ఞు నుకారమున కత్వము చెప్పునదిగాఁ దోఁచు.

## 42. చమ్ష.

వి. లడర్థే ధాతోశ్చమ్ ప్రత్యయస్యాత్సిబ్మిపోః పరయోః ఇత్యనేన (తిబు) కారస్య చమితి ప్రాప్తే - వచ్చుచున్నాఁడవు, మీరు వచ్చు చున్నారు, చూచుచున్నాఁడను.

సిప్, మిప్పు లు పర మగుచుండగా వర్తమానార్థమునందు ధాతువునకు చమ్ ప్రత్యయమగును. చమ్ లో చకారముకారము లిత్తులు గాఁగా లోపించి అత్వమె మిగులును. చూచుచున్నాఁడు అను చూచుచున్నాఁడను మొll కాని నువులకు ముందు దుజ్విధానము మృగ్యము.

చూచుచున్నాఁడవు అనురీతివి క్రియాపదములు గాక ప్రథమావిభక్త్యంత యుష్మదస్మద్విశేషణ రూపములుగా లాక్షణికులు పిదప నిరూపించిరి. ఇట నివి క్రియాపదములుగాఁ జెప్పుటవిశేషము

## 43. మసోముశ్ [1].

మసః = ఉత్తమ పురుష బహువచన మగు 'మస్' స్థానమున, ముశ్ = ముశ్ ప్రత్యయమగును.

వి. ఉత్తమ పురుష బహువచన ప్రత్యయస్య ముశ్ ప్రత్యయ స్స్యాత్. వచ్చు చున్నాము ఇత్యాది.

'తిప్త స్ఝి, సిప్థస్థ, మిబ్వస్మస్' అనుపాణినీయ లక్షణము ననుసరించి 'మస్' అనునది యుత్తమపురుష బహువచనము. ఉత్తమపురుష బహువచనమున (మస్) కు తెలుఁగున ముశ్ అనునది యగు. ముశ్ లో శకార మిత్తు కావున మువర్ణమె నిలుచును. చూచుచున్నాము. మొ॥

---

1. ముదుత్తమస్య ఆం.కౌ.క్రి.31
ఉత్తమస్యతుభవేన్ముః ఆం.శ.చిం.క్రి.27

## (4). దిరమహతి [1].

అమహతిః = అమహదర్థమునందు, దిః = ది అను ప్రత్యయ మగును.

వి. అమహత్క్రియాయాః ప్రథమపురుషైకవచనే తిపోదిస్స్యాత్ స్త్ర్యర్థే - ఆబిడ వచ్చుచున్నది, వారువచ్చుచున్నారు, నీవు వచ్చు చున్నదవు, మీరు వచ్చుచున్నారు. నేనువచ్చుచున్నడను, మేము వచ్చుచున్నాము ఇత్యాది.
పశుజడార్థే. గోవు వచ్చుచున్నది, కొండ పెరుగుచున్నది. ఇత్యాది.

అమహదర్థమునఁ బ్రథమైకవచన మగు'తిప్' స్థానమున దివర్ణము. వచ్చును. ఇట్లనుటచేఁ బ్రథమ పురుష బహువచనాదులందుఁ బూర్వోక్తము లగు రువర్ణాదులే యమదర్థమునం దగు నని యర్థ మగుచున్నది. స్త్రీలు వచ్చుచున్నారు, ఆబిడ వచ్చుచున్నది. ఇచట ('ది' పరకతవలన) డుమురులు పరముగా లేకుండుటచే 'ఘాద్దు మురుషు' అను సూత్రముచే ఘాట్ప్రత్యయము రాదు కావున వచ్చుచున్నాఁ డన్నట్లుగా వచ్చుచున్నది యని కాదు. కాని 'నిత్యం నఘ్టాటి'(క్రి.36) యని ఘాట్ ప్రత్యయ పరకత్వమునఁ జెప్పిన 'నక్' ఇట ఘాట్ లేకయు వచ్చుచున్నది లేనిచో వచ్చుచుండిది యని కావలసి వచ్చును. కాక యా(క్రి.36) సూత్రమందలి నిత్యశబ్దమున కీయర్థము సాధించు శక్తి గల దేమో?

మధ్యమోత్తమైకవచనములందును నీ 'ది' వర్ణము మాపుట విశేషము. వచ్చుచున్నదవు, వచ్చుచున్నదను ఇట్టిశబ్దములు భాషలో లే వనుట దోషము గాదు. వచ్చుచున్నాఁడవు అనుచో మహదర్థమునఁ జెప్పిన దుజ్ఞున కత్వముతో వచ్చుచున్నఁడవు అనురీతిగా జూపినట్లే

---

1. చూ.క్రి.4. 'అమహతిదిః' అని యీ యర్థమింతకుముందు .చెప్పఁబడినది. అదే యర్థమిటఁబునరుక్తమైనది. ఉదాహరణములతోఁ గూడి యున్న ప్రస్తుతస్థలము సందర్భోచితమై యున్నది.

రెండు వేర్వేరు (పూర్వ వ్యాకరణములందలి సూత్రములో), లేక ప్రమాదవశమునఁ బునరుక్తియైనదో, ఇట బూర్వ సూత్ర సంఖ్య దీనికీయఁబడినది. ప్రత్యేక పరిగణన మవసరముగాఁ దోచదు. ఆ సూత్రముచెప్పక క్రి .3.సూత్రమున 'ఘాద్దుమురుషు' అనుదానికిఁ బూర్వము చెప్పిన బాగుండెడిదని తోఁచు.

దిగ్లటి. ఆం.కౌ.క్రి.23. స్త్రీ వదేక వచనమ్ (ఆం.కౌ.క్రి.28,) స్త్ర్యర్థే పునర్దు దీభవతః, స్త్రీవదేకవచనంతు ఆం.శ.చిం.క్రి.20, 24 అని స్త్రీత్వమున వేఱుగను, తిర్యగ్జడ కర్తృత్వమున వేఱుగను విధింపఁ బడినను నిట'నమహతి' యని సామాన్యముగాఁ జెప్పఁబడె.

యిచట సమహదర్థమునఁ జెప్పిన దివర్ణమున కత్వముతో వచ్చుచున్నదవు వచ్చుచున్న దను అని చూపఁబడియుండును కాని మహదర్థమున (యుష్మదస్మ ద్విశేషణ) రూపములు వచ్చుచున్నాఁడవు, వచ్చు చున్నాఁడను అని యుండఁగా, స్త్ర్యర్థయిన వచ్చుచున్నదానవు, వచ్చుచున్న దానను అని యుండును గాని, వచ్చుచున్నదవు వచ్చుచున్నదను అని యుండదు.

ఇట్టి రూపములు వివృతి వలన నేర్పడుచున్నవి సూత్రముచే నిట్టి యనర్థమున కవకాశము లేదు. తిప్పున కుఁ జెప్పిన 'ది' వర్ణము మధ్యమోత్త మవచనములకును ముం దగుట (ప్రథమ పురుష బహువచనాదులకు ముందు లేకుండుటయు) ఎట్లో స్పష్టముగాదు. డుజ్జీవర్ణము లిచ్చుటఁ బ్రత్యేకముగా విధించిన జాడయు లేదు.

పశుజడములు సమహత్తులే. కావున నయ్యవి కర్తలుగా నున్నపుడును బ్రథమ పురుషైకవచనమున 'ది' వర్ణకమును, ఇతర స్థలముల రువర్ణకాదులు నగును.

గోవు (పశువు) వచ్చుచున్నది.

కొండ (జడము) పెరుగుచున్నది.

స్త్ర్యర్థమునవలెనే, తిర్య గ్జడ కర్తృకతలోను బ్రథమపురుషబహు వచనమున 'రు' వర్ణకము రావలసియుండఁగా నిట్లు చెప్పఁబడుచున్నది.

## 44. ఝె ర్విశ్.[1]

ఝః = ఝి ప్రత్యయమునకు, విశ్ = విశ్ ప్రత్యయ మగును.

వి. తిర్యగ్జడేషు కర్తృషు లట్ ప్రథమ పురుష బహువచన స్య విశ్ ప్రత్యయస్స్యాత్. గజములు వచ్చుచున్నవి. గుఱ్ఱములు పోవుచున్నవి. చిలుకలు గూయుచున్నవి. ఇత్యాది.

తిర్యగ్జడములు కర్తలుగా నున్నపుడు వర్తమానార్థమున ప్రథమ పురుషబహువచన మగు ఝి ప్రత్యయమునకు 'విశ్' అనునది యగును. విశ్ ప్రత్యయమునందు శకార మిత్తు కావున నది లోపింపఁగా వివర్ణమె నిలుచును.

గజములు వచ్చు చున్నవి. మొ॥

---

1. ' విర్లటి బహొ. ఆం.కౌ.క్రి.26
అన్యత్రవుపి ఆం.శ.విం.క్రి 23
దివ్యోరుద్వ్యతిరేక భవిష్యతోః వై.చం.తి.16

ఇట్లనుటవలన తిర్యగ్జడ కర్తృత్వమున మధ్యమోత్తమ పురుషముల నేక బహువచనములు మహదర్థమునందింతకు ముందు చెప్పఁబడినట్లుగా వువర్ణకాదులనె పొందు నని స్పష్ట మగుచున్నది.

ఇంతటతో లడంతప్రక్రియ పరిసమాప్తము. వర్తమానార్థక రూపములు నిరూపింపఁబడినవి.

## అథలిట్.

ఇఁక లిడంత (భూతార్థక) క్రియాపదములు నిరూపింపఁబడుచున్నవి.

వి. చూచ్ - డు ఇతిస్థితే.

చూచ్ అను ధాతువునకు భూతార్థ మునందు 'లిడ్భూతే' యని లిట్టు రాఁగా, లిట్టునకుఁ ప్రథమ పురుషైకవచన వివక్షలో 'తిప్' వచ్చి, ఆ తిప్పునకు 'డుజ్మహతి' యనుసూత్రముచే డు జ్జయి చూచ్ + డు అని యుండఁగా-

### 45. ఝుగ్లిటి. [1]

లిటి = లిట్టు పర మగుచుండఁగా, ఝుక్ = ఝుక్ ప్రత్యయ మగును

వి. లిటి ధాతోరన్త్య స్య ఝుక్ ప్రత్యయస్స్యాత్తిజీ పరే.

చూచి డు ఇతి స్థి తే,-

భూతార్థమునందుఁ క్రియావిభక్తులు పర మగుచుండఁగా ధాతువు చివర ఝుక్ ప్రత్యయమగును. ఝుక్ అనుచో ఝుకారమును, కకారము నిద్వర్ణములు కావున నవి లోపింపఁగా ఇత్వమె యగును.

చూచి + డు = చూచి డు అని యగును.

---

1. క్త్వా భూతయో రిదన్త్యస్య. ఆం.కౌ.క్రి.19
   క్త్వా భూత యోః క్రియాన్త్యస్యేత్. ఆం.శ.చిం.క్రి.17
   భూతఇత్. వై.చం.తి.19

## 46. ఝుస్తిపః [1].

తిపః = తిప్ ప్రత్యయము స్థానమున, ఝుస్ = ఝుస్ అనునది యగును.

వి. లిటస్తిపో ఝుస్ ప్రత్యయ (ఏకాదేశ) స్స్యాత్.
డుజో లోపే చూచెన్.

లిట్టున కాదేశ మయిన ప్రథమపురుషైకవచనము (తిప్) స్థానమున ఝుస్ ప్రత్యయ మగును. ఝుస్ - అనుచో ఝుకారమును, సకారము నిత్తులు కాన లోపించు. ఎత్వము మాత్రమె యగును. ఇది తిప్ వెుత్తమున కగును. చూచి + ఎ = చూచె. ద్రుతప్రకృతికము గాన ద్రుతము చేరి చూచెన్ అని యగును.

ఇట వివృతియందు తిప్పుస్థానమున డుజ్జుచేసి ఆడుజ్జునకు లోప మయినట్లు చెప్పఁబడినది. 'ఝిగ్లిటి' యనుచో లిట్పరకత్వముననే ఝుక్కును విధించుటయు, ఝుస్తిపః అని ఝుస్ తిప్పునకే యాదేశించుటయు ననుసరించి ఇట తిప్పునకు డుజ్జు (బాధింపఁబడి) రా దని చెప్పుట సూత్రానుగుణము. ప్రక్రియలో లాఘవమును తిప్పునకు డుజ్ చేయగా, తిప్పునకుఁ జెప్పిన ఝుస్ ప్రత్యయము దేనికిఁ జేయవలె. డుజ్జు లోపించుట యెట్లు. కావున దీనిప్రక్రియ యిట్లూహింపఁదగును.

చూచి - లిడ్భూతే చూచి + ల్. ఝిగ్లిటి - చూచిల్ లిట్టునకు తిప్పు -చూచి + తిప్. డజ్మ హతి యను సూత్రమును బాధించి 'ఝుస్తిపః' - చూచె - ద్రుతము చూచెన్-

(చూచెరు) చూచిరు ఇతి స్థితే.

చూచి ధాతువునకు లిట్టులో ప్రథమపురుష బహువచనమున 'ఝురుశ్' అను సూత్రముచే ఝువర్ణక మయి, 'ఝిగ్లిటి' - చూచి + రు అని యుండఁగా-

---

1. ఏత్రృ థమైకస్య భూతే. ఆం.కౌ.క్రి.37
ప్రథమై కస్యేర్భ వేచ్ఛ భూతార్థే. అ.ఆ.శ.చిం.క్రి.30
ఎను ఇరి ప్రథమే. త్రి.శ.9. బృహస్పతిసూత్రము.
అరః ప్రథమస్యేహేల్. వై.చం.తి.17.

## 47. కిదుతామ్.[1]

ఉతామ్ = రువునుము ప్రత్యయములందలి యుత్వములకు, కిట్ = 'కిట్' అనునది యగును.

వి. భూతార్థే క్రియాయాః పరేషా ముదంతవర్ణకానాం
కిట్ స్యాత్. కకారస్య ఇత్సంజ్ఞా. చూచిరి. రోరిత్వమ్.

భూతార్థమునందు ధాతువు కంటెఁ బరముగా నున్న రువునుము ప్రత్యయముల యుత్వమునకు 'కిట్' అగును. 'కిట్' అనుదానిలో కకారటకారము లిత్తులు అవి లోపింపఁగా ఇత్వమె యగును.

చూచి + రు అనుచో ఇట్లు రువర్ణమున కిత్వము రాఁగా చూచిరి అని యగును.

చూచ్, ఝిక్ - చూచి.

చూచి ధాతువు నకు లిట్టులో 'ఝిగ్లిటి' అని ఝిక్ రాఁగా చూచి మధ్యమపురుషైక వచనమున సిప్ రాగా - చూచి + సిప్ అని యగును.

## 48. తిమప్రథమే[2].

అప్రథమే = ప్రథమేతరపురుషలందు, తిమ్ = ధాతువునకు 'తిమ్' ప్రత్యయ మగును.

వి. ధాతోః పరస్తిమ్ ప్రత్యయ స్స్యాన్మధ్య మోత్తపురుష
వచనద్వయే లిటి. చూచితి. వుక్ - కిట్, చూచితివి
చూచితిరి. చూచితిని, చూచితిమి ఇతి లిట్.

---

1. ఇద్భూ తాదుతామ్: ఆం.కౌ.క్రి.38
భూతాదుతాదుతాం పరేషామిత్. ఆం.శ.చిం.క్రి.35
తిని తిమి ఉత్తమే, తివి తిరి మధ్యమే. త్రి.శ.బృహస్పతి సూత్రములు
భూతే తిజః వై.చం.తి.20.

2. దుతీ తద్ధర్మ భూతయోః భూతేద్వయోశ్చ ఆం.కౌ.క్రి.34,36
దుతివర్ణకాక్రమాత్ స్తః, ద్వయేశ్చ భూతార్థే. ఆం.శ.చిం.క్రి.31,33
తిర్యా తస్యా ప్రథమే. వై.చం.తి.21

భూతార్థమునందు ప్రథమేతరపురుషలం దనఁగా మధ్యమోత్తమ పురుషలయం దేకవచనమునను బహువచనమునను ధాతువునకు 'తిమ్' అను ప్రత్యయ మగును. 'తిమ్' అనుచో మకార మిత్తు. కావున 'తి' వర్ణమె యగును.

చూచి + సిప్ అనుచో నీ సూత్రముచే ధాతువునకు తివర్ణక మై చూచితి + సిప్ - 'సిబ్మిపోరుబ్నుకౌ' యనుసూత్రముచే సిప్పునకు వుక్. చూచితి వు 'కిడుతామ్' యను సూత్రముచే కిట్. చూచితివి అని యగును.

ఇ ట్లే తరము లూహింపఁదగును.

## 49. ద్విలస్య ఝుష్ద్వి విధః

ద్విలస్య = రెండులఘువులు గలిగిన ధాతువునకు, ఝుస్ = తిప్పున కగు ఝుస్ ప్రత్యయము, ద్వివిధః = రెండువిధములుగా నగును.

వి.ద్విలఘ్వక్షర క్రియాణాం లిట్ప్రథమైకవచనే, ఆగమాదేశాభ్యాం ఝుస్ ద్వివిధా స్యాత్. కనియెన్ - కనెన్, వినియెన్ - వినెన్, పడియెన్ - పడెన్. ఇత్యాది.

రెండులఘువులు గలిగిన ధాతువునకు భూతార్థమునఁ బ్రథమపురుషైకవచనమునందు ఝుస్ ప్రత్యయము ఆగమము గను, ఆదేశముగను రెండువిధములుగ నగును. కన్ - లిట్టు, 'ఝుగ్లిటి' కని - ఝుస్ ఆదేశ మైన కనె - ఆగమ మయిన కని ఎ- ఝుస్ ఆదేశ మైన కని - ఆగమ మయిన కని ఎ - యః ప్రాణస్య యని యకారమై కనియె. ఇ ట్లే తరము లూహ్యములు.

ఇట్లు ద్వివిధముగాఁ జెప్పుటను బట్టి 'ఝుస్తిపః' అనుచో ఝుస్ - తిప్పు స్థానమునఁ గాక, తిప్పరకత్వమున నగు నని వివృతి కర్త చెప్పియుండును. లేనిచో తిప్పున కాగమ మన్నను తెబ్లో ప మెట్లు గుదురును?

తిపః అనుచో షష్ఠికి, సప్తమీ విపరిణామము చేయవలె. అట్లయినను డుబోప మెట్లు?

ఇచట ఝుస్ నకు యడాగమమును వికల్పముగా విధించిన బాగుండె డి దనిపించు.

## అథల్ృట్

ఇఁక ల్ృడంత (భవిష్యదర్థక) క్రియాపదముల ప్రక్రియ నిరూపింపఁబడుచున్నది.

### 50. ల్ృటః (టి) కలట్.

ల్ృటః(టి) = ల్ృడర్థమునందు, కలట్ = కలట్ అను ననుబంధ మగును.

వి. ల్ృడర్థే ధాతోః కలడనుబంధక స్స్యాత్. టకారస్య ఇత్సంజ్ఞా. కన్ గలము ఇతి స్థితే.

ల్ృడర్థమునందు ధాతువునకు 'కలట్' అనునది యనుప్రయుక్త మగును. 'కలట్' అనుచో టకార మిత్తు (టిత్త్వముచే) 'కల' యనునది ల్ృట్టున కాద్యవయవముగాఁ జేరు నని చెప్పఁదగునవి. ల్ృటః అనుచోట షష్టీవిభక్తి నిబట్టి యదిట్లు చెప్ప వలె ననవలెను. కాని వివృతి యందు ధాతువున కనుబంధముగాఁ జెప్పఁబడినది.

'కన్' ధాతువుపై భవిష్యదర్థము నందుల్ృట్ రాఁగా 'కల' యయి కన్ కల ల్-లకారమునకు ప్రథమపురుషైకవ చనమున తిప్పు, దానికి మహతిడుజ్ యని డుజ్ఞను రాఁగా కన్ కలఁడు అని యుండును.

### 51. ల్ృడ్వ్యతిరేకాదౌ ఘల్.[1]

ల్ృడ్వ్యతిరేకాదౌ = ల్ృడర్థము, వ్యతిరేకము మొద లగునర్థములందు ధాతువునకు; ఘల్ = ఘప్రత్యయ మగును.

వి. ల్ృడ్వతిరే కాభావ ప్రతిషేధేషు పరేషు ధాతో ర్ఘల్ ప్రత్యయ స్స్యాత్. ఘకారలకార యో రిత్సంజ్ఞా. ఉ. కన్ - అ -కన - కనఁగలఁడు, కనఁగలరు, కనఁగలవు - కనఁగలరు, కనఁగలను, కనఁగలము. కనఁడు, కనరు కనలేవు. కనలేరు కనని వారము, కనని వాఁడను, కనవె, కనవా కనదు కననిది కననవి ఇత్యాది.

---

1. అద్యావి వ్యతిరేకయోః ఆం.కౌ.క్రి.18
వ్యతి రేకాదౌ భావి చాల్ స్యాత్. ఆం.శ.చిం.క్రి.16

భావి, వ్యతిరేకము, అభావము మొద లగునర్థము లందుఁ దిజాదులు పరముగా నుండఁగా ధాతువునకు ఘల్ అను ప్రత్యయ మగును. 'ఘల్' అనుచో ఘకార లకారము లిత్తులు కావున 'అ' కారమె యగును.

కన్ + కలఁడు అను పూర్వ స్థలమున నీ సూత్రముచే ధాతువున కత్వ మయి కన కలఁడు అని యగును. నడుమ ద్రుత మగుట యిటఁ జెప్పఁబడలేదు కాని కనగలఁడి త్యాదిగా నుదాహరింపఁబడినవి.

కనఁడు, కనరు అనుచో నభావ మనియు కనలేవు కనలేర నుచో (కనఁగలను – కనలేను) వ్యతిరేకార్థ మనియు విప్రతికర్త యుద్దేశించె నేమో. కాని వీని నితరలాక్షణికులు మార్గాంతరమున గుర్తించిరి.

కనఁడ నురీతివె వ్యతిరేకార్థక క్రియాపదములు. వై.చం.వ్యతిరేకేఽ స్తి వ్యతిరేకః. వై.చం.తి.34 అని యిట్టి వానిని బేర్కొన్నది. కనని వారు, కననిది – యనుచో ప్రతిషేధార్థము.నణ్ణిటౌ లిఙ్ప్రతిషేధయోః.

కలను లృట్టున కను బంధము చేయఁగా 'కన్' అనునదే ధాతు వగును. కావున దానికె యత్వ మయినది. ఇట్లు కల(ట్) టిత్త్వమునుబట్టి యది లృట్టున కాద్యవయవముగాఁ జేర్చుట సూత్రకృన్మత మనిపించును.

## 52. ఉ దితః [1].

భవిష్యదాద్యర్థములందు, ఇతః = ఇకారమునకు, ఉత్ = ఉత్వమగును.

వి. లృడ్వ్యతిరేక తిర్యగ్జడార్థక క్రియాపదైక
వచన బహువచనయోర్ది వ్యో రికారస్య ఉకార స్స్యాత్.
గజము రాఁగలదు, గజములు రాఁగలవు.
గుఱ్ఱము రాదు, గుఱ్ఱములు రావు.
రథము లేదు, రథములు లేవు ఇత్యాది.

---

1. అనుహరితిదుః త్రి.శ.9.25 బృహస్పతి సూత్రము.
లృడ్వ్యతిరేకయోరుః. ఆం.కౌ.క్రి.27
దుష్యర్థేలృడ్వ్యతిరేకయోః ఆం.కౌ.క్రి.22 ఇత్యాది.

భవిష్యదర్థమునను వ్యతిరేకార్థమునను, అమహదర్థమునందు ప్రథమ పురుషైకవచనమైన దివర్ణకమునను, ప్రథమ పురుష బహువచన మగు వివర్ణకమునను నున్న యిత్వమున కుత్వ మగును. గజము రాగలది. అనుచో 'దిరమహతి' అను సూత్రము చే నయిన ది వర్ణకము నందలి యిత్తున కుత్వ మయి గజము రాఁగలదు అని యగును.

రథములు లేవి యనుచో 'ఘ్నుర్వ్యోః' అను సూత్రముచే నయిన 'వి'ప్రత్యయము నందలి యిత్వమున కీ సూత్రముచే నుత్వ మయి 'లేవు' అని యగును. గజము రాఁగలదు, గజములు రాఁగలవు. అనుచో (గజము) పశువాచకము. రథము లేదు, రథములు లేవు అనుచో (రథము) జడము.

స్త్ర్యర్థమున బహుత్వమున వి వర్ణకము లేదు కావున నిట నుత్వ ప్రసక్తి లేదు. కాని యేకవచనమున ది వర్ణకము గలదు. దానికి భవిష్యదాద్యర్థము లం దుత్వమగును.

రమ రక్షింపఁగలదు, శిక్షింపదు మొ॥

డుమురువు లలో నిత్వమె లేదు గావున నట్టివాని కిటఁ బ్రసక్తియే లేదు.

## అథలేట్

ఇఁక లేడంతములు (తద్ధర్మాద్యర్థములు) నిరూపింపఁ బడుచున్నవి.

చూచ్ ఇతి స్థితే-

చూచి ధాతువు - చూచ్ అని యుండఁగా

## 53.శుడ్లేటి.[1].

లేటి = 'లేట్' పర మగుచుండఁగా' ధాతువునకు, శుట్ = 'శుట్' అగును.

వి. లేడర్థే ధాతో శ్శుట్ప్రత్యయ స్స్యాత్, శకార టకార యో రిత్సంజ్ఞా చూచు ఇతి స్థితే-

లే డర్థమునం దనఁగా లేట్ పర మగుచుండఁగా ధాతువునకు శుట్ ప్రత్యయ మగును. 'శుట్'లో శకారమును, టకారము నిద్వర్ణములు గాన నవి లోపించును. చూచ్ + ఉ - చూచు-ల్-అని యుండఁగా-

---

1. లేటిశుః. త్రి.శ.9.28. బృహస్పతి సూత్రము.

## 54. దుట్శుటః.[1]

శుటః = శుట్ ప్రత్యయమునకు, దుట్ = దుడాగమ మగును.

వి. శుటో దుడాగమ స్స్యాత్. టకారస్య ఇత్సంజ్ఞా.

చూచుదు ఇతి స్థితే. (అనన్త రం డు జి ప్రాప్తే చూచుదుడు)

ఇతి స్థితే -

శుడ్లేటి యను సూత్రముచే లేట్ పర మగు చుండఁగా ధాతువునకు శుప్రత్యయము వచ్చును. ఆ శుట్టున కీ సూత్రముచే దుడాగమ మగును. దుట్టులో టకార మిత్తు (శుట్టు ప్రత్యయ మనుటకు, దుట్టు ఆగమ మనుటకు వివృతి వచనములు తప్ప వేఱొక యాధారము లేదు). 'దు' (ట్) టి త్తగుట నాద్యవయవము చేసిన చూచ్దు - అని యగును. అది యనిష్టము. శుప్రత్యయమునకుఁ బరముగనె దుట్టు చేయవలె నిదియుఁ బ్రత్యయ మనక యాగమ మని వివృతి పేర్కొన్నదో స్పష్టముగాదు. చూచుదు + ల్ అని కాఁగా లేట్లకారమునకుఁ ప్రథమపురుషైకవచనమున 'తిప్' వచ్చి చూచుదు + తిప్ - అని యగును.

## 55. దో ర్లుక్తిపి.[2]

తిపి = తిప్రత్యయము పర మగుచుచుండఁగా, దోః = దువర్ణమునకు, లుక్ = లోపమగును.

వి. తిపి పరే దోర్లుక్ స్యాత్. చూచు డు ఇతి స్థితే.-

'తిప్' పర మగుచుండఁగా దానికిఁ బూర్వమునం దున్న దువర్ణమునకు లోప మగును.

చూచుదు + తిప్ అనుచో నిట్లు దువర్ణము లోపింపఁగా చూచు + తిప్ అని యగును.

'తిప్' ప్రథమ పురుషైకవచనము 'తిపి' యని చెప్పుటచేఁ బ్రథమపురుషైకవచనేతరములు పర మగునపుడు దువర్ణమునకు లోపము రాదు. చూచుదురు, చూచుదును, మొ॥ రీతిగ దువర్ణ ముండును.

---

1. దుదీ తద్ధర్మ భూత యోః అం.కౌ.క్రి. 34
   దతివర్ణ కౌ క్రమాత్ స్తరి అం.శ.చిం.క్రి.311
   తద్ధర్మన్య దు. వై.చం.తి.24.
2. నాద్యస్యాదేః. అం.కా.క్రి.34
   నాద్యస్యాదేః.అం.శ.చిం.క్రి.32

## 56. తిపో లు క్ష్వుటః [1].

షుటః = షుట్ప్రత్యయమునకుఁ బరమయియున్న, తిపః = తిప్ ప్రత్యయమునకు, లుక్ = లోప మగును.

### వి. షుట్ప్రత్యయాత్పరస్య తిపో లుక్ స్యాత్. ఇత్యనేన తిపో లోపే చూచు -

షుట్ప్రత్యాయము కంటెఁ బరముగా నున్నప్రథమ పురుషైకవచనము(తిప్) నకు లోప మగును. ఇట్లు చూచు + తిప్ అనుచో తిప్పు లోపింపఁగా చూచు అని యుండును. ఇది ద్రుతప్రకృతికము గావున ద్రుతముతో చూచున్ అని యుండును.

ఇట విపృతి యందు తిప్పునకు డుబ్జు చేసి ఆ డుబ్జు పర మైనపుడే 'దోర్లుక్తిపి' యను సూత్రముచే దులోపము చేయుటయు తిపోలు క్ష్వను నీ సూత్రమునొద్ద తిప్పు లోపించిన దనుచు డుబ్జును లోపింపఁజేయుటయుఁ గన్పించును. అట్లు చేయుటలోఁ బ్రక్రియాగౌరవము తప్పఁ బ్రయోజనము లేదు.డుబ్జు చేయక తిప్పునకే లోపము చేయఁదగును.

### వి. చూచుదురు ఇతి స్థితే-

'దోర్లుక్తిపి' యనులక్షణము ననుసరించి ప్రథమపురుషైకవచనమునందు మాత్రమె దువర్ణము లోపించును. కాఁగాఁ బ్రథమపురుష బహువచనాదులలో దువర్ణమునకు లోపము లేదు. కావున ప్రథమ బహువచనమున

చూచుదు + ఝ అని యుండఁగా-

## 57. చ్దో స్తహల్ ఝ్యాదౌ.[2]

ఝ్యాదౌ = ఝ మొదలగు క్రియావిభక్తులు పరమగుచుండఁగా, చ్దోః = చకార దకారములకు, తహల్ = హల్లయిన తకార మాదేశ మగును.

---

1. తద్ధర్మాతీతయో రాద్యేకలోపః. ఆం.కౌ.క్రి.20
   ప్రథమైక వచనలోప స్తద్ధర్మాతీతయోః క్రియాణాంస్యాత్.
   ఆం.శ.చిం.క్రి.18
   భూత తద్ధర్మ యో ర్లుక్. వై.చం.తి.22
   దుఙశ్చ భూత తద్ధర్మ యోః. వై.చం.తి.18
2. దౌ చౌర్లుక్ తద్ధర్మే, ఆం.కౌ.క్రి.33; ఆం.శ.చిం.క్రి.29
   బిందు పరస్యచదో స్తః. ఆం.కౌ.క్రి.36
   బిందు పరస్యతకారో దోస్స్యాత్, ఆం.శ.చిం.క్రి.34
   దోశ్చనాతుస్తద్ధర్మే. వై.చం.తి.25.

వి. చాన్త క్రియాన్తస్య చకారస్య దువర్ణక ద కారస్య చ
హల్ తకార ఏకాదేశ స్స్యా ఝ్యాదౌ పరే - ఇత్యనేన
చూత్ + ఉ ఇతి స్థితే, అజ్ఝలో స్సంయోగే అచోర్నిత్య
సన్ధిః- చూతు అనంతరం, రుక్, చూతురు. స్థానివదా
దేశః - చూతువు - చూతురు, చూతును - చూతుము ఇత్యాది.

ఝి మొదలగు క్రియావిభక్తులు పర మగునపుడు చకారాంత మగు ధాతువు చివరి చకారమునకును దువర్ణకమునందలి దకారమునకును తకార మేకాదేశ మగును.

దువర్ణమున దకారపు పొల్లునకె యాదేశము కావున దాని పయి నుత్వము మిగిలియుండును. చూచుదు 'చూద్' అను భాగమునకు తకారపుపొల్లు రాఁగా చూత్ + ఉ - అని యగును. తకారపుఁబొల్లు పై నున్న యుత్వముతోఁ గూడి చూతు అని యగును. పై నున్న ఝిప్రత్యయమునకు ఝేరుక్ అను సూత్రముచే రు వర్ణకము వచ్చి చూతురు అని యగును.

'స్థానివదాదేశః' అనుదాని ప్రసక్తి యవసరముగాఁ గానరాదు. ఆదేశ మయిన రు వర్ణకము స్థాని యగు ఝి ప్రత్యయమువంటి దగు నని యుద్దేశము గాఁబోలును - ఇట్లె యితర వచనాదులు గ్రాహ్యములు.

'చ్దోః' అని కాక 'చుదోః' అని చెప్పఁబడియున్న స్పష్టముగా నుండెడిది. చూచ్ అనురీతిగా నిది పొల్లు చివరఁగలిగి నదే యయ్యును 'టుడ్లేటి' యను టుప్రత్యయము రాకతప్పదు. 'దుటుమ్మటః' అని టుట్టునకే గదా దుడాగమ మవునది. కాఁగా 'చ్దోః' అన్న సామర్థ్యము చేతనె నడిమి యుత్వమును బోవు నని గ్రహింపఁదగును.

## 58. లిడ్లేటో రేకవచనమ్ [1].

**లిడ్లేటోః** = లిట్టునను, లేట్టునను, ఏకవచనమ్ = బహువచనమున కేకవచన మగును.

వి.తిర్యగ్జడేషు కర్తృషు భూత తద్ధర్మయో ర్బహువచ
నస్య ఏకవచన స్స్యాత్.[2] గుఱ్ఱములు వచ్చెవ్, గజము లేతెం
చెన్. గోపురము లమరెన్, గోవు లావిర్భవించెవ్ ఇత్యాది.

---

1,2. కర్తృషు తిర్యగ్జడేషు భూతతద్ధర్మ యో ర్బహు
రే కత్వమి తివాచ్యమ్. ఆం.కౌ.క్రి.25,
తిర్యగ్జడేషు కర్తృషు బహువచనం త్వేకవచనమేవ స్యాత్
భూతేతద్ధర్మేచ. ఆం.శ.చిం.క్రి.22

తిర్యగ్జడములు కర్తలయినపుడు భూతార్థము నందును, తద్ధర్మార్థము నందును ప్రథమ పురుషలో బహువచనమున కేకవచన మగును.

గుఱ్ఱములు వచ్చెన్, గుఱ్ఱములు అని (తిర్యక్కు) కర్త బహుత్వమునం దుండుటచే వచ్చి ధ్మాతువుపైఁ బ్రథమపురుషయందు బహువచనము రాఁగా (భూతార్థమున) దాని కేకవచనమై 'వచ్చెన్' అని యైనది. ఇట్లె తద్ధర్మార్థమున గుఱ్ఱములు వచ్చున్ అని ఏకవచన మగును.

ఈ నియమము తిర్యగ్జడ కర్తృకతయందే కావున మహదర్థము నందు బహువచన మట్ల యుండును. రాములు వచ్చిరి. స్త్రీలు మెచ్చిరి. రాములు వత్తుర్, స్త్రీలు మెత్తురు.

లిడ్లేట్టులయందే కావున తిర్యగ్జడ కర్తృత్వము నితరస్థలముల బహువచన మట్ల యుండును. చిలుకలు కూయు చున్నవి.

లిడ్లేట్టులందును, ప్రథమపురుషయందే కావున మధ్య మోత్తమ పురుషలయం దేకవచనము రాదు.

## 59. లోటో లేడ్వత్.

లోటః = లోట్టునకు, లేడ్వత్ = లేట్టు నందువలె నె క్రియా రూపము లుండును.

### వి. లోటో లేట ఇవ స్యాత్. అనేన లోటశ్శుృణ్వత్యా యాదయః.

లోట్టునను 'లేట్' లకారమునవలె నాయాకార్యము లగును. ఇట్లనుటవలన, 'శుడ్లేటి' మొదలుగా లేట్టునఁ జెప్పఁబడిన శుట్ మొద లగునవి లోట్టులోను నగును.

## 60. తిఙస్తత్తదాగమా వానా.

తిఙః = లోట్టున కాదేశ మయిన తిఙ్ఙులకు, వా = వికల్పముగా, తత్తదాగమాః = ఆయాయాగమము లగును.

### వి. లోటి తిఙః పరత ఆశీరాద్యర్థేషు తత్తదాగ మా వా స్యుః.

లోట్టున కాదేశ మయిన క్రియా విభక్తులకు ఆశీస్సు మొద లగు నాయాయర్థములందు నాయావర్ణతము లాగమము లగును.

## 61.లోడా శీః ప్రసభ విధ్యాదిషు [1].

ఆశీః-ప్రసభ విధ్యాదిషు = ఆశీస్సు, శాపము, విధి-మొదలగు నర్థములందు, లోట్ = లో ట్టగును.

వి.ఏష్వ ర్థేషు లోట్ స్యాత్.

ఆశీస్సు, ప్రసభము, విధి మొదలగు నర్థములందు 'లోట్' ధాతువున కగును.

ఇతః పూర్వము లోడాశీరాదేః అని యాశీరాదులందు లోట్ విధింపఁబడియున్నది. మఱల నిట నదియె వివరణముగాఁ జెప్పఁబడినది కాఁగా నట నా సూత్రము వలనఁ బ్రయోజనము మృగ్య మనవచ్చును.

## 62.ఆశిష్యుత కాత కావుతాః [2].

ఆశిషి = ఆశీరర్థమునందు, ఉత కాత కావుతాః = ఉత, కాత, కావుత అనునవి యగును.

వి. ఆశీరర్థే ఉత- కాత - కావుత ఏతే ప్రత్యయా స్స్యుః.

ఆశీరర్థమునందు, ఉత, కాత, కావుత యనుప్రత్యయము లగును.

చూచ్ + ఉత - చూచుత.

చూచుఁగాత, చూచుఁగావుత మొ॥

ఇందు కాత, కావుత అనునవి అగుధాతువుయొక్క యాశీరర్థక రూపములుగా లాక్షణికులు సాధించి యున్నారు.

ఉదాహరణములు తరువాతి సూత్రము నొద్ద చూపఁబడినవి.

---

1. ఆశీః ప్రసభ విధ్యాదిషు లోడిన్యత ఇతిక్రమః. త్రి.శ.9.
2. లోటి కాతకావు తోతాశ్చ త్రి.శ.9.41. బృహస్పతి సూత్రము.
   దుజ్మకారాకావుతాద్యా ఆశీరర్థేతు సమ్మతాః .
   అం.కౌ.అ.66.
   దుముకావుతావాశిషి వై.చం.అవ్య.9.

## 63. ప్రసభే కాక కానీ.[1]

ప్రసభే = ప్రసభార్థమునందు, కాక కానీ = కాక, మఱియు, కాని అనునవి యగును.

వి. ప్రసభార్థే కాక కాని ఏతౌ ప్రత్యయౌ స్తః.
చూచుత, చూచుఁగాత, చూతురు గావుత,
చూతురుగాత, చూతురుత, చూచుఁగావుత ఇత్యాది.
చూచుఁగాక, చూచుగాని, చూతురుగాక, చూతురుగాని ఇత్యాది.

ప్రసభ మనఁగా బలాత్కారము. ప్రసభార్థము నందు, కాక, కాని యనుప్రత్యయము లగును. ఇవి యవ్యయములుగాఁ బ్రసిద్ధములు, ఉత మొదలగు వాని నెల్లవానికి నిట వివృతియందు దాహృతులు గానవచ్చు. చూచుఁగాత, చూచున్ అను లేట్టున ప్రథమపురుషైకవచనాంత రూపముపై కాత యయినది.

చూతురు గావుత యను ప్రథమ లేక మధ్యమపురుష బహువచనాంతముపై కావుత అయినది.

'కాని' యనునది యీయర్థమున నెంతవఱకు సరిపడునో ప్రయోగములఁ బరిశీలింపవలయును.

'కాక' యన్నదియు నాశీరర్థకమునఁ గలదు. పంతమును దెల్పుట ప్రసభముగా నిట నుద్దేశింపఁబడియుండు.

## 64. జీని ర్విధావతిజి.[2]

విధౌ = విధ్యర్థమునందు, అతిజి = తిఙ్ప్రత్యయరహిత మైన ధాతువునకు, జీనిచ్ అనునది యగును.

వి. విధ్యర్థే ధాతోః పరతో జీనిచ్ ప్రత్యయస్స్యా దతిజి
మహదమహతోః ప్రథమ పురుషై కవచనే.
రాముఁడు చూచీని, అతఁడు పూజ చేసీని.
తలఁచిన పని అయ్యీని ఇత్యాది.

1. కాక కాని త్రి.శ.9.42. బృహస్పతిసూత్రము.
2. ఎదరీని ముడుజాద్యాః? త్రి.శ.బృహస్పతిసూత్రము 9.43.

తి(జ్)ప్రత్యయములు లేకుండ (అనఁగా లోపించు నని యర్థము చేయఁదగును) ధాతువునకు విధ్యర్థమునందు 'జీనిచ్' అనుప్రత్యయ మగును. జీనిచ్ అనుదానిలో జకారమును, చకారము నిత్తులు కావున 'ఈని' అని మాత్రమె నిలుచును. ఇది ప్రథమపురుషైకవచనార్థముననే యగు నని వివృతియందు స్పష్టము చేయఁబడినది.

చూచ్ధాతువుపై నీ సూత్రముచే 'ఈని' చేరి చూచీని అని యగును. కాని 'రాముఁడు చూచీని' తలఁచిన పని అయ్యీని అనురీతి నున్న యిచట విధ్యర్థము కంటె నాశీరర్థమె సముచితముగా నుండునేమో యని తోఁచును.

ఇట్టి కవి ప్రయోగము లాధునికము లై లేకపోలేదు. వీనిని ప్రామాణికులు పెక్కురు గ్రామ్యములుగనె తలఁతురు.

## 65.తిజి ఝెదర్.

తిజే = విధ్యర్థమునందుఁ దిజ్విభక్తులు పర మగుచుండఁగా ధాతువునకు, ఝెదర్ = ఝెదర్ అనుప్రత్యయము వచ్చును.

వి. విధ్యర్థేధాతోః ఝెదర్ ప్రత్యయ స్స్యాత్తిజి పరే.
ఝకారరేఫయో రిత్సంజ్ఞా. వారు చూచెదరు,
నేను చూచెదను, మేము చూచెదము, నీవు చూచెదవు,
మీరు చూచెదరు ఇత్యాది.

విధ్యర్థమునందు దిజ్విభక్తులు పర మగుచుండఁగా ధాతువునకు ఝెదర్ ప్రత్యయ మగును. 'జీనిజ్విధావతిజే' యనుచోఁ బ్రథమపుష్షైక వచనమునందు 'జీనిచ్' ప్రత్యయము విధింపఁబడియున్నది. కావున నిచ్చటఁ జెప్పిన ఝెదర్ ప్రత్యయము ప్రథమ పురుషబహువచనాదులం దగును. 'తిజే' యనక ఝ్యాదౌ యనియో ఝిజే యనియో చెప్పిన బాగుండెడి దని పించును. ఝెదర్ ప్రత్యయములో ఝకారమును రేఫము నిద్వర్ణములు కావున నవి లోపింపఁగా 'ఎద' అనునది యగును.

చూచ్ ధాతువుపైఁ విధ్యర్థమునలోట్టు, ప్రథమపురుషబహువచనమున ఝి, చూచ్ + ఝి ప్రస్తుతసూత్రముచే ఝెదర్ ప్రత్యయము చూచెద- 'ఝి'కి 'ఝేరుశ్' అని రువర్ణము చూచెదరు.

---

1. ఎదరీని ముదుజాద్యాశ్ త్రి.శ.బృహస్పతిసూత్రము 9.43
అర్థవిశేషేదుః. వై.చం.తి.27.

ఇట్లితరస్థము లూహింపఁదగును.

తద్ధర్మాద్యర్థములుగా సూరి సాధించిన యిట్టి రూపము లిట విధ్యర్థకములుగాఁ జెప్పఁబడినవి. విధ్యర్థమున నీట్టి ప్రయోగము వెదుకవలె.

## 66. ముగుజౌ సంప్రార్థ నార్థే [1].

సంప్రార్థనార్థే = సంప్రార్థనార్థమునందు, ముగుజౌ = ముక్ మఱియు డుజ్ అనునది యగును.

వి. సంప్రార్థనార్థే క్రియాపదేషు సిప్థయో ర్ముక్ప్రత్య యడుజ్ప్రత్యయౌ క్రమాత్ స్తః. చూడుము, కనుము, చేయుము, చూడుఁడు, కనుఁడు, చేయుఁడు ఇత్యాది.

సంప్రార్థనార్థమునందు మధ్యమపురుషైకవచన మగు 'సిప్' స్థానమున ముక్ వర్ణముకమును, మధ్యమపురుష బహువచన మగు 'థ' స్థానమున డుజ్ప్రత్యయము నగును. సంప్రార్థనము మధ్యమపురుషార్థమునందే సంభవముగావున ముడుజ్లు మధ్యమపురుషైక బహువచనముల కగు నని గ్రహింప వలయును.

చూడుము, చూడుఁడు మొ॥.

## 67. వాజీప్. [2].

ఆ ముడుజ్ప్రత్యయములకు వా = వికల్పముగా, జీప్ = జీప్రత్యయ మగును.

వి.సంప్రార్థనార్థక క్రియా పదేభ్యః పరతో వికల్పేన జీప్రత్యయ స్స్యాత్. జకారపకారయో రిత్సంజ్ఞా. చూడుమీ, కనుమీ, చూడుఁడీ, కనుఁడీ, చేయుమీ చేయుఁడీ ఇత్యాది.

1. ఎదరీనిముడుజాద్యాః త్రి.శ.9.43. బృహస్పతి సూత్రము.
   ముడు జౌ ప్రార్థనార్థకేషు ఆం.కౌ.క్రి.32
   ఏకత్వేఽథ బహుత్వేముడుజౌ సంప్రార్థ నార్థకేష్వస్తః
   ఆం.శ.చిం.క్రి.29
   ముడుజౌ ప్రార్థనాయామ్ వై.చం.తి.31
2. ప్రార్థనార్థ కాదీప్. ఆం.కౌ.క్రి.45
   సంప్రార్థనార్థకాదీప్. ఆం.శ.చిం.క్రి.43
   సంప్రార్థనాదాచ. వై.చం.అవ్య.6

సంప్రార్థనార్థకము లయిన క్రియాపదములకుఁ బరముగా, వికల్పముగా 'జీప్' అనుప్రత్యయ మగును. 'జీప్'లో జకారమును, పకారము నిద్వర్ణములు. కావున నవి లోపింపఁగా 'ఈః' అనునది యగును.

చూడుము + ఈః = చూడమీ, కనుఁడు + ఈః = కనుఁడీ మొ॥

## 68. (ఏదాతౌ) సంప్రశ్నార్థే [2].

సంప్రశ్నార్థే = ప్రశ్నార్థమునందు (ఏదాతౌ= ఏత్వమును ఆత్వము నగును)

వి. మహదమహతోర్లడాదిలకార పంచకాభావ వ్యతిరే
కాది ప్రథమాది పురుషవచన ద్వయాన్తానా మా కారైకా
రౌ స్తః. చూచుచున్నాఁడా, చూచుచున్నారే,
చూచెనే, చూచిరా, చూడఁగలరా, చూడఁగలవే, చూచునే,
చూతురే, చూచెదరా, చూచీనా,
చూడరే, చూడదే, చూడవా, చూడవే ఇత్యాది.

మహత్క్రియలకు నమహత్క్రియలకును, లట్, లిట్, ల్రుట్, లేట్, లోట్ - అంతమునఁ గలవానికి వ్యతిరేకార్యర్థకములకు ప్రథమామధ్యమోత్తమ పురుషల నేకవచనాంతములకు, బహువచనాంతములకును - అనఁగాఁ గ్రియాపదముల కన్నింటికిని, సంప్రశ్నార్థమునందు, ఆ, ఏ, యనునవి చేరును.

చూచుచున్నాఁడు + ఆ = చూచుచున్నాఁడా, చూడరు + ఏ = చూడరే

ఇవి సుబంతములపైఁ గూడ గలవు. వాఁడా? వాఁడే, ఎవరు? రాముఁడా మొ॥.

సంప్రార్థనమందే కాక యితరము లగు నర్థవిశేషములందును, తిఙంతములపయినే గాక సుబంతములపయిఁ గూడఁ గన్పించు నిట్టివాని నిటఁ బ్రస్తావించుటలోఁ బ్రయోజన మల్పము.

చూడరే, మున్నగు నవి ప్రార్థనార్థకములగుట గమనింపఁదగును. పై సూత్ర మిట్టివానిని బ్రస్తావింపమను. చూడరే - మీరు చూడలేదా యనురీతి స్థలములె యిట నుద్దిష్టము లని గుర్తింపఁదగును.

---

2. ఏదాతౌ ప్రశ్నార్థే ఆం.కౌ.క్రి.46.
ఏదాతౌ ప్రశ్నలక్షణౌ భవతః. ఆం.శ.చిం.క్రి.44
ఏచధూతాల్. వై.చం.ఖ్య.7.

## 69. వ్యతిరేకాజ్జే దోసౌ .

వ్యతిరేకాత్ = వ్యతిరేకార్థక మగు క్రియాపదముపై, జేదోసౌ - జేత్, ఓస్ అనునవి యగును.

వి. క్రియాణాం వ్యతిరే కార్థాదపి సంప్రార్థనపరౌ జేదోసౌ ప్రత్యయౌ స్తః, చూడవే, చూడవో, రక్షింపవే, రక్షింప వో, ఇత్తువే, ఇత్తువో ఇత్యాది.

వ్యతిరేకార్థకము అగు క్రియాపదములపైని జేత్, ఓస్, అనుప్రత్యయములు చేరును. అపు డవి ప్రార్థనార్థకము లగును. అనగా జేత్ ఓస్ ప్రత్యయములు వ్యతిరేక క్రియలపైఁ బ్రార్థనార్థమునందు వచ్చు న నవచ్చును.జేత్, అనుచో జకార తకారము లిత్తులు 'ఏ' అగును. ఓస్ అనుచో సకార మిత్తు ఓ యనునది యగును. చూడవు. వ్యతిరేకార్థక క్రియ. దీనిపైఁ బ్రార్థనమున 'ఏ' - చూడవు + ఏ - చూడవే - ఇపు డిది 'చూడుమీ' యనువిధముగా. ప్రార్థనార్థక మగును. ఇట్లె చూడవో మొ॥

వి. విధ్యాదిః విధినిమంత్రణా మంత్ర ణాధీష్టాః.

లోడాశీః ప్రసభవిధ్యాదిషు '(61) అనుసూత్రమునందలి 'విధ్యాది' యనుచోటి యాదిశబ్దముచే గ్రహింపఁబడునర్థము లిట వివరింపఁబడినవి. అవి విధి, నిమంత్రణము, ఆమంత్రణము, అధీష్టము. వానిని వివరించుచున్నాఁడు

వి. [1].విధిః ప్రేరణమ్ - భృత్యాదేర్ని కృష్టస్య ప్రవర్త నమ్.

విధి యనఁగాఁ బ్రేరణము. అనఁగాఁ గార్యోన్ముఖముగాఁ జేయుట. అధికారి తన సేవకునిఁ 'ఈ వస్త్రముల నుదుకుము' అనురీతిగా నాయా పనులందుఁ బ్రవర్తింపఁజేయుట విధి. పెద్దలు పిన్నల నాజ్ఞాపించుట యని స్థూలముగా గ్రహింప వచ్చును.

వి. [2] నిమన్త్రణమ్ నియోగకరణమ్. ఆవశ్యకే శ్రాద్ధాది భోజనాదౌ దౌహిత్రాదేః ప్రవర్తనమ్.

నిమంత్రణ మనఁగా నియోగించుట. ఆవశ్యక మైన శ్రాద్ధ భోజనము మొదలగు వానిలో

---

1,2,. సి.కౌ. 3.3.161 సూత్రవృత్తి.

దౌహిత్రుఁడు మున్నగువారిని 'బాబూ! నీ విట భుజించునది' యను మొదలగు తీరుగా నియోగించుట నిమన్త్రణము.

వి. ఆ మన్త్రణమ్ కామచారానుజ్ఞా.

'ఇష్టానుగుణముగాఁ జేయున' దని చెప్పుట యామన్త్రణము.

వి. [1] అధీష్ట స్సత్కార పూర్వకో వ్యాపారః.

గౌరవ పూర్వకముగాఁ బ్రవర్తింపఁజేయుట యధీష్టము. ఉ. ఆర్యా యీ బాలుని జదివించునది. మొ॥

## 70. ముకోలుక్చ (శుటః) .

(శుటః = శుప్రత్యయము కంటెఁ బర మై యున్న), ముకః = ముప్రత్యయమునకు, లుక్ చ = లోపము గూడ వచ్చును.

వి. శుటః పరస్య సంప్రార్థనముగ్వర్ణ కస్య వా లుక్ స్యాత్.
చకారో వికల్పార్థః. చూడు, చేయు, కను,
విను, కట్టు కొట్టు ఇత్యాది.

శుప్రత్యయము కంటెఁ బరమై యున్న సంప్రార్థనమునందలి ముమ్వర్ణకమునకు లోపము నగును. సూత్రమునందలి చశబ్దము వికల్పార్థకము. కావున 'ము'లోపము వికల్పముగా నగును.

వినుము అనుచో- మువర్ణకము లోపింపఁగా విను. వికల్పము గావున లోపము రానిచో వినుము అని మువర్ణక మట్ల యుండును. ముకః అనుటచే డుజ్లోపము లేదు. వినుఁడు అనునర్థమున విను అనురూప ముండదు.

అచ్చు పరమగునట్టిసందర్భములో మువర్ణకము లోపించు నట్టి స్థితి లే దని పెక్కురు లాక్షణికుల మతము. 140. సూత్రవివృతులు దీనికి సన్నిహిత ములు.

వి. అయం ప్రయోగః కేషాంచిత్పక్షః సోఽప్యసాధు
రపిసాధురేవ.

ప్రార్థనార్థక మగులోపించుట యన్నదికొందఱి మతమె. కావున మువర్ణకము లోపింపఁజేసిన ప్రయోగము సాధువు గాకున్నను సాధువే యగును.

1. పి.కౌ. 3.3.161. సూత్రవృత్తి.

ఈ వివరణ మనవసరము 'ముకోలుక్చ' యని ముగ్లోపము విధింపఁబడు చుండఁగా నట్టి ప్రయోగము అసాధు వగుట యెట్లు? అసాధువె యైనను సాధువె యనుట యెట్లు?

## 71. కుచశ్చ[1]

కుచః చ = వ్యతిరేకార్థమునం దగు 'కుచ్' అనుదానికంటెఁ బరముగాఁ గూడ ముగ్డుజ్లులగును.

వి. కుచః పరతః క్రమాదభావప్రార్థనార్థే ముక్ ప్రత్యయ డుఙ్ప్రత్యయౌ స్తః- చేయకుము, చేయకుఁడు, వినకుము, వినకుఁడు, చూడకుము, చూడకుఁడు ఇత్యాది.

కు(చ్) వర్ణముకంటెఁ బరముగా అభావ (వ్యతిరేక) ప్రార్థనార్థమునందును, సిప్, థలకు ననఁగా మధ్యముపురుషయం దేకవచనము నను, బహువచనము నను గ్రమముగా ముక్, డుఙ్ ప్రత్యయములు వచ్చునని 'ముగ్డుఙౌ సంప్రార్థనార్థే (66)అని ప్రార్థనమునఁ జెప్పిన ముగ్డుజ్లులు వ్యతిరేక ప్రార్థనమునను కు వర్ణమునకుఁ బరముగ నగును.

విన్ ధాతువుపై వ్యతిరేకప్రార్థనార్థవివక్షలో ల్వద్వ్యతిరేకాదౌఫల్ (50) అను సూత్రముచే ఫల్ ప్రత్యయ మయి విన- అని కాఁగా కుచ్ వర్ణకమయి వినకు అని కాఁగా మధ్యమపురుషైకవచనము సిప్పును దానికి సూత్రముచే ముగ్వర్ణకము నయి వినకుము. ఇట్లే బహువచనమున 'థ'కు డు జ్జయి వినకుఁడు. 'డు'(ఙ్) జిత్తు గావున 'జిదనుస్వారశ్చ' యను సూత్రముచే డువర్ణమునకు ముందు బిందు వయినది.

ఇట వ్యతిరేక ప్రార్థనమున ముడుజ్విధానముకంటె ధాతువునకు కువర్ణకము చెప్పిన బాగుండెడి దని తోఁచు.

వి. ముకోలుక్చేతి సూత్రమే తస్యాపీతి జ్ఞాతవ్యమ్.
చేయకు, వినకు, కనకు, చూడకు ఇత్యాది.

ముకోలుక్చ యను పూర్వసూత్రము ప్రస్తుతసూత్రముచే వ్యతిరేకప్రార్థనార్థమునఁ జెప్పిన ముగ్వర్ణకము నెడలను వర్తించును. కావున 'ముకోలుక్చ' యను సూత్రముచే వ్యతిరేకమధ్యమ ముపర్ణకమునకును లోపము వికల్పముగా నగును. ముపర్ణము లోపించినచో వినకు – లోపింపని పక్షమున వినకుము. ఈ లోపము సామాన్యము. నమ్మకీట.

---

1. కుః ప్రార్థనాయామ్. వై.చం.తి.32
వ్యతిరేక ప్రార్థనార్థే కుస్స్యాన్మువుపరస్తుతః అ.కా.క్రి.9

ఇచటను ముక్కుకే లోపము. డుజ్జు లోపింపదు కావున వినకుఁడు అను నర్థమున వినకు అనురూప ముండదు.

## 72. నవిభక్తౌ కచట డశలాదయః.

విభక్తౌ = విభక్తి యందలి, కచటడశలాదయః = కచటడశ.ల, మొదలగునవి,. న=(ఇత్సంజ్ఞములు) కావు.

వి. విభక్తిస్థాః కచట డశలాదయ ఇతో న స్యుః.

విభక్త్యంయందలి కచటడశలకారాదులు ఇద్వర్ణములు గా వని యర్థము. 'రుశ్' ముశ్, అనుచో శకార మిత్తు నుక్,వుక్, అనుచో కకారము లిత్తులు. ఇత్తులు గా వనుట పరిశీలనార్హము.

## 73. ముశి మనే టాక్థకౌ. [1].

మనే = ఉభయార్థవాచి యగు మనశబ్దము ప్రయుక్త మగునపుడు, ముశి = ముశ్ ప్రత్యయము పర మగుచుండఁగా, టాక్ థకౌ = టాక్, థక్ అనునవి యగును.

వి. ఉభయార్థవాచి నిత్యబహువచనే మన శబ్దే ప్రయుజ్య
మానే చ లేడుత్తమపురుష ముశ్ ప్రత్యయే పరే
విధ్యర్థే ధాతోః దుక్ప్రత్యయస్య టాక్థక్ప్రత్య
యా వాగమౌ స్తః. టకాక థకార కకారాణామిత్సంజ్ఞా. ఆ.అ.
చేయుదాము, చూదాము, విందాము, కొట్టుదాము, పోవుదాము,
కొట్టుదము, తిందము, చూతము, జేయుదము ఇత్యాది.

అస్మద్యుష్మదుభ యార్థమును దెలుపు నట్టిదియు, నెప్పుడును బహువచనాంతమె యై యుండునదియునగు మనశబ్దము ప్రయోగింపఁబడునపుడు, లేట్టున నుత్తమపురుష బహువచన మగు'ముశ్' ప్రత్యయము పర మగునపుడు దుక్ప్రత్యయమునకు టాక్, థక్ అను ప్రత్యయము లగును. టాక్,లో టకార కకారములును, థక్కులో థకార కకారములును విద్వర్ణములు కావున ఆ,అ, అనునవే యగును.

చేయుదుము అనుచో మనము కర్త యైన దువర్ణకమునకు టాక్ప్రత్యయ మయిన చేయుదు + ఆము = చేయుదాము అని యగును, థక్ ప్రత్యయ మయినచో చేయుదుఅ + ము = చేయుదము అని యగును. ఇట్లితరములూహ్యములు.

1. ద్వంద్వ కర్తృ కేదో ర్మో వై.చం.తి.26

ఇయ్యవి విధ్యర్థకములుగా నిటఁ బేర్కొనఁబడినవి ఉభయ'ప్రార్థనము' గాఁ జిన్నయసూరి స్పష్టము చేసెను.

చేయుదాము విందాము అనురీతివి లోకవ్యవహారముననే కాని కావ్యవ్యవహారమునఁ గానరావు.

## 74. తోటచాదేర్బిన్దోః.

అచాదేః = చకారము మొదట లేని ధాతువులకు, బిన్దోః = బిందువు కంటెఁ బర మయియున్న, తః = తకారమునకు, టః = టకార మగును.

వి. అచాదే ర్ధాతో రను స్వారాత్పరస్య తకారస్య టకార స్స్యాత్.
అనితి అంటి, కనితి కంటి, తినితి తింటి, మనితి
మంటి, వినితి వింటి, అచాదేః కిమ్? చనిధాతోశ్చ కారాది త్వాత్
చని తీత్యత్ర చంటి నితి న.

చకారము మొదటఁ గల్గినది గాని ధాతువున ననుస్వారమునకుఁ బైనున్న తకారమునకు టకార మగును.

అనితి- అనుచో 'నివర్ణమునకు బిందు వయి అంతి అని కాఁగా బిందువు పైనున్న తకారమున కీ సూత్రముచే టకార మయి 'అంటి' అని యగును. ఇ ట్లితరములు.

అచాదేః అనుటచే చకారాది యగు ధాతువునకీ కార్యము లేదు. చనితి. చంటి నని గాదు.

ఇట బిందువును లేదు. కావున తకారము బిందువుపై నుండుటయే లేదు గావున టకార మగు ప్రసక్తియు న్లు లేదు. బిందువయి, టకారము రాక చంతి అనురూపము నుండదు గదా.

## 75. నో(కో)నుస్వారః.

వి. ఆదేశప్రత్యయః – కాను, కము, కాఁడు, కావు ఇత్యాది.

ఇట సూత్రవివృతు లస్పష్టముగా నున్నవి. నోనుస్వారః అనియున్నదేమో. అనితి ఇత్యాదుల బిందువు సాధింపఁబడును.

కాను మొదలగు లక్ష్యములనుబట్టి అగునకు 'కా' యను నాదేశము గలదు. కావునఁ దద్విధాయక మగు సూత్రమును (వివృతియు) నిట నష్టము లై యుండును.

## 76. కఙ్మి కావ భావే [1].

అభేవే = అబావార్థమున, కఙ్మికౌ = కక్ మిక్ – అను ప్రత్యయము లగును.

వి. అభావార్థేధాతోః కఙ్మి కౌ ప్రత్యయౌ స్తః.

చేయక – చేయమి, వినక – వినమి, చూడక – చూడమి ఇత్యాది.

అభావార్థమునందు ధాతువునకు కక్, మిక్ అను ప్రత్యయము లగును. కక్, మిక్ అను ప్రత్యయములలో తుది కకారము లిత్తులు. అవి లోపింపఁగా, క, మి అనునవె నిలుచును.

చేయ్ అనుధాతువుపై నీసూత్రముచే కక్ ప్రత్యయము రాఁగా చేయ్ + క – 'ల్ర్‌డ్వ్యతిరేకాదౌఫల్' (50) అనుసూత్రముచే ధాతువునకు ఫల్ ప్రత్యయ మయి చేయ్ + అక = చేయక యని యగును.

ఇది వ్యతిరేకక్త్వార్థముగా లాక్షణికులు స్పష్టము చేసియున్నారు.

చేయ్‌ధాతువుపై అభావార్థమున 'మిక్' ప్రత్యయ మై, చేయ్ + మి అని యుండఁగా 'ల్ర్‌డ్వ్యతిరేకాదౌఫల్' అను సూత్రముచే ఫల్‌ప్రత్యయము వచ్చి చేయ్ + అమి = చేయమి అని యగును.

ఇది వ్యతిరేక భావార్థకముగా లాక్షణికులు నిరూపించి యున్నారు.

## 77. క్త్వార్థే శిచ్. [2]

క్త్వార్థే = క్త్వాప్రత్యయము యొక్క యర్థమునందు, శిచ్ = శిచ్ అనుప్రత్యయ మగును.

వి. క్త్వాప్రత్యయార్థే ధాతోరన్త్యస్య శిచ్ ప్రత్యయ స్స్యాత్. వచ్చి, పోయి, డాసి,కొని, విని ఇత్యాది.

క్త్వాప్రత్యయము యొక్క యర్థములోఁ దెలుఁగున 'శిచ్' అనుప్రత్యయ మగును. శిచ్

---

1. అభావేఅకః త్రి.శ.9.45,46. బృహస్పతిసూత్రములు (అమిశ్చ?)
   కవ్య తిరేకేక్త్వః వై.చం.కృ.35–సర్వస్మాద్వ్యతిరేకేమిః. వై.చం.కృ.26
   క్త్వార్థేచ వ్యతిరేకార్థే, ధాతోస్తత్రైవ మిర్భవేత్.అ.కా.క్రి.21.
2. క్త్వార్థేశిః త్రి.శ.9.44.బృహస్పతిసూత్రము
   క్త్వ ఇల్. వై.చం.కృ.34
   క్త్వాభూతయో రిదన్త్యస్య ఆం.కౌ.క్రి.19
   క్త్వాభూతయోః క్రియాన్త్య స్యేల్. ఆం.శ.చిం.క్రి.17

ప్రత్యయమునందు శకారమును, చకారము నిత్తులు కావున 'ఇ' త్వమె నిలుచును. 'సమానకర్తృకయోః పూర్వకాలే' యను లక్షణము ననుసరించి సంస్కృతమున, ఒకే కర్తకలిగిన యనేక క్రియలలోఁ బూర్వకాలికమును దెల్పుదానికి 'క్త్వ' ప్రత్యయము విధింపబడినది. ఆ యర్థమున తెలుఁగున శిచ్ ప్రత్యయ మగును.

విన్ అనుధాతువుపై క్త్వార్థమునం దీసూత్రముచే శిచ్ ప్రత్యయము రాఁగా విన్ + ఇ = విని అని యగును. ఇ ట్లితరము లూహ్యములు.

## 78. తే చేతి.

చేత్ = చేదర్థమున, తే = ధాతువునకు 'తే' యనునది యగును.

వి. చేదర్థే తే స్యాత్. చూచితే- పశ్యతిచేత్.
వచ్చితే- ఆగచ్ఛతి చేత్. పోయితే- గచ్ఛతి చేత్ ఇత్యాది.

చేదర్థమునందు ధాతువునకు తే యనుప్రత్యయ మగును.

చూచి ధాతువుపైఁ జేదర్థ వివక్షయం దీ సూత్రముచే తేప్రత్యయము రాఁగా, చూచితే. - చూచినచో నని యిది చేదర్థమునం దున్నది 'చూస్తే' యనురీతిగా నేటివ్యవహారము.

వచ్చితే(వస్తే) పోయితే(పోతే) అనురీతి రూపములు కావ్యవ్యవహారమునఁ బ్రామాణికములై లేవు.

## 79. స్యోర్యగ్వకౌ [1].

స్యోః = సకార యకారములకు, యగ్వకౌ = యక్, వక్ అనునవి యగును.

వి. సాంత ఁ యాంత ధాతూనామన్త్య సకారయకారయో ర్యగ్వకౌ
స్త స్సార్వధాతు కార్ధ ధాతుకయోః. దాయు చున్నాఁడు,
దాయఁగలడు, దాయన్, దాయఁడు, దాయగ, దాయుఁగాత,
దాయుత, దాయుగాక, దాయుదు, దాయనివాఁడు,
దాయ, దాయవలె, దాయుము, దాయించెన్ ఇత్యాది.

ధాతువుతుది నున్న సకారమునకు 'యక్', యకారమునకు వక్ అనునది యగును. యక్, వక్, అనుచో కకారము లిత్తులు. అత్వ ముచ్చారణార్థము. కావున సకారమునకు యకారమును, యకారమునకు వకారము నగును. దాసి ధాతువు. దాస్ అనుచో సకారమునకు

1. వవ్యయః. వై.చం.తి.30, ధువేః . వై.చం.తి.37

యకారమ్మై - దాయ్ అనియగును దాయుచున్నాఁడు. మొ॥.

యకారమునకు వకార మగుట యుదాహరింపఁబడలేదు (అవు) అయ్, (పోవు) పోయ్ అను రెండు ధాతువులలో యకారమునకు వకార మగును. అయ్, అవ్, అవుచున్నది. పోయ్ పోవ్ - పోవుచున్నాఁడు మొ॥.

ఈ ధాతువులు సహజముగా, యకారాంతములు, (అగు పోవు) వకారాంతములు గాఁగా నాయాయియెడల సకార యకారము లగుటను సూరి స్పష్టము చేసెను. ఇం దాపద్ధతి తిరుగఁబడినది. ఇట్టి స్థితి వై.చం.లోఁ గూడ గానవచ్చును.

## 80. నతాలవ్యా జాది తిమోః.

తాలవ్యాజాదితిమోః = తాలవ్యము లగు (ఇ,ఎ) నచ్చులును, తి,మి, అనునవి యును బరమ్మైనపుడు, న = సకార యకారములకు యగ్వకుక్కులు రావు.

వి. తాలవ్యాజాది ప్రత్యయ శి త్తిముషు పరేషు
సాంత యాంత ధాతూనా మన్త్య సకార యకారయోః
యగ్వ కౌ న స్తః. దాసేటి వాఁడు, దాసెన్, దాసెడిది,
దాసి, దాసితి, దాసెదరు, దాసితివి, దాసితిరి.
దాసితిని, దాసితిమి దాసినవాఁడు.

ప్రత్యయము మొదటి తాలవ్యము లగు నచ్చులు పర మయినను, (శిత్తులయిన) తి, మి, అను ప్రత్యయములు పర మైనను ధాతువు తుది సకారమునకు యకారము గాని, యకారమునకు వకారము గాని రానేరవు. 'స్యోర్యగ్వకౌ' యను పూర్వ సూత్రముచేఁ బ్రాప్తించిన యక్, వక్, అనువాని నీ సూత్రము నిషేధించుచున్నది.

దాసి. దాస్ ధాతువు 'క్త్వార్థేశిచ్' అను సూత్రముచే 'శిచ్' ప్రత్యయము రాఁగా నందు మిగిలిన ఇవర్ణము తాలవ్య మగునచ్చు, అది పరముగా నుండుటచే ధాతువు చివరి సకారము న కీ సూత్రముచే యకారము రానేరదు. దాస్ + ఇ = దాసి యనియే యగును.

ఇట్లే, అయ్ + ఇ = అయి అనియే గాని 'అవి' అను రూప ముండదు.

వి. అనేన దన్త్యశిదార్ధధాతుకేషు పరేషు సకార
యకార ర్యగ్వకౌ బోద్ధవ్యౌ.

**తాలవ్యాజాది యనుటచే, తావ్యములు గాని (అనఁగా దంత్యములయిన) అచ్చులు పర మైనపుడు, 'స్యోర్యగ్వకౌ' యను సూత్రముచే రావలసిన యకార వకారములకు రానేరవని గ్రహింపవలెను.**

దాయుచున్నాఁడు, పోవుచున్నాఁడు ఇచట 'ఘుమప్' ప్రత్యయమునందలి (ఉమచ్) మొదటి 'ఉ'కారము దంత్యము పర మయినది యగ్వక్కు లయిన వని గ్రహింప వలయును.

## 81. అయే రాదే ర్దా ఝేసి.

ఝేశి = ఝేశ్ ప్రత్యయము పర మగుచుండఁగా, ఆయేః = అయిధాతువు యొక్క, ఆదేః = మొదటి యక్షరమునకు, దాప్ = 'దాప్' అగును.

వి. అయిధాతో ర్ఝేశి పరే ఆద్యకారస్య దాబాదేశస్స్యాత్. (ఆటి?) ఆయెన్.

ఝేశ్ పర మగుచుండఁగా అయిధాతువునందు (మొదటిదగు) అకారమునకు 'దాప్' ఆదేశ మగును. దాప్ అను దానియందు దకారమును, పకారము నిత్తులు కావున నివి లోపింపఁగా 'ఆ' కారమె యగును. అత్వమునకు దీర్ఘము నగు నని చెప్పినను ఫలిత మిల్ల యుండెడిది.

ఝేర్ఝేశ్. అను సూత్రముచే భూతార్థమునందు (శిట్టున కాదేశ మైన) ప్రథమపురుష బహువచన మగు 'ఝి'ప్రత్యయమునకు 'ఝేశ్' (ఎ) అనునవి యగును. అది పర మగుచుండఁగా అయెన్. అనుచో నత్వమున కీ సూత్రముచే ఆత్వ మయి 'ఆయెన్' అని యగును.

ఈ 'ఆ' త్వము ఆయెదరు ఇత్యాదిగా 'ఝేశ్' భిన్నము లగు స్థలములందలి ఎత్వము పర మయినపుడును గలదు.

వి. ఝేశి (పరే) కిమ్? అవున్, అవుచున్నాఁడు, అవుఁగాత, అవుఁగాక, అవుట, అవుదు ఇత్యాది.

సూత్రమునందు 'ఝేశి' అనుటచే ఝేశ్ భిన్న మైనది పర మయినపుడు, అయిధాతువు నందలి అకారమునకు 'దాప్' అను నాదేశము లేదు. అవుచున్నాఁడు మొదలగు చోట్ల ఆవుచున్నాఁడు మొదలగు రూపము లుండవు.

## 82. కాల్చ.[1]

(అయిధాతువునకు) కాల్ చ = కాల్ అను నాదేశము నగును.

వి.ల్రుట్ ప్రార్థనాభావ వ్యతిరేక ప్రతిషేధాదిషు పరేష్వయి
ధాతోః కాల్ సర్వాదేశస్స్యాత్. లస్య, ఇత్సంజ్ఞా.
కాఁగలవాఁడు, కానివాఁడు, కమ్ము, కండు, కాఁడు - కావె,
కాలేఁడు కావలె, కాక, కా-కానిమ్ము, కాఁగ, కాదు,
కావా ఇత్యాది.

భావి, ప్రార్థనము వ్యతిరేకము మొదలగు నర్థములయందు అయిధాతువునకు 'కాల్' అనునది యాదేశమగును. కాల్ అనుదానియందు లకార మిత్తు. కావున లోపింపఁగా 'కా' యనునదే 'అయ్' అనుదాని కాదేశ మగును.

అయ్ ల్రుట్ కాఁగలదు మొ॥ ఇతరము లూహ్యములు.

## 83. లుగ్వ కో రావణస్య.

రావణస్య = రావణునిమతమునందు, వకః = వక్ అనుదానికి, లుక్ = లోప మగును.

వి. పోయిధాతో రాదేశ వక్రప్రత్యయస్య లుక్ స్యాదార్ధ
ధాతుకే పరే రావణస్య మతే. పోయెన్, పోవుచున్నాఁడు.
పోఁగలఁడు, పోఁడు, పోలేదు, పోఁగ, పోక, పోదు,
(పోపోదు?) పోపోము. పోకుము, పోనీ, పోగా.

పోయి ధాతువునందలి యకారమునకు, 'స్యోర్యగ్వకౌ, (81) యను సూత్రముచే నాదేశ మయిన వ (వక్) కారమునకు భవిష్యదాద్యర్థములందు లోపము వచ్చు నని రావణుని మతము.

పోవఁగలఁ డనుచో 'వక్' లోపింపఁగా పోఁగలఁడు అని యగును. ఇట్లే పోదు, పోము మొ॥ 'రావణస్య' యనుటచే లోప మగుట రావణునిమతమునందే. కావున మతాంతరమునందు 'వక్' అనుదానికి లోపము లేదు. వక్కు లోపింపని పక్షమునందు పోవఁగలఁడు, పోవుదు-పోవుము మొదలగురీతిగా రూపము లుండును.

---

1. అతా భ్వసాగమాం కాలేరాః వై.చం.తి.33

వి. లోపా భావపక్షే 'పోవున్' పోవుచున్నాఁడు,
పోవఁగలఁడు, పోవఁడు, పోవలేదు, పోవంగ, పోవక,
పోవుము, పోవదు, పోవవలె, పోవకుము, పోవుదాము
పోవనిమ్ము, పోవంగా ఇత్యాది.

ఇట వివృతియందు పోవున్, పోవుచున్నాఁడు అనియు సుదాహరింపఁబడుట విశేషము. దీనివలన వ గ్లోపపక్షమున ననఁగా రావణుని మతమునందు పోన్, (పోవున్) పోచున్నాఁడనురీతి రూపములకు నవకాశము గల్గుచున్నది. అట్టిరూపములు కవిప్రయోగములందు మృగ్యములై యున్నవి. వై.చం. కూడ పోవుచున్నాఁ డని చూపుట గమనింపఁదగు (పుట.172).

వి. కించ (యకో న లోపః) పోయెన్, పోయెడివాఁడు,
పోయెడిది, పోయి, పోయిాని, పోయెదరు, పోయిరి, పోయి
తివి, పోయితిని, పోయితిమి, పోయినవాఁడు, పోయివచ్చెన్ ఇత్యాది.

'లుగ్వకః' అను సూత్రము 'వక్'అనుదానికి మాత్రమె లోపము చెప్పుచున్నది. కావున 'వక్' రానిస్థలమున నున్న పోయిధాతుగత మైన యకారమునకు లోపము రాదు. పోయెన్ మొ॥ పోన్, (పోయితిని) పోతిని అనురీతిగాఁ గాదు.

## 84. వచ్చే రామ్.[1]

వచ్చేః = వచ్చిధాతువునకు, రామ్ = రామ్ అనునది యాదేశ మగును.

వి. లృట్ప్రార్థనాభావ వ్యతిరేక నిషేధాది ష్వర్థ
ధాతుకేషు పరేషు వచ్చి ధాతో 'రామ్' సర్వాదేశ
స్స్యాత్. మకారస్య ఇత్సంజ్ఞా. రా - రాఁగలవాఁడు., రమ్ము,
రండు, రాఁడు, రావో, రాలేదు,
రావోయి, రా, రాఁగా, రాక, రాని, రావడము ఇత్యాది.

భావి, ప్రార్థనము, వ్యతిరేకము మొదలగు నర్థములందు వచ్చి ధాతువునకు మొత్తమునకు 'రామ్' అనునది యాదేశ మగును. 'రామ్' అనుదానిలో మకార మిత్తు. కావున నది లోపింపఁగా 'రా' యనునదే నిలుచును.

1. వచ్చే రా. త్రి.శ.9.34 బృహస్పతి సూత్రము
అతా భ్యసాగమాంకాలేరాః వై.చం.తి.33

వచ్చి ధాతువునకు లృడర్థమునఁ బ్రథమపురుషైక వచనమునందు కలాదులతో, 'వచ్చి' అనుదానికి 'రా' యనునది యాదేశము కాఁగా రాఁగలఁడు అని యగును. ఇతరము లూహింపఁదగును.

వి. ఆదేశాభావేఁ సార్వధాతుకేషు- వచ్చెన్, వచ్చిరి, వచ్చితివి, వచ్చితిరి, వచ్చితిమి, వచ్చుచున్నాఁడు, వచ్చున్, వచ్చుఁగాత, వచ్చుఁగాక, వచ్చి, వచ్చెదరు ఇత్యాది.

'వచ్చేరామ్' అను సూత్రముచే 'రామ్' అనునాదేశము లృడాద్యర్థములందు మాత్రమె. కావున నితరస్థలములందు రామ్ అనునాదేశము లేదు, లట్, లిట్, లేట్, లోడర్థములు మొద లగు నర్థానింట 'రామ్' ఆదేశము లేకపోవుటచే వచ్చి ధాతు వట్లే యుండును.

వచ్చుచున్నాఁడు, వచ్చెన్. మొ॥

## 85. చూచేర్డక్చ [1].

చూచేః = చూచి ధాతువునకు, డక్ చ = డక్ అను నాదేశ మగును.

వి. లృట్ప్రార్థనాభావ వ్యతిరేక ప్రతిషేధాది సార్వధాతుకేషు పరేషు చూచి ధాతో రన్త్యస్య డగాదేశ స్స్యాత్.
చూడ(ఁగ) కలఁడు , చూడుము, చూడవో, చూడలేఁడు, చూడదు, చూడని వాఁడు, చూడఁగ, చూడక, చూడనిమ్ము, చూడము ఇత్యాది.

భావి, ప్రార్థనము మొద లగు నర్థములందు, చూచి ధాతువు యొక్క చివరి వర్ణమునకు 'డక్' అనునది యాదేశ మగును. 'డక్' అనుచో కకార మిత్తు. కావున నది లోపింపఁగా 'డ' యనునదే నిలుచును. 'చూచ్' అనుచో ఁచివరి చకారమునకు 'డ' యనునది యాదేశ మగు నని ఫలితార్థము.

చూడఁగలఁడు, చూడఁడు మొ॥

'రామ్' అనునది సర్వమున కాదేశము గాఁగా ఇచట 'డక్' అనునది యంత్యమునకె యాదేశ మగుట వివృతినుండి పొందవలసిన యర్థవిశేషము. 'డక్' అనుచో కకార మిత్తగుట వలన నీ ప్రయోజనము సిద్ధించు నని వివృతి కర్త తలఁ పయినఁ గా వచ్చును.

1. చూచేర్డక్. త్రి.శ.9.36 బృహస్పతి సూత్రము.
అన్త్యస్య చోర్డశ్చే డోఽతి వై.చం.తి.85.

వి.తదభావే సార్వధాతుకేషు - చూచెన్, చూచిరి, చూచితివి, చూచితిరి, చూచితిని, చూచితిమి, చూచుచున్నాఁడు, చూచున్, చూతురు ఇత్యాది.

'చూచేర్డక్స' యను డగాదేశము ల్బాద్యర్థములందే కావున లట్, లిట్, లేట్, లోట్ మొదలగు స్థలములం దీయాదేశము లేపోవుటచే చూచి ధాతు వట్ల యుండును. చూచుచున్నాఁడు మొ॥

## 86. డుదడేంచిషు దేర్వక్.

డుదడేంచిషు = (డుత్) అడ, ఇంచి యనునవి పరముగా నున్నపుడు, దేః = దీర్ఘముపైని, వక్ = 'వక్' అనునది యాగము మగును.

వి. డుదడ ప్రత్య యేంచిషు పరేషు శేషాదేశయో ర్దీర్ఘస్య వగాగమ స్స్యాత్. రావుండు. రావడము, రావించెన్, కావుండు, కావడము, కావించెన్, పోవుడు, పోవడము, పోవించెన్, ఈవుండు, ఈవడము, ఈవించెన్, నావుడు ఇత్యాది.

ఇతరవర్ణములు లోపింపఁగా మిగిలియున్నది కాని లేదా యాదేశముగా వచ్చినది గాని యైన దీర్ఘమునకు డుత్, అడ, అనుప్రత్యయములును, ఇంచియను నాగమమును బరముగా నున్నపుడు 'వక్' అనునది యాగము మగును. 'వక్' అను చోఁ కకార మిత్తు. అకార ముచ్చారణార్థము కావున నది తొలఁగి వకారపుఁబొల్లు మాత్రమె యాగము మగును.

వచ్చి - అడ - రా + అడ - అనుచో నాదేశ మగు 'రా' అనుదాని కీ సూత్రముచే వగాగమ మయి రావ్ + అడ = రావడము - అని యగును. ఇతరము లూహ్యములు.

అగుధాతువు నకు (క్రి.82) 'కా' యనునాదేశము. ఈ సూత్రముచే వకారము. కావడము రూపము లగు నని యుదాహరింపఁబడినదే.

రావడము కావడ మనురీతివి వ్యవహారమునఁ గలవు. 'ప్రతి క్రియమడాన్తత్వం ప్రతీతం న తుగీయతే' (అ.98) అని అ.కా . ఈ యంశమును ప్రస్తావించినది కాని యామోదింపలేదు. రావించెన్, కావించెన్ అనునవి ప్రసిద్ధములే. పోవించెన్ ఈవించెన్ అనునవి మృగ్యములు. రావుఁడు, కావుండు, ఈవుండు అనురీతి వానం తర్యార్థకములుగాఁ బోలును. అట్టి రూపములును లేవు. అప్పటి వ్యవహారమున నుండె నేమో.

## 87. ఇచ్ఛే రీటః.

ఇచ్ఛేః = ఇచ్చి ధాతువు యొక్క, ఈటః = ఈ డాగమమునకు సైత మగును?

వి. ల్భ్రట్ప్రార్థనా భావ వ్యతిరేక ప్రతిషేధాది సార్వధాతుకే
షార్వధాతు కేషు పరేష్వీ డాదేశస్య యగ్వగాగమౌ వికల్పేన స్తః.
కకారయో రిత్సంజ్ఞా. ఈయఁగల వాఁడు, ఈయని వాఁడు,
ఈయఁడు, ఈయుఁడు, ఈయుము, ఈయక, ఈయగ,
ఈయవలె ఇత్యాది.
ఈవఁగలవాఁడు, ఈవనివాఁడు, ఈవఁడు, ఈవవలె,
ఈవక, ఈవగ, ఈవుము, ఈవుఁడు, ఈవడము ఇత్యాది.

భావి, ప్రార్థనము మొదలగునర్థములందు ఇచ్చి ధాతువున కాదేశ మయిన ఈట్ అనుదానికిఁ బరముగా యక్, వక్, అనునవి యగును. యక్, వక్ అనుచో కకారము లిత్తులు కావున నవి లోపింపఁగా, య,వ, అనునవె నిలుచును. య వలు కిత్తులు గావున నీడాదేశమున కంతాగమము లగును.

ఇచ్చి ధాతువునకు భవిష్యదర్థమున ఈడాదేశమును దానికి యగాగమమును రాఁగా ఈయఁగలఁడు, వగాగమ మయినచో ఈవఁగలఁడు. మొ॥

యవలు లేని ఈఁగలఁ డనురీతివి ప్రచారములు ఈయ యనియుఁ గలదు. ఈవగలఁ డనుట యప్రసిద్ధము. ఇవ్వఁగల డనురీతి నరుదుగఁ గలవు.

## 88. నమలయవాం ద్వి ర్వా.

నమలయవామ్. న, మ, ల, య, వ అనుహల్లులకు, వా = వికల్పముగా, ద్విః = ద్విత్వ మగును.

వి. ఏతస్య వర్ణపఞ్చకస్య వికల్పేన ద్విత్వం స్యాత్ త్రిలిఙ్గ భాషాయామ్. "వా హ్రస్వదీర్ఘావన్యో న్య' మిత్యనేన దీర్ఘస్య హ్రస్వః. యగ్వకోర్ద్విత్వమ్. ఇయ్యఁగలఁడు, ఇవ్వఁగలఁడు, ఇయ్యఁడు, ఇవ్వఁడు, ఇయ్యనివాఁడు, (ఇవ్వనివాఁడు) ఇయ్యక, ఇవ్వక, ఇయ్యగ (ఇవ్వగ) ఇయ్యడము, ఇవ్వడము ఇత్యాది.

నమలయవ అను హల్లు లయిదింటికిని వికల్పముగా ద్విత్వము వచ్చును. ఇట్లు 'ఇచ్చేరీటి' యను సూత్రముచే నయిన యవలకు వికల్పముగా ద్విత్వ మగును. ఈయ్య, ఈవ్వ, ఇట్లు ద్విత్వము రాగా వాహ్రస్వదీర్ఘావన్యోన్య (తద్భ.91) మ్మనుసూత్రముచే ముందటి దీర్ఘమునకు హ్రస్వము వచ్చి ఇయ్య ఇవ్వ అని యగును.

ఇయ్యఁగలఁడు, ఇవ్వఁగలఁడు మొ॥

వి.సార్వధాతుకేషు ఇచ్చియెఁన్, ఇచ్చివెన్, ఇచ్చుయున్, ఇచ్చువున్, ఇచ్చుచుయున్నాఁడు, ఇచ్చుచువున్నాఁడు ఇచ్చియుగాత, ఇచ్చివుగాత ఇతి న.

'ఇచ్చేరీటి' యనుసూత్రముచే నగు యగ్వాగాగమములు, ల్యడాద్యర్థములందు మాత్రమె. కావున లడాదులగు నితరార్థములందు ఈఁడాదేశమును య గ్వాగాగమములును లేవు. కావున ఇచ్చుచయున్నాఁడు లే దా ఇచ్చుచు వున్నాఁ డనురీతి రూపము లుండవు.

ఇంక నట్టియెడల, ఇచ్చెన్, ఇచ్చున్ ఇచ్చుచున్నాఁడు ఇచ్చుఁగాత ననురీతిగనె రూపము లుండును.

యగ్వకాగమము లీడాదేశమునకు విధింపఁబడినవి లడాదులయందు ఈఁడాదేశమును లేదు. కావున ఈఁడాదేశమె లేనిచోట ఈఁట్టునకుఁ జెప్పిన యగ్వాగాగమము లెట్లు వచ్చును. కాఁగా లడాదులం దీడాదేశమె లేదు గావున యగ్వకుక్కుల ప్రసక్తియె లే దని గుర్తింపఁదగియున్నది.

## 89. అవి వక్షితమి త్[1].

ఇత్ = ధాతువు తుది నున్న యిత్వము, అవివక్షితమ్ = వివక్షితము గాదు.

వి. క్రియాన్త్యే కారో వివక్షితో న స్యాత్.

ధాతువు తుది నున్న యికారము వివక్షితము గాదు. 'కని విన్యాదయః' ఇత్యాదిగా ధాతువులు ఇదంతములుగా నిర్దేశింపఁబడినవి. కని, విని, చూచి మొదలుగా ధాతువునఁ జివర నున్న యిత్వము వివక్షితము గాదు. అనఁగా నది ధాతుభాగముగాఁ జెప్పఁబడినది గాదని యర్థము.

## 90. తస్య లుక్.[2]

తస్య = ఆయిత్వమునకు, లుక్ = లోప మగును.

వి. తస్య క్రియాన్త్య స్యే కారస్య లుక్ స్యాత్.

ధాతువు చివర నున్న యిత్వము 'అవివక్షితమిత్ అను పూర్వసూత్రము ననుసరించి యవివక్షితము కాఁగా నట్టి యిత్వమున కీ సూత్రము చే లోప మగును.

'కని' ధాతువునందిట్లు చివరి యిత్వమునకు లోపము రాఁగా 'కన్' అనునది ధాతువుయొక్క యసలుస్థితి యగును.

ఇత్వలోప ముద్దిష్టము కాఁగా సవివక్షిత మనుదానిచేతనే తల్లోపము సిద్ధ మనవచ్చు అవివక్షిత మని, లోప మని రెండు లక్షణములఁ యవసరము గోచరించదు. స్పష్టత కనవచ్చు.

## 91. ఏవార్థే ధనే స్తః[3]

ఏవార్థే = 'ఏవ' యనుదాని యర్థమునందు డెలుగున, ధనే = ధ, యనునదియు, నే యనునదియు, స్తః = అగును.

వి. ధ నకారాణామిత్సంజ్ఞా. రాముఁడ, భూపుఁడ, అతఁడ

రాముఁడె, బూపుఁడె, అతఁడె ఇత్యాది.

---

1,2. అవివక్షితమిత్, తస్యలుక్, త్రి.శ.9.1,2 బృహస్పతి సూత్రములు.

3. అవి? ఏవార్థే చ. త్రి.శ. 9.15 బృహస్పతి సూత్రము.

'ఏవ' యను సంస్కృతావ్యయము యొక్క యర్థమున తెలుఁగున ధ, నే, యనునవి యగును. 'ధ' యనుదాని యందు ధకార మిత్తు అది లోపింపఁగా 'అ' అనునది నిలుచును. 'నే' యనుదానియందు నకార మిత్తు. కావున నది లోపింపఁగా 'ఏ' అనునది నిలుచును. ఏవార్థమునం దనఁగా నవధారణమున అ, ఎ, అనునవి యగును.

ఇవి యవ్యయము లగుట నవ్యయప్రకరణమునఁ జెప్పిన నొప్పు ననిపించు. వై.చం. అట్ల పేర్కొన్నది.

అతఁడు అనుదానిపై నవధారణార్థమున నీ సూత్రముచే 'ధ' అయినచో అతఁడు + అ = అతఁడ అని యగును 'నే' వచ్చినచో అతఁడు + ఎ = అతఁడె యని యగును.

'అ' అనునది హ్రస్వము మాత్రమే యవధారణార్థకము. 'రాముఁడా' యనుదానికి రాముఁడే యను నవధారణార్థము లేదు. కాని 'ఎ,ఏ' యను హ్రస్వదీర్ఘములు రెండు నేవార్థకములుగ నున్నవి. రాముఁడె, రాముఁడే మొ॥

## 92. ఖ యేప్చ.

ఏవార్థే = ఏవశబ్దార్థమున, ఖయేప్ చ = ఖయేప్ అనునదియు నగును.

వి. ఏవార్థే ఖయేప్చ స్యాత్. ఖపయోరిత్సంజ్ఞా. రాముఁడయె అతఁడయె, - యస్య ద్విత్వే రాముఁడయ్యె, అతఁడయ్యె.

ఏవార్థే ధనే స్తః అను పూర్వసూత్రము నుండి 'ఏవార్థే' యనునది యను వర్తించును. అవధారణార్థమునఁ బూర్వసూత్రమునఁ జెప్పిన 'ధ,నే' యనాదానితోపాటు, ఖయేప్ అనునదియు నగును 'ఖయేప్' అనుదానిలో ఖకారమును, పకారము నిద్వర్ణములు కావున నవి లోపింపఁగా 'అయె' యనునది నిలుచును.

రాముఁడు అను పదముపై నేవార్థమున నీ సూత్రముచే 'ఖయేప్' అనునధి రాఁగా 'రాముఁడు + అయే' = 'రాముఁడయే' యని యగును.

'అయె' యనుదానియందలి యకారమునకు 'నమలయవాం ద్వర్వా' యను సూత్రముచే ద్విత్వము వచ్చిన పక్షమునందు రాముఁడయ్యె' అనియు నగును.

అవధారణార్థమున రాముఁడయె, రాముఁడయ్యె యనురీతిరూపములు గానరావు. హరియ, రమయ, యనురీతిగా నవధారణార్థక మగు 'అ' అను శబ్దము పర మగుచుండఁగా సంధి రానిరూపములు గన్పించును. దీనిని బట్టి చూడఁగా 'ఖయేప్చ' యని ఖయేద్విధానము యొక్క యౌచిత్యము విచారింపఁదగియున్నది.

## 93. తాన్ సంశయే.[1]

సంశయే = సంశ యార్థమునందు, తాన్ = తాన్ అనునది యగును.

వి.సర్వేషాం నామ్నాం ప్రత్యయాన్త క్రియాపదానాఞ్చ
సంశయార్థే తాన్ ప్రత్యయస్స్యాత్. తకార నకారయో
రిత్సంజ్ఞా. రాముఁడా, హరియా, విష్ణుఁడా, మాతా,
కన్నెయా, గోవా, గోడా, భామా, ఇంతియా, చూచెనా,
చేయునా, కనుచున్నాఁడా, చూడఁడా, చూచితివా,
కంటినా ఇత్యాది.

సుబంతములును తిఙంతములు నయిన యన్నివిధము లగు పదములపయిని సంశయార్థము నందు 'తాన్' అను ప్రత్యయ మగును. 'తాన్' అనుదానిలో తకారమును, నకారము నిద్వర్ణములు. కావున నవి లోపింపఁగా 'ఆ' యనునది నిలుచును.

రాముఁడు + ఆ = రాముఁడా - అకారాంతము (రామ రాముఁడా), ఇకారాంతము (హరి-హరియా), ఉకారాంతము (విష్ణు-విష్ణుడా), ఋకారాంతము (మాతృ - మాతా) ఏదంతము (కన్నె-కన్నెయా) మొదలుగాఁ గ్రమముగా నిట నుదాహృతులు చూపఁబడినవి. ఇట్లే క్రియాపదములయెడ నూహింపఁదగును.

వి. ప్రత్యయాంత క్రియాపదానాం కిమ్? కనా (కూడా?)
ఇచ్ఛా ఇతిన.

వివృతి యందఁ 'ప్రత్యయాంతము లగు క్రియాపదములపై నీ 'తాక' ప్రత్యయ మగు నని చెప్పఁబడినది. అట్లు చెప్పుటవలనఁ బ్రత్యయాంతములు గాని 'కన్'- మొదలుగా ధాతువులపై 'తాన్' ప్రత్యయము లేదు. ఇచట సంశమార్థ వివక్షయేకుదుర దని గుర్తింపవచ్చును.

అట్లే యంతకు మునుపు 'నామ్నామ్' అనఁగాఁ బ్రాతిపదిక లని కాక ప్రథమాదివిభక్త్యంతము లగు పదములే గ్రహింపఁబడుట వివృతి కర్త యుద్దేశముగా నెఱుఁగవచ్చును.

---

1. అన్న (అనుశ్చ?) సంశయే త్రి.శ.9.14.బృహస్పతి సూత్రము.

## 94. య్ద్యోర్వా.

య్ద్యోః = ధాతువు చివరి యకారమునకును, దైనున్న దువర్ణకము నందలి దకారమునకును రెంటిస్థానమున, వా = పోల్లు తకారము వికల్పముగా నాదేశ మగును.

వి. సాంత క్రియాన్తాదేశ యకారస్య దువర్ణకదకారస్యచ హల్త కారాదేశో (ఝ్యాదేః) చోః పూర్వలో వికల్పేన స్యాత్.
చేతురు-. చేయుదురు, చేతువు-చేయుదువు, వ్రేతువు-వ్రేయుదువు, వ్రేతును-వ్రేయుదును, దాతుము-దాయుదుము ఇత్యాది.

తాలవ్యేతర మగు నచ్చు పర మైనపుడు సకారాంతధాతువుల తుది సకారమునకు యకారము వచ్చును 'స్యోర్యగ్వ్కౌ (77) ఆ యకారము కంటెఁ లేడంతస్థలమున నగు దువర్ణకము పర మగుచుండఁగా ఆయకార దకారములు రెంటి స్థానమునను వికల్పముగా తకార మాదేశ మగును. 'ద్వోస్తహల్ ఝ్యాదౌ యను పూర్వ(58) సూత్రము ననుసరించి, ఝ్యాదౌతహల్' అనుదళములిం దన్వయింపవలయును. కాఁగా నీ సూత్రము నచ్చుటఁ జెప్పనఁగ్రమము గ నీయర్థముగల్గెడి దనిపించు. కాఁగాప్రథమ పురుష బహువచనాదిస్థలముల యందే యీ తాదేశ మగును.

'చేయుదురు' అనుచో 'యుద్' అను భాగమునకు తకార మీ సూత్రముచే నాదేశము గాఁగా చేత్ + ఉరు = చేతురు అని యగును, ఖద్లేటి, యని ఖట్టు వచ్చినఁ గాని 'దుట్పుటః' అని దుట్టు రాదు. అవి పర మగునపుడు గాని ప్రస్తుతలక్షణము వర్తింపదు. కవున 'యుద్' అను భాగమునకే తకార మగు నని గ్రహింపఁదగును.

'వా' యనుటచే 'యుద్' అనుదానికి తకార మాదేశము గాని పక్షమునందు 'చేయుదురు' అని యట్లె యుండును.

ఇ ట్లే తరము లూహింపఁదగును.

వి. ఏకపదనాంతే-
కనుదురు ఇత్యత్ర నువర్ణ స్యో కార లోపః
కన్దురు.

ఏక పదమునందలి నకారముపైని 'ఉక్తా నాం చ' యను (సంధి.20) సూత్రముచే నుత్వము లోపించును.

కనుదురు అనుచో నువర్ణము నందలి యుకారము లోపింపఁగా కన్దురు అని యగును.

## 95. బిన్దుశ్చ.

వి. కందురు.

బిన్దుః చ = ఆ నకారమునకు బిందువు నగును.

నువర్ణమునందలి యుకారమునకు లోపము రాఁగా మిగిలియున్న పొల్లు నకారమునకు నిండు సున్న వచ్చును. కన్దురు అనుచో నకారమునకు బిందువు రాఁగా కందురు అని యగును.

## 96. తోష్టుః.

తోః = తవర్గము స్థానమున, టుః = టవర్గ మగును.

వి. బిన్దోః పరస్య తవర్గ స్య టవర్గ స్స్యాత్. తస్య డకారః.
కండురు ఇతి స్థితే-టోరిణోహలి లోపః ఇత్యనేన
డువర్ణో కారస్య లోపే కండ్రు ఇతిరూపసిద్ధిః.

పూర్ణబిందువుకంటెఁ బరమయియున్న తవర్గీయాక్షరములయొక్క స్థానమున యథాక్రమముగా టవర్గీయాక్షరము లగును.

'కందురు' అనుచో నీ సూత్రముచే బిందువునకుఁ బైనున్న దకారమునకు డకారము రాఁగా కండురు అని యేర్పడును.

ఇట్లు డకార మగుట వికల్ప మని గ్రహింప వలయును. డకారము రాని పక్షమున 'కందురు' అనురీతిగా దకార మట్లే యుండును.

'కండురు' అనుచో '[1]టోరిణో హలిలోపః' (త్రి.శ.2.13) అనుసూత్రముచే డువర్ణము నందలి యుత్వమునకు లోపము రాఁగా కండ్రు అని యగును.

ఈ యుత్వలోపమును వికల్పమె కావున నుల్లోపము రాని పక్షమున కండురు అనియు నుండును.

వి. కనుదురు-కన్దురు - కందురు - కండురు-కండ్రు
ఇతిపఞ్చరూపాణి స్యుః. అని, కని, కొని, చని, తిని, మని,
విన్యాదయోనాన్తాః.

---

1. ఇణస్త్వరలి.(సంధి.19) అని యీ సూత్రమునకు స్వరూపము. ఇట మారుటకుఁ గారణము స్పష్టము. (ఈసూత్రముధర్వణ గ్రంథము నసున్నది.

కనుదురు అనుచో నుత్వము లోపించుట చేతను (కన్ దురు) నకారమునకు బిందు వగుట చేతను (కంటురు) ఆ బిందువు మీఁది దకారమునకు డకారమగుట చేతను (కండురు) ఆ 'డ' కారముపై నుత్వము లోపించుటచేతను (కండ్రు) నుత్వలోపము లేని స్థితి ననుసరించియు (కనుదురు) నయిదు రూపము లుండును. అని, కని, మొద లగునవి నాంత ధాతువులు. మని- మందురు-మంద్రు మొ॥ 'కన్దురు' అనురీతివి వెదుకవలె.

వి. కనితివి, కనితిరి ఇత్యత్ర ఏకపదే నివర్ణే కారస్య లోపే నకారః- బిన్దుః. కంటివి ఇతి స్థితే-తోష్టు రితి సూత్రేణ తకారస్య టకారః. కంటివి, కంటిని, కంటిమి.

కనితివి ఇత్యాదులయందు 'ఉక్తానాం వే.(సంధి.20) యను సూత్రముచే నివర్ణమునందలి యికారమునకు లోపము రాఁగా 'కన్ తివి' - అని కాఁగా 'బిన్దుశ్చ' యను సూత్రముచే నా నకారమునకు బిందు వయి కంతివి యని యగును. 'తోష్టుః' అను సూత్రముచే తకారమునకు యథాక్రమముగా టకార మయి కంటివి అని యగును. ఇట్లే తరములు.

ఇట నకారమునకు బిందువు దాని పైని తకారమునకు టకారము నను కార్యము లెల్ల నిత్యములె యని గుర్తింపవలయును. కావున కన్ తివి, కంతివి యనురీతిరూపము లుండవు. ఇత్వము లోపింపని కనితివి యనురీతిరూపము లరుదు.

తోటోచాదేర్బిన్దోః (74) అను సూత్రము నీ విషయమును ప్రతిపాదించుచున్నది. 'తోష్టుః'- అని యిచట నిం కొకలక్షణము ప్రస్తావింపఁబడియున్నది.

ఇది దాని కంటె విస్తృతార్థము గల్గియుంట నా సూత్రము (క్రి.74) చెప్పకున్న నిబ్బంది లే దని తోఁచు.

## 97. లడ్ల్బ డభావానాం నుగ్వా.

లట్, ల్బట్, అభావానామ్ = లట్, ల్బట్, అభావమునను నర్థములందు, నుక్ = ఉత్తముపురుషైకవచన మగునుక్ ప్రత్యయము, వా = వికల్పముగా నగును.

వి. ఏతేషాముత్తమ పురుషైకవచనానాం నువర్ణో వికల్పేన స్యాత్. చేయుచున్నాఁడను-చేయుచున్నాఁడ, దాయఁగలను-దాయఁగల, వ్రేయను-వ్రేయ ఇత్యాది.

లట్ ల్రిట్, అభావార్థములందు నుత్తమపురుషైకవచనమగు నువర్ణము వికల్పముగా నగును.

చేయుచున్వాఁడను, వా యనుటచే నువర్ణము రానిపక్షమునందు, చేయుచున్వాఁడ అని యుండును.

ఈ విధానము ప్రయోజనవంతముగాఁ గానరాదు. 'చేయుచున్వాఁడ కాదె' యనురీతిగా వాక్యమధ్యమున నువర్ణము లేని రూప ముండదు. వాక్యాంతమునం దయినచో 'వాక్యాన్త ద్రుతలోపముచే (లుగ్వావా క్యాన్త ద్రుతస్య) (సంధిః.) నెట్లు నిట్టి రూపస్థితి గల్గును. ద్రుతము నకారపుఁబొల్లె గాని నువర్ణము గా దని యభిప్రాయ మున్నను, నుత్వములోపము ననంతరము పొల్లుయై యుండు నకారమునకు లోపమును సాధించుకొనవచ్చును. దీని ప్రయోజనము విచార్యము.

చేయుచున్వాఁడను - చేయుచున్వాఁడ - లట్.
దాయఁగలను - దాయఁగల ల్రిట్.
వ్రేయును - వ్రేయ - అభావము.

## 98. లేడ్లిటో రాదేః.

లేడ్లిటోః = లేట్, లిట్, లకారములయందు. ఆదేః = ప్రథమపురుషైకవచనస్థలమున, నుక్ వా = నుక్ ప్రత్యయము వికల్పముగా నగును.

వి. తద్ధర్మ భూతయోః ప్రథమపురుషైకవచనస్య
నుగ్వా స్యాత్. వచ్చును-వచ్చు, ఇచ్చెను-ఇచ్చె ఇత్యాది.

తద్ధర్మ భూతార్థములందుఁ బ్రథముపురుషైక వచనమున నుక్ ప్రత్యయము వికల్పముగా నగును. పూర్వసూత్రమునుండి 'నుగ్వా' యనునది యిం దనువర్తించును. లేట్టునఁ దద్ధర్మార్థమునందుఁ బ్రథముపురుషైకవచనమున నువర్ణకము రాఁగా 'వచ్చును'. ఇట్లె భూతార్థము (లిట్టున) వచ్చెను. వికల్పము గావున 'నుక్' రాని పక్షమునందు వచ్చె, వచ్చు అని యుండును.

తిపోలుక్పుటః (57) అని తిప్పునకుఁ దద్ధర్మార్థమున లోపము చెప్పఁబడినది. కాని లిడ్లేట్టులందు తిప్ స్థానమున నువర్ణము విధించు టుచిత మేమో పరిశీలింపఁదగియున్నది.

## 99. మధ్యాస్త్యయోర్న్యను వినయః.

లేడ్లిటోః = తద్ధర్మ భూతార్థములందు, మధ్యాస్త్యయోః = మధ్యమ పురుష యందును, దరువాతి దగు నుత్తమ పురుషయందును, వునువినయః-వును, విని, అను ప్రత్యయములు, వా = వికల్పముగా నగు ను.

వి. తద్ధర్మభూతయో ర్మధ్యోత్తమైక వచనానాం వును,
విని, ఏతే ప్రత్యయా వా స్యుః. నీవు సేయుదువు-
నీవు చేయుదు, నేను దాయుదును-నేను దాయుదు, నీవు
వ్రాసితివి- నీవు వ్రాసితి, నేను వ్రేసితిని-నేను వ్రేసితి.

పూర్వ సూత్రమునుండి లేడ్లిటోః అనునదియును, ప్రపూర్వ సూత్రమునుండి క్రమముగా 'వా' యనునదియు నీ సూత్రములోని కనువర్తించును.

తద్ధర్మార్థము నందు, మధ్యమోత్తమ పురుషైక వచనము లగు, వు, నుప్రత్యయములును, భూతార్థమునందు మధ్యమోత్తమైకవచనము లగు విని ప్రత్యయములును వికల్పముగా నగును.

(నీవు) చేయుదువు - వువర్ణము రాని పక్షమున చేయుదు.

(నేను) వ్రేసితిని - వివర్ణము రానిపక్షమున - వ్రేసితి.

ఇ ట్లితరము లూహింపఁదగును.

చేసెదు అను రీతిరూపములు మ్మాత మిటానసాధ్యము లయి యున్నవి.

లట్, ల్రుట్, అభావార్థములందు 'నుక్' వికల్ప మగుట యింతకు ముందు చెప్పఁబడినది. అట నుక్ సాధారణమని నెల్ల యర్థముల వికల్ప మని చెప్పియున్న నిట నద్దానిని జేర్ప నక్కఱ లేకుండెడిది. దానితోపాటు 'ని' వర్ణకమును జెప్పనవసర ముండదు కాఁగా దద్ధర్మభూతార్థములందు మధ్యమపురుషైకవచనము వికల్ప మగుట మాత్రమె చెప్పనఁ జాలెడిది.

## 100. లోట స్త్ర యాణామ్.

**లోటః = లోట్టునందు, త్రయాణామ్ = ప్రథమ, మధ్యమోత్తమ పురుషలు మూఁడింటను నేకవచనములు వికల్పముగా నగును.**

వి. లోట ఆది మధ్యాస్త్య పురుషైకవచనానాంను
వర్ణకో వా స్యాత్. అతఁడు వచ్చీని- అతఁడు వచ్చు,
నీవు కనియెదవు-నీవుకనియెద, నేను నిలిచెదను-
నేను నిలిచెద ఇత్యాది.

లోట్టునందు ప్రథమ మధ్యమ, ఉత్తమపురుషలు మూఁడింటను నేకవచనములు వికల్పముగా నగును. అతఁడు వచ్చీని-ఇట 'జీనిజ్వీధావతిజ (64) యను సూత్రముచే నగు 'జీనిచ్' ప్రత్యయము వచ్చినచో వచ్చీని, రానిపక్షమున అతఁడు వచ్చు (లోటో లేద్వత్?) అని యగును.

నీవు కయెగవు-మధ్యమపురుషైకవచన మగువువర్ణకము రానిచో కనియెద.

ఇచట 'కనియదు' అనురీతిగా నుదంతము లై యుండును. 'అందుకే సూరి తన ప్రణాళికచొప్పున 'లిఙ్లాట్టులవకారంబునకు లోపము విభాషనగు' నని వకారలోపము మాత్రము చెప్పెను. వువర్ణక(లోప)ము వికల్ప మనలేదు.

నేను నిలిచెదను ఇట నుత్తమపురుషైకవచన మగు నువర్ణకము రానిపక్షమునందు 'నిలిచెద' అనియె యుండును.

## 101. దౌడో లుక్ [1].

దౌ = దువర్ణకము పర మగుచుండఁగా, ఢ = డకారమునకు, లుక్ = లోపము, వా = వికల్పముగా నగును. వాశబ్దము పూర్వ సూత్రములనుండి క్రమముగా నిం దను వర్తించును.

వి. ఉండిధాతో ర్డకారస్య దువర్ణకే పరే వికల్పేన
లుక్ స్యాత్. ఉండుదురు. వికల్పేన డలోపే ఉందురు.
తోష్టురిత్యనేన ఉండురు. డువర్ణోకారలోపే
ఉంౘ్రడు. ఇతి చత్వారి రూపాణి స్యుః.

తద్ధర్మార్థమునందు 'దుట్టుటః' అని శత్రుప్రత్యయమునకుఁ బరముగా 'దుట్' వచ్చును. ఆ 'దు' వర్ణకము పర మగు చుండఁగా ఉండి ధాతువు యొక్క డకారమునకు **(శత్రుప్రత్యయసహిత మగు దువర్ణమునకు) వికల్పముగా లోప మగును.**

---

1. వసేరునః కానాదివచ్చుర్వో్యా (వై.చం.ఖి.74)

'ఉండుదురు' అనుచో నీ సూత్రముచే డువర్ణము లోపింపఁగా ఉందురు అని యగును. 'తోష్టుః' అను సూత్రముచే (తోటోచాదేర్బిన్దోః - 74) బిందువుమీఁది దకారమునకు వికల్పముగా డకార మగును. అట్లు డకారము రాఁగా 'ఉండురు' అని యగును. ఇణష్ఠోర్లలి (సంధి.19) అను సూత్రముచే డువర్ణము నందలి యుకారమునకు వికల్పముగా లోప మగును. లోపము వచ్చిన పక్షమునందు ఉం(డ్రు అని యగును.

ఉత్వలోపము లేనిచో ఉండురు.

దకారమునకు డకారము రానిచో ఉందురు.

డువర్ణమునకు లోపము రానిచో ఉండుదురు.

ఇట్లిట, ఉం(డ్రు, ఉండురు, ఉందురు, ఉండుదురు అనురీతిగా నాలుగు రూపము లేర్పడును. ఉండి ధాతోః అను వివృతి ననుసరించి వండుదురు ఇత్యాదులలో లోపము లేదు.

## 102. తెచ్చే రక్.[1].

తెచ్చేః = తెచ్చిధాతువు యొక్క చివరివర్ణమునకు, రక్ = రక్ అనునాదేశ మగును.

వి. తిచ్చి ధాతో రన్త్యస్య ఆదేశోరక్ స్యాదార్ధధాతుకే
పరే.

తెచ్చి ధాతువు యొక్క చివరి వర్ణమునకు 'రక్' అనునది యాదేశ మగును. 'రక్' అనుచో 'క' కారము ఇత్తు. కావున నది లోపింపఁగా 'ర' యనునదే నిలుచును. కి త్తగుటచే నీయాదేశ మంత్యాక్షరమున కగు నని చెప్ప యుండనవు.

తిచ్ - తెర -

## 103. తే ర్దిశ్చ.

తేః = తెచ్చి ధాతువు యొక్క 'తె' యనువర్ణము నందలి యచ్చునకు, దిః చ = దీర్ఘము నగును.

వి. తెచ్చి ధాతో రాదే ర్దీర్ఘశ్చ స్యాదార్ధధాతుకే పరే.
తెచ్చెన్, తెచ్చున్, తెచ్చిరి, తెచ్చుచున్నాఁడు
తేరఁగలఁడు, తేరఁడు, తేరుము, తేరనిమ్ము, తేరక,
తేరగ, 'అరదంబు దోతేర' - ఇత్యాది.

---

1. తెచ్చేరక్ - త్రి.శ.9.35 బృహస్పతి సూత్రము.

తెచ్చి ధాతువున 'తెచ్చేరక్' అను సూత్రముచే సంత్యాక్షరమునకు రగాదేశము కాఁగా (తెర) మొదటి యచ్చునకు ననఁగా 'తె' అనుచోట హ్రస్వ మగు 'ఎ'కారమునకు దీర్ఘము వచ్చును. తేరఁగలఁడు మొ॥

రగాదేశ మయినపుడె యీ దీర్ఘము రగాదేశముల్ఌట్, ప్రార్థన వ్యతిరేకాద్యర్థములందే యగును. లడాదుల యందు రగాదేశము లేదు. కావున నప్పక్షమున దీర్ఘము నుండదు. తెచ్చుచున్నాఁడు మొ॥.

## 104. లోపస్సోమ చన్ద్రస్య.

సోమచన్ద్రస్య = సోమచంద్రుని మతమున లోపః = ఆదేశ మయిన 'రక్' అనుదానికి లోపము వచ్చును.

వి. తెచ్చి ధాతో రగ్వర్ణకస్యలోపస్స్యా దార్ధధాతుకే
పరే తేర్దిశ్చేతి దీర్ఘః

ఌడాద్యర్థములందు తెచ్చి ధాతువు నంత్యాక్షరమున కాదేశమయిన రక్కునకు సోమచంద్రుని మతమున లోప మగును. 'తేర్దిశ్చ' అనుసూత్రముచే మొదటి యచ్చున కయిన దీర్ఘ మట్లె యుండును. తేరఁగలఁడు ఇత్యాదులందు 'ర'వర్ణమున కిట్లు లోపము రాఁగా తేఁగలఁడు అని యగును ఇట్లె యితరస్థలములు.

'సోమచన్ద్రస్య' యనుట చే నిది యొక పక్షము కావునఁ బక్షాంతరమునందు రక్కునకు లోపము రాక తేరఁగలఁ డను రీతి రూపములు నుండును.

## 105. ఏజోయశ్రు తిశ్చ.

ఏజః = ఏ(ఐ)ప్రత్యాహారసిద్ధము లగు (ఏఓ) వర్ణములకు, యశ్రుతిః చ = యకారమునగను.

వి. త్యేగలఁడు, త్యెండు, త్యేక, త్యేగ, త్యే నిమ్ము
త్యేలేఁడు, (త్యేలెమ్ము, త్యెండి)

ఏ(ఐ) కారమునకుఁ బూర్వమునందు యశ్రుతియునగును. అనఁగా ముందు యకారము వచ్చి చేరును. త్ + ఏ - త్ + య్ఏ - త్యే - త్యేగలఁడు మొ॥

త్యేగలఁ డను రీతి రూపములు కావ్యములందు మృగ్యములు. నాఁటి జన వ్యవహారమునం దట్లుండియుండ వచ్చును. కాని ప్రయోగ ప్రామాణ్యము లేని యిట్టి రూపములను లక్షణ బద్ధము చేయుట ప్రయోజనవంతముగాఁ దోఁదకున్నది.

## 106. చొచ్చే ళ్ర.[1].

చొచ్చేః చ = చొచ్చిధాతువునను నంత్యవర్ణమునకు, తెచ్చి ధాతువునకు వలె రగాదేశమగును.

వి. చొచ్చిధాతోరన్త్య వర్ణస్య చ ఆదేశ రక్స్యాదార్ధ
ధాతుకేపరే - చొచ్చెన్ - చొచ్చిరి, చొచ్చున్,
ఛొచ్చుచున్నాఁడు, చొచ్చుఁగాత- చొచ్చుఁగాక.
చొరఁగలఁడు, చొరఁడు, చొరుము, చొర నిమ్ము, చొరక,
చొరగ ఇత్యాది.

చొచ్చి ధాతువునం దంత్యాక్షరమునకు ల్యాడాద్యర్థములందు 'రక్' అను నాదేశ మగును.'రక్'లో కవర్ణ మిత్తు కావున లోపింపఁగా 'ర' వర్ణమె నిలుచును.

చొచ్చి - చొర - చొరఁగలఁడు- మొ॥ ల్యట్, ప్రార్థనము, వ్యతిరేకము మొద లగు నర్థములందు మాత్రమె యీ యాదేశము కాగా లడాద్యర్థములందు రగాదేశము లేదు. చొచ్చు చున్నాఁడు, చొచ్చెన్ చొచ్చును అనువిధముగనె యగును.

## 107. చచ్చే రావుక్.[2]

చచ్చేః = చచ్చి ధాతువునఁ దుది వర్ణమునకు 'అవుక్' - అవుక్ అనునది యాదేశ మగును.

వి. చచ్చి ధాతో రన్త్యవర్ణస్య అవుగాదేశ స్స్యాదార్ధ
ధాతుకే పరే - చచ్చెన్ - చచ్చిరి - చచ్చుచున్నాఁడు,
చచ్చున్, చచ్చుఁగాత, చచ్చుఁగాక,
చావఁగలఁడు, చావండు, చావుఁడు, చావుము,
చావక, చావగ, చావని వాఁడు ఇత్యాది.

ల్యాడాద్యర్థములందు చచ్చి ధాతువు యొక్క తుది వర్ణమునకు 'అవుక్' అనునది యాదేశ మగును. 'అవుక్' అనుచో కకార మిత్తు కావున లోపింపఁగా 'అవు' అనునదే మిగులు.

---

1. చొచ్చ చ్చోరః వై.చం.తి.87
2. చచ్చ వుచ్చ తెచ్చచ్చ నొచ్చాం ఞ్లక్క్వే? వై.చం.తి.92.

చచ్ - చ + ఆవు - అనుచో సంధి యై చావు అని యగును చావఁగలఁడు మొ॥ ఆవుగాదేశము, ల్రుట్, ప్రార్థనము, వ్యతిరేకము మొద లగు నర్థముల యందే కావున లడాద్యర్థములందు లేదు. చచ్చుచున్నాఁడు, చచ్చున్ మొ॥

వి. [1]అచ్చి, ఎచ్చి, హెచ్చి, గ్రుచ్చి, పుచ్చి, మెచ్చి - ఇత్యాదీనామ్
ఏషాం సార్వధాతు కార్ధ ధాతుకయోః పరయోః
పుపూ? న స్తః. అచ్చెన్, ఉచ్చున్, హెచ్చుచున్నాఁడు,
గ్రుచ్చుచున్నది, పుచ్చున్, మెచ్చెన్, విచ్చున్, అచ్చఁగలఁడు.
ఉచ్చఁడు, ఎచ్చక, గ్రుచ్చును, పుచ్చదు, మెచ్చగలఁడు
ఇత్యాది.

అచ్చి,ఎచ్చి, హెచ్చి, గ్రుచ్చి, పుచ్చి, మెచ్చి, విచ్చి మొదలగు ధాతువులకు లడాదులతో పాటు ల్రడాద్యర్థగులందును తుదివర్ణమునకు ఏకారము రాదు. హెచ్చుచున్నాఁడు యనురీతిగనె, హెచ్చ గలదు మొదలగు ల్రడాది స్థలములందును ఏత్వము లేదు.

హెప్పఁగల డనురీతిగా నుండ వని యభిప్రాయము గావలెను. ఇట లక్షణము నుదాహృతులు నింకను సూక్ష్మముగాఁ బరిశీలింపవలసి యున్నది.

## 109.ణిచ్చ [2].

ణిచ్ చ = ణిచ్ ప్రత్యయము గూడఁ ననుస్వార సహిత మగును)

వి. ణిజనుస్వారస్స్యాత్ [3] ఇం.

'ణిత్' అనునది సంస్కృతాను సారముగా ( ప్రేరణమునం దగును. 'ణిచ్' లో ణకార చకారము లిద్వర్ణములు కావున 'ఇ' అనునది నిలుచును. ఈణి చ్ (ఇ) ప్రత్యయమునకుఁ బరముగా ననుస్వార మగును. ఇం. అని యగును. (త్రి.శ.ను బట్టి వీని నడుమ నొక సూత్రము నష్టమయ్యె ననిపించు).

1. బహుశః ఇది వృత్తికార వచనమేమో.
2. ణిచ్చ. త్రి.శ.9.6 బృహస్పతి సూత్రము
3. ణిదనుస్వారః త్రి.శ.9.7 బృహస్పతిసూత్రము.

## 110. పుగాగమశ్చ [1].

పుగాగమః చ= ణిచ్ ప్రత్యయమునకు 'పుక్' అనునది యాగమ మగును.

వి. యత్ర యత్ర ణిచ్ ప్రత్యయః తత్ర తత్ర తస్య పుగాగమోఽనుబన్ధ కస్స్యాత్. ఇంపు, రక్షింపున్, రక్షింపించెన్, రంజింపించెన్, ఇత్యాది.

ణిజర్థమున ననఁగా ప్రేరణమునందు ణిచ్ ప్రత్యయమునకు ('ఇం') పైని 'పుక్' అనునది యాగమ మగును. 'పుక్' అనుచో కకార మిత్తు కావున లోపింపఁగా 'పు' అనునదే నిలుచును.

రక్షధాతువుపై ణిచ్చు రక్షి. 'ణిచ్చ' యని పై ననుస్వారము 'రక్షిం' - పుగాగమశ్చ యని దానికి పుగాగమము. రక్షింపు దీనిపై ఇంచిరాగమమై రక్షింపించ్ - రక్షింపుచున్నాఁడు మొదలుగా రూపము లగును.

సంస్కృతధాతువులకు సాధారణముగ నించిరాగమ మగును. ప్రేరణార్థక మైన యాగమము దానిపైని జేరుట యను క్రమ మితర వ్యాకరణములందుఁ గాని యిట ముందు ణిచ్, దానిపై ఇంచి రాగమ మగుటయను క్రమము వర్ణింపఁబడినది.

## 111. ఉడుః.[2]

ఉడుః = ధాతువునకు 'ఉడు' అను ప్రత్యయ మగును.

వి. సతిసప్తమ్యర్థే క్రియాన్త్యస్య ఉడుస్స్యాత్.

అతఁడు చేయుడు, ఈయుఁడు, (ఇనుడు) వినుడు,

కనుడు ఇత్యాది.

---

1. పుగాగమశ్చ - త్రి.శ.9.8 బృహస్పతిసూత్రము.
2. దుశ్చ? త్రి.శ. 10.9.

'ఆనంతర్యంబున డువర్ణకంబు ద్రుతాంతం బగు' నని చెప్పఁబడు నానంతర్యార్థకమె యిట సతిసప్తమ్యర్థకముగాఁ జెప్పఁబడిన దని తోఁచు. ధాతు వుదంతము లగుట నాయెడ 'డు' ప్రత్యయముగాఁ జెప్పఁబడఁగా నిట ధాతువులు హలంతములుగా భావింపఁబడుట వలనఁ బ్రత్యయము 'ఉడు' అని చెప్పఁబడినది.

విన్ + ఉడు = వినుడు (వినుచుండ వినఁగా- నని యర్థము?

## 112. పౌనః పున్యేయజ్ [1].

పౌనం పున్యే = పునఃపునః - అనుదాని యర్థమున, యజ్ - యజ్ అగును.

వి. సంప్రార్థనార్థే పౌనః పున్యే యజ్ స్యాత్.

రారా [2], పోపో, లేలే, ఈయీ, కాకా. ఇత్యాది.

సంప్రార్థ నార్థమున పౌనఃపున్యమునందు య జ్జగును. ద్విరుక్తి కలిగి రా రా పోపో ఇత్యాదిగ నగును.

'ఈయీ' యనురీతిరూపము మృగ్యము. జన వ్యవహారమున నుండ వచ్చును.

సంస్కృతమందలి యజన్తములను దృష్టియందుంచుకొని పౌనఃపున్యార్థమున నిట (సి॰ కౌ. 3.1.22) యజ్జు విధింపఁబడినది. తెలుఁగున నిది విచార్యము.

## 113. హద్వీ పూర్వపరయోః.[3]

పూర్వపరయోః = పూర్వవర్ణమునకును, పరవర్ణమునకు హద్వీ = క్రమముగా హ్రస్వమును ద్విత్వము నగును.

వి. సంప్రార్థనార్థే పూర్వస్యై కాక్షరస్య దీర్ఘస్య, తత్పర
స్య వర్ణస్య చ హ్రస్వద్విత్వే క్రమాత్ స్తః రమ్మ
పొమ్మ, తెమ్మ, ఇమ్మ, కమ్మ.

---

1. పౌనః పున్యేయజ్ త్రి.శ.9..12 బృహస్పతి సూత్రము.
(2. ద్విత్వంచ - త్రి.శ. 9.13. బృహస్పతిసూత్రము?)
3. ద్విత్వంచ.? త్రి.శ.9.13 బృహస్పతిసూత్రము.
ద్విత్వంచ దీర్ఘః వై.చం.తి.69.

వృత్తియందుఁ బెక్కు విశేషము లుగ్గడింపఁ బడినవి. వీనికి సూత్రమున నాధారము మృగ్యము. సంప్రార్థనార్థ మునందు ముందఱదియు, నేకాక్షరము నయిన దీర్ఘమునకు హ్రస్వ మగును. దానికిఁ దరువాతి వర్ణమునకు ద్విత్వము వచ్చును.

తెచ్చి ధాతువునకుఁ బ్రార్థనార్థమున నేకవచనమునందు 'ముగ్డుజౌ సంప్రార్థనార్థే' యని ముప్రత్యయము తెచ్చ్ + ము. 'తెచ్చే రక్' (101) తెర + ము 'తేర్దీర్ఘః' (103) యని దీర్ఘము తేర + ము లోపస్సోమ చన్ద్రస్య (104) యని 'ర'లోపము తే + ము అని యుండఁగా నిటఁ బూర్వమునం దేకాక్షరమగు 'తే' యనుదాని యందలి దీర్ఘమునకు హ్రస్వము రాఁగా తె + ము దానికిఁ బర మయిన మువర్ణమునందలి మకారమునకు ద్విత్వ మయి '**తెమ్ము**' అని యగును. ఇతరము లూహ్యములు.

## 114. యజశ్చ.

యజః చ = యజ్జనకుఁ **బరముగాఁ** గూడ, హ్రద్వి = హ్రస్వద్వి**త్వము** లగును.

వి. యజః పరతః హ్రస్వద్విత్వే క్రమాత్ స్తః పోపోమ్ము,
**తే**తెమ్ము, ఈయిమ్ము, రారమ్ము, కోకొమ్ము,
లేలెమ్ము.

'పౌనః పున్యే యజ్' అనుట ననుసరించి యజంతము **లగువాని**పైఁ గూడ హ్రస్వద్విత్వము లగు నని యభిప్రాయము.

లేలే – లే లెమ్ము వెు॥

లేలే– యన్నదానిపై బ్రార్థనమున నేకవచనమున ముకర్ణకము నిత్యాదిగాఁ బ్రక్రియ నెన్నవలయును. గాఁబోలును.

లెమ్ము + లెమ్ము అనుచో ము(డుజ్) లోపమును దీర్ఘము నిత్యాదిగా నితరలాక్షణికులు వీని ప్రక్రియను స్పష్టము గావించియున్నారు.

ఈ యి మ్మను రూపము మృగ్యము ఇమ్మిమ్మని యుం డును.

## 115. న నిగ్రహాదిషు.

నిగ్రహాదిషు = నిగ్రహము మొదలగు నర్థములందు. న = పూర్వోక్తము లగు హ్రస్వత్వత్వములు లేవు.

వి. నిగ్రహశోకే ర్ష్యాది ష్వర్థేషు ద్యోత్యేషు
ఆదేశ దీర్ఘాణా మామ్రేడితానామ్రేడితేఽపి
హ్రస్వద్విత్వే న స్తః. రా. రారా (రా) ఈ, ఈయీ
(యీ) తే. తేతే (తే) లే. లేలే - (లే) కా.
కాకా (కా) పో. పోపో (పో) ఇత్యాది.

నిగ్రహమ్ము (బెదిరింపు మొ॥) శోకము, ఈర్ష్య మొదలగు నర్థములు ద్యోతక మగు సందర్భమున, ధాతువుల కాదేశముగా వచ్చిన (వచ్చ్ - రా అయ్ - కా.మొ॥) దీర్ఘాక్షరము లామ్రేడితము లయినను, గాకున్నను, బూర్వోక్తము లకు హ్రస్వద్విత్వములు లే వని యభిప్రాయము. రా. ఇల నామ్రేడితము గాదు. అయినను హ్రస్వద్విత్వములలో 'రమ్ము' అని కాలేదు.

రారా. ఇల నామ్రేడితము రారమ్ము. అని కాలేదు.

హ్రస్వద్విత్వములు లేవనఁగా రాము, రారాము అని యుండక, రా, రారా యనియె యుండుట విశేషమె యనక తప్పదు.

## 116. అని ర్నిగ్రహే.

నిగ్రహే = నిగ్రహార్థమునందు అనిః = అని అనునది యగును.

నిగ్రహార్థమునందు ధాతువునకు 'అని' అనునది యగును. అని యనుదానిలో ఇకార మిత్తు కావున లోపింపఁగా 'అక' అనునదే యగును.

వి. చేయ్ అన్ - చేయన్ - మొ॥
క్రియాన్త్యస్య దీర్ఘోవాస్యా [1]త్.
చేయఁగ, చేయంగ, వినఁగ, వినంగ కనఁగ, కనంగ
చేయగా చేయంగా, వినగా వినంగా ఇత్యాది.

1. గాంగా.? త్రి.శ.9.33 బృహస్పతి సూత్రము.

దీనికి ముందు సూత్ర మేదియేని నష్ట మయి యుండు ననిపించు చున్నది. చేయఁగ ఇట జివర దీర్ఘము రాఁగా చేయగా, వికల్పము గావున దీర్ఘము రాని పక్షమున చేయగ.

'క' అనునది చేరుటయు, దానికి వికల్పముగ దీర్ఘ మగుటయు ననునంశములను ప్రస్తావించు లక్షణ మొకఁ డిట నుండి యుండ వచ్చును.

అనిర్ని గ్రహే యనుదానికి నిచటి యుదాహృతులతోఁ బొత్తు గుదురకున్నది.

## 117. ముగ్డుజౌ వనేర్వా.

అనేః = అని అనుదానికి వా = వికల్పముగ్గా ముగ్డుజౌ = ముక్, డుజ్ అను ప్రత్యయము లగును.

వి. అనేః పరతశ్చాదేశ పూర్వ కౌ ముగ్డుజౌ వర్ణకౌ
వికల్పేన స్తః చేయనిమ్ము, రానిమ్ము, పోయ
నిండు, రానిండు, కననిమ్ము, కననిండు ఇత్యాది.

'అనిర్నిగ్రహే' యనుసూత్రముచే నయిన అని అనుదానికిఁ బరముగ ఆదేశ పూర్వక మగు ముక్, డుజ్ అను ప్రత్యయములు వికల్పముగా నగును. ఆదేశ పూర్వకమని సామాన్యముగాఁ జెప్పినను ఇచ్చిధాతువున కాదేశ మగు 'ఈః' యనునది (పూర్వమునందుఁ గలిగినముగ్డుజ్జలె) యని యుదాహరణ క్రమమును బట్టి గ్రహింపవలయును.

చేయ్ ధాతువుపై 'అనిర్నిగ్రహే' యను సూత్రముచే 'అన్' అనునది కాఁగా చేయ్ + అన్ = చేయన్, ప్రస్తుత సూత్రముచే ఈము అనునది యై చేయన్ + ఈము - 'హద్విపూర్వపరయోః' అనుసూత్రముచే హ్రస్వద్విత్వము లయి చేయనిమ్ము అని యగును. ఇ ట్లితరము లూహ్యములు. చేయనిండు అనుచో హ్రస్వము మాత్రమె యైనది. డు (జ్జు) జి త్తగుట ఁబర మైన యనుస్వార మ చ్చుగుటవలనఁ గావచ్చు నేమో.)

## 118. పదే ర(ట్ప్రార్థ నార్థే.

ప్రార్థనార్థే = ప్రార్థనార్థమువందు పదేః = పది ధాతువునకు అట్ = అట్ ప్రత్యయ మగును.

వి. పది ధాతో రట్ స్యాదేకవచనే పద- పదపద
(ముగ్డుజౌ ప్రార్థనే) ఇత్యనేన బహువచనే డుజ్
ప్రత్యయ స్స్యాదితి ఙోద్ధవ్యః' పదుఁడు, పదుండు ఇత్యాది.

ప్రార్థనార్థము నందు పది ధాతువునకు 'అట్' అనునది యగును. 'అట్' అనుచో టకార మిత్తు. కావున లోపింపఁగా 'అ' అనునదే మిగులును. పద్ + అ = పద- అని యగును: 'ముగ్దుజౌ ప్రార్థనే' యనుసూత్రముచే నేకవచనమున ము(క్ప్రత్యయము రాఁగాఁ బదము అని యు, బహువచనమున డు(జ్ప్రత్యయము రాఁగా పదఁడు అనియు నగును.

వివృతియందు 'అట్' ఏకవచనముగా నగునని తలఁచబడినది. కావున పదిధాతువుపైఁ బ్రార్థనార్థమున నేకవచనమె 'అట్' అగుటచే 'ముగ్దుజౌ' యనుసూత్రముచే ము(క్ప్రత్యయము రాదు. కావున 'పద' అనియె యగును. ఈ పక్షమున 'పదము' అను రూపము సాధ్యము. 'పదపద' అను స్థలమును బట్టి యట్ ఏకవచనమని దీనిపై ము(క్ప్రత్యయము రాదని తలఁచ వీలు లేదు. పదము (పదము) అని యున్నను 'ముకోలుక్స' (69) యనుసూత్రముచే ము(క్ప్రత్యయము లోపింపఁగాఁ బైరూపము లేర్పడును.

ఇంక 'అట్' ఏకవచన మని తలఁచుటవలన పది ధాతువునకుఁ బ్రార్థనార్థమున బహుత్వమునందు 'ముగ్దుజౌ ప్రార్థనే' యనిడు(జ్ప్రత్యయ మయి పదుఁడు అని కావలయును. వివృతియం దట్లే ఉకారమధ్యముగా నుదాహరింపఁబడినది. కాని 'పదఁడు' అనురీతిగా నకారమధ్యముగనె ప్రసిద్ధము.

'పది' ధాతు వొకటి ప్రత్యేకముగాఁ గానరాదు. పడుచున్నాఁడిత్యాదిగా నితర రూపములు లేవు గదా. సూరి పోవుధాతువు నకె పొద, పద యనునవి యాదేశించి పొదము పదము పొదఁడు పదఁ డనురీతిగా సాధించి యుండుట ప్రసిద్ధమె.

పదుఁ డనురీతి స్థితిని నిర్ణయించు ప్రామాణిక మైన ప్రయోగము లభించినఁ దప్ప 'పదేరట్' అని చెప్పఁబడిన 'అట్' ఏకవచన మని చెప్ప వీలులేదు. అట్లయ్యుఁ 'బదము' అనురీతి స్థితి యిట నసాధ్యమె యగుట చూడఁగా లక్షణము ననుసరించి అట్ ధాతువునకు నగుటయు దానిపై ముడుజ్జులగుటయు గుర్తించుట సక్రమ మని తోఁచుచున్నది.

## 119. కజభావే.[1]

అభావే = అభావార్థమున, కచ్ = ధాతువునకు 'కచ్' అను ప్రత్యయ మగును.

వి. అభావార్థే ధాతోః కచ్ ప్రత్యయస్స్యాత్ - చేయక, తినక, వినక, చూడక ఇత్యాది.

అభావార్థమునందు ధాతువునకు 'కచ్' అను ప్రత్యయ మగును. 'కచ్' అనుచో చకార మిత్తు. కావున నది లోపింపఁగా 'క' యనునదియే మిగులును.

---

పదే రట్స్ త్రి.శ.9.11. బృహస్పతి సూత్రము.

1. అభావే అకః (త్రి.శ.9.45)

చేయి ధాతువుపైన బావార్థమును వివక్షింపఁగా 'చేయ్' అనుదానిపై 'ల్బద్వ్యతిరేకాదౌఘల్' (50) అను సూత్రముచే ఘల్ ప్రత్యయ మై ('ఘల్'లో 'అ' అనునదె మిగులును) చేయ్ + అ = చేయ అని కాఁగా నీ సూత్రముచే 'కచ్' ప్రత్యయ మై 'చేయక' యని యగును. ఇ ట్లితరము లూహింపవచ్చును.

ఇది వ్యతిరేక క్త్వార్థముగాఁ బ్రసిద్ధము.

కజ్మి కావభావే (76) యను సూత్రమున నీ ప్రత్యయము విధింపఁబడియే యున్నది ఇట బునరుక్త మగుటలోఁ బ్రయోజనము గానరాకున్నది.

## 120. మిట్చ.

**అభావే** = అభావార్థమునందు, మిట్ చ = మిట్ప్రత్యయము నగును. 'కజభావే' యనుపూర్వ **సూత్ర**మునుండి 'అభావే' యనున దిం దన్వయించును.

వి. **అ**భావార్థే మహదమహతోస్తృతీయా పఞ్చమ్యర్థ యోర్ధాతోర్మిట్ ప్రత్యయస్స్యాత్. చేయమి, వినమి, తినమి, చూడమి – చూడనందుచేత, కననందు వల్ల, ఇత్యాది.

**అభావార్థము నందు మహ దమహదర్థములు రెంట ధాతువునకు, తృతీయా పంచమీ** విభక్తుల యర్థమున **మిట్** ప్రత్యయ మగును. **'మిట్' అనుదానిలో** టకార **మిత్తు. కావున** నది లోపింపఁగా 'మి' యనునదే మిగులును.

చేయి ధాతువుపై నభావార్థమునందు 'ల్బద్వ్యతిరేకాదౌఘల్' (50) అను సూత్రముచే ఘల్ప్రత్యయ మయి చేయ్ + అ = చేయ యని కాఁగా ప్రస్తుత సూత్రముచే మిట్ప్రత్యయ మయి చేయమి అని యగును. ఇది వ్యతిరేక భావార్థముగాఁ బ్రసిద్ధము.

విన్నతి యందు మహదమహదర్థములు రెంట ననియు తృతీయా పంచమ్యర్థములం దనియు రెండంశము లధికముగాఁ జెప్పఁబడినవి. లక్షణమున నాధారము లేని యీ యంశములు సంగతములుగా లేవు.

(అభావార్థమునం దగు ననుట నిట నమహదర్థమె కాని మహదర్థ మసంభవము 'చేయమి' యనఁగా 'జేయకపోవుట' 'చేయమి' యను దానిచే స్త్రీతిర్యగ్డభిన్నమువాచ్య మగుట యెట్లు? వాఁడు చేయమి, అదిచేయమి, మొ॥ వానింబట్టి కర్తృత్వము ననుసరించి **యివి** మహదమహత్తులుగాఁ జెప్ప వీలులేదు గదా)

'మి' యనునది కృత్ప్రత్యయము. కృదంత మిది 'కృత్తద్ధిత సమాసాశ్చ' యను నార్య వ్యాకరణ సంప్రదాయము ననుసరించి ప్రాతిపదిక సంజ్ఞ నందును. కావున దీనిపై యథార్థముగాఁ బ్రథమాది విభక్తు లవును. దానము చేయమి తగదు. అనుచో చేయమి యనునది 'చేయకుండుట ' యనురీతిగాఁ బ్రథమాంతము ఉక్తార్థమునం దిటఁ బ్రథమ దానము చేయమి నొప్పరు అనుచో 'చేయకపోవుటను' అనురీతిగా నిటఁ గర్మార్థమున ద్వితీయ. పనుల చేయమికి నాగ్రహించె, చేయమిఁ దాత్పర్యము. (చేయకపోవుట యందు) మొ॥ రీతిగా నెల్ల విభక్తులు యథార్థముగా నగును.

కావున మిప్రత్యయము తృతీయా పంచమ్యర్థములందే యగు ననుట యుచితము గాదు. దీనిపై నే విభక్తి యం దయిన బహువచనము క్వాచిత్క మని యెఱుఁగవచ్చును.

## 121. ఆదేర్వాలుగనేః[1]

అనేః = అని ధాతువున, ఆదేః = మొదటివర్ణమునకు, వా = వకల్పముగా, లుక్ = లోపమగును.

వి. అనిధాతో రాదే రకారస్య వా లుక్ స్యాత్.

'అని' ధాతువు నందు మొదటి వర్ణమున కనఁగా 'అ' కారమునకు వికల్పముగా లోప మగును. అని – అకారము లోపించిన పక్షమునఁ 'ని' వా యనుటచే లోపింపని పక్షమునందు 'అని'.

## 122. కాడితః.

అనేః = అని ధాతువు నందలి ఇతః = ఇకారమునకు, కాట్ = 'కాట్' అనునాదేశ మగును. 'ఆదేర్వాలుగనేః' అనుపూర్వసూత్రము నుండి 'అనేః' అనునది యిందనువృత్త మగును.

వి. అవిశిష్ట నివర్ణ స్యేకారస్య వా లుక్ స్యాత్ కటో రిత్సంజ్ఞా 'నా' ఇత్యేకం రూపమ నిధాతో రన్యస్య.

'అని' ధాతువునందు 'అదేర్వాలుగనేః' అనుసూత్రముచే అకారము లోపింపఁగా మిగిలియున్న 'నివర్ణము నందలి యికారమునకు 'కాట్' అనునది యాదేశమగును. 'కాట్' అనుచో కకారమును టకారము నిద్వర్ణములు కావున నవి లోపింపఁగా 'ఆ' అనునదే నిలుచును.

---

1. అనే రకారలుక్స. త్రి.శ.9.38. బృహస్పతి సూత్రము.

అని 'ఆదేర్వాలుగనే' 'కాడితః వా - అని యగును.

అవివక్షితమిత్, అనుసూత్రము ననుసరించి ధాతువు చివరి యికారము వివక్షితము గాకుండుటచే 'తస్య లుక్' అనుసూత్రముచే ఇత్వము లోపింప వలయును. అయ్యును 'కాడితః' అని యిట నిత్తునకు కాడాదేశమును విధించిన సామర్థ్యము ననుసరించి యీ స్థలమున మాత్రము తుది యిత్వము లోపింప దని గ్రహింపఁదగును.

'కాడితః' అని కాడా దేశము అని ధాతువున అకారము లోపించినపుడే కావున లోపింపని పక్షమునందు 'అన్' అనియె ధాతురూప ముండును.

వి. అనఁగా నిత్యర్థే నా ఇతి రూపమ్.

అనఁగా అనునర్థమున 'నా' అని రూప మగును. నాఁడు (అనఁడు) నాక (అనక) యను రీతిగా వ్యతిరేకాద్యర్థములం దిట్లు 'నా' అనురూపము గల్గుచున్న దని గ్రహింప వచ్చును.

## 123. సెడు సెడి కర్మధారయే.[1]

కర్మధారయే = కర్మధారయ సమాసమునందు సెడు, సెడి, ఎడు, ఎడి అనుప్రత్యయము లగును.

వి. కర్మధారయ సమాసే సెడు సెడి
ద్వౌ ప్రత్యయౌ స్తః చూచెడి రాజు, ఇచ్చెడిదాత,
ఉండెడుదొర, పలికెడు భామ ఇత్యాది.

కర్మధారయ సమాసమునందు ధాతువునకు సెడు, సెడి అనుప్రత్యయము లగును. ఇందలి శకార మిత్తు గావున లోపింపఁగా ఎడు, ఎడి అనునవి నిలుచును. చూచి ధాతువునకు- ఎడు ప్రత్యయము రాఁగా (చూచ్ + ఎడు) చూచెడురాజు, ఎడిప్రత్యయ మయిన (చూచ్ +ఎడి) చూచెడి రాజు.

కర్మధారయసమాసమునం దనుటచే చూచెడు, చూచెడి అనురీతిగా వ్యస్తతయిం దెడు ఎడిప్రత్యయము లుండవు.

చూచెడివాఁడు, చూచెడునది, యనురీతిని గూడఁ గర్మధారయసమాసములుగా నిప్పక్షమున గుర్తింపవలసియున్నది.

---

1. శెడి ఏశెడు ?
ధాతో రెడ్వేడస్తద్ధర్మే వై.చం.కృ.27

## 124. ధాతోరేత్ ప్రాచామ్.

ప్రాచామ్ = ప్రాచీనులమతమున, కర్మధారయే = కర్మధారయమున (**ఎడి**, ఎడు ప్రత్యయములే **కాక**) **ధాతోః** = ధాతువునకు, ఏత్ = ఏత్వ మగును, 'ఎడుఎడికర్మధారయే' యనుపూర్వసూత్రమునుండి 'కర్మధారయే' యనునది యిట ననువర్తించును.

వి. మహదమహతోః (పదప్రత్యయేషు పరేషు?)
ఏత్ స్యాత్ కర్మధారయే ప్రాచామ్మతే. అయ్యేవాఁడు,
చూచే రాయఁడు? ఉండేదొర ఇత్యాది.

కర్మధారయ సమాసమునందు ధాతువునకు ఏత్వ మగు నని ప్రాచీనుల మతము. **అనఁగా** 'ఎడుఎడి కర్మధారయే' యని చెప్పఁబడిన ఎడు, ఎడి అనుప్రత్యయములకు మాఱుగా **నే**త్వము వచ్చు నని ప్రాచీనుల యభిప్రాయము.

చూచెడు దొర, లేక చూచెడిదొర యనుస్థలమున **ధాతు**వునకు (చూచ్) ఏత్వము రాఁగా (చూచ్ + ఏ) చూచే దొర యని యగును. ఇ ట్లితరము లూహింపవచ్చు.

వి. ఏతే ప్రాచాం ప్రయోగా అసాధుత్వాత్కణ్వరావణ
పుష్పదన్తాది త్రైలింగ్యమహర్షిభి? ర్నిరాకృతా ఏవ.

ఎడు, ఎడి ప్రత్యయములకు మాఱుగా ఏత్వము గల్గిన 'చూచేదొర' యనురీతి వగు ప్రాచీనులు సమ్మతించిన రూపముల సాధువులు కణ్వుఁడు, రావణుడు, పుష్పదంతుఁడు మొదలగు నాంధ్రలాక్షణిక మహర్షు లట్టి యేత్వ మయిన రూపములను దిరస్కరించి యున్నారు. కావున చూచెదొర యనురీతిరూపములు లక్షణవిరుద్ధము (గ్రామ్యము) లని యభిప్రాయము.

ఇట్లీ రూపముల సాధువు లని భావించుసందర్భమున 'ధాతోరేత్ప్రాచా' మ్మని ప్రత్యేకలక్షణములోఁ బ్రాచీనుల మతము నుద్ధరింపవలసిన యావశ్యకము గానరాకున్నది. **'మయిదాటువాని'** కనురీతిగాఁ గవిప్రయోగము లున్నను బ్రామాణికులు పెక్కురు వీనిని సాధువులుగనె తలఁచిరి.

---

1. **శేష్** - త్రి.శ.10.9.

## 125. ద్యదివ్యవయశ్చ.

ద్యదివ్యవయః చ = ది, అది, వి, అవి, యనునవి గూడ నగు

వి. అమహతి శెడి, శెడ్వోః పరత ఏకవచన బహు
వచనయోః క్రమాత్ ది, అది, వి, అవి
స్యుః చూచెడిది, చూచెడియది, చూచెడివి, చూచెడి
యవి.

అమహదర్థమునందు 'శెడుశిడి కర్మధారయే' యని యగు, శెడు, శెడి ప్రత్యయములకుఁ బరముగా నేకవచనమున, ది,అది యనునవియు, బహువచనమున -వి, అవి యనునవియు నగును.

ఏకవచన స్థలమున 'ఎడి'పై 'ది'వర్ణము రాఁగా చూచెడిది 'అది' యైనచో చూచెడియది బహుత్వమున 'వి' వర్ణము రాఁగా చూచెడివి. 'అవి' యనునది యైన చూచెడియవి.

ఎడుపై ది,వి కానరావు. చూచెడునది, చూచెడునవి ఇవి కర్మధారయము లనుట కవకాశము లేదు. ది,వి ఇత్యాదులు ప్రత్యేకముగా విధింపఁబడినవి గదా. కర్మధారయములు గాకుండఁగా శెడు, శెడి ప్రత్యయము లగుటకు వీలు లేదు. అవి కర్మధారయమునందుఁ జెప్పఁబడినవి గావున కాఁగాఁ గర్మధారయేతర స్థలమున నరుదుగా ఎడియెడు లగుట గుర్తింపవలెను.

అమహత్ స్థలమున ది, వి మొ॥ వాని నిట్లు సాధింపఁగా, మహత్త్వమున చూచెడివాఁడు ఇత్యాదులను బ్రస్తావింపకుంట విశేషము.

చూచెడిదానిని, చూచెడు వారియందు, మొదలగు వానినిబట్టి ది, అది మొదలగురీతి గాఁగా సూరి పేర్కొన్నట్లు విభక్తి వివక్షలోఁ దచ్ఛబ్దానుప్రయోగముగాఁ జెప్పుటయె యుచితము గానుండు నని తెలియవచ్చును.

---

1. శెడిది శెడియది. (ఇత్యాద్యాస్తద్ధర్మాః)
   త్రి.శ.9.40.బృహస్పతి సూత్రము.

## 126. ణ్యనుబంధ ప్రార్థనా భావాది షు పశ్చేః.[1]

ణియ అనుబంధ, ప్రార్థన, అభావాదిషు = ణిచ్, ప్రార్థనము, మొద లగుస్థలములయం దవి పర మగుచుండఁగ్రా చేః = ముందున్న ధాతువు చివరి చివర్ణమునకు పః = పకార మగును.

వి. ణిజ్వర్తమాన భవిష్యత్ప్రార్థనాభావ వ్యతిరేక
ప్రతిషేధాదిషు పరేషు ధాతో రించి ఆగమ చివర్ణస్య
పస్స్యాత్. పోషింపఁగలఁడు, రక్షింపఁగలఁడు,
పోషింపు చున్నాఁడు. రమింపఁగలఁడు, భజింపఁగలఁడు,
సేవింపఁడు, గణింపఁడు, రక్షింపవా, నుతింపవే,
భజింపలేఁడు, రక్షింపఁగలఁడు, పోషింపు, పోషింప
వమ్మ, పోషింపుము, భజింపుము ఇత్యాది.

ణి ప్రత్యయము పరమైనను, వర్తమానార్థమునందగు 'ఉండి' యను ననుబంధము పర మయినను, భవిష్యదర్థమునం దగు కల యను ననుబంధము పర మైనను ప్రార్థనార్థమునం దగు ముగ్దుబ్జులు పర మైనను, అభావార్థమునం దగు, క, మి, మొదలగు నవి పర మైనను వ్యతిరేకాద్యర్థములందును ధాతువు చివరి ఇంచిరాగమ చివర్ణమునకు పకార మగు నని యర్థము.

పోషించ్ + ఉండి - అనుచో నిట వర్తమానార్థమున ఉండి యను నను బంధము పరముగా నుండుటచేఁ బూర్వమునందలి చకారమున కీ సూత్రముచే పకార మాదేశము కాఁగా పోషింప్ + ఉండి - పోషింపు చున్నాఁడు అని యగును. ఇ ట్లితరము లూహ్యములు.

ణిచ్ స్థలమున మాత్రమున (ణిచ్‌లోని ఇకారమునకు 'ణిచ్చ' యని సున్నయు) పుగాగమశ్చ యని పుగాగమము విధంపబడియున్నది కాఁగా నట ఇంచిరాగమ చకారమునకు పత్వము వచ్చు ప్రసక్తియే లేదు వృత్తి యం దిట్టివి యుదాహరింపఁబడను లేదు. కాని తలఁడించు చున్నాఁడు మొద లగు విధముగా దేశ్యధాతువులయెడ నిట్టిపత్వము గుర్తింపవచ్చును. ప్రేరణించిరాగమము గూర్చి పైని బ్రస్తావింపఁబడును.

---

పశ్చః త్రి.శ.9.బృహస్పతిసూత్రము
ణ్యను బంధ ప్రార్థనాభావాదిషుపశ్చః ఆం.కౌ.క్రి.17
అనుబంధ ప్రార్థన యోర్ణ్వ్యతిరేకాదికేచ చోః పస్స్యాత్ ఆం.శ.చిం. క్రి.15
చస్యేంచుఃపః వై.చం.తి.182
అతాలవ్యస్య. వై.చం.తి.6

అహోబలుఁడు పోషింపు చున్నాఁ డనురీతిగా వర్తమానార్థమున పత్వమును బేర్కొనెను. కాని యితర ప్రామాణికలాక్షణికులు పెక్కురు వర్తమానార్థమున పత్వమును జెప్పలేదు. తన్మతము ననుసరించి పోషించుచున్నాఁ డనురీతిగా 'చ' కారమె యుండును. కవి ప్రయోగములందు నేఁ డిట్లె చ కారమె కన్పించుట గమనింప వచ్చును.

## 127. ఇలజ్వా సం వృ తేః 1.

సంవృతేః = సంవృతిధాతువులకు, వా = వికల్పముగా, ఇలచ్ = 'ఇలచ్' వచ్చును.

వి. [2] రంజి ఘట్యాదీనాం సంవృతిధాతూనా మించిరాగ మస్య ఇలజాదేశో వా స్యాత్ స్వార్థే.

రంజ్, ఘట్ మొద లగు సంవృతి ధాతువులకు వచ్చిన ఇంచి రాగమునకు 'ఇలచ్' అనునది వికల్పముగా నాదేశ మగును. 'ఇలచ్' లో చకార మిత్తు ముందరి యకారముచ్చారణార్థము కావున ఇల్ అనునది యగును.

రంజ్ + ఇంచ్ అనుచో ఇంచికి ఇలజాదేశము రాఁగా రంజ్ + ఇల్ = రంజిల్ అని యగును.

'వా' యనుటచే ఇలజాదేశము రానిపక్షమునందు ఇంచిరాగ మట్లె యుండి రంజించ్ - అని యుండును.

ఇంచి ఇరాగమము చేసి దాని కిలజాదేశము చేయుటకంటె, ఇంచి రాగమమును బాధించి ఇలచ్ - ఆగమ మగు ననుటలోఁ గొంత లాఘవము గల దేమో.

ఆదేశ మైన నాగమమె యైనను 'వా' యని - 'ఇలచ్' వికల్పముగాఁ జెప్పుట విశేషము. స్వార్థమునందు 'రంజిల్' అని మాత్రయె యుండును. కాని 'రంజించు' అని యుండదు. 'రంజించు' అనురీతిది ప్రేరణార్థకస్థలముగాఁ బ్రామాణికు లితరులు స్పష్టము గావించియున్నారు.

ఈ వ్యాకరణము వికల్ప మని భావించుట చేతనే ప్రేరణము నందు 'రంజింపించు' చున్నాఁ డను రీతి రూపమును సైతము పూర్వముదాహరింపఁగల్గిన వనవచ్చును.

---

1. తత్రోభయోర్వ్యపేదే కోంకార ఇతికేచన. అ.కా .క్రి.13.
2. రంజతిఘట్యాదేనాం'హ బిందు చయోర్బిలః. ఆం.కౌ.క్రి.43.
   రంజతిఘట్యాదేనాం బిందోశ్చస్యాపిలావు భౌ భవతః
   ఆం.శ.చిం.క్రి.39.

## 128. ద్విశ్చ.

ద్విః చ = ఇలచ్ లోని లకారమునకు ద్విత్వము సయిత మగును.

వి. ఇలచో ద్విత్వం చ వా స్యాత్. రంజిల్లెన్, రంజిలెన్, ఘటిల్లెన్, ఘటిలెన్, విలసిల్లెన్, విలసిలెన్. వర్తిల్లున్, వర్తిలున్, భాసిల్లుచున్నాఁడు, భాసిలుచున్నాఁడు ఇత్యాది.

'ఇలజ్వా సంవృతేః' అనుపూర్వసూత్రముచే 'ఇలచ్' అనుదాని యందలి లకారమునకు ద్విత్వము సయిత మగును. చ శబ్దముచే ద్విత్వము వికల్పము. కావున లకారమునకు ద్విత్వము వచ్చుటయు రాకుండుటయుఁ గలదు.

రంజిల్- ద్విత్వ మైన రంజిల్ల్, భూతార్థమునఁ బ్రథమపురుషైకవచనము నందు రంజిల్లెన్.

ద్విత్వము రానిపక్షమునం దొకేలకారముతో రంజిలెన్' ఇట్లితరము లూహ్యములు. వికల్పము గావున ఇలచ్ అనునదేరాని పక్షము నందు 'రంజించె' నని యించిరాగమముతోఁగూడ స్వార్థమునం దీ వ్యాకరణము ననుసరించి రూప మేర్పడుచున్నది.

## 129. ధాతో ర్ణిచ్ [1].

ధాతోః = ధాతువునకు, సంస్కృతాను సారముగా (ప్రేరణార్థమున) ణిచ్ = ణిచ్ అనుప్రత్యయ మగును.

వి. అధి కారోఽయమ్ హేత్వర్థే దేశ్యాది ధాతూనాం ణిచ్ స్యాత్

ఇది యధికారసూత్రము (ఇట్లనుటవలనఁ బ్రయోజన మేమో స్పష్టము గాకున్నది.) హేత్వర్థమునందు దేశ్యములు మొదలగు ధాతువులకు ణిచ్ ప్రత్యయమగును. 'హేతుమతి చ' యను నాద్యవ్యాకరణ సంప్రదాయానుగుణమునఁ దెలుఁగునను సంస్కృతాచ్ఛిక ధాతువులకుఁ బ్రేరణార్థమున ణిచ్ ప్రత్యయ మగు నని యభిప్రాయము.

---

1. ణిచశ్చ వై.చం.తి.181.

## 130. ఇంచిరేవ.

ఇంచిర్ ఏవ. ణిచ్ప్రత్యయము గూడ ఇంచిర్ అనునదే యగును.

వి. ణిచ్చ (ఇంచిరేవ) కేషాంచిత్ప్రాచాం పక్షః.
కనిపించెన్, తనిపించెన్, చేయించెన్, చూపించెన్ ఇత్యాది.

కొందఱు ప్రాచీనుల మతమున ణిచ్ ప్రత్యయము 'ఇంచిర్' అనునదే యగును.

స్వార్థమునందు సంస్కృత ధాతువుల కించిరాగ మము పూర్వోక్తమై యున్నది. ణిచ్ ప్రత్యయము గూడ (అట్టి) ఇంచిర్ అని కొందఱు ప్రాచీనుల పక్షము.

ఇంతకు ముందు 'ణిచ్' ప్రత్యయములో నిత్తులగు ణకారచకారములు లోపింపఁగా మిగిలిన 'ఇ' వర్ణమున 'ణిచ్చ' యనుసూత్రముచే బిందువును (ఇం) 'పుగాగమశ్చ' యనుసూత్రముచే పుగాగమమును జెప్పి 'ఇంప్' అనురూపమును 'ణిచ్' నుండియె సాధించినది. కావున 'ణిచ్' అనఁగా 'ఇంచిర్' అనునదే యనుట కొందఱు ప్రాచీనుల మతముగా నిట వివరింపఁ బడినదని గ్రహింప వచ్చును.

## 131. నణౌ.[1]

ణౌ = ణి (చ్) ప్రత్యయము నందలి (ఇంచిర్కు) న = 'ఇలచ్' రాదు.

వి. ణిచ్ ప్రత్యయే విద్యమానేంచిర ఇలచ్ ప్రత్యయో న స్యాత్. భజింపించెన్, రంజింపించెన్, ఇత్యాది భజింపిల్లె, రంజింపిల్లెన్ ఇతి న.

ణిచ్ ప్రత్యయమునకు సంబంధించిన 'ఇంచిర్ ' అనుదానికి ఇలచ్ రాదు. ఇలజ్వా **సంవృతేః** అను సూత్రముచే రంజ్యాదుల ఇంచి రాగమమునకుఁ జెప్పిన ఇలజా దేశము **ణిచ్ప్రత్యయమునకు** సంబంధించిన ఇంచిరాగమమునకు లే దని యర్థము. కావున **స్వార్థమునం** దయిన ఇంచిరాగమమునకె ఇలజాదేశ మగును.

ప్రేరణార్థక మగు ఇంచిర్కు ఇలజా దేశము లేకుండుటచే ఆ 'ఇంచిర్' అట్లే యుండును. రంజింపించె. మొ॥ 'ణ్యనుబంధే'త్యాది సూత్రముచే పత్వ మయిన దని తలఁదనగును.

---

1. **నణౌ. ఆం.కౌ.క్రి.44.**
   **నతుణౌ. ఆం.శ.చిం.క్రి.40.**

ఇందు మొదటిది స్వార్థమం దయిన యించి రాగమ మనియుఁ దరువాతిది ణ్యర్థమం దయిన దనియు గ్రహించిన పక్షమున 'సణౌ' యనఁగా ణిచ్ (ప్రేరణేంచిర్) పర మగుచుండఁగా (స్వార్థేంచిర్' - కు) ఇలజాదేశము లే దని సూత్రార్థము నెన్నవలయును. కాని యింతకుముందు ణిచ్ ప్రత్యయ స్వరూప నిరూపణ సందర్భమున ణిచ్ ప్రత్యయము చేసి దానిపైననె స్వార్థేంచిరాగమము చేసినట్లు గాఁ దోఁచును. ఇంక స్వార్థేంచి రాగమము లోపింపఁగా ప్రేరణేంచిర్ కే ఇలజాదేశము లే దని చెప్పనవు. 'రంజింపించె' నను రూపము లుండవు. ఉండ వనుట తరువాత సూత్రము ననుసరించి యిందును స్పష్టమగుచున్నది. కాని వివృతియం దెడ నెడ నీరూపము లి ట్లు దాహరింపఁబడుట వింత. మొత్తముమీఁద ఇలజాదేశ నిషేధమువలన రంజింపిల్లె ననురీతి నుండ వని వృతి పేర్కొన్నది. (ప్రేరణమునందు రంజిల్లె నని యుండదు. స్వార్థమునందు రంజించె నని యుండదు.)

ఇట వివృతి భజిధాతువును జూపుట యుచితముగాఁ గానరాదు. స్వార్థమందె యైనను రంజిల్లె ననురీతిగా భజిల్లె ననురీతిరూపములు గానరావు. కాఁగా సంవృతి ధాతువులకుఁ గూడ నెల్లవానికి 'ఇలచ్' లేదు. అందుకే రంజాదుల కనురీతిగా లాక్షణికులు గణము నేర్పఱచి రని గ్రహింపవచ్చును.

'ఇల జ్వాసంవృతేః' అనుచోట వా శబ్దముచే సంవృతి ధాతువులె యైనను భజాది ధాతువుల కీ కార్య మసలు లే దని వ్యవస్థ చేసికొన వీలు గలదు.

## 132. లుజ్ ణ్యర్థే [1].

ణ్యర్థే = ణిజర్థము పర మగుచుండఁగా, లుక్ = ముందటి యించిరాగమమునకు లోప మగును.

### వి. ణి ప్రత్యయార్థే ధాతో రించిరో (న) లుక్ స్యాత్.
### భజించెన్, రంజించెన్, భజింపించెన్, రంజింపించెన్
### ఇత్యర్థః.

ణి ప్రత్యయార్థము ('ఇంచిర్') పర మగుచుండఁగాఁ బూర్వమునందలి ధాతువు యొక్క ఇంచిరాగమమునకు లోప మగును.

---

1. భజేచ్ఛ్రలోపాణ్యర్థేయోవర్తతేపరేతస్మిన్ ఆం.శ.చిం.క్రి.౪౦
ణావక ర్మకాల్ స్వార్థేంచుకః వై.చం.తి.184.

రంజ్ ధాతువుపై స్వార్థమునం దించిరాగమము రాఁగా దానిపైఁ బ్రేరణమున నించిర్ రంజ్ + ఇంచ్ + ఇంచ్ ఇపుడు ప్రస్తుతసూత్రముచే ప్రేరణార్థమునం దయిన 'ఇంచిర్' పర మగుచుండఁగా దానికి ముం దున్న, స్వార్థమం దయిన ఇంచి రాగమమునకు లోపము. రంజ్ + ఇంచ్-- ఇటనున్నది. దానికి ప్రేరణేంచిర్‌కు 'సణౌ' యనుసూత్రముచే ఇలజాదేశము రాదు. అది స్వార్థమునం దగునది గావున రంజించ్ - రంజించెన్.

రంజించెన్ అనుదాని కర్థము చెప్పుచో వివృతి 'రంజింపించెన్' అని చూపినది 'స్వార్థేంచిర్' లోపించుటను లక్షణము పేర్కొనుటచే నర్థమును వివరించునపు డైనను నలాక్షణికముగా స్వార్థేంచిర్‌కు లోపము చేయక 'రంజింపించె' నని చూపుట పొసఁగదు 'ఇలజ్వా' యని ఇలజాదేశము రానిపక్షమున నైనను నిటనించిర్ నిలుచుట యెట్లు?

భజించె (ప్రేరణము) భజింపించె నని యిటఁ జూపుట సరిగాదు.

క్రియను బట్టి ధాతువునకు ముందుగా స్వార్థము నం దించిరాగమము నాపై ణిచ్ ప్రత్యయము (ఇంచిర్) చేయుట యుద్దిష్ట మగుచున్నది. నిజమున కిట్టి ప్రక్రియయే యుచితము. కాని యింతకుముందీ వ్యాకరణము ణిచ్ స్వరూపమును సాధించుటలో పుగాగమశ్చ యనుటిరుగాఁ జూపుట యీ క్రమమునకు విరుద్ధ మై యున్నది.

## 133. ణావస్య.

వి. ణి ప్రత్యయే పరే ధాతోరించిరో లుక్ స్యాత్.
భజింపించెన్, రంజింపించెన్ ఇత్యాది రంజిల్లింపించెన్
ఇతి న.

లక్షణమును వివృతియు సక్రమముగా లేవు. విచార్యములు.

**వివృతి పూర్వసూత్రార్థమునే చెప్పుచుండ నందలి యుదాహరణములు తద్విరుద్ధార్థమును సూచించు నివి పరస్పర విరుద్ధములై యున్నవి.**

## 134. ఇద్వానయో ర్లైకపూర్వస్య [1].

ల ఏకపూర్వస్య = ఒక్కటి యగు లఘువు పూర్వమునందుఁ గలిగినదియు, అనయః = 'అయ్' అనుభాగము చివర లేనిదియు నగు ధాతువునకు వా = వికల్పముగా, ఇత్ = ఇత్వ మగును.

వి. ఏకశ్చాసౌవర్ణః (ఏకవర్ణః) లశ్చాసా వేకవర్ణః (లైక వర్ణః) లఘ్వేకఏవ పూర్వే యస్య- తస్య అనయన్తస్య క్రియాపదస్యాన్తిమస్య వికల్పేన ఇత్ స్యాత్.
హరించెన్- హరియించెన్, వరించెన్-వరియించెన్, రమించెన్- రమియించెన్ ఇత్యాది.

'ల' యనునది లఘువునకు సంజ్ఞ. లోలఘో:, లఘువగునొక్కవర్ణము మాత్రమె పూర్వము నందు గల్గి, అయ్ అనునది చివర లేని, ధాతువునకు వికల్పముగా ఇత్వము వచ్చును.

హృ- ధాతువు అర్ అనుపరిణామముతో హర్ అని కాఁగా ప్రస్తుత సూత్రముచే ఇత్వ మయిన పక్షమున హరి ఇదేనిపై స్వార్థమునం దించిరాగమము హరి + ఇంచ్ - ఇచట సంధిజరిగినచో హరించ్ అని యగును. ప్రస్తుత సూత్రముచే విధింపఁబడిన ఇత్వము లేకున్నను హర్ + ఇంచ్ = హరించ్ అనియె యగును. కావున సంధి యయిన నిత్వవిధానము నిరర్థకమె యగును. కాఁగా ఇత్వవిధానసామర్థ్యము చేతనె యిత్వ మయినపుడు సంధి లేదు 'యః ప్రాణస్య' యని యకార మై హరియించ్- హరియించె నని యవును.

'ఇద్వా' యనుటచే నిత్వము రాని పక్షమునందు హర్ +ఇంచ్ - హరించ్- హరించెన్ అని యవు. ఇట్లితరము లూహ్యములు.

'లైకపూర్వస్య' యనుచో 'ల' యనుటవలన యాచ్ + ఇ మొద లగుచో గురువు గల ధాతువుల కీ యిత్వము రాదు యాచియించె నని గాదు యాచించె.

'ఏక' శబ్దముచే కరుణించె మొద లగుచోనునేకములగు లఘువు లున్నయెడను నిత్వము లేదు.

'అనయః' అనుటవలన అయంతములకు ధాతువులకు నిత్వము రానేరదు జి - జయ్- జయించె. జయియించె ననురీతి నుండదు.

---

1. లఘ్వే కాక్షర పూర్వాన్తి మస్యేద్వానయః ఆం.కౌ.క్రి.39
లఘ్వేకాక్షరపూర్వక్రియాన్తి మస్యానయో భవేదిద్వా
ఆం.శ.చిం.క్రి.36
లఘ్వేపూర్వాదయనయ ఇంచుక్ వై.చం.తి.52.

## 135. ఉత్తమ రవాన్తాస్తి జ్మధ్యాః.[1]

ఉత్తమ రవాన్తాః = ఉత్తమపురుషక్రియలును రేఫము (రు - రి) వకారముఁ (వు.వి) అనునవి యంతమందుఁ గలిగిన క్రియలును, తిజ్మధ్యాః = తిజ్మధ్యము అనుసంజ్ఞ గలిగిన వగును.

వి. ఉత్తమ పురుష రేఫాన్త వాన్తాస్తిజ్మధ్యనామకా
స్స్యుః వచ్చితిని - వచ్చితిమి, వచ్చితివి - వచ్చితిరి
వచ్చితి. ఇత్యుత్తమ రేఫాంతవాన్తా ఏతే కళా
సంజ్ఞికాశ్శబ్దాః.

ఉత్తమపురుష క్రియలకు తిజ్మధ్యము అని సంజ్ఞ. సామాన్యముగాఁ జెప్పుటచే నుత్తమపురుషయం దేకబహువచనాంతములు రెంటికిని తిజ్మధ్యసంజ్ఞ సిద్ధించుచున్నది. వచ్చితిని, వచ్చెదము మొ॥

రేఫాంతము లనఁగా రు లేదా రి యనున వంతమందుఁ గలయవి. ఇవి ప్రథమ మధ్యమపురుష బహువచనాంతములు.

వచ్చితిరి - వత్తురు, మొ॥

వాంతము లనఁగా వు, వి, వర్ణము లంతమందుఁగలవి. ఇవి మధ్యమపురుషైకవచనములు.

వచ్చితివి-వత్తువు మొ॥

ఇట్లు ప్రథమపురుషైకవచనాంతములు దప్ప మిగిలిన తిజంతశబ్దముల కెల్ల తిజ్మధ్య సంజ్ఞ సిద్ధమగు చున్నది.

తిజ్మధ్య నామకాస్స్యుర్మధ్యమ పురుషాశ్చయే రమాన్తాశ్చ' యనుచో 'రాన్త' శబ్దము చేతనె మధ్యమ పరుష బహువచనములు సంగ్రహింపఁబడుచుండగా మధ్యమపురుష మఱలఁ బ్రత్యేకముగా నేల చెప్పవలె నను నుద్దేశ్యముతో నిట ఉత్తమ పురుష పేర్కొనబడి మధ్యమపురుషైకవచనాంతముల నంగ్రహణమునకై వాంతములు వేఱుగాఁ జెప్పఁబడియుండును.

కాని యుత్తమపురుషైకవచనాంతములకుఁ దిజ్మధ్య సంజ్ఞ సమంజసము గాదు. 'కిశ్చే దిత్యాది సూత్రముచే తిజ్మధ్యములు కళ లగును. ఉత్తమపురుషైక వచనాంతములు

---

1. తిజ్మధ్యా రమాన్త మధ్యమాః ఆం.కౌ.క్రి.40.
తిజ్మధ్య నామకాస్స్యుర్మధ్యమపురుషాశ్చయేరమాన్తాశ్చ ఆం.శ.చిం.క్రి.37
రమాన్తో మధ్యమశ్చ తిజ్మధ్యః. వై.చం.నం.23.

తిఙ్మధ్యము లైన గళలు గావలెఁ గదా. అయినఁ ద్వితీయాద్యుత్తమ 'సూత్రమునం దుత్తమపురుషను గ్రహించుటచే నవి కళలు గాకుంట సిద్ధించును. కాని యుత్తమపురుషైకవచనములకుఁ దిఙ్మధ్యసంజ్ఞ వలనఁ బ్రయోజన మేమి? ప్రథమపురుషైకవచనాంతములకు మాత్ర మేల తిఙ్మధ్య సంజ్ఞ చెప్పరాదు.

అసలు తిఙ్మధ్యసంజ్ఞ యావశ్యకమా యన్న నది వేఱు. కాని యుత్తమ పురుషైకవచనములను దిఙ్మధ్యము లనుట యనవసరము గాక తప్పదు.

మధ్యమపురుష విషయమున రవాన్తశ్చయనుట వలన 'రక్షింపుము, రక్షింపుఁడు' అనురీతి వగుప్రార్థనార్థక క్రియా రూపములకుఁ దిఙ్మధ్యసంజ్ఞ సిద్ధింపదు. 'తిఙ్మధ్యనామకాస్స్యుర్మధ్యమ పురుషాశ్చ' యన్న చింతామణి లక్షణమున మధ్యమపురుష క్రియాపదముల కెల్లఁ దిఙ్మధ్యసంజ్ఞ సిద్ధ మగుటచే బాధ లేదు.

వచ్చుచున్నాఁడు మొదలగులదాద్యంత ప్రథమపురుషైకవచనములకు (చింతామణి యందు, నిందును) వలె నిందు ముడుజంతము లిత్యాదులగు (పద.కో॰ మొ॥) మధ్యమపురుష క్రియాపదములకు తిఙ్మధ్య సంజ్ఞ లేకయు గళాత్వము గుర్తింప వలసి యుండును.

## 136. ఉపసర్గశ్చ.

ఉపసర్గః చ = ధాతువుల కుప సర్గములు నగును.

వి. ధాతోః పూర్వముపసర్గశ్చ స్యాత్. అనురంజించెన్
నివసింపు చున్నాఁడు, అభిలషింపఁగలఁడు,
విజయింపఁడు, ఆకల్పింపుము, సంకల్పింపలేము
ఇత్యాది.

ధాతువునకుఁ బూర్వమునం దుపసర్గలు కూడ నగును. ప్ర పరా మొదలగువానికి క్రియా యోగమునందె యుపసర్గ లని సంజ్ఞ. రంజించెన్ అనురంజించె మొ॥.

ఉపసర్గలగుట యన్నది తెలుఁగుననగునదిగా నిట్లు చెప్పుట తగ దని తోఁచుచున్నది. సంస్కృత ధాతువుల యెడనె సంస్కృతానుసారముగఁ నున్న యిట్టివి, ప్రాది పూర్వక మగుచునే ధాతువు తెలుఁగునఁ గ్రహింపఁబడిన దనుట యుచితము. ఇతరు లిట్లు గ్రహించి యున్నారు.

## 137. దౌ (చో) చే ర్వాలుగ్లోటి.[1]

లోటి = తద్ధర్మార్థమునందు, దౌ = దువర్ణము పర మగుచుండఁగా, (చేః) (చోః)= ఇంచిరాగమమునందలి చి(చు) వర్ణమునకు, వా = వికల్పముగా, లుక్ = లోప మగును.

వి. తద్ధర్మ క్రియాపదే దువర్ణకే పరే ఇంచిరాగమస్య
చివర్ణస్య వా లుక్ స్యాత్. సేవించుదు ఇతి స్థితే
అనేన సూత్రేణ చివర్ణస్య లోపే సేవిందు ఇతి స్థితే.

తద్ధర్మార్థక క్రియలయందు దువర్ణకము పర మగుచుండఁగాఁ బూర్వమునందలి యించిరాగమమునకు సంబంధించిన చి (చు) వర్ణమునకు వికల్పముగా లోపము వచ్చును.

సేవించుదు (రు) అనుచో నీసూత్రముచే చువర్ణము లోపించి సేవిందు అని యగును.

చువర్ణమును జూపుట ననుసరించి 'దౌ చోర్వాలుక్' అని సూత్రమున 'చు' వర్ణమునకే లోపము చెప్పఁబడి యుండ వచ్చును.

'ద్వోస్తహల్ఝ్యాదౌ' (58) యనుదానిచేతనే యీరూపములును సిద్ధింపఁగలవు. కాని యది యాచ్ఛిక ధాతువులకుఁ బరిమితము చేయఁబడి నట్లున్నది. అది యన్నింటికి నన్వయించిన నిదియు దీని తరువాతి సూత్రమును జెప్ప కుండఁ జాలెడిది.

## 138. తోదో బిన్దోః[2].

బిన్దోః = బిందువు కంటెఁ బరముగా నున్న, దః = దకారమునకు, తః = తకార మగును.

వి. బిన్దోః పరస్య దువర్ణక దకారస్య తకారస్స్యాత్.
సేవింతును, రక్షింతును.

బిందువుకంటెఁ బర మయియున్న దువర్ణము నందలి దకారమునకు తకార మగును.

సేవించుదును అనుచో 'దౌ చోర్వాలుగ్లోటి' యనుసూత్రముచే చువర్ణము లోపింపఁగా సేవిందును అని యుండఁగాఁ బ్రస్తుతసూత్రముచే దకారమునకు తకార మై సేవింతును అని యగును ఇ ట్లితరము లూహ్యములు.

---

1. దౌ చోర్లుక్తధర్మే. ఆం.కౌ.క్రి.33;
ఆం.శ.చిం.క్రి.29

2. బిన్దు పరస్యచ దోస్తః ఆం.కౌ.క్రి.36 ·
బిన్దు పరస్యతకారో దోస్స్యాత్. ఆం.శ.చిం.క్రి.34.

'వా లుక్' అనుటచే చేవర్ణము లోపింపని సందర్భమునందు 'సేవించుదును' అని యుండగా దువర్ణము బిందువునకుఁ బరముగా లేకుండుటచే తకారము రాదు.

'చ్ఛోస్తహల్ ఝూర్యదౌ' యను లక్షణమునుబట్టి యీయవి సిద్ధింపఁగలవు కాని మునుపటి యీ సూత్రమును వేఱ యేల చెప్పఁబడెనో.

## 139. ణస్తుములః [1].

తుమలః = తుమున్ ప్రత్యయము యొక్క యర్థమున ణః = ణప్రత్యయ మగును.

వి. ధాతోః పరతో ణ స్స్యాత్ ణకారస్య ఇత్సంజ్ఞా

విన- తిన. చూడ, చేయ ఇత్యాది.

తుమర్థమునందు ధాతువునకు 'ణ' ప్రత్యయ మగును. ణ ప్రత్యయమునందు ణకార మిత్తు. కావున నది లోపింపఁగా 'అ' అనునదే మిగులును. విని ధాతువు విన్ ఈసూత్రముచే ణప్రత్యయము విన్ + అ - విన- ఇవి ద్రుతప్రకృతికము లగుట వీనిపై ద్రుతము చేరు నని గ్రహింపవచ్చును. వినన్ మొ॥

## 140. ముకోలుగ్వా.

వి. శుట్ప్రత్యయాత్పరస్య సంప్రార్థన ముగ్వర్ణకస్య

వాలుక్స్యాత్. స్థానివదాదేశః, శుటో నలోపః-కను,

విను, - చూడు, చేయు, కొట్టు, తిట్టు ఇత్యాది.

'ముకోలుక్ప' (69) అను సూత్ర మిటఁ బున రుక్తమైన దనఁదగును.

వి. వ్యతిరేక ప్రార్థనోదాహరణాని

పోషింపు-వు. అకారః పోషింపవు. రక్షింపవ

మ్మ, కనవమ్మ, వినవయ్య. ఇత్యాది.

వ్యతిరేక ప్రార్థనమున కుదాహరణములు పోషధాతువుపై ఇంచిరాగమము కాఁగా పోషించ్ 'ణ్యనుబంధేత్యాది సూత్రముచే షత్వము పోషింప్. ఌడ్వ్యతిరేకాదౌఘల్ అని ఘల్ప్రత్యయమై పోషింప. మధ్యమపురుషైకవచనమున సిప్స్థానమున 'సిఙ్మిపోవుడ్వకౌ' అని వుక్ ప్రత్యయము పోషింపవు, ఇతరము లూహ్యములు.

---

1. తుమన్ వ్యతిరే కయోరల్. వై.చం.తి.15
ణశ్చ? త్రి.శ.10.9.

వి. వ్యతిరేక సంప్రశ్నార్థే పోషింపవే,
రక్షింపవా, ఇత్యాది తద్వత్.

వ్యతిరేక సంప్రశ్నార్థమునందు పోషింపవు ఇత్యాదిగాఁ బూర్వము వలెనె రూపము లేర్పడఁగా 'ఏదాతౌ సంప్రశ్నార్థే' (68) అనుసూత్రముచే ఏత్వ మయిన పోషింపవే ఆత్వమయిన రక్షింపవా ఇత్యాదిగ నగును.

(ఇతి క్రియాపరిచ్ఛేదః)

ఇది క్రియాపరిచ్ఛేదము

క్రియాపరిచ్ఛేదము సమాప్తము

---

పిదపఁ గృత్తులు నిరూపింపఁబడుచున్నవి. కావున నింతటితోఁ దిఙ్ప్రక్రియ ముగిసినదని చెప్పవలె. అయ్యుఁ గొన్ని యీప్రకరణమునఁ జెప్ప వలసినవి ఆం.శ.చిం.ప్రభృతులలో నీప్రకరణమున నున్నవి కృత్ప్రకరణమునఁ గన్పించును. ఆయా యంశము లటనె గమనింతము.

# అథ కృత్ప్రకరణమ్

## అథ కృదన్తాః.

ఇఁకఁ గృదంతములు పేర్కొనఁబడుచున్నవి.

### 1. స్చోః పుట్ [1].

స్చోః = సకారాంతములును, చకారాంతములు నగు ధాతువుల సకార చకారములకు, పుట్ = పుట్ ప్రత్యయ మగును.

వి. కృదన్తే సాన్త చాన్త ధాతూనా మన్త్య సకార చకార
యోః పుట్ స్యాత్.

సకారాంతము లగు ధాతువుల తుది సకారమునకును, చకారాంతము లగు ధాతువుల తుది చకారమునకును కృత్తయిన 'పుట్' అను ప్రత్యయ మగును. 'పుట్' అనుచో టకార మిత్తు. కావున నది లోపించును. పు అనునదె యగును.

మెచ్చ్ - మెప్పు, మేస్ - మేపు. మొ॥

### 2. క్వచిద్వుట్చ [2].

స్చోః = ధాతువుతుది స కార చ కారములకు, క్వచిత్ - కొన్నియెడల, వుట్ చ = 'వుట్' అను ప్రత్యయము నగును. 'స్చోః పుట్' అను పూర్వసూత్రమునుండి 'స్చోః' అనునది యిం దనువర్తించును.

వి. క్వచిత్ స్థలే సాంత చాంతధాతూనామన్త్య సకారు
చకారయో ర్వుట్ స్యాత్. కృదన్తే - మెప్పు, విప్పు,
అప్పు, పు(ప్పి)ప్పు, పెంపు, వంపు, దింపు, కాపు, కొలుపు,
(వాయు) వాపు, వారుపు, తలఁపు ఇత్యాది.
ఈ(వి)వు, విలువు, కొలువు, మురువు, తెలివు (వి), అరువు.

---

1.2. పుక్రసాః. వై.చం.కృ.6 పుక్పను శృక్వచిత్ క్వచిత్. త్రి.శ.9.7.

కొన్ని సకారాంతములును చకారాంతములు నగు ధాతువుల తుది స కార చ కారములకు 'వుట్' అను ప్రత్యయము నగును.

వివృతి యందు మెప్పు మొదలుకొని తలఁపు అన్నంతవఱ కున్న యుదాహరణములు 'స్పోః వుట్' అను పూర్వసూత్రమునకుఁ జెందినవి. ఇవి యటనే యుదాహరింపఁదగియున్నవి. అప్పు అనుచో అచ్. ధాతువు గావలెను. వెదుకవలె.

కొన్నింటి సకార చకారములకు 'వు' ప్రత్యయము ఇచ్చు- ఈవు. విలుచు - విలువు మొ॥ అరువు అనుచో అరుచు ధాతు వేమో పరిశీలనార్హము.

### 3. ఇంచిరి చ.

ఇంచిరి చ = 'ఇంచిర్' అనునది పర మగునపుడు గూడ , వుట్ = వుట్ ప్రత్యయ మగును.

వి. య్యాంత చాంతధాతూనా మాదేశ దీర్ఘాణా మించిరా గమే పరే చ వుట్ స్యాత్. కావించెన్, రావించెన్ ఇత్యాది.

యకారాంతములును, చకారాంతములు నగు ధాతువులకు నాదేశములుగా వచ్చిన దీర్ఘాక్షరములకు ఇంచిరాగమము పర మగుచుండఁగాఁ గూడ వుట్ ప్రత్యయ మగును.

అయ్ - కా + ఇంచి = కావించ్ - కావించెన్ మొ॥ వచ్- రా + ఇంచ్ = రావించ్- రావించెన్ మొ॥

ఇది కృదంతవిషయము గాదు. ఈ రూపములందలి వ కారము 'స్యోర్యగ్వకౌ' మొ॥ తిజంతప్రక్రియలో చెప్పఁబడియే యున్నది. ఇటఁ బునరుక్తము చేయుట నిరర్థకమె యనవచ్చును.

### 4. డశ్చ.

డః చ = డ ప్రత్యయము నగును.

వి. ధాతో శ్శ్లేషస్య డస్స్యాత్ డకారస్య ఇత్సంజ్ఞా. అకారః సకార చకార యోర్లోపః. పొగిస్- పొగ, వగచి [1] వగ, నడచి- నడ, వెలిచి - వెల ఇత్యాది.

1. వగచ నడచ పొగచ కొంచాం లుక్. వై.తం.కృ.8

మిగిలియున్న ధాతువునకు 'డ' అను కృత్ప్రత్యయము వచ్చును. డప్రత్యయములో డకార మిత్తు కావున నది లోపింపఁగా 'అ' అని మిగులను. ధాతువు తుది నున్న సకారమును చకారమును లోపించును.

'పాగిస్' అను ధాతువులోఁ దుది స కారము 'లుక్ క్వచిత్' (కృ.39) అను సూత్రము చే లోపింపఁగా మిగిలియున్న "పాగి" అనుదాని కీసూత్రముచే డ ప్రత్యయము రాగా పాగి + అ = పాగ మొ॥ ఇట్లితరము లూహ్యములు.

## 5. భావే టుటచ్ [1].

భావే = భావార్థమునందు ధాతువునకు, టుటచ్ = టుటచ్ అను ప్రత్యయ మగును.

వి. భావార్థే క్రియాంతస్య టుటప్రత్యయస్స్యాత్.

కనుట, వినుట, చూచుట ఇత్యాది.

భావార్థమునందు ధాతువునకుఁ బైని 'టుట' అను ప్రత్యయ మగును. 'టుటచ్' అను దానియందు శ కార చ కారము లిత్తులు గావున లోపించును. ఉట యనునది నిలుచును.

కని ధాతువుపై భావార్థమునం దీ సూత్రముచే టుట ప్రత్యయము రాఁగా కన్ + ఉట = కనుట అని యగును. ఇట్లితరము లూహ్యములు.

## 6. టాదౌ చ.

టాదౌ చ = 'టా' మొదలగు విభక్తులు పర మగునపుడు సయితము 'భావే టుటః'. భావార్థమునందు ధాతువునకు టుట ప్రత్యయ మగును. పూర్వసూత్ర మిట నన్వయించును.

వి. తృతీయాదిషు విభక్తిషు పరతో ధాతో రన్త్యస్య టుట స్స్యాత్. చూచుటచేత, కొట్టుట కొఱకు, వినుట వలన, తినుటకు, ఇచ్చుటయందు ఇత్యాది.

'టా' యనునది సంస్కృతము ననుసరించి తృతీయా విభక్తి కాఁగాఁ దృతీయాది విభక్తులు పరముగా నున్నపుడు సయితము ధాతువునకు టుట ప్రత్యయము వచ్చును.

---

1. భావేకృతస్తు. వై.చం.కృ. 1 భావేటుః వై.చం.తి.202 టుట? త్రి.శ.10.9.
భావేర్థే టాంత్యస్య. ఆం.కౌ.క్రి.48.
భావేటవర్ణకో౽న్తే సర్వేషాం చ క్రియాపదావాకంస్యాత్.
ఆం.విం.క్రి.48

చూచ్ - చూచుటచేత వెం॥ 'టాదె' యనుట యసంగతము. 'వచ్చుటను జూడలేదా' యనుతీరుగా ద్వితీయ యందును 'శుట'కలదు.

అస లీ విధాన మసంగతము. తృతీయాది విభక్తులు పర మగునపుడు ధాతువునకు శుట ప్రత్యయ మగు ననుట కసలు ధాతువుపైనా సుబ్విభక్తు లెట్లు చేరును. సుప్పులు ప్రాతిపదికలపైఁ జేరును. ధాతువు ప్రాతిపదికమె కాదు. 'అర్థవదధాతురప్రత్యయః ప్రాతిపదికమ్' కాఁగా ధాతువుపై సుబ్విభక్తులు చేరరామి తృతీయాది విభక్తి పరకత్వమె యసంభవము గాఁగా నది పర మగుచుండ శుట ప్రత్యయ మగు ననుట సంప్రదాయ విరుద్ధ మనక తీఱదు.

'శుట' అనునది కృత్ప్రత్యయము. కృత్ప్రత్యయ మంతమందుఁ గలదానికి 'కృత్తద్ధితసమాసాశ్చ' యను పాణినీయలక్షణము ననుసరించి ప్రాతిపదిక సంజ్ఞ గలుగును. ఇట్లు శుట ప్రత్యయాంతమునకుఁ బ్రాతిపదిక సంజ్ఞ గలుగఁగా దానిపైఁ బ్రథమాదివిభక్తు లెల్లఁజేర వీలు గలదు. అట్లు తృతీయాదులు చేరినవి. కాఁగా నిట శుట ప్రత్యయాంతము పై (ప్రథమ) తృతీయాది విభక్తులు చేరినవి గాని తృతీయాదివి భక్తి పరకత్వమున శుట ప్రత్యయ మైనదను మార్గము సమంజసము గాదు.

ఇ ట్లీలక్షణము సంప్రదాయ విరుద్ధము ననర్థకము నై యున్న దని నిశ్చయింపఁ దగును.

## 7 శుతా శుచుపి. [1]

శుచుపి = శుచుప్ ప్రత్యయార్థమున, శుతా = ధాతువునకు 'శుతా' యను ప్రత్యయ మగును.

వి. శుచుబర్థే ధాతో రన్త్యస్య శుతా స్యాత్.

చూచుతావచ్చె, వినుతావచ్చె, వినుతా పోయె,

కనుతా పోయె, కనుతాఉండె.

శుచుప్ ప్రత్యయముయొక్క యర్థమున 'శుతా' యను ప్రత్యయ మగును. శుచుప్ ప్రత్యయము వర్తమానార్థమున విహితము. ఇపు డిది శత్రర్థముగాఁ బ్రసిద్ధము. ఆయర్థమున 'శుతా' యను ప్రత్యయ మగును. 'శుతా' యనుదాని యందు 'శ' కార మిత్తు. కావున నది లోపింపఁగా 'ఉతా' యనునదె నిలుచును.

చూచి ధాతువుపై నిట్లు శుతాప్రత్యయము రాఁగా చూచ్ + ఉతా = చూచుతా- వచ్చె ననురీతి నగును.

ఈ రూపములు కావ్యవ్యవహారమున లేవు. శుచుప్ ప్రత్యయముతో 'చూచుచు వచ్చె' నను రీతివె కలవు. నేఁడు లోకవ్యవహారమునను చూస్తూ, వింటూ, కంటూ అను రీతిగనె

1. శుతాస్యాద్వ్యాభావఏవ (త్రి.శ.10.3)

ప్రచురములు. అయ్యుఁ గొన్ని ప్రత్యేకస్థలములలో చూస్తా వచ్చిండు, వింటా పొయ్యిండు అను రీతిని గూడ నరుదుగ నుండుటం బట్టి చూచుతా, వినుతా యన్నవి యొకప్పుడు వ్యవహారమున నుండి యుండును. నేఁడు నే ప్రాంతమం దయిన నట్లున్న వేమో. అ ట్లయ్యు నిట్టి కావ్యప్రయుక్తములు గాని రూపములను లక్షణబద్ధము చేయుట యనవసర మనియె నిర్ణయింపఁదగియున్నది.

వి. కిఞ్చ చతుష్షష్టి కళాధుర్యాథర్వణాచార్య మతే 'శుచా ప్రత్యయః భావార్థేఽపి[1] స్యా' దితి స్పష్ట ఏవ. చూచుతా, వినుతా ఇత్యాది.

ఇంకను నథర్వణాచార్యుని మతమున శుతా ప్రత్యయము భావార్థము నందు నగు ననుట స్పష్టమే. చూచుతా- యనఁగా చూచుట యని యర్థము. భావార్థక మనుటకుఁ గావ్యవహారమున నాధారము లేదు. నేఁడు లోకవ్యవహారమున నట్టిది గానరాదు.

## 8. క్వచి దార్ధ ధాతుకే[1].

క్వచిత్ = కొన్ని యెడల, ఆర్ధధాతుకే = ల్యడాదులు పర మగుచుండఁగాఁ గూడ ('వట్') అగును.

వి. క్వచిత్ స్థలే చాన్తధాతూనామన్త్య చకారస్య వట్ స్యాదార్ధధాతుకే – కావఁగలఁడు, కావఁడు, కావ లేఁడు, కావుము, కావక, కావగ, కావమి, కావవో, కావని, కావడము, కావించెన్, లేవఁగలఁడు, లేవలేఁడు, లేవలేము, లేవము, లేవగ, లేవక, ఇవ్వఁగలఁడు, ఈవఁడు, ఈవడము ఇత్యాది.

కొన్ని (యెడల చకారాంతములగు) ధాతువులతుది చకారమునకు, ల్యడాద్యర్థము లందు 'వట్' అగును. కాచి ధాతువునకు ల్యడర్థమునం దిట్లు 'వట్' రాఁగా కాచ్ – కావ్- కావఁగలఁడు మొ॥.

ఇది తిజన్త ప్రక్రియకు సంబంధించిన లక్షణము.

---

1. లఘోర్వఃॽ వై.చం.తి.89
   వశ్చాన్తానామ్. త్రి.శ.10–6.

'కావించెన్' అనుదాని నింతకు ముందు 'ఇంచిరిచ' యను సూత్రము నొద్దఁ జూపియె యుండెను. అయి ధాతువునుండి గాక కాచి (కాచు) ధాతువునుండియె యైనఁ గావించె ననురూపమె యుండదు. కావించె నని యుండనవు. ప్రేరణముపైఁ బ్రేరణము.

ఇవ్వఁగలఁడు – ఈవఁగలఁ డనునవి యిట నుదాహరింప ననవసరము. యగ్వ్యక్కులలో ఈయ, ఈవ యనువాని నింతకుముందు సాధించుట యైనది.

వి. ఆర్ధధాతుకే కిమ్? కాచెన్, కాచున్, లేచుచున్నాఁడు,
లేచెన్, చచ్చెన్, చచ్చున్, చచ్చుచున్నాఁడు ఇత్యాది.
ఏతే సార్వధాతుకాః.

'క్వచిదార్ధధాతుకే' యనుచో సూత్రమునం 'దార్ధధాతుకే 'యనుట వలన ల్యడాదులయందే 'వట్' వచ్చును. లడాదులయందు (సార్వధాతుకములు) నీ కార్యము లేదు. లేచుచున్నాఁడు లేచెన ఇత్యాదుల యందు లేవుచున్నాఁ డిత్యాదిగా వ కారము రాదు.

వ కారము రాకుండు విషయమున చచ్చిధాతువు నిటఁ జూపుట యనవసరము. 'చచ్చేరావక్' అని చచ్చిధాతువు నంత్యాక్షరమున కావగాదేశముతో చావఁగల డనురీతిరూపములు పూర్వము సాధింపఁబడియె యున్నవి.

మొత్తము మీఁద సిద్ధచకారమునకు వకారమును సాధించుచు నీ లక్షణము కొంతవఱకుఁ బ్రయోజనవంతమె యైనను వివృతియందుఁ గొన్ని పునరుక్తులు చోటుచేసికొనుట విచార్యము.

## 9. హద్వీ ఇంచిరి.

ఇంచిరి = ఇంచిరాగమము పరముగు చుండఁగా, హద్వీ = పూర్వము హ్రస్వమును మీఁద ద్విత్వము నగును.

వి. కృదన్తే ధాతోర్ద్విత్వ చకారయో శ్చేషాదేశయో స్తత్ప
రస్య పుడాగమస్య చ హ్రస్వద్విత్వే క్రమాత్ స్తః
ఇంచిరి పరే.
రా వచ్చివత్. ఆదేశ స్థానివదిత్యనేన దీర్ఘస్య
హ్రస్వః పుటో ద్విత్వమ్ – రప్పించె, ఇప్పించెన్,
తెప్పించెన్, మెప్పించెన్.–

ద్విరుక్త మగు చకారము చివరఁ గలిగినధాతువుల కాదేశ మగు దీర్ఘాక్షరములకు, ఇంచిరాగమము పరమగు చుండగా పుట్ ప్రత్యయము వచ్చునపుడు ధాతువున కాదేశ మయిన దీర్ఘమునకు హ్రస్వమును మీఁద నున్న 'పుట్' లోని పకారమునకు ద్విత్వమును వచ్చును.

వచ్చి ధాతువు వచ్. 'వచ్చేరా' యని 'వచ్' అనుదానికి 'రా' యని యాదేశము. ఆదేశస్థానివత్ అను నాద్యసంప్రదాయము ననుసరించి ఆదేశ మయిన 'రా' స్థాని యగు వచ్చి వంటిదే - యగును. దీనిపై ప్రేరణమునందు ణిచ్చు (ఇంచిర్) రాఁగా రా + ఇంచ్ ఇపుడు ధాతువునకు పుట్ ప్రత్యయము రా-పు -ఇంచిరి. ఆదేశ మయిన రా యనుదానియందలి దీర్ఘమునకు ప్రస్తుతసూత్రము చేతనే హ్రస్వము (ర పు) మీది పకారమునకు ద్విత్వము వచ్చి రప్పు + ఇంచ్ = రప్పించ్ - రప్పించెన్ మొ॥ ఇట్లు తెచ్చి- తేర, తే- తెప్పించెన్ మొ।

వి. ద్విత్వం చకారస్యేతి కిమ్? చూపించెన్, దాపించెన్, కాపించెన్, తోపించెన్ ఇత్యాదిషు హ్రస్వద్విత్వేన.

ద్విరుక్త మగు చకార మంతమందుఁ గలిగిన ధాతువులయెడనే యీ హ్రస్వద్విత్వము అని (వివృతియందు) చెప్పఁబడుటచే, నొకే చకార మున్నధాతువున కీ హ్రస్వద్విత్వములు రావు.

చూచ్ = చూపించె. త్రోచ్ = త్రోపించె మొ॥ ఇట పుట్ చకారమున కాదేశ మైన దని యెంచవలెను.

ప్రేరణార్థమున 'పుగాగమము' గా సూరి చెప్పినది యిట 'పుట్' ప్రత్యయముగాఁ జెప్పఁబడిన ట్లూహింపవచ్చును.

ఇవి ప్రేరణార్థక పుగాగమముపై ఇంచుగాగమము వచ్చిన రూపములుగా సూరిప్రభృతుల మతము. ప్రేరణేంచిర్ పర మగుచుండ పు ట్టయినట్లు వీరిమతము.

## 10. టిచిర్ కేభ్యశ్చిత్.

కేభ్యశ్చిత్ = కొన్నిధాతువులకంటెఁ బరముగా, 'టిచిర్' = టిచిర్ ప్రత్యయ మగును.

వి. కేభ్యశ్చిద్ధాతుభ్యః పరతష్టిచిర్క్త్వార్థ కస్స్యా దించి రర్థే. తీరి - తీరిచి - తీరఁజేసి, తారి - తారిచి- తారజేసి, తేరి - తేరిచి, మారి - మారిచి మని - మనిచి, అని - అనిచి, పూని - పూనిచి, విడి - విడిచి ఇత్యాది.

కొన్నిధాతువులకు ణిజర్థమునందు 'టిచిర్' ప్రత్యయ మగును. టిచిర్ అనుదాని యందు టకారరేఫము లిత్తులు. కావున 'ఇచ్' అనునదే యగును. (చ కారముపై నికార ముచ్చారణార్థముగా గ్రహింపఁదగును.) 'తీరి' ధాతువుపైఁ బ్రేరణమున నీ సూత్రముచే టిచిర్ ప్రత్యయము రాఁగా తీర్ + ఇచ్ = తిరిచ్ - తీరిచెను- తీరునట్లు చేసెనని యర్థము. మొ॥ ఇ ట్లితరము లూహ్యములు.

సూరిప్రభృతులు ప్రేరణార్థమునఁ జెప్పిన చుగాగమమె యీ టిచిర్ ప్రత్యయ మని యూహింపవచ్చును, తీరుచుచు చున్నాఁ డిత్యాదిగా అడాదుల యందు ముం దుత్వ మగుట విశేషము.

## 11. కాసి కూసి కోస్యాదీనాం యః [1].

కాసి కూసి కోస్యాదీనామ్ = కాసి, కూసి,కోసి మొదలగు ధాతువుల (స కారమున) కు, యః = యకార మగును.

వి. ఏతేషాం సాంతధాతూనా మన్త్యసకారస్య యకార
స్స్యాద్దన్త్యాజాదిశిదార్ధ ధాతుకయోః పరయోః.
కాయున్, కాయుచున్నది. కాయఁగలదు, కాయదు
ఇత్యాది.

దంత్య మైన యచ్చు మొదటఁ గలిగిన శిత్తులు నార్ధధాతుకములు పర మైనపుడు కాసి మొదలగు ధాతువులతుది స కారమునకు యకార మాదేశ మగును.

ఇ ఈ ఎ ఏల కంటె భిన్న మైన యచ్చు మొదటఁ గలిగిన ప్రత్యయాదులు పర మైనచో సాంతధాతువులతుది సకారమునకు యకార మగును.

కాస్ - శుట్, కాస్ + ఉ. అనుచో ఉత్వము దంత్యస్వరము పర మైనది కావున సకారమునకు యకారము కాయ్ + ఉ - కాయు, ద్రుతప్రకృతికము కాయున్ మొ॥ ఇ ట్లితరము లూహింపఁదగును.

వి. దన్త్యాజాదిశిదార్ధ ధాతుకయోః కిమ్? డాసెన్,
డాసిరి, డాసితివి, డాసితిని, డాసీని, డాసెదరు ఇత్యాది.

దంత్యస్వరము పర మైనపుడె సకారమునకు యకారము. కావున ఇ, ఈ, ఎ, ఏలు తాలవ్యస్వరములు పర మైన సందర్భమున యకారము రాదు. సకారమట్లే యుండును. డాసిరి. డాసెన్ మొ॥ ఇట్లిరతము లూహ్యములు.

---

1. సాన్తానాంయః. త్రి.శ10.5.

కాసి మొద లగునవి వివృతియందుఁ జూపబడినవి.

వి. కాసి, కూసి, కోసి, చేసి, తీసి, వేసి, త్రోసి, దూసి,
నేసి, పాసి, పూసి, పోసి, మాసి, మూసి, మేసి, మ్రోసి, (వ్రా)రాసి,
రోసి, (దేశ్యేదిర్శ్యో?) ఒడిసి, కెదిసి,కొడిసి, జడిసి,
తడిసి, మడిసి, మిడిసి, వడిసి, విడిసి, వెడిసి, సుడిసి,
ఉరిసి, కిరిసి, కురిసి, తరిసి, తిరిసి, దొరిసి, నెరిసి, మురిసి,
మెరసి, మోరిసి, విరిసి, సొలిసి, అలిసి, కలిసి, తెలిసి, నలిసి,
నులిసి, పులిసి, పొలసి, ములిసి, మెలసి, వడిసి, వలసి,
ఆరసి, సొలసి, కినిసి, గునిసి, తనిసి, తునిసి, మొనిసి,
ఎగిసి, పొగసి, బిగిసి, మొగిసి – ఆదయః – ఏతే.
కాసి, కూసి, కోస్యాదయః. సాంత ధాతవః.

ఇట్లు సకారాంతము లెల్ల కాస్యాదులలోఁ జేరునవే, సూత్రమున కాసి కూసి కోస్యాధీనామ్' అని మూఁడు ధాతువులు నిర్దేశించుట యనవసరము. కాస్యాదీనాంయం' అన్నఁ జాలును.

ఇంతకును 'స్యోర్యగ్వకౌ' యను సూత్రమున ప్రస్తుతవిషయము చెప్పఁబడియే యున్నది. కాఁగా నీ లక్షణము పునరుక్తియే గాని ప్రయోజనవంతము గా దనకతప్పదు.

## 12.కూసి కాసి భ్యాం కక్.

కూసి కాసిభ్యాం = కూసి, కాసి యను ధాతువులకు, కక్= కక్ అను కృత్ప్రత్యయ మగును.

వి. పోగేశ్చేతి వక్తవ్యమ్ [1].

'పోగేః చ – పోగి యను ధాతువునకును కక్ ప్రత్యయ మగు నని చెప్ప వలయును.

వి. కూక, కాక, పోక.

కూసి, కాసి, పోగి, ధాతువుల యంత్యాక్షరమునకు కక్ అను కృత్ప్రత్యయ మగును. 'కక్'లో ఇకార మిత్తు కావున నది లోపించును 'క' యనునదే నిలుచును.

1. ఇది వివృతికారవచనము యై యుండును.

కూస్- సకారమునకు కక్ ప్రత్యయము రాఁగా కూక (కూఁత యని యర్థము) కాస్ - కాక, పోగ్ - పోక (పోవుట).

## 13.కూసి కోసి చేసి పూసి పోసి రోసి వ్రాసి గీసీనాంతజ్[1].

వ్యా.కూసి - గీసీనామ్ = కూసి--గీసి అను ధాతువులకు, తజ్ = తజ్ప్రత్యయ మగును.

వి. కూఁత, కోఁత, చేఁత, పూఁత, పోఁత, రోఁత, వ్రాఁత, గీత ఇత్యాది.

కూసి, కోసి, చేసి, పూసి, పోసి, రోసి, వ్రాసి, గీసి- అను ధాతువుల తుది సకారమునకు 'తజ్' అను కృత్ప్రత్యయ మగును. తజ్ అనుచో జకార మిత్తు 'జిదనుస్వారః' అను సూత్రముచే జిత్తగు'త'వర్ణమునకుఁ బూర్వమున సున్న యగును.

కూసిధాతువు - కూస్ అనుచో సకారమునకు తజ్ ముందుబిందువు కూఁత. ఇ ట్లితరము లూహ్యములు. 'గీసీనామ్' అని సూత్రమునఁ జెప్పఁబడుట వీనిలో వే ఱొకధాతువు చేర్ప నవకాశము లేనట్లె గుర్తింపవలెను. కాని వివృతి యందు 'ఇత్యాది' యనుట విశేషము.

## 14.నేసి మూసి మేసి మ్రోసీనాం తస్.

వ్యా. నేసి--మ్రోసీనామ్ = నేసి--మ్రోసిధాతువులకు, తస్ తస్ప్రత్యయ మగును.

వి. నేత, మూత, కేత, మ్రోత ఇత్యాది.

నేసి, మూసి, మేసి, మ్రోసి యను ధాతువుల తుది సకారమునకు 'తస్' అను కృత్ప్రత్యయ మగును. తస్‌లో సకార మిత్తు కావున లోపించును. 'త'యనునదే నిలుచును.

నేసిధాతువు నేస్ అనుచో సకారమునకు తస్ప్రత్యయ మై నేత. ఇట్లితరములు.

నేఁత, మూఁత, మొదలగు రీతిగా నుండుటను బట్టి వీనిని గూడి పూర్వసూత్రస్థలముననే పేర్కొనఁదగు నని చెప్పవచ్చును. 'కూస్యాదీనాం తీజ్' అని యట సూత్రించినఁ జాలెడి దనవచ్చును.

---

1. అలస కూసమేస మ్రోసమూస ప్రాసకోస వ్రాసవేస పోసానాంతజ్. వై.చం.కృ.11,(12)

## 15. వ్రచ్చి కాసి పాసీనాం యస్.

వ్యా.వ్రచ్చి కాసి పాసీ నామ్, = వ్రచ్చి కాసి పాసి అను ధాతువులకు, యస్ = యస్ ప్రత్యయ మగును.

వి. వ్రయ్య, కాయ, పాయ.

వ్రచ్చి, కాసి, పోసి యను ధాతువులయందుఁ జివరి హల్లులకు యస్ అను కృత్ప్రత్యయ మగును. 'యస్' అనుచో సకార మిత్తు. కావున లోపింపఁగా 'య' యనునదే నిలుచును.

వ్రచ్ అనుచో ద్విరుక్త మగుచకారమున కీ సూత్రముచే యస్ ప్రత్యయ మై వ్రయ - ద్విరుక్తితో వ్రయ్య యని యగును. కాస్ - కాయ, పాస్ - పాయ.

## 16.. తూచేః కుఙ్.

వ్యా.తూచేః = తూచి ధాతువునకు, కుఙ్ = కుఙ్ ప్రత్యయ మగును.

వి. తూఁకు.

తూచి ధాతు వందలి చకారమునకు 'కుఙ్' అను కృత్ప్రత్యయ మగును. 'కుఙ్' అనుచో ఙకార మితు. కావున 'ఙిచనుస్వారశ్చ' యని ముందుబిందు వగును. తూచ్ - తూకు - తూఁ కు.

## 17.ఇచ్చి తెలిస్యోర్విశ్ [1].

వ్యా.ఇచ్చి తెలి స్యోః = ఇచ్చి, తెలిసి అను ధాతువులకు, విశ్ = విశ్ అను ప్రత్యయ మగును.

వి. ఈవి, తెలివి.

ఇచ్చి, తెలిసి యను ధాతువులందుఁ జివరి చకార సకారములకు 'విశ్' ప్రత్యయ మగును. 'విశ్'లో శకార మిత్తు గావున లోపించును.

ఇచ్- ఇవి. ఇట దీర్ఘము ఈవి.

తిలిస్ - తెలివి.

---

1. ఇచ్చ చచ్చయో ర్విశ్వౌ. వై.చం.కృ.7

## 18. అరిసి, మురిసి, నిలిచి, కొలిచి, పూచీనాం వుట్.

వ్యా. అరిసి--పూచీనామ్ = అరిసి--పూచి అను ధాతువులకు , వుట్ = వుట్ప్రత్యయ మగును.

వి. అరువు, మురువు, నిలువు, కొలువు, పూవు.

అరిసి, మురిసి,నిలిచి, కొలిచి, పూచి యను ధాతువు లందలి చివరి సకార చకారములకు 'వుట్' అను కృత్ప్రత్యయ మగును. వుట్‌లో టకార మిత్తు గాన లోపింపఁగా 'వు' అనునదె నిలుచును.

అరిస్ - వుట్. అరివు. ముందరి యిత్వమునకు ఉత్వము- అరువు -- మొ॥.

ఈ, 17,18 సూత్రములనుబట్టి 'క్వచిద్వుట్చ(2) సూత్రము చెప్ప నక్కఱ లే దని తెలియవచ్చును.

## 19. చచ్చే రావుట్. [1]

వి. చావు.

చచ్చి ధాతువు చివరి ద్విరుక్త మగు చకారము స్థానమున 'ఆవుట్' అను కృత్ప్రత్యయ మగును. ఆవుట్‌లో టకార మిత్తు ఆవు అనునది నిలుచును.

చచ్చ్ - చ + ఆవు సంధి యై 'చావు' అని యగును.

## 20.వచ్చి రా(పో)యో్యః కన్.

వ్యా.వచ్చి రా(పో)యో్యః, = వచ్చి, రా(పో)యి, ధాతువులకు, కన్ = కన్ ప్రత్యయ మగును.

వి. రాక. (పోక).

వచ్చి, (రా)పోయి అను ధాతువులకు కన్ప్రత్యయ మగును. వచ్చి ధాతువునకు 'రా' యనునది యాదేశమై రాక. (పోయిధాతువునకు కన్ వచ్చిన యకారము లోపించి పోక?)

## 21. చొచ్చి వే స్యో ష్టుక్.

వ్యా.చొచ్చి వేస్యోః = చొచ్చి, వేసి ధాతువులకు, టుక్ = టుక్ ప్రత్యయ మగును.

వి. చోటు , వేటు.

---

1. ఇచ్చ చచ్చయో ర్విట్వౌ. వై.చం.కృ.7

చొచ్చి వేస ధాతువు తుది చకార సకారములకు 'టుక్' అను కృత్ప్రత్యయ మగును. టుక్‌లో కకార మిత్తు. చొచ్- చొటు ముందటి యచ్చునకు దీర్ఘము చోటు. చోటు అన్నది చొచ్చు ధాతువు కృదంతరూప మనుట విశేషము.

వేస్ - వేటు.

## 22. మో చేర్టట్.

వ్యా.మోచేః = మోచి ధాతువునకు, టట్ = టట్ప్రత్యయ మగును.

వి. మోట.

మోచి ధాతువు యొక్క చకారమునకు టట్ అను కృత్ప్రత్యయ మగును. 'టట్'లో చివరి టకార మిత్తు. మోచ్ - మోట.

## 23. నోచే ర్ముక్ (వా).

వి. నోచే ర్ముక్ స్యా త్సార్వధాతుకార్ధధాతుకయోః.
నోము, నోమెన్, నోచెన్, నోమున్, నోచున్
నోముచున్నాము. నోచుచున్నది, నోమఁగలదు,
నోచఁగలదు, నోమదు, నోచదు, నోమకు, నోచకు,
నోముము, నోచుము ఇత్యాది.

నోచేః = నోచి ధాతువుయొక్క చకారమునకు (వా = వికల్పముగా) ముక్ = ముక్ ప్రత్యయ మగును. ఎల్లయెడల ముక్ వికల్పముగా నగు నని వివరింపఁబడినది. నోముచున్నాఁడు నోమఁగలఁడు వెు॥ వికల్ప మగుటచే ముక్ రాని పక్షమునందు నోచుచున్నాఁడు నోచఁగలఁడనురీతిగా నవును.

ఇవి భిన్నము లగు ధాతువులుగాఁ జెప్పఁబడును. నోచి తధాతువు చకారము ముక్ కృత్ప్రత్యయముగాఁ గూడఁ జెప్పఁదగును. నోము.

## 24. రాచే ర్యిల్.

వి. రాయి.

రాచేః = రాచి ధాతువుయొక్క చకారమునకు, యిల్ = యిల్ అను కృత్ప్రత్యయ మగును. యిల్ అనుచో లకార మిత్తు.

రాచ్ - రాయి, రాయి శబ్దము రాచి ధాతుకృదంతరూప మనుట విచార్యము. రాయిడి, రాపిడి, రాపున్నవి ప్రసిద్ధములు.

## 25. నొచ్చి పుచ్చి త్రెంచి చించి రొంచీ నాం పిట్.

వ్యా.నొచ్చి---రొంచినామ్ = నొచ్చి---రొంచి అను ధాతువులకు పిట్ = పిట్ అను ప్రత్యయ మగును.

వి. నొప్పి, పుప్పి, త్రెంపి, చింపి, రొంపి, ఇత్యాది.

నొచ్చి, పుచ్చి, త్రెంచి, చించి, రొంచి యనుధాతువులతుది చకారమునకు 'పిట్' అను కృత్ప్రత్యయ మగును. నొచ్ - నొప్పి, మొ॥ రొంచి ధాతువు మృగ్యము. ద్విరుక్త మగు చకారమునకు ద్విరుక్త మగు పకారము గల్గుట విశేషము.

## 26. ఉద్వా త్రెంచేః.

వి. త్రెంపు.

త్రెంచేః = త్రెంచి ధాతువున కగు పిట్ ప్రత్యయమునందలి యిత్వమునకు, వా = వికల్పముగా, ఉత్ = ఉత్వ మగును. త్రెంచి ధాతువు చకారమునకుఁ బూర్వసూత్రముచే పిట్ ప్రత్యయము రాఁగా నందలి యిత్వమునకుఁ బ్రస్తుతసూత్రముచే నుత్వము వికల్పముగ నగు. త్రెంపి - త్రెంపు 'వా' యనుటనే నుత్త్వము రానిపక్షమునందు 'త్రెంపి' యని యిదంతముగనె యుండును. ఇట్టి కృదంతరూపములు కవిప్రయోగములందు వెదుకవలసి యున్నవి. ఇది త్రెగుధాతువు ప్రేరణరూపము.

## 27. ఎచ్చి నచ్చి నుచ్చి నూచి రేఁచి నాఁచీ నాముల్.

వ్యా.ఎచ్చి--నాఁచీనామ్ = ఎచ్చి--నాచి ధాతువులకు, ఉల్ = ఉల్ ప్రత్యయ మగును.

వి. ఎచ్చు,నచ్చు, నుచ్చు, నూచు, రేచు, నాచు ఉకారః.

---

1. పుచ్చ నొచ్చయోః ప్పిక్. వై.చం.కృ.9

ఎచ్చి, నచ్చి, నుచ్చి, నూచి,రేఁచి, నాఁచి యను ధాతువులకు పరముగా ఉల్ ప్రత్యయ మగును. ఉల్ అనుచో లకార మిత్తు. 'ఉ' అనునదె నిలుచును.

ఎచ్ + ఉ = ఎచ్చు. మొ॥ నుచ్చి, నూచి, నాఁచి యను ధాతురూపములు పరిశీలింపఁదగును.

28.ఆచ్యూచి రాచి చాచి త్రోచి దాచి తోచ్చేచి వీచి
వేచి సైఁచి కలచి తలచి తొలచీనాం పుట్.

వ్యా. ఆచి--తొలచీనామ్ = ఆచి--తొలచి ధాతువులకు, పుట్ = పుప్రత్యయ మగును.

వి. ఆపు, ఊపు, రాపు, చాపు, త్రోపు, దాపు, తోపు, ఏపు
వీపు, లేపు, సైపు, కలపు, తలపు, తొలపు ఇత్యాది.

ఆచి, ఊచి, రాచి, చాచి, త్రోచి, దాచి, తోచి, ఏచి, వీచి, వేచి, సైచి, కలచి, తొలచి ధాతువుల చివరి చకారము యొక్క స్థానమున 'పుట్' అను కృత్ప్రత్యయము వచ్చును. 'పుట్' అనుచో టకార మిత్తు. 'పు' వర్ణము నిలుచును. ఆచ్ - ఆపు, ఊచ్-ఊపు మొ॥

29.అచ్చి (కాచి) గుచ్చి, చూచి, తీసి, తేసి, త్రోచి,
త్రెస్సి, రేచి, దాసి, దూసి, మేసి, మెచ్చి, మోచి,
(రాచి) విచ్చి, వాచి, అఱచి, కఱచి, చఱచి, చెఱిచి, తఱిచి, తెఱచి,
తొలిచి, మరిచి, పఱచి, మఱచి, విరిచి, వెఱచి, ఆరిచీ
రిచ్యూరిచ్యేఱిచ్యోరిచి - కారిచి, కూరిచి, చారిచి, చెఱచి,
జాఱిచి, దూరిచి, దోరిచి, నూరిచి, నేరిచి, పారిచి, పీలిచి,
పేరిచి, తీరిచి, తెఱిచి, తూరిచి, వారిచి, ఆరిసి, ఒడిసి,
కురిసి, ఉరిసి, నెఱసి, మెఱసి, మోరిస్యోలిచి-గెలిచి, తెలిసి, నలిచి,
నిలిచి, పిలిచి, నులిచి , పులిసి,మలచి,
వలచ్యలుస్యులిసి - బలిసి, వెలసి, కొలిచి, సొలసి,
పేలిచి, కూలిచి, తాలిచి, పీలిచి, వేలిచి, పోలిచ్యడచ్యోడిచ్యే
డిచి - కడిచి, కుడిచి, కెదిచి, కొదిచి, తడసి, తుడిచి, నడచి,
నిడిచి, దడిచి, విడిచి, పొడిచి, మడిచి, మిదిచి, ముడిచి,

వడిచి, విడిచి, దడిచీడి చ్యుడి చ్యూడిచ్యేడిచ్యోడిస్యోడిచి-
గాడిచి, పూడిచి, మాడిచి, పాడిచి, వీడిచి, జడిసి. తడిస్యనిచ్యే
నిచ్యేడిచి - తొనిసి (మఱచి) ననిచి, నినిచ్యానిచీడిచ్యూనిచి-
(తూరిచి) తెనిచి, పాడిచి, పూనిచి, మొనసి, చదిసి, కదిసి,
మెదిస్యాదీనాం పుట్.

అచ్చి మొదలగు ధాతువులయొక్క చివరి యక్షరమునకు 'పుట్' అను కృత్ప్రత్యయ మగును.పుట్ లో టకార మిత్తు. అప్పు మొ॥

ఇది యొక సూత్రముగాఁ జెప్పుట విలక్షణము.

పూర్వ సూత్రము విధించునదియు నీ పుట్ప్రత్యయమె, 'అచ్యాదీనాంపుట్' ని యొకే సూత్ర మటనే చెప్పుట సూత్రలక్షణానుగుణ మై యుండఁగా వ్యాఖ్యాతృ మార్గములో నిట్లు సుదీర్ఘముగా నుపన్యసించుట సముచితముగాఁ గానరాకున్నది.

ఇఁక క్రమముగా వివృతి యం దుదాహృతులు చూపఁబడుచున్నవి.

వి. ఇత్యాదీనాం సాంత చాంత ధాతునాం పుట్ స్యాత్.

అప్పు (అచ్చి) కాపు (కాచి - ఈ ధాతువు పూర్వసూత్రమునను బఠింపఁబడియున్నది. ఇట్టి వింకను బైని గుర్తింపఁదగును) గ్రుప్పు (గ్రుచ్చి) చూపు (చూచి) తీపు (తీసి-తీయుట యను నర్థమున తీయు ధాతువునుండి తీపు అను రూపము గానరాదు.) తేపు? (తేసి?) త్రోపు (త్రోసి) త్రేపు(త్రెస్సి) రేపు(రేచి) దాపు(దాచి) దూపు(దూసి) మేపు(మేసి) మెప్పు (మెచ్చి) మోపు(మోచి) రాపు(రాచి) విప్పు(విచ్చి) వాపు(వాచి) అఱపు(అఱచి) కఱపు (కఱచి) చఱపు (చఱిచి) చెఱుపు (చెఱిచి) తఱుపు(తఱిచి) తెఱపు(తెఱచి) తొలపు(తొలచి) నురపు(నురిచి) పఱపు(పఱచి) మఱపు(మఱచి) విరుపు(విరిచి) వెఱపు(వెఱచి) ఆరుపు(ఆరిచి) ఈరుపు(ఈరిచి) ఊరుపు(ఊరిచి) ఏరుపు(ఏరిచి) ఓరుపు(ఓరిచి) కారుపు(కారిచి) కూరుపు(కూరిచి) చారుపు(చారిచి) చెఱపు(చెఱచి) జాఱుపు(జాఱిచి) దూరుపు(దూరిచి) దోరుపు(దోరిచి) నూరుపు(నూరుచి) నేరుపు(నేరిచి) పారుపు(పారిచి) పీరుపు(పీరిచి) పేరుపు(పేరిచి) తెరుపు(తెరిచి) తూరుపు(తూరిచి) వారుపు(వారిచి) ఆరుపు(ఆరిసి) ఒడుపు(ఒడిసి) కురుపు(కురిచి) ఉరుపు(ఉరిచి) నెరపు(నెరసి) మెఱుపు(మెఱిసి) మోరుపు(మోరిసి) ఒలుపు(ఒలిచి)) గెలుపు(గెలిచి) తెలుపు(తెలిచి) నలుపు(నలిచి) నిలుపు(నిలిచి) పిలుపు(పిలిచి) నులుపు(నులిచి) మలుపు(మలిచి) వలుపు(వలిచి) అలుపు(అలిసి) ఉలుపు(ఉలిసి) బలుపు(బలిసి) వెలపు(వెలసి) కాలుపు(కాలిచి))

సొలుపు(సొ[illegible]) [illegible]లుపు(కొలిచి) వెలుపు(వెలసి) పేలుపు(పేలిచి) కూలువు(కూలిచి) తాలుపు([illegible]లిచి) [illegible]లుపు(పీలిచి) పోలుపు(పోలిచి) ఇడుపు(ఇడిసి) అఱుపు(అఱచి) ఉడుపు(ఉడిచి) ఏడుపు(ఏడిచి) కడుపు(కడిచి) కుడుపు(కుడిచి) కెదుపు(కెదిచి) కొదుపు(కొదిచి) తడుపు(తడిసి) తుడుపు(తుడిచి) నడుపు(నడిచి) నిలుపు(నిలిచి) దడుపు(దడిసి) పిడుపు(పిడిచి) పొడుపు(పొడిచి) మడుపు(మడిచి) మిదుపు(మిదిచి) ముడుపు(ముడిచి) వడుపు(వడిచి) విడుపు(విడిచి) దడుపు(దడిచి) ఈడుపు(ఈడిచి) ఊడుపు(ఊడిచి) ఏడుపు(ఏడిచి) ఓడుపు(ఓడిచి) గాడుపు(గాడిచి) పూడుపు(పూడిచి) మాడుపు(మాడిచి) వారుపు(వారిచి) పీడుపు(పీడిచి) జడుపు(జడిసి) తడపు(తడిసి) అనుపు(అనిచి) ఉనుపు(ఉనిచి) ఎనుపు(ఎనిచి) పనుపు(పనిచి) తొనుపు(తొనిచి) మనుపు(మనిచి) (మఱపు(మఱచి)) ననుపు(ననిచి) (నినుపు(నినిచి)) నొనుపు(నొనిచి) ఆనుపు(ఆనిచి) ఈనుపు(ఈనిచి) (ఊనుపు(ఊనిచి)) తూనుపు(తూనిచి) తెనుపు(తెనిచి) పొడపు(పొడిచి) పూనుపు(పూనిచి) మొనుపు(మొనిచి) వదుపు(వదిసి) కదుపు(కదిసి) (మెదపు-మెదసి)-

ఇందుఁగొన్ని ధాతువుల యుని కింకను బరిశీలింపవలసి యున్నది. తెనుపు - తెంపు, నొనుపు-నొంపు-మొ॥ రీతిగాఁ బ్రసిద్ధములు. సూత్రమునందుఁ గానగు ధాతువులకును, వివృతియందున్న వానికిని నడుమ నడుమఁ బోలిక కుదురపడకున్నది. మిగిలిన యెడల సూత్రానుగుణముగనె ధాతువుల కృదంతరూపములు గానవచ్చు చున్నవి.

## 30. కొలిచేః.

## వి. కొలిచి ధాతోః ధాన్యార్థే పుడాదేశస్స్యాత్. కొలుపు.

కొలిచి ధాతువునకు ధాన్య మను నర్థమునందు 'పుట్' అనునది చివరి వర్ణము (చకారము)న కాదేశ మగును. కొలి + పు ఉదితః - 35 - అను సూత్రముచే ముందటి యిత్వమున కుత్వ మయి కొలుపు అని యగును.

## 31. సేవాయామ్.

## వి. కొలిచి ధాతో స్సేవార్థే పుడాదేశస్స్యాత్.

సేవించుట యను నర్థమునందు కొలిచి ధాతువు నందలి చివరి వర్ణమునకు (చకారమునకు) పుట్ అనునది యాదేశ మగును. కొలుపు = సేవ. ఉదితః అను సూత్రముచే ముందటి యిత్వమున కుత్వము.

పయి రెండు సూత్రములను జెప్పుటలోఁ బ్రయోజన మేది యేని గల దేమో విచారింపవలసి యున్నది.

## 32.ఉణ్ధాన్యే (ఉణ్ణిత్యమ్?)

## వి.కొలిచి ధాతో రన్త్యస్య ఉణాగమస్స్యాద్ధాన్యార్థే – కొలుచు ఇత్యాది.

ధాన్య మను నర్థమున కొలిచి ధాతువునకుఁ బైని 'ఉణ్' అనునది యాగమ మగును. ఉణ్ అనుచో ణకార మిత్తు. కావున 'ఉ' వర్ణము మాత్రమె నిలుచును.

కొలిచ్ + ఉ = కొలిచు. ఇట 'ఉదితః' అను సూత్రముచే ముందటి యిత్వమున కుత్వము. కొలుచు – ధాన్యము.

## 33.కర్త ర్యడచ్ [1].

కర్తరి కర్త్రర్థమునందు, అడచ్= అడచ్ అను ప్రత్యయము ధాతువున కగును.

వి. అమహతి కర్త్రర్థేఽడచ్ ప్రత్యయస్స్యాద్ధాతోరన్త్యస్య –
కాయడము, కూయడము, కోయడము, ఆర్ధధాతుకత్వా
ద్యకారః – కొట్టడము, నెట్టడము, విడువడము, అలుకడము,
వినడము ఇత్యాది.

అమహత్ కర్త్రర్థమున ధాతువుపై 'అడచ్' అను ప్రత్యయ మగును. 'అడచ్' అనుచో 'చ్' కార మిత్తు. 'అడ' అనునది నిలుచును. 'అడ' ప్రత్యయాంతము లగు కృదంత ప్రాతిపదికలు ములంతము లగును.

కొట్టి ధాతువుపై నీ సూత్రముచే అడచ్ప్రత్యయము రాఁగా, కొట్ + అడ –కొట్టడ అని కాఁగా ములంతమై కొట్టడము అని యగును. ఇట్లితరములు.

ఇతరులు యాంతములుగా నిరూపించిన ధాతువులిందు సాంతములు. చేసి, కొసి మొ। అడ ప్రత్యయ రూపము – చేయడము, కోయడ మనురీతి నుండును. ఆర్ధధాతుకత్వముచే 'స్యోర్యగ్వకౌ' అని సకారమునకు యగాదేశమైన దని వివృతి యందుఁ జెప్పఁబడినది. ఇట నార్ధకత్వము విచార్యము. పోవడు అనుచో యకారమునకు వగాదేశము నైనది.

'అడచ్' ప్రత్యయము కర్త్రర్థమునం దగు ననుట సంగతముగాదు. చేయడము అనుదానికి 'చేయుట' అని యర్థము. ఇది భావార్థము 'చేయడము' అనుదానికి 'కర్త' అనురీతిగాఁ గర్త్రర్థము లేదు. కాఁగా 'అడచ్' ప్రత్యయమును గర్త్రర్థముగాఁ జెప్పుట యొప్పదు.

---

1. అడచ్ప కర్తరి చేన్యతే. త్రి.శ.10.4.

## 34.నలిగి నులిసి పొలసి మలసి మెలిస్యాదీనాం కువచ్.

వ్యా.నలిగి-- మెలిస్యాదీనామ్ = నలిగి--మెలిసి మొదలగు వానికి, కుపచ్ = కువచ్ ప్రత్యయ మగును.

వి. ఏషామంత్యవర్ణానాం కువచ్ ప్రత్యయ ఆదేశ స్స్యాత్[1].

నలకువ, నులకువ, పొలకువ, మలకువ, మొలకువ ఇత్యాది.

నలిగి, నులిసి, పొలసి, మలసి, మెలిసి మొదలగు ధాతువులయొక్క చివరి వర్ణమునకు కువచ్ అనుకృత్ ప్రత్యయ మాదేశముగా నగును. కువచ్ అనుదానిలో చకార మిత్తు. కువఅనునదే నిలుచును.

నలిగి - నలికువ- తరువాతి సూత్రముచే నుత్వ మయి- నలుకుప యని యగును.

'కువవర్ణకం బడుగ్వాదుల కగు ' నను సూత్రముతో సూరి అడకువ మొదలగు రూపములను స్పష్టము చేసెను. ఆదిశబ్ద మెల్లను సూత్రమున నున్నదే కావున 'నలిగ్యాదీనాం కువచ్' అని మాత్రమె సూత్రించినను నసర్థము లే దని గుర్తింపవచ్చును.

## 35.ఉదితః.

వి.ఆదేశే పరే ధాతోః శేషస్యాన్త్యేకారస్య (ఉకార స్స్యాత్) క్వచిత్ స్థలేషు-

నలుకువ, నులుకువ, పొలుకువ, మలుకువ, మెలుకువ

ఇత్యాది.

ధాతువుయొక్క చివరివర్ణమున కాదేశ మయిన ప్రత్యయాదులు పరముగా నున్నపుడు దానికిఁ బూర్వమునందున్న ధాతువు తుది యిత్వమున కుత్వము వచ్చును.

నలిగి ధాతువు చివరి గకారమునకుఁ బూర్వసూత్రముచే 'కువచ్' ప్రత్యయము రాఁగా నలి + కువ యని యుండఁగాఁ బ్రస్తుతసూత్రముచే ముందటి యిత్యమున కుత్వ మయి నలుకువ యని యగును.

చెటిచి - చెఱుపు మొదలగు పూర్వ స్థలములందు నుత్వ మీ సూత్రము చేత నయిన దని గ్రహింపఁదగును.

ఇట్టి రూపములు మృగ్యములు. నలగు ధాతువునకు కువప్రత్యయ మై 'నలకువ' యను రీతిగ నేర్పడుట నితరులు స్పష్టము చేసిరి. ఇట్లె మెలగు-మెలకువ మొ॥.

తద్భవ పరిచ్ఛేదమున నిట్టి సూత్రము గలదు.

---

1. మెలగవేగా డగాం కువచ్. వై.చం.కృ.14.

## 36. అదు(తో)తః.

వి. ధాతుశేషేకా(రాత్ప్ర)రస్య ఆదేశో కారస్య అకార
స్స్యాత్ క్వచిత్ స్థలే. నలకువ, మెలకువ ఇత్యాది.

ధాతువుయొక్క తుదివర్ణమున కాదేశముగా వచ్చిన ప్రత్యయాదులు పర మగుచుండగా ముందటి యిత్వమునకు 'ఉదితః' అను పూర్వసూత్రముచే నాదేశముగా వచ్చిన యుత్వమునకుఁ గొన్నియెడల నత్వము వచ్చు నని యభిప్రాయము.

నలిగి ధాతువు తుదిగకారమునకుఁ బ్రపూర్వసూత్రముచే 'కువ' యాదేశ మయి నలి + కువ యని కాఁగా 'ఉదితః' అను పూర్వసూత్రముచే ముందటి యిత్వమున కుత్వ మయి నలుకువ యని కాఁగా నా యుత్వమునకుఁ బ్రస్తుతసూత్రముచే నత్వ మయి నలకువ యని యగును. ఇట్లే మెలకువ మొ॥.

ఇత్వమున కుత్వము చేసి దాని కత్వము చేయుటలోఁ బ్రక్రియాగౌరవమె కాని ప్రయోజనము గానరాదు. ఇత్వమునకుఁ బర్యాయమున నత్వోత్వములు రెండును విధింపనగును. కాని చెఱిచి, చెఱుపు ఇత్యాదిగా నుత్వము సాధారణము. కాఁగా నత్వవిశేషము కొన్ని యెడల మాత్రమె కలదు. అందుచే నీ యుత్వాత్వములు రెండును వేఱుగాఁ జెప్పఁబడియుండును.

అయిన నిట్టియెడల నిత్వమునకె యత్వము వికల్పముగా విధింపవచ్చును. పక్షమున సామాన్యవిధిచే నుత్వము గాఁగలదు.

నలుకువ యను రీతిరూపము లదృష్టము లగుటంబట్టి యిట నత్వమె నిత్యముగ నగుటయు నూహింపఁదగి యున్నది. ఇట్టి సూత్రమును దద్భవపరిచ్ఛేదమునఁ గలదు.

## 37. తునిసేర్యకజౌ.

తునిసేః = తునిసి ధాతువు తుది వర్ణమునకు, య, కజౌ = 'య' మఱియు కజ్ అను కృత్ప్రత్యయము లగును.

వి. తునిసిధాతోరన్త్య స్య సకారస్య యప్రత్యయ
కప్రత్యయౌ ద్వావాదేశౌ స్తః. తునియ, తునుక
ఇత్యాది.

తునిసి ధాతువునందుఁ జివరి సకారమునకు య, మఱియు కజ్ అను ప్రత్యయము లాదేశము లగును. రెండును తుది వర్ణమున కాదేశములు గావలసియున్నవి. కావున

యప్రత్యయము రాకుండుటయు నా పక్షమున సకారమునకు క(ప్రత్యయ మగుటయు గుర్తింపఁదగును. ఇవి రెండును రాని రూప మిట నుండదు.

తునిసి ధాతువు సకారమున కీ సూత్రముచే యవర్ణ మాదేశము కాఁగా 'తునియ' యని యగును.

యప్రత్యయము రాక తునిస్ అని యుండఁగా సకారమున కీ సూత్రముచేతనె క(ప్రత్యయ మయి తుని + క అని కాఁగా 'ఉదితః' అను సూత్రముచే ముందఱి యిత్వమున కుత్వ మయి 'తునుక' యని యగును.

'తునిసేః' అని యకఙ్జులను తునిసి ధాతువున కొక్కదానికి యీ సూత్రము చెప్పుచున్నది. అదియ యుదాహరించియు వివృతి యం 'దిత్యాది' యనుట విశేషము.

'కఙ్' అనుచో ఙకార మిత్తు. 'ఙిదనుస్వారశ్చ' యను లక్షణము ననుసరించి ఙి త్తగు కవర్ణమునకుఁ బూర్వము నందు బిందువు రావలయును. కాని 'తునుంక' యను రీతిరూపములు గానరావు. కాఁగా నిట క(ప్రత్యయమును ఙిత్తుగాఁ జెప్పుట యనర్థక మగుచున్నది.

## 38. ఎగిసి బిగిస్యోర్వున్.

ఎగిసి బిగిస్యోః = ఎగిసి, బిగిసి అను ధాతువుల తుదివర్ణమునకు, వున్ వున్ అను ప్రత్యయ మాదేశ మగును.

వి. ఏతయోరన్త్య సకారయోర్వునా దేశస్స్యాత్ – ఎగువు, బిగువు.

చివరి ఎగిసి, బిగిసి యనుధాతువుల చివరి వర్ణము 'స' స్థానమున వున్ అను ప్రత్యయ మాదేశ మగును. వున్‌లో నకార మిత్తు. వువర్ణమె నిల్చును.

బిగిసి ధాతువు సకారమున కిట్లు వున్ రాఁగా బిగిస్– బిగి + వు అని కాఁగా 'ఉదితః' అను సూత్రముచే ముందఱియిత్వమున కుత్వ మై 'బిగువు' అని యేర్పడును.

ఎగిసి ధాతువు నుండి ఎగువు అని యిట్లే యగును. కాని యీ రూపము గానరాదు. ఎక్కు ధాతువునకు వప్రత్యయమును, ఎక్కునకు 'ఎగు' అను నాదేశమును బేర్కొని ప్రౌఢవ్యాకర్త 'ఎగువ' యను రూపమును నిరూపించెను.

## 39. లుక్ క్వచిత్ [1].

క్వచిత్ = కొన్నియెడల, లుక్ = తుదివర్ణమునకు లోప మగును.

వి. క్వచిత్ స్థలే ధాతో రన్త్య వర్ణస్య లుక్ స్యాత్.

(వగి-) వగిచి. పొగిస్యాదయః- అన్త్యవర్ణలోపః

శేషస్యడశ్చేతి సూత్రేణ అకారః - వగ, పగ, పొగ ఇత్యాది.

కొన్ని యెడల ధాతువుయొక్క తుది వర్ణమునకు లోపము వచ్చును.

'వగిచి' యనుచో నీ సూత్రముచే తుదివర్ణము (చకారము) లోపింపఁగా 'వగి' అని యగును. చివర డశ్చ. (కృ.4) అను సూత్రముచే అత్వమై వగ, పొగిసి- పొగ మొ॥.

## 40. పుద్వార్ధ ధాతుకే.

ఆర్ధధాతుకే = ఆర్థధాతుకము పర మగుచుండఁగా, వా = వికల్పముగా, పుట్ = ధాతువు తుది చకారమునకు పుదాదేశము వికల్పముగా నగును.

వి. అనుస్వారాత్పరస్య చకారస్య పుద్వికల్పేన స్యాదార్ధ

ధాతుకే పరే. దాఁచగలఁడు - దాఁపఁగలఁడు

కలఁచఁగలది - కలఁపఁగలఁది, త్రుంచఁడు - త్రుంపఁడు

ఆఁచఁడు - ఆఁపఁడు ఇత్యాది.

ఆర్ధధాతుకము పరముగా నున్నపుడు (భవిష్యదాద్యర్థములందు) ధాతువు తుది బిందువు కంటెఁ బైనున్న చకార స్థానమున 'పుట్' అనునది వికల్పముగా నాదేశ మగును.

దాఁచి ధాతువునందు చకారము అనుస్వారము (ఖండము) పయి నున్నది. కాఁగ భవిష్యదర్థమునం దీ సూత్రముచే చకారమునకు 'ప' కార మాదేశమయి దాపఁగలఁడు అని యగును.

'వా' యనుటచే నాదేశము వికల్పము గావున రానిపక్షమునందు చకార మట్లే యుండి దాఁచఁగలఁ డనురీతి నగును. ఇట్లితరము లూహింపవచ్చును.

---

1. వగచ నడచ పొగచ కొంచాంలుక్? వై.చం.కృ.8.

ఇది యాచ్ఛికధాతువుల విషయముననే యైనను కృదంతప్రకరణమునఁ గాక క్రియాప్రకరణమునఁ జెప్పఁదగినది. ఇట్లె క్రియాపదములకు సంబంధించిన యంశము లిం దింకను గాననవును.

## 41. ధాతోష్టిః.

ధాతోః = ధాతువుయొక్క చివరివర్ణమునకు, టిః = 'టి' అనున దాదేశ మగును.

వి. ప్రత్యయే పరే ధాతోరన్త్యస్య టిస్స్యాత్. టకారస్య ఇత్సంజ్ఞా -ఇకారః. కనినవాఁడు, చూచినాఁడు ఇత్యాది.

ప్రత్యయము పర మగుచుండఁగా ధాతువు నందలి చివరి వర్ణమునకు బరముగా 'టి' యనున దగును. 'టి' యనుదానియందు 'ట'కార మిత్తు. కావున ఇత్వము మాత్రమె యాగమ మగును.

ఝుగ్లిటి (క్రి.45) యన్నది లిట్ప్రరకతయందు మాత్రమె చెప్పుటవలన నిట నిట్లు 'టి' విధాన మవసర మైనట్లు దోఁచు.

## 42. (పతిః) అనుబన్ధః కర్మణి.[1]

వి. పతిధాతుః కర్మణి అను బన్ధస్స్యాత్.

కర్మార్థమునందు ధాతువునకు పతి ధాతు వనుబంధముగా నగును. పతి ధాత్వర్థక మగు 'పడు' అనునది యనుబంధముగాఁ జేరు నని గ్రహింపఁదగును. క్రియచే కర్మ చెప్పఁబడుట కర్మార్థము.

## 43. కర్తృవచ్చ.[2]

వి. పతిధాతోర్విధానం కార్యం కర్తృవత్ స్స్యాత్.
దేవతలచేత రాముఁడు నుతింపఁబడినవాఁడు.
యశోదచేత కృష్ణుఁడు ఱోట గట్టఁబడినవాఁడు ఇత్యాది.

---

1. కర్మణ్యనుబన్ధః పతిధాతుః. ఆం.కౌ.క్రి.49.
   పతతేః కర్మణి పడుధాత్వాదేః. వై.చం.తి.203
   కర్మణ్యనుబన్ధస్స్యాత్పతిధాతుః. ఆం.శ.చిం.క్రి.47.
2. కర్తృవచ్చతద్విధయః. ఆం.శ.చిం.క్రి.47
   తద్విధిః కర్తృవత్. ఆం.కౌ.క్రి.50.

'(పతిః) అనుబన్ధః కర్మణి' యను పూర్వ సూత్రముచే కర్మార్థమునందు పత్యర్థక మగు'పడు' అను ధాతువు ధాతువుపైఁ జేరును. ధాతువుపయి లకారాదులు కర్త్రర్థమునందు నయినట్లుగనే కర్మార్థమునందుఁ జేరినపడు·ధాతువు పయిఁ గూడ నగును.

నుతించినవాఁడు - నుతింపఁబడినవాఁడు.

కట్టినవాఁడు - కట్టఁబడినవాఁడు మొ॥

ఇట్లే నుతించుచున్నాఁడు - నుతింపఁబడుచున్నాఁడు. నుతించుట - నుతింపఁబడుట మొ॥.

## 44. అత్వాది దేశ్యానాం (తత్సమానా మివ).[1]

### వి. తత్సమ పదానా మివ దేశ్యశబ్దానాం చ అ తు ఇత్యాద్యా గమా స్స్యుః. నలువ, పూవిలుతుఁడు ఇత్యాది.

వ్యా. తత్సమానా మివ = తత్సమ శబ్దములకు వలెనె, దేశ్యానామ్ = దేశ్య శబ్దములకును, అత్వాది = -అ-తు- మొదలగునవి యగును. నలువ - యనుచో అత్వమును. పూవిలుతుఁడు అనుచో 'తు' వర్ణము నయినవి.

ప్రస్తుతసూత్రమునకు వివృతియందుఁ జూపఁబడిన యర్థము సంగతముగాఁ గానరాకున్నది.

ధాతువులకు సంబంధించిన ప్రస్తుతప్రకరణములో న(క)లువ, పూవిలుతుఁ డనుచోటి సమాసాంతకార్యముల విధానము సనందర్భముగా లేకుండుట యొకలోపము.

తత్సమపదానామివ' అని వివృతియందు స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. నలువ-పూవిలుతుఁ డనుచో దేశ్యశబ్దములందుఁ జూపబడిన- అ-తు అనునవి తత్సమములం దెచ్చట నున్నవి? తత్సమపదానామివ అనుటలోఁ దత్సమములం దిది ప్రసిద్ధము లను నభిప్రాయము వ్యక్తమగు చుండఁగా నిక్కార్యము తత్సమములం దసలే లేకుండుట యొక విరోధము.

ఇవి బహువ్రీహి ని సమాసాంతకార్యములు. ఇందే.సమా.1. సూత్రము వివృతిలో 'నలువ' చూపఁబడె. మిశ్రబహువ్రీహు లసలులేకుండఁగా సిద్ధబహువ్రీహులందీ కార్యములు లేవు. అట్టియెడల తత్సమానామివ యనుట విరుద్ధము గాక తప్పదు గదా.

---

1. తత్సమవదత్వాది దేశ్యానామ్. ఆం.కౌ.క్రి.52
   అత్వాది తత్సమానామివ దేశ్యానామపి క్రియాపదానాంచ
   ఆం.శ.చిం.క్రి.48

'అత్వాది తత్సమానామివ దేశ్యానామపి క్రియాపదానాంచ' యని చింతామణి యందలి సూత్రము. ప్రస్తుతసూత్రము దానికిఁ జాలవఱకు సన్నిహిత మై యుండుట గమనింప వచ్చును. అట 'అత్వాది' యనఁగా అత్వ + ఆది - యని అత్వము మొదలగున వని యర్థము చేయఁబడినది. ఇట 'అత్వాది' అనుచో - అ, తు, ఆది అని - అ- తు మొదలగున వను రీతిగా నర్థము చెప్పఁబడినది. ఇంకను జింతామణియందు 'వ్యతిరేకాదౌ భావిని వాత్స్యాత్ స్యాత్' అత్వము విధింపబడినచోట నిట 'ఘల్' ప్రత్యయము విహితము. చింతామణిలక్షణము ప్రసక్తి యీ గ్రంథమున విస్మృతియం దట నట నుండుట గమనింప వచ్చును. ఇటఁ దద్భిన్నముగా నుంటకు కారణము పయి భేదమె యగుసెమో. ఏ మయినను నీ సూత్రమె కాక తరువాతి దగు 'లోపాగమాబహవః' అను సూత్రమును 'వర్ణాగమోవిశేషః' అను చింతామణిలక్షణమును స్ఫురింపఁజేయక మానదు. ఇట 'వర్ణలోపాగమానైకే' యను వికృతివివేక లక్షణమున కిందను సన్నిహితము.

ఆం.కౌ. వివరణమే తద్భిన్నమై చిం.కనుగుణముగానుండుట గమనార్హము. సూత్రాభిప్రాయమును వివృతి కర్త(నృసింహకవియె) యిట సరిగా గుర్తింపలేదా? విచార్యము.

## 45. లోపాగమా బహవః [1].

లోపాగమాః = వర్ణముల లోపము, ఆగమమును, బహవః = అనేకవిధములుగ నున్నది.

వి. దత్భవపదేషు వర్ణానాం లోపాగమా బహవ స్స్యుః.

తద్భవశబ్దములయందు వర్ణములు లోపించుట ఆగమము లగుట యనేక విధములుగా నున్నది. ఈ సూత్రవివృతులు 'వర్ణలోపాగమానైకే సర్వస్మింస్త ద్భవే పదే' యను వికృతివివేకమును స్ఫురింపఁజేయుచున్నవి. 'వర్ణాగమో విశేషః' అను చింతామణి సూత్ర సందర్భమున నహోబలుఁ డీ వికృతివివేకవచనమును మఱలఁ బ్రస్తావించుటయుఁ దిజంత్రప్రకరణమున సీ సూత్ర ముండుటయుఁ బరిశీలింపఁదగిన సంబంధముతో నున్న వనిపించును.

---

1. వర్ణలోపాగమాః పురుషార్థవచనేషు. ఆం.కౌ.క్రి.53

## 46. జిదనుస్వారశ్చ [1].

వి. జిదన్త ప్రత్యయస్య అనుస్వారశ్చ స్యాత్.

ఈ లక్షణమజంత ప్రకరణమునఁ బేర్కొనఁబడియున్నది. మఱల నిటఁ బునరుక్తమైనది.

## 47. అనునాసికం చ [2].-

వి. అనునాసికం చ స్యాత్. రాముఁడు - రాముండు,

కలఁడు - కలండు.

'జిదనుస్వారశ్చ' యను పూర్వసూత్రము నుండి జిత్తునది యనువృత్తము కాఁగా జిత్ అనునాసికం చ- యని జి త్తగు ప్రత్యయాదులకు ననునాసికము నగును.

అనునాసికమును వేఱుగాఁ జెప్పుటలో నుద్దేశ్యమేమి?

జిత్త్వప్రయోజనము స్పష్టము చేయఁబడని చింతామణి యందు వ్యాఖ్యాతలు 'సానునాసికోచ్చారంజిత్' అను ప్రాకృతీయ లక్షణము ననుసరించి జిత్త్వమునకుఁ బ్రయోజన మానునాసిక్యముగాఁ జెప్పిరి.

అనునాసికం చ' యను ప్రస్తుతలక్షణము దానిని దలపింపఁజేయును.

'సానునాసికోచ్చారం' అను దానిచే నహోబలుఁడు జిత్తునకుఁ బూర్ణ మఱిసున్న చేసెను. ఇంక 'హ్రస్వాత్పూర్ణోఽపి భవే' త్తను దానిచే రాముఁడు రాముం డని చెప్పెను. ఇచట 'జిదనుస్వారశ్చ' యను సూత్రముచే జిత్తునకుఁ బూర్ణము నిండు సున్నయు (రాముండు) 'అనునాసికంచ' అను సూత్రముచే జిత్తునకుఁ బూర్ణము ఖండబిందువును (రాముఁడు) అగు నని చెప్పఁదగును.

అజంతప్రకరణమునం దీ'జిదనుస్వారశ్చ' యను సూత్రము సందర్భమున మాత్ర మిట్టి భిన్నస్థితి గోచరించుట లేదు. ఇది యజంతప్రకరణమునఁ గాక తిజంతప్రక్రియలో నుంట విశేషము.

---

1. వర్ణాగమో విశేషః పురుషే వ్యస్తేషు చాపి వచనేషు.
   అం.శ.చిం క్రి.49

1,2. త్రి.శ.9.బృహస్పతి సూత్రములు.

## 48.[1]ఇడి పడి చెడి తగ్యని కని కొనిచని తిని మని విన్యా దీనాం వాణద్విః [2].

ఇడి--విన్యాదీనామ్ = ఇడి -- విని మొదలగు ధాతువులకు, వా = వికల్పముగా, ణ = ణ ప్రత్యయమును, ద్విః = ద్విత్వమునగును.

వి. ఇత్యాదీనాం ధాతూనామన్త్య(స్య)ణప్రత్యయద్విత్వే
వా స్తః కర్మధారయే (వీటి) ణస్య ఇత్సంజ్ఞా
అకారః. ఇడ్డ బిచ్చము, పడ్డ పాట్లు, చెడ్డధనము,
తగ్గచోటు, అన్నమాట, కన్నతల్లి, కొన్నకోక,
చన్నదినములు, తిన్నకూడు, మన్న మగఁడు,
విన్నసుద్ది ఇత్యాది.

ఇడి, పడి, చెడి, తగి, అని, కని, కొని, చని, తిని, మని, విని మొదలగు ధాతువులకు ణ ప్రత్యయ మగును. ధాతువు తుదిహల్లునకు ద్విత్వము వికల్పముగా నగును. (కర్మధారయమున).

ణ ప్రత్యయమునందు ణకార మిత్తు. కావున నది లోపింపఁగా 'అ' కారము మాత్రమె మిగులును.

ఇడి ధాతువుపై ణ ప్రత్యయము వచ్చి (ఇడ్ + అ) తుదిహల్లునకు ద్విత్వము రాఁగా ఇడ్డ అని యగును, ఇట్లే తగ్గ మొ॥

ఇడ్డ బిచ్చము మొ॥

వి. వేతి కిమ్? ఇడినబిచ్చము, పడినపాట్లు, చెడిన
ధనము, తగినచోటు, అనినమాట, కనిన తల్లి,
కొనిన కోక, చనిన దినములు, తినినకూడు, మనిన
మగఁడు, వినిన సుద్ది ఇత్యాది.

---

1.2. పదేరశ్చ? త్రి.శ.9. బృహస్పతి సూత్రము.
ఇటనుండి 3 సూత్రములు సర్వనామ ప్రకరణము చివరననుస్వారప్రకరణమునకు ముం దసందర్భముగ నున్నవి. ఇటఁదేఁబడె.

'వాణద్విః' అనుచో సూత్రమున 'వా' శబ్దమును జేర్చుట చేత ణత్వ ద్విత్వములు వికల్పములు కావున నవి రాని సందర్భమున 'ఇడిన బిచ్చము' ఇత్యాదిగ రూపము లుండును.

నిజమునకు ణ ద్విత్వములు రానిచో 'ఇడిన బిచ్చ' మను రీతిగా రూప మగుట సంభవము గాదు. ణ ద్విత్వములు రాని చో నవర్ణక మగు ననుట యెట్లు?

కాఁగా భూతార్థమున వచ్చు న ప్రత్యయమున నకారమునకు లోపము చెప్పుటయు ముందటి హల్లునకు ద్విత్వము చెప్పుటయు నొప్పును. అట్లు గా దన్న భూతార్థక న ప్రత్యయమున కీ సూత్రముచే ణ ప్రత్యయ మాదేశ మగు ననియు నీ యాదేశమైన ణ ప్రత్యయమునందు ణకార మిత్తు గావున లోపింపఁగా 'అ'కారమె నిల్చియుండు ననియుఁ జెప్పుట సరిపడును.

## 49. లుగ్డస్య చ.

డస్య = డవర్ణమునకు, లుక్ చ = లోపము సైతము వచ్చును.

వి. చూచిధాతోర్డస్య వికల్పేన లుక్ స్యాత్ చకారో
వికల్పనేఽర్థః. చూడు - చూ.

చూచి ధాతువు నందుఁ దుదిచకారమున కాదేశముగా వచ్చిన డకారము (డువర్ణము) నకు వికల్పముగా లోప మగును 'లుగ్డస్య చ' అనుచోటి చశబ్దము వికల్పార్థకము.

చూడు అనుచో డువర్ణము లోపింపఁగా 'చూ' అని యుండును. వికల్పము గావున లోపము రానిపక్షము నందు చూడు అని యుండును.

(ఇది చూడుము అను నర్థమున నేర్పడినదిగాఁ దలపవలెను) 'చూడు' అని డకార మెల్ల యెడల రాదుగదా. చూము, చుండు అనియు దీనినుండి యేర్పడునవకాశము గలదు.

## 50. వావౌ చ.

వౌ చ = వువర్ణకము పర మగునపుడు సైతము, వా = చూచి ధాతువుయొక్క డవర్ణమునకు వికల్పముగా లోప మగును.

వి. వుప్రత్యయే పరే చూచిధాతో ర్డస్య వికల్పేన
లుక్ స్యాత్ చూడవె, చూడవో,
చూవె, చూవో, చువ్వె, చువ్వో, చూ-చు.

వు ప్రత్యయము పరమగుచుండఁగా చూడు ధాతువు యొక్క డకారమునకు వికల్పముగా లోప మగును.

చూడవె యనుచో డవర్ణము లోపింపఁగా చూవె. వికల్పము గావున లోపింపని పక్షమునందు చూడవె యని యుండును.

ఇట్లే చూడవో చూవో యని యుండును. హ్రస్వద్విత్వములతో వెవ్వె చువ్వొ యని యగును. చూ (చు?) అన్నది యింతకు మునుపే సర్గతమునే సాధింపఁబడినది.

ఇతి కృత్ప్రక్రియా

ఇది కృత్ప్రకరణము

# అథ ధాతు ప్రక్రియా :

ఇటు నాయ యి యర్థములతో ధాతువులను నిరూపించుట యుద్దేశ్యము గావలయును. అట్టి స్థితియె యధికముగ నున్నది కూడ. కాని కొన్ని యెడలఁ గృత్తులుగాఁ జెప్పఁదగిన ప్రత్యయములు నిందుఁ గూర్పఁబడినవి. అట్టియెడల కృదంతము లనరానివి ధాతువులుగాఁ జెప్పఁదగినవి గూడ ధాతువులుగా నిర్దేశింపఁబడి పై వర్ణములను గృత్తులుగా సమన్వయించుట యొక విశేషము. ఇట్టి స్థితి పూర్వప్రకరణమునను గొన్ని యెడల గమనింపవచ్చు.

1. అగ్గింగి కలి కాలి చలి చెలి చిలి తెగ్యడకి తక్కి తులినలి నట్టి పలి మగి ముక్కెక్కి క్కివలివెలి వెల్ల్యాదిభ్య స్టువచ్

వి. ఏభ్యః పరతష్టువచ్ ప్రత్యయస్స్యాత్.

అగ్గి, ఇంగి, కలి, కాలి, చలి, చిలి, తిగి, అడకి, తక్కి, తులి, నలి, నట్టి, పలి, మగి, ముక్కి, ఎక్కి, ఇక్కి, ఏలి, వెలి, వెల్లి– మొద లగుధాతువులకుఁ బరముగా 'టువచ్' అనుప్రత్యయ మగును. టువచ్ ప్రత్యయమునందు టకార చకారము లిత్తులు. కాఁగా 'ఉవ' అనునది నిలుచును.

ఆదిభ్యః' అనున దెల్లను దప్పకుండఁగా నిన్నిధాతువులను సూత్రమునఁ బఠించుటకంటె అగ్గ్యాదిభ్య ష్టుదచ్' అని మాత్రము సూత్రించిన లాఘము గల్గెడిది.

ఇందు తెగి, అడకి, తక్కి, ఎక్కి, అనునవి తప్ప మిగిలినవి ధాతువులుగాఁ దలచుట విశేషము. వీని అజంత రూపములు గానరావు. అగ్గువ కలువ, కాలువ, మగువ మొదలగురీతివి కృదంతములుగా భావించు నవకాశమును గానరాదు.

ఉదాహరణములు వివృతియందు స్పష్టములు.

వి. అగ్గువ, ఇంగువ, కలువ, కాలువ, చలువ, చిలువ, చెలువ, తెగువ, అడకువ, తక్కువ, తులువ, ఎక్కువ, ఇక్కువ, వలువ, వెలువ, వెల్లువ ఇత్యాది.

తెగిధాతువుపైఁ బ్రస్తుతసూత్రముచే 'టువచ్' ప్రత్యయము చేరఁగా, తెగ్ + ఉవ = తెగువ యని యగును. ఇ ట్లితరములూహ్యములు.

వి. చెలేశ్చో లవక్ష వ్యమ్ – చెలువ,

సూత్రమున విధింపఁబడిన 'టువచ్' ప్రత్యయము 'చెలి'కిని వచ్చు నని చెప్పవలెను. చెల్ + ఉవ = చెలువ సూత్రమునందు చెలి చెప్పఁబడియే యున్నది. వివృతియం దది యుదాహరింపఁ బడియు నున్నది. మఱల నిట్లు చెప్పుట యేలకొ స్పష్టము గాదు బహుశః అర్థ విశేష మెదియే నుద్దేశించి చెప్పఁబడిన దేమోయని తరువాతివాక్యమును బట్టి యూహింప వీలు గలదు.

*.కలిః కైరవే కల్మాషే చేతివాచ్యమ్ [1]

వి. కలువ. కలి.

'కలి' యనునది కైరవము (కలువ) కల్మషము (మలినము) అనునర్థములం దుండును. కైరవ మనునర్థమున నీ సూత్రముచే 'టువచ్' ప్రత్యయ మై కలువ అనియగును. కల్మష మనునర్థమున టువచ్ లేదు కలి (కల్మషము) అని యట్లు యుండును.

*.కాలిః కుల్యాయామ్.

వి. కాలువ.

'కాలి' అనునది కుల్య(కాలువ) యను నర్థమునం దుండును. టువచ్ ప్రత్యయము వచ్చి 'కాలువ' యని యగును. కాలువ యనునర్థమున 'కాలి' అని యుండదు.

*. దహనార్థ క్రియా యాం చ.

వి. కాలెన్.

దహన మను నర్థముతో 'కాలి' యనునది ధాతువు నైయుండును. కాలెన్-కాలుట మొద లగురీతిగా లడాదులు దీనిపై నగును.

* అంశ చరణ యోశ్చేతి వాచ్యమ్.

వి. కాలు-తురీయః పాదః, కాలు = చరణః.

కాలి యనుశబ్దము అంశము, (భాగము) చరణము(పాదము) అనునర్థములందు నుండును.

కాలు-అనఁగా నాలుగవభాగ మని యర్థము. ముక్కాలు మొద లగుచోట్ల నిది ప్రసిద్ధము. నేఁ డిది కొన్ని ప్రాంతములం దీయర్థమున నిత్యవ్యవహారముగ నున్నది.

కాలు - చరణము. మోకాలు, మొ॥.

---

1. ఇవియెల్ల సూత్రములుగాఁదోచవు. * చిహ్నముంచఁబడుచున్నది.

చెలి స్త్రియామ్.

వి. చెలి - చెలువ.

చిలి శబ్దము (సఖి) స్త్రీ యనునర్థములం దుండును. టువచ్ప్రత్యయము వచ్చిన పక్షమునందు చెలువ యని యగును. టువచ్ లేక చెలి యనియు నుండును.

*. చిలి సర్పే.

వి. చిలువ.

చిలి యనుశబ్దము సర్ప మను నర్థమునం దుండును.

చిలిశబ్దముపై 'టువచ్' ప్రత్యయ మయి చిలువ యని యేర్పడును. చిలువ యనఁగా పాము.

*. తెగి ధైర్యే.

వి. తెగువ.

తెగిశబ్దము ధైర్య మనునర్థమునం దుండును. టువచ్ ప్రత్యయ మయి 'తెగువ' యని యగును. తెగువ యనఁగా ధైర్యము.

వృ. ఔదార్య భేదన యోశ్చేతివాచ్యమ్.

వి. ఔదార్యే - తెగువ, భేదన క్రియాయాం తెగెన్

తెగిశబ్దము ఔదార్యము, ఖండించు అనునర్థములందు దుండును. టువచ్ ప్రత్యయముతో 'తెగువ' యని యయినదాని కౌదార్య మనియు నర్థము.

ఖండించు ననుటనర్థమునను 'తెగి' యనునది ధాతువయి యున్నది. తెగెన్ తెగుట మొ॥ ఇట్లు తెగిధాతువు పయి లడాదులు చేరును.

*. అడికి లజ్జాయామ్.

వి. అడుకువ.

'అడికి' శబ్దము లజ్జ యను నర్థమునం దుండును. దీనికి టువచ్ ప్రత్యయము రాఁగా అడుకువ యని యగును. 'అడకువ' యని డకారముపై నత్వమె యుండును. కాని యీవ్యాకరణ ముత్వముతో అడుఁకువ యనురూపమును గూడ సాధించియున్నది. అడఁకువ యనఁగా లజ్జయని యర్థము. వినేయతగాఁ బ్రసిద్ధము.

## *.తక్కి న్యూనే.

వి. తక్కువ.

'తక్కి' యనుదానికి న్యూన మని యర్థము టువచ్ ప్రత్యయము వచ్చి 'తక్కువ' యని యగును.

## *.త్రుంచి భేదవే.

వి. త్రుంచె.

త్రుంచిధాతువు భేదించు అనునర్థమునందుండును. త్రుంచెన్ మొ॥.

త్రుంచి యన్నది ప్రత్యేకమగు ధాతువుగా జెప్పుట విశేషము. తునుగు ధాతువు యొక్క ప్రేరణార్థ కరూపముగా 'త్రుంచు' అన్నది ప్రసిద్ధము.

## *.తక్కి వినార్థే.

వి. రాముఁడు తక్కి, కృష్ణుఁడు తక్కి, అందఱును.

'వినా' అనునర్థమున 'తక్కి' అనుశబ్ద ముండును. రాముఁడు తక్కి. అనఁగా రాముఁడు తప్ప రాముని విడచి మిగిలిన అనురీతిగ నర్థ మగును.

'తక్కు' అనుధాతువునుండి తుమర్థమున నేర్పడిన రూపముగా 'తక్కన్' అనుదానిని లాక్షణికులు గుర్తింతురు. న్యూనార్థకముగా నింతకు ముందు చెప్పిన తక్కిధాతువునుండి ఏర్పడిన రూపమె ఈతక్కి అనునది.

## *.తులి తుచ్ఛే.

వి. తులువ.

తుచ్ఛార్థమునందు 'తులి' యను శబ్ద ముండును. దీనికి 'టువచ్' అను ప్రత్యయ మై తులువ అని యగును. తులువ, తుచ్ఛుఁడు.

## *. నలి పీడా చతుర్ముఖ యోః.

వి. నలి–పీడా, నలువ–బ్రహ్మ.

నలి యనుశబ్దము పీడ, బ్రహ్మ యను నర్థములం దుండును. బ్రహ్మ యను నర్థమున నలిశబ్దముపై టువచ్ ప్రత్యయము రాఁగా 'నలువ' యని యేర్పడును.

ఇట్లు టువచ్ ప్రత్యయముచే - నలి - నలువ యని యేర్పడుచుండగా నింతకుముందు అత్వాది దేశ్యానామ్ (తత్సమానామివ) యను సూత్రము వొద్ద నలువ యనుచో నత్వ మయినట్లు చూపుట విచార్యము.

నాలుగు వాతులు గలవాఁ డనునర్థముతో (నిటఁ గూడ సూత్రమున 'చతుర్ముఖ'శబ్ద ముపయుక్తము యర్థవివరణమున) నాలుగు + వాయి = నలువా యని యైనట్లు సూరి నిరూపించెను. ఇందును - చూ.సమా.1. ఆప్రక్రియ యే యుచితమై గన్పించును. ఈ వ్యాకరణము చూపిన ప్రక్రియ యిటఁ జెప్పుట సక్రమముగాఁ దోఁపదు.

పీడ యను నర్థమున 'నలి' శబ్ద మట్ల యుండును.

*. నట్టి నటే.

వి. నట్టువ.

నట్టి శబ్దము నటశబ్దార్థము నందుండును. నట్టి శబ్దముపై టువచ్ ప్రత్యయము రాఁగా నట్టువ యని యగును

* పలి దాసార్థే.

వి. పలువ.

పలిశబ్దము దాసుఁ డనునర్థమున నుండును. పలిశబ్దమునకు టువచ్ ప్రత్యయము రాఁగా పలువ.

*.పలేః కిశ్చ భావనే.

వి. పలిధాతోః కివర్ణకస్స్యా ద్భావనార్థే.

భావన మను నర్థమునందు పలిధాతువునకు కివర్ణక మగును. పలికి.,

పలుకు - (లేదా పలికి) అన్నది మొత్తము ధాతువుగా గుర్తింపఁదగి యుండగా వీని నిట్లు విభాగించుట విశేషము. పలి ధాతు వొకటి గానరాదు.

*.పలి దంతే.

వి. పలుకు - పలికెన్, పలుకున్. కృదన్తాత్పరతో మధ్యవర్ణో రేఫః -- పలుకరించు, పలుకరించెన్.

పలి శబ్ద ముదంత మనునర్థమునం దున్నది. పలిశబ్దముపై 'పలేః కిశ్చ' యను సూత్రముచే కివర్ణ మై పలికి అని యగును- పలికెన్- పలుకున్ అనురీతిగాఁ

దిజంతాదిరూపములు దీనినుండి యేర్పడును. 'పలుకు' అనునది కృదంతము (ఎట్లేర్పడినదో పరిశీలనార్హము పలికెన్ ఇత్యాదులు దీనినుండి యే యేర్పడు ననియు వివృతికర్త యుద్దేశ మేమో. ఇట్టిధాతువుల నిరూపణము వింతగాఁ దోఁపక మానదు.

పలుకు అనునది కృదంత మగుటచే? దీనిపై ఇంచిరాగమము చేరినపుడు నడుమ (కాదిర్మధ్యః?) రేఫ మయి పలుకరించు అనురీతిగ నేర్పడు నని వివరణము.

* మగి స్త్రియామ్.

వి. మగువ.

మగి యనుశబ్దము స్త్రీ యను నర్థమునం దున్నది. దీనికి టువచ్ ప్రత్యయము రాఁగా 'మగువ' యని యేర్పడును. దీనికే స్త్రీ యని యర్థము.

* మక్కి దయాయామ్.

వి. మక్కువ.

మక్కి యనుశబ్దము దయ యను నర్థమునం దున్నది. దీనికి 'టువచ్' ప్రత్యయము రాఁగా మక్కువ య ని యేర్పడును.

'మక్కువ' శబ్దము 'దయ' యనునర్థమునఁ గల దేమో పరిశీలింపలెను. ఇష్ట మను నర్థమున నీ శబ్దము ప్రసిద్ధము.

* ఎక్కి బహౌ.

వి. ఎక్కువ.

ఎక్కి యనుశబ్దము అనేక మనునర్థము నం దున్నది. దీనికి టువచ్ ప్రత్యయము రాఁగా 'ఎక్కువ' యని యేర్పడును.

ఆరోహించు ననురీతియర్థము గల ఎక్కి ధాతువుకంటె నిది భిన్న మని ప్రస్తుతలక్షణమును బట్టి యూహింపవచ్చును.

* వలి వస నేచ్ఛ యోః

వి వలువ, వలచెన్, వలచున్, వలపు.

వలియను శబ్దము వసనము (వస్త్రము) ఇచ్ఛ యను నర్థములం దుండును.

వస్త్ర మను నర్థమునందు వలి శబ్దమునకు 'టువచ్' ప్రత్యయ మయి 'వలువ' యని యేర్పడును.

ఇచ్చు యనునర్థమున వలి శబ్దము 'వలచు' అనురూపముతో నుండును. ఇది ధాతువు. వలచెన్, వలచుట మొద లగు తీరుగా దీనిపై లకారాదు లగును. 'పుట్' అను కృత్ప్రత్యయముతో 'వలపు' అనురూప మీయర్థమున నేర్పడును.

*. ఇక్కిం గితే.

వి. ఇక్కువ.

ఇక్కి యను శబ్దము ఇంగిత మనునర్థమునం దుండును. దీనిపై టువచ్ ప్రత్యయ మయి ఇక్కువ అని యేర్పడును.

*. వెల్లి స్రోతసి.

వి. వెల్లువ.

వెల్లి శబ్దము ప్రవాహ మను నర్థమునం దుండును. దీనిపై టువచ్ ప్రత్యయము రాగా వెల్లువ. వెల్లి శబ్దమును ప్రవాహమను నర్థమునఁ గలదు. పాలవెల్లి - పాలసముద్రము.

*. వెల్లి వేగ బహ్వోః.

వి. వెల్లువ. బహ్వర్థే వెల్లి. వెల్లి కాయలు ఇత్యాది.

వెల్లిశబ్దము వేగము, అధికము నను నర్థములం దుండును. వేగ మను నర్థమునందు టువచ్ ప్రత్యయము చేరి వెల్లువ యని యేర్పడును. బహ్వర్థమునందు 'వెల్లి' అని యుండును. వెల్లి కాయలు మొ॥ ఈ యంశములు విచార్యములు.

*. విరి ప్రసూన ఖండయోః.

వి. ప్రసూనే విరి. ఖండనే టిచిర్ ప్రత్యయః. విరిచెన్, విరుచున్.

విరి యనుశబ్దము పూవు, ఖండించు అను నర్థములందుండును. పూవు అను నర్థమున 'విరి' అనియే శబ్దము. ఖండించు అను నర్థమునందు 'టిచిర్' ప్రత్యయము వచ్చి విరిచి అని యగును. (ఇదిధాతువు) దీనిపై లకారాదు లగును. విరిచెన్ మొ॥

విరి శబ్దమునందు సాధురేఫ ముండఁగా విఱుచు ధాతవువున నుండునది శకటరేఫము. ఆవిషయ మిట నుపేక్షిత మైనది.

ఉండినివాసే.

వి. ఉండెన్

ఉండి ధాతువునకు నివాస మర్థము. ఉండెన్, ఉండుట మొదలగురీతిగా లకారాదు లగును

వి. ఉండిధాతో స్తోష్టురితి సూత్రేణ తేః ష్టకారే ప్రాప్తే-

ఉండితి నిత్యత్ర- ఉండిటిని ఇతి స్థితే-

ఉండిధాతువునకు భూతార్థమునందు మధ్యమోత్తమపురుషలయందు తివర్ణక మయి ఉండితివి, ఉండితిని ఇత్యాదిగ నగును. 'తోష్టుః'(క్రి.96) అను సూత్రముచే తివర్ణమునందలి తకారమునకు టకారము రాగా ఉండటిని అని యగును-పిదప-

2. టౌ డే ర్లుక్.

టౌ = టివర్ణకము పర మగు చుండగా, డేః = ముందటిడివర్గమునకు, లుక్= లోప మగును.

వి. టివర్ణకే పరే ఉండిధాతోః, విద్యమాన డవర్ణస్య లోపస్స్యాత్ ఉంటిని తదభావే ఉండితిని ఇత్యాది.

టివర్ణకము పర మగుచుండగా నుండి ధాతువునందలి డివర్ణము లోపింపగా ఉంటిని అని యేర్పడును.

'తోష్టుః అను సూత్రముచే తివర్ణ కతకారమునకు టకారము రానిపక్షమునందు టివర్ణపరకత యుండదు. గావున 'టౌ' యను నీ సూత్రముచే డివర్ణమునకు లోపము రానేరదు. కావున ఉండితిని అనియె యుండును. మా.క్రి.74.

3. చౌ డే(డో)ర్లుక్.

చౌ = చువర్ణము పర మగుచుండగా, డేః = డివర్ణమునకు, లుక్ = లోప మగును.

వి. వర్తమానార్థే చువర్ణకే పరే ఉండిధాతో ర్విద్యమాన (డు) డివర్ణకస్య లుక్ స్యాత్. ఉంచు(చు)న్నాడు.

వర్తమానార్థ మగు చువర్ణముపర మగుచుండగా ఉండిధాతువునందలి డి(డు)వర్ణమునకు లోప మగును.

ఉండిధాతువుపై వర్తమానార్థమున (శత్రర్థమునందు) చువర్ణక మయి ఉండి + ఉచు అనుచో ఉండుచు-(డు) డివర్ణము లోపింపఁగా ఉంచు అని యగును, క్రి.37 సూత్రమీ కార్యమును జెప్పుచునే యున్నది.

'ఉంచుచున్నాఁడు' అను వివృతియందలి యుదాహరణము సమన్వయింపఁబడుట లేదు. వర్తమానార్థ క్రియాపదమె యనుకొన్నను చువర్ణములు రెం డుంట కవకాశము లేదు. 'ఉంచున్నాఁడు' అనియె యుండు నని యూహింత మన్న ఉండుధాతువునకు వర్తమానార్థమున ఉంచున్నాఁడు ఉంచున్నా రను రీతిరూపములు గానరావు. సూరి ఉండుధాతువునకు లోపము చెప్పి ఉన్నాఁ డనురీతిగనె సాధించెను.

ఉండుధాతువునకు? ఉనుచు అనునది ప్రేరణరూపమై - దానినుండి ఉంచుచున్నాఁ డని కావచ్చును. అక్కడ డిలోప ప్రసక్తి లేదు. 'ఇట ఉండుచు ననియు రూప ముండును. చువర్ణకము పర మగునపు డుండు డులోపము వికల్ప మని సూరి పేర్కొనెను. ఇటఁ బైసూత్రమున వాశబ్దము గలదు. దాని ననకర్షింప వీలు గలదు.

## 4. వా దౌ చ.

దౌ చ = దువర్ణకము పర మగునపుడు సైతము ఉండిధాతువు యొక్క డి(డు)వర్ణమునకు లోప మగుట, వా = వికల్పము.

వి. తద్ధర్మే విద్యమాన దువర్ణకే పరే ఉండే ర్డివర్ణస్య

వికల్పేన లుక్ స్యాత్. ఉందురు - ఉండుదురు,

ఉందుము - ఉండుదుము ఇత్యాది.

తద్ధర్మార్థమునందు ప్రథమపురుషబహువచనాదులయందు వచ్చు దు వర్ణకము పర మగుచుండఁగా ఉండిధాతువు యొక్క డివర్ణమునకు వికల్పముగా లోప మగును.

ఉండ్ (టుట్) + దురు = ఉండు + దురు అనుచో నీ సూత్రముచే డ(డు)వర్ణము లోపింపఁగా ఉందురు అని యగును. 'వా' యనుటచే లోపము రానిపక్షమునందు ఉండుదురు అని యగును.

క్రి..37 సూత్ర మీకార్యమును జెప్పుచునె యున్నది.

ఇట మఱల నడుమఁ ఊద్ప్రక్రియ విశేషము.

దౌడోలుక్ క్రి.101. అనుసూత్రము నీయర్థమునె చెప్పుచున్నది.

## 5.* అణ్ప్ర.

వి. కృదన్తే పదాన్తస్య అణ్ స్యాత్. అణితిప్రత్యాహారః.

అఇఉణ్ అనుమాహేశ్వర సూత్రము ననుసరించి అణ్ అనుప్రత్యాహారముచే అఇఉ అనునవి గ్రహింపఁబడును. కొన్ని యెడల ధాతువులపై- అ,ఇ,ఉ అనునవి కృత్తులుగాఁ జేరు నని యుద్దేశము గావచ్చును.

ఎండి మొదలగుధాతువులపై 'అ' అనుకృత్ప్రత్యయము చేరును. ఎండ, కాయ మొ। ఈ 'అ'త్వము డక్ప్రకృత్ -4-అను దానిచే సిద్ధింపదా?

చేయ్ మొదలగుధాతువులపై 'ఇ' అనుకృత్ప్రత్యయమగును. చేయి, వ్రాయి మొ॥.

ఒప్పి మొదలగు ధాతువులకు 'ఉ' అనుకృత్ప్రత్యయము వచ్చును ఒప్పి - ఒప్పు, కప్పి - కప్పు మొ॥

*. వచ్చ్రి గమనే.

వి. వచ్చెన్.

వచ్చి యను ధాతువు 'ఆగమనము' అను నర్థమునం దుండును. వచ్చెన్ - వచ్చుట మొద లగురీతిగా అకారాద్యంతరూపము లగును.

*. ఏడి రోదనే.

వి. ఏడిచెన్.

ఏడి యనునది రోదన మను నర్థమునం దుండును. ఏడిచి యనుచో ఏడి యనుదానిపై టచిర్ ప్రత్యయము చేరి ఏడిచి యని యగు నని యద్దేశము. ఏడిచెన్ - ఏడుచుట మొ।

*. అని వ్యక్తాయాం వాచి.

వి. అనెన్.

అని యను ధాతువు వచించు అను నర్థమునం దుండును. అనెన్, అనుట మొ॥

*. సమరే చేతి వక్తవ్యమ్.

వి. అని సమరః.

అని శబ్దము సమర మను నర్థమునను గలదు. ఇది నామము, ఇంకను దత్సమము. దీనిప్రసక్తి యిట నత్యంతమనవసరమె యనవచ్చును.

*. కని ప్రేక్షణే.

వి. కనెన్.

కని యను ధాతువు దర్శించుట యను నర్థమునం దుండును. కనెన్, కనుట మొ॥.

*. కొన్యా దానే.

వి. కొనెన్.

కొని ధాతువు గ్రహించు అను నర్థమునం దుండును. కొనెన్, కొనుట మొ॥

*. ఇచ్చి దానే.

వి. ఇచ్చెన్.

ఇచ్చి ధాతువు దానము చేయు అను నర్థమునందుండును. ఇచ్చెన్, ఇచ్చుట మొ॥.

*.తెచ్చ్యానయనే.

వి. తెచ్చెన్.

తిచ్చి ధాతువు ఆనయనము (తీసికొనవచ్చు) అను నర్థమునం దుండును. తెచ్చెన్, తెచ్చుట మొ॥.

*.అయి సత్తాయామ్.

వి. ఆయెన్.

అయి ధాతువు భూ.ధాతువు యొక్క యర్థమున నుండును. అయెన్, అగుట మొ।

*. పోయి గతౌ.

వి. పోయెన్.

పోయి ధాతువు గమించు అను నర్థమునం దుండును. పోయెన్ , పోవుట.

## 6.సూ॥ య్వోర్లు క్క్వన్యస్య.

కణ్వస్య = కణ్వనిమతము నందు, య్వోః = యకార వకారములకు, లుక్ = లోప మగును.

వి. పోయి ధాతోర్యవయోర్లుక్ స్యాదార్ధ ధాతుకే పరే కణ్వస్య మతే (పోయెన్ - పోవున్ - పోవుచున్నాఁడు) పోఁగలఁడు, పోఁడు, పోక, పోదు, పోలేఁడు, పోని, పొమ్ము, పోపొమ్ము, పొండు.

పోయి ధాతువునకు సంబంధించిన యకార వకారముల కార్ధధాతుకము పర మైనపుడు కణ్వనిమతము నందు లోప మగును. 'స్యోర్యగ్వకౌ' యను సూత్రముచే పోయి ధాతువు నందలి యకారమునకుఁ గొన్ని యెడల వకార మగును. కణ్వని మతము భవిష్యదాద్యర్థములందు యకార వకారములు రెంటికి లోప మగును.

పోఁగలఁడు, పోఁడు మొ॥

కణ్వస్య యనుటచే మతాంతరమున లోపము లేదు. పోవఁగలఁడు, పోవఁడు మొ॥.

యకారము లోపించు స్థలము విచార్యము. లుగ్వకో రావణస్య క్రి.83. అను చో వగ్లోప ముక్తము. వివృతి యందు యలోపము లేమి స్పష్టీకృతము. నిజమునకుఁ బై స్థలముల యకారమె లోపించు ననవచ్చును. యకారమునకు వకారముచేసి లోపింపఁజేయుట కంటె యకారమునకే లోపము చేయుటలో లాఘవము గలదు. లోపము రాని పక్షమున యకారమునకు వకారము చేసికొని యిష్టరూపములు సాధించుకొనవచ్చును.

వి. ఆర్ధధాతుకే కిమ్? పోయెన్, పోయీని, పోయెదను, పోయెదరు, పోయి, పోవు-పోవు చున్నాడు ఇత్యాది.

ఆర్ధధాతుకము పర మయినపుడే లోప మగు నని చెప్పుటచే నార్ధధాతుకేతరము పరమయినపుడు లోపము రానేరదు. పోయెన్, పోవుచున్నాఁడు మొ॥

* లేꣳ భావే.

వి. అభావార్థే లే స్యాత్. లే, లెండు, లేదు.

లే యనునది యభావార్థము నం దుండును. లేఁడు, లేమి మొ॥. కలుగు ధాతువునకె వ్యతిరేకార్థములందు లే యను నాదేశమును సూరి నిరూపించెను.

*. నిలి గత్యవరోధనే.

వి. నిలిచెన్.

నిలి యనునది గతి నవరోధించు (నడచుట నాగు) అను నర్థమునం దుండును. నిలిచెన్, నిలుచుట మొ॥. నిలి యనుదానిపై 'టిచిర్' అయిన దని గ్రహింపవలెను.

*. మొలి బీజజన్మని ప్రాదుర్భావే.

వి. మొలిచెన్.

మొలి యనునది, బీజము జన్మించుట, పుట్టుట యను నర్థములం దుండును. మొలిచెన్, మొలుచుట మొ॥ దీనికిని 'టిచిర్' అయి మొలి – మొలిచి యని యైనది.

*. దాచి దృశ్య నిక్షేపణే.

వి. దాచెన్.

దాచి యను ధాతువు అదృశ్యము, ఉంచుట యను నర్థములం దుండును. దాచెన్, దాచుట మొ॥

దాగు అను ధాతువు యొక్క ప్రేరణార్థక రూపముగా దాచు (దాచి) అన్నదానిని లాక్షణికులు నిరూపించిరి.

*. ఏఁచి సన్తాపే.

వి. ఏఁచెన్.

ఏఁచి యనునది సంతాప మను నర్థమునం దుండును. ఏఁచెన్, ఏఁచుట మొ॥.

*. వేఁచి సన్తపనే.

వి. వేఁచెన్.

వేఁచి శబ్దము తపింపఁజేయు అను నర్థమునం దుండును. వేఁచెన్, వేఁచుట మొ॥

ఇది గూడ 'వేఁగు' ధాతువు యొక్క ప్రేరణార్థకరూపముగా గుర్తింపఁదగును.

## 35. కాఁచి తపనే.

వి. కాఁచెన్ ఇత్యాది.

కాఁచి శబ్దము తపింపఁజేయు అను నర్థమునం దుండును. కాఁచెన్, కాఁచుట.

ఇది 'కాఁగు' ధాతువు యొక్క ప్రేరణార్థకరూపముగా గుర్తింపఁదగును.

## 7. సూ॥. సిచీ కేభ్య శ్చిత్.

వి. కేభ్యశ్చిత్ (కార)ధాతుభ్యో దాంత, డాంత
వాంత రేఫాంతలాంతే భ్యోధాతుభ్యశ్చ పరత స్సి
చీప్రత్యయౌ స్తః - ఏకాక్షరధాతవః
దాచెన్, దాసెన్, కూసెన్, తోచెన్, వ్రాసెన్, లేచెన్,
రోసి, మేసి, లేచి, చూచి ఇత్యాద్యా దాంతాదయః-
ఎగిసెన్, పొగిసి, దిగిచెన్, పనిచెన్, మనిచెన్, కరిచెన్
విరిచెన్, కురిసెన్, నిలిచెన్, తెలిసెన్, విలసెన్ ఇత్యాది.

కేభ్యశ్చిత్ = కొన్ని ధాతువులకుఁ బరముగా, సిచీ = సి, మఱియు చి' యను ప్రత్యయములు వచ్చు, ఏకాక్షరము లగు, దా, డా, మొదలగు దానికంటె కొన్నింటికి చివర్ణమును కొన్నింటికి సివర్ణము నగును. దాచి- దాసి- దాచి యనుదానికి రహస్యముగా నుంచు మొదలగున వర్థములు. దాసి యనుదానికి సమీపించు మొదలగున వర్థములు. - ఈ సిచి ప్రత్యయములందును నిత్య మిత్వ మగు ననఁదగు, దాస్ దాచ్- అనియె యిట ధాతురూపము.

దా,డా మొదలగు నేకాక్షరము లే ధాతువు లనియు వాని పై, చి, సి, అనునవి ప్రత్యయము లనియు నీ సూత్రము నభిప్రాయము.

ఇట్లే రేఫాంతములు, లాంతములు మొదలగు ననేకాక్షరశబ్దములకును, సి,చి యను ప్రత్యయములు వచ్చును. కురి - అనుదానికి సిపత్యయ మై కురిసి - అని యగును. కురిసెన్ మొ॥

నిలి - అనుదానిపై 'చి' ప్రత్యయ మై 'నిలిచి' అని యగును. నిలిచెన్ మొదలగు రూపాలగును.

విరిచి, యనుచో విరి శబ్దముపై టిచిర్ ప్రత్యయముగా నింతకు ముందు చెప్పఁబడినది. ఇచట చి ప్రత్యయము చేరినట్లు చూపఁబడినది.

ధాతువులను దా, (సి) నిరి (చి) మొదలగు రీతిగాఁజూపుట వింతగాఁ గన్పింపక తప్పదు.

వి. కేభ్యశ్చిత్ కిమ్? మెట్టెన్, తిట్టెన్, ఆడెన్
వేడెన్, తినెన్, ఇత్యాదిభ్యో న.

సూత్రమునందు 'కేభ్యశ్చిత్' అనుటచే, కొన్ని ధాతువులకే, సి, చి ప్రత్యయము లగును. అన్నింటికిని రావు కావున మెట్టి ఆడి మొదలగు చోట్ల సి, చి, ప్రత్యయములు లేవు.

36*. ప్రోపాలనే.

వి. ప్రోచెన్.

ప్రో యనునది పాలనమను నర్థమునం దుండును. పూర్వసూత్రముచే 'చి'ప్రత్యయమై ప్రోచి యని యుండును. ప్రోచెన్, ప్రోచుట మొ॥

37*. క్రా కఫోద్గమనే.

వి. క్రాసెన్.

క్రా యనునది (కఫోద్గమనము ) 'ఉమియు' అను నర్థమునం దుండును. 7 సూత్రముచే సివర్ణమురాగా క్రాసి. క్రాసెన్ మొ॥.

38*. కూ మహా శబ్దే.

వి. కూసెన్-.

కూ యనునది గొప్పధ్వనిని దెలుపును. 7 సూత్రముచే సివర్ణమురాగా కూసి- కూసెన్ మొ॥

39. కో ఫలాద్యు పచారే.

వి. కోసెన్

కో యనునది పండ్లు మొదలగువానిని త్రెంచుట యనునర్థమునం దుండును. 7 సూత్రముచే సి ప్రత్యయమురాగా కోసి- కోసెన్ మొ॥

## 40. కా ఫల రక్షణయోః.

వి. చెట్టు కాచెన్, రాజు కాచెన్.

కా యనునది, ఫలించు, రక్షించు నను నర్థము లందుండును. 7 సూత్రముచే దీని పైని 'చి' వర్ణకము వచ్చును. కాచి.

చెట్టు కాచెన్ అనుచో కాచి యనునది ఫలించు అను నర్థమునం దున్నది. (ఇట ధాతువు కాయు - కాసెను) రాజు కాచెన్ అనుచో 'కాచి' ధాతువునకు రక్షించు అని యర్థము.

## 41. కా దీప్తౌ.

వి. కాసెన్.

కా యనునది దీపించు అను నర్థమునం దుండును 7 సూత్రముచే సివర్ణమురాగా కాసి ఎండ కాసెన్ మొ॥.

## 42. కై హస్త శృంగారయోః.

వి. కై హస్తః. కైసేసెన్, శృంగారించెన్.

కై యనునది హస్తము, మఱియు అలంకరించు అను నర్థములం దుండును.

'కై' హస్త మను నర్థమున 'కై' యను శబ్ద మట్లె యుండును. (ఇది ప్రాతిపదికము).

కై సేసి' యనుచో నలంకరించు అని యర్థము. కై శబ్దముపై 'చేసి' యను వేఱొక ధాతువు చేరుటచే నిది యేర్పడినట్లు గుర్తింపవచ్చును. సూరి ప్రభృతుల మతమున నీయది శబ్దపల్లవము అగును.

## 43. చేకరణే

వి. చేసెన్.

చే యనునది కరణము. (చేయుట) యను నర్థమునం దున్నది. 7 సూత్రముచే 'సి' యనునది వచ్చును. చేసి-చేసెన్ -చేయుట మొ॥

## 44. చూ దర్శనే.

వి. చేచెన్.

చూ యనునది దర్శన మను నర్థమునం దుండును. 7 సూత్రముచే దీనిపై చి వర్ణమురాగా చూచి అని యగును. చూచెన్ - చూచుట మొ॥

## 45. గీ (ష్) విలేఖనే.

వి. గీచెన్.

గీ యనునది లిఖించు అను నర్థమునం దుండును.

7 సూత్రముచే చి వర్ణము రాగా గీచి యని యగును. గీచెన్, గీచుట మొ॥

## 46. గీరి కండూ కర్షణే.

వి. గీరెన్, గీరున్.

గీరి యనునది కండూ కర్షణార్థమునం దుండును. గీరెన్, గీరుట మొ॥

## 47. తోఁ(ష్) మన ఉద్బోధనే.

వి. తోఁచెన్.

తో యనునది మనసు నుద్బోధించుట యను నర్థము నం దుండును. 7 సూత్రముచే చి వర్ణమురాగా తోఁచి అని యగును. తోఁచెన్ మొ॥

## 48. త్రో(ష్) హఠాకర్షణే.

వి. త్రోచెన్.

త్రోయనునది త్రోయించు అను నర్థము నందుండును. 7 సూత్రముచే చివర్ణమురాగా త్రోచి అని యగును. త్రోచెన్ మొ॥.

త్రోయు అను ధాతువునకుఁ బ్రేరణార్థకరూపము త్రోచు అని యుండునని గ్రహింపవచ్చును.

## 49. నో వ్రతార్థే.

వి. నోచెన్.

నో యనునది వ్రత మను నర్థమునందుండును. 7 సూత్రముచే చివర్ణమురాగా నోచి అని యగును. నోచెన్ మొ॥.

## 50. పూ పుష్పోత్పత్తౌ.

వి. పూచెన్.

'పూ అనునది పుష్పముల పుట్టుక యనునర్థమునం దుండును.7 సూత్రముచే చి వర్ణము, పూచి అని యుగును. పూచెన్, పూచుట మొ॥

## 51. పూ విలేపనే.

వి. పూసెన్.

పూ అనునది విలేపన మను నర్థమున నుండును. 7 సూత్రముచే సి వర్ణమురాగా పూసిలని యగును. పూసెన్ మొ॥

## 52. పో జలాద్యుత్సర్జనే.

వి. పోసెన్.

పో యనునది జలము మొదలగువానిని విడచు అను నర్థమునం దుండును. 7 సూత్రముచే సి ప్రత్యయమురాగా పోసి అని యగును. పోసెన్, పోయుట మొ॥

## 53. పో వియోగే.

వి. పోయెన్.

పో అనునది వియోగ మను నర్థమునం దుండును. పోయెన్. ఇట (పోవు) పోయి అనుదానికంటె భిన్నముగాఁ దలపఁబడినట్లు గనఁబడుచున్నది.

## 54. మా మలినే.

వి. మాసెన్.

మా యనునది మలిన మగు అను నర్థమునం దుండును. 7 సూత్రముచే సి వర్ణము, మాసిఅని యగును. మాసెన్ మొ॥

## 55. మూ తిరోధానే.

వి. మూసెన్.

మూ యనునది తిరోధానము చేయుట యను నర్థమునం దుండును., 7 సూత్రముచే సి వర్ణమురాగా మూసిఅని యగును. మూసెన్ మొ॥

## 56. మే పశ్వాది చర్వణే.

వి. మేసెన్. ఆదిశబ్దేన నరపశుపక్షిమృగాదయః.

మే యనునది పశువులు మొదలగువాని చర్వణ మను నర్థమునం దుండును, మే అనుదానిపై 7 సూత్రముచే 'సి' వచ్చి మేసిఅని యగును. మేసెన్, మేయుట మొ॥

'పశ్వాది' యనుచోటి యాది శబ్దముచే నరులు, పక్షులు, మృగములు మొదలగునవి గ్రహింపఁబడును. ఇట వివృతి 'పశ్వాది' యనుచోఁ బశుశబ్ద ముక్తము కాఁగా నాదిశబ్దముచే మఱలఁ బశువులను గ్రహించుట వింత.

## 57. మో ధూర్వహనే.

వి. మోచెన్.

మో యనునది భారమును వహించుట యను నర్థమునం దుండును. 7 సూత్రముచే చి ప్రత్యయ మయి మోచి యని యగును. మోచెన్, మోచుట మొ॥

## 58. మ్రో నిస్వనే.

వి. మ్రోసెన్.

మ్రో యనునది ధ్వనించు అను నర్థమున నుండును. 7 సూత్రముచే 'సి' ప్రత్యయ మయి మ్రోసిఅని యగును. మ్రోసెన్ మొ॥

## 59. ఆఙ్ వారణే.

వి. ఆఁచెన్.

ఆ(ఙ్) అనునది వారించు అను నర్థమునం దుండును. ఙకార మిత్తుగాఁ జెప్పుట విశేషము. దీనిపైని ఙంకారను స్వారమున కిది సాధకముగాఁ గలదేమో కాని యట్టిలక్షణము చెప్పినజాడ గానరాదు. 7 సూత్రముచే చివర్ణక మయి ఆఁచిఅని యగును. ఆఁచెన్ - మొ (ఇది ఆఁగు ధాతుప్రేరణరూపము)

## 60. ఊఞ్ దోలనకంపయోః.

వి. ఊఁచెన్.

ఊఁ(ఞ్) అనునది దోలనము (ఊయలలూపు) కంపించు అను నర్థములం దుండును. ఇటఁగూడ ఞకార మిత్తుగాఁగూర్పఁబడినది. (ఇటఁ గూడ ఊకారముపై ఖండానుస్వార మున్నది.) 7 సూత్రముచే చి ప్రత్యయము రాఁగా ఊఁచి అని యగును. ఊఁచెన్ మొ॥

## 61. రా కర్షణే.

వి. రాచెన్.

రా యనునది కర్షణము అను నర్థమునం దున్నది. 7 సూత్రముచే చి ప్రత్యయము వచ్చి రాఁచి యని యగును. రాఁచెన్ మొ॥

## 62. రేఞ్ సంక్షోభణే.

వి. రేఁచెన్.

రే(ఞ్) యనునది సంక్షోభించు అను నర్థమునం దుండును. ఇటఁ గూడ ఞకార మిత్తుగాఁ గూర్పఁబడినది . రే యనుదానిపై ఖండానుస్వారమున్నది. 7 సూత్రముచే చి ప్రత్యయము వచ్చి రేఁచి యని యగును. రేఁచెన్ మొ॥

రేఁగు ధాతువుయొక్క ప్రేరణార్థకరూపముగా రేఁచు అనుదానిని లాక్షణికులు గుర్తించియున్నారు.

## 63. రో మ్యనసారుచౌ

వి. అరుచిర్మనసః. రోసెన్.

రో యనునది మనసు యొక్క అరుచిని తెల్పును. ఇచటి యరుచి జిహ్వకుఁ గాక మనసునకుఁ జెందినది. ఏవగించు అని యర్థము. రో శబ్దముపై 7 సూత్రముచే 'సి' ప్రత్యయము వచ్చి రోసి అని యగును. రోసెన్, రోయుట మొ॥

## 64. లే సముత్థానే.

వి. లేచెన్.

లే యనునది యుత్థాన మను నర్థమునం దుండును. 7 సూత్రముచే చి ప్రత్యయము వచ్చి లేచి అని యగును. లేచెన్, లేమట మొ ॥

## 65. వా శోషార్థే.

వి. వాచెన్.

వా యనునది శోష(వాఁపు) అను నర్థమునం దుండును. 7 సూత్రముచే చి ప్రత్యయము వచ్చి వాచి యని యగును. వాచెన్, వాచు మొ॥ ఇం దఱసున్న యున్న ఇకార మిత్తుగా లేదు.

## 66. వాఙ్ ధ్వనికరణే.

వి. వాఁచెన్.

వాఁ(ఙ్) యనునది ధ్వనిచేయు అను నర్థమునం దుండును. 7 సూత్రముచే చి ప్రత్యయము వచ్చి వాఁచిఅని యగును. వాచెన్ మొ॥ ఈ యర్థమున నీ ధాతువు మృగ్యము కాఁగా ఙిత్తుగాఁ జెప్పినను నిచట బిందువు స్థితి నిర్ణయింపరాకున్నది.

## 67. పీఙ్ కరాది చాలనే.

వి. (ఱెక్కల) పక్షి పీఁచెన్.

పీ యనునది హస్తాదులఁ జలిపను నర్థమునం దుండును. 7 సూత్రముచే చి ప్రత్యయము వచ్చి పీచిఅని యగును. పీచెన్ మొ॥

## 68. వ్రే వై కరణ పతనయోః.

వి. లాగు వ్రేసెన్. గంతులు వైచెన్. అకరోదిత్యర్థః.

వ్రే, వై యనునవి కరణము (చేయు) పతనము అను నర్థములం దుండును. వ్రే యనుదానిపై 'సి' ప్రత్యయమును, వైశబ్దముపై చి ప్రత్యయమును 7 సూత్రముచే నగును. వ్రేసి, వైచి-

ఈటె మొదలగువానిచే కొట్టు అను నర్థమున 'వ్రేసి' ధాతు వున్నది. పడవేయు విసరు మొదలగు నర్థముల వైచి కలదు.

## 69. చాఙ్ సంప్రసారణే.

వి. చాఁచెన్.

చాఁ(ఙ్) అనునది సంప్రసారణము (చాఁచు) అను నర్థమునం దుండును. ఇకార మిత్తు. చా యనుదానిపై ఖండానుస్వార మున్నది. 7 సూత్రముచే చి ప్రత్యయమువచ్చి చాఁచిఅని యగును. చాఁచెన్, చాఁపుము మొ॥

## 70. సైఙ్ సహనే.

వి. సైఁచెన్ - ఇత్యాది.

సై(ఙ్) అనునది సహించు అను నర్థమునం దున్నది. ఇకార మిత్తు కాఁగా మీఁద ఖండానుస్వార మున్నది. 7 సూత్రముచే చి ప్రత్యయము వచ్చి సైఁచి యని యగును. సైఁచెన్ మొ॥.

ఇతిధాతుప్రక్రియా

ఇదిధాతువులనిరూపణము

# అథ సంఖ్యావాచక ప్రకరణమ్

## 1. కొమోమే రెంమూనాం డు గమహతి.

అమహతి = అమహదర్థము నందు, కొమోమేరెంమూనామ్ = కొం, ఒం, ఏ, రెం, మూ అను శబ్దములకు, డుక్ = డుక్ అను ప్రత్యయ మగును.

వి. అమహతి సంఖ్యావాచకానా మేకాక్షరశబ్దానాం
కొమోమే రెంమూనాం డుప్రత్యయ ఆగమ స్స్యాత్.
కొండు, ఒండు, వేడు రెండు మూడు ఇత్యాది.

ఏకాక్షరము లయిన సంఖ్యావాచకశబ్దము లగు కొం, ఒం, ఏ యనువానికి నమహదర్థమున 'డు' అను ప్రత్యయము చేరును.

(ఒ)కొండు, ఒండు ఏడు అయి యుండును. రెండు మూడు మొ॥

సంస్కృతసంప్రదాయము ననుసరించి సంఖ్యావాచకములు (ఏక ద్విశబ్దములు దప్ప) సర్వనామములు గావు. కాని తెలుఁగున సంఖ్యావాచకము లెల్ల సర్వనామములుగనె 16 సూత్రవివృతి ననుసరించి చెప్పవలెను.

## 2. రెం ద్వయోః.

ద్వయోః = ద్వి అను శబ్దమునకు, రెం = రెం అనునది యగును.

వి. ద్విశబ్దస్య రెం స్యాత్.

ద్విశబ్దమునకుఁ దెలుఁగున 'రెం' అనునది యాదేశ మగును. పూర్వసూత్రముచే నమహదర్థమున డు ప్రత్యయము వచ్చి రెండు అని యగును.

– సంఖ్యావాచకనా మేకాక్షర శబ్దానాం
కోమోమూ సప్తానామ్– ?

ఇది యస్పష్టము.

---

*. విషయముననుసరించి యిట్లు విభాగింపఁబడినది. సంఖ్యావాచక నిరూపణము పూర్వప్రకరణములోఁ గలిపియే వ్రాత ప్రతియందున్నది.

## 3. ఏ సప్త శబ్దస్య.

వి. ఏ

'సప్త' శబ్దమునకు 'ఏ' అనునది యగును. ౹౪ సూత్రముచే దీనిపై నమహదర్థమున డుప్రత్యయము వచ్చి 'ఏడు' అని యగును.

## 4. కొమొమేకస్య.

ఏకస్య = ఏక శబ్దమునకు, కొమొమ్ = కొమ్, ఒమ్ అనునవి యగును.

వి. ఏకశబ్దస్య కొం ఒం ఇతి ద్వే స్తః.
ఇత్యాదీనాం డుప్రత్యయః.

ఏక శబ్దమునకు, కొం, ఒం, అనునవి యగును. కొమ్ + ఒమ్ + ఏకస్య - అని సూత్రమున మకారముతో నిర్దేశ మైనది. కాని సున్నలతోనె యవుట గమన్యార్హము.

## 5. (మూ)త్రేః [1].

వి. (త్రిశబ్దస్య) మూస్యాత్.

త్రేః = త్రి శబ్దమునకు, మూ = మూ అనునది యాదేశ మగును.

సంఖ్యావాచక మగు 'త్రి' శబ్దమునకుఁ దెలుఁగున 'మూ' యని యాదేశ మగును.

మొదటిసూత్రముచే దీనికి డు ప్రత్యయము వచ్చి మూడు అని యగును.

మూఁడు శబ్దమున నరసున్న గలదు. అరసున్నతో మూ యనునది (మూఁ) ఆదేశముగా విధింపఁబడిన దేమో మూర్ అని వివృతి. అస్పష్టమై యున్నది.

## 6. నాలుశ్చతు (ర్వర్ణమ్) రః.

వి. చతుశ్శబ్దస్య నాలు స్యాత్.

చతుశ్శబ్దమునకు 'నాలు' అనునది యాదేశ మగును.

---

1. తరువాతిసూత్రివివృతిలో చతుశ్శబ్దస్య మూర్ స్యాత్ అని వ్రాతప్రతియం దున్నది. దీనింబట్టి ముందు త్రిశబ్దమునకు మూ రాదేశమును జెప్పు సూత్రము నష్ట మయ్యుండు నని యిట్లూహింపఁబడవలది.

## 7. గుః క్లీబే.

క్లీబే = అమహదర్థమునందు, గుః = గు అనునది యగును.

వి. నాలు పదాత్పరతః క్లీబే గుగాగమ స్స్యాత్ - నాలుగు.

'నాలుశ్చతురః' అను పూర్వసూత్రముచే చతుశ్శబ్దమునకు వచ్చిన 'నాలు' అనుదానికి నమహదర్థమునందు 'గు' అను వర్ణము చేరును. నాలు + గు = నాలుగు, గుఱ్ఱములు నాలుగు, మేడలు నాలుగు మొ॥

## 8. పఞ్చానామేన్వైదూ (పంచనో ఏన్వైదూ).

వి. పంచన్ శబ్దస్య ఏన్వైదూ సర్వాదేశౌ స్తః.

ఏను, ఐదు.

పఞ్చ శబ్దమునకు ఏను ఐదు అనునవి యాదేశ మగును. (ఏను + ఐదు = ఏన్వైదు) ఏను- ఐదు. (పంచ)

## 9. వాలుగ్గౌ నుదోః.

గౌ = గు వర్ణము పర మగుచుండఁగా, నుదోః = ఏను, ఐదు అను శబ్దములందలి ను, దు అను వర్ణములకు, వా = వికల్పముగా, లుక్ = లోప మగును.

వి. గువర్ణే పరే ఏన్వైదుశబ్దయోర్నుదువర్ణయో ర్వైక
ల్పేన లుక్ స్యాద్బహువచనే - ఏగురు, వకారః-
ఏవురు; అయిదుగురు - ఐగురు, అయివురు - ఐవురు
ఇత్యాది.

మహదర్థమునందు గు వర్ణము పర మగుచుండఁగా ఏను, ఐదు శబ్దములందలి ను, దు వర్ణములకు వికల్పముగా లోప మగును. మహదర్థమునందు రెండు మొదలగు సంఖ్యావాచకము లెప్పుడును బహువచనాంతములే యగును. కావున వివృతియందు 'బహువచనే' యనుట స్పష్టత నుద్దేశించియే యని గ్రహింపవలయును.

ఏను + గురు అనుచో నీ సూత్రముచే నువర్ణము లోపింపఁగా 'ఏగురు' అని యగును క్వచిద్వోగస్య యని గకారమునకు వకారము వచ్చినపక్షమున ఏవురు.

ఐదుగురు అనుచో దువర్ణము లోపింపగా ఐగురు 'ఐ' కి 'అయి' యనునది, యయినపుడు 'అయిగురు' గకారమునకు వకారమైన పక్షమున ఐవురు అయివురు. ఈ లక్షణ మిట్లు పేర్కొన్నదే కాని దువర్ణము లోపించిన ఐగురు, అయివురు అనురీతి రూపములు గానరావు. 'వా' శబ్దమునకు దులోపనిత్యత నియమించుకొన వీలుగలదు. కాని వివృతి యట్లు చేయలేదు.

'వా' యనుటచే వికల్పము గావున ను దువర్ణము లు లోపింపని పక్షమునందు ఏనుగురు, ఐదుగురు, అయిదుగురు అనురీతిగ రూపము లుండును.

## 10. షణ్ణా మాఱుః.

వి. షట్ శబ్దస్య ఆఱుస్యాత్. ఆఱు.

షట్ అను శబ్దమునకు 'ఆఱు' అనునది యాదేశ మగును. ఆఱు.

## 11. ఎని రష్టానామ్.

వి. అష్టన్ శబ్దస్య ఎని స్యాద్దేశ్యే.

అష్టన్ శబ్దమునకు 'ఎని' అనునది యాదేశ మగును. 'ఎని'- అని యుండును.

## 12. తొమ్ నవానామ్.

వి. నవ శబ్దస్య తొం స్యాత్.

నవ శబ్దమునకు 'తొమ్' అనునది యాదేశ మగును.

## 13. తొమెన్యోర్మిదిః.

తొమెన్యోః = నవ శబ్దమున కాదేశ మయిన 'తొమ్' అనుదానికిని, అష్టశబ్దమున కాదేశ మయిన 'ఎని' అనుదానికిని బరముగా, మిదిః = మిది యను నది యగును.

వి. తొం శబ్దఎని శబ్దయోః పరతో మిది స్యాదమహదర్థే-
ఎనిమిది, తొమ్మిది.

తొమ్, ఎని అను శబ్దములకుఁ బరముగా 'మిది' యనునది యగును. తొమ్ + మిది = తొమ్మిది, ఎనిమిది. 'మిది' యనునది యమహదర్థమునందె యగును. కావున మహదర్థమున నీ రూప ముండదు. రాము లెనిమిది, వారు తొమ్మిది యనురీతి నుండవు.

## 14. ద్వయోరిద్ద స్త్రీపుంసయోః.

స్త్రీపుంసయోః = స్త్రీలను, పురుషులను బోధించు సందర్భమునందు, ద్వయోః = ద్వి శబ్దమునకు, ఇద్ద = ఇద్ద యనునది యాదేశ మగును.

వి. ద్విశబ్దస్య స్త్ర్యర్థపురుషార్థయో రిద్ద స్యాత్.
సర్వనామ త్వాద్బహువచనే రుః - ఇద్దరు స్త్రీలు, ఇద్దరు పురుషులు.

స్త్రీ పురుషవాచక మైనపుడు ద్వి యనుదానికి ఇద్ద యనునది యాదేశ మగును. ఇది సర్వనామము. (నిత్యబహువచనము.) కావున దీనిపైఁ బ్రథమా బహువచన వివక్షలో 'జస్' రాఁగా దానికి రువర్ణక మయి ఇద్దరు (స్త్రీలు పురుషులు) అని యగును.

స్త్రీపుంసోః అనుటచే ఇద్దరు గుఱ్ఱములు, ఇద్దఱు గోడ లనురీతిగా స్త్రీపురుషేతర వాచకత్వమున నీ రూప ముండదు.

## 15. ఇరుశ్చ.

స్త్రీపుంసోః = స్త్రీపురుషులను బోధించునపుడు, ద్వయోః = ద్విశబ్దమునకు, ఇరుశ్చ = ఇరు అనునది యాదేశము నగును.

వి. స్త్ర్యర్థపద మహత్పద సమాసేషు ఇరుశ్చ స్యాత్.
ఇరు.

స్త్రీపురుషులను బోధించునపుడు ద్విశబ్దమునకు ఇరు అనునదియాదేశ మగును. చ శబ్దముచే ఇద్ద అను నాదేశము నుండును. ఇరు అను నాదేశము సమాసములందు (మహదర్థమున) నగును. ఇరుగడ, ఇరుమొన మొ॥

వి. క్వచిద్వోగస్యేతి సూత్రేణ గువర్ణక గకారస్య వకారస్స్యాత్.

తరువాతి సూత్రముచే నగు గువర్ణమునందలి గకారమునకు 'క్వచిద్వోగస్య' యను సూత్రముచే వకారమును వచ్చును. ఇరువురు, ఇరుగురు.

## 16. గురావేదుతోః.

రౌ = రు వర్ణకము పర మగుచుండఁగా, ఏదుతోః = సంఖ్యావాచకములతుది ఏకారమునకు నుకారమునకును, గుః = గువర్ణము చేరును.

వి. ఏదన్తో దన్తయో స్సంఖ్యా వాచి నస్సర్వనామ్నో
బహువచనే రౌపరే గురాగమ స్యాత్.
ఇరుగురు - ఇరువురు - ఇర్వురు, ముగ్గురు - మువ్వురు,
నలుగురు - నలువురు - నల్వురు - నల్గురు, ఏనుగురు-
ఏన్గురు - ఏగురు - ఏవురు, ఐదుగురు - ఐదువురు - ఐవురు,
ఆరుగురు - ఆర్గురు - ఆఱువురు - ఆర్వురు, ఏడుగురు-
ఏడ్గురు - ఏడువురు - ఏడ్వురు, పదుగురు-
పదువురు, నూఱుగురు - నూర్గురు - నూఱువురు -
నూర్వురు, వేగురు - వేవురు ఇత్యాది.

బహువచన మగు రు వర్ణకము పరముగా నుండఁగా ఏకారాంతములును, ఉకారాంతములు నయిన సంఖ్యావాచకములకు గు వర్ణ మాగమ మగును. రు వర్ణకము పర మగుచుండఁగా ననుటచేతనె యీ కార్యము మహదర్థమునందె యని స్పష్ట మగును. అమహదర్థమునందు రు వర్ణకము లేదు.

(ద్వి) ఇరు శబ్దముపైఁ బ్రథమాబహువచనమున రు వర్ణకము రాఁగాఁ బ్రస్తుతసూత్రముచే, (ఇరు-ఉదంతమైనది గావున) గు వర్ణ మాగమ మై ఇరుగురు అని యగును. 'క్వచిద్వోగస్య' యను సూత్రముచే నిందలి గకారమునకు వకారము వచ్చు పక్షమున ఇరువురు అనియు నగును. ఇట్లితరము లూహింపఁదగును.

సూత్రమునం దేదంతములకును వర్ణము చెప్పఁబడినది. 'హాలుగ్గానుద్వోః' అను సూత్రము చొప్పున గు వర్ణము పర మగునపుడు మాత్రమె ఏనులో ను వర్ణము లోపించును. కాఁగా నిట్లు చెప్పుట వలన 'వేం' (వేయి) శబ్ద మొక్కదానిపై మాత్రమె గు వర్ణము వచ్చుట ప్రయోజన మని నిర్ణయింపవచ్చును. అట్టియెడల దానినొక్కదానికి వేఱు సూత్రముచే జెప్పి యుదంతములకె గు వర్ణాగమము చెప్పుట గూడ నొకయుచిత మగు మార్గమె కాగలదు. ఏ మైనను గు వర్ణాగమము ఏదంతములకు రాకుండుట లేదు గావున విరోధము లేమి లక్షణము నేదంతముల గ్రహణమునఁ దప్పులేదు. ఏన్గురు, ఏనుగురు అనురీతి రూపములు మృగ్యములు.

## 17. హః పదౌచ చతుర్థ వర్ణః.

పదౌ చ = పది పరముగా నున్నపుడు గూడ, చతుర్థవర్ణః = చ తుశ్శబ్దమున కాదేశ మయిన 'నాలు' అనుదానికి, హః = హ్రస్వ మగును.

వి. చతుశ్శబ్దస్య దీర్ఘస్య స్త్ర్యర్థ (పుమర్థ) పద సమాసేషు పదౌ పరే చ హ్రస్వ స్స్యాత్. నలు, నలుగురు రాజులు, నలుగురు స్త్రీలు, నలుఁబది.

(సమాసమున) పది' యను శబ్దము పరముగా నున్నపుడును, (ఇటనమహత్తు) మహదర్థమునను, చతుశ్శబ్దమున కాదేశముగా వచ్చిన నాలు అనుదాని యందలి దీర్ఘమునకు హ్రస్వము వచ్చును.

నాలు అనుదానిపైఁ బ్రథమాబహువచన వివక్షయందు జస్సునకు రు వర్ణము 'గురావేదుతో'' అను సూత్రముచే గు వర్ణమును వచ్చి నాలుగురు అని కాఁగా ప్రస్తుతసూత్రముచే దీర్ఘమునకు హ్రస్వము వచ్చి నలుగురు అని యగును. నలుగురు రాజులు, నల్గురు స్త్రీలు.

సమాసమున పది శబ్దము పరముగా నున్నను నీ హ్రస్వమగును నలుఁబది. పది శబ్దము పరమైనపుడే కాక నలుగడ, నలుదిక్కులు మున్నగురీతిగా నితరస్థలములందును సమాసమున నీ కార్యము గలదు.

## 18. ఆరో ర్దీర్ఘశ్చ.

ఆరోః = ఆఱు శబ్దమునందును దీర్ఘమునకు, హ్రస్వ మగును.

వి. పదౌ పరే ఆరోర్దీర్ఘస్య హ్రస్వస్స్యాత్ అఱుపది అఱువది. పస్య వకారః.

సమాసమున పది శబ్దము పరముగా నున్నపుడు ఆఱు శబ్దమునందలి దీర్ఘమునకు హ్రస్వమగును. ఆఱు + పది హ్రస్వము రాఁగా అఱు + పది పకారమునకు (క్వచిద్యోగస్య) వకారమై అఱువది యని యగును. ఆఱుగురు మొదలుగా నితరస్థలముల మాత్రము (నాలు శబ్దమునవలె) ఆఱు శబ్దమున హ్రస్వము లేదు.

## 19. హ్రద్వీ పూర్వపరయోః రహరహలి.

అహరహలి = హకారము, రేఫము ననువానికంటె నితరమగు హల్లు పరముగా నున్నపుడు, పూర్వపరయోః = పూర్వవర్ణమునకును దానికిఁ బరమ్మైన వర్ణమునకును గ్రమముగా, హ్రద్వీ = హ్రస్వమును ద్విత్వమును వచ్చును.

వై.[1] త్రిశబ్దస్య త్ర్యర్థమహత్వద సమాసేషు హకారరేఫ
రహితహలి పరే పూర్వవర్ణ పరవర్ణయోః హ్రస్వద్విత్వే క్రమాత్
స్తః. (ముక్కంటి, ముప్వేల్పులు, ముజ్జగంబులు,
ముత్త్రోవ, ముల్లోకములు).

త్రిశబ్దమున కాదేశమగు 'మూ' అనుదానికి సమాసమునందు రేఫ హకారములకంటె వే ఱయినహల్లు పరముగా నున్నపుడు పూర్వవర్ణమునకు హ్రస్వమును దానికిఁ బరమ్మైన హల్లునకు ద్విత్వమును నగును. ఇచటఁ బూర్వవర్ణ మనఁగా 'మూ' శబ్దమునందలి 'ఊ'కారము పరవర్ణ మనఁగా దానికిఁ బరమ్మైన హల్లు.

మూ + త్రోవ అనుచో నీ సూత్రముచే మూ శబ్దమునందలి ఊకారమునకు హ్రస్వమును, (ము + త్రోవ) దానికిఁ బరమ్మైన (త్రోవ) తకారము హల్లునకు ద్విత్వమును వచ్చి ముత్త్రోవ యని యగును. ఇట్లితరము లూహ్యములు.

రేఫ హకారములయెడ సమాసమె కానరాదనఁదగు. మూఁడు రంగులు, మూఁడు హయము లనియె కాని యీ సూత్రమున 'అహరహలి' యనుటచే హ్రస్వద్విత్వములు రాకున్నను మూ రంగులు, మూహయములు అనియు నుండుట లేదు.

ఇట్లే హ్రస్వ ద్విత్వములు సమాసమునందేకాక త్ర్యర్థ మహదర్థమునందు నగు నని విష్కృతి ననుసరించి స్పష్టము. మూగురు, ముగ్గురు.

---

1. త్రిలింగశ. వై.సం.సూ.24.

## 20. క్రొనె శబ్ద యోశ్చ సమాసే.

సమాసే = సముసము నందు, క్రొనెశబ్దయోః చ = క్రొ,నె అను శబ్దములకంటెఁ బరముగా నున్న రేఫ హకారములకంటె వేఱయిన హల్లులకు ద్విత్వమువచ్చును. చ శబ్దముచే 'హద్విపూర్వ పరయో రహరహలి' యను పూర్వసూత్రము ననుసరించి రేఫ హకారేతరహల్లులకు ద్విత్వమగు నను నర్థము సిద్ధమగును.

వి. హకార రేఫరహిత హలిపూర్వ పరయోః హ్రస్వ ద్విత్వేక్రమాత్ స్తః. ముక్కంటి, ముచ్వేలుపులు, ముజ్జగంబులు, ముత్త్రోవ, ముల్లోకములు, క్రొన్నెరులు, క్రొక్కారు నెన్నుదురు, నెమ్మోము, క్రొమ్మెఱుగు ఇత్యాది.

సమాసమునందు క్రొ, నె యను శబ్దములకంటెఁ బర మైన రేఫ హకార భిన్న మగు హల్లునకు ద్విత్వ మగును. క్రొ, నె అనుచో సహజముగనే హ్రస్వము గలదు.

క్రొ + నెఱులు అనుచో నీ సూత్రముచే మీఁది హల్లు నకారమునకు ద్విత్వము రాఁగా క్రొన్నెఱు లని యగును. ఇట్లే నెన్నుదురు మొ॥

ఇచట వివృతియందుఁ జూపఁబడిన యుదాహరణములలో ముక్కంటి యన్నది మొదలుకొని ముల్లోకము లన్నంతవఱ కున్నవి పూర్వసూత్రమునకుఁ జెందినవి. అటనే చూపియున్న బాగుండెడి దనిపించును.

## 21. గోర్ద్విర్వా

గోః = మూ శబ్దముకంటెఁ బర మై యున్న గువర్ణకము నదంలి గకారమునకు, ద్విః = ద్విత్వము, వా = వికల్పముగా నగును.

వి. స్త్ర్యర్థ మహదర్థ యో స్త్రి శబ్దాత్పరస్య గువర్ణకస్యద్విత్వమ్ వికల్పేన స్యాత్. ముగురు రాజులు, ముగ్గురు చేల్పులు, ముగురు వేలుపులు, ముగ్గురు రాచవారు ఇత్యాది.

స్త్రీ పురుషులను బోధించు సందర్భమున త్రి శబ్దమున కాదేశ మయిన 'మూ' అను దానికంటెఁ బరమయిన (ముగురు) గు వర్ణమునందలి గకారమునకు ద్విత్వము వికల్పముగా నగును.

'హద్విపూర్వపరయో రహరహలి' యను సూత్రముచే మూ శబ్దమున దీర్ఘమునకు హ్రస్వమును మీఁది గకారమునకు ద్విత్వమును నిత్యముగా రావలసియున్నవి. అట్టియెడల

నీ సూత్రము గకారమునకు ద్విత్వము వికల్ప మని చెప్పుచున్నది. కాఁగా మూ దీర్ఘమునకు హ్రస్వము మాత్రము ద్విత్వము వచ్చినను రాకున్నను 'హ' ద్వ్యపూర్వపరయో' అను సూత్రము ననుసరించి నిత్యముగనె వచ్చును. కాని మూగురు అనియు రూపము లేకపోలేదు.

ద్విత్వము వచ్చుచో ముగ్గురు. రాకున్న ముగురు.

వి. క్వచిద్వోగస్యేత్యనేన ముప్వురు, ముపురు ఇత్యాది.

పయి నప్లేర్పడిన ముగ్గురు, ముగురు అను శబ్దములందలి గకారమునకు 'క్వచిద్వోగస్య' యను సూత్రముచే వకార మాదేశము వచ్చినపక్షమున ముప్వురు, ముపురు అనియు రూపము లుండును.

## 22. టిరేకస్యామహతి.

అమహతి = మహతీతర మగు నమహదర్థమున, ఏకస్య = ఏక శబ్దమునకు, టి ః = టి అనునది యగును.

వి. అస్త్రీవాచకామహదర్థే ఏకశబ్దస్య టిప్రత్యయ
స్స్యాత్.

స్త్రీవాచకము కాని యమహదర్థమున ఏక శబ్దమునకంటెఁ బరముగా 'టి' యను ప్రత్యయము వచ్చును.

## 23. ఓదేతః.

ఏతః = ఏక శబ్దమునందలి యేకారమునకు, ఓత్ = ఓకార మగును.

వి. తద్భవే ఏత ఓత్ స్యాత్. ఏకస్య దీర్ఘస్య హ్రస్వః
ఒక– ఇతి స్థితే పుంసి సర్వనామత్వా డ్డుఙ్
ఒకఁడు బహువచనే ఒకరు స్త్రీత్వే ఒకతె క్లీబే–
ఒకటి, ఒకఁడు రాజు, ఒకతె భామ, ఒకటి గుఱ్ఱము
ఇత్యాది.

ఏక శబ్దమునందలి ఏకారమునకు 'ఓ' కారమువచ్చును. ఒక దీర్ఘమునకు హ్రస్వ మై ఒక యని యగునని వివృతియందు నిరూపింపఁబడినది.

కాని సంస్కృతమున హ్రస్వవక్రములు లేమి 'ఓత్' అని దీర్ఘమునే నిర్దేశించినను దెలుఁగున హ్రస్వము చేయనగును. ఏదన్తతా చ నామ్నామన్యతరస్యామియాన్తానామిత్యా దుల

నిట్లే గదా. ఒక యని యేర్పడఁగాఁ బూర్వసూత్రముచే తిర్యగ్జడవాచకత్వమున టి ప్రత్యయము వచ్చి ఒకటి, గుఱ్ఱ మొకటి, కోట యొకటి.

ఒక శబ్దము స్త్రీవాచక మగునపుడు 'తె' మొదలగు ప్రత్యయము లయి ఒకతె మొదలుగా నగును. ఒకతె భామ మొ॥.

మహద్వాచక మగునపు డేకవచనమున డు జ్జయి ఒకఁడు అనియు బహువచనమున (జసోరుః) రువర్ణక మయి ఒకరు అనియు నగును.

## 24. ద్విర్వా కః.

కః = ఒక శబ్దమునందలి కకారమునకు, వా = వికల్పముగా, ద్విః = ద్విత్వ మగును.

వి. ఏకశబ్ద కవర్ణకస్య వికల్పేన ద్విత్వం స్యాత్ ఇత్యనేన కస్య ద్విత్వమ్. ఒక్కఁడు, ఒక్కతె, ఒక్కటి ఇత్యాది.

ఏకార్థక మయిన ఒకశబ్దము నందలి కకారమునకు వికల్పముగా ద్విత్వ మగును. సామాన్యముగాఁ జెప్పుటచే మహదమహదర్థములు రెంట ద్విత్వ మగును.

ఒకరు అనుచో కకారమున కీ సూత్రముచే ద్విత్వము రాఁగా ఒక్కరు 'వా' యనుటచే ద్విత్వము రాని పక్షమున ఒకరు అని యుండును. ఇట్లె ఒక్కతె, ఒక్కటి మొ॥.

## 25. ఒక్క (కస్య) రురన్యై కయోః.

అన్య ఏకయోః = అన్యార్థమునను నేకార్థమునను (నేకవచనముననే) ఒకశబ్దమునకు, రుః = రువర్ణ మగును.

వి. అన్యార్థైకార్థయో రుస్స్యాత్. ఒరురాజు, అన్యరాజు, ఒరుమంత్రి ఒక్కమంత్రి ఇతిచ.

అన్యార్థము (ఇతరుఁడు) ఏకార్థము ఒక్కఁడు అను నర్థమునందును ఒక శబ్దమునందలి క వర్ణమునకు 'రు' వర్ణ మగును. ఒక – ఒరు.

ఒరురాజు ఇతరుఁ డగురాజు, ఒరుమంత్రి ఒక్కఁ డగుమంత్రి అని వీనికి వివృతియం దుదాహరణము తీయఁబడినవి. ఇట్టిరూపములను వెదుకవలయును.

అన్యుఁ డను నర్థమున ఒరుశబ్దముపై డుజ్వర్ణక మయి 'ఒరుఁడు' అని యగుట గలదు. దీనికి ఒక్కఁడను నర్థమునఁ బ్రయోగము గల దేమో వెదుకవలయును.

వి. ఒరు బహువచనే లుప్రత్యయః ఒరులు.

ఒరు అను శబ్దముపైఁ బ్రథమా బహువచనమునందు 'లు' ప్రత్యయము వచ్చును. ఒరు + జస్- (జసోరుః) ఒరులు (అన్యు లని యర్థము).

## 26. క్వచి ద్రోడః.

క్వచిత్ = కొన్నియెడల, రః = రేఫమునకు, డః = డకార మగును.

వి. బహువచనే లకారే పరే రేఫస్య డకారస్యాత్
క్వచిత్ స్థలే. ఒడులు, ఒరులు, వరి-వరులు, వడ్లు - వ డ్ల ఇత్యాది.

బహువచన లకారము పరముగా నున్నపుడు కొన్నియెడల రేఫకు డకార మగును.

పూర్వస్థలమున 'ఒరులు' అనుచో రేఫకు బహువచన లకారము పర మయినది గావునఁ బ్రస్తుతసూత్రముచే డకార మై ఒడులు అని యగును. కాని ఒడులు అనురూపము గానరాదు. 'ఒడ్లు' అని యుండును.

వరి, వరులు, వడ్లు అనుచోఁ గూడ నిట్లే గ్రహింపఁదగును. వరి-పైరు, వడ్లు-ధాన్యము.

## 27. పదిర్దశానామ్.

దశానామ్ = దశార్థమున, పదిః = పది అని యగును.

వి. దశశబ్దస్య పదిస్సర్వాదేశ స్స్యాత్.

'దశ' యను శబ్దమునకు 'పది' యనునది యాదేశ మగును. పది (దశ).

వి. తద్భవే పఙ్క్తి శబ్దస్య పదిరితి త్రిలిఙ్గాచార్యాణామ్మ
తే ప్రసిద్ధః. పఙ్క్తిః = పది.

తద్భవములలో పఙ్క్తి యను శబ్దము పది యను రీతిగాఁ దెలుఁగున నేర్పడునని తెలుఁగు లాక్షణికుల మతము. పఙ్క్తి, పది.

దశ శబ్దమున కాదేశ మయి 'పది' శబ్దము దేశ్య మగు నని యభిప్రాయము గాఁబోలును.

## 28. పదే రుత్ [1].

పదేః = పది శబ్దమునకు, ఉత్ = ఉత్వ మగును.

వి. సంఖ్యావాచి పద గ్వోః పరయోః పదేరికారస్య ఉకారస్స్యాత్. పదుగురు పదుమూఁడు.

సంఖ్యావాచకము లగు పదములును 'గు' వర్ణమును పరముగా నున్నపుడు, పది శబ్దమునందలి యికారమునకు ఉత్వ మగును. 'ఉత్' ఏకా ల్లగుటచే 'అలోఽన్త్యస్య' యను పరిభాష ననుసరించి యిట, 'పది' శబ్దమునందుఁ జివరివర్ణమగు ఇకారమునకె యుత్వ మగును.

పది + మూఁడు అనుచో సంఖ్యావాచక మగు మూఁడు పరముగా నుండఁగా నీ సూత్రముచే నుత్వము వచ్చి పదుమూఁడు ఇట్లె పదునాలుగు.

పదిగురు అనుచో 'గు' వర్ణము పరముగా నుండఁగా నీ సూత్రముచే నుత్వ మయి పదుగురు.

## 29. నగచి.

అచి = అచ్చు పర మగుచుండఁగా, నక్ = నగాగమ మగును.

వి. సంఖ్యావాచిపదస్య అచి పరే పదే రుకారాత్పరతో నస్యాత్-పదునేను, పదునైదు, పదునాఱు, పదునేడు, పదునెనిమిది.

సంఖ్యావాచక మగు పదమునందలి యచ్చు పర మగుచుండఁగా పదిశబ్దము నందలి యిత్వమునకు 'పదేరుత్' అను సూత్రము చేసెన యుత్వమునకు నగాగమ మగును. నక్‌లో కాకర మిత్తు కావున 'పదు' శబ్దమున కంత్యావయవముగా నగును. 'న' వర్ణములోని యత్వ ముచ్చారణార్థము కావున నకారపుఁ బొల్లగును.

పది + ఏను అనుచో 'పదేరుత్' అను సూత్రముచే నుత్వము పదు + ఏను, ప్రస్తుతసూత్రముచే నకారము -పదున్ + ఏను = పదునేను. ఇ ట్లితరము లూహ్యములు.

---

1. ఆదేశః క్వచిదున్మాత్రమ్. అ.కా.అ.86.

## 30. ఒండౌ చ [1].

ఒండౌ చ = ఒండు అను శబ్దము పరముగా నున్నపుడు గూడ పదీ శబ్దముయొక్క ఉత్వమునకు నగాగమ మగును. నగచి యను పూర్వసూత్రము ననుసరించి యిచ్చటి చ శబ్దముచే నగాగమము సంగ్రహింపఁబడును.

వి. ఒండుపదే పరే నకారస్స్యాత్ పది పదస్యో కారాత్ప
రతః. పదునొండు, పదునొక్కటి, పదునొకొండు.

ఒండు శబ్దము పర మైనపుడు గూడ పది శబ్దమునకు 'పదేరుత్' అను సూత్రముచే నయిన ఉత్వమునకు నగాగమము వచ్చును.

పది + ఒండు 'పదేరుత్' పదు + ఒండు ప్రస్తుతసూత్రముచే నకారము కాఁగా పదునొండు.

(పదునొకొండు యనునది విశేషము)

ఈ సూత్ర మవసరముగాఁ దోఁపకున్నది. 'పదేరుత్' అను సూత్రముచే ఉత్వము సంఖ్యావాచకము (గువర్ణము) పర మగునపు డగును. కాఁగా పదు + ఒండు అనుతీరుగా నుత్వము వచ్చునపుడు ఆ సంఖ్యావాచకము (ఒండు) నందలి యచ్చు పర మగుచుండఁగా 'నగచి' యను సూత్రము చేతనె యేల నగాగమము రాదు? కాఁగా పదునొండు, పదునొకటి యనునవి నగచి యను పూర్వ సూత్రమునకే యుదాహరణములు.

ఇట సూత్ర వివృతులందు 'కొండౌ చ' యని యున్నది. 'కొండు' అనుదానిలో మొదట నచ్చు లేదు. గావున 'నగచి' యనుదానిచే నగాగమము రాకుండుటచే నిట్లు విశేషముగాఁ జెప్పుట యొప్పును. కాని చ శబ్దముచేఁ బూర్వోక్త మగు నగాగమమె స్మరింపఁబడును. అట నగాగమములో నకారపుఁబొల్లె యగును. అట్లె యయిన 'పదున్ కొండు' అని యగును. వివృతి యందు 'పదునకొండు' అని చూపఁబడినది. నకార మద్విశిష్టముగా నిట నైనది. పూర్వస్థలమునను నకారపుఁబొల్లు గాక 'న' వర్ణ మాగమమై పదున + ఏను అనుచో ననవసర సంధి ప్రసంగము కలుగును. ఇంతకును పదునకొండు అనురూపము లేదు. (పదునొకొండు అని యున్నది. విడిగా కూడ కొండుశబ్దము లేదు. (కొండొకచో?) ఒకొండు అనియె కాఁగా నీ లక్షణము విచార్యము) తరువాతి సూత్రము నొద్దను వేనవేలు అని నగామము న వర్ణముగనె చూపఁబడినది.

---

1. ఏకాదశాది సంఖ్యాయామునో దుశ్చనబిస్దుకః అ.కౌ.అ.86

## 31. సహస్రాద్వా (జస్వదే) స్వపదే.

స్వపదే = సహస్రపదము (వే) పర మగు చుండఁగా, సహస్రాత్ = 'వే' అను పదముకంటె వా = వికల్పముగా నగాగమ మగును.

వి. సహస్రపదే సహస్రపదాత్పరతో నగ్వా స్యాత్.
వేనవేలు, వేవేలు.

సహస్రార్థక మగు 'వే' యను పదము పరమగుచుండఁగా సహస్రార్థక మగు 'వే' యను శబ్దమునకు నగాగమము కల్గును.

వే + వే అనుచో నగాగమము రాఁగా వేనవే బహువచనముతో వేనవేలు.

'వా' యనుటచే నగాగమము రానిపక్షమునందు వేవేలు అని యుండును.

ఇట నగాగమమున 'న' వర్ణము మొత్తము నిల్చుట విశేషము.

వి. [1]క్లీబే తిర్యగ్జడవాచకపదేషు పరేషు సంఖ్యావాచి పదాత్పరతో గుర్వాస్యాత్. ఇరుదెస, ముమ్మాఱు, ముచ్వేలుపు, నలుమాఱు, అయిదువీధులు, ఆఱెద్దులు, ఏడు వారములు, పది దినములు, నూఱు గట్టములు వే యేనుంగులు ఇత్యాది.

తిర్యగ్జడవాచకము లగునపుడు సంఖ్యావాచకములకు గు వర్ణము రాదు. రెండు మూఁడు నాలుగు మొ॥

ఇట వివృతియందు దాదా పన్నియు సమాసములే యుదాహరించుట విశేషము. ప్రస్తుతాంశము పూర్వమే స్పష్టము.

---

1. ఇది 'నక్లీబే' యని సూత్ర మగునేమో.

## 32. రు స్త్రీ పుంసోః.

స్త్రీ పుంసోః = స్త్రీ పురుష బోధక మగునపుడు, రుః = రు అను ప్రత్యయ మగును.

వి. ఎనిమిది తొమ్మిదిభ్యాం పరతో రుస్స్యాత్. స్త్రీపుంసార్థ యోర్బహువచనే. ఎనిమిదిరు తొమ్మిదిరు ఇతి స్థితే.

సూత్రార్థము వివృతియందు విశేషముగా వివరింపఁబడినది. స్త్రీ పురుష వాచకము లగునపుడు ఎనిమిది, తొమ్మిది అను సంఖ్యావాచకములకు ఁ బరముగా రు అను ప్రత్యయము వచ్చును.

ఈ రు వర్ణము ఒకరు, ముగ్గురు ఇత్యాదిగా సర్వనామములకుఁ బ్రథమాబహువచనమున వచ్చునదే. వీనికి విశేషముగాఁ జెప్పుటలోఁ బ్రత్యేక ప్రయోజనము గానరాకున్నది.

ఎనిమిది + రు, తొమ్మిది + రు అని కాఁగా–

## 33. రౌ దేర్లుక్.

రౌ = రు వర్ణకము పర మగుచుండఁగా, దేః = ది వర్ణమునకు, లుక్ = లోపమగును.

వి. రువర్ణే పరే అష్టశబ్ద నవశబ్దయో ర్ది వర్ణయోః స్త్రీ పుంసార్థయో ర్లుక్ స్యాత్. ఎనిమిరు, తొమ్మిరు ఇతి స్థితే–

స్త్రీ పురుష వాచకము లగునపుడు (ప్రథమాబహువచనమున) రు వర్ణకము రాఁగా నది పరముగా నున్నపుడు, ఎనిమిది, తొమ్మిది యను శబ్దములందలి 'ది' అను నక్షరమునకు లోపము వచ్చును.

ఎనిమిది + రు, తొమ్మిది + రు అనుచోఁ బ్రస్తుతసూత్రముచే ది వర్ణము లోపింపఁగా ఎనిమి + రు, తొమ్మి + రు అని యగును. ఇవి ఇట్లుండఁగా–

## 34. డుస్స బిన్దూ రువర్ణే పరే [1].

రువర్ణే పరే = రు వర్ణకము పర మగుచుండఁగా, సబిన్దుః డుః = బిందువుతోఁ గూడిన డువర్ణ మగును.

---

1. సబిన్దుర్డు స్తుమాత్వరః. అ.కా.అ.88.

వి. ఎనిమిది తొమ్మిది భ్యాం పరతో డుస్స
బిన్దు స్స్యాత్. ఎనిమిందురు తొమ్మిందురు ఇతి స్థితే-

రువర్ణకము పరముగా నున్నపుడు ఎనిమి(ది) తొమ్మి (ది) శబ్దములకుఁ బూర్ణబిందువు పూర్వమునందుఁ గలిగిన డువర్ణ మాగమ మగును.

ఎనిమి + దు, తొమ్మి + దు అనుచోఁ బ్రస్తుతసూత్రముచేఁ బూర్ణ బిందుపూర్వక డువర్ణము రాఁగా ఎనిమిందురు తొమ్మిందురు అని యగును.

'ది' వర్ణమునకు లోపమును జెప్పి యామిద'ండు' వర్ణము నాగమము చేయుటకంటె 'ండు' వర్ణమును ఎనిమిది తొమ్మిదుల 'ది' వర్ణము స్థానమున నాదేశముగా విధించుటలోనె లాఘవము గల దని తోఁచుచున్నది.

ఇంకను ఎనిమిది, తొమ్మిది యనునవి యసమస్తరూపములుగా సాధించునప్పు డింతకుఁ బూర్వము అష్ట శబ్దమునకు ఎని, నవశబ్దమునకు 'తొమ్' అనునవి మాత్రమె చెప్పఁబడినవి. కావున వాని మహదర్థకస్త్రర్థకరూపములను, ఎనిమిది, తొమ్మిది యను సమస్తరూపములనుండి కాక ఎని, తొమ్, అను మూలరూపములనుండియె క్రమముగ సాధించుట యుచితమనియుఁ జెప్పవలసియున్నది. ముగురు నలుగురు ఇత్యాదు లిట్లే గదా సాధింపఁబడియున్నవి.

## 35. అదితోడౌ.

డౌ = డువర్ణము పర మగు చుండఁగా, ఇతః = ఎనిమి(ది) తొమ్మి(ది) శబ్దములతుది ఇకారమునకు, అత్ = అత్త్వ మగును.

వి. అష్టశబ్ద నవశబ్దయో ర్మివర్ణయో రికారస్య
అత్ స్యాత్ బిన్దుసహితే డౌ పరే. ఎనిమందురు
తొమ్మందురు- ఇతి స్థితే-

డుస్సబిన్దూరువర్ణే పరే యను పూర్వసూత్రముచే నయిన పూర్ణ బిందుపూర్వక డువర్ణము పర మగుచుండఁగా ఎనిమి(ది)తొమ్మి(ది) శబ్దములందలి యికారమునకు అత్త్వ మాదేశ మగును.

తొమ్మి + ండురు అనుచో తొమ్మిశబ్దమున 'మ్మి' వర్ణమునందలి యిత్వమున కత్వము రాఁగా తొమ్మందురు అని యగును.

ఎనిమి + ండురు అనుచో మివర్ణమునందలి ఇత్వమున కత్వము వచ్చి ఎనిమందురు అని యగును.

పిదప-

## 36. తయోరుల్లుక్.

తయోః = ఎనిమిది తొమ్మిది శబ్దములకుఁ బైనున్న పూర్ణబిందుపూర్వకడువర్ణములకు, ఉత్ లుక్ = ఉత్త్వలోప మగును.

వి. ఇత్యనేన సూత్రేణ డువర్ణో కారస్య లోపే కృతే
ఎనమంద్రు తొమ్మంద్రు ఇతిస్థితే-

'డుస్స్వబిన్దూ రువర్ణే పరే' యను సూత్రముచే నయిన పూర్ణబిందుపూర్వకడువర్ణమునందలి యుకారమునకు లోప మగును.

ఎనమండురు తొమ్మండురు అనుచో నీ సూత్రముచే డువర్ణమునందలి యుత్త్వము లోపింపఁగా ఎనమంద్రు, తొమ్మంద్రు అని యగును. (ఎనమండుగురు తొమ్మండుగురు అనియు నిట రూపములు గలవు) ఉత్వలోపము నిత్యమె యవుచుండ డువర్ణమును జెప్పి యుల్లోపమును మఱల విధించుటకంటె మొదటనే పూర్ణబిందుపూర్వకడకారమును విధించుటలో లాఘవము గలదు.

ఎనమంద్రు తొమ్మంద్రు అనుచో-

## 37. పాత్పర మ్యోర్నేరుట్.

ప-అత్ పర మ్యోః = పకారమును, అకారము పరముగా గల మివర్ణము పర మైనను, నేః = నివర్ణము నందలి యిత్వమునకు, ఉట్ = ఉట్ అగును.

వి. అష్టశబ్ద నివర్ణే కారస్య పదిశబ్దాత్పర మివర్ణయోః
పరయోరుత్ స్యాత్. ఎనుమంద్రు, ఎనుబది ఇత్యాది.

'పది' శబ్దమునందలి పకారము పర మైనపుడును, 'అదితోడా' యనుసూత్రముచే నయిన యత్వము పరముగాఁ గల మివర్ణము (మకారము) పర మైనను ఎనిమిది శబ్దము యొక్క నివర్ణమునందలి యికారమునకు 'ఉట్' వచ్చును. ఉట్ లో టకార మిత్తు. ఉత్వమె నిలుచును.

ఎనిమిది + పది యనుచో 'మిదేర్లుక్ పదౌ' యను తరువాతి సూత్రముచే 'మిది' లోపించి ఎని + పది అని యగును. ఇపుడు ఎని (మిది) శబ్దములోని నివర్ణమునకు 'పది' శబ్దములోని పకారము పర మైనది. కావునఁ బ్రస్తుతసూత్రముచే నివర్ణమునందలి యిత్త్వమునకుత్త్వము వచ్చి ఎనుపది - (ఎనుఁబది) అని యగును.

పూర్వసూత్రములననుసరించి (చూ 35) ఎనిమండ్రు- అని కాఁగా ఇచట ఎని(మిది) శబ్దము నివర్ణమునకు 'మ' వర్ణము పరమైనది. ఇది (ఎని)మిది లోని మివర్ణమునకు 'అతితోడౌ' యను సూత్రముచే సత్వము వచ్చుటవలన నేర్పడినది. కావున నిది పర మగుచుండఁగాఁ ప్రస్తుతసూత్రముచే నివర్ణమునందలి యిత్వమున కుత్వము వచ్చి 'ఎనుమండ్రు' అని యగును.

ఇచట 'ఎనమండ్రు' అనురీతిగా నత్వముతో నె రూపమును లాక్షణికు లితరులు నిరూపించిరి. ఇట 'ఎనుమండ్రు' అను యుత్వమధ్యముగా సాధించుట విశేషము.

## 38. మిదేర్లుక్పదౌ.

పదౌ = పదిశబ్దము పర మగుచుండఁగా, మిదేః = ఎనిమిది, తొమ్మిది శబ్దములందలి మిది యను దానికి, లుక్ = లోపమగును.

వి. పదిశబ్దేపరేఽష్ట శబ్దనవశబ్దయో ర్మిదే ర్లుక్స్యాత్.
ఎనిపది తొంపది ఇతి స్థితే. 'హ్రత్వరమ్యోర్నేరు' డితి సూత్రేణ నేరుత్వే ప్రాప్తే 'ఎనుపది (తొంపది) ఎనుమండ్రు తొంబండు (తొమ్మండ్రు) ఇత్యాది.

పది శబ్దము పర మగుచుండఁగా 'ఎనిమిది' తొమ్మిది శబ్దములలోని 'మిది' యనుదానికి లోప మగును. ఎనిమిది + పది, తొమ్మిది + పది యనుచో 'మిది' లోపింపఁగా ఎని + పది తొం + పది యని యగును. 'హ్రత్వరమ్యోర్నేరుట్' అను పూర్వసూత్రముచే ఎని, నివర్ణమున కుత్వము వచ్చి ఎనుపది యని యగును. ఎనుబది యనుతీరుగా మీఁది పరుషమునకు సరళము 'తొమ్మిది' యనుచో మకారమున కనుస్వారము. తొంబది.

## 39. ర(క)రు మూ(లు ఏ) ల్వేను బిన్దుభ్యః పది.

ర, (క) రుమూ లు ఏను బిన్దుభ్యః = ర, (క) రు, మూ, లు, ఏ, ను. బిందువు అనువానికంటెఁ బరముగా, పది = పది యనునది యగును.

వి. సంఖ్యావాచిభ్య ఏతదన్తేభ్యః పరతః పది స్యాదేకవచ నే కర్మధారయే. అరపది, ఒరుపది, ఇరుపది, ముప్పది, నలుపది, ఏపది, అరుపది, డెబ్బది, ఎనుపది, తొంపది ఇత్యాది.

కర్మధారయసమాసమునందు ర మొదలగునవి యంతమందుఁ గల సంఖ్యావాచకములకుఁ బైని 'పది' యనుశబ్ద మగును. ర-అరపది. (క = ఒకపది)? రు = ఒరుపది, ఇరువది, అరువది, మూ = ముప్పది, లు = నలువది, ఏ = ఏబది, ను = ఎనుపది, బిందువు = తొంపది.

ఈ లక్షణము సమంజసముగా లేదు.

'మిదేర్లుక్ పదౌ' యని యింతకు ముందు సూత్రము పది పర మగునపుడే మిదిలోపము చెప్పినది. అట్లు మిది లోపించినఁ గాని 'తొం' అని తుదిని బిందు వుండదు ఇట తొం అనుదానిపై పది యగు నను టెట్లు? పది లేనిదే మిది లోపించుటే కుదురమి తుదిని బిందు వుండుటయే లేదు గదా.

నలువది, అఱువది యనుచో హ్రస్వమును ఎనుబది యనుచో నుత్వము నిట్టి విరోధముతోనె యుండుట గుర్తింపవలయును.

(అఱపది అఱువది యనుచో శకటరేఫలు)

ఒరుపది అనురూపము గానరాదు.

పదిశబ్దముతో నగు నట్టి యీసమాసమును విశేషముగాఁ బ్రస్తావింప వలసిన యవసరమును విచార్యము.

వి. పోవః ఇత్యనేన పకారవకారః. ఇరువది (ఎను) అఱువది.

పోవః అను సూత్రముచే పకారమునకు వకార మై ఇరు + పది = ఇరువది యని యగును. ఇట్లే అఱువది ఎనుబది యనుచో బకార మైనది 'నలుబది' యనుచో గూడ బకారమె యగున ట్లీవివృతి యింతకు ముం దుదాహరించినది కాని నలువది యనియె సాధువుగా నితరులు పేర్కొనిరి.

వి. ఉకారలోపః, నోనుస్వారః, ఇత్యనేన బిన్దుః ఏఁబది.

ఏను + పది అనుచో నుత్వము లోపించి ఏన్ + పది, నకారమునకు బిందువు 'క్రియా.75 వచ్చి(మీఁది పరుషము సరళమై) ఏఁబది యని యగును. ఉతలోపాదిప్రసంగమునుబట్టి చూడగా నీ 'ఏఁబది' యన్నది పయి సూత్రమున కుదాహరణముగా నెట్లు సమన్వయింపఁబడునో తెలియకున్నది. సూత్రమునుబట్టి 'ఏ' అనుదానిపై పది చేరును. 'ను' అనునది 'ఏను' అనుదానికిఁ జెందినది లేనిచో ఎనుబది యనుదాని కిట నవకాశ ముండదు.

## 40. దె సప్తానామ్ [1].

సప్తనామ్ = సప్తశబ్దమునకు, దె = దె అనునది యగును.

వి. పదిశబ్దే పరే సప్తశబ్దస్య దె ఇత్యా దేశస్స్యాత్.
దెపది, పోవః ఇత్యనేన పస్య వకారః.

పదిశబ్దము పర మగు చుండఁగా సప్తశబ్దమునకు 'దె' యనునది యాదేశమగును. దె + పది యని యుండఁగా 'పోవః' (తద్బ.) అను సూత్రముచే పకారమునకు వకా రమై దెవది యగును- డె అన్నదె విధింపఁదగునని తోఁచు.

## 41.వోబః [2].

వి.వస్య బస్స్యాత్.

వః = వకారమునకు, బః = బకార మగును(తద్బ) దెవది యనుచోటి "వ" కారమున కీ సూత్రముచే బకారము రాఁగా దెబది యని యగును.

వి. హద్వ్యపూర్వపరయో రిత్య నేన హ్రస్వ
ద్విత్వయోః ప్రాప్తయోః దెబ్బది. ఇతి స్థితే, క్వచిద్దోడ
ఇత్యనేన దస్య డకారే ప్రాప్తే డెబ్బది.

'హద్వ్యపూర్వ పరయోరహరహలి' యను సూత్రముచే మీఁది హల్లునకు ద్విత్వ మయి దెబ్బది యని యగును. 'క్వచిద్దోడః' (తద్బ) అను సూత్రముచే దకారమునకు డకారము వచ్చి డెబ్బది యున్నది. ఈ సూత్రము 'క్వచిదాదేర్దోడః' అని యున్నది.

దీనిని బట్టి దెబ్బది యనురూపము నంగీకరింపఁబడిన దని స్పష్టము. (పూర్వము నుదాహృతము). లేనిచో సప్తశబ్దమునకు 'దె' యనునది కాక 'డె' యనునదే యాదేశింపఁబడిన దని గ్రహింపఁదగును.

వి. మూ + పది ఇతి స్థితే హద్వ్యపూర్వ పరయోరిత్యనేన
హ్రస్వ ద్విత్వయోః ప్రాప్తయోః ముప్పది

---

1. సప్తాష్టనవానాం డెబెన్ తొన్ పదౌ.వై.చం.వ.29.
2. తద్బ.40.

మూ + పది యని యుండఁగా ' హ్రద్వీపూర్వపరయో రహరహలి' యను సూత్రముచే పూర్వదీర్ఘమునకు హ్రస్వమును (ము + పది) మీఁది హల్లు (పకారము)నకు ద్విత్వమును రాఁగా ముప్పది యని యగును. ఇది పూర్వము పేర్కొనఁబడినదే.

వృ.నలుబది అఱువది ఎనుబది ఉత్వలోపే ఎన్ బది
అనుస్వారే ఏఁబది తొంబది ఇత్యాది.

నలుపది యనుచో డెబ్బది యనుచో వలె నే పోవః అని పకారమునకు వకారమును, వోబః అని యావకారమునకు బకారము నై నలుబది యని యగు నని యభిప్రాయము గావచ్చును. కాని నలువది యన్నదే ప్రామాణిక మని నిశ్చయింపఁదగును.

'అఱుపది' యనుచో పోవః అను సూత్రముచే పకారమునకు వకారము. అఱువది (ఇట మాత్రము వకారమునకు బకారము చేసి అఱుబది యనలేదు) .

ఎనిమిది + పది – మిదేర్లుక్ పరౌ ఎని + పది 'హ్రత్వరమ్యో ర్నేరుట్' అని యుత్వము ఎనుపది యనుచో పోవః, ఎనువది, వోబః. ఎనుబది యనుచో నువర్ణమునందలి యత్త్వము లోపించిన పక్షమునందు (ఉక్తానాంచ. సంధి) ఎన్బది యగును.

ఇచట నకారమునకు బిందు వవు నని 'ఏఁబది' యని వివృతియందుఁ జూపఁబడినది. ఏఁబది యనఁగా నైదుపదు లని యె గాని ఎనిమిది పదు లని యర్థము గాదు. తరువాతి తొంబదియనుదానిని బట్టి యిచటిది ఎనిమిదిపదులను దెల్పునదె కావలెను. అనుస్వారము వచ్చు ననుటనె 'ఎంబది' యని చూపఁబడిన దేమో. కాని ఇట ననుస్వారము వచ్చిన రూపములు లేవు.

తొం + పది తొంబది యైనట్లు నలుబది యవునని యూహింపనగును.

## 42. నూఱు శతస్య.

వి. నూఱు.

శతస్య = శతశబ్దమునకు, నూఱు = నూఱు అనునది యాదేశ మగును. నూఱు = శతము.

## 43. వే(వేయి) సహస్రస్య.

వి. వే వేయి.

సహస్రస్య = సహస్రశబ్దమునకు, వే(వేయి) వే (వేయి) ఆదేశము లగును. వే, వేయి= సహస్రము

## 44. ఒండ్వా దేరవట్ [1].

ఒండ్వా దేః = ఒండు మొదలగువానికి, అవట్ = అవట్ అనునది యగును.

వి. ఒండు, రెండు, మూఁడు, నాలుగు, ఐదు, ఆఱు, ఏడు,
ఎనిమిది, తొమ్మిది, పది, నూఱు, వే ప్రభృతీనా మవగా
గమస్స్యాత్కర్మధారయ సమాసే. ఒండవది, రెండవది,
రెండవవాఁడు, మూఁడవ దేవదేవుఁడు, నాలుగవ
కొడుకు, నాలవధాత, అయిదవకూతురు, ఏనవ
మామ, ఆఱవయిల్లు, ఏడవఋషి, ఎనిమిద
వతరము, తొమ్మిదవగ్రహము, పదవయవతారము,
నూఱవయేడు, వేయవ బంటు ఇత్యాది.

ఒండు మొదలగు సంఖ్యావాచకములకుఁ గర్మధారయ సమాసమునందు 'అవట్' అనునది యాగముముగా వచ్చును. అవట్ అనుచో టకా రమిత్తు. టిత్వముచే అవ ఆద్యవయవముగా రావలెను. కాని యది యంత్యావయవముగనె యగును. కాఁగా 'అవట్' అని టిత్తుగాఁ జెప్పక కిత్తుగాఁ జెప్పదగు. టకారమునకు చ్చారణసౌకర్యము ప్రయోజనముగాఁ జెప్పుట యొక మార్గమె యైన, నది యంతగా సమంజసముగాఁ దోఁపదు 'అవ' యనుదాని యుచ్చారణమున నసౌకర్యము గానరాదు. ఇటుఁ గర్మధారయ సమాసమున నని చెప్పఁబడినది.

పూరణార్థక మగుట స్పష్టము. వి.వి.సమాసమనె.

ఒండు – అది అవ, ఒండవ అది ఒండవది ఇట్లె రెండవవాఁడు మొ॥

## 45. ద్వేర్ద్వి ర్న వయోః(ను)

ద్వేర్నవయోః = ద్వి, నవశబ్దములు పరముగా నున్నపుడు, దేః = పదిశబ్దముయొక్క దివర్ణమునకు, నిః = నివర్ణమగును.

వి. పదిశబ్ద దివర్ణస్య న్యాదేశస్స్యాత్ ద్విశబ్దనవ
శబ్దయోః పరయోః – పని రెండు, పనితొమ్మిది ఇతి
స్థితే, నివర్ణేకారస్య లోపే నకారస్య హలః బిందౌ,
పరస్య తకారస్య దకారే కృతే పందొమ్మిది.

---

1. సమాసేఽవస్తు సర్వదా. అ.కా.అ.89.

ద్వి(రెండు) నవ(తొమ్మిది) శబ్దములు పరమైనపుడు పూర్వమునందలి పదిశబ్దముయొక్క దివర్ణమునకు నివర్ణ మగును.

పది + తొమ్మిది అనుచో నిట్లు దివర్ణమునకు నివర్ణము రాగా పని + తొమ్మిది ఈని వర్ణము నందలి యికారము లోపించి (ఇణష్ట్వ ర్థలి?) (పన్ + తొమ్మిది) ఆనకారమునకుఁ బూర్ణబిందువై (పం + తొమ్మిది) మీఁది తకారమునకు దకారము రాగా పందొమ్మిది యని యగును. ఇవి ద్రుతకార్యములుగా నూహింపవచ్చును.

వి. పని + రెండు ఇతి స్థితే నివర్ణేకారలోపే పన్నెండు [1].

పది + రెండు అనుచో నీ సూత్రముచే దివర్ణమునకు నివర్ణము వచ్చి పని + రెండు అనుచో నివర్ణమునందలి యికారము లోపించి పన్ + రెండు పన్నెండు అని యగును.

పందొమ్మిది అనుచోను పన్నెండు అనుచోను రెండింటి నివర్ణమునందలి యికారము లోపింపక తప్పదు. అట్టియెడల 'ని' వర్ణమును గాక దివర్ణము మొత్తమునకు పొల్లునకారమునే విధించుటలో లాఘవము కలదు.

'పన్నెండు' అనునది లోక వ్యవహారమున నుండవచ్చును. కాని కావ్య వ్యవహారమున మాత్రము పండ్రెం డని [2]యె. కన్పించును. పన్నిద్దరు, పన్నిరుగురు.

## 46. రోష్టః.

రోః = నూఱుశబ్దము యొక్క ఉవర్ణమునకు, టః = టవర్ణ మాదేశ మగును.

వి. సంఖ్యావాచిని పదే పరే నూరు శబ్దే విద్యమాన రువర్ణ
స్య టాదేశస్స్యాత్. నూఱు ఒక్కటి - నూట యొక్కటి-
నూటొక్కటి టకారః. నూట రెండు - నూటమూఁడు -
నూటనాలుగు, నూటయిదు, నూటాఱు, నూటేడు, నూటె
నిమిది, నూట తొమ్మిది, నూట పది ఇత్యాది.

సంఖ్యావాచకము పరముగా నుండఁగా నూఱుశబ్దము యొక్క ఉవర్ణము స్థానమున ట అనునది యాదేశమగును.

---

1.? పదేః పన్ ద్వినవాఢకేషు. వై.చం.స.26

2. దుశ్శపదిన్నుకః ఆ.కా.అ.86.

నూఱు + ఒక్కటి ఈ సూత్రముచే ఱువర్ణమునకు టవర్ణమై నూట + ఒక్కటి వాటతః సంధియైన నూటొక్కటి. సంధి రానిపక్షమున 'యః ప్రాణస్య' యని యకార మై నూటయొక్కటి - నూటరెండు మొ॥.

## 47. పదే రొండౌ ననకౌ.

ఒండౌ. ఒండుశబ్దము పర మగుచుండఁగా, పదేః = పది శబ్దమునకు,న, నక్ అనునవి యాగమము లగును.

వి. దశశబ్దస్య ఒండోర చిపరే పూర్వపరయోః
రొండ్వాద్యోరచోః క్రమాన్నకవర్ణ నాగమౌ స్తః
పదునకొండు. (పదునొండు).

ఇట వివృతియందుఁ గొంత వైపరీత్యము గానగును. ఒండు శబ్దము పర మగునపుడు పదిశబ్దమునకు నక్, న, యనవి యాగమము లగు నని యర్థము. నవర్ణమునం దకార ముచ్చారణార్థము.

పది + ఒండు అనుచో 'పదేరుత్' అను సూత్రముచే నుత్వము రాఁగా పదు + ఒండు ప్రస్తుతసూత్రము చే 'నక్' రాఁగా పదునక్ + ఒండు పదునకొండు అనియగును. 'న' కారము వచ్చిన పదున్ + ఒండు = పదునొండు అని యగును.

'ఒండౌచ' యను సూత్రమునొద్ద నీరూపములు ప్రస్తావింపఁబడియున్నవి. కొండుశబ్ద మొక్కట ప్రత్యేముగను బ్రస్తావింపఁబడినది.

పూర్వపరవర్ణముల కిత్యాదిగా వివృతియందుఁ గానగు వివరణము ఉదాహరణముతో సమన్వయింపకున్నది.

## 48. (ఒండు రేకస్మిన్) ఒండోః క రేకస్మిన్.

ఏకస్మిక్ = ఏకశబ్దార్థక మగు 'ఒక'పర మగునపుడు, ఒండోః = ముందటి యొండు శబ్దమునకు మొదట, కః = కకార మగును.

వి. ఒండు పదస్య తద్భవైకశబ్దే పరే పూర్వప దస్యాదేః
కవర్ణాగమః స్స్యాత్. ఒకశబ్దః కొండొక చోటు,
కొండొకటి.

ఏకశబ్దభవ మగు 'ఒక' యనునది పరముగా నున్నపుడు దానికిఁ బూర్వమున నున్న 'ఒండు' శబ్దమునకు మొదట కకారము వచ్చి చేరును.

ఒండు + ఒకటి కకార మొండుశబ్దము ముందు చేరఁగా క్ + ఒండు + ఒకటి = కొండొకటి యని యగును. కొండొకచోట, కొండొకచోన్ మొ॥.

## 49. ఏకస్మాదానుక్.

ఏకస్మిన్ = ఏకార్థక మగు 'ఒక' శబ్దము పర మగునపుడు, ఏకస్మాత్ = ఏకార్థక మైన ఒకశబ్దమునకు, ఆనుక్ = ఆనుక్ అనునది యగును. పూర్వసూత్రమునుండి ఏకస్మిన్ అనునది యనువర్తించును.

వి. కశ్చనైక ఇత్యర్థే ఒకశబ్దే పరే పూర్వతోవిద్య
మానాదేకశబ్దస్య అనుగాగమస్స్యాత్. ఒకానొకఁడు,
ఒకానొకటి, ఒకానొకపురుషుఁడు ఇత్యాది.

(కశ్చనైకః) ఒకానొక యనునర్థమునందు ఒకశబ్దము పరముగా నుండఁగా దానికిఁ బూర్వమునం దున్నయొక శబ్దమునకు ఆనుక్ అను నాగమ మగును. 'ఆనుక్'లో కకార మిత్తు. నువర్ణమందలి యుకారముచ్చారణ సౌకర్యమునకై యుంచఁబడినది. కావున'ఆన్' అనునది (కి త్తగుటచే) పూర్వమునం దున్న ఒకశబ్దమున కంత్యావయవముగాఁ జేరును.

ఒక + ఒకటి, ఒక + ఆన్ + ఒకటి. సంధి నిత్యముగా నయి ఒకానొకటి యని యగును. ఇట్లితరము లూహింపఁదగును.

వి. కొండు ఏకశబ్దార్థశ్చ [1].

కొండు అనునది ఏకశబ్దార్థకమై ఒకఁడు అనునర్థమునను నున్నది. కొండొకచో ఇత్యాదులయందలిది భిన్న మని యభిప్రాయము గానోపును. ఏకశబ్దార్థమున కొండు అనునది మృగ్యము.

---

1. ఇది వృత్తికార? వచనముగునా?

## 50. లుగ్రుడులుదీనామ్.

రుడులుదీనామ్ = రు, డు, లు, ది అనువర్ణములకు, లుక్ = లోప మగును.

వి. నూరుశబ్దస్య నూవర్ణే పరే కర్మధారయసమాసే
పూర్వతో విద్యమాన ద్విచతురష్ట నవానామ్
ఇరు, మూడు, నల్వెనిమిది తొమ్మిదీనాం శబ్దానా
మన్త్యానాం రుడులుదీనాం వర్ణానాం లుక్ స్యాత్.
ఇనూఱు, మునూఱు, ననూఱు, ఎనిమి నూఱు,
తొమ్మి నూఱు ఇతి స్థితే.

నూఱు అనుశబ్దము (యొక్క నువర్ణము) పర మగుచుండఁగా దానికిఁ బూర్వమునం దున్న ఇరు(ద్వి)మూడు(త్రి) నలు(చతుః) ఎనిమిది(అష్ట) తొమ్మిది(నవ) యనుశబ్దములలోఁ జివరి వగు రు,డు, లు, ది అను వర్ణములకు లోప మగును.

ఇరు + నూఱు అనుచో నీసూత్రముచే 'రు'వర్ణము లోపింపఁగా ఇ +నూఱు అని యుండును.

మూడు + నూఱు అనుచో 'డు' వర్ణము లోపింపఁగా మూ + నూఱు - (ముప్పది ఇత్యాదులవలె భావించిన నిచట డులోప ప్రసక్తి యుండదు)

నలు + నూఱు అనుచో 'లువర్ణము లోపించి న + నూఱు అని యుండును.

ఎనిమిది + నూఱు, తొమ్మిది + నూఱు అనుచో నీ సూత్రముచే దివర్ణము లోపించి ఎనిమి + నూఱు, తొమ్మి + నూఱు అని యుండును. పిదప-

వి. అదితః(ఇత్యనేన) ఎనిమితొమ్మిశబ్దయో రికారస్య
అత్ స్యాన్నూరుశబ్దస్య నూవర్ణే పరే. ఎనిమ నూఱు,
'హ్రస్వరమ్యోర్నేరుట్' ఇత్యనేన
నేరుకారే ప్రాప్తే ఎనుమ నూఱు, తొమ్మనూఱు.

అదితః(తద్బ) అను సూత్రముచే ఎనిమి(ది) తొమ్మి(ది) శబ్దములందలి యికారములకు నూఱు శబ్దము పర మగునపుడు డత్వ మగును. ఎనిమిది + నూఱు అనుచోఁ బూర్వసూత్రముచే దివర్ణము లోపించి ఎనిమి + నూఱు అని యుండఁగాఁ బ్రస్తుతసూత్రముచే

మి'వర్ణమునందలి యిత్వమున కత్వమై ఎనిమనూఱు అని యగును. 'హత్వరమ్యోర్నేరుట్' అను సూత్రము (అత్వర మి వర్ణము - మ - పరమైనది గావున) ని వర్ణమునందలి యిత్వమునకు కుత్వ మయి ఎనుమనూఱు అని యగును. ఇట ఎనమనూ అని ప్రసిద్ధము. ఇట్లే తొమ్మిది + నూఱు తొమ్మి + నూఱు అనుచో నత్వ మయి తొమ్మ నూఱు.

## 51. ద్విర్వా నో(వ): [1].

నో(వ): = నూఱు శబ్దమునందలి నకారమునకు, ది: = ద్విత్వము, వా = వికల్పముగా నగును.

వి. అత్సహిత మకారాత్ప రస్య నూవర్ణస్య ద్విత్వం వాస్యాత్. ఎనుమన్నూఱు, తొమ్మన్నూఱు, (ఎనుమనూఱు, తొమ్మనూఱు) ఇత్యాది.

'అదితః' అను సూత్రముచే వచ్చిన యత్వముతోఁగూడిన ఎనమ, తొమ్మ, అను శబ్దమునకుఁ బరముగానున్న నూఱు శబ్దమునందలి నకారమునకు ద్విత్వము వికల్పముగా నగును.

ఎనుమ + నూఱు అనుచో నీ సూత్రముచే ద్విత్వము రాఁగా ఎనమన్నూఱు. ఇట్లే తొమ్మ + నూఱు = తొమ్మన్నూఱు. వా యనుటచే ద్విత్వము రానిపక్షమునందు ఎనుమనూఱు, తొమ్మనూ అని యుండును.

## 52. నిత్యమినాభ్యామ్.

ఇనాభ్యామ్ = ఇ(రు) న(లు) అను వానికంటెఁ బరమైన, నోః = నూఱు శబ్దము నందలి నకారమునకు, ద్విః = ద్విత్వము, నిత్యమ్ = నిత్యముగా నగును. 'ద్విర్వానోః' అను పూర్వసూత్రమునుండి ద్విః, నోః అనునవి యిం దనువర్తించును.

వి. ఇవర్ణ నవర్ణాభ్యాం పరస్య ద్విత్వం నిత్యం స్యాత్. ఇన్నూఱు, నన్నూఱు.

ఇ(రు) న(లు) అను వర్ణములకుఁ బరముగా నున్న నూఱు శబ్దమునందలి నకారమునకు ద్విత్వము నిత్యముగా నగును.

---

1. ఇరునలోర్నూరౌనః. వై.చం.స.30

ఇరు నూఱు, నలు నూఱు అని యుండఁగా, లుగ్రుడులుదీనామ్ 'అను' సూత్రముచే రు లు వర్ణములు లోపింపఁగా ఇ + నూఱు, న+ నూఱు అని యుండఁగా ప్రస్తుత సూత్రముచే నూఱులోని నకారమునకు నిత్యముగా ద్విత్వము వచ్చి ఇన్నూఱు, నన్నూ అని యగును.

వి. హద్వీ పూర్వపరయోరిత్యనేన హ్రస్వద్విత్వే.

మున్నూఱు, మూనూఱు ఇతి న.

మూడు + నూ అని యుండఁగా 'లుగ్రుడులు దీనా' మ్మను సూత్రముచే డు వర్ణము లోపించి మూ + నూ అని యుండఁగా 'హద్వీపూర్వపరయో రహరహలి' యను సూత్రముచే మూ దీర్ఘమునకు హ్రస్వమును (మునూఱు) మీఁది నకారమునకు ద్విత్వమును రాఁగా మున్నూ అని యగును.

హ్రస్వద్విత్వములు రాని 'మూనూఱు' అను రూప ముండదు.

## 53. నాదేర్దీర్ఘాచః.

ఆదేః = మొదటి దగు, దీర్ఘాచః = దీర్ఘస్వరమునకు, న = హ్రస్వము లేదు.

వి. పదాదేర్దీర్ఘాచో హ్రస్వో న స్యా న్నూఱుశబ్దే పరే.

ఏనూఱు, ఆర్నూఱు.

నూఱు శబ్దము పరముగా నున్నపుడు ముందఱి శబ్దము మొదట నున్న దీర్ఘమునకు హ్రస్వము రాదు.

ఏనూఱు, ఆర్నూఱు; ఎనూఱు, అర్నూఱుఅని హ్రస్వము రాదు.

హ్రస్వమునకుఁ బ్రాప్తింగూర్చి పరిశీలింపవలెను.

## 54. డో ణః.[1]

డః = డకారమునకు, ణః = ణ కార మగును.

వి. డకారస్య ణ స్స్యాత్ ఉల్లోపః. ఏణూరు.

డకారమునకు ణకార మగును.

ఏడు + నూఱు అని యుండఁగా డకారమునకు ణకార మాదేశ మై ఏణు + నూఱు అని కాఁగా ణు వర్ణమునందలి యుత్వమునకు (ఇణష్ట్వార్ధలి) లోపమై ఏణ్నూఱు అని యగును.

1. క్వచిడ్ణోణః అ.కా.అ.90.

ఏణునూ అను రూపము లేదు. కావున డకారమునకుఁ గాక డు వర్ణము మొత్తమునకును ణకారము విధించి యున్న సుత్త్వలోప ప్రక్రియా గౌరవము తగ్గెడిది.

## 55. డునోర్ణః.

డునః = డు వర్ణమునకును దానికిఁ బైనున్న నకారమునకును, ర్ణః = ణకార మగును.

వి. సంఖ్యావాచి పదాన్తడువర్ణస్య తత్పర
నకారస్యచ ద్విత్వసహితణవర్ణక ఏకాదేశ
స్స్యాత్ రిత్వాద్ద్విత్వమ్ చ. రెణ్ణాళ్లు, మూణ్ణె
లలు, ఏణ్ణాలువలు, మూణ్ణేతిసిద్దెలు ఇత్యాది.

సంఖ్యావాచక మగు శబ్దము చివరనున్న డు వర్ణమునకును, దానికిఁ బర మైన శబ్దము మొదటినకారపుఁ బొల్లునకును రెండింటి (డున్) స్థానమున(ద్విత్వ)ణకారము వచ్చును. 'ర్ణః' అనుచో రేఫ మిత్తు 'ర్వితోద్విత్' అను(ప్రాకృతవ్యాకరణ) లక్షణమును బట్టి రి త్తయినది ద్విరుక్తముగా వచ్చును. ఇచట ణకారము రిత్తుగాఁ జెప్పుటనే నది ద్విరుక్త మయి వచ్చును (రితోద్విత్వమ్.వై.చం.సం.15)

మూడు + నెలలు అనుచో 'డున్' అనుదానికి ద్విరుక్తణకారము రాగా మూణ్ణ్ + ఎలలు = మూణ్ణెలలు అని యగును. ఇట్లితరము లూహ్యములు. రెండు నెలలు అనుచో బిందులోపము.

రెణ్ణెలలు, మూణ్ణేతిసిద్దె లనురీతివానికిఁ గావ్యప్రయోగ ప్రామాణ్యము మృగ్యమై యున్నది.

## 56. కిం చ అధర్వణభారతే.

వి. పదిదినము లైదు ప్రొద్దులు
పదపడి రెణ్ణాళ్ల నొక్కపగలున్ రేయున్
కదనంబు సేసి మడిసిరి
నదిసుత గురు కర్ణ శల్య నాగపురీశుల్.
ఇతి ప్రయోగః – – మానత్వాత్.

అధర్వణుని భారతము నందుఁ బైపద్యమున రెణ్ణాళ్ల ప్రయోగించుటయే 'డున్' కు ద్విరుక్తణకారమగు ననుటకుఁ బ్రమాణము. రెండు + వాళ్ళు = రెణ్ణాళ్ల అని యిందుఁ బ్రయుక్త మయినది.

ఈ పద్యము నేఁడు నన్నయభారతమునఁ గానవచ్చు. అది య ట్లుండఁగా ప్రౌఢవ్యాకర్త డకారమునకు మాత్రమె నకారమును విధించి రెన్నాళ్లు అని సాధించెను. పయిపద్యమునను రెన్నాళ్లు, అనియె కానవచ్చును. వ్యవహారమున మాత్రము రెణ్ణాళ్లు, మూణ్ణెల్లు మూణ్ణాళ్లే ముచ్చట మొదలుగా ణకారము గలదు. రాముణ్ణి, మొ॥.

## ఇతి సంఖ్యావాచక ప్రకరణమ్

# అథ అనుస్వార ప్రకరణమ్

## 1. ణ ల లిభ్య స్సిద్ధ సాధ్యౌ క్యవిభక్తౌ.

కి అవిభక్తౌ = విభక్తికి సంబంధించినది కానట్టి క కారము పర మగుచుండగా, ణలలిభ్యః = ణ, ల, లి అనునక్షరములకు బిదప, సిద్ధసాధ్యౌ = పూర్ణబిందువును ఖండబిందువు నుండును.

వి. ణ ల లిభ్యం పరత స్సిద్ధ స్సాధ్యావను స్వారౌ స్తః.
క్రియాపదయోరవిభక్తౌ కకారే పరే-
అణఁకువ, అణంకువ, అణఁక, అణంక,
కలఁక, కలంక, కలిఁకెడు కలింకెడు? ఇత్యాది

విభక్తికి సంబంధించినది గాని కకారము పరముగా నున్నపుడు ధాతువునకుఁ జెందిన ణ, ల, లి అను నక్షరములకుఁ దరువాత సిద్ధసాధ్య బిందువులు రెండు నుండును. సిద్ధ మనఁగాఁ బూర్ణము సాధ్యమనఁగా ఖండము.

ణ వర్ణముపై - అణఁకువ, అణంకువ
ల వర్ణముపై - కలఁక, కలంక
లి వర్ణముపై - కలిఁకెడు, కలింకెడు?

అనుస్వారమును గూర్చిన యీ విధానములు సమగ్రములు గావు. అతివ్యాప్త్యాది దోషములకు దూరము గాకున్నవి.కలఁక యనుచో ననుస్వార మున్నది. కాని అలక యిత్యాదుల లేదు. ఇటఁజూపఁబడిన కలిఁకెడు అను శబ్దము గానరాదు.

## 2.ఏశ్చ

కి = కకారము పరముగా నున్నపుడు, ఏః చ = ఇకారముకంటెఁ బరముగాఁ గూడ సిద్ధసాధ్యబిందువు లుండును.

వి. ఇకారాచః పరతస్సిద్ధసాధ్యౌ స్తః కకారే పరే.
ఇఁక, ఇంక.

కకారము పరముగా నున్నపుడు ఇకారమునకుఁ బైని సిద్ధ(పూర్ణ) సాధ్య(ఖండ) బిందువు లుండును. సిద్ధబిందువు - ఇంక, సాధ్యబిందువు - ఇఁక, చీఁకటి, పీఁక.

ఇత్యాదుల నరసున్న యున్నది సిక, ఇత్యాదుల లేదు.

## 3. లుగ్ఘలస్సిద్ధస్య.

హలః = హల్లునకుఁ బరముగా నున్న, సిద్ధస్య = పూర్ణబిందువునకు, లుక్ = లోప మగును.

వి. హలః పరస్య సిద్ధస్య లుక్ స్యాత్.

హల్లుకంటెఁ బరముగా నున్న సిద్ధ(పూర్ణ) బిందువునకు లోప మగును.

ఇచట తరువాత వివృతియందు కినుక, కిన్క యనురీతిని గలదు. కాని కినుకలో సున్నలేదు.

అనుస్వారమునకుఁ బూర్వ మున్న స్వరము లోపింపఁగా హల్లునకుఁ బైనున్న యా బిందువు లోపించునని చెప్పవచ్చును, కనుంగవ యనుచో నుత్వలోపము గల్గి కన్ంగవ అని కాఁగా నిపు డనుస్వారము హల్లునకుఁ బర మైనది గావునఁ బ్రస్తుత సూత్రముచే లోపించి కన్గవ యని యగును. పాఁ(తి పార్తి మొ॥ ఇట్లు కండానుస్వారమె య్యైనను బొల్లుపై నుండదు.

వి. కినుక- ఉకారలోపే- కిన్క.

కినుక యను శబ్దమునం దుత్వము (ఉక్తానాంచసంధి) లోపింపఁగా కిన్క యని యగును.

## 4. (ణణినవిరలే భ్యశ్చగే)[1].

గే = గకారము పర మగుచుండఁగా, ణణి నని రలభ్యః చ = ణ, ణి, న, ని, ర, ల అను వర్ణములకంటెఁ బరముగా సిద్ధసాధ్యబిందువు లుండును.

వి. ఏభ్యః పరతస్సిద్ధసాధ్యావనుస్వారౌ స్తః
క్రియా పదయోర్గ కారేపరే.
తొణఁగె - తొణంగె, కణఁగి - కణంగి, ముణిఁగి - ముణింగి,
పెనఁగి - పెనంగి, మునిఁగి - మునింగి, ఒరఁగి - ఒరంగి, కరఁగి- కరంగి, చెలఁగి - చెలంగి, తెఱఁగు - తెఱంగు.

---

1. కుండలీ కరణమునం దున్నంతమేర సూత్రవృత్తులు వ్రాఁత ప్రతిలో లేవు. పూర్వోత్తరసందర్భములను బట్టి యి ట్లూహింపఁదగును.

గకారము పర మగుచుండఁగా ధాతువులకు సంబంధించిన 'ణణ నని రల' యను వర్ణములకుఁ బైని సిద్ధ (పూర్ణ) సాధ్య(ఖండ) బిందువు లుండును.

ణ వర్ణముపై బిందువులు - తొణఁగె - తొణంగె, కణఁగి - కణంగి.
ణి వర్ణముపై- మునిఁగి - మునింగి.
ముడుగు? (ముడిగి) యను ధాతువున బిందువు లేదు?
న వర్ణముపై బిందువునకు - పెనఁగి - పెనంగి.
ని వర్ణముపై బిందువునకు - మునిఁగి - మునింగి-
ర వర్ణముపై బిందువు - ఒరఁగి - ఒరంగి, కరఁగి - కరంగి,
అలఘురేఫమునకు రే ఫభేదమె.
ఱ వర్ణముపై - తెఱఁగు - తెఱంగు
ల వర్ణముపై బిందువునకు - చెలఁగి - చెలంగి.

## 5. ణణి రలేభ్యశ్చే.

చే = చకారము పరముగా నుండఁగా, ణణి రలేభ్యః = ణణి రల యనువానికిఁ బరముగా సిద్ధ సాధ్య బిందువు లుండును.

వి. ఏభ్యః పరస్తౌస్త శ్చకారే పరే.

అణఁచె - అణంచె, ముణిఁచె - ముణించె.

కరఁచె - కరంచె, కలఁచె - కలంచె ఇత్యాది.

చకారము పరముగా నుండఁగా ధాతువు తుది 'ణణి రల' యనువానికిఁ బైని ఖండ పూర్ణానుస్వారములు రెండు నుండును.

ణ వర్ణముపై- బిందువులు - అణఁచె - అణంచె.
ణి వర్ణముపై - ముణిఁచె - ముణించె.
ర వర్ణముపై - కరఁచె - కరంచె .
ల వర్ణముపై - కలఁచె - కలంచె.

ఇందు అణఁచు, ముణుఁచు, కలఁచు అన్నవి ప్రేరణార్థకములు.

## 6. టి నని లేభ్యః.

టి = టకారము పర మగుచుండఁగా, ననిలేభ్యః = న, ని, ల వర్ణములకుఁబైని సిద్ధ సాధ్యబిందువులు రెండు నుండును.

వి. ఏభ్యః పరతష్టకారే పరే తౌ స్తః.
చెనఁటి–చెనంటి, కొనఁటు – కొనంటు
అనఁటే – అనంటే, గెనిఁటి – గెనింటి.
ఇల్లఁటము – ఇల్లంటము ఇత్యాది.

టకారము పరముగా నున్నపుడు న, ని, ల అను వర్ణములపై ఖండ పూర్ణబిందువులు రెండు నుండును. న వర్ణముపై బిందువులకు – చెనఁటి – చెనంటి మొ॥

ని వర్ణముపై బిందువులకు – గెనిఁటి – గెనింటి

ల వర్ణముపై బిందువులకు – ఇల్లఁటము – ఇల్లంటము.

ఇందలి పూర్వావయవము ధాతుసంబంధి గాదు. కొనఁటు, గెనిఁటి, విచార్యములు.

## 7. ణణినరల లిభ్యోతి.

తి = తకారము పర మగునపుడు, ణణినరలలిభ్యః = ణ, ణి న, ర ల లి అను వర్ణములకుఁ బైని సిద్ధసాధ్య బిందువు లుండును.

వి. ఏభ్యః పరతస్తకారే పరే తౌ స్తః. పణఁతి – పణంతి,
కణిఁతి – కణింతి, వినఁతి – వినంతి, కొఱఁత – కొఱంత,
పాలఁతి – పాలంతి, మెలఁత – మెలంత, బాలిఁత – బాలింత,
చూలిఁత – చూలింత.

తకారము పరముగా నున్నపుడు ణ,ణి,న,ర,ల,లి, అను నక్షరములకుఁ బైని ఖండ పూర్ణబిందువులు రెండు నుండును.
ణ వర్ణముపై బిందువులకు – పణఁతి – పణంతి.
ణి వర్ణముపై బిందువులకు – కణిఁతి – కణింతి.
న వర్ణముపై బిందువులకు – వినఁతి – వినంతి?
ర వర్ణముపై బిందువులకు – కొఱఁత – కొఱంత.
ల వర్ణముపై బిందువులకు – పాలఁతి – పాలంతి.
లి వర్ణముపై బిందువులకు – బాలిఁత – బాలింత.

బాలింత, మూలింత యను శబ్దములలో నజఉసున్నలు బాలిఁత, మూలిఁత యను రీతిరూపములు గానరావు. వినతి శబ్దమున నే సున్న యును లేదు.

## 8. ణినిలడేభ్యోది.

ది = దకారము పర మగుచుండఁగా, ణి నిలడేభ్యః = ణి, ని, ల, డ, యనువానికిఁ బరముగా సిద్ధసాధ్య బిందువు లుండును.

వి. ఏభ్యః పరతో దకారే పరే తౌ స్తః. కణిఁది – కణింది, కనిఁదె – కనిందె, వెలఁది – వెలంది, కొలఁది– కొలంది, ఎడఁద – ఎడంద.

దకారము పర మగునపుడు ణి, ని, ల, డ వర్ణములకుఁ బరముగా ఖండ పూర్ణబిందువులు రెండు నుండును.

ణి వర్ణముపై బిందువులకు – కణిఁది– కణింది (కడిఁది)
ని వర్ణముపై బిందువులకు – కనిఁదె – కనిందె?
ల వర్ణముపై బిందువులకు – వెలఁది – వెలంది.
డ వర్ణముపై బిందువులకు – ఎడఁద – ఎడంద.

## 9. ప్రిలాత్.

పి = పకారము పర మగుచుండఁగా, లాత్ = లవర్ణముపై సిద్ధ సాధ్య బిందువు లుండును.

వి. లకారత్పరతో) తౌస్తః. పకారే పరే – తలఁపు – తలంపు.

పకారము పరముగా నుండగా ల వర్ణముపై ఖండ పూర్ణబిందువు లుండును. తలఁపు– తలంపు.

## 10. ఆదీదూదేత్కాకూగీ గోచీ తాతూతోదే
## పాపీపోరోవావీవేసో సాభ్య స్సాధ్యః కి.

కి = కకారము పర మగు చుండఁగా, ఆదీ – – సాధ్యః = అ, ఈ, ఊ, ఏ, కా, కూ, గీ, గో,చీ, తా, తూ, తో, దే, పా, పీ, పో, రో, వా, వీ, వే, సో, సా యను నక్షరములకుఁ బరముగా సాధ్య (ఖండ) బిందు వుండును.

వి. తజ్జ దేశ్య దీర్ఘాచ్ప్రాచ్చ్యరేభ్యఏభ్యః పరతః కకారే
పరే అర్ధానుస్వారస్స్యాత్.
ఆఁకలి, ఈఁక, ఊఁకొనె, ఏఁకాఁటి, కాఁక,
కూఁకటి, గీఁకె, గోఁకె, చీకఁటి, తాఁకె, తూఁక
తోఁక, దేఁకె, పాఁకనాఁడు, పీఁక, పోఁక, రోఁకలి,
వాఁక, వీఁక, వేఁకటి, వేఁకువ, సోఁకుడు, సాఁకె
ఇత్యాది.

తద్భవములు దేశ్యములు నైన దీర్ఘాచ్చులు నేకాక్షరములు నైన ఆ ఈ మొదలగు పూర్వోక్తము లగు నక్షరములపై కకారము పర మగునపు డఱసున్న యుండును. ఉదాహరణములు క్రమముఁగా వివృతి యందు గమనింపఁదగును.

## 11. నపర్ణహిత నిర్మలీక(గ)రణ గత్యాదీనామ్.

పర్ణహిత నిర్మలీ క(గ)రణ గత్యాదీనామ్ = పర్ణము , హితము, నిర్మలీకరణము, గతి - యను నర్థమునందలి శబ్దములలో కకారము పర మైనను, న = సాధ్యబిందువు నుండదు.

వి. తేషాం సాధ్యోఽపి న స్యాత్. ఆకు, ఈకు, ఏకు,
పోకు ఇత్యాది.

పర్ణాద్యర్థకము లగు శబ్దములలో కకారము పర మైనను ఆ ఈ మొదలగు వానిపైఁ బూర్వసూత్రానుసారముగా నుండఁదగిన యఱసున్న యునుండదు.

పర్ణము - ఆకు, హితము - ఈకు,

నిర్మలీకరణము - ఏకు, గతి - పోకు.

హితార్థకముగా ఈకు శబ్దము విశేషము.

## 12. ఆదీదూదే దోత్కాకౌ చేతా తీతూ తేతో దా
## పాపో వీవే వాభ్యోఃగి.

గి = గకారము పర మగుచుండఁగా, ఆదీత్ - - వాభ్యః = ఆ, ఈ, ఊ, ఏ, ఓ, కో, కౌ, చే, తా, తీ, తూ, తే, తో, దా, పా, పో, వీ, వే, వా, యను నక్షరములకుఁ బైని సాధ్యబిందు వుండును.

వి. తత్పరేభ్య ఏభ్యః పరత స్సాధ్య స్స్యాద్గకారే పరే.

అ,ఈ,ఏ, మొదలగు పూర్వోక్తము లగువానిపై గకారము పరముగా నున్నపుడు ఖండబిందువుండును.

వి. ఆఁగె, (ఈఁగె) ఊఁగె, ఏఁగె, ఓఁగె, కాఁగి, కౌఁగిలి,

చేఁగ , తాఁగె, తీఁగె, తూఁగె, తేఁగ, తోఁగె, దాఁగె,

దోఁగె, పాఁగు, పోఁగు, వీఁగె, వేఁగె, వాఁగె ఇత్యాది.

ఆఁగు మొదలుగాఁ గ్రమముగా ఆ మొదలగువానిపై నఱసున్న యున్నందులకు నుదాహరణములు స్పష్టములు.

13.న పానోష్ణీష మందురా ఖలీన చారతాదీనామ్.

పాన, ఉష్ణీష, మందురా, ఖలీన, చారత, ఆదీనామ్ = పానము, ఉష్ణీషము, మందుర, ఖలీనము, చారత్వము అను నర్థములం దున్న శబ్దములలో, న= పూర్వసూత్రోక్త మగు ఖండబిందు వుండదు.

వి. తాగెన్, పాగ, పాగా, పాగె వేగు ఇత్యాది.

పానము (త్రాగుట) ఉష్ణీషము (తలపాగ, పాగా) మందురము (పాగె) చారత్వము (వేగు) అను నర్థములం దున్న శబ్దములలో తా, పా, వే యక్షరములకు గకారము పరముగా నుండఁగాఁ బూర్వసూత్రముచే నుండఁదగిన యఱసున్న యుండ దని భావము.
తాగె, పాగా మొ॥

పానార్థక మగు ధాతువు 'త్రాగు' అని కావ్యప్రసిద్ధము. తాగు అనురీతిగా రేఫరహితముగా లోకవ్యవహారమునఁ గలదు.

14. ఆదీదూదేత్కాగీ గోచాతాతూ తేతో దాదో
పాపీరేవీ వేవాభ్యశ్చ.

చి = చకారము పర మగుచుండఁగా, ఆదీత్--- వాభ్యః = అ, ఈ, ఊ, ఏ, కా, గీ, గో, చా, తా, తూ, తే, తో, దా, దో, పా, పీ, రే, వీ, వే, వా యను నక్షరములకుఁ బరముగా సాధ్యబిందు వుండును.

వి. తత్పరేభ్య ఏభ్యః పరతస్సాధ్యస్యాచ్చకారే పరే.

చకారము పరముగా నున్నపుడు ఆ, ఈ, ఊ మొదలగు పూర్వోక్తము లగు నక్షరములకుఁ బైని ఖండబిందు వుండును. ఉదాహరణములు వివృతి యందు స్పష్టములు.

వి. ఆఁచె, ఈఁచె, ఊఁచె, ఏఁచె, (కాఁచు) కాఁచె, గీఁచె,
గోఁచి, చాఁచె, తాఁచె, తూఁచె, తేఁచె , తోఁచె,
దాఁచె, దోఁచె, పాఁచి, పీఁచు, రేఁచె,
వీఁచె, వేచె, వాఁచె ఇత్యాది.

చకారము పర మగుచుండఁగా ఆకారముపై నఖసున్న యున్నందులకు ఆఁచె- ఉదాహరణము. ఇట్లితరము లూహ్యములు. ఆఁచు (ఆఁగు) ఊఁచు (ఊఁగు) మొదలుగా నిందు ప్రేరణార్థకరూపములును గలవు.

## 15. నరక్షాకరణ ఫలీకరణ (శింబీవరణ సస్యవ ర్ధనవా) యు? రాదీనామ్.

రక్షాకరణ, ఫలీకరణ, కరణ సస్యవర్ధన ఆయుదాదీనామ్ = రక్షించు, ఫలించు --

అను నర్థములందు, న = అరసున్న యుండదు.

వి. రాజు గాచెన్ - చెట్టుగాచెన్, పాచిత్రావెన్, వాచెన్, వానిని చెక్కెన్.

రాజు కాచెన్ అనుచో రక్షించు అను నర్థమున చకారము పరముగా నుండఁగా 'కా' వర్ణము పైని బూర్వసూత్రముచే నఖసున్న యుండఁదగియున్నను నీసూత్రముచే లేదు.

చెట్టుగాచెన్ అను చో ఫలించు అనునర్థమున కాచులో నఖసున్న లేదు. కాని యిట ధాతువు కాయు, చెట్టు కాసెన్ అని యుండును.

పాచి - ప్రాఁతది యను నర్థమున నరసున్న లేక మిగిలిన వాని యర్థములు పరిశీలనార్హములు.

## 16. ఉదోత్కా గోపా బూరో రాభ్యో జి.

వి. పూర్వవత్ జకారే పరే.

జ = జకా రము పర మగుచుండఁగా, ఉదోత్కా--రాభ్యః = ఊ, ఏ, కొ, గో, పా, బూ, రో, రా యను వర్ణములపై నఖసున్న యుండును.

వి. ఊఁజెలు, ఓఁజెలు, ఓఁజె, కౌఁజు, గోఁజు,
పౌఁజు, బూఁజు, రోఁజు, రాఁజె ఇత్యాది.

జకారము పరముగా నున్నపుడు ఊ ఓ కౌ గో పౌ బూ రో రా యను వర్ణములకుఁ బై నఱసున్న యుండును.

ఊఁజెలు మొ॥ ఊఁజెలు, ఓఁజెలు, ఓఁజె, యన్నవి పరిశీలనార్హములు.

## 17. న కాచ తురగాదీనామ్.

కాచ తురగాదీనామ్ = గాజు, వాహనము మొదలగు నర్థములందు, న = పూర్వసూత్రముచే నుండఁదగిన యఱసున్న యుండదు.

వి. గాజు, తేజీ ఇత్యాది.

గాజు(కాచము) అను శబ్దమున జకారము పర మైనను (వాహనము, గుఱ్ఱము) అను శబ్దమునను తే వర్ణముపై నఱసున్న లేదు.

## 18. ఆదీదూతా్కాగీ గూతాతీతూతేతో దోపీ పూపైవే దాభ్యష్టి.

టి = టకారము పర మగుచుండఁగా, ఆత్ -- దాభ్యః = ఆ, ఈ, ఊ, కా, గీ, గూ, తా, తీ, తూ, తే, తో, దో, పీ, పూ, పై, వే, దా - అను వర్ణములకుఁ బైని అఱసున్న యుండును. వివృతియం దుదాహరణములు క్రమముగా గమనింపఁ దగును.

వి. పూర్వవత్ టకారపరే -
ఆఁటివచ్చె, ఈఁటె, ఊఁటు, కాఁట, గీఁటు, గూఁటము,
తాఁట, తీఁట, తూఁటు , తేఁటి, తోఁట
దోఁటి, పీఁట, పూఁట, పైఁట, (వేఁటు) దాఁటు ఇత్యాది.

ఆఁటి యనుచో టకారము పర మగు చుండఁగా 'ఆ' కారముపై నఱసున్న. ఇట్లితరము లూహ్యములు.

## 19. నలాస్యాంజన నిర్మల ప్రహారోపాయాదీనామ్.

లాస్యాంజన-- = లాస్యము, అంజనము, నిర్మలము, ప్రహారము, ఉపాయము మొద లగు నర్థములందు, న= పూర్వసూత్రమునఁ బ్రస్తావింపఁబడిన యఱసున్న యుండదు.

వి. ఆట, కాటుక, పాట, తేట, మాట, వేటు, వాటు
ఇత్యాది.

ఆట(లాస్యము) కాటుక(అంజనము) తేట(నిర్మలము) వేటు, వాటు (ప్రహారము) పాట (విధము - ఉపాయము) ఆ, కా, తే, వే, వా, పా వర్ణములకు టకారము పర మైన నీ శబ్దములం దఱసున్న లేదు.

20. ఆదేత్కాకో కూచూతోపాపూ పేవేలోవా
వీవేసాభ్యోడి.

డి = డకారము పర మగుచుండఁగా, ఆత్--సాభ్యః = ఆ, ఏ, కా, కో, కూ, చూ, తో, పా, పూ, పే, వే, లో, వా, వీ, వే, సా అను నక్షరములకుఁ బైని సాధ్యబిందు వుండును.

ఉదాహరణములుః-

వి. పూర్వవత్ డకారే పరే. ఆఁడి, ఏఁడు, కాఁడు, కోఁడి, కూఁడు,
చూఁడు,తోఁడేలు, పాఁడి, పూఁడు, పేఁడె, పేఁడ,
వేఁడి, లోఁడ, వాఁడే, వీఁడు, లేఁడె, సాఁడు ఇత్యాది.

డకారము పర మగుచుండఁగా ఆకారము పైని నఱసున్న కలదు. ఇ ట్లితరములు. వీఁడు = పట్టణము.

21. న నర్తనభావ, సప్తసంఖ్యా, పితృవన, కుక్కుట,
ఖట్వాచరణ, సహాయ ఁ, మహోక్ష తృతీయా,
శూన్యా, సంధి దార్వల్ప ఖండ కుటకవరణ
ఛాయా విధి విట స్వభ్యాస పురవిసర్జనోత్స
వాదీనామ్.

నర్తనభావము మొదలగు నర్థములందుఁ బూర్వసూత్రముచే నుండఁదగిన యఱసున్న యుండదు.

ఉదాహరణములుః-

వి. ఆడుట, ఏడు, కాడు, కోడి, కోడు, తోడు,
కోడె, తోడ, పాడు, పేడు, పేడి
వాడి, వీడెము, వాడుక, వీడు, వీడెన్, వేడుక.

ఆడుట(నర్తనభావము) ఏడు(సప్తసంఖ్య) కాడు (పితృవనము.స్మశానము) కోడి(కుక్కుటము) కోడు(ఖల్వాచరణము = మంచపుగాలు) తోడు(సహాయము) కోడె(మహోక్షము = ఎద్దు) తోడ(తృతీయావిభక్తి) పాడు(శూన్యదేశము పాడువడు. మొ॥) పేడు(సంధిదారువు, కలుపువట చెక్కముక్క) పేడి(కటకవరణము = ?) వాడి(ఛాయావిధి వాడిపోవు) వీడెము (వీటికా).

వాడుక(స్వభ్యాసము = మంచి అలవాటు)  వీడు (పురము.) వీడెన్(విసర్జించెను. విడిచెను) వేడుక (ఉత్సవము)

కోఁడిలో నఅసున్న యింతకు ముందు చూపఁబడినది. అట్టిశబ్దము గానరాదు.

## 22. ఆత్కాగోజో వీవాభ్యో ణీ.

ణకారమునకుఁ బూర్వమునందు స్థితి లేదు. పూర్వము ప్రస్తావింపఁబడను లేదు. కావున నిచట ణీ వర్ణము విధింపఁబడిన యూహింప నగును.

ఆత్ కా గో జో వీ వాభ్యః = ఆ, కా, గొ, జో, వీ, వా, వర్ణములకుఁ బైని, ణీ = ణీవర్ణ మగును?

వి. స్పష్టమ్. ఆణీ, కాణీ, గొణము, జొణగి, వీణీ, వాణీ ఇత్యాది.

ఆడి, కాడి ఇత్యాదిగా నిచట డి వర్ణ ముండును. ణీ కూడ నగు నని యభిప్రాయ మేమో.

ణకారము పరమై నపుడు ఆకారాదులపై ఖండానుస్వార ముండ దని ప్రకరణానుగుణముగఁ జెప్ప వలసి యున్నది. కాని పూర్వము ణకారమునకుఁ బూర్వము ఖండబిందువు పేర్కొన బడకుండగనే నిషేధించుట కుదురదు. అట్లు గాక ఖండబిందువుండు నని చెప్పుట ప్రయోగానుగుణమును గాదు.

## 23. ఆదీదూ(దేదో)త్కూకో గీగోచేజాజో పాపూపోబా రోవేలోవాభ్యస్తి.

తి = తకారము పర మగుచుండఁగా, ఆత్ ---- వాభ్యః = ఆ, ఈ, ఊ (ఏఓ) కూకో గీ గో చే జా జో పా పూ పో బా రో వే లో వా యను నక్షరములకంటెఁ బైని సాధ్యబిందు వుండును.

ఉదాహరణములుః-

వి. పూర్వవత్. ఆఁత, ఈఁత, ఊఁత (ఎడము) కూఁత, కూఁతురు, కోఁత, గీఁత, గోఁతము, చేఁత ,జాఁతర జోఁత, పాఁత, పూఁత, పోఁత, బాఁతి, రోఁత వేఁత, లోఁతు, వాఁత, ఇత్యాది.

ఆఁతః = తకారము పర మగుచుండఁగా ఆకారముపై నఱసున్న యున్నది. ఇట్లితరము లూహ్యములు.

ఏ ఓ లపై (తపరకతలో) నఱసున్న లున్న రూపములు లేవు. (వివృతియం దుదాహృతులును లేవు) సూత్రమునం దే దోత్తలు ప్రమాద పతితము లై యుండును.

## 24. న శైలూషనర్తనాతృతీయామహిషాదీనామ్.

శైలూష-- = శైలూషుని నర్తనము, తృతీయావిభక్తి మహిషము, మొద లగు నర్థములందు, న = అరసున్న యుండదు.

వి. (గీతి)? చేత, పోతు; బాతు, బూతు ఇత్యాది.

గీతి (శైలూషనర్తనము?) చేత(తృతీయావిభక్తి)పోతు (మహిషము) బాతు (బూతు) అను శబ్దములలో నఱసున్న లేదు.

## 25. ఈదేద్గోచాచీ చేచో బోబాభ్యోది.

వి. స్పష్టమ్.

ది = దకారము పర మగు చుండఁగా, ఈఁట్-బాభ్యః = ఈ, ఏ, గో, చా, చీ, చే, చో, బో, బా యను వర్ణములకుఁ బైని సాధ్యబిందు వనఁగా నఱసున్న యుండను,

ఉదాహరణములుః-

వి. ఈఁద, ఏఁదు, గోఁద, చాఁదర, చీఁదర, చేఁదు, చోఁధ, బోఁద, బాఁదె ఇత్యాది.

ఈఁద = దకారము పర మగుచుండఁగా 'ఈ' కారముకంటెఁ బరముగా నఱసున్న యున్నది. ఇట్లితరము లూహ్యములు.

## 26. నగృహశివాయః.

గృహశివాయాః = ఇంటిదూల మనునర్థమున, న = పూర్వసూత్రముచే నుండఁదగిన ఖండబిందు వుండదు.

వి. బోదె- అధస్తాద్దార్వీత్యర్థః.

ఇంటఁ గ్రిందిదూల మను నర్థమునం దున్న బోదె శబ్దమున దకారము పరమై యున్నను బో వర్ణముపై నఖసున్నలేదు.

## 27. కాచాచీ చేతేతోదాదో బావీభ్యః పి.

వి. స్పష్టమ్.

పి = పకారము పరముగా నున్నపుడు, కా -వీభ్యః = కా, చా, చీ, చే, తే, తో, దా, దో, బా, వీ యను వానికంటెఁ బరముగా నఖసున్న యుండును.

వి. కాఁపు, కాఁపురము, చాఁపు, చీఁపు, చేఁప, తేఁపు,
తోఁపు, దాఁపురము, దోఁపడము, బాఁపడము,
వీఁపు ఇత్యాది.

కాఁపు అనుచో పకారము పరముగా నుండఁగా కావర్ణము పై నఖసున్న యున్నది. ఇట్లితరము లూహింపఁదగును.

## 28. నఫలన (మయ) కిళింజకదృష్టి నికటాశ్రయోభి మాన శలాటు బాలికా శునకాదీనామ్.

ఫలన --- శునకాదీనామ్ = ఫలనము మొదలగు నర్థములందుఁ బూర్వ సూత్రముచే నుండఁదగిన యఖసున్న, న = ఉండదు.

వి. కాపు, చాప, చూపు, దాపు, ప్రాపు, పూప, పాప,
వేపి, ఇత్యాదయః.

కాపు (ఫలనము) చాప(కిళింజకము)? చూపు (దృష్టి) దాపు (నికటము) ప్రాపు (ఆశ్రయము) పూప (అభిమానము, శలాటువు) పాప (బాలిక) వేపి (శునకము).

ఆయా యర్థములం దున్న పై శబ్దములందు కాప్రభృతులపై నఖసున్న లేదు.

ఈ ప్రకరణము వలనఁ బ్రయోజనము నెన్నుట కష్టము. అఖసున్న, నిండుసున్న యున్న పదములపట్టిక నిచ్చిన నింతకంటెఁ బ్రయోజన మంత మై యుండెడి దనిపించు.

# రేఫ(సంయుక్త) ప్రకరణమ్.

## అథరేఫాః

ఇఁక రేఫసంయుక్తముల విషయము వివరింపఁబడుచున్నది.

## 1. రస్తు-

సాధురేఫము.

1. గసో రాపూర్వకస్య కోరః.

గసోః = గకారము లేదా సకారము పరముగా నున్నపుడు, ఆపూర్వకస్య = పైని 'ఆ' కార మున్నచోట, కః = కకారముపై, రః = రేఫ ముండును.

వి. గకార సకారయోః పరయో రాకారాత్పూర్వస్య
రేఫస్స్యాత్. క్రాగి, క్రాసి ఇత్యాది.

గకారము లేదా సకారము పరముగా నుండఁగా ఆకారము తరువాతనున్నప్పుడు (ఆగ్) ఆస్-అన్నవి పైనున్నపుడు) దానికిఁ బూర్వమునం దున్న కకారముపై (క్ + ఆగ్, క్ + ఆస్) రేఫముండును. (క్ర్ఆగ్) క్రాగి - క్రాసి మొ॥

## 2. పరయోరేతశ్చ.

ఏతః పరయోః చ = ఏకారము పరముగాఁ గలిగిన చోట్లఁ గూడ రేఫ మగును.

వి. పరయోరేకారాత్పూర్వస్య కకారస్య రేఫస్స్యాత్.
క్రేపు, క్రేవ.

ఏకారము పరముగాఁ గలిగిన కకారముపైఁ గూడ రేఫము కలుగును.

క్ + ఏ - క్ర్ఏ- క్రే- క్రేపు- క్రేవ మొ॥

## 3. ల్యుతః.

లి = లకారము పర మగుచుండఁగా, ఉతః = ఉకారము పరముగా నున్న
కకారమునకును రేఫము గలుగును.

వి. ఉకారాత్పూర్వస్య కకారస్య రేఫస్స్యా ల్లకారే పరే.

క్రుల్లై.[1]

లకారము పరముగా నున్నట్టి ఉకారము పరముగాఁ గల కకారమునకుఁ బైని గూడ రేఫముండును. క్ + ఉ-ల్ క్ ర్ ఉ ల్. క్రుళ్ళు.

## 4. ఓతస్తపలయసేషు.

తపలయసేషు = త, ప, ల, య, సకారములు పరముగాఁ గల, ఓతః = ఓకారము పరముగా నున్నపుడు కకారమునకు రేఫ మగును.

వి. ఏషు పరేష్వోతః పూర్వ స్య కో రేఫ స్స్యాత్.
క్రోతి, క్రోపు, క్రోయ, క్రోలె, క్రోసె- ఇత్యాది.

తకారము, పకారము, లకారము, యకారము, సకారము పరముగా నున్నట్టి ఓకారమునకుఁ బూర్వమునం దున్న కకారముపైని గూడ రేఫ ముండు క్ + ఓ - త్. క్ ర్ ఓ త్ - క్రోఁతి. ఇట్లే వివృతి యం దితరోదాహృతు లూహింపఁదగు.

## 5. ద్వికమోరతః.

ద్వికమోః = రెండు కకారములు రెండు మకారములు (ద్విరుక్తకకార మకారములు) పరముగా నున్నట్టివి, అతః = అకారమునకుఁ బూర్వమునం దున్న కకారమునకు రేఫ మగును.

వి. ద్విత్వసహిత కకార మకార యోః పరయో రకారా
త్పూర్వస్య కకారస్య రేఫస్స్యాత్. క్రక్కె
క్రమ్మె ఇత్యాది.

ద్విరుక్త మగు కకారము లేదా ద్విరుక్త మగు మకారము పరముగా నున్న అకారమునకుఁ బూర్వమునందలి కకారము పైని రేఫ ముండును.

---

1. క్రూలె-అని వివృతియం దున్నది. కూలుశబ్దము గలదు గాని తెలుఁగున క్రూలు అనునది గానరాదు.

క్ - అక్క్ - కర్అక్క్ - క్రక్కు - క్రక్కె.
క్ + అమ్మ్ - క్ర్అమ్మ్ - క్రమ్ము - క్రమ్మె మొ॥.

## 6. కసోరితః.

కసోః = కకారమును సకారమును (ద్విరుక్తములై) పరముగా నున్న, ఇతః = ఇకారమునకు, బూర్వమునందలి కకారము పైని గూడ రేఫ మగును.

వి. పరయోర్ద్విక సకారయోః పూర్వస్య కోరేఫస్యాత్.

క్రిక్కిరిసె, క్రిస్సె.

ద్విరుక్త మగు కకారము లేదా ద్విరుక్త మగు సకారమును బరమయి యున్నట్టి ఇకారమునకు (బూర్వమునం దున్న కకారమునకుఁ బైని రేఫ ముండును.
క్ఇక్క్ - క్ర్ఇక్క్ -క్రిక్కి - క్రిక్కిరిసె.
క్ఇస్స్ - క్ర్ఇస్స్ - క్రిస్స్ క్రిస్సె = (కృశించె).

## 7. ఉతః కతమ లేషు.

కతమలేషు = క, త, మ, లకారములు పరముగాఁ గలిగిన, ఉతః = ఉకారమునకుఁ బూర్వమునం దున్న కకారముపై రేఫ ముండును.

వి. తేష్వేషు పరేషు ఉకారాత్పూర్వస్య కోరస్స్యాత్.

క్రుక్కె, క్రుత్తు, క్రుమ్ము, క్రుళ్లె.

(ద్విరుక్తములగు?) క, త, మ, లకారములు పరముగా నున్న ఉకారమునకుఁ బూర్వమునందలి కకారముపై రేఫ ముండును.
క-క్ఉక్క,-క్ర్ఉక్క్ - క్రుక్కి - క్రుక్కు.
త-క్ఉత్త్ - క్ర్ఉత్త్ - క్రుత్త్- క్రుత్తు.
మ - క్ఉమ్మ్ - క్ర్ఉమ్మ్ - క్రుమ్మ్ - క్రుమ్ము.
ల - క్ఉల్ - ల్ క్ర్ఉల్ల్ - క్రుల్ల్ - క్రుళ్లు.
క్రుత్తు అన్నది గానరాదు. (ఋతః రేఫ.3)

## 8. ఓతః కతమలేషు.

కతమలేషు = క, త, మ, లకారములు పరముగా నున్న, ఓతః = ఓకారమునకుఁ బూర్వమునం దున్న కకారమునకుఁ బైని రేఫ ముండును.

వి. తేష్వేషు పరేషు ఓకారాత్పూర్వస్య కోరస్స్యాత్.
క్రొక్కు, క్రొత్త, క్రొమ్మ క్రొవ్వు ఇత్యాది.

ద్విరుక్తములగు కతమలకారములు పరముగాఁ గలిగిన ఓకారమునకుఁ బూర్వమునం దున్న కకారముపై రేఫము.
క్-ఒ-క్క్- కర్ఒ క్క్- క్రొక్కు ఇ ట్లితరము లూహ్యములు.

'క్రొక్కు' కానరాదు. క్రొక్కారము. కోడికూఁత.

## 9. అదితో స్సిద్ధే దే.

సిద్ధే దే = సిద్ధబిందువు గల దకారము పరముగాఁ గలిగిన, అదితః = అకారమునకును, ఇకారమునకును బూర్వమునం దున్న కకారమునకు రేఫ మగును.

వి. పూర్ణానుస్వారసహితే దకారే పరే అకారేకార
యోః పూర్వస్య కోరస్స్యాత్. క్రందు (క్రిందు).

పూర్ణబిందువు పూర్వమునందుఁ గలదకారము(ంద్) పరముగాఁ గలిసిన అకారమునకును (అంద్) ఇకారమునకును (ఇంద్) పూర్వమునం దున్న కకారము (క్+, అంద్, క్+ఇ ంద్) పైని రేఫ మగును.
క్ + అందు- క్+ ర్ + అందు - క్రంచు.
క్ + ఇందు క్ + ర్ + ఇందు క్రిందు.

## 10. గదతోరుతః.

(సిద్ధే) గదతోః = పూర్ణబిందువుతోఁ గూడిన గకార దకారములు పరముగాఁ గల్గిన, ఉతః = ఉకారమునకుఁ బూర్వమునందలి కకారమునకు రేఫ మగును.

వి. బిందు సహితగరదయోః పరయోః రుతః పూర్వస్య కో
రస్స్యాత్ క్రుంగె, క్రుందె.

క్ + ఉంగ్ - క్ర్ఉంగ్- క్రుంగు-క్రుంగె
క్ + ఉంద్ - క్ర్ఉంద్ - క్రుందు - క్రుందె.
క్రుందు అన్నది గానరాదు.

## 11. ఓతః కగజేషు.

(సిద్ధే)కగజేషు = పూర్ణబిందుపూర్వకము అయిన కకారగకారజకారములు పరముగాఁగల్గిన, ఓతః = ఒకారమునకు బూర్వమునం దున్న కకారము పైని రేఫ మగును.

వి. తేష్వేషు పరేషు ఓతః పూర్వస్య కోరస్స్యాత్.

క్రొంకు, క్రొంగు, క్రొంజక ఇత్యాది.

పూర్ణబిందుపూర్వకము లగు కగజకారములు పరముగాఁ గలిగిన ఒకారమునకుఁ బూర్వమునం దున్న కకారమునకు రేఫ మగును.

క్ + ఒంక్ - క్ర్ ఒంకు- క్రొంకు.

క్ + ఒంగ్- క్ర్ + ఒంగు - క్రొంగు.

క్ + ఒంజ్ - క్ర్ + ఒంజ - క్రొంజక.

## 12. కటతపూర్వస్యేర్గోరః.

కటతపూర్వస్య = కటతకారములు పరముగాఁ గలిగిన (ఏః = ఈకారమునకుఁ బూర్వమునందున్న) గోః = గకారము పైని, రః = రేఫ మగును.

వి. ఈకారాత్పూర్వస్య (గోరః) గకారస్య రేఫస్స్యాత్

కటతేషు పరేషు. గ్రీటె గ్రీతె ఇత్యాది.

కటతకారములకుఁ బూర్వమునం దున్న ఈకారమునకుఁ బూర్వమునందుఁ గల గకారమునకుఁ బైని రేఫ మగును.

గ్ + ఈక్ - గ్ర్ ఈక్ - గ్రీక్ గ్రీకె

గ్ + ఈట్ - గ్ర్ ఈట్ - గ్రీట్ గ్రీటె

గ్ + ఈత్ - గ్ర్ ఈత్ - గ్రీత్ గ్రీతె.

ఈ రూపములు విచార్యములు. కనరావు.

## 13. కలో రోతః.

కలోః = కకార లకారములకుఁ బూర్వమునం దున్న, ఓతః = ఓకారమునకుఁ బూర్వమునం దున్న గకారముపైని రేఫ మగును.

వి. ఓతః పూర్వస్య గోరస్స్యాత్కలోః పరయోః

గ్రోకె గ్రోలె.

కకార లకారములు పరముగాఁ గల్గిన ఓకారముకంటెఁ బూర్వమునం దున్న గకారమునకుఁ బైని రేఫ మగును.

గ్ + ఓక్ - గ్ర్ఓక్ - గ్రోక్- గ్రోకె.

గ్ + ఓల్- గ్ర్ఓల్- గ్రోల్ - గ్రోలె.

గ్రోకె నన్నది లేదు. గ్రోలె ననుచో క్రోలె ననురీతి నిది పరుషాది.

## 14. ద్విచత దేష్వతః.

ద్విచతదేషు = ద్విరుక్త మగు చకారతకార దకారములు పరముగా నున్న, అతః = హ్రస్వ మగు అకారమునకుఁ బూర్వమునం దున్న గకారము పైని రేఫ మగును.

వి. ద్విత్వసహిత చకార తకార దకారేషు పరేష్వ కారాత్పూర్వస్య గోరస్స్యాత్. గ్రచ్చర గ్రత్తము గ్రద్ద ఇత్యాది.

ద్విరుక్త మగు, చకార తకార దకారములు పరముగా నున్న అకారమునకుఁ బూర్వమునం దున్న గకారముపై రేఫ మగును.

గ్ - అచ్చ్ - గ్ర్ అచ్చ్ - గ్రచ్చర.

గ్- అత్త్ - గ్ర్ అత్త్ - గ్రత్తము.

గ్ - అద్ద్ - గర్ అద్ద్ - గ్రద్ద.

గ్రత్తము శబ్దము గానరాదు.

## 15. కచతేషూతః.

కచతేషు = ద్విరుక్త మగు కకార చకార తకారములు పరముగా గల, ఉతః = హ్రస్వమగు ఉకారమునకుఁ బూర్వమునందున్న గకారమునకు రేఫ మగును.

వి. తత్కచదేషు పరేషు ఉతః పూర్వస్య గోరస్స్యాత్. గ్రుక్కెడు గ్రుచ్చె గ్రుద్దు ఇత్యాది.

ద్విరుక్తము లగు కకార చకార తకారములు పరముగా గల ఉకారమునకు ముందటి గకారముపై రేఫ మగును.

గ్ ఉక్క్ - గ్ర్ఉక్క్ - గ్రుక్కెడు.

గ్ ఉచ్చ్ - గ్ర్ఉచ్చ్ - గ్రుచ్చె

గ్ ఉద్ద్ - గ్ర్ఉద్ద్ - గ్రుద్దె.

## 16. గజతదబేష్వోతః.

గజతదబేషు = ద్విరుక్తము లగు గ, జ, త, ద, బ, కారములు పరముగా నున్న, ఓతః = ఓకారమునకుఁ బూర్వమునందున్న గకారమునకు రేఫ మగును.

వి. తేష్వేషు పరేషు ఓతఃపూర్వస్య గోరస్స్యాత్.

ౘగ్రొగ్గి, గ్రొజ్జు, గ్రొద్దు, గ్రొత్తి, గ్రొబ్బున ఇత్యాది.

ద్విరుక్తములగు గజతదబకారములకుఁ బూర్వము నందున్న ఓకారమునకుఁ బూర్వమునందలి గకారముపై రేఫ మగును.

గ్ + ఒగ్గ్-గ్ర్ ఒగ్గ్, గ్రొగ్గి.

ఇట్లితరము లూహింపఁదగును.

ఇవి రేఫసంయుక్తములుగాఁ గానరావు.

## 17. (ఇతస్సిద్దేది).

వి. సిద్దానుస్వారపరస్య దకారేపరే ఇకారాత్పూర్వస్య గోరస్స్యాత్. గ్రొంది.

పూర్ణానుస్వారపూర్వక మగు దకారమునకుఁ బూర్వమునందలి ఇకారమునకు ముందలి గకారముపై రేఫ మగును.

గ్ + ఒంద్ - గ్ర్ ఒంద్- గ్రొంది.

ఇదియు రేఫసంయుక్తముగాఁ గనరాదు.

## 18. కచటడలేష్వా పూర్వస్యరోతః.

వి. ఏషుపరేష్వా కారాత్పూర్వస్య తకారస్యరేఫ స్యాత్. త్రాఁకె, త్రాఁచు, త్రాఁట, త్రాడు, త్రాలె ఇత్యాది.

కచటడలేషు = క, చ, ట, డ, లకారములు పరముగాఁ గలిగిన, ఆ పూర్వ స్య = ఆకారమునకుఁ బూర్వమునం దున్న, తః తకారమునకుఁ బైని, రః = రేఫ మగును.

త్ + ఆక్ - త్ర్ఆక్ - త్రాకె.
త్ +ఆచ్ - త్ర్ఆచ్ - త్రాఁచు
త్ +ఆ ట్ - త్ర్ ఆట్ - త్రాట
త్ + ఆడ్ - త్ర్ ఆడ్ -త్రాడు
త్ + ఆల్ - త్ర్ ఆల్ - త్రాలె.

తాకు, తాట, తాలు అనురీతిగా నివి రేఫసంయుక్తములు గాకుండఁ గనఁబడు.

## 19. కగచట లేషూతః.

కగచటలేషు = క, గ, చ, ట, లకారములు పరముగాఁ గల, ఊతః = ఊకారమునకుఁ బూర్వమునం దున్న తకారము పైని రేఫ మగును.

వి. ఏషు పరేషూతః పూర్వస్య తోరస్స్యాత్

త్రూకె, త్రూగె, త్రూచె త్రూటు త్రూలె ఇత్యాది.

కగచటలకారములు పరముగాఁ గల యూకారమునకుఁ బూర్వమునం దున్న తకారముపై రేఫ మగును.

త్ ఊక్ - త్ర్ఊక్ - త్రూకె
త్ ఊగ్ - త్ర్ ఊగ్ - త్రూగె
త్ ఊచ్ - త్ర్ఊచ్ - త్రూచె
త్ ఊట్ - త్ర్ ఊట్ - త్రూటు.
త్ ఊల్ - త్ర్ ఊల్ - త్రూలె.

ఇవి రేఫసంయుక్తములుగాఁ గానరావు.

## 20. చపోరేతః.

చపోః = చకారమును, పకారమును పరముగాఁ గలిగిన, ఏతః = ఏకారమునకుఁ బూర్వమునం దున్న తకారముపై రేఫ మగును.

వి. ఏతఃపూర్వస్య తో రస్స్యాచ్చపోః పరయోః.

త్రేచె, త్రేపు.

చకారమును, పకారమును పరముగాఁ గలిగిన ఏకారమునకు ముం దున్న తకారముపైని రేఫ మగు.

త్, ఏచ్ - త్ర్ఏచ్ - త్రేఁచె.
త్, ఏప్ - త్ర్ఏప్ - త్రేఁపు.

## 21. ఓతశ్చ పమయలవసిషు.

చపయలవసిషు = చ, ప, మ, య, ల, వ సకారములు పరముగాఁ గల్గిన, ఓతః = ఓకారమునకుఁ బూర్వమునం దున్న తకారముపైని రేఫ మగును.

వి. ఏషుపరేష్వోకారాత్పూర్వస్య తోరస్స్యాత్.
త్రోచె, త్రోపు, త్రోమె, త్రోయు, త్రోలె, త్రోవ,
త్రోసె.

చపమయలవ సకారములు పరముగాఁ గలిగిన యోకారమునకుఁ బూర్వమునం దున్న తకారముపై రేఫ మగును.

త్ + ఓచ్ -త్ర్ ఓచ్ - త్రోచ్ - త్రోచె. ఇట్లితరము లూహింపఁదగు.

త్రోము, అని రేఫయుక్తముగాఁ గానరాదు. త్రోయు, త్రోసె, నన్న వొకే ధాతువునుండి యేర్పడిన రూపములు. తోచు ధాతుకృదంతరూపము త్రోపు.

## 22. ద్విచమవేష్వతః.

దిచమవేషు = ద్విరుక్తము లగు, చ, మ వకారములు పరముగాఁ గలిగిన, అతః = అకారమునకుఁ బూర్వము నం దున్న తకారముపై రేఫ మగును.

వి. ద్విత్వసహిత చమవేషు పరేష్వతః పూర్వస్య
తోరస్స్యాత్. త్రచ్చె, త్రమ్మ, త్రవ్వె.

ద్విరుక్తము లగు చకార మకార వకారములు పరములుగాఁ గలిగిన హ్రస్వ మగు అకారమునకుఁ బూర్వ మందున్న తకారము పై రేఫ మగును.
త్, అచ్చ్ త్ర్అచ్చ్ - త్రచ్చ - త్రచ్చె.
త్, అమ్మ్ త్ర్ అమ్మ్ - త్రమ్మ - త్రమ్ము.
త్, అవ్వ్ త్ర్అవ్వ్ - త్రవ్వ - త్రవ్వె.
త్రమ్ముశబ్దము గానరాదు.

## 23.ః మోరితః.

పమోః = పకారమకారములు పరముగా నున్న, ఇతః = హ్రస్వ మగు ఇకారమునకుఁ బూర్వమునందలి తకారముపై రేఫ మగు.

వి. ఇతః పూర్వస్య తోరస్స్యాత్తత్పమోః పరయోః
త్రిప్పె త్రిమ్మె.

(ద్విరుక్తములగు) పకారమకారములు పరముగాఁ గలిగిన ఇకారమునకుఁ బూర్వమునం దున్న తకారము పైని రేఫ మగు. త్ ఇప్ప్ - త్ ర్ ఇప్ప్ - త్రిప్ప్. త్రిప్పు-త్ ఇమ్మ్ త్ ర్ ఇమ్మ్ త్రిమ్మ్, త్రిమ్మె.

త్రిమ్ముధాతువు గానరాదు. త్రిమ్మరు అని కలదు.

## 24. ఉతష్టపవలేషు.

టపవ లేషు = టపవలకారములు పరముగాఁ గల, ఉతః = హ్రస్వ మగు ఉకారమునకు బూర్వమందున్న తకారముపైని రేఫమగును.

వి. ఉతః పూర్వస్య తోరస్స్యాత్తేష్వేషు పరేషు.

త్రుట్టె, త్రుప్పె, త్రువ్వె, త్రుళ్ళె.

టపవలకారములు పరముగాఁ గల హ్రస్వమగు ఉకారము కంటెఁ బూర్వమునం దున్నతకారముపైని రేఫ మగును.

త్ - ఉట్ట్ - త్ ర్ ఉట్ట్ - త్రుట్ట్ - త్రుట్టె.
త్ -ఉప్ప్ - త్ ర్ ఉప్ప్ - త్రుప్ప్ - త్రుప్పె
త్ - ఉవ్ వ్ -త్ ర్ ఉవ్ వ్ - త్రువ్వ్ - త్రువ్వె
త్ - ఉల్ ల్ - త్ ర్ ఉల్ ల్ - త్రుల్ల్ - త్రుల్లె.

త్రుప్పు శబ్దము గలదు. ధాతువు గానరాదు. త్రువ్వుశబ్దము గానరాదు.

## 25. (ఎతోడలోః).

వి. ఎతః పూర్వస్య తోరస్స్యాత్ డలపరయోః. త్రెడ్డు త్రెళ్ళు.

ద్విరుక్తములగు డకారలకారములు పరముగాఁ గలిగిన ఎకారమునకుఁ బూర్వమునందున్న తకారముపై రేఫము కలుగును.

త్ ఎడ్ డ్ - త్ ర్ ఎడ్ డ్ - త్రెడ్డ్- త్రెడ్డు
త్ ఎల్ ల్ - త్ ర్ ఎల్ ల్ - త్రెళ్ళ్ - త్రెళ్ళు.

## 26. కటోరోతః.

కటోః = ద్విరుక్తము లగు కకారటకారములు పరముగాఁ గల్గిన, ఓతః = ఒకారమునకుఁ బూర్వమునందలి తకారముపై రేఫ మగును.

వి. ఓపూర్వస్య తోరస్స్యాత్ కటోః పరయోః. త్రొక్కు, త్రొట్టె.

ద్విరుక్తము లగు కకారటకారములు పరముగాఁ గల్గిన 'ఒ' కారమునకు ముం దున్న తకారముపై రేఫ మగును.
త్ ఒక్ క్ - త్ ర్ ఒక్ క్ - త్రొక్క్ - త్రొక్కు
త్ ఒట్ ట్ - త్ ర్ ఒట్ ట్ - త్రొట్ట్ - త్రొట్టి.

త్రొట్టి శబ్దము గానరాదు. (తొట్టి).

## 27. అతస్తోరస్స సిద్ధేపి.

ససిద్ధే = సిద్ధ(పూర్ణ)బిందువుతోఁ గూడిన, పి = పకారము పరముగాఁగల, అతః = హ్రస్వ మగు అకారమునకుఁ బూర్వమునందలి, తః = తకారమునకుఁ బైని రః = రేఫమగును.

వి. అతఃపూర్వస్యతో రస్స్యాత్ససిద్ధే పి పరే త్రంపి.

పూర్ణబిందుపూర్వక మగు పకారము పరముగాఁ గల 'అ' కారమునకు ముందటితకారమునకుఁ బైని రేఫ మగును.

త్ అంప్ - త్ ర్ అంఫ్ - త్రంప్- త్రంపి(దాలి).

## 28. గచపేషూతశ్చ.

గచపేషు = పూర్ణబిందుపూర్వకము లగు గ, చ, పకారములు పరముగాఁ గలిగిన, ఉతః చ = ఉకారమునకు ముందటి తకారముపైని గూడ రేఫ మగును.

వి. ఉకారాత్పూర్వస్యతోరస్స్యాత్ సిద్ధానుస్వార
సహితేషు గచపేషు పరేషు. త్రుంగె, త్రుంచె, త్రుంపె.

పూర్ణబిందుపూర్వకము లగు గచపకారములకు పరముగాఁ గలిగిన ఉకారమునకుఁ బూర్వమునందలి తకారమునకుఁ బైని రేఫ మగును.
త్ ఉంగ్ - త్ ర్ ఉంగ్ - త్రుంగ్ - త్రుంగె.
త్ ఉంచ్ - త్ ర్ ఉంచ్ - త్రుంచ్ - త్రుంచె
త్ ఉంప్ - త్ ర్ ఉంప్ - త్రుంప్ - త్రుంపె.

త్రుంగుధాతువు ప్రేరణరూపము. త్రుంచు కృదంతరూపము త్రుంపు.

## 29. చపోరేతః.

చపోః = పూర్ణబిందుపూర్వకము లగు చకార పకారములు పరముగాఁ గల, ఏతః = ఎకారమునకుఁ బూర్వమునం దున్న తకారముపై రేఫ మగును.

వి. ఎపూర్వస్య తోరస్యాత్తచ్ఛపో పరయోః
త్రెంచె త్రింపె.

పూర్ణబిందుపూర్వకము లగు చకార పకారములు పరముగాఁ గలిగిన 'ఎ' కారమునకు ముందటి తకారముపై రేఫ మగును.

త్ ఎంచ్ - త్ర్ఎంచ్ - త్రెంచ్ - త్రెంచె
త్ ఎంప్ - త్ర్ఎంప్ - త్రింప్ - త్రింపె.

త్రెగుధాతుప్రేరణరూపములు. త్రెంచు, త్రెంపు, అనునవి.

## 30. క్యేతో దోరః.

కి = బిందుపూర్వక మగు కకారము పరముగాఁగల, ఏతః = ఎకారము నకుఁ బూర్వమునందలి, దః = దకారముపై, రః = రేఫ మగు.

వి. ఏతః పరస్య దోరస్స్యాత్క్రిపరే ద్రెంకె.

పూర్ణబిందుపూర్వక మగు దకారము పరముగాఁ గల ఎకారమునకుఁ బూర్వమునందలి దకారమునకుఁ బైని రేఫమగును.

ద్ ఎంక్ - ద్ర్ఎంక్ - ద్రెంక్. ద్రెంకె.

ఈ శబ్దము గానరాదు.

## 31. చ్యోతః.

చి. = చకారము పరముగాఁ గల, ఓతః = ఓకారమునకుఁ బూర్వమునం దున్న దకారముపై రేఫ మగును.

వి. ఓతః పూర్వస్యదోరస్స్య చ్చి పరే ద్రోచె.

చకారము పరముగా గలిగిన ఓకారమునకుఁ బూర్వమునం దున్న దకారముపై రేఫ మగును. ద్ఓచ్ - ద్ర్ఓచ్ - ద్రోచ్ - ద్రోచె.

ఈ శబ్దము గానరాదు, దోచు, త్రోచు అనునవి గలవు.

## 32. ద్విబమయోరితః.

ద్విబమయోః = ద్విరుక్తము లగు బకార మకారములు ( పరముగాఁ గల, ఇతః = హ్రస్వ మగు ఇకారమునకుఁ బూర్వమునందలి దకారముపై రేఫ మగును.

వి. ద్విత్వసహితయోరనయోర్బ్మయోః పరయోరితః
పూర్వస్య దోరస్స్యాత్. ద్రిబ్బ ద్రిమ్మరి.

ద్విరుక్తము లగు బకార మకారములు పరముగా నున్న ఇకారమునకుఁ బూర్వమునందలి దకారమునకుఁ బైని రేఫ మగును.

ద్ ఇబ్ బ్ - ద్ ర్ ఇబ్ బ్ - ద్రిబ్బ్ ద్రిబ్బ

ద్ ఇమ్ మ్ - ద్ ర్ ఇమ్ మ్ - ద్రిమ్మ్ ద్రిమ్మరి.

దిబ్బ, త్రిమ్మరి అనియే కాని యీ శబ్దములు గానరావు.

## 33. క్కుతశ్చ.

కి = ద్విరుక్త మగు కకారము పరముగాఁ గలిగిన, ఉతః చ = హ్రస్వ మగు ఉకారమునకుఁ బూర్వమునం దున్న దకారముపైని రేఫ మగును.

వి. ద్విత్వసహితకకారే పరే ఉతఃపూర్వస్య దోరస్స్యాత్.
ద్రుక్కి.

ద్విరుక్త మగు కకారమునకుఁ బూర్వమునం దున్న ఉకారమునకు ముందటి దకారముపై రేఫ మగును.

ద్ ఉక్ క్ - ద్ ర్ ఉక్ క్ - ద్రుక్క్ -ద్రుక్కి

'దుక్కి' యని రేఫరహితముగానె యీశబ్దముగానవచ్చు.

## 34. గబో రోతః.

గబోః = ద్విరుక్తములగు గకార బకారములు పరముగాఁగలిగిన, ఓతః = ఒకారమునకు ముందటి దకారముపైని రేఫ మగును.

వి. ఓతః పూర్వస్యదోరస్స్యాద్గబోః పరయోః.
ద్రొగ్గలి, ద్రొబ్బె.

ద్విరుక్తములగు గకార బకారములకు ముందటి 'ఒ' కారమునకు ముందున్న దకారముపై రేఫమగును.

ద్ ఒగ్ గ్ - ద్ ర్ ఒగ్ గ్ - ద్రొగ్గ్ - ద్రొగ్గలి
ద్ ఒబ్ బ్ - ద్ ర్ ఒబ్ బ్ - ద్రొబ్బ్ - ద్రొబ్బె.

## 35. కచతపమయసేష్వాపూర్వస్య పోరః.

కచతపమయసేషు = క, చ, త, ప, మ, యసకారములు పరముగాఁగల, ఆపూర్వస్య = ఆకారమునకుఁ బూర్వమునందలి, పః = పకారమునకుఁ బైని, రః = రేఫమగును.

వి. ఏషు పరేష్వాకారపూర్వస్య పోరస్స్యాత్ ప్రాఁకె.

ప్రాఁచి, ప్రాఁత, ప్రాపు, ప్రామె, ప్రాయము, ప్రాసె ఇత్యాది.

కచతపమయసకారములు పరముగాఁ గల్గిన ఆకారమునకుఁ బూర్వమునం దున్న పకారముపై రేఫ మగును.

ప్ + ఆఁక్ - ప్ర్ ఆఁక్ - ప్రాఁక్ - ప్రాఁకె. ఇట్లేతరము లూహింపఁదగు.

ప్రాయము సంస్కృతసమము. ప్రాయి = పౌరుషము మొ॥. అని దేశ్యశబ్దము చూపఁదగు. ప్రాసె కానరాదు. ప్రాసగు - (సస్యవిశేషము) ఉదాహరింపఁదగు.

## 36. కచోరీతః.

కచోః = కకార చకారములు పరముగాఁ గల్గిన, ఈతః = ఈకారమునకుఁ బూర్వమునం దున్న పకారముపై రేఫ మగును.

వి. ఈ పూర్వస్య పోరస్స్యాత్ కచోః పరయోః

ప్రీకె, ప్రీచు.

కకార చకారములు పరముగాఁ గలిగిన ఈకారమునకుఁ బూర్వమునందలి పకారముపై రేఫ మగును.

ప్ఈక్ - ప్ర్ ఈక్ - ప్రీక్ - ప్రీకె
ప్ ఈచ్ - ప్ర్ ఈచ్ - ప్రీచ్ - ప్రీచు.

ఇవి రేఫసంయుక్తములుగాఁ గానరావు.

## 37. డతనమలవేష్వేతః.

డతనమలవేషు = డ, త, న, మ, లవకారములు పరముగాఁ గల, ఏతః = ఏకారమునకు బూర్వమునం దున్న పకారముపై రేఫ మగును.

వి. ఏతఃపూర్వస్య పోరస్స్యాదేషు పరేషు

ప్రేడు, ప్రేత, ప్రేను, ప్రేము, ప్రేలె, ప్రేవు

డతనమలవకారములు పరముగాఁ గలిగిన ఏకారమునకుఁ బూర్వమునందుఁ గల పకారము పైని రేఫ మగును.

ప్ఏడ్ - పర్ఏడ్ - ప్రేడ్ ప్రేడు.

ఇట్లితరములూహ్యములు.

ప్రేడు (పేడు) ప్రేను (పేను) అని రేఫసంయుక్తములు గానరావు. ప్రేతశబ్దము దేశ్యము గాదు.

## 38. గడదలేష్వోతః.

గడదలేషు = గడదలకారములు పరముగాఁ గల, ఓతః = ఓకారమునకుఁ బూర్వమునందుఁ గల పకారమునకుఁ బైని రేఫ మగును.

వి. ఓపూర్వస్య పోరస్స్యాత్తేషు పరేషు. ప్రోగు, ప్రోడ, ప్రోద్దు, ప్రోలు.

గడదలకారములు పరముగాఁ గలిగిన ఒకారమునకుఁ బూర్వమునం దున్న పకారముపై రేఫ మగును. ప్ఓగ్ - ప్ర్ఓగ్ - ప్రోగ్ - ప్రోఁగు. ఇట్లితరము లూహింపఁదగును.

## 39. ద్వికగబలేష్వతః.

ద్వికగబలేషు = ద్విరుక్తము లగు క, గ, బ, లకారములు పరముగాఁ గల్గిన, అతః = హ్రస్వ మగు అకారముకంటెఁ బూర్వమునం దున్న పకారము పై రేఫ మగును.

వి. ద్విత్వసహిత కగబలేషు పరేష్వతః పూర్వస్య పో రస్స్యాత్. ప్రక్కె, ప్రగ్గె, ప్రబ్బె, ప్రల్లదనము.

ద్విరుక్తము లగు కగబలకారములు పరముగాఁ గలిగిన అకారమునకుఁ బూర్వమునం దున్న పకారముపై రేఫ మగును.

ప్ అక్క్ - ప్ర్క్క్ - ప్రక్క ప్రక్కె. ఇట్లితరము లూహింపఁదగును.

ప్రగ్గె-ప్రగ్గ.(పంగ).

## 40. ఇతః కే.

కే = ద్విరుక్త మగు కకారము పరముగాఁ గల్గిన, ఇతః = హ్రస్వ మగు ఇకారమునకుఁ బూర్వమునం దున్న పకారమునకుఁ బైని రేఫమగును.

వి. ఇతః పూర్వస్య పోరస్స్యాత్ కకారే పరే. ప్రిక్క.

ద్విరుక్త మగు కకారము పరముగాఁ గల్గిన హ్రస్వ మగు ఇకారమునకుఁ బూర్వమునం దున్న పకారమునకుఁ బైని రేఫ మగును.

ప్ఇక్క్ - పర్ఇక్క్ - ప్రిక్క్ - ప్రిక్క.

ప్రిక్క శబ్దము గానరాదు. 'ప్రక్క' కలదు. అది పూర్వలక్షణముచే గుర్తింపవచ్చును.

## 41. చపకే ఘాతః.

చపకేషు = ద్విరుక్తము లగు చ, ప, కకారములు పరముగాఁ గల్గిన, ఉతః = హ్రస్వ మయిన ఉకారమునకుఁ బూర్వమునం దున్న పకారముపైని రేఫ మగును.

వి. ఉతః పూర్వస్య పోరస్స్యాత్తచ్చ పకేషు ఫరేషు.

ప్రుచ్చె, ప్రుప్పి, ప్రుక్కలి, ఇత్యాది.

ద్విరుక్తము లగు చపకకారములు పరముగాఁ గలిగిన ఉకారమునకుఁ బూర్వమునందలి పకారమునకుఁ బైని రేఫ మగును.

ప్ ఉచ్చ్ - పిర్ఉచ్చ్ - ప్రుచ్చ్ - ప్రుచ్చె

ప్ ఉప్ప్ - ప్ర్ఉప్ప్ - ప్రుప్ప్ - ప్రుప్పి

ప్ఉక్క్ - ప్ర్ఉక్క్ - ప్రుక్క్ - ప్రుక్కలి

ప్రుక్కలి (పుక్కలి) అని రేఫ సంయుక్తముగాఁ గానరాదు.

## 42. కలోరేతః.

కలోః = ద్విరుక్తము లగు కకారలకారములు పరముగాఁ గలిగిన, ఏతః = ఏకారమునకుఁ బూర్వమునం దున్న పకారముపై రేఫ మగును.

వి. ఏతః పూర్వస్య పో రస్స్యాత్తత్కలోః పరయోః.

ప్రెక్కు (ప్రెల్లు) ఇత్యాది.

ద్విరుక్తము లగు కకారపకారములకుఁ బూర్వమునం దున్న ఎకారమునకు ముందటి పకారముపై రేఫ మగును.

ప్ ఎక్క్ - ప్ర్ఎక్క్ - ప్రెక్క్ - ప్రెక్కు.

ప్ ఎల్ల్ - ప్ర్ఎల్ల్ - ప్రెల్ల్ - ప్రెల్లు

ప్రెక్కు, ప్రెల్లు (పెక్కు, పెల్లు) అని రేఫయుక్తములుగాఁ గానరావు. ప్రెక్కణ ముదాహరింపవచ్చు.

## 43. ద్త్యోతః.

ది = ద్విరుక్త మగు దకారము పరముగాఁ గలిగిన, ఓతః = ఒకారమునకుఁ బూర్వ మున్న పకారముపై రేఫ మగును.

వి. తద్దకారేపరే ఓతః పూర్వస్య పోరస్స్యాత్. ప్రొద్దు.

ద్విరుక్త మగు దకారము పరముగాఁ గలిగిన ఒకారమునకుఁ బూర్వమునం దున్న పకారముపై రేఫ మగును. ప్ ఒద్ద్ - ప్ర్ ఒద్ద్- ప్రొద్ద్ - ప్రొద్దు.

## 44. ససిద్ధే క్యేతః.

ససిద్ధే = పూర్ణబిందువుతోఁ గూడిన, కి = కకారము పరముగాఁ గల్గిన, ఏతః = ఎకారమునకుఁ బూర్వ మున్న పకారముపైని రేఫ మగును.

వి. సిద్ధానుస్వార కకారే పరే ఏకారాత్పూర్వస్య
పోరస్స్యాత్. ప్రెంకు.

పూర్ణబిందుపూర్వక మగు పకారమునకుఁ బూర్వమునం దున్న ఎకారమునకు ముందఁటి పకారమునకుఁ బైని రేఫ మగును.

ప్ ఎంక్ - ప్ర్ ఎంక్ - ప్రెంక్ -ప్రెంకు

ప్రెంకు (పెంకు) అని యిది రేఫసంయుక్తముగాఁ గానరాదు.

## 45. త్యాపూర్వస్య బోరస్సాధ్యే.

సాధ్యే = సాధ్య(ఖండ) బిందువు పూర్వమునం దున్న, తి = తకారము పరము గాఁగల, ఆపూర్వస్య = ఆకారమునకుఁ బూర్వమునం దున్న , బః = బకారమునకు, రః = రేఫ మగును.

వి. సాధ్యానుస్వారసహితే తకారే పరే ఆకారాత్పూర్వస్య
బోరస్స్యాత్. బ్రాఁతి.

ఖండబిందుపూర్వక మగు తకారము పరముగాఁ గలిగిన ఆకారమునకుఁ బూర్వమునం దున్న బకారమునకు రేఫ మగును.

బ్ ఆత్ - బ్ ర్ ఆత్ - బ్రాత్ - బ్రాఁతి.

## 46. చదో రోతః.

చదోః = చకార దకారములు పరముగాఁ గల, ఓతః = ఓకారమునకుఁ బూర్వమునం దున్న బకారమునకుఁ బైని రేఫ మగును.

వి. ఓతః పూర్వస్య బోరస్యాచ్చదోః పరయోః

బ్రోచె, బ్రోదె.

చకార దకారములు పరముగాఁ గల ఓకారమునకుఁ బూర్వమునం దున్న బకారముపై రేఫ మగును.

బ్ ఓచ్ - బ్ ర్ ఓచ్ - బ్రోచ్ - బ్రోచె.
బ్ ఓద్ - బ్ ర్ ఓద్ - బ్రోద్ - బ్రోదె.

బ్రోచె శబ్దము లేదు. ప్రోచె అని ఇది పరుషాది. బ్రోదె (బోదె) అని రేఫ సంయుక్తము గానరాదు.

## 47. ద్విద్యతః.

ద్విది = ద్విరుక్త మగు దకారము పరముగాఁ గల, అతః = హ్రస్వ మగు అకారమునకుఁ బూర్వమునం దున్న బకారముపై రేఫ మగును.

వి. అతఃపూర్వస్య బోరస్స్యాద్ద్విత్వసహిత దకారే పరే.

బ్రద్ద.

ద్విరుక్త మగు దకారము పరముగాఁ గలిగిన అకారమునకుఁ బూర్వమునం దున్న బకారముపై రేఫ మగును.

బ్ అద్ ద్ - బ్ ర్ అద్ ద్ - బ్రద్ద్ - బ్రద్ద.

## 48. గ్యుతః.

గి = ద్విరుక్త మగు గకారము పరముగాఁ గల, ఉతః = హ్రస్వ మగు ఉకారమునకుఁ బూర్వమునం దున్నబకారముపైని రేఫ మగును.

వి. ఉకారాత్పరస్య బోరస్స్యాత్తద్గకారే పరే. బ్రుగ్గి.

ద్విరుక్తమగు గకారము పరముగాఁ గలిగిన ఉకారమునకుఁ బూర్వమునం దున్న బకారముపైని రేఫ మగును.

బ్ ఉగ్గ్ - బ్ ర్ ఉగ్గ్ - బ్రుగ్గ్ - బ్రుగ్గి.

బ్రుగ్గి (బుగ్గి) యని యిది రేఫసంయుక్తముగాఁ గానరాదు.

## 49. కగోరోతః.

కగోః = ద్విరుక్తము లగు కకార గకారములు పరముగాఁ గలిగిన, ఓతః = ఒకారమునకుఁ బూర్వమునం దున్న బకారమునకుఁ బైని రేఫ మగును.

వి. ఓతః పూర్వస్య బోరస్స్యాత్క్కగోః పరయోః.

బ్రొక్కు - బ్రొగ్గు.

ద్విరుక్త మగు కకార గకారములు పరముగాఁ గలిగిన ఒకారమునకుఁ బూర్వమునం దున్న బకారముపై రేఫ మగును.

బ్ ఒక్క్ - బ్ ర్ ఒక్క్ - బ్రక్క్ - బ్రొక్కు

బ్ ఒగ్గ్ - బ్ ర్ ఒగ్గ్ - బ్రొగ్గ్ - బ్రొగ్గు.

బ్రొక్కు బ్రొగ్గు (బొక్కు బొగ్గు) అని యివి రేఫసంయుక్తములుగాఁ గానరావు.

## 50. ఉదోతోస్స సిద్ధేగి.

ససిద్ధేగి = సిద్ధ (పూర్ణ) బిందుపూర్వక మగు గకారము పరముగాఁ గల్గిన, ఉదోతోః = ఉ, కారము, ఒ, కారమునకుఁ బూర్వమునం దున్న బకారముపై రేఫ మగును.

వి. సిద్ధ సహిత గకారే పరే ఉకారౌకారయోః
పూర్వస్య బోరస్స్యాత్. బ్రుంగె, బ్రొంగు.

పూర్ణబిందుపూర్వక మగు గకారము పరముగాఁ గలిగిన ఉకారమునకును, ఒకారమునకును, బూర్వమునం దున్న బకారముపై రేఫ మగును.

బ్ ఉంగ్, బ్ ర్ ఉంగ్ - బ్రుంగ్ - బ్రుంగె.

బ్ ఒంగ్ - బ్ ర్ ఒంగ్ - బ్రొంగ్ - బ్రొంగె.

బ్రొంగు (పొంగె) ధాతువు లేదా బ్రొంగె శబ్దమును గానరాదు.

## 51. కగ నేష్వా పూర్వస్య మోరః.

కగనేషు = కగన కారములు పరముగాఁ గలిగిన, ఆపూర్వస్య = ఆకారమునకుఁ బూర్వమునం దున్న, మోః = మకారమునకుఁ బైని,-రః = రేఫమగును.

వి. ఆకారాత్పూర్వస్య మోరస్స్యాత్క గనేషు పరేషు
(మ్రాకు) మ్రాగె, మ్రాను.

క,కార, గకార, నకారములు పరముగాఁ గల్గిన ఆకారమునకుఁ బూర్వమునందలి మకారమునకుఁ బైని రేఫ మగును.

మ్ ఆక్, మ్ర్ ఆక్ - మ్రాక్ - మ్రాకు. ఇట్లితరము లూహింపఁదగును.

## 52. కగట తదపయలవసే ష్వోతః.

కగటతదపయలవసేషు = క, గ, ట, త,ద, ప, య, ల, వ, సకారములు పరముగాఁ గలిగిన, ఓతః = ఓకారమునకుఁ బూర్వమునందలి మకారమునకుఁ బైని రేఫ మగును.

వి. ఓకారాత్పూర్వస్య మోరస్స్యాదేషు పరేషు
మ్రోకు, మ్రోగు, మ్రోటు, మ్రోత, మ్రోదె, మ్రోదుగు,
మ్రోపె, మ్రోయు, మ్రోల, మ్రోవు, మ్రోసె ఇత్యాది.

కగట తదపయలవసకారములు పరముగాఁగలిగిన ఓకారమునకుఁ బూర్వమునందలి మకారమునకుఁ బైని రేఫ మగును.

మ్ ఓక్- మ్ర్ ఓక్ - మ్రోక్ - మ్రోకు. ఇట్లితరములూహ్యములు.

మోకు, మోటు, మోదు, మోదుగు, మోపు అనియెకాని, మ్రోకు, మ్రోటు, మ్రోదుగు, మ్రోపె అనుతీరుగా రేఫ సంయుక్తములుగాఁ గానరావు. మ్రోయు, మ్రోసె మ్రోత మ్రోయుధాతువునుండి యేర్పడు రూపములు.

## 53. ద్విగ్యతః.

ద్విగి = ద్విరుక్త మగు గకారము పరముగాఁ గలిగిన, అతః = హ్రస్వ మైన అకారమునకుఁ బూర్వమునం దున్న మకారమునకుఁ బై రేఫ మగును.

వి. ద్విత్వసహిత గకారే పరే అతఃపూర్వస్య మోరస్స్యాత్.
మ్రగ్గ.

ద్విరుక్తసహిత మగు గకారము పరముగాఁ గలిగిన అకారమునకు ముందటి మకారమునకుఁ బైని రేఫ మగును. మ్ అగ్గ్ - మ్ర్ అగ్గ్ - మ్రగ్ - మ్రగ్గ.

## 54. కదోరితః.

కదోః = ద్విరుక్తము లగు కకార దకారములు పరముగాఁ గల్గిన, ఇతః = హ్రస్వ మగు ఇకారమునకుఁ బూర్వము నందలి మకారమునకుఁ బై రేఫ మగును.

వి. ఇతః పూర్వస్య మోరస్స్యాత్తద్ తత్కా (దేషు ద్విత్వసహిత పరేషు) కదోః పరయోః

ప్రిక్కె, ప్రిద్ది.

ద్విరుక్తము లగు కకార దకారములు పరముగాఁ గలిగిన హ్రస్వ మగు ఇకారముకంటెఁ బూర్వమునం దున్న మకారమునకుఁ బైని రేఫ మగును.
మ్ఇక్క్ - మ్ర్ఇక్క్ - మ్రిక్క్ - మ్రిక్కె.
మ్ఇద్ద్ - మ్ర్ఇద్ద్ - మ్రిద్ద్ - మ్రిద్దె.

మ్రిక్కు, మ్రిద్దె (మిక్కిలు, మిద్దె) యని యీ శబ్దములు రేఫ సంయుక్తము లై గానరావు. మ్రిక్కె అనురీతి శబ్దమె లేదు.

## 55. ఉతోగచతేషు.

గచతేషు = గ చ తకారములు పరముగాఁ గల్గిన, ఉతః = హ్రస్వ మయిన యుకారమునకుఁ బూర్వమునందలి మకారముపై రేఫ మగును.

వి. ఉతః పూర్వస్య మోరస్స్యాత్కాచతేషు పరేషు.

ప్రుగ్గు, ప్రుచ్చు, ప్రుత్యము.

కకారము, చకారము, తకారము పరముగాఁ గల్గిన హ్రస్వ మగు ఉకారమునకుఁ బూర్వము నందలి మకారముపై రేఫ మగును.
మ్ఉగ్గ్ - మ్ర్ఉగ్గ్ - మ్రుగ్గ్ - మ్రుగ్గు
మ్ఉచ్చ్ - మ్ర్ఉచ్చ్ - మ్రుచ్చ్ - మ్రుచ్చు
మ్ఉత్త్ - మ్ర్ఉత్త్ - మ్రుత్ - మ్రుత్యము.

మ్రుత్యము (ముత్యము) అని రేఫసంయుక్త మై యీ శబ్దము గానరాదు.

## 56. కగోరోతః.

కగోః = కకార గకారములు పరముగా గల్గిన, ఓతః = ఓకారమునకుఁ బూర్వమునం దున్న మకారముపై రేఫ మగును.

వి. ఓతః పూర్వస్య మోరస్స్యాత్తత్క్గోః పరయోః.

మ్రొక్కు , మ్రొగ్గ.

కకార గకారములు పరముగాఁ గల్గిన ఒకారమునకు ముందటి మకారముపై రేఫ మగును.

మ్ఒక్క్ - మ్ర్ఒక్క్ - మ్రొక్క్ - మ్రొక్కు-

మ్ ఒగ్గ్ - మ్ర్ఒగ్గ్ - మ్రొగ్గ్ - మ్రొగ్గ.

## 57. సిద్ధ యోర్ద పోరతః.

సిద్ధయోః = సిద్ధ(పూర్ణ) బిందువునకుఁ బరముగాఁ గల్గిన, దపోః = దకార పకారములకుఁ బూర్వమునం దున్న, అతః = హ్రస్వ మగు అకారమునకు ముందరి మకారముపై రేఫ మగును.

వి. అతః పూర్వస్య మోరస్స్యాత్సిద్ధసహితయోర్ద

పోః పరయోః. మ్రందె, మ్రంపు.

పూర్ణబిందుపూర్వక మగు దకార పకారములకుఁ బూర్వమునం దున్న హ్రస్వ మగు అకారము ముందటి మకారముపై రేఫ మగును.

మ్ అంద్ - మ్ర్అంద్ - మ్రంద్ - మ్రందె.

మ్ అంప్ - మ్ర్అంప్ - మ్రంప్ - మ్రంపు.

మ్రంపు (మంపు) అని రేఫ సంయుక్తముగా నీ శబ్దము గానరాదు.

## 58. గీతః.

గి = సిద్ధబిందుపూర్వక మగు గకారము పరముగాఁ గలిగిన, ఇతః = హ్రస్వ మగు ఇకారమునకుఁ బూర్వమునం దున్న మకారముపై రేఫ మగును.

వి. ఇతః పూర్వస్య మోరస్స్యాత్తద్గిపరే. మ్రింగె.

పూర్ణబిందుపూర్వక మగు గకారము పరముగాఁ గల హ్రస్వ మగు ఇకారమునకు ముందటి మకారముపై రేఫమగును.

మ్ ఇంగ్ - మ్ర్ఇంగ్ - మ్రింగ్ - మ్రింగె.

## 59. చపోరోతః.

చపోః = చకార పకారములు పరముగాఁ గల, ఓతః = ఓకారమునకు ముందటి మకారముపై రేఫ మగును.

వి. ఓతః పూర్వస్య మోరస్స్యాత్తచ్చపోః పరయోః.
  మ్రోచె, మ్రోపె.

చకార పకారములు పరముగాఁ గల ఓకారమునకుఁ బూర్వమునం దున్న మకారముపై రేఫ మగును.

మ్ ఓచ్ - మ్ర్ ఓచ్ - మ్రోచ్ - మ్రోచె.
మ్ఓప్ - మ్ర్ ఓప్ - మ్రోప్ - మ్రోపె.

మ్రోచె, మ్రోపె (మోచు, మోపు) అని యివి రేఫ సంయుక్తములుగాఁ గానరావు.

## 60. కతయ సేష్వాపూర్వస్య వో౽రః.

కతయసేషు = క, త, య, సకారములు పరముగాఁ గలిగిన, ఆపూర్వస్య = ఆకారమునకు ( బూర్వమునందుఁ గల, వః = వకారమునకు బైని, రః = రేఫ మగును.

వి. ఏషుపరేష్వాకారపూర్వస్య వో౽రస్స్యాత్.
  వ్రాకుఁడు, వ్రాత (వ్రాయ), వ్రాయి, వ్రాసె.

క త య సకారములు పరముగా (గల ఆకారమునకు ముందటి వకారమునకుఁ బైని రేఫ మగును.

వ్ ఆక్ - వ్ర్ ఆక్ - వ్రాక్ - వ్రాకుడు. ఇట్లితరము లూహింపఁదగు.

## 61. ఈతో౽లి.

లి = లకారము పరముగాఁ గల, ఈతః = ఈకారమునకుఁ బూర్వమునందలి వకారముపై రేఫ మగును.

వి. ఈతఃపూర్వస్య వో౽రస్స్యాల్లిపరే. వ్రీలె.

లకారము పరముగాఁ గల ఈకారము ముందటి వకారముపై రేఫమగును.

వ్ ఈక - వ్ర్ ఈల్ - వ్రీల్ - వ్రీలె.

## 62. కగచటడతలసేష్వేతః.

కగచటడతలసేషు = క, గ, చ, ట, డ, త, ల సకారములు పరముగాఁ గల, ఏతః = ఏకారమునకు ముందటి వకారముపై రేఫ మగును.

వి. ఏతః పూర్వస్య వోరస్స్యాదేషు పరేషు.
(వ్రేఁక వ్రేగ) వ్రేచె, వ్రేటు, వ్రేడము, వ్రేతము, వ్రేలు, వ్రేసె.

క గ చ ట డ త ల సకారములు పరముగాఁ గల ఏకారమునకు ముందటి వకారముపై రేఫ మగును. వ్ ఏఁక్ - వ్ర్ఏఁక్ - వ్రేఁక్ - వ్రేఁక. ఇట్లితరము లూహింపఁదగును.

వ్రేఁగు ధాతువు ప్రేరణరూపము వ్రేఁచు.

వ్రేడము, వ్రేతము శబ్దములు గానరావు. వ్రేఁత (గొల్ల స్త్రీ) వేడము. (మండలాగ్రము.) కలదు.

## 63. ద్వికచయసేష్వతః.

ద్వికచయసేషు - ద్విరుక్తము లగు, క, చ, య, సకారములు పరముగాఁ గల్గిన, అతః = హ్రస్వమగు అకారమునకు ముందరి వకారముపై రేఫ మగును.

వి. అతః పూర్వస్య వోరస్స్యాత్ ద్విత్వసహితేషు కచయసేషు పరేషు. వ్రక్క, వ్రచ్చె, వ్రయ్య, వ్రస్సె, ఇత్యాది.

ద్విరుక్తము లగు క చ య సకారములకుఁ బూర్వమునందలి అకారమునకు ముందటి వకారముపై రేఫ మగును.

వ్ అక్క్ - వ్ర్అక్క్ - వ్రక్క - వ్రక్క. ఇట్లితరములూహింపఁదగును.

ఇతి సారస్వత[1] త్రిలిఙ్గ శబ్దానుశాసన వ్యాకరణమ్ సంపూర్ణ మగమత్.
ఇతి డా॥ అంబడపూడి నాగభూషణం విరచిత భూషణ వ్యాఖ్యాన సహిత సారస్వత త్రిలింగ శబ్దానుశాసనం సంపూర్ణమ్.

---

1. ఇట వ్రాతప్రతియందు 'సారస్వత' శబ్దములేదు. కాని గ్రంథకర్త పేర్కొన్న గ్రంథారంభభాగములో- "బార్హస్పత్యం రావణీయం కాణ్వమాథర్వణంవిదన్. కరోమి సారస్వత త్రిలిఙ్గ శబ్దానుశాసనమ్." (పీఠిక. 3.శ్లో) అనియు-
లక్షణభాగము నారంభించుచు ముందు "ఇదానీమహమపి కాణ్వబార్హస్పత్య రావణీయాది వ్యాకరణాని బుద్ధ్వా కరోమి సారస్వత త్రిలిఙ్గశబ్దానమేవమ్" - అనియు
'రెండు పర్యాయము లీ గ్రంథనామమును సారస్వత త్రిలిఙ్గ శబ్దానుశాసనముగాఁ బేర్కొనుటచేఁ బ్రధానమయిన గ్రంథస్థమయిన యాధారమును బట్టి యిట గ్రంథాంతమున గద్యలో 'సారస్వత' శబ్దము ప్రమాద వశమునఁ దొలఁగిన దని గుర్తింపఁదగును. కావున నీ గ్రంథము 'సారస్వత త్రిలిఙ్గశబ్దానుశాసనము.'

# అనుబంధము – 1

## విషయానుగుణ సూత్రానుక్రమణిక

### 1. సంజ్ఞా పరిచ్ఛేదః.

| | | |
|---|---|---|
| 1. | సిద్ధిర్లోకాద్వృశ్చా | పరి – 1 |
| 2. | అనుక్తమన్యస్మాత్ | పరి – 2 |
| 3. | ఆద్యే | సం . 6 |
| 4. | వికృతిరేషా | సం . 7 |
| 5. | పఞ్చవిధంత్రైలిఙ్గ్యమ్ | సం . 29 |
| 6. | వర్ణకవికృతం తత్సమ్ | సం . 30 |
| 7. | సమస్త వికృతం తజ్జమ్ | సం . 31 |
| 8. | ఏకదేశ తజ్జాః జ(టా)డాదయః | సం . 32 |
| 9. | ముగ్ధాదిస్సచ్ఛాయాతజ్జః | సం . 37 |
| 10. | దేశ్యమశేషతః | సం . 33 |
| 11. | అన్యదేశాగతంగ్రామ్యమ్ | సం . 34 |
| 12. | అలక్షణంచ | సం . 35 |
| 13. | అనర్థంచ | సం . 36 |
| 14. | అచ్చాః కృత్తద్ధితావ్యయధాతవః | సం . 38 |
| 15. | నాసంస్కృతాఙ్గమ్ | సం . 28 |
| 16. | నావ్యయసుప్తిఙ్కృతుమున | పరి . 32 |
| 17. | యోగ్యాస్సదాదయః | పరి . 29 |
| 18. | వాక్యమనుకృతౌసోమచన్ద్రస్య | పరి . 33 |
| 19. | షణ్ణాశదాద్యాయాః | పరి . 34 |
| 20. | ప్రకృతేశ్చత్వారింశత్ | పరి . 35 |
| 21. | షట్త్రింశద్వికృతేః | పరి . 36 |
| 22. | పఞ్చచత్వారింశత్పుమ్పదస్తస్య | పరి . 37 |
| 23. | సప్తప్రాణాః | పరి . 3 |
| 24. | వింశతిః ప్రాణినః | పరి . 4 |
| 25. | అన్యేచ | పరి . 5 |
| 26. | ఆదిః ప్రాణః | సం . 4 |
| 27. | కాదిః ప్రాణీ | సం . 5 |

| | | |
|---|---|---|
| 55. | పశ్చోష్ఠ్యప్రాణే | పరి . 31 |
| 56 | రో నిత్యమ్ | పరి . 15 |
| 57. | నయవలామ్ | పరి . 21 |
| 58. | రయోర్నిత్యమ్ | పరి . 22 |
| 59. | నప్రేరయోస్సావర్ణ్యమ్ | పరి . 23 |
| 60. | ప్రః ప్రాసస్య | సం . 8 |
| 61. | వశిరాద్యమ్ | సం . 19 |
| 62. | ప్రోఽనన్తరమ్ | సం . 20 |
| 63. | .మాదయోగణాః | సం . 18 |
| 64. | గుగౌగురోః | సం . 21 |
| 65. | లోలఘోః | సం . 22 |
| 66. | గవోద్యన్తవ్యఞ్జనపరపూర్వ సబిన్దు విసర్జనీయహల్వ రాః | పరి . 16 |
| 67. | హపరోల | పరి . 17 |
| 68. | నామప్రాతిపదికమ్ | సం . 1 |
| 69. | ధాతుః క్రియా | సం . 2 |
| 70. | డుజాదిప్రత్యయోవర్ణకః | సం . 3 |
| 71. | ఉత్తమరవాన్తా స్తి ఙ్మధ్యాః | క్రి . 135 |

# సన్ధిపరిచ్ఛేదః

# శబ్దపరిచ్ఛేదః

## అజన్తప్రకరణమ్.

| | | |
|---|---|---|
| 60. | న్యాక్ప్రంబుద్ధ్యో | శబ్ద . 53 |
| 61. | ఉతవుస్సర్వత్ర | శబ్ద . 60 |
| 62. | వాలుక్ప | శబ్ద . 61 |
| 63. | డుజశ్చ | శబ్ద . 62 |
| 64. | డుజతోర్లుగామన్త్రణే | శబ్ద . 63 |
| 65. | ప్లుతః పుష్పదన్తస్య | శబ్ద . 64 |
| 66. | ఓతశ్చ | శబ్ద . 65 |
| 67. | ధత్రాదేర్దగుః | శబ్ద . 67 |
| 68. | వావిధాత్రాదేః పుంసి | శబ్ద . 68 |
| 69. | రోరాయః కణ్వస్య | శబ్ద . 69 |
| 70. | ఆవజ్నావః | శబ్ద . 70 |
| 71. | జీవన్నావః పుష్పదన్తస్య | శబ్ద . 71 |
| 72. | భూద్యోదివాంచ | శబ్ద . 72 |
| 73. | గ్లౌ స్త్రీవత్ | శబ్ద . 73 |
| 74. | ములతస్నోః క్లీబే | శబ్ద . 74 |
| 75. | క్వచిన్నులోవాలుక్ | శబ్ద . 66 |
| 76. | మోర్లుకుక్రుశాదేః | శబ్ద . 86 |
| 77. | అదేర్మబూపుష్పదన్తస్య | శబ్ద . 75 |
| 78. | ముబ్వోరనుస్వారః | శబ్ద . 76 |
| 79. | న్లోర్మ్వతోర్లుగ్గీసోమచన్ద్రస్య | శబ్ద . 77 |
| 80. | హ్రూదేస్త్రిషు | శబ్ద . 49 |
| 81. | స్త్రియామనుతాంసోర్లుక్ | కార . 25 |
| 82. | అమహతస్సమస్యచ | కార . 26 |
| 83. | దేర్లుక్(సోః)దేశ్యైకాచోః | శబ్ద . 78 |
| 84. | స్త్రీత్వబహుత్వేసురాదేరసౌ | శబ్ద . 84 |
| 85. | స్త్రీత్వంతాతాదేః | శబ్ద . 85 |
| 86. | నటాదౌ నిరితః | శబ్ద . 54 |

## హలన్తప్రకరణమ్.

## ఆచ్ఛికప్రకరణమ్

| | | |
|---|---|---|
| 1. | త్రిమతజ్ఞాదయః | కార. 30 |
| 2. | ములగన్తాః | కార. 27 |
| 3. | సింగాదేరద్వత్ | కార. 31 |
| 4. | మహదుద్వల్లాదేః | శబ్ద. 89 |
| 5. | నాతస్సుప్యత్ | శబ్ద. 83 |
| 6. | పుమమహతస్సోర్డజ్ జసాదౌచ | శబ్ద. 81 |
| 7. | ఉతోలుగ్జసాదౌడుజః | శబ్ద. 82 |
| 8. | అణ్ దేశ్యస్య | కార. 34 |
| 9. | స్త్రియామేక్వచిత్ | తద్భ. 119 |
| 10. | అగమహతామ్ | తద్భ. 121 |
| 11. | నడమహతాముతామ్ | కార. 22 |
| 12. | ఉనోవాలుక్ | కార. 23 |
| 13. | వామాన్వాదేః కుజ్నోః | శబ్ద. 90 |
| 14. | మీన్వాదేర్వాలుక్ | శబ్ద. 91 |
| 15. | సలలోస్సబిన్దుర్వాడుః | కార. 15 |
| 16. | ఉల్లుక్చ | కార. 16 |
| 17. | నిత్యందారాదేః | కార. 17 |
| 18. | లీనామితశ్చ | కార. 20 |
| 19. | లుస్సంయుక్తసమాప్తస్య | కార. 21 |
| 20. | ర్లోరుతఃప్రాయోలుప్తలి | సంధి. 16 |
| 21. | నశ్చ | సంధి. 17 |
| 22. | ఉల్లోపోభల్లటస్య | కార. 28 |
| 23. | సలలోరులోపశ్చ | కార. 19 |
| 24. | ఏకపదే | సంధి. 18 |
| 25. | ఏకపదస్య | ఏక. 1 |
| 26. | ఇణష్టోర్లఠి | సంధి. 19 |
| 27. | ఉక్తానాంచ | సంధి. 20 |
| 28. | జశశ్చయ్ | సంధి. 24 |
| 29. | ననహలస్సరశః | సంధి. 23 |
| 30. | వస్సతాలవ్యస్యచ | సంధి. 38 |
| 31. | ద్వినుల్వోరాదేర్వాలుక్ | సంధి. 63 |

## సర్వనామప్రకరణమ్

| | | |
|---|---|---|
| 1. | సర్వవాచ్యం సర్వనామ | సర్వ . 1 |
| 2. | ఒక్కొల్లవ్యాదయస్సర్వనామశబ్దాః | సర్వ . 2 |
| 3. | అస్మద్యుష్మదాత్మనో నీనాతాః | సర్వ . 7 |
| 4. | సమాస్త్రీషు | సర్వ . 22 |
| 5. | నుగమాదౌ ద్విశ్చ | సర్వ . 8 |
| 6. | హోనౌచ | సర్వ . 9 |
| 7. | నానుతః | సర్వ . 10 |
| 8. | విభాషామోజసి | సర్వ . 11 |
| 9. | న్మోర్వాలుక్ప్రథమాయామ్ | సర్వ . 12 |
| 10. | ఆత్మనశ్చ | సర్వ . 13 |
| 11. | అస్మదోనిత్యమ్ | సర్వ . 14 |
| 12. | నజమః కిః | సర్వ . 15 |
| 13. | స్వస్యతముః | సర్వ . 16 |
| 14. | ఉభయార్థవాచీ మినః | సర్వ . 17 |
| 15. | జశ్శసోర్మతౌ | సర్వ . 18 |
| 16. | ఆత్మవట్టాదౌ | సర్వ . 19 |
| 17. | రిన్యోర్లుక్ | సర్వ . 20 |
| 18. | క్వచిన్న సర్వేషామ్ | సర్వ . 21 |
| 19. | యతాహద్యచాంలోపః | సమా . 14 |
| 20. | ఆదతః | సమా . 16 |
| 21. | ఈః దేతః | సమా . 18 |
| 22. | అతఏత్ | సమా . 15 |
| 23. | ఆత్తదః | తద్ధి . 20 |
| 24. | తదత | సమా . 17 |
| 25. | యతఏ | సమా . 13 |
| 26. | ఏద్యత్కిమోః | తద్ధి . 19 |
| 27. | ఇదమదసేతదామీల్ | తద్ధి . 21 |
| | (ఇటుఃబునరుక్తులు గమన్నార్హము) | |
| 28. | హయదాదిభ్యోదిరమహదేకస్య | తద్ధి . 15 |
| 29. | ద్యన్తాదేర్న్యమాదిపరే | తద్ధి . 16 |
| 30. | తతోవాపుంసి | తద్ధి . 17 |

| | | |
|---|---|---|
| 63. | గోదేః | తద్ధి . 57 |
| 64. | అనఃపుంసి | తద్ధి . 58 |
| 65. | వతెవరితెవరిత్వాదిస్త్రియామ్ | తద్ధి . 27 |
| 66. | ఏకాద్వలుక్ | తద్ధి . 28 |
| 67. | కెమెపెబిడాదిస్త్ర్యర్థే | తద్ధి . 29 |
| 68. | తెజాతిపుంయోగయోః | తద్ధి . 31 |
| 69. | తదోవాటలః | కార . 49 |
| 70. | అస్యద్విత్వంచ | కార . 50 |

## సంఖ్యావాచకాః

| | | |
|---|---|---|
| 1. | కొమె మేకస్య | సంఖ్యా . 4 |
| 2. | రెంద్వయోః | సంఖ్యా . 2 |
| 3. | మూ్రతేః | సంఖ్యా . 5 |
| 4. | కొమెమేరెంమూనాండుగమహతి | సంఖ్యా . 1 |
| 5. | నాలుశ్చతురః | సంఖ్యా . 6 |
| 6. | గుఃక్లీబే | సంఖ్యా . 7 |
| 7. | పఞ్చానామేన్వైదూ | సంఖ్యా . 8 |
| 8. | వాలుఁగ్గానుద్వోః | సంఖ్యా . 9 |
| 9. | షణ్ణామాఱుః | సంఖ్యా . 10 |
| 10. | ఏసప్తశబ్దస్య | సంఖ్యా . 3 |
| 11. | ఎనిరష్టానామ్ | సంఖ్యా . 11 |
| 12. | తొమ్నవానామ్ | సంఖ్యా . 12 |
| 13. | తొమెన్యోర్మిదిః | సంఖ్యా . 13 |
| 14. | పరిర్దశానామ్ | సంఖ్యా . 27 |
| 15. | నూఱుశతస్య | సంఖ్యా . 42 |
| 16. | వే(వేలూ)సహస్రస్య | సంఖ్యా . 43 |
| 17. | టిరేకస్యామహతి | సంఖ్యా . 22 |
| 18. | ఓదేతః | సంఖ్యా . 23 |
| 19. | ద్విర్వాకః | సంఖ్యా . 24 |
| 20. | రుర్న్యైకయోః | సంఖ్యా . 25 |
| 21. | క్వచిద్రోడః | సంఖ్యా . 26 |
| 22. | ద్వయోరిద్ద స్త్రీపుంసయోః | సంఖ్యా . 14 |
| 23. | ఇరుశ్చ | సంఖ్యా . 15 |
| 24. | ద్వేశ్చేన్నిరు నెద్దోనయః | తద్భ . 94 |
| 25. | గురావేదుతోః | సర్వ . 16 |
| 26. | హద్వ్యపూర్వపరయోరహరహలి | సర్వ . 19 |
| 27. | క్రొనెశబ్దయోశ్చసమాసే | సర్వ . 20 |
| 28. | గోర్ద్విర్వా | సర్వ . 21 |
| 29. | హఃపదౌచతుర్థవర్ణః | సర్వ . 17 |
| 30. | ఆరోర్లశ్చ | సర్వ . 18 |
| 31. | రుస్త్రీపుంసోః | సర్వ . 32 |

| | | |
|---|---|---|
| 32. | రాదేర్లుక్ | సర్వ . 33 |
| 33. | డుస్ప్రబిన్దూరువర్ణేపరే | సర్వ . 34 |
| 34. | అదితోడా | సర్వ . 35 |
| 35. | తయోరుల్లుక్ | సర్వ . 36 |
| 36. | పాత్పరమ్యోర్ణ్వేరుట్ | సర్వ . 37 |
| 37. | ఒండురేకస్మిన్ | సర్వ . 48 |
| 38. | పదేరుత్ | సర్వ . 28 |
| 39. | నగచి | సర్వ . 29 |
| 40. | ఒండౌచ | సర్వ . 30 |
| 41. | సహస్రాద్యాస్యపదే | సర్వ . 31 |
| 42. | ఏకస్మాదానుక్ | సర్వ . 49 |
| 43. | దేర్ణిద్విసవయోః | సర్వ . 45 |
| 44. | రోష్టః | సర్వ . 46 |
| 45. | పదేరాండౌననకా | సర్వ . 47 |
| 46. | లుగ్రులుడుదీనామ్ | సర్వ . 50 |
| 47. | ద్విర్వ్యానోః | సర్వ . 51 |
| 48. | నిత్యమినాభ్యామ్ | సర్వ . 52 |
| 49. | నాదేర్దీర్ఘాఘః | సర్వ . 53 |
| 50. | డోణః | సర్వ . 54 |
| 51. | డునోర్ణః | సర్వ . 55 |
| 52. | రురుమూల్వేనుబిన్దుభ్యః పది | సర్వ . 39 |
| 53. | ఆటోహ్రస్వ | సర్వ . 18 |
| 54. | దేసప్తానామ్ | సర్వ . 40 |
| 55. | వోబః | తద్బ . 40, 41 |
| 56. | మిదేర్లుక్పదో | తద్బ . 38 |
| 57. | ఒండ్వాదేరవట్ | తద్బ . 44 |

## ఔపవిభక్తికప్రకరణమ్

# అవ్యయప్రకరణమ్

## పౌలస్త్య రావణః-

## అవ్యయపాఠః

అయ్య - అక్క - అమ్మ - అత్త----

| | | |
|---|---|---|
| 1. | పరస్యాదేశ్చ | సంధి . 30 |
| 2. | ద్విరాదేః పరస్య | సంధి . 31 |
| 3. | అటఃకశ్చ | సంధి . 32 |
| 4. | అగోరడ్వానామ్రేడితే | సంధి . 33 |
| 5. | దిశాంధాత్వన్తరస్య | సంధి . 34 |
| 6. | టస్యవాలుక్ | సంధి . 35 |
| 7. | ఓదన్త్యస్య | సంధి . 36 |
| 8. | ఓదటశ్చ | సంధి . 37 |
| 9. | యురనుతస్సర్వస్మాత్ కణ్వస్య | శబ్ద . 58 |
| 10. | నురుతః | శబ్ద . 59 |

## తద్భవ పరిచ్ఛేదః

| | | |
|---|---|---|
| 1. | అచఃప్రతీపః కాత్యాయనస్య | తద్భ . 49 |
| 2. | ఇదతః | తద్భ . 100 |
| 3. | ఉదతః | తద్భ . 96 |
| 4. | ఉదతస్వా | తద్భ . 6 |
| 5. | ఎదతశ్శేషస్య | తద్భ . 99 |
| 6. | ఐదతః | తద్భ . 46 |
| 7. | ఓదతః | తద్భ . 15 |
| 8. | ఔదతః | తద్భ . 125 |
| 9. | అదితః | తద్భ . 27 |
| 10. | ఉదితః | తద్భ . 5 |
| 11. | ఓదితః | తద్భ . 132 |
| 12. | వాదుతః | తద్భ . 29 |
| 13. | ఇదుతః | తద్భ . 17 |
| 14. | ఓదుతః | తద్భ . 130 |
| 15. | అదృతః | తద్భ . 126 |
| 16. | ఇదృతః | తద్భ . 16 |
| 17. | ఉదృతః | తద్భ . 122 |
| 18. | ఏదృతః | తద్భ . 134 |
| 19. | ఓదృతః | తద్భ . 131 |
| 20. | ఇణ ఏజ్ | తద్భ . 4 |
| 21. | ఋక్షాదౌరిః | తద్భ . 34 |
| 22. | అయుక్తస్యరిరూ | తద్భ . 26 |
| 23. | ఋష్యాదావిచ్చ | తద్భ . 35 |
| 24. | ఋతోఽద్వృద్ధాదౌ | తద్భ . 36 |
| 25. | ఇదేతః | తద్భ . 127 |
| 26. | ఓదేతః | తద్భ . 98 |
| 27. | ఇదైతః | తద్భ . 117 |
| 28. | అదోతః | తద్భ . 118 |
| 29. | ఏదోతః } | తద్భ . 136 |
| 30. | (ఆదేఙః?) } | |

| | | |
|---|---|---|
| 31. | ఏజైచః | తద్ప . 31 |
| 32. | బిన్దోరర్థత్వమ్ | తద్ప . 7 |
| 33. | హే ద్విస్తుర్వ్యాహలి | తద్ప . 88 |
| 34. | పాధ్యోదేః | తద్ప . 89 |
| 35. | విత్యంజిహ్వామూలీయోపధ్మానీయ యోర్లుక్ | తద్ప . 62 |
| 36. | హెూదేః | తద్ప . 13 |
| 37. | వా హ్రస్వదీర్ఘావన్యోన్యమ్ | తద్ప . 92 |
| 38. | ఆదౌదీర్ఘౌలుక్ | తద్ప . 25 |
| 39. | కోగః | తద్ప . 19 |
| 40. | ఖఃకః | తద్ప . 20 |
| 41. | గఃకః | తద్ప . 18 |
| 42. | క్షఃకః | తద్ప . 58 |
| 43. | చస్సః | తద్ప . 91 |
| 44. | చోస్తుః | తద్ప . 128 |
| 45. | వాగుచ్ఛతుచ్ఛయోస్తః | తద్ప . 137 |
| 46. | టుస్తోః | తద్ప . 39 |
| 47. | డుండ్యోస్తుత్ | తద్ప . 114 |
| 48. | దంభదండదాడిమీదోహళాదశనేమడః | తద్ప . 50 |
| 49. | తోళ్ళః | తద్ప . 129 |
| 50. | పుస్తోః | తద్ప . 135 |
| 51. | నణావన్యోన్యమ్ | తద్ప . 42 |
| 52. | ఖఛఠథఫఘఝఢధభాం | |
| 53. | కచటతపగజడదబాః | తద్ప . 109 |
| 54. | ఆద్యానాంతృతీయాః | తద్ప . 110 |
| 55. | తదోర్దతౌ | తద్ప . 115 |
| 56. | దస్తస్య | తద్ప . 106 |
| 57. | జ్ఞోనః | తద్ప . 112 |
| 58. | జ్ఞానసర్వజ్ఞ శయ్యానాంజః | తద్ప . 52 |
| 59. | వర్గ్యోవర్గస్యసవర్ణః | తద్ప . 97 |
| 60. | మోవః | తద్ప . 105 |
| 61. | వోమః | తద్ప . 38 |
| 62. | పోవః | తద్ప . 41 |

| | | |
|---|---|---|
| 63. | వోబః | తద్భ . 40 |
| 64. | బోవః | తద్భ . 51 |
| 65. | క్వచిన్నోలః | తద్భ . 8 |
| 66. | వాలోనః | తద్భ . 2 |
| 67. | ఆదేర్యోజః | తద్భ . 45 |
| 68. | దోరః | తద్భ . 133 |
| 69. | రోడః | తద్భ . 37 |
| 70. | రోనః | తద్భ . 138 |
| 71. | లోడః | తద్భ . 139 |
| 72. | రలావన్యోన్యమ్ | తద్భ . 43 |
| 73. | శషోస్సః | తద్భ . 24 |
| 74. | సశ్శః | తద్భ . 87 |
| 75. | స్నస్తః | తద్భ . 111 |
| 76. | శశ్శః | తద్భ . 90 |
| 77. | షఃఖః | తద్భ . 120 |
| 78. | వాహోగః | తద్భ . 108 |
| 79. | ర్యః | తద్భ . 53 |
| 80. | యుక్తస్యవికర్షః | తద్భ . 22 |
| 81. | రియరిజౌతూర్యాదౌ | తద్భ . 54 |
| 82. | ఆత్పరస్యరుశ్చ | తద్భ . 55 |
| 83. | జ్ఞషహణః | తద్భ . 56 |
| 84. | ర్యస్నష్టాంరియసినసిటాః | తద్భ . 113 |
| 85. | ఇత్తాలివ్యే | తద్భ . 67 |
| 86. | ప్రేమద్రుతయోశ్చ | తద్భ . 68 |
| 87. | ఆదౌలిచ | తద్భ . 69 |
| 88. | పూర్వస్వరోఽన్యస్మిన్ | తద్భ . 70 |
| 89. | ప్రస్యచ | తద్భ . 71 |
| 90. | చంద్రాదేర్వా | తద్భ . 72 |
| 91. | ఇచ్చమాత్రాకారే | తద్భ . 73 |
| 92. | ఉద్వృక్తాదేరుదుత్తరస్య | తద్భ . 74 |
| 93. | వాభుక్తి ముక్తి సుప్తి భక్తి శక్తి మూర్తి భక్త శక్త్యాదౌ | తద్భ . 75 |
| 94. | భక్తశక్తయోరుత్వమ్ | తద్భ . 76 |

| | | |
|---|---|---|
| 95. | నక్షాదేః | తద్భ . 77 |
| 96. | పల్లవసజ్జనమజ్జనకుక్కుటఢక్కాదౌ | తద్భ . 78 |
| 97. | సమంబాదీనామ్ | తద్భ . 86 |
| 98. | సరసకరేరోర్వ్యాల సబాలికావైఢూర్య<br>కరాళమహో రాష్ట్రా రావణస్య | తద్భ . 79 |
| 99. | నారికేళే ద్వితాయ చతుర్థయోః | తద్భ . 80 |
| 100. | విచికిలే ద్వేతుర్యతృతీయానామ్ | తద్భ . 81 |
| 101. | మరకతాదీనాం యథేష్టమ్ | తద్భ . 82 |
| 102. | సహహలః | తద్భ . 83 |
| 103. | త్రేస్తినితీని | తద్భ . 93 |
| 104. | మాన్వ్యానోర్మంతవంతౌ | తద్భ . 95 |
| 105. | జోలుక్ | తద్భ . 28 |
| 106. | హః | తద్భ . 57 |
| 107. | అధోమనయామ్ | తద్భ . 14 |
| 108. | కగటడతదపః కఃపశోర్ద్రే | తద్భ . 10 |
| 109. | కగచజదపయవానామనాదౌ కాత్యాయనస్య | తద్భ . 9 |
| 110. | ఉభయత్రరవలామ్ | తద్భ . 3 |
| 111. | ఆదిమధ్యాన్తానామౌచిత్యే | తద్భ . 63 |
| 112. | ణమాద్వేర్హః | తద్భ . 64 |
| 113. | సమాసేవా | తద్భ . 65 |
| 114. | కారకరణాగారాణాంసమాసఏవ | తద్భ . 59 |
| 115. | నభయాత్కారకరణయోః | తద్భ . 60 |
| 116. | శేషాదేశస్యాహ్రేహాచోఖోః | తద్భ . 23 |
| 117. | ఝయో (ద్విః)కాత్యాయనస్య | తద్భ . 61 |
| 118. | (ణ)నమలయవాంవా | తద్భ . 32 |
| 119. | నరహేహాః | తద్భ . 84 |
| 120. | లుగ్గీ ర్షాత్ | తద్భ . 85 |
| 121. | అత్ కృతే ద్విత్వయవోరుపధాయాః | తద్భ . 44 |
| 122. | ఆదిహలో వర్ద్యేతోర్లుగ్ద్వ్యేతోః | తద్భ . 1 |
| 123. | వికర్షవ్యత్యయపాదార్థోక్తితః | తద్భ . 107 |
| 124. | తీరదుర్గమందిరేమఘపాదుకోటోత్తరణోః | తద్భ . 116 |
| 125. | లతామక్షికాఖలీనాదిష్వేత్ | తద్భ . 103 |

## కారకపరిచ్ఛేదః

| | | |
|---|---|---|
| 1. | కర్తృకర్మాదికంసమమ్ | కార . 1 |
| 2. | తత్పాదేశ్చ | కార . 2 |
| 3. | అర్థశాస్త్రంచ | కార . 3 |
| 4. | పదానిస్వేచ్ఛమ్ | కార . 4 |
| 5. | ఆద్యాతుల్యా | కార . 47 |
| 6. | జిబ్జసిసోస్సుస్ | కార . 10 |
| 7. | జసశ్చ | కార . 11 |
| 8. | సుపసావావలెయోగే | కార . 5 |
| 9. | ద్వితీయాకూర్చియోగే | కార . 7 |
| 10. | జిబ్జమో రమ్నపుంసకే | కార . 9 |
| 11. | జిబ్జసోష్టాస్జేసః | కార . 12 |
| 12. | జేస్జమః | కార . 6 |
| 13. | పంచమీతృతీయాయాః | కార . 8 |
| 14. | వ్యత్యయవ్యవహితయోశ్చ | కార . 13 |
| 15. | ఉభయమస్త్రీవాచకస్య | శబ్ద . 92 |
| 16. | ప్రథమా షష్ఠీ విశేషణస్య | శబ్ద . 87 |
| 17. | అన్యోన్య మే కబహుత్వే | కార . 48 |
| 18. | యుష్మదస్మచ్వాబ్యాదిలోపినీ | కార . 35 |
| 19. | ధర్మోత్తమమధ్యమవత్పరేషామ్ | కార . 36 |
| 20. | నప్రథమవత్ | కార . 37 |
| 21. | ఉలోఽత్పర్వేషు | కార . 38 |
| 22. | అస్మద్వాదాత్మనః | కార . 39 |

## సమాసపరిచ్ఛేదః

| | | |
|---|---|---|
| 1. | ద్విగుకర్మధారయ తత్పురుషద్వంద్వ బహువ్రీహ్యా పమానోత్తరపదలోప రూపకాః | సమా . 3 |
| వివృతి. | బహవస్స్వవిభక్తి వికారై స్సమస్యన్తే యథాతథమితివాచ్యమ్ | |
| 2. | లడాది లకారై రవ్య యై ర్వినాసమస్యతే (సుబన్తేన) సుబన్తమ్ | సమా . 9 |
| 3. | షష్ఠీ సమాసోబలవాన్ | సమా . 10 |
| 4. | అన్యే క్వచిత్ క్వచిత్ | సమా . 11 |
| 5. | వైకృతస్సమాసకః | సమా . 4 |
| 6. | ఉభయోమిశ్రః | సమా . 5 |
| 7. | పరిమిత మాద్యేయేన | సమా . 6 |
| 8. | విభక్త్యాదేర్లోపః | సమా . 2 |
| 9. | అన్యంటీ గుణానామ్ | సమా . 12 |
| 10. | మోః పోవానోపధస్య | సమా . 7 |
| 11. | క్వచిత్తామరాదేరాకౌ | సమా . 8 |
| 12. | అన్వ్రహౌః పరస్యహద్వీవా | కార . 29 |
| 13. | చోటోశ్చ | తద్ధి . 25 |
| 14. | చోట్యాదిర్ద్రదీ | తద్ధి . 26 |
| 15. | నిర్వాదుజన్తస్య | కార . 43 |
| 16. | తద్ధి తపుమ మహతోర్నిత్యమ్ | కార . 44 |
| 17. | మహదమహతోర్నాంతస్య | కార . 45 |
| 18. | లస్సర్వత్ర | కార . 46 |
| 19. | దుర్వాయుష్మదస్మదాత్మభ్యః | కార . 32 |
| 20. | ద్వంద్వ ఉరః | కార . 14 |
| 21. | ఔపవిభక్తి కపదన్త విధిః | సమా . 1 |

## తద్ధితపరిచ్ఛేదః

| | | |
|---|---|---|
| 1. | అనవిత్తద్ధితః | తద్ధి . 1 |
| 2. | గాండ్వరిడుజీంద్వాండువాండ్వా దయస్తద్ధితాః | తద్ధి . 2 |
| 3. | మతుపి ధర్మాత్ | తద్ధి . 3 |
| 4. | ధర్మిణశ్చ | తద్ధి . 4 |
| 5. | ఆద్యేయాచ్చ | తద్ధి . 5 |
| 6. | గొల్లాదిభ్యోడుజాదిః | తద్ధి . 6 |
| 7. | పూర్వస్యేత్ | తద్ధి . 12 |
| 8. | డుజోవాలుక్ | తద్ధి . 13 |
| 9. | సంబంధ జాత్యాదావదిః | తద్ధి . 14 |
| 10. | దయాయామణ్యేల్లాళ్వాద్యాః | తద్ధి . 32 |
| 11. | కత్తె ధర్మ ధర్మి నామభ్యః, గింజాది భ్యోంతః | తద్ధి . 30,56 |
| 12. | పరిమితావంతః | తద్ధి . 44 |
| 13. | లుక్తస్యగురౌ | తద్ధి . 45 |
| 14. | సేపుం కాలేంతాత్ | తద్ధి . 64 |
| 15. | మానాదేసిః | తద్ధి . 55 |
| 16. | ఏసిస్సంఖ్యాయాః | తద్ధి . 63 |
| 17. | ఎడుః ప్రస్థాది మానే | తద్ధి . 54 |
| 18. | ఆలుర్మతుపః | తద్ధి . 59 |
| 19. | దారార్థేచ | తద్ధి . 60 |
| 20. | అతోరోధర్మిణః | తద్ధి . 61 |
| 21. | ఉచ్చ | తద్ధి . 62 |
| 22 | ఉకసాస్వార్థే | కార . 33 |

## క్రియాపరిచ్ఛేదః

